తే. సూర్యుఁ డస్తగతుం డైనఁ ♦ జూచి పిదప, హనుమ యద్భుతగతిఁ బిల్లి♦యంతరూపుఁ
గొని ప్రదోష కాలంబున♦దనుజపురముఁ,జొచ్చె నొకగంతు వెస వైచి♦చూచెదాని

## హనుమంతుఁడు లంకలోఁ బ్రవేశించుట.

సీ. నలుచదరంబు లై ♦ నలువొందుబాటలు, ప్రాసాదమాలావి♦రాజితములు
స్వర్ణరాజితమహా♦స్తంభశోభితములు, శాతకుంభగవాక్ష♦సంయుతంబు
లగుచు నే డెనిమిది♦యంతస్తు లేపారు,గంధర్వనగరనీ♦కాశసౌధ
పాళులు గలిగి స♦త్స్ఫటికసుసంకీర్ణ,కనకవైడూర్యము♦క్తాప్రవాళ
తే. భూమికాసురమందిర♦పుంజ మమరఁ, జిత్రతోరణపంక్తులు ♦ చెలువు మీఱ
నెపుడు సమలంకృతం బయి ♦ యీడ్యశౌర్య,నిష్ఠురోదగ్రరాక్షసా♦న్వీత మగుచు.
తే. అద్భుతంబు నచింత్య మై ♦ యసురనాథ
రక్షితం బైనలంకాపు♦రంబుఁ జక్కఁ
గాంచి దైన్యంబు నొందియు ♦ ధ్మాతనూజఁ
గనఁగఁ గోరుట సంతోష♦కలితుఁ డయ్యె. ౧౬౧

కం. కువలయబాంధవుఁ డప్పుడు, ప్లవగునకుం దోడుపడెడి♦భావంబున నా
భువి దివిఁ గాంతులఁ గప్పుచు, సవురుగఁ దోతెంచెఁ జుక్క♦చాలులనడుమన్.

తరలము. జలజకాంతియుఁ బాలడాలు బి♦సంబుడంబును నింబుగాఁ
గలిగిరూపునఁ గాన వచ్చి ప్ర♦కాశమానుఁడు నొశశిఁ
వలిముఖాగ్రణి సారసాకర♦వారిఁ గ్రీడఁ జరించునా
జలజసంభవు తేజి యట్టులు ♦ సంతసంబునఁ గన్గొనెన్. ౧౬౩

సీ. లంబమానాంబుద♦లంబలంబాగ్రంబు,నందుండి రేయి వ♦నావళులను
జారుతోయంబుల ♦ శారదాబ్దప్రఖ్య,భవనంబులను నబ్ధి♦పవనములను
సాగరోపమమహా♦చటులఘోషంబుల, రమ్యసుద్వారతో♦రణచయముల
మందమారుతముల ♦ మహితజాంబూనద,మయగృహప్రాకార♦మంటపములఁ
తే. గింకిణీజాలరవములఁ ♦ గీర్తితేంద్ర
నగరనిభ మయి నిస్తుల♦నాగరాజ
రక్షితాహిపురాభ మై ♦ రమణ మీఱు
పట్టనముఁ జొచ్చెఁ గన్గొంచుఁ ♦ బ్రాజ్ఞ వరుఁడు. ౧౬౪

కం. అలకాపురముం బోలుచు, సలలిత మై పుష్టసైన్య♦సంఘుష్టం బై
కలితతటిద్ఘన మై గ,జ్జైలరవళుల మీఱె నొర ♦ చిత్రం బనుచున్. ౧౬౫

## హనుమంతుఁడు ప్రాకారంబునఁ జేరి యాలోచించుట.

సీ. చని యిట్లు ప్రాకార♦సన్నివేశముఁ జేరి, కలయంగఁ గాంచె లం♦కాపురంబు
స్వర్ణకవాటముల్ ♦ వైడూర్యవేదికల్, గురువజ్రముక్తాశ్మ♦కుట్టిమంబు

లపరంజిరయొంఱగుదిం ♦ డ్లమలసోపానముల్,మింటి కెగురుమాడ్కి ♦ మెఱయుచున్న
వరచతుశ్శాలలు ♦ వరహంసమాయూర,కలకలార్భటులు నా ♦ కసము నిండఁ
తే. దూర్యభూషణరవములు ♦ తోరములుగఁ, గలిమి వస్వోకసార నాఁ ♦ గమ్రమైన
విబుధశాత్రవనగరంబు ♦ పెంపునకును, మదిని హర్షించి యాపావ ♦ మాని దలఁచు.

ఉ. ఎప్పుడు విచ్చుకత్తులు వ ♦ హించి చరించుబలంబు గావఁగా
నిప్పురి గెల్వ శక్య మగు ♦ నే పరు లేరికి నైన బల్మి మైఁ
జొప్పడు నంగద ద్వివిద ♦ సూర్యజమైందసుషేణబుతులుల్
దప్పక తూఱఁగాఁ గుముద ♦ తత్కుశపర్వులుఁ గేతుమాలుఁ డేన్. ౧౬౮

కం.అనిబలశాలుల వానరు,లను నెన్నిసుమిత్రసుతుబ ♦ లంబును శ్రీరా
ముని శౌర్యగరిమ దలఁచుచు, ననఘుఁడు సంతుష్టచిత్తుఁ ♦ డగుచుం బిదపన్.

కం. వెండియుఁ గనె మణివాసో,మండిత గోష్ఠావతంస ♦ మఱి యంత్రసభా
కాండస్తని భూషితవే,తండగమనయట్లు వెలయు ♦ దశకంఠపురిన్. ౧౬౯

## హనుమంతుఁడు లంకాధిదేవతను జయించుట.

కం.నవరత్నకలితశాలా,నివహానిరస్తాంధకార ♦ నిచయం బగునా
దివిజారిపురముఁ జొచ్చెడి, ప్లవగు నిజాకార మూని ♦ లంకయుఁ జూచెన్. ౧౭౦

చం,కనుఁగొని కింక లంకయు వి ♦ కారముఖంబును ఘోరరూపముం
బెనఁగొన లేచి, యాప్లవగ ♦ వీరున కడ్డము నిల్చి, గర్జిలన్
నినుచుచుఁ బల్కె నోరి విను ♦ నీల్గక మున్నె యెవండ వీ వహో
వనచర యేమి కార్యముగ ♦ వచ్చితి విచ్చటికి న్వచింపరా. ౧౭౧

కం.ఏ వేళల నేచోటుల, రావణబలగుప్త మగుచుఁ ♦ గ్రాలెడులంకన్
నీవా చొచ్చెడివాఁడవు, దేవాదులు చొచ్చి బ్రదుకు ♦ తెరువుం గలదే. ౧౭౨

చం.అనిన వచింతు నాచరిత ♦ మంతయు నైన విరూపనేత్రవై
పని యెది గల్గి యీనగరి ♦ వాకిట నుండెద? వేల యొప్పుచున్
నను నిటు లడ్డగించెదవు ♦ నా కిది తెల్పు మ టన్న నామరు
త్తనయునిఁ గాంచి లంక యనె ♦ దారుణభాషలఁ గ్రోధదీప్త యై. ౧౭౩

ఉ. రావణునాజ్ఞ మోచి నగ ♦ రం బిది కాచెద నెల్లవేళలన్
నీ విటు కన్నుఁ బ్రామి నను ♦ నేరుతె దీనిఁ జొరంగ? నిప్పుడే
చావఁ గలాఁడ వోరి వన ♦ చారి! స్వయంబుగ నేన లంకరా
నావిధ మింత, నీకథ వి ♦ నన్ వచియింపు మ టన్న నాతఁడున్. ౧౭౪

ఉ. లంక వచించినట్టి నుడు ♦ ల న్విని కొండన నిల్చి యింతయేన్
జంకక యోషిదాకృతి నె ♦ సంగెడుదానిని జూచి వాహినీ

సంకులితాట్టగోపురవి♦శాలగృహాంగణనిష్కుటోత్కరా
లంకృత మైె తనర్చుపురి ♦ లంకఁ గనుంగొను వేడ్క వచ్చితిన్. ౧౭౫

కం. నాపుడు నను నిర్జింపక, యేపడువున నీవు దుర్మ♦తీ! చూచెద వీ
రావణపాలితపుర మని, యీవిధమునఁ బరుషభాష ♦ లింతి యనంగన్. ౧౭౬

కం. రక్కసిఁ గనుఁగొని యి ట్లను, నక్కపివీరుండు పురము ♦ నంతయుఁ గని నే
గ్రక్కున వచ్చినత్రోవం, ద్రొక్కెద నన లంకభయద♦రోషాగ్భటులన్. ౧౭౭

కం. అరచేతఁ గొట్టె వానర,వరునిం గపి యిట్లు దెబ్బ♦పడి బొబ్బిడుచుం
దరుణి యని తీవ్రరోష,స్ఫురితుఁడు గా కెడమముష్టిఁ ♦ బొడిచెం గినుకన్. ౧౭౮

## లంక దన్ను రక్షింప హనుమంతుని వేఁడుట.

కం. ఆముష్టిఘాతముననే, భూమింబడ వివృతవక్త్రఁ ♦ బొలఁతుక ననుకం
పామతిఁ గనెఁ బావని యా,భామిని గతగర్వ యగుచుఁ ♦ బలికె నతనితోన్.

కం. కరుణింప వయ్య వానర,వర! కావుము నన్ను వీర్య♦వంతుఁడ వెందుం
దరుణులఁ జంపఁగ రా దను,మరియాదను దాఁట రెపుడు ♦ మహితబలాఢ్యుల్.

చం. అగచరలోకపుంగవ! స్వ♦యమ్ముగ లంకను నేన, పోరిలోఁ
దెగి నను గెల్చి తీవు భవ♦దీయపరాక్రమ మేర్పడంగ; ని
న్నగచరుఁ డెవ్వఁ డే గెలుచు ♦ నాఁడు మొదల్ సురవైరికోటికిం
దెగుదలకార్య మబ్బెడి న♦నెం విధి మున్ను వరంబు లిచ్చుచోన్. ౧౮౧

ఉ. సత్యముఁ జెప్పితి న్విధియు ♦ సత్యమ పల్కెను దప్ప దేమిటం
దైత్యులకుం దశాస్యునకు ♦ ధారిణికన్యక కారణంబుగా
మృత్యువు దాపరించె నిఁక ♦ నేగుము పట్టన మెల్లఁ జూడుమీ
కృత్యము లెల్లఁ దీర్చుకొను♦మీ మదిచొప్పునఁ గీశపుంగవా! ౧౮౨

కం. శాపోపహతం బగులం,కాపురముం జొచ్చి జనక♦కన్యకఁ గన ని
చ్ఛాపూర్తి యొదవఁ గపికుల,దీప! యథాసుఖముగాఁగఁ ♦ దిమ్మరు మనినన్. ౧౮౩

## హనుమంతుఁడు లంకలో సంచరించుట.

తే. సత్యవిక్రముఁ డైన కే♦సరిసుతుండు, కామరూపిణి లంకను ♦ గడిమి గెలిచి
తడయ కాపత్తనంబు న♦ద్వారముననుఁ, జొచ్చెఁ బ్రాకారమునుదాఁటి ♦ శూరవరుఁడు

కం. అగచరపతిహితకరణుం, డగచరవరుఁ డరులమూర్ధ♦మందుం బలిమిం
దగఁ దనడాకాలిని ము,న్నుగ నుంచి దశాస్యపురము♦నుం జొచ్చె నిసిన్. ౧౮౫

కం. పూవులచే ముత్తెంబుల,చే వెలసెడిరాచబాటఁ ♦ జేరిమనోజ్ఞం
బొవీడు నాల్గుప్రక్కలఁ, బావని తిలకించి మెచ్చె ♦ భాగ్యోన్నతికిన్. ౧౮౬

సీ. తోరంబుగా మ్రోయు♦తూర్యనాదంబులఁ, బకపకనవ్వుల♦ప్రాభవముల
వజ్రాంకుశనికాశ♦వజ్రజాలవిభూష,ణాంచితగృహపయో♦దాళికలన
మేఘాళిచే నొప్పు♦మిన్నునా విలసిల్లి,మఱిసితాబ్దాభ మై ♦ మహిమ మీఱు
స్వస్తికపద్మాఖ్య♦వర్ధమానాకృతిఁ, గొమ రొప్పుర్థాక్షస♦కూటవితతిఁ
తే. జిత్రమాల్యాభరణములఁ ♦ జెన్ను మీఱు
పురిని గనుఁగొని సంతోష♦భరితుఁ డగుచు
సూర్యభవహితకరణుండు ♦ చొచ్చి చూడఁ
గడఁగి శ్రీరాఘవార్థంబు ♦ కరము నలరె. ౧౮౭

తే. ఈగతిని నింటి కింటికి ♦ నేగుచోటఁ, గనియె నానావిధాకృతుల్ ♦ గలిగి వెలయు
మందిరంబులు ననమాన♦సుందరములు, నయనపర్వంబుగా వాయు♦నందనుండు.

ఉ. వీనుల కింపు గూరుప ది♦విజ సురకన్యలుఁవోలె నందుఁ ద్రి
స్థానమనోహరస్వరయు♦తంబుగ మాదసమృద్ధదైత్యకం
జానన లోలి గానరస ♦ మాదట నించుట హారిరత్న కాం
చీనినదంబు నూపురవి♦శిష్టఝుళంఝుళ శింజితంబులున్. ౧౮౯

సీ. సోపాననాదముల్ ♦ శూరభుజాస్ఫాల,నంబులు భీమకం♦ఠరవములును
జాపకమాంత్రిక♦స్వనము లాకర్ణించె, స్వాధ్యాయరతుల ని♦శాచరేంద్ర
సంస్తవశీలురఁ ♦ జక్కఁగఁ గనుఁగొని, రాజమార్గస్థచ♦క్రముల రాజు
చారుల గర్జన్ని♦శాటుల దీక్షిత,జటిలముండుల నృష♦చర్మధరుల
తే. దర్భముష్టిప్రహారణుల ♦ దహనకుండ
సాధనులఁ గూటముద్గర♦శస్త్రధరుల
నొంటికన్నొక్క చెవియు లం♦బోదరములు
వ్రేలుఁజొమ్ములుఁ గలవారి ♦ వేడ్కఁగనియె. ౧౯౦

సీ. వికటకరాళుల ♦ విపులకోదండుల, వామనులను భుగ్న♦వక్త్రయుతుల
ఖడ్గుల ముసలులఁ ♦ గవచులఁ బరిఘాయు,ధులను శతఘ్న్యాయు♦ధులను మఱియు
నాధికస్థూలుల ♦ నాతికృశాంగుల, నాతిదీర్ఘుల నాతి♦హ్రస్వకులను
నాతిగౌరాంగుల ♦ నాతికృష్ణాంగుల, నాతివామనులను ♦ నాతికుబ్జ
తే. కులను బహురూపులను విరూ♦పుల సురూపు
లను సువర్చసులను బతా♦కినిచయముల
ధ్వజుల వివిధాయుధుల శక్తి♦కుజధరులను
బట్టిసాయుధులను గాడ్పు♦పట్టి గనియె. ౧౯౧

తే. క్షేపణీపాశకరుల నా♦లేపరతుల, మాల్యవిలసితతనుల స♦మాల్యభూరి
భూషణుల స్వైరుల ననేక♦వేషయుతుల, వేలకొలఁదులఁ గనియెనా♦భీమబలుఁడు.

ఆ. భయదశూలధరుల ♦ వజ్రహస్తకులను, బంక్తికంఠునాజ్ఞఁ ♦ బట్టనమున
నడిమిగుల్మ మగుచుఁ♦గడుహెచ్చరిక నింటి,ముందు గ్రాలఁ గనియె♦మూలబలము.
కం.బంగరుతోరణములను జెలంగుచు గిరిశిఖరసీమ♦లన్ వెలిదమ్ముల్
రం గగునగడ్తతోడ వెలింగెడిప్రాకారమున ల♦లిం గొమరొప్పన్. ౧౯౪
చం.అమరనివాసతుల్య మయి ♦ హారినినాదయుతంబు నై తురం
గమపటుహేషితంబు నయి ♦ కమ్రవిభూషణశింజితంబు నై
విమలవిమానయానరథ♦విశ్రుతవారణమత్తపఙ్క్తిసం
ఘమ్మృగమనోహరంబు నయి ♦ క్రాలు మహాబలయోధగుప్తమున్ ౧౯౫.
వంశస్థము.సహేమరత్నోజ్జ్వల♦చక్రవాళమున్,మహార్హముక్తామణి♦మండితాంతమున్
మహాఽసితాభ్రాగురు♦మంజుగంధమై, రహించురక్షోధిపు♦రాణివాసమున్

## చంద్రవర్ణనము.

కం.కనుఁగొని కేసరిసూనుఁడు, చనె లోనికి రామచంద్రు♦సతి నెమకంగా
వినువీదిని మధ్యంబున, జనలోచనపర్వముగను ♦ జంద్రుఁడు వెలిఁగెన్. ౧౯౬
లయగ్రాహి. అంత హనుమంతుఁడు న♦భోంతరమునం గనియె
వింత లగువెన్నెలల♦కాంతులు వెలుంగన్
గాంత మగుమంద వృష♦కాంతునిగతిన్ మలయు
చంతట జగంబున ని♦తాంతరుచి మీఱన్
స్వాంతములు హాయి గొన ♦ సంతసమునన్ జలధి
కాంతుఁడు తరంగముల ♦ గంతు లిడునట్లా
శాంతముల నంటునటు ♦ తంతయును జేయునుడు
కాంతు జనసంచయదు♦రంతదురితాంతున్ ౧౯౮
చారుమతి. ఏకాంతి పొల్చునొ మ♦హీస్థలి మందరస్థ మై
యేకాంతి సంజ రహి♦యించు నదీశ్వరస్థ మై
యేకాంతి యొప్పు సర♦సీద్ధసరోరుహస్థ మై
యాకాంతి యప్డు పోలు♦పారె నిశాకరస్థ మై, ౧౯౯
ఉ. రాజతపంజరస్థ మగు♦రాజమరాళముభంగి, మందర
భ్రాజితకందరస్థమృగ♦రాజమువైఖరి, భూరిదుర్ధదో
ర్ద్వేజకకుంజరస్థుఁ డగు♦వీరువిధంబునఁ, జంద్రుఁ డయ్యెడన్
రాజిలె నంబరస్థుఁ డయి ♦ రాజముఖీవదనాభిరాముఁ డై. ౨౦౦
చం.బలిసినతీక్ష్ణశృంగవృష♦భంబువరంబువిధంబు దోఁపఁగా
సలలితహేమశృంగ మగు♦సామజరాజమునోజఁ బాండురో

జ్వలితమహోచ్చశృంగకర♦సాధరనాథువిధానఁ జంద్రుఁడుర్
వెలసెను బూర్ణశృంగుఁ డయి ♦ విశ్వమనోజ్ఞవిభానుమంగుఁ డై. ౨౦౧

వంశస్థము. వినష్టశీతోదక♦బిందుపంకుఁడుర్, ఘనగ్రహగ్రాహవి♦నష్టపంకుఁడుర్
వినోదలక్ష్మ్యాశ్రయ♦నిర్మలాంకుఁడుర్,వినిద్రరుగ్వ్యక్తిఁజ♦నేకశశాంకుఁడున్.

కం.చంద్రుఁడు విపులశిలాస్థమ్ము,గేంద్రుఁడు నా భీమసమర♦పృథ్వీగతనా
గేంద్రుఁడు నా రాజ్యాప్తి న,రేంద్రుఁడు నా వెలసె సితఖ♦గేంద్రునిమాడ్కిన్.

శా.రాజద్రాజవినష్టదోషము, సురా♦రాతిప్రవారామిష
భ్రాజద్భోజనవృత్తదోషము, లస♦ద్రామాభిరామేరితో
ద్వేజన్మానసదేశ దోష, మగుచుర్ ♦ వేడ్కం బ్రదోషంబు స్వా
రాజావాససమానతోషణము నై ♦ రాజిల్లెఁ దేజంబునన్. ౨౦౪

ఉ. అత్తఱిఁ దంత్రినాద మల♦రారెను గర్ణసుఖప్రవృత్త మై
బిత్తరి మొత్తముల్ నిదుర♦పెల్చన నొప్పె హృదీశ వృత్త మై
హత్తెను గ్రూరశీలపిశి♦తాశనసంఘము రౌద్రవృత్త మై
తత్తఱచే వియుక్తవని♦తాతతి గుండె సుమేషువృత్త మై. ౨౦౫

కం.గృహములు మత్తోన్మత్తని,వహములురథగజతురంగ♦భద్రాసనసం
గ్రహములు శుభవీరరమా,వహములు గనుఁగొనియెఁ బ్లవగ♦వల్లభుఁ డచటన్.

హనుమంతుఁడు లంకలో రాక్షసస్త్రీపురుషులఁ జూచుట.

కం.ఆక్షేపంబుల గురుభుజ,విక్షేపంబులను మత్త♦వివిధాలాపా
ధిక్షేపంబుల నన్యా,ధిక్షేపంబులఁ జెలంగు♦దితిజులఁ గాంచెన్. ౨౦౭

ఉ. ఱొమ్ములు విచ్చి దేహము లెఱుంగకనూర్కెడివారి,స్త్రీలగా
త్రమ్ములఁ గాలుఁ జేయి రుచి♦రమ్ముగ వైచి పరున్నవారి, రూ
పమ్ములు పెక్కురీతులుగ ♦ భాసిలువారిని, సారభూగిచా
పమ్ములు మీటువారిఁ, గనెఁ బావని పౌరనిశావిహారులన్. ౨౦౮

ఉ. ముచ్చట లాడువారి, నగు♦ముద్దుమొగంబులవారి, నిద్ర క
న్రచ్చెడివారిఁ, జందనమ♦నోహరలేపముఁ బూయువారి, లో
నెచ్చినవర్ణకోపమున ♦ నెంతయు నూర్చుచు నున్నవారి, సొం
పచ్చువడంగఁ గాంతులను ♦ బ్రార్థన చేసెడివారిఁ గన్గొనెన్. ౨౦౯

కం.వినదద్గజములు సభ్య,ప్రణమత్పూజ్యులు ప్రాదాంత♦రస్థితఘూఘూ
నినదత్ఖణులనుబోలెడి,వినిశ్వసద్వీరభటులు ♦ వెలయఁగఁ బురిలోన్. ౨౧౦

సీ. సంవిత్ప్రధానుల ♦ సంశ్రద్ధధానుల, రుచిరాభిధానుల ♦ రూఢిమీఱు
విశ్వప్రధానుల ♦ వివిధవిధానులఁ, బురియాతుధానులఁ ♦ బురుమనోజ్ఞ

రూపుల స్వగుణాను♦రూపుల లసమాన,రూపుల బహుగుణ♦దీపితులను
మఱియు విరూపుల ♦ మానితపరిశుద్ధ,భావలను మహాను♦భావురాండ్రఁ
ఆ. భావనాధిసక్త♦భావలఁ దారకా,పటలలసితసుప్ర♦భావలను స
మీరసుతుఁడు గాంచె ♦ సారతరానంద,యుక్తి సౌధరాజి ♦ నుప్పరిగల. ౨౧౧

చం.భరితత్రపోపగూఢలను ♦ భాస్వరమోహరసైకరూఢలన్
వరరమణోపగూఢలను ♦ వల్లభమోహనకార్యమూఢలన్
సురుచిసుమోపగూఢకవి♦సుందరలం బ్రమదోపగూఢలన్
వరమతిభర్తృపోఢలను ♦ వానరనేత గనె న్నవోఢలన్. ౨౧౨

చం.కనకగృహోపవిష్టలను ♦ గాంతధవాంకసుఖోపవిష్టలన్
వినయకృతాత్మనాథసమ♦భీష్టల ధర్మకళావిశిష్టలన్
ఘనమదనాభివిష్టల వి♦కారవిదూరమనోజ్ఞచేష్టలన్
గనియె నివిష్టలం బవను♦గాదిలిపట్టి నితాంతహృష్టలన్. ౨౧౩

ఉ. కాంతసువర్ణవర్ణలను ♦ గాంతవియోగవశక్షువర్ణలన్
గాంతవకేళ్యుదీర్ణలను ♦ స్కన్నకుచాంశుకగౌరవర్ణలన్
గ్లాంతిగళత్సువర్ణలను ♦ నాయకవిద్ధసుగంధిచూర్ణలన్
శ్రాంతవికీర్ణచూర్ణకచ♦చారుదృగబ్జనిగారకర్ణలన్. ౨౧౪

ఉ. రామలఁ బ్రాప్తనాథపరి♦రంభణహృష్టమనోభిరామలన్
శ్యామల నాత్మమందిరవి♦హారకళాపరమాభిరామలన్
గోమలగాత్రవల్లు లగు♦కోమలఁ బ్రేమరసైకధామలన్
రామునిదూత గన్గొనియె ♦ రాక్షసకేళిగృహాళిసీమలన్. ౨౧౫

కం.బాలికలన్ శశినిభముఖ,మాలికలన్ వక్త్రపక్ష్మ♦మంజులతరదృ
గ్పాళికలం గనె భూషణ,మాలికలం జంచలార♦మాజాలకలన్. ౨౧౬

కం.సీతను రాజాన్వయసం,జాతను బరమాభిజాత ♦ సద్వ్రతపూతన్
స్ఫీతస్ఫుటలతికానిభ,జాతను గపి మానసాభి♦జాతఁ గనండున్. ౨౧౭

సీ. వరసనాతనపథ♦స్థిరసన్నివిష్టను, బ్రాణేశముఖలోక♦నైకహృష్టఁ
గామాభివిష్ట సు♦కాంతావిశిష్టను, నాత్మవల్లభహృద♦యప్రవిష్ట
విరహతాపోద్భవా♦విరళాశ్రుకంఠిని, రమ్యపక్ష్మల నభి♦రక్తకంఠిఁ
దరుణిఁ బురావరో♦త్తమనిష్కకంఠిని, నిష్కుటసంచర♦న్నీలకంఠి
తే. నబ్జరేఖను బోలె న♦వ్యక్తరేఖ, పాంసుపరిదిగ్ధ మగునవ♦భర్మరేఖ
వ్రణమునను లెస్సనాటిన♦బాణరేఖ, యనిలభిన్నాభ్రరేఖనాఁ ♦ దనరుదాని.

దోధకము. సీతను రామునిశ్రీతరళాక్షిఁ, వాతతనూజుఁడు ♦ పట్టనమందుఁ
భీతిల కారసి ♦ వేదిజ[1] లేమిఁ, జాతమహావ్యథ ♦ సంకట మందెన్. ౨౧౯

### హనుమంతుఁడు రావణాలయంబుఁ జూచుట.

తే. నెమకి నెమకియు రాక్షస♦నిలయములను
సీతఁ గానక సవిషాద♦చిత్తుఁ డగుచుఁ
గామరూపంబుఁ దాల్చి లా♦ఘవము మెఱయ
వెండి నొకమాటు పావని ♦ వెదకఁ దొడఁగె. ౨౨౦

కం. కేసరులు గావ నెల్లెడ, భాసిల్లుమహావనంబు♦భాతినిఁ దుష్ప్రే-
క్షాసురసంఘము గావఁగ, వాసిం గని యర్కవర్ణ♦వప్రావృత మై. ౨౨౧

సీ. దేదీప్యమాన మౌ ♦ దివిజారిభవనంబుఁ, గని ముక్కునను వ్రేలు ♦ గదియఁ జేర్చి
రూప్యకోపహితాభి♦రూపమణీహేమ,భూషితతోరణ♦పుంజ మగుచుఁ
జిత్రకక్ష్యంబులఁ ♦ జెలువారి రుచిర మౌ,ద్వారపంక్తులచే సు♦దార మగుచు
వారణారూఢు లౌ♦బరికాండ్రచేతను, శ్రమ మెఱుంగనిశూర♦రాజిచేత

తే. శోభితం బయి త్రొక్కని♦చోట్లు త్రొక్కు-
యుగ్యములచేతఁ బులులయు ♦ నుగ్రసింహ
ములయుఁ జర్మములను గప్పు ♦ మొనసి దాంత
కాంచనాంచిత మగురథ♦గణముచేత ౨౨౨

సీ. రహి మీఱుచు నమూల్య♦రత్నసమాకీర్ణ, మై పరార్థ్యాసన ♦ మగుచు మఱియు
నతిరథావాస మై ♦ యతులరథంబులు, నతులపీఠంబులు ♦ నమర బహుళ
విధమృగంబులచేత ♦ విహగసంఘముచేతఁ, బరిపూర్ణ మగుచు ని♦ర్భయత రేఁగు
నంతపాలురచేత ♦ నభిరక్షితం బయి, యాత్మ కెక్కిన మెచ్చు♦లాఁడు లొప్ప

తే. బలుపువెన్నెలపులుఁగుల♦బవిసి యార్చు
కన్నుఁగవ లొప్పుప్రమదల♦కనకరత్న
భూషణంబులరాపున ♦ బొడమునులివు
లబ్ధిరావంబు నటు లుండు ♦ మనుచు నుండ ౨౨౩

తే. చందనాగరుధూపవా♦సనలు నిండ, భేరికామర్దలధ్వనుల్ ♦ బోరుకొనఁగ
నిశిచరావిరతాభ్యర్చ♦నీయమగుచు, నబ్ధిగంభీర మగురావ♦ణాలయంబు ౨౨౪

కం. పొంకంబుగ హయవారణ,సంకుల మై వివిధరత్న♦జాలక వేశ్మా
లంకృత మవుదానిని గని, లంకాభరణంబుగాఁ ద♦లఁచి నికటమునన్. ౨౨౫

చం. వెదకెను రాక్షసావళుల ♦ వీడును వీడును వాడ వాడయుఁ
నదలక తోఁట తోఁటయును ♦ వానరవర్యుఁడు దొడ్డి దొడ్డియుఁ

---

[1] వేదిజ = సీత.

గొ॒దకొని మేడ మేడయును ♦ గూటము కూటము మూల మూలయుఁ
మది వెఱలేక తా విసివి ♦ మానక కార్యభరంబు పెంపునన్　　　౨౨౬

—— హనుమ రాక్షసముఖ్యుల యిండ్లయందు సీతాదేవిని వెదకుట. ——

సీ. వేగ ప్రహస్తుని♦వీటికి లంఘించి, యెలమి మహాపార్శ్వ♦నిక్క కెగిరి
కందతుల్యము కుంభ♦కర్ణుసౌధముఁ జొచ్చి, యల విభీషణువాస ♦ మధిగమించి
యట మహోదరవిరూ♦పాక్షవిద్యుజ్జిహ్వు,లిండ్లు విద్యున్మాలి♦గృహము నరసి
వజ్రదంష్ట్రునిశాల ♦ వలనొప్పఁగా రోసి, శుకసారణులసభల్ ♦ సొరిది నెమకి
తే. యింద్రజిత్తునివేశ్మంబు ♦ నెల్ల వెదకి, జంబుమాలి సుమాలుల♦సదనములను
రశ్మికేతువుసూర్యశా♦త్రవుల నెలవు, వజ్రకాయునిగేహంబు ♦ వరుసఁ జూచి　౨౨౭
సీ. బలులు ధూమ్రాక్షసం♦పాతినామకులు వి,ద్యుద్రూపభీములు ♦ నుగ్రులైన
ఘనుఁడు విఘనుఁడు వి♦కటుఁడు వక్రుండును, శఠశుకనాసర♦క్షఃప్రవరులు
బ్రహ్మకర్ణుండు దం♦ష్ట్రధ్వజగ్రీవయు,ధ్ధోన్మత్తమత్తులు ♦ నుదుటు మీఱు
రోమశుండును మఱి♦క్రూరవిద్యుజ్జిహ్వ,హస్తిముఖేంద్రజి♦హ్వప్రవరులు
తే. శోణితాక్షపిశాచులు ♦ శూరుఁడైన,యాకరాళుండు నివసించు♦నాలయముల
వరుస దప్పక యాగంధ♦వహసుతుండు, తగవు మఱవక వెదకు సీ♦తావధూటి.

—— హనుమంతుఁడు రావణగృహంబుఁ జొచ్చుట. ——

ఉ. ఈవిధి వారు వారు వసి♦యించుగృహంబుల నెల్ల రోసి యా
పావని పాశతోమరకృ♦పాణసుముద్గరశూలహస్తలై
కావలికాచుస్త్రీల నుప♦కంఠమునం శయనించువారి ర
క్షోవిభుమందిరంబునను ♦ జూచి తదంతరసీమలోపలన్.　　　౨౨౯
కం. నానావిధసాధనముల, మానుగ ధరియించుయుద్ధ♦మర్మజ్ఞుల ర
క్షోనిచయము రక్తసితా,జానేయంబులను జూచె ♦ జవనాఢ్యములన్.　　　౨౩౦
కం. పరగజపీడాకరములఁ, బరసేనామర్దనముల ♦ వరకులజములం
హరిహయగజనిభములఁ గే,సరిసూనుఁడు గాంచె రూప♦సంపన్నములన్.　　　౨౩౧
కం. కురిసెడుజలదములో యనఁ, దొరఁగెడునిర్ఝరచయంబు♦తోడిగిరు లనం
గురుగర్జన్మేఘము లనఁ, బరఁగెడిపరదుర్జయముల ♦ వారణమఃఖలన్.　　　౨౩౨
సీ. తతకాంచనపరిష్కృ♦తంబు లౌతరుణార్క,సన్నిభ వాహినీ♦సంఘములను
నైకాకృతుల నొప్పు♦నాందోళికలను వి,చిత్రలతాగేహ♦చిత్రనిలయ
కేళీగృహంబులఁ ♦ గ్రీడింప దారుప,ర్వతములఁ గామకా♦రణగృహముల
మంజుదివాగృహ♦మందరప్రఖ్యమ,యూరతలంబుల; ♦ నొప్పు మీఱు
తే. టెక్కెముల దండములను బా♦టించి చూడఁ
దగిననిధిజాలముల నొప్పి ♦ ధగధగాయ

మాన మగుచుఁ గైలాసస♦మాన మైన
రావణుని వీడు గనుఁగొనె ♦ రాముదూత. ౨౩౩

కం. సురశాత్రవు తేజముచేఁ, బరమమణీనికరదీప్తి♦పటలంబులచే
భరితం బయి రావణుమం,దిరము వెలింగెను గరాళి ♦ దినకరుమాడ్కిన్. ౨౩౪

కం. ప్రాసాదసంఘయుతమై, భాసురమణిభాజనాళి♦భరితంబై మ
ధ్వాసవసుపరిక్లిన్నం,బై సరసమృదంగనాద♦మై కడువిరివై. ౨౩౫

ఉ. బంగరుసెజ్జలుం దళుకు♦బంగరుపాత్రలుఁ జిత్తచోరమ
త్తాంగజఘోటికానిభవ♦రాంగనలున్ మణికాంచినూపురా
భంగరవంబులుం గలిగి ♦ బాఢమనోరమ మై విశాల మై
యం గగురావణాసురగృ♦హంబువరంబును గాంచి దానిలోన్. ౨౩౬

## హనుమంతుఁడు నగళ్లలో సంచరించుట.

మధురగతిరగడ.

మారుతి గన్గొనె ♦ మందిరజాలము, హారివిదూరజ♦హాటకజాలముఁ
జపలాలతికా♦శకునవిహారము, నిపుణప్రావృ♦ణ్ణీరదవారము
వలెఁ బలుదెఱఁగుల ♦ భాసిలు శాలలఁ, గలితాంబుజఘన♦కార్ముకశాలల
రమణీయం బయి ♦ క్రాలువిశాలల, విమలగృహోపరి♦విలసచ్చాలలఁ
బరమసురత్న♦భ్రాజిత మగుచును, బురుహూతాదిక♦పూజిత మగుచును
వరమును దోషవి♦వర్జిత మగుచును, నరయఁగ నాత్మజ♦లార్జిత మగుచును
సాత్వాన్వయమతి♦సంకల్పిత మయి, యక్షరమణిభూ♦షాకల్పిత మయి
భాసిలుగృహములఁ ♦ బావని గాంచెను, వీసముఁ గొంకక ♦ వేడ్కఁ జరించెను.

## హనుమంతుఁడు పుష్పకవిమానముఁ జూచుట.

వృషభగతిరగడ.

ఘనఘనాఘనకలితరూపము ♦ కాంచనాంచిత చారురూపము
దనుజనాథబలానురూపము ♦ ధాత్రి నప్రతిరూపరూపము
ధారిణీగస్వఃప్రకీర్ణము ♦ తతవిభాబహురత్నకీర్ణము
చారుతరకుసుమావకీర్ణము ♦ శైౌద్ర మనఁగ రజోవికీర్ణము
చంచలాంగీదీప్యమానము ♦ చంచలాయుతఘనసమానము
అంచితసితఖగోహ్యమానము ♦ నగువిమానమునకు సనూనము
నగ మనన్ బహుధాతుచిత్రము ♦ నైకవర్ణపయోదచిత్రము
గగన మన గ్రహచంద్రచిత్రముఁ ♦ గనె విమానము రత్నచిత్రము
ధరణి పర్వతరాజిపూర్ణము ♦ ధరము వృక్షవితానపూర్ణము

ధరణిరుహము సుమౌఘపూర్ణము ♦ తతసుమావళి పత్రపూర్ణము
భాసురసుమగపుష్కరంబులు ♦ పక్షికలయుతనిష్కుటంబులు
కేసరాన్వితపుష్కరంబులు ♦ గృహము లచ్ఛ త్రివిష్కరంబులు
ఆకుపచ్చవిహంగమంబులు ♦ హారిజాత్యతురంగమంబులు
నైకరత్నభుజంగమంబులు ♦ నవ్యరుచినభసంగమంబులు　　౨౩౮

కం. సాత్త్వోత్సుమనస్సాయక, పక్షములు ప్రవాళకనక ♦ పక్షములు లస
త్పక్షములు కుసుమకీలిత, పక్షములు సలీలవక్ర ♦ పక్షము లమరన్.　　౨౩౯

కం. తమయంతఁ గరులు నునుఁదొం, డములన్ నెఱవిరియుకలువ ♦ ననలఁ గొలనినీ
రము గొని యభిషేకింపఁగఁ, గమలాంచితహస్తయైన ♦ కమలాసతితోన్.　　౨౪౦

కం. కమ్మనివలపులు గలవృ, క్షమ్మన మాధవదరీద్ధ ♦ శైలమ్మన హృ
త్సమ్మతపుష్పవిమానం, బమ్మరుదాత్మజుఁడు గాంచి ♦ యబ్బురపడియెన్.　　౨౪౧

కం. ఎంతయు వింతలు పురమం, దంతటఁ గనుఁగొనుచు నరిగి ♦ యరిగి మహీజా
కాంతను గనక సునేత్రుఁడు, చింతాయుతుఁ డయ్యె నేమి ♦ చేయుదు ననుచున్.

## పుష్పకవిమానవర్ణనము.

ఉ. ఆనిలయంబులోన నడు ♦ మంతరమందు విచిత్రరత్నసం
తానధగద్ధగాయితను ♦ తప్తనువర్ణమనోహరంబు వై
మానికమార్గసంచరణ ♦ మానిత మప్రతిమం బమేయమున్
భానుపథైకలక్ష్యమును ♦ బావని గాంచె విమానరత్నమున్.　　౨౪౩

ఉ. అందు నమేయకౌశలసు ♦ యత్నముతోడ నొనర్పనట్టి దే
దెందును లేదు దివ్యమణి ♦ హీరవినాకృత మెందు లేదు త
త్సుందరతాగుణంబు గన ♦ ద్యోచరయానములందుఁ గల్గ దెం
దెందుఁ గనంగ నబ్రము ద ♦ యింపక పోదు నితాంత మేరికిన్.　　౨౪౪

సీ. విపులతపంబున ♦ విక్రమంబున నార్జి, తం బయి హృత్సమా ♦ ధానముగను
జరియించుచు ననేక ♦ సంస్థాననిర్మితం, బై సర్వతోమనో ♦ హరము నగుచు
దుర్వార మై వాయు ♦ తుల్యజవంబు నై, కృతపుణ్యమహితాత్మ ♦ గేహ మనఁగ
నొప్పుచుఁ జిత్రకూ ♦ టోత్కరమండితం, బై హృద్య మై శర ♦ దంబుజారి
తే. ధవళ మై కుండలాలంకృ ♦ తముఖగగన, చరనిశాచరచారువి ♦ శాలనయన
భూరిజవనదురాధర్ష ♦ భూతగణస, హస్రవాహిత మయి యొప్పు ♦ నట్టి దాని　　౨౪౫

కం. సురభిసుమసుందరం బై, సురభిత మై సురభికంబె ♦ సుందర మగుచున్
సురశిల్పివినిర్మిత మై, పరఁగెడి పుష్పకవిమాన ♦ వరముం గనుచున్.　　౨౪౬

## హనుమంతుఁడు రావణుని యంతఃపురంబుఁ జూచుట.

తే. ఆవిమానంబు మధ్యంబు♦నందు నర్ధ,యోజనము విస్తృతియు నొక్క♦యోజనంబు
నిడివి గలపంక్తికంఠుమం♦దిరముఁ జొచ్చి,యాయతాక్షిని వెదకె హ♦తారికులుఁడు.

కం. పెక్కులు మూఁడుగు లొప్పెడి, రక్కసనాయఁకులనగరఁ ♦ గ్రమముగఁ గని పే
రుక్కు గలసోఁకులిండ్లను, గ్రక్కన తేఁ డుండు పీటఁ ♦ గనఁగఁ దొడంగెన్. ౨౮౯

సీ. మూఁడును నాల్గుకొ♦మ్ములు గలయేనుఁగు, లెడ మెడముగఁ గట్టఁ♦బడుచు నుంట
యుద్ధృతాయుధు లైన♦యోధులు గాచుట, యసురనాయకునిభా♦ర్యాళిచేత
విక్రమాహృతపృథి♦వీధవకన్యకా,బృందంబుచేఁ బరి♦వృతము నగుట
తిమితిమింగిలనక్ర♦దీర్ఘఘుషాకులో,దధి నాఁగఁ గల్లోలి♦తంబు నగుట

ఆ. శ్రీదులక్ష్మి యింద్రు♦సిరియును సర్వంబు, పాయ కుంట వాని♦బంధులిండ్ల
యమకుబేరవరుణ♦రమయు నంతకు మిన్న, వెలయు చుంటఁ గనియె ♦ వీరవరుఁడు.

ఉ. ఆసొబగారుమేడనడు♦మంతర మం దొగి విశ్వకర్మ దా
వాసిగ మింటఁ దొల్దొలుత ♦ వారిజగర్భునకై రచించె నా
నాసుమణీయుతంబుగ న♦నంతర మాధనదుండు నీరజా
తాసనుఁ గొల్చి చేకొనియె; నాతని గెల్చి రణాంగణంబునన్ ౨౯౦

సీ. రావణుఁ డుగ్రత ♦ గ్రహియించినదియు నీ,హామృగయుక్త మై ♦ యమరు నదియుఁ
గార్తస్వరస్తంభ♦కమనీయ మగునది, ధగధగత్కాంతులఁ ♦ దనరు నదియు
మేరుమందరముల♦మేలిమి గగనంబు, రాయుకూటాలయ♦రాజిచేత
సమలంకృతం బయి ♦ సవురు మీఱెడునది, నడిమింటిసూర్యుని ♦ నవ్వునదియుఁ

తే. గనకసోపానపంక్తులఁ♦గమ్రవేది,కలను వాతాయనంబులఁ ♦ గలితనీల
విద్రుమాంచితమౌక్తిక♦వితతిచేత, స్థగిత మవునది యెక్కెఁ బు♦ష్పకము హనుమ.

ఉ. ఆయెడ భక్ష్యపానవివి♦ధాన్నవినిర్గతకమ్రవాసనల్
వాయుతనూభవుం గదిసి ♦ స్వాంతము రంజిల బంధురీతిగా
నీయెడ నున్నవాఁడు దను♦జేశ్వరుఁ డిట్టిటు రమ్ము రమ్మ టం
చాయతివీరునిం బిలుచు♦నట్టులు రాజిలె సోడు ముట్టుచున్. ౨౯౧

సీ. అట నేగి వరశుభా♦యత మయి కాంత నాఁ, గాంత మై ప్రియనిజ♦కాంతవోలె
నమరారికిని మనో♦హర మయి రత్నసో,పానవికృత మయి ♦ పైఁడిజాల
కంబుల నీ టయి ♦ కడుఁబటికపురాల, ని మ్మయి దంతపు♦బొమ్మ లమరి
పవడముల్ ముత్యముల్ ♦ బంగారు వెండియుఁ, బటిమఁ దీర్చినస్తంభ♦పటలి గలిగి

తే. సమము చక్కన యెత్తును ♦ జాను మీఱు,కంబముల మింటి కెగిరెడి♦కరణి వెలసి
యిలను గలిగినచిత్రంబు ♦ లెల్ల వ్రాయఁ,బడినచిత్రకంబళము లై ♦ పఱపు గలిగి.

ఉ. ఘుమ్మని కమ్మవాసనలు ♦ గ్రమ్మ నితాంతశకుంతనాద మ
భ్రమ్మును ముట్టఁగా మృదువు♦పాన్పులు వన్నెలు మీఱ శుభ్రమై
నెమ్మది రావణాసురుఁడు ♦ నిచ్చ చరించెడిధామ మాచు ధూ
పమ్ముల ధూమ్రమై శబల♦భంగి విచిత్రసువర్ణజాతమై ౨౫౪

కం. మదికిని నతిసంహ్లాద,ప్రదమై రంగులకు మేలి♦రం గొసఁగుచు శో
కదళనసమర్థమై స,మ్మదమై కాంతులకు జనన♦మందిర మగుచున్. ౨౫౫

కం. రావణపాలితభవనము, పావని పంచేంద్రియముల♦పాలికి నపుడై
దావిషయంబులచే మో,దావాప్తిం గూర్చెఁ దల్లి ♦ యనువున నతఁడున్. ౨౫౬

కం. నాకము కాకుండిన సుర,లోకము హరిహయునిపురము ♦ లోకేశుమహా
లోకము యగు సిద్ధం బని,యాకపి యటు చనుచు నెదుట ♦ నద్భుతకాంతిన్.

మానిని. జూదమునం బెనుజూదరి కోడి స♦సుల్ దెసదోఁపక చింతిలు నా
జూదరియట్టులు నిశ్చలతం గను ♦ సొన్నప్రదీపములుం జగతిం
మాదిరి లేక వెలుంగు మణీకృత♦మంజులదీపులు సెమ్మెలుఁ దా
మోదము మీఱఁ గనుంగొనె వానర♦ ముఖ్యుఁడు తద్భవనాంతమునన్.

సుగంధి. దీపకాంతి దైత్యకాంతు♦దేహకాంతిఁ దద్వపు
స్థాపనీయభూషణాళి♦సారకాంతకాంతులం
బాపు! మండు చుండునట్లు ♦ ప్రజ్వరిల్లె శాల, యా
యేపుఁ జూచి మెచ్చె నంజ♦నేష్టపుత్త్రుఁ డాత్మలోన్. ౨౫౯

### నిద్రించు రావణునియంతఃపురస్త్రీలను హనుమంతుఁడు చూచుట.

రసమంజరి. పరిపరివిధముల ♦ భాసిలుచేలల్, సరగలుఁ బలుపలు♦చందపులీలల్
పరఁగెడియువతులు ♦ పానసుకేళీ,పరతను నిదురను ♦ బడఁగఁ జూచెన్.

స్రగ్విణి. సద్దు లేకుండఁగాఁ ♦ జారుభూషాతతుల్
ముద్దియల్ నిద్దురం ♦ మున్గి వర్తింపఁగాఁ
దద్ద యంచల్ మిళిం♦దంబులుం లేనిమేల్
ముద్దుఁబద్మాకరం ♦ బో యనం రాజిలెన్. ౨౬౦

కం. ముకుళితనయనంబులు నిం,చుకయుం వెలిఁ దోఁపనట్టి♦సొబగురదంబుల్
ప్రకటసరోజాతామో,దకలితవదనములు గలుగు♦తరుణులఁ జూచెన్. ౨౬౧

కం. తామరలవోలె వారల,మోములు వికసించు నుదయ♦మున రుచిరముగం
యామిని యగుడుం మఱి తా,మే ముకుళితదళము లయిన ♦ యెలమిం గూర్చెన్.

కం. వీరల మోములు నిజముగ, సారసములు గాక యున్న ♦ షట్చరణంబుల్
నీరజములవలె నేలా, సారెకు నీవదనములను ♦ సంప్రార్థించున్. ౨౬౪

కం. అందముచందము మఱి చ,ల్లందనమును బరిమళంబు ♦ లలితాకృతులున్
సుందరము లగుటఁ బంకజ,బృందముపో ముఖములనుచు ♦ నెంచెను గపియున్.

కం. తారాగణరాజిత మగు,శారదతారాపథంబు♦చందంబున దే
వారివరమందిరము కాం,తారత్నగణంబుచేతఁ ♦ దద్దయు వెలిఁగెన్. ౨౬౬

శా. ఆరాజీవవిలోచనాపరివృతుం ♦ డై రాక్షసాధీశుఁడున్
దారాసంవృతకైరవాప్తుఁ డన న♦త్యంతంబు శోభిల్లె బా
లారత్నంబులఁ బుణ్యవిచ్యుతిని నే♦లన్ వ్రాలు తారాళిగా
ధీరాగ్రేసరుఁ డామరుత్తనయుఁ డెం♦తే నెంచెఁ జిత్తంబునన్. ౨౬౭

కం. తళుకు తళు క్కను బెనుఁదా,రలవన్నె ప్రసాదగరిమ ♦ ప్రభయును ఘన మై
చెలువారు చుండె రావణు,నిలయంబునఁ గూర్కు చున్న♦నెలఁతుకలందున్.

కం. పానవ్యాయామంబుల, మీనాంకునియుద్ధమునను ♦ మెయి స్రగ్భూషల్
పేనుకొన రాలిపడినను, మే నెఱుఁగక కూర్కె నందు ♦ మెలఁతలపిండుల్. ౨౬౯

సీ. జాఱఁగఁ దిలకంబు♦సవు గొప్పనారులు, నందియ లూడిన♦యబ్జముఖులు
ప్రక్కల రాలిన♦వరమాల్యములచెలుల్, చీరలు సడలిన♦చేడియలును
ద్రెస్సిన మంచిము♦త్తియపుఁ బేరుల సతుల్, తునిఁగిన మొలనూళ్ల♦తోయజాస్య
లలసట దీఱంగ ♦ నల్లఁ బండినగుజ్జు,పుంబిల్లలనుబోలు ♦ పువ్వుఁబోండ్లు

తే. తళుకుఁగమ్మలు దాల్చిన♦తలిరుఁబోండ్లు, నలఁగి తెగియుండుదండల♦చెలువు మీఱి
కానఁ గరి ద్రెంచి వైచినఁ ♦ గ్రాలు పూల, తీఁగలనఁబోలి కొండఱు ♦ తేజరిలిరి.

కం. ముద్దియలు గూర్కఁ గొందఱు, ముద్దుఁజనుంగవలఁ దఱచు♦ముత్తెపుఁ బేరుల్
తద్దయు రవిశశికరముల, కుద్దిగ నయి కూర్కునంచ ♦ లొప్పం జూపెన్. ౨౭౦

కం. ఇంబుఁగ గొందఱువైడూ,ర్యంబులు కాదంబపక్షు♦ల ట్లొప్ప, రథాం
గంబులగతిఁ గొందఱుగ్రీ,వంబులఁ దనరారు చుండె ♦ బంగరుసరడుల్. ౨౭౧

కం. కొందఱు మెడలం దాల్చిన,యందపువైడూర్యవితతు ♦ లంచలరీతిన్
గొందఱ బంగరుసరములు, సుందరచక్రములరీతి ♦ సొబగున వెలసెన్. ౨౭౩

కం. అంచలచేఁ గారండవ,చంచచ్చక్రములచేత ♦ సైకతములచేఁ
బ్రాంచన్నదు లన జఘనో,దంచిత లయి సతులు వెలసి ♦ రాభవనమునన్. ౨౭౪

చం. ప్రకటసువర్ణభూషణసు♦పద్మచయంబులుఁ జారుకింకిణీ
ముకుళములున్ మనోగ్రసన♦మోహనశీలవిలాసనక్రరు
క్ప్రకరతటంబు లై నిదురఁ ♦ గ్రాలెడుబాలలు పోల్ప నేఱు ల
ట్లకలుషరీతిఁ గ్రాలిరి వి♦హారభరశ్రమనష్టచిత్త లై. ౨౭౫

కం.గురుకుచచూచుకంబులను ♦ గోమలహృద్యతరాంగపాళులన్
సరసమణీమయాభరణ♦సంఘము లెంతయు నొప్పు మీఱె న
త్తరుణులు నిద్ర వోవు నెడ ♦ దర్పకదర్పవినష్టచిత్తులై
పురుషులు మీఁద సోలిపడు ♦ పొల్పు వహించి మనోహరంబుగన్. ౨౭౬

కం.అయ్యెడ నిదురించెడు న,త్తొయ్యలులముఖములనుండి ♦ తోలఁకెడియూర్పుల్
పయ్యెదచెంగులచేఁ దా, మొయ్యన వీచోపు లిడెడు ♦ యోషాస్యములన్. ౨౭౭

కం.నానావర్ణసువర్ణ,తీనవ్యముఖాబ్జ ములను♦దీప్యచ్ఛ్ఛభపై
తానివహము మదనపతా,కానికరము నట్లు వెలిఁగెఁ ♦ గమనీయంబై. ౨౭౮

కం.ఇందుముఖీముఖనిర్గత,మందసుగంధవహాసర్గ♦మండిత మగుచున్
మందంబుగఁ గదలెను గురు,విందమణీరుచిరము లగు♦వెలఁగలకమ్మల్. ౨౭౯

కం.చక్కెరకల్వలపులు వెలిఁ, గ్రక్కెడునచ్చిగురుఁబోండ్ల♦కమ్మనియూర్పుల్
మక్కిలి రావణుమీఁదను, జక్కఁగ విహరించెఁ గైపు♦సంపద లొలయన్. ౨౮౦

సీ. రావణాననము లన్ ♦ భ్రాంతిని సవతుల,ముఖముల ము ద్దిడు♦ముద్దరాండ్ర
నధిపుఁడే ము ద్దిడె ♦ న న్నను మత్తున, సవతాండ్రఁ జుంబించు ♦ ధవసురతలఁ
బడుకలు పైఁటలు ♦ కడియాలచేతులు, దిండ్లు గా నిదురించు♦తీఁగఁబోండ్లఁ
దమయురంబుల నుంచి ♦ తలలు నిద్రించుచె,ల్వలబొమ్ములను జేయి ♦ వైచు సతుల
తే. నొఱపు మెఱయంగ నొక్కర్తు ♦ కుఱువుమీఁద
శిరము ఘటియించి కూర్కెడి♦చెలువబొమ్ము
నందుఁ గే లైవ్చి నిదురించు♦నిందుముఖుల
నందుఁ గనుఁగొనె నంజనా♦నందనుండు. ౨౮౧

ఉ. సారెకుఁ ద్రావి మేను లవ♦శంబుగ నొండొరుమీఁదఁ బార్శ్వవప్పు
స్తోరుకటీప్రదేశముల ♦ నుంచి సుమాంబకరాగమగ్న లౌ
వారును సూత్రబద్ధమద♦బంభరశోభితమాలికారుచిన్
వారక యొక్కొకర్తుకను ♦ బాహులఁ గట్టి పెనంగుకేశినుల్. ౨౮౨

చం.సలలితమందమారుతవ♦శంబునఁ గూడి పెనంగుతీఁగలన్
గలసిన స్కంధసంతతుల ♦ నవ్యసుమౌఘములన్ మిళిందపం
క్తులఁ జెలువారి చైత్రమునఁ ♦ దోరపుఁగాంతిని మీఱుసద్వనీ
విలసనము న్వహించె సుర♦వీరవిరోధివధూవనం బటన్. ౨౮౩

ఆ. మెలఁత లచట నత్త♦మిల్లినలీలలు, చూడ నవయవములు♦సొబగు మీఱు
వస్త్రమాల్యములును ♦ వారి వారి వ టంచు, వేఱుపఱుపరాక ♦ బెరసి యుండె.

కం.ఆమందిరమణిదీపము, లాముదితలరూపు తెప్ప ♦ లార్పక జగతీ
స్తోమభయదుండు గూర్కఁగఁ, గామము చనఁ జూచుమాడ్కి ♦ గ్రాలెనచలతన్.

ఉ. కాముని బారి కోహటిలి ♦ కైవస మైననృపర్షి దైత్యక
న్యామణులున్ సురాంగనలు ♦ నాహవకాంక్షను దెచ్చినట్టికాం
తామణులున్ స్మరాశుగహ♦తప్రమదల్ సురవైరి చుట్టు ని
ద్రామదపారవశ్యమున ♦ రంజిలు చుండిరి తత్స్థలంబునన్. ౨౮౬

చం.ప్రమదలలో సురారి ప్రస♦భంబునఁ దెచ్చిన దన్యకామ ము
న్నమగనిఁ బొందినట్టిచెలి ♦ యక్కడ లే దొకసీత దక్కఁగా
సమరవిరోధిఁ గాంచి తమ ♦ యంతన తాము తదీయశౌర్యమున్
రమయు గుణంబు మెచ్చి తమి ♦ రాములు వచ్చిరి వానిఁ గూడఁగన్. ౨౮౭

ఉ. లేదు కురూప యందు నకు♦లీనయు లే దుపచారసత్క్రియా
మోదితచిత్త గానియొక♦ముగ్ధ యదక్షిణ లేదు చూడఁగా
లేదు విహీనసత్త్వయును ♦ లీలల భర్త కకామనీయయున్
లే దల రావణాసురుని♦లేమలయం దొకభార్య యేనియున్. ౨౮౮

కం.ఈరావణుభార్యలవలె, శ్రీరామునిధర్మపత్ని ♦ చేరినచో దే
వారాతి సుకృతి యనెడువి,చారం బుదయించె హరికి ♦ సద్బుద్ధి కటన్. ౨౮౯

కం.వ్యసనపడి మఱియు నాతం,డసదృశసద్గుణవిశిష్ట ♦ యవనిజ యయ్యో
యసమాత్తుఁ డామె యెడ రా,క్షసరా జొనరించెఁగా య♦సత్కార్యంబున్. ౨౯౦

### హనుమంతుఁడు నిద్రించురావణునిఁ జూచుట.

కం.అని చింతించుచుఁ జూచుచుఁ, జనుచుం బలుఁగులను రత్న♦సమితుల గొన బై
కనకవిడూరజదాంతా,సనములఁ జిత్రాంగములను ♦ సవు రగుదానిన్. ౨౯౧

సీ. పఱపైనపఱుపులఁ ♦ బట్టుదిండ్లును గల్గి,మహిత మై దేదీప్య♦మాన మగుచు
నొక్కచో నవ్యమా♦లోదారహరిణాంక,సన్నిభ పాండుర♦చ్ఛత్త్ర మమర
జాతరూపఖచిత♦సారసాప్తప్రభాఽ,శోకమాలాపంక్తి♦సుందర మయి
వీవనల్ విసరెడి♦వెలఁదిబొమ్మల నొప్పి, వరవధూపంక్తులఁ ♦ బరిఢవిల్లి
తే. మేఁకపిల్లలచర్మముల్ ♦ మెత్తఁ బఱచి, పూలదండల నెల్లెడఁ ♦ బొనరుపఱచి
కనఁగ సురనాథశయ్యాని♦కాశ మైన,యసురపతిమంచము న్గనె ♦ హనుమ యచట.

సీ. ఆమహనీయశ♦య్యాతలంబునయందుఁ, గారుమేఘము నవ్వు♦కాంతివాఁడు
క్రొత్తతళ్కులఁ దేఱు♦కుండలంబులవాఁడు, కావిపాఱిన పెద్ద♦కనులవాఁడు
సంజకెంజాయ స♦శంపాంబుదమురీతిఁ, బొరి నెత్తుగంధంపుఁ♦బూఁతవాఁడు
దివ్యపరిష్కార♦దేదీప్యమానుండు, రూపసియును గామ♦రూపధరుఁడు

తే. అసురకన్యకలకును బ్రియుం ♦ డైనయాతఁ
డాడి మాపట మిక్కిలి ♦ యలయువాఁడు
మేలిసొమ్ముల మెఱసెడి♦మేనివాఁడు
రావణుఁడు నిద్దురింప మ♦ర్కటుఁడు గనియె. ౨౯౩

తే. రజతచేలంబువాని దీ♦ర్ఘంబు లైన, బాహువులవాని భూరుహా♦వనకుడుంగ
సహితమందర మనఁగను ♦ జాలువాని, నెల్ల రాక్షసులకు సుఖ ♦ మిడెడువాని.

ఉ. పెద్దగ దంతివోలె బుస♦పెట్టెడువానిని, బానమత్తతన్
నిద్దురగొన్నవాని, రణ♦నిష్ఠురు, రావణుఁ డాసి భీతిమైఁ
దద్దయు దద్దఱిల్లె హరి ♦ దయ్యముఁ జూచి వణంకుకోఁచ నా
నొద్ద కి టేల వచ్చితి న♦యో యని పానుపు డిగ్గి యంతటన్. ౨౯౪

ఉ. చెచ్చెర వేదికాంతరముఁ ♦ జేరి కనుంగొనె నిద్దురించు నా
కుచ్చితుఁ, దచ్ఛయంబు మద♦కుంజరయుక్తఝరీప్రకాశ మై
మెచ్చులు గొల్పె, నయ్యెడ న♦మేయపరాక్రమకీర్తియుక్తముల్
నిచ్చలుఁ గాంచనాంగదమ♦ణీమయభూషణభూషితంబులున్ ౨౯౬

సీ. 'అగుచును నింద్రధ్వ♦జాభంబు లగువాని, నైరావతవిషాణ♦హతులచేతఁ
గాయ గాచినవాని ♦ ఘనశతారాహతి, నోర్చునంసంబుల ♦ నొప్పువాని
విష్ణుచక్రక్షతి[1] ♦ వెలయుచుండెడివాని, సబలసంగతసమాం♦సములవాని
నమలచిహ్నోత్తన♦ఖాంగుష్ఠములవాని, గుదియలఁబోలిన♦కొమరువానిఁ

తే. గరికరాకృతి గల గరి♦గరికవాని, నైదుపడగలపాముల♦యట్లు పాన్పు
నెరసి పడియుండువానిఁ గుం♦డేటినల్లఁ[2], బోలుకమ్మనిగందంపుఁ♦బూఁతవాని.

సీ. మృగవిలోలాక్షీవి♦మృదితంబు లగువాని, మంచిగందపుఁబరి♦మళమువాని
యక్షపన్నగనిర్జ♦రాసురగంధర్వ,పటలి హాహా యనఁ ♦ బ్రబలువాని
మందరాచలశృంగ♦మధ్యసీమను గూర్కు,క్రుద్ధాహు లన భీతి ♦ గొలుపువానిఁ
గ్రవ్యాదనాథుక♦రంబుల రెంటిని, బావని కనుఁగొనె ♦ బాహుయుగము

తే. కలిమి సశిఖరమందర♦క్ష్మాధ్ర మనఁగఁ, గ్రాలురావణువదని♦ర్గతము లైన
చూతపున్నాగవకుళాన్న♦సురభితములు, శ్వాసపవనముల్ నిండా రె♦సదనమునను.

సీ. ఒకరొూర నొఱఁగిన♦యుజ్జ్వలన్మౌక్తిక, కాంచనమకుటంబు ♦ మించువానిఁ
గుండలజ్వలితాస్య♦మండలంబుఁ గలానిఁ, గ్రూరసర్పమువోలె ♦ రోఁజువాని
రక్తచందనదిగ్ధ♦రమణీయహారసం,సక్తవిశాలవ♦క్షంబువాని
నొకవంక వ్రాలిన♦యొఱ పైన వెలిపట్టుఁ,బుట్టంబుముంగొంగు ♦ పొలుచువాని

---

[1] విష్ణుచక్రక్షతి = ఇది విష్ణుసాధన మైన సుదర్శనముచేనైన గాయము గాదు; విష్ణుచక్ర మనునది వే ఱొం కాయుధము. చూడు. ౬౭-వ స. బాలకాండము. [2] నల్ల = నెత్తురు.

ఆ. విలువ లేనిపైఁడి♦వలువఁ గట్టినవాని, మినుపపెద్దకుప్ప ♦ నెనయు వాని
గంగ నడుమ నిదుర ♦ నంగం బెఱుంగని,ద్వీపమునాఁగ మిగుల ♦ వెలుఁగువాని.
కం. నాలుగుదిక్కులఁ దమరుచి, వాలాయము నిండ వెలుఁగు♦వరదీపములన్
నాలుగిట మెఱయమెయి శం,పాలలితాబ్దంబుపగిది ♦ భాసిలువానిన్. ౩౦౦

హనుమంతుఁడు నిద్రించురావణుభార్యలఁ జూచుట.

తే. అసురవల్లభు నాతని♦యంఘ్రిమూల,మునను బండినయాతని♦ముద్దరాండ్ర
రాక్షసాధీశు దివ్యహ♦ర్మ్యంబునందుఁ,గాంచెఁ బవమానసూతి ని♦ష్కలుషమతిని.
కం. కమ్మలతో వాడనిమా,ల్యమ్ములతో నిండు నెలను ♦ హసియించెడునా
స్యమ్ములతో నట ముద్దుం,గుమ్మలఁ గనుఁగొనియె గాలి♦కొడు కవ్వేళన్. ౩౦౨
కం. ఇంబుగఁ దాలిచి యాభర,ణంబుల వీణాదివాద♦నంబుల శుభనృ
త్తంబులఁ జతురలఁ బత్యం,కంబులపై నిదురగొనెడి♦కాంతలఁ గనియెన్. ౩౦౩
కం. అంగనలవీనులందుఁ జె,లంగెడివైడూర్యకుండ♦లంబులు మఱి యా
చెంగట వెలుంగుబంగరు,టంగదములు గాంచె వాన♦రాగ్రణి యచటన్. ౩౦౪
కం. ఇందురుచిఁ గేరుముఖములు,సుందరతఁ దళుక్కు మనెడి♦చొక్కపుఁగమ్మల్
మందిరమును దారాగణ,తుందిలగగనంబుమాడ్కిఁ ♦ దోఁపించెఁ గడున్. ౩౦౫
కం. హేలారతిఁ గేళీగతి, లీలారతిఁ దేలినట్టి♦లీలావతు ల
వ్వేళను మే నెఱుఁగక కడుఁ,దూలిరి యిం దందు నిదుర ♦ తోరము గాఁగన్. ౩౦౬
కం. మత్తచకోరాంబక వర,నృత్తకళాశీల యగుట ♦ నేయభినయసం
పత్తి మును వెలసె నిద్రా,యత్తయు నై తదభినయమె ♦ యనువుగఁ దాల్చెన్. ౩౦౭
కం. వెల్లువఁ బోవుచుఁ బోతము, ఫుల్లనళిని యాశ్రయించు♦పోలుపున నిదురన్
హల్లకపాణి యొకతె కర,పల్లవములఁ గౌఁగిటన్ వి♦పంచిం గూర్చెన్. ౩౦౮
కం. కక్షంబున నొకకంజా, క్షేక్షణ మడ్డుకము నుంచి ♦ యెలమిని శిశువున్
గక్షమునఁ జేర్చి పండుమ్మృ,గేక్షణ యన నిద్దురించె ♦ నెలమిం గొనుచున్. ౩౦౯
కం. చిరకాలాగతు వల్లభుఁ, గరముల బిగిఁ గౌఁగిలించు♦కామినికరణిన్
గురుకుచ యొకర్తు పటహముఁ, గరముల బిగిఁ గ్రుచ్చి నిదుర♦కైపునఁ జొక్కెన్.
కం. కామమదంబున నొర్తుక, కామిని ప్రియతము రహస్సు ♦ గ్రహియించినటుల్
తామరసాక్షి యొకర్తుక, ప్రేమంబునఁ గౌఁగిలించి ♦ వేణువుఁ బండెన్. ౩౧౧
కం. కాంతునితోడఁ బరుండిన,కాంతామణి నా విపంచి ♦ గౌఁగిట నొనరన్
దంతిగమన నృత్తకళా,త్యంతనిపుణ యొర్తు నిదుర ♦ సంగము వ్రాల్చెన్. ౩౧౨.

కం. బంగరుజిగి మృదువుపు హృద,యంగమమును బీవరంబు • నగునంగములన్
రంగార నొత్తి యొక్కమృ,దంగ మొకకురంగనయన • తద్దయుఁ గూర్కెన్. 3౧౩

కం. మద్దెల మొరయించుచు నొక,ముద్దియ శ్రమ మొంది బాహు•మూలంబుల చేఁ
దద్దయుఁ గక్షంబున నది, గ్రద్దన బిగియించి పోలె • గాటపునిదురన్. 3౧౪

కం. డిండిమముఁ గ్రుచ్చి వెనుకను, నొండొకడిండిమము గ్రాల • యువవల్లభుతోఁ
గొండొకబిడ్డనితోడఁ బ,రుండినకకుభోరు వనఁ బ•రుండెను నిదురన్. 3౧౫

కం. మదనమదభృశవిమోహిత,మదకలమదిరాక్షి యొర్తు • మతి తెలియక తా
మృదుకరముల నాడంబర,ము దగఁ గవుంగిటను జేర్చి • మూసిఁగెను నిద్రన్. 3౧౬

కం. జలకలశ మొర్తు వసుధా,తలమున దొరలించి దానఁ • దడిసెన్ సురభిన్
జెలువతి వాడమికై ని, ర్మలజలసిక్త మగుశబల•మాల్యముమాడ్కిన్. 3౧౭

కం. బంగరుగిండులమేలిహరా,రంగులు గలనిజపయోధ•రంబులఁ గేలన్
భృంగీకురళ[1] యొకర్తుక, పొంగుగ బిగఁబట్టికొనుచుఁ • బొందెన్ నిదురన్. 3౧౮

కం. మదవిహ్వల యగునొక్కప్ర,మద శారదపూర్ణ చంద్రు • మఱపించెడి స-
ద్వదనముఁ గలయొకహరికటి, నిదురను బిగియారఁ గ్రుచ్చె • నెఱమోహమునన్.

తే. కామినులు కామమదమునఁ • గాముకులను, జన్నులను బిగ్గ నొత్తెడి•చందమునను
[2]తతఘనానద్ధసుషిరవా•ద్యములఁ గ్రుచ్చి, మత్తకాశిను లయ్యెడ • నత్తమిలిరి. 3౨౦

కం. వారల నెల్లరఁ జూచుచు, వీరుఁడు కపివరుఁడు పోయి • వే ఱొకచోటన్
జారుతరరూపవిభవో,దారను నేకాంతసీమఁ • దరుణిని గాంచెన్. 3౨౧

## హనుమంతుఁడు మందోదరిని జూచుట.

శా. రాణ న్మించినమంచిముత్తియపు హా•రాల్ దూల వక్షస్థలిన్
మాణిక్యప్రకరప్రభాపటలశుం•భన్మండనోద్దీప్తయై
రాణింపన్ శయనంబునం గనియె ని•ద్రాసక్త స్వర్ణాంగి మ
త్తేణీలోచనఁ జారురూపిణిని శు•ద్ధాంతేశ మందోదరిన్. 3౨౨

ఉ. హత్తినమేలిరూపమును • యౌవనసంపదఁ జూచి కంటి నే
నత్తరళాక్షి సీత నని • హర్షమునన్ భుజ మప్పళించు, ము
ద్దొత్తును దోఁక, నాడు, ముద•మొందును, గంబము లెక్కు, దూఁకుఁ, గెం
చిత్తుగఁ బాడు, నైజ మగు•చేష్టలు సేయుచు వానరుం డటన్. 3౨౩

## హనుమ సీతాదేవిని బానశాలయందు మరల వెదకుట.

ఉ. కాంచితిఁగా రఘూత్తముని•కామిని నంచును స్వస్థచిత్తుఁ డై
యించుక యుండి యాహనుమ • యెట్లగు నీసతి సీత? సీత ని

---

[1] భృంగీకురళ = తుమ్మెదవంటి ముంగురులు గలది. [2] తతము = వీణాదికము, ఘనము = తాళాదికము.

ద్రించునో? యారగించునో? ము♦దించునో? సొమ్ములు మేనఁ దాల్పఁ గాం
క్షించునో? పాన మామెకు రు♦చించునో? రాముని బాసి యుండుటన్. ౩౨౪

కం. రామునిఁ దక్కఁగ నాను, త్రాముని నేఁ భూమికన్య ♦ తగఁ గనుఁగొనునే?
రామునితోఁ దుల్యుఁడు స్వర్ధాముల నేఁ లేఁడు నిశ్చి♦తం బిది యనుచున్. ౩౨౫

సీ. ఆవల నరిగి పా♦నాలయంబునయందు, వెదకంగఁ దొడఁగె నా♦వీరవర్యుఁ
డాటలఁ బాటల ♦ నలసిన వారిని, మధుపానమున మేను ♦ మఱచువారి
మర్దలమురజముల్ ♦ మఱి పీఠికాతతి, తలదిండ్లు గాఁగను ♦ దనరువారి
నంచితాస్తరణాళి ♦ నత్తమిల్లినవారి, వాలుఁగంటులఁ గాంచి ♦ వానరేంద్రుఁ
తే. డమలమణిభూషణాలంకృ♦తాంగు లైన, రూపసల్లాపశీలతా♦రూఢ లైన
కాలదేశాభియుక్త లౌ♦కాంత లెల్ల, బలియఁగ రతాభిరతసుప్త♦వాసవారి ౩౨౬

ఉ. ఆవులమందలో వృషము♦నట్టులు కానలలోఁ గరేణుపూ
గావృత మైనదంతిగతి ♦ నబ్జముఖీపరివారకీర్ణునిన్
రావణుఁ గాంచి దాఁటి చని ♦ రమ్యసమస్తసువస్తుపూరితం
బౌ వరపానభూమిఁ గది♦యం జని యందు సమీరసూతియున్. ౩౨౭

సీ. మహిషసూకరమృగ♦మాంసంబు లచ్చట, నచ్చటఁ బ్రోవు లై ♦ హెచ్చి యుండ
మీఁగడ పెరుఁగున ♦ మేలిమి సౌవర్చ,లమునఁ దీరిచినకో♦ళ్లయు నెమిళ్ల
కిరుల ఖడ్గంబుల ♦ వరశల్యముల లేళ్ల, క్రకరచకోరసం♦ఘము నెఱచుల
సామి[1]భక్షితకల♦శంబుల బహువిధ, పక్వలేహ్యసుభోజ్య♦పటలములను
తే. నుప్పు పులుసుల వండుట ♦ నొప్పు మీఱు,రాగషాడబములను దొ♦రంగ వైపఁ
బడినసరగలు నందెలుఁ ♦ దొడవు లెల్లఁ,బానభాజననిక్షిప్త♦ఫలచయముల ౩౨౮

తే. అచ్చ టచ్చట నునిచిన ♦ హారువుమీఱు
నవ్యకనకమణీశయ♦నముల నాస
నములకాంతులఁ బానగే♦హము కృశాను
రహిత మయ్యుఁ బ్రదీప్త మా♦రమణఁ దోఁచె. ౩౨౯

కం. వెరవరు లగునడబాలలు[2], సరసంబుగఁ దీర్చునామి♦షంబులు సుమశ
ర్కరలను మధుఫలములచే, సురుచిరముగఁ దీర్చినట్టి♦సురలం గాంచెన్. ౩౩౦

కం. బుక్కాములు[3] పలు తెగ లగు,ప్రక్కలు బంగారు వెండి ♦ స్ఫటికంబులఁ బెం
పెక్కినకలశంబులు రుచి, పెక్కువపానీయములఁ గ♦పిప్రభువు గనెన్. ౩౩౧

కం. అఱద్రావిన నెఱ ద్రావిన, కొఱగానని కమ్మరసముఁ ♦ గూడినపాత్రల్
నెఱమెక్కిన యఱ చిక్కిన, కోఱ దక్కనిభక్ష్యములయుఁ ♦ గుప్పలు గాంచెన్.

---

[1] సామి=సగము. [2] అడబాలలు=వంటచేయువారు. [3] బుక్కాము=గంధపొడి.

మనోరంజని. పగిలినగిన్నెలు దొరలెడికుండలుఁ ♦ బాఱుజలంబులు దండలుఁ బల్
తెగ లగుపండులు బిగి గలకౌఁగిటఁ ♦ దేల్చుచు నొండొరు నిద్దుర మై
వగ గలకన్నెలచెలు వగుచిన్నెలు ♦ వారక వే ఱొకతొయ్యలిచీ
ర గరిత యొక్కతె నిదురను లాగి యు♦రంబునఁ గప్పికొనం గనియెన్.

కం. సుందరుల మేనివలువలు, నందపుసరములును నూర్పు♦టనిలమున దర
స్పందము లయి మందానిల,కందళముల సుఖముఁ జెందు♦కైనడి నయ్యెన్. ౩౩౪

ఉ. కమ్మనిచందనంబు కసు♦గందనిపూలసరాలు శీధుపా
నమ్ములు స్నానలేపములు ♦ నవ్యసుధూపము లీనుచున్న ఘుం
ఘుమ్మను కమ్మఁదావు లెస♦కంబునఁ గైకొని తన్మహావిమా
నమ్మున నించె సౌరభము ♦ నవ్యముగాఁగ మరుత్కిశోరముల్. ౩౩౫

కం. నల్లని తెల్లని పచ్చని, మొల్లం బగునన్నె లొప్పు♦మోహనవతు లం
దెల్లెడఁ గూర్కియుఁ గూర్కిన,హల్లకలతలట్టు లొప్పి ♦ రంగజుగాసిన్. ౩౩౬

పరాంగనాదర్శనంబునకు హనుమంతుఁడు చింతించుట.

కం. అంతయు దశకంధరునే,కాంతగృహం బిటులు కడిగి ♦ గాలించియు భూ
కాంతాత్మజ యడపొడ గన, కెంతయుఁ జింతించె వాన♦రేశ్వరుఁ డాత్మన్. ౩౩౭

ఉ. అచ్చట నిద్దురించుకమ♦లాక్షుల నెల్లరఁ జూచి యయ్యయో
నచ్చెను ధర్మహాని పర♦వారిజలోచనలందు నాదుచూ
పెచ్చట నేని వర్తిలద ♦ యిచ్చటిమేడలఁ గూర్కు కాంతలన్
బొచ్చెము మీఱఁ జూచితిని ♦ బోవఁగఁ ద్రోచితి ధర్మమార్గమున్. ౩౩౮

కం. పరదారల నెయ్యెడనే, నరసి కనుట ఘోరపాప ♦ మందును నిద్రా
పరవశలై యొడలెఱుఁగని, పరసతులంగంటి నెంత♦పాపం బకటా. ౩౩౯

తే. అనుచుఁ దలపోయు చున్నమ♦హాత్మకునకు, నిశ్చితైకాంతమతికి ని♦ర్నిద్రగతికిఁ
గార్యనిశ్చయదర్శన♦క్షమము నైన,బుద్ధి జనియించెఁ గ్రమ్మఱఁ ♦ బూతగతిని. ౩౪౦

ఉ. కాంచితి రావణాసురుని♦కాంతల నెల్లర నైన నేమి నా
కించుక యైన బుద్ధి చలి♦యింపద; యింద్రియవర్తనంబు సా
గించుఁ గదా మనంబు కడుఁ♦గీడున కేనియు మేలు సేఁతకే
నెంచఁగ నట్టినామన మొ♦కింతయుఁ గ్రాలదు సాభిలాష మై ౩౪౧

ఉ. ఇయ్యెడఁ గాక యిం కెచట ♦ నే వెదకం దగు భూమికన్యకన్?
దొయ్యలులందుఁ గా కెచటఁ ♦ దొయ్యలి యుండఁగ నేర్చుఁ జూడఁగా?
నెయ్యది జాతి దేని కది ♦ యేర్పడ నందులఁ గాదె రోయ నౌ;
నెయ్యెడ నష్టకాంత నగు♦నే వెదకం జని జింకమందలన్. ౩౪౨

కం.శుద్ధం బగుమనమున నే, శుద్ధాంతం బెల్ల వెదకి ♦ చూచితి నధిక
శ్రద్ధను నెచ్చటఁ గానను, సద్ధారిణితనయ ననుచు ♦ నాతఁడు మఱియున్. 3౪3

తే. నాగకన్యలయందును ♦ నాకకన్య,లందు గంధర్వకన్యల♦యందు వెదకెఁ
గాని కానక సీతఁ ద♦త్పానశాల, విడిచి యంతఃపురంబున ♦ వెదకె మరల. 3౪౪

## హనుమంతుఁడు సీతాదేవిని గానక విచారపడుట.

కం.ఆయంతిపురమునడుమ ల,తాయతనంబుల విచిత్రి♦తాయతనములన్
వాయుతనూజుఁడు వెదకియు, మాయురె! కనఁ డయ్యె రాము♦మహిళామణినిన్.

కం.స్వాంతమునం దీవిధమునఁ, జింతించెను రాముదేవి ♦ సీతను గన నే
నెంతయు వెదకితిఁ దత్సతి, యంతముఁ గనెఁ గాక యున్న ♦ నగపడ కున్నే?3౪౬

కం.కా కున్న రాక్షసేంద్రుం, డాకట! నిజశీలరక్ష♦ణాసక్తను స
ల్లోకనుతసుగుణ సీతఁ జి,రాకున వధియించె నేమొ ♦ క్రౌర్యరతుం డై. 3౪౭

చం.కనుఁగొన ఘోర మావికృత♦కాయములం బెదపెద్దమోములన్
ఘనములు దీర్ఘముల్ గడువి♦కారము లై భయపెట్టుకన్నులన్
దనరినరాక్షసాంగనల ♦ దైన్యమునం గని బెగ్గడిల్లి యా
జనకతనూజ దేహమును ♦ జయ్యన వీడెనొ యేమి చేయుదున్. 3౪౮

ఉ. సీతను జూడ లేక మును ♦ చెప్పినబీగము లెల్లఁ దీర్ప కే
రీతిని గ్రస్తకాలముఁ బొ♦రింబొరి మీఱఁగ భానుపుత్రు, మో
మేతగ వెంచి చూచుటకు ♦ నేగుదునో? బలియుం డతండు నా
జ్ఞాతిచరిష్ణులం గినిసి ♦ యంతన దండన చేయకుండు నే. 3౪౯

కం.చూచితి నంతిపురంబును, జూచితి దశకంఠుసకల♦సుందరులను సీ
తాచపలాక్షీమణి దా, నేచోటను లేదు శ్రమము ♦ వృథ వోయెఁ గదే. 3౫౦

ఉ. ఏమి యొనర్చితో హనుమ! ♦ యేది ధరాసుత? యన్నఁ గ్రోఁతు లే
నే మని యుత్తరం బిడుదు ♦ నేగి సురారిపురంబుఁ జొచ్చి శ్రీ
రాముని దేవిఁ గాన కిటు ♦ గ్రమ్మఱితిన్ వృథ యంచు నందునా?
హా! మరణించు వానరచ♦యంబులు నే నిట నాలసించినన్. 3౫౧

ఉ. ఆవలియొడ్డు చేరఁ గపు ♦ లందఱు గుంపుగఁ గూడ జానకీ
దేవిని గాన నైతి ననఁ ♦ దెల్పుచు నాజననంబుభంగిఁ దా
వావిరి మెచ్చినట్టి గుణ♦వంతుఁడు వృద్ధుఁడు జాంబవంతుఁడున్
శ్రీవిభవుండు నంగదుఁ డి♦సీ యన రే ప్లవగాగ్రగణ్యులున్. 3౫౨

## హనుమ యుత్సాహంబు వహించి మరల సీతాదేవిని వెదకుట.

శా.ఉత్సాహంబె సిరిన్ ఘటించు మఱి యా♦యుత్సాహమే సౌఖ్య మా
నుత్సాహంబె సతంబు నెల్ల కెలసం ♦ బొప్పారఁగాఁ దీప్పు నా

యుత్సాహంబునె యాశ్రయించి పనికై ♦ యుంకింతు నిం కొక్కమా<br>
టుత్సాహంబుఁ ద్యజింతురే పనికి ను♦ద్యోగించుధీరాత్మకుల్. ౩౫౩

ఉ. చక్కఁగఁ జూతు వెండి యొక♦సారి సురారిసురక్షితంబు లా<br>
నిక్కువ లెల్లఁ బానగృహ ♦ మేడ్తెఱఁ జిత్రగృహాళి తోఁటలుఁ<br>
జక్కని కేళిశాలలును ♦ సందులు వీథులు నవ్విమానముల్<br>
దక్కక యుండ నొక్కటియుఁ ♦ దత్పరవృత్తి నటంచు నెంచుచున్. ౩౫౪

చం. వెదకుటకుం గడంగెఁ బృథి♦వీగృహవర్గము చైత్యగేహముల్<br>
సదనసమీపకేళివన♦శాలలు నొండొకచోట నెక్కు వే<br>
ఱుదలల డిగ్గుఁ దాఁ బలుమ♦ఱుం జనుచోటికె పోవు ద్వారముల్<br>
వదలిచి దల్పులుం దెఱచి ♦ వచ్చును బోవును నెక్కు దూఁకెడిన్. ౩౫౫

తే. కొంచె మైనను విడక శో♦ధించె హనుమ, రావణాసురునంతిపు♦రంబునందు<br>
నాలుగంగుళములయేని ♦ గాలికొడుకు, చొచ్చి చూడనిదేశ మ♦చ్చోట లేదు.

సీ. ప్రాకారములు నడి♦బాటలు వేదికల్, దిగుడుబావులు సర♦స్తీరములును<br>
వివిధవికారరూ♦పవిశేషలను సోఁకుఁ,జెలువలఁ గనె నందు♦సీత లేదు<br>
అసమానసౌందర్య♦లసమానవిద్యాధ,రీతతులందు శ్రీ♦సీత లేదు<br>
పూర్ణచంద్రాస్యలా♦భోగినులం దంద,గత్తెలలోన భూ♦కన్య లేదు

తే. పంక్తికంఠుఁ బలిమిని ♦ బట్టినట్టి,నాగకన్యలలోన జా♦నకియ లేదు<br>
సుందరుల నటఁ బెక్కురఁ ♦ జూచెఁ గాని, కమలలోచన మైథిలి ♦ గాన రాదు.

ఉ. ఇంతయుఁ జూచి యాహనుమ ♦ యెంతయు దుఃఖవిషాదసంభ్రమ<br>
స్వాంతత నంది కుందుచును ♦ వానరవర్యులయెత్తికోలు వి<br>
క్రాంతి సముద్రలంఘనముఁ ♦ గాంచి వృథా చనుటల్ మనంబులో<br>
మంతన ముండి డిగ్గెను వి♦మానవరంబుఁ దటిజ్జవాఘ్యుఁడై. ౩౫౮

హనుమ ప్రాకారంబుఁ జేరి సీతాదేవి గానరామికి వ్యసనపడుట.

కం. ప్రాకారము మీఁదికి జని, కాకుత్స్థకులాభరణుని♦కాంతామణి నా<br>
లోకింపఁగఁ గానక చిం,తాకులితమనస్కుఁ డగుచు ♦ నంజనసుతుఁడున్. ౩౫౯

తే. కడిగి గాలించి చూచితిఁ ♦ గాని లంక<br>
గుంటలును జెర్వులును గొలం♦కులును నదులు<br>
వంకలును వాఁగులును మలల్ ♦ డొంక లెల్ల<br>
తలములును ద్రిమ్మఁదిరుగుచు ♦ ఫలము లేదు. ౩౬౦

కం. కానుగా వైదేహిని, దానవవరునింటఁ గలదు ♦ ధరణిజ యనుచుం<br>
దా నాడఁడె సంపాతియు, జానకి యిట లేద యేమి ♦ పలుపుదు నింకన్. ౩౬౧

కం.జనకజ మైథిలి రాముని,వనిత విదేహాభవ సీత ♦ వశమతి దుష్టున్
దనుజున్ మనుజాశను నే,ననుచుం బ్రాపించు నట్టి♦యాగడమున్నే. ౩౬౨

కం.సీతం గొని రామమార్గణ, భీతి న్వడి నెగుర నసుర♦వీరుఁడు నీరే
జాతాక్షియు నడి త్రోవను, భీతిం బడిపోయె నోటు ♦ భీరువు గానన్. ౩౬౩

ఉ. అట్టులుగాక యున్న ఖచ♦రాధ్వమునం జనుచోట రావణుం
డిట్టుల మైనభీతి మిథి♦లేశ్వరుకన్యక యబ్ధిలోన లోఁ
దొట్టిన నివ్వెఱం బడెనొ ♦ తోరపువేగము సైఁప లేక తా
నెట్టన మే న్వణంక ధృతి♦నిల్పఁగ నేరక మేనువాసెనో? ౩౬౪

కం.రామునిరాకావేళా,సోముని నిరసించుముఖము ♦ సురుచిరకంజా
తామలదళనయనములను, వేమఱు స్మరియించుకొనుచు ♦ విడిచెనొ మేనిన్.

సీ. చుట్టపక్కములు లే♦నట్టిసాధ్వి సుశీల, సీత రావణుఁడు భ♦క్షించె నేమొ?
యీసున రావణు♦నిల్లాండ్రు రనఘాత్మఁ, బట్టి భక్షించిరో ♦ పాపరతలు?
హా!రామ!హా! లక్ష్మ♦ణా!హా! యయోధ్య! య,టంచు నేడ్చుచుమర♦ణించెనొక్కొ?
పంజరంబున గోరు♦వంకనా నసురుండు, నేలమళిగ నుంచి ♦ యేలునేమొ?

ఆ. జనకరాజతనయ ♦ సాధ్వి సుమధ్యమ, రాముపత్ని సీత ♦ రావణాసు
రాధిపతికి నెట్లు ♦ స్వాధీన యయ్యెడు? నట్టిదెన్నఁడైన ♦ నగుట గలదె. ౩౬౬

ఉ. దానవుఁ డింద యెయ్యెడనొ ♦ దాఁచెనొ, కాక సుశీల మిత్రికిన్
లో నయి పోయెనో వనధి♦లోఁ బడి భీతి? హృదీశుకూటమిన్
మాని మనంగ లేక మర♦ణంబునె తా శరణంబుఁ గాంచెనో
మానిని, యిష్టభార్యనకు ♦ మానుగ రామున కేమి చెప్పుదున్. ౩౬౭

## ←→ {సీతాదేవి లేదని రామునితోఁ జెప్పినఁ గలుగుననర్థంబుల హనుమంతుఁడు యోజించుట.} ←→

కం.చెప్పిన ననర్థకం బగుఁ, జెప్పమిసిం దోష మెట్లుఁ ♦ జేకుఱుఁ గానన్
జెప్పుదున? చెప్పకుందున? యిప్పగిది ఘటిల్లె విషమ ♦ మే మొనరింతున్. ౩౬౮

కం.అని యన్యోన్యవిరుద్ధము,గను దోఁప సమర్థ మగుచుఁ ♦ గాలార్థం బా
ఘననీతి యెద్దియంచును, మనమునఁ దలపోయుఁ దొడఁగె ♦ మారుతి మఱియున్.

ఉ. ఏమిఫలంబు గల్గుఁ దర♦శేక్షణఁ గానక నేను వానర
స్వామిపురంబుఁ జేరఁ జన ♦ వారిధి దాఁటుట లంకఁ జొచ్చుటల్
భూమిజ రోయుటల్ దనుజ♦పుంగవులం గనుటల్ వృథా చనన్
భూమిజఁ గాన కే మనుచుఁ ♦ బోవుదుఁ బుణ్యమొ పూరుషార్థమో. ౩౭౦

ఉ. ఏ మని యందురో వనచ♦రేశ్వరులున్ రవిజుండు నేఁ జనన్
రాముఁడు లక్ష్మణుండుఁ గన♦రాదు సుఁడీ జనకాత్మజాత నా;
రాముఁడు ప్రాణముల్ విడుచుఁ ♦ గ్రచ్చఱఁ,గ్రూరము తీక్ష్ణ మింద్రియ
స్తోమసుతాపనంబు చెవి♦సూఁదునుముల్ వినియున్ సహించునే? ౩౭౧
కం.మరణకృతనిశ్చయాత్ముని, వరగుణునిన్ రాముఁ జూచి ♦ భ్రాతృసుహృత్త్వ
స్ఫురితుం డగుసౌమిత్రియు, మరణంబును బొంద కేల ♦ మఱి జీవించున్. ౩౭౨
కం.అన్నయుఁ దమ్ముఁడుఁ జచ్చిన,యన్నుడి విన్నంతమాత్ర ♦ నట భరతుండున్
మున్నుగఁ బ్రాణము విడుచును, సన్నుతశత్రుఘ్నుఁడు బడిఁ ♦ జనుదేరంగన్.
కం.కొడుకులమరణము విని వగఁ,బడి కౌసల్యయు సుమిత్ర ♦ భరతుజననియున్
విడుతురు వెంటనె ప్రాణముఁ, బుడమిని జీవింప నెట్లు ♦ బుద్ధియుఁ బుట్టున్. ౩౭౪
కం.కృత మెఱుఁగుచు సత్యముఁ దన,మఱిఁ బాయఁడు కపివిభుండు ♦ మార్తండజుఁడున్
క్షితితనయావల్లభుఁ డా,గతిఁ బట్టుటఁ జూచి తాను ♦ గాలముఁ జెందున్. ౩౭౫
కం.శోకోపహతయు భృశదుః,ఖాకులిత యపాస్తనిర్భ♦రానంద మహా
శోకాకుల యయి రుమ పతి,శోకంబున మేను విడఁగఁ ♦ జూడక యున్నే. ౩౭౬
తే. వాలి మరణంబునకె కడు♦వగఁ గృశించు, తార సుగ్రీవుగతిఁ జూచి ♦ తా నశించుఁ
దల్లియును దండ్రియును బిన్న♦తండ్రిచావఁ,జూచి యంగదుఁ డేటికిఁ♦బ్రోచు మేను.
చం.వనచరవీరు లెల్ల నిజ♦వల్లభసంస్థితి దుఃఖతప్తులై
ఘనతరముష్టిగాఢతల♦ఘాతములన్ నిహతోత్తమాంగులై
చనఁ జిరసాంత్వనాదృతులు ♦ చత్తు రరణ్యచరుల్ సపుత్రకుల్
వనచరు లార్తిఁ గూరి భృగు♦పాత[1] మొనర్చి నిజప్రియాళితోన్. ౩౭౭
కం.శైలంబుల వివిధవనీ,జాలంబులఁ గీశవరులు ♦ సంఘము లగుచున్
హేళిఁ జరింపరు తమి వా,హ్యాళిం గ్రీడలను దుఃఖి♦తాత్మకు లగుచున్. ౩౭౮
కం.ఉరిపోఁతలఁ బెనుమంటలఁ, బరువవిషంబులను నిట్రు♦పాసంబులచే
మరణింతు రొండె నుసుఱులు, తరవారుల నుఱికి యొండెఁ ♦ దలఁగుదురు కపుల్.
సీ. కిష్కింధ కిప్పు డే♦గితి నేని యెయ్యెడ, హా యనునేడుపు♦టులివు వినఁగఁ
బడు నంతె, యిక్ష్వాకు♦వంశనాశంబును,గపికులనాశంబుఁ ♦ గలుగు నిజము
కావునఁ గిష్కింధ♦కడకు నే నిట నుండి, చన కుండుటయె చూడ ♦ సమ్మతంబు
చూతు నే నెట్టులు ♦ సుగ్రీవుముఖమును, జానకిపోబడిఁ ♦ గాన లేక
తే.నేను బోకుంటి నేని వ♦నేచరులును, దాశరథులును బ్రాణముల్ ♦ దాల్చువార
లాశచే నైనఁ గొన్నాళ్లు ♦ లట్టుగాన, నటకుఁ బోకుండు టే మేల♦టంచుఁ దోఁచె.

[1] భృగుపాతము = కొండమీఁదనుండి నేలఁద్రెళ్లుట.

### హనుమంతుఁడు ప్రాణత్యాగముఁ జేయ నాలోచించుట.

శా. ఏ నిందుం గన నైతి నేని మిథిలా♦ధీశాత్మజాతం గరా
దానుండై[1] నియతవ్రతంబుగ ముఖా♦దానుండ[2] నై యుండ యెం
దేనిన్ భూరుహమూలవాసి నయి జీ♦వేచ్ఛన్ విసర్జించుచున్
వానప్రస్థుఁడ నై చరించుటయె భ♦వ్యం బైనమార్గం బగున్. ౩౮౨

కం. మె చ్చగుఫలమూలంబుల, హెచ్చగుజలనిధితటంబు ♦ నే నరిగి యటన్
జి చ్చుఱికెదఁ జితి పేరిచి,చచ్చుట మేల్ సీతఁ గనక ♦ చనుకంటె నిటన్. ౩౮౩

కం. అంగములు వ్యాఘ్రగృధ్రకాకవ,తంగంబులు దినుచు నుండఁ ♦ దలఁగక ధృతిమీ
ఱంగ మరణోపవిష్టత, లింగిని సాధించువాఁడ ♦ లీలగ నిచటన్. ౩౮౪

తే. అవనిసంభవ నిటఁ గాన ♦ నైతి నేని,నీళ్ల నుఱికి త్యజించెద ♦ నేను మేని
నిట్టినిర్వాణగతికి ము♦నీంద్రు లెల్ల,సమ్మతింతుర యని తోఁచె ♦ స్వాంతమునను.

ఉ. హా యెటు సేయుదున్ వరశు♦భావహశాలిని యై మనోజ్ఞ చం
ద్రాయతచంద్రికాసుభగ ♦ యాచు యశోవిభవాభిరామ యై
పాయుట నిద్ర దీర్ఘయయి ♦ బాధసుకీర్తిద యైనరాత్రి వే
పోయెడిఁగా వృథా జనక♦పుత్రిఁ గనుంగొనుభాగ్య మేదఁగన్.[3] ౩౮౬

కం. వ్రతి నై భూరుహమూల,క్షితిపైఁ బడి యుండువాఁడ ♦ సీతం గనకే
మతిలేక చనిన నంగద,పతిముఖ్యులుఁ గీశవరులు ♦ బ్రదుకం గల రే. ౩౮౭

ఆ. ప్రాణములను విడువ ♦ బహుదోషములు గల్గు
బ్రదికి యున్నఁ గాదె ♦ పడయు శుభముఁ
గానఁ దాల్చువాఁడ ♦ మేనఁ బ్రాణంబులు
బ్రదికి యున్న భద్ర ♦ మొదవు నిజము. ౩౮౮

చం. అని యిటు మాటిమాటికి దు♦రంతపుఁజింతలఁ జిక్కి దుఃఖనీ
రనిధికి వేల గాన కెదఁ ♦ గ్రమ్మఱ యోజనసేయు, ధారిణీ
తనయ యె టైన నాత, ఱుఁకె ♦ దానవనాథునిఁ బట్టి త్రుంతునా?
దనుజునిదుష్కృతంబునకుఁ ♦ దద్దయు నయ్యది పాచితం[4] బగున్. ౩౮౯

కం. రావణుని నీడ్చికొనుచుం, బోవుదునా జలధిమీఁద ♦ భూపతికడకున్
వే వేగ యజ్ఞపతికై, వావిరిఁ గొనిపోవుపశువు♦పడువున బలిమిన్. ౩౯౦

ఉ. సారెకుఁ గుందు, వందు, నిట ♦ జానకి గానఁగ రాదిఁ కేదిరా
తీరగు నంచు నెంచు, సుద♦తీమణిఁ గన్గొనుదాఁక నీపురిన్
వారక చూతుఁగాక యను ♦ బాధపరాక్రము రాము గృధ్రరా
డ్భారతి నమ్మి యుండుఁ గొని♦వచ్చితినా సతిఁ గాన కీయెడన్ ౩౯౧

---

[1] కరాదానుఁడు = చేతిలోఁ బడినదానిని దినువాఁడు. [2] ముఖాదానుఁడు = నోరఁ బడినదానిని దినువాఁడు. [3] ఏదఁగన్ = తెలియింపఁగా. [4] పాచితము = ప్రాయశ్చిత్తము.

కం.దారుణ మగురోషంబున, మారణహోమంబు సేయు ♦ మార్గణసహ్నిన్
వీరకపివారముల రఘు,వీరుఁడు పోవిడుచు నెట్లు ♦ వృథ వంచకులన్. ౩౯౨
కం.నియతాహారుఁడ నగుచును,నియతేంద్రియవృత్తి నిండె ♦ నివసించెద నా
కయి యేల ఘడియపలయును,నయగుణు లగునృపతివరులు♦నగచరవర్యుల్? ౩౯౩

→ హనుమంతుఁ డశోకవనంబును జూచుట. ←

కం.అదిగో మహాద్రుమాన్విత, మది యొక్కయశోకవాటి ♦ యం దిందనుకన్
వెదకంగ లేదు సీతను, వెదకెదఁ గా కందు నేల ♦ విడువఁగ వలయున్. ౩౯౪
కం.మ్రొక్కెద వసురుద్రులకును, మ్రొక్కెద నాదిత్యులకును ♦ మొగి మరుతులకున్
మ్రొక్కి చని యశ్వులకు నేఁ, గ్రక్కించెద సోఁకుకండ♦గరువం బెల్లన్. ౩౯౫
కం.మక్కించి రక్కసుల నే, నుక్కన వా రెల్లి నేడ్వ ♦ హా యని సీతన్
మక్కువ గలపతిఁ గూర్చెదఁ, జక్కఁగఁ దపసికి ఫలం బొ♦సంగెడురీతిన్. ౩౯౬
కం.అని చింతాసందానిత,మనమున నొండొకముహూర్త♦మాత్రము నాలో
చన యొనరిచి యుత్సాహం,బున లేచి మరుత్తనూభ♦వుం డిటు పల్కెన్. ౩౯౭
ఉ. మ్రొక్కెద రామచంద్రునకు ♦ మోడ్చెదఁ గేలు సుమిత్రపట్టికిన్
మ్రొక్కెదఁ దద్విదేహపత♦నూజకు శ్రీరఘురాము దేవికిన్
మ్రొక్కెద ధర్మవాసవము♦రుద్గణ మారుత రుద్రపాళికిన్
మ్రొక్కెద సూర్యచంద్రులకు ♦ మ్రొక్కెదఁ దామరసాప్తసూతికిన్. ౩౯౮
చం.అని ప్రణతుల్ ఘటించి దిశ ♦ లన్నియుఁ జూచి యశోక కాననం
బునఁ దనదృష్టి నిల్పి చనఁ ♦ బూని మతిన్ మది నెంచు నీగతిన్
వనచరలోకనాథుఁడు ధ్రు♦వంబు నిశాచరకోటిరక్షితం
బును బరిసంస్కృతంబుఁ బురు♦భూరుచిరంబు నశోకవాటికన్ ౩౯౯
ఉ. కావలివారు వృక్షములఁ ♦ గాచుచు మిక్కిలి యున్నవార, లం
దావిభుఁ[1] డైనమారుతుఁడు ♦ నల్లన వీచుచు నున్నవాఁడు, సీ
తావిభునర్థ మై తనువు ♦ దానవనేత కగోచరంబుగా
వావిరి సంగ్రహించి రఘు♦వల్లభవల్లభ నందు రోసెదన్. ౪౦౦
చం.మునులును వేల్పులున్ దివిజ♦ముఖ్యుఁడు వజ్రి స్వభుండు బ్రహ్మవా
య్వనలశశిప్రభాకరజ♦లాధిపశర్వమరుత్తు లశ్వులున్
గనులకుఁ దోఁచువారు మఱి ♦ కాననివారును సర్వభూతముల్
ఘనతరభూతనాయకుఁడుఁ ♦ గార్యము సిద్ధి యొనర్తు రియ్యెడన్. ౪౦౧
సీ. ఎప్పుడు చూతునో ♦ యే నున్నసంబును[2], బాండురదంత మ♦ప్రణము నగుచు
మందహాసాంకూర♦సుందరం బయి పద్మ,దళలోచనంబులఁ ♦ జెలువు గాంచి

---

[1] విభుఁడు = సర్వవ్యాపి. [2] ఉన్నసము = ఉన్నతనాసిక.

నిర్మలతారేశ ♦ నిభదర్శనంబగు,నమ్మహాదేవియా♦స్యమ్ము నేను
ఏగతిఁ గందునో ♦ హీనుండు క్షుద్రుండుఁ, బరమపాపియుఁ గ్రౌర్య♦పరుఁడుఁ దలున
తే. దారుణుం డయ్యును సువేష♦ధారి యయిన,యసురపతిచే బలాత్కృతి♦నపహరింపఁ
బడినసాధ్విఁ దపస్విని ♦ బుడమికూఁతు, రామదేవుని దేవి స♦తీమతల్లి. ౮౦౨

హనుమంతుఁ డశోకవనంబునఁ బ్రవేశించుట.

కం. అని యీగతి మనమునఁ బా,వని యించుకసేపు లోన ♦ వనరుచు నాలో
చన మొనరిచి యాప్రమదా,వని ప్రాకారమున కంత ♦ వలనుగ దాఁటెన్. ౮౦౩
సీ. ప్రాకారమున నిల్చి ♦ పావని సంహృష్ట,సర్వాంగుఁ డగుచును ♦ సంతసమునఁ
జూడ వసంతాది ♦ సురుచిరవికసిత,శాఖ లైనట్టిభూ♦జములతోడ
సాల తమాల త♦క్కోల హింతాల కో,ద్దాల కాశోక ర♦సాల చంప
క కపిముఖానేక♦కమనీయతరలతా,భవ్యాగయుతవృక్ష♦వాటిఁ గాంచి
తే. యల్లె విడిచిన బాణంబు ♦ ననుకరించి, చివ్వనను దాఁటి యచటికిఁ ♦ జేరఁ బోయి
చారునీడజనిస్స్వనో♦దార మగుచుఁ, గనకరాజతపాదపా♦క్రాంత మగుచు. ౮౦౪
సీ. వింతవింతలు గొల్పు♦విహగమృగంబుల, సవురయి యుదయభా♦స్కరనిభంబు
నగుచుఁ జిగుళ్లు లే♦యాకులు పూవులు, పూపలు పిందెలు ♦ పొలుపుమీఱు
పసరుగాయలు దోర♦పండులు పండులు, గలపెక్కు తెగలవృ♦క్షముల వెలసి
కోకిల హిందోళ[1] ♦ కేకిరవంబుల, నానాశకుంతసం♦తానకలన
తే. నవ్యమైనయశోకవ♦నంబునందు,
ధారిణీసుత వెదకుచో ♦ మారుతాత్మ
జుండు సుఖసుప్తములను బ♦క్షులను మేలు
కొలుప నవి యెల్లఁ గలకల ♦ కూయఁ దొడఁగె. ౮౦౫
సీ. నింగికి నెగురుప♦తంగకోటులయెఱ,కలతాఁకునను జేల♦జేల మటంచు
రాలఁ బూవులు వాని♦రాసులనడుమను, బుష్పమయాద్రి నాఁ ♦ బొలిచెఁ గపియు
దిక్కుదిక్కుల నున్న♦యక్కుజంబుల కేగు,కపి వసంతునిఁ గాఁగఁ ♦ గనియె భూత
తతులు భూమీరుహా♦పతితపుష్పాకీర్ణ,వసుధ భూషితయోష♦పగిది వెలిఁగె
తే. గంధవహసుతగమనవే♦గప్రకంపి,తావనీరుహపాళి వా♦తాత్మజాతు
మీఁద వర్షించెఁ బుష్పముల్ ♦ మేలిమిగను, బుష్పపర్ణఫలావళుల్ ♦ పొనుఁగుపడియె.
కం. రాలినయాకులతో నిలఁ, దూలినపూవులను బండ్ల♦తుటుములతోఁ బై
చేలలు సొమ్ములు నోడిన,యాలరిజూదరియుఁ బోలె ♦ నమరె నగంబుల్. ౮౦౬
ఆ. శకునినికర మేది ♦ స్కంధమాత్రాశ్రయ,ద్రుము లసేవ్యము లయి ♦ తోఁచె నపుడు
సకలమిత్రబంధు♦సంపరిత్యక్తమా,నవులపగిది నింపు ♦ మివుల లేక. ౮౦౭

---

[1] హిందోళము = తుమ్మెద.

చం. విరిసిన కేశపాశముల ♦ వీడినకుంకుమపత్త్రరేఖలన్
ఖరనఖరాంకురక్షతయు ♦ గాఢరదక్షతి విహ్వలాత్మయున్
వరపరిపీతశుభ్రరద ♦ నచ్ఛద యౌ జవరాలిఁబోలె వా
నరవరవాలహస్తచర ♦ ణంబులఁ దద్వని యప్డు రాట్పడెన్. ౪౦౯

హనుమంతుఁ డశోకవనంబున విహరించుట.

కం. వింజముశిఖరంబుల వృష్టిం జెలఁగెడి యాగడపలఁ[1] ♦ జెదరఁగ ననిలుం
డుం జిమ్మినవడువునఁ గపి, కుంజరుఁడును జెదరఁ దీఁగ ♦ గుంపులఁ జిమ్మెన్. ౪౧౦

సీ. అయ్యెడ మగరాల ♦ ననువైనభూముల, వెండియుఁ బైఁడియు ♦ వెలయుస్థలుల
మంచినీళ్లుల నింపు ♦ మించిన బావుల, మణిమయసోపాన ♦ మండలముల
మౌక్తికవిద్రుమ ♦ మంజులసికతాసు, కూలముల్ స్ఫాటిక ♦ కుట్టిమములఁ
దీరజకనకమ ♦ హీరుహాన్వితములఁ, బద్మినీకుముదినీ ♦ భాసురములఁ

తే. జక్రచక్రాంగ నత్యూహ ♦ సారసాళి
కూజితంబుల వాహినీ ♦ రాజితముల
నమృతనిభతోయములఁ గుసు ♦ మావృతవ్ర
తతుల నగునూతులను గనెఁ ♦ దరుచరుండు. ౪౧౧

కం. ఆయాటతోఁటలోపల, వాయుతనూజుండు గాంచె ♦ వరశిఖరవిచి
త్రాయతకూటాగయుతశి, లాయతనం బైన కేళి ♦ కావనిధరమున్. ౪౧౨

సీ. ఆనగాగ్రమునుండి ♦ యవనికి నరుదెంచు, సెలయేటిచొప్పుఁ గాం ♦ చినను నచటఁ
బతిమీఁదఁ గినిసి యం ♦ కతలంబు డిగి యేగు, కోపనవైఖరి ♦ కొమరు మీఱె
నందు వ్రేలాడుశా ♦ ఖాగ్రంబు లాక్రుద్ధ, వారించుచుట్టాల ♦ పగిదిఁ దోఁచె
ఝుర మప్డు వెనుకకు ♦ మరలెడివహి చూడఁ, గినుక చల్లారఁ గాం ♦ తుని గనంగ

తే. మెల్లఁ గ్రమ్మఱి పోయెడి ♦ మెలఁతఁ బోలె
దానికి నలంతి దవ్వునఁ ♦ దతశకుంత
రాజిరాజితకాసార ♦ మోజఁ గాంచె
మారుతసుతుండు భృశహర్ష ♦ మాణుఁ డగుచు. ౪౧౩

కం. చిత్రపురతనపుమెట్టు ప, విత్రశిశిరజలము వివిధ ♦ వికిరమృగంబుల్
కృత్రిమవనములు గలపలు, కృత్రిమదీర్ఘికలఁ ద్వష్టృ ♦ కృతసౌధములన్. ౪౧౪

కం. ఫలపుష్పభరితకుజపా, ళులు గొడుగులు పసిఁడి జగతు ♦ లున్ సోపానం
బులు గ్రాల నందు వల్లీ, దళమేదురశింశుపోరు ♦ తరువు నొకండున్. ౪౧౫

కం. బంగరుటరుంగు లోలిఁ జె, లంగఁగఁ దనచుట్టు కడువి ♦ లసితము గాఁగన్
బొంగుచుఁ దనలో వానర, పుంగవుఁ డటఁ గాంచె వహ్నిఁ ♦ బోలు తరువులన్. ౪౧౬

---

[1] ఆగడపలు = మేఘముల గుంపులు.

ఉ. గుంటల మిట్టలన్ నదులఁ ♦ గ్రొందళుకుంగనకంపుఁ జెట్లు మి
న్నంటు వెలుంగుతోడఁ దన ♦ రారఁ గనుంగొని వీనిడాలు మై
నంటుటఁ బైడిగుంటి[1] రుచు ♦ లంటిన వేఁడి వెలుంగునట్లు నే
నుంట లభించెఁగా యనుచు ♦ నూహ యొనర్చెఁ గపీంద్రుఁ డాత్మలోన్. ౪౧౭

కం. అచ్చెరుపడెఁ దనచుట్టును, నచ్చపుటపరంజిచాయ ♦ నమరుకుజంబుల్
హెచ్చుఁగ బంగరుగజ్జెలు, నిచ్చ మొరయుశింశుపావ ♦ నీరుహావరమున్. ౪౧౮

సీ. సుచిరకోమలాం ♦ కురపల్లవంబుల, నన్య మాశింశుపా ♦ నగముఁ నెక్కి
యిచ్చట నుండి నే ♦ వీక్షింతుఁ గాక శ్రీ,రామదర్శనలోల ♦ రమ్యశీల
నిట నట నలమట ♦ నటమట గొనుబాల, జనకేశ్వరునిపుత్రి ♦ చారుగాత్రి
ధూర్తు రావణు వని ♦ తోరంపుఁజందన,చంపకవకుళవృ ♦ క్షముల చేత
తే. సొంపు నింపెడి పక్షుల ♦ గుంపు చేతఁ
గమ్రతర మైనవరతటా ♦ కముల చేత
నింపు నిండారఁ గూర్చెడి ♦ హృదయమునకు
జ్ఞాతనూభవ యిందురాఁ ♦ గలదు నిజము. ౪౧౯

కం. ఆరామ రాము దేవెరి, శ్రీరాముఁడు గూర్చుసాధ్వి ♦ శ్రీరాఘవచిం
తారతమృగలోచన కాం,తారవిహారరచణ యిటకుఁ ♦ దప్పక వచ్చున్. ౪౨౦

కం. శ్రీరామశోకతప్తయుఁ, జారువిలోచన యరణ్య ♦ సంచారిణి కాం
తారవిహారాసక్తమ,హీరమణీతనయ సత్య ♦ మిట కరుదెంచున్. ౪౨౧

కం. మున్నీ యుద్యానంబున, నున్న వనేచరుల సేమ ♦ ముల్లంబునఁ దా
నెన్నుచు నున్నది సత్యము, సన్నుతరఘురాము దేవి ♦ జానకి యిచటన్. ౪౨౨

కం. సంధ్యాకాలంబునఁ దా, సంధ్యావందనముఁ జలుపఁ ♦ జనుదెంచును ని
ర్వంధ్యోదక యీనదికడ,కుం ధ్యాన మొనర్చికొనుచుఁ ♦ గూర్మిహృదీశున్. ౪౨౩

కం. ఆయంబకు రఘురాముని,ప్రేయసికిన్ రాజవర్య ♦ ప్రియ కనుహూపం
బై యమరె సమ్మతం బై, యీయతులాశోకవనము ♦ హృదయంగమ మై. ౪౨౪

కం. జీవితయేనియు రాముని, దేవియుఁ దా నిందు నరుగు ♦ దెంచుట నిజ మం
చీవిధిఁ దలఁచుచుఁ బావని, యావృక్షంబునను డాఁగి ♦ యటు నిటు గనుచున్.

## హనుమంతుఁ డశోకవనంబున సీతాదేవిని వెదకుట.

సీ. సంతానకలతోరు ♦ సంతానముల చేత, రాజితభూరుహ ♦ రాజి చేత
దివ్యగంధరసాఢ్య ♦ భవ్యాకృతుల చేత, నందనతుల్యసుం ♦ దరత చేత
సలలితమృగపక్షి ♦ కులచయంబుల చేతఁ, బ్రాసాదహర్మ్యాగ్ర ♦ పాళి చేతఁ
గోకిలాలాపన ♦ కోలాహలము చేతఁ, గనకాంబుజోత్పల ♦ గణము చేతఁ

[1] పైఁడిగుంటి = మేరుపర్వతము.

తే. బలువిధంబులు మేలికం♦బళుల చేత, నతులితవిశాలభూమిగృ♦హాళిచేత
సర్వఋతుపుష్పఫలగభూ♦జముల చేత, మీఱెడు నశోకవనిని సా♦మీరి[1] గనియె.

కం. ఫుల్లాశోకప్రతతులఁ, బెల్లగు నెఱడాలు మించె ♦ వేకువప్రొద్దు
న్నొల్లపుఁగాంతుల నగుచుం, గొల్లగ నెఱమంటఁ జిక్కి♦కొనియె నసంగన్. ౪౨౭

ఉ. రాలెడుపూలు సొమ్ము లనఁ ♦ గ్రాల శిరంబుల నన్నియొక్కటే
కాలమునందుఁ బక్షు లెఱ♦కల్ నెఱవిచ్చికొనం దదీయప
క్షాళివిలీనపుష్పదళ ♦ మై ద్రుమపాళివిహీనపత్రశా
ఖాళియుతంబునట్లు గన ♦ నయ్యె మరుత్సుతుకన్నుదోయికిన్. ౪౨౮

కం. ఆమూలపుష్పనిచితం, బై మంజుతరంబు నయి స్వ♦భాపహ మగుచున్
శ్రీమత్కుసుమభరంబున, భూమిని సోఁకెడు నశోక♦భూరుహశాఖల్. ౪౨౯

చం. కుసుమితకర్ణికారములఁ ♦ గ్రొన్ననలం గలకింశుకంబులున్
బసగలసప్తపర్ణములు ♦ బా గగుపొన్నలుఁ జంపకంబులున్
బసి గలశాతకుంభనిభ♦చారునగంబులఁ గొన్ని కొన్ని య
గ్గిసిగలఁబోలు చెట్టులను ♦ గేసరిసూనుఁడు చూచె నయ్యెడన్. ౪౩౦

సీ. కాటుకడాలునఁ ♦ గ్రాలుచెట్టులు కొన్ని, వేవేలుగ నశోక♦వృక్షములును
నవు రొప్ప నందన♦చైత్రరథంబుల, నతికరించిన కాంతి ♦ నంద మగుచు
వాక్కున కందని♦ప్రాప్తరూపం బయి, కుసుమతారావళిఁ ♦ గొమరు గనుట
రెండవయాకాశ♦మండలం బనఁ బుష్ప,మణుల నేనవ పెను♦మడుఁ[2] గనంగ

తే. సర్వఋతుఫలనిచిత మై ♦ చారుగంధి, పాదపంబులఁ దనరారి ♦ బహువిధ గాలి
కలిత మగుచును రెండవ♦గంధమాద,నాద్రి యనఁ బుణ్యగంధ మై ♦ యమరుదాని.

తే. ఆయశోకవనంబు వా♦తాత్మజుండు, చూచి నడుమను గైలాస♦శుద్ధ మగుచుఁ
బగడపున్నెట్లుతప్తసు♦వర్ణవేది,కలును వెలయఁగ లక్ష్మిప్ర♦కాశ మొసరి ౪౩౨

కం. మి న్నొరయుచు రమ్యం బై, కన్నులకును మేలిపిందు ♦ ఘటియించుచు సం
పన్నస్తంభసహస్రము, చెన్నా రెడు నొక్కమేడఁ ♦ జేరువఁ గాంచెన్. ౪౩౩

హనుమంతుఁడు సీతాదేవిని జూచుట.

ఉ. మాసినచీరతోడ, ధృతి ♦ మాలినచిత్తముతోడ, సింతయేన్
గ్రాసము లేమిఁ జిక్కినసు♦కాయముతోఁ, బయి పై నిగుడ్చుని
శ్శ్వాసచయంబుతో, గుఱుతు ♦ పట్టఁగరానిస్వరూపకాంతితో,
గాసి నొసంగురాత్రిచర♦కాంతలచేఁ బరివేష్టమాన యై ౪౩౪

ఉ. క్రొన్నెలవోలె నున్నయొక♦కోమలగాత్రిని, హోమధూమసం
ఛన్నహుతాశనార్చిగతి ♦ జా నతి యుండెడిదాని, నైజమా

---

[1] సామీరి = హనుమంతుఁడు. [2] ఏనవ పెనుమడుఁగు = ఐదవసముద్రము.

యిన్నెఱిరూప మంచు మది ♦ నెంతో విచారముఁ జేసికాని లో
నెన్నఁగరాని దానిని, న♦హీనతరవ్యథితాత్మ, సుందరిన్ ౪౩౫

ఉ. ధూళిని బ్రుంగియున్న మెయి♦తోఁ గమలంబులు లేనికొల్కు నా
ప్రేళ నలంకృతిం దొఱఁగి ♦ పీతరుచిం గలయొంటిచీరతో
వాలినదుఃఖభారమున ♦ వాడి తపస్విని యై కుజగ్రహం
బోలిని బట్టుకొన్న చెలు ♦ వూడినరోహిణి నాఁగ నొప్పుచున్. ౪౩౬

సీ. కాలువలై పాఱు ♦ కన్నీళ్లు మొగ మొల్ల, నావరింపఁగఁ గడ♦నడలుదానిఁ
దలపోఁతలకుఁ జిక్కి ♦ తతశోకమున స్రుక్కి, యెప్పుడు వెకి వెక్కి ♦ యేడ్చుదానిఁ
దనవారి మొగములఁ ♦ గన లేక రక్కసి,పిండు మోములు చూచి ♦ బెగడుదాని
వేఁటకుక్కలలోన ♦ వేర్పడి చిక్కిన, యేఁడుజింక నఁగ న♦ల్లాడుదాని

తే. నల్లత్రాఁచన దిగి జఘ♦నంబు నొరయు,నొంటిజడతో శరత్తున♦నుదయవేళఁ
గారుటడవుల నొప్పారు♦క్ష్మాతలంబుఁ,బోని దానిని నెఱమాపు♦మేనిదాని. ౪౩౭

కం వ్యసన మెఱుంగనిదానిని, వ్యసనంబున మాఁడుదానిఁ ♦ బరనుసుఖార్హన్
బస దొఱఁగి ధ్యానపరయై, పసివాడినదాని దీన ♦ వనజదళాక్షిన్. ౪౩౮

↔ హనుమంతుఁడు సీతాదేవిని జూచి తనలో వితర్కించుకొనుట. ↔

కం.కని యీకృశమలినాంగియె, ఘనుఁ డగుజనకునితనూజ ♦ గాఁబోలు నొకో
యని యీకారణముల నా,హనుమ వితర్కింపఁ దొడఁగె ♦ స్వాంతమునందున్.

కం.ఏరూపముఁ గలసుందరి, నారావణుఁ డపహరించి ♦ యరుగుచు నుండన్
వారక కంటిమొ యానాఁ, డారూపము యీమెయందు ♦ నయ్యెం గనఁగన్. ౪౪౦

సీ. నిండుఁజందురుఁబోలు ♦ నెమ్మోముఁ గలదానిఁ, బొలుపు లీనెడికను♦బొమలదాని
లలినవృత్తయౌవన♦లక్షణంబుల[1]దాని, నిడుద లౌ నీలంపు♦నెఱులదాని
నిరుల బ్రుంగెడికాంతి ♦ నెసఁగు చుండెడిదాని, బింబంబు డంబగు♦పెదవిదాని
సింహమధ్యంబు హ♦సించుమధ్యముదాని, నొప్పఁదీర్చినపాద♦యుగముదానిఁ

తే. దోయజంబులఁబోలు క♦న్దోయిదానిఁ, బుష్పబాణునియలివేణిఁ ♦ బోలుదానిఁ
నిండునెలడాలునాఁగను ♦ నిఖిలజగతి, కనుపమానేష్ట యగుచును ♦ జనెడుదాని.

ఉ. తాపసిఁబోనిదాని, వసు♦ధం బడియుండెడిదాని, నూరుపుల్
పైపయిఁ బాఁపలేమ[2] యనఁ ♦ బర్వఁగఁజేసెడిదాని, ధూమమా
లాపరితాగ్ని నాఁగ విపు♦లవ్యథ సొంపఱి యుండుదాని, మి
థ్యాపరిభూతకీర్తి నిహ♦తం బగునాశను బోలుతొయ్యలిన్. ౪౪౨

ఆ. కుదుటఁ బడనిశ్రద్ధ ♦ మదికి సందిగ్ధ మౌ, స్మృతియు, క్షీణమైన♦సిరియుఁ గలుష
యుక్తమైనబుద్ధి, ♦ యుపహతిఁ గూడిన, కార్యసిద్ధి నాఁగఁ ♦ గ్రాలుదాని. ౪౪౩

---

[1] యౌవనలక్షణంబులు = స్తనములు. [2] పాఁపలేమ = నాగకన్య.

సీ. కౌసలేయునిఁ జూడఁ♦గానక తపియించి, యసురచేతకుఁ జిక్కి ♦ యడలుదాని
వచ్చునా నా ప్రియ♦వల్లభుం డంచును, నలుదెస ల్వరికించి ♦ తలరుదానిఁ
బొదలుచు నొంటి మై ♦ బెదరి చూచెడి లేడి,కన్నెకన్నులఁబోలు ♦ కనులదానిఁ
గాలువ లైపాఱు♦కన్నీటివఱదతోఁ, బుల్కు పుల్కను గను♦పొలుపుదాని
తే. వాడుపాఱిన మోమున ♦ వగచుదాని, వేఁడినిట్టూర్పు పైపయి ♦ విడుచుదాని
ధూళి గ్రుంగిన మేనను ♦ దూలుదాని, విన్నఁదనమున మలమల ♦ వేఁగుదాని.
సీ. ఉత్తమాలంక్రియా♦యోగ్య యయ్యును మేన, మండనంబులు లేక♦యుండుదానిఁ
గారుమబ్బుచుఱుంగుఁ ♦ గనినచుక్కలతేని,నడుమున మాసిన ♦ ప్రభలదాని
నభ్యాస మెడలుటఁ ♦ నాత్త విస్మృతి గన్న, చదివినచదువు నాఁ ♦ బొదలుదాని
విగతసంస్కారమై ♦ వేఱర్థ మొసఁగెడి,పదము నా వికట మై ♦ పరఁగుదాని
ఆ. నగునొ కాదొ సీత ♦ యనుచు శంకించుచుఁ, గలఁగి చూచి చూచి ♦ కష్టమునను
గారణంబులెల్లఁ ♦ గలయ నాలోచించి, నెలఁత సీత యనుచు ♦ నిశ్చయించె. ౨౨౪

హనుమ తాను జూచినస్త్రీ సీతాదేవి యని నిశ్చయించుకొనుట.

కం. జానకిసొమ్ము లటంచును, మానవవిభుఁ డేవి పలికె ♦ మా కవియెల్లన్
గానఁగ నయ్యెడిఁ గుజశా,ఖానికరములందు వ్రేలి ♦ కలికికి నఱుతన్. ౨౨౫
ఉ. చక్కనిచేఁతకమ్మలును ♦ జానగుమేల్ బొగడల్ సుకాంతిఁ బెం
పెక్కినరత్నవిద్రుమము♦హేమవిభాకరభూషణంబులున్
మక్కియు నల్లపాఱియును ♦ మానక పెక్కుదినాలు దాల్చుటన్
జక్కఁగ గుర్తు లేర్పఱిచె ♦ స్వామి వచించినసొమ్ము లివ్వగున్. ౨౨౬
కం. అక్కడ నేఁ జూచిననగ, లిక్కడఁ గనరావు; యున్న ♦ విట నచ్చోటన్
జిక్కనిసొమ్ములె; దీనికి, నొక్కింతయు సందియంబు ♦ నొనఁగదు చూడన్. ౨౨౭
చం. పసిమికడానిడాలున శు♦భం బయి యప్పుడు వోవువేళ నా
కసమున నుండి రాలుచు న♦గంబునఁ గొం డొక చిక్కి త్రెస్సి తా
వెసఁ గపిపంక్తి చూడఁగను ♦ ప్రీలినచీరయు మేలిసొమ్ములున్
వసుమతి నీమెయే విడిచె ♦ వంచనలే దొకయింత యేనియున్. ౨౨౮
కం. చిరకాలం బీవసనము, ధరియింపంబడుట మాపు♦తగిలియు వన్నెన్
బరికింపఁగ నాచీరకు, సరియై యొప్పారె నిదియు ♦ సత్యము చూడన్. ౨౩౦
ఉ. ఈకనకాంగి రాముహృద♦యేశ్వరి దేవెరి దూరవిప్రవా
సాకుల యయ్యు రాముహృద♦యంబున నెప్పుడుఁ బాయ కున్న, ద
స్తోకము రామచంద్రు నెడఁ ♦ దోఁచు సురూపము నంగసౌష్ఠవం
బీకువలాక్షి[1] యందుఁ బరి♦దృశ్యము లయ్యెను యుక్తమే కదా? ౨౩౧

[1] కువలాక్షి = కలువలవంటి కన్నులుగలది.

కం. శ్రీరాఘవుఁ డేమెఱుఁగాఁ, గారుణ్యం బానృశంస్య♦గరిమయుఁ గడుఁ దు
ర్వారపుశోకము మదనుఁడు, గారింపఁగ వేఁగు నట్టి♦యబల యి దేయా. ౪౫౨

సీ. ఆపదవేళల ♦ నంగన నొక్కర్తుఁ, బ్రోవలే దనెడి కా♦రుణ్యమునను
నన్ను నమ్మినదాని ♦ కిన్నిపా ట్లబ్బిన, నైఁచితి నను నాన్నృ♦శంస్యమునను
నర్ధాంగలక్ష్మిని ♦ నకట కోల్పడితిఁగా, సుందరి ననియెడి♦శోకమునను
నొద్ద లేదాయెఁగా ♦ యొప్పులకుప్ప నా, ప్రియ యన్న వెరవేఁకి♦వేఁకరమున[1]

తే. నకట యీనాలుగింటను ♦ నడలు చుండు
రామచంద్రుండు హృదయ మీ♦రామయందు
నిలిపె నీమెయుఁ బతియంద ♦ నిలిపె మనముఁ
గాన బ్రదికిరి వీరలు ♦ గడియ యైన. ౪౫౩

కం. ఎంతటిదుష్కరమును భూ, కాంతుఁడు ఘటియించె నీమెఁ ♦ గనకయు బ్రదికెన్
జింతావ్యథఁ జిక్కండును, వింత గదే మిగుల రామ♦విభుచరితంబుల్. ౪౫౪

కం. ఎంతటి దుష్కరమును దు, ర్దాంతపరాక్రముఁడు సల్పు ♦ రాముఁడు సీతా
కాంత మదిరాయతాంబక, చెంతను లేకున్నఁ ద్రుటియు ♦ జీవముఁ దాల్చెన్.

కం. అని జానకిఁ గని పావని, మనమున సంతోషమగ్న♦మానసుఁ డగుచున్
ఘనుఁ బ్రభుని రాము నెంతయుఁ, గొనియాడె నదెంతవాఁడొ♦కో యతఁ డనుచున్.

హనుమంతుఁడు సీతాదేవిస్థితికి దుఃఖించుట.

ఉ. రాము గుణాభిరాము నల♦రాము నుతించి ప్రశంసితస్వఁ జిం
తామథితాత్ముఁ డై పవన♦నందనుఁ డశ్రులు గ్రమ్ముకన్నులన్
రాముని దేవిఁ గూర్చి యవు♦రా యనుచున్ విలపించి మూర్త మి
ట్లామహిమాధ్యుఁ డుండి తద♦నంతర మి ట్లని యేడ్చె దుఃఖియై, ౪౫౭

కం. శీలవతి గురువినీతుం, డాలక్ష్మణుగురున రేణ్యు♦నాత్మప్రియ భూ
బాలికయును దుఃఖించినఁ, గాలము దురతిక్రమం బె♦కా యెవ్వరికిన్. ౪౫౮

కం. రామునిస్యవసాయంబును, ధీమత్సౌమిత్రిమతముఁ ♦ దెలియుట సీతా
భామామణి కలఁకం గన, దేమియు వానలకు వేల్పు♦టేటివిధమునన్. ౪౫౯

కం. రామున కీయసితేక్షణ, రాముఁడు నీసతికిఁ దగును ♦ బ్రాయమునందున్
శ్రీమానితశీలంబుల, సాముద్రికలక్షణముల ♦ సద్వంశమునన్. ౪౬౦

కం. అని బంగరు బొమ్మనఁ ద్రిభు, వనములకు న్వెల్పుసాని ♦ వరలక్ష్మివలెన్
గన నగుసీతను గనుఁగొని, మనమున రామునిఁ దలంచి ♦ మఱియుం బలికెన్.

సీ. ఈకాంతకై కదా ♦ యిషువున నొక్కంట, బలశాలి యవ్వాలి ♦ భంగపడియె
నీవెలందికె కదా ♦ రావణతుల్యవీ, ర్యుండు గబంధుఁడు ♦ రూపు మాసె
నీమానినికె కదా ♦ భీమవిక్రముఁ డైన, యనిరోధుఁడు విరాధుఁ ♦ డంత మొందె
నీనెలంతకె కదా ♦ కానలోఁ బదునాల్గు, వేలరక్కసులకుఁ ♦ బేరు మాసె

[1] వెరవేకివేఁకరము = విరహజ్వరము.

తే. నీమెకై కాదె ఖరఖలు♦నామ మణఁగె, నీసతికిఁ గాదె త్రిశిరుండు♦నీల్గి చనియె
నీసుదతికయి దూషణుం♦డే పడంగెఁ, బటుపరాక్రముఁ డగురామ♦భద్రుచేత.

ఉ. ఈమెకు నై దురాలభక♦వీశ్వరపాలితపూజ్యసంపదల్
శ్రీసహితార్కసంభవునిఁ♦ జేరె నిమేషములోన, సాగరం
బీమెకుఁ గాదె నేను దరి♦యించితి, నీపురిఁ గంటి, నీమెకై
రాముఁడు లోక మెల్లమహిఁ♦ గ్రాఁచిన యుక్తమ నాకుఁ జూడఁగన్. ౪౬౩

కం. మేలో త్రిభువన రాజ్యము, మేలో జానకి యటన్న♦ మేదినిసుతకున్
ద్రైలోక్యరాజ్య మెల్లను, జాలదు షో యొక్కకళకు♦ సరిపోలంగన్. ౪౬౪

ఆ. ఈమె ధర్మశీలుఁ♦ డెంతో మహాత్ముండు, మిథిలనాథుఁ డగుచు♦మెల్గిగన్న
ప్రథితజనకుతనయ♦ భర్తృదృఢవ్రత, యల్లసీత సంది♦యంబు లేదు. ౪౬౫

సీ. తమ్మిపుప్పొడులయం♦దం బైన మడిదున్ను, రేఁచునాఁగటికొనఁ♦ దోఁచె నుర్వి
సత్యశీలుం డైన♦జనకావనీశుని, ముద్దులకూఁతు రై తద్ద♦పెరిఁగె
అతివీరుఁ డార్యుండు♦ నపరాజితుండైన, యాజికిఁ[1] దొలికోడ♦ లగుచు నెగడె
విదితాత్ముఁడును గృత♦విదుఁడు ధర్మజ్ఞుఁ డౌ, రామునిమోహంపు♦రాణి యయ్యెఁ

తే. గాంతుపై భక్తిఁ గష్ట మన్♦చింత లేక, సౌఖ్యములఁ బాసి చొచ్చి ని♦ర్జనవనంబు
నాకు లలములు దిని యింటి♦యందుఁబోలెఁ, బతిని సేవించుసతి దైత్య♦సతులఁజిక్కె.

ఉ. సుందరిఁ గష్టదూర దర♦సుస్మితభాషిణి స్వర్ణవర్ణ రా
కేందునిభాస్య రాక్షసకు♦లేశ్వరపీడిత నీరువట్టుచే
వందురువాఁడు పెంజెలువ♦పందిరి డాయఁగఁ గోరునట్టు లీ
కుందరదం గనంగ రఘు♦కుంజరుకోరుట యుక్తమే కదా. ౪౬౭

కం. రాజ్యపదభ్రష్టుఁడు దన, రాజ్యము లభియింప నలరు♦ రహిని ద్రిలోకీ
పూజ్య యగుసీత మరలం, బ్రాజ్యంబుగఁ బొంది ముదము♦పడు రాముండున్.

ఉ. చుట్టములం దొఱంగినను♦ జూఱలు వోయినఁ గామభోగముల్
నిట్టల మైనకష్టముల♦ నెవ్వగఁ దాను మునింగి యుండినన్
నెట్టన ప్రాణనాథుఁ గన♦ నిల్పి మనం బనయంబు నోర్పుతో
గిట్టకయున్న దీమె పిడి♦కింట సయో బిగఁబట్టి ప్రాణముల్. ౪౬౯

ఉ. చూడదు రాక్షసాంగనలఁ♦ జూడదు పుష్పఫలద్రుమంబులన్
జూడదు రమ్యహర్మ్యముల♦ సుందరి డెందమునందు నెప్పుడున్
జూడఁగఁ గోరుచున్ భువన♦సుందరు రాముని నొక్కని న్మదిన్
వేడుక సేయ దెయ్య దవ♦నీసుత, యుక్తమె కా తలంపఁగన్. ౪౭౦

కం. వరభూషణములకంటెను, బరమం బగుభూషణంబు♦ భర్తయె సతికిన్
దరుణీమణి తద్భూషా, విరహిత యై వనరుకతన♦ వెలుఁగదు కంటే. ౪౭౧

---

[1] ఆజి = దశరథుఁడు.

కం. ఎంతటిదుష్కరమును భూ,కాంతుఁడు ఘటియించు నీకొఁ ♦ గనకయు బ్రదికెఁ
జింతావ్యథఁ జిక్కండును, వింతగదే మిగుల రామ♦విభుచరితంబుల్. ౪౭౨

కం. అళినీలకుంతలాంతను, నళినీదళతుల్యనయన ♦ నన్యసుఖార్హన్
గలకంఠి దుఃఖితం గనఁ, బలు కేటికి నాకుఁ గూడ[1] ♦ వ్యథ పైకొనియెన్. ౪౭౩

ఉ. రాముఁడు లక్ష్మణుండుఁ దను ♦ రక్షణసేయ సుఖంచు చుండు నీ
వామ క్షమర్క క్షమాతరుణిఁ ♦ బద్మవిలోచన రాక్షసాంగనల్
భీమవిలోకనల్ బెదరు♦పెట్టుచుఁ గావఁగ వృక్షమూలమం
దీమెయి నున్న, దార! విధి ♦ కేది యసాధ్యము తప్పఁ జూచినన్. ౪౭౪

తే. మంచు సోఁకిననత్తమ్మి♦మాడ్కిఁ గాంతి, దఱిఁగి దుఃఖపరంపరఁ ♦ దప్త యగుచు
నంటుకానిని బాసిన♦పెంటిచక్ర,వాక మన సీత దీనత ♦ ననరు టయ్యె ౪౭౫

మానిని. పూవులవ్రేఁకన వ్రాలినకొమ్మలఁ ♦ బొల్చునశోకమహాతరువుల్
తావులు నించుచు మాధవచారుసు♦ధాకరకాంతులు రేఁగుచు దుః
ఖావిలఁ జేయుచు నున్నవి యీతర♦ళాక్షి నటంచు మనంబున నీ
దేవియ సీత యటంచును నిశ్చయ♦ధీయుతుఁ డుండె ద్రుమంబుపయిన్. ౪౭౬

హనుమంతుఁడు సీతాదేవికిఁ గాపున్నరాక్షసస్త్రీలఁ జూచుట.

కం. అంతట నీలాంబువులం, గాంతం బగుహంసయట్లు ♦ గగనాపరభా
గాంతరమున వెలికలునల,కాంతి నిశాకాంతుఁ డమరెఁ గడు నిర్మలుఁడై. ౪౭౭

కం. వాసిగ సీతను నెమకఁగ, బాసట యై వెలసె నేమొ ♦ పావని కనఁగా
భాసురనిర్మలతేజో,రాసులఁ దాపంబుఁ బాపె ♦ రా జాతనికిన్. ౪౭౮

కం. వ్రేఁగున మునిఁగెడియుడుపము, నాఁ గడుదుఃఖమున మ్రగ్గి ♦ నవయుచు నుండం
గాఁ గనుఁగొనె రామునియొల,నాఁగను నాఁగంటిచాలు♦నవలామిన్నన్. ౪౭౯

సీ. ధరణీసుతను జూచి ♦ తన్నికటంబున, ఘోరదర్శనల సు♦రారిసతుల
నేకాక్షిని నకర్ణ ♦ నేకకర్ణను శంకు,కర్ణను దనుదీర్ఘ♦కంధరలను
నెగయుముక్కునదాని ♦ దిగవ్రేలుచెవిదాని, ధ్వస్త కేశిని బోడి♦తలలవారి
నతికాయ మగునుత్త♦మాంగంబుఁ గలదాని, గడ్డంబు నంటు స♦ల్కృప్పదాని

తే. లంబకర్ణలలాటను ♦ లంబకుచను, గేశకంబళధారిణిఁ ♦ గీశవరుఁడు
లంబజానుక లంబాస్య ♦ లంబజఠర, లంబరదనాంశుకలయుఁ గ♦దంబములను.

సీ. గిటకలఁ బొడవుల ♦ నట మఱుగుజ్జుల, వికటల వామనా♦నికరములను
మిట్టపండ్లులదానిఁ ♦ బొట్టయుబ్బినదాని, ముక్కుఁడిఁ బింగాక్షి ♦ బొక్కినోటి
వికృతను గాళిని ♦ బింగళఁ గ్రోధనఁ, గాలాయసమహాశూ♦లకూట
ముద్గరహస్తల ♦ మొగిఁ గలహప్రియ, నజమృగమహిషశి♦వాస్యతలల

తే. వ్యాఘ్రముఖి నుష్ట్రగజఘోట♦కాంఘ్రి మఱి ని
ఖాతమూర్ధను నేకాంఘ్రి♦కర్ణకరల

[1] నాకుఁగూడ = బ్రహ్మచారియు - విరాగియు - యోగీశ్వరుఁడు జితేంద్రియుఁడు నైన నాకునుగూడ.

నశ్వకర్ణిక ఖరకర్ణి హస్తకర్ణి
మఱియు గోకర్ణ హరికర్ణి కుండలముల. ౮౭౧

సీ. అతినాసను ననాస చ్యుతనాస నున్నత,నాసఁ దిర్యఙ్నాస నాగనాసఁ
బాదచూడిక హస్తిపాదగోపాద మ,హాపాద దీర్ఘజిహ్వ నఖలను
బెద్దతలలవారిఁ బెద్దమెడలవారిఁ, బెద్దపొట్టలవారిఁ బెద్దకనుల
వారిఁ బెంజన్నులవారిఁ గరేణుకా,ముఖి నజాముఖి హస్తిముఖిని నాఁడు

తే. పందిమోమునదానిని వాజివక్త్ర,నుష్ట్రవక్త్రను ఖరవక్త్ర నుగ్రదర్శ
నలను ముద్గరశూలహస్తలను గ్రోధ,నలఁ గరాళలఁ గన్గొనెఁ గలహరతల.

ఉ. కొల్లగఁ గల్లు ద్రావి, వెఱికూఁతలు రోఁతలు గొల్ప నంజుడుల్
నల్లియు[1] నాని, వెక్కసపులాగున మైఁగలయుంగఁ బూసి, యు
త్ఫుల్లసరోజనేత్ర యగుభూసుత యుండుకుజంబుచుట్టు అం
పిల్లఁగఁ గాంచె రక్కసల మేఁకబుఁకింప సమీరసూతియున్. ౮౭౨

హనుమంతుఁడు సీతాదేవిని జూచి సంతోషించుట.

సీ. ఆచెట్టుక్రీనీడ నమలినచారిత్ర, వనటచేఁ దపియించి వగచుదానిఁ
జనఁగొన్న మాపుకనును వెంద్రుకలదాని, నెఱి మీఱునడవడి నెగడుదానిఁ
గాంతిఁ బాసినదానిఁ గాంతుఁ గానఁగలేని,దాని మేల్సొమ్ములు లేనిదాని
భర్త్రనురాగంబె వరభూష యవుదానిఁ, బుణ్యహీనతఁ జేసి పుడమిఁబడిన

తే. రిక్కయునుబోనిదాని రేద్రిమ్మరీఁడు, పట్టి బంధింపఁ జట్టాలపట్టు లేక
సింగ మాఁగినగుంపునఁ జీలి యొంటి,యైనయాఁడేనుఁగునుబోలె నడలుదాని.

తే. వాడుకొనమిని దంత్రులు వదులుపాఱి, ధూళి మాసినవీణెనాఁ దోఁచుదానిఁ
బ్రీతిభరమున మగని స్మరించుదాని, రక్కసలపల్కుఁ బెడచెవిఁ బెక్కుదాని.

సీ. శారదవేళను నీరదావృతమైన, పూపచందురు రేకఁ బోలుదానిఁ
గ్రూరగ్రహావృత రోహిణిచాడ్పున, నసురాంగనావృత యైనదానిఁ
బూవులు లేనట్టి తీవఁబోలినదాని, ధూళి గ్రుంగియు రుచిఁ దోఁచుదానిఁ
బసలు[2] పై గ్రమ్మిన యబ్జినివలెఁ గాంతి, నెగడియు నెగడక నెగడుదానిఁ

తే. దీరమాసిన చినిఁగినచీరదాని, జింకపిల్లలకన్నులచెలువు నవ్వ
కన్నుఁగవదానిఁ జూపఱకడుపుఁ జేతఁ, గలఁచిన ట్లొనరించెడి కలికిఁ గనియె.

ఆ. భర్తృతేజమునను బరమధీరత గల్గు, దీన మైనమోముదానిఁ దనదు
శీలమహిమఁ గాపు చేసికొంచడలెడు,దాని సీతఁ గనియె వానరుండు. ౮౭౩

సీ. బెగడొంది కంపిల్లు మృగకన్యకయుఁబోలె, దిక్కులు చూచుచు స్రుక్కుదాని
వేఁడినిట్టూర్పుల వృక్షపల్లవములఁ, గ్రాఁచెడినేమొనాఁ గ్రాలుదాని

[1] నల్ల = నెత్తురు. [2] అసలు = బురద.

నాంతరదుఃఖాబ్ధి ♦ యందు దంద పొంగిన,నలలయట్టూర్పులు ♦ వెలువడాని
నవసినయంగముల్ ♦ నాగెంబుతో వినా,కృతభూష నైయె శోభ ♦ నెసఁగుదాని
ఆ. మదిరనయన సీత ♦ మారుతి గనుఁగొని, సమ్ముదాశ్రు లురల ♦ జాలుగాఁగ
రామచంద్రునకును ♦ సౌమిత్రికిని గేలు, మోడ్చి శాఖయందె ♦ ముడిఁగి యుండె.

## రావణుఁ డశోకవనంబునకు వచ్చుట.

కం. చంచత్పల్లవకుసుమో,దంచితవనిఁ గలయఁ జూచి ♦ యవనిజఁ జక్కం
గాంచఁగ మారుతి దలఁపఁగ, నించుకదక్కువగ రేయి ♦ యెల్లం గడచెన్. ౪౮౯

ఉ. అంతట నాలకించెను ష ♦ డంగకవేదవిదుల్ మఖక్రియా
స్వాంతులు వేగుజామునను ♦ యంబున మేల్కని బ్రహ్మరాక్షసుల్
మంతు వొ[1]కింత లేక శుచి ♦ సద్విధి నించెడిబ్రహ్మఘోషముల్
వింతగ వాద్యనాదములు ♦ వీనులవిందుగ మ్రోయుచుండఁగన్. ౪౯౦

కం. ఆమంగళరవములఁ బూ,ర్వామరపతి మేలుకాంచి ♦ యంబరసుమనో
దామంబు లెడల సీతా,వామాక్షిం దలఁచె రాగ ♦ పరవశుఁ డగుచున్. ౪౯౧

కం. మదనమదోత్కటుఁ డయి దశ,వదనుఁడు గాఢముగ మనము ♦ వనజాక్షిపయిన్
బదిలముగ నిల్పి కామము, హృది నణఁపఁగ నేరఁ డయ్యె ♦ నించుక యైనన్.

సీ. తనకును గలయను ♦ త్తమలక్ష్మి శోభిల్ల, సర్వాభరణములు ♦ సరగఁ దాల్చి
కుసుమితఫలితస ♦ త్కుజసంతతుల చేతఁ, గందోయి కెంతయు ♦ విందు లిడుచు
విచ్చినతమ్ములఁ ♦ బెచ్చు మీఱినకొలం,కులు శకుంతంబుల ♦ కలకలములు
సొబగార నద్భుత ♦ సుందరం బయి పెక్కు,లీహామృగంబుల ♦ వ్యూహములను
తే. దృఙ్మనోహార మగుచును ♦ దేజరిల్లి, రత్నకాంచనతోరణ ♦ రాజి వెలసి
బహుమృగాకీర్ణ మయి గళ ♦ త్ఫలచయ మయి, నవ్య మైనయశోకవ ♦ నంబుఁ జొచ్చె.

తే. వేయిగన్నుల వేల్పును ♦ వెంబడించు, నమరగంధర్వసతులట్టు ♦ లసురసతులు
వందమంది సురేంద్రుని ♦ వైరి వెంట, నరిగిరి ప్రదీపచామర ♦ హస్త లగుచు. ౪౯౪

సీ. రంగారుబంగారు ♦ భృంగారువుల నీళ్లు, కొందఱు గైకొని ♦ ముంద అడుగ
మండలాగ్రంబులు ♦ మణిమయాసనములు, గొని కొంద ఱంగనల్ ♦ వెనుక రాఁగ
జాణయొక్కతె మణి ♦ స్థాలిఁ బానంబునఁ, బూరించి కుడికేలఁ ♦ బూనినడువ
రాజహంసను బూర్ణ ♦ రాజబింబముఁ బోలు, గొడుగు నొక్కతె వెను ♦ కడను బట్టఁ
తే. పైఁడిదండంబు నొక్కతె ♦ పట్టుచుండఁ
గూర్కుకన్నులఁ దనప్రియ ♦ కులసతులును
మబ్బుతోఁ జనుమెఱుఁగుల ♦ మాడ్కి నడవఁ
బంక్తికంధరుఁ డుద్యాన ♦ వనముఁ జొచ్చె. ౪౯౫

[1] మంతువు = అపరాధము.

సీ. ప్రేలినకొప్పులు ♦ రాలినపూఁతలుఁ, దూలినసరములుఁ ♦ గ్రాలువారు
నిద్దురమంపులు ♦ నెఱిముత్తుకంపులుఁ, జెమ్మటమోములుఁ ♦ జెలఁగువారు
శ్రమవారిఁ దడిసిన ♦ సుమహారములవారు, మాలికాకులచికు ♦ రాళివారు
జేవుఱుఁగన్నులుఁ ♦ జెలునంపుఁజన్నెలు, మేలగువన్నెలు ♦ మెఱయువారు
తే. రాఁగ రాగంబునను వెంట ♦ రామవిభుని
కాంత మది నుంచి తమిఁ బెంచి ♦ కళవళించి
మాధ్యము వహించి మర్యాద ♦ మట్టగించి
క్రించుటసురుండు వనముఁ జొ ♦ త్తెంచుటయును. ౪౯౬

కం. అంజనతనయుఁడు రావణ, కుంజరగమనావళీని, కూజత్కాంచీ
శింజితములు శ్రవణపుటీ, రంజకహంసకనికాయ ♦ రవములు వినియెన్. ౪౯౭

ఉ. ద్వారము డాసి యున్న సుర ♦ వైరికులేశ్వరు, గంధతైలసి
క్తోరుసుదీపికల్ గొని త ♦ లోదరు లేగ వెలుంగుశామవి
స్తారుని, వక్త్రలోహితవి ♦ శాలవిలోచనుఁ, జాపహీనుఁ డౌ
మారునిమాఱుమూర్తి యన ♦ మంజులరూపు వహించువీరునిన్. ౪౯౮

తే. అంగదంబులఁ దగిలిన ♦ యమృతఫేన, సన్నిభోత్తమవిమలవ ♦ స్త్రమును లీలఁ
గేల సవరించువాని దో ♦ ర్వల్లి నిట్టిఁ, డంచు నెన్నంగరానియా ♦ యసురఁ గనియె.

కం. కాంచెను గాంచనకాంచీ, చంచన్మణికింకిణీల ♦ సన్మధ్యల రూ
పాంచితయువతుల మారుతి, పొంచి నగంబందు నుండి ♦ పూవుంబోండ్లన్. ౫౦౦

ఉ. తారలు గూడియున్న యల ♦ తారకరాజునుబోలి సుందరీ
వారము చుట్టు గొల్వఁగను ♦ వచ్చెడివాని లసత్పరిష్క్రియా
హారవిలాసునిం బటుమ ♦ హాబలభానునిఁ గామదానునిన్
హారిశరీరు విశ్రవసు ♦ నాత్మకుమారునిఁ గాంచి యాత్మలోన్. ౫౦౧

మ. అగుఁ బో యితఁ డ రావణుం డనుచు ర ♦ క్షోధీశుఁ గానంగపీ
లగుతానంబును జేరి భూరిబలుఁడై ♦ యావీరు తేజంబునన్
విగళత్తేజుఁడు నొచుఁ గొమ్మలను డా ♦ వెన్ వాఁడునున్ సుస్తనిన్
జిగురుంబోఁడి సుగాత్రి డాయ నరుదెం ♦ చెం జూడఁ గాంక్షించుచున్. ౫౦౨

## రావణుఁడు సీతాదేవిని జేరఁబోవుట.

చం. తడయక సీత గాంచి దవు ♦ దవ్వుల భూషణభూషితాంగుఁడై
పడఁతులతోడ వచ్చుసుర ♦ భంజను యౌవనరూపవైభవున్
వడఁకుచు నోరుగాలికి వ ♦ ణంకునసంటినిబోలి యూరులన్
గడుపును బాహులం జేనులు ♦ గ్రక్కన మాటుచు నేడ్చుచుండఁగన్. ౫౦౩

సీ. దశకంధరుం డంత ♦ దర్శించె రాకాసి, మూఁక గావఁగ నార్తి ♦ మునుఁగుదాని
జలనిధి నవిసిన ♦ కలముఁ బోలినదాని, నుత్తనేలను గూరు ♦ చున్న దానిఁ
గొట్టి వైచినపూవుఁ ♦ గొమ్మదీ టవుదాని, నతులితసఁశితే ♦ వ్రతముదానిఁ
బంకపునగనుబల్ ♦ వన్నె లినెడుదాని, నొంటి నేడ్చుచుఁ జింత ♦ నొందుదాని
ఆ. బురద క్రమ్మియున్న ♦ సరసిజం బనఁగను, మెఱసి మెఱయ కుండు ♦ మేనిదాని
మండనార్హ యయ్యు ♦ మండనంబులు ద్రోచి, యడలుదాని నవయు ♦ నొడలిదాని.
చం. కనుఁగొన లేక మేర దన ♦ కాటియకుం బరివేష్టమానభో
గిని యన నుండుదాని, గుణ ♦ కీర్తితధార్మికవృత్తశీల మా
ఘనకులమందుఁ బుట్టియును ♦ గాపురుషాధము దుష్కృతోద్భవుర్
బెనిమిటిఁ జేసికొన్న యలి ♦ వేణినిబోనిపతివ్రతామణిన్. ౫౦౫
కం. అంకరహితవిదితాత్మునిఁ, బంకజదళనేత్రు రామ ♦ భద్రుని డాయర్
సంకల్పహయంబులచేఁ, బొంకంబుగ హృద్రథమునఁ ♦ బోయెడిదానిన్. ౫౦౬
కం. అపవాదముచేఁ దేరకు, నిపతిత మగుకీర్తిఁబోని ♦ నెలఁతుకమిన్నర్
వ్యపకలితాభ్యాసం బగు, కృపణునివిద్యయునుబోలెఁ ♦ గీఱ్పడుదానిన్. ౫౦౭
చం. సమసినకీర్తి, నాదరము ♦ చాలని శ్రద్ధఁ, బరిక్షతంబు నౌ
యమలినపూజ, భగ్న యగు ♦ నాశను, జిందఱవోవులాభమున్
గమరినపద్మమున్, మిగులఁ ♦ గాలెడిదిక్కును, భగ్నపూజనున్
దమమును గూడువెల్తురు, ని ♦ దాఘమునందలియేటిఁ బోలుచున్. ౫౦౮
కం. హతశూరముసైన్యమువలెఁ, బ్రతిహతశాసనముకీతి ♦ రాహువు మ్రింగన్
వెతగొను జాబిలిఁ గలనిశ, గతి శాంతానలముభంగిఁ ♦ గ్రాలెడిదానిన్. ౫౦౯
తే. మైల దాఁకినవేదినాఁ ♦ బూలఁ గమల, దళములను బీఁకివైచి ప ♦ క్షులను బఱచి
గజము గలఁపఁగ బురదచే ♦ గాడు పడిన, సారసాకరమో యనఁ ♦ జాలుదాని. ౫౧౦
చం. మగనిఁ దలంచి యేడ్చుటను ♦ మానక, కట్ట దెగంగ వాఁకనాఁ
దగి, యుపచారహీన యయి ♦ తానవసంగతిఁ[1] గృష్ణపక్షమం
దగునిశఁబోలు సుందరి, స ♦ నర్ఘమణిస్థగితాలయోచితన్
మిగులసుఖార్హనున్, మృదుల ♦ నిర్మలదేహను, సుందరీమణిన్ ౫౧౧
తే. అపుడ యెండకు వైచిన ♦ యట్టితమ్మి, తూఁ డనంగను వాడిన ♦ తోయజాక్షి
యూథపునిఁ బాసి కంబాన ♦ నుక్కు చెఁడఁగఁ, గట్టఁబడి వగ నూర్చెడి ♦ కరిణికరణి
కం. తూలుచును నొంటిజడతో, జాలిగ నగ్గ లేమిలేమి ♦ శారదవేళన్
నీలం బగువనలక్ష్మి, లీలలు గలభూమినా ల ♦ లిం గనుదానిన్. ౫౧౩

[1] తానవసంగతి = కృశించియుండుటచేత.

తే. భయమునను శోకమున నుప♦వాసములను
ధ్యానమునఁ గోఱకుడుపునఁ ♦ దపముఁ జేయు
చుండునదివోలె శుష్కించి ♦ యుండుదాని
దీన యగుదాని వెలవెల ♦ నైనదాని. ౫౧౪

ఉ. దేవతలార! నాపతికిఁ ♦ దేజ మెలర్పఁగఁ జేసి యాదశ
గ్రీవుఁ బరాభవింపుఁ డని ♦ కేల్ముకుళించి సభక్తికంబుగా
భావములోన వేఁడుచెలిఁ ♦ బ్రక్కలు చూచుచు నేడ్చుదాని, న
ప్పావని మైథిలిం గదిసెఁ ♦ బాపి దశాస్యుఁడు పంచతార్థ మై. ౫౧౫

రావణుఁడు తనకోరికను సీతాదేవికిఁ జెప్పుట.

కం. చేరంగఁ బోయి రాక్షస,వీరుఁడు మధురోక్తిఁ బల్కెఁ ♦ బృథ్వీసుతతో
వారక తనమదిఁ గలుగువి,చారము తెల్లంబుగాఁగ ♦ సాధ్వీమణికిన్. ౫౧౬

ఉ. ఏటికి నన్నుఁ జూచి జల♦జేక్షణ! దాఁపఁ గుచోదరంబు, లి
ట్లేటికి గొంకి వణంకఁ, బరు ♦ లెవ్వరొకో కరభోరు! యిందు, నా
మాటను బాటిగాఁ గొనుము ♦ మత్ప్రియురాల! బహూకరింపు నన్,
మేటిసురూపతాఖనివి ♦ నీవ గదే జగదేకమోహినీ. ౫౧౭

ఆ. కలికి మనుజులైనఁ ♦ గామరూపధరులు, రాత్రిచరులునైన ♦ రాజవదన!
యిందులేరు నీకు ♦ నేటికి భయపడ? నాకు వెఱవ వలదు ♦ నళిననేత్ర! ౫౧౮

కం పరదారగమనకేళియుఁ, బరదారాపహరణంబు ♦ పద్మదళాక్షీ
పరఁగుఁ గులధర్మ మయి ని,ర్జరవైరుల కెల్ల భీరు ♦ సందియ మున్నే. ౫౧౯

కం. రామా! యిది యి ట్లయ్యు న,కామను నినుఁ దాఁక నొల్లఁ ♦ గామముబలిమిన్
గామింపు యథాకామము,గా మైథిలి! నాదుపట్లఁ ♦ గరుణామతి వై. ౫౨౦

ఉ. దేవి! భయంబు నొందఁగ మ♦దిం దగ దిందుఁ, బ్రసాదదృష్టి సం
భావన సేయు నన్ను, వెత♦పాల్పడఁబోకుమ, యేకవేణి దు
ష్టానని శయ్యయున్ పరసు♦ఖార్ద్రతలంబునఁ బస్తు లుంటయున్
వావిరిచింతయున్ మయిల♦వస్త్రము నీ కుచితంబులే యిటన్. ౫౨౧

ఉ. అందము లైనమాల్యనిచ♦యంబులు దివ్యము లైనభూషలున్
జందనలేపనంబులును ♦ జక్కనిపెక్కు తెఱంగుచేలముల్
సుందరమందిరంబులును ♦ సొం పగుపానశయాసనంబులున్
సుందరి నృత్తగీతములు ♦ నూల్కొనుమీ ననుఁ బొంది మైథిలీ! ౫౨౨

కం. స్త్రీరత్నమ! యిటు లుండకు, భూరివిభూషల ధరింపు ♦ పువ్వుఁబోఁడీ! నన్
జేరియునన్ రుచిరాలం,కారములకుఁ బాసి యుండఁ♦గాఁ దగు నొక్కో. ౫౨౩

కం. చను చున్నది యెఱుఁగ వొకో, ననఁబోఁణీ! హరియావనము నీకు వృథా
చనినదియు మరలు నటవే? వనజాక్షీ! వచ్చునా ప్రవాహము మరలన్? ౨౪

ఉ. నిన్ను సృజించి వెండి తరుణీ యలవిశ్వవిధాత రూపసం
పన్నల సృష్టి సేయుటయె మానె నటంచుఁ దలంతు లోకమం
దన్నులమిన్న! నీకు సరియంగన లేమి నొకర్తుఁ, బూరుషుం
డన్నలు వైన నిన్నడసి యబ్జముఖీ! విడనాడి పోవునే. ౨౫

తే. ఎచ్చ టెచ్చట నాదృష్టి యిందువదన!, పడియె నీపయి నందంద భ్రాంతిఁ జలన
ముంచుకయు లేక నిలిచెనే యించుఁబోఁడి, గురునితంబిని నిన్నెన్నఁ దరమె నాకు.

సీ. విడువుమీ మోహంబు వెలఁది భార్యవు గమ్ము, నా కచ్చటచ్చట నాఁచికొనుచుఁ
దెచ్చిననాయెల్ల తెఱవలలో నగ్రమహిషివి గమ్ము సమ్మదము మీఱ
నెల్లరఁ బీడించి యేను దెచ్చినమణుల్, నేను రాజ్యంబును నీధనంబ
నిర్జించి ధరణియు నిఖిలపత్తనములు, నీదుసంతుష్టి కై నెఱి నొసంగు

తే. వాఁడ జనకున; కెవ్వఁడే వాలుమగఁడు, నన్ను రణమున నోర్వఁగా నున్నజగము
నందుఁ? బోరుల వేళల సుందరాంగి, నాదుబలవీర్యములను గనంగఁ గలవు.

చం. ఒఱిగినటెక్కెముల్, రవుతు లూడినవాజులుఁ, గూలు తేరులున్
విఱిగినవిండులుం, జెదరి వ్రేలెడి వెండ్రుకలుం, దడంబడం
బఱచెడిపాదముల్, పిలుకుమాఱెడి సేనలుఁ, గల్గి శత్రువుల్
పిఱికితనానఁ బాఱుదురు భీతి ననిన్ దనుజామరుల్ సతీ! ౨౮

ఉ. కన్నుల కాంక్ష దీరఁ గనఁగా మది గోల్పెడు నీదురూపమున్
జెన్నగుభూషణంబులను జెల్వ! ధరింపుము మేన, నాశదీ
ర న్నిఖిలేష్టభోగములఁ బ్రాజ్యముగా భుజియింపు, క్రీడలన్
బన్నుగఁ దేలుమీ, రుచిర పానకముల్ ముదమారఁ గ్రోలుమీ. ౨౯

మ. ధనమో భూమియొ రాజ్యమో యెదియు నేఁ దన్వీ! యథేష్టంబుగా
వనితా! దానము సేయుమీ, ననుఁ గృపా భావంబునం జూడుమీ
కొనుమీ యెయ్యది గోర నిచ్చెదను నీకు, న్నావయిం గూర్మిఁ జూ
పిన నీవారల కెల్ల సౌఖ్యములు ప్రాపించున్ నిజం బాడెదన్. ౩౦

తే. కలికి నాదుసమృద్ధియుఁ గలిమి కీర్తిఁ, గనుము ప్రీతి; వనాటుండు గతరముండు
చెలియ! చీరాంబరుండు నిక్షిప్తవిజయుఁ, డతివ! స్థండిలశాయి నీపతి దలంప.

ఉ. రాముఁడు నింత దాఁక నటఁ బ్రాణముతోడుత నున్నవాఁడొ లేఁ
డో మది సంశయింతు, నిను నుత్పలలోచన! చూడ నేనియున్
రాముఁడు చాలఁ, డగ్రమున రాజిలఁ గొంగలు వార్షికాంబుద
స్తోమము గ్రమ్మినన్ వశమె చూడఁగ వెన్నెల నట్టివారికిన్? ౩౨

తే. వృత్రశాత్రవకరగత♦హేమకశిపు,కీర్తిచందంబునను రామ♦మూర్తి మరల
నాదుహస్తంబునం దుండి ♦ నళిననేత్ర! నిన్ను గ్రహియింపనెట్టులు ♦ నేర్చుఁ జెపుమ.

కం.అందం బగుచిఱునగవున, సుందరరదనములఁ గనుల♦సొబగున వినతా
నందనుఁడు లేలిహానము,చందమున హరించె దీవు ♦ సకి నామనమున్. ౫౩౪

ఉ. మాసినచీరఁ గట్టి, నెఱి♦మాలి, యలంకృతి లేక మిక్కిలిన్
గాసిలు చున్నయట్టినినుఁ ♦ గాంచుట నాప్రియురాండ్రతోడ వి
శ్వాసముగా రతిం జలుపఁ♦జాలన, కంటె సమస్తసద్గుణా
వాసలు మత్సతుల్ ముగుద! ♦ వారల కీశ్వరి వై చెలంగుమీ. ౫౩౫

కం.సిరి నచ్చరలు భజించెడి,కరణిఁ ద్రిలోకీప్రవరలు ♦ కాంతా! యస్మ
త్తరుణులు నిన్ను భజింతురు, కరమును భయభక్తియుక్తిఁ ♦ గరుణం గనుమీ. ౫౩౬

కం.చేకొను మలకాపురిఁ గల,ప్రాకటరత్నములు ధనముఁ ♦ బద్మదళాక్షీ
లోకంబునఁ గల్గునమూ,ల్యాకల్పంబులను నన్ను ♦ నాదర మారన్. ౫౩౭

కం.తపముననో బలముననో, విపులపరాక్రమములందొ ♦ విత్తమునందో
విపుల సుకీర్తినో కాంతినో, చపలాక్షీ! రామవిభుఁడు ♦ సరియగు నాతోన్. ౫౩౮

మ. లలనా! కోరినరీతిఁ గ్రీడలను దే♦లంరాదె, త్రావం గదే,
కలభోగంబులఁ బొందుమీ, యొసఁగెదం ♦ గళ్యాణి! విత్తంబులో
యిలధామా యెయ్యది గోర, నాపయిఁ గృపా♦దృష్టుల్ ప్రసారించినన్
జెలి! నీచుట్టము లెల్లరున్ సుఖులుగాఁ ♦ జింతింపు కాంతామణీ. ౫౩౯

మణిమంజరి. మసలకు కనకసు♦మండన! కుంజ
ద్భసలవిసరములు[1] ♦ భాసిలు వేలా
కుసుమితతరుగణ♦కుంజములందున్
బసమెయి మెలఁగుము ♦ భామిని నాతోన్. ౫౪౦

### సీతాదేవి రావణునకు బుద్ధి చెప్పుట.

చం.అనుడు దశాస్యవాక్యముల ♦ నాధరణీభవ యాలకించి దు
ర్మన యయి వేపమాన యయి ♦ మానక సాధ్వి పతిం దలంచుచున్
గనుఁగవ నశ్రువు ల్దొరఁగఁ♦గా విలపించుచు దీననాద యై
యనియెను గడ్డిపోఁచ తన ♦ కడ్డము నిల్పి శుచిస్మితాస్య తాన్. ౫౪౧

కం.నాపయిఁ జిత్తముఁ జేర్పకు, నీపడఁతులయందు మనము ♦ నిలుపుము నను నీ
వీపగిది వేఁడ ఫలమా, పాపాత్ములు ముక్తిఁ గోరు♦పగిదిని ఖలుఁడా! ౫౪౨

ఉ. పుట్టితిఁ బుణ్యవంశమునఁ ♦ బూజ్యతరాన్వయ మేను మెట్టితిం
బట్టితి నేకపత్నినియ♦మంబును నిట్లు రహించి పాపమున్

[1] భసలవిసరములు = తుమ్మెదగుంపులు.

గట్టుకొనంగ నేర్తునె య◆కార్య మొకండు ఘటించి? యేల యీ
వట్టివి విప్రలాపములు ◆ వాఁగెదు మూర్ఖుఁడ వౌచు రాక్షసా? ౫౪౩

చం. అని పెడవాటుగా మరలి ◆ యాజనకాత్మజ వెండి పల్కె నో
దనుజుఁడ! నేను సాధ్విఁ, బర◆దారను, నీసతిఁ గాను, నీమదిం
గను మిఁక సాధుధర్మముప్ర◆కారము, సాధులమార్గ మానుమీ,
పనిగొని తేరతేర కిటు ◆ పాపము నీ వొడిగట్ట నేటికిన్? ౫౪౪

కం. నీ కెట్టులొ నీభార్యలు, లోకంబునవారిభార్య◆లును రక్ష్య లటుల్
రాకాసి ఱేఁడ! నిన్నే, చేకొని యుపమగను బ్రీతిఁ ◆ జెలఁగు స్వసతులన్. ౫౪౫

ఉ. సంచలితేంద్రియుం డగుచుఁ ◆ జంచలుఁడై తనభార్యయందఁ ప్రే
మించి రమించి తుష్టిఁ గొన ◆ మేకొన నోపనిజాల్మప్రజ్ఞ యున్
సంచితలక్ష్మి యాయధము◆సంతతియున్ మఱి వానియాయువున్
ద్రుంచుట సత్య మన్యవ◆తోయజపత్త్రవిశాలలోచనల్. ౫౪౬

శా. లేరా పెద్దలు నీకు బుద్ధిఁ దెలుపన్? ◆ లేకుందురా యీపురిన్
వారిన్ డాయవొ ధర్మమార్గములు నే◆ర్వన్? నీదురాచారముల్
దూరీభూతసుపుణ్యవృత్తియలు సా◆ధువ్రాతదూరస్థుఁగా
నోరీ! తెల్పెడిఁ; గాక యున్న విపరీ◆తోక్తుల్ ననుం బల్కెదే? ౫౪౭

కం. కాలంబు దీఱ రాక్షస,జాలంబుల కీవు వినవొ ◆ సాధులబోధల్?
బాలిశ! మిథ్యాస్నేహావి,లోలున్ నిను నమ్మి వారు ◆ లోఁగరె చెట్టన్? ౫౪౮

చం. అనయరతాత్ముఁ డౌచు నకృ◆తాత్మకుఁ డైననృపాలపాళుప
ట్టనములు రాష్ట్రముల్ సిరి య◆డంగును, దగ్గతి రత్నపూర్ణయై
గొన బగులంక యిం కిటను ◆ గూలెడు నిక్కము శీఘ్రకాలమం
దున యసురేంద్ర! నీయొకని◆దోషమునం బలుమాట లేటికిన్. ౫౪౯

ఉ. దూరపుఁజూపు లేక యెటు ◆ దోఁచిన నెయ్యది యైనఁ జేయుచున్
గ్రూరపుఁబాపకార్యముల◆కుం మన సిచ్చి చరించునాయప
స్మారి స్వకీయకృత్యములను ◆ జావఁగ లోకము లెల్ల సంతసం
బారఁగఁ బండుగుల్ సలుపు ◆ హాయిగఁ గన్ను మొగుడ్చు రాత్రులన్. ౫౫౦

ఉ. నిక్కపువంచకుండ వగు◆ని న్నొకనెచ్చెలి వంచు నమ్మి వే
దిక్కఱి పోవువారు నినుఁ ◆ దిట్టుదు రీచెడుకూళ చిక్కె నీ
చిక్కుల దైనతంత్రమునఁ ◆ జేప్పడుఁ గాక యటంచు సంతసం
బెక్కఁగ, నేలరా చెడెద ◆ వీగతి నిందును నందు నిందలన్? ౫౫౧

కం. రవి కెట్టు లెండ శ్రీరా, ఘవునకు నే నట్లు నన్నుఁ ♦ గనకంబుల వై
భవముల నాశలు గొలిపెద, వవివేకీ! మోసపుచ్చ ♦ నలవియె నీకున్.　　౫౫౨
తే. ఆజగన్నాథునత్కృతం ♦ బైనభుజము, దిండుగా సుఖ మందెడి ♦ దేవి నయ్యు
ననురుఁడా! పేరులేని పె ♦ ద్దమ్మ నొకనిఁ, గరముచే నంటుదునె నాదు ♦ కాంతుఁ బాసి.
ఉ. సాంగము వేదముం జదివి ♦ సత్యము శీలముఁ గల్గి సాధుస
త్సంగతిఁ దేటి జ్ఞాని యగు ♦ త్మావిబుధేశున కాత్మవిద్య నా
నంగగ రామభద్రునకు ♦ న్యాయవిధిం దగుభార్య నేను; నీ
యంగముఁ గాల నేనియును ♦ నంటుదునా యిది యేమి భ్రాంతిరా!　　౫౫౪
కం. కాననతలమునఁ జిక్కిన, ధేనుకతోఁ[1] గరిని గూర్చు ♦ తెరువున దుఃఖా
ధీన నయి వగచునాతో, నానాథునిఁ దెచ్చి కూర్చు ♦ నయమతి వగుచున్.　　౫౫౫
ఉ. ఇంకను గొన్ని నాళ్లు పుర ♦ మేలఁ దలంచెద వేని, దండభృ
త్కింకరఘోరపాశములఁ ♦ గీడ్వడ నొల్లఁగ వేని, రావణా
కొంకకు రాముతోఁ జెలిమిఁ ♦ గోరుము, యప్పురుషోత్తముండు ని
న్నంకిలి పెట్ట కేలు శర ♦ ణాగతవత్సలుఁ డౌట నర్థిలిన్.　　౫౫౬
ఉ. మానుము రాక్షసేంద్ర! కొఱ ♦ మాలినబుద్ధి, దయాస్వరూపుఁ డా
మానధనుండు, న న్వెస స ♦ మర్పణ చేసి భజింపు మాతనిన్
దాన శుభంబు నీ కగును ♦ నానుడి నీవు కృతాంతుప్రేరణన్
వీనులఁ బెట్టవేని పృథి ♦ వీవరుచే మృతి గందు వాజిలోన్.　　౫౫౭
ఉ. తప్పినఁ దప్ప వచ్చు బల ♦ దానవవైరిశతారపాతముల్
దప్పినఁ దప్పవచ్చు నల ♦ ధర్మునిచూడ్కులు కొంతకాలమేన్
జెప్పెద సావధానమతిఁ ♦ జేర్పుము వీనుల, రాముఁ డల్గినన్
జెప్పెడి దేమి మూర్తమునఁ ♦ జీలిచి వైచును నిన్ను బోటులన్.　　౫౫౮
కం. కడువడి సురపతి విడిచిన, పిడుగులవడువునను గడిఁది ♦ బెడిదపుటులివుల్
విడివడ రఘుపతిశరములు, వెడలఁగ వినఁ గలవురా! వి ♦ వేకముఁ గనరా.　　౫౫౯
ఉ. క్రూరవిషానలార్చులను ♦ గుప్పునఁ గ్రక్కుచుఁ గొఱ లార్చుచున్
ఘోరముగాఁగ సర్పములు ♦ దూఱెడు నట్టు లవక్రపర్వముల్
శ్రీరఘురామలక్ష్మణసు ♦ చిహ్నితముల్ శితభీకరేషువుల్
ఘోరముగాఁ బయిం గవియ ♦ గోడుకొనుం జుమి లంక యంతయున్.　　౫౬౦
తే. రామలక్ష్మణముక్తనా ♦ రాచతతులు, కంకపత్త్రంబు లీవురిఁ ♦ గలయఁ బర్వి
వీనుఁగులవెంట లొనరించు ♦ దానవాళి, నింట నింటను నేడ్పులు ♦ మింటి నంట.

---

[1] ధేనుక = ఆఁడేనుఁగు.

తే. పాఁపమూఁక సుపర్ణుండు ♦ పట్టి చిమ్ము,గతి మహాబలుఁ డగురామ♦ఖగవిభుండు
రాక్షసేంద్రమహాసర్ప♦రాజి నెల్ల, నాశుగత్రోటిఁ జించి చెం♦డాడుఁ జుమ్ము.

చం. అసురకుఁ గైవసం బయిన♦యైంద్రపదంబుఁ ద్రివిక్రమాకృతిన్
వసముగఁ గైకొనండె హరి ♦ వాసవశాత్రవ! యట్ల రాముఁడున్
వెస నిట నుండి తోడ్కొనుచు ♦ వెళ్లును నన్, నిజ మంతవట్టు, నీ
వసదుగఁ జూడఁ బోకు రఘు♦వర్యుని భూమి మనంగఁ గోరినన్. ౫౬౩

కం. ప్రస్థానార్భటి చెలఁగ జ,నస్థానము వెడలి వచ్చి ♦ నానారులు నా
కస్థానముఁ జేరఁగను హ,తస్థానము గాఁగ నదియు ♦ ధైర్యము లేమిన్ ౫౬౪

కం. దొంగిలి తెచ్చితి వుటజము,నం గూళా యొంటి నుండు ♦ నన్ నృపతిలకుల్
చెంగట లేమిని జోరుని,భంగియ గా కిదియు శూరు♦పద్ధతి యటరా? ౫౬౫

కం. పులులపసి సోఁక శునకము, నిలువంగా లేనియట్లు ♦ నిలువం గలవే
కలన రఘూత్తంసులముం,గల విక్రమహీన నీవు ♦ కల్మషచిత్తా! ౫౬౬

చం. అలవి యెఱుంగ నేరక మ♦హాత్ములతోఁ బగ గొంటి, వీవు దు
ర్బలుఁడవు వారలం జెనయ ♦ వచ్చునె నీ కని? దోర్యుగోగ్రు నా
బలదనుజారి నొంటిచెయి♦వాఁ డగువృత్రుఁడు పోరఁ దాఁకిన
ట్టుల విను నీవు ద్రుంగెదు ప♦టుప్రదరాహతి వారిఁ దాఁకినన్. ౫౬౭

చం. అనుజసమేతుఁ డై యిటకు ♦ నాత్మవిభుం డరుదెంచి వేగ పే
ర్చినకినుకన్ వధించు నిను ♦ గ్రీష్మవిభాకరుఁ డల్పతోయమున్
దనకిరణాళిఁ బీల్చుగతి ♦ దాఁగిన యక్షపపర్వతంబునన్
వననిధినాథుపీటను ధ్రు♦వంబుగ వృక్షముఁ బిడ్డురీతిగన్. ౫౬౮

## రావణుఁడు సీతాదేవిని బెదరించుట.

కం. అని పరుసంబుగఁ బల్కిన,వనజాయతనేత్ర సీత♦వచనంబులు దా
విని పంక్తికంఠుఁ డనియెన్, వినరానికఠోరవాక్య♦విస్తర మొలయన్. ౫౬౯

కం. ఎంతెంతగ బతిమాలునొ, యంతంత వశుండు పురుషుఁ ♦ డగు సతులకుఁ దా
నెంతెంత ప్రియము లాడునొ, యంతం తవమాన మొందు ♦ నతఁ డలివలచేన్.

కం. కాపథములఁ జనుహయముల, నేపున రథచోదకుండు ♦ నిలిపెడిరీతిన్
నీపలుకుల రేఁగిననా,కోపము నార్చెడిని గామ♦గుణ మోచెలువా! ౫౭౦

చం. వెలఁదిరో! యాత్రకామమును ♦ విఘ్న మొనర్చెడునట్టివారి దం
డ్యుల నొనరింప నెట్లు తగి♦యుండియుఁ దద్విషయంబునన్ దయన్
జెలిమిని జూపు చుంద్రు గద ♦ చెల్వరో! యట్టులె కల్ల తాపసిన్
వలచెడి నీవు వధ్య వయి♦నన్ బరిభావ్యవునైన నోర్చితిన్. ౫౭౧

కం. నీ వాడినపరుషోక్తుల, కే వధ కీ వర్షూరాల ♦ విప్పుడ యని కో
పావేశభరంబున నా, దేవారివిభుండు పలుకు ♦ దివిజస్తుతకున్. ౫౬౩

మ. వినవే జానకి! యింక రెండునెలలే ♦ విశ్వాసపూర్వంబుగాఁ
గను నే వేచెద, నంతయే గడువు, నెం♦క్కం జూడు మాలోపలన్
ఘనవేణీమణి! నాదుశయ్య నతి వై ♦ కాదేని రెణ్ణెల్లపై
నిను వంటింటను గోసి వండుదురు విం♦టే ప్రాతరాశార్థమై. ౫౬౪

కం. అని యిట్లు రాక్షసేంద్రుఁడు, జనకతనూజాత మిగుల ♦ సాధ్వసపఱుపన్
గని నిర్జరగంధర్వాం, గనలు తపించిరి వెతన్ వి♦కారేక్షణ లై. ౫౬౫

కం. వెఱపెట్టి కఱకు లాడెడు, కఱటిం గని సీత వగవఁ ♦ గనుసన్నల వా
తెఱలన్ మోములఁ గొందఱు, తెఱగంటినెలంత లామె ♦ ధృతిఁ దేర్పంగన్.

సీతాదేవి రావణునిఁ బరుషంబులు పలుకుట.

తే. వారిసన్నల ధృతిఁ గూరి ♦ వారిజాక్షి, నిబ్బరంబుగ వృత్తశౌం♦డీర్యగర్వ
వశమునను నాత్మహితమెంచి ♦ భావవీథి, నిట్టు లను వానితో దిగు ♦ లింత లేక.

ఉ. నిక్కము రోరి దుష్టమతి! ♦ నీదుశుభం బిటఁ గోరువారు లే
రొక్కరుఁ, గల్గి రేని యిటు ♦ లొప్పనికార్యము నీవు చేయఁగా
నొక్కి వచింప కుందురె ఘ♦నుల్ సరి గాదుర సూను మంచు, నీ
యొక్కనితోడఁ బోవ దిటు ♦ లొప్పరికించుట వారు రాక్షసా! ౫౬౭

ఉ. ఆలను నేను రామునకు ♦ నాహరికిన్ శచివోలె నన్నునో
బాలిశ నీవు దక్కఁగఁ బ్ర♦పంచమునం దెవఁ డైనఁ గోరునా
బాళిని జిత్తమం దయినఁ, ♦ బల్కితి వెన్నొదురుక్తు లాయఘం
బేలర నిన్నుఁ బాయుఁ? జని♦ తేనియు నెక్కడ కైనఁ ద్రెళ్ళనున్. ౫౬౮

ఉ. మత్తమతంగజంబుఁ గొఱ ♦ మాలిననీచశశంబు దాఁకఁగా
నెత్తినయట్లు నాదువిభు ♦ నీ వెదిరింపఁగఁ గోరు టెల్ల, నీ
జిత్తుల రాము దవ్వు చనఁ♦ జేసియు దొంగిలి తెచ్చి నన్ను నీ
చిత్తమునం దొకింతయును ♦ సిగ్గు వహింప వ దెట్టిమానివో. ౫౭౦

కం. లవమాత్ర మేనియును నా, ధవుకంటం బడిన నీవు ♦ తత్సమయమునన్
బవరంబున నానృపులా, ఘవసత్త్వము లపుడె నీకుఁ ♦ గనఁబడి యుండున్. ౫౭౧

కం. ఏలోకొ ననుఁ దమిఁ గను నా, భీలవిరూపములుఁ గ్రుష్ట♦పింగళములు నా
నీలోచనములు రెండును, నేలం బడ వవిసి యిపుడ ♦ నిష్ఠురశీలా. ౫౭౨

కం. దశరథుకోడల నగుచున్, విశదయశుం డైనరామ♦విభునకు సతి నై
యశముం గను ననుఁ బల్కిన, దశవదనా నీదునాల్క ♦ దగఁ జీలదుగా. ౫౭౩

ఉ. నేన దశాస్యు నిన్నిపుడ ♦ నీఱుగఁ జేయనె! నాదువల్లభుం
డానతి యీమి నట్టిపని ♦ కై, తప మెల్లను బొల్లుపోవఁగా
మానస మొప్ప కుండుటను ♦ మానితిఁ గాక, హరింపఁ జాలుదే
దానవ నన్ను? నిన్నెడపు ♦ తత్పరతన్ విధి యిట్లు చేసెడిన్. ౫౮౪

కం. శూరుఁడ వైవితతబలో, దారుఁడ వై యైలబిలుని[1] ♦ తమ్ముఁడ వై పెం
పారియు వంచనమెయిఁ బర, దారస్తేయంబు నీకుఁ ♦ దగునే యనుడున్. ౫౮౫

↔ రావణుఁడు సీతాదేవిపై నాగ్రహపడుట. ↔

కం. జానకివచనంబులను ద, శాననుఁ డాలించి క్రూర ♦ మగునయనంబుల్
దా నట్టె నిచ్చి త్రిప్పుచు, మానవతీమణిని గినుక ♦ మండుచుఁ జూచెన్. ౫౮౬

సీ. కాలజీమూతసం ♦ కాశుఁ డున్నతమహా, భుజశిరోధరుఁడును ♦ భూరిసింహ
గతిసత్త్వుఁడును దీప్త ♦ తతజిహ్వికాగ్రలో, చనుఁడు మాల్యనులే ♦ పనుఁడు మఱియుఁ
జలితాగ్రమకుటుండు ♦ స్వర్ణాంగదధరుండు, రక్తమాల్యాంబర ♦ సక్తతనుఁడు
నవ్యసుధోత్పాద ♦ నద్ధాహిమందర, మన నల్ల మొలత్రాట ♦ నమరువాఁడు
తే. పర్వతమునకు నుద్దియై ♦ పరఁగువాఁడు? పీనభుజయుగ్మమున శృంగ ♦ విహిత మైన
మందరధరాధరమునకు ♦ మాద్రివాఁడు, రావణుండు త్రిలోకవి ♦ ద్రావణుండు.
తే. రక్తపల్లవవరపుష్ప ♦ రాజిచేత, నతులితాశోకములచేత ♦ నద్రివోలె
నవదివాకరవర్ణకుం ♦ డలయుగంబు, కలిమిఁ దనరారు మునిమనః ♦ కంటకుండు. ౫౮౭

కం. చందనలిప్తశరీరుఁడు, సుందరత వసంతుఁడగుచు ♦ సురుచిరభూషా
బృంద యుతుం డయి మసనము[2], నందలిమండపమునా భ ♦ యంకరుఁడగుచున్.

కం. రాఁజెడికోపహుతాశను, చేఁ జక్షులు జాజువాఱి ♦ చెడుగోపమునన్
రోఁజుచు నాశీవిష మనఁ, దాఁ జటులత సీతతోడ ♦ దశముఖుఁ డనియెన్. ౫౯౦

ఉ. ఓగుణహీనురాల! నను ♦ నొల్లక నీతివిహీను నిర్ధనున్
బా గని నాశ్రయించె దటె ♦ పంకజమిత్త్రుఁడు సంధ్యఁ ద్రుంచు నా
లాగున నిన్ను నిప్పుడ చ ♦ లంబున రూపఱఁ జేయువాఁడ, నీ
యాగడ మెల్ల నాయెదుట ♦ నా! నను రావణు నీ వెఱుంగవా. ౫౯౧

సీ. అని పల్కి యచ్చటి ♦ యసురకాంతల నేక, కర్ణ నేకాక్షి గో ♦ కర్ణి హస్త
కర్ణిని మఱి లంబ ♦ కర్ణి నకర్ణిక, హస్తిపాది నపాది ♦ నశ్వపాది
పాదచూళికను గో ♦ పాదిని బృథుపాది, నేకపాదిని విపు ♦ లైకనేత్ర
బెద్దతలలవారిఁ ♦ బెద్దమెడలవారిఁ, బెద్దపొట్టలవారిఁ ♦ బెద్దచనుల
తే. వారి నతిమాత్రనేత్రల ♦ బాఢదీర్ఘ, జిహ్వికనజిహ్వికను మఱి ♦ సింహముఖిని
సూకరీముఖి గోముఖిఁ ♦ జూచియనియె, వినుఁడు నాయాజ్ఞ మీరలు ♦ వనితలార.

---

[1] ఐలబిలుఁడు = కుబేరుఁడు. [2] మసనము = శ్మశానము.

ఉ. మీరలు గుంపు గూడుచు స♦మేలపుమాటల రామపత్నినీ
వారిజలోచనన్ వినయ♦వాక్కులనో నుతి సామదానభే
దేరలనో[1] భయంబుననొ ♦ యేగతినేఁ బ్రతిలోమలోమగీ
ద్వారములన్ మదీయవశ♦వర్తిని వైళము చేయుఁ డెల్లరున్. ౫౯౩

కం. అని యానతి యిడి రాక్షస, వనితలకున్ మరల మరల ♦ వైదేహిని దాఁ
గనుఁగొని గర్జనములఁ ద, ర్జన మొనరుప నడ్డ మగుచు ♦ రాక్షసపతికిన్ ౫౯౪

←— ధాన్యమాలిని రావణున కడ్డము వచ్చుట. —→

తే. ధాన్యమాలిని రాక్షస♦తరుణి యతనిఁ
గౌఁగిటను గ్రుచ్చి యను ఱేడ! ♦ త్ఝాజ యేల?
యీనకియమానవి[2] వివర్ణ ♦ యేమనకిఁ మ
హాకృపణ[3] రమియింపు నా♦యందు నీవు. ౫౯౫

కం. నిక్కమిది బ్రహ్మదేవుం, డిక్కమలాక్షికిని నొసటి♦యెడ వ్రాయఁడు నీ
దిక్కులను గెలిచి తెచ్చిన, యక్కజపుంధనములెల్ల ♦ ననుభోగింపన్. ౫౯౬

కం. కామంబు లేనికామినిఁ, గామించినయంతఁ బురుషు♦కాయంబు చెడున్
గామించుచున్న కామినిఁ, గామించినఁ బరమసుఖము ♦ గలుగును నాథా. ౫౯౭

కం. అని చెప్పుచు నారక్కసి, దనుజేశ్వరుని న్సరల్ప ♦ దశవదనుఁడు దాఁ
జని నవ్వికొనుచుఁ జొచ్చెను, దనమందిరమున్ సువర్ణ♦ధామోజ్జ్వలమున్. ౫౯౮

తే. దేవగంధర్వపన్నగ♦దేవతారి,కన్యకలు చుట్టుఁ గొలువంగఁ ♦ గదలి పోయె
నట్లు సీతను దర్శించి ♦ యనుచితగతిఁ, బంక్తివదనుండు మదనసం♦భ్రాంతుఁ డగుచు.

←— రాక్షసస్త్రీలు సీతాదేవికి బోధించుట. —→

కం. ఆనతి యిడి యరిగినన, ద్దానవసతు లంతఁ గ్రోధ♦తామ్రాక్షుల నా
జానకిని డాసి పలికిరి, నానావిధపరుషభాష♦ణంబుల నిట్టుల్. ౬౦౦

కం. బేలా! రావణుఁ బతిఁగా, నేలా కైకొనవు? వాని ♦ నేమిగఁ గని తా
పౌలస్త్యుని దశకంఠునిఁ, ద్రైలోక్యవరిష్ఠు నిహత♦దర్పితవైరిన్? ౬౦౧

సీ. అంతట నేకజ♦టాఖ్య యి ట్లను సీత!, రావణుం డనఁగ నీ♦భావమునను
గొలఁదిగాఁ జూచెదే? ♦ యలప్రజాపతు లారువు, రందుఁ జతుర్థుఁ డ♦బ్జాసనునకు
మానసపుత్త్రుండు ♦ మహితయశస్వి పు,లస్త్యుండు వానిత♦లంపునందుఁ
గలిగె విశ్రవుఁ డను♦కంజజతుల్యుండు, వానిపుత్త్రుఁడు గదే ♦ వారిజాక్షి!

తే. రావణుం డభియాతివి♦రావణుండు
తాన బతిమాలుకొన నీకుఁ ♦ దగునె బిగువు?

---

[1] భేదేరలు = భేదవాక్యములు, [2] ఈసకియ + మానవి. ఈసకి + యమానవి.
[3] మహా + కృపణ. మహా + అకృపణ.

మక్కువ యొనర్చుకొలఁదిని ♦ నిక్కపడెదు
నమ్మవా నాదుమాట నో♦యమ్మలాఁడి! ౯౦౨

సీ. ఆవల హరిజట ♦ యను పెనురక్కసి, తనపిల్లికన్నులు ♦ దద్ద విచ్చి
గిరగిర మని త్రిప్పి ♦ కినుక మై నిట్లను, ముప్పదికోటులు ♦ మూఁడుకోట్లు
నిర్జరులను గెల్చె ♦ నిర్జరనాథునిఁ, జెఱఁబెట్టె నట్టిపె♦జ్జెట్టి నీకుఁ
దగినవరుం డగు ♦ మగువ! వరింపుము, పంక్తికంఠుని నన ♦ బ్రఘస యనియెఁ

తే. క్రోధమూర్ఛిత యగుచును ♦ ఘోరఫణితిఁ
దనదుప్రియభార్య రూపసి ♦ ధన్యురాలి
విడిచి నినుఁ గోరుశూరుని ♦ వీరవరుని
బలియు సతి వౌట కింత ని♦ర్బంధ మేల? ౯౦౩

కం. కాంతాసహస్రకలితని, తాంతవిభాబహుళమణివి♦తానాంచిత మా
నంతఃపురమును బో నిడి, కాంతా! నీతోడఁ గూడఁ♦గలఁ డాతండున్. ౯౦౪

సీ. వికట యి ట్లనియెను ♦ నికటంబునను జేరి, యమరులతో యుద్ధ ♦ మాడువేళ
నెన్ని మాఱులో గెల్చె ♦ హేలమై నాగగంధర్వయక్షోరగ♦దానవులను
నట్టిమహాత్ముండు ♦ పెట్టి నీపై మతి, యాసింప నిర్భాగ్య♦రాల యేల
యతనియిల్లాల వై ♦ హర్షింప నొల్లవు? నాఁగ దుర్ముఖి యెల♦నాఁగ కనియె

ఆ. నెవనిఁ దలఁచి సూర్యుఁ ♦ డెండలుగాయండు, వెఱచు గాలి వీవ ♦ వృక్షతతులు
పూలవాన రాల్చు ♦ బోలుపుగా మబ్బులు, పరమభీతిఁ గురియు♦వలయునపుడు.

ఆ. అట్టిరాజరాజు ♦ నమరారిఁ బతిఁ గాఁగఁ, గొనుము నాదుమాట♦వినుము శుభముఁ
గనుము సౌఖ్యముగను ♦ మనుము మా రావణు, జాయ వగుట కింత♦సందియంబ?

## రాక్షసస్త్రీలు సీతాదేవిని బెదరించుట.

సీ. మఱియు నందఱుఁ జేరి ♦ మైథిలిఁ గనుఁగొని, తర్జించి రిటు క్రూర♦గర్జనముల
నది యేల యొల్లవే ♦ యఖిలభూతమనోహ,రం బైనశుద్ధాంత♦రంగసీమఁ
బఱపులమీఁదను ♦ బన్నుండ? నోచెలి! మానుషి వగుటను ♦ మనుజునకును
నిల్లాల వగుటయే ♦ హెచ్చుగఁ జూచెద, విఁక నేటి రాముఁడే? ♦ యేల యతని

తే. మీఁద మన సుంచి మిడికెదు?♦ మెలఁత! యింకఁ, గల్ల నీ వెటు రామునిఁ♦ గనుటగాన
రాక్షసేశ్వరుఁ డైనట్టి♦రావణుండు, నీకుఁ దగువాఁడు భర్తగా ♦ నెమ్మిఁ గొనుము.

ఉ. మానుషి వౌట రాముఁ గొఱ♦మాలినమానుషు రాజ్యహీనునిన్
దీను దరిద్రు దుర్బలుని ♦ దేవి! మనోహరుఁగాఁ దలంచె, దీ
మానవభోక్త లోకచయ♦మానితసర్వపదార్థభోక్త యా
దానవభర్త భర్తగ య♦థాసుఖముం జరియింప రాదటే? ౯౦౫

కం. అనుచును దను ననురాంగన, లన విని కనుఁగవలఁ గాఱు♦నశ్రులు గొనగో
టను మీటుచు జలజేక్షణ, యను నారాకాసిమూఁక ♦ నల్లనఁ గనుచున్. ౬౦౯

↞ సీతాదేవి రాక్షసస్త్రీలకుఁ దనమనోనిశ్చయముఁ దెలుపుట. ↠

ఉ. రాక్షసకాంతలార! విన♦రా? జను లెవ్వరు మెచ్చ రీనుడుల్
రూక్షతరాఘకారణము♦లుం జుఁడి మీ కివి, మర్త్యకాంతయుః
రాక్షసు నాలు గాఁగలదె? ♦ క్రచ్చఱ మీకిది యిష్టమేని నః
భక్షణసేయుఁ డీచెనఁటి♦పల్కులు నాచెవిఁ గ్రుచ్చ కుండుఁడీ. ౬౧౦

కం. దీనుండో వర రాజ్యవి,హీనుండో నెవ్వఁ డైన ♦ హృదయేశ్వరుఁడే
మానితుఁ డగు నా కెప్పుడు, భానుండు సువర్చల కగు♦పగిదిం జగతిన్. ౬౧౧

సీ. బలనిషూదనునకుఁ ♦ బౌలోమియట్టులు, దమి వసిష్ఠున కరుం♦ధతినిబోలి
నీహారకరునకు ♦ రోహిణిరీతిని, జ్యవనర్షికి సుకన్య♦చందమునను
సత్యవంతునకును ♦ సావిత్రి మాడ్కిని, క్షితిఁ గపిలునకు శ్రీ♦మతివిధమునఁ
బ్రథ నగస్త్యునకు లో♦పాముద్ర చాడ్పున, సగరునకును గేశి♦నిగతిగాఁగ

తే. నల్లసౌదాసునకు మద♦యంతికరణి, నలునకును దమయంతియుం♦దంబు వెలయ
రఘుకులాధీశ్వరుం డైన♦రామచంద్ర,విభున కే నాతని భజించి ♦ వెలయుదాన.

కం. జానకి యిటు పల్కిన విని, దానవకులనాథచోది♦తలు రాకాసుల్
దీనాత్మను గర్కశవా,చానిష్ఠురబాణనిహతఁ ♦ జలిపిరి మిగులన్. ౬౧౩

కం. కదలక మెదలక తెలివక, పెదవులు నాశింశుపాఖ్య♦వృక్షస్థితుఁ డై
బెదరించు చుండ రాక్షస,సుదతులు జానకిని వాయు♦సూనుఁడు వినియెన్. ౬౧౪

↞ రాక్షసస్త్రీలు సీతాదేవిని గఱకు లాడుట. ↠

కం. అంతట సందఱురాక్షస,కాంతలు చుట్టుకొని రాము♦కామిని భీత
స్వాంతమున వణఁకఁ గోపా,క్రాంతత ని ట్లనిరి వాతె♦రల్ చలియింపన్. ౬౧౫

కం. గొడ్డండ్లఁ ద్రిప్పుచును వఱ,గొడ్డంబులు పలుకుచుం బ్ర♦కోపంబునఁ బై
పడ్డగతి నీ వటే మా, యొడ్డెదు నీవేల యొల్ల♦వో రావణునిన్. ౬౧౬

కం. అను డాబిభీషికోక్తుల, విని జానకి శోక బాష్ప♦వృష్టి కురియఁగాఁ
జనె నల్లశింశుపాద్రుమ,మునచాటునకుః భయంబు ♦ ముంచుకొనంగన్. ౬౧౭

ఆ. బొజ్జ వ్రేలుపొట్ట ♦ యెఱ్ఱనికన్నులు, బుఱ్ఱముక్కు గలిగి ♦ చిఱ్ఱు చిఱ్ఱు
లాడుకొనుచు వచ్చి ♦ యాడె జానకితోడ, వినత యనెడునొక్క♦వికటరూప.

కం. పతిపై నెయ్యము మేల్మేల్, సతి! కనఁబఱిచితివి నీవు ♦ చక్కఁగ నైనః
మితి మీఱిన నెది యేనియు, నతివా! కీడునకు మూల ♦ మగు నన వినవే? ౬౧౯

సీ. మనుజాంగనకుఁ దగు♦మగనాలితనమును, మెలఁత చెప్పితి లెస్స ♦ మెచ్చు వచ్చె
నయిన నాచెప్పెడి♦యత్యంతపథ్య మౌ,మాటలఁ జెవి నిడు ♦ మందయాన
సురనాయకుం డైన♦హరిహయునట్టులు, వరవిక్రముఁడు రూప♦వంతుఁ డైన
నిఖిలరాక్షసభర్త ♦ నీప్రియభర్తగాఁ, గొనుము నామాటను ♦ వినియుఁ జూడు

తే. మిాగి గలవాఁడు కలవాఁడు ♦ భోగపరుఁడు
దక్షిణుండు జనప్రియ♦దర్శనుండు
రావణుఁడు నీకుఁ దగినట్టి♦ప్రాణవిభుఁడు
కృపణుఁ డగురామునకు నేల ♦ యేడ్చె దిట్లు? ౬౨౦

ఉ. ఘు మ్మనునంగరాగములు ♦ కాంచనరత్నసమంచితంబు లౌ
సొమ్ములు లెస్స మైఁ దొడిగి ♦ సుందరి! యీత్రుటినుండి యెల్లలో
కముల నేలుమిా, విబుధ♦కాంతునకుఁ శచి, స్వాహ యగ్నికిన్
సమ్మతి నిష్టురాం డ్రయిన♦చాడ్పున నీ నగుమిా సురాంగికిన్. ౬౨౧

ఉ. ఏటికి రాముఁ గట్టుకొని ♦ యేడ్చెద వాకృపణుఁ గతాయుషుఁ
గూటికి లేనివాని మదిఁ ♦ గూర్చెదు, విన్ను మదీయవాక్యముల్
పాటిగ నెంచి మాపనుచు♦భంగ నొనర్పక మాఱు పల్కని
న్నాటికి గండకండగను ♦ గోసి భుజింతుము వ్యంజనంబుగన్. ౬౨౨

తే. అంతటను వ్రేలుచన్నుల♦యసుర పేర, వికట వికటాట్టహాసంబు ♦ ప్రకటితముగ
ముష్టి పై కెత్తి చూపుచు ♦ ముగ్ధసీత,ప్రక్కఁ గనుఁగొని యిట్లనుఁ♦బరుషభంగి.

ఉ. ఓసి దురాత్మురాల! కఠి♦నోక్తులు పెక్కులు పల్క రాక్షసా
గ్రేసరు నయ్యొ పాప మని ♦ కేవలమున్ మృదుకాయ వౌటచే
రోసము మాని పెందయను ♦ గ్రూరత నిన్ను వధింపఁ డాతఁ డో
క్ష్మాసుత! కాలయోగ్య మగు♦మాపలుకుల్ గణియింప నైతిగా. ౬౨౪

ఉ. ఏరికిఁ దేఱి చూడఁగ న్మృ♦గేక్షణ! శక్యము గానియీాయకూ
పారముతీరమం దసుర♦వల్లభునంతిపురంబులోన దు
ర్వారత మేము గావ దృఢ♦పంజరమందలిచిల్కయట్టు లై
చేరితి వల్లయింద్రుఁడును ♦ జేరఁగ నేర్చునె నిన్నుఁ గావఁగన్. ౬౨౫

చం. వలవనిమాట లాడ, హిత♦వాదిని నేను, మదీయవాక్యముల్
చెలువరో వీనులం జొనుపు ♦ చెక్కులఁ గన్నులనీరు గాఱఁగా
వలవల యేల యేడ్చెద, వ♦వశ్యము శోక మనర్థకంబె కా
వెలఁది! దశాస్యుతోడఁ గడు♦వేడుకలన్ విహరింపు మ్మిలిన్. ౬౨౬

ఉ. ప్రాయము శాశ్వతం బటవె ♦ భామల, కియ్యది నీ వెఱుంగవా,
తోయజనేత్ర! జవ్వనము ♦ దూలక మున్న నితాంతకాంతసౌ
ఖ్యాయతి నొందఁ జూడుము వ♦నాంతరవీథులఁ గేళికాద్రులన్
జే యని భోగముల్ గుడువఁ ♦ జేఁ దలె యాయమరారినేతతోన్. ౬౨౬

కం. సుందరి! బృందారకవర,బృందారకు భర్తగాఁగ ♦ నేలిన నిన్నుం
గ్రందుగ సప్తసహస్రము, లిందీవరలోచనాళు ♦ లెలమి భజించున్. ౬౨౭

కం. సమ్మతి గొన కీమాటా,కమ్ముఁ దిరస్కృతి యొనర్పఁ♦గాఁ జూచిన నీ
ఱొమ్ముఁ బగిల్చియు వెస న,స్రమ్మును గ్రోలెదము వింత♦చవు లూరంగన్. ౬౨౮

కం. చండోదరి యనురక్కసి, చండతరక్రోధమునను ♦ సాధ్వసకర మౌ
దండిత్రిశూలముఁ ద్రిప్పుచు, గండున ని ట్లనియె జనక♦కన్యామణికిన్. ౬౩౦

కం. త్రాసోత్కంపితపయోధర, నీసుందరి భీతవన్య♦మృగనేత్ర స్వరా
వాసారివ్యాతను జూడఁగ, వాసిగ నానోర నీళ్లు ♦ వారక యూరెన్. ౬౩౧

తే. ఎప్పుడో కదె సీత య♦కృత్తుప్లీహ, మెదడు గల్గినయుత్పీడ ♦ మిష్టముగను
జప్పరించుచు బంధన ♦ మొప్పమీఱ, మెదడు నరములు తనివార♦మెసవుటాదవు.

ఉ. అంతట నిట్లు పల్కుఁ బ్రఘు♦సాఖ్య యి దేటికె యింతరచ్చ? యీ
కాంతగళంబును న్నులిమి ♦ గ్రక్కున నల్లమనుష్యకాంత దా
నంతము నొందె నంచును ద♦శాననుతోఁ జని చెప్ప జేఁడు ని
శ్చింతతఁ దిందు పొం డనును ♦ సిద్ధము దీనికి నాల మేటికిన్. ౬౩౩

చం. గల గల వాదు లాడుటయె ♦ కార్యముచొప్పుఁ దలంప రెవ్వరున్
బలుకులతోడ నేమిపని ♦ భామినినంజుడు నెల్లవారమున్
వలనుగఁ బంచుకోఁ దగును ♦ వారుణి నంజుకొనంగ నూరుఁగా
యలు గొని రండు మీ దగుర♦యంబును జాతము గాక యియ్యెడన్. ౬౩౪

కం. అనుచు నజాముఖి పలికిన, విని శూర్పణఖాసమాఖ్య ♦ వినిచె యథార్థం
బనియె నజాముఖి కల్లును, గొని రండీ యదియ యన్ని♦కొదవలు దీర్చున్. ౬౩౫

కం. మానుషమాంసంబును స,మ్మాననముగ నంజికొనుచు ♦ మఱి సురలోనన్
జానుగ నికుంభిలను గే,ళీనిరతిం దేల వచ్చు ♦ లీలం బాళిన్. ౬౩౬

కం. ఈరీతి నసురకాంతలు, దారుణముగ బెడిదములను ♦ దర్జించిన నా
శ్రీరాముదేవి విని వెఱ, హా రామా! యనుచు నేడ్చె ♦ నంగిలియెండన్. ౬౩౭

## రాక్షసస్త్రీలమాటలకు భయపడి సీతాదేవి యేడ్చుట.

ఉ. అండజయాన యట్లు బహు♦శార్తి శ్రమంపడు చాసురాంగనా
దంషములోడ నిట్టు లనుఁ ♦ దథ్యము మీపలు కాదరింప, నన్

దిందు యథేష్టవృత్తి, నగు♦నే యనురాధము లేఁడ? మర్త్యవే
తండనుయాన లేఁడ? గల♦దా విపరీతపుఁబొత్తు ధాత్రిలోన్? ౬౩౮

కం. అని రాకాసులలో మహి,తనయామణి చిక్కి వణఁకుఁ♦ దనలోఁ గ్రుంగున్
వని మందనుండి చెదరినఁ, బెనుఁదోడెలు పట్టుకొన్న♦ విడి హరిణి యనన్. ౬౩౯

తే. ఇంబు జాఱఁగఁ బుష్పక♦దంబభార, లంబమానసుశాఖికా♦లంబ యగుచుఁ
గంబుకంధర తనదుమ♦నంబునందు, నంబుజాక్షుని బతిని దుః♦ఖంబు గదుర ౬౪౦

కం. కనుదోయినీటివాఁకను, జనుదోయిని దడుపుకొనుచు♦ సర్గియించుచు లో
దనుజాంగనలకు వెఱచుచు, ఘనవాతోచ్చలితకదళి♦కరణిన్ వణఁకెన్. ౬౪౧

చం. గడగడ లాడునాకలువ♦కంటి విశాలము దీర్ఘ మైనపెన్
జడ యిటు నట్టుఁ బొర్లుచు మ♦నంబునకుం దలఁపించె సర్పమున్;
బడఁతుక రామ! లక్ష్మణ! కృ♦పారత! యత్తరో కోసలాత్మజా!
చెడితిని హా సుమిత్ర! కృప♦ సేయరుగా యొక రైన నాదెసన్. ౬౪౨

ఉ. తాలిమి వీడ, రాక్షసుల♦తర్జనముల్ గడుగోడు గూర్ప, నా
యేలినవానిఁ బాసి త్రుటి♦యేనియు జీవముతోడ నుండుటన్
గాలముకానికాలమునఁ♦ గల్గదు మృత్యువు పూరుషాళికిన్
గోలల కన్నసూరిపలు♦కుల్ కడునిక్కము వో తలంపఁగన్. ౬౪౩

కం. కొఱనోము నోఁచి పున్నెము, గఱగొఱ యగునేను సుడియు♦గాలికి జలధిన్
జిఱ జిఱను దిరిగి మునిఁగెడి, విఱిసినకల మనఁగఁ జెడుదు♦ విభురహితవలెన్. ౬౪౪

ఉ. ఆరఘురాముఁ బ్రాణవిభు♦ నాదట నేఁ గనుగొంట లేకయున్
గ్రూరపలాశినీవశమ్ముఁ♦ గూరి మహావ్యథ స్రుక్కఁ గంటి, దు
ర్వారరయోద్ధతం బయిన♦వాహినిచేతను నుర్లువాహినీ
తీరమునట్టు లే మనుచుఁ♦ దేఁకువ నుండుదు జీవయుక్త నై. ౬౪౫

కం. మాన్యునిఁ గృతజ్ఞు నుతసా,జన్యునిఁ గమలాక్షు సింహ♦సమగతిఁ గృతిమూ
ర్ధన్యుని నాప్రాణవిభున్, ధన్యులువోఁ గన్నులార♦ దర్శించుజనుల్. ౬౪౬

కం. వసనాభిఁ దినినవానికి, నసువులు మెయి నిలువనట్టు♦ లమరసనాభున్
వసుధాపతి నెడఁబాసిన, వసమే నామేనఁ బ్రాణ♦వాయువు లుండన్. ౬౪౭

కం. కటకట యింతగ వెతచే, నటమటపడఁ బూర్వజన్మ♦మందును నేనే
పటుపాపముఁ జేసితినో, కుటిలాత్మిక నగుచు నదియ♦ కూర్చెడిఁ గీడుల్. ౬౪౮

కం. ఇక్కరణిని బెనుమోఱకు, రక్కస లొక్కటను మూఁగి♦ రక్షింపంగా
నెక్కడి రాముఁడు నా కిట, దిక్కేదీ చూడ మృత్యు♦దేవత దక్కన్. ౬౪౯

కం. ఛీ మనుజ జన్మ మేటికి, ఛీ మఱి పరవశ్య మైన ♦ చెనఁటిబ్రతుకు నే
లా? మదిఁ దలంచినప్పుడ, యే మరణముఁ బొంద రామి ♦ యేర్పడెఁ గంటే.

## సీతాదేవి శ్రీరామునిఁ దలంచుకొని దుఃఖించుట.

ఉ. వెండియు నిట్లు లేడ్చుఁ బృథి♦వీసుత యానతవక్త్రపద్మ యై
దండిగ బాష్ప వారి ముఖ♦తామరసంబున నావరింప గో
త్రం దొరలాడుగోడిగవి♦ధంబున నొప్పుచుఁ బిచ్చి యెత్తి న
ట్లుండి ప్రమత్తరీతిఁ దన♦యుల్లము భ్రాంతి మునింగినట్లుగన్. ౬౫౧

సీ. రాముఁ డేమఱి యుండ ♦ కాముకూపాశరుం, డేడ్చు చుండఁగ నన్ను♦నీడ్చి తెచ్చె
నీరక్కసుల చేతి ♦ కిటు చిక్కి వారలు, తర్జింప నెబ్భంగిఁ ♦ దనువుఁ దాల్తుఁ
బ్రాణంబు లేటికి ♦ నర్థంబు లేటికి, భూషణంబు లవేల ♦ సౌఖ్య వేళ
రామచంద్రునిఁ బాసి ♦ రాక్షసీమధ్యంబు,నఁ బందు చుండఁగ ♦ నాదుగుండె
తే. యినుపచిట్టెము గాక నా♦హృదయమునకు
ముదిమియును జావు లే వొకో ♦ సదమదంబ
నయ్యె దుఃఖంబుచే నది ♦ యవిసి పడదు
కటకటా నాదుదౌర్భాగ్య♦గరిమ నేమొ ౬౫౨

తే. పాపజీవిత నయి రామ♦భద్రుఁ బాసి, యొడలఁ బ్రాణంబులను నిల్పి♦యున్నదాన
ఛీ యనార్యను నసతిని ♦ శీలహీన, నేమిబ్రదు కిది తలఁప నా♦దేమివ్రతము. ౬౫౩

మ. తిననీ పీరలు నాశరీరమును బ్రీ♦తిం, దీర ఖండింపనీ
మనఁజాలం జతురర్ణవీవలయిత♦క్ష్మాభర్త నాభర్తఁ బా
సి నితాంతంబు దురంత మైనవ్యథ గా♦సిం బొందు చే నిట్టిరీ
తిని సౌఖ్యంబులు గోరుదానన? కడుం♦దీపో కదే ప్రాణముల్. ౬౫౪

ఆ. ఎడమకాలిగోర ♦ నేనియు రావణుఁ
దాఁకుదానఁ గాను ♦ దథ్య మింత
యతని వలతు ననుట ♦ యది యేటిమాట యి
స్సీ యెఱుంగఁ డతఁడు ♦ చెనఁటి యగుట. ౬౫౫

ఉ. తిట్టి తిరస్కరించిన మ♦దిం దెలియండు, తలంపఁ డేడు దాఁ
బుట్టినవంశముం బరువుఁ♦బోణిమియుం, దనుఁ దా నెఱుంగఁ డా
కట్టిఁడి, నన్ను వేఁడెడిని ♦ క్రౌర్యరతుం డయి, యేమి చేయుఁ దగ
గట్టి యముండు పాశముల ♦ గట్టిగ నీడ్వఁగఁ జావనున్నడన్. ౬౫౬

## సీతాదేవి రాక్షసస్త్రీలకుఁ బరుషంబుగఁ బ్రత్యుత్తర మిచ్చుట.

కం. కోయుఁడు కడికండలుగా, వ్రేయుఁడు కత్తులను రోష♦వివశత నన్నున్
ద్రోయుఁడు మండెడుమంటల, మీయుక్తుల విన ని కేల ♦ మిడిసిపడంగన్. ౬౫౭

సీ. తనవారిపట్లను ♦ బెనుదోస ముండిన, గుణము మాత్రముఁ గను♦గుణధనుండు
ఇంచుక యుపకార ♦ మెవఁడు చేసిన దాని, విస్మృతి నొందని♦విజ్ఞతముఁడు
తన్ను నమ్మినవాని♦ఖిన్నతకై తాను, విరవిర లాడెడి♦కరుణగలఁడు
అన్యులయభివృద్ధి ♦ నాత్మఁ గోరుచు నుండు, నిర్మలచిత్తుండు ♦ నిపుణతముఁడు
తే. పదియునాలుగువేల దు♦ర్మదులఁ ద్రుంచె, దానవుల నెక్కటిగ జన♦స్థానమునను
నట్టినాప్రాణభర్త దా♦నిట్టుకరుణ, మాలుటయు నాదుదౌర్భాగ్య♦మహిమ నేమొ.

సీ. నన్నిట్టు లరికట్టు♦నిన్నీచబలుఁ ద్రుంపఁ, జాలియు న న్నేల ♦ నేల రాఁడొ?
దండకాటవి విరాధు ♦ దండించినట్టి వీ,రాగ్రణి న న్నేల ♦ యరయ రాఁడొ?
ఖరదూషణాదుల ♦ ఖండించి వైచిన,శూరుండు న న్నేల ♦ చూడ రాఁడొ?
రక్కసుచేతిలోఁ ♦ జిక్కినప్రియురాలిఁ, బ్రోయాలి న న్నేల ♦ ప్రోవ రాఁడొ?
తే. యుదధిమధ్యంబునను లంక♦యుండుఁ గాక, యన్యులకు నెల్లదుస్సాధ♦మగును గాక
మహిమ జగముల నెందును ♦ మాఱులేని,రామబాణంబులకు నడ్డ ♦ మేమి గలదు?

ఉ. సందియ మయ్యె నావిభుఁడు ♦ చాలఁడు నే నిట నుం టెఱుంగ, నీ
చంద మెఱింగి యున్నయెడ ♦ సైఁచునె మానధనుండు, రామ! నీ
సుందరి రావణాసురుఁడ ♦ సుమ్ము హరించె న టంచుఁ జెప్పఁడే
మందల వీడ కున్న నస♦మానబలుం డలగృధ్రనాథుఁడేన్. ౬౬౦

ఉ. అంతము నొందఁ జేసె నను♦రాగ్రణి వీరు జటాయుఁ బట్టి, వా
డెంతటి తెంపు చేసెఁ గడు♦వృద్ధుఁడు నయ్యును, ద్వంద్వయుద్ధమం
దింతల నంతలం జేనక ♦ యేద్దెఱ చూపె మదర్థ, మక్కటా
యెంతకు లేఁడు నాదుదుర♦దృష్టము కాలముగాదు వానికిన్. ౬౬౧

ఉ. నాయిట నుండుజాడ రఘు♦నాయకుఁ డింత యెఱింగెనేని య
త్యాయతకోపఘూర్ణహృద♦యంబున లోక మరాక్షసంబుగాఁ
జేయఁడె? యీనిమేషమున ♦ సింధువునం బెనుదుమ్ము రేఁపఁడే?
మాయఁగఁ జేయఁడే ఖలుని♦మానముఁ బ్రాణము నామముం బురిన్. ౬౬౨

కం. అప్పుడు గద రాక్షసతతు, లిప్పుడు నే నేడ్చురీతి ♦ నిం టింట నెలుం
గొప్పఁగ విధవాకృతులన్, గొప్పగ నేడ్చెదరు గోలు♦గోలున సతమున్. ౬౬౩

చం. ఉడిగెడువాఁడు కాఁడు పురు♦షోత్తముఁ డేగతి నైన నాదుపో
బడిఁ గనిపట్టి యిచ్చటికి ♦ వచ్చుట సత్యము, వచ్చినంత నా
కడిఁదిబలాఢ్యులం గని క♦శాపిక లై చనువారు గాక ము
క్కడిసురవైరులా యుసుఱు ♦ గాచుకొనం గలవారు మూర్తమేన్? ౬౬౪

ఆ. పాడెరాను లుండ ♦ బాటల నిండఁగఁ, బొగిలి కాలు పీన్గు♦పొగలు మింట
నెసము లేక యాడు♦గృధ్రాళిగూడ నీ,వీడు వేగ వల్ల♦కాడు కాదె. ౬౬౫

కం. తూర్ణంబ నాదుకోరికి, పూర్ణం బగుఁ, జెడెడివారు ♦ పొలఁతులు! మీమీ
ధుర్ణయముల మీరే యిది, నిర్ణయముగ వినుఁడు వెండి ♦ నిజముం గనుఁడీ. ౬౬౬

చం. చెలఁగెడి నిప్పు డీపురిని ♦ జేటును దెల్పెడు పెక్కులక్షణం
బులు, నిజ మీపురంబు చెడి♦పోవును నిష్ప్రభమై, దశాననుం
డిలుగ దురాసదం బయిన♦యీనగరంబు ముహూర్తమాత్రలో
పల సొబగాఱెడిం గొమరుఁ♦బాయపురండనుబోలి, చూడుఁడీ. ౬౬౭

కం. భాసురపుణ్యోత్సవములు, వాసిగ శుభలక్షణములు ♦ పాయుచు విధవా
వాసం బగుచును బూర్వసు,వాసినివలె నుండు లంక ♦ పతి మరణింపన్. ౬౬౮

కం. తడ వింక లేదు శోకుం,బడఁతులు బిడ్డా యటంచు ♦ మగఁడా యనుచున్
గొడుకా యని యింటింటను, మిడుక న్నే వినఁగఁ గలను ♦ మెలఁతుకలారా!

కం. దిగ్ధాము లెఱుఁగ హతపల,భుగ్ధీరము[1] నిష్ప్రభంబు ♦ పుర మగును నసం
దిగ్ధము రఘువరశరశుచి,దగ్ధం బై ముగ్ధలార! ♦ తథ్యము కనుఁడీ. ౬౭౦

కం. ఆనీచు పంక్తికంఠుఁడు, దా నొసఁగినగడువు ముగియ ♦ దాపయ్యె మదిన్
మీనైర్ఋతు లెఱుఁగరు సుని,ధానం బుత్పాత మిపుడు ♦ దలకొనుఁ జుండీ. ౬౭౧

కం. మాంసము నమలెడిదుష్టనృ,శంసులు ధర్మం బెఱుంగఁ ♦ జాలరు దనుజుల్
హింసింతురు నన్ రాక్షస,పాంసనువఱువాతికూటి♦వ్యంజనమునకై. ౬౭౨

కం. ఏమి యొనర్చితి రేనియు, నే మనఁగా నేర్తు నాహృ♦దీశ్వరుఁ గరుణా
ధాముని రాముని వికసిత,తామరసదళాక్షు విడిచి ♦ తలరెడిదానన్. ౬౭౩

కం. పతిఁ బాసి యిందు నీగతి, వెత గుడుచుట కన్న నిదిగొ ♦ విషముం గొను మం
చితవుగ నిచ్చెడికరుణా,వతి యుండినఁ జనని కనఁగ ♦ వైవస్వతునిన్. ౬౭౪

ఉ. ఇక్కడఁ బ్రాణయుక్త నయి ♦ యేడ్చుచు నుండుట లక్ష్మణాగ్రజుం
డక్కడఁ దా నెఱుంగఁడొ కటా! యొక యింత యెఱింగి యుండినన్
జక్కఁగ రోయ కేలుడుగు ♦ స్త్రీతల మెల్లను? నన్నుఁ బాసి లోఁ
ద్రెక్కొనుశోకవేగమునఁ ♦ దీఱె నొకో? యిఁక నేమి సేయుదున్. ౬౭౫

కం. ధన్యులు రఘుకులనృపమూ,ర్ధన్యుని నాహృదయనాథు ♦ రాముని నతరా
జన్యుని రాజీవాక్షుని, మాన్యునిఁ గను దేవసిద్ధ♦మానిప్రవరుల్. ౬౭౬

కం. పరమాత్ముఁడు ధీమంతుఁడు, నిరతము ధర్మైకరతుఁడు ♦ నృపఋషి యగునా
వరశీలున కా లయినం, బరఁగెడి నావలన నేమి ♦ ఫల మాతనికిన్. ౬౭౭

---

[1] హతఫలభుగ్ధీరము = చచ్చినరాక్షస ధీరులఁ గలది.

10*

ఆ. కంటి కెదుర నున్నఁ ♦ గడుఁబ్రేమ గలుగును
మఱుఁగువడిన మైత్రి ♦ మఱపు గలుగుఁ
దథ్య మద్ది యగుఁ గృ♦తఘ్నులయం, దెడఁ
బ్రేమ మఱవఁ డెపుడు ♦ రామవిభుఁడు. ౬౭౮

ఆ. అంతమంచిగుణము ♦ లమరవో నాయందుఁ, బుణ్యఫలము చూఱ♦పోయె నేమొ?
ప్రాణతుల్యుఁ డైన♦భర్తచే విడువంగఁ,బడితిఁ బడఁతి! గోడు ♦ గుడుచుదాన.

కం. శూరుఁడు రణధీరుఁడు నరి,మారుఁడు సద్గుణధనుండు ♦ మహితాత్ముఁడు సూ
దారుఁడు రాముఁడు పాయుట, ధారిణి నే మనుటకంటెఁ ♦ దగు మరణింపన్.

మ. వనిలో వేరులు వెల్లఁకుల్ మెసవుచున్ ♦ వర్జించి శస్త్రాస్త్రముల్
మనుజశ్రేష్ఠులు నన్నదమ్ములు వృథా♦మగ్నాత్ములై పోయిరో?
యనయుం డీయసురేశ్వరుండు కుటిల♦వ్యాపారపారీణుఁ డే
మన శూరాగ్రణులన్ వధించె నొకొ మా♦యాసంప్రయోగంబునన్. ౬౮౧

కం. ఇంతటిదురవస్థలఁ బడి, యింతటిదుఃఖంబుఁ గుడుచు♦హీనాత్మకుఁ దా
నెంతో సుఖదము మరణం, బంతకునకుఁ గరుణ లేదు ♦ హా! నామీఁదన్. ౬౮౨

కం. ఎంతటిధన్యులొ మును లా,వంతయు నేవంత లేక ♦ త్యక్తకలుషులై
స్వాంతముఁ బ్రియాప్రియంబుల,పొంతలఁ జోనీరు విజిత♦బుద్ధీంద్రియులై. ౬౮౩

కం. ప్రియమున సంతోషం బ,ప్రియమున నధికముగ భయము ♦ పృథివి జనించున్
భయమును ముదమును విడిచిన,యయగుణులకు మ్రొక్కుదాన ♦ నవహితమతినై.

కం. కావున విదితాత్మం డగు, కేవలమత్ప్రియుని రాముఁ ♦ గీర్తితగుణునిన్
బో విడిచి పాపిదైత్యున, కే వశపడి యుండఁ గలనె ♦ మృత్యువుఁ గందున్. ౬౮౫

త్రిజట తనస్వప్న వృత్తాంతము రాక్షసస్త్రీలకుఁ జెప్పుట.

కం. అనిన విని యామెమాటల,కును గింకిరిపాటు గదురఁ ♦ గొందఱు రక్షో
వనితలు దశకంఠునకున్, వినిపింపఁగఁ జనిరి సీత♦వృత్తాంతంబున్. ౬౮౬

కం. కొందఱు కరాళవదనలు, ముందర నిలుచుండి రాము♦ముదితం గని యో
మందమతి! నీదుమాంసం, బిందఱమును గుడుతు మనుచు ♦ నేకార్థముగన్.

కం. వారలను గాంచి నిద్దురఁ, గూరినయొకవృద్ధ మేలు♦కొని త్రిజట యనన్
బేరుది యిట్టులు పలికెన్, మీరలు చాలింపుఁ డింక ♦ మీమీమాటల్. ౬౮౮

కం. మీ రటె సీతను రాముని,దారను జనకేంద్రుసుతను ♦ దశరథుస్నుషనున్
జేరి భుజింతురు? పొండీ, దూరంబుగ మిమ్ముఁ దినుఁడు ♦ తొయ్యలులారా! ౬౮౯

మ. కలఁ గంటిం జెలువార! యేమనుదు మై♦కంపంబు పో దిప్పుడున్
దలఁపన్ దాని, సమూలనాశనము సి♦ద్ధం బయ్యె దైత్యాళి, కీ

నళినాక్షీమణిభర్తకుఁ జయము మా♦నం బో దనఁ, భీత ల
చ్చెలువల్ నీకల యెట్టి దీనిశ నసం♦ జెప్పెం దదీయార్థమున్. ౬౦

సీ. ఆకాశగమనంబు ♦ హంససహస్రంబు, గజదంతమయ మైన♦కలికిపల్ల
కీలోనఁ దెల్లని♦మాలికల్ చేలముల్, దాల్చి సుమిత్రాగ్ర♦తనయుతోడ
రామచంద్రుఁడు వచ్చె ♦ రమణీయశుక్లాంబ,రావృత యగుచు నీ♦దేవి పాల
వెల్లిలోపల నున్న♦వెల్లనిగట్టుపై, భానునితోఁ బ్రభ ♦ పరఁగునట్లు

ఆ. రామచంద్రుతోడ ♦ రంజిల్లఁ గంటిని, ధరముఁబోలి నాల్గు♦దంతములను
మీఱు చున్నగజము♦మీఁద సలక్ష్మణుఁ, గౌసలేయు నరుగఁ ♦ గంటిఁ గలను.

కం. వెల్లనిపలిపపుఁజేలలుఁ, దెల్లనిమాల్యములు దాల్చి ♦ ధీరోత్తము లీ
పల్లవపదచెంగట రం,జిల్లఁగ రఘుకులులఁ గంటిఁ ♦ జిత్తం బగలన్. ౬౧

తే. అంత నాపర్వతాగ్రంబు♦నందు మింటి, నంటి యుండినగౌరుపై ♦ నబ్జమిత్ర
కులునితోడమీఁద నెక్కి యీ♦కలునకంటి, తరణిచంద్రుల నంటువి♦ధంబుఁ గంటి.

కం. రాకామరులు రాజాస్యయుఁ, బ్రాకటముగ నెక్కినట్టి♦భద్రేభము నే
నాకసమున లంకపయిఁ, జోకగ నిలువంగఁ గంటి ♦ సుందరులారా! ౬౪

కం. అంచితనృషభాష్టకముం, బూంచినరథ మెక్కి పురుష♦పుంగవుఁ డిట కీ
చంచలలోచనతో నరు,దెంచుట నేఁ గంటిఁ గొఱఁత ♦ దెలియఁగ వినుఁడీ. ౬౫

తే. అర్కసన్నిభపుష్ప♦కాఖ్యాతదేవ,యానమున వార లీగజ♦యానతోడ
నుత్తరంబుగ నరుగుట ♦ యుత్సవముగఁ, గన్నులారంగఁ గంటి నేఁ ♦ గలను జూండి.

కం. ఆవిష్ణుపరాక్రముఁ డగు,ధీవిభవుఁడు రామవిభుఁడు ♦ తేజం బెసఁగం
గా వెలఁదియుఁ దమ్ముఁడుఁ దా, నీవిధమున నుండఁ గంటి ♦ నిది నిక్కం బౌ

కం. పాపాత్ములు స్వర్గంబున,దాపున కరుగంగ లేని♦తద్గతి రాముఁ
రూపింప నైన నేరదు, సౌపర్వసురారిగణము ♦ సంగరవీథిన్. ౬౭

సీ. దశకంధరునిఁ గంటిఁ ♦ దైలలిప్తాంగుఁ డై, తైలంబుఁ గ్రోలు చు♦న్నత్తుఁ డగుచు
గన్నేరుపేరులు ♦ గళమున వ్రేలంగ, రక్తాంబరంబులు ♦ గ్రాలు చుండ
ముండుఁడై కృష్ణాంబ♦రుం డయి వెండియుఁ, బుష్పకంబున నుండి ♦ పుడమిఁ గూల
నెలనాఁగచేతను ♦ నీడ్వంగఁబడుచుండఁ, గంటి నేఁ గల మచ్చె♦కంటులార!

తే. మఱియు ఖరయుక్తరథమున ♦ మలయువాని, రక్తమాల్యానులేపన♦యుక్తుఁ డగుచు
భ్రాంతమతి నూనె గ్రోలుచు♦గంతు లిడుచు, నగుచు గాడిదెపై దక్షి♦ణంబుగాఁగ

సీ. చను చుండ వెండియు ♦ మనదశవదనుండు, తలక్రిందు గాఁగ గా♦ర్దభమునుండి
భయమోహితుం డయి ♦ పడుచు దిగ్గన లేచి, వెల వెల నై మద♦విహ్వలుండు

సాధ్వసార్తుండు నై ♦ జల్పాకుఁ డగుచును, దిగ్వాసుఁ డయి దిక్కు ♦ తెలియ లేక
దుర్గంధ ఘోర మై ♦ దుస్సహతిమిర మై, నరకాభ మగుపెను♦బురదలోనఁ
తే. బడఁగఁ గనుఁగొంటిఁ గాళినాఁ ♦ బడఁతి యొకతె
రక్తవసనయు మఱియుఁ గ♦ర్దమవిలిప్త
దేహయును నయి మెడత్రుచ్చి ♦ తిగుచు చుండె
దక్షిణపుదిక్కుగా మన♦రాక్షసేంద్రు. ౨౦౦

సీ. అల కుంభకర్ణుపైఁ ♦ గలఁ గంటి నే నిట్టి,రీతిన మఱి దశ ♦ గ్రీవుసుతులు
నూనెఁ బ్రుంగుట గంటి ♦ దానవనాథుండు, పందిని నింద్రజి ♦ బలుమొసలిని
గుంభకర్ణుం డొంటెఁ ♦ గొని వాహనములుగ, దక్షిణదిశ కయి ♦ తరలఁ గంటి
వీరలలోన వి♦భీషణుం డొక్కఁడే, వెల్లనిగొడుగును ♦ వెల్లచేల
తే. ములును వెల్లనిగందంపుఁ♦బూఁతలు నయి, శంఖదుందుభినిర్ఘోష♦సంయుతముగ
నృత్తగీతాదు లొప్ప భూ♦భృత్సమంబు, మేఘురావంబు నగునొక్క♦మేలిగజము
తే. ఎక్కి నల్వురమంతురు ♦ లెసక మెసఁగ, మింటితెరువునఁ బోవుచు ♦ నుంటగంటిఁ;
ద్రావి చెంగావిగుడ్డలు ♦ రక్తమాల్యములును దాలిచి వాదిత్ర♦ములు చెలంగ
తే. సోఁకుమూఁకలు వెలయ నేఁ ♦ జూడఁ గంటి, భగ్నగోపురతోరణ♦పంక్తి గలిగి
యసురనాయకరక్షితం ♦ బైనలంక, వనధిలోపలఁ గూలంగఁ ♦ గనితిఁ జుండు.
కం. ప్రాఁత యఁట రామునకు నొక,క్రోఁతి వెస న్వచ్చి లంక♦గుఱుకొని బూదిన్
జేఁతయుఁ; జేడెలు ప్రోఁతలు, కూఁతలు నై చొచ్చి లంకఁ ♦ గ్రోలుచు నూనెన్
కం. వేఁడి యగుబూదిఁ గూలుట, మూఁడఁగ విధికుంభకర్ణ♦ముఖ్యులు దమ దా
వాఁడిమి చెడి పడఁబొఱఁగఁ, బేఁడమడుంగునను గంటి ♦ వెలఁదుకలారా. ౨౦౫

శా. పొండీ చాటుగ లేచి రామవిభుఁ డీ♦పూఁబోఁడిఁ గైకొంచు ను
గ్రుం డై రాక్షసకోటులం దునుముచోఁ ♦ గోపించి మీ రిట్టు లు
ద్దండత్వంబున నాత్మదారను బ్రియం ♦ దర్జించి బాధించుటన్
ఖండీభూతలఁ జేయకుండఁడు మిముం ♦ గంజాక్షిసంప్రీతికై. ౨౦౬

కం. మచ్చిక గల దని తన్నున్, నచ్చిన దని భార్య యని వ♦నంబుల కెలమిన్
వచ్చిన దని రఘునాయకుఁ, డిచ్ఛానకు నై వధించు ♦ నెల్లయసురులన్. ౨౦౭

ఉ. చాలును జాలు రక్కసులు! ♦ సాధ్వసభాషలపుస్తకంబు లా
మూలను గట్టి వైపుఁ డిఁక ♦ మోసము వచ్చును, మంచిమాటలన్
లాలన సేయుఁ డీమె, మన♦లన్ క్షమియింపఁగ వేఁడుకొంట యే
పోలును, సీత యాత్మవిభుఁ ♦ బొందుట నిక్కము నిక్కమిం గనన్. ౨౦౮

కం. వ్యసనంబుల మునిఁగినయా, విసజేక్షణవిషయ మిట్టి♦విధము నకలయుం
బొనఁగిన యేనియుఁ దత్సతి, వెస దుఃఖముఁ బాసి సుఖిత ♦ వెలయును జుండీ.

కం. అదరించియు బెదరించియు, ముదలించియు గాసిపెట్ట♦మో మన మేలా
సదయ యగు ననఁగ వలవదు, కదిసెంబో బెడఁద మనకుఁ ♦ గాకుత్థ్సునిచేన్. ౭౧౦

కం. ప్రణతిప్రసన్న జానకి, యణుమాత్రం బైన సంది♦యము లేదు సుఁడీ
క్షణ దాచరసతులారా, యణుమధ్యను వేఁడుఁడీ మ♦హాపదఁ బాపున్. ౭౧౧

కం. లక్షించి చూడఁగా నవ, లక్షణ మొకటైన లేదు ♦ లలిమీఁఱువిశా
లాక్షి మెయిఁ గాన వల్లభ, సాక్షాత్కారంబు గలుగు ♦ జలజాక్షి కెటున్. ౭౧౨

కం. కేవలము వన్నె మాఱుట, చే వనటం బడె నటంచు ♦ సెంకించితి నీ
దేవి యదుఃఖార్హయ యగు, గావున దివ్యసుఖములను ♦ గలదు భుజింపన్. ౭౧౩

చం. అదె యదె కంటిరే జలరు♦హాయతపత్త్రమువోలి మిక్కిలిన్
గదలెడి వామలోచనము ♦ క్ష్మాసుతకుం బ్రియసూచకంబు నై
సుదతికిఁ గార్యసిద్ధియును ♦ సోఁకులఱేనికి నాశనంబు దు
ర్గదపరకాలుఁ డైనరఘు♦రామునకు న్విజయంబుఁ దెల్పుచున్. ౭౧౪

కం. ఆకస్మికముగ జానకి, డాకేల్ పులకించి వడఁకె ♦ డాపలిదెస శుం
డాకారోరు[1] వదరుచును, గాకుత్థ్సపురస్థ్సితిం బ్ర♦కాశముఁ జేసెన్. ౭౧౫

చం. నెలకొని శాఖలందుఁ గడు♦నెమ్మిగ నుత్తమసాంత్వవాది యై
వెలసెడిపక్షి పల్కుచును ♦ వెండియు వెండియు స్వాగతోక్తిఁ బే
రెలమిని వెండి వెండియును ♦ బ్రేరణ చేసెడునట్లు గ్రాలెడున్
వల దిఁక నింద నిల్చి యతి♦వన్ వ్యథపెట్టఁగఁ బొందు దవ్వగన్. ౭౧౬

సీతాదేవి శ్రీరాముఁడు రామికి కనేకవిధములఁ బరితపించుట.

మత్తకోకిలము. క్రూరుఁ డైనదశాస్యునాజ్ఞను ♦ ఘోరరాక్షసకామినుల్
దారుణంబుగ నప్రియంబులు ♦ దన్నుఁ బల్కుచు నుంటకున్
ధారిణీసుత కానలో మృగ♦నాథు బారిని బడ్డయా
వారణేంద్రునికన్యరీతిని ♦ బాధకంపితగాత్ర యై. ౭౧౭

మత్తకోకిలము. రాక్షసాంగన లెల్లఁ జుట్టును ♦ గ్రాలి భీషణవేష లై
రూక్షభాషల బాధపెట్టఁగ ♦ రోషదూషితుఁ డైనయా
రాక్షసాధిపుతర్జనంబుల ♦ రామకామిని కాన సం
రక్షకచ్యుత యైనబాలిక♦రాణఁ దా విలపించుచున్. ౭౧౮

---

[1] శుండాకారోరువు = ఏనుఁగు తొండమువంటి తొడ.

పంచచామరము. అకాలమందు మృత్యు వచ్చె ◆ దండ్రు పెద్ద తల్లి నా
ప్రకారమే యథార్థ మయ్యెఁ ◆ బ్రాణ మేగ దయ్యయో
నికారరీతిఁ దెచ్చి త్రుచ్చి ◆ నిష్ఠురంబు లాడఁగన్
వికారరాక్షసీజనంబు ◆ నే నదెంతపాపనో. ౨౧౯

మత్తకోకిలము. అక్కటా! కడ వాయె సౌఖ్యము ◆ నైకదుస్సహదుఃఖముల్
పెక్కు లాయెను, వజ్రపాతవి◆భిన్నశృంగమునట్టు లై
యెక్కు వేశకలంబు లై చన ◆ దుల్ల మింతయుఁ జూడఁగా
నిక్క మీహృదయంబు నాశిల ◆ నేర దెన్నఁడు దైవమా! ౨౨౦

ఉ. చూడఁగ నైనరానిసుర◆సూదను కోఁతకు నగ్గ మైచు న
ల్లాడుటకంటెఁ బాప మగు◆నా యురిపోఁతల నేను బ్రాణముల్
వీడుట? శూద్రజాతునకు ◆ విశ్రుతమంత్ర మొసంగి పాపి యౌ
బాడబునట్లు నాకుఁ దగ◆వా మన సీయ నిశాటనేతకున్? ౨౨౧

మానిని. దుర్భరతేజుఁడు రాముఁడు నన్నిటఁ ◆ దూర్ణము చూడఁగ రానియెడన్
నిర్భరకోపముతోఁ గడు వేగిన ◆ నిష్ఠురశాతకృపాణములన్
గర్భమున న్మరణించినజంతువు◆కండల శస్త్రచికిత్సకుఁడున్
నిర్భిదముల్ ఘటియించుగతిన్ రజ◆నీచరుఁ డోడక కోయు ననున్.[1] ౨౨౨

మత్తకోకిలము. ఎంతకాలముగానొ యేడ్చెడి◆హీనభాగ్యకు రెన్నెలల్
గొంత గొంత గతించె నే నను◆గొందు నయ్యయొ ధారిణీ
కాంతునాజ్ఞను గాలుసేతులు ◆ కట్ట వేకువ వధ్యఁ జై
చింతలం బడుదొంగభంగిని ◆ జింతఁ గుందెద దైవమా! ౨౨౩

సీ. కన్నతల్లికి మిన్న ◆ కరుణ నన్ లాలించు, నారామమాత నా◆యత్తగార!
యత్తగారికి మిన్న ◆ యాదరించుచు నున్న, మైత్రీధీపాత్ర సు◆మిత్రదేవి!
కన్నతల్లినిబోలె ◆ మన్నించు నాముద్దు, మఱఁది యోలక్ష్మణా! ◆ మహితచరిత!
తనప్రాణములకన్న ◆ ఘనముగా ననుఁ జూచు, ప్రేమసముద్ర యో◆రామభద్ర!
తే. యయ్యయో రామ! లక్ష్మణా! ◆ హాసుమిత్ర!, హా రఘూత్తముజనని య◆త్తా! యిటేను
గడలి సుడిగాలి సుడివడు◆కలముకరణి, మందభాగ్యను నిడుమల ◆ గ్రుందుదాన.

చం. కటకట! నానిమిత్తము మృ◆గంబుస్వరూపముఁ దాల్చి యున్నయా
కుటిలునిచేత మృత్యువును ◆ గూరిరి శూరులు పార్థివాత్మజుల్
దటుకునఁ బిట్టపిడ్గు నడిఁ ◆ దాఁకినసింహవృషద్వయంబు నా
నటమట మింత కైనఁ గల◆దా? మఱి యింతకు మూల మేఁ గదా! ౨౨౪

కం. రాముని లక్ష్మణు మతి చెడి, యే మని పాసితినో యప్పు◆డే దురదృష్టం
బామృగరూపధరాకృతి, మై మోసము చేసె నన్ను ◆ మాట లిఁ కేలా? ౨౨౫

---

[1] దీనివలనఁ బూర్వకాలమునందు శస్త్రచికిత్సయందార్యులెంత ప్రవీణులైయుండిరో తెలియనగు.

ఉ. హా రఘురామ! సత్యరత ♦ హా! పరిపూర్ణసుధాకరాననా!
హా రమణీయదీర్ఘకర! ♦ హా! జగదేకహితా! విశారదా!
హా రణరంగభీకర! స♦మస్తజగచ్ఛ్రయభూతరక్షణా!
సారసనేత్ర! నన్నిట ని♦శాటులు చంపుట నీ వెఱుంగవో? ౨౨౭

సీ. ఈవొక్కఁడవు దక్క ♦ నితరదైవము లేద,టంచు నేఁ దలఁచిన♦యట్టితలఁపు
వినఁగోరి నీసూక్తి ♦ వికటరాక్షసపరు,షాలాపముల విను♦నట్టియోర్పు
నీతోడ శయనించు♦ప్రీతిమై నీనేలఁ, బడియున్నయట్టియా♦కడిఁదిదిటము
రాముఁ డేటికి నన్ను ♦ రక్షింపకుండు నన్,ధర్మమార్గంబున♦స్థైర్యవిధము

తే. నాదుపరమపాతివ్రత్య♦నవ్యతపము, పాడుగాఁ బోయె నాదుదౌ♦ర్భాగ్యమునను
ధరఁ గృతఘ్నున కొసరించు♦పరమకృతిని,బోలి నాపాప మెంత ప్ర♦భూత మౌర.

చం. చెలువము వాసి మిక్కిలి కృ♦శించితి, నిన్ననులారఁ గానఁగాఁ
గల ననునాశయున్ సమసెఁ ♦ గావున మత్కృతపుణ్యకార్యముల్
పొలిసెను నిష్ఫలంబు లయి ♦ పూరుషపుంగవ! పోయెఁ బొమ్ము ని
ర్మల మగునేకపత్నినియ♦మంబు నిరర్థక మౌచు వల్లభా! ౨౨౯

చం. జనకునియాజ్ఞ చొప్పునఁ బ్ర♦శస్తగతిన్ వనవాసదీక్షఁ దీ
ర్చి నగర మేగి ధాత్రి కభి♦షేకముఁ గైకొనుచుం గృతార్థతన్
జనవున వారిజాతదళ♦చారువిశాలవిలోచనాళితో
నెనయిక భీతి లేక రమి♦యించెద వంచుఁ దలంతు సువ్రతా.[1] ౨౩౦

పంచచామరము. ఘనంబుగా మనంబు నిల్పి ♦ కంజనేత్ర! నీపయిన్
వినాశ మందు చున్నదాన ♦ నేను రామ! యీగతిన్
విపిత్రరీతి నేను జల్పు♦విశ్వసద్వ్రతంబులున్
జనెం బ్రయోజనంబు లేక ♦ స్వల్పభాగ్య నౌటచేన్. ౨౩౧

శా. లేరే దాతలు నాకు నింత విషమేన్ ♦ లేఖారివేశ్మంబునన్
ఘోరం బైనకృపాణ మేనియును గో♦ళ్ళమ్మంచు నీయంగ? న
ట్లైరే నిచ్చినఁ బాయనే తనువు ని♦ష్ఠే కాలకూటానఁ గా
నీ రాజత్కరవాలఘాతమునఁ గా♦నీ దుఃఖనాశంబుగన్ ౨౩౨

చం. లలన యనేకరీతులఁ ద♦లంచి తలంచి మనోవిభున్ వ్యథా
కులమతి నిట్లు వా విడిచి ♦ గోలున నంగిలి యెండ నేడ్చుచున్
దలఁకుచుఁ బుష్పితోరువసు♦ధారుహమూలసదేశ మేగి య
చ్చెలి తనవేణిఁ గేలఁ గొని ♦ చెచ్చెరఁ దా నురిపోసికొన్నతిన్. ౨౩౩

---

[1] ఇట్టి విచారము స్త్రీలకు స్వభావము. అంతియకాని యిదివఱకే సీతగాక రామునకు వేఱు భార్య లున్నారను తలంపునఁ జెప్పఁబడలేదు.

ఉ. అనువగు శాఖఁ గేలఁ గొని ♦ యాత్మకులంబును రామచంద్రునిఁ
ఘనుని సుమిత్రపట్టిని మ♦నంబున నెంచుచు నుండ శోకనా
శనమును ధైర్యసాధనము ♦ శస్తకరంబును నౌనిమిత్తముల్
గనఁబడెఁ దొంటియట్ల మృగ♦కాతరనేత్రకు ముత్ప్రదంబులై. ౨౩౮

↞ మరణోద్యుక్త యగు సీతాదేవికి శుభశకునంబు లగుట. ↠

సీ. అంతటివ్యథితను ♦ హర్షవ్యపేతను, బరిదీనమానసఁ ♦ బరమనియమ
భద్రనిమిత్తముల్ ♦ ప్రాపించి రాజిల్లె. ధనిఁ జేరు సేవక♦తతులభంగి
లక్ష్మికము నరాళ♦పక్ష్మరాజీవృతం,బును విశదవిశాల♦మును వినీల
మును నగువామలో♦చనము మీనాహత, మైనపద్మం బన ♦ నదరఁజొచ్చె
ఆ. మృదుమనోజ్ఞపీన♦వృత్తంబు చందనా,గురుసమర్హ మగుచుఁ ♦ బరమలోక
నాథచిరగృహీత♦సవ్యవామభుజంబు, కొంతసేపు కదలె ♦ నంతకంత. ౨౩౯

కం. కరిరాజహస్తనిభములు, సరసంబులుఁ బీవరములు ♦ సంహతములు నౌ
కరభోరుతొడల నెడమది, పొరిఁ బొరి రఘురాముఁ జూపు♦పొలుపున నదరెన్. ౨౩౧ [?]

కం. చారురద చారులోచన, సారసముఖి యైనసీత ♦ స్వర్ణాభవిభో
దారము ధూసరితం బగు,చీరయు నొకయింత నడలె ♦ సేమముఁ దెలుపన్. ౨౩౨

కం. మున్నగడు లెస్సయెఱిఁగియ,యున్న నిమిత్తములఁ జూచి ♦ యుగ్రాతపవా
తోన్నతిఁ జెడుబీజము వృ,ష్టి న్నన మొలతెంచుమాడ్కి ♦ సీతయు నలరెన్. ౨౩౮

కం. బింబఫలాధరమును రో,లంబాలకమును సుమంజు♦లభ్రువు నీరే
జాంబకముఁ సితదంతం,బుం బొలిచెను ముఖము రాహు♦ముక్తేందుగతిన్. ౨౩౯

కం. అంతట శ్రీరఘురాముని,కాంత విగతశోక హర్ష♦కలితయునై యే
కాంతము శోభిల్లె నిశా,కాంతునితో వెలుఁగు రేయి♦గతి నవ్వేళన్. ౨౪౦

↞ సీతాదేవితో నెట్లుభాషింపఁ దగు నని హనుమ యోజించుట. ↠

కం. సీతావిలాప మసురీ,వ్రాతము బెడిదములు త్రిజట♦స్వప్న కథనముఁ
వాతతనూజుఁడు విని భూ,జాతను సురవని నమర్త్య♦సఖుఁగఁ దలంచున్. ౨౪౧

ఉ. వేయితలంపు లూరఁ బది♦వేలవిధంబుల యోజనాపరుం
డై యతిసంఖ్యులైనప్లవ♦గాగ్రణు లెల్లెడ నేసతీమణిఁ
రోయుచు నున్నవారొ సిత♦రోచిముఖిం గనుఁగొంటి నిందు నే
నాయలినీలవేణిఁ గుసు♦మాసవసన్నిభవాణి జానకిన్. ౨౪౨

కం. చారుఁడనై యోగ్యుఁడనై, వైరిబలాబలము లెఱుఁగ ♦ వలఁతిని నౌనే
నారసి యసురవిశేషము, లీరావణుబలముఁ బురము ♦ నెఱిఁగితి నెల్లన్. ౨౪౩

సీ. అటుగాన నప్రమే♦యగుణాకరుండును, నఖిలభూతహితుండు ♦ నైనరామ
చంద్రు, దేవిని భర్తృ♦సందర్శనాసక్త, నాశ్వసించుటె శుభం ♦ బైనవిధము
దుఃఖనిర్మగ్న యై ♦ దుఃఖాంత మెఱుఁగక, సంతపించెడి పూర్ణ♦సౌఖ్యపాత్ర
నూఱడింపకయ యే ♦ నూరక పోయిన, సత్య మనర్థంబు ♦ సంభవిల్లు
తే. నీయశస్విని తన్నుఁ దా ♦ నిందుఁ గాచు,కొనఁగ నేరక మరణించు ♦ గురుబలుండు
దశరథసుతుండు జానకీ♦దర్శనేచ్ఛఁ, డతని నాశ్వాసపఱుచుటే ♦ న్యాయ్యమగును.
ఆ. ఏమి సేయవచ్చు ♦ నీరక్కసులు విను,చుండఁ బల్క నెట్లు ♦ యుక్త మగును
మగువ నేను రాత్రి♦ తెగువలలోపల, నూఱడింప కున్న ♦ నుసుఱుఁ బాయు.
మ. హనుమా! యే మని నాకుఁ జెప్పు మనె న♦య్యా! జానకీదేవి నీ
వనుమా తద్వచనంబులెల్ల నని ధ♦ర్మాత్ముండు శ్రీరాముఁ డా
య్యనఁ బల్కన్ సతి నిందుఁ జూచియును మా♦ట్లాడింప కే నేగి లో
ననుమానింపక యేమి మా ఱిడుదు? న♦ర్థం బౌనె నా కావిధుల్? ౨౪౬
కం. సీతాసందేశము లే, కాతరణికులేంద్రుఁ జూడ ♦ నరిగిన నతఁడున్
జాతాధికకోపానల,హేతుల నను నీఱుఁ జేయ ♦ కేలా మానున్. ౨౪౭
సీ. సీత యున్నది లంకఁ ♦ జెచ్చెరఁ బదఁ డని, రాముకార్యమున శా♦ఖామృగాళిఁ
దోడి తెచ్చితి నేని ♦ తుదకు వ్యర్థము గాదె, జానకి యింతలో ♦ సమసె నేని
యటుగాన నిం దుండి ♦ యంతరంబును రోసి, జానకి నూరార్చి ♦ చనుట లెస్స
యల్పశరీరుండ ♦ నందు వానరుఁడను, మనుజునివలె నేను ♦ మాటలాడఁ
తే. దగవె సంస్కృతమున? నేను ♦ ధరణిసురుని
రీతి సంస్కృత మాడిన ♦ భీత యగుచు
దశముఖాసురుఁగా నన్నుఁ ♦ దలఁచు నేమొ?
యేమి సేయుదుఁ గ్రోఁతి నే ♦ నెట్లు పలుక? ౨౪౮
కం. ఊరార్పఁగఁ దగుఁ దరుణిని, నూరార్చుట యెట్లు మాన ♦ మూనిన? మఱి నే
నేరీతిఁ బలుక? గతి లే, దీరమణిం బలుకరింతు ♦ నే మనుజోక్తిన్? ౨౪౯
కం. రూపంబునఁ గ్రోఁతియు నా,లాపంబులు మనుజులవియు ♦ లలనామణి దా
రూపించి మున్నె రక్ష,స్త్రీపరిసంత్రస్త భయము ♦ చెందదె మఱియున్. ౨౫౦
సీ. కంజాక్షి యంతటఁ ♦ గామరూపిని నన్ను, రారి నేతఁగ నెంచి ♦ యఱుచు భీతి
నానాదమునఁ జేసి ♦ యఖిలాసురాంగనల్, వివిధసాధనహస్త ♦ లవుచుఁ గదిసి
కోపించి ననుఁబట్టి ♦ రూపుమాపఁగ నొండెఁ, గట్టి కొంపో నొండెఁ ♦ గడఁగువారు
కొమ్మల రెమ్మల ♦ గొప్ప మొదళ్లతో, వృక్షముల్ గొని పరు♦విడుచు నేను

తే. వనమున న్విహరింపఁగ ♦ భయద మైన,మత్స్వరూపంబుఁ గనుఁగొని ♦ మగువలెల్ల
వికృతముఖములతో వెఱ ♦ వేగ మరిగి, రాక్షసేంద్రుని గేహసం♦రక్షకులను ౭౫౧

కం. రక్కసులం బిలుతురు వా, రుక్కున శూలములు శక్తు ♦ లుగ్రాసులు నీ
సెక్కఁగఁ గొని మొత్తము లై,యొక్కట ననుఁ దాఁక రోస ♦ మొదవెడు నాకున్.

ఉ. వారల నెల్లఁ జంపుపని ♦ వచ్చినచో జలరాశి దాఁటి యా
తీరముఁ జేర నెట్టు లగుఁ? ♦ దెంపునఁ బైపడి నన్నుఁ బట్టినన్
శ్రీరఘురామువార్త చెవి ♦ సేరదు సీతకు, నేను జిక్కుదున్
ధారిణికన్యఁ బట్టి ఖల♦దైత్యసతుల్ వధియింతు, రంతటన్ ౭౫౩

ఉ. పా డగు రామభానుజులు♦పట్టిన కార్యము, సీత యంటినా
జాడయుఁ గానరా కసుర♦సంఘపరీవృత యౌచు వార్ధియే
పీడనిపే రగడ్త యయి ♦ విశ్రుతి గాంచినలంకలోనఁ గా
పాడఁ బడున్ రహస్యముగఁ ♦ బ్రాణములైనను గోలుపోయెడిన్. ౭౫౪

చం. కలనను నన్నుఁ జంపినను ♦ గాక రుషామతిఁ గట్టివైచినన్
గలుగఁ డొకండు రామవిభు♦కార్యముఁ దీర్పఁగఁ జాలు మేటి, యె
వ్వలను దలంచి చూచినను ♦ వానరుఁ డన్యుఁడు నూఱుయోజనం
బులు గలవార్ధి దాఁటఁగను ♦ బూనెడువాఁ డట లేఁడ యారయన్. ౭౫౫

ఉ. వేలకొలందిరాక్షసుల♦పీఁచ మడంపఁగ నేస్తు నైన దో
ర్లీల వెలుంగఁ బిమ్మటఁ ద♦రింపఁగ లేను మహాబ్ధి గాసినై,
నాలములో జయం బపజ♦యం బన రా దిద మిత్థ మంచు, శం
కాలులితార్థముల్ సలుపఁ♦గా మది గొల్పదు కొంచె మేనియున్. ౭౫౬

కం. సందేహ మైనకార్యము,నం దెవ్వఁడు బుద్ధిమంతుఁ ♦ డాలోచన లే
కెందును దెగు? నటు చేసిన, నిందింపఁగఁబడును దుర్వి♦నీతుఁ డటంచున్. ౭౫౭

తే. పలుకరింపక నే నేగ ♦ భయము పేర్మి, మేను దొఱఁగుట నిక్క మీ♦మీననేత్ర
పలుకరించితి నేనియుఁ ♦ బైయనర్థ,చయములెల్లను బ్రాప్తించు ♦ సత్యముగను.

కం. ఐనట్టుతోఁచు పను లేన్, భానునిఁ గనుఁగొన్నతమము♦పగిదిం జెడెడున్
వానిని దేశము కాలము, జ్ఞానము లేనట్టిదూత ♦ సలుపఁ గడఁగినన్. ౭౫౯

కం. దీని నిటు సల్ప సఫలం, బౌ నని ప్రాజ్ఞులు విధించి♦నట్టిది కార్యం
బైనను జెఱుచును బండిత,మాని యయినదూత శక్తి♦మంతుఁడు గామిన్. ౭౬౦

ఉ. ఏగతిఁ గార్యహాని జని♦యింపక యుండునొ, బుద్ధిజాడ్య మిం
కేగతి రాకయుండు నొకొ ♦ యేగతి వారిధిలంఘనంబు దా

నో గయి పోక యుండెడినొ ♦ యుర్విజ యేగతి నాడుమాటలన్
బాగుగ నాలకించు, వెఱ♦పాల్పడ కేగతి నుండు న గ్గనన్. ౭౬౧

సీ. అనుచు దీర్ఘంబుగ ♦ నాలోచన మొనర్చి, మతిమంతుఁ డగుహను♦మంతుఁ డపుడు
కార్యనిశ్చయము నీ♦కరణిని గావించె, నారూపమును జూప ♦ కారఘూర్త
మునిని గీర్తించెద ♦ వనజాతలోచన, భయపడ కుండెడు♦పగిది గాఁగ
రఘుకులగ్రామణి ♦ రాముని విదితాత్ము, ధర్మసహితశుభ♦దంబు లైన

ఆ. మధురవాక్యములను ♦ మానుగ నమ్మిక, పుట్టునట్టిభంగిఁ ♦ బొగడువాఁడ
వెలఁది యెంతమట్టు ♦ విశ్వసించునొ దాని, నెఱిఁగి యవలికార్య ♦ మే నొనర్తు.

కం. అని నిశ్చయించి సీతం, గను చామెయె వినెడునట్లు♦గా సరసకుజం
బున మాటుగొనియె పావని, యనియెన్ మధురంబు లైన♦యవితథసూక్తుల్. ౭౬౩

→ హనుమ సీతాదేవి వినునట్లు శ్రీరాముఁ బ్రశంసించుట. ←

సీ. దశరథుం డనురా జు[1]♦దారకీర్తియు రథి, వారణసైంధవ♦భటయుతుండు
ధర్మశీలుఁడు గుణ♦ధన్యుండు మాన్యుండు, రాజర్షివర్యుండు ♦ ప్రకటయశుఁడు
చక్రవర్త్యన్వయ♦జాతుండు తపమున, ఋషిఁబోలు బలమున ♦ నింద్రనిభుఁడు
కరుణాపరుండు ని♦క్ష్వాకువంశాగ్రణి, సత్యవిక్రముఁ డహిం♦సారతుండు

తే. నృపతిలక్షణయుక్తుఁడు ♦ ఋజుగుణుండు
చతురుదధివృతమేదినీ♦చక్రవిత్రు
తుండు సుఖదుండు సుఖి యయి ♦ దొరలు లేక
దొరల కెల్లను దొర యయి ♦ పరఁగు చుండు. ౭౬౪

ఉ. ఆమహితాత్ము నగ్రసుతుఁ ♦ డబ్జనిభాస్యుఁ డతిప్రియుండు, శ్రీ
రాముఁడు పేర, స్వీయజన♦రక్షణదక్షుఁడు, నాత్మధర్మర
క్షామతి, చాపభృద్వరుఁ డ♦ఖండుఁడు నన్నిట, దుష్టశాత్రవ
స్తోమభయంకరుండు, నిజ♦శుద్ధకులాగతధర్మరక్షుఁడున్. ౭౬౫

సీ. ఆయనఘుండు స♦త్యాత్ముఁడు వృద్ధుఁ డౌ,తనతండ్రి పనిచిన♦పనుపుఁ జేసి
తమ్ముఁడు దారయుఁ ♦ దనతోడ రా వనీ,ధారణి కేగి యా♦వీరవరుఁడు
మృగమారతుం డయి ♦ మెలఁగుచు శూరులుఁ, గామరూపులు నైన♦ఖలసురారి
వరులఁ బెక్కురఁ జంపె ♦ ఖరదూషణాదులు, నమయుట విని జన♦స్థానమునను

తే. మాయలేడి నెపంబున ♦ మాయ చేసి, యతని యిల్లాలి రావణుఁ ♦ డపహరించె
నామె వెదకుచు వచ్చి నే♦య్యం బొనర్చె,భూవిభుఁడు కీశుఁ డైనసు♦గ్రీవుతోడ.

ఉ. వానినిమిత్త మై తునిమె ♦ వాలిని, వానరరాజ్యలక్ష్మినిన్
బూనిచె సూర్యసంభవునిఁ ♦ బూని యతండును సీత రోయఁగా

---

[1] దశరథుఁ డనుపేరితో సంభాషణము ప్రారంభించిన చమత్కారముఁ గనుఁడు.

వానరవీరులం బనిచె ♦ వాఁడి చెలంగెడి కామరూపులన్
మానక సర్వదిఙ్నిచయ ♦ మార్గణతత్పరు లైరి వారలున్. ౨౬౭

మ. సరగన్ నేను జటాయుసోదరుఁడనౌ ♦ సంపాతివాక్యంబునన్
గురుశక్తిన్ శతయోజనాయతమహా ♦ కూపారమున్ దాఁటితిన్
ధరణీపుత్త్రినిమిత్త మై; యిచట సీ ♦ తానాయకోక్తస్వరూ
పరుచిశ్రీలఁ జెలంగు సాధ్వి గుణరూ ♦ పం గంటిఁ బుణ్యంబునన్. ౨౬౮

చం. అని హనుమంతుఁ డాడ జన ♦ కాత్మజ తద్వచనంబు లన్నియున్
విని వెఱగంది మోమునను ♦ వ్రేలెడిముంగురు లల్లఁ ద్రోచికొం
చును మొగ మెత్తి చెట్టుదెసఁ ♦ జూచుచు రాము వెఱన్ స్మరించుచున్[1]
గనియెను గ్రిందు మీఁదును న ♦ గంబునఁ బ్రక్కల నందు నొక్కెడన్. ౨౬౯

సీతాదేవి హనుమంతునిఁ జూచి భయపడుట.

ఉ. తూరుపుకొండపై వెలుఁగు ♦ తోయజమిత్త్రుఁ డనంగఁ గొమ్మలం
దారఁగ డాఁగియున్నకపి ♦ నర్జునచేలుని సాంత్వవాది శం
పారమణీయపింగళుని ♦ భాస్వదశోకసుమోత్కరాభునిన్
జేరువ గొమ్మ నుండెడి య ♦ చింత్యపరాక్రము స్వర్ణలోచనున్. ౨౭౦

చం. కని చలియించి యబ్రపడి ♦ క్ష్మాసుత హా! యిది భీషణంబు నౌ
వనచరరూప, మేదొసఁగు ♦ పాటిలునో కనుఁ గొంట దీని? నం
చును మదిలోఁ దలంచి భృశ ♦ శోకమునన్ రఘురామ! లక్ష్మణా!
యని భయమోహితాత్మ యయి ♦ యల్లన నల్లన నేడ్చె దీనయై. ౨౭౧

కం. కనుచుఁ బృథుభుగ్నవక్త్రుని, వనచరపతిమంత్త్రివర్యు ♦ వాతాత్మజునిన్
ఘనమేధావివరిష్ఠుని, దిననాథతనూజుబంటుఁ ♦ దేజోనిలయున్ ౨౭౨

చం. నెలఁత భృశార్తిఁ గుందుచు వి ♦ నీతునిరీతిగ నున్నమారుతిం
దలఁచి మనంబులోన నగు ♦ నా యిది స్వప్న? మటంచు వెండియున్
జెలువ సమీరపుత్త్రుఁ గని ♦ చిత్తము వ్యాకుల మంద భీతిచేఁ
గలఁగి విసంజ్ఞ యై శవము ♦ కైవడి నై తెలి వొంది యిట్లనున్. ౨౭౩

మ. కలలోఁ గ్రోఁతిని జూడరా దనుచు వ ♦ క్కాణించు శాస్త్రంబు, నేఁ
గలఁ గంటిం గద వానరంబు, నిఁక నే ♦ కష్టంబు ప్రాప్తించునో
కలుగుం గావుత రామలక్ష్మణులకుం ♦ గళ్యాణముల్, సంతతం
బలరుం గావుత నాదుతండ్రి జనకుం ♦ డారోగ్యసంపత్తిచేన్. ౨౭౪

చం. కల యని యందునా యెటులు ♦ కల్గెడు స్వప్నము నిద్ర లేకయే?
కలిగెడు నెట్లు నిద్ర యిటు ♦ కాఱియపాటున వేఁగువేళలన్?

1 ఆపత్కాలమందు 'ఆపదామపహర్తార'మని శ్రీరాము స్మరించిన సకల భయములు నశించును.

తెలుఁగు నోకో సుఖంబు సమ♦సీతకరాభముఖారవిందునిన్
జెలువుని రాముఁ బాసి యిటు♦చేస్పడు దుర్భగురాల నాకునన్? ౨౨౫

చం. కల యిదిగాదు, నిక్కువము ♦ గాదు, నిజం బరయంగ నెప్పుడున్
దలఁపున రామ రామ యని ♦ ధ్యాన మొనర్చుచు, నోర నట్టు లే
పలుకుచు నుంటఁ, దద్విషయ♦వాక్యములే విను దాన, నమ్మహా
బలునిస్వరూపమే కనెద ♦ భావనతీవ్రబలంబు పెంపునన్. ౨౨౬

ఉ. ఆరఘువీరుపై హృదయ ♦ మంతయు నిల్పి మనో భవవ్యథా
భారముచేఁ దపించుటను ♦ భావనశక్తి రఘూత్తమాకృతిన్
సారెకుఁ గాంతు నెల్లయెడఁ ♦ జారుతదీయకథల్ వినంబడున్
వారక నాదుమోహ మొక ♦ వానరరూపముఁ గాంచి పల్కెనో. ౨౨౭

చం. అటు లయినన్ మనోరథము♦నాకృతి యిట్టిది గా దటంచుఁ బ్ర
స్ఫుటముగ బుద్ధిచేఁ దెలియఁ ♦ జూచెద, రూపము లేదు దానికిన్
బటుతరరూపి యియ్యదియుఁ ♦ బల్కెడి మాటలు నన్నుఁ జూచి యే
యెటు లనవచ్చు మాయ యని ♦ యెంతయుఁ జూచిన నిక్కువంబ యౌ. ౨౨౮

చం. అని మది నిశ్చయించి తన♦హస్తయుగంబును మోడ్చి మ్రొక్కు దా
నను బలవైరియుక్తు సుమ♦నస్పతిమంత్రి స్వయంభువున్ శుచిన్
వనచరుఁ డిప్డు నాయెదుటఁ ♦ బల్కినవాక్యము లెల్ల సత్యమై
యొనరుత వేఁడుగా జరుగ ♦ కుండెడిఁ గాత మటంచు వేఁడఁగన్. ౨౨౯

## హనుమంతుఁడు సీతాదేవితో సంభాషించుట.

కం. హనుమయు వినీతవేషం,బున వృక్షముఁ గొంత డిగ్గి ♦ మోడ్పుంగేలన్
దనశిరమునఁ బూనుచు నతి,వినయంబున మధురఫణితి ♦ వెలఁదికి ననియెన్. ౨౩౦

శా. అమ్మా! యెవ్వతె వమ్మ నీ విచట నే♦లా మైల కౌశేయచే
లమ్ముం దాలిచి కొమ్మ యూఁతఁగొని ని♦ల్వం? బద్మపత్రంబులం
దిమ్మై కాఱుజలంబునాఁగఁ గనులం ♦ ది ట్లేల శోకాశ్రుపూ
రమ్ముల్ గ్రమ్మెడి? నానతీయఁ గదవే ♦ ప్రార్థింతు సాధ్వీమణీ! ౨౩౧

ఉ. కిన్నరకాంతవో? యసుర♦గేహినివో? వసురుద్రరామవో?
పన్నగనారివో? విబుధ♦భామినివో? మఱి యక్షయోషవో?
యన్నెలఁ బాసి కూలినగు♦ణాన్విత రోహిణివో? తలంప నో
కన్నియ నీవు దేవతవ♦కాఁ దలపోసెద భద్రలక్షణా! ౨౩౨

తే. అలుకచేతనో మోహంపు♦గలఁకచేత,నో వసిష్ఠుని నెడఁబాసి ♦ యుర్విఁదిరుగఁ
దడఁగినయరుంధతివి గావు♦గా? యెఱుంగఁ, బల్కవే ప్రేమఁ గళ్యాణి♦భద్ర మగుత.

ఉ. ఎందులనుండి వచ్చి? తిటు ♦ లిచ్చట నేల మహార్తిఁ గుంద, నో
సుందరి![1] తండ్రి యెవ్వఁడొకో? ♦ సోదరుఁ డెవ్వఁడు? భర్తయెవ్వరో
నందనుఁ డెవ్వఁ డమ్మ? సుర♦నారివి గా వని తోఁచె నేడ్చుటన్,
దందడియూర్పు లుంట, వసు♦ధాస్థలి నిల్చుట, రాజచిహ్నలన్. ౨౮౪

కం. లలనరో! చూడ నీదుశుభ♦లక్షణముల్ నృపకన్య వంచు భూ
వలయము నేలు మేటినృప♦పర్యనిపట్టపు దేవి వంచు నేఁ
దలఁచెద, దండకాటవి య♦థామతిఁ ద్రిమ్మర రావణుండు దా
బలిమిని దెచ్చినట్టినృప♦భామిని సీతవొ? పల్కుమే లగున్. ౨౮౫

కం. అతిమానుష మగురూపము, వ్రతయుతవేషంబు నీదు♦వైవర్ణ్యంబున్
మతిఁ దలపోయఁగ రాముని,సతి వంచును దోఁచె లేదు ♦ సందియ మబలా. ౨౮౬

## సీతాదేవి హనుమంతునితోఁ దనవృత్తాంతముఁ జెప్పుట.

కం. అనుడున్ రఘువల్లభకీ, ర్తనహృష్టమనోజ్ఞ యగుచుఁ ♦ దర్వాశ్రితునిన్
హనుమంతుఁ గాంచి పలికెన్, జనకతనూజాత తనదు♦చారిత్రంబున్. ౨౮౭

కం. రాజితయశుఁ డగుదశరథ,రాజేంద్రునిస్నుషను జనక♦రాజతనూజన్
రాజనిభాస్యుఁడు రాముని, కే జాయను సీత యందు ♦ రిల నాపేరున్. ౨౮౮

ఉ. మానితసర్వకామముల ♦ మానుషభోగములన్ భుజించుచు
మానుగ రెండునుం బది స♦మల్ వసియించితి రామునింటిలోఁ
బూని త్రయోదశాబ్దమున ♦ భూవరుఁడున్ గురుమంత్రిపౌరలో
కానుమతిన్ మదీశ్వరు ర♦సాధిపుఁ జేయఁగ నున్న యంతటన్.[2] ౨౮౯

ఉ. ఆమనుజాధినాథుప్రియు♦రా లగుకైకయి ప్రాణభర్తతో
రాముని నీవు ధారిణికి ♦ రాజుగఁ జేసెద వేని చెప్పెదన్
నేమముఁ బట్టి త్రావ నిఁక ♦ నీరముఁ, గూడును ముట్ట నింతతో
నీమెయితోడిపొత్తు సరి, ♦ యిప్పుడ ప్రాణముఁ బాయుదుం జుమీ. ౨౯౦

ఉ. అడినమాట నిల్పుకొను♦నట్టితలం పెదఁ గల్గ నేనియున్
పీడుము రామునిన్ గహన♦వీథుల వేగ మటన్న మున్ను దా
నాడినమాట నెంచి ప్రియు♦రాలికఠోరతరాప్రియోక్తి కై
యేడిచి మూర్ఛలన్ మునిఁగి ♦ వృద్ధధరాపతి ధర్మబద్ధుఁ డై. ౨౯౧

ఉ. ఆలికిఁ జెప్ప లేక తన♦యగ్రతనూజుని వేఁడె రాజ్యముం
శ్రీలలితుండు రాముఁ డభి♦షేకముకంటెఁ బ్రియంబు నైనభూ
పాలునిమాటఁ గైకొనియెఁ ♦ బ్రాణనిమిత్తమ యైన నామగం
డాలరిపల్కుఁ బల్కఁడు, న♦యంబున నిచ్చు గ్రహింపఁ డేమియున్. ౨౯౨

---

[1] ఇంతటి జగన్మోహినివి నీవిట్లు దుఃఖింపఁ గారణము లేదేయని యాశయము. [2] చూ. ఆ. కా, ప. ౭౬౭.

చం. జనకుని మీఁది భక్తి మెయి ♦ సంపదలుఁ ధరణీప్రభుత్వముం
ఘనతరనవ్యచేలములు ♦ గ్రక్కున వీడి, కుశాజినంబులన్
గొని, ననుఁ దల్లికిన్ మిగులఁ ♦ గూరిమి నప్పన చేసె, నాకు న
య్యనఘునిఁ బాసినంత నమ♦రాలయ మైన రుచింప దాత్మకున్. ౯౩

ఉ. కావున రాముకంటె మును ♦ కానల కేను బ్రయాణ మైతి, స
ద్భావుఁడు లక్ష్మణుండు దొలుఁ♦తన్ ధరియించెను నారచీరముల్
మూవుర మిట్లు మేము వ్రత♦ముం గొని యెన్నఁడుఁ జూడనట్టిభీ
త్యావహ మైనదండక ధ♦రాధిపునాజ్ఞను జొచ్చి యుండఁగన్ ౯౪

ఉ. మ్రుచ్చిలి తెచ్చె నన్ను రఘు♦ముఖ్యుని దేవిని గూళ రావణుం
డిచ్చట దిక్కు లేమి నిటు ♦ లేడ్చెద, మాసయుగంబు జీవితం
బిచ్చె దశాస్యుఁ, డంతపయి ♦ నీల్గెదు దానను, నింతలోన నా
సచ్చరితుండు వచ్చు నని ♦ చాలఁగ నాశను మేను నిల్పితిన్. ౯౫

హనుమంతుఁడు సీతాదేవికి రామలక్ష్మణులకుశలవార్తఁ దెలుపుట.

సీ. అనవుడు నామాట ♦ లాలించి పావని, సాంత్వనోక్తుల నను ♦ జనకసుతకు
దేవి! నీకొక్కసం♦దేశ మంపఁగ రామ, భద్రుండు దూత నై ♦ వచ్చినాఁడ
శ్రీరామచంద్రుండు ♦ సేమ మయ్యెడఁ దన, సేమంబు నీతోడఁ ♦ జెప్పు మనియె
బ్రహ్మాస్త్రవేదశా♦స్త్రవిదుండు శ్రీరాముఁ, డర్మిలి నీసేమ ♦ మడిగె నమ్మ!
ఆ. శౌర్యదర్పధనుఁడు ♦ సౌమిత్రి నీపతి, కనుచరుండుఁ బ్రియుఁడు ♦ సాశ్రునేత్రుఁ
డగుచు నీకు భక్తి ♦ సాష్టాంగ మెరఁగెను, గుశలు లమ్మ వారు ♦ కువలయాక్షి.[1]

కం. అని హనుమంతుఁడు పల్కిన, విని జనకతనూజ హర్ష♦వివశాత్మిక యై
తను వెల్లఁ బులకరింపఁగ, ననుఁ బావనిఁ జూచి యంచి♦తాలాపములన్. ౯౭

కం. తనువునఁ బ్రాణము లుండినఁ, గనుఁగొను నూఱేండ్లకైనఁ ♦ గడుహర్షంబున్
మనుజుం డనుసామెత ము, న్ననుకొనఁగా వింటి నది య♦థార్థమ చూడన్.

కం. అని శుభవార్తం దెలిపిన, హనుమయెడన్ జనకతనయ ♦ యద్భుత మగుప్రీ
తిని జూపఁగ నన్యోన్యం, బును నమ్మిక కుదురుకొనఁగ ♦ ముచ్చట జరగెన్. ౯౯

కం. భూపుత్త్రిక పలికినయా, లాపంబుల విశ్వసించి ♦ లాలించుచు దుః
ఖోపశమనం బొనర్పఁగ, దాపునకున్ మెల్ల వాయు♦తనయుం డరిగెన్. ౧౦౦

కం. అంతకు నంతకు వానర, కాంతుఁడు దను డాయుకొలఁది ♦ క్ష్మాసుత శంకన్
జింతించె రావణుండే, చెంతకు నటు వచ్చె ననుచుఁ ♦ జేడ్పడి భీతిన్. ౧౦౧

సీతాదేవి హనుమంతుని రావణుఁ డని శంకించుట.

ఉ. అక్కట! మోస మయ్యెను ద♦శాననుఁ డీగతి మాయురూపమున్
నెక్కొని వచ్చె, నీవిధము ♦ నేఁ దలపోయక మాట లాడితిన్

---

1 సీతాదేవి కనులవైభవము హనుమయందందు వర్ణించియున్నాఁడు. ఆయసితేక్షణత్వమే రాముని కామె యర్హత్వమును దెలుపుచున్నది. ఈపద మర్థగర్భితము. దీనివలన హనుమ తన గుణగ్రాహణశక్తి తెలిపెను.

మక్కువ విశ్వసించితిఁ, బ్రమాదము కల్గె నయో! య టంచుఁ దా
గ్రక్కునఁ గొమ్మ వీడుచు ధరాస్థలిఁ గూలఁబడెన్ వ్యథామతిన్. ౧౦౨

కం. వడఁకెడి దేహముతో వ్యథ,పడుపడఁతిం గాంచి హనుమ ప్రాంజలి యగుడున్
గడువెఱ నతనిం జూడక, యడజడి నిట్టూర్పుతోడ నన నీరీతిన్. ౧౦౩

చం. దెలిసితి లేర నిన్ను, నిటు తెక్కలివేషము వేసి రావణా!
కలఁచెద వేలరా? శుభము గాదుర నీ కిది, దండకాటవిన్
వలనుగ భిక్షురూపమున వచ్చినమాయలమారి వీవె, దు
ర్బల నుపవాస దీనఁ దగవా యిటు కాఱియ పెట్ట రాక్షసా? ౧౦౪

ఉ. రావణుఁ డీ వటంచు నన రా దనియున్ మదిఁ దోఁచె, నిన్గనన్
భావమునందుఁ బ్రీతి ప్రభవం బగు చున్నది, రామదూత వే
వావిరి మేలు నీ కగుత వర్ణన సేయుము మత్ప్రియంబులౌ
నావిభురామచంద్రునిగుణంబు, లనంతముదంబు నా కగున్. ౧౦౫

కం. భూరిప్రవాహవేగము, తీరంబు హరించురీతిఁ దిగిచెదు సౌఖ్యా
కారా! మచ్చిత్తము నని, ధారిణిసుత మఱియు నిట్లు దలఁచెన్ మదిలోన్.

ఉ. ఎక్కడిరామదూత? యిట కేగతి నచ్చును? స్వప్న మద్దిరా
నిక్కపుసౌఖ్య మిచ్చెడిని నేఁటికి రామునిదూత నంచుఁ దా
నొక్కఁడు ప్రీతి వచ్చె,నయయో కలయుం గఱవాయె, మత్పురం
బెక్కియొ నన్నుఁ జేర దడి, యేగతిఁ గాంచెద రాఘవేంద్రులన్. ౧౦౭

చం. కల యిది గాదు, వానరునిఁ గాంచిన స్వప్న మునందు భద్రముల్
గలుగునె? కల్గు చున్నయవిగా యిపు డీతనిఁ జూడ, నామనః
కలిలమొ? వాతలక్షణమొ? కా దనఁ బిచ్చియొ? యెండమావొ? యిం
దుల నెది గాదు, చక్కఁ గపి తోఁచెడి, నాస్మృతి లెస్స యుండెడిన్. ౧౦౮

చం. అనుచు బలాబలంబుల నిజాత్మవిచార మొనర్చి, లేదు నా
మనమున మోస, మింక నను మానము మానెదఁ, గామరూపి యా
దనుజవరుండె వచ్చె, నిది తథ్య మ టంచును నిశ్చయించి యా
యనుపమసాధుశీల పలుకాడక యుండె మరుత్తనూజుతోన్. ౧౦౯

## ⟵ హనుమంతుఁడు సీతాదేవికి సందేహము దీఱునట్లు భాషించుట. ⟶

కం. కాంతామణి యీవిధమునఁ, జింతాకుల యగుట కీశశేఖరుఁడు నిజ
స్వాంతంబున నూహించి ని,తాంతమధురసూక్తి నతికిఁ దా నిట్లనియెన్. ౧౧౦

ఉ. రాజులలోన మేటి, దినరాజు ప్రతాపమునందు, యామినీ
రాజు మనోజ్ఞతన్, భువనరాజులరా జలరాజరాజన

ట్లాజగదేకకీర్తి యప♦రాజితశౌర్యుఁడు, మూర్తిమద్రతీ
రాజు సురూపసంపద, వి♦రాజిలు సత్యవచోరతుండునున్. ౮౧౧

కం. గురుఁడు మధురోక్తులను భీ,కరుఁడు విరోధులకు భువన♦గణ మెవ్వనిశ్రీ
కరకరములఛాయను సు,స్థిరతన్ జీవించు నట్టి♦దేవుని రామున్ ౮౧౨

కం. మృగము నెపంబుగ దూరం,బుగఁ గొనిచని యెవరు లేని♦పొలకువఁ గని నె
వ్వగఁబడ నిన్నుం దెచ్చిన,పగతుఁడు తత్ఫలముఁ గుడువఁ♦బరికింపు మికన్. ౮౧౩

శా. జ్వాలాభీలకరాళశాతఖగదు♦ర్వారప్రవాహంబునన్
బాలా! రావణు ముంచి త్రుంచు ననిఁ గో♦పస్ఫీతుఁడై పోరిలోఁ
గాలాగ్నిప్రతిమానుఁ డేమహితుఁ డా♦కాకుత్స్థవర్యుండు స
చ్ఛీలా! నీకడ కంచె దూతగ నన♦న్నెంకింప నీ కేటికిన్. ౮౧౪

సీ. నీవియోగంబున ♦ నెవ్వగ రాముఁడు, నీసేమ మడిగె నో♦నీరజాస్య![1]
సౌమిత్రి సద్భక్తి ♦ సాష్టాంగ మెరఁగి నీ♦కుశలంబుఁ గోరె నో♦కోమలాంఘ్రి!
రామునిమిత్రుండు ♦ రాజు క్రోఁతుల కెల్ల, సుగ్రీవుఁ డడిగె నీ♦శుభముఁ దల్లి!
సౌమిత్రిసుగ్రీవ♦సహితుఁడై రాముండు, సంస్మరించును నిన్ను ♦ సతము దేవి!

తే. రాక్షసులకును జిక్కియు ♦ రాజతనయ! భాగ్యవశమున నిందాఁక ♦ బ్రదికి యున్న
దాన విం కిటఁ దూర్ణంబ ♦ తరుణి కనెదు, రాము లక్ష్మణు వానర♦స్తోమవిభుని.

ఉ. మానిని! వానరుండ, హను♦మంతుఁడఁ బేర, దినేశపుత్రుఁ డౌ
వానరరాజుమంతిరిని ♦ వారిధి దాఁటితి, లంకఁ జొచ్చితిన్
దానవనాథునెత్తిపయి ♦ నాపద ముంచి పరాక్రమంబునన్
గానఁగ వచ్చినాఁడ నినుఁ ♦ గంజదళాయతనేత్ర! నమ్ముమా. ౮౧౫

కం. ఎవ్వనిఁగా నను దలఁచితి, వవ్వాఁడను గాను నంది♦యుంపడ నేలా?
పువ్వుంబోఁణిరొ? యనుచును, నివ్విధిఁ బలుకంగ సీత ♦ యిట్లని యడిగెన్. ౮౧౬

సీతాదేవి హనుమంతుని రామలక్ష్మణులచిహ్నంబు లడుగుట.

సీ. శ్రీరామచంద్రుతో ♦ స్నేహ మెట్లు లభించె, నీకు? లక్ష్మణు నెట్టు ♦ లెఱిఁగి తీవు?
నరవానరుల కెట్లు ♦ పరఁగె సమాగమం? బెట్టిగుర్తులవార ♦ లిద్ద ఱన్న
దమ్ములు? వానిని ♦ దథ్యంబుగాఁ దెల్పి, నాదుఃఖ మడఁపు వా♦నరవరుండ!
యెట్టిది సంస్థాన?♦మెట్టివి రూపంబు, బాహూరువులు రామ♦భద్రునకును

ఆ. నతనిసోదరునకు? ♦ నంతయు వినిపింపు, మంచు నిట్లు దన్ను ♦ నడుగుటయును
మారుతాత్మజుండు మైథిలితో రాఘ,వులశుభాంకములను ♦ బలుకఁ దొడఁగె.

ఉ. భాగ్యము గాదె దేవి! నను ♦ భావమునం దిటు విశ్వసించి నీ
వాగ్యమ ముజ్జగించి నిజ♦వల్లభుగుర్తులు లక్ష్మణాంకముల్

[1] నీరజాస్య - కోమలాంఘ్రి - తల్లి - దేవి యివి సార్థకపదములు. వియోగమున ముఖస్మరణము - అంఘ్రులకు నమస్కారణము - సుగ్రీవునకు సీతయందు మాతృభావము సముచితము. ఇట్లులే తక్కినవి యూహించుకొనునది.

యోగ్యవిధంబుగాఁ బలుకు ♦ మున్నవిధంబుగ నంటి ప్రీతి సౌ
భాగ్యవతీ! వచింతు విను ♦ భ్రాతల మేనిశుభాంకపద్ధతుల్. ౧౯

సీ. రాముండు కమలప♦త్రవిశాలలోచనుం, డఖిలసత్త్వసుమనో♦హరగుణుండు
రూపదాక్షిణ్యని♦రూఢుఁడై జనియించెఁ, దేజంబునందు నా♦దిత్యుఁబోలు
నోరుపుగుణమున ♦ నుర్వికిఁ దుల్యుండు, బుద్ధి బృహస్పతి♦పురుడు చూపు
సద్యశంబున హరి ♦ సకలజీవావళీ, రక్షకుఁ డాత్మీయ♦రక్షకుండు
ఆ. స్వకులవృత్తి ధర్మ♦సంరక్షకుఁడు నాల్గు,జాతు లరయుచుండు ♦ రీతిచెడక
మనుజహితము లైన♦మర్యాదలం దుండి, పరుల నట్ల చేయఁ ♦ బనుచు చుండు.
ఉ. కాంతి రహించుఁ, బూజితుఁడు ♦ కంజదళాక్షిరో! బ్రహ్మచర్య మ
త్యంతముఁ బూను, సాధులకుఁ ♦ దప్పనిప్రాపు, సమస్తసద్విధుల్
సాంతముగా నెఱుంగు, సము♦పాసితవిప్రుఁడు, రాజవిద్యలం
దెంతయు మేటి, శీలధనుఁ ♦ డెల్లరపట్ల వినీతుఁ డంగనా! ౨౧
తే. వేదవేదాంగముల యజు♦ర్వేదమునను
విల్లువిద్యను నిపుణుండు♦విపులము లగు
నంసములవాఁడు దీర్ఘబా♦హువిరాజి
యబ్జకంఠుఁడు ముఖము రా♦కాబ్జసఖము. ౨౨
ఆ. తామ్రలోచనుండు ♦ తతగూఢజత్రుండు, దుందుభిస్వనుండు ♦ తోయజాక్షి
బల్లిదుండు స్నిగ్ధ♦వర్ణుండు చామన,చాయవాఁడు సింహ♦సంహాసనుఁడు. ౨౩
సీ. [1]సమవిభక్తాంగుండు ♦ సముఁడు త్రితామ్రుండు, త్రిప్రలంబుండును ♦ ద్రిస్థిరుండు
ముచ్చోట్ల నున్నతి ♦ ముచ్చోట్ల స్నిగ్ధత, ముచ్చోట్ల గాంభీర్య♦మును గలండు
త్రివళివంతుండును ♦ ద్రిసముండు త్ర్యవనత,త్రిశిరస్కుఁ డమ్మ!నీ♦హృదయవిభుఁడు
నాలుగు వ్యంగ్యముల్ ♦ నాలుగు కలలును, నాలుగురేఖ లం♦దంబు మీఱుఁ
ఆ. జెలి! చతుస్సముండు ♦ బలి చతుష్కిష్కుఁడో, యమ్మ మహితనాసి♦కోష్ఠహనువు
లమరువాఁడు జంట ♦ లగుపదునాలుగు, సమముగాఁ గలండు ♦ జనకతనయ.
ఉ. నాలుగు ప్రక్కదంష్ట్రలును ♦ నాల్గిటియానముఁ గల్గు, నాలుగున్
నాలుగు వంశముల్ గలఁడు ♦ నాలుగు నొక్కటి స్నిగ్ధ, మాఱునున్
నాలుగు పద్మముల్, మఱియు ♦ నాలుగు నాఱును గొప్ప, వొప్పెడున్
నాలుగు రెండు మిట్టలును ♦ నాలుగు నైదును సన్నవైతగున్. ౨౪
తే. మూఁట వ్యాప్తుఁ డనుష్ఠించు ♦ మూఁటి నతము
రెంటఁ దెల్లన సత్యంబు ♦ నంటి యుండు

[1] ఈ మూఁడుపద్యముల కర్థము వివరముగా నుత్తరపీఠికయందుఁ గననగు.

ధర్మనిరతుండు సంగ్రహ♦దానవిధుల
నెంతయును నిస్తులుండు శ్రీ♦మంతుఁ డమ్మ.[1] ర ౨౬

కం. రామునిద్వైమాతురుఁ డగు, సౌమిత్రి యజయ్యుఁ డాజి ♦ సద్గుణరూప
ప్రేమముల నట్టివాఁడు,గ్వీమండలి దేవి! నిన్ను ♦ వెదకుచు వారల్. ర ౨౭

→ సీతాదేవికి హనుమంతుఁడు రామసుగ్రీవులసమాగమవిధంబుఁ జెప్పుట. ←

సీ. చనుదెంచి రమ్మ! మా♦చరియించుచోటికి, నన్న రాజ్యమునుండి ♦ తన్నుఁదఱుమ
బుశ్యమూకాద్రి మే ♦ మెల్లరు సేవింప, నన్నభయంబున ♦ నదరిపడుచు
నున్నసుగ్రీవుఁ డీ♦యన్నదమ్ములఁ జీర,వసనుల ధృతచాప♦పాణితలుల
వీక్షించి భయమున ♦ నెగిరి శృంగముఁ జేరి, ననుఁ బంపె వారిచం♦దం బెఱుంగ

ఆ. మోడ్పుఁగేలఁ బురుష♦ముఖ్యుల డాసితి, వారు నాదుపల్కు ♦ గారవింప
మోచి తెచ్చి కీశ♦ముఖ్యునిమ్రోలను, లలితరీతి వారి ♦ నిలుపుటయును. ర ౨౮

కం. వారు పరస్పరసల్లాపోరురతిఁ విశ్వసించి ♦ యొండొరులను వా
రూరార్చిరి తమిఁ దనతన, చారిత్రముఁ జెప్పి విశద♦సరణిగ నంతన్ ర ౨౯

కం. అన్న యగువాలిచేఁ దన,యన్నునిమిత్తంబు వెడల♦నడువంబడుటన్
బన్నపడి వగచు సుగ్రీ,వు న్నీప్రాణేశ్వరుండు ♦ పొలఁతీ! తేర్చెన్. ర 30

తే. నీవియోగవశంబున ♦ నెవ్వగ గొను, రాముచరితంబు వానర♦స్వామి కంత
వినిచె సౌమిత్రి యది విని ♦ విగతతేజుఁ, డయ్యె నుపరాగకలితప♦ద్మాప్తునట్లు.

ఉ. పూర్వము మింట రావణుఁడు ♦ పొల్తుక నిన్గొనిపోవువేళ నీ
వుర్విని వైచినట్టినగ ♦ లొక్కెడ నేఁ బదిలంబు సేసితిన్
సర్వము నష్ట తేర దివ♦సప్రభుసూతియుఁ జూపెఁ గాని హృ
త్పర్వము గూర్చ నీయునికి♦పట్టును మాత్ర మెఱుంగ మంగనా! ర 3౧

ఉ. వానిని జేర్చి యంకమున ♦ వారిజలోచన! నీదుభర్త శో
కానలదహ్యమానుఁ డయి ♦ యాభరణాళిని గాంచి కాంచి య
మ్మా! నినుఁ గూర్చి యా వఱచి♦న ట్లఱచెన్ వివిధప్రలాపుఁడై,
నేను విచేతనున్ నృపతి ♦ నెమ్మదిఁ దేర్చితి సాంత్వవాక్యులన్. ర 33

→ రామునివిరహతాపము హనుమంతుఁడు సీతాదేవికిఁ జెప్పుట. ←

ఆ. నగలు చూచి చూచి ♦ నగచరపతి కిచ్చె, మరల వాని నీదు♦మగఁడు దేవి!
నిన్నుఁ బాసి విభుఁడు ♦ నిత్య మగ్నిని గాలు,నగ్నిపర్వతంబు♦నటు తపించు. ర 3౪

కం. మగ్నుండై శోకంబున, భగ్నంబుగ నిద్ర చింత ♦ వనరుచు రాముం
డగ్నులచేఁ దపియించెడి,యగ్నిగృహం బనఁగ నున్న ♦ యాతం డబలా! ర 3౫

---

[1] ఇందుఁ గొన్నిచిహ్నములు వస్త్రములుఁగుననుండి సీతకుఁ దప్ప నితరులకుఁ దెలియరానివి. అట్టివి శాస్త్రజ్ఞానబలముచే నూహించి సరిగాఁ జెప్పఁగలిగెనేని నితఁడు నమ్మఁదగినవాఁడని సీత తలంపు. కాన నిట్టి విషమప్రశ్న.

ఉ. కావఁడు సౌఖ్య మేమి నినుఁ గానని వేదన చేతఁ, దాపముల్
మాపఁడు, త్వద్వియోగదహనంబు దహింపఁగ భూమికంపవే
గాన వణంకుకొండ యనఁగాఁ జలియించెడి, సంతసింపఁ డో
మానిని! నిన్నుఁ బాసి సుమమంజులకుంజము లెన్ని చూచినన్. ౨౩౬

తే. హృద్యకాంతారముల నెందు నేగుచున్నఁ
గమ్రలహరీతరంగిణుల్ గాంచుచున్న
నిన్నుఁ గాననికతమున నీరజాక్షి
మానవేంద్రున కరున మఱ్మాట లేదు. ౨౩౭

ఉ. అంబుజనేత్ర! నీపతి రణావని రావణుఁ బుత్రమిత్రయు
క్తంబుగఁ జంపి శీఘ్రముగఁ గ్రమ్మఱఁ గైకొను నిన్ను, బాస లా
యంబుజమిత్రవంశ్యుఁడును సజ్జహితోద్భవుఁ డాచరించి రో
యంబ! వధింప వాలి నిను నారసి నల్గడ వార్తఁ దేరఁగన్. ౨౩౮

ఉ. బంధురతేజు లుగ్రరణపండితు లాహరినాథుతోడఁ గి
ష్కింధను డాసి వాలి హతుఁ జేసి యినాత్మజు రాజుఁ జేయుటల్
సంధి ఘటిల్లె నీగతిని జక్కఁగ వారికి, వారిదూతుఁడన్
సింధువు నుత్తరించి యిటు చేరితి రోయుచు నిన్ను మైథిలీ. ౨౩౯

కం. హనుమంతుఁడఁ బేరను నా, యినజుఁడు రాజ్యస్థుఁడై హరీశ్వరకోటిన్
నిను నెమకఁగఁ బదిదిక్కుల,కును బంచిన వారు చనిరి కోమలి నీకై. ౨౪౦

ఉ. వాలితనూభవుండు కపివల్లభుఁ డుత్తమశూరుఁ డంగదుం
డోలిఁ ద్రిభాగసైన్యయుతుఁ డూనె స్వయంబుగ నేతదర్థమై
శైలవరంబు వింధ్యమునఁ జాలదినంబులు రోసి మేము దు
ర్గాళిని ద్రోవ తప్పి వ్యసనార్తిఁ బడం జనెఁ గాల మంతయున్. ౨౪౧

కం. పట్టయు గుట్టయు విడువక, చెట్టును జెట్టును మఱుంగు చేనుం జేనుల్
బట్టుగ వెదకిన జనకుని,పట్టీ! నీయునికి తెలియఁబడ దయ్యెఁ జుమీ. ౨౪౨

కం. చేమో కడచనియెను, బుడమితనూజాత యున్నపోబడిఁ గనముల్
సరి కపిపతి యనువెలఁ, విడువఁగ నెంచితిమి మేము వెలఁదీ యసువుల్.

హనుమంతుఁడు సీతాదేవితోఁ దన కామెయునికి దెలిసినవిధంబుఁ జెప్పుట.

ఉ. అంగదుఁ డంత శోకమున హా! యనుచున్ నినుఁ గోలుపోవుటల్
ప్రంగము గృధ్రరాజునకుఁ బ్రాణవినాశము వాలి కబ్బుటల్

శృంగమునందు మా కిటులు ♦ చేకుఱుటల్ మృతి, చెప్పికొంచు నో
యంగన! యేడ్చి, నేర్చిన జ♦టాయువుసోదరుఁ డంతయు న్వినెన్. ౧౪౪

మ. విని సంపాతి యనంగ గృధ్రపతి వే♦వే వచ్చి మాయంతికం
బునఁ గోపారుణనేత్రుఁ డై పలికె మ♦మ్ముం జూచి యెవ్వండు నా
యనుజుం జంపె వచింపుఁడీ ప్లవగులా♦రా! యన్నఁ దారేయుఁడుఁ
దనుజుం డాతని నీనిమిత్తము జన♦స్థానంబునం ద్రుంచుటల్ ౧౪౫

ఉ. అంతయు నాడె; నాడ నరు♦ణాత్మజుఁ డార్తి సహించి నీదువృ
త్తాంతముఁ బల్కె రావణుని♦ధామమునందు వసించి యుండుటల్[1]
సంతస మార దాని విని ♦ చయ్యనఁ గీశులు లేచి తన్నగ
ప్రాంతముఁ బాసి చేరిరి మ♦హాంబుధియుత్తరతీరధారిణిన్. ౧౪౬

ఉ. చిత్తము నిన్నుఁ జూడఁ ద్వర ♦ సేయుచు నుండియుఁ గంధిదర్శనం
బుత్తలపాటు గూర్చెఁ బ్లవ♦గోత్తమపాళికి, నంత నేను లో
హత్తినధైర్యసారమున ♦ నామడ లొక్కశతంబు దాఁటి దై
త్యోత్తమువీడు సొచ్చి నిశ ♦ నొయ్యన రావణు నిన్నుఁ జూచితిన్. ౧౪౭

చం. కలది వచించినాఁడ, మదిఁ ♦ గాతరభావము మాని ధీరతం
బలుకుము, నన్ను నమ్ముము, నృ♦పప్రవరోద్యమ మూని నీకుఁగాఁ
జెలి! యరుదెంచినాఁడఁ, గపి♦శేఖరుమంత్రిని, వాయుపుత్రుఁడఁ
జలజహితాన్వవాయనృప♦సత్తము రామునిదూత సాధ్వరో! ౧౪౮

కం. మీరాముఁ డఖిలాయుధ, వారభృదగ్రణికి సుఖము ♦ వర్ణితగుణ! గు
ర్వారాధనయుక్తుం డగు, వీరుఁడు సౌమిత్రి సుఖిత ♦ వెలసెడి నమ్మా! ౧౪౯

కం. నీవిభుహిత మెంచుచు సు, గ్రీవునిమడి దక్షిణముగ ♦ క్షితిజా! నిన్నున్
నే వెదకుచు ససహాయుఁడ, నై వచ్చితి నిన్నుఁ గంటి ♦ నతిపుణ్యమునన్. ౧౫౦

చం. నినుఁ గన లేనిదుఃఖమున ♦ నివ్వెఱఁగూరిన కీశపాళికిన్
వినిచి నినుం గనుంగొనుట ♦ వేతొలఁగించెద దుఃఖ మెల్ల, నో
జనని! సముద్రలంఘనము ♦ సార్థక మయ్యెను బుణ్యసంపదన్
హనుమ యొకండె కాంచె జన♦కాత్మజ నన్యశ మేను గాంచితిన్. ౧౫౧

↔ హనుమంతుఁడు సీతాదేవికిఁ దనజన్మవృత్తాంతముఁ జెప్పుట. ↔

కం. వీరుఁడు రాముఁడు సహపరి, వారున్ సహమిత్రునిన్ స♦బాంధవునిన్ ర
క్షోరాజుఁ జంపి పోరన్, వారక గ్రహియించు నిన్ను ♦ నమ్ముము దేవీ! ౧౫౨

సీ. మాల్యవంతం బను♦మహితభూధరమున, జనని! నాతండ్రి కే♦సరి వసించుఁ
జనియె గోకర్ణాఖ్య♦శైలంబున కతండు, నట శంబసాదనుఁ ♦ డనెడిదైత్యు

---

[1] సాముద్రికచిహ్నములఁ జెప్పుట, కొండమీఁదనున్న యేవురుక్రోఁతులము మేమే నీసొమ్ములు దాఁచితిమని చెప్పుట, స్నేహము కుదుర సరియైనకారణము, సంపాతి కొడుకును రావణుఁడు మార్గ మడిగికొనుట యివియన్నియు సీత విశ్వసింపఁ గారణములు.

దేవర్షిసంఘని♦ర్దిష్టుఁడై వధియించె, నతనిక్షేత్రంబున ♦ ననిలునకును
జనియించినాఁడను ♦ స్వకృతకర్మంబున, హనుమంతుఁడనునామ ♦ మమరె నాకు[1]

ఆ. నీవు నముపొందె ♦ నీనాథుగుణముల, నెల్లఁ బలికినాఁడ ♦ నిచటనుండి
నిన్నుఁ దోడుకొనుచు ♦ నీవల్లభుం డేగు, భయపడంగ వలదు ♦ భవ్యశీల! ౪౫౩

చం. అనవుడు విశ్వసించె జన♦కాత్మజ యాతని దూతగా మనం
బునఁ, గడుసమ్మదాశ్రువులు ♦ ముస్పర మై ప్రవహించె వాలుఁగ
న్గొనలను, రాహుముక్తశశి♦కోపున మోము వికాస మందె, వా
నిని దలపోసె నిక్కపువ♦నేచరుఁ డంచు నపాస్తశంక యై. ౪౫౪

కం. దానిని గని హనుమంతుఁడు, మానవతీమణికి ననియె ♦ మరలి చనియెదఁ
జానకి! యూఱడుమీ నీ, కే నేమి యొనర్తు నెద్ది ♦ యిష్టము చెపుమా. ౪౫౫

కం. పవనతనూజుఁడ నగుటను, జవబలగరిమములఁ దండ్రి ♦ సరిపోలుదు నో
యవనిజ! కపిమాత్రుఁడ నని, తవులుట సందియము నీకుఁ ♦ దగదు సుశీలా!

హనుమంతుఁడు సీతాదేవికి రామముద్రిక నిచ్చుట.

ఉ. ఇంకను నమ్మ వేని జన♦కేశ్వరనందిని! చూడు రామనా
మాంకిత మైనయుంగరము ♦ నాదటఁ బంచె నతండు దీని నీ
కింకరుచేత నీదుమది♦కిన్ ఘటియింపఁగ నమ్మకంబు నీ
యంకిలి దీఱు నం చొసఁగ ♦ నాయమ గైకొని దానిఁ బ్రీతితోన్.[2] ౪౫౬

చం. పతికరభూషణంబుఁ గని ♦ పద్మదళాక్షి ముదంబు నొందెఁ దాఁ
బతియె సమక్ష మచ్చుటికి ♦ వచ్చినయట్లుగఁ, దామ్రశుక్రభా
సితనయనాంచితం బయిన♦శ్రీముఖ మెంతొ వికాస మొందె న
ద్భుతగతి రాహుముక్తపరి♦పూర్ణసుధాకరబింబమో యనన్. ౪౫౭

కం. హ్రీమతి బాలామణి పతి, సేమము సందేశవార్తఁ ♦ జెప్పఁగఁ గపియున్
సామోదంబుగ విని యా, సామీరిని గౌరవించి ♦ స్తవ మొనరించెన్. ౪౫౮

సీతాదేవి హనుమంతునిఁ బ్రశంసించి రామాదులకుశలం బడుగుట.

సీ. జలనిధి యోజన♦శతము గోష్పదముగా, లంఘించి యొక్కఁడ ♦ లంకఁ జొచ్చి
తీవె శూరుండవు ♦ నీవె సమర్థుండ, వీవె ప్రాజ్ఞుఁడవు క♦పీంద్రచంద్ర!
సామాన్యవానరుఁ♦గా మది నమ్మంగఁ, జాల రావణుఁ డన ♦ సంభ్రమంబు
సంత్రాసమును లేమి ♦ శాఖామృగేశ్వర!, భాషింపఁ దగుదువు ♦ ప్రాణనాథుఁ

తే. డైనశ్రీరామునకుదూత ♦ వగుటఁ జేసి; పంపఁ డతఁ డపరీక్షితుఁ ♦ బవనతనయ!
యందులోపల నాకొఱ ♦ కంపునపుడు, పటుపరాక్రమవంతునిఁ ♦ బంపుఁ గాని.

---

[1] మాయ రూపముగాదనుటకై. స్వజన్మకథనము. [2] ఇతరకారణముల చేత నమ్మికపుట్టినతరువాత నుంగరముఁ జూపిన బుద్ధివైశారద్యముఁ గనుఁడు. తొలుత నే చూపిన సీత నమ్మియుండదు.

సీ. సత్యసంగరుఁడు కౌసల్యాతనూజుండు, కుశలిగా నాభాగ్యవశతఁ దండ్రి!
యనుపమగుణి సుమిత్రానందవర్ధనుం, డౌలక్ష్మణుఁడు సుఖియా హితేంద్ర?
రాముండు కుశలియేని భూమివార్ధులఁ గాల్ప, లేదుగా కల్పాగ్నిలీలఁ గినిసి?
కా కేమి శూరులు నాకుల[1] గెల్వరే, కలనిలో నాపాపఫలము గాక

తే. యున్నవాఁడు గదా రాముఁ డన్న! చెపుమ
మద్వియోగవ్యథాప్తిని మఱుఁగకుండ?
నాకుఁగాఁ బరితాప మందండు గాదె?
యెంచునా మీఁదికార్యంబు లెన్నఁ డైన? ౮౬౧

సీ. ఏమఱఁడే కదా యెల్లకార్యంబులు, దీనుఁ డై సంభ్రాంతి వానరేంద్ర?
పురుషకారము లెల్ల సరిగఁ జేయును గదా, యారాజనందనుం డాంజనేయ?
సలుపునా మిత్రుల శత్రులయెడ రెండు,మూఁ డుపాయంబులు మోసపోక?
గడన సేయును గదా కడు మిత్రవర్గంబుఁ! జెలికాండ్రు రతనిఁ బూజింతు రయ్య?

తే. దేవతానుగ్రహమును జింతించు నొక్కొ? పౌరుషంబును దైవంబుఁ బరఁగుచున్నె?
కరము వైవనా మీఁదఁ గరుణ గలఁడె? ప్రోచునా నన్ను,నీబాధ ద్రోచి తండ్రి?

కం. ఆగర్భశ్రీమంతుఁడు, భోగి వ్యథానర్హుఁ డైన పుణ్యుఁడు రాముం
డీగతి నాకై దుఃఖా,భోగంబున మిగుల నవసి పోలేదు గదా? ౮౬౩

సీ. కౌసల్యయు సుమిత్ర కపివరా! భరతుండు, కుశలులే? యువార్త విశదపడునె?
భ్రాతృవత్సలుఁ డైన భరతుండు నాకయి, యక్షౌహిణీసేన నంపు నయ్య?[2]
దంతనఖాయుధ తరుచరకోటితో, సుగ్రీవుఁ డీలంకఁ జొచ్చు నయ్య?
సత్త్వసంపన్నుండు సౌమిత్రి యసురుల, నానా స్త్రసృష్టిని నఱకునయ్య?

తే. చూతునా నేను భీకర శాతబాణ,దారితాంగు సబాంధవు దశశిరస్కు?
నానిమిత్తంబు వగచు చున్నాఁడె? యేక,మతియె నాపతి యణఁప నాయతులితార్తి?

చం. పరమనవీన హేమసమవర్ణము పద్మసమానగంధి యై
సురుచిర మైనమన్నయన సోమముఖంబు మరుత్తనూజ! మ
ద్విరహము పేరిమిన్ వ్యసనదీనత నీరము లింకఁ దమ్మికిన్
దర మయి వాడుపాఱదు గదా వచియింపఁగదయ్య తత్త్వమున్. ౮౬౫

ఉ. క్రౌర్యముతోడఁ గైకయి యరణ్యములం బడు మన్న ధర్మప
ర్యార్య మటంచు నెంచిన వికారవిదూరుఁడు, నేను బాదసం
చర్యఁ జరింపఁ గానఁ గనఁ జాలినధీరుఁడు, నేఁడు దీనుఁడై
ధైర్యము నుజ్జగింపఁడు గదా కపినాథ! నిజంబుఁ జెప్పుమా. ౮౬౬

ఉ. ఏ మనుదాన దూతుఁడ! మహీశ్వరు, నాపయిఁకూర్మికంటె శ్రీ
రాముని కాత్మమాతపయి రా జగుతండ్రిపయిన్ హితాళిపైఁ

---

[1] నాకులు = దేవతలు. [2] పూర్వపీఠికయు నుత్తరకాండము చూచునది.

ప్రేమము హెచ్చు గాదు సరి♦ప్రీతియుఁ గా, దటు గావునం గదా
యామహితాత్మువార్త విను♦నంతకు నిల్చితి మేనఁ బ్రాణముల్. ౧౬౭

చం. అని మధురార్థయుక్తము మ♦హార్థము నౌవచనంబు లాడి యా
వనజదళాయతాక్షి కపి♦వర్యునిరామగుణానుకీర్తనం
బును వినునాశ మానసము♦ బూనిన నాయమఁ జూచి వాయునం
దనుఁడు కరంబుభక్తిఁ గర♦తామరసంబులు మోడ్చి యిట్లనున్. ౧౬౮

## హనుమంతుఁడు సీతాదేవికి ధైర్యోక్తులు చెప్పుట.

చం. కమలదళాయతాక్షి! యెఱుఁ♦గండు సుమీ యిట నీవునున్కి నీ
రమణుఁడు, కావునం గద పు♦రందరుఁ డాశచిఁబోలె నిన్ను శీ
ఘ్రముగను దోడుకొం చరుగ♦ రాఁ, డిఁక నే వచియించినంత వే
గము చనుదెంచు ఋక్షకపి♦కాండసమాకులసైన్యయుక్తుఁ డై. ౧౬౯

ఉ. క్రమ్మెడుక్రూరశాతవిశి♦ఖమ్ములచే వరుణాలయంబు స్త
బ్ధమ్మొనరించి లంక హత♦పాపనిశాటగఁ జేయు నమ్మ! మ
ధ్యమ్మునఁ గాలుఁ డైన విబు♦ధాసురకోటులు నైన నాఁగిరన్
దిమ్ము వదల్చు నమ్ముము మ♦దిన్ నిరవద్యసుశీలభూషణా! ౧౭౦

కం. సింగముచేఁ జిక్కినమా,తంగమువలెఁ ద్విద్వియోగ♦తాపార్తుఁ డై
యంగన! సుఖము నెఱుంగఁడు, పొంగఱి కృశియించుఁ బూఁట♦పూఁటకు దేవి!

చం. మలయసుమేరువింధ్యధర♦మందరదర్దురభూధరాళిపై
ఫలముల వేరువెల్లకుల♦పై జననీ! శపథంబుఁ జేసెదన్
గలవు కనంగ భవ్యతర♦కంజవిలోచన ముజ్జ్వలోరుకుం
డల మరుణాధరంబు నగు♦నాథమనోజ్ఞముఖేందుబింబమున్. ౧౭౧

కం. రాముని ప్రస్రవణతటీ,ధాముని జూడంగఁ గలవు♦ త్వరగా నలసు
త్రాముని విబుధాలయగత,ధామానితనాకపృష్ఠ♦భాసితుఁబోలెన్. ౧౭౩

కం. మాంసము[1] ముట్టఁడు రాముఁడు, హంసీవరయాన! మధువు[2]♦ నాసింపఁడు సా
యంసమయములన్ మాత్ర ము,హింసారతి వన్యఫలము♦ లించుక గొనెడిన్.

కం. దోమలు నీఁగలుఁ బురుగులుఁ, బాములుఁ దను వెరియ మీఁదఁ♦ బ్రాఁకుచునున్నన్
రాముఁ డెఱుంగఁ డొకింతయు, భామిని! నీయంద యుంటఁ♦ బ్రాణము లెల్లన్.

సీ. నీచక్కఁదనమును♦ నీదుసౌశీల్యంబు, చెలువరో! ధ్యానంబుఁ♦ జేయుఁ జేయుఁ
జేయుచో నీ రూపు♦చెలువు కన్నులఁ గట్ట, సుందరీ! నివ్వెఱఁ♦ జూచుఁ జూచు
చూచి నన్ బాసితే♦ సుదతిరో! యంచును, గన్నులబడి నీరుఁ♦ గార్చుఁ గార్చుఁ
గార్చి నే నేరీతిఁ♦ గనుఁగొందునో కదే, మెలఁత నంచును గడు♦మిడుకు మిడుకు

---

[1] మాంసము=రుచికరముగ వాసనద్రవ్యములతోడ గృహంబున భోగ్యంబుగ పక్వముచేసిన మాంసము రాముఁడు భుజింపలేదనియు, నాపద్ధర్మముగ నాఁకలివేళకుఁ బచ్చిదో వెచ్చిదో యెప్పుడేని గ్రహించెననియు; దానివలనఁ గౌసల్యతోఁ జెప్పిన వ్రతమునకు భంగములేదనియు గ్రహించునది. [2] మధువు=తేనె.

తే. నన్య మేది స్మరింపఁ, డ♦నంగబాణ
తాపమునఁ జేసి కనుమూయఁ ♦ దలఁపఁ డెపుడుఁ,
దలఁచెఁ బో యంతలోన సీ♦తా! యటంచు
నులికిపడి లేచు మదిలోనఁ ♦ గళవళించు ౧౭౭

కం. పండో పువ్వో మఱి యిం, కొండుమనోహరపదార్థ♦మో కాంచినచో
నండజగమనా యంచును, నుండును నినుఁగూర్చి యుల్ల♦ముదిలకొనంగన్. ౧౭౮

కం. సీతా సీతా యనుచును, జేతము తపియింపఁ బలుకు ♦ క్షితిజా! నినుఁ దా
నే తెఱఁగునఁ బడయుఁగ నగు, నా తెఱఁగు నొనర్చెడిఁ మ♦హాత్ముం డనఁగన్.

ఉ. రామునికీర్తనంబునను ♦ రాగిలి రామసమానశోక సీ
తామదిరాక్షి దుఃఖమును ♦ ద వ్వొనరించి, శరన్ముఖంబునన్
ధూమజఖండయుక్త మగు♦తోయజశాత్రవమండలంబు నా
యామినిఁబోలి భూమిసుత ♦ యంజననందనుతోడ ని ట్లనున్. ౧౭౯

→ సీతాదేవి హనుమంతునకు రావణుఁడు పెట్టినగడువు నెఱింగించుట. ←

కం. రాముఁ డనన్యమనస్కుఁడు, రాముఁడు భూరివ్యథాప♦రాయణుఁ డనుచున్
నీమాటలు సుధ విషమున, సామీరీ! కలిపి యిడిన♦చందం బయ్యెన్. ౧౧౦

కం. భూరితరైశ్వర్యముననొ, దారుణదుఃఖమున నేని ♦ దైవము త్రాటన్
బూరుషునిఁ గట్టి యీడ్చును, ధారిణిపై జీవికిని స్వ♦తంత్రత గలదే? ౧౧౧

ఆ. విధిని దాఁటుజీవి ♦ విశ్వంబునను లేదు, వానరేంద్ర! యింత♦పట్టు నిజము
రామచంద్రవిభుని ♦ సౌమిత్రినిన్ నన్ను, నెట్లు పఱచెఁ గంటి♦వే కదయ్య.

ఉ. ఎప్పుడు చేరువాఁ డొకొ ది♦నేశకులాభరణంబు రాముఁ డీ
గొప్పవ్యథాసముద్రమున♦కూలముఁ? బెద్దతుపాను తాఁకునన్
ద్రిప్పుల నొందునావగతిఁ, ♦ దేజు దొఱంగి నలంగినాఁడె? న
నెప్పుడు దోడుకొం చరుగు? ♦ నెప్పుడు రావణుఁ ద్రుంచు? మారుతీ! ౧౧౩

ఉ. ఎప్పుడు వచ్చు నొక్కొ మను జేంద్రుఁడు? రాక్షసకోటిఁ బట్టి తా
నెప్పుడు ద్రెచ్చు నొక్కొ? దను♦జేంద్రునిఁ గిట్టి శరాలిపాలుగా
నెప్పుడు ద్రుంచు నొక్కొ? యసు♦రేంద్రునివీటిని మూలముట్టుగా
నెప్పుడు దంచు నొక్కొ? నను ♦ నెప్పుడు చూచెడి నొక్కొ? పావనీ! ౧౧౪

ఉ. తీవరపెట్ట వయ్య జగ♦తీవిభు నింతటిలోన రాఁగ నో
పావని! నా కిలన్ బ్రదుకు♦పాటును నీసమ[1] తీఱునంతకే
చూ విధియించె నట్లు దనుజుం, డిఁక మాసయుగంబ చిక్కెఁద
త్తావధియందుఁ, జెల్లెడిఁ జు♦మా దశమం బగుమాస మియ్యెడన్. ౧౧౫

[1] సమ = సంవత్సరము.

ఉ. పెక్కువిధాలఁ దమ్ముఁడు వి♦భీషణుఁ డెంతయు నొక్కిచెప్పె నీ
పక్కమలేక్షణన్ మరల ♦ నంపు మటంచును, నాలకింపఁ డా
ముక్కడి రావణుండు, విధి ♦ మూఁడినవానికి సాధుపద్ధతుల్
మక్కువ గూర్చునే దురభి♦మానము కన్నులఁ గప్పు చుండఁగన్? ౧౧౬

చం. పెనిమిటియానతిం గొని వి♦భీషణుపత్ని నిజాత్మజాతఁ దా
ననల యనంగఁ బేర నల♦రారెడికన్యక నీచరిత్రమున్
వినుపఁగఁ బంచె నాకడకు ♦ వే పతి నన్ను గ్రహించు శుద్ధమై
తనరె మదంతరాత్మయును ♦ దాన వసించు గుణంబు లెన్నియేన్. ౧౧౭

కం. పౌరుషము సముత్సాహము, సారతరబలంబు నాన్నృ♦శంస్యము మహిమో
దారత కృతజ్ఞతాదులు, శ్రీరామునియంద కలవు ♦ స్థిరముగ హనుమా! ౧౧౮

సీ. ఆజనస్థానంబు♦నందు సోదరుఁ డేని, బాసటగా లేక ♦ పదియునాల్గు
వేలరక్కసుల దో♦ర్లీల నొక్కఁడ చంపె, నట్టివానికి నెవ్వఁ ♦ డడల కుండు?
నింద్రుని శచిపోలె ♦ నెఱుఁగుదుఁ దన్మహి,మంబుఁ గష్టంబు లా♦మానధనునిఁ
గలఁపఁగ జాలవు ♦ కాండభానువులను, రక్షోజలంబుల ♦ రామభానుఁ

తే. డడరి శోషింపఁజేయు నం ♦ చశ్రుపూర్ణ,లోచనాంబుజ యైనయా♦లోలనేత్రఁ
జూచి యిట్లను నంజనా♦సూనుఁ డప్పు, డేల శోకించె దమ్మ! యీ♦లీల నీవు. ౧౧౯

హనుమంతుఁడు సీతాదేవిని దనవీఁపున నెత్తుకొనిపోయెద నని చెప్పుట.

ఉ. నానుడు లాలకించి రఘు♦నాథుఁడు వానరభల్లుకావళీ
సేనలతోడ నియ్యెడకు ♦ శీఘ్రమ వచ్చెడు, నంత కోర్వ నె
ట్లా నని తేని దుఃఖము ర♦యంబుగఁ బాతు ననింద్యశీల! చం
ద్రానన! నాదువీఁపుపయి ♦ నాదట నెక్కుము కొంచుఁ బోయెదన్. ౧౨౦

కం. నీ వాకత వేల? లంకను, రావణునిన్ మోచికొనుచు ♦ రయమునఁ బోవం
గా వలఁతిని జేర్చెద నిపు,డే విభుకడ హవ్య మగ్ని ♦ యింద్రునకువలెన్. ౧౨౧

శా. అమ్మా! మున్ దనుజావళిం దునుమ దై♦త్యారాతి సన్నాహి యా
నమ్మాడ్కిం దనతమ్ముతోడ భవదీ♦యప్రాణనాథుండు య
త్నమ్ముం జేయుచు నుండఁ జూడఁ గల వు♦ద్యత్ప్రీతిఁ గన్నారఁగా
లెమ్మా యెక్కఁగదమ్మ! వీఁపుపయి నో♦లేమా! నసున్ నమ్ముమీ. ౧౨౨

కం. నినుఁ జూడఁ గోరు వానిని, ననుపమబలశాలిఁ బర్వ♦తాశ్రమగతునిన్
గనుఁగొనెదు నాకపృష్ఠం,బున నుండెడివజ్రధరునిఁ♦బోలినవానిన్. ౧౨౩

ఉ. ఆలము సేయకమ్మ నిను ♦ నాదటఁ గూర్చెదఁ బ్రాణనాథుతో
బాలిక! రోహిణీకుముద♦బాంధవులట్టులు కూడి యుండ మీ
రాలు మగండు, శీతకిర♦ణార్కులతోడఁ బ్రసంగ మాడుచున్
లీలగ దాఁటవమ్మ యవ♦లీల నభంబును సాగరంబునున్. ౮౯౪

కం. నిను నేఁ గొనిపోవఁగ న, న్ననుగమనము సేయ నోపఁ ♦ డమ్మా! లంకన్
దనుజుం డొక్కం డైనను, ననుమానము మాని యెక్కు♦మా నావీఁపున్. ౮౯౫

కం. ఏకరణిని వచ్చితి విట, కాకరణిని గొంచుఁబోదు ♦ నాకాశమునన్
నీ కేల సందియం బన, నాకపిఁ గని హర్షవిస్మ♦యాంగి వచించెన్. ౮౯౬

↞ హనుమంతుఁడు సీతాదేవికిఁ దనదేహముఁ బెంచి చూపుట. ↠

కం. హనుమా! మిక్కిలిదూరము, ననుఁగొని నీ వేగతిం జ♦నం జాలెద వో
విన వింతలు నీపలుకులు, వనచర! నీకోఁతిబుద్ధి ♦ వచ్చెం దెలియన్. ౮౯౭

ఉ. ఇంతవు నీ వదేమిగతి ♦ నేగెదవో నను మోసికొంచు భూ
కాంతునిపాలి కిం చనిన ♦ వ్మారుతపల్కుల నాలకించి లోఁ
జింత వహించె నా కిపుడు ♦ చేకుఱెఁ గ్రొత్తపరాభవం బ టం
చెంతయు వానరుండు మఱి ♦ యిట్లని తాఁ దలపోసె నాత్మలోన్. ౮౯౮

చం. ఎఱుఁగదు గాక యించుకయు ♦ నెంతటివాఁడనొ కానఁ బల్కె న
న్నుఱక మదీయరూప మిపు ♦ డొప్పుగఁ జూపిన నమ్ముఁ గాక యీ
తెఱవ యటంచు నెంచి తన♦దివ్యమహాకృతిఁ జూప నేలపై
కుఱికి ద్రుమంబునుండి రభ♦సోద్ధతిఁ బెంపఁ దొడంగెఁ గాయమున్. ౮౯౯

సీ. దీప్తానలప్రభఁ ♦ దేజరిల్లుచు మేరు♦మందరసంకాశ♦మహితరూప
మునఁ దామ్రవక్త్రుఁడై ♦ఘనవజ్రసన్నిభ, దంష్ట్రానఖంబులు ♦ దద్దవెలుఁగ
జానకిముంగల♦గా నిలుచుండి యి, ట్లనియె నాసతితోడ ♦ నాంజనేయుఁ
డో దేవి! నగరివ♦నోద్దేశముగ సాట్ట, నప్రతోరణముగ ♦ వైరినాథు
ఆ. తోడ లంకఁగొనుచుఁ ♦ దోరంపుజవమునఁ, బోవుశక్తి గలదు ♦ భూమితనయ
పిన్నవాఁడ ననున♦భిప్రాయమును బాసి, రమ్ము జాల మేల ♦ రాముకడకు. ౯౦౦

↞ హనుమంతునితోడ సీతాదేవి తాను రామికిఁ గారణములు చెప్పుట. ↠

చం. అనవుడు వాయుసూనుని మ♦హాద్భుతభీప్రదమైనరూపమున్
గనుఁగొని నీరజాక్షి యను ♦ గాడుపునందనుతో నెఱింగితిన్
ఘన మగు తావకీనబల♦గర్వసమున్నతి వాయువేగమున్
వనదహనోరు తేజమును ♦ వానరమాత్రుఁడవే కపీశ్వరా! ౯౦౧

ఉ. ఇంతటివాఁడు గాక యది ♦ యెట్లు పయోధిఁ దరించి లంక నే
కాంతము చొచ్చి న న్నరయఁ♦గా క్షముఁ డా? నొకప్రాకృతుండు దా
నింత ఘటింప నేర్చు నె? య♦హీనజవంబున నన్ను రామభూ
కాంతునియంతికంబునను ♦ గ్రచ్చఱఁ జేర్తువు విశ్వసించితిన్. ౯౦౨

సీ. అయినను మామకీ♦నాత్మేశకార్యంబు, వేగంబ సిద్ధించు♦విధ మ దెట్లొ
యని తలపోయుట ♦ యావశ్యకము నాకుఁ, గాదె? నీ వెంట రా♦రా ద టౌట
ననిలవేగముతుల్య ♦ మగునీదుజవమున, కోర్వక దిగ్భ్రమ ♦ యొదవు నాకుఁ
బైపైనఁ బొరలుకూ♦పారంబుఁ గన భీతిఁ, దల చుట్టి పడిపోనె ♦ దానిలోనఁ

తే. బడినయంతనె తిమినక్ర♦పటలి నన్నుఁ
బట్టి చవు లూరఁగా మ్రింగి ♦ యట్టె పోవె?
నన్ను రక్షింపఁ దలపోయు ♦ చున్ననిన్నుఁ
గూర్చియును సంశయించెదఁ ♦ గ్రోఁతిరాయ. ౯౦౩

సీ. నను గొనియేగుని ♦ న్గని పంక్తి కంధర,చోదితరాక్షస♦శూరవరులు
నిను వెంబడింపరే? ♦ నీకును వారికిఁ, జండసంగ్రామంబు ♦ జరుగ కున్నె?
శూలముద్గరకరా♦భీలుర వారల, గెలుతువో? కలనిలో ♦ గెలువ లేవొ?
సాయుధుల్ వారు ని♦రాయుధుండవు నీవ, దెట్లు పోరెదవు న♦న్నెట్లు గాతు?

తే. వీవు కలహింపఁ గ్రూరదు♦ర్భావు లైన
దైత్యులను గని నామది ♦ తల్లడిల్లి
వనధిలోపలఁ బడుదునో? ♦ పడిన నన్నుఁ
గొనుచుఁ బోయి యొసంగరే ♦ దనుజపతికి? ౯౦౪

ఉ. పోరుపయిన్ మది న్నిలిపి ♦ పోరుచు నుండెడివేళ నీవు నే
వారిధి జాఱి త్రెళ్ళినను ♦ వారు బలాత్కృతిఁ గొంచుఁబోయినన్
శూరత నిన్ను గెల్చినను ♦ జొప్పు చెడుం గద? నన్ను రాక్షసుల్
క్రూరత ముక్కముక్కలుగఁ ♦ గోయరె వారలచేతఁ జిక్కినన్? ౯౦౫

చం. అరయఁగ నేరిసొమ్ము విజ♦యాపజయంబులు యుద్ధమందు? సా
గరమున నేను ద్రెళ్లమియ ♦ కల్గినన్ విజయంబు నీకు నే
దొరకిన యేనియున్ దనుజ♦ధూర్తులయార్భటి విన్నమాత్ర నే
హరివర! ప్రాణముల్ విడనె ♦ యంత భవత్కృతి వ్యర్థమే కదా? ౯౦౬

కం. చాలుదువు నీవు రాక్షస, పాళిన్ గెలువంగ నట్టి♦భంగియ యగు నే
నీలోకంబునఁ దఱుఁగదె, వాలాయము రాముకీర్తి ♦ వనచరనాథా! ౯౦౭

కం. అట్టులు గా. కుండినచోఁ, బట్టుగ రాక్షసులు నన్నుఁ ♦ బార్థివులు కపుల్
నెట్టన యెఱుంగ కుండఁగ, గు ట్టగుస్థలి దాఁప ఫలము ♦ గూడునె మీకున్?

ఉ. రామునిప్రాణ మాయనఘు♦భ్రాతలప్రాణము కీశవర్య! మీ
స్వామికులంబుప్రాణమును ♦ వర్తిలు నెంతయు సేమమార నా
క్షేమముఁ బట్టి, య ట్లగుటఁ ♦ జెచ్చెరఁ బోయి సుఖాన నున్న దా
భూమిజ యంచుఁ దెల్పి నృప♦పుంగవుఁ దెమ్ము శుభమ్ము కల్గెడిన్. ౯౦౯

కం.భూసుత లే దని నృపవరు, లాసను నాయెడను మాని♦రా యంతటితో
వాసిచెడి వానరావళి,తో సమయుటె నిజము వారు ♦ దుఃఖబలమునన్. ౯౧౦

చం.వరపతిభక్తిఁ జేసి మగ♦వానిని రామునిఁ దప్ప నింక నె
వ్వరిని స్పృశింప నొల్ల, దశ♦వక్త్రుఁడు దాఁకఁడె నన్ను నంటివా?
పరవశురాల, దుర్బలను ♦ బ్రాపును లేద, యనాథ, నొంటి, నె
ప్పరసున నేమి చేయఁగలఁ? బావని నీవ తలంచి చూడుమా. ౯౧౧

కం.రాముఁడు దశకంధరు సం,గ్రామంబున నింద చంపి ♦ కలబంధులతో
సేమముగ నన్నుఁ గైకొన, సామీరీ! యతని కదియె ♦ సముచితకృతి యౌ. ౯౧౨

ఉ. శిక్షితవైరి యైనరఘు♦శేఖరుభూరిపరాక్రమంబుఁ బ్ర
త్యక్షము గాఁగ నేఁ గనిన♦దానఁ, బోరిం బోర విన్నదాన, నా
దక్షుని సంగరస్థలిని ♦ దాఁకఁగ లేవు ముఖాముఖిన్ సహ
స్రాక్షముఖామరోరగసు♦రారిచయంబులు నైన వాయుజా! ౯౧౩

ఉ. ఎవ్వఁ డొకో సహించెడి న♦హీనబలున్ బలవైరివిక్రమున్
జివ్వను జిత్రకార్ముకు వి♦చిత్రచరిత్రు సలక్ష్మణుం గడున్
గ్రొవ్వఱఁ జూచియేనియు? న♦కుంఠితమత్తదిశాగజాభుఁ దా
నెవ్విధిఁ దాఁకియున్ మను స♦మీరసమీరిత వహ్ని తుల్యునిన్. ౯౧౪

కం.కల్పావసానభాస్కర,కల్పు నమోఘానుపమిత♦కాండుని దృఢసం
కల్పుని లక్ష్మణసహితునిఁ, జల్పునొ సాహస మెవండు ♦ సమితిం దాఁకన్? ౯౧౫

ఉ. కావున వేఱుపాయములఁ ♦ గార్యము లే, దిటకున్ రయంబునన్
నావిభు లక్ష్మణాన్వితు వ♦నాటసమూహధవోపసేవితున్
నీ వెట్టులేని తెమ్ము, ధర♦ణీవిభుఁ గూర్చి నితాంతనిత్యదుః
ఖావిల నన్నుఁ దేర్చు, పవ♦నాత్మజ! పుణ్యము నీకు నయ్యెడున్. ౯౧౬

### సీతాదేవి చెప్పినకారణములను విని హనుమంతుఁ డామెను బ్రశంసించుట.

కం.అని జనకతనయపలికిన, విని వాక్యవిశారదుండు ♦ ప్రీతుం డగుచున్
జననాథుతరుణిఁ గనుఁగొని, యనియెఁ జతురవచనరచన ♦ యమరఁగ నిట్టుల్.

తే. చారుదర్శన నీ వన్న♦చంద మరయ, యుక్తరూపంబు నినువంటి♦యువతిమణికి
స్త్రీస్వభావంబునకును వి♦శిష్టసాధ్వి, శీలమునకును దగినట్లు ♦ చెప్పి తమ్మ. ౯౧౭

తే. ఆఁడుదానవు గావున ♦ నదరె దిట్టు,[1] లామడలునూఱు విరివి గ♦లట్టికడలి
నాదుపేఁ పెక్కి దాఁటంగ ♦ నళిననేత్ర! విశద మయ్యెను దీన నీ♦పిఱికితనము.

ఉ. రెండవకారణంబుగ ధ♦రిత్రిసుతా! యని తీవు ప్రాణకాం
తుం డగురాముఁ దక్క మఱి ♦ నూల్కొనఁ దాఁకఁగ నొండ్లఁ జుమ్మి యె
వ్వం డగుఁగాక యంచు, నటు♦వంటిమహాత్ముని భార్య వైనయో
యండజనేత్ర! నీకుఁ దగు ♦ నట్లన, నన్య లిటుల్ వచింతురే? ౯-౨౦

చం. వినియెడువాఁడుగాక రఘు♦వీరుఁడు దేవి! త్వదీయచేష్టితం
బును మఱి నీవు నాయెదుటఁ ♦ బొందుగఁ బల్కినయట్టిమాటలున్
వనజదళాక్షి! నీవు పడు♦పాటులు గన్గొని రామునందు మ
న్ననమునఁ గల్గుభక్తికత♦నన్ వచియించితిఁ దద్విధంబుగన్. ౯-౨౧

చం. జలధిఁ దరించు టెంతయు న♦సాధ్యము గావున, లంకఁ జొచ్చుటల్
సులువుగఁ గానికార్య మను♦చుం దలపోసి స్వశక్తి నెంచి నేఁ
బలుకుట తద్విధంబుగను ♦ భామిని నిన్నతితోడఁ గూర్చు మేల్
దలఁపునఁ గాని వేఱొకవి♦ధంబుగ నీమది నెంచఁబోకుమీ. ౯-౨౨

కం. నావెంట నిపుడు వచ్చుట, కీవుత్సాహంబు సేయ♦వేనియు రామ
క్ష్మావిభున కభిజ్ఞానము, దేవీ యే దైన నిమ్ము ♦ తెలియఁగ దానన్. ౯-౨౩

సీతాదేవి హనుమంతునకుఁ గాకాసురవృత్తాంతముఁ జెప్పుట.

కం. అని పవనసుతుఁడు పల్కిన, విని జానకి కనుల నీరు ♦ వెడలఁగ హనుమం
తునితో నిట్లను మెల్లగ, వినుమీ మేల్గుర్తు నిట్లు ♦ విభునకు ననుమీ. ౯-౨౪

సీ. మును చిత్రకూటంబు♦నను నీశ్వరాశను, మందాకినీతీర♦మందు మనము
తాపసాశ్రమములఁ ♦ దవిలి వసించుచో, విమలసుగంధిపు♦ష్పముల నొప్పు
వనములఁ దిరుగుచు ♦ బడలి నీకుఱువున, నుండితి నట వాయ♦సుం డొకండు
తనముక్కునను మాంస♦మునయాన నన్నుఁ జ,రక్కునఁ బొడిచెఁ జు♦ఱుక్కనంగ

ఆ. మంటిపెళ్ళ నెత్తి ♦ తుంటరికాకిని, గొట్ట నదియుఁ జుట్లఁ ♦ బెట్టుచుండెఁ
గాని పోవ దయ్యె ♦ దానిని గని కోప,మునను దఱిమికొట్ట ♦ మనసు నెట్టె. ౯-౨౫

కం. నాయొడ్డాణముఁ దీసితి,నాయెడ నొక్కింత జాఱె ♦ నంశుకము చెఱం
గాయది గని నీనవ్వుట,నాయాసముపడితి లజ్జ ♦ యలముటకతనన్. ౯-౨౬

కం. ననుఁ గాకము చీరుటచేఁ, గినుకయు నీ వపహసింపఁ ♦ గెలఁగ సిగ్గున్
జనుదెంచి గాసిపడి నేఁ, గొనకొని నీయంకసీమఁ ♦ గూర్చుంటి వ్యథన్. ౯-౨౭

చం. బుడబుడ బాష్పముల్ కనులఁ ♦ బొంపిరి వోవఁ జెఱంగుచేత నేఁ
దుడుచుకొనంగ నన్నుఁ గని ♦ తోయజలోచన! యూఱడింపవే?

---

[1] ౯-౭-వ పద్యములోని యుల్లసవుమాట కిది బదులు.

వడఁబడి నీదునూరువున ♦ వ్రాలితి నిద్దురగ్రమ్ముకనులన్
వడిగ నె లేచితిం బిదపఁ ♦ బ్రాణవిభుండును గూర్కె నాతోడన్, ౨౭

ఉ. అంతట మున్ను గాసి నిడి ♦ నట్టిది యాపలుగాకికాకి నా
యంతికసీమ డాయుచు స్త♦నాంతరసీమను జీరి యంతతో
శాంతి వహింప కాపులుఁగు ♦ సత్వరతం బొడువంగ మాటికిన్
వంత జనింప రాముపయి ♦ వ్రాలెఁ దదుద్గతరక్తబిందువుల్. ౨౮

ఉ. పాపపుఁబుల్గు నా కిడెడు♦బాధ సహింపఁగ లేక నిద్దురన్
లేపితి నామనోవిభుని ♦ లేచి యతండు స్తనాంతరంబునన్
జేపడియున్న కాటుఁ గని ♦ చిత్తమునం గన లూని యెవ్వఁ డీ
పాపముఁ జేసెఁ జెప్పు మిఁకఁ ♦ బైదలి! యాతని రూపుమాపెదన్. ౩౦

ఆ. రోషవేగమునను ♦ రోఁజెడిపంచవ,క్త్రంబుపాముతోడ ♦ గర్వి యెవ్వఁ
డాడుకొనఁగఁ జొచ్చె ♦ నంబుజలోచన! యనుచు నచట నాకు ♦ నభిముఖముగ

ఆ. రక్తసిక్తనఖర♦యుక్త మాకరటంబుఁ, గనియెఁ గనినయంతఁ ♦ గాకిరూపుఁ
గొనినయట్టి శక్రు♦కొమరుండు గా డ్వనఁ, బర్వతంబు డిగ్గి ♦ పాఱఁ దొడఁగె.

సీ. అది చూచి శ్రీరాముఁ ♦ డాగ్రహవశుఁ డయి, యాయరిష్టముపట్ల♦నదయుఁ డగుచు
దర్భాసనంబున ♦ దర్భయొక్కటి దీసి, బ్రహ్మమంత్రంబునఁ ♦ బ్రజ్వరిల్లఁ
జేసి మాకళిమీఁద ♦ వేసిన నదియును, నంబరపథమున ♦ నరుగుచున్న
బలిభుక్కు వెన్నంటి ♦ పఱవఁ దొడంగెను, గాకియు వెఱ మూఁడు♦లోకములను

తే. సంచరించుచుఁ బలువుర ♦ శరణు వేఁడెఁ
గన్నతండ్రియు సురలును ♦ ఘనమహర్షి
చయములును దాముఁ గావంగఁ ♦ జాల మనఁగ
మరలి చనుదెంచి రామునే ♦ శరణుఁ జొచ్చె. ౩౩

సీ. శరణంచు ధరణిపై ♦ సాఁగిలఁబడినట్టి,వాయసుఁ గని యది ♦ వధ్య మయ్యుఁ
జంపక కాచితి ♦ పెంపారుకరుణచే, జగముల దిక్కేది ♦ వగవు చెంది
శరణాగతుం డైన♦వగభృత్తుఁ గనుఁగొని, వ్యర్థంబు పోదు బ్ర♦హ్మాస్త్ర మేమి
చెప్పెద ననినను ♦ జేకొననిమ్ము నా,కుడికంటి ననియె నా♦చెడుగుకాకి

ఆ. చెడిద మైనశరము ♦ కుడికన్ను హరియించి, చనియెఁ జనియెఁ గాకి ♦ చావు దప్పి
కన్ను లొట్ట వోవఁ ♦ గాకుత్స్థకులున కా,దశరథునకు[1] భక్తి♦దండ మిడుచు. ౩౪

కం. నాకొఱకై బ్రహ్మాస్త్రముఁ, గాకముపై విడిచి నిన్నుఁ ♦ గా దని ననుఁ దా
నీకరణిని గొని తెచ్చిన, యాకూళునియెడ నుపేక్ష ♦ యగునె నరేంద్రా! ౩౫

---

[1] శరణాగతరక్షణధర్మము రఘువంశధర్మము కావున రాముని నే శరణు వేఁడి బ్రదుకుమని దశరథుఁడు స్వర్గమున బోధించెనని తెలియునది.

చం. తెలియనిదానఁ గాను జగ♦తీవర! నీదుపరాక్రమంబునున్
బలమును సాహసంబును, గృ♦పాగుణమే పరధర్మ మంచు మున్
బలికితి వీవ నన్గుఱిచి ♦ బాధలఁ బొందెడినా యెడన్ దయం
దలఁపుము, నాథుఁ డీ వఁట య♦నాథగతిం బడియున్నదానఁగా. ౯౩౬

కం. అంభోనిధిగంభీరుఁడు, శుంభద్విక్రముఁడు వైరి♦సూదనచణుఁ డా
జంభారినిభుఁడు సజలధి,కుంభినికిని భర్తయా ర♦ఘు ప్రవరుండున్. ౯౩౭

కం. ఈవిధమున నస్త్రకళా,కోవిదతతి మేటి సత్త్వ♦గుణధాముఁడు స
ద్భావుఁడు సచ్ఛీలుం డేలా విడువం డస్త్ర మొండు ♦ నసురావళిపై. ౯౩౮

మ. వరదివ్యాస్త్రవిదుం డదేల యసుర♦వ్రాతంబుపై వైవఁ డు
ద్ధురశాతాస్త్ర మొకండు? దేవదనుజ♦స్తోమాహిగంధర్వులేన్
దివురై చూడఁగలేరు సంగరధరి♦త్రిన్ రామునిన్, నాపయిన్
గరుణాలేశమె యున్న రాక్షసుల వీఁ♦కం గూల్పఁ డేహేతువో? ౯౩౯

ఉ. అన్నయనుజ్ఞఁ బొంది యహి♦తాంతకమూర్తి సుమిత్రపట్టియే
న్నన్నదియేల కావఁగ మ♦నంబున నెంచఁడు? సర్వభుజ్ఝరు
త్సన్నిభు లన్నదమ్ములు న♦జయ్యులు దక్షు లుపేక్ష సేఁత కో
యన్న నిజంబు మత్కృతమ♦హత్తరపాపము హేతు వెన్నఁగన్. ౯౪౦

కం. అని దీనాలాపంబులఁ, గనుఁగవ బాష్పంబు లురలఁ ♦ గళవళపడుచున్
జనకజ పల్కిన విని యం,జనతనయుం డిట్టు లనియె ♦ సాంత్వవచనముల్. ౯౪౧

మ. వినుమీ సత్యముఁ జేసి పల్కెదను దే♦వీ! రామభద్రుండు త్వ
జ్జనితార్తిన్ విముఖుండు సర్వమునకున్ ♦ సంతప్తుఁడై కుందెడిన్
గని యాయన్న యవస్థ లక్ష్మణుఁడు శో♦కక్షుబ్ధుఁ డయ్యెం జుమీ
కనితి న్నిన్నిపు డెట్టకేల కిట, నిం♦కం జాలి నీకేటికిన్. ౪౨

కం. ఇడుమలఁ గుందెడికాలము, కడచెన్ దుఃఖాంత మిపుడ ♦ కనియెద వాత్రం
పడుచు విభు లెదురు చూచుచుఁ, బడఁతీ! యున్నారు లంక ♦ భస్మము సేయన్.

కం. ఆహవమున సహబాంధవు, ద్రోహిని రావణు వధించి ♦ ద్రుతగతిని జగ
న్మోహిని! నినుఁ గొని పురి కుత్సా♦హంబునఁ బోవు రామ♦చంద్రుఁడు ప్రీతిన్.

### సీతాదేవి హనుమంతునితో రామలక్ష్మణులకు సందేశవార్తలు చెప్పి పంపుట.

ఉ. ఏ మని చెప్పె సీత యన ♦ నే మనుదున్ రఘురామునితో, సుమి
త్రామహిళాత్మజాతునకుఁ ♦ దన్వీరో! యే మనువాఁడ? వానర

స్వామికి నేమి చెప్పుదును? ♦ సంగడికాండ్ర గుఱ్ఱోఁతిజేండ్ల కే
నే మని నీదుమాటలు మ♦హీతనయా! వచియింతుఁ? జెప్పుమా. ౪౫

కం. ఈవిధిఁ ద న్నడిగిన యా, పావనివాక్యముల దుఃఖ♦పరితప్తగ నై
భూవిభుని దేవి యి ట్లను, నావిరిఁ గన్నీళ్లు దొరఁగ ♦ వాతాత్మజుతోన్. ౪౬

కం. లోకచయభర్త[1] శుభమతి, యాకోసలతనయ గాంచె ♦ నామహనీయున్
నాకు న్నాథుగ మ్రొక్కుము, మీకుశలం బడిగె ననుమి ♦ మిత్రవతంసా! ౪౭

ఉ. హారివిహారశాలలు స♦మంచితనిస్తులభోగభాగ్యముల్
వారిజలోచనామణుల♦వర్గముఁ బాయుచుఁ, దల్లిదండ్రులన్
గౌరవమారఁ బల్కి, యధి♦కం బగువారిప్రసాద మంది, కాం
తారనివాసి యయ్యె గుణ♦ధన్యుఁడు లక్ష్మణుఁ డన్నఁ గావఁగన్. ౪౮

చం. నిరుపమవిక్రమాఢ్యుఁడు వి♦నీతుఁడు సత్ప్రియదర్శనుండు ని
ర్భరసుఖ మెల్ల వీడి తన♦భ్రాతకుఁగా గహనంబులోన ని
ష్ఠురదశ సానుకూలమతిఁ ♦ జొచ్చి నిజాగ్రజుఁ గొల్చుచుండు, న
న్నరయును దల్లిఁగాఁగఁ, దన♦యన్నను దండ్రినిగాఁగఁ జూచెడిన్. ౪౯

ఆ. మంచిమనసువాఁడు ♦ మంచిమాద్గులవాఁడు, సింగమొనయుమూఁపు♦ చెలువువాఁడు
మామగారితో స♦మానుండు, దెలియండు, పాపియసుర నన్నుఁ ♦ బట్టి తేర. ౫౦

సీ. వృద్ధోపసేవి సు♦శ్రీకుండు మితభాషి, మామామగారి గా♦రాముసుతుఁడు
నాముద్దుమఱఁది యా♦సౌమిత్రి, మే మేమి, చెప్పిన నన్నియుఁ ♦ జేయుచుండు
నెవ్వనిఁ గనుఁగొని ♦ యెలమి శ్రీరాముండు, తనతండ్రి మదిలోనఁ ♦ దలఁప కుండు
దాక్షిణ్యశీలుండు ♦ దయ గలవాఁడు ని, ర్మలమతి కడుమెత్త♦మనసువాఁడు
తే. ననఘుఁడును రామచంద్రుని♦యనుఁగుభ్రాత, సేమ మడిగితి నని నీవు ♦ చెప్పవయ్య
యెట్లు చెప్పిన శ్రీరాముఁ ♦ డేగుదెంచు, నట్టు లంతయుఁ జెప్పుమా♦ యాంజనేయ!

కం. నావంత లంత మొందఁగఁ, బ్రోవఁగ ననుఁ బ్రాణవిభుఁడు ♦ పూనుట యెట్లో
యావిధిఁ గార్య మొనర్పఁగ, నీవె ప్రమాణంబు సుమి వ♦నేచరనాథా! ౫౨

ఉ. సారెకుఁ జెప్పవయ్య కపి♦సత్తమ! నే నిఁక నొక్కమాస మే
తీరున నైనఁ బ్రాణములు ♦ దేహమునన్ ధరియించుదాన, నా
పై రఘుచంద్రమా! నిజము ♦ ప్రాణము నిల్వదు, మున్నధోభువిన్
జేరినకౌశికిన్ హరిని ♦ జేర్చినరీతి సముద్ధరింపుమీ. ౫౩

సీతాదేవి హనుమంతునిచేతికిఁ దనచూడామణి నిచ్చుట.

కం. అని తనకొంగున ముడిచిన, ఘనచూడామణిని దీసి ♦ కౌసల్యానం
దనునకు నిమ్మని జానకి, హనుమంతునిచేతి కిచ్చె ♦ నధిక ప్రేమన్. ౫౪

---

[1] లోకమందుఁ దల్లిదండ్రులు తమ్ముభరించు బిడ్డలను గందురు. కౌసల్య లోకములనన్నిటిని భరించు మంచిమనస్సుగల కొడుకును లోకోపకారకముగఁ గనెను.

కం. ఇచ్చినమణి నంగుళి నిడె, నచ్చపుమతిఁ బెద్ద గాదు ♦ హస్త మపుడు దాఁ
గ్రచ్చుఱ వలగొని మ్రొక్కుచు, నచ్చపలవిశాలనేత్ర ♦ యంచున నిలిచెన్. ౯౫౫

కం. సంతసమునఁ బొదలెడికపి, కాంతుఁడు దేహంబు సీత ♦ కడ నుంచియుఁ దా
స్వాంతంబున రఘురాముని, జింతించుచు నుండె నతనిఁ ♦ జేరఁగఁ జనఁగన్.

చం. అతులిత మై మహార్హ మయి ♦ యాజనకాత్మజచే మహానుభా
వత ధృత మైనయమ్మణిఁ బ్ర ♦ భావమునం గొని పావమాని మా
రుతమునఁ గంప మొందియును ♦ రూ పయి కోల్కొను నద్రివోలి హా
ర్షితమతి యై చనం దలఁచె ♦ శ్రీరఘురామునిఁ జేర నంతటన్. ౯౫౭

→ సీతాదేవి తన్నుగుఱించి శ్రీరామునికిఁ దెలుప హనుమంతుని వేఁడుట. ←

ఉ. జానకి రత్న మిచ్చి కపి ♦ సత్తముతో నను వానరోత్తమా!
దీనిని గుర్తెఱుంగు రఘు ♦ దీపకుఁ డెంతయు లెస్స, దీని నా
మానధనుండు కన్గొనిన ♦ మాత్రమునన్ జననిన్ ననున్ ధరా
జానిని నాజినిం దలఁచు ♦ సంశయ మింతయు లేదు నమ్ముమీ. ౯౫౮

కం. నీవు సముత్సాహముఁ గొను, నావిధిఁ బ్రేరించితిన్ వ ♦ నాటచయేంద్రా!
నీవే యీపని యిఁకమీఁ, దేవిధి ఘటియింపవలయు ♦ నెంచుము దానిన్. ౯౫౯

కం. నీవే గతి యీకార్యం, బో వానరవర్య! ఫలము ♦ నొందఁగఁ జేయన్
నీ వేవిధి నైనను నా, వావిరిదుఃఖంబుఁ బాప ♦ వలయుం జుమ్మీ. ౯౬౦

కం. కావున నేమార్గంబున, భూవిభుఁడు మదీయదుఃఖ ♦ మును బోనడుచున్
నీ వాయుపాయ మంతయుఁ, బావని! యోజింప నీదె ♦ భారము సుమ్మీ. ౯౬౧

కం. అన నట్ల చేయువాఁడను, వనితామణి! యని ప్రతిజ్ఞ ♦ వచియించి మరు
త్తనయుఁడు పయనం బైనను, గని జానకి యిట్టు లనియెఁ ♦ గనుసీరొలుకన్. ౯౬౨

కం. వినుమా కుశలం బడిగితి, ననుమా శ్రీరాముఁ దమ్ము ♦ నాప్తజనయుతున్
దినకరసుతుఁ గపివృద్ధుల, హనుమా! ధర్మోక్తి సేమ ♦ మడిగితి ననుమా. ౯౬౩

తే. ఆమహాబాహుఁ డైనశ్రీ ♦ రామచంద్రుఁ, డెట్లు తరియింపఁ జేయు న ♦ న్నీదురంత
శోకవారాశినుండి యా ♦ చొప్పు నెఱిఁగి, యట్లు సమ్మతిపఱుపుమా ♦ యతులకీర్తి.

కం. నాచేతోవిభుఁ డేగతిఁ, బ్రోచున్ నే మేను విడక ♦ పూర్వమె నన్నున్
ధీచతుర! యట్లు పలుకుము, వాచాపుణ్యంబుఁ జలుపు ♦ వానరవర్యా! ౯౬౪

కం. సత్సాహసికాగ్రణి విచి, కిత్సాదూరోక్తి నీవు ♦ కెరలుచుఁ బలుకన్
బ్రోత్సాహము గొని నను నా, పత్సాగరముం దరింపఁ ♦ బతి యొనరించున్.

కం. నాసందేశయుతంబగు, నీసూక్తుల నాలకించి ♦ నెఱపౌరుషమున్
గౌసల్యాతనయుఁడు క్రూ, రాసురపంక్తులకుఁ జూపు ♦ నాహవమందున్. ౯౬౫

సీ. అనవుడుఁ బవమాన♦తనయుఁ డి ట్లను దేవి! శ్రీరామభద్రుండు ♦ శీఘ్రముగను
వానరభల్లూక♦వారసంయుతుఁ డయి, చనుదెంచి యిచ్చటి♦శత్రుసమితి
హరియించి నీదుఃఖ ♦ మపనయించును దేవ,మనుజనాగార్క_య♦మప్రభృతులుఁ
బర్జన్యుఁ డైనను ♦ భగ్నులే నీ కయి, రాముండు దొడర నిం♦కేమి పలుక?
ఆ. జలధివేష్టితోర్వి ♦ శాసింపఁగలవాఁడు, రామచంద్రుఁ డతిప♦రాక్రమమున
నతనివిజయమునకు ♦ నంబుజలోచన, నీవ కావె కతము ♦ నిశ్చయముగ.　౯౬౮

## సీతాదేవి తనసందేహమును హనుమంతునితోఁ జెప్పుట.

కం. అనవుడు సయుక్తికంబును, విన నింపును సత్య మైన♦వృత్తాంతోక్తుల్
విని సంతసించి యంజన,తనయుఁ బహుమానసూక్తి ♦ ధరణిజ మెచ్చెన్.　౯౬౯
కం. ఆమాటలు విని శ్రీరఘు,రామునిపైఁ గల్గుస్నేహ♦రమ దీపింపం
గా మారుతిదెస మఱి మఱి, ప్రేమంబునఁ గనుచు నిట్లు ♦ ప్రేయసి పలికెన్.　౯౭౦
కం. నాపలుకు నీకుసమ్మత,మై పొనరిన యేని శత్రు♦హరణసమర్థా!
యీపూఁట నిలిచి మఱుఁగున, రేపటఁ బోరాదె శ్రమము ♦ ప్రీ లెడి నీకున్.　౯౭౧
కం. ఓపావని! నీసన్నిధి,ప్రాపున ధృతిఁ గూరి యల్ప♦భాగ్యను క్షణమేఁ
నీపుణ్యంబున శోకము, తాపంబుఁ దొఱంగి బ్రదుకు♦దానఁ గపీంద్రా!　౯౭౨
ఉ. పోయెద వేని పొమ్ము రఘు♦పుంగవుఁ జేరఁగ, నీవు గ్రమ్మఱన్
వాయుజ! వచ్చునందనుకఁ ♦ బ్రాణము లుండునొ యుండవో చుమీ
యీయెడలందు సందియము ♦ యెంతయు వేఁగెడు నాకు నీవునున్
బాయుట గల్గ నేమి కని♦ప్రాణము నిల్చునొ నీవ చెప్పుమా.　౯౭౩
కం. నీయందును నీకును దో,డై యరుదెంచినకపీంద్రు♦లందును నాకున్
బాయనిసందేహం బో,వాయుజ! నాకనుల మ్రోల ♦ వర్తిలఁ దొడఁగెన్.　౯౭౪
చం. హరివర ఋక్షసైన్యములు ♦ నానృపవర్యతనూజు లేని దు
స్తరజలరాశి దాఁట నెటు ♦ చాలుదు రన్న? తలంచి చూడఁగా
గరుడుఁడు నీవు మారుతుఁడుఁ ♦ గాక మ ఱెవ్వరు భూతకోటిలో
బరవస మొప్ప దాఁటఁగల♦వారలు గానఁగరారు మారుతీ.　౯౭౫
కం. కనుకొలఁది నసాధ్యం బొ,పని యనుచుం దోఁచెఁ; గార్య♦పద్ధతులను నీ
కననియది లేదు దీనికి, హనుమా! నీ వనుమ విన స♦మాధానంబుల్.　౯౭౬
కం. నీ వొకఁడవె యీకార్యము, పావని సాధింప శక్తి♦పరుఁడవు ధరపై
నీ వొకఁడవె యీకీర్తి,చే విలసిల్లంగఁ గలవు ♦ శిక్షితవైరీ!　౯౭౭
కం. బలములతో నిచటికి రఘు,కులతిలకుఁడు వచ్చి కలనఁ ♦ గూల్చి దశాస్యున్
గెలు పొంది నన్నుఁ దనపురి, కలవునఁ గొనిచనిన నాకు ♦ యశ మది గూర్చున్.
కం. ప్రాకటశితనారాచా,నీకంబున లంకఁ జలిపి ♦ నీఱుగఁ గడిమిన్
గైకొని న న్నేగినచోఁ, గాకుత్స్థున కదియె తగిన♦కార్యము చుమ్మీ.　౯౭౯

తే. పరమశూరుండు రాముండు ♦ బవరమందు, నతనిమగఁటిమి కనురూప ♦ మైనదావి
యోజనయొనర్చి చెప్పుమీ ♦ యోజమీఱ, వనచరకులావతంస! నీవనుచు నడుగ

కం. ఘనహితము హేతుయుతమును, ననఘార్థోపహితమైన ♦ యవనిజసూక్తుల్
విని యంజనవరతనయుం, డనియెన్ వక్తవ్యశేష ♦ మాదట నిట్టుల్. ౯౮౧

### హనుమంతుఁడు సీతాదేవిసందేహము దీర్చుట.

ఉ. దేవి! కపీంద్రభల్లుకత ♦ తిప్రభువర్యుఁడు నిశ్చయించె సు
గ్రీవుఁడు నీనిమిత్తము ప్ర ♦ కృష్టబలంబులతోడఁ దోడ్పడం
గా, వెస వత్తు రాతనికిఁ ♦ గైవసమై యసమానవిక్రముల్
దేవనిభుల్ మనోజవులు ♦ దిగ్గగనాటులు శత్రుమర్దనుల్. ౯౮౨

కం. ఎంతగడుసుఁబని నైన ర, నంతయు వెత లేక సలుప ♦ నగువారలు వి
క్రాంతులు సాబ్ధిధరావని, గంతున వలగొనెడివారు ♦ గగనాధ్వగులై. ౯౮౩

కం. నాకంటె గొప్పవారును, నాకున్ సరివారుఁ గలరు ♦ నగచరులచటన్
నాకంటెహీనుఁ డొకఁడేన్, క్ష్మాకన్యా! లేఁడు తీక్ష్ణ ♦ కరసుతునొద్దన్. ౯౮౪

కం. నేనే నినుఁ గాంచితి నఁట, యానిస్తులబలుల నేచి ♦ యనవలయు నొకో
మానవపతి భూరిగుణా,హీనులఁ బంపండు పంపు ♦ నితరుల మొదలన్. ౯౮౫

సీ. కావున నీవు శో ♦ కంబు మానుము తల్లి! దుఃఖకాలం బెల్లఁ ♦ దొలఁగిపోయె
నిదె పోయి నేఁ జెప్ప ♦ ముదితులై క్రోఁతులు, వచ్చెద రొకగంతు ♦ వైచి యిటకు
నావీఁపుపై నెక్కి ♦ భూవిభుల్ శశిభాస్క,రులపోల్కి నీమ్రోల ♦ నిలుచువార
లిట వచ్చి యీలంక ♦ నెల్ల సాయకములఁ, దుత్తుమురుగఁ బోవఁ ♦ ద్రుంచువారు

ఆ. రామచంద్రవిభుఁడు ♦ రణరంగమం దిందు, సబలుఁ బంక్తికంఠు ♦ సంహరించి
నిన్నుఁదోడుకొనుచు ♦ నెమ్మి నయోధ్యకుఁ, బోవువాఁడు పువ్వుఁ ♦ బోణి నిజము.

కం. కాలమున కెదురు చూడుము, బాలా! తూర్ణముగ రాము ♦ వహ్నివలెఁ గనఁ
జాలెద వాతఁడు నీవ్యథఁ, బాలార్చ్చును నసురుగతిని ♦ బరికింపు మిఁకన్. ౯౮౬

చం. కొడుకులతోడ బంధుజన ♦ కోటులతోడ నమాత్యపంక్తితోఁ
గడచని రాక్షసేశ్వరుఁడు ♦ క్ష్మాస్థలిఁ ద్రెళ్లఁగ నీవ చూచి నీ
యుడుగనిదుఃఖసాగరము ♦ నొడ్డును జేరి శశాంకు రోహిణీ
జలజదళాక్షిచందమున ♦ సమ్మదమారఁగఁ గూడెదంగనా! ౯౮౭

సీ. అని యిటు లూరార్చి ♦ యవనిజఁ గనుఁగొని, పయనింప నాయత్త ♦ పడుచు వెండి
పల్కె నాపావని ♦ పల్లటిల్లకు మమ్మ, త్వరగాను గాంచెదు ♦ దాశరథుల
శరచాపకరుల నీ ♦ పురమువాకిట నఖ,దంష్ట్రాయుధులు రణ ♦ దక్షులైన
శాఖామృగంబుల ♦ శైలాంబుదసముల్, సద్భక్తిఁ గొలువంగ ♦ జలదవేణి!

ఆ. నిన్నుఁ దలఁచి తలఁచి ♦ కన్ను మొగుడ్పక, యున్నవాఁడు రాముఁ ♦ డుమ్మలికను
దుఃఖపడకుమమ్మ! ♦ దుడపిల్లకోయమ్మ! తాళవమ్మ వెతలు ♦ దలఁగు నమ్మ. ౯౮౮

కం.రామునికంటెను విశిష్టుఁడు, భూమిజ! యెవఁ డమ్మ లోక ♦ ముల నెం దేనిన్?
సౌమిత్రికి సముఁ డెవ్వఁడు? భామా! నీకాశ్రయులును ♦ వహ్న్యనిలసముల్.

కం.రాముని నేఁ జూచుటయే, భూమిసుతా! యద్దు; నేను ♦ బోయి వచింపన్
భీమకపిస్తోమంబుల,తో మహిపుఁడు వచ్చి యిటకుఁ ♦ దున్మాడు నరిన్. ౯౯౧

కం.ఈరక్షోగణరక్షిత,ధారిణి వెత లందఁగలదు ♦ తల్లి! చిరముగా
స్వారాజును[1] శచి గూడిన,తీరునఁ బతిఁ గూడెదీవు ♦ ధృతి గొను మాత్మన్.

సీతాదేవి రాము నుద్దేశించి హనుమంతునితోఁ బలుకుట.

సీ. అనవుడుఁ బవమాన♦తనయునిఁ గనుఁగొని, ధరణిజ యి ట్లనుఁ ♦ గరముఁ బ్రీతి
నీప్రియసూక్తులు ♦ నిండుముదం బిచ్చె, వాడినమడికిని ♦ వానయట్టు
లెట్టు లా త్మేశు నే ♦ స్పృశియింపఁ గలనొ నీ, వట్లు సేయుము వఱు♦వట్లు దొలఁగఁ
గాకిని గోపాన ♦ నేకాతుముగఁ జేసి,నట్టివార్తయు నర♦ణ్యమున నాదు

ఆ. గండభాగమునను ♦ గరఁగిపోఁ దిలకంబు, స్వేదబిందువులను ♦ జిత్రరీతిఁ
మణిసిలను నొకంట♦మమత మీఱఁగనీవు,తిలక ముంచుటయును♦దలఁపు మనుము.

కం.వరుణేంద్రోపమవిక్రమ, పరుఁడవు నీయట్టిఁ డాత్మ♦పత్నిని దైత్యుల్
హరియించి బాధ పెట్టఁగఁ, బరునట్టుల యూరకుంట ♦ భావ్యం బగునే? ౯౯౪

ఉ. దాఁచితి నీరజంబు మణి ♦ దాశరథీ! యిది నీమనోంబుజం
బాఁచికొనంగఁ జాలుట మ♦హాత్మ! భవద్విరహానలంబు న
న్నాఁచెడివేళ ని గ్గనిన♦కైవడి దీనిని గాంచి పొంగుదున్
సైఁచుట దోఁప దింక వెత♦సంద్రమునం దుసు ఉుగ్గఁబట్టుచున్. ౯౯౫

ఆ. పడఁగ రాని యట్టి♦పాటులఁ బడుచును, వాకొనంగ రాని♦వార్త వినుచు
గుండె జల్లు మనఁగఁ ♦ గూళరక్కసలలో, నిన్నుఁ దలఁచి సైఁచి ♦ యున్నదాన.

చం.ఒకనెల యెట్టులైన మని♦యుండెద, నంతకు నీవు రానిచోఁ
బ్రకటముగాఁగఁ బ్రాణములు ♦ పాయును, రావణుఁ జూచినంతటన్
దకతక లాడు గుండియలు ♦ దైత్యుఁడు క్రూరుఁడు నాథ! నీమనం
బకట! కరంగ దేని యది♦యంతయు నాదురదృష్ట మే చుమీ. ౯౯౬

హనుమంతుఁడు మరలిపోవుటకు సీతాదేవిని సెల వడుగుట.

చం.అని కరుణంబుగా రమణి ♦ నాడుమృగాయతనేత్రవాక్యముల్
విని పవమాననందనుఁడు ♦ విన్ము సతీ! శపథంబుఁ జేసెదన్
వనజదళాయతాంబకుఁ డ♦వశ్యము నీవెతఁ బాపు, నెంతయున్
వనరెడి నిన్నుఁ బాసి, మగు♦వా! యది చూచి కృశించుఁ దమ్ముఁడున్. ౯౯౭

[1] ఇంద్రుఁడు.

శా. ఎట్టెట్లో నిను గంటి నిందు నిఁకఁ ద♦ల్లీ! దుఃఖకాలంబు గా
డ్పెట్టుం దప్పుదు నిన్నుఁ జూచుతమి ధా♦త్రీశాత్మజుల్ లంకకుం
బట్టన్ లగ్గలు రాక్షసాధముని దు♦ర్నన్ నీవ కన్నార రా
పట్టీ! చూచెదు పోదు వాత్మవిభుతోఁ♦ బద్మాక్షి మీవీటికిన్. ౯౯౯

ఉ. రాముఁ డెఱుంగుగు ర్తొకటి ♦ రాజసుతా! యిదు మంతె చాలు నా
భామిని మత్ప్రదత్తమణి ♦ పావని! చాలెడిగుర్తు, తన్మణిన్
భూమివిభుండు చూచిన న♦పోహముగా దెవ నమ్ము నీనుడుల్,
నా మరుదాత్మజుండు పయ♦నం బయి నే నిఁకఁ బోయివత్తునే. ౧౦౦౦

చం. అని నమితోత్తమాంగుఁ డయి ♦ యాత్మపదంబుల వ్రాలి లేవ న
య్యనఘునిమేను నెంచుట[1] మ♦హాంబుధి దాఁటఁగ నుత్సహించుటల్
గని కనుదోయి బాష్పములు ♦ గ్రమ్మ సగద్గదకంఠ యై ధరా
తనయ ప్రభంజనాత్మభవు ♦ దైన్యమునం గని పల్కె నీగతిన్. ౧౦౦౧

సీతాదేవి హనుమంతుడు క్రమ్మరి పోవుటకు ననుమతించుట.

కం. హనుమా! కుశలం బడిగితి, ననుమా శ్రీరాము నతని♦యనుజు సుమిత్రా
తనయు సహామాత్యుని నిన, తనుజాతుని నందు నున్న♦తక్కినవారిన్. ౧౦౦౨

కం. అన్నా! రాఘవుఁ డెట్టులు, నన్ను విపత్సాగరంబు♦నం జెడకుండన్
జెన్నారఁ బ్రోచు నాగతి, మన్ననమెయిఁ బలుక వన్న! ♦ మఱవకు మన్నా!

కం. ఇన్నీచరాక్షసావళి, నన్ను భయముపఱచువిధము ♦ నానావ్యసనా
పన్నత శేఁ గుందెడిగతి, విన్నప మొనరింపు నాదు♦విభునకుఁ దండ్రీ! ౧౦౦౪

హనుమంతుఁడు కార్యశేషం బాలోచించుట.

చం. శుభ మగు గాక త్రోవ నరి♦సూదన! యం చనఁ బొంగుచున్ మరు
త్ప్రభవుఁ డుదగ్దిశాగమన♦తత్పరుఁ డై యటువాసి పోయి నే
నిభనిభయానఁ గంటి, నిఁక ♦ నించుక కార్యము తక్కె, నీపురీ
విభు నెడ మూఁడుపాయములు ♦ వీడి చతుర్థమె యుక్త మారయన్. ౧౦౦౫

ఉ. సామము మేలు గాదు దను♦జప్రకరంబులపట్ల, దాన ము
ద్దామధనాఢ్యులందు ఫల♦దంబును గా, దిఁక భూరివిక్రమో
ద్దాము లభేదసాధ్యులు గ♦దా, యటుగానఁ బరాక్రమం బొకం
డేమెయిఁ జూడ యుక్త మని ♦ యెంచెదఁ బ్రస్తుతకార్యభంగికిన్. ౧౦౦౬

చం. అసురులచేవనట్టు తెలి♦యన్ గమకించెద నేని దండమే
యొసఁగు శుభోత్తరం బయి, మ♦ఱేది ప్రయోజనకారి గాదు, రా

---

[1] సీతాదేవి చూడామణినిచ్చినప్పు డల్పగాత్రుఁడు గావున నది వ్రేలికి సరిపోయెను. ఇప్పుడు దానిని గట్టువస్త్రమునందుఁ బదిలపఱిచెనని యెంచునది.

క్షసవరవీరులం గెడపం♦గా ననిఁ గొందఱ నున్నవార లీ
రస మటి మెత్తపాటు గొన ♦ రాముని కార్య మకష్టసాధ్య మా. ౧౦౦౭

ఉ. సీతను జూచి రమ్మనుచుఁ ♦ జెప్పెను గాక రఘూద్వహుండు దు
ర్నీతులతోడఁ బోరు మనె♦నే యని యాత్మఁ దలంతు నేనియుఁ
దూతయు నీతమైనపని♦తోఁ బలుకార్యములన్ ఘటించుచో
ఖ్యాతమనస్వి తత్ప్రథమ♦కార్యవిరోధము లేమిఁ గన్గొనున్. ౧౦౦౮

ఉ. ఎంతయుఁ జిన్నపాటిపని ♦ నేనియుఁ జక్కఁగఁ జేయఁ బూనుచో
సంతస మందఁ గూడ దొక♦సాధన మబ్బినయంత, నర్థమాఁ
జింతిలఁ బెక్కు మార్గములఁ ♦ జేయఁగ దానిని, గాన జానకీ
కాంతుని యిమ్మహాక్రియయుఁ ♦ గార్యము చేయఁగఁ బెక్కుభంగులన్. ౧౦౦౯

తే. దనుజులకు నాకుఁ గలతార♦తమ్య మెల్ల, నరసి నిక్క మెఱింగి కీ♦శాధినాథు
సరస కరిగితి నేని య♦శంబు వెలయ, భర్తృనాజ్ఞను జేసిన♦బంట నగుదు. ౧౦౧౦

కం. సులభతరంబుగ నసురులతోఁ, గలహము సమకూరెఁ బంక్తి♦కంఠుం డస్మ
ద్బలమును దనదుబలంబును[1], దెలిసికొనుం గాక యొంటఁ ♦ దెలియం గలఁడే? ౧౦౧౧

ఉ. కావున నెట్టులైన దశ♦కంఠు సమంత్రిసమూహు సైన్యసం
భావితు నాజి కీడ్చి పరి♦పంథిబలాబలరీతి వానిహృ
ద్భావముచందముం దెలిసి ♦ దద్దయుఁ జెక్కు చెమర్ప కుండఁగాఁ
బోవుట కార్య మట్లయినఁ♦బో కృతకార్యుఁడ నౌదుఁ గావునన్. ౧౦౧౨

చం. కనులకుఁ బండువై హృదయ♦కాంతము నై సురనాథునందనం
బన ఘనవృక్షసుందరల♦తాన్వితమై సొబగారుచున్న దీ
దనుజునినిష్కుటంబు,[2] వెస ♦ ధ్వంసముఁ జేసెద దీనిఁ, గారుచి
చ్చునఁ జెడినట్టికాననము♦చొప్పునం గని రావణుం డెదన్. ౧౦౧౩

ఉ. మండి మహారథద్విపస♦మాజముఁ బంపును భండనార్థమై
దండిమగల్ త్రిశూలచయ♦దారుణపట్టిసచాపహస్తులై
గండున రాఁగ వారలను ♦ గ్రక్కునఁ జేయుచుఁ దుండెతుండెముల్
నిండుముదంబునం జనెద ♦ నేఁ గపినాథుపురంబుఁ జేరఁగన్. ౧౦౧౪

## హనుమంతుఁ డశోకవనంబుఁ బాడుచేయుట.

సీ. అని తలపోసి యం♦జనపట్టి చెలరేఁగి, యూరువేగంబున ♦ ధారిణీజ
తతులఁ బ్రభంజను♦గతి మూలముట్టుగఁ, బడవైవఁ గడఁగెను ♦ బెడిదముగను
మత్తశకుంతస♦మాకులము [illegible] మగుచును, సానాద్రుమలతాళి ♦ నవ్య మయిన
ప్రమదావనం బెల్లఁ [illegible] పా డొనరించి, యూటమలల నెల్ల ♦ నవనిఁ గలిపి

[1] హనుమంతుని యుద్దేశము రావణాసురునితో ముష్టాముష్టియుద్ధమొనర్చి వానిబలము తెలిసికోవలయునని. రావణాసురునకో తాను యుద్ధమునకుఁబోక హనుమంతు నితరులచేత నెట్లయినఁ గట్టి తెప్పింపవలయునని.

[2] ఉద్యానవనము.

తే. కేళిసలిలాశయంబులఁ ♦ గూలఁ ద్రోయఁ, దెగినతీఁగలు విఱిగిన♦యగచయంబుఁ
బాడుకొలఁకులు నగుచును ♦ బ్రమదవనము, కారుచిచ్చునఁ గాలిన♦కరణి నయ్యె.

కం. కూఁకటివేరులతోడం, బ్రాఁకుంబల్లల్ల నేలఁ ♦ బడఁగ లతాళుల్
వ్రాఁకులకొనలఁ జలించెను, దేఁకువ వడఁకాడుచెలుల♦తీరున నంతన్. ౧౧౬

కం. వ్యాళంబులు నలఁగెను జి,త్రాలయములుఁ బొదరుటిండు ♦ లక్షగృహంబుల్
గూలెను వ్రీలెను దూలెను, నేలను గడుఘోర మగుచు ♦ నేత్రంబులకున్. ౧౧౭

కం. దనుజేశప్రమదావన,మును బ్రమదావనము మూల♦ముట్టుగ నాశం
బొనరిచి యలరుచుఁ గలనికి, హనుమంతుఁడు తోరణాగ్ర♦మందు వసించెన్.

→ రాక్షసస్త్రీలు హనుమంతువృత్తాంతము సీతాదేవి నడుగుట. ←

కం. పక్షులబహుళారవమున, వృక్షంబులుగూలుధ్వనుల ♦ వెఱగొని లంకన్
రాక్షసు లందఱు దిగ్భ్రమ,వీక్షించిరి యొకరి మొగము ♦ వేఱొక రంతన్. ౧౧౯

ఉ. క్రూరనిమిత్తముల్ దెలుపు♦కూఁతలు పెట్టుచుఁ బాఱెఁ బక్షులున్
ఘోరమృగంబు లాదిగ ది♦గుల్ వడి మేల్కని రాక్షసాంగనల్
ఘోరతరాకృతిన్ వెలయు♦క్రోఁతిని బాడగు చున్ననిష్కుటం
బారసి చూచి వేగ జన♦కాత్మజఁ జేరఁగఁ బోఱు చుండఁగన్. ౧౨౦

కం. ఆరాక్షసులు బెదరఁగఁ, గ్రూరము భయదంబు నైన♦రూపముఁ గొనె న
మ్మారుతి యాతనిభయదా, కారు మహాబలునిఁ జూచి ♦ క్ష్మాసుతతోడన్. ౧౨౧

ఉ. ఎవ్వఁడొ వీఁడు సీత? యిట ♦ కేరినిమిత్తము వచ్చినాఁడొ? వీఁ
డెవ్వరివాఁడొ? నీ వతఁడు ♦ నేమిగొ యిు ముచ్చట లాడుచుంటిరే?
నివ్వెఱ పొందఁ బోకు తరు♦ణీ! భయకారణ మేమిలేదు, నీ
కివ్వనచారి యిందనుక ♦ నే మని చెప్పెను జెప్పవే యనన్. ౧౨౨

ఉ. మీ మటుమాయపుంబనులు ♦ మీకె యెఱుంగఁగఁ జెల్లుఁగాక నా
కేమెయిఁ దోఁచు రాక్షసుల♦కృత్యము లెల్ల యథార్థరీతిగాఁ,
బాములకాళ్లు పాములకుఁ ♦ బాటిలుఁ గాదె యెఱుంగ, నెవ్వఁడో
క్రోఁ, మది నాకునుం గలఁగెఁ ♦ గ్రూరనిశాటుఁడు కామరూపియై[1] ౧౨౩

→ రాక్షసస్త్రీ లశోకవనంబు పాడగుట రావణునకుఁ దెలుపుట. ←

సీ. ఏ తెంచెనో? యన ♦ సీతోక్తులను విని, భయపడి కొందఱు ♦ పాఱి రందు
నిలిచిరి కొందఱు ♦ నెవ్వడి నసురాధి,పతికిని దెలుపంగ ♦ సతులు గొంద
ఱరిగి రావణుఁ గాంచి ♦ యవధారు దైత్యేశ! వికటవానరరూపి ♦ వీరుఁ డొకఁడు
జనకజతోడుతఁ ♦ జనవున ముచ్చట, లాడి యశోకవ♦నాంతరమున

[1] ఆశ్రితప్రాణరక్షణార్థమై, స్వప్రాణరక్షణార్థమై, కార్యరక్షణార్థమై పలికెడు బొంకు బొంకుకాదు.
శ్లో. సాధవఃక్షీణపాపాస్తుసచ్ఛబ్దస్సాధువాచకః। తేషామాచరణం యత్తు సదాచారస్స ఉచ్యతే॥ వి. పు॥

ఆ. నిలిచి యున్నవాఁడు ♦ నిర్జరనాథుని,దూతయో కుబేరు♦దూత యొక్కొ
సీత నెమకుఁబంపె ♦ శ్రీరాముఁ డంపిన, దూతుఁ డేమొ తెలియ ♦ దుర్ఘటంబు.

కం. అమ్మా! యెవఁ డీకపి యని, క్రొమ్మను మే మెంత వేఁడు♦కొన్నన్ మాతో
నమ్మహిజ యెఱుఁగ నంచును, మమ్ముం గికురించె మాయ♦మాటలచేతన్. ౧౦౨౪

ఉ. పోలఁగ భీమరూపుఁ గొని ♦ పొంగుచు నీప్రమదావనంబు ని
ర్మూలముఁ జేసి క్రోతి మృగ♦మోహనపక్షివితానసల్లతా
జాలనగాళి రూపు చెడ ♦ సర్వముఁ బాడొనరించెఁ గాని తా
నేలొకొ తాఁకకుండెడు మ♦హీజ వసించుప్రదేశ మొక్కఁడున్. ౧౦౨౫

ఉ. ఆసతిరక్షణార్థమొ ప్ర♦యాసము చేతనొ ధారిణీసుతా
వాసతలంబునై కుసుమ♦వారసమంచిత మైనశింశుపన్
గాసి యొనర్పఁబోఁడు, కనఁ♦గా శ్రమ మెక్కడి దయ్యె వానికిన్?
భూసుతసౌఖ్యముం దలఁచి ♦ పోలుఁ జుమీ యది ద్రుంప కుండుటల్. ౧౦౨౬

కం. నీవనముఁ జెఱిచినందున, కావనితం బల్కరించి♦నందునకును ర
క్షోవర! వానరవరునకుఁ, గావింపుము కఠినశిక్ష ♦ కావర మడఁగన్. ౧౦౨౭

కం. నీవలచి యున్న చేడియ,తో వాసవమథన! పలికి ♦ తోడన మెయితోఁ
బోవచ్చునె యెవఁడే? నన,గా విని మండిపడెఁ బంక్తి♦కంఠుఁడు కినుకన్. ౧౦౨౮

## రావణుఁడు హనుమంతునిమీఁదికిఁ గింకరులఁ బంపుట.

కం. కోపావర్తితనేత్రుం, డౌపంక్తిగ్రీవుకనుల ♦ నశ్రులు రాలెన్
దీపంబునుండి మండుచుఁ, బైపయిఁ బడుతైలబిందు♦పటలం బనఁగన్. ౧౦౩౦

మ. తనతోఁ దుల్యులఁ గింకరాఖ్యుల మహా♦దర్పాంధులన్ వాయునం
దనుఁ బట్టన్ దితిజాధినేత పనుపన్ ♦ వా రుగ్రులై కూటసా
ధనఖడ్గాదికహస్తులై వెస మహా♦దంష్ట్రాకరాళోదర
స్వనరూపద్రవిణంబు లొప్పఁ గపిపై ♦ సంగ్రామలోలాత్ములై. ౧౦౩౧

చం. ఎనుబదివేలదైత్యవరు ♦ లేకముఖంబుగఁ దోరణస్థితున్
హనుమను డాసి కాంచనక♦నత్పరిఘోగ్రకృపాణదీప్తరో
పనిచయశూలముద్గరను♦పట్టిసతోమరశక్తితాడితాం
గునిఁగ నొనర్ప నాతఁడును ♦ గొండవలెన్ మెయి పెంచి క్రుద్ధుఁడై. ౧౦౩౨

## హనుమంతుని జయఘోషము.

తే. వాల మల్లార్చి జాడించి ♦ వసుధ మోఁది, యార్భటించిన నాగర్జ ♦ కఖిలపురము
నిండి ఘూర్ణిల్లెఁ బక్షులు ♦ నింగి కెగసి, గుండెలగలంగ ధారిణిఁ ♦ గూలె నపుడు.

చం. జయము జయంబు రామునకు ♦ సారపరాక్రమధన్యమూర్తికిన్
జయము జయంబు విద్విషద♦సహ్యతరస్వి సుమిత్రపట్టికిన్
జయము జయంబు దాశరథి♦సంపరిపాలితుఁ డౌ వలీముఖో
చ్చ్యయపతి సూర్యపుత్త్రునకు ♦ సాహసవిక్రమకీర్తిశాలికిన్. ౧౦౩౪

ఉ. దాసుఁడ సర్వసద్గుణవి♦తానమనోహరరామమూర్తికిన్
గోసలదేశవల్లభున♦కున్ హతశత్త్రుఁడ వాయుపుత్త్రుఁడన్
నాసరి గారు సంగరము♦నన్ దశకంఠులు వేవు రేనియున్
వాసి యడంతు తాల ద్రుమ♦పాళుల నే హనుమత్సమాఖ్యుఁడన్. ౧౦౩౫

కం. ధ్వంసంబుఁ జేసి లంకను, హింసించి సమస్తరాక్ష♦సేంద్రుల సీతా
హంసీయానకు మ్రొక్కి ప్ర,శంసితగతిఁ జనెద మిడుక ♦ సకలసురారుల్. ౧౦౩౬

కం. అని ఘోషించిన దనుజులు, మనమున బెగ డొంది సంజ♦మ బ్బన విరివిం
గొను కపిపై నృపునానతి, ఘనసాధనచయము వృష్టి♦గాఁ గురియంగన్. ౧౦౩౭

తే. తోరణాశ్రిత మైయున్న♦దొడ్డయినుప, గుదియఁ గైకొని పెనుఁబన్న♦గుని గ్రహించి
తిరుగు గరుడుని పోలికఁ ♦ దిరిగి తిరిగి, యసురబలముల వెస నుఱు♦మాడెఁ గవిసి.

కం. కింకరకాండంబుల ననిఁ, బొంకం బడఁగించి యుద్ధ♦మునఁ బుట్టుతమిన్
శంకింపక రక్షోతిభ, యంకరుఁ డై తోరణంబు♦నందుం జేరెన్. ౧౦౩౮

చం. హనుమకు నోడి బెగ్గడిలి ♦ ప్రాణభయంబునఁ బాఱి రాక్షసేం
ద్రునిగృహమందుఁ దూఱి నుడి♦తోట్రిలఁ జచ్చిరి సర్వకింకరుల్
దనుజవరేణ్య! యన్న విని ♦ దారుణరోషణభీషణుండు లో
చనములఁ ద్రిప్పి గిర్గిర న♦జయ్యునిఁ బంచెఁ బ్రహస్తపుత్త్రకున్. ౧౦౪౦

హనుమంతుఁడు ప్రాసాదమును విఱుగఁ దన్నుట.

ఉ. ఆదనుజాళిఁ జంపి పవ♦నాత్మజుఁ డంతయుఁ బాఱఁ జూచి యే
లా దుమ దుమ్ము చేసియు వి♦లాసవనంబును, ద్రుంప నైతిఁ బ్రా
సాద మటంచు నెంచి పెలు♦చం గనకాచలశృంగతుంగ మై
మాదిరి మీఱు నత్తలము ♦ మానఱ నల్లలనాడ దూఁకుచున్. ౧౦౪౧

కం. ఎక్కి శిఖరంబుమీఁదను, నిక్కనఁ గూర్చుండి పావ♦నియు భాసిల్లెన్
దిక్కుల వెలుంగు తేజము, పెక్కువ నుదితార్కమాఱు♦బింబం బగుచున్. ౧౦౪౨

కం. ధ్వంసంబు చేసి సమరరి, రంసువు ప్రాసాద మెల్ల ♦ రాజిల్లె బలి
ష్ఠాంసములు వెలుఁగ సురలు ప్ర, శంసింపఁగఁ బారియాత్ర♦శైలాకృతి యై.

కం. దుర్భరరవరయము శ్రవో, గర్భంబులు చీల్ప నసుర♦కాండములకుఁ బ్రా
విర్భూతామర్షంబున, నార్భటి యొనరించె రక్ష♦కావళి స్రుక్కన్. ౧౦౪౪

చం.జయము జయంబు రామునకు ♦ సర్వమహాస్త్రవిదగ్రవర్తికిన్
జయము జయంబు విద్విషద♦సహ్యతరస్విసుమిత్రపట్టికిన్
జయము జయంబు దాశరథి♦సంపరిపాలితుఁ డౌవలీముఖో
చ్చయపతి సూర్యపుత్రునకు ♦ సాహసవిక్రమకీర్తిశాలికిన్. ౧౦౪౫

ఉ. దాసుఁడ సర్వసద్గుణవి♦తానమనోహర రామమూర్తికిన్
గోసలదేశవల్లభున♦కున్ హతశత్రుఁడ వాయుపుత్రుఁడన్
నాసరి గారు సంగరము♦నన్ దశకంఠులు వేవు రేనియున్
వాసి యడంతు తాల ద్రుమ♦పాళుల నే హనుమత్సమాఖ్యుఁడన్. ౧౦౪౬

కం.ధ్వంసంబుఁ జేసి లంకను, హింసించి సమస్తరాక్ష♦సేంద్రుల సీతా
హంసీయానకు మ్రొక్కి ప్రశంసితగతిఁ జనెద మిడుక ♦ సకలసురారుల్. ౧౦౪౭

హనుమంతుఁడు చైత్యపాలకులఁ జంపుట.

మ. అని గర్జింపఁగఁ జైత్యపాలగశతం ♦ బానాద మాలించి హ్యా
జ్జనితామర్షము పేర్మిఁ జుట్టుకొని శ♦స్త్రప్రాసకుంతాదులన్
హనుమంతు న్వడి నొంప గంగ సుడిగుం♦డం బోయనం గ్రాలె నా
దనుజస్తోమము కీశవర్యుఁడును రౌ♦ద్రస్ఫూర్తిసాటోపుఁ డై. ౧౦౪౮

సీ. ప్రాసాదమునను స్తం♦భంబును బెకలించి, గిర గిర మని చూడ్కి♦కిని నగోచ
రముగ వేవిధముల ♦ రభసంబునను ద్రిప్పఁ, దజ్జాతశిఖిశిఖో♦త్కరము గవిసి
ప్రాసాదమెల్లను ♦ భస్మంబుఁ గావించె, వాయుసూనుండు దై♦తేయశతముఁ
గాలునిపురి కన్చి ♦ గగనంబునకు దాఁటి, యిట్లను బిగ్గర ♦ నెల్ల వినఁగ
తే. వినుఁడు నావంటివారలు ♦ వేలకొలఁదు, లవని వర్తించు చున్నార ♦ లవనిజాత
న్వెదక సుగ్రీవవశవర్తు ♦ లమితబలులు, వానరేంద్రులు లంకాని♦వాసులార!
సీ. పదియేనుఁగులపాటి ♦ బలియురు కొందఱు, కొందఱు నూఱేనుఁ♦గులబలంబు
దనరినవా రిభ♦దశశతబలయుతుల్, కొందఱు వాయువే♦గులును గలరు
అప్రమేయబలాఢ్యు ♦ లర్కజుకడ నిట్టి,దంతనఖాశ్మసా♦ధనులఁ గపుల
నూఱులు వేలును ♦ నూఱువేల్ కోట్లును, బదికోట్లు నెన్నంగఁ ♦ బాటిగాని
తే. వారిఁ గొనివచ్చు వానర♦వర్యుఁ డౌన,మేయబలుఁడు సుగ్రీవుండు ♦ మిమ్ముఁ జంపు
రామచంద్రునితోడ వై♦రమును గొంటి, రింక నెచ్చటి రావణుఁ ♦ డెచటిలంక.

హనుమంతుఁడు జంబుమాలిని వధించుట.

ఉ. అంతట నేగుదెంచెను బ్ర♦హస్తసుతుం డగుజంబుమాలి దే
వాంతకచోదితుం డయి మ♦హారభసంబున రక్తమాల్యముల్

వింతగ నుగ్ర రక్తవస్త్రములు ♦ లీలగఁ గుండలముల్ ధరించి దు
ర్దాంతబలుండు వాసవశ♦రాసనతుల్యశరాసహస్తుఁ డై. ౧౦౫౧

ఉ. సాయక మొండు గైకొని ది♦శావలయంబు వణంక జ్యాలతం
బాయక మీటుచుఁ ఖరస♦మంచిత మైనరథంబు నెక్కి తఁ
డాయఁగ నచ్చువాసని ఘ♦నం బగు నాకృతివానిఁ గాంచి లో
వాయుజుఁ డుబ్బి యార్చె సుర♦వైరిసమూహము పిచ్చలింపఁగన్. ౧౦౫౨

కం. వానరవీరునిఁ గని యా, దానవవీరుండు బాణ♦దశకము వింటిన్
బూనిచి బాహులఁ గ్రుచ్చుచు, నాననమునఁ దలను మార్గ♦ణావళి నాటెన్.

కం. శరనిహతముఖము రక్తని, కరబిందునిషిక్త మగుచు ♦ ఖరకరకిరణో
త్కరవికసితశరదాగమ, సరసీజాతంబుసొంపు ♦ సంపాదించెన్. ౧౦౫౪

కం. శోణిత మగుకపివదనము, శోణితబిందువులచేత ♦ శోభిలి మింటన్
శోణిత చందనబిందుల, రాణించెడికోకనదము♦రాణఁ దలిర్చెన్. ౧౦౫౫

సీ. రోషాళితాఁకునఁ ♦ గోపించి మారుతి, డాపున నుండుబం♦డను నొకండు
గొని వైవ వాఁడును ♦ దునుకలు గావించెఁ, బదిబాణముల దాని♦పాటు గాంచి
కపి సాలమొక్కండు ♦ గ్రక్కునఁ గైకొని, త్రిప్పంగ దానిని ♦ దితిజవరుఁడు
నాలుగుశరముల ♦ లీలమై ఖండించి, యేనిట భుజముల ♦ నేసి వక్ష

ఆ. మునను నొకటఁ బదిట ♦ స్తనదేశమును గొట్ట, దీప్త బాణవిద్ధ♦దేహుఁ డగుచుఁ
బరిఘ మదియ త్రిప్పి ♦ గిరగిర మని వాని, ఱొమ్ము సూటి చూచి ♦ ఉవ్వెటయును.

కం. తల యేదో చెయి యేదో, మొల యేదో చాప మేదొ ♦ మోఁకా ళ్ళేవో
తెలియక యుండఁగ దితిజుఁడు, నులి నులియై నేల రాలె ♦ నుగ్గ నూచై. ౧౦౫౮

కం. స్యందనముతోడ ఘోటక, బృందముతోఁ బూనియున్న♦యిషుకాండముతో
వందము లగుభూషలతో, మ్రందెను దనుజుండు ముద్ద♦మాడ్కిగ నగుచున్.

ఆ. జంబుమాలిపాటు ♦ చయ్యన హతశేష, కింకరాళి దెలుపఁ ♦ గింక రేఁగ
పంక్తికంఠుఁ డంతఁ ♦ బనిచె నమాత్యపు, త్రకుల శౌర్యగర్వ♦దర్పధనుల. ౧౦౫౯

## హనుమంతుఁడు మంత్రిపుత్రుల నేడ్వురఁ జంపుట.

సీ. సప్తార్చివర్చసుల్ ♦ సప్తసంఖ్యులువారు, వెలువడి శరచాప♦వివిధసాధ
నంబులఁ గైకొని ♦ డంబుమీఱఁగఁ బర, స్పరజయవాంఛులై ♦ భర్మజాల
కేతనమాలికా♦కీలితరథములు, నంబుదధ్వానంబు♦లట్లు మొరయఁ
జాపటంకృతుల ది♦శాభాగ మగలఁగఁ, గార్మెఱుంగులయట్లు ♦ గ్రాలి చనఁగ

తే. వారితల్లులు కింకర♦వార్త వినుట, కొడుకు లేమగువారలొ♦కో యటంచు
బాంధవాప్తసమేతు లై ♦ పల్లటిలిరి, సురవిరోధులు పవమాన♦సుతుని డాసి

ఉ. స్యందనగర్జితస్వనము ♦ సాయకవృష్టియుఁ గ్రాల దేవతా
　బృందవిరోధవారిధర ♦ మెంతయు మ్రోఁగిన వాయుసూనుఁడున్
　గొందలపాటు లేక యొక♦కొండన నోర్చి చరించె మింట ని
　ర్గంధరయాన రాక్షసశ♦రంబులకున్ గుఱిగాక వేగి యై. 　　౧౦౬౧

కం. ఇంద్రశరాసనసంయుత,సాంద్రాంబుదపంక్తి కలఁచు♦శ్వసనుం డనఁగా
　నుంద్రప్రతాపి కపియు న,తంద్రతఁ గోదండధరుల♦దైత్యులఁ గలఁచెన్. 　　౧౦౬౨

కం. కంఠారవ మారఁగఁ గపి,కంఠీరవ మపుడు గవిసి ♦ క్రవ్యాదవధో
　త్కంఠుం డై తలపదనఖ,కుంఠితములఁ జేసె నేలఁ ♦ గూల బలంబుల్. 　　౧౦౬౩

ఉ. కొందఱఁ గేల బాఁది, మఱి♦కొందఱ నేఃను మోఁది, గ్రుద్దుచుం
　గొందఱ, వెండి కొందఱను ♦ గోళ్లను జీల్చుచు, నట్టె తాఁకుచున్
　గొందఱ గుండువోలె, నొక♦కొందఱ దిర్దిర ద్రిప్పి వైచుచున్
　గొందల మందఁ గూల్చె రిపు♦కోటి వనాటవిభుం డుదగ్రుఁ డై. 　　౧౦౬౪

తే. చెవులు బీఁటలు వాఱఁగ ♦ సింహనాద
　మొనరఁ జేయఁగ మఱికొంద ♦ ఱుర్విఁ గూలఁ
　గాక తక్కురు వెఱచి చీ♦కాకుపడుచుఁ
　బోయినదె పోకగాఁ బాఱి♦పోయి రంత. 　　౧౦౬౫

తే. తన్నుకొనిచచ్చు గుఱ్ఱాలు ♦ ధరణిఁ గూలి
　మూల్గునేనుంగులును నేల ♦ మ్రొగ్గతిలిన
　గొడుగులును డెక్కెములల్ నిండెఁ ♦ బుడమి నెత్రు
　టేర్లు పాఱెను లంకలో ♦ నెగసె నులివు. 　　౧౦౬౬

కం. వానరవీరుం డీగతి, మానవభోజుల వధించి ♦ మసలక చని యు
　ద్యానముతోరణమున నా,సీనుం డై యుండె రణము ♦ సేసెడుకోర్కిన్. 　　౧౦౬౭

↞ హనుమంతునిమీఁదికి రావణుఁడు సేనానాయకుల నేవురఁ బంపుట. ↞

సీ. మంత్రితనూజుల ♦ మరణంబు రావణుఁ, డాలించి మఱుఁగిడి ♦ స్వాంతమును వి
　రూపాక్ష దుర్ధర ♦ యూపాక్ష భాసక,ర్ణప్రఘసుల సైన్య♦నాయకులను
　నేవురఁ గనుఁగొని ♦ యేగి మీరలు సర్వ,సైన్యంబుతో వన♦చరునిఁ బట్టి
　తేవలయును జుండు ♦ తేఁకువ మెలఁకువ, తప్పక కడుఁ బ్రయ♦త్నంబుచేసి
తే. కాలదేశవిరోధంబు ♦ గలుగకుండఁ, గార్య మొనరింపుఁడీ క్రోఁతి♦గాఁడు వాఁడు
　జిష్ణుఁడు తపోబలంబున ♦ సృష్టి చేసి, యంపెఁ బెనుభూతమొం డస్మ♦దర్థముగను.

చం. మిముఁ గొని కాదె గెల్చితిని ♦ మేటిబలాఢ్యుల నాగయక్షరా
　సమరమహర్షి దానవుల ♦ నద్భుతరీతి రణాగ్రసీమలన్

సమయము వేచి వా రిపుఁడు ♦ సల్పఁగఁ జూచెద రప్రియంబుఁ జం
డమరవిరోధులార! యెటు♦లైనను గ్రోఁతిని బట్టి తేరుఁడీ. ౧౦౬౯

ఉ. గెలిగఁ జూడఁబోకుఁడు ప్ర♦కీర్తితవిక్రము నీకపీశ్వరున్
వాలిని వాలిసోదరు న♦వార్యపరాక్రము జాంబవంతుఁ గీ
శాలిచమూపు నీలు ద్వివి♦దాదులఁ జూచితిఁ గాని వారి కీ
హాలినరూపు ధీగతి య♦వారితతేజము లుల్లసిల్లెనే. ౧౦౭౦

చం. ఘనతరభూత మెయ్యదియొ ♦ కైకొని వానరరూప మీక్రియం
బనివడిరాఁగఁ బోలును, బ్ర♦మాదము మాని చరింపుఁ డాజిలో
మనుజసురాసురాదులును ♦ మార్కొనఁ జాలరు మిమ్ము నట్లటం
చును మది నేమఱం దగదు ♦ శూరులకుం గలహంబుపట్టులన్. ౧౦౭౧

చం. కలన జయింతు నేన యనఁ♦గాఁ దగ దేరికి, గెల్పు చంచలం
బలఘుతరప్రయత్నమున ♦ నోఁ దన రక్ష యొనర్పు నంచుఁ దాఁ
సెల విడ వార లేగిరి వి♦శిష్టరథేభతురంగపంక్తితోఁ
గలకలనాదముల్ చెలఁగఁ ♦ గాంచ శరాసనశస్త్రపాణు లై. ౧౦౭౨

### హనుమంతుఁడు సేనానాయకుల నేవురఁ జంపుట.

కం. వీరునిఁ బ్రజ్వలదుదయ,త్సూరునివలె వెలుఁగువాని ♦ శుభమతిని మహా
కారు మహావేగు మహా,ధీరు మహోత్సాహుఁ గనిరి ♦ దితిజనరేణ్యుల్. ౧౦౭౩

సీ. కనుఁగొని దుర్ధరుం ♦ డనుపమశితపీత,ముఖశరపంచక♦మునను హనుమ
శిరము నొప్పించిన ♦ హరివరుం డుప్పర,వీదికి నెగిరి యు♦ర్వియును దెసలు
నిండ గర్జింప న♦ఖండతేజుం డైన,దుర్ధరుం డొకనూఱు♦తూపు లూని
కపిమీఁద వర్షింపఁ♦గా నల్పమేఘంబుఁ, దూలించువాయువు♦లీల వాని

ఆ. మాపి పవనజుండు ♦ మార్గణహతి నొచ్చి, మేను పెంచి వేగ ♦ మింటి కెగసి
యచటినుండి పడియె ♦ నాతని తేరిపైఁ, గొండమీఁదఁ బిడుగు♦పిం డనంగ. ౧౦౭౪

ఆ. హయము లెనిమిదియును ♦ నక్షకూబరములు, సమసె విటిగె వాఁడు ♦ స్యందనంబు
నుండి పడియె విడిచి ♦ యసువు వానిని గాంచి, తీవ్రరోషు లగుచు ♦ దివికి నెగిరి

తే. అల విరూపాక్షయూపాక్షు ♦ లనెడివారు, కపియురస్థలి మోఁద ము♦ద్గరము లెత్తె
హనుమ వారల వేగంబు ♦ నాఁగి మరలఁ, బృథ్వికిని డిగ్గి చెట్టొండు ♦ పెల్లగించి.

ఉ. వారలఁ గొట్టి చంపఁ దమ♦వారలమువ్వురపాటుఁ గాంచి దు
ర్వారతరాగ్రహంబునను ♦ బట్టిసముం బ్రఘసుండు పైచినన్
శూరుఁడు భాసకర్ణుఁడును ♦ శూలముఁ గైకొని క్రుమ్మెఁ గ్రుమ్మినన్
మారుతి బాలభాస్కరుని♦మాడ్కిని మండుచు రక్తసిక్తుఁడై. ౧౦౭౫

కం. తరుమృగఫణిసంయుత మగు, ధరణీధరశృంగమునను ♦ దద్రాక్షసులన్
బురుగతి వైచిన నయ్యైరు, వురు వ్రాలిరి యపగతాసు ♦ వు లయి ధరిత్రిన్. ౧౦౭౮

కం. ఏవురు దళవాయులు నిటు, చావం బెఱవారి నెల్లఁ ♦ జక్కడఁచెను దం
తావళహయభటతతి దం, తావళహయభటుల నసుర ♦ తతి నిండ్రుఁ డనన్. ౧౦౭౯

కం. చన దెరువులేక యుండఁగ, ఘనగజహయభటచయంబు ♦ క్ష్మా నెఱసిన నా
హనుమ లయకాలుఁ డనఁగాఁ, జని తోరణసీమఁ జేరె ♦ శ్రాంత్యర్థ మనన్. ౧౦౮౦

హనుమంతుమీఁదికి రావణుఁ డక్షకుమారునిఁ బంపుట.

సీ. దళవాయు లేవురు ♦ దళములతోఁ బోర, హతు లౌట విని యమ ♦ రారినేత
సమరోద్ధతోన్ముఖుఁ ♦ జండవిక్రమశాలిఁ, దనతనూభవు నక్షుఁ ♦ గనుఁగొనంగఁ
గనుసన్న యెఱిఁగి యా ♦ దనుజవీరుఁడు స్వర్ణ, చిత్రకార్ముకమును ♦ జేతఁ బూని
ద్విజవరుల్ వేల్వంగ ♦ వెస భగ్గు మని లేచు, నగ్నినా దిగ్గన ♦ నట్టె లేచి

తే. తపముబలమున నార్జింపఁ ♦ దప్తకనక, జాలశోభిత మై రత్న ♦ జాలలసిత
కేతనాంచిత మై జవో ♦ పేతసైంధ, వాష్టకసుయోజితం బయి ♦ యమరి మఱియు

తే. బాలభాస్కరుభంగిని ♦ బ్రజ్వరిల్లి, యసురదానవదుర్జయ ♦ మై నభశ్చ
రంబు నై రత్నమయ మైన ♦ రథము నెక్కి, తూణ మష్టకృపాణికల్ ♦ తోమరములు

కం. వెలుఁగ న్వెలువడి భువి డివి, నులివునఁ బూరించి రథగ ♦ జోత్తమహయముల్
బలములు గొలువఁగఁ జనికనె, బలియునిఁ దోరణనివాసిఁ ♦ బ్లవగాధీశున్ ౧౦౮౩

చం. విలయకృశానుతుల్యుఁ డగు ♦ వీరవరున్ బహుమానదృష్టిచేఁ
గలయఁగఁ జూచి వానిజవ ♦ గర్వము నాత్మఁ దలంచి స్వీయ మా
నలవు బలంబుఁ జూపఁగ హి ♦ మాత్యయభాస్కరుఁబోలి తీవ్రుఁ డై
తలఁకక మూఁడుబాణములఁ ♦ దాడితుఁ జేసి మరుత్తనూభవున్ ౧౦౮౪

హనుమంతుఁ డక్షకుమారునిఁ జంపుట.

కం. వెండియుఁ బైపడి శితఖర, కాండంబుల నొంప నక్ష ♦ కపినాథులకున్
భండనము చెల్లె దివిజుల, గుండెలు దిగ్గిగ్గనంగఁ ♦ గ్రూరం బగుచున్. ౧౦౮౫

చం. పుడమి వడంకెఁ, దేజ మఱి ♦ పోయె నహర్పతి, గాలి వీచుటల్
విడిచెఁ, జలించెఁ గొండలును, ♦ విన్నువిరావ మెసంగె, క్షోభముం
బడియె సముద్రముల్ భయము ♦ పాటున, రాక్షసవానరేశ్వరుల్
విడివడి ఘోరభంగిఁ బరి ♦ విచ్చక మచ్చర మెచ్చి పోరుచోన్. ౧౦౮౬

ఉ. అట్టియెడం గుమారుఁడు ర ♦ యంబునఁ గాంచనపుంఖబాణముల్
పట్టి విషోజ్జ్వలంబు లగు ♦ పాములపోలిక మూఁటినాటినన్

దొట్టెడు నెత్తుటన్ ముఖము ♦ తోయజబాంధవుఁబోల సోఁకురా
పట్టి శరంబులు న్వెలిఁగె ♦ భానువులట్టులు ప్రజ్వరిల్లుచున్. ౧౦౫౭

సీ. అది చూచి మారుతి ♦ యాగ్రహోదగ్రుఁడై, తనచూపుగముల నె ♦ దనుజతనయు
బలముల వాహనం ♦ బుల దహియించెను, మందరాగ్రస్థాంశు ♦ మాలిమాడ్కి
నక్షుండు కుపితుఁడై ♦ యచలంబుమీఁద జీ, మూతముగతి ముల్కి ♦ ముసురుగురిసెఁ
గపియును జంకక ♦ గర్జించి తృణవృత్తి, వాపిని డాసెడి ♦ వారణంబు

ఆ. పగిదిఁ దన్నుడాయు ♦ బాలునిఁ గికురించి, మింటి కెగసె దానఁ ♦ గంటగించి
యసుర పఱపె మార్గ ♦ ణాసార మతనిపై, హరియుఁ దగులువడక ♦ యంద తిరిగె.

చం. తిరిగిన నీడ వోవకయె ♦ తీవ్రఖరాశుగజాలవర్షముల్
గురియుకుమారుఁ గాంచి కపి ♦ కుంజరుఁ డెట్లు జయింతు వీని నం
చరయఁగ నింతలోన నమ ♦ రాంతకసూనుఁడు శాతమార్గణో
త్కరపరివిద్ధబాహువుగఁ ♦ దన్నొనరింపఁగ మెచ్చి చింతిలున్. ౧౦౫౯

ఉ. చూడఁగఁ బిన్నగాని పటు ♦ శూరుఁడు బాలదివాకరప్రభుం
డోడఁ డొకించుకేనియు న ♦ నుత్తమకర్ముఁడు, వీని కక్కటా!
గోడు ఘటింపఁగా మనసు ♦ గొల్పదు, వీనిపరాక్రమంబుఁ గొం
డాడెద రెంతయున్ విబుధ ♦ యక్షసురాహిమహర్షు లద్దిరా. ౧౦౬౦

ఉ. చక్కఁగ నన్నుఁ జూచెడిని ♦ సమ్ముఖమం దొగి నిల్చి తెంపు పెం
పెక్కెడు నంత కంతకును ♦ నెక్కుడు నేర్పును దీర్పు నోర్పునున్
మిక్కిలి యీసు మానఁడు, స ♦ మిన్నిపుణుండును, బాలుఁ డంచు నే
మక్కువ నూరకున్న నప ♦ మానము తప్పక గూర్చు నా కనిన్. ౧౦౬౧

ఉ. భండనసీమ నీతని య ♦ భంగపరాక్రమవేగతేజముల్
గుండెలు వ్రక్కలించు సుర ♦ కోటుల కేనియు, నేమి వీనికో
దండవిజృంభణంబు భుజ ♦ దర్పసమగ్రత! నైప వచ్చునే?
ఖండితుఁ జేయఁ బూన నగుఁ ♦ గా, జ్వలదగ్ని నుపేక్ష యర్హమా? ౧౦౬౨

చం. అని తనమేను వెంచి యను ♦ రార్భకుఁ ద్రుంపఁగ నెంచి స్వేచ్ఛమై
ఘనతరవేగవంతముల ♦ ఖప్రచరిష్ణువు లైనవాజులన్
దునిమెఁ దలప్రహారములఁ ♦ దోడనె తేరును గూల నేలపైఁ
దునియలు వాఱఁ దద్రథము ♦ దూఁకి కుమారుఁడు చాపహస్తుఁడై, ౧౦౬౩

చం. అనుపమ యోగశక్తిని మ ♦ హర్షులు దేహము వీడి స్వర్గమున్
జనియెడిభంగిఁ దీవ్రరభ ♦ సంబున మింటికి దాఁటి ఖడ్గముం

గొని పవనాత్మజుం గదిసి ♦ క్రూరతఁ బోరుచు నుండ నంజనా
తనయుఁడు డాసి పైపడి ప♦దంబులు రెండును బట్టి కోపి యై. ౧౦౯౪

ఉ. అండజనేత జిహ్వగము♦నట్లు విదిర్చివిదిర్చి వేగతుల్
గండున నేలపై విసరి ♦ క్రచ్చఱ మోఁద శిరంబు వ్రక్కలై
కండలు నెత్తు రెమ్ములును ♦ క్ష్మాతల మంతయుఁ గప్పఁ దండ్రికిన్
గుండెలు ఝల్లనంగ సుర♦కోటులు సమ్మద మందఁ జచ్చినన్. ౧౦౯౫

కం. మునులును యక్షులుఁ బన్నగ,ులును జక్రచరుల్ మహాత్ము♦లును వాసవుఁడున్
వినియములు నమరవరులును, గని రచ్చెరు వొలయఁ బంక్తి♦కంఠసుతారిన్. ౧౦౯౬

కం. క్షతజోపమాక్షు వాసవసుతసన్నిభ తేజు నక్షు ♦ స్రుక్కించి మరు
త్సుతుఁ డేగి ప్రళయకాలుని,గతిఁ దోరణమందుఁ జేరె ♦ గాసి దొలంగన్. ౧౦౯౭

⟵ రావణుఁ డింద్రజిత్తును హనుమంతునిమీఁదికిఁ బంపుట. ⟶

కం. వీరుఁడు తనయుం డక్షకు,మారుఁడు వానరునిచేత ♦ మడియుట విని కో
పారుణితలోచనుం డై, ధీరత రావణుఁడు పల్కు ♦ దేవేంద్రజితున్. ౧౦౯౮

మత్తకోకిలము. ఈవె యస్త్రవిదగ్రగణ్యుఁడ ♦ వీవె సర్వసుపర్వదై
త్యావళీవ్యసనప్రదాతవు ♦ ఖ్యాత మెల్లజగంబులన్
దావకీనభుజాబలంబు, వి♦ధాతఁ గొల్చి మహాస్త్రముల్
నీవు పొందితి, నీచరిత్రలు ♦ నిర్జరాళికి స్పష్టముల్. ౧౦౯౯

కం. నీయస్త్రబలము పెంపున, నీయెదుటను నిలువ వశమె ♦ నిర్జరులును దై
తేయులు వాసవుఁ డైనను, మాయామ్నాయమున నీస♦మానులు గలరే? ౧౧౦౦

మత్తకోకిలము. యోజనం బొనరింపఁ దోఁపని♦యుక్తి యొక్కఁడు లేదు నీ
కాజికేళి నసాధ్య మాపని ♦ యైన నేదియు లేదుగా
యీజగత్త్రయి నీదుదర్ప మ♦హీననిస్తులితాస్త్రసం
యోజితాద్భుతశక్తి యెవ్వరో♦కో యెఱుంగరు పుత్రకా! ౧౧౦౧

తరలము. తపముపేర్మిఁ బరాక్రమంబున ♦ దారుణాస్త్రబలంబునన్
విపులశక్తిని మాదృశుండవు ♦ నీకు గెల్పు రణంబులో
నెపుడు నిశ్చిత మా టెఱుంగుట ♦ నేను జింత దొఱంగి ధీ
నిపుణ! యెప్పుడు హాయి నుండుదు ♦ నేఁటిమాట యిదేటికిన్. ౧౧౦౨

కం. ఓడక ని న్నెదిరిచి యహ్లాదనివాఁ డెవఁడు? భుజత♦పోతిబలంబుల్
గూడి నినుఁ గాచు నెప్పుడు, వీడక మఱి దేశకాల♦వేదివి తనయా. ౧౧౦౩

సీ. కింకరులను గాల♦కింకరులను గూర్చె, జంబుమాలిని బట్టి♦దంబు మాల్చె
మంత్రిపుత్త్రుల యమ♦మందిరంబున కన్చెఁ, బంచత సైన్యేశ♦పంచకమున

కలవరించెను హయ♦నాగరథాళితో, దళముల నెల్ల వి♦దళనపఱిచె
నీముద్దుఁదమ్ముండు ♦ నీల్గె నక్షకుమారుఁ, డింద్రజితా! నాకు ♦ నెల్లయందు
తే. కంటెనీయందు విశ్వాస ♦ మ్ముంట నిన్నుఁ, బనుప వలసెను ♦ వానరు♦బలముఁ జెలము
చక్కఁ బరికించి నీబల♦శౌర్యములను, దదనురూపంబు సేయుము ♦ తనయ కుజ్జ్రీ.

మత్తకోకిలము. సేనయంతయు వానరేంద్రుని♦చే హతం బయి పోకముఁ
వాని నస్త్రవిదగ్రగణ్య! జ♦వంబుమైఁ బరిమార్పుమీ
వానిఁ దాఁకఁగఁ బోవు ముందుగ ♦ వానిశక్తి స్వశక్తియుఁ
మానసంబునఁ జక్కఁజూడు ప్ర♦మాదముం బడఁ బోకుమీ. ౧౧౦౫

మత్తకోకిలము. సేన కావఁగ లేదు నిన్నని ♦ సిద్ధ మియ్యది, సేన లె
న్నైనఁ దాఁకినఁ ద్రుంచు వాఁడు, మ♦హాబలోపమ వేగు వై
శ్వానరాభుని డాయఁ బోకుము ♦ వజ్రముఁ ధరియించి యొం
డేని ముష్టిరణంబు సేయఁగ♦నేని మర్దితశాత్రవా. ౧౧౦౬

మత్తకోకిలము. ఇంతయుం దలపోయుమీ మఱి♦యేది యుక్తమొ చూడుమీ
యంత నింతను బోఁడు వాఁడు మ♦హాస్త్రముల్ స్మరియింపుమీ[1]
స్వాంతముఁ నిజదృష్టియుఁ శర♦పాత మొక్కటిగాఁగ దు
ర్దాంతశక్తి రణంబు సేయుము ♦ తాల్మి, నీకు జయం బగున్. ౧౧౦౭

కం. బాలుని నినుఁ బంపఁగ రా, దాలమునకు నాకుఁ దెలియు ♦ నైనను ధరణీ
పాలురకు క్షత్రనీతియ, వాలాయము దాని దాఁట ♦ వచ్చునె చెపుమా. ౧౧౦౮

కం. కావున నిన్నంపెద నా,నావిధమహితాస్త్రముల మ♦నంబునఁ గడుసం
భావించుచుఁ బోరుము పుత్రా! విజయముఁ గొమ్ము పోయి ♦ రమ్మా సుమతీ!

## ఇంద్రజిత్తు హనుమంతునిమీఁదికి యుద్ధమునకుఁ బోవుట.

చం. అని జనకుండు వల్క విన♦యంబున నాతనికిం బ్రదక్షిణం
బొనరిచి దక్షపుత్రనిభుఁ ♦ డుద్ధతి సన్నహనంబు సేసి బం
ధునిచయపూజితుం డగుచుఁ ♦ దూర్ణము పర్వము వేళ వార్ధిరీ
తిని ఖగరాజవేగహరి♦దీప్తరథంబును నెక్కి వెల్వడెన్. ౧౧౧౦

ఉ. ఆరథికోత్తముండు పవ♦నాత్మజుచక్కటి కేగ నాతఁ డా
ఘోరశతాంగనిస్స్వనము ♦ క్రూరశరాసగుణారవంబులుఁ
భూరితరంబు గావుటయుఁ ♦ బొంగి గళార్భటి నించె వ్యోమసం
చారులు నాగయక్షఋషి♦సత్తము లుబ్బున మూఁగ వేడుకన్. ౧౧౧౧

---

[1] ఇదివఱకు హనుమంతునితో యుద్ధముచేసినవారు భుజశస్త్రబలముల నమ్మి పోరాడినవారు. అక్షకుమారుఁ డస్త్రవిద్య తెలిసియు నామార్గమున పోయినవాఁడు కాఁడు. అతికాయ మకరాక్షాదు లిరువురు మువ్వు రస్త్రవిద్య తెలిసియు హనుమంతుని జయించునంత విద్య తెలిసినవారు కారని రావణుఁడు బ్రహ్మాది సర్వాస్త్రవేదియైన యింద్రజిత్తుని నస్త్రములతోనే పోరుమని బోధించెను.

చం. దరకరభూరిచాపమును ♦ దారుణశాతశిలీముఖంబులుఀ
వరబలుఁ డుద్ధతిం గొని జ♦వంబున సంగరకాంక్షఁ బోవ భీ
కరముగఁ గూసె సత్త్వములు ♦ కాంతి దొఱంగె దెసల్ విహంగమో
త్కరములు మింటఁ బెక్కులువి♦ధంబుల నాద మొనర్చె భీతిచేన్. ౧౧౧౨

శా. జ్యాటంకారవిపాటితాశుఁ డగుచుఀ ♦ శక్రారి నిర్వక్ర మా
నాటోపంబున బాణవర్షములతో ♦ నవ్వానరుఀ డాయ వృ
త్తాటుం డుద్భటవైరిభీతికరగ♦ర్జాస్ఫోటితో ర్వీధ్రుఁ డై
యాటాడంగ ధరాతలంబు నిజవే♦గోద్ధూతజీమూతుఁ డై. ౧౧౧౩

చం. విడివడి తాఁకె నిట్లు రణ♦వీరు లవారణవిక్రమంబునఀ
గడుకొని దేవదానవుల♦కైవడిఁ బోరిరి బద్ధ వైరు లై
యెడ గొన నీక వచ్చుశర♦వృష్టిరయంబును నాఁపి కాయముం
బొడ వొనరించి తండ్రిపథ♦ముం గొని గ్రుమ్మరుచున్నమారుతిన్. ౧౧౧౪

ఉ. ఆయతతీక్ష్ణశల్యకన♦కాంచితపుంఖశరాలి వైచె న
త్యాయతవేగ మార నసు♦రాధిపనందనుఁ డంతఁ దూర్యముల్
వాయక భేరికాపటహ♦వారరవంబులుఁ గార్ముకధ్వనుల్
మ్రోయఁ దొడంగె దాని విని ♦ రోషమునం బవమానసూతియున్. ౧౧౧౫

మ. కృతహస్తుం డగువాసవారి దనపైఁ ♦ గీలించుబాణావళిం
వితగాఁ జేయుచు వానియంతరమునఀ ♦ వేగంబు దీపింపఁగా
ధృతి పెంపారఁ జరించు, నెట్టయెదుటఀ ♦ దృగ్గోచరుం డౌ, నభో
గతుఁ డౌ, వెంటనె మీఁద దూఁకుఁ, గరయు♦గ్మం బడ్డగించు న్వెసన్. ౧౧౧౬

ఉ. ఇద్దఱు యుద్ధకర్మఠు ♦ లిద్దఱు భూరిజవాధికోత్తముల్
పద్దుగఁ బోరి రిద్దఱు న♦పారపరాక్రము ముల్లసిల్లఁగా
నద్దిర నాఁగ భూతనిచ♦యంబు, పరస్పరతారతమ్య మా
యిద్ద ఱెఱుంగ రైరి దను♦జేశ్వరనందనవాయునందనుల్. ౧౧౧౭

చం. హనుమ యెఱుంగఁ డయ్యె నసు♦రాధిపనందనునంతరంబు, నా
దనుజుఁ డెఱుంగఁ డయ్యె వసు♦ధారుహచారునియంతరంబు, నా
యనఘులు పోరుచో దృఢస♦మాధిని నింద్రజి బాణముల్ వృథా
చనుటయ కాని కీశవరుఁ ♦ జక్కఁగ నాటవ యేమి సేయుదున్ ౧౧౧౮

## ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రమున బంధించుట.

ఉ. చిక్కఁడు లక్ష్యసిద్ధికిని ♦ జేవడి వీని వధింప శక్యమా
యెక్కరణిం గ్రహింప నగు ♦ నీతని నంచుఁ బితామహాస్త్రముం
గ్రక్కున నారికిం దొడిగి ♦ రావణి పావని వైచి కట్టె వీఁ
డుక్కరి యొంటఁ బోఁ డనుచు ♦ నుర్విఁ బయిం బడె దానఁ గ్రోఁతియున్. ౧౧౧౯

ఉ. పోలి విచేష్టుఁ డై పవన♦సూనుఁడు బ్రహ్మవరంబు నెంచి దో
ర్లీల నడంచి నిర్జరవ♦రిష్ఠునియానతి దాఁట శక్యమా
పాలన సేయుటే పరమ♦భవ్యము చిక్కితిఁ బో భయంబు లే
దోలిఁ బితామహుండును బి♦డౌజుఁడు వాయువు నన్నుఁ గావఁగన్. ౧౧౨౦

కం. ననుఁ బట్టుకొనుచుఁ బోదురొ, దనుజులు పోవుదురు గాక ♦ దశకంధరునిం
గనుఁగొని సంభాషింపఁగఁ, జను నదియును నొక్కమేలె ♦ చర్చింపఁగన్. ౧౧౨౧

ఆ. అని సమీక్ష్యకారి ♦ యాహనుమంతుఁడు, చేష్ట లుడిగి యుండి ♦ దుష్టదితిజు
లెల్లఁ బట్టి కట్టి ♦ యీడిచి బెదరింపఁ, గూఁత లిడియెఁ గోఁతి♦గుణముఁ దెలుప.

## రాక్షసులు హనుమంతునిఁ గట్టి రావణునొద్దకుఁ దీసికొని పోవుట.

చం. కనుఁగొని నిర్విచేష్టు డగు♦కైసరి నాశరవారమెల్లఁ గిం
కను బలితంపుఁబగ్గములఁ ♦ గ్రౌర్యమునన్ ద్రుమచీరపాళితోఁ
గొనకొని కట్టఁగా దనుజ♦కుంజరుఁ డుత్కటకౌతుకంబునన్
గను నను నంచు నోర్చి కపి ♦ కట్టులు సైఁచి యణంగి యుండఁగన్. ౧౧౨౩

చం. అసురలు త్రాళ్లఁ బగ్గముల ♦ నాహనుమంతునిఁ గట్టినంతనే
వెస వెస నస్త్రబంధములు ♦ వీడి చనెన్, ద్రుహిణాస్త్రబంధముల్
పసచెడిపోవు నన్య మగు♦బంధచయంబులతోడఁ గూడినన్[1]
లసదసమాస్త్ర మీగతి ఫ♦లం బఱిపోవుట చూచి దీనుఁ డై. ౧౧౨౪

శా. అయ్యో! యెంతటికార్య మిట్లు విఫలం ♦ బాయెన్, సురారుల్ మహా
జయ్యం బౌవరమంత్రశక్తి మది నెం♦చం జాలరై రక్కటా!
యియ్యస్త్రంబు పునఃప్రయుక్త మయి కా♦దేనిన్ మఱొం డస్త్రమేన్
గయ్యానన్ ఫలకారి కా దిఁకను, శం♦కం గూరి రీయందఱున్. ౧౧౨౫

చం. తనమెయి నస్త్రబంధములు ♦ దాఱు టెఱుంగఁడు గాక వానరుం
డని యిటు చింత సేయఁగ సు♦రాధిపజేత, వనాటనేత బం
ధనములఁ గట్టి కట్టియలఁ ♦ దాఁచుచు ముష్టుల బిట్టు గ్రుద్ధుచున్
గొని చని రావణాసురుని♦కొల్వున నిల్పిరి క్రూరరాక్షసుల్. ౧౧౨౬

ఉ. తెచ్చితి మయ్య! క్రోఁతి నని ♦ తెల్పిన నచ్చట నున్న వారు వీఁ
డెచ్చటనుండి వచ్చె? నితఁ ♦ డెవ్వఁడొ? యెవ్వఁడు పంపెఁ? దాను రా
నిచ్చటి కేమికార్య? మిటు ♦ లేటికిఁ జేసె? నటంచు నొండొరుల్
ముచ్చట లాడుచుండ మద♦మోహమునన్ మఱికొంద ఱుద్ధతిన్. ౧౧౨౭

ఉ. కట్టుఁడి కొట్టుఁడీ యతనిఁ ♦ గాల్పుఁడి మ్రింగుఁడ టంచుఁ గ్రుద్ధులై
నెట్టనపల్కుచుండ విని ♦ నీరజబాంధవవంశ్యదూత య

---

[1] ఇట్లే ప్రపన్ను లితరదేవతల భజించినఁ బ్రపత్తికిఁ జ్యుతిగలుగును.

ప్పట్టున రాక్షసాధిపుని♦పాదసమీపమునందు మంత్రులన్
ద్దిట్టల వృద్ధసేవకుల ♦ దివ్యమణీమయగేహముం గనెన్.　　౧౧౨౮

కం.ఇటురా యిటురా యనుచును, బటువికృతాకారదైత్య♦భటు లీడ్వఁగ ముం
దటఁ గనుఁగొనె దశముఖుఁ డు,ద్భటసాధ్వసహేతుతేజు ♦ వాయుతనూజున్.

కం.మర్కటసత్త్ముఁడును గనె, నర్కునివలె వెలుఁగువాని ♦ నతిబల తేజున్
గర్కశముఖు రాక్షసపతిఁ, దర్కింపఁగ రానిమహిమఁ ♦ దనరఁగ నతఁడున్.౧౧౩౦

చం.వికటతరాగ్రహారుణిత♦వింశతిలోచనముల్ వెలుంగఁగాఁ
బ్రకటమనీషులన్ సచివ♦రాజుల సత్కులశీలవృద్ధులన్
నికటతలానువర్తుల స♦నెం, గపి యెవ్వఁ డెఱుంగుఁ డీరు త
త్ప్రకల మ టన్న వారు కపి♦సత్తముఁ గార్యముఁ బ్రశ్న సేయఁగన్.　　౧౧౩౧

కం.హరిలోకేశ్వరుఁ డగునా,హరితనయుం డంప దూత♦నై యిచ్చటి కే
నరుదెంచితి నని వారికిఁ, బరమబలోదారుఁ డొసఁగెఁ ♦ బ్రత్యుత్తరమున్.౧౧౩౨

హనుమంతుఁడు రావణుని సభలోఁ జూచుట.

కం.హనుమయు రావణుచర్యల,కును[1] నబ్బురపాటు గదురఁ ♦ గోపారుణలో
చనుఁడై నిర్లక్ష్యగతిం, గనుఁగొనియెం బంక్తికంఠుఁ ♦ గలహోత్కంఠున్.　　౧౧౩౩

సీ. అతులమహార్ఘము♦క్తావళీవృత మయి, మెఱుఁగారుమకుటంబు♦నఱలు వాని
సంకల్పసంభూత♦జాంబూనదాభర,ణాంచిత మైనదే♦హంబువాని
క్షౌమవస్త్రుని రక్త♦చందనలిప్తుఁడై, వలపులు వెదఁగ్రమ్మఁ♦గొలుపువాని
దర్శనీయంబులై ♦ తగవివృతంబులై, వెఱపెట్టుకన్నుల♦మెఱుపువాని

తే. మెఱుఁగుఁగోఱలు ప్రేలువా♦తెఱయుఁ గలుగు
వక్త్రదశకంబుతోడ స♦వ్యాళమంద
రాద్రిశిఖరంబునకు నెన ♦ యైనవాని
నమరవరులకు హృచ్ఛల్య ♦ మైనవాని.　　౧౧౩౪

ఉ. కాటుకప్రోవుఁబోలు మెయి ♦ గ్రాల నురంబునఁ దారహారముల్
నీటు చెలంగ నిండునెల♦నెయ్యముఁ జూపుముఖంబుతో బలా
కాటనయుక్తవారిదము♦నంగు వహించెడివానిఁ జిత్రిత
స్ఫాటికరత్నపీఠమున ♦ సౌరు వహించెడివాని పేరునన్.　　౧౧౩౫

కం.అంగదకేయూరాదిక,సంగతములు పీవరములు ♦ చందనయుతముల్
రంగుగ నైదుశిరములభు,జంగము లనఁ దేజరిలుభు♦జంబులతోడన్.　　౧౧౩౬

సీ. కంకణఝుణఝుణ♦త్కారంబు తోరంబు,గను జామరములు జ♦వ్వనులు వైవ
మంత్రతత్త్వజ్ఞులౌ♦మంత్రివరుల్ దుర్ధ,రుఁడు ప్రహస్తుఁడు నికుంభుఁడును మఱి మ

---

[1] తాను (రావణుఁడు). యుద్ధమునకు రాకయే తన్నుఁ గట్టి తెప్పించుట మొదలైనవి.

హాపార్శ్వుఁడును భువ♦నాళివార్ధిచతుష్ట,యంబురీతిని జుట్టి ♦ యమరు చుండ
నితరమహామాత్రు ♦ లింద్రుని సురతతి,భంగిని భజియింపఁ ♦ బ్రబలువాని

తే. మేరుశిఖరాగ్రగత మైన♦వారియుక్త
వారిధర మన వెలుఁగొందు♦వాని రాక్ష
సేశ్వరుని రావణునిఁ జూచి ♦ హృదయసీమఁ
బరమవిస్మయపరుఁ డయి ♦ పవనజుండు. ౧౧౩౭

శా. ఔరా రూప! మహో బలంబు! ధృతి యా♦హా! తేజమా యద్దిరా!
యౌరా రాజసమస్తచిహ్నకలనం ♦ బయ్యో యధర్మక్రియా
చారోదారుఁడు కాఁడ యేనియు బిడౌ♦జస్సంయుతం బౌమరు
ద్వారాగారము నేల లేఁడె యితఁ డు♦ద్యచ్ఛక్తిసంపన్నతన్. ౧౧౩౮

కం. క్రూరుం డై భూతదయా,దూరుం డై లోక మెల్ల ♦ దూషించుపనుల్
వారక సలుపుట గాదే, సౌరాసురసమితి లోక♦చయములు వణఁకున్. ౧౧౩౯

కం. లోకంబు నెల్లఁ గినుకను, నేకార్ణవముం బొనర్ప ♦ నితఁ డెంచినచో
వీకున నట్ల యొనర్పం,డే? కా దనువార లెవ్వ ♦ రీగురుతేజున్. ౧౧౪౦

రావణుఁడు హనుమంతునిఁ జూచి యోజించుట.

మ. అను నాలోచన నుండ రావణుఁడు పిం♦గాక్షుం బురోదేశవ
ర్తిని గీశేశుని నట్టె చూచి మది సం♦దేహించెఁ గైలాసముః
ఘనశక్తిం బెకలింప శాపమిడుసా♦క్షాన్నందియా యేమి వ
చ్చెను నీలంకకుఁ? గాక బాణుఁ డోకో[1] వ♦చ్చెం గ్రోతిరూపంబునన్. ౧౧౪౧

మ. అని శంకించి సరోషతామ్రనయనుం ♦ డై మంత్రివర్యుం బ్రహ
స్తుని వీక్షించి ప్రహస్త!నీ వడుగు మీ♦దుష్టాత్మకుం డెవ్వఁ? డే
పనికై వచ్చెనొ మత్పురంబునకు? నె♦వ్వం డంపె? నుద్యానభం
జన మేలా యొనరించె? నేమిటికి ర♦క్షస్త్రీలఁ దర్జించుటల్? ౧౧౪౨

ఆ. ఈదురాత్ము నడుగు ♦ మేటికి యుద్ధంబు, సలిపె? ననఁగ నతఁడు ♦ పలికె నిట్లు
లోరి క్రోతివాఁడ!♦యూఱడిల్లుము భయ,పడఁగ వలదు నీకు ♦ భద్ర మగును.

ప్రహస్తుఁడు హనుమంతునిఁ బ్రశ్నించుట.

చం. అడలకు నీదుచందము య♦థార్థము చెప్పుము, నిక్క మాడఁ బో
విడుతుము, గాక దబ్బఱలు ♦ ప్రేలితి వేనియు నిన్ను మేనితో
విడువము, వాసవుం డసుర♦వీటికిఁ బంపెనె నిన్నుఁ? గానిచో
విడిముడిజేని[2]దూతవో? ర♦విప్రభవాప్పతు[3] లంప వచ్చితో? ౧౧౪౪

[1] వీఁడు కృష్ణునినాఁటి కాలమువాఁడు కాఁడు. ఆపేరుగల మఱియొక రాక్షసుఁడు. [2] విడిముడిజేని — కుబేరుని. [3] రవిప్రభవాప్పతులు = యమవరుణులు.

చం.అసురుల గెల్వఁ గోరుహరి ♦ యంపఁగ వచ్చినదూత వేమొ, యా
లసదసమాన తేజము బ♦లంబును వానరమాత్రునందు నీ
రస నెట నేనియుం గనఁగ ♦ రాదు, స్వరూపముచేత మాత్రమే
యెసఁగెదు వానరుండ వయి ♦ యేటికి వచ్చితి? విన్నవింపరా. ౧౧౪౫

కం.విడుతుము నిను నిజ మాడిన, మెడపైఁ దల నిల్వఁబోదు ♦ మిథ్యలు పలుకన్
నొడువుము సర్వము సోఁకుల, యొడయనిపురి నీవు చొచ్చు♦నుద్దేశంబున్.౧౧౪౬

→ హనుమంతుఁడు రావణునకుఁ దనవృత్తాంతముఁ జెప్పుట. ←

కం.అన విని హనుమంతుఁడు త,ద్దనుజగణేశ్వరునిఁ జూచి ♦ తడఁబడక యనెన్
వినుమీ నావృత్తాంతము, దనుజేశ్వర! పలుకువాఁడఁ ♦ దథ్యము గాఁగన్.౧౧౪౭

సీ. వజ్రపాణియు యమ♦వరుణులు పంపఁగా, నేను వచ్చినవాఁడఁ ♦ గాను జిష్ణు
శ్రీదునకును నాకుఁ ♦ జెలిమి యెప్పుడు లేదు, నను విష్ణు విటకుఁ బొ ♦ మ్మనఁగ రాను
జాతి యియ్యదియ య♦చ్చపువానరుండను, రాక్షసరాజద♦ర్శనము సేత
దుర్లభం బని నాకు ♦ దొరకునిమిత్తమై, ప్రమదావనం బటు ♦ పాడుచేసి

ఆ. నాఁడ యుద్ధకాంక్ష ♦ నానాసురారులు, రా మదీయదేహ♦రక్షణార్థ
మేను బోరినాఁడ ♦ నింద్రాదులును నస్త్ర,పాశములను నన్నుఁ ♦ బట్టలేరు.౧౧౪౮

ఆ. బ్రహ్మవలన నిట్టి♦వర మేనునుం [1]గంటి, నధిపుఁ జూచువేడ్క ♦ నస్త్రమునకుఁ
బట్టువడితిఁ ద్రాళ్లఁ ♦ గట్టుట రాక్షసుల్, పాసె నెల్లయస్త్ర♦బంధనములు.౧౧౪౯

ఆ. రాక్షసేంద్ర! యొండు♦రాజకార్యముకల్మి, నేను వచ్చినాఁడ ♦ నిన్నుఁజూడ
భూరితేజుఁ డైన♦శ్రీరామచంద్రుని,బంట నాదుమేలు♦పలుకు వినుము. ౧౧౫౦

→ { హనుమంతుఁడు రావణునకుఁ దాను లంకకు వచ్చినకారణముఁ దెల్పుట. } ←

సీ. సుగ్రీవునాజ్ఞ ద♦శగ్రీవ! వచ్చితి, నీపట్టనమునకు ♦ నిన్నుఁ జూడ
నీసోదరుండు వ♦నేచరనాథుండు, నీకుశలంబును ♦ నెమ్మి నడిగెఁ
దమ్ముండు చెప్పిన♦ధర్మోక్తి యిహపర,సౌఖ్యనిదానంబుఁ ♦ జక్క వినుము
దశరథుం డనియెడి♦ధరణీశ్వరుఁడు చతు,రంగబలంబులు ♦ నమరువాఁడు

ఆ. ధరణిజనములకును ♦ దండ్రికి మాఱట, తేజమున సురేంద్రు♦దీటువాఁడు
అతనిపెద్దకొడుకు ♦ క్షితితలరంజన,శాలి విభుఁడు రామ♦చంద్రుఁ డతఁడు

చం.జనకునియాజ్ఞఁ జేసి సతి ♦ జానకి తమ్ముఁడు లక్ష్మణుండునున్
దనబడి నేగుదేరఁ జని ♦ దండకఁ జొచ్చెను ధర్మశీలి, యా
తనిసతి నష్ట యయ్యె వన♦ధారిణి ధారిణికన్య, దత్సతిన్
బనిగొని రోయుచుం దనకు ♦ బాసటగాఁ జనుదేరఁ దమ్ముఁడున్. ౧౧౫౧

---

[1] బ్రహ్మచేత వరములనుబొందినవాఁడవు నీ వొకఁడవే కావు. నేనుఁగూడ నెట్టియస్త్రముచేతను మృతి లేకుండ వరముఁ బొందినాఁడను జుమా.

ఉ. రాముఁడు ఋశ్యమూకకుధ♦రంబున సూర్యజుఁ జూచి నాతఁడున్
భూమిజ రోయఁగాఁ బ్రతిన ♦ పూనఁగ భానుకులుండు నట్లె శా
ఖామృగరాజ్య మిత్తు నని ♦ క్రచ్చఱ వాలి వధించి యాజిలోఁ
బ్రేమను గట్టెఁ బట్టము హ♦రిప్రవరుండగు సూర్యనందనున్. ౧౧౫౩

ఉ. వాలిని మున్ను నీ వెఱుఁగ♦వా? యతఁ డొక్క శరంబుచేతనే
కూలెను రాముచేఁ, బిదపఁ ♦ గోమలి రోయఁగఁ గీశనాథులన్
బోలఁగ దిక్కుదిక్కులకుఁ ♦ బుచ్చె దివాకరసూతి నూఱులున్
వేలును వేనవేలుగను ♦ నింగియు నేలయుఁ జూచి క్రమ్మఱన్. ౧౧౫౪

కం. గరుడానిలసమవేగులు, హరివీరులు భూరివిక్ర♦మాఢ్యులు సీతా
హరిణాక్షీమణి నెల్లెడ, వరయుచు నున్నారు వారి♦యం దే నొకఁడన్. ౧౧౫౫

ఉ. మారుతునౌరసుండ, హను♦మంతుఁడఁ బేరను, రాముదేవికై
యారయ నూఱుయోజనము ♦ లాయత మౌలవణాబ్ధి దాఁటి నేఁ
జేరితి నీపురంబు, నిట ♦ సీతను రోయఁగ నీగృహంబునం
దే రమణీమణిం గనితి[1] ♦ నింతయు సత్యము రాక్షసేశ్వరా. ౧౧౫౬

↞ హనుమంతుఁడు రావణునకు బుద్ధి చెప్పుట. ↠

చం. చదివితి వెల్లధర్మములు ♦ శాస్త్రవిధానముచొప్పునన్, జగ
ద్విదితముగాఁ దపోధికతఁ ♦ దీరితి, వట్టిఁడ వయ్యు నన్యలో
ముదితల నేఁప న్యాయమె? స♦మూలవినాశనహేతు వాపదా
స్పద మగు ధర్మహీనకృతిఁ ♦ జల్పునొకో నినువంటి ప్రాజ్ఞుఁడున్. ౧౧౫౭

కం. రామాగ్రహానువర్తులు, సౌమిత్రికరోజ్ఝితములు ♦ శరముల కెదుటన్
సేమముగ నిలుతురే నా, నామరరాక్షసులు నైన ♦ నసురప్రవరా! ౧౧౫౮

కం. రామునకుఁ గీడు చేసియు, నీమూఁడుజగంబులందు ♦ నెలమి సుఖింపం
గా మన నేనియు నెవనికి, సామర్థ్యముగల దొకో వి♦చారింపు మెదన్. ౧౧౫౯

ఉ. కావున ధర్మయుక్తము త్రి♦కాలహితంబును సార్థమైనను
గ్రీవునివాక్యమున్ వినుము ♦ శ్రీనరదేవున కిమ్ము జానకిన్
మావిభుదేవి నిందుఁ గని♦నాఁడ, నదే గడు, నింక నోదశ
గ్రీవ! రఘూద్వహుండె పయి♦కృత్యము లన్నిటిఁ దీర్పఁజాలెడిన్. ౧౧౬౦

ఉ. కంటిని రావణా! జనక♦కన్యక నిచ్చట, నామె నీవు వా
ల్గంటియకాఁ దలంచితివి ♦ గాని యెఱుంగుము పంచవక్త్రయై
కంటు వహించి యున్న పెనుఁ♦గాలభుజంగిగ, దుర్విషాన్నముం
గొంట సతిన్ గ్రహించు టను♦కొమ్ము సురాసురకోటి కేనియున్. ౧౧౬౧

---

[1] సీత నీయింటనుండఁగాఁ జూచితినని చెప్పెనుగాని సీతను నీవెత్తికొనివచ్చితివని చెప్పలేదు. ఆ వాక్యచమత్కృతియు నుపన్యాసము నుపక్రమోపసంహారవిధంబుల గమనింపుఁడు.

చం. అలఘుతపశ్శ్రమార్జితము ♦ నాయువుఁ దేజముఁ బెంచుధర్మస
త్ఫల మిటు పాడుచేసికొన ♦ భావ్య మొకో? సురరాక్షసాళి నన్
గలన జయింప లే దనెడు ♦ గర్వము మాను, మవధ్యతావరం
బులు నినుఁ గావ విష్ణు, చెడి ♦ పోదువు చు మ్మది యెట్టు లంటివేన్. ౧౧౬౨

కం. కాఁ డసురుఁడు కాఁ డమరుఁడు, కాఁడు దనుప్రోద్భవుండు ♦ గంధర్వుండున్
గాఁ డహి సుగ్రీవుఁడు కపి, తేఁ డెట్టులు బ్రదుకు దీత ♦ తేన్ రాజేంద్రా![1] ౧౧౬౩

ఆ. పాపఫలము పుణ్య ♦ ఫల మేకకాలమం, దనుభవింప నెప్పు ♦ డనువు పడదు
ధర్మఫలము వెంట ♦ ధర్మఫలం బేగు, ధర్మమునను జెడు న ♦ ధర్మఫలము. ౧౧౬౪

ఆ. మున్ను నీవు సలిపి ♦ యున్నతపోరూప, ధర్మమునఫలంబు ♦ దానవేంద్ర
యనుభవించి తింత ♦ దనుక న దంతయుఁ; బడయఁ గల వధర్మ ♦ ఫలము వేగ. ౧౧౬౫

కం. తలఁపు జనస్థానము వధఁ, దలఁపుమ యవ్వాలివధము ♦ ధరణిపసుగ్రీ
వులచెలిమియు స్మరియింపుము, దలపోయుమ యాత్మసుఖవి ♦ ధానం బధిపా!

ఉ. నే నొకరుండనే కడిమి ♦ నిర్మథనం బొనరింపనేర్తు లం
కానగరంబు సర్వమును ♦ గాని వచింపఁడు రాముఁ డవ్విధిం;
దానె వధింతు నంచుఁ బ్రతి ♦ నన్ వచియించెఁ గపీంద్రుసన్నిధిన్
జానకిద్రోహి, న ట్లగుట ♦ సైరణ సేసితి రాక్షసేశ్వరా! ౧౧౬౬

కం. రామునకును సాక్షాత్తు, త్రాముఁడు నపకృతిని జేసి ♦ రాదు సుఖింపన్
సామాన్యుల నన నేలా? నీమాటేఁక నేమి చెప్ప ♦ నిర్జరవైరీ. ౧౧౬౭

ఉ. నీవశమంద యుండి ధర ♦ ణీసుత యంచును నీవు చూచునా
భావిని లంక నంతయును ♦ బా డొనరింపఁగఁ జేరియున్నయా
దేవిని గాళరాత్రిఁగ మ ♦ దిం దలపోయుము, నీమెడందు సీ
తావిధకాలపాశ మది ♦ దార్కొనెఁ జూడుము యోగ్యపద్ధతిన్. ౧౧౬౮

చం. ధరణిసుతాతపోనలను ♦ దగ్ధము రాఘవకోపపీడితం
బరయుము సాట్టవప్రపుర ♦ మంతయు, మంత్రిహితానురక్త సో
దరసుతదారయుక్తముగఁ ♦ దద్దయు నాశన మేల యయ్యె? దీ
పురమును వారిఁ గాచికొనఁ ♦ బోలదె చూడుము రాక్షసేశ్వరా. ౧౧౭౦

కం. వినుమీ నావచనంబులు, దనుజేశ్వర! పలుకువాఁడఁ ♦ దథ్యము నే రా
మునిదాసుఁడ దూతుఁడ నం, దును వానరుఁడన్[2] శుభంబు ♦ దొరకొను నీకున్.

---

[1]నీవు తపస్సుచేసి సంపాదించిన పుణ్యఫలము నేఁటితో ముగిసినది. నీవు గంధర్వాదులచేతఁ జావు లేకుండ వరముఁ గోరితివి. సుగ్రీవుఁడు వారిలోఁ జేరినవాఁడు కాఁడు. వానరులచే మృతిలేకుండ నీవు కోరినవాఁడవు కావు. కావున నీవు నరవానరులచేఁ జావు తప్పదు. [2]నీవు రాక్షసుఁడవు; రాముఁడు మనుష్యుఁడు; నే నుభయజాతులలోఁ జేరని క్రోఁతిని. అందు దూతగా వచ్చినవాఁడను. లాభనష్టములు న న్నంటవు. కావున మధ్యవర్తినై నిష్పక్షపాతముగఁ జెప్పుచున్నానని తెలిసికొనుము.

కం.సచరాచరభూతజగ,న్నిచయంబుల సంహరింప ♦ నిరుపమశక్తిన్
రచియింప మరల రాముఁడె, ఖచరేశ్వరదమన! నేర్చు ♦ ఘనయశ మొలయన్.

మ. నరదేవాసురయక్షకింపురుషగం♦ధర్వాహివిద్యాధరో
త్కరసిద్ధామరకిన్నరావళుల వి♦క్రాంతాద్యు విష్ణూపమున్
నరదేవోత్తము రామునిన్ దురములో♦నన్ మార్కొనం జాల రె
వ్వరు నెక్కాలమునందు నెల్లయెడ స♦ర్వప్రాణిజాలంబులన్. ౧౧౨౩

కం.రామునకు రాజసింహున, కామహనీయాత్మునకును ♦ నవికలలోక
స్వామికి ద్రోహ మొనర్చితి, వేమెయి దుర్లభము బ్రదికి ♦ యొసఁగుట నీకున్.

తే. మూఁడులోకంబులకుఁ బ్రభు♦ముఖ్యుఁ డైన
రామచంద్రుని రణమున ♦ రాక్షసేంద్ర!
నాగయక్షనిశాటగం♦ధర్వదేవ
దైత్యవిద్యాధరులు నైనఁ ♦ దాఁకలేరు. ౧౧౨౫

తే. అధిప! బ్రహ్మ స్వభువు చతు♦రాస్యుఁ డైనఁ
ద్ర్యంబకుఁడు రుద్రుఁడును బుర♦హరుఁడు నైన
నింద్రుఁడు మహేంద్రుఁడును సురా♦ధీశుఁ డైనఁ
గలన శ్రీరామవధ్యునిఁ ♦ గావలేరు.[1] ౧౧౨౬

కం.అని హితయుత మగుకఠినవ,చనముల ధృతి చెడక హనుమ ♦ సభఁ దన్నాడన్
విని దశవదనుఁడు కోపం,బున గ్రుడ్డులు ద్రిప్పికొనుచు ♦ భ్రుకుటి నడంకన్.౧౧౨౭

విభీషణుఁడు రావణుతో దూతను జంపరా దని చెప్పుట.

సీ. హనుమంతుఁ జంపఁగ ♦ నాజ్ఞ సేయఁగ విని, దోషజ్ఞుఁ డైనవి♦భీషణుండు
నిశ్చితార్థుండయి ♦ నీతి నాలోచించి, తద్ధితకాంక్ష[2] న♦త్యంత హితము
వఱల నన్నను మృదు♦వాక్కుల నిట్లను, క్షమియింప వయ్య రో♦షంబు విడుము
దయఁ జూడు నామాట ♦ తగవు విచారింపు, నయవిధిజ్ఞులు ధరా♦నాథు లెందు

తే. దూత వధియింప నొల్లరు ♦ దోష మగుటఁ, గపిని జంపుట లోకవి♦గర్హితంబు
రాజధర్మవిరుద్ధంబు ♦ రాక్షసేంద్ర! నిన్నుబోఁటికిఁ దగ దిది ♦ నిర్జరారి! ౧౧౨౮

తే. క్షత్రధర్మంబునందు వి♦శారదుఁడవు, మేలు మఱవనివాఁడవు ♦ మేటి వీవు
ధర్మవిదులందు లోకంబు♦తప్పు నొప్పు, దెలియుదువు పరమార్థసు♦ధీవరేణ్య!

కం.చదువరి యగునీబోఁటియు, మదిఁ గింకిరిఁ బూని కాని♦మార్గము చనఁగాఁ
గొదుకనిచో నన్నాళ్లులు, చదివినచదువులకు ఫలము ♦ శ్రమ మొకఁడె కదా.

కం.కావున నసురేశ్వర! పరి,భావితపరిపంథి! యుచిత♦భంగిని మది సం
భావించి దూతునిం దగ, వౌవిధి దండింపు మనిన ♦ వాతం డలుకన్. ౧౧౩౧

---

[1] కావలేరు = అంతటి మహిమగల ముప్వురేకమై కలసివచ్చినను శ్రీరాము జయింపలేరని బహువచనప్రయోగ సారస్యము. [2] తద్ధితకాంక్ష = రావణుమేలుగోరి.

కం.పాపాత్ముల వధియించుట, పాపం బగు నెట్లు శత్రు♦భంజన! కానన్
 బాపచరిత్రుని వానరు, వ్యాపాదితుఁ జేయువాఁడ ♦ నని వచియింపన్. ౧౧౮౨

ఆ. అధికదోషయుత మ♦నార్యసమ్మతము న,ధర్మమూల మైన ♦ దశశిరస్కు
 పలుకు లాలకించి ♦ ప్రాజ్ఞుఁ డైనవిభీష,ణుండు పరమతత్త్వధీచ♦ణుండు పలుకు.

పంచచామరము. క్షమింపు రాక్షసేంద్ర! ధర్మ♦సంయుతంబు నానుడిన్
 శమంబుతోడ నాలకింపు ♦ చంపరాదు దూతఁ గా
 ర్యముల్ ఘటించువేళ నంచు ♦ నన్నిజాతులందునున్
 సమస్తసీమలందు సూరి♦సంఘముల్ వచించెడిన్. ౧౧౮౩

సుగంధి. శాత్రవుండు వీఁడు, లేదు ♦ సందియంబు, శిక్షకున్
 బాత్రుఁడున్ మహాపకార♦వారమున్ ఘటించుటన్;
 జైత్రవర్య! దూతపట్ల ♦ సజ్జనాళి పల్కెడిన్
 గాత్రపీడనంబు నాది♦గాఁగఁ బెక్కుశిక్షలన్. ౧౧౮౪

కం.తల గొఱిగించుట యంగవి,కలుఁగాఁ గావించుటయును ♦ గశ నడుచుటయున్
 దెలియఁగ గుర్తులు వేయుట, పలుకుదు రివి దూతదండ♦పద్ధతు లనుచున్. ౧౧౮౫

ఉ. అంతియకాని దూత వధ ♦ కర్హుఁ డటం చన నాలకింప, నీ
 యంతటిధర్మవేత్త యుచి♦తానుచితార్థవినిశ్చితాత్ముఁడున్
 శాంతము మాని కార్యములు ♦ సల్పఁ గడంగిన నింక నేధరా
 కాంతులు సత్త్వవంతులు ప్ర♦గాఢతరాగ్రహ మాఁపువారలో? ౧౧౮౬

సుగంధి. ఆరయంగ ధర్మవాద♦మందుఁ గాని లౌకికా
 చారమందుఁ గాని సర్వ♦శాస్త్రబోధనంబునన్
 ధారణన్ భవత్సముండు ♦ దానవామరాళులన్
 వీరవర్య! లేఁడు సుమ్ము ♦ నీవె మేటి వన్నిటన్. ౧౧౮౭

కం.ఈకోఁతిఁ జంపితేనియు, నేకార్యము గలదు? వీని ♦ నెవ్వం డంపెన్
 వీకున నవ్వానిని శి,క్షాకలితుం జేయు టొప్పు ♦ ఖ్యాతి యెసంగన్. ౧౧౮౮

కం.ఖలుఁ డైన సుజనుఁ డైనం, గొలువునకై చిక్కి పరుల♦కుం దజ్జనముల్
 పలికినపలుకుల నొ్లం డెడఁ, బలికెడునద్దూతఁ జంప ♦ భావ్యం బగునే? ౧౧౯౦

సీ. ఇతని నీవు వధించి♦తేనియు జలనిధి, దాఁటి రాఁజాలిన♦దర్పఘనుఁడు
 వేఱొక్కరుఁడు లేఁడు ♦ వీఁ డిట మడిసిన, రాజపుత్రులకు నీ♦యోజఁ దెలిపి
 వారిని గొనివచ్చు♦వాఁడును గలుగండు, కాన యుద్ధముమాట ♦ కలుగఁ బోదు
 యుద్ధప్రియుండవు ♦ యుద్ధసముత్కంఠ,రతులు నీభటులు దు♦ర్జయులు సుమ్ము
తే. యింద్రుఁడాదిగ దేవతల్ ♦ లెత్తిరేని,పోర నుత్సాహ మూనుటే ♦ పురుషగుణము
 గాక నీయట్టివానికిఁ ♦ గడకుఁ ద్రోయఁ, దగునె దూతను జంపకు ♦ దనుజనాథ.[1]

---

[1] రాముఁడు దండెత్తివచ్చినపుడు సంధికుదుర్పవలయునని విభీషణు తలంపు. దూతను జంపిన సంధి యసాధ్యము.

కం. హితులు మహామతులు సహా, హితులు కులోద్భవులు శస్త్ర♦భృత్ప్రవరుల్
జితకాములు యోధులు సం,భృతులు భవత్సైన్యపతులు ♦ మేటిబలాఢ్యుల్.

కం. వలసినచోఁ గొందఱు తమ,బలములతో దాడివెట్టి ♦ పార్థివపుత్రుల్
నిలిచిన చోటికిఁ జని తమ,బలములు ప్రకటించు టదియ ♦ పౌరుష మధిపా!

### రావణుఁడు హనుమంతునితోఁకఁ గాల్ప నాజ్ఞ సేయుట.

చం. అన విని నీవు పల్కినది♦యంతయు సత్యము, దూతఁ జంపుటల్
ననయము గాదు, వీడుటయు ♦ సమ్మతి గా, దొకశిక్ష వీనికిన్
జనుఁ బొనరింపఁ, గ్రోఁతులకు ♦ సమ్మతభూషణ మాటఁ దోఁక దా
నిని దెగఁగాల్చి పుచ్చుటయె ♦ నిర్మలతేజ యథార్హదండ మా. ౧౧౯౪

తే. అంగవైరూప్యకర్శితుఁ ♦ డైనవీనిఁ, జూచి యాతనిచుట్టముల్ ♦ సుహృదు లెల్ల
నవ్వుదురు గాక వీని నీ♦నగరమునను, దోఁకఁ గాల్చుచుఁ ద్రిప్పుఁడీ ♦ తూర్ణముగను.

సీ. అనుచు దశగ్రీవుఁ ♦ డాజ్ఞ సేయఁగ విని, రాక్షసుల్ ప్రాఁతవ♦స్త్రములు దెచ్చి
చమురునఁ దడిపి వా♦లమునకుఁ జుట్టుచో, నెండుకట్టెల రేఁగి♦మండువహ్ని
విధమునఁ దనమేను ♦ వృద్ధిచేయఁ గడంగె, వారును జెలరేఁగి ♦ వాలమునకు
నిప్పు దగిల్చిరి ♦ నిష్ఠురామర్షప,రీతాత్ముఁ డైవాత♦సూతి చెలఁగి

తే. బాలభాస్కరుపగిదినై ♦ వాలమునను, జుట్టుకొని యుండుదనుజుల ♦ నట్టెకొట్టెఁ
దోఁక గాలుట గనుచు న♦స్తోకముదము, గనిరి బాలురు వృద్ధులు ♦ కాంత లెల్ల.

### రాక్షసులు తోఁకఁ గాల్చుచుండ హనుమ యాలోచించుట.

సీ. తనచుట్టు ముట్టి య♦ద్దానవుల్ బాధింపఁ, దనలోన ని ట్లని ♦ తలఁచె హనుమ
కర్తవ్య మెద్ది యి♦క్కాలంబునను నాకు, వీరు కట్టిరి గాక ♦ కోరినంత
నా కడ్డమే త్రెంచి ♦ వీకునఁ బాశముల్, గాల రాచనె వీరి ♦ నేలఁబెట్టి
భర్తృహితార్థమై ♦ పరఁగన యేనియు; రావణాసురునాజ్ఞ ♦ రాక్షసులును

ఆ. నన్నుఁ గట్టి కీడు ♦ నా కొనరించిన, వారు గార; యిది శు♦భంబె చూడ;
రాముప్రీతికొఱకు ♦ రాక్షసపురమెల్లఁ, దిరిగి చూతు వీరు ♦ త్రిప్ప నన్ను. ౧౧౯౭

తే. రాత్రివేళను దుర్గక♦ర్మంబు తెలియఁగు, సాధ్యపడ దయ్యె నెల్లను ♦ జక్కఁజూడ
నుదయమునఁ దప్పకంతయు ♦ నొప్పుఁజూడ, నవనిభర్తకు నయ్యది ♦ హర్ష మొసఁగు.

ఉ. కావున వీరు నన్నుఁ బెడ♦కట్లను గట్టినఁ గట్టనిమ్ము, మై
కావర మెత్తి కాల్చినను ♦ గాల్పఁగ నిమ్మటు లిట్టు లీడ్చిరా
పోవడి నీడ్వ నిమ్ము, హృద♦యవ్యథ యేమియు లేదు, దైత్యచే
ష్టావిపరీతవర్తనల ♦ సర్వముఁ దీర్చెద వడ్డితో వెసన్. ౧౧౯౯

ఉ. ఇప్పగిదిం దలంచు నెడ ♦ నెంతయుఁ గేరుచు రాక్షసాగ్రణుల్
తప్పక శంఖభేరుల న♦దంబులతోఁ బురి వాడవాడలన్
ద్రిప్పిరి త్రొప్పి రెంతయును ♦ దిట్టిరి కొట్టిరి కొంద ఱార్చుచున్
జప్పటు లొప్పఁ గొందఱును ♦ సంభ్రమ మారఁగ వెంట నంటఁగన్. ౧౨౦౦

చం. హనుమ యథాసుఖంబుగను ♦ నాశరపంక్తులు వెన్నడింపఁగాఁ
గనుఁగొనెఁ దత్పురంబునను ♦ గ్రంతయుఁ గ్రంతయు సందు సందు నొ
య్యనఁ జని వాడ వాడయును ♦ నాయతవీథులు గూఢదేశముల్
ఘనగృహకాంతరంబులు న♦గారములున్ విలసద్విమానముల్. ౧౨౦౧

మ. ఇతఁడే చారుఁడు చూడుఁ డోయసురు లం ♦ చెల్గెత్తి రక్షోభటుల్
వితతారావము నింప గుంపు లగుచున్ ♦ వృద్ధుల్ శిశుల్ స్త్రీలు దీ
పితలాంగూలు సమీరనందనుని సం♦ప్రీతిం గనన్ వచ్చి, రా
వితముం గొందఱు రాక్షసాంగనలు పృ♦థ్వీపుత్రితో జానకీ! ౧౨౦౨

కం. ఎఱ్ఱనిముఖంబుతో గుఱు,గు ఱ్ఱని నీఁకోడఁ బల్కు ♦ క్రోఁతిని నసురుల్
బిఱ్ఱుగఁ గట్టియుఁ దోఁకను, జుఱ్ఱనఁ గాల్చుచును బురముఁ ♦ జుట్టెద రనిరన్. ౧౨౦౩

## సీతాదేవి యగ్నిహోత్రునిఁ బ్రార్థించుట.

తే. మంగళార్తిక సతి యార్త♦మరణతుల్య
మైనవాక్కులు విని విక♦చాంబుజాక్షి
శోకసంతప్త యయి కపి♦శుభముఁ గోరి
హుతవహునిఁ గూర్చి యి ట్లని ♦ నుతి యొనర్చె. ౧౨౦౪

తే. భర్తృశుశ్రూష యొనరించు♦పడఁతి నేని, దపములను నిష్ఠ సలిపిన♦తరుణి నేని
నేఁబతివ్రత నగుటయు ♦ నిక్కమేని, హనుమయెడ శైత్య మూనుమీ♦యగ్నిదేవ!

కం. ఇనకులతిలకుం డగు రా,మున కు న్నామీఁదఁ గరుణ ♦ మొనయున యేనిన్
గన భాగ్యశేష నేనియు, హనుమయెడన్ శీతలుండ ♦ వగుము హుతాశా! ౧౨౦౬

కం. ఘనమతి రామునికూటమి, ననవరతముఁ గోరుదాన ♦ ననుచున్ శుభశీ
ల న టంచు నతఁడు నమ్మిన, హనుమయెడన్ శీతలుండ ♦ వగుము హుతాశా!

తే. సత్యసంగరుఁ డైనభా♦స్కరసుతుండు
సరగ సుగ్రీవుఁ డిట వచ్చి ♦ సతము నన్ను
ముంచుశోకాబ్ధినుండి దాఁ♦టించు నేని
హనుమయెడ శైత్య మూనుమీ ♦ యగ్నిదేవ! ౧౨౦౮

## అగ్ని చల్లనైనందునకు హనుమంతుఁ డాశ్చర్య పడుట.

సీ. అని వేఁడుసీతకు ♦ హనుమంతుసేమంబు, వచియించువిధమున ♦ వహ్ని సప్ర
దక్షిణశిఖుఁ డయి ♦ తనరెను; దేవిపై, వాలాగ్నియుతుఁ డయ్యు ♦ వాయు వపుడ

ప్రాలేయమారుత♦ప్రాయుఁడై వీచెను, హనుమయుఁ దనలోన ♦ నబ్రపడుచు
ధగ ధగ మండియుఁ ♦ దాపంబుఁ గూర్పఁడు, శీతలుం డై వహ్ని ♦ హేతు వేమొ
ఆ. తెలిసెఁ దెలిసె రామ♦దేవునిమహిమను, మల నొకండు వార్ధి♦మధ్యమునను
గనుచు నక్కజంబు ♦ గొనితి నియ్యదియును, నతనిమహిమ సంది♦యంబు లేదు.
కం. జడధియు మైనాకుండును, గడుకొని శ్రీరాముపట్లఁ ♦ గాన్పించినకై
వడి నేల యగ్నియును బోఁ, ద్పడి శుభముం గూర్పకుండు♦వాఁడు దలంపన్. ౧౨౦౦
కం. సీతాసతిదయచేతను, సీతాహృదయేశుమహిమ ♦ స్వీయసఖుతనూ
జాతుఁడ నగుటను నాయెడఁ, బ్రీతిం గొని పావకుండు ♦ వేఁడిమి మానెన్. ౧౨౦౧
చం. అని తలపోసి కొంతవడి ♦ యార్భటులన్ దెస లెల్ల నించి చి
వ్వున గిరిశృంగతుల్యమయి ♦ పూర్వసుపర్వనికాయహీన మై
తనరుపురంబు వాకిటికి ♦ దాఁటి గిరీంద్రనికాశ దేహుఁ డా
హనుమఁడు హ్రస్వుఁ డైనను ద♦మంతట బంధములెల్ల నూడినన్. ౧౨౦౨
కం. శ్రీమంతుఁ డాత్మ వంతుం, డామారుతసంభవుం డ♦హార్యసమం బౌ
భీమాకృతి మరలం గొని, యామెయి నామెయిని బొఱ♦వీక్షించి రుషన్. ౧౨౦౩
తే. తోరణాశ్రిత మైనట్టి♦దొడ్డ గుదియ, సరగఁ గైకొని కావలి♦సురవిరోధి
వారములఁ గూల్చి ప్రజ్వల♦ద్వాలుఁడగుచు, నంశుమాలినిబోలి యు♦ట్లాత్మఁ దలఁచు.

## హనుమంతుఁడు లంకఁ గాల్చుట.

కం. కర్తవ్యం బెది యిం కిట? మార్తురకును దుఃఖపీడ ♦ మఱి మఱి కలుగన్
వర్తింపవలయు సీతా, భర్తకుఁ గార్యంబు సుకర♦పడు నట్లైనన్. ౧౨౦౪
కం. చెండితి నశోకవనమున్, ఖండించితిఁ బ్రబలదైత్య♦కాండము సేనా
దండ మొకకొంత ద్రుంచితి, గండున దుర్గాళిఁ జెఱుచు♦కార్యమ మిగిలెన్.
ఉ. ఇంచుక యత్న మూని పుర ♦ మెల్లను నాశముఁ జేయ మత్క్రియా
సంచయ మెంతయున్ ముగియు ♦ సార్థక మయ్యెడు మచ్ఛ్రమంబు; వా
లాంచలహవ్యవాహునకు ♦ నాహుతి చేయుట న్యాయ్య మీగృహా
దంచితవుత్తనం బనుచుఁ ♦ దద్భవనాళిపయిం జరించుచున్. ౧౨౦౬
కం. శంపాయుతతోయద మనఁ, గంపింపక హనుమ లంకఁ ♦ గలయిల్లిల్లున్
దెంపునఁ జొచ్చుచు దాహన, లంపటుఁ డై తిరిగెఁ దోఁట♦లన్ సౌధములన్.
సీ. మంత్రిప్రహస్తుని ♦ మందిరంబున మహా, పార్శ్వునిగృహమున ♦ వజ్రనాభు
సదనంబునను శుక♦సారణాలయముల, నింద్రజిత్తు వసించు♦నింటియందు
జంబుమాలి సుమాలి♦సౌధసీమంబుల, రశ్మికేతునివాటి ♦ రవివిరోధి
హ్రస్వకర్ణులభవ♦నాంగణంబులయందు, దంష్ట్రరోమశమత్త♦తలములందు

తే. వలను మెఱసి యుద్ధోన్మత్తు♦నిలయమందు, నల ధ్వజగ్రీవదైత్య గే♦హంబునందు
ఘోరహస్తిముఖాఖ్యుల♦కూటములను,నోజ మెఱయ విద్యుజ్జిహ్వుఁ ♦ డున్నవీట.

తే. సారిదిగఁ గరాళుని పిశాచు ♦ శోణితాక్షు, కుంభకర్ణుని మకరాక్షు ♦ కుంభు బ్రహ్మ
శత్రుని నికుంభు మఱి యజ్ఞ♦శత్రు వాస,తలములం దెల్ల నగ్నిని ♦ గొలిపెఁ గపిసి.

చం.విడిచి విభీషణాలయము ♦ వేమఱుఁ గ్రుమ్మరి యొక్కఁడేనియుఁ
విడివడకుండఁ దక్కఁగల♦వీడుల నన్నిటిఁ గాల్చి యంతటఁ
గడచి మహార్హరత్నకన♦కప్రకటోజ్జ్వలభూషణావళిఁ
గడు బెడఁ గైనరావణున♦గారమునఁ దహనంబుఁ గొల్పుచున్.		౧౨౧

కం.కల్పాంతజలదగర్జా,కల్పం బగునాద మడరఁ ♦ గపి రేఁగి నిజా
నల్పజవమారఁ జిచ్చును, గొల్పెను బెనుగాలి విసర ♦ ఘోరపుభంగిన్.	౧౨౨

కం.చిటులుచుఁ బఠీలు మనుచుం, బెటులుచుఁ బటపట మటంచు ♦ వివిధమణితతిఁ
స్ఫటికంబుల గొనబారెడి,కిటికీలును మేడ లిండ్లు ♦ క్షితిపైఁ గూలెన్.	౧౨౩

కం.కాలి విమానంబులు ధరఁ, గూలుట చూపట్టె సుకృత♦కోటులు దీఱఁ
గూలెడిసిద్ధభవనముల,పోలిక నెల్లెడల దనుజ♦పురవరమందున్.		౧౨౪

ఉ. మండెడునిండ్లకై కడుపు ♦ మండఁగఁ బర్విడి వచ్చి వేఁడిమిఁ
దండను జేర లేక మసి ♦ నాశన మయ్యెడువిత్తముల్ గనఁ
గుండెలు బ్రద్ద లైనను ది♦గుల్ గొని యేడ్చెడివారు హా! యటం
చుండెడివారు మొత్తుకొను ♦ చుండెడివారు భ్రమించువారుగన్.	౧౨౫

చం.తమతమయిండ్లు కాచికొన ♦ దవ్వుల నుండియుఁ బాఱువారుఁ, బెం
డ్లములును బిడ్డలుఁ మఱియ ♦ లబ్బెన లాడెడివారు, వారికై
తమకముమీఱ లోనఁ జని ♦ తామును గాలెడివారు, ధూమసం
తమసమునందుఁ జిక్కి వగ ♦దార్కొనువారును, నేడ్చువారలున్.	౧౨౬

కం.కటకట! కపిరూపున ము,న్నటివైరముఁ దీర్చికొనఁ గ♦ణంగెను దహనుం
డిటు లనియెడివారల యు, ప్పటినులివు దిగంతరాళ♦భాగము నిండెన్.	౧౨౭

చం.పరువడిఁ జుట్టుముట్టుకొనఁ ♦ బావకకీలలు కొంద ఱంగనల్
విరిసినకేశపాశములు ♦ వ్రేలుచు నుండ మహాస్వనంబుతో
నురమునఁ జంటిపాపలను ♦ నొత్తుచు మేడలనుండి కూలి రం
బరమున నుండి మబ్బులను ♦ బాసి దొరంగు మెఱుంగు లోయనన్.	౧౨౮

తే. వజ్రవిద్రుమవైడూర్య♦వర్గములును
వెండి పైడియు ముత్తెముల్ ♦ వింత లైన

ధాతుభవనాళి కరఁగి యెం♦తయును బాఱు
చుండఁగా నంజనానంద♦నుండు గనియె. ౧౨౯

కం. తృప్తిఁ గనఁ డనుము గాల్పం, దృప్తిం గొనఁ డగ్ని కాష్ఠ♦తృణసంఘములన్
దృప్తిఁ గన దిలయు శవసం,ప్రాప్తిన్ గాలియును వీవ ♦ బడలక యుండెన్. ౧౩౦

తే. కింశుకంబులడా లొక్క♦క్రేవ శాల్మ
లీప్రసూనచయంబుల♦లీల వేఱు
చోటఁ గుంకుమలోహిత♦శోభ యొండు
గడను జెలువార జ్వాలలు ♦ కాంతి మెఱసె. ౧౩౧

కం. పురముల దహియించిన యా,పురహరుచందమున వాయు♦పుత్త్రుఁడు లంకా
పుర మెల్లఁ గాల్చె మంటలు, పొరిఁ బొరిగఁ ద్రికూటశైల♦మున వ్యాపింపన్.

సీ. అభ్రంలిహోదభ్ర♦విభ్రమోదగ్రుఁ డై, రక్షశ్శరీరాజ్య♦రాజిఁ జేసి
నాలుకల్ గ్రోయుచు♦నలువంకఁ గ్రమ్ముచుఁ, బవనుండు దనకుఁ దో♦డ్పడుచు నుండ
రేఁగి బ్రహ్మాండంబు ♦ లోఁగొనుపోలికఁ, గోటిదినేశుల♦సాటిమీఱఁ
బిడుగులు రాలెడి♦వడువున ధ్వనియించి, సర్వంబుఁ దానయై ♦ పర్వ నగ్ని

ఆ. మింటి నంట నెగయు♦మంటలు మోదుగు,పూలగుత్తు లనఁగఁ ♦ జాలి యుండె
నగ్ని యాఱ నెగయు♦నసితంపుఁబొగలచే, మొగులు నల్లకల్వ♦జిగిని దాల్చె.

రాక్షసవిలాపము.

ఉ. ఈకపి యామహేంద్రుఁడు సు♦రేశ్వరుఁ డాపవిహస్తుఁడో యముం
డో కుముదాప్తుఁడో దహనుఁ♦డో ధనదుండొ జలాధినాయకుం
డో కమలాప్తుఁడో పవనుఁ♦డో యలరుద్రుఁడొ కాక యీతనిన్
బ్రాకృతవానరుం డనఁగ ♦ వచ్చునె? కాదు లయాంతకుం డొకో. ౧౩౪

ఆ. సర్వలోకకర్త ♦ సర్వపితామహుం, డై చతుర్ముఖుండు ♦ నైనబ్రహ్మ
ప్రబలకోప మిట్లు ♦ రాక్షసనాశార్థ,మరుగుదెంచెనో వ♦నాటుఁ డగుచు. ౧౩౫

కం. అనుచు విశిష్టులు రాక్షసు,లనలశిఖాదగ్ధభూరు♦హాలయవనప
క్షినికరముఖజీవ్యన్విత,మును దమనగరంబుఁ గాంచి ♦ పొక్కుచుఁ బలుకన్.

తే. అకట! యన్యక్త మేక మ♦నంత మగు న, చింత్యవిష్ణుని తేజంబు ♦ స్వీయమాయ
వానరాకృతిఁ గైకొని ♦ వచ్చె నేమొ, యఖిలరాక్షస కులవినా♦శార్థ మిపుడు.

కం. హనుమత్ప్రేరితహుతభు,గ్ఘనకీలాదగ్ధసాశ్వ♦గజరథజనప
క్షినిచయమృగవృక్షం బై, దనుజస్థానీయ మపుడు ♦ తద్దయు నేడ్చెన్. ౧౩౮

కం. అయ్యో తండ్రీ! కొడుకా!, యయ్యో ప్రాణేశ! మిత్త్ర♦మా! పోయితిరే
యియ్యెడ సుఖజీవన మ,య్యయ్యో పోయె నని యంగ♦లార్చిరి యసురుల్.

చం. కెరలి ఛటచ్ఛటాకలిత♦కీలలమాలలఁ గాలి కూలుచున్
　బరువిడుయోధవర్గములు ♦ ప్రాణమువాసినవీరవర్యులై
　పరఁగఁగ రోదనధ్వనులు ♦ పావనికోపబలాభిభూతమై
　స్థిరఁ గనుపట్టెఁ దత్పురము ♦ తిట్టిన రూపఱుమాన్కి దీనమై　౧౨౪౦
తే. సంభ్రమత్రస్త సవిషణ్ణ♦సౌరవైరి,పాళిచే నుజ్జ్వలజ్వాల♦పావకార్చి
　రంకములచేతఁ జూపట్టె ♦ లంక కల్ప,విశ్వసృట్కోపనిహత మా♦విశ్వ మనఁగ.
ఆ. వనముఁ బాడుచేసి ♦ మనుజాదులను జంపి, సౌధభవనములను ♦ జదునుచేసి
　మండుతోఁకతోడ ♦ మార్తండునట్లు త్రి,కూటశిఖరిఁ జేరి ♦ క్రోఁలితేఁడు.
తే. జానకీశ్వరుఁ గనుఁగొనఁ ♦ జనఁగఁ దలఁచె, నతనియద్భుతకర్మంబు ♦ నవధరించి
　దేవగంధర్వమునినాగ♦దివ్యు లెల్ల, నిస్తులం బైనముదమున ♦ నివ్వటిలిరి.　౧౨౪౩
కం. గంధవహాసుతునిచే దశ,కంధరుపుర మెల్ల భస్మ♦కాండము గాఁగన్
　గంధర్వులు సిద్ధులు, బంధురవిస్మయముతోడఁ ♦ బరికింపంగన్.　౧౨౪౪
కం. జ్వాలామాలావృతలాం,గూలు మరుత్తనయుఁ జూచి ♦ కూరినభీతిన్
　గాలానలుఁ డోయనుచును, జాలఁగఁ గంపించె భూత♦సంచయ మెల్లన్.　౧౨౪౫
తామరసము. మునిసురపన్నగ♦ముఖ్యులు యతులు్ గనుఁగొని మారుతి♦కార్యమునార్తన్
　ఘన మగుప్రీతిని ♦ గాంచిరి మేల్ మేలనుచును మెచ్చిరి ♦ యంజనపుత్రున్.

### హనుమంతుఁడు సీతాదేవి దగ్ధ యయ్యె నని పరితాపపడుట.

కం. అంతట హనుమంతుఁడు వా,లాంతాగ్నిని వార్ధినీట ♦ నాఱిచి నగరం
　బంతయును జూచి దుస్సహ,చింతారతి స్రుక్కి నేమి ♦ చేసితి నయ్యో.　౧౨౪౭
కం. ఎంతేయకార్యంబును నేఁ, జింతింపక లంకఁ గాల్చి ♦ చేసితి ననుచున్
　స్వాంతమున దిగులుపడి యే,కాంతంబును దన్నుఁ దానె ♦ గర్హించుకొనెన్.
కం. దీపించునగ్ని జలముల, రూపు చెఱుచునట్లు పెరుఁగు♦రోషమును సుధీ
　వ్యాపారముచే నణఁచెడు,నాపురుషుఁడె పో మహాత్ముఁ ♦ డవుధన్యుండున్.౧౨౪౯
కం. కోపి తునుము గురువులనేన్, గోపి కడుంగఱకు లాడు ♦ గుణవంతులనేన్
　గోపి యొనర్పఁగఁ జాలని,పాపం బే దైనఁ గలదె ♦ భావింపంగన్.　౧౨౫౦
కం. ఆరయ వాచ్యావాచ్యవి,చారం బే లేదు కోపి♦జనులకుఁ జేయం
　గారానికార్య మాడం, గారానియవాచ్య మొండుఁ ♦ గలదే చూడన్.　౧౨౫౧
కం. వాతాశనంబు జీర్ణం, బౌతనకుబుసంబు విడుచు♦నట్టులు క్షమచే
　జాతక్రోధముఁ బాచెడి,యాతఁడె పో పురుషుఁ డనఁగ ♦ నర్హుఁడు జగతిన్.
కం. ఎంతటిలజ్జాహీనుఁడ, నెంత సుదుర్బుద్ధిఁ బాప♦కృత్తముఁడ నిసీ
　చింతింపక శ్రీరాఘవు, కాంతను దహియించి స్వామి♦ఘాతుకుఁ డైతిన్.　౧౨౫౩

ఉ. నిక్కము లంక యంతయును ♦ నీ ఱయిపోవుట, సీత యగ్నులం
జిక్కి నశించి యుండు, నెది ♦ సేయఁగఁ బూనితి దానిఁ దెల్వి లే
కక్కట నేనె కీడ్పఱుచు ♦ టయ్యెను, జానకిఁ గావఁ జూడమిం
ద్రిక్కనకింక చేతఁ బతి♦కార్యము నంతయుఁ బాడుచేసితిన్. ౧౨౫౪

కం. గొంచెపుఁబని యీపురిని ద,హించుట యది యెల్లఁ దీరె ♦ నేలా? నేఁ గా
వించితిఁ బని నాశము నెదఁ, గాంచక ; మతి యున్న యాత్ర♦గానికి నెందున్?

ఉ. ఎంతటిలోన నాశ్రమము♦లెల్ల వృథా చనె, రోషదూషిత
స్వాంతత స్వామికార్యమును ♦ వట్టునఁ గల్పితి మూలముట్టుగాఁ
గొంతయుఁ దక్క కంతయును ♦ గూలె సురారిపురంబు, మైథిలీ
కాంతయు నిందుఁ జిక్కి హత♦గా కెటుజీవము నిల్వ నోపెడిన్. ౧౨౫౬

కం. నాయజ్ఞానముచేతను, నాయూనినపనియె నాశ ♦ నం బైన నిటన్
జేయుదుఁ బ్రాణత్యాగం, బీయెడ నయ్యదియ యుచిత ♦ మెటు యోజింపన్.

కం. చిచ్చుఱుకుదునో? కడలిని, మచ్ఛములకు సత్త్వములకు ♦ మై యెరగాఁగన్
జొచ్చుదునో? బడబాగ్నికి, నిచ్చుదునో దేహ? మిప్పు ♦ డెటు మరణింతున్?

ఉ. వారలకార్యముం జెఱిచి ♦ ప్రాణము మేన ధరించి యే మటం
చారఘురామలక్ష్మణుల ♦ నాకపినాథుని మోముఁ జూచెదన్?
భూరితరాగ్రహంబుమెయి ♦ భూప్రథితం బగుక్రోఁతిబుద్ధి నే
నీరహిఁ జూపితిం, బ్రకృతి♦వృత్తము నాఁపఁగ నేరనైతిఁగా. ౧౨౫౭

ఆ. అనెడువారు లేమి ♦ నతిచంచలము రజో,భావ మైనబుద్ధి ♦ పాడు గాను
శక్తి గలిగియుండి ♦ జానకిఁ గావంగఁ, దలఁప నైతిఁ గనుక ♦ బలిమిఁ జేసి. ౧౨౬౦

సీ. భూమిజ మరణింప ♦ రామలక్ష్మణులును, బ్రతుక రవ్వారల♦పాటుఁ జూచి
సమయు సుగ్రీవుండు ♦ సహబంధుఁ డై యది, విని భరతుండును ♦ విలయ మొందు
శత్రుఘ్నుతో నిట్లు ♦ మిత్రకులం బెల్లఁ, దీఱినఁ బ్రజలును ♦ దీర్ఘశోక
సంతప్తు లయ్యెద ♦ రింతకు ధర్మార్థ,హీనుఁడ భాగ్యర♦హితుఁడ రోష

తే. దోషకలితాంతరంగుఁడ ♦ దుర్మదుండ
నైన నే మూల మై లోక♦మంత నాశ
మొందఁ గన్గొందుఁ, గల దొకో ♦ సందియంబు
దీన? ననుచును జింతించె ♦ దీనుఁ డగుచు. ౧౨౬౧

### హనుమంతుఁడు సీతాదేవిని నగ్ని దహింపఁజాలఁ డని నిశ్చయించుట.

కం. ఈవిధమునఁ జింతించెడి,పావనికిం బూర్వదృష్ట♦భద్రశకునముల్
వావిరి మెయిఁ దోఁపఁగఁ జే, తోవీథిం జింత సేయఁ ♦ దొడఁగెన్ మరలన్.

చం.అది యెటు సంభవించుఁ? గల♦దా దహియింపఁగ నగ్ని నగ్ని? భూ
విదితమహత్త్వ శీలవతి ♦ స్వీయమహామహిమంబుచేత న
భ్యుదయము నొంద కున్నె? వర♦పుణ్యచరిత్ర మహాత్ముదేవినిన్
సదమలశీలగుప్తమహి♦జన్ దహనుం డెటుదాఁకఁ జాలెడిన్? ౧౨౬౩

ఉ. రాముమహత్త్వతన్ జనక♦రాజసుతానుకృతంబుకల్మిన
న్నామెయిఁ గాల్పనేరనిహు♦తాశనుఁ డెట్టులు కైకపట్టి లో
నౌ ముగు రన్నదమ్ములకు ♦ నర్చితదేవత యై రఘూత్తము
ప్రేమకు నాకరం బయిన♦ప్రేయసినిన్ దహియింపఁ జాలెడిన్? ౧౨౬౪

ఆ. అవ్యయుండుఁ బ్రభువు ♦ నఖిలంబు నెం దేని, గాల్చి వైచు వేల్పు ♦ గాడ్పుసఖుఁడు
పూనఁ డయ్యెనాడు♦పుచ్ఛంబు దహియింప, నమ్మహానుభావ♦నంటు నెట్లు?

తే. ఔర! లంకకు వచ్చుచో ♦ నీరనిధిని, నడుమఁ గన్గొంటిఁ గాదె మై♦నాక మనెడి
శైలమొక్కటి నన్ను నా♦శ్వాసపఱుప, ననుచు వెండియుదానిని ♦ నాత్మఁ దలఁచి.

ఉ. సూనృతవాక్యసంపదను ♦ శుద్ధతపంబునఁ బ్రాణనాయక
ధ్యానరతైకచిత్తమున ♦ నాయమ కోరిన హవ్యవాహునే
పూని దహించుఁ గాక, పువుఁ♦బోణిని నగ్నిదహింపఁ జాలునే?
లేనికుశంక లేల యని ♦ లేమమహత్త్వము నెంచుచుండఁగన్. ౧౨౬౫

కం.ఔరా! వాయుతనూజ,ప్రేరిత మగునగ్ని లంక ♦ నెల్ల దహించెన్
దోరణవప్రాట్టప్రా,కారసమేతం బసాధ్య♦కార్యం బిదియున్. ౧౨౬౭

కం.స్థానములు విడిచి పరువిడ, దానవమాణవక[1]వృద్ధ♦తరుణీజనతా
నానారోదనముల లం,కానగరము గుహల నేడ్చ♦కైవడిఁ దోఁచెన్. ౧౨౬౯

కం.ఏమీ చిత్రము భవన,గ్రామంబు[2]లతోడ లంక ♦ గాలియు సకలం
బామహికన్యక మాత్రము, సేమంబున నున్న దగ్ని ♦ సేరదు సీతన్. ౧౨౭౦

కం.అని ఋషులు చారణాదులు, వినువీదిని బల్కుచుండ ♦ వీనుల నమృతం
బును గురిసినయట్లానుడు,లను విని యాహనుమ పొంగి♦లాఁతుగఁ దనలోన్.

చం.కలిగిననన్నిమిత్తములఁ ♦ గన్నులఁ జూచినభూరికారణం
బుల, ఋషి వాక్యజాలముల ♦ భూమిజ సేమ మెఱింగి, యాత్మలో
నలరుచుఁ, గన్నులారఁగ మ♦హాసతిఁ జూచి, సుఖం బెఱింగి, యా
వలఁ బయనింపఁగాఁ దలఁచె ♦ వాయుసుతుండు కృతార్థుఁ డంతటన్. ౧౨౭౧

## హనుమంతుఁడు మరల సీతాదేవిని సందర్శించుట.

ఉ. ఆలలితాంగి యున్నయెడ ♦ కావవనాత్మజుఁ డేగి శింశుపా
మూలగతావనీజఁ గని ♦ మ్రొక్కిడి తల్లి! మదీయభూరిపు

---

[1] మాణవకులు = పిల్లవాండ్రు. [2] భవనగ్రామంబు = ఇండ్లసమూహము.

ణ్యాళివశంబునం గుశలి ♦ తాస్థిరహించెడినిన్నుఁ గంటి, నా
యేలినవానికార్యతతు ♦ లెల్లను దీరె యథోచితంబుగన్. ౧౨౩

కం. అనుచుఁ బ్రయాణోన్ముఖుఁడౌ, హనుమనుమతిమతియుఁ గాంచి ♦ యవనిజ యనియెన్
బెనిమిటిపైఁ గలప్రీతిన్, మునుకొని సూచించువాక్య ♦ ముల నిట్లనుచున్. ౧౨౪

కం. నీ వొకఁడవె యీకార్యము, పావని! సాధింప శక్తి ♦ పరుఁడవు సుమ్మా
వావిరిబలోదయముచే, నీవే కనియెదవు కీర్తి ♦ నిర్గళితారీ. ౧౨౫

కం. ప్రాకటశితనారాచా, నీకంబునఁ జలిపి లంక ♦ నీఱుగఁ గడిమిన్
గైకొని నన్నేగినచోఁ, గాకుత్థ్సున కదియె తగిన ♦ కార్యము సుమ్మీ. ౧౨౬

తే. పరమశూరుండు రాముండు ♦ బవరమందు, నతనిమగఁటిమి కనురూప ♦ మైనదాని
యోజన యొనర్చి చెప్పుమీ ♦ యోజ మీఱ, వనచరకులావతంస నీ ♦ వనుచుఁ బలుక

కం. వినయము హేతుయుతంబును, నన ఘార్థోపహిత మైన ♦ యా దేవినుడుల్
విని యంజనవరతనయుం, డనియెన్ సముచితపుభంగి ♦ నవనీసుతకున్. ౧౨౮

చం. అడలకు మమ్మ వానర బ ♦ లాన్వితుఁ డైవెస రామభద్రుఁ డీ
కడలిఁ దరించి రాక్షసుల ♦ గర్వ మడంచి త్వదీయశోకమున్
గెడపును, నమ్ము నాపలుకుఁ ♦ గీడ్పడఁ బోకుము, రాముఁ జూడ న
య్యెడ కిదె యేగువాఁడ, సెల ♦ వీయఁగదే జననయిత్రి మ్రొక్కెదన్. ౧౨౯

## సీతాదేవిచే సెలవుగొని మరలి హనుమంతుఁ డరిష్టాద్రి నెక్కుట.

మ. అని సాష్టాంగనమస్కృతుల్ సలిపి కీ ♦ శాధీశుఁడున్ స్వామిద
ర్శనకౌతూహలి యై లతాబహుళభూ ♦ జవ్రాత మై కేసరి
స్వనగంభీరగుహాసమూహ మయి య ♦ క్షవ్యూహగంధర్వస
న్మునిసర్పాదినిషేవితం బగుచు స్వా ♦ దుస్ఫీతమూలాఢ్య మై ౧౩౦

సీ. తుంగపద్మకజుష్ట ♦ రంగనీలోద్యాన, మాలికాహృద్య మై ♦ క్రాలుదాని
శృంగాంతరవిలంబి ♦ రంగత్పయోదోత్తరీయ మైకనువిందు ♦ సేయుదాని
మార్తండకరబోధ్య ♦ మానోన్మిషద్ధాతు, నేత్రసంజాత మై ♦ నెగడుదాని
నిర్ఘరచయమంద్ర ♦ నిస్స్వనాధ్యయనఘో, షాకలితం బయి ♦ యమరుదానిఁ

తే. బ్రస్రవణరావవిస్పష్ట ♦ రమ్యగీత, మైనదానిని దేవదా ♦ ర్వవనిజముల
నూర్ధ్వబాహువు నట్టుల ♦ యొప్పుదాని, నిలను బడునీళ్లనులివుల ♦ నేడ్చుదాని

సీ. శ్యామ మై పుష్పించి ♦ శరదభ్రతతులచే, వార్ధకమునఁ బోలె ♦ వణఁకుచుండ
వెదురుబొంగుల గాలి ♦ వెడ వెడఁ జొచ్చుచు, వెడలఁ గూజిత మన ♦ వెలయుచుండ
సర్పముల్ బుసగొట్టు ♦ సాకున హనుమపై, మల నిశ్వసించిన ♦ మాడ్కి నుండ
నిండారఁగా మంచు ♦ నిండి గంభీర మై గుహాలు ధ్యానించెడి ♦ వహి భజింప

తే. వారిధరపాదనిభపాద ♦ వారములను, నడఁచి చనుచున్న యట్టి నా ♦ ణ్యము వహింప
సాలతాలాశ్వకర్ణవం ♦ శప్రకీర్ణ, మగు నరిష్టనగంబు నా ♦ హనుమ యెక్కె. ౧౩౧

సీ. చక్కఁగాఁ బూచిన ♦ పెక్కు తెఱంగుల,లతికలచే నలం♦కృతము నగుచు
వింతవింతగ బహు♦విధము లౌమృగముల,వారంబుచే నభి♦వ్యాప్త మగుచుఁ
బలుచాయ లగుధాతు♦వుల వన్నె లొప్పారు, శీతలవారిభూ♦షితము నగుచు
బండల గుండులఁ ♦ బ్రస్రవణంబుల, దుర్గమం బగుచును ♦ దోఁచుదాని
తే. యక్షగంధర్వఋషికిన్న♦రాహి సేవి,తంబు నగుదాని బెబ్బులుల్ ♦ దనరుదాని
సింగములకందరములఁ జె♦లంగుదాని,రాముఁ గనుఁగొనుత్వర నెక్కె♦భీమబలుఁడు.

కం.నిజపాదఘట్టనంబుల, రజమై శిల లఱుగ నెక్కి ♦ రాజీవాళీ
భుజగభయదాబ్ధిఁ గని వా,తజుఁ డనిలునిభంగి దాని ♦ దాఁటఁ గడంగెన్. ౧౨౮౪

ఉ. ఉత్తరపార మేగుతమి ♦ నొత్తఁ బదంబుల శైలరాజముల్
దత్తఱ మందె సత్త్వములు ♦ ధారిణి డొల్లె వరప్రసూనసం
పత్తులతో ద్రుమోత్కరము ♦ పర్వతగందరసంస్థసింహముల్
బిత్తరపాటుతో దెసలు ♦ పెల్లగిలన్ ధ్వను లిచ్చె హెచ్చుగన్. ౧౨౮౫

కం.కుసుమితతరుచయములు సర,భసముగఁ జనునతనితోడల♦పటువేగమునన్
బసచెడి వజ్రముతాఁకున, వసుమతిఁ గూలినవిధానఁ ♦ బడె భగ్నములై.

కం.గాడుపుపట్టిజవోద్ధతిఁ, బీడితమై గిరిమృగేంద్ర♦బృందంబు గుహా
క్రోడంబులలోఁ దబ్బి,బ్బాడెను గగనంబు పగులు♦నారవ మెసఁగన్. ౧౨౮౭

కం.తూలఁగఁ జీరలు పైఁటలు, ప్రేలఁగ మెయిభూషణములు ♦ పీడ్పడఁ గలఁకన్
శైలంబున విద్యాధర,బాలామణు లెగసి చనిరి ♦ పటుజవయుక్తిన్. ౧౨౮౮

సీ. అధికప్రమాణమ♦హావిషదీప్తజి,హ్వలు దొర్లెఁ బాములు ♦ తలలు నులియఁ
గిన్నరోరగయక్ష♦కింపురుషాదులు, గగనస్థు లైరి త♦న్నగము విడిచి
పనగకూటోదగ్ర♦శైలంబు దిగఁబడి, యారసాతల మేగె ♦ నద్భుతముగఁ
బదియోజనంబుల♦పఱపును ముప్పది,యోజనంబులయెత్తు ♦ నొప్పు చున్న
తే. యాధరాధర మొకత్రుటి♦యంతలోన, నేల మట్టంబుగాఁ బోయె ♦ నీరనిధిఁ ద
రింప నుద్యుక్తుఁ డగుచు హ♦రిప్రవీరుఁ, డిట్లు మింటికిఁ గుప్పించి♦యెగయుటయును.

### హనుమంతుఁడు మరల సముద్రము లంఘించుట.

సీ. అర్కకారండవం ♦ బబ్జకువలయంబుఁ, డిష్యశ్రవణహంస♦దీపితంబు
జలధరశైవాల♦శాద్వలంబును బున,ర్వసుమహామీనవి♦రాజితంబు
నంగారకమహాగ్ర♦హంబు నైరావత,ద్వీపంబు స్వాతిహం♦సాపచితము
వాతసంఘాతసం♦జాతోర్మిచంద్రాంశు,శిశిరాంబుమంతంబు ♦ సిద్ధయక్ష
తే. భుజగగంధర్వఫుల్లనీ♦రజము నైన, యంతరిక్షార్ణవమున మ♦హాంబురాశి
నావ దరియించుచందాన[1] ♦ నవ్యలీల,నంజనానందనుం డేగె ♦ నశ్రమముగ.

---

[1]రామాయణమునాఁటికే యార్యులు నావికాయాత్ర చేయుచుండిరి.

తే. ఆకసంబును మ్రింగునో • యబ్జవైరిఁ, బట్టి గీఱునో సహతార•భాస్కరంబు
గగనము హరించునో యనఁ•గపివరుండు, చనియె మబ్బులఁ జీల్చెడి•చందముగను.

తే. తెలుపు నెఱుపును బసుపును•నలుపు నగుచుఁ
గృష్ణలోహితవర్ణంబు • నెసఁగుచుండ
నతుల తేజస్వి యగుమరు•దాత్మజాతు
దేహసంపర్కమున మొగుల్ • తేజరిల్లె. ౧౭-౨

కం. మఱి మఱి లోనం జొచ్చుచు, మఱి మఱి వెలుపలను దోఁచి • మబ్బులనడుమన్
మఱుఁగుచు మెఱయుచు నొప్పెడి, కఱకంఠునిశిరసుపూవు•గతిఁ[1] గపియొప్పెన్.

తే. విశదవస్త్రంబు ధరియించి • వివిధ మేఘ, కాండవృతుఁ డయి కనఁబడి • కానఁబడక
యంబరంబునఁ జనియెడి•యాంజనేయుఁ, డంబుజారివిధంబున • డంబు వీఱె.[2]

తే. వారిధరనికురుంబంబు • దారితముగ
మాటి మాటికిఁ జలుపుచు • మారుతాత్మ
భవుఁడు బయలను మెఱయుచు • వైనతేయు
మాడ్కిఁ దనరారె నాకాశ•మార్గమునను. ౧౭-౫

సీ. జలదనిర్ఘోషుండు • చటులమహారావ,మున దెస లెల్లను • బూర్ణములుగ
రాక్షసప్రవరుల • రణమున వధియించి, తనపేరు నెల్లరు • వినఁగఁ జేసి
పట్టనం బంతయు • వ్యాకులపడఁ జల్పి, పంక్తికంఠుఁడు వ్యథ•పడ నొనర్చి
ఘోరబలం బెల్లఁ • గూపెట్టఁగాఁ గొట్టి, వైదేహికిని గడు•భక్తి మ్రొక్కి

ఆ. మహితతేజుఁ డైన•మారుతపుత్త్రుండు, మరలి వచ్చి జలధి•మధ్యమునను
జనుచు నుండి శైల•సత్తము మైనాకు, హస్తమున స్పృశించి • యతని దాఁటి.

తే. జ్యాలతాముక్తనారాచ • మనఁగ నరిగి, వారిదాభమహేంద్రంబు•వలను చూచి
దశదిశలు నిండ సింహనా•దంబు సేసె, మేఘనాదంబుఁబోలె న•మేయశక్తి.

కం. హితదర్శనలాలసుఁడై, వితతంబుగ నార్చి తోఁక • విద్రుపఁగఁ గపి య
ద్భుతఘోషమున దివాకర, యుతగగనము బ్రద్దలైన•యొప్పం గనియెన్. ౧౭-౮

హనుమంతుని సింహనాదము కపులు విని హర్షించుట.

ఉ. అయులివ్వూరువేగమును • నావలితీరమునందు దీనులై
వాయుతనూజుఁ జూచుతమి • వర్తిలుక్రోఁతులు విన్చు హృష్టులై
రాయెడ బుఃశురా జలరి • యందఱుఁ జేరఁగఁ జీరి యిట్లనున్
జే యని వచ్చె వాయుజుఁడు • సిద్ధము కార్యము పండు చూడుఁడీ. ౧౭-౯

ఉ. సందియ మేమి లేదు ధ్వని•చందమ తెల్పెడిఁ గార్యసాధనం
బెందు నసాధితార్థులకు • నీరవ మేటికిఁ గల్గు? నన్న న

---

[1] కఱకంఠునిశిరసుపూవు = చంద్రుఁడు. [2] దీనివలన హనుమంతుఁడు సముద్రము నీఁదనుగాని దాఁటలే దనువాదము దుర్వాదమని యేర్పడుచున్నది.

యయ్యంగదులు మిత్రదర్శనము♦నాశ నమృతున్నకు లాచు నంజనా
నందనురావముల్ విను చ♦నంతముదంబున గంతు లాడుచున్. ౧౩౦౦

తే. ఒక్కశిఖరంబు నుండి యొం ♦ డొక్క శిఖర
మునకు నొకకొమ్మనుండి స♦మున్నతంపుఁ
జెట్టుకొనకొమ్మ కెగురుచు ♦ నిట్టలంపుఁ
బ్రమదంబునఁ గ్రాలుచు ♦ సందడించి ౧౩౦౧

కం. పట్టుగ దూరపుజనులకుఁ, బుట్టముఁ జూపించురీతిఁ ♦ బుష్పితతరులన్
గొట్టకొనకొమ్మలన్ వెస, బిట్టుగ నాడించి యూఁచి ♦ పేర్చిరి ప్రీతుల్. ౧౩౦౨

కం. గిరిగుహల డాఁగి మొరయుచు, నురువడి వెలివచ్చుగాలి♦యొప్పున గర్జల్
పరఁగించుచుఁ జనుదెంచెను, సరభసముగ మారుతాత్మ♦సంభవుఁ డంతన్. ౧౩౦౩

కం. జలధరమార్గంబున న,బ్బలియుఁడు జలదోత్కరంబు♦పగిదిన్ రాఁగన్
వలిముఖు లందఱు ఘటితాం,జలు లై నిలిచిరి నభంబు♦చాయం గనుచున్.

## హనుమంతుఁడు మందరాద్రిపై దిగుట.

కం. గిరినిభుఁ డగు కపిఋషభుఁడు, తరునిక రాకులమహేంద్ర♦ధరకూటమునన్
ద్వరితుఁ డయి దూఁకి[1] గిరిని,ర్ఝరమునఁబడె నిహతపక్ష♦శైలం బనఁగన్. ౧౩౦౫

కం. శ్రీతమనంబునఁ గపివర,జాతంబులు గంధవాహ♦సంభవుచుట్టున్
గౌతుకమున నిలుచుండిరి, యాతనిఁ గనుఁగొనుచు మెచ్చి ♦ యాడుచు మిగులన్.

మానిని. అంతట వానర పుంగవు లెల్ల ని♦రామయతం గనుపట్టుహనూ
మంతునిఁ జూచి నితాంతముదంబున ♦ మా నగుమూలఫలాదిక మే
కాంత ముపాయన మిచ్చి కుతూంగట ♦ నందఱుఁ జేరి భజింప శుభ
స్వాంతుఁడు ఋక్షధవాంగదవృద్ధుల ♦ కర్థిలిఁ జేసి నమస్కృతులన్. ౧౩౦౭

## హనుమ కపులతోఁ దాను సీతాదేవిని జూచితి నని చెప్పుట.

సీ. చూచితి సీత నం♦చును సంగ్రహముగాఁగఁ, జెప్పి యంగదు కేలు ♦ చేర్చి కేల
నామ హేంద్రాద్రిర♦మ్యారామతలమున, నాసీనుఁ డై వాన♦రాళిఁ జూచి
రూక్షరాక్షసపతీ♦రక్షితసీతను, జూచితి సాధ్వి న♦శోకవనిని
విభుదర్శనాసక్తిఁ ♦ బెనఁగొన్నకురులతో, నుపవాసములఁ జిక్కి[2] ♦యున్న దనిన

తే. నమృతతుల్యమహార్థ వా♦క్యములఁ బ్రీతు
లెగురువారును దూఁకువా ♦ రిందు నందుఁ
గూయువారుఁ గిలార్చుచు ♦ మ్రోయువారు
వాలముల నెత్తి నేలపై ♦ బాఁదువారు. ౧౩౦౮

---

[1] ఇదియును హనుమంతుఁ డాకాశమునుండి నేలకు దిగినట్లు తెలుపుచున్నది గాని సముద్ర మీఁది తీరము నెక్కినట్లు తెలుపదు. [2] దీనివలనఁ బ్రతిదిన మింద్రుఁడు సీతకుఁ బాయసముఁ దెచ్చి యిచ్చు చుండెనను కథ ప్రక్షిప్తమని యేర్పడుచున్నది.

తే. ద్విరదతుల్యులు క్రోఁతులు ♦ దరుల నుండి
దుమికి హనుమంతుఁ బరిరంభ♦ణము నొనర్చి
రంత సర్వవనాటమ♦ధ్యంబునందు
వాలితనయుండు పల్కె న♦వ్వాయుతనయు. ౧౩౦౯

కం. విస్తారం బగువారిధి, నిస్తరణ మొనర్చి మరలి ♦ నెమ్మది రాఁగన్
శస్తగతి నెవ్వఁ డోపును, నిస్తులజవసత్త్వములను ♦ నీసముఁ డేఁడీ? ౧౩౧౦

కం. ఔరా! నీప్రభుభక్తియు, నౌరా! నీశక్తిధైర్య ♦ మర రే! హనుమా
భూరిత రాదృష్టంబున, శ్రీరామునిరమణిఁ గంటి ♦ సీతాసాధ్విన్. ౧౩౧౧

ఆ. జానకీవియోగ♦సంతాపమును భూప, వర్యుఁ డిపు డదృష్ట♦వశతఁ బాసె
నీదుపోకరాక ♦ నెటి మాకుఁ దెలియంగఁ, బలుక వయ్య కర్ణ♦పర్వముగను. ౧౩౧౨

తే. అనిన వానరులెల్ల వా♦తాత్మజాతు, జాంబవంతుని నంగదు ♦ సరసఁ జుట్టి
యుండి రయ్యెడఁ బెద్ద వౌ♦బండలందు, హనుమ చెప్పెడివృత్తాంత ♦ మాలకింప.

కం. ఎటు దాఁటెనొ వారిధిఁ దా, నెటు చొచ్చెనొ లంక సీత ♦ నెటు చూచెనొ య
క్కుటిలుని దశకంఠునిఁ దా, నెటు గాంచెనొ యంచు వినఁగ ♦ నెసగినవాంఛన్.

తే. అంజలి ఘటించి భజియింప ♦ నగచరాళి, వాలిసుతుఁడును శిఖరాగ్ర♦భాగమందు
దిశలు వెలిగించు చుండెను♦దేవవితతి, గొలువ రాణించువాసవు♦కొమరు దోఁప.

కం. విలసితకీర్తియశస్సుల, నలరారెడుహనుమ చేత ♦ నంగదములచేఁ
జెలువారెడు నంగదుచే, జ్వలితం బయ్యెను మహీధ్ర♦వరకూటంబున్. ౧౩౧౬

{ హనుమంతుఁడు తాను లంకకుఁ బోయి వచ్చిన
విధం బంతయుఁ గపులకుఁ జెప్పుట. }

దండకము. ఆద్యంతవృత్తాంత మాలింపఁగా నింపు పెంపారనాజాంబవంతుండు వాతాత్మజుం జూచి యోయంజనానందనా! ముందుగాఁ బొందుగాఁ దెల్పు మేరీతి నానాతిని న్నీవు గన్గొంటి? వాల్గంటి దా నొంటి నెట్లున్న? దాయున్నమిన్నన్ దశాస్యుండు క్రూరుండు దా నేవిధిం జూచెడిన్? మీఁదికార్యంబు లేనంచునన్ సంచుగాఁ జెప్పు నొ చెప్పఁగా రానియవ్వాని భాషింపు మన్నన్, హనూమంతుఁ డత్యంతసంతుష్టుఁ డై హృష్టుఁ డై జానకిన్ లోన ధ్యానించి మూర్ధంబుచే మ్రొక్కి యిక్కెవడిం బల్కె; వారాశి యాప్రక్కతీరంబుఁ జేరంగ లో నెంచి నే నీన గాగ్రంబునం దుండి కుప్పించి దాఁటంగ మీరెల్లఁ గన్నారఁ గన్నార కాదే? య ట్లే నేగ నంభోధిమధ్యంబునన్ హేమశృంగాంచితం బైనశైలంబు నాత్రోవకడ్డంబు రా వచ్చెరా విఘ్న మం చెంచి రోషించి భేదించి పోవంగ లో నెంచి దానిన్ ఢికీలంచు నేఁ దాఁకితిన్, దోఁకతోఁ దాచితిన్, దాఁచినన్ దానిశృంగంబు వేభంగు

లన్ భంగ మై రాలెఁ, దచ్చైత్యలమో మామకీనాశయం బెంచి హర్షంబుగా నాయనా! నీకుఁ జిన్నప్ప నే, గాడ్పుమిత్రుండ, మైనాకుఁడన్, వార్ధిలో నుండుదున్, మున్ను పక్షంబు లుండన్ ధరాధ్రంబులెల్లన్ యథేచ్ఛంబుగాఁ ద్రిమ్మరన్ లోకభీదానదక్షంబు లౌ వాని వీక్షించి పక్షంబులం ద్రుంచె వజ్రాహతిన్ శక్రుఁ, డగ్గోడు తప్పింప నీతండ్రి న న్దెచ్చి యీయంబుధిం ద్రోచెఁజూ, ధర్మభృద్వర్యుఁడున్ శక్రవీర్యుండు నౌ రామకార్యంబున న్నాదుసాహాయ్యముం గొమ్ము నా, నమ్మతిన్ నాదుకర్జంబుచందంబు బోధించి కార్యైకసక్తాత్మతన్ శైలరాజాజ్ఞ నేఁ బోయితిన్, గ్రాసమున్ మానుషాకారమున్ మాని శైలాకృతిం బూని వారాశిమధ్యంబునం జొచ్చె, నే నెచ్చువేగంబునం బోవఁ బోవంగ నాగాంబ వేగంబ నాకడ్డ మై నిల్చి యోక్రోఁతిఱేఁడా! మదాహారముం గమ్ము, వేగమ్ము రారమ్ము, దేవాళి యేర్పాటురా సుమ్ము నా, నమ్మహాదేవికిన్ మ్రొక్కి దిక్కేమియుం దోఁప కిట్లంటి నో దేవి! భూదేవిజామాత శ్రీరాముఁ డారణ్యదేశంబునన్ జానకీలక్ష్మణాన్వితుఁ డై క్రుమ్మరం బంక్తికంఠుండు శుంఠుండు తద్దేవినిన్ ముచ్చిలించెన్, దదన్వేషణార్థంబు రామాజ్ఞచేఁ బోవు చున్నాఁడఁ, దద్దేవుదేశంబునం దుంట శ్రీరామకార్యంబునర దోడు కారాదె? కాదేని వైదేహినిన్ రామునిం జూచి వే వచ్చి నే నిచ్చ నీమెచ్చుగాఁ జొచ్చువాఁడన్ భవద్వక్త్రమం దన్న నయ్యన్న హా! యేటిమాటల్ బళా దాఁటి పోనీయ, నా కీవరం బిచ్చిరా దేవతావల్లభుల్, పొల్లుగాదన్న, మే న్పెంచితిన్ యోజనంబుల్ పది న్నిడుపు నందర్ధవిస్తారముం గల్గ నా దేవి నాయంత వాక్రంతఁ దావిచ్చె నే నంత హ్రస్వుండ నై యొక్కయంగుష్ఠమాత్రంబుగాఁ జివ్వునన్ దానివక్త్రంబునం జొచ్చి వెల్వడ్డ నన్ జూచి నైజాకృతిం దాల్చి యాయంబ! యోవానరంబా! సుఖంబారఁ బో పొమ్ము, నీకార్యముల్ చక్క నౌఁ, గూర్పుమీ సీత శ్రీరాముతో, మెచ్చితిన్ నీయెడన్, భద్ర మౌ నన్న నన్నంతటన్ భూతముల్ ప్రీతముల్ మేలు మేలంచు శ్లాఘించెఁ, దర్వాత నిర్భీతిఁ బక్షీశురీతిన్ మొగుల్ త్రోవ నేఁబోవ, నాచాయ నేదో గ్రహింపంగ నే చాయఁ గన్గొన్న నా కేమియుం దోఁప దాత్మీయవేగంబు సంకుంఠితం బైన నే నాత్మలో నే మహా! నా మహావేగమా చిక్కె, నే ప్రక్క నే యొక్కరిం గానఁ, గార్యంబు వార్యంబుగా నోపునో? యంచు దుఃఖాకులాత్ముండ నై క్రిందు చూడంగ, మున్నీట ఘోరాకృతిం బండి రాకాసి యొక్కర్తు నన్ జూచి గర్జించి తర్జించి పెన్నవ్వుతోఁ గ్రొవ్వుతోఁ గీడుగా నాడె, నో పెద్దదేహంబువాఁడా! బలే యెందురా యేగ వేవేగ? నే నెన్నియో నాళ్లుగాఁ

గూడు లేకుంట నాఁకంట నేఁ జిక్కి స్రుక్కంగ నిందుండ నాదండిభాగ్యాన
నాకంటికిం దోఁచి తిప్పట్ల, నాకడ్పులోఁ గుడ్పుగాఁ జొచ్చి యానంద మొందింపరా,
యన్నఁ గా ని ష్మటం చేను నామేను వే దాని వాకంబె బల్ పెద్దగాఁ బెంప,
నాటక్కు నూహింపఁగా లేక నన్నిరింగ నో ర్విచ్చె, నేనో నిమేషంబునన్ గుజ్జు
వేషంబునన్ దాని పెన్బొట్టలో దిట్టనై యట్టివే చొచ్చి ప్రేవుల్ వెసం గొంచుఁ
జివ్వాలునం బైకి లంఘించితిన్, హస్తముల్ వ్రేల రాకాసి వారాశిలోఁ గూలె,
మింటన్ నభశ్చారు లౌచారణుల్ సింహికారాక్షసిం ద్రుంచె సామీరి యం
చాడఁగా వింటి, నే నత్త్యయం బెంచుచున్ వింటిమార్గంబునం బోయి శాఖి
ప్రతానావృతంబౌచు లంకాపురం బుండు నాయొడ్డుఁ గన్గొంటి, నాపిమ్మటన్
సూర్యుఁ డస్తాద్రిఁ జేరంగ ఘోరాసురస్తోమముల్ గాన కుండంగ లంకాపురిం
జొచ్చితిం, జొచ్చు చుండంగ నొక్కర్తు కల్పాంత ధారాధరాకార ఘోరాట్టహాసా
ననోపేత జాజ్వల్యమానాగ్ని కేశాళితో నన్నుఁ జంపన్ సమీపింప డాకేల నేఁ
బెద్దపె ట్టొక్కటిం బెట్టితిన్, దానితో సోలుచుం గూలి, నన్ జూచి యోవీర!
లంకాపురిన్ నేను, న న్గెల్చి తీ వింక గెల్వంగ నేర్తీ సురారాతిసంఘంబుఁ,బొమ్మంచు
నచ్చెడె నన్నాడె, నే నాప్రదోషంబునన్ లంకలోఁ జొచ్చి రేయెల్లసీతాసతిన్ రోసి
తిన్, దైత్యునంతఃపురాంతస్థ్సలిం గానరా దయ్యె, నే నయ్యెడన్ శోకసంతాప
మేపారఁ బ్రాకారముం దాఁటి, యుద్యానముం గాంచి, యందే యశోకావనీజాత
మొం డెక్కి బంగారవంటుల్ విరాజిల్లు తోఁ టొక్కటిన్ శింశుపాభూరుహో
పాంతదేశంబునన్ శ్యామ నీరేజపత్త్రాంబకన్ నిట్రుపాసంబులం జిక్కి యేకాంశు
కాన్వీత యై ధూళిసంలగ్న కేశాంత యై శోకసంతాపదీనాంగి యై నాథు ధ్యా
నించుచున్ బెబ్బులుల్ చుట్టఁగా లేడిచందాన దుఃఖించుచున్ భూమిపై వ్రాలి
పెన్నంచునం దమ్మివోలెన్ వివర్ణాకృతిం దాల్చి దైత్యేశభీతిన్ మృతిం జెందఁగాఁ
గోరుసీతాసతిం గాంచు చాచెట్టుపై నుంటి, నే నింతలోఁ బంక్తికంఠాలయంబందు
ఝూళంఝుళీరావముల్ వింటి, నద్దాన నే నివ్వెఱన్ గొంటి, సంక్షిప్తగాత్రుండ
నై పక్షివోలెం గుజంబందు నే నుంటి, దైత్యేశుఁ డిల్లాండ్రతో వచ్చె నచ్చోటికిన్,
జానకీదేవి యారాక్షసాధీశునింజూచి మోఁకాళులన్ బొమ్మునం జేర్చి హస్తంబులం
జుట్టి విత్రస్త యై దిక్కు లేకందు నల్దిక్కు లీక్షించుచున్ వేపమానాంగి యైయుండ
వాఁ డంగనం జేరి ధాత్రీస్థలిన్ వ్రాలి నన్నేలవే గోల! యో బేల! రెన్నాళ్లలో
నన్నుఁ గైకోక గర్వించి తేనిన్ భవచ్ఛోణితం బేను ద్రావంగ నుంకింతుఁ జు మ్మన్న

నన్నీచువాక్యంబు లాలించి రోషంబునన్ సీత భాషించె నోనీచుఁడా! దుర్మతీ! నన్నెవ్వతెంగాఁ గనుంగొంటిరా! నీవు; శ్రీరామునిల్లాల, నిక్ష్వాకువంశేశ్వరుం డైనయయ్యాజికిం గోడలన్, నన్నురా నీవు నీచోక్తు లాడంగ! నీనాల్క తుత్తునకలై కూలదా? క్రూరుఁడా! శూరుఁడా నీవు? చోరుండవై నాదునాథుండు లేనప్డు నన్దెచ్చి ముచ్చట్లు వాక్రుచ్చఁగా వచ్చితా? రామచంద్రుండు సంగ్రామశూరుండు సత్యోక్తివ్రతాధారుండు యజ్ఞప్రచారుండు నీ వామహాభావుదాసుండు గానైన నర్హుండవా? యన్న నన్నాతివాక్యంబు లాలించి కోపించి యంతఁ, జిత్తాస్థాగ్ని చందంబున న్మండి పెన్రుష్టులం ద్రిప్పి నద్దేవినిం గ్రుద్ధి చంపంగ నేలెత్త నయ్యో యయో యయ్యయో యంచు దైత్యాంగనల్ గూయ స్త్రీమధ్యమం దున్న మందోదరీ[1] నాథ్ని దా నడ్డమై శూరుఁడా! యేమి యీసేఁత? యీసీత నీకేల నేనుండఁగా? లేరె యీయక్షదేవాంగనల్? చాలరే వీరు? లీలావిలాసంబులం దేలఁగా రాదె, రమ్మంచుఁ గోపంబు చల్లార్చి యారాక్షసుం దోడుకొంపోగ, నల్లంగ సీతాసతిం గాచుఘోరాస్యలౌ రాక్షసస్త్రీలు తద్దేవినిం జూచి గర్జించి భర్జించి తర్జించి కర్జంబుగా నెన్నియో దారుణాలాపముల్ పల్కఁగా వాని నాచానయున్ గడ్డిపోఁచంబలెం జూచె, నాయింతిస్థైర్యంబు నారక్కసుల్ గ్రక్కునం బోయి దేవారికిం జెప్పి యాయంగనన్ లొంగఁగాఁ జేయ దుస్సాధమంచెంచి యందంద నిద్రించి రా మైథిలీదేవియున్ రామ! రామా! యటం చేడ్చుచుండం ద్రిజాటాఖ్య దా నిద్దురన్ లేచి రక్షస్సతీసంఘముం గాంచి మీరేటికే జానకిం జూచి భక్షింతుమా తిందుమా యంచుఁ దర్జింపఁగా? మ్రింగుఁడీ మిమ్ము మీరే, ధరాపుత్రి నాశంబు గాదెన్నఁ, డాయాజికిం గోడలై రామునిల్లాలు నౌ సాధ్వి మీచేతికా చిక్కెడిన్? దారుణంబైనస్వప్నంబునం దీదశగ్రీవునాశంబు శ్రీరాము గెల్పుంగనుంగొంటి, మీతర్జనల్ చాలు, మిమ్మెల్ల నీదేవి శ్రీరాముతోఁ జెప్పి రక్షింపఁ జాలున్, ననుస్సాగ మాత్ర ప్రసన్నన్ గృపావాల వేవేఁడు కోరే, మదీయాశయం బిద్ది, నిక్కంబు దుఃఖంబులం బాపు నీ దేవి, యోతల్లిరో! నీవ మాదిక్కు మాత్రొక్కుఁ గైకొంచు రక్షింపు మన్నన్ దయాలోల సీతామహాదేవి తా నెవ్వరిం గాచు, నన్నంత నాయింతియుం గాంతు జేత్పృత్వ మాలించి లోసిగ్గునం బల్కె, మీమాటసత్యంబ యే నట్ల రక్షింతు నం చీగతిం బల్క, నాకల్కి యాపద్దశం జూడ లేనైతి, నాధైర్యమో వమ్ముగాఁ బోయె, నే నంత నాకాంతతో భాషణోపాయముం జక్క భావించి యిక్ష్వాకువంశస్తవం బారఁగాఁ జేయ నామాట

[1] అడ్డమువచ్చినది మందోదరి కాదు. మందోదరిపేరుమాత్రము విని యుండుటచేతను భేదము గుర్తింపఁజాలక ధాన్యమాలినియే మందోదరి యని హనుమంతుఁడు భ్రమించెను.

లాలించి యాదేవి కన్నీటితో వానరశ్రేష్ఠ యెవ్వండ వయ్యా! నినుం బంపె
నెవ్వం డదేలా యదేలాగునన్ వచ్చి తీ విందు? నే విందుగా విందు, శ్రీరాముతోఁ
జెల్మి నీ కెట్లు చేకూరె? భాషింపవేయన్న నాయన్నుతో విన్నపం బిట్లు నేఁ జేసితిన్,
దేవి! నీనాథు మిత్రుండు మిత్రాత్మజుం డుండు సుగ్రీవనాముండు, నే నామహాశూరు
బంటన్ హనూమంతుఁడ న్పేరివాఁడన్, నినుం గాన నాత్రేఁడు శ్రీరాముఁ డంపెం
జుమీ, నీ కభిజ్ఞాన మాత్మాంగుళీయంబు దా నిచ్చెఁ గైకొమ్ము, నాకిమ్ము నీ వానతిన్,
రామ సౌమిత్రులన్ డాయ నిన్గొంచు నేఁ బోయెదన్ వచ్చె దే? యన్న నాగోలలన్
మిన్న యోయన్న శ్రీరాముఁడే రావణుం జంపి నన్గొంచుఁబో వత్తు నన్నన్ సతీ!
నాకుఁ జిత్తప్రమోదావహం బైనగుర్తేమియే నిచ్చెదే? యన్నఁ గా నిమ్మటం చింద
మీదివ్యచూడామణిం గొమ్ము, నాప్రాణనాథుండు నిద్దాని వీక్షించినంతన్ నిజం
బెచ్చుగా నిన్ను మన్నించు నం చిచ్చి తా వెండియుం గొన్నిసందేశవాక్యంబులం
జెప్పె, నే నాసతీరత్నమున్ మ్రొక్కి నే నిందురాఁ జూచు చుండంగఁ దా వెండి
యున్ నన్నువీక్షించి యోయంజనానందనా! యెట్లు వాక్రుచ్చి నన్ రామసౌమిత్రి
సుగ్రీవు లిచ్చోటికిన్ వేగ రాఁ జూతురో యట్లు భాషింపు, మిం కేను మాసద్వయం
బే చుమీ మేనఁ బ్రాణంబులం దాల్తు, నీలోన శ్రీరామచంద్రుండు నన్జూడ రాఁడా
యెనా నాయనా! నే నాయనాథాకృతిం జత్తు, మీయిష్ట మం చన్న నాకన్నెదీ
నోక్తు లాలింపఁగాఁ గింక యంకూరమెత్తెం జుఁడీ, యంతఁ గొండంత దేహంబుతో
యుద్ధకాంక్షన్ వనం బెల్లఁ జీకాకుగాఁ బీఁకి నిర్మూలముం జేయ యారద్దునన్
నిద్దురన్ లేచి యద్దైత్యకాంతల్ మదిన్ భీతి గొల్పంగ నల్దిక్కులం బాఱె యిం
ద్రారినిం జేరి యోవైరి విద్రావణా రావణా! క్రోఁతియొక్కండు యుష్మన్మహా
శూరతాఽజ్ఞాని దుష్టాత్ముఁ డై తోఁటయెల్లన్ సపాటంబుగా నేలతోపాటు గా
వించె, నాక్రించు రప్పించి ఖండింపుమీ, యన్న నారాక్షసుం డుగ్రులం గింకరా
ఖ్యాతశూలాయుధాశీతిసాహస్రసంఖ్యాకులం బంచె, నేలాడిచేఁ ద్రుంచితిన్ వా
రలం జావఁగాఁ, దక్కి యున్నట్టిదైత్యుల్ వెసం బాఱి దేవారితోఁ జెప్పి రే నింత
లో నూర కేలుండఁగా నంచుఁ దోఁపంగ నాచైత్యప్రాసాదమున్ ధ్వస్తముం జేసి
యచ్చోటిరక్షస్తతిన్ స్తంభఘాతంబులం గూల్చితిన్ నూర్వురన్, వచ్చెఁ దానంత
లోనం బ్రహస్తాత్మసంభూతుఁ డౌ జంబుమాల్యాఖ్యవిఖ్యాతశూరుండు ఘోరా
సురవ్యూహసంయుక్తుఁ డై, వాని సేనాసమేతంబుగా లాణిచేఁ జంపితిం, బిమ్మటం
బంచె నాపై మహామాత్యపుత్రాష్టకం బేను నద్దాననే వారిఁ గాలాలయావా

సులం జేసితిం, బంచసంఖ్యాకసేనాను లుద్దండత న్వొండి పై రా విదారించితిన్ సేనతో, వెన్క నప్పంక్తికంఠాత్మజుం డక్షుఁ డన్వాఁడు సైన్యంబుతో వచ్చె, నే నాకుమారున్ మహావీరు మందోదరీసూనునిన్ మింటికి న్వాఁడు లంఘించుచోఁ గాల్లు లీలన్ బిగంబట్టి గిర్గిఱ్ఱునన్ నూఱు మాఱుల్ వడిం ద్రిప్పి పెన్నుగ్గుగాఁ జేసి ధాత్రీస్థలి న్మోఁదితిన్, వానిపాటాదశాస్యుండు నాలించి వేఁ డొండు పుత్రున్ మహాగాత్రునిన్ శక్రజిం బంపె; నవ్వాని నవ్వాహినింగూడఁ దేజం బఱంజేసి మోదించితిన్, వాఁడు నన్గెల్చున న్నమ్మకం బూని రక్షోవిభుం డంపె, న న్నెట్టులుం గెల్వరా దంచు నూహించి వాఁ డంత బ్రహ్మాస్త్రపాశంబులన్ నన్ను బంధించె, రక్షోవరుల్ త్రాళ్లతో నన్ను బంధించి కొంపోయి దైత్యేశు మోలన్ నిలం బెట్ట వాఁ డుగ్రుఁడై యేలరా వచ్చితీలంక? కీ వేలరా చంపితా సోఁకులం?, జెప్పరా యన్న సీతార్థమై సర్వముం జేసితిన్, నిన్నుఁ జూడంగ నీయింటికిన్ వచ్చితిన్ రాక్షసేంద్రా! హనూమంతుఁ డన్వాఁడ, నేఁ బావమానిన్ రఘూత్తంసుఁ డౌ రాముదూతుండ, సుగ్రీవుమంత్రిన్, ననుం బంప రాముండు నీయొద్దకు న్వచ్చితిన్ దూతనై, సూర్యపుత్రుండు నీక్షేమముం బ్రశ్న గావించె, ధర్మార్థకామానుషక్తంబు పథ్యంబు వాక్యంబు నీకున్ వచింపెం జుమీ, ఋశ్య మూకంబునన్ రాముతో మైత్రిఁ గావించి యున్నాఁడు, తద్వీరువాక్యంబు లా లింపుమా, రామదేవుండు దేవారి నానారినిన్ ముచ్చిలించెన్ వనీభూమి, నీ విందు సాహాయ్యముం జేయుమా, యంచు న న్వేఁడ నే నట్టులే చేయుదుం గాని యవ్వాలినిం జంపఁగా బాసఁ గావింపుమీ యంటి, సూర్యాన్వయుం డట్లు గావించి యవ్వాలినిన్ బాణమొక్కంట నే చంపి కీశాధిపత్యంబు నా కిచ్చె, నే హ వ్యభుక్సాక్షికం బైనస్నేహంబు గావించితిన్, రామసాహాయ్య మే నెట్టులుం జేయు దున్, జానకీదేవి శ్రీరామభూనేత కిమ్మాయకున్నంత వీరుల్ వనాటుల్ భవచ్ఛౌర్య నిర్మూలనం బెట్లుఁ గావింతు, రెవ్వారు మావారిశౌర్యంబు లోకంబునం గానరో? పోవరో మున్ను దేవాళికిం దోడుగా? నంచు నీతో వచింపన్ ననుం బంచెనన్నన్ రుషాశోణితం బైననేత్రంబులం జూడున ట్లుగ్రతం జూచి నావిక్రమం బాదు రాత్ముం డవిజ్ఞాతుఁ డై యంత నన్ జంప నాజ్ఞప్తి గావింపఁగా వానితమ్ముండు ధీశాలి రక్షోవరు న్నానిమిత్తంబుగా వేఁడె నోసోఁకుఱేఁడా! కసన్ రాజశాస్త్రవ్య పేతంబు నీయాజ్ఞ, శాస్త్రంబునం దూత వధ్యుండుగాఁ, డిచ్చమైఁ దథ్యముం బథ్యముం బల్కు వాఁ డెట్టినేరంబు గావించినన్ రూపు మార్పన్ విశా రంబుగాఁ జెల్లుఁగా, నెప్పుడుం జంపఁగా రాదనం, దోఁకఁ గాల్పంగఁ బంచెన్

దశాస్యుండు, రక్షోవరుల్ వాల్కవారంబులన్ జీర్ణకార్పాసవస్త్రంబులం దోఁకకుం
జుట్టినన్ గట్టెలం గొట్టుచున్, గింకచేఁ దిట్టుచున్, బైపైయిన్ ఊప్పుచుం, వీథులం
ద్రిప్పుచున్, బోవ సంక్షిప్తగాత్రుండనై కట్టులం దుల్చి నే వెండియున్ ఘోర
రూపంబుఁ గైకొంచుఁ బెన్ లాడిచే వారలం జంప ద్వారంబునం జేరి లంకాపురిం
గొంప లన్నింటికిం జిచ్చు సంధించి యీమంటలో సీతయుం ద్రుంగెనో? పోయెఁగా
పట్టనం బంతయుం జూడుగాఁ, దన్విమాత్రంబు దా నెట్లుజీవించెడిన్? రామకా
ర్యంబు నిర్మూలముం జేసితిన్ బుద్ధిహీనుండనై, యంచు శోకించుచున్ సీత
భద్రంబ యం చభ్రమార్గంబునం జారణుల్ పల్కనాలించి భావించి సర్వం
బుఁ జుంగాల్పునాయాశ్రయాశుండు నాతోఁకఁ గాల్పండ, నాచిత్తమా సంప్రహృ
ష్టంబు, సౌరభ్యసంభారుఁడై గంధవాహుండునున్ వీచె, సీతామహాదేవినా వీతి
హోత్రుండు దాఁగాల్పఁగా నోపునే? నం చాత్మమోదించి యాయించుఁ బోణిన్ మఱిం
గాంచి నే నామొకుం జెప్పి తత్రస్థమానాయగిష్టంబుపై నెక్కి మిమ్మెల్ల దర్శించు పెన్
క్కువన్ గ్రక్కునన్ వారిథిం దాఁటి చంద్రార్కసంసేవితంబైన మార్గంబునన్
వచ్చితిన్, మిమ్ముఁ గన్గొంటి, శ్రీరామచంద్రప్రభావంబునన్ యుష్మదీయోరు తేజం
బునన్ నేను సుగ్రీవు కార్యంబు నీమట్టు గావించితిన్ లంకలో, నింకఁ గాఁగల్గు
కార్యం బవార్యంబుగాఁ జేయ మీరెల్ల రున్నారుగా. ౧౩౧౭

హనుమంతుఁడు సీతాదేవిని దోడ్కొని వచ్చి శ్రీరాముని దర్శించుట యుక్తమని చెప్పుట.

మ. అని సర్వంబు వచించి జానకి మహా ♦ త్యర్థప్రశీలంబుచే
నినసంభూతుని సంభ్రమంబు రఘువం ♦ శేశప్రయత్నంబు గాం
చెను సాఫల్యము, నాదుచిత్తము సదా ♦ చింతించెడిన్ జానకీ
వనజాతాయతలోచనాప్రవణమై ♦ భాషించితిన్ సత్యమున్. ౧౩౧౮

చం. అలఁతిగ నెంచఁ బోకుఁడు సు ♦ రారివిభున్ దశవక్త్రునిం దపో
బలమున లోకముల్ నిలుప ♦ బాధతరాగ్రహ మెత్తి నన్నిటిన్
బెలుచ దహింపఁ జాలెడిఁ బ్ర ♦ వృద్ధుఁడు సర్వవిధాల, జానకిన్
బలిమిని దాఁకియుం జెడమి ♦ వానితపోగరిమంబునం జుఁడీ. ౧౩౧౯

కం. జానకి కోపమె పూనిన[1], మానక యొనరించుదాని ♦ మఱి దహనుండున్
బూని కరంబున నంటినఁ, దా నొనరుపఁ జాలఁ డింత ♦ తథ్యము సుండీ! ౧౩౨౦

---

[1] సీతనుదాఁకిచెడిపోక తనతపోబలముచేత రావణుఁ డుండెనేని సీతాపాతివ్రత్యమునకంటె రావణుని తపోబలము గొప్పదని యేర్పడుచున్నది. అట్లైనచో రావణునకు రాఁగల భయమేమియని కపులు సందేహింపఁగా నింగితజ్ఞుఁడైన హనుమ యదితెలిసి సీతకుఁ గోపమురాకుండుటచేత రావణాసురుఁడు బ్రతికెనుగాని వానితపోబలముచేతఁ గాదని చెప్పుచున్నాఁడు.

చం జరగిన దేమొ చెప్పితిని ♦ జాంబవదాదులసమ్మతిన్ నృపా
భరణము రామచంద్రుఁ గన ♦ భావ్యము జానకిఁ దెచ్చి, రావణున్
బరిజనయుక్తు నే నొకఁడ ♦ పట్టి వధింపఁగఁ జాలుదున్ వనే
చరవరులార! మీరలును ♦ సాయము వచ్చినఁ జెప్ప నేటికిన్? ౧౩౨౧

కం.శూరులుఁ గృతాస్త్రులును గడు,నీరులుఁ గృతమతులు మఱియు ♦ విజయైషులు దు
ర్వారబలయుతులుఁ బ్లవగులు, మీరలు బాసటగ లంక ♦ మీటనె దివికిన్?

సీ. సహపుత్రు సానుజు ♦ సైన్యసమేతుని, రావణు నొకఁడ సం♦గ్రామమునను
బొరివుచ్చ నేర్తును ♦ హరిహయజిత్తుని, బ్రాహ్మ మైంద్రంబును ♦ రౌద్రవారు
ణాద్యస్త్రముల నెల్ల ♦ హననంబుఁ జేసెద, నందఱుఁ గాని మ్మ♦టంటి రేని
నాకురిసెడి నిరం♦తర శైలవృష్టికి, నమరులు నీల్గుదు ♦ రసురు లెంత
ఆ. వనధివేల దాఁటి ♦ వచ్చిన వచ్చును, మఱియు వణఁక వణఁకు ♦ మందరంబు
గాని జాంబవంతుఁ ♦ గదలింప నేరదు, సంగరంబునందు ♦ శత్రుసమితి. ౧౩౨౩

సీ. అసురసంఘములఁ బే ♦ రైనవారిని జంపఁ,జాలు నొక్కరుఁడ యీ♦వాలిసుతుఁడు
పనసనీలురజవ♦పటిమను ను గ్గగు, మందర మాశర♦బృంద మెంత
మైందద్వివిదులతో ♦ మార్కొనఁగలవారి, యక్షగంధర్వోర♦గాళి నైన
ప్రేల్వంచి యొక్కని ♦ వెదకి చెప్పఁడు చూత, మే నెఱింగినయంత♦లోన లేఁడు
ఆ. బ్రహ్మవరముఁ గన్న♦పరమబలాధికు, లమృత మానినార ♦ లాశ్వినేయ
గౌరవార్థముగను ♦ గమలసంభవుఁ డవ,ధ్యత్వ మిచ్చె వీరి ♦ కనఘులార! ౧౩౨౪

కం.వరగర్వంబున వీరలు, సురవరసంఘముల గెల్చి ♦ సురఁ గ్రోలిరి యా
శరవిసరముఁ జీరికిఁ గొం,దురె యంద ఱటుండ నిండు ♦ దోర్దర్పఘనుల్. ౧౩౨౫

కం.లంకాపురమెల్ల, నిరా,తంకంబుగఁ గాల్చి బూడి♦దం జేసితి ని
శ్శంకంబుగ నామంబుల, బింకంబుగ నెల్ల యెడలఁ ♦ బేర్కొంటిఁ జుఁడీ. ౧౩౨౬

చం.జయము జయంబు రామునకు ♦ సారపరాక్రమధన్యమూర్తికిన్
జయము జయంబు విద్విషద♦సహ్యతరస్వి సుమిత్రపట్టికిన్
జయము జయంబు దాశరథి♦సంపరిపాలితుఁ డౌవలీముఖో
చ్చయపతి సూర్యపుత్రునకు ♦ సాహసవిక్రమకీర్తిశాలికిన్. ౧౩౨౭

కం.కోసలరాజేంద్రునకున్, దాసుఁడ హనుమత్సమాఖ్యుఁ ♦ దనరినవాఁడన్
నే సుతుఁడ మారుతున కని, వాసిగ నెల్లరును వినఁగఁ ♦ బలికినవాఁడన్. ౧౩౨౮

హనుమంతుఁడు కపులకు సీతాదేవిస్థితిని దెలుపుట.

కం.అనుపమశీలవతీమణి, వనజాంబక ఖలునశోక♦వని శింశుపనీ
డను దుఃఖించుచు నున్నది, మన మెరియదె యామెపాటు ♦ మది స్మరియింపన్.

కం. దానవతరుణీవృత యై, జానకి వారిదవిలీన♦శశిలేఖ యనన్
దీన యయి కాంతి దొఱఁగియు, మానసమున సరకు గొనదు ♦ మానవభోజిన్.

తే. ఆత్మనాయకునందు నే♦కాగ్రవృత్తిఁ, జిత్తమును నిల్పి నిర్జర♦సత్త్వముపయి
నలపులోమజయట్టుల ♦ యధికరక్త, యగుచు శ్రీరాము ధ్యానించు ♦ ననవరతము.

ఉ. మాసినయొంటిచీరను దు♦మారమునం దను వెల్లఁ బ్రుంగ సీ
తాసతి దుఃఖభారవశ♦తం దపియించుచుఁ బ్రాణనాథుపై
నాసను రక్కసుల్ బెదరు♦లాడఁగ వ్రేలెడు నొంటివేణితో
గాసిని గుందెడిం, దలపఁ♦గాఁ గడు పెల్లను మండిపోయెడిన్. ౧౩౩౨

ఉ. చూడఁగ గుండె ఝల్లు మను ♦ సోఁకునెలంతలు భీతి గొల్పఁ ద
న్నాడఁగ, వల్లభా! యనుచు ♦ నాతని సేమముఁ గోరి దీన యై
వాడి దురంతశోకమున ♦ వ్రాల ధరాస్థలి దుష్టరాక్షసా
క్రీడమునందుఁ గంటిఁ గలి♦కిం జలి కారునతూఁడుఁబోలఁగన్. ౧౩౩౩

ఉ. వచ్చెడిజాడ లేదు నృప♦వల్లభుఁ డీయెడ, కీసురారినిన్
నచ్చఁగరాదు, వానివల♦నం జెడ నొల్లను, గాన నిప్పుడే
చచ్చుట మే లటంచును భృ♦శంబుగ నిశ్చిత చిత్త యైనయా
సచ్చరితాగ్రగణ్య కొక♦చందమున న్నది నమ్మఁ బల్కితిన్. ౧౩౩౪

కం. ముచ్చటలను సర్వార్థము, లచ్చపలాక్షికిని జెప్ప ♦ నగచరపతితో
నచ్చెపుఁ జెల్మి హృదీశున, కచ్చుపడుట కబ్జనేత్ర ♦ హర్షం బందెన్. ౧౩౩౫

ఉ. ఆమె మహానుభావతను ♦ నామెయతుల్యపతివ్రతంబునం
దామసుఁ డైనయా యసుర♦నాయకుఁ డింతకుఁ జాక తక్కుటన్
భూమి మహాత్ముఁ డే యనఁగఁ♦బోలును, వానిని రూపు మాపఁగా
రాముఁడు సంగరస్థలిని ♦ గ్రాలఁ గలండు నిమిత్తమాత్రు డై.[1] ౧౩౩౬

తే. సహజముగ సీత తన్వంగి ♦ సాధులార!
యందులో భర్తృశోకతా♦పార్దిత యయి
పాడ్యమిని బఱియించెడి♦వానిచదువు
పగిదిఁ గృశియించి యున్నది ♦ ప్రభ దొలంగి ౧౩౩౭

తే. సీత యీరీతి లంకలోఁ ♦ జిక్కి నవసి
గోడు గుడుచుచు నున్నది ♦ పాడి యరసి
దానికిని మాఱు సేయంగఁ ♦ దలఁప రయ్య
యనినఁ దారాతనూభవుఁ ♦ డనియె నిట్లు. ౧౩౩౮

---

[1] సీతాతపోమహిమచేతనే లంక మృతప్రాయమై యున్నదని భావము. చూ. ౧౧౭౦ ప.

→ అంగదుఁడు సీతాదేవిని దోడ్కొని వచ్చుటకు సమ్మతించుట. ←

ఉ. దంటలు మీరు శౌర్యమున ♦ దానవదేవభుజంగపాళులన్
జంటలు లేరు మీకుఁ బ్లవ♦నంబున, నిట్టిరు రిత్తకేలవా
ల్గంటులమిన్న లేక చనఁ ♦ గార్యమె? రామునిఁజేరి జానకిన్
గంటిమి, తోడితేర, మనఁ♦గాఁ దగునా మిమునంతవారికిన్? ౧౩౩౯

ఉ. వీరుఁడు గాఢ్పుపట్టి హత♦వీరముఁ జేసె సురారివారమున్
గారియ మన్య మేమి గలు♦గం గల? దుర్విజఁ డెత్త మన్న నా
వీరుని జాంబవంతుఁడు సు♦విశ్రుతశౌర్య! భవత్సమూహయున్
దీ రగు, నైన రాఘవుమ♦తిం జనఁగాఁ దలపోయుమీ యనన్. ౧౩౪౦

→ కపులు కిష్కింధకుఁ బోవు మార్గంబున మధువనంబుఁ జూచుట. ←

కం. సరి సరి యని రంగదకే,సరిసూనులు నున్నవారు[1] ♦ శాఖామృగముల్
పరమమతి వాయుజవుర,స్సరము మహేంద్రాద్రిఁ బాసి ♦ చయ్యనఁ జనఁగన్.

సీ. మేరుమందరసముల్ ♦ భూరిగజాభులు, మార్తండపథమెల్ల ♦ మాటు పఱుచు
నట్టులు వ్యాపించి ♦ యాంజనేయునిఁ దమ,దృష్టులచే వహి♦యించునట్లు
కనుఱెప్ప వెట్టక ♦ కాంచుచు నాతనిఁ, గొనియాడుచును స్వామి♦పనిని దీర్చి
నార మన్మదమున ♦ వారక ప్రియభాష,ణంబును జేయు చ♦నన్యచిత్త

ఆ. వృత్తి యుద్ధమునకు ♦ వేడుక సేయుచు, రామసాహ్యమునకు ♦ రాగపడుచు
మింట నేగి కనిరి ♦ కంటికిఁ బండువౌ,మధువనంబు మిగుల ♦ మంజులంబు. ౧౩౪౨

ఉ. నందనసన్నిభం బయి య♦నంతముదావహమై ద్రుమావళీ
సుందరవల్లరీనికర♦శోభిత మై సకలాప్రధృష్య మై
యందము మీఱఁగా దధిము♦ఖాఖ్యుఁడు సూర్యజుమేనమామ దా
నందు వసించి కాచు నెపు ♦ డర్కజముత్కర మద్ది గావునన్. ౧౩౪౩

కం. దానిం గని క్రోఁతులు మధు, వానం దమకించి కొమరు ♦ నంగదు వేఁడన్
లోనం జన నిమ్మని యతఁ, డౌననెఁ గపివృద్ధవిధిజు ♦ లామోదింపన్. ౧౩౪౪

→ కపులు మధువనంబుఁ జొచ్చుట. ←

కం. యువరా జనుమతి సేయఁగ, నవనీరుహచారు లెల్ల ♦ హర్షరసావే
శవివశు లై నృత్యంబుల,వివిధంబులుగాఁగఁ జలిపి ♦ వెసఁ జొచ్చి వనిన్. ౧౩౪౫

మానిని. ఆడెడువారును వేఁడెడువారును ♦ హాయిగఁ బాడెడివారును నై
వీడెడివారును గూడెడివారును ♦ వేడుక లాఁగులు వేసెడువా

[1] ఉన్నవారు = తక్కినవారు.

ఢోఁకెడువారును గూలెడివారును ♦ నూఁగెడివారును మీసములన్
దీడెడువారును దాఁటెడువారును ♦ దేఁకెడివారును నైరి కపుల్. ౧౩౪౬

సీ. కొనకొమ్మనొక్కటి ♦ క్రోఁతియొక్కం డూఁచి, పెఱకొమ్మమీఁదఁ గు♦ప్పించియెగసె
శాఖయొక్కటినుండి ♦ సరగున నిల డూఁకి, గొబ్బున వేఱొక్క♦కొమ్మ కెగిరెఁ
బైకొమ్మపైనుండి ♦ పడుచుఁ గ్రిఁగొమ్మను,నొక కేలఁ గ్రహియించి ♦ యూఁగునొకఁడు
కొమ్మలలో డాఁగి ♦ క్రోఁతియొక్కఁడు సేరఁ, దటుకునఁ బైపడి ♦ తఱుమునొకఁడు

ఆ. ఒక్కఁ డెక్కిరించు ♦ నొక్కరుఁ డిగిలించు
నొకఁడు కొక్కిరించు ♦ నొకఁడు కూయు
నొకఁడు కిచకిచ మను ♦ నొక్కఁడు గికురించు
నొకఁడు లాఁగు వేయు ♦ నొకఁడు లాగు. ౧౩౪౭

ఉ. పాడుచు నుండ నొక్కరుఁడు ♦ పైపడి నవ్వ నొకండు నవ్వుచో
నేడుచు చేగు వే ఱొరుఁడు ♦ నేమవ నొక్కఁడు వెక్కిరించుచున్
జూడఁగఁబోవు నాతనిని ♦ సొంపు బలే యని కొక్కిరించుచున్
గూడఁగఁ బోవు నాతనిని ♦ గ్రోతి మ ఱొక్కఁడు నవ్వులాలకై. ౧౩౪౮

కం. ఈవిధి నిచ్చఁ జరించుచుఁ, ద్రావఁగఁ దేనియలు తృప్తి ♦ దనరని వాఁడున్
వావిరి మత్తెక్కనివాఁ, డావనచరసైన్యసమితి♦యం దరిది గనన్. ౧౩౪౯

కం. ఈరీతి భాతి దీఱఁగ, నారామముఁ గలఁచి దులిచి ♦ యచ్చటిపండుల్
గోరంబుగఁ గూలిచి ద్రుమ,వారంబులఁ బెల్లు రేఁగి ♦ వానరు లున్నన్. ౧౩౫౦

దధిముఖుండు కపుల వారించుట.

కం. ఇంతకు దధిముఖవానరుఁ, డెంతయుఁ గోపించి వనము ♦ నెటులేఁ గావన్
జింతించి వానరావళి,యంతికమున కేగి వారి ♦ నాఁపఁ గడంగెన్. ౧౩౫౧

కం. తిట్టెను గొందఱ వెలికి, న్నెట్టెను గొందఱకుఁ బలికె ♦ నీతులు కేలన్
గొట్టెను గొందఱఁ గొందఱ,మొట్టెను బిడికింటఁ గినిసి ♦ మునుకొని కపులున్.

కం. కొఱికిరి కొందఱు కోఱల, బఱికిరి గోళ్లులను గాళ్లఁ ♦ బడ నడిచి ధరన్
బఱబఱ యీడ్చిరి కరముల, నఱిముఱి మర్దించి విడిచి ♦ రావనపాలున్. ౧౩౫౩

కం. కొందఱు ద్రోచిరి వానిని, గొందఱు దూషించి రధిక♦కోపంబున ని
ట్లందఱు బాధించుచు వాఁ,నిం దరుచరు లావనంబు ♦ నిర్మూలింపన్. ౧౩౫౪

అంగదహనుమంతుల ప్రాపునఁ గపులు మధువనంబున నిచ్చకొలఁది సంచరించుట.

కం. అంతట హనుమంతుఁడు కపి,కొంతులతో మీరు తృప్తి ♦ గన నవ్యగ్ర
స్వాంతంబుల మధు వానుఁడు, చెంతలఁ జేరంగ నీను ♦ సిద్ధము పగతున్. ౧౩౫౫

సీ. హనుమంతుఁ డాడిన♦యామాట లాలించి, యంగదుం డి ట్లను ♦ హరివరేణ్యు
లార! యవశ్యకా♦ర్యం బకార్యం బైనఁ, గృతకృత్యుఁ డగువాయు♦సుతునిపలుకు
ఇప్పల్కుఁగూర్చి నేఁ ♦ జెప్పంగవలయునే, తేనెగ్రోలుం డాస♦తీర ననిన
బళి బళీ యని మెచ్చి ♦ బలిముఖుల్ వెల్లువ,పోలెఁ జొచ్చిరి వన♦పాలకులను
తే. మొదలఁ దాఁచిరి త్రోఁచిరి ♦ మొగము పగుల
ద్రోణమాత్రము మధువు సం♦తోషముగను
నెల్లవారలుఁ ద్రావిరి ♦ కొల్లగాఁగఁ
గొన్నిటిని నేలఁ బగులంగఁ ♦ గొట్టి రపుడు. ౧౩౫౬.

కం. నైసర్గికబలమునఁ బృథ్వీసుతఁ గనుఁగొనుట వార్త♦వినుటను మఱి తా
రాసుతుననుమతిఁ దేనియ, నాసలు దీరంగఁ ద్రావి ♦ రగచరు లెల్లన్. ౧౩౫౭

సీ. కొందఱు మధువాని ♦ కొంత పాఱఁగ వైచి, మైనపుటుండల ♦ మాఱుకొనిరి
కొందఱు కైపెక్కి ♦ కొమ్మలఁ జేఁబూని, యాకు సెజ్జలఁ[1] బడి ♦ రాద మఱచి
మత్తునఁ గడువేఁదు ♦ ఱత్తినపోలికిఁ, ద్రోపు లాడిరి కొంద ♦ ఱేపు చెలఁగఁ
గొందఱు గర్జింత్రు ♦ కొందఱు నిద్రింత్రు, కొందఱు కిలకిల ♦ కూయు చుందు
ఆ. ఱేము యేము చేసి ♦ హిహిహీ యందురు గొంద
ఱేము యేము చేసి ♦ యెగిరి కొంద
ఱేము యేము చేసి ♦ యెలమిఁ జెప్పిరి కొంద
ఱేము యేము చేయ ♦ నెంచి రపుడు. ౧౩౫౮.

ఉ. వానరవర్గముల్ పడెడి♦పాట్లు గనుంగొని కిన్కమై మధూ
ద్యానమురక్షకుల్ దధిము♦ఖానుచరుల్ వెస రాఁగ వారలన్
జానుల ముష్టిఘాతములఁ ♦ జావఁగ మోఁదుచు దేవమార్గముల్
గానఁగఁ జేయ భీతిగొని ♦ క్రచ్చఱఁ బాఱిరి నేత యొద్దకున్. ౧౩౫౯

ఉ. ఇమ్మెయి నేగి యాదధిము♦ఖేశ్వరుఁ గన్గొని వాయుపుత్త్రసా
యమ్మున వానరాళి వన♦మంతయుఁ బా డొనరించి మమ్ములన్
గ్రమ్మిరి జానుదేశముల ♦ గ్రుద్దిరి ముష్టుల, వెండి దేవమా
ర్గములు[2] చూపి రన్నఁ గిను♦కం గొని వారల నూఱడించుచున్. ౧౩౬౦

శా. రండీ వానరులన్ బలాంధులను గ్రౌ♦ర్యం బార మర్దింత ము
చ్చండత్వంబున నంచు నాతఁ డొక భూ♦జశ్రేష్ఠముం గొంచు రాఁ
గొండల్ గుండులు ఱాలుఁ జెట్లుఁ గొని స♦క్రోధాంతరంగంబునన్
దండన్ డాసిరి తక్కుక్రోఁతులు వెసన్ ♦ దండింపఁ గీశేశులన్. ౧౩౬౧

---

[1] సెజ్జ = శయ్య. [2] దేవమార్గము = మర్మస్థలము.

## అంగదుండు దధిముఖునిఁ దన్నుట.

సీ. వానరవరు లిట్టు ♦ వచ్చి నేలను జెట్లఁ, గ్రుమ్మరు క్రోఁతుల♦గుంపుమీఁదఁ
గవిసిన నాతని♦కడఁకఁ గనుంగొని, పావని మొద లగు♦ప్రముఖు లెల్ల
నచటికిఁ బఱ తెంచి ♦ రంగదుఁ డంతటఁ, దరుహస్తుఁ డైనయా♦దధిముఖుండు
దనకుఁ బూజ్యుం డని ♦ మత్తత నెఱుఁగక, కోపించి కేలిచేఁ ♦ గూలఁ దాఁచి
ఆ. నలియ గ్రుద్ది విడువ ♦ వెలవెలఁ బోవుచు, రోఁజుకొనుచు నెత్తు♦రులు దొరంగ
నంగసంధి ప్రిదుల ♦ నరసావు చచ్చియు[1], లేచి యాఁవెఁ బెఱ వ♦లీముఖముల.
తే. ఎట్టులో వారువిడువంగ ♦ నేగుదెంచి, యేకతంబునఁ దనవారి ♦ నెల్లఁ గూర్చి
దధిముఖుం డిట్టు లను వీరు ♦ మధువనంబు,నంద యుండఁగ మనమెల్ల ♦ నరిగి వేగ.
ఉ. రామునితోడ నున్నకపి♦రాజును గన్గొని యొక్కయంగదుం
డే మునుకొంచు దోషముల ♦ నెల్ల ఘటించె నటంచుఁ జెప్పఁ బై
తామహామున్ దురాసద ము♦దాత్తము నిష్టవనంబు గావునన్
దామస మేది కీశపతి ♦ దండనముల్ ఘటియించు వీరికిన్. ౧౩౬౪
కం. భూవల్లభశాసనపరి,భావులు దుర్మతులు వీరిఁ ♦ బరిమార్పింపం
గా వలయు నంత వీరల, కావరమును దొలఁగు మనకుఁ ♦ గసియుం దీఱున్.
కం. అని తనబడిఁ దక్కినమధు,వనపాలకు లేగుదేర ♦ వానరపతిపు
త్రునిఁ జూడనాకసంబునఁ, జని దధిముఖుఁ డొక్కత్రుటిని ♦ సత్వరుఁ డగుచున్,
ఆ. రామచంద్రవిభుని♦సౌమిత్రి సుగ్రీవుఁ, గాంచి యచట డిగ్గి ♦ కపికులాభ
రణముఁ జేరఁ నేగి ♦ ప్రణతిఁ గావించెన,త్యంత మార్తి మొగము♦నందు వ్రేల.

## దధిముఖాదివనపాలకులు సుగ్రీవునితోఁ గపులదుశ్చేష్టలు దెల్పుట.

కం. ఇమ్మెయి దీనతఁ దనపా,దమ్ములఁ బడ సూర్యసుతుఁడు ♦ దధిముఖుఁ గని లే
లెమ్మా! భయపడకుము విష,యమ్మును వినిపింపు మంచు ♦ నాశ్వాసింపన్.
ఆ. అతఁడు లేచిపల్కె ♦ నధిప! నీజనకుని,తరమునందు నన్ను♦తరమునందు
నీతరంబునన్ వ♦నేచరు లావంక, మలయరానిరమ్య♦మధువనంబు. ౧౩౬౯
ఉ. ఆవనచారు లెల్లవిల♦యం బొనరించిరి పాడుపాడుగాఁ
ద్రావిరి తేనె, లెల్లఫల♦రాజి మెసంగిరి, తక్కు తేనెలన్
భూవివరంబులం దొలుకఁ♦బోసి, రిదే మని వీర లడ్డ మై
పోఁవఁగఁ గొక్కిరించి కను♦బొమ్మలు చూపిరి గుఱ్ఱుకొట్టుచున్. ౧౩౭౦
ఉ. ఏపున వీర లొక్కటిగ ♦ నేగి వని న్వెడలుం డటంచనన్
గోపముతోడ ముష్టులను ♦ గ్రుద్దిరి, గ్రుమ్మిరి కాలుసేతులన్

---
1 అరచావు చచ్చి = మూర్ఛపోయి.

జూపిరి దేవమార్గముల • శుంఠతనాన యథేచ్ఛ మిట్లు నీ
భూపతితం జెలంగి పలు•పోకలం బోయిరి తోంట పాడుగన్. ౧౩౭౧

కం. అని విన్నవించు చుండంగ, విని లక్ష్మణుం డనియె నోర•విప్రభవా! యే
మనియెడి నీవనపాలుండు, వన రెడి నిటు లేల యనిన • వాక్యజ్ఞుం డనున్. ౧౩౭౨

→{ సుగ్రీవుండు లక్ష్మణుతో హనుమదాదులు మధువనంబున విహరించుటం దెల్పుట. }←

సీ. ఆర్య! సౌమిత్రి! యు•ద్యానపాలుండు వీండు, దధిముఖుం డనియెడి•తరుచరుండు
దక్షిణదిశ రోయం • దరలి పోయినయంగ,దాదులు చనుదెంచి • మోదమునను
మధువనంబునంజొచ్చి•మధు వంతయుం ద్రావి,యిచ్ఛావిహారంబు•నెలమిందలంపు
చున్నవా రంట యందు • నూహింప నివి యెల్ల,నకృతకృత్యుల చేత•లనంగ రాదు

తే. వనముం జొచ్చిన యప్పుడె • వారు కార్య,సాధకతం గ్రాలు చుండుట • సత్య మయ్యు
చూడంబడె దేవి, సత్యంబు • సుమ్ము హనుమ,చేత నే యది యితరుల•చేతం గాదు.

కం. ఈకార్యము సాధింపంగం, జేకుఱుం బావనికె యొరుల•చే నిదియౌనే
యాకపివరున కెశక్తియు, ధీకలిమియు శ్రుతము తెంపు • తేంకువ గలుగున్. ౧౩౭౪

ఉ. మంత్రి జాంబవంతుం డంట • మానుగ వానరకోటికిఁ హనూ
మంతుండు రక్షకుం డంట, స•మానవిహీనబలాఢ్యుం డంగదుం
డింతకు నేలినాతం డంట •యిట్టిరు పూనినకార్య మొక్కయా
వంతయు మొక్కపోనె? ఫల•వంతమ యౌ టది యేమి చోద్యమో? ౧౩౭౫

కం. అంగదుం డాదిగం బ్రముఖులు, భంగించిరి మధువనంబు • వారింపంగాం
జెంగటి కేగిన జానుల, నంగంబుల నలియ దంచి • రంట యాకపులన్. ౧౩౭౬

చం. వనజదళాయతాక్షిం గని • వచ్చినవారలు వారు కాని చో
వనమును బ్రహ్మదత్తమును • వారలె కన్నుల నైనం జూడంగాం
జనియెడివారు? నాంగ శ్రుతి•సౌఖ్యదవాక్యము లాలకించి యా
యినకులదీపకుల్ పరమ•హృష్టతం దుష్టి వహించి రంతటన్. ౧౩౭౭

→ సుగ్రీవుండు కపులకుం ద్వరగ రం డని దధిముఖుచే వార్తం బంపుట. ←

చం. ఇనజుండు తోంటవాని కని•యెం గపివల్లభ! నీదువాక్యముల్
వనచరు లావనంబునను • వారక గ్రుమ్మరి రంచు వింటచే
ఘనముద మయ్యె, సాధితను•కార్యులు మన్నన కర్హులే కదా?
గనుక క్షమించితిం గపులం • గానంగ నేగుము పల్కు మివ్విధిన్. ౧౩౭౮

కం.హనుమంతుఁడు లోనుగఁ గల,వనచరవర్యులచరిత్ర ♦ వసుధాతనయం
గనుటను వారిప్రయత్నము, వినఁ గోరితి నృపులతోడ ♦ వే రం డనుమా. ౧౩౪౯

కం.అని చెప్పి సంప్రహృష్టుల, ఘనముత్సంఫుల్లనయన♦కంజుల నృపులన్
గని పులకితగాత్రుండై, యినజుఁడు కార్యంబుసిద్ధి ♦ కెంతయుఁ బొంగెన్. ౧౩౫౦

## ↞ అంగదాదులు సుగ్రీవుకడకుఁ బోవుట. ↠

కం.తరణికులోద్ధారకులకుఁ, దరణితనూజునకు మ్రొక్కి ♦ దధిముఖుఁ డరిగెన్
బరిచరయుక్తుం డగుచును, దరణిపథంబున యథాగ♦తత్వరితమునన్. ౧౩౫౧

సీ. మధువనంబున డిగ్గి ♦ మధువారి మూత్రించి, కైపేది లేచిన♦కపులఁ గాంచి
యంగదుఁ జేరంగ ♦ నరిగి యంజలి మోడ్చి, రోషింపకయ్య మా♦దోషమునకు
నజ్ఞానవశమున ♦ నడ్డగించిరి వన,పాలురు మిమ్ము నృ♦పాలతనయ
యువరాజ! నీవ యీ♦యుద్యానమున కెల్ల, ప్రభుఁడవు మూర్ఖత♦బలిమిఁ జేసి

తే. చేసితిమి నేరమును మదిఁ ♦ జేర్ప కీవు; మమ్ము క్షమియింపు మీరు వ♦నమ్ముఁ జేర
నేగుదెంచుట నీదుపి♦తృవ్యునకును[1], నేను బోయి వచించితి ♦ మానసీయ. ౧౩౫౨

కం.దోషంబుగ నేఁ జెప్పిన, భాషణముల నాలకించి ♦ పతి యది యేమో
రోషింపఁడు మీపై సం,తోషంబున వేగ రమ్ము♦నుచుఁ జెప్పు మనెన్. ౧౩౫౩

ఉ. ఆకపిమాట లెల్ల విని ♦ యంగదుఁ డిట్లను వానరాళితో
నీకథ లెల్ల రాఘవకు♦లేంద్రుఁడునున్ విని యుండునే కదా
ప్రాకటలీలఁ దేనియలఁ ♦ ద్రావి శ్రమంబును దీర్చుకొంటి మిం
కేకరణీయ మిందుఁ గల ♦ దేగఁగ నొఁ బినతండ్రిఁ జూడఁగన్. ౧౩౫౪

కం.మీ రెల్ల రెట్లు చెప్పిన, నారీతి నొనర్చువాఁడ ♦ నగచరులారా!
యారయఁ దత్పరతంత్రుఁడఁ, గారియముల సందియంబు ♦ గలదే దీనన్. ౧౩౫౫

కం.యువరాజను మీ కెల్లర, కవుదుమగా కేమి దాన ♦ నాజ్ఞాపింపన్
దవుదునె? కృతకర్ముల మిము, నవునే పీడింప రిత్త♦యాజ్ఞలచేతన్? ౧౩౫౬

చం.అన విని వార లెల్లరుఁ బ్ర♦హర్షమునం బ్రభు వెవ్వఁ డీగతిన్
వినయము దోఁపఁ బల్కుఁ, బృథి♦వీపతి నంచును భాగ్యనష్టచే
తనుఁ డయి తాన సర్వ మని ♦ దర్పముఁ జూపును గాక యన్యుఁ డి
ట్లనునతఁ డున్నె? భావిశివ♦తార్హతఁ[2] దెల్పెడి నీవినీతియే. ౧౩౫౭

కం.నీవినిర్దేశము లేకదు, గేనియు నటు పెట్టఁ జాల ♦ మెల్లరము నృపా
లా! నీచెప్పినయట్టుల, వానరపతిఁ జూడఁబోవ ♦ వల నగు ననినన్. ౧౩౫౮

ఉ. మంచిది లెం డటన్న విని ♦ మానుగఁ గీశులు మింటిజాడ లం
ఘించి జవాన యంత్రమున ♦ క్షిప్తములై చనుకొండ లట్టు ల
భ్యంచితలీల నేగిరి మ♦హాంబుదసంఘము లట్లు గర్జలన్
నించుచు; రామచంద్రుఁ డట ♦ నీరజలోచనవార్త రామికిన్ ౧౩౫౯

---

[1] పితృవ్యుఁడు = పిన్నతండ్రి. [2] భావి...ర్హత = రాఁగలమేలునకు యోగ్యత.

### సుగ్రీవుఁడు శ్రీరామునకు ధైర్యోక్తులు చెప్పుట.

సీ. తపియింపఁ గనుఁగొని ♦ తపనతనూభవుం, డూఱార్చి యిట్లను ♦ నీరజాక్షు
వీరలు చూచిరి ♦ వారిజాతాక్షిని, సందియం బేమియు ♦ నొంద వలదు
గడువు దాఁటియు నన్నుఁ ♦ గానఁగ వత్తురే, కార్యంబు సాధింప♦కయ నృపాల!
యంగదుం డంతటి♦యుసదయే వరశౌర్య, తేజుఁడు రిత్త యే♦తేరుటకును?

తే. గార్యమును జేయకయుఁ బ్లవ♦గప్రవరుఁడు, తండ్రిదాతలచే రక్షి♦తంబు నైన
నామధూద్యానరత్నంబు♦ నేమి మొగముఁ, బెట్టుకొనిచొచ్చునదభీతిఁ♦ గొట్టుకొనఁగ.

తే. ఊఱడిల్లుము రఘువర! ♦యూఱడిల్లు, సంశయము మానవయ్య కౌ♦సల్యతనయ!
చూడఁబడె దేవి, నిక్కంబు ♦ నుమ్ము హనుమ, చేతనే యది యితరుల♦చేతఁగాదు.

కం. ఈ కార్యము సాధింపఁగఁ, జేకుఱుఁ బావనికె యొరుల♦చే నిది యౌనే?
యాకపి[1] యెడఁ దేజమునలె, నీకపియెడ శక్తిబలము ♦ ప్రేక్షయు ధ్రువమౌ. ౧౩౯-౨

ఉ. మంతిరి జాంబవంతుఁ డఁట ♦ మానుగ వానరకోటికిం హనూ
మంతుఁడు రక్షకుం డఁట, స♦మానవిహీన బలాఢ్యుఁ డంగదుం
డింతకు నేలినాతఁ డఁట ♦ యిట్టిరు[2] పూనిన కార్య మెన్నఁ డా
వంతయు మొక్కపోనె? యివు ♦ డార్తిఁ దొఱంగు మతుల్యవిక్రమా. ౧౩౯-౩

### హనుమంతుఁడు శ్రీరామునకు సీతాదేవిస్థితిఁ దెలుపుట.

సీ. ఇటు ముచ్చటింపఁగ ♦ నింతలోఁ గార్యసి,ద్ధిని దెల్పురీతి గ♦ర్జనము లమరఁ
గిష్కింధ కేతెంచు♦కీశుల కిలకిలా,శబ్దంబు మింట నా♦సన్నమైన
నది విని సుగ్రీవుఁ ♦ డాయతాంచితవాలుఁ, డై యుండె వానరు ♦ లంగదాంజ
నేయపురస్సరు ♦ లై యరుదెంచి రా,ఘవకపినాథాంతి♦కమున డిగిరి

తే. యంత శిరమున మ్రొక్కి వా♦తాత్మజుండు
రామవిభునకు నియతయుఁ ♦ బ్రాణయుక్త[3]
దేవి[4] యన ఫలియించెఁ బో ♦ భూవరేంద్ర
కార్యమని సంతసం బందెఁ ♦ గపివిభుండు. ౧౩౯-౪

ఆ. ప్రీతియుక్తు లగుచు ♦ శ్రీరామలక్ష్మణుల్, కడుఁ బ్రియంబుఁ దెలుపు♦గంధవాహ
నాత్మజాతుఁ గనిరి ♦ సాదరాలోకన,పంక్తు లతనిమీఁదఁ ♦ బరఁగఁ జేసి. ౧౩౯-౫

ఉ. రాముని లక్ష్మణుం బ్లవగ♦రాజును జేరి నమస్కరించి శా
ఖామృగపాళి భూమిసుత♦గాధ వచించెను లంక నామె సు

[1] కపి = సూర్యుఁడు. [2] ఇట్టిరు = ఇట్టివారు. [3] నియత - శీలముగలది, ప్రాణయుక్త - ప్రాణముతో నుండునది. సీత ప్రాణముతో నుండియు శీలముచెడి యుండెనేని చచ్చినదానితో సమానయే కావున మొదట నియత యని హనుమంతుఁడు చెప్పెను. [4] మొదట దేవి యను పదముఁ జెప్పిన సీత భ్రష్టురాలయ్యెనని చెప్పెనో మరణించెనని చెప్పెనో యని యంతలో రాముఁడు పరితపించునని ముందు నియత, ప్రాణయుక్త యనిచెప్పి తరువాత దేవి యని చెప్పెను.

త్ర్యామవిరోధిమందిరధ♦రం జెఱ నుండుట, రాక్షసాంగనా
భీమబిభీషికల్,[1] గడువు ♦ పెట్టుట, తత్పతిభర్తృభక్తియున్. ౧౩౯౬

ఉ. జానకి సేమ మంచుఁ గపిసత్తము లాడఁగ రాఘవుం డనున్
వానరులార! సీత యెట ♦ వర్తిలు చున్నది? నాయెడాటమం
దేనియతిం జరించు! నిది ♦ యెల్లను జెప్పుఁడ టన్నఁ నంజనా
సూనుని నీవు పల్కు సతిఁ ♦ జూచినవాఁడ వ టన్నవానరుల్. ౧౩౯౭

కం. హనుమంతుండును వసుధా,తనయామణి యుండు దెసకుఁ ♦ దన్వీమణికిన్
సనయంబుగ శిరమున వం,దన మొనరిచి[2] యిట్టు లనియె ♦ దశరథసుతుతోన్.

→ { హనుమంతుఁడు శ్రీరామునకు సీతాదేవి లంకయం దున్న దని తెల్పుట. } ←

సీ. శతయోజనాయత♦సాగరంబును దాఁటి, భూమిజఁ గనుకోర్కిఁ ♦ బోయినాఁడ
నచట దుష్టాత్ముఁ డా♦నసురారి రావణుం, డేలెడిలంక య ♦ నోప్పలు గలదు
ఆరాక్షసేశ్వరు♦నంతఃపురంబున, స్వాభిలాషంబు నీ♦యంద యునిచి
జీవించి యుండెడి♦సీతను గంటి వి,రూపరక్షస్త్రీలు ♦ రూక్షముగను

తే. మీఁద మీఁదను దర్జింప ♦ మిడుకు చున్న, దతివ దుఃఖ మెఱుంగని♦యట్టిసౌఖ్య
శీల యిం తంత యనుచును ♦ జెప్ప రాని,శోకమునఁ గుందు చున్నద♦శోకవనిని.

సీ. రావణునంతఃపు♦రంబునఁ జెఱఁ జిక్కి, రాకాసిమూఁకలు ♦ రక్ష సలుప
నొకటిగఁ బెనఁగొన్న ♦ యొంటివేనలితోడఁ, గటికినేలను బండి ♦ కష్టపడుచు
ననవరతంబుఁ ద్వ♦ద్ధ్యానరతాత్మయై, యడజడి హేమంత♦మందు నళిని
నాఁగ వివర్ణయై ♦ నవసి రావణుకోర్కి, వృథచేయ దేహంబు ♦ విడువఁ దలఁచి

ఆ. నిశ్చయించి యున్న♦నెలఁత నెట్టెట్టులో, యేను గాంచి యామె ♦ కెఱుకపడఁగ
నెలమిఁ బొగడినాఁడ ♦ నిక్ష్వాకువంశవి,ఖ్యాతి దేవి నమ్మఁ ♦ గలుగుటకును.

కం. ముచ్చటలను సర్వార్థము, లచ్చపలాక్షికిని జెప్ప ♦ నగచరపతితో
నచ్చపుస్నేహము మీకిట, నచ్చుపడుట కబ్జనేత్ర ♦ హర్షం బందెన్. ౧౪౦౧

→ హనుమంతుఁడు శ్రీరామునితో సీతాదేవి వాక్యంబులు దెల్పుట. ←

ఉ. నిన్నుమహానుభావ! కడు♦నిర్మలచిత్తమునన్ స్మరించుచున్
సన్నుతభక్తిశీలములు ♦ సాధ్విగుణంబుఁ దపంబుఁ బాయ కం

[1] బిభీషికల్ = బెదిరింపులు. [2] హనుమంతుఁడు సీతను జూడకముందు రాముఁడు ఋష్యమూకంబునఁ బడు విరహతాపముఁ జూచి యింతటివాఁడు గూడ నొకస్త్రీకై యేడ్చుచున్నాఁడే యేమి యీయన జితేంద్రియత్వమని తలఁచుచుండెను. సీతను జూచినపిమ్మట నామెను దేవతగా భావించుటయే గాక రాముఁడు రావణాసురుని జంపుటయందు నిమిత్తమాత్రుఁడే యనియు నామె మహిమచేతనే లంకయంతయు ఘుండే దగ్ధమైనదనియుఁ దలఁచినవాఁ డాయెను. ఆకారణముచే రామునియందుకంటె సీతయందు హనుమంతునకు యెక్కువ భయభక్తులు.

దున్నది, నేను జూచితి,[1] ర॥ఘూత్తమ! నీకు నభిజ్ఞ చిత్రకూ
టోన్నతసీమఁ గాకికథ ॥ యొండు వచించియు నాకు నిట్లనెన్. ౧౪౦౨

కం. హనుమా! యిచ్చటఁ జూచిన, దనుమా సర్వంబుఁ బురుష॥హార్యతునితో
నినకులదీపకుతో నని, నను నాజ్ఞాపించెఁ గంజ॥నయన నృపాలా. ౧౪౦౩

కం. మిక్కిలియత్నముతోనే, నక్కఱ రక్షించితిని మ॥హామణి యిది నీ
వక్కాకుత్థ్సున కిమ్మా, యక్కపినాథుండు వినఁగ ॥ హనుమా యిట్టుల్. ౧౪౦౪

ఆ. గండభాగమునను ॥ గరఁగిపోఁ దిలకంబు, స్వేదబిందువులను ॥ జిత్రరీతి
మణిసిలనునొకంట ॥ మమతమీఱఁగ నీవు, తిలక ముంచుటయును॥దలఁపవలయు.

ఉ. దాఁచితి నీజలోద్భవము ॥ దాశరథీ! యిది నీమనోంబుజం
బాఁచి కొనంగఁ జాలుట మ॥హాత్మ! భవద్విరహానలంబు నఱ
గ్రాఁచెడివేళ నిగ్గనిన॥కైవడి దీనిని గాంచి పొంగుదుఱ
న్నైఁచుట దోఁప దింక రఘు॥చంద్రమ! యియ్యది నీకుఁ బంచితిన్. ౧౪౦౬

కం. నెల యొక్కటి యెటు లేనియు, నిలుపుదుఁ బ్రాణంబు మేన ॥ నీరజనయనా!
నెల కావల బ్రదుకను సోఁకులచేతికిఁ జిక్కి నిజము ॥ కువలయనాథా! ౧౪౦౭

చం. అనుచుఁ గృశాంగి ధర్మరత ॥ యాశరసాధనిరుద్ధ ధారిణీ
తనయ మృగాక్షి పల్కెను య॥థాస్థితి సర్వము నీకుఁ దెల్పితిఁ
వనధిఁ దరింపఁ బూనుము ది॥వాకరవంశమణీ! యొ కేని యం
చును రతనంబుఁ జేత నిడె ॥ సొంపుగ వారలు విశ్వసింపఁగన్.[2] ౧౪౦౮

↞ శ్రీరాముఁడు సీతాదేవిచూడామణిని జూచి దుఃఖించుట. ↠

కం. రాముఁడు తన్మణిఁ గైకొని, ప్రేమంబున నక్కుఁ జేర్చి ॥ ప్రియసోదరుతో
భామినిఁ దలంచి దుఃఖోద్దామతఁ బలవించి సూర్య॥తనయున కనియెన్. ౧౪౦౯

సీ. సుగ్రీవ! యీదివ్య॥చూడామణిని జూడఁ, జూడ నామనము లే॥దూడఁ గన్న
ధేనువు చేఁపెడి॥తెఱఁగునఁ గరఁగెడి, త్సాతనూభవకు మా॥మామగారు
వఱలుప్రేమమున ను॥ద్వాహవేళను శిర, మం దిది గూర్ప న॥త్యంతకాంతిఁ
దేజరిల్లుచు నుండె ॥ దివ్యంబు సజ్జన,పూజితం బంబుసం॥భూత మైన

ఆ. దీని నధ్వరమునఁ ॥ దృప్తుఁడై శక్రుండు, జనకునకు నొసంగె ॥ సారదయను
మణిని జూచినంత ॥ మామామ జనకుని, నాత్మజనకుఁ గన్న ॥ యట్టు లయ్యె.

కం. ఆతరుణీమణిశిరమున, భాతిం జెలువారు దీనిఁ ॥ బరికింపఁగ నా
కోతరణిజ! భూసుతయే, ప్రీతిం జను దెంచినట్టి॥రీతిగఁ దోఁచెన్. ౧౪౧౧

[1] నేను గన్నులారఁ జూచి చెప్పుచున్నాను గాని యితరులు చెప్పిన ముచ్చటలను నేను జెప్పలేదు.

[2] ఆత్మశ్లాఘగా నుండుననియుఁ గార్యనివేదనమున కనావశ్యకమనియు రామునకుఁ గావలసినది సీతా వృత్తాంతమే గావునఁ దాను బడినకష్టము, చేసినకార్యము నొకటియేనియుఁ జెప్పినవాఁడు కాఁడు.

ఉ. వారక దప్పిచే నలఁగు♦వానికి నీరము పోయురీతిగా
సారెకు సీతవాక్యముల ♦ సౌమ్యగుణా! వచియింపవయ్య, యా
వారిజనేత్ర లేకయును ♦ వారిజ మీారతనంబుఁ గంటి, నా
కారయ నింతకంటెను మ♦హత్తరదుఃఖము లున్నె లక్ష్మణా! ౧౪౧౨

చం.ఒకనెల దాఁకఁ బ్రాణమున ♦ నుండఁగఁ జాలినయేని యింక జా
నకి చిరజీవ, నేనొకక్ష♦ణం బసితేక్షణ లేక మేనిపాం
దిక బ్రదుకంగ నేర, సుమ♦తీ! ననుఁ దోడ్కొని పోఁగదే ప్రియా
నికటముఁ జేర, వార్తను వి♦నిన్ వశమా యిట నాకు నిల్వఁగన్? ౧౪౧౩

మ. అకటా! యెట్లు వసించునో కదె మదీ♦యాత్మేశ భీశీల యా
వికటాలాపభయంకరాస్యసురవి♦ద్వేష్యాళిమధ్యంబునన్;
బ్రకటాభ్రావృతశారదేందుసమ మై ♦ పద్మాక్షి నెమ్మోము త
న్నికటానేకపలాశనావృతము నై ♦ నిస్తేజ మై యుండదే? ౧౪౧౪

కం.హనుమా! సతినుడు లన్నియు, ననుమా మందునను బ్రదుకు♦నాతురరీతిన్
విని బ్రతుకువాఁడ నన్నే, మని మధురాలాప మధుర ♦ యనె మచ్చ్యుత యై.

## హనుమంతుఁడు శ్రీరామునకుఁ గాకాసురవృత్తాంతం బభిజ్ఞానంబుఁ దెలుపుట.

కం.అని రామచంద్రుఁ డడిగిన, హనుమంతుఁడు భూమికన్య ♦ యాడిన వెల్లన్
వినిచె సతి చిత్రకూటం,బున వృత్తము గుఱుతుఁ జెప్పెఁ ♦ బురుష రేణ్యా! ౧౪౧౬

కం.నీతోడుత నిద్రించుచు, సీతాసతి మున్నె లేవఁ ♦ జెచ్చెరఁ గాకం
బాతరుణీస్తనమధ్యము, శాతనఖాగ్రమునఁ జీరె ♦ సహసోద్గత మై. ౧౪౧౭

కం.ఆర్యజనోత్తమ! నీవును, బర్యాయంబునను నీదు♦పడఁతుకతోడ సౌ
కర్యంబుగ నిద్దుర గొన, ధైర్యంబునఁ బక్షి మరలఁ ♦ దద్దయు నేఁచెన్. ౧౪౧౮

కం.మాటికి మాటికి ముక్కునఁ, గాటు పడం బొడువఁ బొడువఁ ♦ గాకము నీసీ
మాటిఁ[1] దదుద్గతరక్తము, నూటిగ నీమీాఁదఁ బడియె ♦ శుద్ధచరిత్రా! ౧౪౧౯

ఉ. పాపపుఁబుల్గు సీత కిడు♦బాధ సహింపఁగ లేక నిద్దురన్
లేపెను గాదె రామ! నిను ♦ లేచి నృపాల! స్తనాంతరంబునన్
జేపడియున్న కాటుఁ గని ♦ చిత్తమునం గన లూని యెవ్వఁ డీ
పాపముఁ జేసెఁ జెప్పు మిఁకఁ ♦ బైదలి వానిని రూపు మాపెదన్. ౧౪౨౦

ఆ. రోష వేగమునను ♦ రోఁజెడిపంచవ, క్రంబుపాముతోడఁ ♦ దవిలి యెవ్వఁ
డాడుకొనఁగఁ జొచ్చె ♦ నంబుజలోచన!,యనితి వపుడు నీకు ♦ నభిముఖముగ.

[1] సీమాటి = ఉత్తమస్త్రీ.

ఆ. రక్తసిక్తనఖర♦యుక్త మాకరటంబుఁ,[1] గనితి కనినయంతఁ ♦ గాకిరూపుఁ
గొనినయట్టిశక్ర♦కొమరుండు గాడ్పునఁ, బర్వతంబు డిగ్గి ♦ పాఱఁ దొడఁగె.

సీ. అది చూచి నీవు భృ♦శాగ్రహావశుఁడవై, యాయరిష్టముపట్ల ♦ నదయుఁ డగుచు
దర్భాసనంబున ♦ దర్భ యొక్కటిఁ దీసి, బ్రహ్మమంత్రంబునఁ ♦ బ్రజ్వరిల్లఁ
జేసి మాకళిమీఁద ♦ వేసిన నదియును, నంబరపథమున ♦ నరుగు చున్న
బలిభుక్కు వెన్నంటి ♦ పఱవఁ దొడంగెను, గాకియు వెఱ మూఁడు♦లోకములను

తే. సంచరించుచుఁ బలువుర ♦ శరణు వేఁడెఁ
గన్నతండ్రియు సురలును ♦ ఘనమహర్షి
చయములును దాము గావంగఁ ♦ జాల మనఁగ
మరలి చనుదెంచి దేవ నిన్ ♦ శరణుఁ జొచ్చె. ౧౪౨౩

సీ. శర ణంచు ధరణిపై ♦ సాఁగిలఁ బడినట్టి,వాయసుఁ గని వాఁడు ♦ వధ్యుఁడయ్యుఁ
జంపక కాచితి ♦ పెంపారుకరుణచే, దిక్కెవ్వరును లేక ♦ దీనుఁ డగుచు
శరణాగతుం డైన♦జాల్ము నాతనిఁ జూచి, వ్యర్థంబు పోదు బ్ర♦హ్మాస్త్ర మేమి
చెప్పెద వనినను ♦ జేకొన నిమ్ము నా,కుడికంటి ననియె నా♦చెడుగు కాకి

ఆ. పెడిద మైనశరము ♦ కుడికన్ను హరియించి, చనియెఁ జనియెఁ గాకి ♦ చావు దప్పి
కన్ను లొట్ట వోవఁ ♦ గాకుత్స్థకులున కా,దశరథునకు భక్తి♦దండ మిడుచు. ౧౪౨౪

కం. ఈవిధమున నస్త్రకళా,కోవిదతతి మేటి సత్త్వ♦గుణధాముఁడు స
ద్భావుఁడు సచ్ఛీలుం డే,లా విడువం డస్త్ర మొండు ♦ నసురావళిపై? ౧౪౨౫

మ. వరదివ్యాస్త్రవిదుం డ దేల యసుర♦వ్రాతంబుపై నంపఁ డు
ద్ధురఘోరాస్త్ర మొకండు! దేవదనుజ♦స్తోమాహిగంధర్వులే
దిరులై చూడఁగ లేరు సంగరధరి♦త్రిన్ రామునిన్; నాపయిం
గరుణాలేశమె యున్నఁ బంక్తివదనున్ ♦ ఖండించుఁ గా కింక నేన్. ౧౪౨౬

ఉ. అన్నయనుజ్ఞఁ బొంది యహి♦తాంతకతుల్యుఁడు లక్ష్మణుండు నే
న న్నదియేల కావఁగ మ♦నంబున నెంచఁడు? సర్వభుగ్జరు
త్సన్నిభు లన్నదమ్ములు న♦జయ్యులు దక్షు లుపేక్ష సేత కో
యన్న! నిజంబు మత్కృతమ♦హత్తరపాపము హేతు వెన్నఁగన్. ౧౪౨౭

## సీతాదేవిని దా నూరార్చినవిధంబు హనుమంతుఁడు శ్రీరామునకుఁ దెలుపుట.

కం. అని దీనాలాపంబులఁ, గనుఁగవ బాష్పంబు లురలఁ ♦ గళవళ పడుచున్
జనకజ పల్కిన విని యో,జనవర! యి ట్లంటి సతికి ♦ సాంత్వవచనముల్. ౧౪౨౮

[1] కరటంబు - మాకళి - అరిష్టము - బలిభుక్కు = ఇవి కాకికిఁ బేర్లు.

మ. వినుమీ సత్యముఁ జేసి పల్కెదను దే♦వీ! రామభద్రుండు త్వ
జ్జనితార్తిన్ విముఖుండు సర్వమునకున్ ♦ సంతప్తుఁడై కుందెడిన్
గని యాయున్నయవస్థ లక్ష్మణుఁడు శో♦కత్యుబ్ధుఁ డయ్యెం జుమీ
కనితి న్నిన్నిపు డెట్టకేల కిట, నిం♦కం జాలి నీకేటికిన్. ౧౪౨౯

కం. ఇడుమలఁ గుందెడికాలము, గడచెన్ దుఃఖాంత మిపుడ ♦ కనియెద వాత్రం
పడుచు విభు లెదురు చూచుచుఁ, బడఁతీ! యున్నారు లంక ♦ భస్మము సేయన్.

కం. ఆహవమున సహబాంధవు, ద్రోహిని రావణు వధించి ♦ ద్రుతగతిని జగ
న్మోహిని నినుఁ గొని పురి కుత్సాహంబునఁ బోవు రామ♦చంద్రుఁడు ప్రీతిన్.

ఉ. రాముఁ డెఱుంగుగు ర్తొకటి ♦ రాజసుతా! యిదు మంతె చాలు నా
భామిని నాల్గుదిక్కులను ♦ బాఱఁగఁ జూచి నిజప్రవేణికా
సీమను గూర్పనైనమణిఁ ♦ జీరచెఱంగుననుండి[1] విప్పి స
త్ప్రేమను నాదుచేత నిడ ♦ దేవిగొ నే నిఁకఁ బోయి వత్తునే. ౧౪౩౨

చం. అని నమితోత్తమాంగమున ♦ నామె పదంబుల వ్రాలి లేవ న
య్యనఘుయు నాదువర్తనము ♦ నంబుధి దాఁటఁగ నుత్సహించుటల్
గని కనుదోయి బాష్పములు ♦ గ్రమ్మఁగ గద్గదకంఠ యై ధరా
తనయ మదాస్యముం గనుచు ♦ దైన్యము దోఁపఁగఁ బల్కె నీగతిన్. ౧౪౩౩

← సీతాదేవి సందేశవాక్యములు హనుమంతుఁడు శ్రీరామునకుఁ దెలుపుట. →

కం. హనుమా! కుశలం బడిగితి, ననుమా శ్రీరాము నతని♦యనుజు సుమిత్రా
తనయు సహామాత్యుని నిన, తనుజాతుని నందు నున్న♦తక్కినవారిన్. ౧౪౩౪

కం. అన్నా! రాఘవుఁ డెట్టులు, నన్ను విపత్సాగరంబు♦నం జెడకుండన్
జెన్నారఁ బ్రోచు నాగతి, మన్నన మెయిఁ బలుక వన్న ♦ మఱవకు మన్నా!

కం. ఇన్నిచరాక్షసావళి, నన్ను భయముపఱుచువిధము ♦ నానావ్యసనా
పన్నత నేఁ గుందెడిగతి, విన్నప మొనరింపు ఱ్రోవ ♦ వెలయుత శుభముల్.

కం. ఈవిధి మీయార్యామణి, భూవల్లభ! భృశవిషాద♦పూర్వంబుగ సీ
తావరవర్ణిని పలికెను, నీ వాసతి కుశల యనుచు ♦ నెఱినమ్ము మదిన్. ౧౪౩౭

← హనుమంతుఁడు సీతాదేవితోఁ దనకు నైన సంభాషణముఁ దెలుపుట. →

కం. నాపయి నీస్నేహముచే, నీవంపినవాఁడ ననెడి♦నెఱనమ్మికచే
భూపాలోత్తమ! జానకి, యాపోవనిరక్తి నిట్లు ♦ లనియెన్ నాతోన్. ౧౪౩౮

---

[1] సీత కొన్నిసొమ్ములను బాఱవైచి కొన్ని చెట్టుకొమ్మలకుఁ దగిలించెను గాని యీ చూడామణి సముద్రమునందుఁ బుట్టి దివ్యమై యింద్రదత్తమై యుండుటచేత బయటికిఁ గనఁబడిన రావణుఁడు హరించునేమో యని దానిని మాత్రము చీరకొంగున కావలియున్న రాక్షసస్త్రీలకుఁగూడఁ దెలియకుండ దాఁచియుంచెను.

కం. రావణు వధించి రాఘవ, భూవరుఁ డెటు తోడుకొనుచుఁ ♦ బోవునొ నన్నుం
నీ వాగతి నిట నాగతి, వావిరి వినిపింప వలయు ♦ వాయుతనూజా! ౧౪౩౯

కం. నాపలుకు నీకు సమ్మత, మై పొసగిన యేని శత్రు ♦ హరణసమర్థా!
యీపూఁట నిలిచి మఱుఁగున, రేపటఁ బోరాదె శ్రమము ♦ వీడి లెడి నీకున్

కం. ఓ పావని! నీసన్నిధి, ప్రాపున ధృతిఁ గూరి యల్ప ♦ భాగ్యను క్షణమేఁ
నీపుణ్యంబున శోకము, తాపంబుఁ దొఱంగి బ్రదుకు ♦ దానఁ గపీంద్రా! ౧౪౪౧

ఉ. పోయెద వేని పొమ్ము రఘు ♦ పుంగవుఁ జేరఁగ, నీవు గ్రమ్మఱన్
వాయుజ! వచ్చునందనుకఁ ♦ బ్రాణము లుండునొ యుండవో సుమీ
యీయెడలందు సందియము ♦ యెంతయు వేఁగెడు నాకు నిన్నునున్
బాయుట గల్గ నేమి గని ♦ ప్రాణము నిల్చునొ నీవ చెప్పుమా. ౧౪౪౨

కం. నీయందును నీకును దో, డై యరుదెంచినకపీంద్రు ♦ లందును నాకున్
బాయనిసందేహం బో, వాయుజ! నాకనుల మ్రోల ♦ వర్తిలఁ దొడఁగెన్. ౧౪౪౩

చం. హరివర! ఋక్షసైన్యములు ♦ నానృపవర్యతనూజు లేని దు
స్తరజలరాశి దాఁట నెటు ♦ చాలుదు రన్న! తలంచి చూడఁగా
గరుడుఁడు నీవు మారుతుఁడు ♦ గాక మఱెవ్వరు భూతకోటిలో
వరజవ మొప్ప దాఁటఁ గల ♦ వారలు గానఁగరారు మారుతీ. ౧౪౪౪

కం. కనుగొలఁది నసాధ్యం బౌ, పని యనుచుం దోఁచెఁ గార్య ♦ పద్ధతులను నీ
కననియది లేదు దీనికి, హనుమా! నీ వనుమ విన స ♦ మాధానంబున్. ౧౪౪౫

కం. నీ వొకఁడవె యీకార్యము, పావని! సాధింప శక్తి ♦ పరుఁడవు సుమ్మీ
నీ వొకఁడవె యీకీరితి, చే విలసిల్లంగఁ గలవు ♦ శిక్షితవైరీ! ౧౪౪౬

కం. బలములతో నిచటికి రఘు, కులతిలకుఁడు వచ్చి కలనఁ ♦ గూల్చి దశాస్యున్
గెలుపొంది నన్నుఁ దనపురి, కలవునఁ గొని చనిన యేని ♦ యశ మది గూర్చున్.

కం. వనమున నే నుండఁగఁ దల, మునుకలు నగు తనదుభీతి ♦ మ్రుచ్చిలి తెచ్చెన్
దనుజుఁడు నను నావిధమునఁ, గొనిపోవుట యర్హమా ర ♦ ఘుగ్రామణికిన్?

కం. ప్రకటశితనారాచా, నీకంబునఁ జలిపి లంక ♦ నీఱుగఁ గడిమిన్
గైకొని నన్నేగినచోఁ, గాకుత్స్థున కదియె తగిన ♦ కార్యము సుమ్మీ. ౧౪౪౯

తే. పరమశూరుండు రాముండు ♦ భండనమున
నతనిమగఁటిమి కనురూప ♦ మైనదాని
యోజన యొనర్చి చెప్పుమా ♦ యోజ మీఱ
వనచరకులావతంస! నీ ♦ వనుచుఁ బలుక ౧౪౫౦

ఉ. దేవి! కపీంద్రభల్లుకత • తిప్రభువర్యుఁడు శౌర్యశాలి సు
గ్రీవుఁడు నీనిమిత్తము ప్ర • కృష్టబలంబులతోడఁ దోడ్పడం
గా వెస వచ్చు నాతనికిఁ • గైవస మై యసమానవిక్రముల్
దేవనిభుల్ మనోజవులు • దిగ్గగనాటులు శత్రుమర్దనుల్. ౧౪౫౧

కం. ఎంతగడునుఁబని నైన ర,వంతయు వెత లేక సలుప • నగువారలు వి
క్రాంతిని సాబ్ధిధరావని, గంతున వలగొనెడివారు • గగనాధ్వగులై. ౧౪౫౨

కం. నాకంటె గొప్పవారును, నాకుఁ జరివారు గలరు • నగచరులచటన్
నాకంటె హీనుఁ డగుకపి, త్రిలోకన్యా! లేఁడు తీవ్ర • కరసుతునొద్దన్. ౧౪౫౩

కం. సేనే నినుఁ గాంచితి నఁట, యానిస్తులబలుల నేమి • యనవలయు నో కో
మానవపతి భూరిగుణా,హీనులఁ బంపండు పంపు • నితరుల మొదలన్. ౧౪౫౪

సీ. కావున నీవు శో • కంబు మానుము దల్లి, దుఃఖకాలం బెల్లఁ • దొలఁగి పోయె
నిదె పోయి నేఁ జెప్ప • ముదితులై క్రోఁతులు, వచ్చెద రొకగంతు • వైచి యిటకు
నావీఁపుపై నెక్కి • భూవిభుల్ శశిభాస్క,రులపోల్కి నీమ్రోల • నిలుచువారు
ఇటవచ్చి యీలంక • నెల్ల సాయకములఁ, దుత్తుమురుగఁ జోవఁ • ద్రుంచువారు
ఆ. రామచంద్రవిభుఁడు • రణరంగమం దిందు, సబలుఁ బంక్తికంఠు • సంహరించి
నిన్నుఁ దోడుకొనుచు • నెమ్మి నయోధ్యకుఁ, బోవువాఁడు పువ్వుఁ • బోణి చూడు.

కం. కనెదవు నఖదంష్ట్రాయుధ,ఘనవిక్రమవరుల దేవి • కపిసింహములన్
వినెదవు శైలాంబుదనిభ, వనచరగర్జలను లంక • వసుధాధ్రములన్. ౧౪౫౬

తే. కాననావాససమయంబుఁ • గడపి నిహత
వైరిరాముండు నీతోడ • వనజనేత్ర!
యలయయోధ్యను నభిషేక • మందఁ గనెద
వనుచు నమ్మించి దుఃఖంబు • నాఁపినాఁడ. ౧౪౫౭

తే. తతభవద్దుఃఖమ్మునకును • దరణిగోత్ర
వార్ధిచంద్రము యట్లు తా • బాధ పడుచు
శుభము నిష్టంబు నగునాదు • సూక్తి ధృతి నొ
సంగ శ్రీరామ వహియించె • శాంతి సీత. ౧౪౫౮

సుందరకాండంత పద్యములు.

కం. యతిమానసబిసజాలయ! యతమానజనార్థనిర్వ • హణసుసమర్థా!
నతసర్వభూతచయ! యిం,గితవిజ్ఞవర్య! విబుధ • కీర్తితచర్యా! ౧౪౫౯

పద్మనాభవృత్తము.

రామా! నతాంహోవిరామా! మునీంద్రాత్మ♦రామా! దయాసత్యధామా! నిశాట
స్తోమావళీభీమసంగ్రామసీమా! వి♦ధూమత్రిధామాభ తేజస్సుధామా!
రామాంబుముగ్ధామ! నీలోత్పలశ్యామ ♦ రాకేందుకామాభ సౌందర్యధామా!
సోమాదిముఖ్యామరారాధ్యనామా! వి♦శుద్ధాత్మభక్తావనోద్దామకామా! ౧౮౬౦

అంబురుహవృత్తము.

క్ష్మారమణీశరజాబ్జభవానన♦సారసాహితపద్యసం
వారసుశస్తనిజార్థిమహాద్భుత♦బాధధైర్యపరాక్రమా!
భూరిపయోనిధితారణకారణ♦భూతనిర్జరయానవ
చ్చారుతరాత్మసమాఖ్య! నిజాశ్రిత♦సర్వసౌఖ్యవిధాయకా! ౧౮౬౧

— గద్యము. —

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిం
దాయమాన మానసత్వ మహావైభవ వావిలి
కొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ సుబ్బరాయ
నామధేయప్రణీతం బైన శ్రీమదాంధ్రవాల్మీకిరామా
యణ మనునిర్వచనమహాకావ్యంబునందు
సుందరకాండము.

---

శ్రీ రామార్పణమస్తు.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్లో. నమోస్తు రామాయ సలక్ష్మణాయ, నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మభువే వరాయ, నమోస్తు వల్మీకభవాయ తస్మై.

---

౯౪-వ పుట ౭౬౦ ప. ౪-వ పాదము—

"సంత్రాసమునులేమి ♦ శాఖామృగేశ్వర, భాషింపఁదగుదవు" అనుదానిని
"సంత్రాసమునులేమి ♦ సమభిభాషింపఁగఁ, బావని! తగుదవు" అని సవరింపవలయును.

భాషించుట యనఁగా నీవెవ్వరనిన నీవెవ్వరని క్రొత్తవారివలె నేవో ముచ్చటలాడుట. అభిభాషించుట యనఁగాఁ బరిచితుల కుశలప్రశ్నాదికము. సమభిభాషించుట యనఁగా నెవ్వరేఱుంగని యంతఃపుర రహస్యములుగూడఁ జెప్పుట యని సంప్రదాయార్థము.



శ్రీః

శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

శ్రీ శారదాయై నమః.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము.

## యుద్ధకాండము.



ప! ప్రపద్యేడిత! దురి
తాపహా! కారుణ్యసీమ ♦ యరిజనభీమా!
తాపహరా! విధిహరనుత!
క్ష్మాపుత్రీలోల! రామ♦చంద్రనృపాలా! ౧

శ్రీరాముఁడు హనుమంతునిఁ బ్రశంసించుట.

కం. కలది కలయట్లు చెప్పిన, వలిముఖమణి గాడ్పుపట్టి♦వాక్యము లెల్లన్
జలజాక్షుఁడు రాముఁడు విని, యలరుమనంబునను నిట్టు ♦ లను నుత్తరమున్. ౨

కం. మనసుననే నన్యనకుం, బొనరింప నశక్య మగుచుఁ ♦ బొరి దుర్లభ మై
తనరు మహాకార్యముఁ దీ,ర్చెను హనుమకు నీడు జోడు ♦ క్షితిలోఁ గలరే? 3

కం. ఇ న్వాయుతనూజుఁడు గా, కవ్విహగాధీశ్వరుండు ♦ ననిలుండును గా[1]
కెవ్వరి కొకా సాధ్యం బగు, నవ్వారిధి దాఁటఁ దోఁపఁ ♦ డాత్మ నొకండున్. ౪

చం. అనిమిషయక్షరాక్షసమ♦హోహిచయంబుల కైనఁ జక్కఁగాఁ
గనుఁగొన రానిదాని, దశ♦కంధరపాలిత మైనలంకనుఁ,

[1] ఇ న్వాయుతనూజుండు గాక, విహగాధీశ్వరుఁడు గాక, యనిలుఁడు గాక యని యుండవలసి యుండఁగా విహగాధీశ్వరుఁడు ననిలుఁడు గాకయని యిరువురను గలిపి చెప్పుటచే వారిద్దఱొకయెత్తని హనుమంతుఁ డొకఁడే యొక యెత్తని భావము.

ఘనతరసత్త్వలక్ష్మిఁ జొరఁ♦గాఁ గను టెక్కఁడఁ? జొచ్చి నేనియున్
దనవునఁ బ్రాణముల్ గలుగఁ♦ దా మఱి వచ్చుట యేడ నెట్టెఁడున్? ౫

కం.బలవీర్యము లున్న మహా,బలసుతుతో నీడు వచ్చు♦వాఁడును గాఁడేన్
గలఁడే రక్షోరక్షిత, మలదుర్ధర్షంబు, లంక ♦ నటువలెఁ జొరఁగన్. ౬

కం.రవితనయభృత్యకార్యముఁ, బవమానసుతుండు దీర్చెఁ ♦ బ్రస్తవ్యగతిన్
సవరన నిజవిక్రమతు,ల్యవిధంబుగ బలముఁ జూపె ♦ ననురూపముగన్. ౭

తే. పతి సుదుష్కర మగుపనిఁ ♦ బంప భక్తిఁ, దనకుఁ జెప్పనిదైనను ♦ దదనుబంధ
మైనదానినిఘటియించు♦నట్టి భృత్య,వరునిఁ బురుషోత్తముండండ్రు♦పరమమతులు.

తే. భర్తచేత నియుక్తుఁ డై♦ పతికి హిత ము
టంచు నెఱిఁగియుఁ జెప్పఁ డ♦టంచు హెచ్చు
నాచరింపని యుక్తస♦మర్థభటుఁడు
మధ్యముఁడు నాఁగఁబడు సాధు♦మతులచేత. ౯

కం.పతిచే నియుక్తుఁ డై త,త్కృతిని సమర్థుండు నయ్యు ♦ భృత్యుఁడు శ్రద్ధా
యుతుఁ డయి చలుపక చెఱిచిన, నతనిని బురుషాధముం డ♦టందురు పెద్దల్.౧౦

ఉ. కాన నియుక్తకార్యమును ♦ గాడ్పుతనూభవుఁ డాత్మగౌరవం
బూనత నొంద కుండఁ, బతి ♦ యుష్ణకరాత్మభవుండు సంతసం
బూన ఘటించె, వెండియు ర♦ఘూత్తమవంశము నన్ను లక్ష్మణున్
జానకిఁ గాంచి మన్చె, సడి♦చావుఁ[1] దొలంచెను, నిల్పె ధర్మమున్. ౧౧

కం.ఇంతటిపరమప్రియము ను,దంతము వచియించుపవన♦తనయునికృతి క
త్యంతము సమ మగుప్రియ మొ,క్కింతయుఁ గావింప లేమి♦ కే దుఃఖింతున్.౧౨

ఉ. నాకుఁ గలట్టిసర్వముధ♦నంబు నొసంగినఁ గాని పోదు హృ
ద్వ్యాకులతావిధంబు, ధన♦వంతుఁడఁ గా, నిఁక మాఱుమేలు నే
నేకరణిన్ ఘటింపఁ గల♦ నియ్యెడఁ? గావున నాదుకౌఁగిలిన్[2]
గైకొనవయ్య దానిప్రతి♦గా మహితాత్మక!మారుతాత్మజా! ౧౩

కం.అని పులకితగాత్రుం డై, యినవంశాభరణ మపుడు ♦ కృతకార్యు మహా
త్మునిఁ బావనిఁ బిగికౌఁగిట, మన మారఁగఁ గ్రుచ్చి వెండి ♦ మానసవీథిన్ ౧౪

కం.తలపోసి, రామచంద్రుఁడు, జలజహితతనూజుఁ గాంచి ♦ జానకి రోయం
గలపని చక్కంబడియును, జలనిధిఁ దలపోయ మనసు ♦ ఝల్లనెఁ జుమ్మీ. ౧౫

కం.దుస్తర మగుజలనిధిని స,మస్తకపుల్ దాఁటి దక్షి♦ణాశాతటమున్
బ్రస్తుతగతిఁ జేరుట యెటు? నిస్తులితబలాఢ్య! చెపుమ ♦ నీ వొకయుపమన్. ౧౬

[1] సడిచావు = నిందతోడి చావు. [2] హనుమంతుని శ్రద్ధాభక్తులకుఁ దనకుఁగల ధనమంతయు (ప్రపంచమంతయు) నిచ్చినను మోక్షమిచ్చినను సరిగాఁజాలను. కావున భక్తునకుఁ దన్నే సమర్పణ చేసికొనెను. కృష్ణుఁడు గోపికలకుఁ జెప్పిన వాక్యము స్మరించునది (కృ. లీ.)

కం.జనకతనూభవ యుండెడు,నునికియుఁ దద్వార్త మీఱ ♦ లొప్పుగఁ జెప్పన్
వినితిని వనచరు! లిందఱు, వననిధిఁ ధరియింప నెట్లు ♦ వల నగుఁ జెపుఁడా? ౧౭
కం.అని పలికి హనుమతో నహీ,తనిబర్హణుఁ డైనరామ♦ధరణీశుఁడు యో
జన సల్పె మహాబాహుం, డనయము శోకంబు దన్ను ♦ నారట పెట్టన్. ౧౮

సుగ్రీవుఁడు శ్రీరామున కుత్సాహంబుఁ గలుగ భాషించుట.

సీ. తతశోకసంతప్తు ♦ దశరథాత్మజుఁ గాంచి, సుగ్రీవుఁ డిట్లను ♦ శోకనాశ
కరము లౌసూక్తుల ♦ ధరణీశనందన, యే లయ్య ప్రాకృతు♦లీల నీవు
సంతాప మందెదు♦సౌహృదంబుఁ గృతఘ్నుఁ, డవలఁ ద్రోచెడిభంగి♦నార్తి విడువు
మింతకు నీ విట్లు ♦ సంతాప మందఁగఁ, గారణం బేమియుఁ ♦ గానరాదు
ఆ. పగతునునికి దెలిసె ♦ బలిమి నీరధి దాఁటి, లంక లగ్గ పట్టి ♦ బింకమునను
నీదుశాత్రవునిని ♦ నిహతునిఁ గావించి, వెలయఁగల మి కేల ♦ కలఁగ నీకు. ౧౯
మ.మతిమంతుండవు శాస్త్రవేత్తవు దలం♦పం బండితాద్యుండవున్
స్తుతధీప్రాజ్ఞవరుండ విట్లు దగునే ♦ శోకంబునం గుందఁగా?
ధృతి యోగీంద్రుఁడు స్వార్థహానికరబు♦ద్ధిన్ వీడున ట్లీవ్యథా
మతిఁ బోవీడుము, కార్యనాశ మగుఁ జు♦మ్మా శోకదైన్యంబులన్. ౨౦
కం.దిగ్గనఁ దరించి జలనిధి, నగ్గిన ముగ్గినలుగా ని♦శాటుల్ లంకన్
లగ్గలుపట్టి భవద్రిపు, గగ్గో లొనరింత్రు చూడు ♦ కపివీరవరుల్. ౨౧
కం.దీనుం డై యుత్సాహవి,హీనుం డై శోకమునను ♦ గృశియించెడియ
మ్మానవు కార్యములుం జెడు,మానసివ్యసనముల నతఁడు ♦ మఱుఁగుచు నుండున్.
ఉ. ఈహరియూథపుల్ కుశలు ♦ లెల్లరు పీసులు విక్రమోద్ధతుల్
సాహసికాగ్రణుల్ నృపతి♦చంద్రమ! నీదునిమిత్త మై కృతో
త్సాహులు, చిచ్చునే నుఱుకఁ ♦ దప్పరు, వీరిముదంబుఁ జూడఁగా
నాహవదోహలం బెఱుక ♦ యయ్యె, దృఢంబ సుమీ మదూహయున్. ౨౩
ఉ. రావణుఁ బాపకర్ము రణ♦రంగమునందు వధించి జానకిన్
దే వల నైనపద్ధతిని ♦ దేఁకువఁ బూనుము, సేతుబంధ మిం
కేవిధి సాగు, లంకఁ గను ♦ టె ట్లగు నట్లు సమాచరింపుమీ
యావిబుధారివీడు గని♦నంత హతుం డని వాని నెంచుమా. ౨౪
సీ. సేతునిర్మాణంబుఁ ♦ జేయక వారిధిఁ, దరియింపరా దయ్య ♦ సురల కైన
సేతు వేర్పడఁ గపి♦వ్రాతంబు దాఁటుట, శత్రుసంహారంబుఁ ♦ జలుపు టాయెఁ
గా నిశ్చయింపుము ♦ కామరూపులు కపుల్, సమరశూరులు కలి[1] ♦ జంక రెపుడుఁ
గావున రాజేంద్ర! ♦ కార్యనాశిని యైన, వైక్లబ్యబుద్ధిని ♦ వదలవయ్య
ఆ. జగతి శోక మెపుడు ♦ శౌర్యవినాశన, క్షమము గాన నీకుఁ ♦ గలఁక దగదు
శౌర్యముఖ్యు లైన♦జనులు కార్యంబుల,బలము ధృతియు దిటముఁ ♦ బాయ రెపుడు.

[1] కలి = కలహము.

ఉ. లోకమునందు నిస్తులబ♦లుల్ నినుబోఁటిమహాత్ము లెయ్యెడన్
వ్యాకులతన్ వహింపరు ప్ర♦ణష్టవినష్టములందు నెప్పుడేన్;
శోకము సర్వకార్యలయ♦సూచక మాట యెఱింగి దైన్యముం
బోకడఁ బెట్టి ధైర్యగుణ♦ముం గొనియాడుచు నుందు రెప్పుడున్. ౨౬

ఉ. నీ వన బుద్ధిమద్వ్రతతి ♦ నిస్తులితుండవు శాస్త్రకోటులన్
గోవిద! పుష్కలుండవు న♦కుంఠితవిక్రమశాలి విప్పు డో
ష్ఠావర! మాదృశాప్తహిత♦మండలసంగతి శత్రుకోటికిన్
గావర మాఱఁ జేయఁ దగుఁ ♦ గాలము గా దిది గుందుచుండఁగన్. ౨౭

ఉ. నీకు శరాసపాణికిని ♦ నిల్చి ముఖాముఖిఁ బోరువాని ము
ల్లోకములందుఁ గానఁ, గపు♦లున్ బలయుక్తులు వారు చేయఁగాఁ
జేకొనినట్టికార్యమునఁ ♦ జే టొనగూడదు, భూరివార్ధి నీ
వేకరణిం దరించి హృద♦యేశ్వరిఁ జూచెదు వైళమే నృపా! ౨౮

కం. కావున శోకము మానుము, నీ వెదఁ గ్రోధంబు గొనుము ♦ నిశ్చేష్టులు నా
భూవరులు మందభాగ్యులు, వావిరి వడఁకుదురు కోప♦వంతున కెవరున్. ౨౯

శా. మాతో నీ విపు డెట్లు వారిధిఁ దరిం♦పన్ వచ్చుఁ దత్పద్ధతిన్
జేతోవీథిని సూక్ష్మబుద్ధిఁ గనుమీ ♦ సేనావళుల్ దక్షిణా
శాతీరంబును జేరెనా రిపులు నా♦శం బైరి, వీరల్ శిలా
వ్రాతక్ష్మారుహవృష్టిఁ గూల్చెద రమి♦త్రవ్యూహముం బోరిలోన్. 30

కం. వరుణాలయ మెటు లైనను, దరియింపన్ వలయు నంత♦దనుక నె కష్టం
బరి రావణాసురుఁడు సం,గరసీమను నిర్జితుండు♦గా నెంతు నృపా! 3౧

కం. ఏలా పలుమాటలు నీ, కేలీలల నైన విజయ ♦ మెసఁగును శుభదం
బౌలక్షణములఁ గంటిని, జాలఁగ నామనము సంత♦సంబునఁ దేలెన్. 3౨

### శ్రీరాముఁడు హనుమంతుని లంకయందలి దుర్గాదులవిధం బడుగుట.

చం. అని యిటు యుక్తియుక్తముగ ♦ నాడిన నాపరమార్థవేది యా
జనకసుతామనోహరుఁడు ♦ చక్క గ్రహించి మరుత్తనూజునిం
గని కనులార నీవె దశ♦కంఠునివీటిని గంటి గాదె? లం
కను జెపు మెన్నిదుర్గములు ♦ గ్రాలెడినో బల మెంతమాత్రమో. 33

కం. నాతపముబలముచేతనో, సేతువు బంధించి యొండె ♦ శిఖినఖబాణ
వ్రాతమున నొండె జలనిధి, నేతీరున నైన దాఁట ♦ నే నిపుణుండన్. 3౪

తే. ద్వారదుర్గక్రియాదుల ♦ దనుజసదన,ములను దద్గుప్తికర్మముల్ ♦ పలుక వయ్య
తీఱుపాటుగ సర్వంబుఁ ♦ దిరిగి కంటి, వన్నివిధములఁ గుశలుండ♦వాంజనేయ. 3౫

ఉ. రామవిభుండు తన్ను నిటు ♦ ప్రశ్నయొనర్పఁగ విన్న దేవ లం
కామహిమంబు దుర్గబల♦కాండవిధానము వాహనావళీ
ధామవిభాగముల్, మకర♦ధామము[1] భీమత, గుప్తికర్మముల్,
భీమసురారిభక్తియును ♦ వేద్యము సర్వము విన్నవించెదన్. ౩౬

ఉ. ధీరమణా! ప్రహృష్టమయి ♦ మత్తగజాకుల మై, మహోత్కృతుల్.
తేరులు, గల్గి పూర్ణముగ ♦ దేవవిరోధిచయావృతంబు నై
సారతురంగమాఢ్య మయి ♦ సార్గళసంపరిబద్ధతుంగవ
ద్ద్వారచతుష్కయుక్త మయి ♦ వాసవవైరిపురంబు గ్రాలెడిన్. ౩౭

ఉ. అందలి యశ్మయంత్రముల[2] ♦ నాగతశాత్రవసైన్య మంద వే
వ్రందు, శతఘ్నికల్ తఱచు ♦ రాక్షససంఘవినిర్మితంబు లై
క్రిందుగ ద్వారదేశములఁ ♦ గ్రాలుచు నుండు, సువర్ణసన్మణీ
బృందవిదూరజాంతరిత♦భీమసువప్రము దుష్ప్రధర్ష మౌ. ౩౮

సీ. ఆపురిచుట్టు మ♦హాభీమములు గ్రాహ,వంతముల్ శీతల♦వారి మిగులఁ
గమ్రంబు లగుచు న♦గాధంబు లగుచు న,గడ్త లొప్పును మీన♦కాండయుక్తి
ద్వారంబులందు యం♦త్రారూఢములు చాల ,విరువులౌ వంతెనల్ ♦ వెలయునాలు
గచ్చోటఁ గలవు మ♦హాగృహపఙ్క్తు లా,పలకలవంతెనల్ ♦ పరులసేన

తే. వచ్చునప్పుడు రక్షించుఁ ♦ బత్తనంబు, వాని యంత్రాళిబలమునఁ ♦ బరిఖలోన
విడుచు చుందురు; వానిలో ♦ వేదికలును, బైఁడికంబంబులును గల్గి ♦ పటిమ నొప్పి

కం. కదలింపరాక దృఢ మై,పొదలెడువంతెన యొకండు ♦ పొలుచును జుమ్మీ
యది సేనాదర్శనమున,యదనున దశకంధరునకు ♦ నగుఁ దానముగన్. ౪౦

కం. మతిమత్ప్రకృతియుతుం డయి, సతతంబు యుయుత్సుఁ డగుచు ♦ స్వీయముగ సేనా
తతి సావధానముగఁ గను, చతులితజాగరిత రావ♦ణాసురుఁ డొప్పున్. ౪౧

సీ. ఇఁక లంక నాదేయ♦కృత్రిమ పార్వత, వాన్యచతుర్విధా♦నన్యసాధ్య
భీకరదుర్గస♦మాకలితం బయి, సురలకు నేనియుఁ ♦ జొరఁగరాక
యాలంబహీన మై ♦ యంబుధికూలంబు,నందు నావలు చన♦నైనఁ ద్రోవ
లేక వార్ధకుఁ జొర ♦ వీక శైలాగ్రంబు, నం దమరావతీ♦చందమునను

తే. వాజివారణపూర్ణ మై ♦ పరమయంత్ర,వివిధ పరిఖాశతఘ్నికా♦న్వితము నగుచుఁ
బరమదుర్జయ ♦ మయి దశ♦వక్త్రపాలి,తంబు పొలుపొందు దశరథ♦తనయ యందు

సీ. ప్రాగ్ద్వారరక్షకుల్ ♦ పదివేవు రుందురు, ఖడ్గాగ్రయోధులు ♦ కడిఁదిబలులు
శూలపాణులు రణ♦శూరులు దుర్జయుల్, దక్షిణద్వారంబు ♦ రక్షసేయ

[1] మకరధామము = సముద్రము. [2] ద్వారమునకుఁ బైభాగమున శిలలు పేర్చి శత్రువు లామార్గమున దానిక్రిందికి వచ్చినపుడు వారిపై నవి పడునట్లు చేయు యంత్రములు.

నియుతరక్షోవరుల్ ♦ నిష్ఠురవిక్రముల్, చతురంగ బలయుక్తి ♦ సతత ముంద్రు
పడమటివాకిటఁ ♦ బ్రయుతరక్షోగ్రముల్, చర్మఖడ్గాన్వితుల్ ♦ చటులబలులు

తే. వినుతసర్వాస్త్రకోవిదుల్ ♦ వెలయుచుందు
రుత్తరద్వారమును గాచు ♦ చుంద్రు న్యర్బు
దాసురులు కులజులు వార♦ణాశ్వవాహు
లిందఱును బూజితులు రాక్ష♦సేశ్వరునకు. ౮౩

కం. మధ్యమభాగాశ్రితులు న, సాధ్యులు నూర్వేవు రుంద్రు ♦ సర్వంబు సదా
రాధ్యం బగుతత్పురమున, మధ్యాహ్నార్కాభకోటి ♦ మానవభోజుల్. ౮౪

కం. చెఱిచితి నంతెన లెల్లను, బఱచితిఁ బాతికబలంబుఁ ♦ బాడు లగడ్తల్
నుఱుమాడితి వప్రంబులు, తెఱపులు నెటఁ గన్ననిపుడు ♦ దేవారిపురిన్. ౮౫

సీ. శ్రీరామ! యెటులైన ♦ వారిధిఁ దరియింపఁ, గలిగినయేని లం♦కాపురంబు
వానరకోటిచేఁ ♦ బా డని నమ్ముము, బల మంతయును? నేల ♦ పార్థివేంద్ర
యంగదద్వివిదబు♦జాంధ్యక్షనీలురు, మైంద పనస నలుల్ ♦ మాత్ర మైన
వారిధి దాఁటి దే♦వారిపురంబునఁ, బర్వతవనములు ♦ భగ్నపఱిచి

తే. తోరణంబులు చెఱిచి ప్రా♦కారములను
తుఱుము గావించి భవనముల్ ♦ దుమ్ము గలిపి
వత్తు రీవారిఁ బంపుము ♦ వరముహూర్త
నిశ్చయముఁ జేయుమీ పయ♦నించుపొంకె. ౮౬

శ్రీరాముఁడు కపిసేనతో లంకపై దండయాత్ర వెడలుట.

కం. అనుహనుమంతునివాక్యము, లనుక్రమముగాఁగ రాముఁ ♦ డాలించి యనున్
దనుజేంద్రపురము విధ్వం, సనముం గావింతుఁ జుండు ♦ సత్యం బంటిన్. ౮౭

చం. అగు నిది మంచిమూర్తము ప్ర♦యాణము సేయఁగఁ, బద్మమిత్రుఁడున్[1]
గగనము మధ్యముం దఱిసెఁ ♦ గ్రాలు నిదే విజయంబు పేరిటన్
నెగడినసన్ముహూర్తము వ♦నేచరనాయక! యిప్డు పోయినన్
బగతుఁడు జానకిం గొనుచుఁ ♦ బ్రాణముతో నెట కేగఁ గల్గెడిన్? ౮౮

ఉ. నాయభియానమున్ వినుచు ♦ నాప్రియురాలు మనంగ నాసయేన్
జేయును గాక, పీడితుఁడు ♦ చేపడినట్టివిషంబు గ్రోలి సా

[1] హనుమంతుఁడు తొలుత సముద్రము దాఁటి సంధ్యాకాలమున లంకలోఁ బ్రవేశించి సీతను వెదకి కనుఁగొని రాక్షసులతో యుద్ధముచేసి యింద్రజిత్తుచేఁ బట్టుపడినప్పటి కరుణోదయమయ్యెను. రావణ దర్శనము, లంకాదహనము మఱునాటియుదయమున జరిగెను. వెంటనే సముద్రలంఘనము, కపులతో సమాగమము, మధువనప్రవేశము, శ్రీరామదర్శనము ఆనాఁటి ౧౦, ౧౧ గంటల లోపల జరిగెను. ౧౨ గంటలకు నభిజిల్లగ్నమున దండయాత్ర వెడలుట.

పాయదశర్ సుధాద్రవముఁ ♦ బానముఁ జేసినరీతి సూర్యజా!
యీయెడఁ గాలయాపన మిఁ ♦ కేల యొనర్పఁగ రిత్త చూడుమా. ౪౯

ఆ. ఉగ్రకిరణతనయ ♦ యుత్తరఫల్గుని, నేఁడు రేపు హస్త ♦ నిలుచు శశియుఁ
గాన నేఁడ సకల♦సేనాసమేతంబు, పయన మగుట లెస్స ♦ ప్లవగరాజ. ౫౦

కం. ఉత్తమశుభదము లైనని, మిత్తము లెంతయును దోఁచె ♦ మేలుగ మనకున్
మిత్తికి వశపడ రాక్షస, సత్తముఁ గావించి నిజము ♦ జానకిఁ దెత్తున్.  ౫౧

కం. మీఁగ న్నదరెడి శత్రులఁ, జాఁగఁ గొని విజయి వగుచు ♦ జనకజఁ గొని నీ
వీఁగెదు బన్నం బనుక్రియఁ, జాఁగురె పయనింప నిదియ ♦ సమయం బనుచున్.

చం. వరనయవేది వెండి యను ♦ వానరరాజును లక్ష్మణుండుఁ ద
న్గురుతరరక్తిఁ గొల్వఁగను ♦ గొబ్బునఁ బంపుము నూఱువేల్ వనే
చరులను మార్గశోధనము ♦ సల్పఁగ నీవెలగోలుగాఁ జమూ
వరుఁ డగునీలు వెంట హరి♦వర్య! మహాబలవేగవంతులన్. ౫౩

చం. వరఫలమూలవంత మయి ♦ వారి సుఖాస్పద మై సుశీత మై
పరమమధుప్రభూత మగు♦బాటలఁ దోకొని పొమ్ము నీల! నీ
హరివరసేనలన్, విను దు♦రాత్ములు వైరులు నీళ్ల మూలికో
త్కరఫలకోటులన్ విషముఁ ♦ దార్తురు, పొంతురు ద్రోవ రాక్షసుల్. ౫౪

కం. జలదుర్గంబులఁ గానన, తలములఁ బల్లముల వైరి♦తతి ఛన్నంబై
బిలముల డాఁగును గావున, వల నగుఁ బైకెగిరి కనఁగ ♦ వానరతతికిన్. ౫౫

కం. బలవిక్రమవంతులకును, జలుపఁగ నర్హంబు ఘోర♦సంగ్రామంబుల్
బలహీను లెవ్వరేనియుఁ, గలిగినఁ గిష్కింధ కనుపఁ♦గాఁ దగు నీకున్. ౫౬

సీ. వెల్లివెల్లువ పాఱు♦విధమున నెలగోలు[1], బలము నూఱులు వేలు ♦ పనుప వయ్య
గజుఁడు గవాక్షుండు ♦ గవయుండు మును చను, వా రాలలో బలీ♦వర్దము లన
బుషభునితోఁ బంపు♦మీ కపిసేనను, దక్షిణపార్శ్వంబు ♦ రక్ష సేయ
మదహస్తిబలి గంధ♦మాదనుఁ డరుగుతఁ, గపులతో డాపటి♦కాపుగాఁగ

తే. సకలబలములు జాతహా♦ర్షమునఁ దేల, నేను నైరావతారూఢుఁ ♦ డైనయింద్రు
కరణి హనుమంతు పైనెక్కి♦యరుగువాఁడ, సైన్యమధ్యంబునందు నో♦సైన్యనాథ.

తే. సార్వభౌమంబు మీఁది వై♦శ్రవణుపోల్కి
నంగదుని నెక్కి సౌమిత్రి ♦ యరుగుదెంచుఁ
గుక్షిరక్ష సుషేణుండు ♦ ఋక్షనాథ
జాంబవద్వేగదర్శులు ♦ సలుపువారు. ౫౮

కం. భూవిభుఁ డిట్లు వచింప రు, మావిభునాదేశమునను ♦ మర్కటులు గుహా
భూములు శృంగతలంబులు, భీమగతిన్ వెడలి రభ్ర♦పృథ్వులు నిండన్. ౫౯

[1] ఎలగోలు బలము = మార్గశోధనముకై ముందుగఁ బోవుసేన.

కం. రాముఁడు వానరవల్లభ, సౌమిత్రిసమేతుఁ డగుచు ♦ సమ్మదమున ను
ద్దామగతి నడిచె రయమున, శామనదిఙ్ముఖముగా[1] స♦సైన్యుం డగుచున్. ౬౦

సీ. వారల వెంబడి ♦ వారణవిభులైన, క్రోఁతులు వేలును ♦ గోటు లయుత
ములు వెన్నడించిరి ♦ ముదితులై దృప్తులై, గంతులు వేయుచు ♦ గర్జ లిడుచు
నెగురుచు దుముకుచు ♦ మొగి చుట్లు పెట్టుచు, ఫలముల మెక్కి తే♦నెలను గ్రోలి
చెట్టుల నెక్కుచుఁ ♦ జిదుముచు గుత్తులు, కాయల రాల్చుచు ♦ గండుమీఱి

ఆ. యొక్కఁ డొకనిఁ ద్రోయు ♦ నొక్కనిఁ బై కెత్తు
నొకఁడు గేలి సేయు ♦ నొక్కఁ డతనిఁ
బట్టి పెనఁగు వాని♦పై నెక్కు నొక్కండు
నొకని నొకఁడు ద్రోసి ♦ యుర్విఁ గూలు. ౬౧

కం. నేనే త్రుంచెద రావణు, నేనే వధియింతు యామి♦నీచరకోటిన్
నేనే నేనే యనుచును, వానరతతి రాము మ్రోల ♦ వాదము లాడున్. ౬౨

సీ. కుముదనీలర్షభుల్ ♦ కొమ్మున మున్నుగాఁ, జనిరి మార్గములశో♦ధనము సేయ
రామలక్ష్మణులును ♦ రాజు సుగ్రీవుండు, నడుమ నేగిరి గొల్వఁ ♦ గడిఁదిబలులు
శతవలి పదికోట్లు♦శాఖామృగాళితో, సర్వంబు రక్షించె ♦ సైన్యసమితిఁ
బరిజనుల్ వేవేలు ♦ బలసిరాఁ బనసార్క, గజకేసరులు ప్రక్క ♦ కాపు లైరి

ఆ. ఋక్షసేనతోడ ♦ రక్షించె జఘనంబు, జాంబవంతుఁ డధిక♦శక్తియుక్తి
బాస టయి సుషేణ♦బలిముఖుఁ డుండఁగఁ, దరణిసుతుఁడు మున్ను ♦ దవిలి నడువ.

కం. సేనాపతి యగునీలుఁడు, వానరసైన్యముల నాల్గు♦వంకల సంర
క్షానియమంబున నిపుణత, మానుగ నరయుచును జనెఁ బ్ర♦మాదరహితుఁ డై.

తే. వానరులఁ దీవరించుచు ♦ వరుసఁ జనిరి
రంభుఁడు దరీముఖుండును ♦ రభసకపియు
మఱి ప్రజంఘుండు చను చిట్లు ♦ మార్గమునను
గనిరి సహ్యాద్రి ఘనసరో♦వనయుతంబు. ౬౫

కం. భీమాగ్రహాయుతుఁ డగు శ్రీ, రాముని యాజ్ఞప్తి వాన♦రవ్యూహంబుల్
గ్రామంబుల జనపదముల, భూముల డాయంగఁ జనవు ♦ పురుతరభీతిన్. ౬౬

తే. సాగరౌఘనిభం బయి ♦ జలధిఘోష, సన్నిభారవ మయి కీశ♦సైన్య మపుడు
రామపార్శ్వతలంబున♦రమణ నడచె, సంప్రయోజితజవనాశ్వ♦చయముభంగి. ౬౭

కం. వానరసమూహ్యమానులు, మానవపతితనయు లపుడు ♦ మహితగ్రహాయు
క్తానంతరత్నమిహికా, భానులగతిఁ బొలిచి చనిరి ♦ ప్రాభవమారన్. ౬౮

లక్ష్మణుఁడు శుభశకునముల శ్రీరామునితోఁ జెప్పుట.

శా. తారేయాంసగతుండు లక్ష్మణుఁడు సీ♦తానాథుతోఁ బల్కు న
న్నా! రక్షోధిపుఁ జంపి తద్హృతసతిన్ ♦ వైదేహినిం గ్రమ్మఱన్

[1] శామన దిక్కు = దక్షిణము.

దేరం గల్గును నీకు నిక్క మిది కం♦టే కార్యసిద్ధ్యర్థమై
యారం దోఁచెడి సన్నిమిత్తముల భూ♦మ్యాకాశదేశంబులన్. ౧౯

సీ. అనుకూలవాయువుల్ ♦ మనసైన్యములమీఁద
మృదుహితసుఖములై ♦ మెలఁగఁ దొడఁగెఁ
బరుషేతరారావ♦భాసమానంబులై
మృగపక్షితతు లెల్లు ♦ లిడఁగఁ గడఁగె
నన్నిదిక్కులు సుప్ర♦సన్నంబులై యొప్పె
విమలుఁడై భానుండు ♦ వెలుఁగువాఁడు
బ్రహ్మరాశి విశుద్ధ♦భార్గవుం డనుగతుఁ
డై యున్నవాఁడు మ♦హర్షివరులు

తే. ధ్రువుని వలగొనుచున్నారు ♦ తోయజాక్ష!
మనకుఁ బ్రపితామహుండు ని♦ర్మలనృపర్షి
సహపురోహితుఁ డగుచుఁ ద్రి♦శంకుఁ డదిగొ
మింట వెలుఁగుచు నున్నాఁడు ♦ మేలిరుచుల. ౨౦

కం. మనయిక్ష్వాకులతారకఁ, గనుము విశాఖను వెలింగెఁ ♦ గడువిశదంబై
తనరి నిరుపద్రవంబుగ, మనశత్రుల కివి రహించు ♦ మూర్ఖము వినుమా. ౨౧

సీ. నైరృతదైవత♦నక్షత్రమగుమూల, దుమగతికేతుచే[1] ♦ ధూపితంబు
గావుట రాక్షస♦కాండంబులకుఁ జేటు, దెల్పుచున్నది యెన్ని♦తెఱఁగు లరయ
వారికి నాశంబు ♦ చేరువ నున్నది, మృత్యుగృహీతుల♦రిక్క మరణ
కాలంబుఁ దెలుపుచు ♦ గ్రహపీడితం బగు, నం ద్రిప్పు డది వైరు♦లందుఁ గలిగె

ఆ. నీరు నిర్మలంబు ♦ నీరజాకరముల, వనము లెల్లఁ బుష్ప♦వంతములును
గమ్మఁదావి యొలసె ♦ ఘన్మని యెల్లెడ, భూజతతి యథర్తు♦పుష్పయుతము. ౨౨

ఆ. తారకామయాఖ్య♦దారుణరణమున, దేవసేనపోలె ♦ దేవ వెలుఁగు
చున్నయదియు వాన♦రోగ్రవీరులసేన, జయము నిజము మనకు ♦ శంక వలదు. ౨౩

కం. అని శకునంబులఁ దెలుపుచుఁ, దనయగ్రజుమనము ముదము ♦ దగుల సుమిత్రా
తనయుఁడు పలికిన రాముఁడు, విని సంతస మంది సేన ♦ వే నడిపించెన్. ౨౪

## కపిసేనలు ప్రయాణమై పోవుట.

చం. జలధరసంఘ మంబరము ♦ ఛాదితముం బొనరించుమాడ్కి న
బ్బలిముఖచక్రముల్ సవన♦పర్వతదక్షిణదిక్కు గప్పఁగా
బలితపుఁదత్కరాంఘ్రిహతిఁ ♦ బాయక లేచి ధరాపరాగముల్
జలజహితద్యుతుల్ సమయ ♦ సర్వజగంబును గ్రింగె నొక్కటన్. ౨౫

[1] దుమగతికేతుచే = ధూమకేతువుచే.

కం.విడువక శాఖామృగముల,దడములు తరియించుకతనఁ ♦ దటినులు వంకల్
పెడమరలి పాఱెఁ బెక్కా,మడ లెప్పటి యట్లపోవ ♦ మార్గము లేమిన్. ౨౬

చం.విమలసరోవరంబులను ♦ వృక్షచయావృతపర్వతంబులన్
సమతలభూప్రదేశములఁ ♦ జారుఫలాన్వితసద్వనంబులన్
క్రమమున నడ్డ నెల్లయెడఁ ♦ గ్రచ్చఱ నడ్డముగాఁగఁ గ్రిందుగా
సమద వలీముఖప్రముఖ♦సైన్యసమూహము లావరించుచున్. ౨౭

చం.చనెఁ జనె వాయువేగమున ♦ సమ్మదవీర్యబలాతిరేకముల్
గనఁబడ యౌవనోద్ధతివి♦లాసపరాక్రమరీతి గర్జలన్
నినుచుచు నందుఁ గొందఱు వ♦నేచరనాథులు కిల్కిలార్భట
స్వనముల నొప్ప, గంతులను ♦ వైచిరి కొందఱు రంతు సేయుచున్. ౨౮

సీ. క్ష్మాస్థలి తోఁకలు ♦ జాడించి కొట్టుచు, ధరణి గ్రక్కదలఁ బా♦దముల నిడుచుఁ
గొండల నెక్కుచుఁ ♦ గుప్పించి దాఁటుచు,భూజముల్ విఱుచుచు ♦ బొబ్బ లిడుచు
నూరువేగంబునఁ ♦ జారులతాపాళి, నలియఁ జేయుచును వా♦నరబలంబు
నూఱులు వేలును ♦ నూఱువేలును గోట్ల,కోలఁదిగా ధారణిఁ ♦ గలయఁ బర్వి
తే. రేయుఁబగలును నడిచె సు♦గ్రీవరక్ష, నిలువ కెడ నెడ హర్షంబు ♦ దలకొనంగ
నెప్పు డెప్పుడు రాముని♦యిగురుఁబోఁణి, బందిఁ దొలఁగింత మనుతమి ♦ సందడింప.

చం.నిలువక పోయి పోయి యవ♦నీరుహసంకటముల్ మృగావళీ
కలితము నైన సహ్య మను♦క్ష్మాధరముల్ మలయావనీధ్రముల్
బలితపుఁగాననంబులఁ బ్ర♦వాహములం గనుఁగొంచు నేగుచో
వలిముఖభంజితంబు లయి ♦ వ్రాలెఁ గరంబు తమాలసంతతుల్. ౩౦

కం.త్రుంచుచు నూడుగలన్ భం,జించుచు మావులను జువ్వి♦చెట్లను దెగ ఖం
డించుచుఁ బొగడల నేరెడు, లించుక భయ మేది వనచ♦రేశ్వరు లరుగన్. ౩౧

కం.కాననభూరుహావారము, వానరతతిమీఁద వాయు♦వశచలితం బై
మానితసుగంధబంధుర,సూనవితానములు గురిసె ♦ సొబగారంగన్. ౩౨

కం.చందనశీతలుఁ డగుచును, నిందిందరబృందగాన ♦ మెసఁగఁగ వీచెన్
మందత సుఖసంస్పర్శుఁడు, సుందరసామోదవనుల ♦ శుభపవనుండున్. ౩౩

కం.వాతమహారయఘట్టిత,ధాతుప్రసృతము రజోవి♦తానముచే న
త్యాతతగతి శైలము ప్ర,స్ఫీతవలీముఖవరేణ్య♦సేనం గప్పెన్. ౩౪

కం.వికసించి యుండె గిరిఁ గే,తకపద్మకతినిశవరణ♦ధవపాటలచూ
తకకోవిదారరథకురు,వకచూర్ణకసిందువార♦వకుళాదితరుల్. ౩౫

కం. గంతు లిడుచుఁ జనువానర,కాంతుల రాయిడిని వివిధ♦కాననతరువుల్
కాంతులు చెడి వ్యాకులతా,వంతము లై యుండె శైల♦వర్గముమీఁదన్. ౮౬

సీ. పర్వతమ్ములనున్న♦బావులు గుంటలు, శీతలజలసము♦పేత మగుచుఁ
జక్రకారండవ♦సంసేవితంబు లై, చెలువార శార్దూల♦సింహబుక్ష
చిత్రకాయులులాయ♦పోత్రిచయంబులు, సర్వత్ర నయనగో♦చరము లయ్యెఁ
బద్మసౌగంధికో♦త్పలకైరవంబుల,కొలఁకు లచ్చోటను ♦ గలుకు లయ్యె

తే. శైలసానుతలంబుల ♦ శ్రవ్యముగను, విహగకూజితములు చాల♦బహుళ మయ్యె
నట్టితలముల డాసి వ♦నౌకసములు, తనివి తీరఁగ విహరించె ♦ మనముకొలఁది. ౮౭

ఉ. దోసిట నీరు గ్రోలుచును ♦ దోఁగుచు నిచ్చగఁ ద్రోవ వచ్చునా
యాసము దీర నీళ్ళఁబడి ♦ యాడుచు నొండొరుమీఁద నీర ము
ల్లాసముగాఁగఁ జల్లుచుఁ ద♦లల్ జలమధ్యమునందు ముంచుచున్
మాసరకందమూలఫల♦మండలి మెక్కుచుఁ గొండ లెక్కుచున్. ౮౮

కం. తేనియల ద్రోణమాత్రప్ర,మాణములం గ్రోలుచున్ ద్రు♦మారుహతతులన్
మానితలతలం జెఱుచుచు, వానరతతి దిరిగె నేర్చి ♦ వసుధాధరముల్. ౮౯

ఆ. చెట్టుచేమ లేని♦మెట్టలఁ గొండఱు, పోవఁ దేనె లెస్స ♦ ద్రావి మత్తు
కతనఁ జెట్లనీడఁ ♦ గపులుకొందఱుఁ గొంచఁ, బడుగఁబడుచు లేచు ♦ చరుసమునను

కం. ఎచ్చటఁ జూచిన కీశస,ముచ్చయముల్ పరఁగ ధరణి ♦ మొగిఁ బక్వం బై
హెచ్చినవరిపైరున మడి,యచ్చున రాజిల్లె నిబిడ ♦ మై యెటు చూడన్. ౯౧

కం. ఇంద్రనిభుఁడు రాముండు మ,హేంద్రధరాధరమునన్ స♦మేధిత మాశ్రృం
గేంద్రము నెక్కి కమఠఝష,సాంద్రము రత్నాకరంబు ♦ సందర్శించెన్. ౯౨

తే. మలయసహ్యామహాశైల♦ములఁ దరించి,యానుపూర్విగ జలధి డా♦యంగఁ బోయి
దిగ్గి వేలావనంబెల్లఁ ♦ దీవరముగ, దాఁటి ధాతోపలతలముఁ♦దఱిసి వేల ౯౩

## శ్రీరాముఁడు కపిసేనతో సముద్రతీరముఁ జేరుట.

ఉ. శ్రీరఘువంశమౌళి కపి♦శేఖరుఁ గన్గొని కీశనాథ! కూ
పారము[1] తీరముం గదియ ♦ వచ్చితి మింక నతీరమున్ సుగం
భీరము నైనదీని నొక♦మేలియుపాయముచేతఁ గాక యిం
కేరహి దాఁటరాదు మన♦యీకపిసేనకు నెల్లఁ జూడుమీ. ౯౪

తే. మున్నుమనకెల్లఁ మది సము♦త్పన్నమైన,చింతయే యిప్డు వెండియుఁ ♦ జివురులెత్తెఁ
జేయఁగాఁదగు నొకసదు♦పాయ మిప్డు, కాలయాపనసేఁత యో♦గ్యంబు గాదు.

ఉ. కావున మంత్రతత్పరత ♦ కార్యము చుమ్మ, యనుజ్ఞ నిమ్ము సు
గ్రీవ! నివేశముం గొనఁగఁ ♦ గీశచమూనిచయంబు లింద, యిం

[1] కూపారము = సముద్రము.

దేవనచారి యైనఁ బని ♦ యెయ్యది యైనను గల్గు గాక దాఁ
టోవఁగ రాదు సేన విడి, ♦ పోవఁగ వచ్చును శూరసత్తముల్ ౯౬

ఉ. ఛన్నవిరోధిసంఘముల♦చందము రోయఁగ నౌను గాన, నం
చన్న సుమిత్రపట్టియు స♦హాయుఁడుగాఁ గపిసేన నెల్ల వా
రాన్నిధితీరమందు వన♦రాజిని బాళెము దిగ్గఁ బంచె సం
పన్నగుణుండు కీశపతి ♦ భ్రాజిత మావరిధిస్థకోటితోన్. ౯౭

కం. పారం బెఱుఁగనిమర్కట,వారము మధుపాండుసలిల♦వంతం బగుకూ
పారం బన లవణాకూ,పారము నికటమున నపుడు ♦ భాసిలు చుండెన్. ౯౮

కం. వారిధినాదము లోఁగొని, సారం బగుకీశసైన్య♦సన్నాహరవం
బారూఢిఁ జెలఁగె; ముత్తెఱఁ, గై రహి మించెన్ బలంబు ♦ లర్కజు నాజ్ఞన్. ౯౯

## సముద్రవర్ణనము.

సీ. దూరపారంబు ర♦క్షోరాజియుక్తంబు, చండనక్రగ్రహా♦సంయుతంబు
క్షణదాదిఘోరంబు ♦ కలితఫేనకదంబ,హాసితంబు భంగనృ♦త్యాంచితంబు
జైవాతృకోదయ♦సంజృంభితంబును, బ్రతికువలయహిత♦వ్యాకులితము
తిమితిమింగిలసము♦దీర్ణంబు చండమా,రుతమహోగ్రాహాభా♦సితము నగుచు

తే. దీప్తభోగభుజంగాళి ♦ తేజ మీఱఁ, శింశుమారాదితతిచేతఁ ♦ జెలఁగుదానిఁ
బ్రకటశైలయుతంబు దు♦ర్గమపథంబు, సాగరవరంబుఁ గాంచెఁ గీ♦శవ్రజంబు. ౧౦౦

సీ. మొసళులచే భోగ♦విసరంబుచేత వి,గాఢ మై వాతప్ర♦కంప్ర మగుచుఁ
బడుచును లేచుచు ♦ బహుళతరంగము, లధికప్రవృద్ధ మై ♦ యమరుదాని
నగ్నిచూర్ణాకీర్ణ ♦ మయినట్లు భాస్వరో[1],దకము మహోరగ♦తతులు గలిగి
యమరారివిషయ మై ♦ యధికభీకరము నై, పాతాళవిషమ మై ♦ వారిదాధ్వ

ఆ. సన్నికాశ మగుచు ♦ సాగర మిది యని,యభ్ర మిది యటంచు ♦ ననఁగరాక
గగన మబ్ధిఁ గలసి ♦ గగనంబునం దబ్ధి, గలసితారకామ♦ణులను వెలసి ౧౦౧

కం. తనరుచు సముత్పతన్ముది,రనికరముల భూరిభంగ♦రాజులచేతన్
గనుఁగొనఁగరాక భేదం, బనయము నొక్కటిగఁ బెనసి ♦ యరువగుదానిన్. ౧౦౨

తే. బెరసి యొం డొంటితో వెండి ♦ పెరిఁగి యొకటి
నొక్కటి గుభాలునను దాఁకి ♦ యూర్మిపంక్తు
లబ్ధిరాజమహాభేరు♦లట్లు మ్రోయ
నగచరావళి చూచె మ♦హాద్భుతముగ. ౧౦౩

చం. రయయుతవాతసంకులత♦రంగకగర్భితదివ్యరత్ననం
చయజలనాదితంబు జల♦జంతుసమూహసమాకులంబు న
వ్యయమహితానిలోద్ధుతసు♦రాధ్వనటద్భుజభంగముల్ సవి
స్మయమతిఁ జూచె నెల్లకపి♦సంఘము భ్రాంతతరంగనాదమున్. ౧౦౪

[1] భాస్వరము = Phosphoros. (ఫాస్ఫరసు)

కం.భరమగు నిర్హ్రాదంబును, బొరలి పొరలి వచ్చునలలుఁ ♦ బురుగును గనఁగా
సురద్రావి పొర్లువెంగలి, కరణి జలధి తోఁచెఁ గీశ♦కాండంబునకున్. ౧౦౫

## ⟷ శ్రీరాముఁడు సీతం దలంచి దుఃఖించుట. ⟷

కం.పాలకయుతహరివాహిని, నీలుఁడు సింధూత్తరమున ♦ నెఱి విడిసెను శా
స్త్రాలపితరీతి నద్దెస, మాలక చరియించి కావ ♦ మైందద్వివిదుల్. ౧౦౬
చం.కడలిదరి యుక్తపద్ధతి, విడియఁగ సేనలును రామ♦విభుఁడు భృశార్తిన్
మిడుకుచుఁ దనకెలన వసిం,చెడిలక్ష్మణుఁ జూచి యనియెఁ ♦ జిత్తం బెరియన్.
కం.లోకమున నాఁడునాఁటికి, శోకంబు క్షయించుచుండుఁ ♦ జుమ్మీ యెందున్
నాకన్ననో నానాఁటికి, శ్శోకన్యక లేమి వనట ♦ మఱి మఱి పెరిఁగెన్. ౧౦౮
తే. లేదు వగపు కాంత ♦ దాదవ్వ చనె నని, లేదు వగపు మ్రుచ్చి♦లింపఁ బడుట
కంబుజాతనేత్ర ♦ కరుగు చున్నది గదా,వయ స టంచు నాత్మ ♦ వగచువాఁడ.
శా.పొమ్మీ మారుత! సీత యున్నయెడకుం ♦ బూఁబోఁణి స్పర్శింపుమీ
రమ్మీ నన్ను స్పృశింపుమీ మరల, సా♦రంగాంకుమార్గమ్మునన్
గొమ్మం జూచెద,[1] నట్లు నీవలన నా♦కున్ జానకీకోమలాం
గమ్ముం దాఁకినయట్టులౌఁ, గలదె భా♦గ్యం బంత నా కక్కటా? ౧౧౦
ఉ. రావణుచేతఁ జిక్కువడి ♦ రాజముఖీమణి నన్నుఁ గూర్చి హా
జీవితవల్లభా![2] యని వ♦చించిన యార్తివిలాపయుక్త మా
నావచనంబులన్ మనము♦నందుఁ దలంపఁ దలంపఁగా నశే
షావయవంబులున్ విషము ♦ నానినయట్టులు క్రాఁగఁ జొచ్చెడిన్. ౧౧౧
కం.చింతాజ్వాలాయుతము ని,తాంతవియోగేంధనప్ర♦తానేధిత మా
కంతుజ్వలనము రేవగ, లెంతయు నాదేహమున్ ద♦హించెడి వత్సా! ౧౧౨
తే. నిన్ను విడనాడి లక్ష్మణా! ♦ నీరనిధిని, నేను మునిఁగి సుఖంబుగా ♦ నిద్దురింతు
నారములలోన శయనించు♦న న్నదెట్లు, నీరజేషుఁడు దహియింప ♦ నేర్చువాఁడు.
కం.అక్కమలాక్షియు నేనును, నొక్కవసుంధరనె నిలిచి ♦ యుండుటచే నే
నెక్కరణినో మనఁ గల్గితి, గ్రక్కన నహ్వాలఁతిఁ జూడఁ♦గల్గునె నాకున్. ౧౧౪
కం.ఆవారి జలము గలమడి,క్రేవలఁ దడిలేనిపొలము ♦ క్రీయాటవలెన్
బావని మని యున్నది యని, నే వినుటను బ్రదుకుఁ గంటి ♦ నిర్మలచరితా. ౧౧౫
ఉ. ఎన్నఁడు గాంచువాఁడనో య♦హీనవిరోధులఁ జంపి నిస్తులా
భ్యున్నతి నొందులక్ష్మివలె ♦ నుగ్మలి నీరజపత్రనేత్ర, నే
నెన్నఁడొ గాసిఁబడ్డయతఁ ♦ డిష్టరసాయన మానుభంగి నా
యన్నుముఖాబ్జమెత్తి యధ♦రామృత మానుదు నాశ దీరఁగన్. ౧౧౬

[1] నేను జంద్రునిఁ జూచెదను. సీతయుఁ జంద్రుని జూచును. ఆ మార్గమున నేను సీతను జూచెదను. అట్టులే గాలి యిరువురను దాఁకుటచే నిరువు రొకరి నొకరు స్పృశించి నట్లయ్యె. [2] గోవిందా యని ద్రౌపది యఱచినట్లు ప్రపన్నుల యార్తి భగవంతుఁడు విని సైఁపఁడు.

కం.బలిసిన యిఱిసిన తాళీ,ఫలములతో నెనయుచున్న ♦ పద్మాక్షికుచం
బులు న న్నెన్నఁడొ కౌఁగిట, నలరించెడి వేళఁ గంప ♦ మందెడి నయ్యో. ౧౧౭

కం.నన్నుం బ్రాణేశ్వరుఁగాఁ, గొన్నసతీమణి యరాళ♦కుంతల సోఁకుం
గన్నెలనడుమ ననాథవ,లె న్నవసెడిఁ గాచుదిక్కు♦లే కెడపడుచున్. ౧౧౮

కం.జనకునినుత యఁట దశరథు,జనపతికోడ లఁట నాదు♦సతి యఁట రక్షో
వనితాజన తామధ్యము,నను నిద్దుర నెట్లు గొనెడి ♦ నవలామిహాయున్. ౧౧౯

కం.గారేతరనీరదతతి,దారితమగుఁ దోఁచుశార♦దవిధుకల యనఁగ
గ్రూరాసురులఁగ సతి ధి,క్కారించియు వెలికి రాఁగఁ ♦ గలుగుట యెపుడో.

చం.తరళమృగాక్షి నైజముగఁ ♦ దాను గృశాంగియ, యందు నిప్పు దు
ర్భరబహుళార్తిచేతను, వి♦పర్యయ మాటను దేశకాలముల్,
కర ముపవాసముం బడుటఁ ♦ గాంత మ ఱెంత కృశించెనో కదా
హరిహయువైరిఁ ద్రుంచి ముద♦మార ధరానుతఁ దెచ్చు టెన్నఁడో. ౧౨౧

తే. దేవతాకన్యఁ బోలునా♦దేవి సీత
పరమసాధ్వీమచర్చిక ♦ పరమరతిని
నెప్పుడో కదె నాకంఠ ♦ మెలమిఁ గ్రుచ్చి
వితతమోదాశ్రువులఁ దాను ♦ విడువఁగలదు. ౧౨౨

కం.నాసతిఁ దరుణీరత్నము, భూసుత నెడఁబాయఁ బెరుఁగు♦భూరివ్యథ నే
మాసినవస్త్రముమాడ్కిని, బాసి సుఖముపడఁగఁగలుగు♦భాగ్యం బెపుడో. ౧౨౩

చం.అని విలపించు చుండఁగ ది♦నాంతమునం గడుమందరశ్మి యై
దినకరుఁ డస్తమించుటయు ♦ దీనత పాయ వచించి లక్ష్మణుం
డనునయసూక్తిఁ దేర్చుటయు ♦ నంబుజలోచన సంస్మరించుచున్
వనట మునుంగుచున్ నృపతి♦వర్యుఁడు సంధ్య యజించె భక్తిమై. ౧౨౪

### రావణుఁడు మంత్రులతో నాలోచించుట.

ఉ. అక్కడ రావణుండు త్రిద♦శాధిపతుల్యుఁడు మారు తాత్మజుం
డెక్కటి[1] లంకలోఁ జ ఘటి♦యించిన ఘోరము భీతిదంబు నా
నక్కృతి నెంచి రాక్షసస♦భాంతరసీమను సిగ్గు దోఁపఁగా
నుక్కఱి నేలఁ జూచు చను♦రోత్తమవీరులతోడ ని ట్లనున్. ౧౨౫

ఉ. వానరమాత్రుఁ డొక్కరుఁడు ♦ వాలినశక్తిఁ జొరంగరాని లం
కానగరంబుఁ జొచ్చి నసుఁ ♦ గానునకుం గొన కాథరానుతన్
గానఁగఁ బోయి పెన్నవని ♦ గల్గినగోపుర ముర్విఁ గూల్చి ర
క్షోనిచయంబుఁ జంపి పురి ♦ ఘోరవిధిన్ దహియించె నుగ్రుఁడై. ౧౨౬

[1] ఎక్కటి = అసహాయుఁడై.

ఉ. ఏమి యొనర్చువాఁడ? నిఁక ♦ నెయ్యది మార్గము? మీకు నాకు మే
లేమివిధంబునం గలుగు? ♦ నేమి యొనర్చిన నెల్లఁ జక్క నౌ?
రాము నెడాటమం[1] దెటులు ♦ గ్రాలిన మే లొనగూడుఁ? జెప్పుఁడా
మీమతమున్, జయాస్పదము ♦ మేలిసుమంత్రము యందు రార్యులున్. ౧౨౭

తే. జగతిఁ బురుషులు గలరు ము ♦ త్తెగలవారు, దలఁప నుత్తమ మధ్యమా ♦ ధము లనంగ
వారియందలి గుణదోష ♦ వర్గములను, వరుస వచియింతు రాక్షస ♦ ప్రవరులార!

చం. సమసుఖదుఃఖబాంధవుల ♦ సంహతితోఁ దనమేలు గోరు నె
య్యముగలవారితోడఁ దన ♦ యాప్తను నచ్చినమిత్రకోటితో
విమలమనీష యోజనలు ♦ వే యొనరించి ఫలంబు దైవయ
త్నముగను గార్యముం గడఁగు ♦ తజ్జ్ఞునిఁ డుత్తముఁ డండ్రు కోవిదుల్. ౧౨౯

కం. దైవమె శరణంబుగఁ గొని, భావించి యొకండె కార్య ♦ పద్ధతి నొకఁడే
కావింపఁ బూనె నేనియు, నావాఁ డగు మధ్యముం డ ♦ టందురు ప్రాజ్ఞుల్. ౧౩౦

కం. అరయక గుణదోషంబులఁ, బోరి దైవాశ్రయము చింత ♦ పూనక పని దా
నెరయింపఁబూనియును నది, పరిపూర్తి నొనర్పకున్న ♦ వాఁ డధముఁ డగున్. ౧౩౧

ఆ. పురుషులందుఁబోలె ♦ సురవైరివరులార! యొప్పు మంత్రములను ♦ నుత్తమాధ
మములు మధ్యమంబు ♦ మఱి వీని లక్షణములను విశదపఱుతుఁ ♦ దెలియ వినుఁడు.

తే. శాస్త్రదృష్టిని జూచుచు ♦ సచివులెల్లఁ
గార్యమునయందు నాసక్తి ♦ కడమ వడక
యైకమత్యంబు వహియింతు ♦ రట్టియదియ
యుత్తమాలోచనం బందు ♦ రుర్వి బుధులు. ౧౩౩

తే. కార్య మాలోచనము సేయఁ ♦ గడఁగు నపుడు
మొదల వేర్వే ఱభిప్రాయ ♦ ములను గొనియుఁ
దుదకు నేకమతంబునఁ ♦ బొదలిరేని
దాని మధ్యమ మందురు ♦ తత్త్వవిదులు. ౧౩౪

తే. ఒకరిమతమును మెచ్చక ♦ యొక్కరుండు, తాను బట్టినపట్టును ♦ మానుకొనక
యైకమత్యంబునందు శ్రే ♦ యస్సు లేద, టన్నయాలోచనం బది ♦ యధమ మండ్రు.

ఉ. మీరలు బుద్ధిమంతులరు ♦ మే లగు కార్యము నిశ్చయించి యీ
తీరునఁ జేయ నౌ ననుచుఁ ♦ దీ రెఱిఁగించు టె నాయభీష్ట మా
వీరుల వానరేంద్రులను ♦ వేలకొలందులఁ గూడి భీకరా
కారత ముట్టడించు రఘు ♦ కాంతుఁడు లంక నిజంబు చూడఁగన్. ౧౩౬

[1] రాము నెడాటమందు = రామునివిషయమందు.

ఉ. సానుజుఁడుం జమూయుతుఁడు ♦ నై రఘురాముఁడు దాఁటివచ్చు న
న్యూనసుఖంబుతో జలధి ♦ యుక్తపరాక్రమరీతి మైఁ బయో
హీనముఁ జేసియో మఱి యెదేని ♦ నిజాద్భుతశక్తిఁ జూపియో
కానఁ బురీబలంబులకుఁ ♦ గల్గ శుభం బొకయుక్తిఁ జెప్పఁడా. ౧౩౮

## రాక్షసులు రావణుపరాక్రమంబుఁ బొగడుట.

చం. పవిధరవైరిపల్కులకుఁ ♦ బల్కిరి మోడుపుఁ గేల నెల్లదా
నవులు మహాబలాఢ్యులు మ♦నంబున నాత్మవిరోధిపక్షముల్
లవము నెఱుంగ లేక మిగు♦లన్ మతిహీనత నీతిబాహ్యులై;
భువి నవినీతులైనసచి♦వుల్ గద రాజులపాలిశాత్రవుల్. ౧౩౯

సీ. దనుజేంద్ర! యిటు విషా♦దముపడ నేటికిఁ? బట్టిసశక్త్యృష్టి♦పరిఘశూల
సంకుల మగుమహా♦సైన్యంబు నీ కుండఁ, బరిమార్చితివి భోగ♦వతిని ఫణులఁ
గైలాసవాసి య♦క్షవ్యూహసంయుతు, ధనదుని నోడిచితి ♦ దర్పగరిమ
నమ్మహేశ్వరుసఖ్య ♦ మంది కీర్తితుఁడవై, కినుక దిక్పాలుర ♦ గెలిచి తీవు

తే. యక్షులను బట్టి గళవళ ♦ మందఁ జేసి, కొట్టి వధియించి కైలాస♦కూటమందుఁ
జేజరిల్లువిమానంబుఁ ♦ దెచ్చి తిటకు, నీకు సరివారు గలరె ము♦ల్లోకములను?

చం. భయమున నీదుసఖ్యమును ♦ బ్రార్థన సేయుచు నాత్మసంభవన్
మయుఁ డనుదానవేశ్వరుఁడు ♦ మానుగ నిచ్చెను నీకు భార్యగా,
జయము గొనంగ లేదొకో ర♦సాతలసీమ రణంబునన్ బిలే
శయులను[1] వాసుకిన్ జటిని ♦ శంఖుని దక్షకు గెల్చి శూరతన్. ౧౪౦

ఉ. దానవనాయకుండు బల♦దర్పితమానసుఁ డామధుండు కుం
భీనసిసౌఖ్యధాత యతి♦వీరుఁడు నీకు వశంపడండె? యు
ద్ధాన సమస్తదిక్పతుల♦దర్ప మడంచి సురేంద్రలోకముం
బూనక చేరి యందు బల♦మర్దను నిర్జితుఁ జేయవే ప్రభూ. ౧౪౧

కం. బలయుతుల లబ్ధవరులను, గలిశూరుల నక్షయులను ♦ గదనములోనన్
నిలిచి యొకయేఁడు దనుజుల, గెలువవె మాయలను నేర్చి ♦ కీర్తిం గనవే. ౧౪౨

కం. విక్రమవంతుల మఱి ని, ర్వక్రభుజబలాఢ్యయుతుల ♦ వరుణాత్మజులన్
జక్రాన్వితుల బాహుప, రాక్రమమున గెలువలేదె ♦ రణలంపటతన్. ౧౪౩

చం. ప్రకటితశాల్మలీద్రుమవి♦భాసము భీకరమృత్యుదండన
క్రకమును గాలపాశసుత♦రంగము దండధరోగ్రకింకరా
హికము పరేతరాడ్బలమ♦హిష్ఠసముద్రముఁ జొచ్చి మృత్యువున్
దికమికఁ గూర్పవే జగము ♦ దిగ్భ్రమ నొంద జయంబుఁ గాంచవే. ౧౪౪

---

[1] బిలేశయులు = సర్పములు.

ఉ. పుత్త్రవిరోధిసన్నిభులు ♦ విశ్రుతవీర్యపరాక్రమాఢ్యు లౌ
క్షత్త్రియు లీధరాస్థలిని ♦ గాననవృక్షములట్టు లుండఁగా
దాత్త్రము చేతఁ బోలె శర♦దారితగాత్త్రులఁ జేయవొక్కో; యా
గోత్త్రధృతీద్యవిక్రముల♦కుఁ సరి వచ్చునె రాముఁ డాజిలోన్. ౧౮౫

ఉ. ఊరక యుండు గాసి గొన ♦ కోమనుజాశననాథ! పాకజి
ద్వైరి యొకండె చక్కఁడుచు ♦ వానరకోటుల నెల్ల, మృత్యుసం
హారు మహేశుయజ్ఞమున ♦ హర్షితుఁ జేసి సుదుర్లభంబు దు
ర్వారము నొవరంబుఁ గని ♦ రంజిలఁ జేయఁడె యెల్లవారలన్. ౧౮౬

సీ. శక్తితోమరచయ♦శకులీకమును విని, కీర్ణాంత్రశైవాల♦కీలితంబు
వారణకచ్ఛప♦వారసంబాధంబు, నశ్వమండూకచ♦యాంచితంబు
నాదిత్యరుద్రమ♦హాగ్రాహమును మరు, ద్వసుమహాపన్నగ♦దరకరంబు
స్యందనతురగగ♦జాంబుపూరంబును, బటుపత్తిసైకత♦భ్రాజితంబు

తే. నైననిర్జరసైన్యమ♦హార్ణవంబుఁ, బఱచి శంబరవృత్రహుఁ ♦ బట్టి లంక
కిటకుఁ గొనివచ్చి శ్రీసుర♦జ్యేష్ఠునాజ్ఞఁ, దలఁచి విడిచినశూరుఁ డీ♦తండ కాఁడె.

ఉ. కావున నిట్టియాత్మజు న♦ఖండపరాక్రము నింద్రజిత్తుఁ గీ
శావళి రామయుక్తముగ ♦ నంతకునంతికసీమఁ జేర్పఁగాఁ
బోవ ననుజ్ఞ యిమ్ము, పొరి♦పుచ్చును వారలఁ, బ్రాకృతుం డొకం
డావిధిఁ జేటు గూర్చె నని ♦ యాత్మఁ గలంగకు, గెల్తు రాఘవున్. ౧౮౮

→ ప్రహస్తాదులు తమతమ పరాక్రమంబు రావణుతోఁ జెప్పుట. ←

ఉ. అంతట సైన్యనాథుఁ డసి♦తాబ్జనిభుండు ప్రహస్తుఁ డుగ్రదు
ర్దాంతపరాక్రమోద్ధతుఁడు ♦ ప్రాంజలియై యసురేంద్ర! యేల యీ
చింత? సురాసురోరగవి♦శిష్టపిశాచగణంబు లేని నీ
చెంతలఁ జేర లే వనఁగఁ ♦ జెప్పెడి దేమి వనేచరావళిన్. ౧౮౯

ఉ. ఎవ్వఁడు మమ్మెదుర్చు మము ♦ నెవ్వఁడు గెల్వఁగఁ జాలు నంచు మే
మివ్విగ సప్రమాదగతి ♦ నేమఱి యుంటిమి గాన వానరుం
డవ్విధ మేనితోఁ జనఁగ ♦ నయ్యెను వంచన చేసి, కానిచో
నవ్వనగోచరుఁ యమగృ♦హాతిథిగా నొనరించి యుండనే? ౧౯౦

చం. జలధిపరీతధారిణి స♦శైలవనాంత మవానరంబుగాఁ
జలిపెద, నాజ్ఞ యి మ్మిపుడ ♦ చయ్యన నేగెదఁ, గ్రోతిచేత నే
విలయము గూడకుండ నొక♦వేయివిధంబులఁ గాపు పెట్టెదఁ,
గలుగదు స్వాపరాధభవ♦కష్ట మొకింతయు నీకు నావుడున్. ౧౯౧

ఉ. క్రుద్ధుఁడు దుర్ముఖుం డనెడి♦ఘోరపలాశి వచించెఁ గ్రోఁతి దు
ర్బుద్ధి పురంబువారికిని ♦ బొల్తుకకూటువకున్[1] సురేంద్రునిన్
బద్ధు నొనర్చినట్టిబల♦వంతున కీయసురాధినేతకున్
సిద్ధ మగౌరవం బొనరఁ ♦ జేసెను, దీనిని సైఁపఁ జెల్లునే. ౧౫౨

కం. ఈనిమిషంబున నొకఁడన, వానరవర్గంబు మిన్ను ♦ ప్రాఁకిన జలధిం
దీనతఁ దూఱ భుజంగ,స్థానంబున కేగఁ బట్టి ♦ చంపెదఁ గడిమిన్. ౧౫౩

చం. అనవుడు వజ్రదంష్ట్రుఁడు మ♦హాబలశాలి పలాస్రరూషితం
బును బరిఘంబుఁ గేలఁ గొని ♦ బొబ్బిడుచుం బలుకున్ దపస్వియా
వనచరుతోడ నేమి పని ♦ వ్రాలినశక్తిని రాముఁ డుండఁగా
ననుజుఁడు లక్ష్మణుండుఁ బ్లవ♦గాధిపుఁ డుండఁగ? నే నొకండనే ౧౫౪

కం. రాముని సుగ్రీవాన్వితు, సౌమిత్రియుతంబుగాఁగఁ ♦ జప్పున నిపుడే
నామ మణఁతుఁ బరిఘంబున, భీమంబుగఁ గ్రోఁతు లదరి ♦ బెదరి తపింపన్. ౧౫౫

శా. రాజేంద్రా! విను మే నుపాయ మను వా♦రం బల్కెదన్, యుక్తులన్
భ్రాజద్ధీ వచియించువాఁడె యరిఁ దీ♦ర్పం జాలు నిస్తంద్రుఁడై
యోజస్స్ఫీతులఁ గామరూపధరులన్ ♦ యుద్ధక్రియాభీలర
క్షోజాగ్ర్యుల నేఁటి వేలకొలఁదిం ♦ గూర్పం దగున్ వెంటనే. ౧౫౬

ఉ. వారలు మానవాకృతుల ♦ వారిజమిత్రకులీను రామునిన్
జేరి భవత్సహోదరుఁడు ♦ శ్రీభరతుం డనిపె న్మము న్నృభా
కారుఁడ దేమొ యాత్యయిక♦కార్యము గల్గెఁ బురంబుఁ జేర నే
తేరు మటంచుఁ బల్కె నసఁ ♦ దెప్పున నాతఁడు పోవు సేనతోన్. ౧౫౭

కం. ఆసమయంబునఁ జాపశ,రాసిగదాకరుల మగుచు ♦ నభ్రతలమునన్
రాసుల మై ప్లవగులను బ,రాసులఁ జేయంగవచ్చు ♦ నశ్మనువృష్టిన్. ౧౫౮

కం. ఈయనువున మాపన్నిన,మాయలలోఁ జిక్కి రామ♦మహీపుఁడు ననుజుం
డాయమసదనముఁ జేరం, బోయెద రంతటను బీడ ♦ పోవును మనకున్. ౧౫౯

తే. కుంభకర్ణసుతుండు ని♦కుంభుఁ డనెడి, ఘోరదర్పుఁడు పరమసం♦క్రుద్ధుఁ డగుచు
భువనరావణు రావణుఁ ♦ బోలఁ జూచి, యధికగంభీరవాక్కుల ♦ ననియె నిట్లు.

ఉ. ఉండుఁడు మీర లింద యసు♦రోత్తముఁ గొల్చుచు నే నొకండ దో
ర్దండపరాక్రమక్రమవి♦దారితగాత్రులఁ జేసి పుచ్చెదన్
భండనసీమ రాఘవుని ♦ భ్రాతృయుతున్ హనుమం గపిప్రభున్;
జెండెదఁ దక్కు వానరవి♦శిష్టచమూనివహంబు వ్రేల్మిడిన్.[2] ౧౬౦

[1] పొల్తుకకూటువకున్ = అంతఃపుర స్త్రీలకు. [2] వ్రేల్మిడిన్ = చిటికవేయుకాలములో.

కం.అప్పుడు వజ్రహనుం డను,నప్పలలాశనుఁడు పర్వ♦తాభుఁడు క్రోధం
బుప్పతిలఁ బెదవి నాకుచుఁ, దెప్పున వచియించెఁ దనదు♦ధీరత వెలయన్. ౧౬౨

ఉ. ఎక్కడిజోలి వీరికిఁ, జనుఁ♦డీ పదఁడీ మదిలోనఁ జింతలం
దక్కి యథేచ్ఛ మైఁ బను లొ♦నర్చుకొనం, దనివార మాంసముల్
మెక్కుఁడు త్రాగుఁడీ మధువు ♦ మెచ్చగు నాటల నాడుఁ, డొక్కఁడన్
గ్రక్కున రాఘవాంగదుల ♦ గాడ్పునుతుం గపిరాజుఁ ద్రుంచెదన్. ౧౬౩

←→ రభసాదులు విజృంభించి పలుకుట. ←→

సీ. అంతట రాక్షసుల్ ♦ యజ్ఞహంతుండు నికుంభ, రభస మహాపార్శ్వ ♦ రశ్మికేతు
సూర్యశత్రువులును ♦ సుప్తఘ్నుఁడును మహో,దరుఁ డగ్నికేతుండు ♦ దశశిరస్క
సుతుఁ డింద్రజిత్తు ని♦స్తులుఁడు ప్రహస్తుండు, నతికాయుఁడును విరూ♦పాక్షుఁ దుగ్ర
ధూమ్రాక్షుఁడును వెండి ♦ దుర్ముఖవజ్రదం,ష్ట్రులు పట్టసంబులు ♦ శూలములును
తే. ప్రాసశక్తిపరశ్వధ♦పరిఘములును, గాండదీపితచాపముల్ ♦ ఖడ్గములును
నొడిసి త్రిప్పుచుఁ జెల రేఁగి♦మిడిసిపడుచు,మండుచును బల్కి రసురప్ర♦కాండు తోడ.

కం.ఈనగరంబును గాల్చిన,యానీచుని హనుమ రాము ♦ ననుజసమేతున్
వానరనాయకు నిపుడే, నేనే వధియింతుఁ ద్రుంతు ♦ నేనే నేనే. ౧౬౫

కం.అని కేల నాయుధంబులు, గొని బిరుదము లాడు నసుర♦కోటులఁ దమయా
సనముల నుండ న్వారలిచి,యనియె విభీషణుఁడు భ్రాత ♦ కంజలితోడన్. ౧౬౬

←→ విభీషణుఁడు రావణునకు రాజనీతిఁ దెలుపుట. ←→

కం.విను సామదానభేదము, లనెడు నుపాయముల మూఁట ♦ నర్థము సిద్ధిం
గన కున్న విక్రమంబును, గొనియాడుదు రయ్య నీతి♦కోవిదవర్యుల్. ౧౬౭

చం.అమలినరాజ్యతంత్రముల♦యందు విరక్తునిమీఁద, నింద్రియ
ప్రమదసురక్తి హెచ్చరిక ♦ వాసినయాతనిమీఁద, దైవసా
హ్యము గనరానివానిపయి ♦ నర్భకభీరులమీఁద, మంత్రయు
క్తముగ విమర్శ సల్పి మఱి ♦ దండముఁ బూన జయంబు సిద్ధమౌ. ౧౬౮

ఉ. ఏమఱుపాటు లేదు మది ♦ నేనియు, గెల్పు గొనంగఁ గోరెడిన్,
భీమబలస్థితుండు, రణ♦వీథిని దేఱి కనంగరాదు, దు
ర్దామపరాక్రముండు, విజి♦తప్రతిఘుం, డలరామభద్రుఁ డా
రాముని నెట్లొకో ఘనప♦రాక్రమవృత్తి జయింపఁ జూచుటల్. ౧౬౯

కం.ఘోరనదీనదపతిఁ గూ,పారము లంఘించి యొక్క♦ప్లవగుం డరరే
ధీరత దుష్కరకార్యముఁ, దీరుచు నని యెవ్వఁ డే మ♦దిం దలఁచె నొకో ౧౭౦

కం. బలమా లెక్కింపఁగ రా, దలవును నట్టిదియ పగలు ♦ కట్టియెడం గే
వలము నలక్ష్యంబుగ నిటు, పలుకఁగ నర్హంబె యసుర♦వల్లభులారా! ౧౭౧

ఉ. ఏయపకారముం జలిపె ♦ నేర్పడఁ జెప్పఁడు రాఘవుండు దై
తేయకులాగ్రగణ్యునకుఁ ♦ దేరకుఁ దా మును మున్న యాతఁడే
యాయమనీంద్రుభార్యను వ♦నాంతరవీథి హరించి తెచ్చె, న
న్యాయచరిత్ర మెవ్వరిదొ ♦ యాడుఁడ యెవ్వరొ వైరకారకుల్? ౧౭౨

ఉ. రాముఁడు గాఁడె మున్ను ఖర♦రాక్షసునిం దునుమాడె? నందరా
యామనుజాళనుండె కద ♦ యాతని పైపడిపోయెఁ జివ్వకై?
భూమిని నెల్లప్రాణులును ♦ బూని యథాస్వబలంబుగాఁ దముం
దాము సురక్షసేఁత తగ♦దా? యది దోషమె మీర చెప్పఁడా? ౧౭౩

కం. పరదారహరణ మెప్పుడుఁ, గర మపకీర్తిని ఘటించుఁ ♦ గలుషముఁ బెంచున్
హరియించు నాయు వర్థముఁ, బొరి నాశము సేయుఁ గానఁ ♦ బుణ్యాజనేంద్రా.

మ. తలఁపన్ జానకికారణంబుగ సము♦త్పాదిల్లె నీయెల్లవా
రలకున్ భూరిభయంబు, నిక్క మిది, కా♦ర్యం బామెఁ బో వీడుటల్;
కలహార్థం బొక కార్యముం జలుప బా♦గా? యా నటం చందువే
గలహంబే నిజమేని యేమి పని లం♦కన్ సీతతోఁ జూడుమా.[1] ౧౭౫

కం. సారబలిష్ఠుఁడు ధర్మా,చారరతుం డట్టిరామ♦చంద్రునితో ని
ష్కారణవైరము దగునే? శ్రీరామున కప్పగింపు ♦ సీతాదేవిన్. ౧౭౬

కం. చారుమణిసంకులము హయ,వారణయుక్తంబు లంక ♦ పరబాణాళిన్
దారితము గాక మున్నే, శ్రీరామున కప్పగింపు ♦ సీతాదేవిన్. ౧౭౭

కం. ఘోరము దుర్ధర్షము కపి,వారము మనపురికి లగ్గ♦పట్టక మును పే
పేరిమి యెసఁగఁగఁ దండ్రీ, శ్రీరామున కప్పగింపు ♦ సీతాదేవిన్. ౧౭౮

కం. మానవభోజులతో లం,కానగరము నాశమందు ♦ త్వానుత నీవే
మానితగతి నీవేనియు, జానకిని న్నరల రామ♦చంద్రున కిమ్మా. ౧౭౯

ఉ. అన్నవు గావ ని న్నిదిగొ ♦ హస్తముల న్ముకుళించి వేఁడెదన్,
నన్ను ననుగ్రహింపు, దయ ♦ నావచనంబులచొప్పు చేయుమీ
యన్న! హితంబుఁ బథ్యమును ♦ నాడితిఁ గాని మ అొండు గాదు, త్వా
కన్నను రామచంద్రునకుఁ ♦ గ్రమ్మఱఁ బుచ్చుము మేలు హెచ్చఁగన్. ౧౮౦

క. శరదర్కకరనిభంబును, బురుదృఢము నవాగ్రపుంఖ♦మును నగుధరణీ
వరుశరనికరము నిన్నుం, బొరిగొన వెడలకయమున్న ♦ పుచ్చుము సీతన్. ౧౮౧

[1] యుద్ధమే యభీష్టమేని సీత లంకలోనుండినను లేకుండినను నొకటే.

పంచచామరము. త్యజింపవయ్య కోపముం సు♦ధర్మ సౌఖ్యనాశముం
భజింపవయ్య సౌఖ్యకీర్తి♦వర్ధనంబు ధర్మముం
భుజింపవచ్చు భోగముల్ స♦పుత్రమిత్ర రాక్షస
వ్రజంబులెల్ల, సీత నిమ్ము ♦ రామభూమిభర్తకున్. ౧౮౨

కం. నావుడు విభీషణునివా,క్యావళి నాలించి రాక్ష♦సాధిపుఁడు వెసం
దా వారి నెల్ల వీడి ని,జావాసముఁ జొచ్చెఁ బరిజ♦నావళితోడన్. ౧౮౩

## ↞ విభీషణుఁడు రావణుగృహంబునకుఁ బోవుట. ↠

సీ. శైలాగ్రసంచయ♦సన్నికాశంబును, సుర్వీధరోరుశృం♦గోన్నతంబు
సువిభక్తకక్ష్యంబు ♦ సూరిసంయుతమును, మతిమత్సురక్తస♦న్మంత్రియుతము
నాప్తపర్యాప్తసు♦రారిరక్షితమును, శంఖనిస్వనమహా♦స్వానితంబు
ప్రమదావితానసం♦బాధితంబును దూర్య,నాదానునాదిత♦నవ్యతలము
తే. మత్తమాతంగనిశ్శ్వాస♦మారుతాధి,కాకులీకృతవాతవి♦హారహృద్య
మతులకలకలకలితమ♦హాపథంబు, తప్తకాంచనమత్తదం♦తావళంబు. ౧౮౪

కం. మరుతుల గంధర్వుల మం,దిరముల కెన యగుచు రత్న♦నికరముచే సం
భరితం బై భోగుల సుం,దరగేహము నట్లు వెలయు♦దానిం ద్యుతిమై. ౧౮౫

తే. ప్రాప్తధర్మార్థనిశ్చయుం♦డై విభీష,ణుండు భీషణకర్ముండు ♦ చండభానుఁ
డభ్రపటలంబుఁ జొచ్చున♦ట్లన్నగృహముఁ,జొచ్చె మఱునాఁటి వేకువ♦శుద్ధమతిని.
తే. భ్రాతృజయసంశ్రితంబులు ♦ పరమపుణ్య,ములును వేదవిదభిహిత♦ములును నైన
విమలపుణ్యాహరవములు ♦ వినుచు నచటి,దధిఘృతాక్షతపుష్పపా♦త్రములచేత
తే. అర్చితము మంత్రవేదవి♦దవనివిబుధ,పూగముం గని రాక్షస♦పూజ్యమానుఁ
డగుచుఁ దన తేజున వెల్గు ♦ నాసనస్థు, శ్రీదసోదరుఁ గనుఁగొని ♦ చేరి మ్రొక్కె.

కం. ఈరీతి మ్రొక్కి విహితా,చారవిదుఁడు నడపి యర్హా♦చర్యల రక్షో
వీరుని కనుసన్నఁ జేఁగి మ,హారజతాసనమునందు ♦ నాసీనుండై ౧౮౯

## ↞ విభీషణుఁడు రావణునకుఁ బురంబున నపశకునంబులు పుట్టుటఁ జెప్పుట. ↠

తే. దేశకాలార్థసంవాది ♦ దృష్టలోక,మంగళామంగళుం డట ♦ మంత్రు లెదుట
విజనముగ సాంత్వసూక్తుల ♦ విభుఁ బ్రసన్నుఁ,జేసికొని యిట్టు లనియె న♦శ్లిష్టఫణితి.

శా. అన్నా! జానకి యెప్డు నీపురికి సం♦ప్రాప్తించె నాఁ డాదిగా
నెన్నంజాలని పెక్కుదుశ్శకునము ♦ లీక్షింప నయ్యెం జుమీ
చెన్నారండు సుమంత్రయుక్తహవులం ♦ జేర్పంగనుం ధూమజా
లోన్నత్యుండు సవిస్ఫులింగుఁడు సధూ♦మార్చిర్యుతుం డగ్నియున్. ౧౯౧

ఆ. వంటయిండ్లలోన ♦ వైశ్వానరునిగృహం,బులను వేదపాఠ♦ములు పఠింపఁ
బడెడిమందిరములఁ ♦ బాములు ప్రాఁకెడి, హవ్యములను జీమ♦ లంటఁ దొడఁగె.

కం. ఆవులు పట్టి చనెన్ దం,తావళములమదము చెడియె ♦ దైన్యముతో మే
పావంత యెలమి ముట్టవు, మావులు మనవీట విమత♦మదమానహరా! ౧౯౩

కం. ఖరములకు నొంటెలకుఁ గం,చరగాడిదలకును రాలి ♦ చనె వెండ్రుక లే
తెరువునఁ జికిత్స చేసినఁ, బురి గొన వాభంగి బాష్ప♦ములు పొరిఁ గార్చున్.

కం. కాకులు గుంపులు గుంపులు, నై కఠినరవాళి నినిచె ♦ నన్నితలములన్
క్రోకలు నై విహరించెడిఁ, గాకారవముల విమాన♦గణములమీఁదన్. ౧౯౫

కం. గ్రద్దలు చక్రాకృతిగాఁ, బద్దుగఁ దిరుగాడి వ్రాలె ♦ భవనంబులపైఁ
బ్రొద్దుల సాయంవేళలఁ, దద్దయు నక్కలును నించె ♦ దారుణరవముల్. ౧౯౬

కం. పిడుగులవడువున రవములు, కడు బెడిదముగాఁగ నించెఁ ♦ గ్రవ్యాదంబుల్
విడివడి పురిగవఁకులకడ, విడువక తద్ధ్వనులు వీట ♦ వినఁగా నయ్యెన్. ౧౯౭

→ విభీషణుఁడు రావణుతో సీతాదేవిని శ్రీరామున కిమ్మని చెప్పుట. ←

కం. ఈయశుభంబుల కెల్లను, బ్రాయశ్చిత్తం బొకండు ♦ వాకొను వాఁడన్
జేయు మిది సీత రామున,కై యర్పింపుము క్షితీశ ♦ యభిమత మేనిన్. ౧౯౮

కం. ఇది యజ్ఞానముచేతనొ, బ్రదికెడియాసలనొ యిట్లు ♦ పలికితి ననుచున్
మదిఁ దలఁతు వేనియును సుర,హృదయవ్రణ! యపుడు దోష ♦ మెంచకు నాపై.

కం. పురమున నంతఃపురమునఁ, దరుణులకుం బురుషులకు ను♦దాహృతదోషో
త్కరములు విదితంబులు చు, మ్మరయుము వలతేని రాక్ష♦సాన్వయచంద్రా! ౨౦౦

కం. విను నీమంత్రులు నీకున్, వినిపింపఁగ లేరు సుమ్ము ♦ వీని న్నేనో
కనినది వినినది సర్వము, వినిపింపక యుండ నాకు ♦ విహితమె యన్నా! ౨౦౧

కం. కావున న్యాయాన్యాయము, లోవీరా! ముందు వెన్క ♦ యోజించి మఱిన్
గావింప వయ్య నీయి,చ్ఛావిధి నని చెప్పె నెల్ల♦సచివులు వినఁగన్. ౨౦౨

చం. హితము మహార్థమున్ మృదుల♦హేతుయుతంబు వ్యతీతకాలసం
ప్రతిశుభదంబు, సౌఖ్యదము ♦ భావిని, నొతనతమ్ము వాక్యముల్
శ్రుతిఁ జొరనిచ్చి రావణుఁడు ♦ క్రోధముఁ దాలిచి యాత్మకృత్యమం
దతిశయ మైనపట్టుదల ♦ నాతనితోడ వచించె నివ్విధిన్. ౨౦౩

ఉ. ఏమిర వచ్చె నంతభయ ♦ మీయెడ నా? కది యట్టు లుండనీ
రాముఁడు డాయునే జనక♦రాజకుమారిక? నెట్లు చూచినన్
సామరసంఘుశక్రుఁ డయి ♦ యాలము చేయఁగఁ బూనె నేనియున్
రాముఁడె నిల్చువాఁడు రణ♦రంగమునందు మదగ్రధారిణిన్? ౨౦౪

కం. అని నిర్జరసైన్యవిమ, ర్దనుఁడు మహాచండబలుఁడు ♦ దశవదనుండున్
దనయనుజుని హితవాదిని, ననఘు విభీషణుని విడిచి ♦ యవలకుఁ జనియెన్.

→ రావణుఁడు కొలువుకూటంబునకుఁ బోవుట. ←

కం. హితుల యనాదృతిని స్వయం, కృతసీతాహరణపాప♦కృతిచే సీతా
తత్కామమోహితుం డగు, పతితుఁడు రావణుఁడు చిక్కి♦బాఱుచు నుండెన్.
కం. ఆలోచనకును నర్హపుఁ, గాలము కడచనఁగ యుద్ధ♦కాలము డాయన్
గాల మిది సచివహితులో, కాళులతో ననుచుఁ దలఁచె ♦ నాలోచింపన్. ౨౦౭
సీ. బంగారుకిటికీలఁ ♦ బగడాలసొమ్ములఁ, దీరినగుఱ్ఱాల♦ తేరి నెక్కి
మబ్బు లుఱ్ఱెడిరీతి ♦ ♦గొబ్బున సభకు నై, దశకంఠుఁ డంతటఁ ♦ దరలి చనఁగ
వాలును బలుకయు ♦ వఱలుసాధనములు, ధరియించి మున్నుగొం♦దఱు చనంగ
నానావికృతవేష♦నానాపరిష్కార, భూషితు లిరువంకఁ ♦ బొల్చు చుండ
తే. రథములను వీరవారణ♦రాజిమీఁద, నటన మాడెడి వాజుల♦పటలిమీఁద
నతిరథులు కొంద ఱెక్కి ద♦శాస్యు బలసి, కొలిచి వెనువెంట నేగిరి ♦ కొప్పరించి
కం. పరిఘగదార్ష్టులఁ దో, మరములఁ బరశువుల శక్తి♦మండలి శూలో
త్కరములఁ గరములఁ దాలిచి, సురవైరులు చనిరి విబుధ♦సూదను వెంటన్.
ఉ. అంతటఁ దూర్యనిస్స్వనము ♦ లంతట నిండె మహారవంబుగా,
దొంతర లయ్యె శంఖముల♦ఘోరపునాదములున్, ధరాంబరా
క్రాంతము లయ్యె నేములవి♦రావము, లిట్లు రహింపఁ దారకా
కాంతిని మించె ఛత్త్రములు ♦ గ్రాల మహాపథమార్గగాము లై. ౨౧౦
కం. చనఁగా హాటకమంజరి, వినిచయగర్భితము స్ఫటిక♦విగ్రహములు నా
ఘనచామరవ్యజనములు, దనరారె దశాస్యసవ్య♦దక్షిణదిశలన్. ౨౧౧
కం. దనుజులు నేల న్నిలఁబడి, వినయంబునఁ గేలు మోడ్చి ♦ వినమితశిరు లై
ఘనరథసంస్థుని దశవ, క్త్రుని మ్రొక్కిరి పోవుచుండు♦క్రోవల నెదు రై. ౨౧౨
కం. దేవారులు జయజయ యని, దీవింపఁగఁ గొంద ఱందుఁ ♦ దెలచుచు నుండన్
భావిత తేజుఁడు సువిహిత, మై వెండిపసిండికంబ♦మై శోభిత మై ౨౧౩
తే. అమలినస్ఫటికాంతర ♦ మగుచుఁ బ్రేడి, పట్టుసరిగలరత్నకం♦బళము గలిగి
యాఱునూర్లపిసాసు ల♦హర్ని శంబుఁ, గాచుభవనోత్తమము విశ్వ♦కర్మకృతము. ౨౧౪
కం. రయమునఁ జొచ్చి విదూరజ, మయముం బ్రియకాజినాభి♦మండితము సుపా
శ్రయరాజిత మయినసము, చ్ఛ్రయపరమాసనముఁ గొనుచు ♦ రావణుఁ డంతన్.

→ రావణుఁ డెల్లరాక్షసుల సభకు రప్పించుట. ←

ఉ. దూతల వేగవంతులను ♦ దోడన పిల్చి జవంబున న్గహా
జ్ఞాతము నై సమర్థ్యము వి♦చార్యమునై పని యొండు గల్గె మీ

రాతతవేగ యుక్తి సభ ♦ కై చనుదెండని సర్వరాక్షస
వ్రాతముఁ బిల్చి రం డసన ♦ వారును నేగి పురంబులోనికిన్. ౨౧౬

కం. ఇల్లిల్లు తోఁటదొడ్డులు, సల్లలితవిహారదేశ ♦ సమితిఁ గనుచు వా
రెల్లరఁ బిలిచిరి మఱి ని, ద్రిల్లెడివారలను గూడ ♦ దిగులేది వెసన్. ౨౧౭

ఉ. కొందఱు స్యందనంబులను ♦ గొందఱు భూరిమదావళంబులన్
గొందఱు సైంధవంబులను ♦ గొందఱు కాల్నడ వచ్చుచుండఁగా
నందఱు తేర్ల వారణహ ♦ యంబులచే నగరంబు రాజిలెన్
గ్రందుగఁ బక్షిసంఘములు ♦ గ్రమ్మి రహించు నభంబుకైవడిన్. ౨౧౮

ఉ. యానము లెల్ల దూరతల ♦ మందున నిల్పి పదప్రచారులై
లోనికి సోఁకు లెల్ల గుహ ♦ లోనికిఁ బోవుమృగాధినాథులో
నా నయమార నేగి సుర ♦ నాయకగర్వవిదారిపాదముల్
పూని కరంబులన్ మరలఁ ♦ బూజితులై యుచితత్వ మేర్పడన్. ౨౧౯

కం. కొందఱు పీఁటల మఱియుం, గొందఱు దర్భాసనములఁ ♦ గొందఱు నేలన్
బృందారకరిపుశాసన, మొంది యతనిమ్రోల నెల్ల ♦ రుపవిష్టులుగాన్. ౨౨౦

సీ. అర్థనిశ్చయసమ ♦ ర్థాత్ములౌ పండితుల్, సర్వజ్ఞులును బుద్ధి ♦ చక్షువులును
గుణయుక్తు లగుమంత్రి ♦ కుంజరుల్ నూఱుల, కొలఁదిగ నుండిరి ♦ కూటముననుఁ
యోధులు పెక్కురు ♦ నొప్పిరా యాస్థాని, నందఱుఁ బతిసేమ ♦ మారయుటకు
నపుడు విశాలమై ♦ హాటకచిత్రితం, బగుమేలిగుఱ్ఱాల ♦ స్యందనమున
తే. నరయశశ్శాలియు మహాను ♦ భావుఁడైన, యవ్విభీషణుఁ డరుదెంచి ♦ యన్నడాసి
తనదుపేరు వచించి పా ♦ దముల మ్రొక్కె, నట్లు శుకుఁడు ప్రహస్తుఁడు ♦ నాచరింప.

కం. వారల కుచితాసనముల, వేరుగఁ బతి యొసఁగ వారు ♦ వెలసిరి వానన్
సారపరార్థ్యాగురుక, ర్పూరస్రగ్సురభి గొనుచుఁ ♦ బొలిచెఁ బవనుఁడున్. ౨౨౨

ఉ. గట్టిగఁ బల్కఁ డెవ్వఁడు నొ ♦ కండును వక్రమవాది లేఁ డటన్
మట్టును మీఱి సద్దిడఁడు ♦ మానవభోజుల నొక్కఁ డేనిదై
త్యేట్టునియానసంబుఁ గను ♦ చెల్లరు ధీరులు వీరు లుండ స్వా
రాట్టు వసుల్ భజింపఁగను ♦ రాజిలుభంగి నతండు రాజిలెన్. ౨౨౩

## రావణుఁడు రాక్షసుల సంబోధించుట.

సీ. కలయంగ సభ నెల్లఁ ♦ గనుఁగొని దళవాయి, యగు ప్రహస్తునితోడ ♦ శాస్యుఁడనియె
సేనాపతీ! నీవు ♦ చెచ్చెరఁ జని చతు, ర్విధకళాధుర్యుల ♦ వీరవరుల
నెక్కుడుకాపుంచు ♦ మీ యన నతఁడును, రాజశాసనమున ♦ రక్ష నిలిపె
వీటిలోపల మఱి ♦ వెలుపల నెల్లెడఁ, బురరక్షణార్థంబు ♦ పూర్ణముగను

ఆ. వేఱ వేఱ యసుర ♦ వీరుల నిటు నిల్పి, సర్వసైన్యములను ♦ సకలదిశల
రక్ష నిలిపినాఁడ రాక్షసవల్లభ! శంక లేక పనులు ♦ సలుప వచ్చు. ౨౨౪

కం. అనవుడు రాజ్యహితైషుఁడు, దనుజాధిపుఁ డతనివాక్య♦తతి విని సుఖమం
దనురక్తికలిమి సుహృదులఁ, గనుఁగొని యిట్లనియెఁ బ్రకృత♦కార్యము దెలియన్.

చం. అసురలు! ధర్మకామముల ♦ నర్థమునం దగు దేనిఁ బూనఁగా
వెస నని యోజనల్ జలుపు♦వేళల లెస్సగ దాన దాన నే
దొసఁగులు మేళ్లు సౌఖ్యములు ♦ దుఃఖములుం బ్రియవిప్రియంబులుం
బొసఁగునొ లెస్సగా నరసి ♦ పూర్ణమనీషను నిశ్చయింపుఁడీ. ౨౨౬

ఉ. ఎప్పుడు నేమికార్యముల ♦ నే నొనరించిన మీర లెల్లరుం
జెప్పినపద్ధతి న్నడతుఁ ♦ జేటొనఁగూడద యెుంట నేని, నే
నప్పురుహూతుఁ డిందుమిహి♦రామరసమ్మతిఁ బోవుమాడ్కి మీ
రొప్పుగఁ జెప్పినట్లు చని ♦ యొందుదుఁ గాదె నితాంతసంపదన్. ౨౨౭

ఉ. మీ కిది సర్వముం దెలుప ♦ మేకొని యుండియుఁ గుంభకర్ణ ని
ద్రాకలితత్వముం గనుటఁ ♦ గ్రన్నన యప్పుడ చెప్ప నైతి, న
స్తోకపునిద్ర నార్నెలలు ♦ పోలెను, నిప్పుడ మేలు కాంచె, నీ
ప్రాకటసర్వశస్త్రధర♦వర్యుఁడు కావున నేడు చెప్పెదన్.[1] ౨౨౮

↞ రావణుఁడు రాక్షసులతో సీతావృత్తాంతముఁ జెప్పుట. ↠

ఉ. రాముని దేవి సీతఁ బ్రియు♦రాలి విదేహతనూజ దండకా
భూమిని నుండఁ దెచ్చితిని ♦ బుష్పసుగంధిని, మందయాన యా
భామిని నాదుశయ్యపయిఁ ♦ బండఁగ నొల్లదు, మూఁడులోకముల్
వేమఱు రోయ సీతసరి♦లేమ లభింప దటంచుఁ దోఁచెడిన్. ౨౨౯

చం. తనుతరమధ్య సత్పృథుల♦తాపరిశోభినితంబబింబఁ గం
జనిభవిశాలలోచనను ♦ శారదపూర్ణసుధాకరాస్య నా
కనకపుబొమ్మ సుందరిని ♦ గాంచినచో మయుఁడే సృజించెనా
వనజదళాయతాక్షి నని ♦ భావమునం దలపోఁత గల్గెడిన్. ౨౩౦

తే. అరుణతలములు కడుమనో♦హరతమములు
సుప్రతిష్ఠితములు నైన♦సుందరాంగి
చరణములు తామ్రనఖములు ♦ చక్కఁజూడఁ
జూఁడు ననుఁ బుష్పబాణుండు ♦ వాఁడిమెఱసి. ౨౩౧

కం. సారహుతాగ్నిజ్వాలల, తీరున నీరజహితద్యు♦తి న్వెలిఁగెడి యా
సారసదళనయనం గని, మారునివశ మైతి నసుర♦మండనులారా![2] ౨౩౨

[1] సీతను మ్రుచ్చిలించితెచ్చి బందియందుంచినవార్త పదినెలలుగా నెవరికి రావణుఁడు చెప్పక దాఁచెను. [2] ఇత్యాదివాక్యములవలన రావణుఁడు సీతను గాముకుఁడై హరించెనని యేర్పడుచున్నది.

కం. తీర్చైనయున్నసంబును, హారులు విపులంబు లైన◆యక్షులుఁ గలయా
నారిముఖముఁ గని వివశత, మారునివశ మైతి నసుర◆మండనులారా![1] ౨౩౩

కం. అలుకను ముదమునఁ దుల్యుఁడు, బలియించును శోకతాప◆భరముం గాంతిం
దొలఁగించు నట్టి స్మరుచేఁ, గలుషితచిత్తుఁడ నిశాట◆కాండములారా! ౨౩౪

కం. తనమగఁడు రామచంద్రుఁడు, చనుదెంచెడి ననెడియాస ◆ సంవత్సరముల్
నను గడువు వేఁడెఁ దత్కా,మిని నే నామేలిమాటఁ ◆ గైకొంటిఁ జుఁడీ. ౨౩౫

కం. చక్కఁగసాఁవరి యొనర్చుట, మిక్కిలి వడఁబడిన తేజ◆మిహినా నేనుం
జిక్కితిఁ గామునిదాడికి, స్రుక్కితి నిది నావిధంబు ◆ సురవరులారా! ౨౩౬

ఉ. ఏకరణిం దరింతురు మ◆హిష్ఠభయంకరసత్త్వయుక్త నీ
రాకరవర్య మాఘనవ◆నౌకసు లేని నృపాలు రేని నా
నాకపియొక్కఁ డే కద మ◆హాహవము న్ననతో నొనర్చె, నె
ట్టేకరణిం గ్రియాసరణి ◆ యేగెడినో తెలియంగ శక్యమే. ౨౩౭

ఉ. దాన భవిష్యదర్థము య◆థామతి యోజనచేసి చెప్పుఁడీ
మానవుచే భయం బొదవు◆మాటయు లే దది చక్కఁజూడుఁడీ
దానవదేవయుద్ధములఁ ◆ దద్భుజ శౌర్యము నేను నూఁతగాఁ
బూని కదా జయించితిని ◆ బోరుల గెల్చెడినారు మీరెకా. ౨౩౮

ఉ. ఆవసుధాధిపాత్మజులు ◆ త్వాత్మజపోబడి తా రెఱింగి సు
గ్రీవపురస్సరం బగుహ◆రిధ్వజినీతతిఁ గూడి వార్ధివే
లావనిఁ జేరినారు, వసు◆ధాత్మజ నీయఁగ రాదు, వెండి సీ
తావిభుఁ జంపఁగా వలయు ◆ దానికిఁ జెప్పుఁడు మంచియుక్తులన్. ౨౩౯

←→ కుంభకర్ణుఁడు రావణునిఁ గోపించి పలుకుట. ←→

ఉ. రాముఁడు దక్క వేఱొకఁడు ◆ రాఁడు సముద్రము దాఁటి వానర
స్తోమముతోడఁ గాన జయ◆శుద్ధి వినిశ్చిత మంచుఁ బల్క, నా
కామపరీతచిత్తదశ◆కంఠునిరోదన మాలకించి కో
పామితదగ్ధచిత్తుఁ డయి ◆ యాతనిఁ బల్కెను గుంభకర్ణుఁడున్. ౨౪౦

సీ. రామసౌమిత్రిసం◆రక్షణీయను సీత,నపహరించితి వేరి ◆ నడిగి నీవు?
అటుచేయకయ మున్న ◆ యడిగినఁ జెప్పమే, యామునరక్షిత◆యమునవోలె
నీచిత్త మెంతయు◆నిల్కడ భజియింప, నోమహారాజ! మేల్ ◆యుక్తి నొకటి
నటు లైన నెంతో లె◆స్సైన యుండు నీపని, నిప్పుడు చింతింప ◆ నేమిఫలము?
తే. రాజకార్యంబు లెవ్వఁడు ◆ ప్రథమమంద, న్యాయపద్ధతి యోజించి ◆ యాచరించు
నట్టివాఁడెందు దుఃఖింపఁ◆డవలఁగార్య,మయ్యు చెడిపోయె నేయని◆యాత్మయందు.

[1] రావణుఁడు కాముకుఁడా భక్తుఁడా యనువిషయ ముత్తరపీఠికయందుఁ జర్చితము.

కం. విపరీతాలోచనఁ బని, నిపుణత లే కాచరింప ♦ నెఱిచెడు మఱియున్
విపరీతఫలము లొదవును, నపవిత్రపుఁదవెల నున్న ♦ హవిఁ దిన్నట్లై. ౨౮౨

కం. మొదలం దగు కార్యంబును, బిదపం గావించువానిఁ ♦ బిదపటిపనులన్
మొదల నొనరించు నాతని, విదితంబుగ నీత్యనీతి ♦ విదుఁ డనఁ దగునా? ౨౮౩

కం. బలియుఁడు దుస్సాధుం డని, తలఁపంబడువాఁడు చపల ♦ తం బని సేయన్
సులువుగ భేదింతు రొరుల్, పులుఁగులు క్రౌంచాద్రిరంధ్ర ♦ మునఁ గాదె చనున్.

కం. దుష్ట మనాలోచితమును, గష్టం బగుపనిని జలుపఁ ♦ గలిగితి విషసం
శ్లిష్టాన్న భుక్తిభంగి న, దృష్టము పో చంపఁ డయ్యె ♦ శ్రీరాముఁ డటన్. ౨౮౪

సీ. పరులకుఁ జాలదు ♦ ష్కర మైనకార్యంబు, నెత్తికొంటివి ఘటి ♦ యించుటకును
(నీతోడఁ బుట్టుట ♦ నీతోడ నిల్వక, నాకుఁ దప్పనె దైత్య ♦ నాథ యిపుడు)
జరుగంగఁ దగుకార్య ♦ సరణి వచించెద, నీపగతుర నేను ♦ నీల్గఁ జేసి
కార్యంబు సరిపడఁ ♦ గావింతు శత్రున, లార్క మరుచ్ఛిదు ♦ లడ్డపడినఁ

ఆ. గేలఁ బరిఘ మూని ♦ లీలమైఁ ద్రిప్పుచుఁ, గఱకుఁగోఱడాలు ♦ కడలఁ గప్పఁ
గొండఁబోలు మేన ♦ గండున గర్జింపఁ, గొండపగతుఁ డైన ♦ బెండువడఁడె.

కం. రెండవశరమున రాముఁడు, ఖండించెదునంతలోఁ ద ♦ గఁగ నా నెత్తు
ద్దండత నేఁ ద్రావెదఁ జుమి, ఖండితసురజాల! సుఖముఁ ♦ గాంచుము మీఁదన్

ఉ. రాముని గీటణంచి మఱి ♦ క్రచ్చఱ లక్ష్మణుఁ బిల్కుమార్చి శా
ఖామృగయూథము న్నసవి ♦ గట్టునఁ ద్రెంచుచు నీకు గెల్పునుం
గామముఁ దీర సౌఖ్యమును ♦ గల్గఁగఁ జేసెదఁ, ద్రాగు వారుణిన్
నీమది కెక్కు కార్యముల ♦ నిర్భయతం జరియింపు స్వేచ్ఛమై. ౨౮౭

కం. భీమాహవరంగంబున, శామనపురి కేగ మృత్యు ♦ సంగతి[1] నలశ్రీ
రాముఁడు పదపడి సీతా, భామారత్నంబుఁ బొందు ♦ బాధముదమునన్. ౨౮౮

మహాపార్శ్వుఁడు రావణుతో సీతాదేవిని విడువరాదని చెప్పుట.

కం. రావణుఁడు క్రుద్ధుఁ డగుటను, భావించుచు శాంతుఁ డగును ♦ పాయము త్రుటి సం
భావించి మహాపార్శ్వుఁడు, కావించుచు నంజలిన్ స ♦ గర్వోక్తి ననున్. ౨౯౦

కం. నానామృగసత్త్వాన్విత, మైనవనం బెట్లొ చొచ్చి ♦ యటఁ జేపడఁగాఁ
దేనియను ద్రాగఁ డెవ్వం, డానరునిం బాలిశుం డ ♦ టందురు ప్రాజ్ఞుల్. ౨౯౧

కం. ఈశ్వరుఁడవు లోకంబుల, కీశ్వరుఁ డన్యుండు గలుగు ♦ నే నీ కసురా
ధీశ్వర! శత్రునిబర్హణ! శాశ్వతసుఖ మనుభవింపు ♦ జ్ఞానుతతోడన్. ౨౯౨

కం. మక్కువతో జానకి నినుఁ, దక్కఁ గొనఁగ నొల్ల దేని ♦ తానుగ నీవే
కుక్కుటవృత్తిఁ[2] జరింపుమ, తక్కుమ సందేహ మెద సు ♦ ధాభుగ్వైరీ! ౨౯౩

---

[1] నేను జావఁగా శ్రీరాముఁడు సీతను బొందునని యొక యర్థము. శ్రీరాముఁడు చావఁగా నీవు సీతను బొందుమని రెండవ యర్థము. [2] కుక్కుటవృత్తి = కోడివలె బలవంతముగ.

తే. వేగ నీవాంఛితము నెఱవేఱ నేని, గలుగనీ భయ ముత్తరక్షణమునంద
కాక కాలాంతరంబునఁ గలుగ నిమ్ము, వానినెల్ల సహింపఁగ వచ్చు నీవు.

కం. దంభోళిఁ గేలఁ గైకొని, జంభారియు వచ్చె నేని సమితిక్షితి సం
రంభమునఁ గుంభకర్ణుఁడు, జంభారిజితుండు మేముఁ జంపుదు మతనిన్. ౨౫౫

ఉ. ముందుగ సామదానములు మూఁడవభేదము శక్తి లేనియా
పందలు మెచ్చు చుంద్రు సలుపం దగు నంచును, శక్తిశాలి దా
నెందును దండనీతిఁ జరియించును, గావున దండపద్ధతిన్
బొందుము నీదువాంఛితముఁ బూర్ణముగా మనుజాశనాధిపా! ౨౫౬

ఉ. వచ్చిన యేని యిచ్చటికి వైరిసమూహము శస్త్రసంహతిన్
వ్రచ్చి వధింప నోపుదుము వాస్తవ మియ్యది, సందియంబు లే,
దిచ్చఁ జరింపు మన్న నసురేశ్వరుఁ డాతనివాక్యజాలమున్
మెచ్చుచు వాని కిట్టు లను మేటిలుచింతను నాత్మవృత్తమున్. ౨౫౭

రావణుఁడు మహాపార్శ్వునితో బ్రహ్మ తన్ను శపించినవిధంబుఁ దెలుపుట.

సీ. వినుము మహాపార్శ్వ! వినిపింతు నత్పురావృత్తంబు గోప్య మవిశ్రుతంబు
హాటకగర్భుసేవార్థ మవ్వేటి కై, పుంజికస్థల యనుపువ్వుఁ బోణి
యభ్రమార్గంబున నరుగుచు ననుఁ జూచి, జంకుచు నొదుగుచుఁ జనుచు నుండ
నగ్నిశిఖయుఁబోనియద్దానిఁ గనుఁగొని, బలవంతముగను బైపడుచుఁ జెఱిచి
తే. కోటవిగఁ[1] జేసి విడిచినఁ గోమలాంగి, నలువసభ కేగె నలిపిననలిన మనఁగ
నబ్జభవుఁడును దాని వృత్తాంత మెఱిఁగి, కోపమున నాకు నీగతి శాప మిచ్చె.

కం. ఇది మొదలుగ దశకంఠా! మదిలో ని న్నొల్లనట్టిమానిని బలిమిన్
గదిసితివా నీతల యాపదనున ధరవ్రాలు నూఱువ్రక్కలు గాఁగన్. ౨౫౯

కం. ఈశాపభీతిఁ గాదే, యాశింపక యున్నవాఁడ నవనిజఁ; గాదే
నాశయనంబున నెపుడో, యాశింపా దేహఁ గూడనా జంకుదునా? ౨౬౦

శా. నావేగం బది సాగరం బెనసెడి న్వాతూలముంబోలెడిన్
నావర్ధిష్ణుగతిప్రకార మనిఁ, గానన్లేక యిద్దాని సీ
తావామాక్షినిమిత్త మిచ్చటికిఁ బ్రోద్దామోగ్రసైన్యంబుతో
వే వచ్చుం గపినేత బాసటగఁ బృథ్వీకన్యకాకాంతుఁడున్. ౨౬౧

ఉ. శైలగుహాప్రసుప్తహరిసత్తమము న్వడి నిద్ర లేపునా
పోలికిఁ, గ్రుద్ధమృత్యువుఁ బ్రబోధ మొనర్చెడిభంగి, మామకా
భీలభుజంగసన్నిభసువిశ్రుతశాతశరాళి రాముఁ డే
వేళను గుర్తెఱుంగమిని వేగమ వచ్చెడి నన్నెదుర్కొనన్. ౨౬౨

[1] కోటవిగ = దిసమొలదానినిగ.

శా. దంభోళిప్రతిమానమామకధను♦ర్దండమ్యుక్తాభీలబా
ణాంభోవృష్టి సహస్రధారగతిఁ బయి♦ న్వ్యాపింపఁగా జేయుచుం
గుంభీంద్రంబు నలాతకోటిబలె నా♦క్రోశింపఁగాఁ దోలుదున్
జంభద్వేషిసహాయుఁ డే ప్రఘుపతిన్ ♦ సంగ్రామరంగంబునన్. ౨౬౩

ఉ. అల్ల సహస్రనేత్రుఁ డమ♦రాధిపుఁ డేనియుఁ బాశహస్తుఁ డ
బ్వల్లభుఁ[1] డేని నాజి నిలు♦వం గలఁడా ననుఁ దాఁకి? శ్రీదు పెం
పెల్ల నణంచి లంక హరి♦యింపనె? తద్బల మెంత? చుక్కలన్
బొల్లువడంగఁ జేయునవ♦పూషనిభంగిని దేజ మూపెదన్. ౨౬౪

↔ విభీషణుఁడు సీతాదేవిని శ్రీరామున కిమ్మని రావణునకు బోధించుట. ↔

కం. దనుజకులసార్వభౌముం, డనుమాటలుఁ గుంభకర్ణు ♦ నతిగర్జితముల్[2]
విని విని విభీషణుం డి, ట్లను దశకంఠునకు హితము ♦ నర్థయుతముగన్. ౨౬౫

మ. తతబాహ్వంతరభోగరాశి భృశచిం♦తాకాలకూటంబు ను
గ్రతరస్మేరనిశాతదంష్ట్ర కరశా♦ఖాపంచకస్ఫారవి
స్తృతపంచోగ్రశిరోతికాయము పతీ ♦ సీతామహాశీవిషం
బతిమేధావివి పట్టి తేరఁ దగ వొ♦నా దాని భావింపుమా. ౨౬౬

కం. భూమిధరకూటనిభు లు,ద్దామనఖాయుధులు భూరి♦దంష్ట్రులు క్రోఁతుల్
భీమగతిరాక మున్నే, రామునకున్ సీత నిమ్ము ♦ రాక్షసరాజా! ౨౬౭

కం. సామీరజవము లశని,గ్రామనిభము లైనరామ♦కాండము లసుర
స్తోమములతలలు ధరఁ బడఁ, బ్రామక మును సీత నిమ్ము ♦ రఘురామునకున్.

ఆ. కుంభకర్ణుఁ డైనఁ ♦ గుంభనికుంభులు, నైన నింద్రజిత్తుఁ డై ♦ నయినఁగాని
యామహోదరుఁడు మ♦హాపార్శ్వుఁ డీయతి,కాయుఁ డైన రాముఁ ♦ గలరె చెనకఁ.

ఉ. భానుఁడు నిన్నుఁ గాచిన సు♦పర్వచయంబులు ప్రోచినన్ దయా
న్యూనముగా బలారియు ని♦జోరుతలంబున నిన్నుఁ జేర్చినన్
మానకమృత్యు వడ్డపడి♦న న్బలిసీమ[3] నుఱంగిన న్బ్రహ
స్తా! నిను రామచంద్రుఁ డనిఁ ♦ బ్రాణముతో విడువం డెఱుంగుమీ. ౨౭౦

చం. అనుడు విభీషణోక్తికిఁ బ్ర♦హస్తుఁడు మా ర్వచియించె మాకు నా
యనిమిషసిద్ధకింపురుష♦యక్షనగాహులచేత నేనియుం
బొనరదువో భయంబు, రఘు♦పుంగవుఁ డొనరనాథపుత్రుచే
మొనయునె? యేల యిట్టులు మ♦మ్ము న్బెదరించెదు రిత్తమాటలన్. ౨౭౧

↔ విభీషణుఁడు ప్రహస్తుని గర్హించుట. ↔

సీ. అనుడుఁ బ్రహస్తువా♦క్యంబుల నాలించి, ధర్మార్థకామత♦త్త్వరమనస్వి
ప్రభుహితైషణుఁ డయి ♦ క్రాలువిభీషణుం, డనియెఁ బ్రహస్త యి ♦ ట్లాడె దేల?

[1] అబ్వల్లభుఁడు = వరుణుఁడు. [2] వ్యర్థములైన యఱపులు— మొదట నీతి చెప్పినట్టే చెప్పి తుదకు రావణుని యభిప్రాయములోనే కలిసికొని యేమేమో వదిరెను. [3] బలిసీమ = పాతాళము.

యీవు మహోదరుం ♦ డీకుంభకర్ణుండుఁ, జలుపు యోజన రామ♦చంద్రు పట్ల
ధర్మవిరుద్ధవ♦ర్తనులకు స్వర్గంబు, ఫలియింపనట్లు స♦ఫలతఁ గనదు

ఆ. కలము[1] లేనివాఁడు ♦ జలనిధిఁ దరియింపఁ, దలఁచినట్లు కార్య♦దక్షుఁ డైన
జానకీహృదీశు ♦ నేనైన నీ వైన, సకలదనుజు లైనఁ ♦ జంపలేము. ౨౨౨

తే. పరమధర్మైకనిరతు ని♦క్ష్వాకువంశ, భవు మహారథు రాజేంద్ర♦వర్యుఁ గార్య
దక్షు రణభూమి నెదుర న♦దక్షు లగుచు, రూఢిగా వేల్పు లెల్లరు♦మూఢు లైరి. ౨౨౩

ఉ. సాటి వచింపరాక హరి♦శంబసమానజవాన్వితం బనూ
ద్ఘాటనకర్మశీల మగు ♦ దాశరథిప్రవిముక్తము న్నిరా
ఘాటము నైన తచ్ఛరని♦కాయము పోరఁ బ్రహస్త నీమెయిన్
నాటవు పూర్వ, మాకతము♦న న్గద పగ్గెలు గొట్టె దియ్యెడన్. ౨౨౪

ఉ. ఎందనుకన్ దురాసద మ♦హీననిశాతము తీవ్రవేగితా
స్కందము గంకపత్రమును ♦ క్ష్మాతనయాధవహస్తముక్తని
ర్యందశిలీముఖోచ్చయ మ♦మందరరీతిని నిన్ను వ్రచ్చునో
యందనుకం బ్రహస్త! యిటు ♦ లాడుచు నుండు వికత్థనంబులన్.[2] ౨౨౫

ఉ. రావణుఁ డైనఁ గాని సుర♦రాజజితుండును గుంభకర్ణుఁ డే
నీ వయినం ద్రిశీర్షకుఁడ ♦ యేని నికుంభనరాంతకాదు లేన్
గ్రావసమానసారగుఁ డ♦కంపనుఁ డే నతికాయుఁ డేని నీ
తావిభుదృష్టిమార్గమునఁ ♦ దాళరు నిల్వఁగ సంగరంబునన్. ౨౨౬

ఉ. మీర లమిత్రతుల్యు లయి ♦ మిత్రులునా వ్యసనాభిభూతుఁ డై
క్రూరతరస్వభావుఁ డయి ♦ కొంచక తా నసమీక్ష్యకారి యై
కారియము ల్ఘటించుసుర♦కంటకనాథునకున్ నిశాటసం
వారవినాశనార్థముగఁ ♦ బంచన చేరితి రేమి చెప్పుదున్. ౨౨౭

కం. శిరములు వేయియు నంతముఁ, బరికింపఁగ రానిమేను ♦ భంతుదాకృతియుం
గురుబల మగునహి చుట్టెను, బరిరక్షితుఁ జేయరయ్య ♦ ప్రసభమునఁ[3] బతిన్. ౨౨౮

కం. పరిపూర్ణకాము లగుహిత,వరు లెల్లరుఁ జేరి కావ♦వలయును రాజుం
గుటు లోడిసిపట్ట శత్రూ,త్కర మరుదేరకయమున్న ♦ గ్రహావిద్ధుబలెన్. ౨౨౯

తే. ప్రళయకర మైనసౌమిత్రి♦జలధిలోన, మునిఁగి శ్రీరామపాతాళ♦ముఖముఁ జొచ్చు
పంక్తికంఠునిఁ గావరే ♦ ప్రాజ్ఞులార, పట్టిబలవంతముగ నైన ♦ బయట వేసి. ౨౩౦

కం. ఈయది లంకకు నసురని,కాయమునకు రాజునకును ♦ గడుమే లిచ్చున్
జేయు మిటు తగును సీతా,నాయకునకు సీత నీయ ♦ నామతము సుఁడీ. ౨౩౧

[1] కలము=ఓడ. [2] వికత్థనంబులన్=తన్నుతాను బొగడుకొను మాటలను. [3] ప్రసభమున=బలాత్కారముగ.

కం. తనబలము నెదిరిబలమును, దనస్థానము క్షయము వృద్ధి ♦ దాయలవిధముల్
దనమదిఁ దలంచి లెస్సగఁ, దనఱేనికి హితముఁ గూర్పఁ ♦ దగుమంత్రులకున్.

↞ ఇంద్రజిత్తు విభీషణుఁ దిరస్కరించి పలుకుట. ↠

తే. బుద్ధి సురగురుతోఁ సరిపోల్పఁజాలు, నవ్విభీషణు వాక్యంబు ♦ లాలకించి
తండ్రిఁ గని రాక్షసాళియూ ♦ ధప్రబర్హుఁ, డైన వాసవజితుఁ డిట్టులనుచుఁ బల్కె.

ఉ. ఏ మిటు నీదుసోదరుఁడె ♦ హీన మనర్థకముల్ విభీతిదం
బై మనజాతి కర్హము ర ♦ వంతయుఁగాని విధంబు పల్కివిం
చే, మనయన్వయంబున జ ♦ నింపనివాఁ డయిన న్వచించునే
యీమెయిఁ? జెప్పెఁ బో వినునె ♦ యెవ్వఁ డదెంతటిశక్తిహీనుఁడేన్? ౨౦౪

ఉ. శౌర్యము భూరిసత్త్వమును ♦ సాహసము న్బటువిక్రమంబునున్
స్థైర్యముఁ దేజము న్ప్రబల ♦ ధైర్యము నేమియు లేనియట్టి ని
ర్వీర్యుఁడు నీదుతమ్ముఁడు వి ♦ భీషణుఁ డొక్కఁడె నుమ్ము తండ్రి! యీ
యార్యకులంబునం బ్రభవ ♦ మందెను దుర్యశముం గడింపఁగన్. ౨౦౫

మ. పితృకీ! మాకలె భీతి నేర్పెదవు? పృ ♦ థ్వీనాయకద్వంద్వముం
బఱప న్నేఁడొకొ దేబెసోఁకుఁ డయిన ♦ న్నాలోన, నీ కేల ప
ల్లఱవు, ల్లోకము లేలుజిష్ణు నమృతాం ♦ ధోధీశుని న్గర్వముల్
బఱిపోవం జెఱ నుంపనే? తఱుమనే ♦ భ్రాంతాత్ము లావేల్పులన్. ౨౦౬

చం. కెరలిననాదుశక్తిఁ గని ♦ గీఁయని కూయుచు నేలఁ బొర్లని
ర్జరపతివారణంబు రద ♦ సంహతి నూడఁగఁ బీఁకి దానిచే
నరులను దోలనే? సురచ ♦ యంబులదర్ప మణంప లేదె? యీ
శరులకు శోకదాత నయి ♦ సన్నుతిఁ గాంచనె? నీ వెఱుంగవే? ౨౦౭

ఉ. అంతటివాఁడఁ బ్రాకృతన్పృ ♦ పాత్మజుల న్బలహీనమర్త్యులన్
వింత యొకో జయించుట వి ♦ భీషణ యంచు వచింప నంత దు
ర్దాంతబలుం డజయ్యు సుర ♦ రాజనిభున్ గురుతేజుఁ జూచి యీ
వంతయుఁ గొంక కిట్లను మ ♦ హార్థసుభాషిత మెల్లరు న్వినన్. ౨౦౮

↞ విభీషణుఁ డింద్రజిత్తును నిందించుట. ↠

ఉ. బాలుఁడ వీవు నాయన! య ♦ పక్వమనీషుఁడ వౌట మంత్రకా
ర్యాళి యథార్థదృష్టిఁ గను ♦ నంతటివాఁడవు గావు, కావునన్
నీలయ మే నెఱుంగకయె ♦ నేర్చిన యట్టులు లేనిపోనివా
గ్జాల ముపన్యసించితివి ♦ కార్యము తీరెనె యంతమాత్రనే. ౨౦౯

కం. పుత్త్రుఁడ వను నెపమునఁ బ్రియ, మిత్త్రునివలె రావణున క♦మిత్త్రుఁడవై త్స్వో
పుత్త్రపతి భయదుఁ డన నీ, మాత్రము గన లేక చెనఁటి♦మాటలు వినుదే. ౨౯౦

చం. అరయఁగ నీవు దండ్యుఁడవ♦యంతియ కా దిటువంటిమంత్త్రముం
జరపెడివేళ నిచ్చటికి♦సాహసముఖ్యుని బాలు ధీరతం
దిరుని సభాస్థలిం జొరఁగఁ♦దెచ్చినదుర్మతికూడ వధ్యుఁ డౌ;
సరిపడు నొక్క మంత్త్ర మది♦జాల్ములు మూఁగినకొల్వులోపలన్. ౨౯౧

చం. తెలివియొ సర్వమంగళము[1]♦తీక్ష్ణత నీకు స్వభావసిద్ధముఁ
దెలియ వణంకు వెట్టిదియొ♦తీర్పులు దిద్దె దెఱింగినట్టులే
యలుచపు స్వల్పబుద్ధివి దు♦రాత్ముఁడవు న్నొఱకండవుం గడు
ల్బిలుకవు మేటిదుర్మతివి♦పిల్లతనంబునఁ బ్రేలె దీగతిన్. ౨౯౨

తే. ఎవఁడు సైరించు నొక్కసీ♦తేశుఁ డేయు, బ్రహ్మదండనిభంబులు♦రవితనూజ
దండకల్పంబు లర్చిమం♦తంబు లుగ్ర, కాలతుల్యాకృతులు నైన♦కాండములను.

మ. దనుజాధీశ్వర! నాదువిన్నపము డెం♦దంబందుఁ బొందింపుమీ
ధనము ల్రత్నములుం బరిష్కరణసం♦తానంబు దీవ్యన్మహా
ధనము ల్చిత్రమణు ల్ధరాసుతయుఁ దా♦త్పర్యంబున న్రామచం
ద్రున కర్పింపుము, సౌఖ్య మంద నగు నెం♦తో యెల్లవారుం బురిన్. ౨౯౪

రావణుఁడు విభీషణునకు జ్ఞాతిలక్షణంబుఁ దెలిపి నిష్ఠురంబు లాడుట.

తే. అనుచు సునివిష్టమును హిత♦మైనవాక్య, మును వచించువిభీషణు♦మోముఁ జూచి
రావణుఁడు కాలచోదిత♦భావుఁ డగుటఁ, బరుషవాక్యంబు లిట్లని♦పలికె నతని.

కం. కినిసినఫణితో నేనియుఁ, దనశత్త్రువుతోడ నేనిఁ♦దగు వసియింపం
దనమిత్త్రునివలె మెలఁగెడి, తనరిపుసేవకునితోడఁ♦దగదు వసింపన్. ౨౯౬

కం. జ్ఞాతుల స్వభావ మంతయు, నా తెలియనియదియె త్రిభువ♦నంబులలోనఁ
జ్ఞాతులకు వ్యసన మబ్బిన, జ్ఞాతులకును సంతసంబు♦సమకూడుఁ గదా. ౨౯౮

కం. ఆతతమతియుతు ధర్మో, పేతు ననుత్తముని శూరు♦హితసాధకునిఁ
జ్ఞాతులు మెచ్చరు మఱి పరి, భూతియు నొనరింత్రు సమయ♦ముం గనుఁగొనుచున్.

ఆ. కలసి మెలసినట్ల♦కనఁబడు చుందురు, క్రూరకర్మములకు♦రోయకుంద్రు
మనసు నీయ రెడరు♦నను జంపఁ జూతురు, భీతికరులు గారె♦జ్ఞాతు లెందు.

కం. మును పాశాహస్తనరులను, గని పద్మవనంబునందుఁ♦గలవారణముల్
వినిచె నొకకొన్నిపద్యము, లను వానిని వినుము జ్ఞాతి♦లక్షణ మెఱుఁగన్. ౩౦౦

ఆ. భయము లేదు మాకుఁ♦బాశచయంబుల, నిప్పువలన శస్త్ర♦నిచయములను
స్వార్థపరులుఁ గ్రూరు♦లైనదాయాదుల, వలననే భయంబు♦గలుగు మాకు. ౩౦౧

[1] సర్వమంగళము = సున్న.

ఆ. మీరు దెచ్చినట్టి♦వారణంబులు మమ్ముఁ, బట్టుకొనఁగ నుపమఁ ♦ బల్కు నిజము
సకలభయములందు ♦ జ్ఞాతిభయం బది, దుస్సహంబు మాకు ♦ లెస్స తెలియు.

ఆ. గోవులందు భాగ్య♦గుణ మది నైజంబు, విప్రులందు దమము ♦ విశ్రుతంబు
స్త్రీస్వభావగుణము ♦ చిత్తచాంచల్యంబు, జ్ఞాతి కెడరు సేఁత ♦ సహజగుణము.

కం. కావున లోకము నను సం,భావించుట నిరుపమాన♦భాగ్యము గనుటన్
నే వైరులతలఁ ద్రొక్కుట, నీ వెడఁ జూపోవ వైతి♦వే సౌమ్యుండా! ౩౦౪

కం. అంటియును దామరాకున, నంటనిజలబిందుసమితి♦యట్టు లనార్యుం
డొంటుకొని చేయు స్నేహం, బంటీయంటకయ యుండు♦నో రాక్షసుఁడా. ౩౦౫

కం. విను విరులఁ దేనెఁ గ్రోలిన, వెనుక న్మధుపములు వాని ♦ విడిచెడిగతి దు
ర్జనులు తొలిమైత్రిఁ దలఁపరు, పని తీరిన వెనుక నిజము ♦ పలికెద నసురా. ౩౦౬

కం. మును జలకేళిం దేలియుఁ, దనశిరమునఁ దనకుఁ దాన ♦ తనతొండమునన్
మను వైచుకొనెడు నేనుఁగు, ననువున ఖలమైత్రియును ని♦రర్థక మసురా! ౩౦౭

కం. శారదవేళల గర్జ ల,పారంబుగ నించి చినుకు ♦ పడరాలిచియున్
ధారిణి తడియనిగతి ని,స్సారము నిష్ఫల మనార్య♦సంగతి యసురా. ౩౦౮

కం. ఈపాటి నన్యుఁ డాడిన, వే పొర్లదె వానిశిరము ♦ పృథివిని త్రుటిలోఁ
బాపాత్మా! కులపాంసన, ఛీ పో నాయెదుటఁ బలుకఁ♦జెల్లదు నీకున్. ౩౦౯

### విభీషణుఁడు సభవిడిచి మింటి కెగసి రావణునకు హితముఁ దెల్పుట.

తే. అనుచుఁ బరుషంబులాడుడు♦న్యాయవాది, యగువిభీషణుండునుగదా♦హస్తుఁడగుచు
నలువు రసురులతో వియ♦న్మార్గ మెగసి, యలుక శ్రీమంతుఁ[1] డన్నతో♦ననియె నిట్లు.

ఉ. అన్నవు నీవు రాజ వటు ♦ లౌటను నిచ్చకొలంది పల్కు మే
చెన్నున నైన మాన్యుఁడవు ♦ జ్యేష్ఠుఁడవు న్పితృసన్నిభుండ వ
ట్లున్నను ధర్మమార్గమున ♦ నుండమి నీయనృతంబులుం గడుం
బన్నము దెచ్చు నిష్ఠురపుఁ♦బల్కులు సైఁపఁగ లే నొకింతయున్. ౩౧౦

కం. హితకాముఁడ నై నీకును, వితతముగ సునీతివిధము ♦ వినిపించితి నీ
మతి కెక్కదు కాలవశా,గతుఁ డకృతాత్మకుఁడు హితము ♦ గ్రహియించు నొకో.

కం. అనయము ప్రియవాక్యంబుల, ననియెడిజను లెందు సులభు ♦ లప్రియ మయ్యున్
గనఁ బథ్య మైనసూక్తిని, ననువాఁడును వినెడివాఁడు ♦ నరు దసురేంద్రా! ౩౧౩

ఉ. కాలెడుగేహము న్విడువఁ♦గా మన సొప్పనిభంగి సర్వభూ
తాళివినాశహేతు వగు♦నంతకుపాశము చేతఁ జిక్కు ని
న్నాలము సేయ నొల్ల, నవ♦హాటకపుంఖము దీప్తపావకా
భీలము రాఘవాశుగము ♦ పృథ్వి నినుం గన నొల్లఁ గూల్పఁగన్. ౩౧౪

[1] భగవత్కైంకర్యనిష్ఠాలక్ష్మిగలవాఁడు. ఇల్లు, వాకిలి, ధనము, ధాన్యము సర్వము వదలి రాష్ట్రమును విడిచి పోవువానికి మఱి యే సంపత్తు చెప్పుటయు నుచితము కాదు. నిజమై నిత్యమైన శ్రీ భగవత్ప్రాప్తియే

కం.వాలుమగ లేని కడుబల,శాలులునే నస్త్రశస్త్ర♦చతురులు నైనం
గాలునిచేఁ జిక్కినతఱి,వాలుక సేతువులుపోలెఁ ♦ బసచెడుదు, రిలన్. ౩౧౫

ఉ. అన్నవు నీవటంచు హిత♦మార వచించిన యట్టి నానుడుల్
మన్నన సేయ వైతి, విఁక ♦ లంకను రాక్షససంఘ యుక్తమున్
నిన్నును లెస్స కాచుకొని ♦ నెమ్మది నుండుము, స్వస్తి నీ కగున్,
న న్నిడఁ బాసి సౌఖ్యము ఘ♦నంబుగ నందుము, పోయి వచ్చెదన్. ౩౧౬

కం.హిత మెంచి యెంతచెప్పిన, మతికెక్కఁగనీవు నాదు♦మాటలు నీవున్
హితసూక్తులు రుచియించునె, గతజీవితు లగుపరీత♦కాలుర కెందున్. ౩౧౭

విభీషణుఁడు నలువురుమంత్రులతో శ్రీరాముఁ డున్నచోటికిఁ బోవుట.

కం.అని పరుషం బగువాక్యము, నని ఖలు రావణుని రావ♦ణానుజుఁ డావెం
టనె వచ్చె సలక్ష్మణుఁ డౌ,జనకసుతానాథుఁ డున్న♦స్థలమున కంతన్. ౩౧౮

కం.మేరుగిరిశిఖరతుల్యా,కారు జ్వలచ్చంచలాని♦కాశు నభస్సం
చారుని ధరణీగతవన,చారిప్రాగ్రసరచయము ♦ సంవీక్షించెన్. ౩౧౯

కం.తనతో నైదవవాఁ డయి, చనుదెంచెడునతనిఁ జూచి ♦ చతురుఁ డసాధ్యుం
డినసుతుఁ డాలోచించుచు, వనచరతతితోడ నిమిష♦పర్యంతంబున్. ౩౨౦

కం.హనుమత్ప్రముఖుల కిట్లనుఁ,గనుఁడీ రక్కసులు గొల్వఁ♦గా నల్వురు తన్
మనుజాశనుం డఖిల సా,ధనములతో మనలఁ జంపఁ ♦ దథ్యము వచ్చెన్. ౩౨౧

ఉ. నావుడు వానరేంద్రువచ♦నంబులు వీనుల సోఁకినంతనే
గ్రావములన్ ధరారుహాని♦కాయములం గొని యిట్లు పల్కి రో
దేవ! దురాత్ములన్ వడి వ♦ధింపఁగ నానతి యిమ్ము, యిప్పుడే
జీవముఁ బాసి నేలఁ బడి ♦ చెల్లిరి చూడుము స్వల్ప తేజులన్. ౩౨౨

విభీషణుఁడు తనరాక శ్రీరామునకుం దెలుప వానరుల వేఁడుట.

మ. అనుచు న్వానరయూథముఖ్యు లిటు ల♦న్యోన్యంబు భాషింపఁ గ్ర
క్కునఁ దా వచ్చి విభీషణుండును నుద♦క్కూలంబునం జేరి మిం
టన నిల్చుండి మహాత్ముఁడు న్సుమతి యం♦ద స్తోతులన్ భానుమ
త్తనయుం జూచి వచించె స్వీయ మగువృ♦త్తాంతం బుదారధ్వనిన్. ౩౨౩

కం.రాక్షసుఁడును దుర్వృత్తుఁడు, రాక్షసకులనాథుఁ డైన♦రావణునకు నే
సాక్షాదనుజుఁడఁ జుండీ, యాక్షితిని విభీషణాఖ్య ♦ నెఱుఁగం బడుదున్. ౩౨౪

మ. ధరణీకన్యక దండకాటవి జన♦స్థానంబునం దుండఁగా
హరియించెన్ మఱి యజ్జటాయువును సం♦హరించె రోధించె నా

కరణీయానను స్వావరోధమున రక్షస్త్రీనలఁ గా పుంచె నా
హారిణీలోచన దీన యై వివశ యై యల్లాడ నాక్రూరుఁడున్. ౩౨౫

కం. రామునకు సీత ని మ్మని, వేమాఱును హేతుయుక్తవివిధోక్తులచే
సామమున నెంతొ చెప్పితి, నామానవభోజి కది నిరర్థక మయ్యెన్. ౩౨౬

కం. అంతకవశుఁ డగువానికి, నెంతటిమే లౌషధంబు నిందనిగతి నే
నెంతహిత మాడినను నొక,సుంతయు మతిఁ గొనఁడు కాలచోదితుఁ డగుటన్.

చం. పరుషములాడి నన్ను నొకబంటువిధాన నవజ్ఞ చేసినన్
దురుసున, నాలుబిడ్డలను ద్రోపిడి యియ్యెడ రామచంద్రునిన్
శరణముఁ జొచ్చినాఁడ, రఘుసత్తముతోడ జగచ్ఛరణ్యుతోఁ
బరమమహాత్ముతోఁ బ్లవగవర్యులు! నాస్థితి వేగ దెల్పరే.[1] ౩౨౮

→ సుగ్రీవుఁడు రామునకు విభీషణురాక దెలిపి రాక్షసుల నమ్మరాదనుట. ←

కం. అను నా వచనంబుల విని, యినతనయుఁడు శీఘ్రగామి యేగి సుమిత్రా
తనయు సమక్షమునం ది, ట్లనియె న్రఘురాముతోడ నత్తరపడుచున్. ౩౨౯

కం. తనపేరు విభీషణుఁ డఁట, యనుజుం డఁట దేవ! రావణాసురునకుఁ దా
మనుజాద చతుష్కముతోఁ, జనుదెంచి నరేంద్ర! నిన్ను శరణముఁ జొచ్చెన్.

తే. యోజనలు సేయు తెఱఁగుల వ్యూహములను
నుపమలం దేని చారని యుక్తియందు
వానరులపట్ల వైరుల వలన మిగుల
నప్రమత్తుండ వై యుండ నగు జయంబు. ౩౩౧

తే. కామరూపులు మఱియు నికారవిదులు,శూరవర్యులు రాక్షసు లూసరివర్య
తెలియరాకుండఁగనులకుఁ దిరుగుచుంద్రు, వారి నెన్నండు నమ్మంగ వలనుపడదు.

కం. ప్రణిధి[2]యయి రావణునకున్, జనుదెంచెనొ నీతిశాలి స్వయముగఁ దానే
మనలోన నుండి సమయముఁ, గని మనలం బిలుకుమార్పఁగా వచ్చె నొకో. ౩౩౩

కం. తనహితు లనిచినబలమున్, వనచారులబలము మూలబలముం దనవే
తనమునఁ గుదిరినబలమును, జను నమ్మఁగ; నమ్మరాదు శాత్రవబలమున్. ౩౩౪

కం. రాక్షసుఁ డఁట సహజంబుగ, రాక్షసనాథునకు ననుఁగుభ్రాతయు నఁట ద్వి
ట్పక్షమున వచ్చినాఁ డఁట, యీక్షింపుము నమ్మవచ్చునే వీని మదిన్. ౩౩౫

చం. వినుము విభీషణుండు రఘువీర! దశాస్యునిచారుఁ, డాతఁడే
పనుపఁగ వక్రబుద్ధి మెయి వచ్చినవాఁ డిట, కీవు నమ్మినన్
జనవర! మాయచే మనలఁ జంపుట సత్యము, వీని నిప్పుడే
పొనుఁగువడంగఁ జేత దగుఁ బో క్షమవద్వర![3] నాకుఁ జూడఁగన్. ౩౩౬

[1] విభీషణశరణాగతి అభయప్రధానము. ఇవి యుత్తరపీఠికయందు విపులముగఁ జర్చితములు.

[2] ప్రణిధి=వేగులవాఁడు.　　[3] క్షమవద్వర = ఓర్పుగలవారియందు శ్రేష్ఠుఁడా.

చం. వెరవరి యైనదాయ యరి♦వీరుల సేనలలోనఁ జొచ్చి యే
యరమర లేక త్రిమ్మరుచు ♦ నంతట సందొకయింత గల్గినన్
బొరిగొను శత్రుసంతతులఁ ♦ బూర్ణముగాఁగ నులూకసంహతిన్
గరటమువోలెఁ గాన నెటు♦కార్యము గాదు విరోధి నమ్మఁగన్. ౩౩౭

కం. క్రూరుఁ డగు రావణాసురు,కూరిమితమ్ముండు సేవ♦కులతో వీనిన్
గ్రూరంబుగఁ జంపుటయే, సారమతీ! కృత్య మిపుడు ♦ చర్చింపంగన్. ౩౩౮

కం. అను నినజునిసంరబ్ధం,బున నాడినవాక్యములను ♦ బురుషోత్తముఁడున్
విని నికటపార్శ్వవర్తుల, హనుమత్ప్రముఖాగచరుల ♦ కను సంప్రీతిన్. ౩౩౯

↞ శ్రీరాముఁడు విభీషణువిషయమై కపులయభిప్రాయ మడుగుట. ↠

చం. వలిముఖనేత యాయసుర♦వల్లభుతమ్ము నెడాటమందుఁ దాఁ
బలికినయుక్తియుక్త మదు♦పల్కులు మీరును వింటిరే కదా
బలితపుఁగార్యసంకటము♦పట్ల హితుం డొకఁ డాడ నంతతోఁ
బలుకమి యొప్పు దన్య మగు♦ప్రాజ్ఞ సమర్థ శుభేప్సపాలికిన్. ౩౪౦

కం. కావున నియ్యెడ మీమీ,భావంబులు దెలుపుఁ డన్నఁ ♦ బ్లవగవరుల్ త
ద్భావుకచికీర్షులై సం,భావించుచుఁ దమమతంబుఁ ♦ బలికి రతనికిన్. ౩౪౧

చం. తెలియని దింత లేదు జగ♦తీత్రయమందు మహాత్మ! నీకు మా
వలననినిగౌరవుం జెలిమి♦బల్మిని బ్రశ్న యొనర్చి తింతయే;
యెలసెఁ బరీక్ష్యకారిత సు♦హృత్పరతంత్రత ధార్మికత్వముం
బలదృఢశౌర్యసత్త్వము ల♦పారపరాక్రమ! జ్ఞప్తి నీయెడన్. ౩౪౨

కం. మతిసంపన్నులు క్రియలం, దతినిపుణులు నీదుసచివు ♦ లందఱు నగుటన్
హిత మొక్కొక్కఁడు తనతన, మత మనుటయ మేలు హేతు♦మానితఫణితిన్.

↞ అంగదాదులు వారివారి యభిప్రాయంబులఁ దెలుపుట. ↠

చం. అన విని వాలిపుత్త్రుఁడు ధ♦రాధిపుతోడ విభీషణుం డరా
తినికటమందు నుండి చను♦దెంచుటచే ననుమానపాత్త్రుఁ డే;
చనదు తటాన నమ్మఁ, దమ♦చందము మార్పడఁ జేసి రంధ్రముం
గని ప్రహరింత్రు ద్రోహు, లటు♦గాన ననర్థము గల్గు నెంతయున్. ౩౪౪

ఉ. కావున నట్టివారలను ♦ గార్యములం దిడి తత్ప్రవర్తనన్
వావిరి నిశ్చయించి గుణ♦వంతుఁడయేన్ గ్రహియింపవచ్చు, దు
ర్భావుఁడ యేని వీడు టది ♦ భావ్యము, దోషబహుత్వ మున్నచోఁ
జే విడువం దగుం; గుణవి♦శిష్టుఁడ యేనియుఁ గైకొనం దగున్. ౩౪౫

ఉ. ఆనుడు లాలకించి శర♦భాహ్వయుఁ డి ట్లను సాధ్యసూక్తులన్
దానవుచిత్తశోధన మొ♦నర్పఁగ వేగుల సూక్ష్మబుద్ధులన్
బో నియమించి వా రితని♦పోకల నెల్ల నెఱింగి వచ్చినన్
మానవలోకపాల! యను♦మానము పాయ గ్రహింపు మిమ్మటన్. ౩౪౬

చం. అనవుడు జాంబవంతుఁడు గు♦ణాఢ్యుఁడు దోషవివర్జితంబుగా
మనవి యొనర్చె రావణుఁడు ♦ మత్సరచిత్తుఁడు బద్ధవైరుఁ డా
తని నెడఁబాసి మి మ్మితఁడు ♦ దాయఁగ వచ్చె నహేతుకంబుగాఁ
గనఁగ నదేశకాలములఁ ♦ గావున నమ్మకుఁ డీవిభీషణున్. ౩౪౭

ఉ. మైందుఁడు నీత్యనీతుల స♦మంబుగ బుద్ధిఁ దలంచి పల్కె ము
న్నుందు విభీషణుం దఱిసి ♦ ముచ్చట కీడిచి తేనెమాటలన్
సందున రావణాసురుని♦చందము మాటలపొం దెఱింగి మీ
దం దగు యుక్తముం జలుప ♦ దాశరథీ! ఖలుఁడే నదుష్టుఁడేన్. ౩౪౮

తే. అంత సంస్కారసంపన్నుఁ ♦ డఖిలమంత్రి
సత్తముఁడు నగుహనుమ ప్ర♦శస్తఫణితి
నర్థవంతంబు మధురంబు ♦ నగుచుఁ బ్రియము
మితము నగువాక్యములు పల్కె ♦ హితము దోఁప. ౩౪౯

విభీషణుని గ్రహింపవచ్చునని హనుమంతుఁ డభిప్రాయముఁ దెలుపుట.

కం. మతిమంతులలో శ్రేష్ఠుఁడ, వతికుశలుఁడ వర్థముల మ♦హావాగ్మివి ని
న్నతిరేకించి వచింపఁగ, శతమఖునాచార్యుఁ డైనఁ ♦ జాలఁడు రామా. ౩౫౦

సీ. వాగ్వాదముల నేను ♦ వావదూకుఁడ[1] నంచుఁ, దర్కనైపుణిఁ జూపఁ ♦ దలఁప లేదు
అన్యమతంబుల ♦ నణఁచి నావాదంబె, గెలిపింప వలయు న♦న్తలఁపు లేదు
ఎల్లవారలకన్న ♦ నేన మిన్నయటన్న, గౌరవంబును గాంచు♦ కాంక్ష లేదు
నావచోజ్జృంభణ ♦ మావిష్కృతము సేయ, నిది సమయం బంచు ♦ నెంచ లేదు
తే. దనుజునందలి పక్షపా♦తమునఁ గాదు, త్వద్గురుత్వాప్తి నభిలాష♦వలనఁ గాదు
రాజవల్లభ! దశరథ♦రాజతనయ, కలది వచియింతు శ్రీరామ ♦ గౌరవమున. ౩౫౧

తే. అర్థము ననర్థమును నార♦యంగ నీదు
సచివవర్యులు పలికిన♦చందములను
దోష మొక్కండు నామదిఁ ♦ దోఁచుచున్న
దది గ్రహించుట కిపుడు సా♦ధ్యంబు గాదు. ౩౫౨

కం. పనులందు నియోగింపక, పనివానితనంబు తెలియఁ♦బడదు తటాలన్
బనులందు నియోగించుట, యను దోషము యనుచుఁ దోఁచె ♦ నుర్వీశవరా.

[1] వావదూకుఁడు = చక్కఁగా మాట్లాడుటయందు నేర్పరి.

కం.చారప్రణిహిత మిపు డను,వారు ననుచు ననిరి యది ని♦రర్థక మగుఁ జూ
దూరపుఁబనికిఁ వేగులు, చేరువల న్వార లేమి ♦ సేయఁగ వచ్చున్. ౩౫౪

ఉ. ఈతఁ డదేశకాలముల ♦ నిం దరుదెంచె నటన్నమాటకుఁ
నాతలఁ పేమినా ననుర♦నాయకుదౌష్ట్యము నీదు శౌర్యముం
జేతమునం దెఱింగి యిటు ♦ చేరె గుణోత్తరు నర్హవేళనే,
యీతనిబుద్ధికిం దగిన ♦ దియ్యది గాదె? యదేశ మెట్లగున్? ౩౫౫

తే.పనిచి యజ్ఞాతరూపు లౌ♦వారి దేవ! ప్రశ్నయొనరింపఁ దగు నని ♦ పలుకఁబడియె
నీవిచారంబునందు నా♦భావమునను, దోఁచు చున్నది యొక్కండు♦దోష మధిప.

చం.పరిచితి లేనివాఁ డొకఁడు ♦ ప్రశ్నలు వేయఁ గడంగినంతనే
వరమతి యైనవానికి న♦వశ్యము సందియ ముద్భవించి యే
పరుసునఁ జెప్ప నేమొ యని ♦ పల్కు సదుత్తర మీక, దానిచే
దురితము లేనిమిత్త్రుఁడును ♦ దూషితుఁ డౌ సరిగానిప్రశ్నలన్. ౩౫౭

ఉ. మాటలఁ దానయెంతయు స♦మర్థుఁడ నంచుఁ దలంచువాఁడు ధీ
పాటవ మేర్పడం దనదు♦భావ మెఱుంగఁగనీక పల్కునా
మేటరిమాటకానిమది♦మేర నెఱుంగఁగ లేఁడు నిక్క, మ
ల్లాటఁ దదీయయుక్తియు ని♦రర్థక మంచుఁ దలంతు రాఘవా. ౩౫౮

ఉ. ఆతఁడు మాట లాడునెడ ♦ నారసి చూచిన దుష్టభావతా
రీతియునేని దోఁపదు గ♦రిష్ఠగుణాఢ్య! ప్రసన్నమౌముఖం
బీతఁడె వంచకుం డిటుల ♦ యెంతయు నిబ్బర మూని రాఁడు శం
కాతురవృత్తి లేక, నుడిఁ ♦ గానఁగరా దొకదోష మేని యున్. ౩౫౯

కం.ఏవిధి గోరిన రూపం,బావిధి మార్పుఁబవచ్చు ♦ నంతర్గత మౌ
భావంబు దాఁప శక్యమె? భావంబును బయలు పుచ్చు ♦ వదనం బెటు లేన్. ౩౬౦

ఉ. కావున సంశయింపఁ దగు♦కారణ మేదియు లేదు, వీని స
ద్భావమునన్ గ్రహింపఁ దగుఁ ♦ బార్థివసత్తమ! దేశకాలముల్
భావనచేసి కార్యమును ♦ బాగుగఁజేసినఁ దత్ఫలంబు పెం
పౌవహి నైళ మబ్బు, మహి♦తాత్మక! నీకు వచించువాఁడనే. ౩౬౧

ఉ. నీమహితోద్యమంబు రజ♦నీచరనాయకుదుర్ణయంబు సు
త్రామసుతు న్వధించి కపి♦రాజ్యము భాస్కరసూతి కిచ్చుటల్
తా మును విన్నవాఁ డగుటఁ ♦ దానును రాజ్యము వేఁడుపొంటె సీ
తామహిళేశ! నీయెడకుఁ ♦ దారసిలె న్నతిపూర్వకంబుగన్. ౩౬౨

తే.దీని నంతయు యోజించి ♦ వీనిసాధు,గుణముఁ బల్కితి నాశక్తి♦కొలఁది రామ
నిగ్రహానుగ్రహంబుల ♦ నిపుణమతివి, శేషకార్యంబు నీవ యో♦జింపవయ్య.[1] ౩౬౩

[1] విభీషణునియందలి పక్షపాతముచె నతని గ్రహింపవచ్చు నని యభిప్రాయము పుట్టనుండుటకై హనుమ తనకును సీతాదేవికిని విభీషణుఁడు చేసిన సహాయమును బ్రస్తావించినవాఁడు కాఁడు.

శ్రీరాముఁడు కపులతో విభీషణుఁడు గ్రాహ్యుఁ డని చెప్పుట.

ఉ. మారుతపుత్త్రుఁ డాడినస♦మంజససూక్తుల నాలకించి దు
ర్వారమతిన్ సువిశ్రుతుఁడు ♦ రామవిభుండు ప్రసన్న చిత్తుఁ డై[1]
వారలతో నిజాశయముఁ ♦ బల్కె వినుండు హితేచ్ఛలౌటచేఁ
గోరెద నీవిభీషణుని♦గూర్చి వచింపఁగఁ గొంత నేనునున్. ౩౬౪

తే. మైత్రి భావించి తాన సం♦ప్రాప్తుఁ డైన,వాని నెపు డేని చేవీడు♦వాఁడఁ గాను
వానియెడ నుండె నేని నే♦ దేనిదోష, మద్ది గర్హ్యంబు గాదు స♦దాళులకును.[2]

కం. అను రామభాషణంబులు, విని సుగ్రీవుండు దాని ♦ వెండి తరచి యి
ట్లను నిశ్రేయసకరముగ, వినయోక్తుల రామచంద్ర♦విభునకు మైత్రిన్. ౩౬౬

ఉ. ఈతఁడు దుష్టబుద్ధి యగు♦నేనియు దుష్టుఁ డె కాక యుండెనే
నీతనిచేతఁ గాఁగలుగు ♦ నెయ్యది? యెవ్వని కౌను వీఁడు? స్వ
భ్రాతను నిట్టికష్టదశఁ ♦ బాసినవాఁ డెడఁబాయకుండు నే
యేతఱి నెవ్వనిం? బరుల ♦ కీతఁడు నాదుకొనంగ నేర్చునే? ౩౬౭

చం. అనవుడు రామభద్రుఁడు వ♦నౌకసులం గని మందహాస మా
ననము నలంకరింపఁ దగు♦నర్మిలిఁ దమ్మునివంకఁ జూచి యి
ట్లను ననధీతశాస్త్రుఁ డయి ♦ యార్యుల వృద్ధులఁ గొల్వకుండినం
బనుపడు నొక్క యిట్టిప్రతి♦భాయుతవాక్కుశలత్వ మేరికిన్. ౩౬౮

చం. కల దొక సూక్ష్మధర్మము ప్ర♦కాశముగా నిఖిలావనీశులం
బలికెద విన్మనంతరవు♦క్ష్మాపతు లేకకులోద్భవు ల్విరో
ధులు, వ్యసనంబు లొత్తుతఱి ♦ ద్రోహ మొనర్చుచు నుంద్రు, గావునన్
లలితగుణా! విభీషణుఁడు ♦ న న్నిటఁ జేరఁగ వచ్చెఁ గానిచోన్. ౩౬౯

కం. కలుషవిహీనాత్ములు త,త్కులజులు స్వీయు లగుహితుల♦కున్ గౌరవముం
గలిగింతు రైన నృపతులు, కలుషింతురు ప్రాయకముగఁ ♦ గడునిర్మలులన్. ౩౭౦

చం. అరిఁ దనుఁ జేరనిచ్చు టన♦యం బని యాడితి వీవు, శాస్త్రస
త్సరణి వచించెద న్వినుము ♦ జ్ఞాతుల మెవ్వరుఁ గాము వానికిన్
స్థిరమతి రాజ్యకాంక్షఁ జను♦దెంచినవాఁ డగు, వారిలోన నుం
డరె మతిమంతు? లట్టు లగు♦టన్ గ్రహియింపఁ దగు న్విభీషణున్. ౩౭౧

ఉ. శూరులలోన హృష్టులును ♦ శుద్ధమనస్కులు నైనవారిలో
వేరిమి యొక్కవేళఁ బ్రభ♦వించును, గానవె యిట్టి రచ్చ, త
త్కారణజాత మా వెఱపు ♦ గల్గుట నీతఁడు చీలి వచ్చె న
న్జేరఁగ నిప్పు, డట్ల గుట♦చే గ్రహియింపఁ దగు న్విభీషణున్. ౩౭౨

---

[1] ఒకఁడైన విభీషణుని గ్రహింపవచ్చునని చెప్పెనుగదా యని ప్రసన్నచిత్తుఁడాయెను. అంతవఱకుఁ బ్రసన్నత లేదు. [2] దీనియందు హనుమంతునకును బ్రత్యుత్తరము గలదు. విభీషణునియందు దుష్టబుద్ధి కానరాదు కావున నతని గ్రహింపవచ్చునని హనుమంతుఁడు చెప్పెను. శరణు చొచ్చినవాఁడు దుష్టుఁడుగానుండినను వానిదోషము లెంచి నిరాకరింపక రక్షింపవలయునని శ్రీరాముల వ్రతము.

తే. భ్రాత లెల్లరు భరతుని♦పాటి గారు,[1] జనకునకు నన్నుఁబోలిన♦తనయుఁ డున్నె
హితులయందును నీయట్టి♦హితుఁడు లేఁడు, తండ్రి! లోకంబునం దిది♦తథ్యమయ్య.

కం. అనురాముని వాక్యంబులు, విని లక్ష్మణుతోడ లేచి ♦ వినయంబు మెయిం
దినకరతనయుఁడు ప్రజ్ఞాధనుఁ డిట్లను రామచంద్ర♦ధరణిపుతోడన్. ౩౨౪

కం. రావణుని వేగువాఁ డని, భావింపు విభీషణుఁ డు♦పాచరవర్యా
గావున క్షమవద్వర! నీ, వేవిధి నితనిఁ వధింప ♦ నెంచుట తగ వౌ. ౩౨౫

ఉ. వచ్చినవాఁడు వీఁడు దశ♦వక్త్రుఁడు వక్రపుబుద్ధిఁ బంపఁగా
నచ్చితి మేని మాయల నొ♦నర్చి ప్రమాదపుబుద్ధి నుండఁగాఁ
గ్రచ్చుఱ నన్నొ నిన్నొ మఱి ♦ గాదిలితమ్మునినో వధించునో
సచ్చరితా! యటౌటఁ దగుఁ ♦ జక్కడుపన్ సచివాన్వితంబుగన్. ౩౨౬

కం. అని మిన్నకున్న సుగ్రీవుని వాక్యము లాలకించి ♦ పొరిఁ జక్క విమ
ర్శన మొనరిచి శుభతరసూ, క్తిని సీతానాథుఁ డనియెఁ ♦ గీశాగ్రణితోన్. ౩౨౭

## శ్రీరాముఁడు సుగ్రీవునకు శరణాగతరక్షణం బవశ్యకర్తవ్యం బని చెప్పుట.

ఉ. ఈతఁడు దుష్టబుద్ధి యగు ♦ నేనియు దుష్టుఁడె కాకయుండె నే
నీతనిచేతఁ గాఁగలుగు ♦ నెయ్యది? యొక్కరవంత యేని వాఁ
డేతఱి నేని కీడు ఘటి♦యింపఁగ శక్తుఁడు గాఁడు మామక
వ్రాతము లందు నాయెడ, ది♦వాకరనందన! నన్ను నమ్ముమీ. ౩౨౮

కం. ఈనిఖిలావని యక్షుల, దానవరక్షఃపిశాచ♦తతులను వలతేన్
భానుజ! యంగుళికొనచే, నే నిమిషములోనఁ జిమ్ము♦నే మిత్తి గనన్.[2] ౩౨౯

మ. వినవా మిత్రము బోయవాఁ డొకడు పృ♦థ్విం గూల్చి స్వప్రేయసిన్
దన ప్రాణంబులు పెన్బుభుక్ష నడలన్♦గక్షార్థియై చేరినం
దనమాంసంబు లొసంగి వానికిఁ గపో♦తం బాతనిం గాచెఁ గా
ననచారీ! శరణాగతు న్విడుచుటల్ ♦ న్యాయంబె నాబోఁటికిన్? ౩౩౦

కం. మును కణ్వసుతుఁడు కండుం, డనుపరమతపోధనాఢ్యుఁ ♦ డాడినగాథల్
విను మతిధర్మిష్ఠంబులు, నినతనయా! సత్యవాక్సు♦హితమును వినుతున్. ౩౩౧

తే. కరములను మోడ్చి దైన్యంబు ♦ కడలుకొనఁగఁ
జేరితిని నీదుమఱువు ర♦క్షింపు మనుచుఁ
బ్రార్థనము సేయువాఁ డరి♦యైనఁ జంప
రాదు కరుణాగుణావనా♦ర్థంబు గాఁగ. ౩౩౨

[1] పరోక్షమందుండు భ్రాతలలోనని యర్థము. [2] ఇది శ్రీరాముని సర్వసంహారకశక్తిని, నతిమానుషత్వమును దెలుపుచున్నది.

తే. పరులకును శరణాగతుఁ ♦ డరియయ్యైన, నార్తుఁ డైనను మఱి దృప్తుఁ ♦ డైనఁ గాని
యాత్మనాశంబునకు నోర్చి ♦ యైనఁ గావ, వలయు శాస్త్రనువిశ్వాస ♦ భావులకును.

తే. భయముచే నొండె మోహంబు ♦ వలన నొండెఁ
బ్రతిఫలాసక్తి నొండె స్వ ♦ బలముఁ గోలఁది
బ్రాపుకోరినవారిఁ గా ♦ పాడఁ డేని
వాఁడు పాలియు నిహంబునఁ ♦ బరమునందు.　　　　౩౮౪

తే. తాను జూచుచు నుండఁగఁ ♦ దన్ను శరణుఁ, జొచ్చినాతఁడు పరునిచేఁ ♦ జచ్చె నేని
యాయనాథుఁడు రక్షసే ♦ యనినృశంసు, నెల్లసుకృతంబుఁ గైకొని ♦ యేగువాఁడు.

ఉ. కానఁ బ్రపన్నుఁ డౌపురుషుఁ ♦ గావక యున్న దురంతపాపముల్
మానక కల్గు, నారకఫ ♦ లం బపకీర్తియుఁ దప్ప దేమియుం
మేనిబలంబు వీర్యమును ♦ మేకొను నాశము, గాన సద్యశ
స్థానము ధర్మనాకఫల ♦ దంబు నొనర్చెదఁ గండువాక్యమున్.　　　　౩౮౬

⟵ శ్రీరాముఁడు విభీషణున కభయ మిచ్చుట. ⟶

కం. నీవాఁ డని యొకపరియే, యేవాఁ డేం శరణు వేఁడె ♦ నేని సకలభూ
తావళి నభయంబును నే, వావిరి ఘటియింతు నిదియ ♦ వ్రత మగు నాకున్. ౩౮౭

ఉ. పొమ్మిఁక లెమ్ము కంజహిత ♦ పుత్రక![1] వాఁడు విభీషణుండ యేం,
సమ్మతి రావణుండ యయి ♦ న[2] న్వీను మే నభయం బొసంగితిం
దెమ్మిట వాని నన్న రఘు ♦ ధీరదయాగుణచోదితాత్ముఁ డై
సమ్మద మార దాశరథి ♦ సత్తముతోఁ గపినేత యిట్లనున్.　　　　౩౮౮

ఉ. ఏమి విచిత్ర మిద్ది జగ ♦ దీశ్వర! ధర్మవిధిజ్ఞ! లోకసా
ఖ్యామితసక్తచిత్త! యిటు ♦ లార్యనుతోక్తులఁ బల్కుటల్, సదా
ధీమతసత్యమార్గనిర ♦ తిం దృఢసత్త్వయుతప్రభావముం
భామహితత్వముం గలుగు ♦ ప్రాజ్ఞవరిష్ఠునకు న్రఘూద్వహా.　　　　౩౮౯

ఉ. నాకును నంతరాత్మ రఘు ♦ నాయక! యీతఁడు శుద్ధుఁ డంచు నే
ప్రాకటరీతిఁ దెల్పెడిని ♦ భావముచందము నారయం, ద్వద
స్తోకసయుక్తిసూక్తులను ♦ దోరముగాఁ బరికించినాఁడ, లే
దేకలుషంబు వీనియెడ ♦ నెంతయుఁ బూతుఁడు లోన వెల్పలన్.　　　　౩౯౦

[1] సుగ్రీవ విభీషణులు సమానదశయం దుండుటచేత నేగాక సుగ్రీవున కింకను విభీషణునిపట్ల సందేహము కలదేమో యనియుఁ బోనని చెప్పునేమో యనియు నతని మనసు శోధించుటకును దనయందు సందేహించి యితరులను బంపెనని సుగ్రీవుఁడు సందేహింపకుండుటకును రాముఁడు సుగ్రీవునే పంపెను.

[2] శ్రీరామునిప్రత మెఱింగిన సీత నీవు రాముని శరణుచొరుము. ఆయన నిన్ను రక్షించునని రావణున కుపదేశించెను. రాముఁడును రావణాసురుఁడు వచ్చిన రక్షించెదనని చెప్పెనుగాని రావణుఁడు శరణుచొరక చెడిపోయెను. రామరావణుల మంత్రాలోచన తారతమ్యము గమనించునది.

ఉ. కావున మానసమానుఁ డయి ♦ క్రాలుత మమ్ములఁ గూడి యిష్ట మే
ధావి విభీషణుండు సఖ♦తం గని యం చన హర్షయుక్తి సు
గ్రీవునివాక్యము ల్విని సు♦కీర్తి గ్రహించె దశాస్యభ్రాత వే
యావినతాతనూజసఖ♦తాప్తి నెసంగినయింద్రు కైవడిన్. ౩౯౧

విభీషణుఁడు శ్రీరాముపదంబులమీఁదఁ బడి తన్ను నివేదించుకొనుట.

ఉ. అంతట రామభద్రుఁ డభ♦యం బొసఁగం గని రావణానుజుం
డెంతయుఁ బ్రాజ్ఞుఁ డొటను మ♦హీస్థలిఁ జూచుచు సన్నతుండు నై
స్వాంతము పొంగ నల్వురు ని♦జాప్తులతోడుత మింటనుండి స
త్స్వాంతుఁడు రాముపాదముల ♦ సత్వరుఁడై శరణార్థియై పడెన్. ౩౯౨

కం. సరగ నిటు ధర్మబుద్ధియు, శరణాన్వేషియు సరాక్ష♦సచతుష్కుఁడు నై
చరణముల వ్రాలి ధర్మా,కర ముచితైతర్షి హర్ష♦కరసూక్తి ననున్. ౩౯౩

చం. అనుజుఁడ రావణాసురున ♦ కాతఁడు న న్నవమాన పెట్టఁ దెం
పునఁ జను దెంచి నే సకల♦♦భూతశరణ్యుని నిన్నుఁ జేరితిన్
నిను శరణంబుఁ జొచ్చితిని ♦ నెయ్యుర లంక సిరిం ద్యజించితిన్
మనుజవరా! భవద్గతము ♦ మత్సుఖజీవితరాజ్యభోగముల్.[1] ౩౯౪

కం. అనుతద్వచనంబుల విని, చనవునఁ దా నాదరించి ♦ సాంత్వభణితులన్
జనకసుతాపతి రాక్షస,వినిచయము బలాబలములు ♦ వినిపింపు మనన్. ౩౯౫

విభీషణుఁడు శ్రీరామునకు రాక్షసబలంబుఁ దెల్పుట.

చం. ప్రవిమలసచ్చరిత్రునకు ♦ రామున కి ట్లను దేవ యాస్వయం
భువునలన స్వరంబులను ♦ బొందుటచే దశకంఠు నాజిలో
దివిజపలాశిసంతతికిఁ ♦ ద్రిక్కిన భూతసమూహకోటికిం
దవిలి వధింపరాదు వను♦ధాధవనందన భక్తనందనా. ౩౯౬

సీ. రావణుతమ్ముండు ♦ రణవీర్యవంతుండు, కుంభకర్ణుండు ని♦ష్కుంఠ తేజుఁ
డన్న నా కతఁడు బ♦లారికి నెదురుద్ది, యని దళవాయి ప్ర♦హస్తుఁ డతని
వినియుండు వేమొ యా♦వీరుండు కైలాస,మున మాణిభద్రుని♦ మొక్కపటిచెఁ
గలన నని ర్భేద్య♦కవచుండు బద్ధగో,ధాంగుళిత్రుండు శ♦రాస మూని
తే. యింద్రజియద్దృశ్యుఁడగుచును♦ నేపు మీఱు,విగ్రహంబున హుతవహు♦ వేల్చితత్ప్ర
సాదమున మాయమగుచును♦జంపునరుల,రావణుని యీడువాఁడుప♦రాక్రమమున.
తే. లోకపాలసమానుల♦నీకపతులు,మఱి మహాపార్శ్వుఁడును నకం♦పనుఁడునాఁగ
నధికబలుఁడు మహోదరుం♦డనఁగఁ గలరు, వీర్యవిక్రమనిర్జిత♦విబుధవరులు. ౩౯౭

[1] విభీషణుఁడు శరణుఁజొచ్చుటకుఁ గారణము రాజ్యకాంక్షయా మోక్షకాంక్షయా యనునది యుత్తరపీఠికయందుఁ జర్చితము.

ఆ. కామరూపధరులు ♦ కల రొకపది వేల,కోట్లు లంకయందుఁ ♦ గ్రూరబలులు
పలలభోజు లల్ల ♦ వారలఁ బొనటఁ, భంగపఱిచె సురలఁ ♦ బంక్తిముఖుఁడు. ౩౯౯

చం. విపులపరాక్రముండు రఘు ♦ వీరుఁడు రాక్షసవంశదీపునా
లపితము నాలకించి సక ♦ లంబు మదిం దలపోసి పల్కె నీ
విపుడు దురాత్ము రావణుని ♦ వృత్తము సర్వము నోవిభీషణా
నిపుణముగాఁగఁ దెల్పుటను ♦ నిశ్చలచిత్తమునన్ గ్రహించితిన్. ౪౦౦

మ. వినుమా రావణుఁ బుత్రమిత్రసచివా ♦ న్వీతు న్మహాస్యందనం
బున మ్రందింతు, రసాతలంబును నధో ♦ భూమిం జొరం బాఱినన్
వనజాతాసనుదాపు చేరినను బ్రా ♦ ణాన న్విడం జుమ్మి, ని
న్ననఘా కట్టెదఁ బట్ట మయ్యసురరా ♦ జ్యశ్రీకి సత్యంబుగన్. ౪౦౧

కం. ఒట్టిడుకొందును నాతోఁ, బుట్టులపై రావణుని స ♦ పుత్రహితబలున్
మట్టిడక నే నయోధ్యా, పట్టనముం జొరఁగఁ బోను ♦ బరమచరిత్రా! ౪౦౨

తరలము. అనుడు భక్తి విభీషణుండును ♦ నంజలిన్ ఘటియించి యో
యనఘశీల! మదీయదేహము ♦ నందుఁ బ్రాణము లుండునం
దనుకఁ జొచ్చెద శత్రుసేన ని ♦ తాంతసాహ్య మొనర్తు లం
కను వినాశ మొనర్ప రాక్షస ♦ కాండముం బరిమార్పఁగన్. ౪౦౩

### శ్రీరాముఁడు విభీషణునకుఁ బట్టాభిషేక మొనరించుట.

సీ. అనువిభీషణునిఁ దా ♦ నంకపాళిని[1] గ్రుచ్చి, సౌమిత్రితో రఘు ♦ చంద్రుఁ డనియెఁ
దెమ్ము మానద! సాగ ♦ రమ్ముజలమ్ముల, నాప్రసాదమ్మున ♦ క్షిప్రముగను
నభిషిక్తుఁ జేయుమా ♦ యసురరాజ్యశ్రీకి, నివ్విభీషణు నన ♦ నింపుమీఱ
మర్కటవాహినీ ♦ మధ్యంబునను నతఁ, డట్లు గావించె రా ♦ జాజ్ఞకలిమి
తే. శ్రీరఘూత్తముకరుణావి ♦ శేషమునకు, మేలు మే లని కపు లెల్ల ♦ మెచ్చుకొనుచుఁ
గేక లెసఁగించి రంత సు ♦ గ్రీవపవన, సంభవులు పల్కి రిటు విభీషణునితోడ. ౪౦౪

ఉ. ఈవరుణాలయంబుఁ దరి ♦ యింపఁగ నెట్టు లగున్ వనాటసే
నావళితోడఁ, జెప్పుము యు ♦ పాయ మొకం, డన నవ్విభీషణుం
డోవనజాప్తనందన! మ ♦ హోదధి సాగరఖానితంబు ము
న్గావున రాఘవుండు శర ♦ ణం బనఁ బ్రాజ్ఞుఁ డొనర్చుఁ గార్యమున్. ౪౦౫

సీ. అనవుడు సుగ్రీవుఁ ♦ డరిగి సీతేశున, కవ్వార్తఁ దెలుపఁగ ♦ నాతఁ డలరి
కార్యదక్షుం డయ్యుఁ ♦ గడఁకఁ సమ్మాననా, ర్థంబు తమ్మునిఁ గపి ♦ రాజుఁ బలుకు
మత్సమ్మతం బది ♦ మర్కటపతికి నీ, కవ్విభీషణువాక్య ♦ మాదరింపఁ
దగు నని తోఁచినఁ ♦ దలపోసి చెప్పుఁడు, మర్కటేంద్రుఁడు సూరి ♦ మంత్రవిదుఁడు

[1] అంకపాళి = కౌఁగిలి.

తే. గాన యోజింపుఁ డన రఘు♦కాంతునకును
వార లని రయ్య! కాలార్థ♦వాక్య మతఁడు
చెప్ప మా కేల యది యరు♦చించు? లంక
సేతువును గట్టి కేభంగిఁ ♦ జేరఁ గలము? ౪౦౭

కం. ఆల మిఁ కేలా సేనా,జాలముతో దాఁట నుపమ ♦ సల్పుఁ డనన్ సీ
తాలోలుఁడు వేదివయిన్,జ్వాలవలెన్ వేగ దర్భ♦శయమునఁ బండెన్. ౪౦౮

శార్దూలుఁడు రావణునితో శ్రీరాముఁడు కపులతో
సముద్రమునొడ్డున దిగియుండువార్తఁ జెప్పుట.

సీ. అక్కడ శార్దూలుఁ ♦ డనురావణాసురు,చారుండు సుగ్రీవ♦సైన్యవిధము
నంతయుఁ బరికించి ♦ యతిరయంబున నేగి, రావణుఁ గనుఁగొని ♦ రాక్షసేంద్ర!
యిదిగో శాఖామృగ♦ఋక్షవాహిని మన,పురముపైఁ బడ వేగ ♦ పొర్లి వచ్చె
నప్రమేయం బయి ♦ యధికగంభీర,మై, మాఱట జలధి యై ♦ మహిమ నెసఁగెఁ
తే. బంక్తిరథపుత్రు లిరువురు♦ భ్రాత లుత్త,మాయుధులు రామలక్ష్మణా♦హ్వయులు సీతఁ
జేరఁ జనుదెంచి నిలిచిరి ♦ సింధుతటిని, బ్రబలదశయోజనావృత♦బలముతోడ.

ఉ. వైళమ దేవరా! తగిన♦వారిని దూతల నందు సర్వముం
బోలఁగ మూలము ల్దెలియఁగఁ ♦ బుచ్చుము వేగము, నాకుఁ జూడ నీ
వేళను సామదానములొ ♦ భేదమొ యర్థవిధం బ టన్న శా
ర్దూలునివాక్యముల్ విని ని♦రూపితకార్యవిదుండు వ్యగ్రుఁడై. ౪౦౯

రావణుఁడు శుకుని సుగ్రీవునొద్దకు రాయబార మంపుట.

కం. శుకనామకు నర్థవిదు,న్నికటమునకుఁ బిలిచి యనియె ♦ నీ వరిగి వెసన్
వికలుఁడవుగాక మద్వా,చికముగ సుగ్రీవుతో వ♦చింపుము సూక్తిన్. ౪౧౦

ఉ. ఈవు మహాబలాఢ్యుఁడవు ♦ ఋక్షరజస్తనయుండవున్ మహా
త్మావరవంశజాతుఁడవు ♦ కాఁగలలాభ మ దెద్ది నీకు సీ
తావిభుతోడి చెల్మిఁ? గల♦దా యొకనష్టము వీడిపోవ? సు
గ్రీవ! మదీయభ్రాతవు ♦ స్మరింపుము పూర్వపునెయ్య మియ్యెడన్. ౪౧౧

కం. రాముఁ డనునరాజపుత్రుని, భామిని నే నపహరింపఁ ♦ బ్రాజ్ఞవరా! నీ
కే మగునష్టము? సుగ్రీ,వా!మరలుము నీదుపురికిఁ ♦ బగ మన కేలా? ౪౧౨

కం. వానరవరు లెమ్మెయినే, నీనగరముఁ జేరలేరు ♦ దృఢ మిది గంధ
ర్వానీకము నేరద నర,వానరులా వచ్చువారు ♦ వనచరనాథా! ౪౧౩

చం. అనువిభునానతిం గొని వి♦హంగమ మై శుకుఁ డంబరంబునన్
జని చని ఖస్థితుం డగుచు ♦ సారసబాంధవసూనుతోడ న
ద్దనుజకులేంద్రువాక్కులు య♦థాక్రమ మంతయుఁ జెప్పఁ, గిన్కఁ జి
వ్వునఁ వినువీధికి న్నెగసి♦పోయి కపుల్ శుకు నేలఁ దాఁచుచున్. ౪౧౪

### వానరులు శుకుని మర్దించుట.

కం. పిడికిళ్ల నొకరి నొక్కరు, కడవఁగ మర్దించుటయును ♦ గలవరపడుచున్
మడియింప రాదు దూతలఁ, గడువడి వారింపు కపులఁ ♦ గాకుత్థ్సవరా! ౪౧౫

చం. పతి విధియించుమార్గమునఁ ♦ బల్కక యాత్మమతంబుఁ జాటుచుం
బతినుడులన్ వచింపనికు♦మార్గపుదూతలు వధ్యు లండ్రు, నేఁ
బతి విధియించినట్టివిధిఁ ♦ బల్కితి, దోసమె రామ? యన్న నా
ధృతి నలదూతచేయుపరి♦దేవనమున్[1] విని రామభద్రుఁడున్. ౪౧౬

కం. వానిని జంపఁగ వలదన, వానరు లవ్వాని గఱులు[2]♦పాచి విడిచినన్
దీనత మింటికిఁ జని యా, వానగవిభుతోడ ననియె ♦ వదలనిభీతిన్. ౪౧౭

కం. శ్రీమతిబలసంపన్నా!, భీమపరాక్రమ కపీంద్ర ♦ వీటికిఁ జని నే
నే మని వచింతు నయ్యా, నీమాటగ స్వామి! యామి♦నీచరపతితోన్. ౪౧౮

### సుగ్రీవుఁడు రావణునకుఁ బ్రత్యుత్తర మంపుట.

ఉ. నావుడు దూతఁ జూచి కపి♦నాయకుఁ డిట్లను నోరి చారుఁడా
యీవిధిఁ బల్కు రావణున ♦ కీ వెటుచూచిన నాకు మిత్రుఁడున్
గావు, ప్రియుండ వేనియును ♦ గా, వుపకర్తవు గావు, గావునన్
నీవు పలాశినాథ! దయ♦నీయుఁడ వైనను గావు నమ్ముమీ. ౪౧౯

కం. రామునకు నీవు వైరివి, రామునకును నేను హితుఁడ ♦ రాక్షసరాజా!
రామునిచే నీవును సం,గ్రామంబున వాలిఁ బోలఁ♦గల వో వధ్యా. ౪౨౦

చం. వదలక నిన్ను జ్ఞాతిహిత♦బాంధవపుత్రసమూహయుక్తుఁగాఁ
గదనములో వధించెద, ని♦కారముగా దిది, లంక సర్వముం
బద[3] డొనరించెదన్ నిమిష♦మాత్రమునన్ హరిసేనఁ బంచి, నీ
యుదు టిలఁ జెల్ల దింకఁ, జెడు ♦ గొప్పున యెందు నిశాచరేశ్వరా! ౪౨౧

శా. పాతాళంబున డాఁగినన్ సురపతిం ♦ బ్రార్థించి తోడ్తెచ్చినన్
ద్యోతస్ఫీతుపథంబులో మఱేఁగినన్ ♦ దుర్మార్గశీలా! యథా
జాతా![4] రావణ! నిన్నుఁ బ్రాణములతో ♦ సంగ్రామరంగంబునన్
సీతానేత విడండు, నేలకు బలిన్ ♦ నీకంఠముల్ గూర్చెడిన్. ౪౨౨

కం. సీతాపతి కినిసిన యా, పాతకి రక్షించువాని ♦ బ్రహ్మాండములో
దైతేయపిశాచామర, జాతంబుల నే నెఱుంగ ♦ క్షణదాటవరా. ౪౨౩

కం. బడుగును ముదుకని దుర్బలుఁ, బొడిచితివి జటాయు నంతఁ ♦ బోటు మిగిలెనే
చెడుతనమె కాక నీయెడఁ, బొడ గానఁగఁ గలదె బీర♦మును బలలాశీ. ౪౨౪

[1] పరిదేవనమున్ = ఏడుపును. [2] గఱులు = ఱెక్కలయీకెలు. [3] పదడు = స్మశానము.
[4] యథాజాతా = మూఢుఁడా.

చం. అవనివిభుండు చూచు నెడ♦నా మఱి లక్ష్మణుమ్రోల నైననా
యవనిజ నీహరించుట? క♦టా తలపోయఁగ లేవ యట్టినీ
యవగడపుంబనిం గలుగు♦హాని, మహాత్ము మహాబలుఁ శచీ
ధవముఖదుర్జయుఁ రఘువ♦తంసము నేమిగ నెంచినాఁడవో. ౪౨౫

కం. నీపాలిటి కాలునిఁగా, క్ష్మాపాలకుఁ దలఁపు మనిన ♦ సత్వరుఁడై తా
రాపుత్త్రుఁడు కపిపతిపైఁ, జూ పుంచి వచించె శుకునిఁ ♦ జూపుచు మింటన్. ౪౨౬

కం. చారుండః గాని ప్లవగమ, హారాజా! రాయబారి ♦ యనరా దితనిఁ
జోరవిలోకనముల బల, మారయు చున్నాఁడు తూఁచి♦నటు లుండి యటన్.

కం. పోనీయరాదు లంకకు, వీని ననఁ రాజునాజ్ఞ ♦ వృతపోటులు న
వ్వానిని గట్టియుఁ గొట్ట మ, హానిష్ఠురవృత్తిఁ బఱప ♦ ననదయుఁ బోలెన్ ౪౨౮

కం. దేవుళ్ళఁ బడుచు వికటా, రావంబున మొఱలు వెట్టె ♦ రామా! రామా!
నీవే గతి చంపి రయా, యీవానరవరులు కావ♦వే ననుఁ గరుణన్. ౪౨౯

చం. పెఱికిరి కంటిగ్రుడ్లు పృ♦థివీవరసత్తమ! నాదుఱెక్కలఁ
సఱికిరి, యీమహార్తి నిధ♦నంబును గంటినయేని చెప్పెదఁ
దఱచుగ నాదుపుట్టువు మొ♦దల్కొని రేపగ లింతదాఁక నేఁ
గఱకునఁ జేసినట్టికొఱ♦గాములపాపము నిన్నుముట్టెడిన్. ౪౩౦

ఉత్సాహము. ఆవిలాప మాలకించి ♦ యంబుజాక్షుఁ డాతనిఁ
గావుఁ డతఁడు దూతగాన ♦ ఘాత మర్హ మానె? నా
నావనాటు నతనిఁ జంప ♦ రైరి; యంత భూమిక
న్యావిభుండు జలధివేల♦యందు దర్భశయనుఁ డై. ౪౩౧

## శ్రీరాముఁడు దర్భశయనంబునఁ బరుండుట.

సీ. మును హారంగు లెసంగ ♦ నునురంగు జాళువా, బంగారుతొడగుల♦వఱలుదానిఁ
గాంచనకేయూరక్కక్రమము క్తావర, భూషణాంచిత మయి ♦ పొలుచుదానిఁ
బరమనారీజన♦కరములచేఁ బెక్కు, బడులను న ల్గిడఁ♦బడినదానిఁ
జందనాగరుపూత♦సౌరభోపేతమై, రక్తచందనమునఁ ♦ గ్రాలువాని
తే. శయనతలమున జానకీ♦చంద్రవదన, యుత్తమాంగంబుచే శోభ ♦ నొందుదాని
గాంగజలములఁ దక్షకు♦కాయమునకుఁ, దుల్య మగుదానిదీనార్తిఁ ♦ దొలఁచుదాని.

తరలము. కలన శాత్రవశోకదంబు యు♦గప్రతీపము దీర్ఘముఁ
సలలితాప్తముదాకరంబును ♦ సాగరాంత సమాశ్రయం
బలఘునవ్యశరప్రయోగస♦మర్థముఁ దృఢశింజినీ
కలిత మౌటను జర్ఘ మూఁడుటఁ ♦ గాయకాచినదానినిన్. ౪౩౩

మత్తకోకిలము. వేలువేలుగ నాలమందల ♦ విశ్రుతంబుగ దానముం
బోలఁ జేసినదానిఁ, బన్నగ♦భోగసన్నిభ మై మహో
భీల మాపరిఘాతసం బనఁ ♦ బేర్మిమించినదాని, నా
వేల దక్షిణబాహువుం బర♦వీరకాలుఁడు దిండుగన్　　౪౩౪

కం. తూరుపు మొగ మై కైకొని, పారావారంబు తరుణ♦భంగియొ మరణం
బో రెంట నొకటి నిజ మని, వీరుఁడు నుది నిశ్చయించి ♦ విధిహితనియతిన్.

కం. ముని యై శయనించెను సద్వననిధిఁ బ్రార్థించికొనుచుఁ ♦ బన్నుండ నిటుల్
చనె మూఁడు యామినులు దర్శన మొసఁగఁడు మందుఁ డగుట♦సరిదధిపతియున్.[1]

→ శ్రీరాముఁడు సముద్రుపైఁ నాగ్రహపడుట. ←

ఉ. అంతట రాఘవుండు కన♦లార మహోదధివర్యు మీఁద ర
క్తాంతవిలోచనుం డయి ని♦జాంతికసీమన యున్నలక్ష్మణుఁ
గాంతసులక్షణుం బలుకుం ♦ గంటివె దర్శన మీఁడు సాగరుం
డెంతటిగర్విమో? పరువు ♦ హీనత పో మలినాత్ము వేఁడుటల్.　　౪౩౭

కం. ఓరుపు శమ మార్జవమును, జారుప్రియవాదితయు న♦సాధులయందుం
గారియము సేయ దాస, చ్చారిత్రు, నశక్తుఁ డనుచు ♦ జడుఁ డెంచు మదిన్.　　౪౩౮

కం. తనుఁ దాన పొగడుకొనువా, నిని సర్వోత్సృష్టదండు ♦ నిర్దయుఁ గుటిలా
త్ముని విపరిధావకుం గని, జనములు తనియించు చుండు ♦ సత్కారములన్. ౪౩౯

కం. సామమునఁ గీర్తి గలుగదు, సామంబున యశము లేదు ♦ సౌమిత్రీ! సం
గ్రామముఖంబున జయ మేఁ, సామమున లభింప దయ్య ♦ జగముల నెందున్.

ఉ. ఏను క్షమాగుణంబు వహి♦యించుట నీజలరాశి నన్నుశా
లీనునిఁబోలెఁ జూచెడి, బ♦లే క్షమ చూపఁగఁ గూడ దిట్టిఁడా
వానియెడన్, మదీయశర♦వారవిదారితనక్రకూర్మ సం
తాను నిరుద్ధతోయు గత♦దర్పు విలోలునిఁ జూడు లక్ష్మణా?　　౪౪౧

కం. కరులకరంబులు దర్వీ, కరములభోగములు మీఁల♦కాయంబులు సా
గరమున మచ్ఛిన్నంబులు, కరముం దేలాడఁ జూడఁ♦గల వనుజాతా!　　౪౪౨

కం. కరవాఁడిశరంబుల సా, గరమును సవిసారశుక్తి♦కాశంఖసమా
త్కారముగ నింకించెద సం, గరమునః మొత్తందనానఁ ♦ గనఁబడఁ డిఁకేఁడున్.　౪౪౩

శా. సౌమిత్రీ![2] యిటు దెమ్ము చాపము మహా♦సర్పోపమానాశుగ
స్తోమంబున్ వెస సాగరంబు నిదె సం♦శోషిల్లఁ గావించెదన్

[1] రామనామము స్మరించుచుఁ దన్ను దాఁటఁబూనిన హనుమంతుని సముద్రుఁడు గౌరవించి తనకు శరణాగతుఁడైన రాముని నుపేక్షించుటచే భగవంతునికంటె భగవన్నామమే శ్రేష్ఠమని ఫలదమని యేర్పడు చున్నది. [2] సుమిత్రపుత్రుఁడా యని సంబోధించుటచే, సుమిత్ర నావిషయములో నీవెట్లు నడచుకొన వలయునని బోధించెనో దానిని స్మరించి మఱుమాట చెప్పక విల్లిమ్మని భావము.

భూమీధ్రాటచయంబు[1] కాలినడకం ♦ బోఁ జేసెదం గిన్క వే
లామర్యాద యణంగి పొంగి ధరఁ బో♦ర్లన్ క్షుబ్ధముం జేసెదన్. ౪౪౪

## ⟵ శ్రీరాముఁడు సముద్రునిపై బాణంబులు వైచి క్షోభిల్లఁ జేయుట. ⟶

ఉ. ఏగతిఁ బట్టునో కనుమ ♦ యీవరుణాలయ మిప్పు డంచుఁ దా
జేగుఱుఁగన్నులన్ ధనువుఁ ♦ జేకొని కల్పకృశానుతుల్యనా
లాశున మండుచుం గరత♦లంబునఁ జాపము బిగ్గఁబట్టి వే
లాగి శరోచ్చయంబుఁ బవ్రు♦లన్ బలవైరియుపోలె వైచినన్, ౪౪౫

స్రగ్ధర. జ్వాలాభీలాశుగంబుల్ ♦ చర చర చనుచున్ ♦ సాగరం బుత్తలింపన్
వే లోనం జొచ్చినంతన్ ♦ విషధరచయముల్ ♦ బెగ్గిలెన్ దిగ్గనన్ గ్రా
హాళీకుంభీరయుక్తం ♦ బగుసలిలము వా♦తాతినిర్హ్రాదయుక్తిన్
జాలన్ ఘోరత్వమందెన్ ♦ సరఁగఁ బొగలతో ♦సంభ్రమద్భంగపాళిన్. ౪౪౬

కం. గుడి తిరుగుచుఁ దిరుగువడి, బుడబుడ శుక్తులను శంఖ♦ములఁ గ్రక్కుచు లోఁ
దొడిఁబడుచును వెడరూపునఁ, గడలి కడుం గొడువ గుడిచి♦కళవళ పడియెన్.

కం. అడిలిరి పాతాళంబును, విడిమ ట్టగుపన్నగులును ♦ విడివడి తోడిపై
నడిరెడిశరములవడి మం, డెడుకన్నులు మోము లొప్ప ♦ డీలుం గొనుచున్. ౪౪౭

ఆ. నక్రమకరకమఠ♦చక్రవాళాన్వీత, వింధ్యమందరాభ♦వీచితతులు
వేలఁగొలఁదు లెగసె ♦ విన్నంట నల్లకల్లోల మయ్యె జలధి ♦ మూలమట్టు. ౪౪౮

శా. ఎన్నం దూననియుగ్రవేగమున సీ♦తేశుండు కోదండమున్
సన్నాహంబునఁ బట్టి దీర్ఘతరని♦శ్వాసంబులం బుచ్చఁగా
నన్నా! మానుము మాను మంచు వెస డా♦యం బోయి సౌమిత్రి యా
పన్నార్త్యావనదక్షుచాపమును సం♦భ్రాంతాత్ముఁడై పట్టినన్. ౪౫౦

## ⟵ శ్రీరాముఁడు సముద్రుపై బ్రహ్మాస్త్రంబు వేయఁ బూనుట. ⟶

చం. జనకసుతామనోహరుఁడు ♦ సాగరు నిట్లను దారుణోక్తి మ
ద్ఘనతరశాతతీవ్రశర♦కాండసుదగ్ధుఁ బ్రశుష్కుఁ జేసి నిన్
గనుము రసాతలంబుదను♦కం ద్రుటిలోపల దుమ్ము రేఁపెదన్
మనియెదె! నీదురూపమును ♦ మాపెదఁ జూడుము రోరిసాగరా! ౪౫౧

ఉ. మామకచాపముక్తశిత♦మార్గణవర్షముచేత సర్వశా
ఖామృగపాళి యీక్షణము ♦ కాల్నడ నావలియొడ్డు చేరఁగా
నోమనుజాశనాలయుఁడ! ♦ యుద్ధతిఁ జూపెద నిప్డు చూడరా,
నీ మది నెల్లెఱింగెదవు ♦ నిస్తులమద్బలవిక్రమంబులన్. ౪౫౨

---

[1] భూమీధ్రాటచయంబు = కపిసమూహము.

శా.కానీరా యని బ్రహ్మదండనిభ మా♦కాండంబు కోదండమం
దానీ రేజవిలోచనుండు దొడి బ్ర♦హ్మాస్త్రంబు మంత్రించి, వే
గానన్ జ్యాలత రోమతీవ్రుఁ డయి యా♦కర్ణాంతముల్ లాగ, గ్రా
వానీకంబులు సంచలించె దిశల♦ల్లల్లాడెఁ బెంజీఁకటిన్. ౭౫౩

శా.వ్రక్కల్ వాఱెను రోదసీబిలము, మా♦ర్తండశుపానాయకుల్
చుక్కల్ ద్రోవలు తప్పె, నేల్గుఁ గొలఁకుల్ ♦ క్షోభించె, నుల్కాతతుల్
లెక్కల్ మీఱి మహారవంబునను వ్రా♦లెన్ మేదినిన్,మింట నా
ర్షుకుల్[1] మారుతపంక్తులున్ బలిసెఁ బె♦న్మూర్ఛం గొనెన్ జంతువుల్. ౭౫౪

కం.సంతమసనమావృతదిన,కాంతమయూఖములతోడ ♦ గగనతలం బు
ద్భ్రాంతిం గూర్చుచుఁ గొఱవుల,సంతతి వెలుఁగొందునట్లు ♦ జ్వలితం బయ్యెన్.

కం.అంజలిగుంజలిగా నెగ,యం జిమ్ముచు మేఘవితతి ♦ నవనీజములన్
భంజించె సశైలశిఖర,పుంజముగఁ బ్రభంజనుండు ♦ పురుభీతిదుఁ డై. ౭౫౬

కం.భైరవరవపూరితములు, ఘోరంబులు నైన మేఘ♦కోటులు గురిసెన్
ధారిణిఁ జిచ్చుఱపిడుగుల,ధారలు బెక్కొట్టై భూత♦తతి దీనదశన్. ౭౫౭

కం.ఎదపడి జంతులు ధరఁబడి,కదలక మెదలకయ యుండెఁ ♦ గడునెసఁగించెన్
రొదల నదృశ్యపుభూతస,ముదయము కడలియు ససత్త్వ♦ముగ వెతఁ జెందెన్.౭౫౮

→ శ్రీరామునకు సముద్రుఁడు ప్రత్యక్షమగుట. ←

చం.చెలియలికట్ట వాసి యల♦సింధువు యోజన మేగె లోనికిన్,
లలితదయాబ్ధి రాముఁడు క♦లంబకమున్ విడఁ డయ్యె, నయ్యెడన్
జలముల నుండి మేరుగిరి ♦ సప్తతురంగుఁడువోలెఁ దోఁచె ను
జ్జ్వలితముఖాహిసంవృతుఁడు ♦ జాంబవభూషణభూషితాంగుఁడున్. ౭౫౯

ఆ. సాటిమీఱు నొంటి♦పేటహారంబుమ,ధ్యమునఁ బాటలప్ర♦భాంచిత మయి
కౌస్తుభానుజ మయి ♦ సిస్తగుమణిపత,కం బురంబునందుఁ ♦ గ్రాలువాఁడు. ౭౬౦

సీ. స్నిగ్ధవైడూర్యస♦న్నిభుఁడు లోహితమాల్య,వస్త్రధరుండును ♦ వారిజాత
పత్రనేత్రుఁడు దివ్య♦♦పౌష్పమాలాంచిత,మస్తుఁ డాత్మజరత్న♦మండితుండు
ప్రాలేయశైలంబు♦లీల నానాధాతు,యుక్తుఁ డాఘూర్ణభం♦గౌఘుఁ డతుల
కాలికానికరవా♦తూలసంకులుఁడు ను,ద్వర్తితనక్రుఁడు ♦ భ్రాంతరాక్ష

తే.సావళీ లేలిహానుండు ♦ నైనవీర
వరుఁడు సాగరుఁ డాయస్త్ర♦పాణిఁ జేరి
యంజలిఘటించి రామచం♦ద్రా! యటంచు
సాదరంబుగఁ బిలిచి యి ♦ ట్లనియె నపుడు. ౭౬౧

[1] వార్షుక్కుల్ = మేఘములు.

చం. అవనినభోనిలానలప♦యస్సులు శాశ్వత మైనమార్గముఁ
దవిలి స్వభావ మేమియును ♦ దప్పవ, యట్టుల నే నగాధ మ
ప్లవమును నౌట నాసహజ♦భావము, దీనిని దప్పరాదు, రా
ఘువవర! సౌమ్య! యియ్యది య♦కార్యము, నీకు నెఱుంగఁ దెల్పితిన్. ౪౬౨

తే. కామమున నైన లోభాది♦కారణముల,నైన భయమున నైన ధ♦రాధినాథ!
గ్రాహనక్రాకులం బుద♦కంబు నేను, స్తంభనముఁ జేయ రాద యే♦సమయమునను

ఉ. ఐనను నీదుకీశబల ♦ మంతయు దాఁటెడిదాఁక గ్రాహసం
తానము సేన కెట్టిబెడ♦దల్ సమకూర్పక యుండఁ గాచెదన్
జే నయినంత, నీ ప్లవగ♦సేన దరింప స్థలం బొసంగెదన్
మానుము కోప మన్న రఘు♦మండనుఁ డి ట్లను నమ్మహాబ్ధికిన్. ౪౬౩

శ్రీరాముఁడు బ్రహ్మాస్త్రమును ద్రుమకుల్యముపైఁ బ్రయోగించుట.

ఉ. ఇయ్య దమోఘ మైనశర ♦ మెచ్చట వైతు న టన్న సాగరుం
డయ్యతులాస్త్రముం గని ధ♦రాధిపుతో ద్రుమకుల్యమంచు నో
యయ్య! భవద్విధంబున మ♦హాఖ్యను గన్నతలంబు గల్గు నొం
డయ్యెడ నుగ్రదర్శులు మ♦హాకలుషాత్ములు దస్యు లుద్ధతిన్. ౪౬౪

కం. వాలాయము నాజలములఁ, గ్రోలుదు రాభీరు లట్టి♦కుటిలులస్పర్శన్
దాళఁగఁ జాలను దన్ని,స్థ్మాలముఁ గావింపు నీయ♦మోఘశరమునన్. ౪౬౬

సీ. అనవుడు రాఘవుం ♦ డబ్ధి చూపినచాయ, జ్వలదగ్నిశరమును ♦ వైచుటయును
శరపతనం బైన♦స్థలము గాంచెను మరు,కాంతార మనఁ బేరు ♦ కాండకలిత
రంధ్రంబునుండి నీ♦రంబు పై కెగసె ర,సాతలంబున నుండి ♦ సరభసముగఁ
గూపంబునకు వ్రణ♦కూప మన్ పే రబ్బె, నందుండి యెగసెడి♦యంబురాశి

తే. కడలి కుద్దిగఁ దోఁచుఁ ద♦త్కాండవరము, భయదనినదసమేతంబు ♦ వసుధ వ్రచ్చు
కతన నచ్చటిగుంటలఁ ♦ గలజలంబు, శోషగిలె నంత రఘువంశ♦భూషణుండు.

కం. ఆమరుకాంతారమునకుఁ, బ్రేమంబున వర మొసంగెఁ ♦ బ్రియయువసము వీ
తామయముఁ ఫలమూలర,సామలముఁ సురభితౌష♦ధాన్వితమునుగాన్. ౪౬౭

కం. ఆవరముబలము పెంపున,నావసుధ శుభప్రదేశ ♦ మయ్యెను; నిటు పా
రావారము దనకుక్షి ధ,రావల్లభుతీవ్రతరశ♦రంబునఁ గ్రాఁగన్. ౪౬౮

చం. సకలకళావిశారదుని ♦ త్వాధవు వెండియుఁ బల్కు విశ్వక
ర్మకుఁ దనయుండు, తండ్రికి స♦మానుఁడు, తద్వరశక్తి విద్యలన్
బ్రకటితదర్పుఁ డీనలుఁడు ♦ రాఘవ! సేతువుఁ గట్టఁగా సము
త్సుకుఁ డగుఁగాక, తద్భరముఁ ♦ దోయజలోచన! యేన తాల్చెదన్. ౪౭౦

## నలుఁడు సేతువు నిర్మించుట.

సీ. అని తిరోహితుఁ డైన ♦ నను నలుం డనసీశ! వారిధి సత్యంబుఁ ♦ బలికె దేవ!
యీమహోదధియందు ♦ నేను సేతువుఁ గట్టు, వాఁడ మజ్జనకుని♦వరము పేర్మి
దండ మొక్కటియె యు♦త్తమము లోకంబునఁ, బురుషున కంచు నే ♦ బుద్ధిఁ దలఁతు
నకృతజ్ఞు లగువారి♦యందు శమం బేని, దాన మేనియు సాంత్వ♦మైనఁ గాని

ఆ. నిష్ప్రయోజనంబు ♦ నీరజలోచన!, దండభీతిఁ గాదె ♦ తనదులోఁతు
చూపఁ గలిగె జలధి ♦ చూడఁగఁ గోరి నా, సేతుబంధనంబు ♦ భీతిదంబు. ౪౭౧

చం. మును పలవిశ్వకర్మ వర♦ముం దయచేసెను మందరాద్రి మ
జ్జననికి, విశ్వకర్మకును ♦ సంభవ మందితి నౌరసాత్మజుం
డను నయి, శిల్పవుంబనుల♦నైపుణిఁ దండ్రికి నీడు వత్తు, నీ
వననిధిమాటలన్ స్మృతికి ♦ వచ్చెను మద్వరశక్తి రాఘవా! ౪౭౨

కం. ఈసాగరుండు దీనిన్, మీసన్నిధిఁ జెప్ప కున్న ♦ మిన్నక యుందున్
నాసామర్థ్యము నేనే, వాసి చెలఁగఁ జెప్పుకొనఁగ ♦ భావ్యము గామిన్. ౪౭౩

ఉ. కట్టుదు నేను సేతువును ♦ గంధిజలంబుల వానరావళుల్
పట్టుగఁ దోడ్పడన్ వలయుఁ ♦ బార్థివవర్య! యటన్న భూమిపా
లేట్టునియాజ్ఞ మై నగచ♦రేశ్వరు లెల్లరు నేగి కానలన్
జెట్టులు పెళ్ళగించికొని ♦ చెచ్చరఁ దెచ్చిరి వార్ధివేలకున్. ౪౭౪

సీ. సాలాశ్వకర్ణముల్ ♦ సప్తపర్ణంబులు, ధవవంశకుటజముల్ ♦ తాలములును
దిలకార్జునంబులు ♦ తిమిశబిల్వంబులు, సుమయుతకర్ణికా♦రము లశోక
వారముల్ మామిళ్ళు ♦ వకుళముల్ చంద్రలు, తాలదాడిమగుల్మ♦జాలములును
వేములు టెంకాయ♦వృక్షముల్ హరులు స, మూలముల్ గాను వి ♦ మూలములుగఁ

ఆ. దెచ్చి రింద్రుధ్వజముఁ ♦ దెచ్చెడిభంగిని, నందుఁ గపులు కొంత ♦ అలవు మీఱి
కొండగములఁ బెఱికి ♦ దండియంత్రంబుల, నునిచి తెచ్చి రప్పు ♦ డుదధికడకు.

పంచచామరము. గుభీల్ గుభీల్ గుభీ ల్మనంగఁ ♦ గొండ లెల్ల దండిగా
దభాలునం బడంగ నైవఁ ♦ దల్లడిల్లి సత్త్వముల్
గభీ ల్మనంగ గుండియల్ ది♦గా ల్పడంగ, బిందువుల్
నభంబునం జివాలునన్ ఘు♦నంబుగన్ నటింపఁగన్. ౪౭౬

సీ. ఆమడల్ నూఱు వ్యా♦యత మైనసూత్రముల్, పట్టిరి కొందఱు♦ప్లవగవరులు
దండంబులను గేల ♦ ధరియింత్రు కొందఱు, సమముగ నెఱపిరి ♦ శైలములను
దృణకాష్ఠపర్వత♦గణముల బిగియింత్రు, సందులు శ్రీరామ♦చంద్రునాజ్ఞఁ
బరుగిడువారును ♦ బర్వతంబులఁ బట్టి, పెకలించువారును ♦ భీమముగను

ఆ. మోసి తెచ్చువారు ♦ మున్ను నే నే మున్న,టంచువచ్చువారు ♦ నబ్ధిలోన
వైచువారు నైరి ♦ వానరు లమ్మహా,రవము తుముల మయ్యెఁ ♦ బ్రకటభంగి.

కం. రామాజ్ఞఁ దోడుపడ శా,ఖామృగముల్ సేతు వొనరఁ♦గట్టె న్నలుఁడుఁ
ధీమంతుఁడు తొలిదినమున, నామడ లొకపదియునాలు ♦ గంబుధిలోనన్. ౭౭౮

ఉ. పుట్టినసంతసంబునను ♦ భూరిజనంబునఁజేసి క్రోఁతి పెం
దెట్టువ లిర్వదామడ ద్వి♦తీయదినంబునఁ గట్టె వీఁకమై
నట్టె తృతీయఘస్రమున ♦ నామడ లిర్వదియొండు నబ్రమా
నట్టులు నాచతుర్థదిన♦మం దొక యిర్వదిరెండు పిమ్మటన్. ౭౭౯

కం. పంచమదివసంబున బం,ధించెను నిరువదియుమూఁడు ♦ నెఱియామడలం
బ్రాంచితగతి సామర్థ్యర,మాంచితుఁ డగునలుఁడు జనకు♦నటు లన కట్టన్. ౭౮౦

కం. అంబరమున స్వాతీపథ,ముం బోలుచు వార్ధిమధ్య♦మున సేతువు గ్రా
లం బరికించుచు నభమున, నంబరచరతతులు నిలిచె ♦ నబ్బుర పడుచున్. ౭౮౧

సీ. పదియోజనంబుల♦పఱపును యోజన,శతకంబు నిడివి నై ♦ జాను మీఱి
రాణించుకడుదుష్క♦రం బైన సేతువు, ముక్కున వ్రేలిడి ♦ యక్కజపడి
యద్భుతం బిది రోమ♦హర్షణ మిది యన,హ్యంబు నచింత్యం బ♦టంచు సకల
భూతముల్ వెఱ గంద ♦ భూరుహచారులు, గంతులు వేయుచు ♦ గర్జ లిడిరి

ఆ. కోటివేలుకపులు ♦ సూటి సేతువుఁ దీర్చి,కొనుచు నవలితీర♦మునకుఁ జనిరి
గద ధరించి నిలిచెఁ ♦ గానివారి వధింపఁ, బెగ్గడలును దా వి♦భీషణుండు. ౭౮౨

కం. ఏపారి విశాలం బై, తోఁపుడుగొన్నట్టు నునుపు♦దోఁపఁగ సమ మై
దీపించుచు సేతువు దగెఁ, బాపట దీర్చినవిధాన ♦ వారిధి నడుమన్. ౭౮౩

## శ్రీరామలక్ష్మణులు కపిసేనతోడ సేతువు దాఁటుట.

సీ. అప్పుడు సుగ్రీవుఁ ♦ డారాముతో నను, హనుమంతు మీఁదు తా♦రాత్మజాతు
సౌమిత్రి యెక్కినఁ ♦ జయ్యన నీయబ్ధి,వైహాయసాధ్వంబుఁ ♦ బట్టివారు
దాఁటింతు రనవుడు ♦ దశరథతనయుఁడు,సహలక్ష్మణుం డయి ♦ చాప మూని
తోయజాప్తభవుండు ♦ తోడరా సైన్యంబు, ముంగల గాఁగఁ జ♦నంగఁ గడఁగె

ఆ. నంతఁ గపులుకొంద ♦ ఱతనిపార్శ్వంబులఁ, గొలిచి రాఁగఁ గొంద♦ఱలవు మెఱయ
నీఁదుకొనుచుఁ జనిరి ♦ యేగిరి కొందఱు, గరుడుభంగి వేగ ♦ గగన మొరసి.

కం. కొందఱకు లేదు మార్గము, యందఱు నిట్లురుగు చుండ ♦ నాసేనరవం
బెందును బర్వుచు జలనిధి, క్రందెల్లను మ్రింగె నిమిష♦కాలములోనన్. ౭౮౪

ఉ. సేతువు నిట్లు దాఁటి కపి♦సేన సమూలఫలోదకక్షితిం
నేతృనిదేశమార్గమున ♦ నెమ్మది డిగ్గెను, గోసలాత్మజా

జాతు నుదుష్కరంపుఁగృతి ♦ సంభ్రమతత్పరదృష్టిఁ జూచుచున్
జేతము పొంగ దేవఋషి ♦ సిద్ధులు చారణులున్ రఘూత్తమున్ ౭౮౬

వనమయూరము. చేరి యభిషేకమును ♦ జేసి శుభవారిన్
ధీరవర! శత్రుల వ♦ధింపుము సపారా
వారమహి నేలుమ య♦పారసమ లంచున్
సారెకు సమర్చల నొ♦నర్చిరి సభక్తిన్. ౭౮౭

→ { శ్రీరాముఁడు లక్ష్మణున కప్పుడు దోఁచు శకునం బుల తెఱం గెఱింగించుట. } ←

చం. సకలనిమిత్తవేది రఘు♦చంద్రముఁ డప్పుడు వర్తమానముల్
శకునము లోలిఁ జూచి యను♦జాతునిఁ గౌఁగిటఁ జేర్చి యిట్లనున్
బ్రకటజలాశయంబు ఫల♦వంతవనంబుల నాశ్రయించి సా
వికలతఁ గీశ వాహినులఁ ♦ బెంపగు వ్యూహము దీర్పు లక్ష్మణా! ౭౮౮

చం. బలిముఖబుక్షురాక్షసని♦బర్హణమున్ భృశభీతిదంబు నౌ
ప్రళయము లోకనాశనక♦రంబుగఁ దారసిలెం, బరాగముల్
బలియఁగ వాయువుల్ విసరెఁ ♦ బర్వతశృంగములున్ వణంకె, నీ
యిల చలియించె, నేలపయి ♦ వృక్షచయంబులు వ్రాలెఁ గంటివే. ౭౮౯

తే. భయదమాంసాదనిభములఁ ♦ బరుషములును
బరుషరవములఁ గ్రూరముల్ ♦ వారివాహ
నిచయములు ఘోరభంగిని ♦ నెత్రుతోడి
వృష్టిఁ గురియించె నుత్పాత♦హేతుకముగ. ౭౯౦

సీ. కుంకుమడాలున ♦ ఘోర మయ్యెను సంధ్య, సూర్యునం దొకనల్ల♦చుక్క దోఁచె
మార్తాండునం దుండి ♦ మండుచు నొకయగ్ని,మండలం బిల వ్రాలె ♦ దండిఁ దారి
మృగములఁ బక్షులు ♦ నెల్లెడ దీనస్వరముల ఘోషించెను ♦ రవిని జూచి
నిజ తేజ మెడయంగ ♦ నిశలందుఁ జంద్రుండు, నలుపును నెఱుపును♦గలయఁ గొనల

తే. విలయ కాలంబునను బోలె ♦ వికటముగను,
దాపమును గూర్చుచున్నాఁడు ♦ ధరణికెల్ల
గుడును హ్రస్వంబు రూక్షంబు ♦ ఘోర మగుచు
వెలయు చున్నది యద్దాని♦విధముఁ గంటె. ౭౯౧

చం. మలినము లౌచుఁ దారకలు ♦ మానని లోకవినాశ మియ్యెడన్
దెలిపెడిఁ, గాకగృధ్రములు ♦ దేకున గల్గినడేగ లెంతయే
నలుపపుఁబక్షులుం దఱుమ ♦ నారట మండెడి, నక్క లెయ్యెడన్
గలయఁగఁ బర్వి భీకరము♦గా రొద సేసెడిఁ గీడు దెల్పుచున్. ౭౯౨

ఉ. వీనిఫలంబుఁ జూడఁ బృథి♦వీస్థలి శోణితమాంసకర్దమం
బౌ నిజ, మట్లు గాన విబు♦ధాహితపాలితపట్టనంబు ని
ష్టే నిఖిలాటవీచరస♦మేతముగాఁ జని ముట్టడింత మం
చా నెఱబంటు లంక కెదు♦రై చనె సంభృతచాపహస్తుఁడై. ౪౯౩

తే. సంప్రహారరసావేశ♦సంప్రహృష్టు, రాము వెన్కొని సుగ్రీవ♦రాక్షసాధి
పతులు లోనగుకపులెల్ల ♦ పరుసఁ జనిరి, శత్రుమర్దననిశ్చిత♦స్వాంతు లగుచు. ౪౯౪

కం. వారలభక్తియు శక్తియు, వారలయాలాపములును ♦ వారలచేష్టల్
వారలధైర్యము గని సీ,తారమణుఁడు సంతసించెఁ♦దనహృదయమునన్. ౪౯౫

శ్రీరాముఁడు లంకలోనిధ్వని విని సీతను దలఁచి దుఃఖించుట.

కం. పారావారముఁ బోలున,పారవనేచరబలౌఘ♦వర్గము ధాటిన్
భూరిజవంబును సైఁపక, ధారిణి వడఁకాడె భీతిఁ ♦ దతపీడితయై. ౪౯౬

ఉ. భ్రాజితతారకానికర♦రాజితశారదపౌర్ణమాసి నీ
రేజవిపత్తుచేవలె హ♦రిప్రవరౌఘము సంవ్యవస్థితం
బై జిగి మీఱె భూమితన♦యాధవుచే, విన వచ్చె లంకఁ బే
రోజ మృదంగకాహళర♦వోల్బణముల్ ప్లవగేంద్రపాళికిన్. ౪౯౭

ఉ. ఆమహితారవంబులు వ♦నాటులవీనులఁ బడ్డ వారు ను
ద్దామముదంబునం గెరలి ♦ తద్దయు నీసున వాని మించఁగా
భీమరవంబు నింపఁగ గ♦భీరఘనాఘనగర్జలట్లు లం
కామనుజాశనావళికిఁ ♦ గర్ణసుగోచర మయ్యె భీమమై. ౪౯౮

చం. తతబహుచిత్రకేతనప♦తాకిని లంకను జూచి జానకీ
పతి తరుణీమణిం దలఁచి ♦ పాపిదశాస్యునిచే నిరుద్ధయై
సతి మృగశాబలోచన కు♦జగ్రహబాధితరోహిణీగతిన్
వితతమనోవ్యథం దవిలి ♦ విన్నఁబడెం గద యీపురంబునన్. ౪౯౯

తే. అనుచుఁ దా వేఁడినిట్టూర్పు ♦ నినిచి యనుజుఁ
గాంచి యిట్లనుఁ దనకుఁ ద♦త్కాలమునకు
హితముఁ గూర్చెడివాక్యముల్ ♦ నుతబలాఢ్య
లంకఁ గనుఁగొంటె యీపురి ♦ పొంక మార! ౫౦౦

ఉ. భానుపథంబుఁ బైకొనఁగఁ ♦ బాఱెడినో యన విశ్వకర్మచే
మానసకల్పితంబుగతి ♦ క్ష్మాధరశృంగతలంబునందుఁ దా
మానిత మయ్యెఁ గంటివె వి♦మానకదంబముతో ధరాస్థలిన్
మా నగుపాండరాంబుదస♦మంచితవిష్ణుపదంబుచాడ్పునన్. ౫౦౧

ఉ. మంజులసూనకుంజచయ♦మండితచైత్రరథోపమాన మై
కుంజదళిద్విజప్రకర♦ఘుష్టవనంబులచే మనోజ్ఞ మై
రంజిలెఁ బుష్పలీనభ్రమ♦రంబును మత్తశకుంతముం బికీ
శింజిత మావనావళిని ♦ శీతసమీరణుఁ డోలి నూఁచెడిన్. ౫౦౨

## శ్రీరాముఁడు సేనల వ్యూహంబు దీర్చుట.

సీ. అని యిట్లు వచియించి ♦ యవనిజాపతి సేన, శాస్త్రపద్ధతి విభ♦జనము సల్పి
నీలునితోఁ దద♦నీకినితో నంగ,దుం డురోదేశస్థి♦తుండు గాఁగ
ఋషభుండు చక్రస♦మేతుఁ డై దక్షిణ,పార్శ్వంబునం దోలిఁ ♦ బ్రబలి నిలువ
గంధహస్తినిబోలు ♦ గంధమాదనుఁడు దా, డాపట వెలయఁగ♦నేపు మెఱసి
తే. వేగదర్శిసుషేణులు ♦ విధిసుతుండు, జాంబవంతుండు ముప్వురు ♦ సైన్యయుక్తిఁ
గుక్షిఁగావంగ ముదలిడి♦కువలయాత్ముఁ,డనుజుఁడును దానుశిరమున♦యందునిలిచి.

కం. లోకము వెనుకటియర్ధము, జోకఁ వరుణుండు గాచు♦చొప్పునఁ గీశా
నీకిని జఘనముఁ గావఁగఁ, బ్రాకటబలు సూర్యపుత్రుఁ♦ బనిచెఁ సరగన్. ౫౦౪

ఉ. అంబుదసంప్లవం బయిన♦యభ్రముఁబోలెడి కీశసేన వృ
క్షంబులు శైలశృంగములు ♦ గైకొని రేఁగి దశాస్యపట్టనం
బుం బొరి సుగ్గునూచముగ ♦ భూధరకూటవితానముష్టులఁ
డంబుచెడంగ దంపఁగ నె♦డందఁ దలంచె సరోషచిత్త మై. ౫౦౫

## శుకుఁడు రావణుతోఁ దాను బోయివచ్చిన వృత్తాంతముఁ జెప్పుట.

సీ. అయ్యెడ శ్రీరాముఁ ♦ డర్కజుతో శుకు, విడిచి పుచ్చు[1]మటన్న ♦ వెడల నడిచె
నతఁడును భయకంపి♦తాంగుఁ డై రావణు, డాసిన నగుచు రా♦కాసిఱేఁడు
ఏ మిది శుక! ఱెక్క ♦ లేమాయెఁ గత్తిరిం,చినజాడ దోఁచెడిఁ ♦ జెనఁటు లైన
చలచిత్తు లైన్నకీ♦శులచేతఁ జిక్కితా? యే మన నతఁడు లో ♦ నెసఁగుభీతి
తే. రాక్షసోత్తముతో నను ♦ రాక్షసేంద్ర!, నీదుపనుపునఁ జని నేను ♦ నీరనిధికి
నుత్తరపుఁదీరముం జేరి ♦ మెత్తఁదనము, దోఁప మధురోక్తి సుగ్రీవు♦తోడ నన్ఱె.

కం. నీచెప్పినట్ల పలికిన, నేచినకినుకను గపీంద్రు♦లెల్లరు నన్నుఁ
ద్రోచిరి తాఁచిరి కూలఁ, వైచిరి పీచి రిల నేను ♦ వాచారంగన్. ౫౦౬

కం. గ్రద్దన పై కెగిరి ననుఁ, గ్రుద్దిరి పిడికిళ్ల గోడు ♦ గుడిపిరి కాలఁ
మద్దించిరి బిద్దింపఁగ, గద్దఱితనమునను గపులు ♦ కడఁగిరి ఱేఁడా! ౫౦౭

ఆ. ముక్కుమీఁద నుండు ♦ ముంగోప మెప్పుడు, సహజముగను గ్రక్క♦సకపులకును
నన్నుఁబల్క నీరు ♦ నామాటకును బదు, లిడరు మీఁద మీఁద ♦ నడచువారు.

[1] శుకుని విడిపించిన నతఁడు సేతుబంధవిషయము రాముని సేనావిషయము రావణునకుఁ జెప్పిన నతఁడు సేతుబంధమునకు విఘ్నము కలిగింప నెంచునని యిన్నిదినములు యీ శుకుఁడు వానరుల నిర్బంధములోనే యుంచఁబడి యిప్పుడు విడువఁబడెను.

కం.ఖరవైరి విరాధాంతకుఁ, డరిభయదకబంధకాలుఁ ♦ డదె రాముఁడు భా
స్కరసుతసహితుం డగుచును, ధరణిసుతకై సేనతోడ ♦ దాయఁగవచ్చెన్. ౫౧౦

ఉ. కట్టెను సేతువుఁ జలధి♦కాండములన్, లవణాబ్ధి దాఁటి తా
మెట్టె నవాచితీరమును ♦ మెండుదళంబులతోడ లంకనుఁ
ముట్టెను, రాక్షసాళి మును♦ముట్టుగఁ గొట్టఁగఁ గార్ముకంబుఁ జే
పట్టెను దిట్టయైన రఘు♦వల్లభుఁ డల్లదె రాక్షసోత్తమా! ౫౧౧

తే. పర్వతాభ్రనికాశు లౌ♦ప్లవగఋక్ష,వరులసేనలు వేనవేల్ ♦ ధరణినెల్ల
నావరించెను శాఖామృ♦గాసురులకు, సంధి పొసఁగదు దైత్యని♦ర్జరుల కట్లు. ౫౧౨

తే. గండుఁగ్రోఁతులు లగ్గ లె♦క్కకయ మున్న,సీతనిచ్చుటో యుద్ధంబు ♦ సేయుటొండె
నొండు వే నిశ్చయింపు ము♦ద్దండతేజ, తడవు సేసినఁ గార్యంబు♦తప్పి వచ్చు.

రావణుఁడు శుకునితో సీత నీయ నని తనపరాక్రమముఁ దెలుపుట.

మ. అనుడుఁ రోషకషాయనేత్రుఁ డయి ర♦క్షోధీశుఁ డోరీ శుకా!
వినరా దానవదేవతావళి రణో♦ర్విం గూడి న న్దాఁకినన్
జనతాసంఘముతోడ లోకములు సం♦తాపించినన్ జానకిన్
జననాథాత్మజునొద్దకున్ మరల శుం♦తా! పంపఁగాఁ బోనురా. ౫౧౪

ఉ. ఎన్నఁడొకో మదీయనిశి♦తేషుతతుల్ సురభిం బ్రసూనసం
పన్నకుజాళి కై యళుల♦మాడ్కిని రామునిమీఁదఁ బాఱు, నిం
కెన్నఁడొ తూణిఁ దూఁగుశర♦బృందము కార్ముకముక్తమై కడున్
ఖిన్నునిఁ జేయు రామునిఁ బ్ర♦కృష్టపుటుల్కలు కుంజరంబునాన్. ౫౧౫

కం.ఉదయించు నినుఁడు జగమునఁ, బొదలు పదార్థముల తేజ♦మును లోఁ గొను న
చ్చదురున రామునిబలముం, గదనంబున నే హరింతుఁ ♦ గలఁగెద వేలా. ౫౧౬

కం.జలనిధిజవము ప్రభంజను, నలఘుగతియు నాకు నుంట ♦ నమ్మనుజుండున్
దెలియుండు గాక తెలిసినఁ, గలనన్ న న్నెదురుకొనఁగఁ ♦ గాంక్షించు నొకో

కం.కఱకులు తూణీశయములు, నెఱకలు గలసవిషఫణుల♦బృందము లని తా
నెఱుఁగండు నాదములుకుల, నెఱిఁగిన న న్దొడర రాముఁ ♦ డేలా వచ్చున్.

ఉ. జ్యారవసంకులంబును భృ♦శార్తవిభీతమహాస్వనంబు దు
ర్వారఖగప్రకాండతల♦వాదితమున్ శరకోణఘోషితో
ద్ఘోరధనుర్విపంచిఁ గొని ♦ దుర్వ్యాళదనీకిని యాలకింపఁగా
నే రణరంగరంగమున ♦ నర్తిఁ జరించెదఁ జూడరా శుకా! ౫౧౯

కం.రాముఁడు పూర్వంబున సం,గ్రామంబున నన్నుఁ దొడరి ♦ కానఁడు మద్వీ
ర్యామితశక్తులు నీయెడఁ, దా మది నెఱిఁగెడిని గాక ♦ దలరఁగ నేలా? ౫౨౦

మత్తకోకిలము. వేయిగన్నులు గల్గివెల్గెడు♦వేల్పుతోఁ డరుదెంచినన్
దోయధీశుఁడు పాశహస్తుఁడు♦ త్రోచివచ్చిన, దండి యై
యాయముం డిట వచ్చినన్, ద్రవి♦ణాధినేత యెదిర్చినన్
జేయ లే రొకయింతయేనియుఁ♦ జెట్ట నా కెటు భీరుకా. ౫౨౧

## ↞ రావణుఁడు శుకసారణులను వానరసేనఁ బరికించి రాఁ బనుచుట. ↠

తే. పొ మ్మటంచును వానిని♦ బుచ్చి యవల, సారణుండును శుకుఁడను♦ సచివవరుల
వంకఁ గనుఁగొని పల్కె రా♦వణుఁడు దుర్భ,రస్మయావిష్టచిత్తుఁ డై♦ రభసయుక్తి:

ఉ. ఎన్నఁడు మున్ను విన్న యది♦ యేనియుఁ గాదు మహాబ్ధిలో మహా
భ్యున్నతసేతు వాజిప్రియ♦పుత్త్రుఁడు[1] నిర్మితి సేయఁ గ్రోఁతులున్
బన్నుగ నబ్ధిదాఁటి మన♦ పైపడి వచ్చిన వంట, నిక్క మం
చెన్నఁగనేర నంబునిధి♦ యెక్కడ! సేతువు కట్టు టెక్కడన్!! ౫౨౩

సీ. అదియును గాక వ♦నాటసైన్యంబును, గణియించుట యవశ్య♦కార్య మగుటఁ
జనుఁ డీరు మాఱువే♦షంబులఁ గపిసేనఁ, జొరుఁడు మి మ్మెవ్వరుఁ♦ జూడకుండఁ
బ్లవగులవీర్యంబు♦ పరిమాణ మెఱుఁగుఁడు, రామమంత్రులఁ గపి♦రాజహితులఁ
బూర్వాభివర్తులు♦ పురువీర్యవంతులు, వృకోటు లెవ్వరో♦ యెఱిఁగి రండు

తే. వానరాళినివేశంబు♦ వార్ధిసేతు,నిర్మితియుఁ జూచి చనుదెండు♦ నిక్క మేమొ
ప్లవగవీరులకును దళ♦వాయి యెవఁడొ? చక్కఁగ గ్రహించి రండు నా♦సచివులార!

కం. రాముఁడు సేయుప్రయత్నం, బామానవుబలిమి యాయు♦ధాళివిధంబున్
సౌమిత్రిపరాక్రమము మ,హామాత్రులు! చక్కఁ దెలియుఁ♦ డామూలముగన్.

సీ. అని సమాదిష్టులై♦ యాశుకసారణుల్, తరుచరవేషముల్♦ దాల్చి యేగి
కపిసేనఁ గని మేన♦ గగ్గురు పొడువ ది,గ్భ్రమ చెంది లెక్కింప♦ వశముగాక
శైలకందరగుహా♦వేలావనీదేశ,ముల నుపవనముల♦ వెలయువారి
దాఁటిన దాఁటెడు♦ దాఁటనుండెడివారిఁ, దీరంబునకు వచ్చి♦ దిగెడువారిఁ

తే. గాంచి యవిచింత్య మైనయా♦కపిబలాబ్ధి,పార మెఱుఁగక తిరుగ న♦వ్వారి నెఱిఁగి
వెంటనే పట్టి కట్టివి♦భీషణుండు, రామునుంగల నిలుప నా♦రక్కసులను. ౫౨౬

## ↞ విభీషణుఁడు శుకసారణులను బట్టి శ్రీరామున కప్పగించుట. ↠

తే. ఆర్తిగొని ప్రాణములమీఁది♦యాశ విడిచి,హస్తయుగళంబు మోడిచి♦యనిరి యిట్లు
పఙ్క్తికంఠునియాజ్ఞ నీ♦బలము నలవు,తీ రెఱుంగఁగ వచ్చిన♦వార మయ్య. ౫౨౭

కం. త్రుంచినఁ ద్రుంపుము మము ర,క్షించిన రక్షింపు జాన♦కీపతి! యన నా
లించి హసించుచు నిటు పచి,యించెను నిశ్శేషభూత♦హితరతుఁ డెలమిన్. ౫౨౮

[1] ఆజిప్రియపుత్త్రుఁడు = దశరథుని కొడుకు - రాముఁడు.

ఉ. మీరలు సర్వసైన్యము స♦మీక్షణ చేసితి రేని, మావిధం
బారఁ బరీక్షచేసిన, ద♦శాస్యుఁడు మీకు వచించి నట్టి యా
కారియ మెల్లఁ దీరినను ♦ గ్రమ్మఱి పొందు; యథేచ్ఛ మేదియేన్
మీరలు చూడ రేని చని ♦ మీమతిచొప్పున వెండి చూడుఁడీ. ౫౨౯

ఉ. ఏకత మేగ మీకు భయ♦మేని విభీషణుఁ డెల్లఁ జూపెడిన్
మా కిటు క్రైవసంపడుట ♦ మానుఁడు ప్రాణముపట్ల భీతి, న్యా
యాకలితంబు గాదు విగ♦తాయుధు లై వశపడ్డదూతలన్
తేకు మడంచి చంపుటలు ♦ ఊచ్చపదం బని యేచు మీ కిటన్[1]. ౫౩౦

చం. కరము విభీషణా! పరవి♦కర్షణశీలురఁ బృచ్ఛమానులన్
సురరిపుచారులన్ విడుము ♦ నొంపకు మంచు వచించి వారితో
ధరణివిభుండు పల్కె క్షణ ♦ దాచరులార! పురంబుఁ జేరి కి
న్నరపతితమ్ముతో ననుఁడు ♦ నావచనంబులు గాఁగ నీవిధిన్. ౫౩౧

ఉ. ఏమిబలంబు నమ్మి యసు♦రేశ్వర! నాసతి సీతఁ గానలో
నామెయి ముచ్చిలించితివొ ♦ యాబలమున్ సహసైన్యబాంధవ
స్తోమము గాఁగ నీవలచు♦చొప్పునఁ జూపుము, జేవ లంక నా
నామహితాస్త్రజాలముల ♦ నాశముఁ జేసెద నీవ చూడఁగన్ ౫౩౨

ఉ. దారుణ మైనవజ్రమును ♦ దానవకోటులమీఁదఁ బంచుపా
కారిగతిన్ మదీయభయ♦దాగ్రహమున్ భవదీయసేనపై
వారక వేగుఁబోక వెసఁ ♦ బంచి సతోరణ మైనలంకఁ బ్రా
కారయుతంబు ధ్వంసితము♦గా నొనరించెదఁ జూడు రావణా! ౫౩౩

కం. అని పల్కెఁడు మీపతికిం, జనుఁ డని విడిపింప వారు ♦ జయరవములతో
ఘను ధర్మవత్సలునిఁ గీ, ర్తన సేసిరి; యంతఁ బోయి ♦ రావణుఁ గనుచున్. ౫౩౪

శుకసారణులు రావణుతో సీతాదేవిని శ్రీరామున కిమ్మని చెప్పుట.

చం. పలికిరి రాక్షసేశ్వర! భ♦వద్ధ్వనిదేశముమేర కేగి త
ద్బలములలోఁ జరింప మముఁ ♦ బట్టి విభీషణుఁ డాకృపాళు రా
ములకడ నిల్ప వధ్యుల మ♦మున్ విడిపించె మహోగ్రతేజుఁ డా
యలఘుపరాక్రమాధ్యువిధ ♦ మంతయు నే మని చెప్పువారమో. ౫౩౫

ఉ. వీరులు నస్త్రవేదు లతి♦విక్రమవంతులు దిగ్ధవోపముల్
చేరిరి నల్వు రొక్క యెడ ♦ శ్రీరఘురాముఁడు లక్ష్మణుండు వృ
త్రారిసమానవిక్రముఁ డ♦హర్పతిజుండు విభీషణుండునున్
వీరలె పెల్లగింప మన♦వీడు సమూలము పాఱఁ జిమ్మఁగన్ ౫౩౬

[1] వేగులవారు శిక్షకుఁ బాత్రులేయైనను వాస్తవవిషయము వీరు రావణునకుఁ దెలిపిన నతఁడు తన్ను, శరణుచొచ్చునేమోయని దయాసముద్రుఁడైన రామభద్రుని తలంపు.

చం. వలఁతులు,[1] తక్కువృక్షచర♦వర్యులమాట యటుండ నిమ్ము; రా
ములవివిధాస్త్రసంపదయు ♦ మూర్తివిశేషముఁ జూడఁజూడఁగా
నలవున నాతఁ డొక్కఁడె స♦మర్థుఁడు పో మనలంక యంతయుఙ్
గులగులలై చెడఙ్ ధరణిఁ ♦ గూల్పఁగఁ,దక్కినముగ్గు రేటికిన్. ౫౩౭

ఉ. రాముఁడు లక్ష్మణుండు హరి♦రాజును బాలనసేయుసేన సు
త్రామపురోగమామరుల♦రాజికి నేని జయింప రాదు, నూ
ఱామడ యాయతంబుఁ బది♦యామడ విర్వియు నైనసేతువుం
దీమన మారదాఁటి మన♦తీరమునం గపిసేన యంతయున్. ౫౩౮

ఉ. పాళెము డిగ్గి యున్న యది ♦ వారిధి దాఁటిన దాఁటు చున్నసె
న్యాళికి నంతముం గనము ♦ హర్ష వినృద్ధకపీంద్రపాళితో
నాలము సేయ డీకొనుట ♦ యర్హము గాదు, శమించు టొప్పు, భూ
పాలున కప్పగింపుము నృ♦పాలతనూజ, శుభంబు నీ కగున్. ౫౩౯

◆ రావణుఁడు శుకసారణులతోఁ బ్రాసాద మెక్కి కపిసేనలఁ జూచుట. ◆

చం. అని యిటు పథ్యసూక్తుల భ♦యంపడ కాడినమంత్రి సారణుఙ్
గని నచియించు రావణుఁడు ♦ కాఱులు పల్కెద వేల? దేవతల్
దనుజులు గూడి యొక్కటయి ♦ తార్కొని రేని జగంబులెల్ల నా
కనుపమభీతిఁ జూపిన ధ♦రాత్మజ నిచ్చుట లేదు నమ్ముమీ. ౫౪౦

కం. అక్కపివరులకు వశపడి, చక్కఁగ మర్దింప వారు ♦ సంత్రస్తుఁడ వై
యిక్కరణి సీత నిమ్మని, పెక్కులు కొఱగామిలెల్లఁ ♦ బ్రేలెదు పిఱికీ. ౫౪౧

ఉ. ఎవ్వఁడు రోరి నన్నని జ♦యించెడిశత్రువు? రమ్ము చూత మం
చవ్విబుధాహితుండు మహి♦కార్జునముఙ్ బహుతాళకోన్నతం
బవ్వనువీది నంటు నొక♦యభ్రపుమేడను రోష మాత్మలో
నివ్వటిలంగ నెక్కి యవ♦నీధరకాననసాగరంబులన్ ౫౪౨

చం. వనచరపూర్ణదేశము న♦పార మసంఖ్యము భూరికీశవా
హినిఁ గని పల్కు సారణుని ♦ నెవ్వరు కీశచమూసమూహమం
దొనరిన వీరవారమున ♦ నుగ్రబలాఢ్యులు శూరసత్తముల్
పెనుపరు లగ్రతస్సరులు ♦ విశ్రుతులుఙ్ వ్యవసాయవంతులున్. ౫౪౩

కం. ఎవరికిఁ జెవి నిచ్చు కపి,ప్రవరుండు? ప్రధాను లెవరు ♦ ప్లవగబలమునం?
దెవ రొకొ యూథపయూథపు? లివియెల్ల యథార్థముగను ♦ నెఱిఁగింపుమురా.

కం. అని తన్నడుగుదశగ్రీ,వునకుఙ్ శాఖామృగాళి♦వ్యూహములోనఙ్
ఘనులను ముఖ్యజ్ఞుం డిట్లని చెప్పెఙ్ సారణుఁడు య♦థార్థపుఫణితిన్. ౫౪౪

---

[1] వలఁతులు = సమర్థులు.

## ← సారణుఁడు రావణునకు నంగదాదుల నెఱింగించుట. →

ఉ. అల్లదె లంకకట్టెదుట ♦ నార్భటులన్ మనలంక పాఁతుతోఁ
బెల్లదరంగఁ జేయుచును ♦ భీషణకేశులు నూఱువేలు దన్
మొల్లమిఁ గొల్వ సేనలకు ♦ ముంగలి యై నిలు చున్నవాఁడె చూ
వల్లభ! వాహినీపతి ప్ల♦వంగమముఖ్యుఁడు నీలుఁ డాఖ్య చేన్. ౫౪౬

ఉ. సారబలుండు ధారిణిఁ బ♦చారము సేయుచు బాహు లెత్తి దు
ష్పారవిలోకనావళులఁ ♦ గ్రోధవశుం డయి లంకఁ జూచుచున్
సారెకుఁ గేరి వాలమున ♦ క్ష్మాస్థలి బ్రద్దలువాఱఁ గొట్టు నా
సారసకేసరాభుఁడు ర♦సాధరశృంగనిభుండు చూచితే? ౫౪౭

ఉ. ఆతఁడె యంగదుండు ప్లవ♦గాధిపుఁ డాతని యౌవరాజ్యమం
దాతతరీతి నిల్పెఁ గని♦తా? నినుఁ బోరికిఁ బిల్చు చున్నవాఁ
డాతఁడు వాలికిం దగిన♦యాత్మజుఁడున్ రవిపుత్రుసత్ప్రియుం
డాతఁడు వజ్రికై వరుణు♦నట్టులు రామునకై పెనంగెడిన్. ౫౪౮

కం. ఈతనిబుద్ధిఁ గదా యీ, వాతాత్మభవుండు రాఘు♦వప్రియఘటనా
ఛేతస్కుం డురుజవన, స్ఫీతుఁడు హనుమంతుఁ డరసి ♦ సీతం గాంచెన్. ౫౪౯

కం. అయోధనకర్కశుఁ డితఁ, డాయతయూథములఁ గూడి ♦ యవిజయ్యుం డై
యోయామినీచరేశ్వర!, జే యని చనుదెంచె రణము ♦ సేయఁగ నీతోన్. ౫౫౦

ఉ. వాలిజు వెన్కఁ గీశబల♦వారముతో రహిమించువాఁడె శా
ర్దూలపదృశుఁ డౌనలుఁడు ♦ దోర్బలవంతులు చందనాలయుల్
పోలఁగ వేయికోట్లు కపి♦పుంగవు లెన్మిదినూర్లవేలు నే
వేళ భజించు చుంద్రు సుర♦భీషణ! సేతువుఁ గట్టె నీతఁ డే. ౫౫౧

ఉ. ఆతనిసైనికుల్ గనుమ ♦ యార్భటులన్ దెసలెల్ల నించుచున్
జేతముఁ గ్రోధపూర్ణముగఁ ♦ జేసి చివాలున లేచి గాత్రమున్
భీతి ఘటింప నుద్దవిడిఁ ♦ బెంచి విదుర్చుచు నిన్నుఁ జూచి ప్ర
స్ఫీతగతిం బయిం దుముకు♦చెన్ను వహించిరి, వారు తెంపరుల్. ౫౫౨

ఉ. శ్వేతుఁడు వెండికొండ కెన ♦ చెప్పఁగఁ జాలెడివాఁడు, లోకవి
ఖ్యాతుఁడు, భీమవిక్రముఁడు ♦ నస్థిరచిత్తుఁడు, బుద్ధిమంతుఁడున్
వే తపనాత్మజుం గదిసి ♦ వెన్కకుఁ బోయి దళంబు సర్వమున్
రీతిగఁ దీర్చెడిం గడుఁబ్ర♦హృష్టముఁ జేయుచు దానవేశ్వరా! ౫౫౩

మ. కుముదుం డాతఁడు గోమతీతటగసం♦కోచాఖ్యశైలంబు ము
న్నమరన్ స్థానము గాఁగ వృక్షచరరా♦జ్యం బేలు వే వేల్ కపుల్

విమలస్రవంతులు గొల్వ రాజిలు మహా♦వీరుండు తద్దీర్ఘవా
లమునన్ లోహితపీతనీలసితముల్ ♦ గ్రాలెన్ మహారోమముల్. ౫౫౪

కం. రోషణుఁడు సాంపరాయిక, భీషణుఁడు భవత్సమిద్ధ♦వేషణుఁడు యశో
భూషణుఁడు చండుఁ డరిపుర, శోషణసక్తుండు విమత♦సూదన కంటే. ౫౫౫

చం. తిరుఁ డతిదీర్ఘలోచనుఁడు ♦ ధీరుఁడు సింహనిభుండు చూడ్కి నీ
పురము దహించుపోల్కి నిటు ♦ పొంగుచుఁ జూచెడిఁ, గృష్ణవింధ్యభూ
ధరముల సహ్యపర్వతను♦దర్శనసీమల సంచరించు నీ
హరివృషభుండు రంభుఁడు సు♦రాంతక! నిస్తులశౌర్యుఁ డీతనిన్. ౫౫౬

కం. వీరులు శూరులు రణదు, ర్వారులు చండులు ప్రచండ♦పటువిక్రములుం
గ్రూరులు ముప్పదికోట్లగ, చారులు గొలిచెదరు లంక ♦ నసి మాసంగన్. ౫౫౭

ఉ. వీనులు నిక్కవెట్టి మెయిఁ ♦ బెంచుచు మాటికి మాటికిం గ్రుథ
న్సేను వణంకఁ దోఁకపయి ♦ నిల్పుచు దృష్టుల నడ్డమూపులన్
దా నదె చూచుచున్ మరల ♦ దారుణగర్జల నించు చున్నవాఁ
డానగచారి గంటె శర♦భాఖ్యుఁడు వాఁడె సురేంద్రమర్దనా? ౫౫౮

కం. పాఱఁడు దురమున జవమున, మీఱెడు గిఱెడిని గిరుల ♦ మృత్యువునకు నే
మా ఱొడ్డెడు వెఱపున నో, టాఱఁడు సాల్వేయ శైల ♦ మందు వసించున్. ౫౫౯

కం. వీరాగ్రణి యీశరభు వి, హారు లనన్ సైన్యవులు స♦హస్రశతంబుల్
చేరి భజియింత్రు, వారలు, కోరుచు నున్నారు లంకఁ ♦ గూల్పఁగఁ గడిమిన్. ౫౬౦

చం. పఱమొగు లాకసం బలము♦భంగిగ నై తెఱగంటిగుంపుల
న్నెఱసెడిగుంటిసూఁ[1]డన వ♦నేచరకోటులలో వెలింగి పె
న్నుఱుములఁ బోలుగర్జల ర♦ణోత్సుకుఁ డై విలసించువాఁడె యే
యుఱగొఱ లేనిధీరుఁడు మ♦హాబలుఁ డౌ పనసుండు దేవరా! ౫౬౧

కం. వీనిని నేఁబదిలక్షలు, వానరపరివృఢులు యూథ♦పశ్రేష్ఠులు శౌ
ర్యానుత్తములు భజింతురు, మానక యల పారియాత్ర ♦ మందువసించున్. ౫౬౨

సీ. అంబుధివేల రెం♦డవమహోదధి యన, భీమ మా సేనకు ♦ వెలుఁగు గొలిపి
దర్దరధారిణీ♦ధరమున కుద్ది యా, వాఁడె పో వినతుఁ డన్ ♦వానరుండు
అఱువదిలక్షల♦యగచరుల్ గొల్వంగఁ, బర్ణాస యనునది♦వారిఁ గ్రోలుఁ
గలహంబునకు నిన్నుఁ ♦ బిలుచుచు నున్నయా, తండె క్రోధనుఁ డను♦తరుచరుండు
ఆ. వేనవేలు గలుఱ ♦ వీరు లీతనియొద్దఁ, దోఁపురంగువాఁడు ♦ తోడివారి
గేలి సేయువాఁడు ♦ హేళిఁ బోలిన తేజు, వాఁడు గవయుఁ డనెడి♦వనచరుండు. ౫౬౩

[1] గుంటిసూఁడు = ఇంద్రుఁడు.

కం. దెబ్బదిలక్షలక్రోఁతులు, గబ్బితనమువారు గొలువఁ గనలున నీపై
దబ్బునఁ బడి యొకదెబ్బన్, నిబ్బరమునఁ దీయ వాఁడు నిగిడెడిఁ గంటే. ౫౬౪

కం. వీరలు దుష్ప్రసహులు బల,హోరులునుం గామరూపు లతిశయవేగో
దారులు యూథపనాయకు, లారఁగ యూథములు వీరి ననిశముఁ గొలుచున్.

సారణుఁడు రావణునకు హరాదియూథనాథుల నెఱింగించుట.

సీ. రామునిమిత్తమై ప్రాణముల్ గోల్పోవ, నున్నవారల విను మున్నవారి
నిద్దంబు,లై కడు నిడుపు లై కావియుఁ, దెలుపును బసుపును నలుపు మఱియుఁ
జెక్కులౌరంగుల వెండ్రుకల్ తోఁక పై,నిట్టగ్రమ్మగఁ గొన్ని నేలవ్రాలి
రవిమరీచులవోలె రాణించు చున్నవి, వాఁడు హరుం డను వానరుండు
ఆ. యూథనాథుఁ డాతఁ డుర్వీరుహంబులు, గేలఁ గ్రాల లంక సాలములను
లీల నెక్క జతన మోలి సేయుచు నున్న,వారు సూర్యసుతుని వారె వీరు. ౫౬౬

ఉ. అంజనపర్వతంబొ యసితాంబుదసంఘమొ యన్నయట్టులై
యంజిక లేనివారు రణమందు యథార్థపరాక్రముల్ గుహా
పుంజములన్ నదీతటులఁ బొల్చెడివా రయి నీపయిం బడన్
గొంజక దూఁకు చున్న యెలుఁగుంగమిఁ జోదులఁ జూడు రావణా! ౫౬౭

కం. గర్జనములు చుట్టిన, పర్జన్యుఁడువోలె నెలుఁగుబంటులు గొలువన్
దుర్జయుఁ డై క్రాలెడు భయ,వర్జితు భీమాక్షు భయదవపువుం గంటే. ౫౬౮

కం. ఆతండు ఋక్షవద్వి,ఖ్యాతాద్రి వసించి నర్మదాంబులు గ్రోలున్
నేత సుమీ భల్లూక,వ్రాతములకు ధూమ్రుఁ డనఁగఁ బరఁగుం బేరన్. ౫౬౯

సీ. వానితమ్ముఁడు[1] చూడు వసుమతీధ్రం బనఁ, గ్రాలెడి నన్న కాకారమునను
సముఁ డయ్యు శ్రేష్ఠుఁడు చటులవిక్రమమున, యూథపయూథపుఁ డుద్ది లేఁడు
గురుసేవ సల్పెసం గరమునఁ జండుండు, విబుధాసురాహవవేళయందు
శంబసాధనునకు సాహ్యంబుఁ గావించి, పెక్కులు వరములు పేర్మిఁ గాంచె
ఆ. గుదియదాల్పు నేని యెదు రొడ్డి చెంగించు, వీనిసేన గిరుః పైన నిలిచి
యురలఁ ద్రోయు చున్న యురుతరాశ్మంబుల,రాజిఁ జూడవయ్య రాక్షసేంద్ర!

కం. రోమములదండి రక్షః,స్తోమపిశాచావళులకుఁ దుల్యము లగుచున్
ధూమధ్వజదీప్తులు నై, యామహితధ్వజిని దిరుగులాడెడిఁ గంటే. ౫౭౦

కం. జంభారి నుపాసించు న,దంభబలపరాక్రముండు దారుణతరసం
రంభవిజృంభితుఁ డల్లదె, దంభుఁడు ప్లవమానుమాడ్కి దర్శితుఁ డాజిన్. ౫౭౧

సీ. ఆమడ దవ్వున్న యద్రు లప్పుడు పార్శ్వ,గతము లెవ్వనికి వేగంపునడక
యోజనోన్నతుఁ డయి రాజిల్లు నెవ్వఁడు,హాళి మై నిలుచున్న యట్టివేళ

[1] ఇతఁడు జాంబవంతుఁడు.

నిలఁ జతుష్ప్రాజ్జంతు♦వులలోన నెవనియా, కారంబునకు మిన్న ♦ గానరాదు
తొలిపురుహూతుని♦దురమున మార్కొని, యెవ్వఁడోటమిమాట♦యెఱుఁగకేసఁగెఁ
తే. దరుచరాళికి నెవఁడు పి♦తామహుండు, నుగ్రదర్పుండు యూథప♦యూథనాథుఁ
డతనిఁ గనుఁగొంటె సన్నాదు ♦ నతులనాదుఁ, బరమబలదర్పసదన యో♦పంక్తివదన.

మ. దనుజాధీశ్వర! చూడుమా యితని గం♦ధర్వాంగనాపుత్త్రుఁ డై
జనియించెం బవమానమిత్త్రునకు, న♦స్వప్నాసురాయోధనం
బున లేఖాళికి బాస లై యరిగి పెం♦పుం జూపెఁ, బాకారితో
నెనయున్ విక్రమసంపదం గ్రథనుఁ డం ♦ డ్రీయూథపాగ్రేసరున్. ౫౭౪

ఉ. ఎచ్చట నుండు నేరెడుమ♦హీజము సేవ యొనర్చు యక్షరా
జెచ్చట పోయిగాఁగఁ జరి♦యించును నిచ్చలు నీవిమాతృజుం
డెచ్చటఁ గిన్నరావళు ల♦హీనగతిన్ విహరించు నట్టిభూ
భృచ్ఛయువర్యమందు వసి♦యించునితం డవికత్థనుం డగున్. ౫౭౫

కం. కోటిసహస్రంబులు శై,లాటులు దనుఁ గొల్వ నిజబ♦లావళితో ను
ద్ఘాటించి లంక నేల స,పాటముగాఁ జేయఁ దలఁచుఁ ♦ బాటవ మమరన్. ౫౭౬

ఉ. వారణవానరావళుల ♦ ప్రాఁబగ లోన స్మరించి జాహ్నవీ
తీరమునన్ మతంగజత♦తిం బెదరించుచుఁ జెట్ల గొరులన్
గొరులఁ జెట్లచే గిరుల ♦ క్ష్మాజతతిన్ హరియించుచున్ మహా
వీరుఁ డుశీరబీజగిరి ♦ వేడ్కఁ జరించును గంగయొడ్డునన్. ౫౭౭

చం. కపు లొకకోటి గొల్వ హరి♦కాంతుఁడు వీఁడు ప్రమాథినామయూ
థపుఁడు సురాలయంబు బల♦దానవఘస్మరుఁబోలి తద్గిరిన్
విపులబలాఢ్యుఁ డేలు సుర♦వీరమదాపహా! వీర్యవిక్రమా
కృపణులు వీనిసైనికు ల♦హీనమదస్ఫురితాత్ము లెంతయున్. ౫౭౮

కం. వానిద సుమ యదిగోఁ బవ,మానసమాధూతరక్త♦మహితరజస్సం
దానిత మతిసంరబ్ధం, బానిమ్మురకీశసేన ♦ యసురాధీశా! ౫౭౯

తే. గండుగొండంగులం దెల్ల ♦ గండుఁ డతఁడు
చూడుము గవాక్షుఁ డనియెడి ♦ శూరవరుఁడు
వానిఁ గాటుక మొగముల ♦ వఱలుకొండ
ముచ్చు లొకకోటి కొలిచెడి ♦ హెచ్చుబలిమి. ౫౮౦

సీ. ఎందు మిళిందముల్[1] ♦ క్రందుగా రొద సేయు, సర్వర్తుతరుఫల♦సంతతులను
దేనిని దనరంగు ♦ లీనునగంబును, సూర్యుఁ డెల్లప్పుడు ♦ చుట్టుపెట్టు

[1] మిళిందముల్ = తుమ్మెదలు.

నేగిరి తన్నాశ్ర♦యించిన మృగపక్షి,తతులను దనకాంతిఁ ♦ దనరఁ జేయు
దేనిని దేవతల్ ♦ దివ్యమహర్షులు, పాయక యుందురు ♦ భవ్యరీతి
తే. వలచినట్టివి ఫలములఁ♦వారిగాఁగ, నెప్పు డెయ్యది యొసఁగు నే♦యెడను దేనె
సోన గురియును నారమ్య♦మైన మేరు,నగమునం దుండుఁ గేసరి♦నామకుండు. ౫౮౧

సీ. గండరగండఁ[1] డీ♦తండు రాక్షసతతి,మధ్యంబునందు నీ♦మాడ్కి దేవ
యఱువదివేల స్వ♦ర్ణాద్రులనడుమను, మేరువు రాణించి ♦ మేటి యగుచు
శాఖామృగంబుల ల♦చ్చట శ్వేతకపిలలో,హితమధుపింగళా♦కృతుల నొప్పఁ
గరవాఁడి[2] గోళ్లను ♦ గఱకుఁగోఱలు నంచు, బెబ్బులులట్టులు ♦ గబ్బ లగుచు
తే. బొబ్బ మెకములవడువునఁ ♦ బొడవులైన,నాల్గుకోఱలు గలిగియుం♦టంగరాని
వేల్పుతోడను సోమించి ♦ విషధరాళిఁ,బోలి మదవారణములకుఁ ♦ బురుడుసూపి.
తే. దీర్ఘవాలంబు లమర మ♦డంచినట్టి, గౌరులను గొండలనుబోలి ♦ ఘనపయోద
రావులై వృత్తపింగళ♦రక్తనయన,ములు రహింపఁగ నీలంక ♦ మూలముట్టు. ౫౮౩
తే. నాశమును జేయ నున్నట్టి♦కీశవరుల,నడుమ విజయార్థియై యున్న♦నగచరుండు
దేవ శతవలి యనియెడి♦ధీరతుండు, దినముదినము నుపాసించు ♦ దివసనాథు. ౫౮౪

కం. బలియుఁడు శూరుఁడు పౌరుష,కలితుఁడు రామునకుఁ బ్రియముఁ ♦ గావించుటకై
తలఁపఁడు ప్రాణము దీ పను,పలు కువ్విళ్లూరు లంకఁ ♦ బా డొనరింపన్. ౫౮౫
తే. గజగవాక్షులు నీలుండు ♦ గవయనలులు
నొక్కఁ డొక్కఁడు దశకోటి♦యూథసమితి
పతులు వింధ్యంబునందలి♦ప్లవగవరుల
రాక్షసేశ్వర యెన్నఁ ద♦రంబు గాదు. ౫౮౬
కం. అంద ఱమితప్రభావులు, నందఱు నచలాభకాయు ♦ లందఱు భూభృ
ద్బృందంబులు పొడిపొడి చే,యం దిట్టలు క్షణములోన ♦ నసురాధీశా! ౫౮౭

శుకుఁడు రావణునకు మైందాదుల నెఱింగించుట.

కం. సారణభాషణముల విని, తీర వచింపం దలంచి ♦ దివిజారికి నా
పారావార మెనయుకపి,వారంబుం జూపి ♦ పలుకు శుకుండున్. ౫౮౮
సీ. ప్రాలేయగిరి నున్న♦సాలవృక్షంబులో, మందాకినీతటి♦మఱ్ఱిచెట్లొ
మత్తెక్కితిరిగెడి ♦ మాతంగనాథులో, యనఁగ దుస్సాధులు ♦ నధికబలులు
కామరూపులు దితి♦జామరసంకాశు, లని దేవసన్నిభు ♦ లైనప్లవగు
లిరువదియొకకోటి♦తరుచరు లట్టులే, వేయిశంఖంబులు ♦ బృందశతము
తే. వీరు కిష్కింధయం దుండు♦వారు సూర్య,తనయుసచివులు దేవగం♦ధర్వతతికి
సంభవించిన వారలు సమరమునను, శత్రుభీకరు లెల్లరు ♦ శక్రవైరి. ౫౮౯

[1] గండరగండఁడు = శూరులలో శూరుఁడు. [2] కరవాఁడి = మిక్కిలి పదునుగల.

మత్తకోకిలము. వారిఁ జూడు మవార్యవీర్య వి♦భాప్రభావులు బాలకా
కారు లబ్జజుపంపునన్ మరి♦గండుమీఱి సుధారసం
బారఁ గ్రోలిరి మైందుఁడున్ ద్వివి♦దాఖ్యుఁడున్ నిను నీపురిం
భూరివిక్రమసంపదన్ మును♦ముట్టఁ గూల్చఁగఁ జూచెదర్. ౬౯౦

కం. వారల క్రేవల శైలా,కారులు సుముఖాసుముఖులు ♦ కాలునితనయుల్
వీరులు జనకసమాను ల,పారబలులు పాఱఁజూచు♦వారలు లంకన్. ౬౯౧

సీ. మత్తమాతంగంబు♦మాడ్కి నుండెడివాఁడు, కనలునఁ గడలినేన్ ♦ గలఁచువాఁడు
పవమానసుతుఁ డని ♦ ప్రథఁ జెలంగెడివాఁడు, కేసరితనయుఁ డై ♦ కెరలువాఁడు
దలఁచినరూపంబు ♦ ధరియింపఁ గలవాఁడు, బలరూపములఁ దీవిఁ ♦ బ్రబలువాఁడు
వాయువున ట్లని♦వార్యవేగమువాఁడు, హరిచయంబుల మిన్న ♦ యైనవాఁడు

తే. దర్పమున సాగరంబును ♦ దాఁటినాఁడు, త్వాత్మజను నిన్నుఁ జూచిమా♦టాడినాఁడు
తిరిగి యిచ్చటి కిపు డరు♦దెంచినాఁడు, కనితి వే వాఁడె హనుమంతుఁ♦డ నెడివాఁడు.

ఉ. వాఁడు కిశోరవృత్తి చెలు♦వం బగువేళ క్షుధార్తి నప్పుడే
వేఁడివెలుంగు ప్రాచిఁ బ్రభ♦వింపఁగ నాఁకలి దీఱ వీనినిన్
బోఁడిమి మ్రింగువాఁడ నని ♦ పూని చివుక్కున మింట నామడల్
మూఁడుసహస్రము ల్నెగసి ♦ లోకవిలోచను డాయఁ బోక యే. ౬౯౩

కం. శైలవరకూటతలమున, వ్రాలుటయున్ హనువు గాయ♦పడెఁ జీలికయై
వాలుమగఁడు దానం గద, వాలెన్ హనుమంతుఁ డనెడి♦వరవిఖ్యాతిన్. ౬౯౪

కం. హనుమంతుఁడు హనుమంతుఁడు, హనుమంతుం డనుచు నితని♦యాప్తులు పిలువన్
విని యెఱిఁగితి నీతనిబల,ఘనమహిమసురూపములను ♦ గాదు వచింపన్. ౬౯౫

కం. జివ్వునఁ బైపడి యిపుడే, యువ్వెత్తుగ లంక నెల్ల ♦ నుహ్వాని మీఁటన్
గ్రొవ్వునఁ దలఁచెడి నీతం, డవ్విధికిని జాలువాఁడ ♦ యని నేఁ దలఁతున్. ౬౯౬

శుకుఁడు రావణునకు శ్రీరామలక్ష్మణులఁ జూపుట.

సీ. సారసనేత్రుండు ♦ శ్యామలగాత్రుండు, ఘనగుణహారి వి♦క్రమవిహారి
శూరవరేణ్యుండు ♦ సుజనశరణ్యుండు, సర్కవంశజులయం ♦ దతిరథుండు
పౌరుషప్రథితుండు ♦ ధీరసంకథితుండు, వేదవేదాంగసం♦విద్ఘనుండు
ధర్మైకశరణుండు ♦ ధర్మానుసరణుండు, బ్రహ్మాస్త్రముం త్రాళిఁ ♦ బండితుండు

తే. బాణముల విన్న బ్రద్దలు ♦ పాఁజాలు, నచలములఁ బిండి సేయంగ ♦ నైనఁ గ్రాలుఁ
బరమరుమగొన్న మృత్యుదే♦వతనుబోలుఁ, బటుపరాక్రమమున దివ♦స్పతికి మేలు.

కం. వేనిసతిన్ సీత జన,స్థానంబునఁ దెచ్చి తట్టి♦దశరథమహీభృ
త్సూనుఁడు రాముఁడు వాఁడే, పూనెను నీతోడ యుద్ధ♦మున కసురేంద్రా! ౬౯౭

సీ. ఆయన సయిదోడు ♦ నన్నకు సరిజోడు, వలపటికయివంక ♦ వఱలువాఁడు
మిసిమిమేలి కడాని ♦ మెఱుఁగులీనెడువాఁడు, కఱియుంగరంబుల ♦ నెఱులవాఁడు
కెందామరల నవ్వు ♦ కందోయిగలవాఁడు, నిక్కు పేర్వెడలువు ♦ టక్కువాఁడు
అసమున నన్నకై ♦ యసుఱు నిల్పెడివాఁడు, నోటమి యెఱుఁగని ♦ యేటుకాఁడు
తే. రామునకుఁ గుడికేలయి ♦ గ్రాలువాఁడు, నతనికిని నిచ్చ వెలియుసు ♦ రైనవాఁడు
పూని యని నేరికిని గెల్వ ♦ రానివాఁడు, కనలు నిండారు డెందానఁ ♦ దనరువాఁడు.
కం. ఈతని లక్ష్మణుఁ డందురు, భ్రాతకుఁ బ్రియతముఁడు మఱియుఁ ♦ బ్రాణసముండున్
నీతిని సంగరరీతిని, ఖ్యాతుఁడు సర్వాస్త్రశస్త్ర ♦ గణకోవిదుఁడున్. ౬౦౦
కం. బలియుఁడు మేధావంతుం, డలఘుపరాక్రముఁడు రాక్ష ♦ సావళి నెల్లన్
గలనం దా నొక్కండే, పొలియింపఁగఁ దమకపడెడుఁ ♦ బురురోషమునన్. ౬౦౧
కం. హితుఁడై రామునకును నా,శ్రితుఁడై డాపటను నిల్చి ♦ శ్రితరక్షస్సం
వృతుఁడైనవాఁడు రాక్షస,పతి యైనవిభీషణుండు ♦ భవదనుజుండున్. ౬౦౨
తే. మానవాశన! యితఁడు శ్రీ ♦ మద్వరుండు; రాజరాజైన శ్రీరఘు ♦ రాముచేత
లంక కభిషిక్తుఁ డగుచు ను ♦ ల్లాసగరిమఁ, దాఁక నున్నాఁడు నిన్నని ♦ దర్పయుక్తి.
సీ. క్రోఁతుల నడుమను ♦ గొండనా నున్నవాఁ, డగచరాళికి భర్త ♦ యైనవాఁడు
ధీజ్ఞానయశములఁ ♦ దేజఃకులంబుల, ధరములఁ బ్రాలేయ ♦ గిరివరంబు
వెలిఁగించుపగిదిఁ గీ ♦ శుల నేలువాఁడును, గలన వెన్నీయని ♦ కడిమికాఁడు
సగహనద్రుమ మయి ♦ శైలదుర్గస్థ మా,కిష్కింధగుహాలోనఁ ♦ గీశయూథ
తే. పతులును ప్రధానులును గొల్వఁ ♦ బ్రబలువాఁడు
లలితపుష్కరశత మయి ♦ లక్ష్మి సుప్ర
తిష్ఠితం బయి కాంత మై ♦ దేవమనుజ
తతికిఁ దగు హేమమాలికఁ ♦ దాల్చినాఁడు. ౬౦౪
కం. దురమున వాలిని గూలిచి, ధరణీతనయాధవుండు ♦ తారాసతినిన్
దిర మగుకపిరాజ్యం బీ,సరియును[1] సుగ్రీవునకు నొ ♦ సంగెం బ్రీతిన్. ౬౦౫

శుకుఁడు వానరసేనాసంఖ్యను రావణునకుఁ దెలుపుట.

సీ. కోటి యా లక్షను ♦ నూటిచే గుణియింపఁ, గ్రాలుఁ దల్లక్ష శం ♦ ఖంబు పేర
నది లక్ష యైన మ ♦ హాశంఖ మనఁబడు, నది లక్ష యైన బృం ♦ దాఖ్యఁ బరఁగు
నది లక్ష యైన మ ♦ హాబృంద మందురు, తల్లక్ష యగును బ ♦ ద్మంబు దేవ!
యది లక్ష యైన మ ♦ హాపద్మ మై చెల్లు, నది లక్ష యైన ఖ ♦ ర్వాభిధాన
ఆ. మదియు లక్ష యేన్ మ ♦ హాఖర్వమౌఁ దత్స,హస్ర మగు సముద్ర ♦ మదియు లక్ష
యైన నోఘ మందు ♦ రది లక్షయు మహౌఘ, మంచు గణితవేత్త ♦ లందు రధిప!

[1]సరి = హారము. దీనిమహిమ పూర్వపీఠికఁ జూడుఁడు.

సీ. ఈ యున్నవానర♦బృందంబు గణియించి, వివరింతు వినవయ్య ♦ వేయికోట్లు
శంఖశతము మహా♦శంఖసహస్రంబు, బృందశతము మహా♦బృంద మొక్క
వేపద్మశతమును ♦ వేమహాపద్మము, ఖర్వసముద్రము ♦ లృతము శతము
శతమహౌఘంబులు ♦ శతసహస్రశతమ,హౌఘముల్ గలిగి మ♦హాబ్ధియట్లు
తే. పెంపు గను వాహినియును వి♦భీషణుండు, సచివయుక్తంబుగాఁ దన్ను ♦ నుచితరీతి
బలసి యుండంగ నీతోడ♦భండనమున, కెదురు చూచుచు నున్నవాఁ♦డినసుతుండు

చం. అలఁతులఁ బోఁడు దేవర! మ♦హాబలవంతుఁడు వీర్యవిక్రమా
స్ఖలితుఁడు ప్రజ్వలద్దహని♦కాశచమూసము పేతుఁ, డాతనిన్
బలమును బాఱఁ జూచి యటు♦పై నెటు లోటమి రాక యుండునో
గెలుతువొ శత్రువర్గమును ♦ గేరి ప్రయత్నము సేయు మవ్విధిన్. ౬౦౮

## ⟵ రావణుఁడు శుకసారణుల నిందించుట. ⟶

చం. శుకుఁ డిటు లాడఁగాఁ బ్లవగ♦శూరసమూహము రామభూమిభృ
న్నికటగతుం నిజానుజుని ♦ నిస్తులవీర్యుని రామదక్షిణ
ప్రకటభుజుం సుమిత్రసుతు ♦ బంధురవిక్రము సర్వకీశనా
యకుఁ గని గుండె ఝల్లన నొ♦కంత దశాస్యుఁడు క్రోధచిత్తుఁ డై. ౬౦౯

కం. వెలవెల నై నమ్రతరా,స్యులు నై నిలుచున్నవారి ♦ శుకసారణులన్
దిలకించి రోషగద్గద, కలితకఠోరోక్తి ననియెఁ ♦ గడిమి దలిర్పన్. ౬౧౦

ఉ. నేరిమి ప్రగ్రహంబును వి♦నిగ్రహముం గలరాజుతోడ నే
వారక వానిసొమ్ముఁ దిను♦వారలు విప్రియము ల్వచింపఁగాఁ
దీ రగు నొక్కొ? మీ తెలివి♦ తేటలు నీ ఱయి యేల పోయెనో?
మీ రటె నాకు ధీ గఱపు♦మేటులు? చెల్లునె యిట్టు లాడఁగన్? ౬౧౧

కం. ప్రతికూలురు యుద్ధార్థా,గతు లగుశాత్రవులు దఱిసి ♦ కడిమిఁ బయిపడన్
హితులవలె వారిఁ బొగడెద, రితవే మీ కిదియు? సమయ ♦ మెఱుఁగఁగ వలదే?

ఉ. ఆర్యగుణైకభూషణుల ♦ నాదటమై గురువృద్ధులన్ మహా
చార్యుల సేవఁ దన్పితిరి ♦ శ్రద్ధను భక్తిని, దానఁ గల్గ దే
కార్యము, నిష్ప్రయోజనము♦గాఁ జనియెం జదువెల్ల, భూమిభృ
త్కార్యులఁ గొల్చుపద్ధతుల♦తత్త్వము మీర లెఱుంగఁజాలమిన్. ౬౧౩

కం. తెలిసికొని యుంటి రేనియు, ఫల మేమియుఁ గలుగ దనుభ♦వమునకు రామిన్
బలితపుశాస్త్రజ్ఞానము,బళు వొక్కటె మోసి తిరుగు♦వారలు మీరల్. ౬౧౪

కం. మీయట్టిమంత్రులను వై,ధేయులఁ [1]గట్టుకొని నేను ♦ దేవునికృపచేఁ
జేయుచు రాజ్యము దేహం, బేయనువుననో ధరించి ♦ యిటు లున్నాఁడన్. ౬౧౫

[1] వైధేయులు=మూఢులు.

తే. ఎఱుఁగరా మీరు నానాళ్ళ ♦ యే శుభంబు
నశుభమును మీకుఁ గూర్పస ♦ మర్థ మనుచు?
నిట్లు పరుషంబు న న్నాడ ♦ నెత్తికొనుట
కేమిరా మృత్యుభయము లే ♦ దేర మదుల? ౬౧౬

ఆ. కారుచిచ్చు దవిలి ♦ కాననంబున నుండు, వృక్షచయము నిలిచి ♦ వెలయుఁ గాక
ప్రభువుకోపమునకుఁ ♦ బాత్రుఁ డౌనపరాధి, తనువు నిలుపలేఁడు ♦ ధరణిమీఁద.

ఉ. పాపుల శత్రుపక్షమున ♦ వారిఁ బ్రశంస యొనర్చుమిమ్ము నా
కోపమహాశుశుక్షణికిఁ[1] ♦ గూర్చనె యాహుతిఁగాఁగఁ, జిత్తమున్
మీపొనరించి యున్న తొలి ♦ మేళ్ల నెఱింగి మృదుత్వ మందదేన్;
గావథవర్తు లీరలు పొ ♦ కాలుఁడు ఛీ నిలకుండు దాపునన్. ౬౧౭

కం. మీమేలు దలఁచి మిమ్మున్, నే మృతిఁ గూర్పంగ నేర ♦ నెఱిచెడి మీరున్
నామేలు మఱచి యస్మ, త్ప్రేమకు దూరస్థు లగుటఁ ♦ ద్రెళ్లినవారల్. ౬౧౯

కం. అని యిట్లు పంక్తికంధరుఁ, డన లజ్జానతశిరస్కు ♦ లయి యామంత్రుల్
వినయంబున జయజయ ని,స్వనముల నుతియించి చనిరి ♦ సభ నుండి వెసన్.

రావణుఁడు శార్దూలాదులను శ్రీరామునిచర్య కనుఁగొని రాఁ బంచుట.

ఉ. అంతట రావణుండు నిక ♦ టావనివర్తి మహోదరాఖ్యుతో
నెంతటినీతివేదుల న ♦ హీనచరిత్రుల వేగువాండ్ర న
త్యంతజవంబునం బిలువ ♦ నంపు మ టన్నను వాఁడు శేముషీ
మంతుల వేగువాండ్ర నుర ♦ మర్దనుముంగల నిల్పె వారలున్. ౬౨౦

కం. జయశబ్దపూర్వముగ నవి,నయముగఁ గేల్మోడ్చి నిల్చి ♦ నన్ వారల ని
ర్భయులన్ భక్తుల శూరుల, నయవేదులఁ గాంచి రావ ♦ ణప్రభు వనియెన్. ౬౨౨

ఉ. పొం డిట నుండి చక్క రఘు ♦ పుంగవుపాళెము డిగ్గుచోటి కా
తం డొనరించుయత్నమువి ♦ ధంబును శోధన చేసి యంత నా
తం డెడ నచ్చువారిచరి ♦ తంబును నాతనిమీఁదఁ బ్రీతిమై
నుండెడిమంత్రిసర్యులస ♦ ముద్యమముం గని రండు లెస్సగన్. ౬౨౩

తే. ఎవరితోడుగ నేవేళ ♦ నెట్లు నిద్ర
గొనును రాఘవుఁ డొంటిమైఁ ♦ గూర్కఁ గొనునొ
యెపుడు మేల్కొను మఱి యెపు ♦ డేమి సేయుఁ
దెలిసి సర్వంబుఁ జక్క రా ♦ వలయు మీరు. ౬౨౪

[1] ఆశుశుక్షణికి=అగ్నికి.

కం. వైరుల తెఱంగు మతిమ,చ్చారులచే నెఱిఁగి తేఁడు ♦ శాత్రవగణముల్
బోర లఘుయత్నమున ధి,క్కారించి జయించు ననినఁ ♦ గడుకొని వారల్. ౬౨౫

సీ. వల్లెయటంచును ♦ వలగొని మ్రొక్కి శా,ర్దూలుండు మున్నుగాఁ ♦ దూర్ణ మరిగి
ప్రచ్ఛన్నవేషు లై ♦ రామసౌమిత్రులు, విహరించు చున్నసు♦వేల మరిగి
వానరరాక్షస♦వల్లభసహితు లౌ,దాశరథుల వారి♦ధ్వజినిఁ జూచి
వెళ్లఁబోవుడును వి♦భీషణుం డెఱిఁగి య,ధార్వణ్ణవర్ణు లటంచు ♦ నగచరాళి
తే. కొయ్య నెఱిఁగించి శార్దూలుఁ ♦ డొక్కరుండె
పాపి యని పట్టి యన్యులఁ ♦ బాఱఁదోలెఁ
జెట్టుద్రిమ్మగులును వారిఁ ♦ బట్టి కొట్టి
పిండి యిడి రెంతయును వారి♦గం డడంగ. ౬౨౬

కం. వానివిలాపము సీతా,జాని విని కృపాళుఁ డగుచుఁ ♦ జరవర్గముతో
వాని విడిపింప వారును, వానరఘాతముల గుండె ♦ వకవక లగుడున్ ౬౨౭

కం. ఎగయూరుపుతో వేలుఁపుఁ,బగ[1] డాయఁగఁ జని సువేల♦పర్వతమున నా
జగదీశుఁడు విడిసినవాఁ, డగచరసైన్యంబుతోడ ♦ నని వచియింపన్. ౬౨౮

## ←→ రావణునకు శార్దూలుఁడు కపులచేఁ దాను బడినపాటు దెలుపుట. ←→

సీ. రావణుండును మది ♦ రాముండు కడుదాపు, దఱిసె నంచు నొకింత ♦ తత్తఱిల్లి
యపసర్ప[2]వరునితో ♦ ననియె శార్దూల! నీ,తనుకాంతి పూర్వవి♦ధంబు గాదు
కందువాఱితి వేల? ♦ కడుస్రుక్కినాఁడవు, కనలుదాయిలకు లోఁ♦గావు గాదె?
యనుచుఁ బ్రశ్నింప భ♦యాకులచిత్తుఁ డై, యల్ల నల్లన నిట్టు ♦ లనియె వాఁడు
ఆ. దేవ! వేగుదీయ ♦ దెప్పరపుం బని, క్రోఁతులందు వా ర♦కుంఠబలులు
నమితవిక్రమాఢ్యు ♦ లది గాక రామ ర,క్షితులు సుమ్ము వారిఁ ♦ జేర రాదు. ౬౨౯

ఉ. కిమ్మని యాడరా దచటఁ ♦ గీశుల నే మనిప్రశ్న సేయ? దూ
ర్గమ్ముల నెల్లఁ బర్వతని♦కాశులు క్రోఁతులు కాచు చున్నవా,
రిమ్ముగ నేను జొచ్చితినొ ♦ యించుక లేదొ తటాన నన్ను రే
ద్రిమ్మరు[3] లుక్కడంపుబిగిఁ ♦ దెప్పునఁ బట్టిరి కొట్టి రుగ్రులై. ౬౩౦

ఉ. దంచిరి నన్నుఁ బాదములఁ ♦ దద్దయుఁ జేతుల వ్రేళ్లగోళ్ల నొ
ప్పించిరి, ముష్టిఘాతములఁ ♦ బిండిగఁ గొట్టిరి, దంతపంక్తిచే
నుంచిరి మేనఁ గా, ట్లుదిల ♦ నుక్కిరిబిక్కిరి నై తపింప మ
ర్దించిరి, నాల్గువంకలను ♦ ద్రిప్పిరి దెప్పిరి యోప్పి రాకపుల్. ౬౩౧

ఆ. త్రిప్పి త్రిప్పి నన్నుఁ ♦ దెచ్చిరి శ్రీరాము,కడకు నేను నెత్రు♦కాల్వవాఱు
మేనితోడ నడలు♦మానసంబున రాము,నంఘ్రియుగళిఁ గావు ♦ మనుచుఁ బడితి.

[1] వేలుపుఁబగ = రావణుఁడు. [2] అపసర్పుఁడు = వేగులవాఁడు. [3] రేద్రిమ్మరులు = విభీషణుని మంత్రులగు రాక్షసులు.

కం.సీతాపతిచేతఁ బరి,త్రాతుఁడ వై యెట్లొ బ్రతుకు♦దలఁ గంటిఁ; గపి
వ్రాతముచే శైలశిలా,జాతము నిండించి కడలి ♦ జననాయకుఁడున్ ౬౩౩

కం.గరుడవ్యూహంబున నగ,చరవర్గము తన్నుఁ గొలువఁ ♦ జాపాయుధుఁ డై
ధరణీపతి మనలంకా,పురిగవన్ని న్నిలిచెఁ జుమ్ము ♦ పురుహూతారీ! ౬౩౪

కం.నను విడిచి లంకమీఁదం,-దనదృష్టిని నిలిపెఁ గ్రోతి♦తతి లగ్గలకున్
జను దేకమున్న యుద్ధమొ, జనకజ నిచ్చుటయొ యొకటి♦సలుపు మటన్నన్.౬౩౫

⟵ శార్దూలుఁడు రామునకుఁ గపుల బలపరాక్రమములు దెలుపుట. ⟶

సీ. ఆమాట లాలించి ♦ యసురాధిపతి యిట్లు, పలికె వానికి గొప్ప♦వాక్య మొండు
దేవగంధర్వులు ♦ దితిజదానవులును, నుక్కునఁ దా రెల్ల ♦ నొక్కటగుచు
నెదిరించివచ్చిన ♦ నెల్లలోకములచే, ముమ్మరంబుగఁ గీడు ♦ మూఁడె నేని
సీత నిచ్చుట లేదు ♦ సిద్ధాంత మియ్యది, యిది యుండ నిమ్ము త♦ద్వృత్తచరుల
ఆ. బలములందుఁ దిరిగి ♦ వచ్చినాఁడవు గదా, శూరు లెచట నున్న ♦ వారు? వార
లెట్టివారు?కొలఁదు♦లెంతమాత్రమ్ము? ప్రభా,వంబు లెట్టి? వందు ♦ బలియు రెవరు?

కం.ఎవ్వరిపుత్రులు తత్కపు, లెవ్వరినునుమంద్రు? తెలుపు ♦ మెదిరిబలం బే
నెవ్విధి నెఱింగి సకలం, బవ్వల యోజింతుఁ జేయ ♦ నర్హ క్రియలన్. ౬౩౬

కం.దురమును గోరెడివారికిఁ, బరులబలాబలము లెఱుఁగ♦వలయు న టన్నన్
సుర వైరిఁ గాంచి యుత్తమ,చరుఁ డి ట్లని చెప్పె శైల♦చరవిషయంబున్. ౬౩౭

సీ. ఋక్షరజసువట్టి ♦ వృషొటరాజు ను, గ్రీవుఁ డాతని నని ♦ గెలువరాదు
గద్గదుకొడుకు ఋ♦క్షప్రభుఁ డాతఁ డే, జాంబవదాఖ్య ప్రశస్తి గాంచె
ధర్మనిపుత్రుండు ♦ ధర్మచిత్తుఁడు వీర్య,ధని నుషేణుండు దో♦ర్దర్పయుతుఁడు
సౌమ్యుండు సోమసం♦జాతుండు దధిముఖుం, డపరమృత్యువులుగ ♦ నబ్జభవుఁడె
తే. వృక్షచరరూపమున ధర ♦ సృష్టి చేసె, నుముఖదుర్ముఖు లనియెడి♦శూరవరుల
వేగదర్శిని రాజేంద్ర! ♦ వీతిహోత్రు,నుతుఁడు నీలుఁడు సేనాని♦శూరతముఁడు.

కం.నీకొడుకు లోనుగాఁగల,నాకారులఁ బిల్కు మార్చె ♦ ననహాయుం డై
యేకపి యాతనిజనకుఁడు, పాకారిగురూద్భవుండు ♦ ప్రబలుఁడు పోరన్. ౬౪౦

కం.అనిలునితనయుఁడు హనుమఁడు, ఘనవిక్రముఁ; డుక్కలుండు ♦ గట్టులపగకున్
మనుమఁడు యౌవనవంతుఁడు, చను నంగదుఁ డనెడిపేర ♦ శక్రారాతీ! ౬౪౧

తే. మైందుఁడును ద్వివిదుండునా♦మహితశౌర్య,లశ్వితనయులు వైవస్వ♦తాత్మభవులు
గజగవాక్షగవయులును ♦ గంధమాద,నుండు శరభుండునా యము♦నుద్దివారు.[1]

[1] కవిత్రయభిమాన్నాది మహాకవి ప్రయుక్తమైన యఖండయతి.

కం. శూరులు శ్రీమద్దేవకు,మారులు రణదోహలులు స♦మానవిరహితుల్
ధీరులు పదికోట్లు వనే,చారులు గల రున్నవారిఁ ♦ జాలం జెప్పన్. ౬౪౩

సీ. సింహసంహనను లక్షణబలాఢ్యులు, దశరథపుత్రులు ♦ నిశిచరేంద్ర
వారిలో నెక్కటి♦పోరిలోనఁ ద్రిశీర్ష,ఖరహంత గండర♦గండఁ డయ్యె
యలవిరాధుఁ గబంధు ♦ వంతికాతిథులుగా, ననిచినరాముండు ♦ యమనిభుండు
విక్రమంబున రామ♦విభునితో సరిపోల్పఁ, గానరాఁ డొకఁడు జ♦గంబులందు
తే. నలజనస్థాన మంతయు ♦ హాత మొనర్చి,నట్టిపౌరుషశాలి గు♦ణాళి నెన్న
నెవ్వఁ డేనియు నేరఁ డీ♦యెల్లలోక,ములను సత్యంబు రాక్షస♦కులవతంస! ౬౪౪

కం. వారణసన్నిభుఁ డని నని,వారణవిక్రముఁడు భూమి♦వరుసోదరుఁ డా
వీరునిశితనారాచము,బారిం బడి బ్రతుక లేఁడు ♦ బలశాత్రవుఁడున్. ౬౪౫

కం. శ్వేతుఁడు జ్యోతిర్ముఖుఁడును, ఖ్యాతబలుల్ సూర్యతనయు♦ లప్పతికిఁ దనూ
జాతుండు హేమకూటా,ఖ్యాతుం డల నలుఁడు విశ్వ♦కర్మాత్మజుఁడున్. ౬౪౬

కం. హరివీరులమేటి సుదు,ర్ధరుఁడు వసువుసుతుఁడు సుమ్ము ♦ రాక్షసులందుర్
గరము వరిష్ఠుఁడు నీసో,దరుఁడు విభీషణుఁడు ♦ హితుఁడు ♦ దాశరథులకున్. ౬౪౭

కం. ఈరీతిగఁ గపిసేనల,తీ రంతయుఁ దెలియనాడి♦తి నువేలాద్రిన్
వా రున్నవారు తక్కిన,కారియముం దీర్ప నీవ ♦ గతి యంతటికిన్. ౬౪౮

### రావణుఁడు విద్యుజ్జిహ్వుని రామునిశిరస్సుఁ జాపముఁ గల్పింప నాజ్ఞాపించుట.

సీ. అపసర్పు లీరీతి ♦ నక్షోభ్యబలముతో, నంబుజాక్షుఁడు సువే♦లాద్రిమీఁద
విడియుట వినిచిన ♦ విని వింశతిభుజుండు,నెద ఝల్లుక్కన నొక ♦ యింత వెఱచి
నిబ్బరంబున మంత్రి♦నివహంబుతో నను, సచివులారా! నీతి♦శాస్త్రవేదు
లార! మీ రెల్లరు ♦ నాలంబు లే కిందు, రండు వేవే మంత్ర ♦ ముండుకాల
తే. మిపుడు ప్రాప్తించె నని వార♦లెల్లవారు, రాఁగ మంతన ముండి యా♦రావణుండు
వారిఁ బనివినుఁ[1] డని చెప్పి♦ చేరి స్వాల,యంబుఁ బిలిపించి యటకు మ♦హాబలాఢ్యు.

సీ. మాయావిదుని మహా♦మాయు విద్యుజ్జిహ్వుఁ, గని యిటు లనియెను♦ ఖ్యాతనూజ
మోసగింపఁగ వలె ♦ సీసమంతయు భేద, మేమి లేకుండ శ్రీ♦రామశిరము
సశర మానాతని♦చాపంబు మాయచేఁ,గల్పించి నేనుండు♦కడకు రమ్ము
టన్ననాతఁడు వల్లె ♦ యనఁ గొన్ని సొమ్ములు, పసదనంబుగ నిచ్చి ♦ పంచి యతనిఁ
తే. దాను విశ్వంభరాసుతా♦దర్శనాభి,లాషి యై యశోకవనిత♦లంబుఁ జొచ్చి
దీనురాలి నధోముఖిఁ ♦ దీవ్రశోక,బాధ్యమాన నదైన్యార్హఁ ♦ బరమశీల. ౬౫౦

[1] పనివినుఁడు = పొండు.

చం. ధరణితలోపవిష్టయయి దారుణవిగ్రహరాక్షసాంగనా
పరివృతయైనదానిఁ, దనప్రాణవిభుం స్మరియించుదాని, సుం
దరిఁ గని డాయఁ బోయి యమితప్రమదాకరవార్త యేదియో
సరసిజనేత్రకుం బలుకుచందమునన్ వచియించు ధీరుఁడై. ౬౫౧

రావణుఁడు సీతకు శ్రీరామాదులు హతులైరని చెప్పుట.

శా. ఎంతో నిన్ బతిమాలుకొంటిఁ గదె తన్వీ నన్నుఁ జేపట్టఁగాఁ
జింతాకంతయు నానుడిన్ వినక ఛీఛీ యంటి వెవ్వానిపై
స్వాంతం బంతయు నుంచి యట్టిభవదీయప్రాణనాథుండు నీ
కాంతుం డాఖరహంత రాముఁడు సతీ కయ్యానఁ జంపంబడెన్. ౬౫౨

ఉ. మోడిగ నీదునేడుపె పమూలము నాశముఁ జేసె నీపతిన్,
వీడఁగఁగొట్టినాఁడఁ గద నీతలఁ గ్రొవ్వను మూలముట్టుగా,
నేడువు మింత యేడ్చెదవొ యిష్టము దీరఁగ, దిక్కు లేక నీ
వేడుచుచైన నాదుహృదయేశ్వరి వయ్యెదు నీవ చూడుమీ. ౬౫౩

ఉ. చచ్చినవానిఁ గట్టుకొని చారువిలోచన యేల యేడ్చె, దీ
పిచ్చితనంబు మాను మికఁ బేరిమిమీఱఁగ మత్సతీతతిన్
బచ్చగ రాణి వై మనుము పండితమానిని యల్పపుణ్య యో
మచ్చరికత్తె స్వార్థహితమారిణి బాలిశురాల దుర్మతీ! ౬౫౪

కం. విను వృత్రాసురవధవలె, విన ఘోరం బైననీదువిభువధ మెల్లన్
వననిధిదరికిని నీపతి, చనుదెంచెను నన్నుఁ జంప సకపిబలుండై. ౬౫౫

చం. దినకరుఁ డస్తమించునెడఁ దీవ్రకరాత్మజు తెచ్చియున్నయ
వ్వనచరసేనతో లవణవారిధియుత్తరతీరమందుఁ జే
రెను, బయనంపుగాసి నిదురించెను రాముఁడు, రాత్రివేళ నా
పనిచినవేగు లవ్విధము బాగుగ శోధన చేసి క్రమ్మఱన్. ౬౫౬

ఉ. ఆవల సేనతోఁ జని ప్రహస్తుఁడు వైనులు డిగ్గియున్న యా
తావును మెల్లఁ జేరి శరదండమహాయసఖడ్గయష్టి శూ
లావళిశక్తిచక్రపరిఘాయుధముద్గరతోమరాళులన్
వే విదళించి రెల్లకపివీరుల భీతులఁ దూఁగుఁబోతులన్. ౬౫౭

కం. గుఱక యిడుచు నిద్రింపఁగ, మెఱుఁగు మెఱచినట్టు లఱిమి మెలఁతుక రామున్
నఱకెన్ శిరముఁ బ్రహస్తుఁడు, కఱకఱ మని యుఱక పెద్దకరవాలమునన్. ౬౫౮

సీ. వింటికై యెగురువిభీషణు మావారు, పట్టి కట్టిరి చక్కఁ బాతళించి
క్రోఁతులలో నొక్క క్రోఁతియై సౌమిత్రి, యూడనిఁ బాడె[1] దిగ్వ్యూహములకుఁ

[1] ఊడనిఁ బాడె = పరుగెత్తెను.

గీశాధినేత సు♦గ్రీవుండు కృత్తను,గ్రీవుఁ డై పన్నుండె ♦ క్షితితలమున
హనుమంతుఁడు నిరస్త♦హనుకుఁ డై తం‌డ్రికిఁ, బ్రాణంబు లర్పించెఁ ♦ బట్టువదలి
తే. జాంబవంతుఁడు రాక్షసుల్ ♦ చటులపట్టి
సాదులను మోఁద మోఁకాళు ♦ లవనిఁ గూల
నంగలార్చుచు జానకీ! ♦ యంతరించె
నెలుఁగు గావున బోలుచు ♦ నెలుఁగు లిడుచు. ౬౫౯

కం. మైందద్వివిదులు రక్షో,బృందము దమ్మంగవింప ♦ బీరువడి వెసన్
మ్రందిరి రోఁజుచు నేడ్చుచుఁ, గుందుచు డిందుచును మిగులఁ ♦ గొందలపడుచున్.
తే. పనసకాయను గుందిన♦పగిది గాఁగ, ఛిన్నమును భిన్నమును జేయఁ ♦ జేవ దఱిఁగి
పొర్లు చున్నాఁడు నెత్తుటఁ ♦ బువ్వుఁబోణి, పనసుఁడిం కేల ననగొట్ట ♦ భర్తకొఱకు.
సీ. నారసంబుల మేను ♦ నీరసంబుగ దరీ,ముఖుఁడు దరీముఖ♦మునను జచ్చెఁ
గూఁతయొక్కటి లేక ♦ కుముదుండు కుముదుఁ డై,యంబకములకు మే ♦ నప్పగించెఁ
దుండు తుండుగ నొడల్ ♦ తుండింపఁగా నంగ,దుండు నిపతితాంగ♦దుండు నయ్యె
నుక్కులు రక్కను ♦ లొక్క పెట్టునఁ గ్రమ్మి, రథము లేనికలు తు♦రంగమములు
ఆ. పఱప నిచ్చకోలఁది ♦ ప్లవగులు కొందఱు, నాగవితతి ద్రొక్క ♦ నలఁగి చచ్చి
రతివ! కొన్నిక్రోఁతు ♦ లరదముల్ పైఁబాఱ, నజ్జుగుజ్జు నెత్రు♦బజ్జు లయ్యె. ౬౬౨
కం. నిలిగిరి నలఁగిరి తొలఁగిరి, మలిగిరి డెరలిరి భయాన ♦ మడిసిరి క్రోఁతుల్
దలరిరి గెడసిరి ముగిసిరి, యిలిగిరి మఱి డింక వేసి ♦ రిం కేమందున్. ౬౬౩
కం. పారీంద్రంబులచేతను,[1] వారణవారములువోలె ♦ వ్రాలిరి నగసం
చారులు కొందఱు దూఱిరి, వారాన్నిధి నుప్పరంబుఁ ♦ బ్రాఁకిరి వెఱచేన్. ౬౬౪
కం. వానరులవృత్తి తమకు న,నూనంబుగ సాయపడఁగ ♦ నుర్వీరుహానం
తానంబు నెక్కె నెలుఁగులు, కానలఁ గోనలను నిండెఁ ♦ గపులశవంబుల్. ౬౬౫
కం. నాదళము లిట్లు పొడువఁగ, నీదయితుఁడు దత్తబడలు ♦ నీల్గిరి యి ట్లిం
కేది గతి నీ కటంచును, నాదశముఖుఁ డామె వినఁగ ♦ ననురక్కసికిన్. ౬౬౬

↞ రావణుఁడు సీతాదేవికి రామునికల్పితశిరచ్చాపంబులఁ జూపుట. ↠

కం. రామునిశిరంబు సంగర,భూమిస్థలినుండి తెచ్చె ♦ భూరిక్రౌర్యో
ద్దాముఁడు విద్యుజ్జిహ్వుం, డామానవభోజిఁ బిలువు♦మా యిచ్చటికిన్. ౬౬౭
కం. అనునంతలోన మూర్ధం,బును ధనువు గ్రహించి వచ్చి ♦ మ్రొక్కిడి దశకం
ఠునియెదుట నిలువ నాతం, డను విద్యుజ్జిహ్వునకు మ♦హాజిహ్వునకున్. ౬౬౮
కం. ఓరీ! రామునిశీర్షం, బారమణికి నెదుట నుంపు♦మూ చయ్యనఁ గ
న్నారఁగ నీనిర్భాగ్య మ,నోరమణునిచరమదశఁ గ♦నుఁ డెస్స యనన్. ౬౬౯

---

[1] పారీంద్రము = సింహము.

కం. మనుజాశనుండు ప్రియదర్శన మగుతచ్ఛిరము నుంచి ♦ జానకి కెదుటన్
జనియెను దిరోహితుండై, దనుజేంద్రుఁడు రాముశిరముఁ ♦ దత్కార్ముకమున్ ౬౦

చం. ధరణిజమ్రోలఁ ద్రోచి యిదె ♦ తామరసాక్షిరొ లెస్స చూడు సం
గరమున మాప్రహస్తుఁడు ప్ర♦కాశముగా నిశ రాము నీమనో
హరు వధియించి తెచ్చెఁ జుమ ♦ యాతనిసజ్యశరాసనంబు, నో
సరసిజనేత్ర! యేమిటికి ♦ జాగు? వశంపడు మింక నా కనన్. ౬౧

→ శ్రీరాముని మాయాశిరశ్చాపంబులఁ జూచి సీత దుఃఖించుట. ←

ఉ. అచ్చెలి యాశిరంబును శ♦రాసనముం గని వాయుపుత్రువా
క్రుచ్చినభాస్కరాత్మభవు♦కూటమియుం బలపోసి యేమియుం
బొచ్చెము లేనిమోమునరి♦మోమును గన్నులవంటికన్నులున్
దచ్చికురాభకుంతలవి♦తానము తద్వజనాబ్జవర్ణమున్[1] ౬౨

కం. శుభకరచూడారత్నము, నిభరాజసమానయాన ♦ యీక్షించి తమిన్
విభుశిర మని నమ్మి మహా, ర్తిభరంబున నేడ్చెఁ గురరి♦ తెఱఁగున మిగులన్. ౬౩

ఉ. హా జేగడాలమారి కయి♦కా! నెఱవేతెనుగా త్వదీప్సితం
బోజెగజేంత! వంశకల♦శోదధిచంద్రుఁడు గ్రుంకె, వంశస
ద్ధ్వజముఁ బాడుచేసితివి ♦ తెంపరివై, యిఁకమీఁద హాయిగా
నేజడ నింత లేక సుఖ♦యింపుము గుండెయనిబ్బరంబులోన్. ౬౪

కం. ఏవిప్రియంబు నీకుం, గావించె మహాత్ముఁ డైన♦ కాకుత్స్థుఁడు నీ
కావిధి యడవులఁ ద్రోయం, గా వల్కముఁ గట్టఁ జేసి ♦ కసి నాతోడన్. ౬౫

చం. అనుచు విదేహరాజసుత ♦ యంచితభూరితపోవ్రతాఢ్య హా
యని విలపించి బాలిక వ్య♦థాతిశయంబున వేపమాన యై
వనరుచు ఛిన్నమై ధరణి♦వ్రాలు ననంటిని బోలి త్రెళ్లి చే
తన చెడి వెండియుం దెలిసి ♦ తచ్ఛిరముం గొని మూరుకొంచునున్. ౬౬

తే. హా! మహాబాహా! రణధీర! ♦ హాసువీర!, యయ్యయో! నాశ మైతినో♦ప్రాణనాథ!
యిట్టినీచరమావస్థ ♦ నేను గాంచి, విక్రమైకధనాఢ్య హా ♦ విధవ నైతి. ౬౭

కం. సతిగుణహీనతచేతం, బతి తొలుతం జచ్చునంచుఁ ♦ బల్కుదురు బుధుల్
నుతశీల! నీవు నాదు, ష్కృతిఁ దెగితివి నేను లెస్స ♦ జీవింపంగన్. ౬౮

ఉ. పాపిని నే నటంటకును ♦ వారిజలోచన! సందియం బొకో
యాపదమీఁద నాపదలు ♦ ప్రాప్తములై వ్యసనాబ్ధి మున్గుచోఁ

[1] దీనివలన నార్యులు శిల్పవిద్యయందు నెంత నిపుణులైయుండిరో తెలియఁదగు.

బ్రో పొసరింపఁ దెప్పగతిఁ ♦ బూని ప్రయత్నముఁ జేయు నిన్న యో
పాపపుమిత్తి ద్రెక్కొనియెఁ ♦ బాపము గల్గు నె యింత కెక్కుడున్. ౯౨౯

సుగంధి. కుల్య! రామభద్ర! యిట్టి ♦ క్రూర మైనవార్త హృ
చ్ఛల్య మై వినంగఁ గల్గ ♦ సాధుశీల యత్త కౌ
సల్య పుత్ర పుత్ర రామ ♦ చంద్ర యంచు దుఃఖధీ
లౌల్య లేఁగఁ బాయుగోవు ♦ లా గ దెంత కుందునో. ౯౩౦

ఉ. మాయురె! శాస్త్రవేత్త లస ♦ మానపరాక్రమ! పల్కి రార దీ
ర్ఘాయువు నీకు, వారినుడు ♦ లయ్యె నసత్యము ప్రాణనాథ! య
ల్పాయువు నీ విట్లైతి, వన ♦ ఘాత్మక నీకు నకాలమృత్యు వె
ట్లాయెనొ వారి కల్లె మతి ♦ హానియు, దైవము హేతు వింతకున్. ౯౩౧

చం. తెలియనివాఁడ వౌదువె ప ♦ తీ! నయశాస్త్రము లెల్ల? వీనినిన్
జలుపఁగ వచ్చు నియ్యవి వి ♦ సర్జనయోగ్యము లం, చెఱుంగుని
న్నలమె నదృష్టరూపమున ♦ నయ్యపమృతువు నిద్ర యన్మిషన్,
దలఁపఁగ నడ్డ మాట గల ♦ దా విధికిన్ మతి యెంత గల్గినన్. ౯౩౨

ఇంద్రవంశము. నీరేజపత్రేక్షణ! ♦ నిర్దయాత్మికన్
క్రూరన్ మహారౌద్రను ♦ ఘోరదుష్కృతా
కారన్ ననున్ వల్లభ! ♦ కాళరాత్రినిన్
జేరంగ నీతీయుటఁ ♦ జేటుఁ దెచ్చితిన్. ౯౩౩

స్రగ్విణి. ఓమహాబాహు! నీ ♦ యొద్దికం గానఁగా
నే మహానిష్ఠలన్ ♦ నిచ్చ వర్తింపఁగా
రామ! భూమిం బరీ ♦ రంభసందాత వై
ప్రేముడిం గూడితే ♦ వీడితే నన్నిటన్. ౯౩౪

కం. సత మేను గంధసుమనో,వితతుల సర్చింప నాకుఁ ♦ బ్రియ మగుకనకాం
చిత మగునీకార్ముక మీ,గతిఁ బట్టెనె నేఁడు దిక్కు ♦ కానక వీరా! ౯౩౫

కం. నామామగారు నీపైఁ, బ్రేమము గలతండ్రితోడఁ ♦ బితరులతో సు
త్రామజగంబున సౌఖ్యం, బామనిగా నున్నవాఁడ ♦ వా ప్రాణేశా! ౯౩౬

కం. అయపుణ్యశీలురకు ను,ప్రియముం బుణ్యంబు నగుచుఁ ♦ బేర్గన్నత్వద
న్వయముం గను చున్నాఁడవె? నయశీలా! మింట నిలిచి ♦ నక్షత్రమ వై. ౯౩౭

మత్తకోకిలము. బాలికం గద బాల్యమందున ♦ ప్రాప్త నైతిని వల్లభా!
శీలినిన్ సహచారిణిన్ శుభ ♦ శీల! భార్యను బత్నినిన్

బాళి న స్నన వేల? మాటయుఁ ♦ బల్క వేటికి? నేమి కాం
తాళమా[1] హృదయేశ! మత్కృత♦దారుణాఘము చెప్పుమా. ౬౮౮

సీ. పాణిగ్రహణవేళ ♦ బాయ ని న్ననినట్టి, బాసను మఱచితే ♦ ప్రాణనాథ!
నీతుల్య సుఖదుఃఖ♦రీతుల నేఁ గాన, నీతోడఁ గొనిపొమ్ము ♦ నీరజాక్ష!
నీప్రాణకాంతను ♦ నే నిట దుఃఖింప, వీడి పో న్యాయమా ♦ విదితచరిత!
నాదిక్కు నీవె కా ♦ నాయకా! పరలోక, మర్హమా యొంటిఁ బో ♦ న్యాయశీల!
తే. సారఘనసారసమ్మిశ్ర♦చందనముల, నవ్యభూషణముల నొప్పి ♦ నాయొకర్త[2]
యంకపాళి సుఖించు మే ♦ నయ్యొ కంక, గృధ్రములపాలు పడియెనా ♦ నృపవతంస.
కం. అగ్నిష్టోమాదుల హుత, భుగ్నికురుంబంబుఁ దన్పి ♦ పూర్ణంబుగఁ ద్వ
త్ప్రాగ్నరపాలురగతిని ద, దగ్నుల సంస్కార మందు ♦ టబ్బ న నీకున్. ౬౯౦
సీ. ఒంటి సౌమిత్రియ♦యోధ్యకుఁ బోవంగఁ, గౌసల్య యాతనిఁ ♦ గాంచి వనికి
నాయనా! మువ్వురు ♦ పోయితిరే మీరు, కలిసి యబ్బంగి నొ♦క్కండ విట్లు
వచ్చితి తక్కిన♦వార లే రన నీవు, రాక్షసతతులచే ♦ రాత్రి నిద్ర
బలఁగంబుతోడుతఁ ♦ బరిమార్పఁ బడుటయు, నేను రావణునింట ♦ నిట్టు లుంట
ఆ. జీవితేశ యతఁడు ♦ చెప్పిన బెగ్గిల్లి, కళవళించి కుంది ♦ కలవరించి
జలదరించి తరలి ♦ జాలిమై దూపిల్లి, పల్లటిల్లి గుండె ♦ పగిలి చచ్చు. ౬౯౧
ఉ. ఉక్కున నొక్కటేఁడు మహి♦నోదధి పార్థివనందనుండు నా
షుక్కువకాఁడు రాముఁడు కు♦మానిని నాకొఱకై యనర్హపుం
ఫక్కిని గూలె దాఁటియును ♦ వారిధి గోష్పదమంతమాత్రలోఁ,
దక్కనె యట్టిదివ్యగుణ♦ధన్యుఁడు నీదురదృష్టురాలికిన్? ౬౯౨
ఉ. పాపిని నన్ను నాత్మకుల♦పాంసని నంచు నెఱుంగ లేక ని
ష్పాపుఁడు రామభద్రుఁడు వి♦వాహమునన్ గ్రహియించెఁ గూర్మి, నా
పాపపుఁజేఁత రామునకు ♦ భార్యయె మృత్యువు నయ్యె, భార్య దా
పాపము పుణ్య మెగ్గును శు♦భం బొనగూర్చుఁ దదీయభర్తకున్. ౬౯3
ఉ. నే నెదొ పూర్వజన్మమున ♦ నిశ్చిత ముత్తమ మైనకన్యకా
దానము విఘ్నుపా టొదవ ♦ దారుణవృత్తి ఘటింపఁ గంటి, న
ద్దానన సర్వలోకజన♦తాపరిపూజ్యనిభార్య నయ్యునున్
మానగుభోగకాలమున ♦ మాఁడెద ని ట్లతిదుఃఖవహ్నులన్. ౬౯౪
కం. రావణ! మే లగు నన్నున్, జా వింతయు[3] లేక రాము♦చంద్రునిమీఁదన్
ద్రోవుము సతిఁ బతిఁ గూరిచి, కావింపఁగదయ్య! పరమ♦కల్యాణంబున్. ౬౯౫

[1] కాంతాళమా=కోపమా. [2] ఇది రాముని యేకపత్నీవ్రతమును స్థాపించుచున్నది. [3] జావు=ఆలస్యము.

కం. రామునికాయముతోడన్, నామేనిన్ నాదుశిరము ♦ నాథుశిరము ర
క్షోమండలవర! కూర్పుము, యామహితాత్మకునిగతికి ♦ నరిగెద నేనున్. ౧౯౮

కం. అని కమలాయతలోచన, తనహృదయేశ్వరునిశిరము ♦ ధనువు మఱిమఱిన్
గనుఁగొను విలపించును నే,డ్చును నారట మందుఁ గుందు ♦ సొమ్మలు వోవున్.

మంత్రులు పిలువ రావణుఁడు కొలువుకూటంబునకుఁ బోవుట.

సీ. అంతలో ద్వారపా♦లాధ్యక్షుఁ డరుదెంచి, హస్తముల్ జోడించి ♦ యార్యపుత్ర!
జయ మగు నంచు నా♦శాస్యముల్ వచియించి, దేవ! ప్రహస్తుండు ♦ తావకీన
దర్శనకాంక్షి యై ♦ తక్కినసచివవ,ర్గంబుతో వాకిటఁ ♦ గాచినాఁడు
తనరాక యెఱిఁగింపు ♦ మనిన వచ్చితి రాజ, వైననీవే చేయ ♦ నర్హ మైన

ఆ. యది యవశ్యకార్య ♦ మైనది గలదు వి,జయము చేయు మన్న ♦ సత్వరముగఁ
బంక్తిముఖుఁ డశోక♦వని వీడి రాముసు,ద్యమము నెఱిఁగి సభకు ♦ నరిగి యందు.

కం. వలసినకార్యముఁ గూరిచి, తలపోయుచు నుండె; నిందు ♦ దశకంఠుఁడు త
త్తలమున్ వీడిన యంతన, తిలకింపఁగ శిరము ధను వ♦దృశ్యము లయ్యెన్. ౧౯౯

మ. అట రక్షోధిపుఁ డెల్ల కార్యములఁ బ♦ర్యాలోచనం జల్పి యు
త్కటసేనానుల నంతికస్థుల కనుం ♦ గాలార్హమావాక్కులన్
స్ఫుటకోణాహతి భేరినాదముల ర♦క్షోవాహినీపాళి ను
ద్భటయుద్ధోద్యమ మొప్పఁ గూర్పఁ దగుఁ; జె♦ప్పం బోకుఁడీ హేతువున్.[1] ౨౦౦

కం. వారును వల్లె యటంచును, వారలసైన్యంబు లెల్ల ♦ వలనుగ నొకచోఁ
గూరిచి తెలిపిరి వెస నా,తీరు రణోత్సాహి యైన♦దివిజరిపునకున్. ౨౦౧

సరమ సీతాదేవిని సమాధానపఱుచుట.

సీ. రావణాదిష్ట యై ♦ రక్షించు సరమ యన్, చాన దృఢవ్రత ♦ సదయశీల
తనకు నెచ్చెలి యయి ♦ తనకాచు చున్నట్టి,సీత వంచిత యయి ♦ జాతదుఃఖ
మునఁ జాలఁ దపియించి♦ముగుద విసంజ్ఞ యై,పుడమి ధూళిని బ్రుంగి♦బడబ యనఁగ
నుండుటఁ గనుఁగొని ♦ యొద్దకుఁ జని మృదు,వాక్యసంతతుల నా♦శ్వాసపఱిచి

తే. చెలిమిబలమున సువ్రత ♦ పలుకు నిట్టు, లూఱడిల్లుము జానకీ! ♦ యూఱడిల్లు
మాయలాఁ డగురావణు♦మాటఁ బట్టి, వగచె దేటికిఁ దపియింప♦వలదు వలదు.

ఉ. రావణుఁ డిప్పు డీవు బెద♦రన్ వచియించినరీతి నాపయిన్
నీవును నుత్తరం బిడుట ♦ నే గగనాంగణలీనగాత్ర నై
రావణభీతి డీల్పడక ♦ రాజముఖీ సకలంబు వింటి, నా
జీవితమందు నేన్ బ్రియము ♦ సేయను నీకొఱ కబ్జలోచనా. ౨౦౩

[1] రావణాసురుని యుద్ధభటులకు యుద్ధకారణమేమో తెలియదు. ఈ దుర్వృత్తి యిప్పటి ప్రభువులయందును గననగునుగదా! సత్యముఁ జెప్పిన నన్యాయయుద్ధము భటులు చేయరని భయము.

ఆ. అసురనాథుఁ డిప్పు ♦ డదరున బెదరున, నాదబాద చనిన ♦ యట్టివిధము
నేను వెలికి నరిగి ♦ నిక్కంబె టెఱింగితి, వినఁగదమ్మ! సీత ♦ విశదముగను. ౨౦౪

ఉ. అమ్మరో! నిద్రపోవ విది ♦ తాత్ముని రాముని హింస సేయ శ
క్యమ్మును గాదు,[1] నీదువిభుఁ ♦ డంతము నొందఁడు, పాదపాయుధుల్
నెమ్మది నున్నవారలు వ ♦ నేచరు లందఱు, వారి నొంప సా
ధ్యమ్మును గాదు వేల్పులు బ ♦ లారివలెన్ రఘురాముఁ డోమఁగన్. ౨౦౫

సీ. వెడఁదవక్షమువాఁడు ♦ నిడుద వక్త్రుఁడయు నై, తవణిల్లుపీనబా ♦ హువులవాఁడు
శౌర్యంబుగలవాఁడు ♦ సతతంబుఁ దన్నును, దనయాశ్రితులఁ బ్రోవఁ ♦ దనరువాఁడు
ధర్మచింతగలాఁడు ♦ ధరణివిఖ్యాతుండు, డంబుమీఱినకార్మ ♦ కంబువాఁడు
సంహననమువాఁడు ♦ చారుసౌందర్యలక్ష్మీనిధానం బయి ♦ చెలఁగువాఁడు

తే. బంధురం బైనవో ♦ ప్రతా ♦ పంబువాఁడు, నీతిశాస్త్రవిదుం డన ♦ నెగడువాఁడు
సోదరుని లక్ష్మణునిఁ గూడి ♦ యొప్పు నాఁడు, యువతి నీభర్త కుశలి ♦ యై యున్నవాఁడు.

కం. సీతా! శాత్రవసేనా, వ్రాతనికారణుఁ డచింత్య ♦ బలపౌరుషవి
ఖ్యాతుఁ డజయ్యుఁడు శ్రీసము, పేతుఁడు రాముండు కాఁడు ♦ హింసితుఁ డబలా!

తే. తెలివిమాలినపనులను ♦ జలుపువాఁడు, నఖిలభూతంబులకుఁ బగ ♦ యైనవాఁడు
మాయలను జక్క నెఱఁగిన ♦ మాయలాఁడు, క్రూరకర్ముండు నిన్నింత ♦ కుటిల పఱిచె.

కం. పోయెను దుఃఖము లన్నియు, దాయఁగ నున్నయది శుభము ♦ తరుణీ నిన్నుఁ గ
జే యని భజింప సిరి విచ్చేయును ముత్కరముఁ బ్రియముఁ ♦ జెప్పెద వినుమీ.

సీతాదేవికి సరమ యుద్ధసన్నాహముఁ దెలుపుట.

సీ. వారిధిదాఁటి నీ ♦ పతి కీశసేనతో, దక్షిణతీరంబు ♦ దఱిసినాఁడు
జలధితీరస్థ మా ♦ శైలాటసేనచేఁ బరిరక్షితుం డయి ♦ ప్రబలినాఁడు
పూర్ణార్థుఁ డగురఘు ♦ పుంగవుఁ గన్నారఁ, గంటిఁ దమ్మునితోడఁ ♦ గ్రాలినాఁడు
రావణప్రేరిత ♦ రాక్షసుల్ లఘుపరాక్రము లకూపారంబు ♦ రాఘవుండు

ఆ. దాఁటినాఁ డటంచుఁ ♦ దద్వార్తఁ దెలిపిరి, దానఁ జుమ్మ వీఁడు ♦ దశముఖుండు
మంత్రిజనముతోడ ♦ మంతనం బున్నాఁ డ, టంచుఁ జెప్పుచుండు ♦ నంతలోన.

కం. వినఁబడియె రణోద్యోగం, బునఁ దనరినసైన్యసంఘ ♦ ములభైరవని
స్స్వనముల్ దండాహతసం, జనితమహాభేరికాని ♦ చయరావంబుల్. ౨౦౬

కం. గురునిర్ఘోషము వినుచుమ, ధురభాషిణి సరమ సీత ♦ తో ననుఁ బిఱికి
పరఁగెడి నల్లదె వింటివె, సరభసముగ నెసఁగుసమర ♦ సన్నాహంబుల్. ౨౦౭

ఉ. తోయదగర్జతోడఁ దుల ♦ దూఁగు గభీరపుభేరికారవం
బాయత మయ్యె గర్జితగ ♦ జాళుల సజ్జనసేయువారు తే

[1] కౌసల్య కట్టిన రక్షచేతను విశ్వామిత్రుఁ డుపదేశించిన బలాతిబలలను విద్యలచేతను రామునికిఁ బ్రమాదమందును గీడు కలుగఁజాలదు.

ర్లాయితముల్ తురంగనిచ♦యంబులఁ బూన్చుచు నున్నవారు జా
తీయహయాళి నెక్కి చను♦దెంచిరి రౌతులు ప్రాసహస్తులై. ౨౧౩

కం. అట నటఁ బాదాతికు లగు, భటు లుద్భటవృత్తి మూఁగు♦వారలు చుమ యు
త్కటవర్మన సేనలతోఁ, బటునదములతోడ; రాచ♦బాటలు పురిలోన్ ౨౧౪

ఉ. నీరధి వారిపూరముల ♦ నిండినభంగిని నిండి యున్న;వో
చారుసతీ! ఖగద్ధగిత♦శస్త్రములున్ దృఢచర్మవర్మముల్
వారణఘోటకాళి రథ♦వర్గము రాక్షసవీరపాళు లెం
తేరహిఁ బూనుభూషలు న♦వే దివి నించె ననేకకాంతులన్. ౨౧౫

కం. నడువేసంగిని నెండిన, యడవుల దహియించుకారు♦టగ్గి యనంగా
దడముల దట్టపుఁదేజు ని, బిడమై యొప్పారె నిపుడు ♦ బిసరుహనేత్రా! ౨౧౬

సీ. విన వమ్మ! ఘంటల♦వివిధఘణంఘణల్, రథములదబదబల్ ♦ రమణి వినుము
ఆలకింపఁగదమ్మ ♦ హయముల హేషల, నాలింప వమ్మ తూ♦ర్యారవంబు
లది యుద్యతాయుధ♦హస్తుల రాక్షసేం, ద్రానుయాయుల రోమ♦హర్షమైన
సంభ్రమం బగుఁ జుమ్ము ♦ సంతాపపడకమ్మ, వ్యసననాశిని యైన♦హర్షలక్ష్మి

తే. చేరు నిను రాక్షసాళికిఁ ♦ జేటు గలుగు, విజితరోషుండు నవిచింత్య♦విక్రముండు
సారసాక్షుండు నిర్జర♦స్వామిసముఁడు, రావణు వధించి నిన్నేలు ♦ నీవిభుండు.

కం. బాసట[1] గాఁగ నుపేంద్రుఁడు, వాసవుఁ డరివధము సేయు♦వడువునను సుమి
త్రాసుతయుతుఁడై నీపతి, యాసురసైన్యముల నెల్ల ♦ హతముం జేయున్. ౨౧౭

సీ. చూడక పోదునా ♦ సుందరీ! జితవైరి, నీపతికుఱువున ♦ నీవు గులుక
విడువక పోదువా ♦ వెలఁది! కాంతునిఁ గ్రుచ్చి, కౌఁగిట ముద్బాష్ప♦కణము లెదను
బతి చిక్కుదీయునే ♦ పదము లంటెడునిన్ని, నెలలుగఁ బెనఁ గొన్న ♦ నీదుజడను
బాయకయుందువా ♦ పాముకుబుసముఁ నాఁ, బతిఁ జంద్రముఖుఁ జూచి♦వ్యసన మెల్ల

తే. రావణానురుఁ దూర్ణంబ ♦ రామచంద్రుఁ, డనిని వధియించి ప్రియురాల ♦ వైసనిన్నుఁ
గదిసి సౌఖ్యార్థుఁ డెల్లభో♦గములఁ దేలు, సంతసింపఁగదమ్మ యో♦జానకమ్మ! ౨౧౮

కం. కారునను వాన గురిసిన, నారబములఁ[2] గూడి పుడమి ♦ యలరెడిమాడ్కిన్
వీరుండు మహాత్ముం డగు, నీరమణునిఁ గూడి కనెదు ♦ నిండుముదంబున్. ౨౨౦

కం. కావా[3] తిరుగుహాయం బనఁ, గా విబుధాలయముఁ జుట్టు ♦ కరుణ జగత్సౌ
ఖ్యావహుఁ డగునీవేలుపు, వేవెలుఁగున్ శరణుఁ జొరుమ ♦ విశ్వాత్మకునిన్. ౨౨౧

సీతాదేవి సరమను రావణుమనోనిశ్చయం బెఱింగి రమ్మనుట.

కం. సూరకర[4] తప్తమహి నా, సారంబున శాంతి పఱుచు♦చద లనఁగను ర
క్షోరాణ్మోహిత దుఃఖవి, చారను సంతోషపఱిచి ♦ సఖ్యము పేర్మిన్ ౨౨౨

[1] బాసట = సహాయుఁడు. [2] ఆరబములు = పైరులు. [3] కావా = చక్రాకారము. [4] సూరకర = సూర్యకిరణములచే.

కం. కాలజ్ఞ సరమ స్మితపూ,ర్వాలాప వచించె నేరి ♦ కగపడకుండన్
బాలా! నీసేమము వా,క్యాళియు రామునకుఁ దెల్పి ♦ యరుదే నేర్తున్. ౨౨౩

కం. అంబరమున నేను నిరా,లంబగతిం జనెడివేళ ♦ లలన! యెయిద[1]శ
క్యం బెట్టుగాదు పత్త్రర,థంబుల యేలికకు నే స♦దాగతి కైనన్. ౨౨౪

ఉ. తియ్యఁదనంబు దోఁప సుద♦తీమణి శోకముఁ బాచి నెయ్యపుం
దొయ్యలిఁ బల్కె, నే నెఱుఁగు♦దున్ గగనంబు రసాతలంబు నేన్
డొయ్యక పోయి రాఁగలవు ♦ నాదునిమిత్త మసాధ్యకార్య మేన్
జయ్యనఁ జేయఁగాఁ గలవు ♦ సాధుమతీ! విను మొక్క కోరికన్. ౨౨౫

ఉ. నీవును మత్ప్రియార్థమున ♦ నిశ్చలచిత్తవ యేని నెచ్చెలీ
రావణుఁ డేమి చేసెడినొ ♦ క్రచ్చఱఁ బోయి యెఱింగి రమ్ము మా
యావి దయావిహీనుఁడు దు♦రాత్ముఁడు శాత్రవరావణుం డయో
త్రావినమాత్ర వారుణివి♦ధంబుగ నన్నటు మోహ పెట్టెఁగా.[2] ౨౨౬

సీ. కావలి యున్నరా♦కాసిమూఁకలు నన్ను, నదరింప బెదరింప ♦ నడలుదాన
నేవేళ కేమేమి ♦ గావించునో యను,సందేహపాటున ♦ గ్రుందుదాన
మనమున స్వాస్థ్యమున్ ♦ మాట లేద యశోక,వని నుంటఁ దద్భీతి ♦ వనరుదాన
వానిచరిత్రంబు ♦ వానినిశ్చయమును, నెఱుఁగరా దొకయింత♦యేని చాన

తే. కాన వానివిధంబును ♦ గరుణ నెఱిఁగి, వచ్చి చెప్పుము నా కదే ♦ సచ్చరిత్ర
పరమ మగునుపకృతి యన ♦ సరమ జవర,నుడుల నూరార్చి కన్నీళ్లు♦తుడిచి పలుకు.

కం. ఇది యేని నీదుకోరిక, యిదె పోయి విరోధిచిత్త ♦ మెఱిఁగి జవమునన్
సుదతీ! క్రమ్మఱుదానను, ముదితమనంబునను జెలఁగు ♦ ముగుదా! నీవున్. ౨౨౭

సరమ సీతాదేవికి రావణునిశ్చయం బెఱింగించుట.

కం. అని రావణు డాయం జని, విని యా కావరుఁ డమాత్య♦బృందముతో వా
దొనువిధము వానినిశ్చయ,మును దెలిసి యశోక వనికి ♦ మూర్తములోనన్. ౨౨౮

ఉ. క్రమ్మఱి భ్రష్టపద్మ రమ♦కైవడి నై తనరాక వేచు నా
కొమ్మను డాయ సీతయును ♦ గూరిమిఁ గౌఁగిటఁ గ్రుచ్చి తాన పీ
ఠమ్ము నొసంగి పల్కె నిచ♦టన్ శ్రమ మాఱ సుఖోపవిష్ట వై
యమ్మొఱ కైనకూళహృద♦యంబువిధంబు వచింపు సర్వమున్. ౨౩౦

కం. అని వణఁకుచు నడిగినయా,జనకాత్మజతోడ సరమ ♦ సచివాన్వితుఁ డై
దనుజేంద్రుఁడు చేసినయో,జనను యథార్థముగ నిట్లు ♦ సకలముఁ జెప్పెన్. ౨౩౧

సీ. రాజాస్య! వినవమ్మ ♦ రావణుతల్లియు,మఱియు నవిద్ధుఁ డ♦న్మంత్రివృద్ధు
శ్రీరామవిభునకు ♦ సీత నిమ్మంచును, బలువిధముల బోధ♦పఱిచి రమ్మ

[1] ఎయిదన్ = ఎదుగుటకు. [2] రామునకు సందేశ మంప నొల్లక, సరమ చనవు చెడకుండఁ జెప్పినపని యిది.

యలజనస్థానమం ♦ దైనయద్భుతము దృష్టాంతంబుగాఁ గొని♦యాడి రమ్య
యంబుధి లంఘించి ♦ హనుమ వచ్చుట నిట, నినుఁ గంట నసురుల♦నిహతి సేఁత
తే. మదిని దలపోయ మానవ♦మాత్రుఁ డైన
వాఁడు గావించుపను లౌనె ♦ వలదె తలఁప?
ననుచు బోధింప ధనకామి ♦ ధనముఁబోలె
నిన్ను విడునంగ నొల్లఁడు ♦ నిర్జరారి. ౨౩౨
ఉ. ముక్కున నూర్పు గల్గ నల♦మూర్ఖుఁడు నిన్విడువంగఁ బోఁడు, దర్
ద్రక్కొనుమృత్యులోభమున ♦ నిశ్చిత మయ్యెను వానిబుద్ధి, వాఁ
డుక్కఱి యీబిభీషికల ♦ కోతరుణీ! బెదరందు, దానునున్
రక్కసు లీల్గుదాఁక నిను ♦ రాముని కప్పన సేయ నేరఁడున్. ౨౩౩
ఉ. మానిని! రాక్షసేంద్రు శిత♦మార్గణపంక్తిని గూల్చి నిన్నయో
ధ్యానగరంబుఁ దోడుకొని ♦ తప్పక పోవును నీవిభుండు, లో
మానుమి శంక యంచు సర♦మాసతి పల్కుచు నుండునంతలో
వానరశంఖభేరులర♦వంబులు ధారిణి దద్దఱిల్లఁగన్ ౨౩౪
కం విన రా లంకాపురమున, మనుజాశనులెల్ల భీత♦మానసముల వి
న్ననిమోముల నుసుఱుల పై, మనుజాధిపుదోషమునను ♦ మానిరి యాశల్. ౨౩౫

⟵ మాల్యవంతుఁడు సీతాదేవి నిమ్మని రావణునకు నీతిబోధించుట. ⟶

తే. శంఖభేరీనినాదముల్ ♦ సాంద్రముగను, బరపురంజయుఁ డగురామ♦భద్రుఁ డేగు
దేరఁ దన్నాద మాలించి ♦ దివిజవైరి, ధ్యానతత్పరుఁ డయి ముహూ♦ర్తంబొకండు.
ఉ. అందఱ మంత్రులం గని మ♦హానినదంబునఁ గ్రూరుఁడున్ జగ
ద్బృందమనోవ్యథాకరుఁడు ♦ దిట్టుచుఁ గేకలు వేసి పల్కె మీ
రందఱు సైన్యయుక్తుఁ డయి ♦ యంబునిధిం దరియించి భూమిభృ
న్నందనుఁ డేగుదెంచె నని♦నం జూఁడి నేఁ జెవిఁ దూఱఁబెట్టితిన్. ౨౩౬
చం. ధరణిను తామనోహరుని♦దర్పము విన్కలి మౌన మూని యొం
డొరుల మొగంబుఁ జూచుకొను ♦ చున్నను మీరలు సంగరంబునం
దరు దగుసత్యవిక్రము ల♦టంచు నెఱుంగుదు, మిమ్ము నమ్మి కా
యరగలి లేక యెంతటిమ♦హాకృతి నేనియు నిర్వహించితిన్. ౨౩౭
కం. అని రావణుఁ డాడినఁ ద,జ్జననికిఁ బినతండ్రి యతుల♦సంవిద్ఘనుఁ డి
ట్లని పల్కె మాల్యవంతుం, డనురాక్షసవరుఁడు సనయ ♦ మగుమార్గమునన్.
తే. నృపతి ధర్మ మెఱింగించు♦నీతివిద్య,లందుఁ బండితుఁ డయి నయ ♦ మనుసరించు
వాఁడు చిరకాల మేలు నై♦శ్వర్యయుక్తి, వైరివర్గంబు నెల్ల స్వ♦వశముఁ జేయు.

కం. సమయోచితముగ నరివర్గముతోఁ గావింపవలయు ♦ గణమును సంధిన్
శమితామర! యది తనపక్షము వృద్ధిం జేసి మిగుల ♦ సంపదఁ గూర్చున్. ౨౪౧

కం. తనబలము తఱుఁగు చున్నను, దనతో సముఁడైన సంధి ♦ తగు శత్రువుతోఁ
దనబలము పెరుఁగు చున్నను, జన దాలము సేయఁ బగఱ ♦ సంగరమె తగున్.

చం. నయవిధ మిద్ది గాన రఘు ♦ నాయకుతోఁ దగు సంధి యిప్డు, నీ
కయ[1] మది, నీకు రామునకు ♦ నయ్యె విరోధము సీతఁ దెచ్చుటన్,
రయమున నామె నిమ్ము రఘు ♦ రామునకుం, బగ దీఱు, నంతతో
భయము దొలంగి నీవు నిర ♦ పాయసుఖస్థితి నుండఁ గల్గెడిన్. ౨౪౩

కం. దేవర్షులు గంధర్వులు, నేవానికి జయము గల్గ ♦ నిచ్చఁ దలఁతురో
యావసుధాపతితో నేలా వైరము సంధి సేయ ♦ నర్హము నీకున్. ౨౪౪

సీ. రెండుపక్షంబులు ♦ సృజియించె జగతిపై, ధాత ధర్మంబు న ♦ ధర్మ మనఁగ
నమరులు మహితాత్ము ♦ లాశ్రయించిరి ధర్మ, మసుర లధర్మంబు ♦ నాశ్రయింత్రు
ధర్మ మేవేళ న ♦ ధర్మంబు మ్రింగునో, యదియ చూ కృతయుగ ♦ మనఁగఁ బడును
ధర్మ మేవేళ న ♦ ధర్మంబుచేఁ జెడు, నదియ పో కలికాల ♦ మనఁగఁబడెడి

తే. జగములను నీవు చరియించు ♦ సమయములను[2]
నేపుమెయి ధర్మ మెల్లను ♦ నూపు మాపి
సంగ్రహించి తధర్మంబు ♦ సరకు లేక[3]
దాన మనకంటె బలులైరి ♦ కానివారు.[4] ౨౪౫

ఉ. మానక నీ వధర్మము ప్ర ♦ మాదమునై నభివృద్ధి చేసి త
ద్దాన నదే గ్రసించెడిని ♦ దానవనాయక యస్మదాదులన్,
మానుగ నయ్యదే విబుధ ♦ మండలిపక్షము వృద్ధిచేసెడిన్,
బూనుట ధర్మమున్ మనుజ ♦ పుంగవుఁడున్ బుధపక్షపాతి యా. ౨౪౬

సీ. విషయసక్తుండవై ♦ ఋషులకన్యలఁబట్టి, యే మేమొ చేసితి ♦ వెఱుకమాలి
వహ్నికల్పులు ఋషి ♦ వర్యుల కద్దాన, నుద్వేగ మమితమై ♦ యుద్భవిల్లె
మండు చుండెడివహ్ని ♦ మాడ్కినిఁ దపము పెంపున దురాధర్షు లా ♦ పుణ్యమునులు
భూరితపంబునఁ ♦ బూతచిత్తులు వారు, ధర్మాభివృద్ధి నా ♦ స్థను గలారు

తే. ఆద్విజాతులు ముఖ్యంబు ♦ లైనయజ్ఞములను గావించి వేల్చు చ ♦ గ్నులను శాస్త్ర
చోదితం బగుపద్ధతి ♦ వేదరవము, నింపెదరు రక్కసులను లె ♦ క్కింప కెదను. ౨౪౭

తే. ఉబ్బు జాఱిన వేసంగి ♦ మబ్బులట్లు, రక్కసులు పాఱుచున్నారు ♦ దిక్కులకును
వారిముంగల వహ్నిసం ♦ భవములైన, పొగలు పదిదిక్కులందును ♦ బగటు మీఱె.

[1] అయము = మేలిచ్చునది. [2] దిగ్విజయవేళ. [3] పరస్త్రీలను జెఱుచుటచేత. [4] కృతయుగమున కంటెఁ గలియుగము దుర్బలము కావునఁ గలిధర్మమాశ్రయించిన నీవు కృతయుగధర్మ మాశ్రయించిన రామునిచేఁ జెడుదువని భావము.

కం. ఆపోగతాఁకునఁ దేజము, రూపఱె రక్కసులగమికి ♦ దూఁకుమున మునుల్
పాపాపహతలములఁ దప, మేపునఁ గావింప నదియ ♦ యేఁచె నసురులన్. ౭౪౯

ఉ. దానవయక్షరాక్షసబు♦ధప్రకరంబులచే వినాశముఁ
గానక యుండఁగా వరము ♦ గల్గెను నీ కిపు డాహవార్థ మై
మానవవానరాచ్ఛము ల♦మానుషశౌర్యము లుల్లసిల్ల లం
కానగరంబు ముట్టెను, నిఁ♦కం గలకార్యము నూహ సేయుమీ. ౭౫౦

ఉ. ఈతఱి నుప్పరంబున మ♦హిన్ జనియించెడిదారుణంబు లు
త్పాతము లెల్లఁ గాంచినను ♦ దప్పక నాశముఁ జెందు రాక్షస
వ్రాత మటంచుఁ దోఁచెడి, ఖ♦రస్తనితంబులు ఘోరమేఘముల్
భీతికరంబులై కురిసె ♦ వెచ్చనినెత్తురు లంక నెల్లెడన్. ౭౫౧

సీ. కన్నీరు గార్చె శో♦కమున వాహనములు, ధ్వజములు ధ్వస్తముల్ ♦ వన్నెఁ బాసె
లంకలో గుమిగూడి ♦ కంకగోమాయుగృ,ధ్రంబులు భైరవా♦రవము నించెఁ
బూతనాదులు క్షుద్ర♦భూతముల్ రాత్రుల,గృహవస్తుతతుల సం♦గ్రహము చేసి
మగువలకలలలో ♦ నగపడి తెల్లని,దంతముల్ వెలిదోఁపఁ ♦ దగవు లాడి

ఆ. యపహసించు చున్న♦యవి బలిపిండముల్, కుక్క లిండ్లఁ దూఱి♦మెక్కఁ దొడఁగె
రాసభముల నాలు[1] ♦ ప్రసవించెఁ దిరిగెడి, ముంగిసలను గూడి♦ మూషికములు.

సీ. పిల్లులు పులులతో ♦ విహరించు చున్నవి,కుక్కలు పందులు ♦ గూడి తిరిగెఁ
గిన్నరరాక్షసు♦లు న్నరు లొక్కటైరి, పావురంబులు రక్త♦పాదములును
దెల్లనిమేను లై ♦ తెలిపెడి రాక్షస,పాళులకు వినాశ♦కాల మనుచుఁ
బెంపుడుశారికల్ ♦ వేశ్మంబులందు వీ,చీకూచి యని రొద ♦ సేయఁ దొడఁగెఁ

తే. బూర్వనిర్జితములు మృగ♦ములును బక్షు,లుద్దవిడి వెండి మూఁగెడి ♦ యుద్ధమునకు
మృగములును బక్షిసంఘముల్ ♦ మేర దప్పి, రాజ! వాపోవు చున్నవి ♦ రవిని జూచి.

ఆ. మిట్టపండ్లవాఁడు ♦ మిడిగ్రుడ్లవాఁడును, నొఱవమేనివాఁడు ♦ కఱకువాఁడు
బోడినెత్తివాఁడు ♦ పొంచి కన్పున్నాఁడు, వేళ వేళఁ దూఱి ♦ కాలుఁ డిండ్ల. ౭౫౪

కం. ఇట్టివి యుత్పాతంబులు, పుట్టుచు నున్నయవి గాన ♦ బుద్ధిఁ దలఁచి యి
ప్పట్టునఁ జెట్టలు పుట్టని, యట్టిపనుల్ చేయ నీకు ♦ నర్హ మటంచున్. ౭౫౫

కం. ఉత్తమసచివాగ్రణులం, దుత్తమపౌరుషధనుండు ♦ నొగిఁ జెప్పియుఁ ద
చ్చిత్తము శోధించియు నది, మెత్తనపడకున్నఁ జూచి ♦ మిన్నక యుండెన్. ౭౫౬

రావణుఁడు మాల్యవంతుని ధిక్కరించుట.

చం. అన విని కాలకింకరవ♦శాత్మకుఁ డౌటను మాల్యవంతునీ
తిని హితబోధముఁ వినక ♦ దేవవిరోధి సరోషచిత్తుఁడై

[1] రాసభములన్ = గాడిదలను. ఆలు = ఆవులు.

కనుఁగవకెంపు బొమ్మముడి ♦ కన్బడ గ్రుడ్లను ద్రిప్పు చాతనిన్
గని వచియించు దుష్టమతి ♦ కండలత్రొవ్వెన నెల్లరున్ వినన్. ౨౫౭

కం. హితమత మని యే మని యీ, గతిఁ బరుషము లహితమ ములగు ♦ కాఱులు ప్రేలన్
మతి గల్గె? వైరిపక్షవి, జితుఁడవు నేఁ జొరఁగ నీను ♦ జెవి నీమాటల్. ౨౫౮

ఉ. ఏ మని తుచ్ఛమానవుని ♦ హీనబలుం గృపణున్ దరిద్రు శా
ఖామృగసంచయాశ్రయు బి ♦ కారిగఁ దండ్రియ వెళ్లఁ గొట్టఁగా
దీనసమేది కానలను ♦ ద్రిమ్మరునొంటరి కాని రాము నెం
తో మెఱమెచ్చు లాడెదవు ♦ దొడ్డసమర్థత యేమి గంటివో. ౨౫౯

కం. ఏ మనుచు రాక్షసేశ్వరు, సామరగంధర్వజనభ ♦ యంకరు సర్వో
ద్దామపరాక్రమసంయుతు, నీమదిఁ గడుహీనుఁగా గ ♦ ణించితి చెపుమా. ౨౬౦

కం. కనుకుట్టుందనమో యరి, జనతా ప్రోత్సాహవిధమొ ♦ శంకింతు ద్విష
జ్జనపక్షపాతమో నీ, యనుటకుఁ బరుషోక్తి నన్ను ♦ నగుఁ గారణముల్. ౨౬౧

కం. అరిప్రోత్సాహము లేకయె, పరశాస్త్రాభిజ్ఞుఁ డైన ♦ పండితుఁ డెవఁ డీ
కరణిని బ్రభావయుతుఁ డగు, పరిపక్వమనస్కునిన్ నృ ♦ పాలుం బలుకున్. ౨౬౨

కం. తామరసహీనరమఁ[1] బోల్, భూమిజ వనిఁ[2] దెచ్చి యేమి ♦ మునిఁగెన టంచున్
రామునకు బెదరికొని నేఁ, గామితమును దీర్చికొనక ♦ క్రమ్మఱ నిత్తున్. ౨౬౩

శా. నీవే చూడఁగలాఁడ వావనచరా ♦ న్వీతున్ ససౌమిత్రిసు
గ్రీవున్ రాముని సంగరక్షితిని నే ♦ గృధ్రాళిపా ల్సేయుఁగా
నేవీరాగ్రణి ద్వంద్వసంగరమునన్ ♦ బృందారకుల్ డాయ లే
రావీరాగ్రణి రావణుం డదరునే ♦ యాయోధనక్రీడకున్. ౨౬౪

కం. ఏవానికి నే లొంగను, జే వఱ నను రెండు గాఁగఁ ♦ జీల్చిన; మత్స్వా
భావికదోషం బిదియు స్వ, భావము దురతిక్రమంబు ♦ పాయం దరమే. ౨౬౫

ఉ. తోయధి సేతునిర్మితిని ♦ దొడ్డగ నాడెద వేల? కాకతా
ళీయ మ దేమి యచ్చెరువు ♦ లెక్కగఁ జెప్పెదు బీతుఁ గొంచె? వి
స్మీ యలరామభద్రుఁడు వ ♦ నేచరయుక్తిని నిందు వచ్చియున్
గాయముతోడ వెండియును ♦ గ్రమ్మఱు నే విను బాస చేసెదన్.[3] ౨౬౬

కం. అని గర్వంబునఁ బలికిన, విని దశకంఠుండు కోప ♦ వివశుం డనుచున్
మనమునఁ దలంచి లజ్జా, వనతశిరంబునను మాల్య ♦ వంతుం డుండెన్. ౨౬౭

తే. అవల నమ్మాల్యవంతుఁడు ♦ నాజ్ఞ గాంచి
జయము వచియించి వీటికిఁ ♦ జనియె నంత
రావణుఁడు మంత్రివర్గంబు ♦ తో విమర్శ
సలిపి కాపుంచె లంకలో ♦ సకలదిశల. ౨౬౮

[1] ఆశ్రయములేని సితనని భావము. [2] వనిన్ = అడవినుండి. [3] క్రమ్మఱు = (1) మరలిపోవు నని నేను బాసచేసెదను. (2) క్రమ్మఱిపోఁగలఁడా యని యొక యర్థము.

## రావణుఁడు పురద్వారంబులఁ గాపుంచుట.

సీ. తూరుపుదెసఁ బుర♦ద్వారంబుఁ గావఁబ్ర,శస్తశౌర్యాఢ్యుఁ బ్ర♦హస్తు నిలిపి
దక్షిణమున మహో♦దరమహాపార్శ్వులఁ, బడమటిగవనిని ♦ బహుళమాయు
సాంద్రసేనావృతు ♦ నింద్రజిత్తును నిల్పి, సారణు శుకుని వై♦శ్రవణుదెసకుఁ
బనిచి యూదిక్కు తా ♦ స్వయముగ రక్షింతు, నని చెప్పి గుల్మంబు♦నందు భూరి
తే. బలముతోడ విరూపాక్షు ♦ నిలిపి యిట్లు, లంక నల్గడఁ గడుఁబది♦లంబుగాఁగఁ
దగువిధానంబుఁ గావించి ♦ దశముఖుండు, తలఁచె ధన్యుఁడ నని విధి♦బలముపేర్మి.
తే. కెలసములు[1] వారి వారికిఁ ♦ బలికి యిట్లు, వారి నెల్లరఁ బోవంగఁ ♦ బనిచి తాను
నఖిలసంపత్సమృద్ధ మా♦నంతిపురికిఁ, జనియె నాశీస్సు పలుకంగ ♦ సచివచయము.

## శ్రీరామునకు విభీషణుఁడు రావణసేనాసన్నాహంబువిధంబుఁ దెల్పుట.

సీ. నరలోకభర్త వా♦నరలోకభర్తయుఁ, బావమానియు జాంబ♦వంతుఁ డంగ
దుండు మైందద్వివి♦దులు మఱి లక్ష్మణుం,డును సుషేణవిభీష♦ణులును గజుఁడు
నలకుముదులును బ♦నసగవాక్షులుఁ గూడి, కార్య మాలోచింపఁ♦గడఁగి రప్పు
డసురేంద్రపాలితం ♦ బైన యాలంక యి,దే దుర్జయం బని ♦ దేవతాహి
తే. యక్షగంధర్వతతి కైన ♦ రాక్షసాధి
నేత రావణుఁ డిందు స♦న్నిహితుఁ డెపుడు
కాన కార్యంబు సిద్ధి కాఁ♦గల తెఱంగు
నిపుణమతిఁ జూడఁ దగు నంచుఁ ♦ గపిచయంబు ౨౨౦
తే. అనుడు నగ్రామ్యపదవంత ♦ మగుచుఁ బుష్క
లార్థ మగువాక్యముల రావ♦ణానుజుండు
పలుకు ననలుండు శరభుండు ♦ ప్రఘసుఁ డతుల
మతులు సంపాతి యనెడి నా♦మంత్రివరులు. ౨౨౧
సీ. పక్షివేషంబులఁ ♦ బరిపంథిపురిఁ జొచ్చి, దళముల విహితవి♦ధానములను
బరికించి వచ్చిరి ♦ పలికెద శ్రీరామ, వారలు చెప్పిన♦తీరు వినుము
తూర్పు ప్రహస్తుండు ♦ దొడ్డబలంబుతో, గవనిని గావంగఁ ♦ గడఁగినాఁడు
దక్షిణంబును మహో♦దరమహాపార్శ్వులు, పడమట నింద్రజి ♦ కడిమి నిలిచెఁ
తే. బట్టిసాసిధనుశ్శూల♦పాణు లైన, శూరు లెందఱో యాతనిఁ ♦ జుట్టినారు
రావణుం డుత్తరంపుద్వా♦రంబు తాన, కాచువాఁ డయ్యె నాశర[2]♦కాండయుక్తి.
కం. శూలాయుధహస్తులు కర,వాలలసత్కరులు చాప♦పాణులు గొలువన్
జాల విరూపాక్షుఁడు పురిఁ,బాలించును గుల్మమధ్య♦పరిరక్షితుఁ డై. ౨౨౪

[1] కెలసము = పని. [2] ఆశరకాండము = రాక్షససమూహము.

సీ. ప్రతిపక్షసైన్యంబు ♦ పన్నినవిధ మిది, పురమున నొకవేయి ♦ కరులు రథము
లయుతంబు నశ్వంబు ♦ లయుతంబు రాక్షస,కోటియుఁ గలదు ని ♦ శాటులెల్ల
నాతతాయులు సంగ ♦ రావని శూరులు, పంక్తికంఠుని మెచ్చు ♦ వచ్చువార
లుగ్రులీ తెగలలో ♦ నొక్కొక్క దానికి, దశలక్ష పరివార ♦ దళము గల ద
తే.టంచుఁ జెప్పిరి మంత్రు ల ♦ టంచు వారి, మ్రోల నిల్పి మఱేఁ రఘు ♦ ముఖ్యుఁ బలుకు
విత్తపతి గెల్చె నఖువది ♦ వే లసురుల, నాత్మతుల్యులఁ గొని రావ ♦ణాసురుండు. ౭౭౬
కం.కినియకుము నీకు రోషం,బును గూర్పఁగ నిట్లు పలుకఁ ♦ బూనితి నీవుర్
ఘనుఁడవు సమర్థుఁడవు దుర,మున వేల్పుల నేని గెలుతు ♦ పురుశౌర్యమునన్.
కం.రామా! చతురంగ బల,స్తోమముతో శాత్రవులను ♦ దూలింపు మనన్
రాముఁడు యోజించి బలం, బీమెయి విభజించె రిపుల ♦ నెల్ల జయింపన్. ౭౭౭

## ←≻→ శ్రీరాముఁడు లంకాద్వారముల సేనల నిలుపుట. ←≺→

తే. తూర్పుగవనిని నీలుండు ♦ దొడ్డసేన
తోఁ బ్రహస్తునితో నని ♦ దొడరవలయు
దక్షిణపుదిక్కునన్ మహో ♦ దరుని వెండి
యును మహాపార్శ్వ నంగదుం ♦ డొప్పు గెలువ. ౭౭౮
తే. అప్రమేయబలుం డైన ♦ యాంజనేయుఁ, డమితసైన్యంబుతోఁ జని ♦ హరిహయారి
యుండుపశ్చిమదిక్కున ♦ గండు మీఱి, యహితపుటభేదనంబుఁ దా ♦ నఖుమవలయు.
సీ. మహితు లౌబుషులకు ♦ మఱి దానవాళికి, గుండెగాలం బైన ♦ దుండగీని
వరము మైఁ గండకా ♦ వరమును గలవానిఁ, బ్రజలెల్ల నల్లాడఁ ♦ బఱచు నీచు
హతుఁ జేయు వంతు నా ♦ యది గాన నతఁ డుండు,నుత్తరదిశను నే ♦ నుండువాఁడ
సౌమిత్రియుతుఁడ నై ♦ జాంబవంతుండు సు,గ్రీవవిభీషణుల్ ♦ ప్రోవవలయు
తే. మధ్యమంబును, వానరుల్ ♦ మనుజరూప
ములను దాల్పంగ రా దిది ♦ వలయు నియతి
యగచరసమూహమునకుఁ జి ♦ హ్నంబు దీనిఁ
దప్ప రా దెవ్వరైన నే ♦ తరుణమునను. ౭౮౦
కం.నేనును నాతమ్ముండును, నా నెచ్చెలి యసురరాజు ♦ నలువురు సచివుల్
మానవరూపంబుల నరి,సేనం బరిమార్పఁ గలము ♦ సిద్ధ మిది సుఁడీ. ౭౮౧
కం.అని సేనల నియమించియుఁ, దనకార్యము సిద్ధికొఱకు ♦ దశరథసుతుఁడున్
మనమునఁ దలఁచి సువేలా,వనిధరకూటంబు నెక్కఁ ♦ బత్తనముఁ గనన్. ౭౮౨

## ←≻→ శ్రీరాములు సుగ్రీవాదులతో సువేలాద్రి నెక్కుట. ←≺→

సీ. తనతోడ సౌమిత్రి ♦ చనుదేర సుగ్రీవు, ననురక్తు ధర్మజ్ఞు ♦ నఖిలమంత్ర
వేత్త విధిజ్ఞు వి ♦ భీషణుఁ గనుగొని, మధురసూక్తుల నిట్లు ♦ మందలించు

వివిధధాతుచితసు♦వేలాద్రిపై నెక్కి, యంద యీరాతిరి♦యంత గడపి
పఋువాతఁ జూతము ♦ వాని నాశమున కై, నాపత్నిఁ గొనిచన్న♦పాపచరితు
ఆ. నిలయు, మహెుు ూంత ♦ నీచుఁడో యాతఁడు, వంశ మైన సాధు♦వర్తనంబు
నైన ధర్మమైన ♦ నాత్మఁ దలంపక, జగము దిట్టుపనిని ♦ జలిపెఁ జెనఁటి. ౨౮౩
ఉ. ఆతనిపేరు విన్నఁ దను♦వంతయు మండెడి, నైన నొక్కఁడు
ఘాతునిమిత్త మై సకల♦రాక్షసులన్ వధియించు టెట్లొకో?
పాతకముం బొనర్చు యము♦పాశవశంగతుఁ డైనయొక్కఁ, డా
పాతకి నీచహేతువునఁ ♦ బా డగు నాతనివంశ మంతయున్. ౨౮౪
సీ. అని యిట్లు క్రోధవ♦శాత్ముఁడై పలుకుచు, మున్నుగ నెక్క రా♦ముండు గిరిని
నతులవిక్రమరతుం ♦ డైనసౌమిత్రియు, శరచాపహస్తుఁడై ♦ చనియె వెంట
నాతనివెన్నంటి ♦ హరిరాజు సామాత్యుఁ, డగువిభీషణుఁడును ♦ హనుమ వాలి
తనయనీలురును మైం♦దద్వివిదగజులు, గవయగవాక్షులు ♦ గంధమాద
తే. నుండు శరభుండు జాంబవం♦తుండు హరుఁడు, పనసరంభకుముదశత♦వలిసుషేణ
ఋషభదుర్ముఖు లాదిగ♦వృక్షచరులు, పెక్కు రెక్కిరి మారుత♦వేగు లపుడు. ౨౮౫
ఉ. అందఱు శైల మెక్కి దివి ♦ నంటినభంగిఁ ద్రికూటకూటమం
దందముమీఱి సాలనిచ♦యంబులు నుత్తమ మైనద్వారముల్
సందడి మీఱి రాత్రిచర♦సంఘములుం బొలుపొంద లంక వే
డ్కం దగఁ జూచి సాలగత♦కాలనిశాటులు వేఱుకోటనాన్ ౨౮౬
ఉ. కాంచిరి; కాంచి రక్కసులు ♦ కయ్యపుటెత్తున నుంటఁ జూచి గ
ర్జించిరి రామసన్నిధిని ♦ వృక్షచరుల్ వివిధస్వనంబులన్;
మించినరాగవర్ణమున ♦ నీరజబాంధవుఁ డస్తమించె; సం
ధించెను బూర్ణశీతకర♦దీప్తవిభావరియున్[1] మనోజ్ఞమై. ౨౮౭
కం. వృక్షచరాగ్రేసరుఁడును, రక్షోనాథుండు గొలువ ♦ రాముఁడు జాగ్ర
ల్లక్షణుఁ డగులక్ష్మణుతో, ఋక్షాదులు గొల్వ గిరిని ♦ రేయి వసించెన్. ౨౮౮

→ శ్రీరాముఁడు లక్ష్మణసుగ్రీవాదులతో లంకం జూచుట. ←

సీ. వేవినయంత న♦వ్వీరులు లంకలో, సమసౌమ్యరమ్యవి♦శాలదీర్ఘ
ముల నుపవనములఁ ♦ దిలకించి యబ్బుర,పోయి రందఱు దాని♦పొలుపునకును
సాలతాలతమాల♦చంపకాశోకవు,న్నాగనీపార్జున♦నాగమాల
పాటలార్జునసప్త♦పర్ణనీపావళీ,కర్ణికారతిలక♦కాండములను
తే. బుష్పితాగ్రలతావృత♦భూరుహముల, వింతకుసుమంబులను రక్త♦కాంతిమృదుల
పల్లవంబులఁ బచ్చిక♦పట్లగముల, నీలవనరాజులను గిరి ♦ నెమ్మిఁ గూర్చె. ౨౮౯

[1] సువేలారోహణము పున్నమనాఁడని కొందఱు; చతుర్దశినాఁడని కొందఱు; దివిటీల కాంతులచే నారాత్రి పున్నమవలె నుండెనని కొందఱు.

కం. మానవులు భూషణంబుల, మానుగ ధరియించురీతి ♦ భూజములు సుగం
ధానూనపుష్పఫలసం, తానంబులఁ దాల్చి చూడ్కి ♦ తనుపుం గూర్చెన్. ౨౯౦

కం. నందనచైత్రరథాభం, బిందిందరబృందనాద ♦ మింద్రియనికరా
నందం బై సర్వర్తుక, మందలివనరాజి గూర్చె ♦ హర్షము మిగులన్. ౨౯౧

సీ. వననిర్ఝరంబుల ♦ భరతపక్షులు చీఁకు, కొక్కెర లింపుగాఁ ♦ గూయు చుండ
నెమ్మలు గేరి నృ♦త్యమ్ములు గావింప, బంభరనాదసం♦రంభ మొనర
మత్తవిహంగము ♦ ల్మధుపసంచారము, ల్కోకిలసముదయ♦కూజితములు
విహంగరుతంబులు ♦ భృంగసంగీతము, ల్సారసగానము ♦ ల్మేరమీఱు

తే. తద్వనోపవనంబులఁ ♦ దరుచరాళి, చొచ్చి చెలరేఁగి కేరుచు♦నిచ్చవచ్చి
నట్టిరూపంబులం గొని ♦ మట్టుమీఱి, సంతసిల్లిరి యం దందు ♦ సంచరించి. ౨౯౨

కం. ఇమ్మెయి వానరు లుద్యా,నమ్ములఁ జొరఁబాఱఁ బుష్ప♦నవ్యసురభిస
ద్గమ్ములు మందానిలములు, ఘుమ్మని పైవీచె నపుడు ♦ ఘ్రాణసుఖముగన్. ౨౯౩

కం. హరిరాజాజ్ఞను దక్షిణ, హరివీరులు దండు వెడలి ♦ యరిగిరి లంకా
పురిపైఁ దద్దర్గల నా,పుర మల్లల నాడెఁ బాద♦ములఘట్టనచేన్ ౨౯౪

ఉ. కంపిత మయ్యె భూమి, పద♦ఘాతసముత్థితధూళిపాళిలుం
బెంపు గనెం, దదారవము♦భీతిని ఋక్షవరాహసింహముల్
ఱంపు లెసంగఁ బాఱె దిశ♦లం బడి యున్నతమున్ సమంబు నై
సొం పయి పుష్పజాలముల♦జొంపము లంతట నిండ నోల మై. ౨౯౫

కం. లలితమహోరజమునకుం, దులితం బై పక్షులకును ♦ దుష్ప్రాపం బై
కలితశ్రీనిర్మల మై, చెలువారెడుదాని మిగుల♦స్నిగ్ధం బగుచున్ ౨౯౬

కం. మనుజులు తలఁపున నేని యుఁ, జనఁగ నశక్యం బనంగ ♦ జవనంబునఁ బోఁ
గొనసాగ దనఁగ నేలా, గొన బగుతద్ధారిణీధ్ర♦కూటమునందున్. ౨౯౭

సీ. అసురేంద్రపాలితం ♦ బైనలంకాపురి, నిడివి నూఱామడ ♦ వెడలుపునను
ముప్పదామడ యయి ♦ గొప్ప వౌ వెల్లమ,బ్బులఁ బోలుచుండుగో♦పురములొప్పి
స్వర్ణరాజతభూరి♦సాలశోభిత మయి, శ్రీసౌధసువిమాన♦భాసిత మయి
ఘనములచే వాన♦కాలంబునందు మ,ధ్యమవైష్ణవపద మట♦తలఁపుఁ గూర్చి

తే. క్రాలు చుండఁగ నందు నా♦కసము నంటు
రజతగిరిశిఖరాభ మై ♦ రాణమీఱు
వేయిరాడుల[1] మాడువు ♦ వెలుఁగు నదియు
ననయ మాసురరక్షితం ♦ బగుచు నుండు. ౨౯౮

[1] రాడుల = స్తంభముల.

కం. ఆలంక కలంకారం, బై లలితం బైనరావ♦ణాసురచైత్యం
బాలోకించెను గోలాంగూలంబులు విస్మయంబు ♦ గుబ్బతిలంగన్. ౯౯

శా. నానాచిత్రవిచిత్రధాతుయుతము ♦ న్నానాసురాన్వీతము
న్నానారామవనాభిశోభితము నా♦నాపక్షిసంఘుష్టము
న్నానాసత్త్వనిషేవితంబును నగేం♦ద్రవ్యూహసంశోభితం
బానీరేజవిలోచనుండు కపిసం♦ఘాన్వీతుఁ డై కన్గొనెన్. ౧౦౦

కం. కనుఁగొని సురవరనగరం, బైన సెడితత్పురముసొంపు ♦ నీక్షించి ధరా
తనయాధవుఁ డచ్చెరువుం, గొని సకలముఁ జూచుచుండెఁ ♦ గుతుకముతోడన్.

సుగ్రీవుఁడు రావణుగోపురంబునకు దాఁటి యతనితోఁ బోరుట.

తే. ఆమడలు రెండు విరివియౌ ♦ నలసువేల
పర్వతాగ్రంబునను రామ♦భద్రుఁ డర్క
తనయ హరియూథ పరివృతుఁ ♦ డన్ని దెసలఁ
జూచుచుఁ ద్రికూటగత లంకఁ ♦ జూచునపుడు. ౧౦౨

ఉ. అం దొకగోపురంబు పయి ♦ హారిమణీచయభూషితాంగుఁ డై
చందనలిప్తగాత్రుఁ డయి ♦ స్వర్ణమహాధనరాజితాంగుఁ డై
కంద[1]వినీలదేహుఁ డయి ♦ కమ్రజయాతపవారణుండు నై
సుందరగౌరచామరవి♦శోభితుఁ డై రహిమీఱు దుర్జయున్. ౧౦౩

తే. అమరనాయకగజవిషా♦ణాగ్రకలిత,కిణవిరాజితవక్షు రా♦వణు దినాంత
మిహిరకాంతిసమావృత♦మేఘరాశి,నా శశాప్రాభవస్త్రంబు♦నవ్యరీతి ౧౦౪

చం. ఎనసినవాని రాక్షసకు♦లేంద్రుఁ గపీంద్రులు రామచంద్రుఁడుం
గనుఁగొను చుండ రావణునిఁ ♦ గాంచినమాత్రన జాతరోషుఁ డై
వనచరలోకనాథుఁడు చి♦వాలునఁ దెంపును బెంపు శౌర్యముల్
బెనఁగొన నట్టె దాఁటె సుర♦వీరవిరోధి వసించు మేడకున్. ౧౦౫

చం. నిలిచి ముహూర్తమాత్ర మట ♦ నిర్భయుఁ డై యసురేంద్రుఁ జూచి యా
ఖలు నొకపోకకుం గొనక ♦ కర్ణకఠోరముగాఁగ నిట్లను
న్బలువ! త్రిలోకభర్త రఘు♦నాథున కేను సఖుండ దాసుఁడన్
దలఁగకు రాము తేజమున ♦ దర్ప మడంపక పోవనిత్తునే. ౧౦౬

కం. అని దుమికి మీఁదికిం ద,ద్ఘనమణిమయముకుట మీడ్చి ♦ ధర మొత్తి మఱిం
దనమీఁదికి నరుదెంచెడి,యినసుతు నీక్షించి రాక్ష♦సేశ్వరుఁ డనియెన్. ౧౦౭

కం. సుగ్రీవా! యింతకు మును,సుగ్రీవుఁడ వీవు నాదు♦చూపునఁ బడి హీ
నగ్రీవుఁడ వయ్యెద వని, యాగ్రహమున నతని విసరి ♦ యావల వైచెన్. ౧౦౮

ఉ. వైచినఁ బుట్టచెండువలె ♦ వానరనాథుఁడు లేచి బాహులన్
ద్రోచె నిశాచరేంద్రు, నిలఁ ♦ ద్రోచినమాత్రన యీడఁబోక వే

[1] కందము = మేఘము.

లేచి కరాకరిం బెనఁగె ♦ లీలగ, వా రిటు పోర నల్కమై
నేచి స్రవించె ఘర్మజల ♦ బృందము నెత్తురు గ్రమ్మె మేనులన్. ౧౦౯

ఉ. ఒండొరుమేను మే నొఱయ ♦ నుగ్రత నిల్చుచు వీతచేష్టులై
యొండొరుఁ జూసి దవ్వు చని ♦ హుమ్మని తాఁకుచు మీఁద దూఁకుచున్
గండున ముష్టిఘాతముల ♦ గాఢకరోగ్రతలంబులన్ సము
ద్దండతఁ బోరి రిద్దఱును ♦ దర్ప మెలర్ప ననల్పధీరతన్. ౧౧౦

ఉ. నెత్తురు కాఱు మేనుల వ ♦ నేచరరాత్రిచరాధిపు ల్మదిన్
హత్తినరోషవేగముల ♦ నల్లల నాడఁగ గోపురాగ్రము
న్వొత్తుగ నొండొరు న్విసరి ♦ యేయుచు వీచుచు నెత్తిత్రేయుచున్
దత్తఱ లేక యొం డొకరుఁ ♦ దాఁచుచుఁ ద్రోచుచుఁ బెన్గులాడుచున్. ౧౧౧

కం. ఒక్కం డొక్కనిఁ జుట్టుచు, నొక్కం డొక్కరునిఁ దిగిచి ♦ యొడికంబుగఁ బై
నెక్కుచు మేనులు వంచుచు, నుక్కున నొండొకరు గదియ ♦ నొడిసి యగడ్తన్

కం. దొల్లిరి; వా రిరువురు ధరఁ, ద్రెళ్లక మింటికిని నెగిరి ♦ ధృతి చెడక యొకిం
తల్లన నిలిచి పెనంగిరి, మల్లాహవకుశలు లసుర ♦ మర్కటనాథుల్. ౧౧౩

ఉ. ఒండొరు బాహురజ్జువుల ♦ నుక్కిరి బిక్కిరిగా బిగించుచున్
దండిమగంటిమిం బులుల ♦ దారిని సింహములట్లు మత్తవే
తండములో యనంగఁ దెగి ♦ తాఁకుచు ఱొమ్మున ఱొమ్ముఁ దాఁచి యా
గండరగండ లిద్దఱును ♦ ఝా యుగపత్తియ వ్రాలి లేచుచున్. ౧౧౪

సీ. పూఁచినమోదుగు ♦ బూరుగువడువున, రంజిల్లుమేనుల ♦ శ్రమము లేక
చక్రాకృతులు గాఁగ ♦ సంచరించుచు దాఁటి, యట్టెపై కెగిరి య ♦ న్యోన్యస్య మెదిరి
భక్ష్యార్థమై పొంచు ♦ బావురుఁబిల్లుల, మాడ్కిని నిల్చుచు ♦ మఱియు మఱియు
సవ్యాపసవ్యాప ♦ సవ్యసవ్యంబులు, లోనుగాఁగల పెక్కు ♦ స్థానములను

తే. దిరుగుచును ముందఱకుఁ బోయి ♦ మరలి వచ్చి, వక్రగమనంబులను లఘు ♦ విక్రమంబు
వెలయఁ బట్టుచుఁ గొట్టుచు ♦ విడివడుచును, బోరి రిద్దఱు సరిగాఁగ ♦ భూరిబలులు.

కం. తిట్టుచు ధరణిం ద్రోపడ, నెట్టుచుఁ గుప్పించి మీఁద ♦ నెగయుచు ముష్టిం
గొట్టుచుఁ గికురించుచు బిగఁ, బట్టుచు లంఘించి లోఁగి ♦ పడుచుం బిఱుఁదన్.

మ. ఇటు లన్యోన్యముఁ గీశరాక్షసధరా ♦ధీశు ల్సమానోద్ధతిన్
స్ఫుటబాహాబలవృత్తిఁ బోరు నెడలన్ ♦ సుగ్రీవుఁ బౌలస్త్యుఁ డు
త్కటమాయం గొని[1] పట్టఁగాఁ దలఁపఁ ద ♦ ద్వ్యాపాద[2] మూహించి తాఁ
జిటికెన్ వ్రేసెడునంతలోనఁ బ్లవగ ♦ శ్రేష్ఠుండు దాఁటెన్ దివిన్. ౧౧౭

కం. జితకాశి జితక్లముఁ డయి, ద్రుతగతిఁ జన దాన వంచి ♦ తుం డై రక్షః
పతి యొక్కఁడ యటఁ బ్రాసాదతలంబున నిలిచె మించెఁ ♦ దప్పె నటంచున్.

---

[1] అనేక రావణులవలెఁ దోఁచి. [2] వ్యాపాదము = ద్రోహబుద్ధి.

చం. హరిచయనాథుఁ డీకరణి ♦ నాహవకీర్తి గడించి[1] యామినీ
చరపతి గాసిపెట్టి సువి♦శాలనభోంగణముల్ మహాజవో
ద్ధురగతి దాఁటి వచ్చి నవ♦శోయజనేత్రుని రాముప్రక్కఁ దా
హరివరసంఘమధ్యమున ♦ నల్లన నిల్చె శ్రమంబు దీఱఁగన్. ౮౧౯

కం. ఇయ్యనువున రావణుతోఁ, గయ్యం బొనరించి తన్నుఁ ♦ గపు లర్చింపన్
నెయ్యంబున రాఘవులకుఁ, గయ్యాపుటు బ్బొనరఁ జేసె ♦ గపినాథుండున్. ౮౨౦

## శ్రీరాముఁడు సాహసము చేయవల దని సుగ్రీవునకు బోధించుట.

కం. శ్రీరామచంద్రుఁ డంతట, నారవిసుతు మేన నున్న ♦ యాహవచిహ్నల్
తీరు గని యతనిఁ గౌఁగిట, నారముదంబునను గ్రుచ్చి ♦ యనె నిబ్బంగిన్. ౮౨౧

కం. నాతో నాలోచింపక, యీ తెంపుం జేయఁ జెల్లు♦నే కపినాథా!
భూతలభర్తలు స్వయముగఁ, జేతాఁకున[2] నిట్టిపనులు ♦ చేయఁగఁ జనునే. ౮౨౨

సీ. ఎంతటిసాహసం ♦ బీ వొనరించితి, సాహసప్రియ! నీవు ♦ సల్పినట్టి
కార్యంబు నన్నును ♦ గపిసేనను విభీష,ణుని సందియంబున ♦ మునుఁగఁ జేసెఁ
గటకట యెంతటి♦కష్టకార్యం! బిట్లు, చేయకు మింక యో♦జించుకొనక
యొండు నీ కేదేని ♦ యొదవినచో సీత,తో నేమిపని భర♦తుండు నేల
తే. యేల సౌమిత్రి శత్రుఘ్నుఁ ♦ డేల యింత, యేల నా దేహ మైన నా ♦ కేటి కయ్య
నీదురాకకు ముం దిట్లు ♦ నిశ్చయించి, నాఁడ నెఱిఁగియు నీశక్తి ♦ నాఁడిమగఁడ.

ఉ. ఎట్టన యుద్ధభూమి నను♦రేశ్వరు సాత్మజబంధుసైన్యుఁగాఁ
బట్టి వధించి లంకకును ♦ బట్టము గట్ట విభీషణున్, మదిన్
నెట్టన కైకయీతనయు ♦ నిల్పి స్వరాజ్యమునందు మేనిఁ బోఁ
గొట్టఁ దలంచి యుంటిఁ గపి♦కుంజర యన్న హరీంద్రుఁ డి ట్లనున్. ౮౨౪

తే. అనఘ నీభార్య దొంగిలి♦నట్టిముచ్చు, నెదుటఁ గనుఁగొని నాశక్తి ♦ నెవ నెఱింగి
యూరకయు యుండ నామన ♦ సొప్పు నెట్టు, లనిన మెచ్చుచు లక్ష్మణు♦నని యె నిట్లు.

## శ్రీరాముఁడు లక్ష్మణునకు శకునంబులఁ దెలుపుట.

కం. ఫలవంతము లగువనముల, కలిమియు శీతోదకమును ♦ గల తావులలో
బలముల నిలుపుచు మొగ్గర,ములు పన్నఁగ వలయుఁ జుమ్ము ♦ మునుకొని యనుజా.

చం. బలిముఖబుక్షరాక్షసని♦బర్హణముల్ భృశభీతిదంబు నా
ప్రళయము లోకనాశనక♦రంబుగఁ దారసిలెం బరాగముల్
బలియఁగ వాయువుల్ విసరెఁ ♦ బర్వతశృంగములుల్ వణంకె నీ
యిల చలియించె నేలపయి ♦ వృక్షచయంబులు వ్రాలెఁ గంటివే. ౮౨౭

---

[1] రావణుఁడు మాయాయుద్ధము చేయుటచే నోడెనని యెఱుంగునది. [2] చేతాఁకున = సాహసించి.

తే. భయదమాంసాదనిభములుఁ ♦ బరుషములును
బరుషరవములుఁ గ్రూరముల్ ♦ వారివాహ
నిచయములు ఘోరభంగిని ♦ నెత్రుతోడి
వృష్టిఁ గురియించె నుత్పాత♦హేతుకముగ. ౨౮

సీ. కుంకుముడాలున ♦ ఘోర మయ్యెను సంధ్య, సూర్యునం దొకనల్ల♦చుక్క దోఁచె.
మార్తండునందుండి ♦ మండుచు నొకయగ్ని, మండలం బిల వ్రాలె ♦ దండితారి!
మృగములుఁ బక్షులు ♦ నెల్లెడ దీనస్వ,రముల ఘోషించెను ♦ రవిని జూచి
నిజతేజ మెడయంగ ♦ నిశలందుఁ జంద్రుఁడు, నలుపును నెఱుపును♦గలయఁ గొనను

తే. విలయకాలంబుననుబోలె ♦ వికటముగను,
దాపమును గూర్చుచున్నాఁడు ♦ ధరణికెల్ల
గుడును హ్రస్వంబు రూక్షంబు ♦ ఘోర మగుచు
వెలయుచున్నది యద్దాని♦విధముఁ గంటె. ౨౯

చం. మలినములౌచుఁ దారకలు ♦ మానవిలోకవినాశ మియ్యెడన్
దెలిపెడిఁ, గాకగృధ్రములు ♦ దేఁకువ గల్గినడేగ లెంతయే
నలువపుఁబక్షులుం దఱుమ♦ నారట మందెడి, నక్క లెయ్యెడన్
గలయఁగఁ బర్వి భీకరము♦గా రొద సేసెడిఁ గీడు దెల్పుచున్. ౩౦

## శ్రీరాముఁడు సువేలాద్రి డిగి లంక ముట్టడించుట.

సీ. లక్ష్మణా! యిప్పుడ ♦ లంకను బలముతోఁ, జని ముట్టడించుట ♦ చను నటంచు
నగము తూర్ణము డిగి ♦ నగచరవరు లెల్లఁ, గన వారి కుత్సాహ♦కారణముగఁ
బౌరుషవాక్యము ♦ ల్పలికి కాలజ్ఞుండు, కౌసలేయుఁడు కీశ♦గణముతోడ
లంకాభిముఖుఁ డయి ♦ శంక లే కరుగంగ, వానరరాక్షస♦వల్లభులును

తే. పావమాని సుమిత్రాత్మ♦భవుఁడు నలుఁడు, జాంబవంతుండు నీలుండుఁ ♦ జనిరి తోడ
వారివెంట ధరారుహ♦ధారిణీధ్ర,తతులు ధరియించి కపుచ్ఛ♦దళము లరిగె. ౩౧

ఆ. దీర్ఘకాల మరిగి ♦ ధీరులు భ్రాతలు, వనవిరాజితంబు ♦ ధ్వజయుతంబు
యోధదుర్జయంబు ♦ నున్నతప్రాకార, తోరణంబు త్రిదశ ♦ దుర్దమంబు. ౩౨

ఆ. చేరిముట్టడింపఁ♦జేసి వానరసేనఁ, బురము చుట్టు నిలుప ♦ భూరిబలులు
ప్లవగవరులు రామ♦వాక్యచోదితులయి, నియతదేశములను ♦ నిలిచియుండ ౩౩

తే. శైలకూటంబుపోల్కి నుచ్చంబునైన, యుత్తరద్వారమును భ్రాతృ♦యుక్తుఁడగుచు
రాముఁ డరికట్టె నచ్చట♦రావణుండు, తత్పురీరక్షణాసక్తిఁ ♦ దగ వసించె. ౩౪

చం. వరుణుఁడు కాచుసాగరము♦భంగిని రాక్షసనేత యున్నయు
త్తరదిశ ద్వార మాఁగుటకు ♦ దాశరథుం డొకరుండు దక్క నె
వ్వరు వలఁతు? ల్భయంకరులు ♦ వాలుమగల్ దృఢవిక్రమాఢ్యులా
శరవరు లోలిఁ గావ బలి♦సద్మము దానవు లట్టు లుగ్రులై, ౩౫

తే. ద్వారనికటస్థ వేదికా♦తతులమీఁద, యుద్ధసక్త భటాళుల♦కుపకరింప
వివిధకవచాయుధంబులు♦విపులముగను, నించియుండఁగ రాముఁడు ♦ గాంచెనపుడు.

కం. ప్లవగచమూపతి నీలుఁడు, ద్వివిదుఁడు మైందుండు నరుగు♦దేరఁగఁ దోడై
దివిజేంద్రాశాద్వారం, బవిరళసైన్యంబుతోడ ♦ నరికట్టె వెసన్. ౮౩౭

కం. దక్షిణపుగవని నాఁగెగ, వాక్షర్షభగవయగజస♦మన్వితుఁడై హ
ర్యక్షపరాక్రముఁ డంగదుఁ, డక్షీణబలుండు నిజబ♦లావళితోడన్. ౮౩౮

సీ. ప్రఘసప్రమాథు లన్ ♦ పటువిక్రములఁ గూడి, పశ్చిమద్వారంబు ♦ పవనసూతి
కాచె సుగ్రీవుండు ♦ గరుడానిలోపమ, వేగులతో గుల్మ♦వీథి నిలిచెఁ
దరణిసుతుం డున్న♦తావున ముప్పది, యాఱుకోట్లగచరు ♦ లమరి రంతె
గవనికి గవనికిఁ ♦ గపివరు లొక్కొక్క, కోటి నిల్చిరి లంక♦కోటఁ జుట్టి

తే. ఋక్షనాయక యుక్తుఁడై ♦ యినతనయుఁడు
మధ్యమున రామునకుఁ బడ♦మటను నిల్చె
యుద్ధకాంక్షను వానర♦యోధులెల్ల
వివిధసన్నాహములతోడ ♦ వేచి రపుడు. ౮౩౯

సీ. వికృతలాంగూలురు ♦ వికటదంష్ట్రాయుధుల్, వికృతచిత్రాంగులు♦వికృతముఖులు
దశనాగసత్త్వులు ♦ దశగుణోత్తర బలుల్, పదినూర్లగజముల♦బలము వారు
నోఘసత్త్వులును శ♦తౌఘసత్త్వులు నప్ర, మేయబలాఢ్యు ల♦జేయబలులు
గాఁ బెక్కువిధములఁ ♦ గపివీరు లొప్పిరి, వారిసేనలు మూఁగు♦తీరు చూడ

ఆ. శలభసమితి కవియు♦చందంబుగాఁ దోఁచె, మిన్నుమన్నుభేద ♦ మెన్నరాక
కోట్లకొలఁదికపులు ♦ కోటవాకిలి డాయఁ, గోట్లకొలఁది వెనుకఁ ♦ గూడి యుండ్రు.

కం. కరువలి కేనియు లంకం, జొరరాకుండఁగ వనాట♦శూరతతి గిరుల్
ధరణీరుహములు గేలన్, ధరియించి పురంబుఁ జుట్టె ♦ దర్ప మెలర్పన్. ౮౪౧

సీ. శక్రసీకాశప♦రాక్రమయుక్తమై, మేఘసంకాశమై ♦ మెఱయు చున్న
ప్లవగకూటసైన్యంబు ♦ వీక్షించి రాక్షసు, లబ్బురపాటున ♦ నదరి రెదల
వేల విరిసినకంధి ♦ వెల్లిపాఱెడునట్లు, వారలు నడతేర ♦ భూరిరవము
పురమునం దంతయు ♦ బోరుకొనెన్ లంకఁ, బ్రాకారతోరణ♦రాజితోడ

తే. సావనీధరవన మయి ♦ జలదరించె, రామలక్ష్మణసుగ్రీవ♦రక్షి తాగ
చరచమూసంఘ మది సురా♦సురుల కైనఁ, దేఱి చూడఁగ రాకుండఁ ♦ దేజరిల్లె.

ఉ. ఈవిధి నాత్మసైన్యముల♦నెల్ల సమర్థము లైనతావులన్
దా విడియించి మంత్రిజన♦తాసహితుం డయి మంత్ర ముండి సీ
తావిభుఁ డర్హకృత్యమువి♦ధంబుఁ దలంచి సునీతివేది ర
క్షోవిభుసమ్మతిం బడసి ♦ శుద్ధమతి న్నృపధర్మ మెంచుచున్. ౮౪౩

## అంగదురాయబారము.

కం. వీరుని వాలిసుతుం గని, శూరా! లంఘించి లంకఁ ♦ జొచ్చి దశాస్యుం
జేరి మదుక్తిగ ననుమీ, భీరహితుఁడ వగుచు నీదు ♦ సేరిమి వెలయన్. ౧౪౪

సీ. ఓరి భ్రష్టశ్రీక ♦ యోరి గతైశ్వర్య!, యో నష్టచేతన ♦ యో ముమూర్షు[1]
గర్వమోహంబులఁ ♦ గావించితివి ద్రోహ, మప్సరోగంధర్వ ♦ యక్షనాగ
నిర్జరఋషిరాజ ♦ నిచయంబులకు నీవు, బ్రహ్మవరంబుకా ♦ వరము దీఱు
కాలంబు ఘటియిల్లెఁ ♦ గాంతాహరణకర్మ,తుండను దండధ ♦ రుండువోలె

ఆ. నీకు శాస్తి సేయ ♦ నీలంకవాకిట, నిలిచి యున్నవాఁడ ♦ నిశిచరేంద్ర!
యేమిబలము నమ్మి ♦ యింతి మాయ హరించి, తట్టిబలముఁ జూప ♦ నరుగు దెమ్ము.

కం. అశరనాయక దురమున, నాశరముల నీల్గి నీవు ♦ నాకులరాజ
ర్షిశమహర్షులపదవి ని,వేశంబుగఁ గొనెద వీవు ♦ వీరుఁడ వేనిన్. ౧౪౬

కం. కా వేని సీత మరలం, గావర మఱి నిచ్చి శరణుఁ ♦ గాంచుము కాదే
నే వెస లోక మరాక్షస, మై వెలయఁగఁ జేయువాఁడ ♦ నాశుగతతులన్. ౧౪౭

తే. ధర్మచిత్తుండు రాక్షస ♦ తతిగరిష్ఠుఁ
డగువిభీషణుఁ డిట నన్ను ♦ నాశ్రయించె
నితఁడు శ్రీమంతుఁ డొందె లం ♦ కేశ్వరత్వ
మసుర! నిష్కంటకముగ ని ♦ త్యంబు గాఁగ. ౧౪౮

మ. వినరా మూర్ఖసహాయ! ధర్మపథముల్ ♦ వీడ్కొల్పి పాపైకగ
ర్ధనచిత్తుండవు నస్వతంత్రమతి వై ♦ రాజ్యంబుఁ బాలింప నొ
క్కనిమేషంబు నశక్య మింక, ధృతి చి ♦ క్కం బట్టి శౌర్యంబుమైఁ
జనుదే పోరికిఁ, బూతుఁ డయ్యెదవు మ ♦ చ్ఛాతాస్త్రశాంతుండ వై. ౧౪౯

చం. పొవరు దొలంగి కన్మొఱఁగి ♦ పోవఁ దలంచి శకుంతమై మనో
జవమున మూఁడులోకములు ♦ జాల్కుఁడ చొచ్చితి వేనియున్ శ్రమం
బవుఁ జుమ యంతమాత్రమ[2], మ ♦ దక్షిపథంబును బొంది ఘోరమృ
త్యువువదనంబునం బడక ♦ ద్రోహి! ధరన్ మనఁ జాల వేమిటన్. ౧౫౦

కం. కావున హిత మాలింపుము, జీవశ్రాద్ధంబు నిపుడ ♦ చేసికొని పురిన్
నీవలచినయవి కను; నీ,జీవము నాచేతిలోనఁ ♦ జిక్కెం గుమతీ. ౧౫౧

కం. అని రాముఁడు వచియించిన, ఘనపథమున కెగిరి రూపు ♦ గాంచినయనలుం
డనఁ దారేయుఁడు రావణు,ఘనసౌధమునందు వ్రాలి ♦ కడమి దలిర్పన్. ౧౫౨

కం. సామాత్యుం డగురావణు, మోముం గని చేరఁ బోయి ♦ మూర్తిమదగ్ని
ద్దామత వెలుఁగుచుఁ దూ చా,[3] యేమి విడక రామునూక్తు ♦ లెల్లను వినిచెన్. ౧౫౩

---

[1] ముమూర్షు = చావుఁగోరినవాఁడా. [2] కాకాసురువలె. [3] తూచా = విడక, ఒక యక్షర మైనను విడక తు, చ, అనునవి సంస్కృతమున పాదపూరణమునకై వేయఁబడు నవ్యయములు.

కం. ఖ్యాతుఁ డగుకోసలేంద్రుఁడు, పూతచరితుఁ డైనరామ♦భూవరమణికిన్
దూతను వాలితనూజుఁడ, నేతఱి నా పేరు వింటి♦వే యంగదుఁడన్. ౮౫౪

చం. అనఘుఁడు రామచంద్రుఁ డిటు♦లాడె దురాత్మక! పూరుషుండవే
ననికిని లేచి రమ్ము, సచి♦వాత్మజబాంధవమిత్రయుక్తుఁగా
నిను వధియింతు, లోకములు ♦ నిర్వ్యథమై సుఖియింప దేవతా
దనుజఋషీశ్వరాహివని♦తాజనకంటకు నిన్నుఁగూల్చెదన్. ౮౫౫

తే. భూమిజాతను బహుమాన♦పూర్వకముగ, నరగఁ గొనివచ్చి యర్పించి♦శరణు వేఁడ
వేని నినుఁ జంపి నీరాజ్య♦మే విభీష,ణునకు నిత్తునటం చను ♦ మనియు ననిన

## అంగదుఁడు రాక్షసులఁ జంపి మరలి శ్రీరాముకడకు వచ్చుట.

కం. ఆపరుషభాషణము విని, కోపారుణనేత్రుఁ డసుర♦కుంజరుఁడు దురా
లాపుని వీనిని గొట్టుఁడు, వే పట్టుఁడు చంపుఁ డనుచుఁ ♦ బెక్కులు తడవల్ ౮౫౬

చం. పలికినఘోరరాక్షసులు ♦ పైపడి నల్వురు వాలిపుత్రునిన్
బెలుచనఁ బట్ట నాతఁడును ♦ స్వీయబలోద్ధతిఁ జూపఁ జిక్కిన
ట్టులు నటియించి వారలఁ ద♦టుక్కునఁ జంకలలోన నొక్కి తా
నలఘుజనంబునం బులుఁగు♦నట్టులు దాఁటెను మేడమీఁదికిన్. ౮౫౭

కం. అచ్చట నుండియ నలువురఁ, జెచ్చెర విదలింప వారు ♦ చేవ చెడంగాఁ
జచ్చి పడిరి దశకంఠుఁడు, కచ్చటి కనుఁగొనుచు నుండఁ♦గా నంగదుఁడున్ ౮౫౮

తే. శైలశృంగోన్నతంబు ప్రా♦సాదశిఖర, మచట వీక్షించి పదహతి ♦ నవనిఁ గూలఁ
దన్నె రావణుఁ డీక్షింప♦మున్ను వజ్రి, మంచుగుబ్బలి[1]శృంగంబుఁ♦ద్రుంచుమాడ్కి.

ఉ. క్రచ్చఱ నిట్లు సౌధశిఖ♦రంబును ద్రుంచి పరాక్రమించి నే
వచ్చినవాఁడ నంగదుఁడ ♦ వాలితనూజుఁడ రాముబంట నం
చచ్చుపడంగఁ బల్కి మహి♦తార్భటు లుల్లసిలంగ ఱివ్వునన్
వచ్చి వియత్పథంబునను ♦ బార్థివవర్యుని మ్రోల వానరుల్ ౮౬౧

కం. ఉల్లాసంబునఁ గెరలఁగఁ, బెల్లగుదుఃఖమున నసుర♦వీరులు వగవన్
మెల్లన నిలిచినఁ గని రఘు,వల్లభుఁ డెద మెచ్చి యాహ♦వమునకుఁ దొడరెన్.

కం. ప్రాసాదభంగమునకున్, రోసము దీపింపరావ♦ణుం డది భ్రష్ట
శ్రీసూచక మని తనకున్, వేసమకుఱు నాశ మనుచు ♦ వెచ్చగ నూర్చెన్. ౮౬౩

తే. కొండవలె నుండు నలసుషే♦ణుండు దండి, గండుమీఱినవానర♦కాండసేన
తోడ నాలుగుగవఁకులఁ ♦ దోయజారి, చుక్కగుమిఁబోలె తేనాజ్ఞఁ ♦ జుట్టు చుండె.

ఉ. వ్యూహము దీరి యున్న ప్లవ♦గోత్కరమున్ లవణాబ్ధి దాఁటున
క్షౌహిణులన్ నిశాచరులు ♦ గాంచి భయంపడి రందు వీరు లా

[1] గుబ్బలి = కొండ.

సాహసికాగ్రణుల్ రణము ♦ సల్పఁ గుతూహలమంది రెంతొయు
తాహ్నముఁ బూని శస్త్రములు ♦ దాల్చి చరించుచు ఝంఝ[1]పోలికన్. ౧౬౫

తే. వరణపరిఖాంతరంబుల♦వ్యాప్తమైన, క్రోతిగమిఁ గని యిది వేఱు♦కోట యొక్కొ-
యనుచు వెఱచిరి వారల♦యార్భటులకు, నడలె నసురులపిండు హా♦హా యటంచు.

## రాక్షసులు రావణుతో లంకను వానరులు ముట్టడించి రని తెలుపుట.

తరువోజ.

అంతట రాక్షసు ♦ లసురేంద్రనిలయ ♦ మరిగి యాతనితోడ ♦ నగచరుల్లంక
నంతయు రోధించి♦నట్టివిధంబు ♦ నఖిలంబుఁ దెల్పిన ♦ నాతండు కనలి
వింతగాఁ గాపెల్ల ♦ ద్విగుణంబుఁ జేసి ♦ వెస సౌధ మెక్కి త♦ద్విధమును గాంచెఁ
గాంతారశైలముల్ ♦ గణియింపరాని ♦ కదనలంపటులైన♦కపులాక్రమింప. ౧౬౭

తోదకము. ధరణిని మ్రింగఁగఁ ♦ దార్కొనువీరిఁ
దురమున నేగతిఁ ♦ ద్రుంతు నటంచు
న్గరమును జింత నొ♦నర్చుచు నార్తిఁ
దిరుఁడయి వారలఁ ♦ దేఁకువఁ గాంచెన్. ౧౬౮

కం. భూవిభుఁడును సాలసమీ, పావని డాయంగ నరిగి ♦ యన్నిదెసల ర
క్షోవీరసమావృత మై, కావఁబడి పతాకమాలి♦కాచిత్రిత మై. ౧౬౯

ఉ. త్రాలెడిలంకఁ గాంచి జన♦కప్రభుపుత్త్రిఁ దలంచి యాత్మలో
జాలి వహించి యయ్యొ మృగ♦శాబవిలోచన నానిమిత్తమై
వాలఁ గృశించి శోకమున ♦ స్థండిలశాయిని యై తపించెడిఁ
హా! లలనామణీ! యనుచు ♦ నారటపాటునఁ దత్కృపాలుఁడున్ ౧౭౦

## శ్రీరాముఁడు లంకకోటకు లగ్గలు పట్ట వానరుల కనుజ్ఞ యిచ్చుట.

ఉ. ధ్వంసము సేయుఁడీ సకల♦వైరుల నంచు ననుజ్ఞ నీయ బా
హాంసములందు భూజశిఖ♦రాళులఁ దాలిచి కీశసంఘముల్
శంసితభంగి గర్జల ది♦శావలయంబు విదారితంబుగా
మాంసభుగోఘమండలము ♦ మార్కొనె నుద్దవిడిఁ మహార్భటిన్. ౧౭౧

చం. పిడికిటిపోటులం గుధర♦బృందముపాటుల లంక యంతయుఁ
బొడుమ వడఁగంగఁ జేయుతమిఁ ♦ బూని రఘుప్రియకామితార్థ మై
విడివడి జీవితాశ విడి ♦ వింశతిబాహుఁడు చూచుచుండఁగాఁ
గడిమిని లగ్గవట్టి ప్లవ♦గప్రముఖుల్ ద్రుమశైలకోటులన్. ౧౭౨

సీ. ప్రాకారతోరణా♦రణ్యతలంబులఁ, జక్కాడి నిర్గల♦సలిలపూర్ణ
పరిఖలఁ దృణకాష్ఠ♦పర్వతాగ్రద్రుమ,భూపరాగంబులఁ ♦ బూడ్చి వైచి

[1] ఝంఝ = వానతోడి గాలి.

లక్షలు కోటులు ♦ వృక్షచరాగ్రణుల్, కోట నారోహించి ♦ గోపురములఁ
గూలిచి ద్వారముల్ ♦ ప్రీలిచి కొమ్మలు, రాలిచి భయదగ♦ర్జలను నించి
తే. యెగిరి దాఁటులు వైచుచు ♦ నెల్లవారు
జయము శ్రీరామవిభునకు ♦ జయము లక్ష్మ
ణునకు రాఘవపాలితుం ♦ డినజునకును
జయ మటంచును ఘోషింత్రు ♦ సంతసమున. ౮౨౩
కం. జాంబూనదతోరణములు, త్ర్యంబకగిరిశిఖరనిభము ♦ లగుగోపురముల్
డంబఱి రూపము మాయఁ జే,లంబున నొనరించి రపుడు ♦ లావరులు కపుల్. ౮౨౪
తే. వీరబాహుసుబాహువుల్ ♦ వీరవరుఁడు, నలుఁడు ప్రాకారమును జుట్టి ♦ నాల్గుదెసల
ముట్టడిని గాచి యుండిరి ♦ మోహరమున, నింతలోపలఁ దక్కి న♦వృక్షచరులు
సీ. తగినపద్ధతిని స్కం♦ధావారమును దీర్పఁ, గుముదుండు తూర్పునఁ ♦ గోటికపులు
ప్రఘసుండు పనసుండు ♦ బాసటగా నుండె, వింశతికోటులు ♦ వీరవరులు
దనకుఁ దోడ్పడి నిల్వ ♦ దక్షిణద్వారంబు, నెదుటను శతవలి ♦ భృశబలుండు
నఱువదికోటుల♦హరిచయంబులతో సు,షేణుండు పడమటఁ ♦ జేరి నిలిచె
ఆ. రామచంద్రుఁ డుత్త♦రద్వారమునఁ బన్నఁ, దమ్మితోడ సూర్య♦తనయుతోడఁ
గొండమ్రుచ్చు ఱేఁడు ♦ క్రూరదర్శనుఁడు గ,వాక్షుఁ డుండె రాము♦నంతికమున.
తే. ఎలుఁగులకు ఱేఁడు ధూమ్రుండు ♦ ఋక్షకోటి
బలియ రాముని మఱి యొండు♦ప్రక్క నిలిచె
సచివసహితంబుగా విభీ♦షణుఁడు గదను
దాల్చి నిలిచెను రఘురాము♦దాపునందు. ౮౨౫
తే. గంధమాదనశరభులు ♦ గజగవాక్ష,గవయులును నెల్ల సేనకుఁ ♦ గాపు గాఁగ
నన్నివంకలఁ బరువెత్తి ♦ యరయు చుండి,రంతయును జూచి రావణుం ♦ డాగ్రహించి.

### రావణుఁడు రాక్షసుల యుద్ధమునకుఁ బోవ ననుజ్ఞ యిచ్చుట.

సీ. పొండు రాక్షసులార ♦ భండనమున కన, నామాట వెలువడి♦నదియొ లేదొ
యార్పులు పెడబొబ్బ ♦ లట్టహాసంబులు, భీమనిర్ఘోషముల్ ♦ పెల్లు రేఁగెఁ
జంద్రపాండురముఖ♦చర్మభేరులు హేమ,కోణాహతములుగా ♦ ఘోష లెసఁగ
భూషితాసితతనుల్ ♦ పూరింప శంఖముల్, సబలాక చంచలా♦జలదచయము
ఆ. పగిదిఁ దోఁచె నిట్లు ♦ వారిధి పొంగిన,వడువు దోఁప సోఁకు♦దడము లెదిరెఁ
గపులు పేరటులివు ♦ కందరప్రస్థపూ,ర్ణముగఁ దాఁకి వీఁక ♦ రణము సేయ. ౮౨౬
శా. ఘోరం బయ్యెను సంగరంబు కపిర♦క్షోనాథయూథాళి క
య్యారే ప్రాక్తనదేవతాసురమహా♦భ్యామర్దనీకాశ మై

వీరుల్ కీశవరుల్ నఖాయుధులు భూ♦భృద్ద్రావనృక్షాంకు లై
పోరన్ రక్కసు లుగ్రశూలపరిఘం♦బుల్ శక్తులున్ వైవఁగన్. ౮౮౦

సీ. తమతమ పేర్వాడి ♦ తరుచరనాయకుల్, జయ జయ సుగ్రీవ ♦ జయము రాజ
యంచు ఘోషించుచు ♦ మించి కోటకుఁ బ్రాఁకి, ప్రాకారమున నున్న♦ రాత్రిచరుల
నఖములఁ గోఱల ♦ నగములఁ గుజముల, మర్దించి వధియించి ♦ మహిని ద్రోయ
రక్కసుల్ చెలరేఁగి ♦ యుక్కున లగ్గెక్కు, వారిమీఁదను భిండి♦పాలములను

ఆ. ఖడ్గశూలములను ♦ గడువడిఁ గురియంగ, లెక్క గొనక సాల ♦ మెక్కి కపులు
కసిమసంగి పరులు ♦ కసిమసి గొనఁ బోర, రక్తమాంసపంక♦సిక్త మవని. ౮౮౧

## ⟵ వానరరాక్షస ద్వంద్వయుద్ధము. ⟶

కం. కాంచనశిరోగ్రభూషో♦దంచద్వాహములు పావ♦కాభధ్వజముల్
చంచత్కవచంబులు రవి♦సంచురథంబు లయి యసుర♦సైన్యము మెఱసెన్. ౮౮౨

తే. రావణజయార్థు లగుచును ♦ రాక్షసులును
రామవిజయార్థు లయి వాన♦రప్రముఖులు
రోషముల దృష్టిభీకర♦వేషములను
వీఁకఁ దాఁకిరి గర్జలు ♦ విన్న దన్న. ౮౮౩

సీ. సంకులసమర మీ♦చందాన వర్తిల్లు, నెడ వాలిపుత్రుని ♦ నింద్రజిత్తు
త్ర్యంబకు నంతకు♦నట్లు మార్కొనిపోరె, సంపాతి దాఁకెఁ బ్ర♦జంఘు నసుర
జంబుమాలి యెదిర్చె ♦ సామీరి మిత్రఘ్నుఁ, డటిమె విభీషణు ♦ నమితకోపుఁ
దపనుండు గజుఁడును ♦ దార్కొనిరి నికుంభు, నీలుండు గదిసెఁ బే♦రాలమునను

తే. బ్రఘసుతోడను ఢీకొనెఁ ♦ బ్లవగవిభుఁడు, లక్ష్మణుండు విరూపాక్షు ♦ లగువు పఱిచె
యజ్ఞకోపుఁడు సుప్తఘ్నుఁ ♦ డగ్నికేతు, రశ్మికేతులు దెంపున ♦ రాముఁ దాఁక

కం. కిట్టిరి మైందద్వివిదుల, నట్టియెడన్ వజ్రముష్టి ♦ యశనిప్రభుఁడున్
బెట్టెదిరించిరి నలుఁడుం, గొట్టెం బ్రతపనసమాఖ్యు ♦ఘోరాసురునిన్. ౮౮౪

తే. ధర్మసుతుఁడు సుషేణుండు♦దరలఁ దాఁకె, నమితబలుని విద్యున్మాలి♦యనెడువానిఁ
దక్కువానరరాక్షసు ♦ లక్కజముగఁ, బోరి రెదు రైనవారితో ♦ ఘోరముగను.

ఉ. ఈవిధి రోమహర్ష మయి ♦ యెల్లెడ సంకులసంగరంబుగా
వావిరి చెల్లఁ దద్ధరణిఁ ♦ బర్వెను గుంతలశాద్వలంబు ని
ర్జీవశరీరకాష్ఠము న♦సృగ్తటినీచయ, మట్టివేళ ఖో
ఘావహు వాలిసూనుని గ♦దాహతి శక్రజితుండు నొంచినన్. ౮౮౫

ఉ. పట్టఁగరానికోపమున ♦ వానిరథంబున దూఁకి చాపమున్
బట్టి విదల్చి దూరముగ ♦ వైచి జవోద్ధతి సూతుమూర్ధమున్

జట్టుకుఁ బాపి గుఱ్ఱములు ♦ సాల్పడి చావఁగ మోఁదిి తేరినిఁ
నెట్టన నుగ్గునూచముగ ♦ నేలఁ బడన్ విఱిచెం గపీంద్రుఁడున్.

ఉ. శాతశరత్రయంబునఁ బ్ర♦జంఘుఁడు దోర్బల మొప్పఁ గొట్ట సం
పాతియు నశ్వకర్ణకుజ♦పాతమునన్ వెస వాని నొంచెఁ బ్ర
స్ఫీతరణంబుపై నిలిచి ♦ పేర్కొని కింకను జంబుమాలియున్
వాతతనూజువక్షమున ♦ బాధసముజ్జ్వలశక్తిఁ జిమ్మినన్. ౧౪౯

ఉ. మారుతనందనుండు సమ♦మానజవంబున మించుమాడ్కి నా
తేరున వ్రాలి చేతికొలఁ♦దిన్ సురవైరిని బెట్టు పెట్టఁగాఁ
దేరును వాఁడు నొక్కత్రుటిఁ ♦ దీఱ, నలుం గని తీవ్రబాణసం
దారితగాత్రుఁ జేయుచును ♦ దద్దవడిం బయిఁ బాఱు తేరఁగన్ ౧౫౦

కం. వానిని బ్రతపనుఁ గనుఁగొని, వానరవరుఁ డైననలుఁడు ♦ పై నుఱికి వెసన్
వానికనుగ్రుడ్లు రెండు న,దీనజవంబునను బెఱికి ♦ త్రెళ్లఁగఁ జేసెన్. ౧౫౧

ఉ. చూపఱు బెగ్గడిల్లఁ బ్రఘ♦సుండు కపిధ్వజినీచయంబుఁ బె
ల్లేపునమ్రింగున ట్లసర ♦ వృక్షచరాధిపుఁ డుగ్రమూర్తి యై
చేపడుసప్తపర్ణమున ♦ శీర్షము వ్రయ్యలు గాఁగ మోఁదినన్
రూప మెఱుంగరానిగతిఁ ♦ గ్రూరనిశాటుఁడు గూలె నేలపై. ౧౫౨

కం. అక్షయశరములు రిపుహృద,యక్షోభముగాఁగఁ గురిసి ♦ యాశుగ మొకటన్
రక్షోవరుఁడైన విరూ,పాక్షుని వెస లక్ష్మణుండు ♦ హతుఁ గావించెన్. ౧౫౩

తే. యజ్ఞకోపుఁడు సుప్తఘ్నుఁ ♦ డగ్ని కేతు
రశ్మి కేతులు బాణప♦రంపరలను
రాము నొప్పింపఁ గినుక మై ♦ రయము మెఱయ
నల్వురను నాల్గుశరముల ♦ నఱికి వైచె. ౧౫౪

చం. అడరెడివజ్రముష్టిఁ గని యాగ్రహ♦మారఁగ మైందుఁ డుగ్రుఁ డై
పిడికిటఁ గ్రుమ్మ రాక్షసుఁడు ♦ పృథ్విఁ బడెన్ సరథుండు సాశ్వుఁ డై
పిడు గడువంగఁ గూలుపుట♦భేదనపొధ మనంగ, నీలునిం
గడుఁ గఱకైనముల్కులను ♦ గ్రచ్చఱ వ్రచ్చె నికుంభుఁ డత్తఱిన్. ౧౫౫

చం. రవి తనయంశుజాలముల ♦ మ్రబ్బును వచ్చువిధంబు దోఁప న
ద్ద్విజవిరోధి వెండియును ♦ దీవ్రశరంబుల క్షిప్రకారి యై
తవులఁగ వైచి నవ్వినను ♦ దానవవైరివిధంబు దోఁపఁగా
బ్లవగవరుం డమేయతర♦లాఘవ మూని తదీయసారథిన్. ౧౫౬

ఉ. ఆతని తేరిచక్రమున ♦ నంతకునంతికసీమ కన్చె, గ్రా
వాతతశృంగ మెత్తి ద్వివి♦దాఖ్యుఁడు వే యశనిప్రభాఖ్యు వి.

ఖ్యాతసురారి వైచి యసు♦రౌఘము చూడఁగ ధారిణీరుహ
వ్రాతముతోడఁ బైఁ గవియ ♦ రాక్షసుఁడుగ్ర శితకాండపంక్తులన్ ౮౯౭

కం. వృక్షముల నఱకి యాతని, వక్షంబున నారసములు ♦ పరఁగించిన నా
వృక్షాటుఁడు సాలంబున, రాక్షసుతురగములఁ జంపె ♦ రథయుక్తముగన్. ౮౯౮

సీ. అపుడు విద్యున్మాలి ♦ స్యందనారూఢుఁ డై, కాంచనభూషిత♦కాండములను
వర్షించుచు సుషేణు ♦ బాధించి గర్జింపఁ, జివ్వున భూధర♦శృంగ మొండు
వైచి రథంబును ♦ భగ్నంబుఁ గావింపఁ, దటుకున నేలకు ♦ దాఁటి యతఁడు
గద కొని నిలఁబడఁ ♦ గనలి సుషేణుండు, బండ నొక్కటి నెత్తి ♦ పైకి నుఱుకఁ

ఆ. దలఁగ దాఁటి యతఁడు ♦ తనగదతోఁ గ్రోఁతి, ఱొమ్ము సూటి చూచి ♦ క్రుమ్మటయును
సరకు సేయ కతఁడు ♦ సరగున నాబండ, వానివక్ష మగల ♦ వైచుటయును. ౮౯౯

కం. ముద్ద యగుడు వక్షం బా, గద్దఱికాఁ డుర్విఁ గూలెఁ ♦ గపిసంతతు లీ
పద్దున సోఁకులమూఁకలఁ, దద్దయు నాకమున కనిచె ♦ ద్వంద్వరణమునన్. ౯౦౦

సీ. భగ్నంబు లై గదా♦పట్టసతోమర, ఖడ్గసాధనములు ♦ కలయ వ్రాలె
వివిధాకృతులు గాఁగ ♦ విధ్వస్తసైంధవ, సంఘంబు పఱచిన♦చంద మయ్యె
భిన్నదంతంబులు ♦ ఛిన్నతుండంబు లై, భూరికుంజరములు ♦ ప్రోవు పడియె
నసురవానరులచ♦యంబులమేనుల, మొండెముల్ తుండెముల్ ♦ దండిమీఱెఁ

ఆ. దునిఁగిపడిననొగలు ♦ దునిసినకాఁడులు, విఱిగిపడినకండ్ల♦విసరములును
నవని నెల్ల నెఱసె ♦ నద్భుతరూప మై, వంచకముల కుత్స♦వంబు గాఁగ. ౯౦౧

కం. బంధురరక్షఃప్లవగక, బంధంబులు నాట్య మాడె ♦ భయదంబుగ ద
ర్పాంధు లగుకపులతో గత, గంధులు రాక్షసులు పోరి ♦ కడఁక దలిర్పన్. ౯౦౨

ఉ. మేనుల రక్తముల్ గురియ ♦ మేకొనఁ జాలక చివ్వ కెప్పు డొ
క్కో నిశ వచ్చు నంచుఁ దమ♦యుల్లములం దలపోయు చుండఁగా
భానుఁడు గ్రుంకెఁ, గ్రోఁతులకుఁ ♦ బ్రాణవినాశిని రాత్రి ధ్వాంతసం
తానము పర్వఁ జేయుచును ♦ దారసిలెం గను గాన కుండఁగన్. ౯౦౩

## ⟵ వానరరాక్షసుల రాత్రియుద్ధము. ⟶

కం. ఆపెంజీఁకటి యుద్ధ, వ్యాపారము జరగె బద్ధ♦వైరులకు బలో
ద్దీపకులకుఁ గీశులకుం, బాపాత్ముకు లైనదుష్ట♦పలలాశులకున్. ౯౦౪

శా. ఓరీ రాక్షస! పోకు పోకు మన నో♦హో కీశ! రా రమ్ము నాఁ
గ్రూరుం జంపుము చంపు మం చనఁగ నా♦కూళుం దిగఁ మ్రింగునా
నోరీ పాఱెద విస్సిరో యనఁగ నో♦హో పోవఁ బోనిత్తునా
రారా నాఁగ వినంబడెఁ రవము లా♦రాత్రిఁ సమిద్ధారిణిన్, ౯౦౫

కం. నీలతనూకాంతులతో, మేలిపసిఁడికత్తళముల♦మెఱుపులతో న
వ్వేళను వనాపఘులతో, శైలేంద్రములట్టు లసుర♦సంఘము వెలిఁగెన్. ౯౦౬

ఉ. ఆనిబిడంపుఁజీఁకటిని ♦ నాశరకోటులు మ్రింగఁ జొచ్చె న
వ్వానరపాళిఁ, గ్రోఁతులును ♦ వారక శత్రుతురంగ దంతిసం
తానములం బతాకలను ♦ దద్ధ్వజసంఘముఁ దీక్ష్ణదంష్ట్రలన్
బూనికఁ దున్క తున్కలుగఁ ♦ బోఁడిమి మాపిరి బెట్టిదంబుగన్. ౯౦౭

సీ. రామలక్ష్మణు లప్డు ♦ సామర్షచిత్తులై, శింజినీనాదంబు ♦ చెవుడు గొలుప
జడివాన గురిసిన♦పడువున బాణముల్, గురియించి యించుక♦గోచరించు
పరిపంథులను గత♦ప్రాణులుగాఁ జేయ, రక్కసుల్ పెనువీఁక ♦ రథముఁ బఱప
గుఱ్ఱాలగొరిజల♦కొట్టుల రేఁగిన,ధూళు లిర్వాఁగు సం♦ధులను జెవిటి

ఆ. వారిఁ జేసెఁ దచ్ఛ♦రీరంబులను గాఱు,నల్ల వెల్లిపాఱెఁ ♦ గొల్లగాఁగఁ
బణవశంఖవేణు♦బహుళభేరీనాద,ములును బర్వె దిక్కు ♦ లలము కొనఁగ. ౯౦౮

కం. చచ్చెడిరక్షఃప్లవగుల,యుచ్చావచమైన[1] యేడ్పు ♦ టులి వెల్లదెసన్
బెచ్చుపెరిఁగె ఘోరంబుగ, నచ్చటులసమిద్ధరిత్రి ♦ యాసమయమునన్ ౯౦౯

కం. చొర రాక తెలియ రాకయుఁ, బురుశోణితమాంసపంక♦ముగ శరసూనో
త్కరసముపహార యయ్యెను, హరివరపలలాదసంఘ♦హారిణి యగుచున్ ౯౧౦

## శ్రీరాముఁడు రాక్షసుల వధించుట.

ఆ. పొలిచెఁ గాళరాత్రి♦పోలికనారాత్రి; యట్టిసమయమునను ♦ నసురవరులు
పిండు గట్టి నిశిత♦కాండముల్ గురియుచు, రాముఁ దాఁకి రుగ్ర♦రభసమునను.

కం. వారలు కోపోద్రేకిత, నారావముఁ బేర్చి నభము ♦ నగలించుచు దు
ర్వారత రా నాగర్జలు, పారావారములు పొంగు♦భంగిగ నయ్యెన్. ౯౧౨

ఉ. వారలరాకఁ జూచి రఘు♦వర్యుఁడు చాపము చంద్రమండలా
కారము గాఁగ జ్యారవము ♦ కర్ణపుటీప్రవిదారణంబుగా
నారసముల్ దెగం దొడిగి ♦ నల్వుర నిద్దఱ నాఱిటన్ వడిన్
బోరగిలంబడన్ నఱకె ♦ భూరిభుజుండు నిమేషమాత్రలోన్. ౯౧౩

సీ. అంతటఁ బోక ఖ♦రాంతకుం డెదిరిన,యమశత్రు దుర్ధర్షు ♦ నమితబలు మ
హాపార్శ్వుని మహోద♦రాఖ్యు మహాకాయు, వజ్రదంష్ట్రుని భీమ♦బాహు లైన
శుకసారణులఁ గ్రూర♦వికటబాణంబు లా,సారంబుగాఁ గప్పఁ ♦ జావు దప్పి
పాఱె రంతట రామ♦బాణావళియు నిరా,ఘాటంబుగాఁ బాఱె ♦ నూటి చెడక

తే. యగ్నిశిఖలకుఁ బురు డయి♦హాటకాంచి,తంబు లగుచును రామనా♦మంబు లొప్పు
విశిఖచయముల దిశలెల్ల ♦ వెలుఁగఁ జేసె,వహ్న్యాగతశలభాళినాఁ♦బరులు మడియ.

ఉ. *ఏపును గోపునుం గలసి ♦ యెంతయువింతలు సంతరింపఁగాఁ
జూపును దూపునుం బెరసి ♦ సూడులదాడుల గోడగింపఁగాఁ

[1] ఉచ్చావచమైన = నానావిధములుగల.

ద్రోపును దాఁపు నేక మయి ♦ రోషము వేషము భీషణంబుగాఁ
గైపును సైఁపు లేమియు నొ♦కండుగ రాముఁడు చండమూర్తి యై. ౯౧౫

కం.*ఒండు గుఱి నేయఁ దొడుగఁడు, రెండవబాణమును; నేర♦రిరికి నేసిన
గాండము వెన్నునఁ దగులదు,[1] బెండుగ వృథ వోవ దొక్క♦విశిఖం బేసిన్. ౯౧౬

తే.కనకపుంఖవిరాజిత♦కాండతతులు, వేనవేలుగ నెల్లెడ ♦ వెడలి పఱవఁ
బొలిచె రాతిరి మిణుఁగురు♦పురుగుగముల,రహి వహించిన శారద♦రాత్రికరణి.

కం.క్రూరాసురగర్జనముల, భూరుహచరసంచయప్ర♦భూతరవములన్
ఘోరం బగునాయామిని, ఘోరతరం బయ్యె నపుడు ♦ గుండెలు పగులన్. ౯౧౮

తే. ధ్వాంతనీకాశనిజతనూ♦కాంతు లెసఁగు
కొండముచ్చులు తమరొదల్ ♦ కొండ నిండ
దాపరించినరక్కస♦దాఁటుఁ బట్టి
పట్టు వదలక భక్షించి ♦ వైచె నపుడు. ౯౧౯

ఇంద్రజిత్తంగదుచేఁ బరాజితుఁ డయి మాయాయుద్ధ మొనర్చుట.

చం.ప్లవగులయేటు రాక్షసుల♦పాటు నరేంద్రులపోటు చూచి యా
దివిజధవారి రావణి మ♦దిం గనరెత్తి విలాసవిక్రమం
బవితథ మై చెలంగఁ గుధ♦రాటుల పైఁ గవియంగఁ దోడుతో
లివమెయి వాలిసూనుఁ డవ♦లీలను వాని హతాశ్వుఁ జేయుచున్. ౯౨౦

కం.సారథిని జంప రావణి, తీ రిదిగా దనుచుఁ దేరు ♦ దిగ దాఁటుచు మా
యారంభుం డై మఱఁగిన, వీరునిఁ దారేయుఁ బొగడె ♦ విబుధర్షితతుల్. ౯౨౧

కం.ధీరుం డని మాయాజి వి,శారదుఁ డని ప్రథనమున న♦జయ్యుం డని శ
క్రారిని జగ మెఱుఁగుట న,వ్వీరుని నొడుచుటకును మెచ్చె ♦ విశ్వము కీశున్.

ఉ. మెచ్చిరి రామలక్ష్మణులు ♦ మే లని రక్కసుఁడున్ విభీషణుం
డిచ్చ దలిర్ప నిట్లు ప్లవ♦గేశుని తాఁకున కోహటించి లో
మచ్చర మెచ్చ రక్కసుఁడు ♦ మాయను గైకొని కానరాక కీ
శోచ్చయమున్ నిశాతవిశి♦ఖోత్కరముం గురియించి యేఁచినన్. ౯౨౩

ఉ. అయ్యెడ రామచంద్రుఁడు వ♦నాటసమూహములార! వీఁడు రే
కయ్యమునం దసాధ్యుఁడు, జ♦గత్త్రయముం బరిపీడితంబుగా
నయ్యజదత్తదుర్వరబ♦లాధికతం జలుపంగఁ జాలు, నా
కియ్యెడ బ్రహ్మవాక్య మతి♦యింపఁగ నర్హము గాన మీరలున్ ౯౨౪

కం.సుగ్రీవునికడ నిలఁబడి, జాగ్రద్దశనుండుఁ డనియె ♦ శతమన్యుజితుం
డాగ్రహమున నంతర్హిత,విగ్రహుఁ డై మింటి కెగసి ♦ విశ్వభయదుఁ డై. ౯౨౫

[1] వెన్నిచ్చినవానిని రామబాణము చంపదు. కావుననే కాకాసురుఁడు పరువెత్తుచుఁ బ్రాణము దక్కించుకొని రామశరణుచొచ్చి బ్రతుకఁగలిగెను.

చం. పిడుగులపిండుపాటు దలఁ♦పింపఁగ శాతశరోత్కరంబులన్
జడిగొనఁ గీశసంఘముల♦సైన్యముపైఁ గురియింప వారలున్
జడిమయు ఱిచ్చపాటు కడు♦సంభ్రమపాటును బొంది దిగ్భ్రమన్
వడి చెడి తూలి సోలి యల♦ త్రాలి యడంగి మడంగి రెంతయున్. ౯-౨౬

ఉ. ఏరికిఁ జూడ రాక తన♦యెచ్చటియున్కియుఁ దోఁప నీక పెం
పార భయంకరాహివిశి♦ఖావళి రాము సుమిత్రనందనున్
బీరము దీఱ బాణచయ♦విద్ధసమస్తశరీరభాగులం
గా రయమారఁ జేసె దశ♦కంఠతనూజుఁ డతుల్యతీవ్రతన్. ౯-౨౭

చం. కదనతలంబునం దభిము♦ఖంబుగ నిల్చి నృపాలపుత్రులన్
మద మణఁగింప లేమి సుర♦మర్దనుఁ డయ్యెడ మాయ పెంపునన్
జిదుమఁగ నెంచి వృక్షచర♦శేఖరు లెల్లను జూచు చుండ న
వ్విదితపరాక్రముండు గడ♦వెన్[1] శరబద్ధులఁ జేయ వారలన్. ౯-౨౮

## ఇంద్రజిత్తు శ్రీరామలక్ష్మణుల నాగపాశబద్ధులఁ జేయుట.

ఉ. ఎందును దానయై, యునికి ♦ యేమియుఁ గానఁగ రాక, మాయ మి
న్నంది పరాక్రమించు నను♦రాధిపనందను రోయ వృత్రహా
నందననందనుం ద్రుహిణ♦నందను నీలు సుషేణపుత్రులన్
వందితవిక్రముల్ శరభ♦వానరునిన్ ఋషభాఖ్యు వెండియున్. ౯-౨౯

కం. వినతుని సానుప్రస్థుని, ఘను ఋషభస్కంధుఁ బంప ♦ ద్రుమరుహగిరిసా
ధను లై మింటను నల్గడఁ, బనిగొని వెమకంగ నింద్ర♦వైరియుఁ గడిమిన్. ౯-౩౦

కం. ఱెక్కలు గల పెనుఁబాముల, మొక్కలమున ఱివ్వటన్న ♦ మ్రోఁతయె బుసగా
నొక్కవడి బాణజాలం, బక్కపితతి దిమ్మఁదిరుగ ♦ నడరించి మఱిన్. ౯-౩౧

కం. పరమాస్త్రంబుల వారల, త్వరయును గమనంబు నాఁప ♦ వనచరవీరుల్
పరికింప రైరి యాతనిఁ, బర పగు నాగడప[2] లఱును ♦ భాస్కరు నణఁగన్. ౯-౩౨

చం. తెఱపి యొకింత యిచ్చినను ♦ దెప్పిఱి రేనియు వీరి మ్రోలఁ గ్ర
మ్మఱ నిలఁగా నశక్య మని ♦ మానవరాజకుమారవీరులన్
గఱకుఁగసిండికోఁతలఖ♦గమ్ములు మేనుల నిండ దండిగా
విఱుగడ లేక యయ్యసుర♦వీరుఁడు వైచె సరోషచిత్తుఁ డై. ౯-౩౩

ఉ. ఆచటులాస్త్రఘాతజని♦తాస్రధునీరససిక్తగాత్రు లై
పూచినకింశుకంబులను♦బోలెడివారల రక్తనేత్రుఁ డై
యేచి విభిన్నకజ్జలని♦భేతరగాత్రుఁ డదృశ్యకాయుఁ డై
చూచుచుఁ బల్కు నైజభృశ♦శూరత వార లెఱుంగఁ జాటుచున్. ౯-౩౪

[1] కడవెన్ = ప్రయత్నించెను. [2] ఆగడపలు = మేఘములగుంపు.

ఉ. మీరలె నన్ను మార్కొనెడి♦మేటిమగల్? ప్రధనోర్వి నుగ్రమా
యారతి నే నగోచరుఁడ♦నై చరియింపఁగ నల్లవృత్రదై
త్యారియు డాయలేఁడు గన♦నైనను లేఁడన మీరు లెక్కయే
ఘోరతరాస్త్రసంతతులఁ♦గూల్చెదఁ జూడుఁడు మిమ్ము నిద్దఱన్. ౯౩౫

ఉ. రోషణభాషణంబు లిటు♦క్రూరనిశాటుఁడు వారిఁ బల్కి జ్యా
భీషణఘోషణం బరులు♦పెల్కుఱఁ జేయుచు శాత్రవస్థయ
ప్రేషణశోషణాహిశర♦బృందముఁ బైపయిఁ గ్రమ్మి దుష్టవి
ద్వేషణభూషణాత్ములను♦వే శరబద్ధులఁ జేసె నీసునన్. ౯౩౬

కం. ఆ యేతరి రాకొమరుల, కాయంబులఁ గాఁడె శరని♦కాయము ప్రేలెం
డే యెడ సందోనరఁగ నీ, కాయుద్ధతికిం జలించి♦యా వీరవరుల్. ౯౩౭

చం. ముడిబిగి తూలునిం ద్రుద్ధ్వజ♦మ్ముం దలఁపించుచుఁ గంప మందుచున్
సడలఁగ నిబ్బరంబు నిము♦సంబును గన్నులు విప్పరాక పై
నడరెడిమర్మభేదనశ♦రావళిఁ గర్శితు లౌచు, గాయముల్
బుడబుడఁ గ్రక్కునెత్తురుల♦బ్రుంగి కలంగి నలంగి రెంతయున్. ౯౩౮

కం. అనఘులకరాంగుళంబుల, దనుక న బాధితము నప్ర♦దారిత మనిలా
శనశరనికరాబద్ధము, తనువులఁ గన రా డెడంబు♦తచ్ఛరవృష్టిన్. ౯౩౯

ఉ. అంజక యంతకున్ సయిఁచి♦యట్టె నిలంబడి యున్న రాముని
న్గంజిగి దొట్టు గన్గవ వి♦నిర్జితనాకపుఁడున్ శితాగ్రముల్
కంజరపుంఖముల్ భయద♦కాండము లుగ్రత వత్సదంతభ
ల్లాంజలికక్షురాశుగచ♦యంబులు భీకరసింహదంష్ట్రముల్. ౯౪౦

కం. ప్రేసిన హెచ్చిననొవ్వున, నాసింహబలుండు త్రిణత♦మై విజ్యం బై
భాసురరత్నాంచిత మై, కై సడలెడి వింటితోడ♦ధ్మా శయనించెన్. ౯౪౧

ఉ. ఆనళినాంబకుండు బహు♦శార్తిని దొల్తను వీరశయ్య పై
మేను గదించె, నన్న యిటు♦మేదిని వ్రాలఁగఁ జూచి తమ్ముఁడున్
మాని స్వజీవితాశ శర♦మండలతల్పగుఁ డయ్యె, నింతకున్
వానరముఖ్యులెల్ల నర♦వర్యులఁ జేరి నితాంతదుఃఖు లై ౯౪౨

సుగ్రీవాదులు బద్ధు లైన శ్రీరామలక్ష్మణులఁ జూడ వచ్చుట.

ఉ. క్రిందును మీఁదు చూచుచుఁ బ♦రిక్షతు లై శరపూర్ణగాత్రు లై
క్రిందను వ్రాలి యున్న నర♦కేసరులం గను చుండ నింతలో
మందత నొంద రావణజు♦మార్గణవృష్టియు వేగ భానుమ
న్నందనుఁడున్ విభీషణుఁడు♦తత్థ్సలికిం బఱతెంచి వారలన్ ౯౪౩

కం. కని యచ్చట ద్వివిదాంగద,హనుమన్మైందకుముదాద్య ♦ గాటయుతముగా
వనరుచుఁ దద్దురవస్థకు, మనమునఁ దికమికలుపడుచు ♦ మల్లడి గొనుచున్. ౨౪౪
సీ. జాలువాఱెడునెత్తు ♦ జాజువాఱినమేను, గాజు వాఱినమోము ♦ కళలవారిఁ
గాలు చేయి కదల్పఁ ♦ గడిమి చాలనివారి, నొయ్యనియూరుపు ♦ లూర్చువారి
వాఁడిముల్కులు లెస్స ♦ గాఁడినమైవారిఁ, బుట్టప ట్లన బుస ♦ గొట్టువారి
నలుగులపాన్పున ♦ నత్తమిల్లినవారి, హాటకధ్వజముల ♦ సాటివారి
తే. వీరశయనశయానుల ♦ వీరవరుల, మందవిక్రము లైయున్న ♦ మనుజవరుల
నీరు గాఱెడికనుల వ ♦ నేచరాళి, మిడుక నెఱుఁగక స్మృతి దప్పి ♦ పడినవారి.
కం. వగచుచు దుఃఖభరంబున, వగరుచుచుఁ మిన్నుగనుచుఁ ♦ బర్వతరిపుపై
న్నగతునియడపొడ గానక, యగచరవరు లన్నిదిక్కు ♦ లరసిరి వృథగన్. ౨౪౬
కం. మాయావి నన్నుఁ గొడుకుఁ, మాయాసంఛన్ను లబ్ధ ♦ మహితపరబలుఁ
మాయావేది విభీషణుఁ, డాయెడ నొక్కండ కనియె ♦ నట రావణియున్. ౨౪౭

↞ ఇంద్రజిత్తు శ్రీరామలక్ష్మణులు చచ్చి రని రాక్షసులతోఁ జెప్పుట. ↞

కం. తనశరముల బాధితు లై, తనువు లెఱుంగక ధరిత్రి ♦ తల్పముగా వ్రా
లినభ్రాతలఁ గని పొంగుచుఁ, దనవారికి ను బ్బెసంగ ♦ దర్పించి యనున్. ౨౪౮
సీ. ఎవ్వరు ఖరుని నా ♦ మైకశేషునిఁ జేసి, రెవ్వరు దూషణుఁ ♦ గ్రొవ్వడంచి
రెవ్వరిచింతఁ బా ♦ న్పెమి యంటక మూఁడు,జాము లేగెడి[1] రేల ♦ జనకుఁడకును
నెవ్వరు సకలక ♦ పీంద్రులతోఁ గూడి, కడలి సేతువుఁ గట్టి ♦ విడిసి రిందు
నెవ్వరికడిమికి ♦ నీలంక కలగుండు,పడె వానకారున ♦ వాఁకపొలె
ఆ. నట్టివారి నిదిగొ ♦ నస్త్రబంధంబులఁ, గట్టి చంపినాఁడఁ ♦ గట్లు విప్ప
నఖిలనిర్జరర్షు ♦ లైనను జాలరు, తక్కువారిమాట ♦ తడవ నేల? ౨౪౯
కం. ఈరాఘవుఁ డీలక్ష్మణుఁ, డీరాణువ చేసి యున్న ♦ యెల్లమగతనం
బీ రే నిష్ఫల మై చనె, శారదదినములను మేఘ ♦ జాలం బనఁగన్. ౨౫౦

↞ ఇంద్రజిత్తు వానరవీరుల నొప్పించుట. ↞

చం. ప్లవగచమూచయంబుపని ♦ పట్టెద నిం కిటఁ జూడుఁ డంచు వా
సవపరిపంథి యూథపులఁ ♦ జ క్కడుపన్ సమకట్టి ముల్కులన్
నవకముచేత నీలుమెయి ♦ నాటఁగఁ గ్రుచ్చియు మూఁట మైందునిన్
ద్వివిదుని మూఁట వైచి యొక ♦ పేరలుగుం దొడి జాంబవంతునిన్. ౨౫౧
చం. ఉరమునఁ గాఁడఁ జిమ్మి జవ ♦ నోద్ధతు మారుతపుత్త్రుఁ దాఁకఁగా
శరదశకంబు వైచి రభ ♦ సంబుమెయిన్ శరభున్ గవాక్షు భీ

[1] మూఁడుజాములేగెడిన్ = రేయెల్ల నిదురలేదని భావము.

కరఖగయుగ్మతాడితులఁ♦గా నొనరించి కలంబవృష్టులన్
గురిసెను వాలిసూనువయిఁ ♦ గ్రోధసమేధితశౌర్యధుర్యుఁ డై. ౯౫౨

తే. వహ్నిశిఖలను నెఱిమించు ♦ బాణములను
బలిముఖులమేను లెల్లను ♦ దొలులు గొట్టి
సింహనాదంబు గావించెఁ ♦ జేవ యెడలి
ప్లవగకుంజరములు భీతిఁ ♦ బడలు పడఁగ. ౯౫౩

ఉ. అంబరవీథి నిల్చి ప్లవ♦గావళియుక్కు మడంచి యట్టహా
సం బొనరించి రాక్షసుల♦సంఘముఁ గన్గొని యిష్టు చూడుఁడీ
యింబఱి నేల వ్రాలి విక♦లేషునిబద్ధశరీర మైనయు
గ్మంబు నటన్న వా రతని♦కార్యముఁ గన్గొని విస్మితాత్ము లై. ౯౫౪

కం. జలదము లుఱిమెడువడువున, బలితపుగర్జలను నించి ♦ పార్థివులు సమి
త్తలమునఁ జచ్చిరికా యని, తలఁచుచు నమ్మేఘనాదుఁ ♦ దన్పిరి పూజన్. ౯౫౫

కం. ఆడక కాలులుఁ జేతులు, నాడక యుచ్ఛ్వాస మేమి ♦ యవనీగతు లై
గోడుకొను నన్నదమ్ములు, గూడిరి మృతి ననుచుఁ దలఁచి♦కొని రయ్యసురుల్.

## విభీషణుఁడు సుగ్రీవునకు ధైర్యముఁ జెప్పుట.

ఉ. ఎంతయు సంతసంబున సు♦రేంద్రజితుండును లంకఁ జొచ్చె, భూ
కాంతులయున్కిఁ జూచి దిన♦కాంతతనూజుఁడు బెగ్గడిల్లి నే
త్రాంతములన్ జడిం గొనుచు ♦ నశ్రులు రాలఁగ శోకతప్తుఁ డై
చింతను మోము వెల్ల నయి ♦ చేడ్పడి యుండ విభీషణుం డనున్. ౯౫౭

చం. చనునె కపీంద్ర! ప్రాకృతుని♦చందమునన్ దిగులొంద, మానుమీ
కనుఁగవ బాష్పపూరములు ♦ గార్పకు, యుద్ధము లిట్టివే కదా
యనిఁ దనగెల్పు నిశ్చయ మ♦టం చని నమ్మఁగవచ్చు నయ్య? నీ
మనమున ధైర్య మూని గతి♦మాలిన నన్నును దేర్పు మియ్యెడన్. ౯౫౮

చం. మనకును భాగ్యశేషము ర♦మాధవ! యించుక యైన నున్నచో
ననఘులు భూరిశౌర్యులు మ♦హాత్ములు మూర్ఛ దొలంగువారు పొ
మ్మనయము సత్యధర్మనిర♦తాత్ముల కెం దపమృత్యుభీతి లే
దని యుదకార్ద్రహస్తమున ♦ నాతనినేత్రయుగంబుఁ దుడ్చుచున్. ౯౫౯

తే. మంత్రితాంబువులను గొని ♦ మంత్రవిదుఁడు
మార్జనము సల్పె నేత్రయు♦గ్మంబు కీశ
రాజునకు వెండి కాలసం♦ప్రాప్త మైన
వాక్యములు పల్కు మదిలొ త్రు♦పాటు దొలఁగ. ౯౬౦

కం. కాలంబు గాదు నీకుఁ, దీలు పడఁగ నిట్టిగతి; న • తిస్నేహము దు
ష్కాలంబున వీక్షించుచుఁ, హేళిసుతా! మరణమునకు • హేతువు సుమ్మీ. ౯౬౧

సీ. కావున సర్వార్థ • ఘాతి నధైర్యంబు, విడువుము వానర • వీర వర్య
రామచంద్రుఁడె తమ • ప్రాపని నమ్మిన, దళముల నెల్లను • దలఁప వయ్య
కాదేని స్మృతి తప్పి • కాకుత్స్థుఁ డుండెడు, దాఁక నాతని కాపు • దలఁగ కయ్య
జనవరేంద్రులు లబ్ధ • సంజ్ఞులైనను మన, యడ లెల్లఁ దీర్ప స • మర్థు లయ్య

ఆ. నాగపాశబంధ • నములు శ్రీరామున, కెట్టి బాధ నిడవ • యింత నిజము
మరణభీతి వలదు • మరణించు వారి కీ,కాంతి వదనసీమఁ • గలుగ దెపుడు. ౯౬౨

ఉ. కావున సర్వకార్యములు • క్రమ్మఱ నే సరిపెట్టుదాఁక సు
గ్రీవ! సమాశ్వసిల్లు మెదఁ • గీశసమూహము నూఱడింపుమీ
యీవనచారులెల్ల విక • చేక్షణులై వెఱ తొట్రగిల్లఁగా
నావల నట్టె చూచి కపి • నాయక యొండొరువీనులం దాఁగెన్. ౯౬౩

తే. గుసగుసలు పోవుచున్నారు • వెసఁ బలాయ,మాను లగుటకు వీరిని • మాన్పవయ్య
వనచరావళి భుక్తపూ • ర్వస్రజంబు,పోల్కి భయమును విడువంగ • బుద్ధి సెపుమ.

కం. అనుచు విభీషణుఁ డీగతి, వనచరపతి నూఱడిల్లఁ • బలికి మఱి పలా
యనపర మగుప్లవగావళి,ననునయవాక్యములఁ దేర్చి • నడలక యుండన్. ౯౬౫

ఇంద్రజిత్తు రావణునితోఁ దాను శ్రీరామలక్ష్మణుల
నాగపాశబద్ధులఁ జేసి వధించితి నని చెప్పుట.

ఉ. అక్కడ నింద్రజిత్తు సక • లాసురసేనలు గొల్వ లంకఁ బే
రుక్కునఁ జొచ్చి తండ్రికి ర • ఘూద్వహయుగ్మముచావుఁ జెప్పినన్
గ్రక్కునఁ బీఠి దూఁకి కొడు • కా! బళిరే యని మెచ్చి శీర్షమున్
మొక్కలపుంబ్రమోదమున • మూర్కొని కౌఁగిటఁ జేర్చి పిమ్మటన్. ౯౬౬

కం. శ్రీరాఘవులవధవిధం, బారఁగ వినఁగాఁ గుతూహ • లాత్ముం డగుచున్
నారాచబంధనంబున, వారలు నిశ్చేష్టు లగుట • ప్రభ పాయుటయున్. ౯౬౭

కం. వినిపించె యథావృత్తం,బును సర్వం బింద్రజిత్తు • ముదమునను దశా
ననుఁ డుత్సహించి రాఘవ,జనితభయము విడిచిపుత్త్రు • శ్లాఘించెఁ గడున్. ౯౬౮

హనుమదాదులు శ్రీరామలక్ష్మణులఁ గాచి యుండుట.

తే. హనుమదంగదనీలగ • వాక్ష గవయ, గజ సుషేణ కుముద నల • కంజజాత్మ
జాతపృథురంభ శతవలి • శరభ గంధ,మాదనులు ఋషభస్కంధ • మర్కటుండు.

కం. కృతకార్యం డై రావణ,సుతుఁ డరుగుడు లంక కంతఁ • జుట్టు నిలిచి దుః
ఖితులై మిక్కిలిజాగ్ర,త్స్థితితో రక్షణ మొనర్ప • మానవనాథున్. ౯౭౦

కం. వృక్షచరు లున్న వారలు, వృక్షంబులఁ గేలఁ బూని ♦ తృణము గదలినన్
రాక్షసు లని యులుకుచు మది, వీక్షించిరి దిక్కులెల్ల ♦ విన్నున్ మన్నున్. ౯౨౧

→{ రావణుఁడు రాక్షసస్త్రీలతో సీతాదేవికి శ్రీరామలక్ష్మణులఁ జూపుఁ డని చెప్పుట. }←

తే. ఆత్మజునిఁ బంచి యసుర ధ♦రాత్మజాత,రక్షిణుల రాక్షసస్త్రీల ♦ రా వచింపఁ
ద్రిజట మున్నుగ వార లే♦తేరఁ బ్రీత,మానసంబున ని ట్లను ♦ మానినులకు. ౯౨౨

ఉ. చచ్చిరి రామలక్ష్మణులు ♦ శక్రజిచే నని భూమికన్యతో
ముచ్చటమీఱఁ జెప్పి రణ♦మూర్ధతలస్థితులన్ నెలంత దా
నచ్చిక పుట్టఁ జూడ జత♦నంబునఁ బుష్పకయానసీమపై
నచ్చెలి నిల్పి తోడ్కొని ర♦యంబునఁ బొం డటఁ జూపుఁ డంతయున్. ౯౨౩

ఉ. ఎవ్వనిప్రాపు నమ్మి జల♦జేక్షణ కావర మెత్తి నన్నుఁ దా
గవ్వకు లెక్క సేయ దల♦కాంతుఁడు రాముఁడు భ్రాతృయుక్తుఁడై
చివ్వను జచ్చె,నింక సతి ♦ చింతయు శంకయు నాశఁ బాసి యా
మవ్వరి సర్వభూషణ సు♦మండిత యై నను డాయుఁ గావుతన్. ౯౨౪

కం. ఇపుడు కదా తమ్మునితో, విపులఁ బరాసువుగ నున్న♦విభుఁ గనుఁగొనుటన్
వ్యపనీతాశను సతి తన,విపరీతస్థితి ననన్య♦విధగతి నెఱుఁగున్. ౯౨౫

ఉ. ఇప్పుడు భర్తపట్ల నిర♦పేక్షమనంబున నన్నుఁ దానుగాఁ
దప్పక కైకొనుం జెలువ ♦ తప్పదు పొం డన, వారు నట్టులే
తెప్పునఁ బుష్పకంబుఁ గొని ♦ దీనత వల్లభశోకతప్తయై
ముప్పిరి గొన్న తాపమున ♦ ముగ్ధ ధరాసుత నందు నిల్పుచున్. ౯౨౬

కం. పాలికలనికిఁ[1] దోడ్కొని చని, రలివేణియుఁ ద్రిజటతోడ ♦ నటఁ గనె ధరపై
బలిముఖనశములు సర్వము, విలయంబును బొంది చెడిన♦విధ;మిటఁ బురిలోన్

కం. హత్తినముదమున దశముఖుఁ, డెత్తించెన్ ధ్వజము లెల్ల♦యెడఁ బ్రకటించెన్
మిత్తిని గూర్చెను వాసవ,జి త్తని రాఘవుల ననుచుఁ ♦ జెచ్చెర నంతన్. ౯౨౭

→ సీతాదేవి పుష్పకంబున నుండి శ్రీరామలక్ష్మణులఁ జూచుట. ←

కం. పొంగెడి రక్కసమూఁకలఁ, గ్రుంగెడికాకుత్థ్సపార్శ్వ♦గులవానరులన్
గంగిన స్మృతి దొఱఁగిన దు,ర్భంగుల శరతల్పగతుల ♦ రాముని ననుజున్. ౯౨౮

ఉ. వ్రాలినచాపముల్ రుచులు♦వాడినరూపము లూడురోపముల్
చీలినవర్మముల్ దెగిన♦జీవితమర్మము లాడుచర్మముల్
దూలెడియూర్పులుం జెడిన♦తోరపునేర్పులు మోముమార్పులన్
ధూళిని బ్రుంగుమేను లగు♦తోయజనేత్రుల నగ్నిపుత్రులన్. ౯౩౦

[1] పాలికలను = స్మశానము. రామలక్ష్మణులు పడియుండుచోటు.

కం.ఎనసెడివారల భ్రాతల, ననుపమదేవప్రభావ♦హారులఁ బతి నా
యనవద్యగాత్ర సౌమి,త్రిని నసితేక్షణ నితాంత♦దీనార్తిక యై ౯౮౧
కం.కాంచుచు నెట్టులొకో యీ,యంచితమహిమాఘ్యు లిట్టు♦లై రనుచు వితి
ర్కించుచు బాష్పంబులఁ గురి,యించుచు దుఃఖాబ్ధి మునిఁగి♦ యీవిధి నేడ్చెన్.

నాగపాశబద్ధులైన శ్రీరామలక్ష్మణులఁ జూచి సీతాదేవి దుఃఖించుట

కం.సుతవతి నయ్యెద ననుచుం, బతిహీనత నొంద ననుచుఁ♦ బలికిరి నన్నుం
క్షితిసురులు లక్షణజ్ఞులు, హతుఁ డగుటను రాముఁ డనృత♦మాడిరి జ్ఞానుల్. ౯౮౩
కం.క్రతుశతనిరతుం డగుసు,వ్రతికి మహిషి సత్త్రయాగ♦పరుపత్నిని నై
నుతిఁ గందు నంచుఁ బలికిరి, హతుఁ డగుటను రాముఁ డనృత ♦ మాడిరి జ్ఞానుల్.
కం.మతిమంతులు దైవజ్ఞులు, క్షితిసురు లే వినుచు నుండఁ ♦ జెప్పిరి శుభసం
తతిశతము నన్నుఁ గూరిచి, హతుఁ డగుటను రాముఁ డనృత ♦ మాడిరి జ్ఞానుల్.
కం.అతులితవీరవరుం డగు,క్షితిపతికిం బత్ని నగుచుఁ ♦ జెలఁగెద నని స
త్కృతి నని చెప్పిరి యయ్యో, హతుఁ డగుటను రాముఁ డనృత ♦ మాడిరి జ్ఞానుల్.
ఉ. పాదములందు నేకమల♦పాణికిఁ గ్రాలునొ యిట్టిపద్మ రే
ఖాదిసుచిహ్నసంచయము ♦ లాతరళాక్షి నరేంద్రపత్ని యై
శ్రీదయివాఱఁ బొందు నభి♦షేకముఁ బట్టముతోడ, నక్కటా
నాదురదృష్ట మిట్టివియు ♦ నాశము లయ్యె నిరర్థకంబు లై. ౯౮౭
చం.తరుణులు లక్షణంబు లెవి ♦ దాల్చుటచేతను భాగ్యహీన లై
ధర విధవాత్వమందుదురొ ♦ తత్కులుపాంకము లందు నొక్కటేఁ
బొరయను, నిట్టి దుస్థితిని ♦ బొందుట యెట్టులొ? భద్రలక్షణో
త్కరములు పద్మచిహ్నములు ♦ కార్యము లేమి య దెట్లొ దైవమా. ౯౮౮
సీ. సమములు నలుపులు♦సన్నముల్ చికురముల్,కనుబొమల్ రెండును♦గలయఁ బడవు
రోమహీనములు వ♦ృత్తములు నాజంఘలు, పలుచా లెడము లేక ♦ కలసినదియుఁ
గణఁతలు నేత్రముల్ ♦ కరచరణంబులు, నూరులు గుల్ఫంబు ♦ లుబ్బ గలవు [యు
నిద్దముల్ గుండ్రముల్♦నెఱిసమంబులుగోళ్లు,లురుపయోధరములొం♦డొంటినొర
తే. మగ్నములు చనుముక్కులు ♦ మఱియు నాభి
యుబ్బుప్రక్కలు లోఁతును ♦ నొనరినదియుఁ
బ్రక్కలును ఱొమ్ము నుబ్బునఁ ♦ గ్రాలు నాదు
ననయవద్యుతి మణినిభ♦మై తనర్చు. ౯౮౯
కం.మృదువులు తనూరుహంబులు, పదతలములఁ గాలివ్రేళ్ళు ♦ బాగుగ ధరణీ
పదమున నానుట భద్ర,ప్రదచిహ్నము లనుచు నన్నుఁ ♦ బలికిరి పెద్దల్. ౯౯౦

కం.ఎఱుపులు నిరంతరంబులు, మఱియు సమగ్రయవరుచులు ♦ మత్కరపదముల్
చిఱునగు కల దని కన్యల,గుఱుతు లెఱుక కలుగు విప్ర♦కోటులు పలికెన్. ౯౯౧
తే. అవనిదేవులు పలికి రే ♦ నాధిరాజ్య,మందుఁ బతితోడ నభిషేక ♦ మందఁ గల న
టంచుఁ దత్సర్వమును వ్యర్థ♦మయ్యె నాదు,భాగ్యహీనతఁ దత్సూక్తి♦భంగ మందె.
కం.శోధించి జనస్థానము, సాధించి మదీయవార్త ♦ జలనిధి బలిమిన్
రోధించి గోష్పదంబున, బాధింపంబడిరి మఱఁది♦ప్రాణేశ్వరుఁడున్. ౯౯౩
సీ. వారుణాస్త్రంబును ♦ వాయవ్యబాణంబుఁ, బావకాస్త్రంబును ♦ బ్రహ్మశిరము
నైంద్రాస్త్ర మాదిగా ♦ నఖిలాస్త్రమండలి, వీర లెఱింగిన♦వార మఱియు
రామునికంటికి ♦ రణమునఁ బ్రతిసంధి, యగపడి యసురుతో ♦ నరుగ లేఁడ
యతఁ డెంతటిమనోజ♦వాఢ్యుఁ డేనియు నట్టి,వీరులఁ బర్వత♦వైరినిభుల
తే. సిఱుముకొని మాయ మఱుగున ♦ నింద్రజిత్తు,దిక్కు లేకుండు నాకల♦దిక్కు గాఁగ
నున్నరాముని లక్ష్మణు ♦ యుద్ధవీథిఁ, బిలుకుమార్చెను నిం కేమి ♦ తలఁప వచ్చు.
కం.రాముఁడు తమ్మునితో రణ,భూమిం దెగిపడుట కాల♦మున కతిభారం
బేమెయిఁ గలుగదు దైవం,బే మేలుం గీడుఁ గూర్ప ♦ హేతువు జగతిన్. ౯౯౫
కం.రామునకు నంత వగవన్, సౌమిత్రికి నంత వగవ ♦ జననికి వగవన్
నామాత్ర కేడ్వఁ గౌస,ల్యామహిత తపస్వినికి న♦లందురుదానన్.[1] ౯౯౬
కం.ఎప్పుడు వ్రత మీడేఱునొ, యొప్పుడొకో కనుదు సీత ♦ నే రామునితో
నొప్పెడిలక్ష్మణు నని మది, నెప్పుడుఁ జింతించుఁ ద్రోవ ♦ లెదురుం జూచున్.[1] ౯౯౭

⟵ త్రిజట సీతాదేవికి శ్రీరామలక్ష్మణులు జీవించి యున్నారని చెప్పుట. ⟶

చం.అని విలపింపఁగాఁ ద్రిజట ♦ యాసతిఁ గాంచి వచించె నేలయో
వనజదళాక్షి యేడ్చెదు భవ♦త్పతి ప్రాణయుతుండ, దుఃఖముల్
గొనకుము, రామలక్ష్మణులు ♦ గూల రటంటకు గొప్ప హేతువుల్
వినిచెద విన్ము నేఁ గనిన♦విన్ మును నాకు నెఱుంగ నైనవిన్. ౯౯౮
సీ. పతి హతుఁ డాయెనా ♦ భటులముఖంబులఁ, గనలును ముద మేమి ♦ కానఁబడదు
పుష్పకం బనుపేరి♦వ్యోమయానము దివ్య, మిది వీరు తెగిన ని ♦ న్నిందుఁ గొనదు
హతవీరసైన్యంబు ♦ హతనావికతరి నా, నుత్సాహ మెడలి ని♦రుద్యమ మగు
నీసేన భయ మింత♦యెఱుఁగక కలఁగక, రాఘవులను లెస్స ♦ రక్ష సేయు
తే. నిన్ని తెలిపితి నీమీఁద ♦ నెసఁగుప్రీతి, భద్రకారణచిహ్నముల్ ♦ పడఁతి యెఱిఁగి
నానుడిని విశ్వసింపుము ♦ మాను వగపు, నన్నదమ్ములు బ్రదికియ ♦ యున్నవారు.
కం.ఆడినది లేదు కల్లల, నాడఁగఁ బోనింక నెప్పు ♦ డంబుజనేత్రా!
యోడకు నామది కెక్కితి, చేడియ చారిత్రసఖ్య♦శీలత్వములన్. ౧౦౦౦

[1] ఇప్పటి యత్తలు కోడండ్రు దీనిని గమనింపవలయును.

ఉ. జానకి వీరి గెల్వఁగ న♦సాధ్యము సేంద్రసురాసురాళికిన్
మానితభద్రచిహ్నములు ♦ మానమిఁ గాంచి వచింతు వారినె
మ్మేనులవైఖరుల్ గనుమి ♦ మెల్లన మూర్ఛ నలంగి యుండియున్
మానదు నైజలక్ష్మి, ద్యుతి ♦ మాఱుఁ జుమీ విగతాసుదేహులన్. ౧౦౦౧

కం. సుందరి రామసుమిత్రా,నందనులకు వగచు టుడుగు ♦ నమ్ముము వీరిన్
క్రందింప నెట్టివా రా,స్కందనమునఁ జాల రేల ♦ కళవళపడఁగన్. ౧౦౦౨

తే. త్రిజట యీరీతిఁ బల్కిన ♦ దేవకన్య,బోని మైథిలుకన్య యా♦బాలఁ జూచి
యంబ నీవచియించిన♦యట్ల యగుత, మంచు నంజలిఁ గీలించి ♦ యనియె నంత.

తే. మరలి చని పుష్పకము రాము♦తరుణితోడఁ
ద్రిజటతో వారి లంకలో ♦ దించుటయును
నసురకాంత లశోకవ♦నాంతరము ప్ర
వేశ పెట్టిరి జానకీ♦లేళమధ్య. ౧౦౦౪

కం. ఆరాక్షసలోకేశువి,హారతలం బైనమంజు♦లారామము సీ
తారమణి చొచ్చి రాజకు,మారుల భావించి కాంచి ♦ మఱి మఱి వగచెన్. ౧౦౦౫

⟵ శ్రీరాముఁడు మూర్ఛ దేఱి లక్ష్మణుం జూచి దుఃఖించుట. ⟶

తే. వీరులు కీశనాయకులు ♦ వేయివిధంబులఁ దన్నుఁ గాచుచున్
భూరితరార్తి దుఃఖమునఁ ♦ బొక్కుచు నుండఁగ నంతలోపలన్
ధీరుఁడు సత్త్వశాలి రఘు♦నేత శరోత్కరబద్ధుఁ డయ్యునున్
గూరి స్మృతిన్ నిజాంతికపు♦క్షోణితలంబున నున్నతమ్మునిన్. ౧౦౦౬

కం. నెత్తుటువఱ్ఱులు వాఱఁగ, జొత్తిల్లినమేనితోడ ♦ సొలిమిడి గోని గా
ఢాత్తశరబంధనంబున, నొత్తోరు వయి నొగిలి యున్న ♦ యుత్తమవీరున్. ౧౦౦౭

కం. తిలకించి దుస్సహార్తిన్, నలఁగుడుపడి యేడ్చె నాయ♦నా! లక్ష్మణ! హా
యలఘుమతీ! తమ్ముఁడ ని,న్నిల నిట్టియవస్థఁ గంటి ♦ నెంతటిపాపిన్. ౧౦౦౮

కం. దురమున నిటు నిర్జితుఁ డై, సొరిగి పడిన కూర్మితమ్ముఁ ♦ జూడఁగఁ గలిగెన్
ధరణి నిఁ కేటికి సీతా,తరుణియు గిరుణియును జీప♦తము గీవితమున్. ౧౦౦౯

కం. నెమకిన సీతకు సమ యగు, కమలాక్షి లభింప వచ్చు ♦ క్షమ లక్ష్మణుతో
సముఁ డగుతమ్ముఁడు సచివుఁడు, సమరకళావిదుఁడు దొరకఁ ♦ జాలం డెందున్.

కం. బాణహతిఁ దమ్ముఁ డే ని,ర్యాణంబును బొందఁ గలిగె♦నా నిక్క మిటన్
క్షోణిరుహాటులు గనఁగాఁ, బ్రాణంబులు విడుతుఁ గాక ♦ బ్రదు కేమిటికిన్.

కం. ఏ మందును గౌసల్యకు, నే మందును గైకయికిని ♦ నే మందును నా
సౌమిత్రికి భరతున కీ,సౌమిత్రిని విడిచి నేను ♦ జనితిన యేనిన్. ౧౦౧౨

ఉ. ఎన్నఁడు వచ్చునో తనయుఁ ♦ డెప్పుడు గందునో యంచు నున్నస్త్రీ
మిన్నకు నేమి చెప్పుదు సు♦మిత్రకు, నీచెడువార్తఁ జెప్పినన్
ఖిన్నత వేపమాన యయి ♦ క్రేపు దొలంగినధేను వై మహా
పన్నత నొంది యేడ్వ నది ♦ పల్కుదు నే మని యూఱడించెదన్. ౧౧౧౩

చం. అడవుల కేగునీ కటు స♦హాయునిఁగాఁ దెక తేర కేను నా
కొడుకును బుచ్చితిన్, వనులఁ ♦ గోల్పడి యాతని నీవు భార్యయున్
విడిదికిఁ జక్కవచ్చితిరె ♦ వీరుఁడ యొక్కనిఁ గావ నీకునున్
గడిమి దొలంగెనా? యనుచుఁ ♦ గ్రౌర్యము దోఁప సుమిత్ర పల్కునన్. ౧౧౧౪

కం. సైరించు టెట్లొకో నా, కారణమున మడిసినట్లు ♦ క్షమఁ బడినాఁ డీ
శూరుఁ డనార్యుఁడ భృశపా, పారంభుఁడ ఛీ మనంగ ♦ నగుఫల మేమీ. ౧౧౧౫

సీ. అనయంబు దుఃఖించు♦నను నూఱడింతువే, విలపింప నిపు డేల ♦ పలుక వయ్య
యెవ్వరి రణమున ♦ నేపు మాపుదు వట్టి,యసురులచే హతుఁ ♦ డైతె తండ్రి
శరతల్పమునను నె♦త్తురు గాఱ శరజాల,వృతుఁడ వై సంధ్యార్క ♦ నెనసె దీవు
ఘనబాణహతమర్మ♦తను బల్కఁజాలమి, వ్యథఁ బ్రేమదృష్టులఁ ♦ బలికె దీవు

తే. వనములకు నొంటిగాఁ జను♦వాఁడ ననుచు, వెంట నెటు లీవు వచ్చితో♦వీరవర్య!
యటుల యమలోకమునకు నీ♦వరుగ నొంటి, నేను దోడన వచ్చుట ♦ నీతిగాదె.

తే. ఇష్టబంధుజనావృతుఁ ♦ డీతఁ డెప్పు, డయ్యు నేవేళ నన్నుఁ దా ♦ ననుసరించు
నట్టిగుణశాలి దురదృష్టుఁ ♦ డైననాదు, తెలివిలేమిని నిట్టిదు♦స్థితిని గాంచె.

కం. కోపించితి నేని నయో, పాపం బీలక్ష్మణుండు ♦ ప్రతిగా ననుఁ దా
నేపాటనేని యహితం, బో పరుషమొ పలుకఁ డెఱుఁగ ♦ మొగమునవిఱువేన్.

చం. అసమునఁ గార్తవీర్యుఁడు మ♦హాంబక పంచశతంబు లొక్కటన్
వెసఁ బరఁగించులోన భృశ♦వేగమునన్ బలుఁ డీతఁ డన్నియే
మసలక వైచుఁ, ద్రుంచు శత♦మన్యునియస్త్రము లస్త్రపాళి,నీ
యసమసుఖోచితుండు దెగి ♦ హా! ధరణిం బడియున్నవాఁ డయో. ౧౧౧౯

తే. ప్రతిన చేసితి రాక్షస♦రాజుఁ జేయు
వాఁడ నంచు విభీషణు ♦ బాస దప్పె
నట్టియనృతోక్తి యిపుడు నా♦యవయవముల
నిప్పువలెఁ గాల్చు చున్నది ♦ నేర సైఁప. ౧౧౨౦

శ్రీరాముఁడు సుగ్రీవుతోఁ గిష్కింధకుఁ బొమ్మని చెప్పుట.

శా. నీ వీమూర్ఛమునందు యంగదు నలున్ ♦ నీలున్ బలం బెల్ల సు
గ్రీవా! తోడ్కొని పొమ్ము నిల్వ కిట వాఃస్థిం దాఁటుమీ యేల నా

దేవారాతిపరివృఢుండు కినుకకా ♦ దృష్టించి నాలేమి నీ
పై వచ్చుకా హితసైన్యయుక్తుఁ డయి, పో♦వం దెప్పరం బత్తఱిన్. ౧౦౨౧
సీ. అన్యులు గావించు♦నట్టివా పావని, సమరానఁ జేసిన♦సాహసములు?
ఈజాంబవంతుండు ♦ నీగవాక్షుండును, జలిపినకృత్యముల్ ♦ పలుక వశమె?
తారేయు తెంపు నా♦తరమె వక్కాణింప, మైందుండు ద్వివిదుఁ డ♦మందబలులు
కేసరి సంపాతి ♦ చేసినకార్యంబు, లలఁతులా? యే మని ♦ యాడువాఁడ?
తే. గజుఁడు శరభుండు గవయుఁడు ♦ గంధమాద, నుండు లోనగుకీశు లు♦ద్దండవృత్తి
మన్నిమిత్తంబు ప్రాణముల్ ♦ మఱచి తెగిరి, మెచ్చితిని వీరి నెల్ల నో♦సచ్చరిత్ర!
కం. నీవు సుహృత్తును మిత్త్రం, బౌవాఁ డెం తెంతఁ జేయ ♦ నగు నంతయు సు
గ్రీవా! ధర్మభయంబునఁ, గావించితి దైవ మఱఁపఁ♦గా నరు వశమే. ౧౦౨౩
కం. వానరవరులారా! కడు,పూనికమై మిత్త్రకార్య♦మును జేసితి రే
మానసమున మెచ్చితి మీ, కానతి యిడినాఁడ నరుగ♦రయ్యా స్వేచ్ఛన్. ౧౦౨౪
చం. అనవుడు నెల్ల వానరులు ♦ హా యని కన్నులు వాఁచ బాష్పముల్
కనుఁగవనుండి వెల్లువలు ♦ గట్టఁగ నేడిచి రింతలో ననీ
కినులను నందు నందుఁ బరి♦కించి దృఢంబుగ నిల్పి రాఘవుల్
పెనుపటి యున్న చోటికి వి♦భీషణుఁడుం జనుదెంచెఁ జయ్యనన్. ౧౦౨౫
కం. అంజనధరాధరంబున,కుం జతయై గద ధరించి ♦ గొబ్బునఁ జనుదే
రం జడిసి యింద్రజిత్తని, యంజాయించుచును బాఱె ♦ నగచరకోటుల్. ౧౦౨౬

కపులు విభీషణుని నింద్రజిత్తని భ్రమించి పరువెత్తుట.

సీ. వాతూలహతిఁ బటా♦పంచ మామబ్బుల,భంగిని దన సేన ♦ పరువు వెట్టఁ
గనుఁగొని సుగ్రీవుఁ ♦ డనియె నీసైన్యంబు, కడలినడుమ సుడి♦గాలులకును
దిరుగుడుపడునావ♦కరణి నల్లాడెడిఁ, గత మేమొ యనఁగ నం♦గదుఁడు పల్కు
వీరులు రాజకు♦మారులు రాముఁడు, సౌమిత్రి మార్గణ♦జాల నిహతు
తే. లగుటె కారణ మన సుతు ♦ ననియె సూర్య
పుత్త్రుఁ డది కాదు మఱి యేదొ ♦ పుట్టఁబోలు
నాయుధంబులు విడనాడి ♦ యదరి బెదరి
నిలువుచూపులు విన్న మో♦ములును గలిగి ౧౦౨౭
తే. ఉఱుకుచున్నారు దెసలందు ♦ నెఱయఁ బిఱికి
కండ లందఱు నిసి నాన♦గండ[1] లగుచుఁ
బడినవారిని దాఁటుచుఁ ♦ బ్రక్కవారి
నీడ్చుకొని పోవుచున్నవా ♦ రింత యేల? ౧౦౨౮

[1] నానగండలు = సిగ్గువిడిచినవారు.

కం.అనులోన విభీషణుఁడును, దన కేలన్ గద ధరించి ♦ తత్రియఁగఁ జని దీ
వన లిచ్చి యినజునకు రామునిలక్ష్మణుఁ జూచు చుండె ♦ మునుఁగుచుఁ జింతన్.

చం.వనచరలోకభర్తయుఁ బ్ల♦వంగమభీషణు నవ్విభీషణున్
గని నికటస్థు భల్లుకని♦కాయపతిం గని యివ్విభీషణుం
గని కపికోటి రావణియ ♦ క్రమ్మఱి వచ్చె న టన్న శంకచేఁ
గనుకని పాఱెడిం, దెలిపి ♦ క్రమ్మఱుపం గదె వారి నెల్లరన్.  ౧౦౩౦

కం.అనవుడును జాంబవంతుఁడు, వనచరసంఘాతమెల్లఁ ♦ బరువిడుమార్గం
బున కడ్డ మగుచు నిట్లనుఁ, దనచేతుల నెత్తి కడును♦దారరవమునన్.  ౧౦౩౧

చం.వెఱవకుఁడీ కపీంద్రులు! వి♦భీషణుఁ డీతఁడు, శక్రజిత్తు గాఁ
డుఱుకకుఁడీ నిజం బరయ ♦ కూరక యంధత గోత్రదాఁటుగ,
న్బిఱికితనంబు పోత్తకము ♦ నేర్చితి రెన్నఁడు? చాలు నింకఁ గ్ర
మ్మఱుఁ డన వారు ఋక్షవిభు♦మాట మెయిం జని యవ్విభీషణున్  ౧౦౩౨

కం.కని విగతభీతి నుండిరి, యనఘుండు విభీషణుండు ♦ నాశుగచితులన్
ఘనబలుల రామలక్ష్మణులను గని వగపాటుమెయి జ♦లంబులఁ గనులన్  ౧౦౩౩

### దుఃఖించు విభీషణుని సుగ్రీవుండు దేర్చుట.

కం.తుడిచి భృశదుఃఖభరమున, మిడుకుచుఁ బలవించె హా య♦మేయబలాఢ్యుల్
కడుసాత్త్వికు లాజప్రియు, లడఁగిరిగా కూటయోధు[1] ♦ లగునసురులచేన్. ౧౦౩౪

తే. క్రూరచిత్తుండు మాయన్న♦కొడుకు వీరి, బుజపరాక్రములను మోస ♦ నిజపలాశి
వక్రబుద్ధిని బీడింప ♦ వ్రాలియున్న,వారు ముల్కులతో ముండ్ల♦పందు లనఁగ.

ఉ. ధీరుల నేరిఁ జేరితిఁ బ్ర♦తిష్ఠను గోరి[2] నరేంద్రు లిద్ద ఱీ
తీరున మిత్తిఁగూరెడిగ♦తిం బడినా, రిఁక నేను మన్గడన్
గూరియుఁ జచ్చిన ట్లయితిఁ ♦ గుంఠితరాజ్యమనోరథుండ నై
కోరిక యుం బ్రతిజ్ఞ సమ♦కూడె దశాస్యున కేమి పాపమో.  ౧౦౩౬

కం.అని విలపించువిభీషణుఁ, దనకౌఁగిటఁ బొదివి పలుకుఁ ♦ దరుచరవిభుఁ డ
ల్లన లంక నీవ యేలెదు, తనయులతోఁ గనఁడు కాంక్షి♦తము రావణుఁడున్.

చం.పగవకు మయ్య వీరి కొక♦బాధయుఁ గల్గదు, మూర్ఛ దేఱినన్
బగతుని సైన్యయుక్తుఁ డగు♦పంక్తిముఖున్ విదళింతు, రంచు నా
ప్పుగుగతి నూఱడించుచు ని♦జాంతికవర్తి సుషేణుతోడ నో
యగచర! లబ్ధసంజ్ఞుల న♦రాధిపులం గొని కీశసేనతోన్.  ౧౦౩౭

కం.చనుమిా కిష్కింధకు నే, దనుజేంద్రు సపుత్రమిత్ర♦తతిబాంధవునిన్
దునిమి కొని తెత్తు సీతన్, మును నష్టశ్రీని నమర♦ముఖ్యుని మాడ్కిన్.  ౧౦౩౮

[1] కూటయోధులు = మాయాయుద్ధము చేయువారు.  [2] ఉత్తరించిపికఁ జూడుఁడు.

↞ సుగ్రీవునితో సుషేణుఁడు సంజీవకరణిఁ దెప్పింపుమని చెప్పుట. ↠

సీ. అనుడు సుగ్రీవుతో ♦ ననియె సుషేణుండు, తొల్లి దారుణ మయి ♦ చెల్లెఁ గలహ
మమరాసురుల కందు ♦ నసమదానవశర,నిహతి బృందారక♦నిచయ మెల్ల
వ్రాలి సొమ్మలు వోయి ♦ ప్రాణముల్ విడువంగ, నమరగురుండు వి♦ద్యాప్రయుక్త
మహితౌషధుల చేత ♦ మాన్పెను దద్బాధ, నవియు క్షీరాంబుధి♦ప్రాంతమునను
తే. గలవు సంపాతి పనసాది♦కపులఁ బంపి, వేగ దెప్పింప వయ్య క♦పిప్రకాండు
లెల్ల రెఱుఁగుదు రచ్చోటు ♦ నీమరుత్త,నూజుఁ బంపుము బలియుండు♦ తేజు మెఱసి
తే. తెచ్చు; సుధకయి దేవతల్ ♦ ద్రచ్చి రెచటఁ,గలశవారాశి నచ్చోటఁ♦గలవుద్రోణ
చంద్రకుధరంబు లందు వి♦శల్యకరణి, దివ్యసంజీవకరణియుఁ ♦ దేజరిల్లు. ౧౦౪౧

కం.ఓషధులు నిలిపి రసుర,ద్వేషులు వేవేగ వానిఁ ♦ దెమ్మను మనుచున్
భాషించు చుండ నీలో, ఘోషము వినవచ్చెఁ జెవులు♦గోలుపుచు ఘనమై.౧౦౪౨

↞ గరుత్మంతుఁడు శ్రీరామలక్ష్మణులఁ జూడ వచ్చుట. ↠

కం.విడివడి మబ్బులు చెదరఁగఁ, కడలి కర ళ్ళెగసి యల్ల♦కల్లోలముగా
గడగడ లాడఁగ మేదిని, గడు సద్వీపద్రుమంబు♦గా లవణాబ్ధిన్. ౧౦౪౩

కం.మూలములతోడ భూరుహ,జాలంబులు విఱిగి కూలఁ ♦ జండసమీరం
బోలి నుదయించె సుడివడి, వ్యాలంబులు బెదరి పఱచి ♦ యంబుధి దూఁకెన్.

ఉ. వెంటనె సంజ్వలద్దహను♦పెంపున వెల్గుచు వైనతేయుఁడున్
మింటను దోఁచెఁ, దోఁచుటయు ♦ నీరజనేత్రులఁ జుట్టియున్న యా
తుంటరిపాఁపపుర్వులును ♦ దోన యథాయథలై భయంబు లో
నంటఁగఁ బాఱి దూఁకె లవ♦ణాంబుధి; నగ్గరుడుండు డాయుచున్ ౧౦౪౫

కం.కాకుత్థ్సులఁ గని యలరుచు, శ్రీకరచంద్రాభముఖకు♦శేశయయుగ మ
స్తోకప్రేమను నివురఁగఁ, బ్రాకటగతి మాసె మేని♦వ్రణజాలంబుల్. ౧౦౪౬

తే. ధిషణబలములు వీర్యంబు ♦ తేజ మోజ
ముత్తమగుణంబు నుత్సాహ ♦ మోలి స్మృతియు
సత్ప్రదర్శనమును రామ♦చంద్రునకును
లక్ష్మణునకును రెట్టించె ♦ లలితరీతి. ౧౦౪౭

తే. మేనికాంతియుఁ బసిఁడికి ♦ మేలుచేయి, యయ్యెనంత సుపర్ణుఁడా♦యనఘమతుల
నెత్తి కవుఁగిట నొత్తె సీ♦తేశుఁ డనియె, నమితసంతోషమున విన♦తాత్మజునకు.

↞ { నాగపాశబంధవిముక్తులై శ్రీరామలక్ష్మణులు గరుత్మంతునిఁ బ్రశంసించుట. } ↠

ఉ. అయ్య! భవత్ప్రసాదమున ♦ నాసురభర్తృసుతప్రయుక్త మా
నియ్యహిపాశబంధతతి ♦ నెట్టివిపత్తును లేక యేమియున్

డయ్యిక మున్నవోలెఁ బెనుధా♦కయుఁ గంటిమి, నిన్నుఁ జూడ మా
యయ్యను నాజిఁ[1] దాత నజు ♦ నాదృతిఁ గన్నటు లుల్లము బ్బెడున్. ౧౦౫౦

తే. రూపమును దివ్యమాల్యాను♦లేపనముల, విమలవస్త్రంబులను దివ్య♦వివిధభూష
ణంబులను ధాల్చి దివ్య తే♦జంబుఁ గలిగి, యొప్పు చున్నాఁడ వెవ్వండ♦వో మహాత్మ!

## గరుడుఁడు శ్రీరామునకు హెచ్చరికగ యుద్ధము సేయ బోధించుట.

కం. అనవుడు నానందాశ్రులు, కనుఁగొనలఁ సందడింప ♦ ఖగపతి యను మీ
కనుఁగుసఖుండను[2] గరుడుఁడఁ, బ్రణుతయశా! నీబహిశ్చ♦రప్రాణంబన్. ౧౦౫౧

సీ. చనుదెంచితిని మీకు ♦ సాహాయ్య మొనరింప, దానవాసురులు గం♦ధర్వు లైన
నింద్రుని మున్నుగా ♦ నిడుకొనివచ్చినఁ, బాపలే రీశర♦బంధనములు
మాయాబలంబున[3] ♦ మఘవారి నిర్మింపఁ, గాద్రవేయులు విష♦కఠినదంష్ట్రు
లిట్లు శరంబు లై ♦ యేతెంచి బంధించి, రీవార్త విని రయం♦బెసక మెసఁగ

తే. వచ్చినాఁడను స్నేహత♦త్వరత రామ!, వీడఁ జేసితి బంధముల్ ♦ వీరవర్య!
కూటయోధులు రాక్షస♦కులజు లెల్ల,నప్రమత్తత మీరుండు♦టర్హమయ్య. ౧౦౫౨

కం. అసురులకు బలము మాయయె, యనఘవినిర్మల మనస్కు ♦ లగుమీకు బలం
బెసఁగు ఋజుత్వమె కావున, నసురుల నమ్మంగవలవ ♦ దాహవమందున్. ౧౦౫౩

కం. దృష్టాంతం బిదె యనుచును, స్పష్టముగ గ్రహించి వారి♦చరితము నీ ష
ష్టాష్టకమున మెలఁగుడు మీ,యిష్టము నెఱవేఱు శీఘ్ర♦మే రఘురామా!

ఉ. నేను సఖుండ నెట్లయితి ♦ నీ కని చూచెద వవ్విచారముఁ
మానుము,[4] తద్విధం బని స♦మాప్తము నొంద నెఱుంగవచ్చు, నా
కానతి యిచ్చెదే చనఁగ ♦ నప్రతిధర్మవిధిజ్ఞ! శత్రులం
దేనియు మాన వీవు కృప ♦ నెప్పుడు నీరజపత్రలోచనా. ౧౦౫౫

కం. బాలురు వృద్ధులు దక్కఁగ, నీలంకఁ గలట్టియసుర♦బృందంబుల ని
ర్మూలించి మార్గణంబుల, శీలవతిఁ సీత మరలఁ ♦ జెందెద వనుచున్. ౧౦౫౬

తే. పలికివారలఁ దనయంక♦పాళిఁ గ్రుచ్చి,తతముదం బొనగూర్చి ప్ర♦దక్షిణించి
పవనునట్టుల యాకాశ♦పథముఁ బట్టి, తార్క్ష్యుఁ డరిగినఁ దేఱిన♦దాశరథుల

## శ్రీరామలక్ష్మణులఁ జూచి కపులు సింహనాదంబులు సేయుట.

కం. తిలకించి హర్షభరమునఁ, బులకించి మదించి వాల♦ములఁ దాఁచుచు గ
ర్జల నించి భేరి నినదము, బలియించి మృదంగరవముఁ ♦ బరఁగించి కపుల్. ౧౦౫౭

కం. వాయించుచు వాద్యంబుల, మ్రోయించుచు శంఖములను ♦ మునుపటియట్టుల్
క్రో యంచును జేయంచును, మాయించుచు రాక్షసులను ♦ మార్కొని రెలమిన్.

[1] ఆజి = అజమహారాజు కుమారుఁడు: దశరథుఁడు. [2] నీ వాహనమగుటచే; ఇది గూఢోక్తి.
[3] మాయాబలము = ఆశ్చర్యశక్తిరూపబలము. [4] వాస్తవము చెప్పిన నవతార రహస్యము వెలువడును.
రావణవధ పర్యంత మది వెలువడరాదు.

కం.జలదాగమమున వెఱఁగొన, జలదంబులు మ్రోయుగతి సి♦శామధ్యమునన్
బలిముఖులభీమనినదం,బులు కర్ణకఠోరముగను ♦ బోరిఁ బోరి నెగసెన్. ౧౦౬౦

→ రావణుఁడు కపులసంతోషమునకుఁ గారణము విచారించుట. ←

మ. పటుసంరంభవిజృంభమాణకపిసం♦వ్రాతస్ఫురద్భీషణా
ర్భటు లుద్దామగభీరకంఠనినద♦వ్యాపారముల్ పర్వ నొ
క్కట సంసద్గతరావణుం డులికి ర♦క్షఃకాండమున్ వానరో
ద్భటకోలాహలసింహనాదములు నా♦దన్స్నేహగర్జాచ్ఛటన్ ౧౦౬౧

కం.తలఁపించెను బట్టనముం, దలఁకించెను సాగరంబుఁ ♦ దలరించెను లో
నలు కించుక లేక యిటుల్, తలిరుపఁగా నేదికతమొ ♦ తరుచరవీరుల్. ౧౦౬౨

ఉ. ఏదియొ హర్షహేతువు క♦పీంద్రులకున్ ఘటియిల్ల నోపు, సీ
తాదయితుండు లక్ష్మణుఁడు ♦ దారుణనాగమహాస్త్రబద్ధులై
మేదినిఁ గూలి యుండఁగ ని♦మిత్తము లేకయె సేన యుబ్బునే?
మేదుర మయ్యె సందియము ♦ మీరు వెసం జని తన్నిదానమున్ ౧౦౬౩

ఉ. ఆరసి రండు పొం డన భ♦యాకులతం బరువెత్తిపోయి ప్రా
కారము లెక్కి వానరని♦కాయముఁ గన్గొని ముక్తబంధులన్
హారివిహారలోలసమ♦రాంగణపర్తుల భీమమూర్తులన్
శూరుల రామలక్ష్మణులఁ ♦ జూచి గభిల్లన గుండె లాశరుల్ ౧౦౬౪

మ. వెలుకం బాఱినమోము లొప్పఁ జని యా♦వృత్తాంతమున్ సర్వమున్
దెలియం బల్కిరి శక్రవైరిశరబం♦ధీభూతనిశ్శేష్టు లా
బలధుర్యుల్ గజతుల్యవిక్రములు త♦త్పాశంబులం ద్రెంచి య
స్ఖలితాండబరవృత్తిఁ గ్రాలెదరు రా♦జా! రాముఁడుం దమ్ముఁడున్. ౧౦౬౫

→ { శ్రీరామలక్ష్మణులు నాగపాశవిముక్తులగుటకు రావణుఁడు వ్యసనపడుట. } ←

చం.అనవుడుఁ జింతయున్ వ్యసన ♦ మారట పెట్ట విషణ్ణచిత్తుఁడై
యనియె దశాస్యుఁ డేమిది మ♦హాపవనాశనతుల్యముల్ విక
ర్తనసమముల్ పితామహవ♦రప్రతిపన్నము లప్రతీపముల్
ఘనతరమత్సుతాస్త్రములు ♦ కా వవి వ్యర్థము లెన్నఁ డేనియున్. ౧౦౬౬

కం.అట్టిశరంబుల నింద్రజి, బిట్టుగఁ గట్టినను మరల ♦ విడివడిరి రిపుల్
చిట్టలు నాబల మిఁక న,న్నెట్టును రక్షించు ననుట ♦ యేమో నమ్మన్. ౧౦౬౭

కం.ఒవ్వనివారలప్రాణము, లువ్వెత్తుగఁ దీయఁ జాలు ♦ నుగ్రశరచయం
బవ్వానుకిసమ తేజం, బివ్విధి వ్యర్థముగఁ బోయె ♦ నిఁక నే మనఁగన్. ౧౦౬౮

### ధూమ్రాక్షుఁడు యుద్ధమునకుఁ బోవుట.

కం. అని రోషకషాయితలోచనుఁడై రోఁజుచును బామువిధంబున దశా
ననుఁ డను ధూమ్రాక్షునితోఁ, జనుమీ దుర్వారసైన్యసంయుక్తుఁడ వై

ఉ. నీవు వధార్థ మై[1] మదవనేచరయుక్తుఁడు రాముమీఁదికిన్,
నావుడు వాఁడు సన్నహము నన్ దశకంధరు మ్రొక్కి పోయి సై
న్యావళిఁ గూర్చు శీఘ్రముగ నాలము చేసెద వేల? నావుడున్
రావణునాజ్ఞ సైన్యపతి రాణున సిద్ధముఁ జేసి తెచ్చినన్. ౧౦౨౦

శా. ఘంటావ్రాతఘణంఘణంఘణఘణక్వాణంబు నిండన్ దెస
ల్మింటల్ చిమ్మ ధగద్ధగద్ధగితశూలప్రాసభల్లాదులున్
మింటిం దన్న ఢమంఢమంఢమఢమామేయోరువాద్యధ్వనుల్
గంటుంగొంటరితుంటరక్కసులమూఁకల్ మీఱె నస్తోకమున్. ౧౦౨౧

కం. క్ష్వేళాపూరితదిశు లై, కాలాయసదండపరిఘకరవాలమహా
శూలపరశ్వధపట్టిస, జాలజ్వలితాంగు లగుచు సంభ్రమమతు లై ౧౦౨౨

కం. కవచులు ఖడ్గులు ధ్వజు లై, సవురుగ రాక్షసులు స్వర్ణసంచయయుతముల్
వివిధాస్యఖరంబులు గల, రవిసన్నిభ రథములందుఁ గ్రాలిరి కీవిన్. ౧౦౨౩

కం. పరమజవోపేతము లగు, హరులపయిన్ మదకలంబు[2] లగుదంతుల పై
సురవైరులు వ్యాఘ్రంబుల, కరణిన్ దుర్జయులు చనిరి కలహోత్సుకు లై. ౧౦౨౪

కం. వృకసింహాముఖసువర్ణ, ప్రకటాలంకారయుక్తపటుఖరరాజ
ద్వికటస్యందనగతుఁ డై, చకచకి ధూమ్రాక్షుఁ డరిగె సమరంబున కై. ౧౦౨౫

### ధూమ్రాక్షున కపశకునంబు లగపడుట.

ఉ. హారివిలాసహాసరుచిరాననుఁ డై హనుమంతుఁ డున్న యా
ద్వారముఁ జేరఁబో శకునవారము మింటను గట్టె, గ్రద్దయున్
దేరపయిన్ దభాలునను ద్రెళ్లె, ధ్వజాగ్రమునందు గ్రద్దలున్
వారక వ్రాలెఁ, దెల్లనికబంధము తన్నికటస్థలంబునన్. ౧౦౨౬

కం. తొరఁగెడి నెత్తుటఁ దడియుచు, స్వరము వికారంబుగాఁగ సైన్యాధ్యక్షున్
బరికించి యార్భటించుచు, ధరణీతలమందుఁ బడియె దబ్బున మఱియున్. ౧౦౨౭

కం. కురిసెన్ నెత్తురు పిడుగులు, దొరలెడిగతి గాలివీచె దొర కెదు రగుచున్
ధరణి వణంకెను నల్లెడ, నిరు లఱిమెను దిశలు కాంతిహీనము లయ్యెన్. ౧౦౨౮

కం. వీక్షించి వాని నాధూమ్రాక్షుఁడు తనలోన మిగుల నలమట చెందెన్
రాక్షసులును మూర్ఛాగతు, లై క్షితిపైఁ బడిరి సాధ్వసాక్రాంతగతిన్ ౧౦౨౯

[1] నీవు రామవధార్థమై చనుమని రావణు భావము. నీవు చచ్చుటకై పొమ్మని నోరవచ్చెను.

[2] మదకలము = మదపుటేనుఁగు.

కం.ఎట్టును ధృతిగొని సేనలు, చుట్టును దనుఁ గొలిచి రాఁగ ♦ సురసూదనుఁడున్
జెట్టుం ద్రిమ్మరి గమిపై, నిట్టల మగువీఁకఁ జనియె ♦ నిబ్బర మొనరన్. ౧౦౮౦

ధూమ్రాక్షుసేనలు కపులతోఁ బోరుట.

ఉ. ద్వారము దాఁటి వచ్చు సుర♦వైరిని గాంచి కపీంద్రు లెల్ల హా
స్లారభటుల్ చెలంగఁ గల♦హప్రియులై వెస నంటఁదాఁకినన్
వారలసంకులాహవ మ♦వారితభీషణమై రహించె గో
త్రారుహశూలముద్గరశ♦రప్రతిఘాత మనన్యసామ్య మై. ౧౦౮౧

చం.పరశుగదాత్రిశూలశర♦పట్టిసభల్లిక భిండిపాలము
ద్గరముఖసాధనంబుల ము♦ఖాముఖి రాక్షససేన పోరఁగాఁ
దరుగిరిశృంగహస్తులయి ♦ దర్పితవానరకోటి రాక్షసో
త్కరములమీఁద దూఁకి ప్రవి♦దారితగాత్రముఁ జేసె సైన్యమున్. ౧౦౮౨

చం.కినుక సురారిసంఘములు ♦ కేరి గదాదికసాధనాదులన్
వనచరపాళి నెత్తురులు ♦ వఱ్ఱులు వాఱఁగఁ జేయ వారలున్
ఘనశరదారితాంగు లయి ♦ ఖడ్గసుతాడితదేహు లయ్యునున్
వెనుచన కశ్మవృక్షహతి ♦ వ్రీలఁగఁ జేసిరి తచ్ఛిరంబులన్. ౧౦౮౩

మ.శిరముల్ బ్రద్దలు వాఱ మోఁదుచు రయ♦శ్రీ దోఁప శాఖావళిన్
గరముల్ నేలఁ దొరంగ బాఁదుచును ని♦ష్కారుణ్యచిత్తంబునన్
సరముల్ ప్రేవులుఁ ద్రెంచి వైచుచును నా♦నాభంగి దంష్ట్రాళిచే
నురముల్ వ్రచ్చిరి దొంతి గ్రుచ్చిరి జయ♦ప్రోత్సాహ మేపారఁగన్. ౧౦౮౪

ఉ. చింతురు శత్రుకాయములఁ ♦ జీలికలై పడ రెండు రెండుగా
దంతురు బజ్జి బజ్జిగ ను♦దారరయంబునఁ జెట్లదెబ్బలన్
నొంతురు ఱాల ఱప్పల న♦నూనమహాద్భుతవృష్టిఁ గొల్పి మ
ర్దింతురు ముష్టిఘాతములఁ ♦ గ్రిందఁ బడన్ మెడఁ ద్రొక్కి యీసునన్. ౧౦౮౫

కం.రక్కసులు కపులపోటులఁ, గ్రక్కిరి నెత్తురులు నేలఁ ♦ గండలతోఁ దా
రుక్కిరిబిక్కిరియై చెడి, స్రుక్కిరి మక్కిరి మఱుంగు ♦ చొచ్చిరి భీతిన్. ౧౦౮౬

కం.కూలినఖరముల ప్రోవుల, వ్రాలినటెక్కెములఁ జెడిన♦రథములగుమిచేఁ
దూలినగజములచే మెయి,చీలినతురగములచేత ♦ క్షితి నిండారెన్. ౧౦౮౭

కం.గంతుగొని చివ్వనం దమ,దంతంబులఁ గఱకుగోళ్ల ♦ దనుజులముఖముల్
వ్రంతలుపడ చీలిచి యము,నంతికమున కనిచి రగచ♦రాధిపు లంతన్. ౧౦౮౮

కం.వ్రేలెడు వెంట్రుకలును రుచి,మాలినమోములును రక్త ♦ మాంసజమూదో
త్తాలకుగంధముసోఁకున, పోలెడు దేహములు నగుచు ♦ సోఁకులు[1] పఱచెన్.

[1]సోఁకులు = రాక్షసులు.

→ ధూమ్రాక్షుఁడు కపుల వధించుట. ←

కం. కొందఱు రోషవశంబునఁ గ్రందుగఁ బైపడి శితార♦కఠినతలములన్
డెందముల మోఁద వారల, మ్రందించిరి కపులు చరణ♦మహీజాహతులన్.

కం. రాక్షసులపాటిపోకయు, వృక్షౌటులమీఱిరాక ♦ వీక్షించుచు ధూ
మ్రాక్షుఁడు రోషకషాయిత,వీక్షణుఁడై కవిసె నహిత♦బృందముమీఁదన్. ౧౯౧

ఉ. వాసవశత్రుతుల్యశిత♦బాణపరంపరఁ గ్రుచ్చి కొందఱన్
బ్రాసపరశ్వధాహతులఁ ♦ బట్టిసముద్గరశూలఘాతులన్
ద్రాసకరాస్త్రసంతతుల ♦ దారితగాత్రులఁ జేసి గొందఱన్
భాసురవిక్రమం బడర ♦ బల్విడి క్రోఁతుల యే పడంచుచున్. ౧౯౨

కం. ఎక్కడఁ జూచినఁ దానై, ప్రక్కలు చెక్కుచు సురంబుఁ ♦ బగిలించుచు మేన్
వ్రక్కలు వ్రక్కలు చేయుచు, నుక్కున విహరించె బలమ♦దోద్ధతి మెసఁగన్.

కం. తెలిపి గని సోఁకుమూఁకలు, నలికఁగఁ గీశులను వారు ♦ నలిగులి యగుచున్
బలిచిరి చచ్చిరి నెత్తుటఁ, దలచుగఁ దోఁగిరి నరాలు ♦ తెలుగుడుపడఁగన్.

కం. జ్యాతంత్రీమధురము హి,క్కాతాళసమన్వితంబు ♦ గజబృంహితసం
గీతము రణగాంధర్వం, బాతతమై వెలసె నతని♦యాహవకేళిన్. ౧౯౫

కం. కార్ముకవిచ్యుతశరజా,లోర్మిపరంపరలఁ గపికు♦లోర్విని ముంపన్
మార్మొగ మిడుక్రోఁతులఁ గని, ధూర్మహితగ్రావ మెత్తి ♦ ద్రుతగతి యగుచున్

→ ధూమ్రాక్షుఁడు హనుమంతునిచే హతుం డగుట. ←

కం. ధూమ్రాక్షునిపైమారుతి, తామ్రాక్షుం డగుచు వైచెఁ ♦ దచ్ఛిల వడి రా
వే మొగ్గుజవంబున ధర,పై మ్రాన్పడ కుఱికి నిలిచెఁ ♦ బటుగదఁ గొనుచున్.

చం. పిడుగన వచ్చి యాశిలయుఁ ♦ బిండిగఁ జేసె రథంబుఁ గాఁడితోఁ
దాడితోడి వింటితో ధ్వజము♦తో రథచక్రయుగంబుతోడఁ ద
త్తడిగమితోడ దానిఁ గని ♦ దానవవీరులు వేగవంతులై
యెడఁ జొరఁ బాఱి తాఁకిరి య♦హీనపరాక్రము మారుతాత్మజున్. ౧౯౮

ఉ. ఆతఁడు గండుమీఱి విల♦యాంతకుఁడైవడి స్కంధయుక్తభూ
జాతముఁ ద్రిప్పుచుం గవిసి ♦ చావఁగ మోఁదుచు ఘట్టటారవ
స్ఫీతముగాఁ దల ల్పగులఁ ♦ జేయుచు శోణితవాహినిన్ సము
ద్భూతముఁ జేయ రాక్షసులు ♦ దూలిరి త్రస్తవిషణ్ణచిత్తులై. ౧౯౯

ఉ. రాక్షసు లిట్టుపాఱుటయుఁ ♦ గ్రమ్మఱనొక్కనగంబుకూటమున్
దక్షుఁడు కేలఁ బట్టి భయ♦దత్వరితుం డయి మీఁద రాఁగ ధూ

మ్రాక్షుఁడు సింహనాదముఖ♦రాననుఁ డై గద యెత్తి మారుతిన్
వక్షము వ్రయ్య నేయుటయుఁ ♦ బావని లక్ష్యము సేయ కుగ్రుఁ డై, ౧౧౦౦

కం. లక్షించి శృంగమును ధూ,మ్రాక్షుని నడినెత్తి వైచె ♦ నతిజవమునఁ ద
ద్రక్షఃపాలుఁడు దానం, బ్రక్షీణాయుష్కుఁ డగుచుఁ ♦ బడియె ధరిత్రిన్. ౧౧౦౧

కం. పిడు గడిచినకుధరముక్రియఁ, బడినబలాఢ్యుఁ జూచి ♦ ప్లవగము లెగవన్
నుడివడి యెదవడి విహ్వల,పడి పఱచిరి లంకత్రోవఁ ♦ బట్టి నిశాటుల్. ౧౧౦౨

కం. ఈవిధి హనుమంతుఁడు ర,క్షోవీరుం బిలుకుమార్చి ♦ కోఁతిబలఁగముల్
వావిరిఁ బూజింపఁగఁ దన,తావునఁ జని నిలిచె యుద్ధ♦తత్పరుఁ డగుచున్. ౧౧౦౩

రావణుఁడు వజ్రదంష్ట్రుని యుద్ధంబున కనుచుట.

సీ. ధూమ్రాక్షుమృతి విని ♦ తోరపుటల్కచే, దశకంధరుఁడు వజ్ర♦దంష్ట్రుఁ జూచి
రామలక్ష్మణుల శా♦ఖామృగనేతతో, సంహార మొనరింపఁ ♦ జనుము నీవ
వల్లె యని ♦ యధికసైన్యముతోడ, నరిగె యుద్ధేచ్ఛ మా♦యావి యసుర
మకుట కేయూరాది♦మండితగాత్రుఁ డై, కవచంబు దొడి పట్టి ♦ కార్ముకంబు
తే. ధ్వజసమాలంకృతోజ్జ్వల♦తప్తకనక,రమ్యభూషణభూషిత♦రథముఁ జేరి
దాని వలగొని యెక్కి గ♦దావిచిత్ర,శూలముద్గరవరకర♦వాలధరులు ౧౧౦౪

కం. భటులు వివిధాస్త్రశస్త్రో,ద్భటులు విచిత్రాంబరులు ము♦దంబునఁ జన ను
త్కటమదదంతావళములు, పటుగతి నడకొండ లనఁగ ♦ బలువిడి నడవన్. ౧౧౦౫

తే. తోమరాంకుశకరులు సం♦గ్రామనిపుణు, లధికశూరులు కరులపై ♦ నరిగి రల్ల
బలము వర్షాగమమునశం♦పాసమేత,గర్జదంబుదనిచయంబు♦కరణిఁ బొలిచె. ౧౧౦౬

వజ్రదంష్ట్రుఁడు యుద్ధమునకు వెడలుట.

ఉ. వాలితనూజుదక్షిణపు♦ద్వారమునన్ వెడలంగ వారిపై
వ్రాలె విమేఘ మైన సుర♦వర్త్మమునుండి మహోల్క లగ్నులన్
జ్వాలలు గ్రక్కి నక్క లశు♦భంబుగ భీకరరీతిఁ గూసె ర
క్షోలయ మారఁ దెల్పుచు శ♦కుంతములున్ విహరించె మింటిపై ౧౧౦౭

కం. మృగములు రక్షోజాలము, దెగుటను సూచింపఁ దొడఁగెఁ ♦ దేరకు యోధుల్
వగచెడి భయమోహితు లై, దిగువం గా ల్జాఱి పడిరి ♦ ధృతిచెడి రరుగన్.

కం. ఆమహితోత్పాతములకు, వ్యామోహిత మగుచు యోధ♦వర్గము దూలన్
భీమాహవదోహలుఁ డై, యేమియు నవ్వజ్రదంష్ట్రుఁ ♦ డెదవడ కరిగెన్. ౧౧౦౯

ఉ. ఆతనిరాకఁ గాంచి కపు ♦ లంబరముం బగిలించునార్పులన్
వీతదరంబుగా నటిమి ♦ భీమము గాఁగ రణం బొనర్పఁగా

జాతరుషాత్ము లాకపిని♦శాచరముఖ్యు లొక ల్లొకల్ల ని
ర్ఘాతసమప్రహారముల ♦ ఘాత మొనర్పఁగఁ బూని యుద్ధతిన్. ౧౧౧౦

కం. జివ్వన యుఱ్వినతాలును, జివ్వలవలె వచ్చుశితవి♦శిఖములు దగులన్
జివ్వను నెగిరెడిమిడుఁగురు, లవ్వేళం జూపఱకు మ♦హాద్భుత మిడియెన్. ౧౧౧౧

సీ. ఉపలద్రుమంబులు ♦ విపులకాలాయస,సాధనంబును దాఁక ♦ జరగురవము
సరభసంబుగఁ బాఱు♦స్యందనంబుల నేమి,చయముల నుదయించు♦చప్పుడులును
భేరీమృదంగశం♦ఖారింఖణధ్వనుల్, జ్యాలతాటంకార♦శబ్దములును
గరులబృంహితములు ♦ హరుల హేషారవం,బులును గాల్బలముల♦బొబ్బరింత

ఆ. లట్టహాసములును ♦ నన్యోన్య తాడన,నాదములును సమితి♦వాదములును
గరము లప్పళింత ♦ బెరసి యయ్యిరువాఁగుఁ, జెవుడుపఱిచె గుండె ♦ చెదరఁ జేసె.

కం. అసురులు కొందఱు సాధన,విసరంబులఁ గపుల నొంప ♦ నృపోటవరుల్
కసిపూని ద్రుమములం గొని, పస మాపిరి శత్రుసైన్య♦భటవర్గములన్. ౧౧౧౩

ఉ. ఇయ్యెడ బాహుయుద్ధము మ♦హాద్భుతభంగిఁ జెలంగె వానరుల్
చయ్యనఁ గాలుసేతులను ♦ జానుల ముష్టుల నొంపఁ జొచ్చినన్
గుయ్యిడఁ జొచ్చె నాశరుల♦కూటువ, వారలపాటుఁ గాంచి మ
బ్బొయ్యన నుర్వుభంగి రథ ♦ ముద్ధతిమైఁ బఱపెన్ మదాంధుఁ డై. ౧౧౧౪

తే. వజ్రదంష్ట్రుండు దుర్వార♦బాణజాల,వృష్టిఁ బరఁగించి వానర♦వీరవరులఁ
గనువుగొట్టుచుఁ ద్రిజగతీ♦కల్పసమయ,పాశహస్తకసమవర్తి♦పగిదిఁ దిరిగె. ౧౧౧౫

చం. వెఱ పొకయింత లేక యరి♦వీరబలంబులలోని కుద్ధతిం
బఱపి రథంబు జ్యాలతిక ♦ బంధుర మై మొరయంగ బాణము
ల్దెఱపియు లేక యుండ నవ♦లీల నిగుడ్చుచుఁ గ్రోఁతిమూఁకలన్
నఱకుచుఁ బాఱఁదోలుచు వి♦నాశముఁ జేయుచుఁ జేవఁ జూపినన్. ౧౧౧౬

## అంగదుఁడు శత్రుసేనపై విజృంభించుట.

ఉ. ఆతనిప్రాపునం గెరలి ♦ యాశరవర్గ మనర్గళక్రమ
స్ఫీతమహాస్త్రధారలను ♦ జెండెఁ బ్రచండగతిం బ్లవంగమ
వ్రాతము, దానికిం గనలి ♦ వాలిసుతుండు యుగాంతహేతిమ
ద్భాతిని మండుచుం గదియఁ♦బాఱె నుదగ్రమహీజహస్తుఁ డై. ౧౧౧౭

శా. బాణాత్రిప్పు చదృశ్యుఁ డై బలజవ♦ప్రావీణ్యముల్ దోఁపఁ గం
ఖాణస్యందనకేతుసూతయుతర♦క్షస్సైన్యసంఘంబు సం
క్షీణం బై చెడఁ గృత్తభూజములమా♦డ్కిన్ ఛిన్నమూర్ధాంగగీ
ర్వాణారుల్ ధర వ్రాల విక్రమకళా♦రంభైకసంరంభుఁ డై. ౧౧౧౮

కం. ఎక్కడఁ జూచిన రుధిరం, బెక్కడఁ జూచిన శవంబు ♦ లెక్కడఁ గనినన్
రక్కసులమేనితుండెము, లెక్కడ శస్త్రములతునుక ♦ లెసఁగించె ననిన్. ౧౧౧౯

కం. హారంబులతో మణికే,యూరంబులతోడ నంబ♦రోత్కరములతో
సారతరశస్త్రతతితో, శారదనిశవోలె వెలిఁగె ♦ సమరాంగణమున్. ౧౧౨౦

కం. క్షుద్రమృగంబులఁ జూచిన, రుద్రాణీవాహనంబు♦రూపున భృశశౌ
ర్యోద్రేకస్ఫూర్తిని గపి, రౌద్రంబుగ రూపుమాపె ♦ రాక్షసకోటిన్. ౧౧౨౧

## వానరులు వజ్రదంష్ట్రుసేనలఁ బోరిగొనుట.

సీ. అంగదుఁ డిట్టు ల♦భంగురవిక్రమ, మెసఁగ శాత్రవసేనఁ ♦ గసిమసంగ
నుగ్రప్రభంజను ♦ నుద్ధతి కోర్వక, విరియుమబ్బులమాడ్కి ♦ విచ్చుసేనఁ
గని వజ్రదంష్ట్రుండు ♦ కనలి శక్రాశని,సమనిస్స్వనం బైన♦జ్యారవంబు
చెవుడు గొల్పఁగ మహా♦శీవిషసంకాశ,నారాచవర్షంబు ♦ ఘోరభంగిఁ
ఆ. గురిసి మిగిలివచ్చు♦క్రోఁతుల నాఁగినఁ, దేజి రాత్రిచరులు ♦ దివ్యశస్త్ర
సమితిఁ గీశయోధ♦సంఘంబుపైఁ జిమ్మి, యుబ్బణంప దండి♦నిబ్బరమున. ౧౧౨౨

కం. వేలకొలందుల సాధన,జాలంబుల సోఁకుమూఁక ♦ సందీక వడిన్
శైలాటయోధముఖ్యుల,పై లీలన్ విసరి విసరి ♦ పస మాపంగన్. ౧౧౨౩

కం. చేయుంగలకీశులు గ్రా,వాయుధులై కో యటంచు ♦ నార్చుచు గుములై
యాయామినీచరేంద్రుల,కాయంబుల నలియ నడిచి ♦ కాలునిఁ గూర్పన్. ౧౧౨౪

సీ. గుట్టలై రాలిన♦కుణపరాసుల నెక్కి, తోడేళ్లు లాడి య♦స్తోకరతిని
జిట్టలుగా రేఁగి ♦ యట్టలగుమి మూఁగి, గొండిలి సల్పెఁ బ్ర♦చండభంగి
నందిపొందినహార ♦ లందఱతోఁ గడు,పార గ్రద్దలు విందు ♦ లారగించె
నల్లయేఱులఁ బుట్టె♦మొల్లంపుఁ దెప్పల, నిక్కున నూరేగె ♦ నక్కపిందు
తే. వాయసంబులు మింటఁ గా♦వా చరించె,గాకగృధ్రంబులకుఁ బెద్ద♦కలహ మయ్యె
నపుడు భూతభయానకం ♦ బైనరీతిఁ, బరిఘవిల్లెను నాసుర♦ప్లవగరణము. ౧౧౨౫

## వజ్రదంష్ట్రుఁడు వానరసేనపై విజృంభించుట.

కం. పగులుతలల్ దెగడుమొల, లొగులుమెయుల్ తునుఁగుచేతు♦లుం బాదములై
తగులు శరంబుల నెసఁగిన, నెగులునఁ జెడి పడిరి యామి♦నీచరకీశుల్. ౧౧౨౬

ఉ. చండతరప్రతాపి కపి♦సైన్యముచేఁ దమవార లందఱున్
గండఱి తూలి తాఁ గన వి♦కావికలై చనుచుండ వజ్రదం
ష్ట్రుండు శరాసనంబుఁ గొని ♦ రోషసముజ్జ్వలభీకరప్రతీ
కుండయి వానరుల్ బెదరఁ ♦ గ్రూరగతిం బరఁగించె నమ్ములన్. ౧౧౨౭

శా. వ్యూహంబుల్ కలఁగంగఁ బాఱ నరదం♦బుం దోలుచున్ సంగరో
త్సాహం బిన్నడిగా నిశాతవిశిఖా♦సారంబునం గీశరా
డ్దేహంబు ల్దుఱుమాడుచున్ నఱకుచున్ ♦ దృష్టింప దుర్లక్ష్యుఁ డై
బాహాటోపముఁ జూపె నాహవకళా♦పాండిత్యముం జాటుచున్. ౧౧౨౮

కం. తక్కక క్రోధావేశం, బెక్కఁగ నేవురును నేడ్వు ♦ రెనమంద్రుగఁ దా
నొక్కొకనారాచంబున, నక్కపులను గుదులు గ్రుచ్చి♦యామికఁ బాపెన్. ౧౧౨౯

కం. ఒఱగుమెడల్ విఱుగుదొడల్, నఱకుడువడుకాళ్లు నగుచు ♦ నగచరవర్యుల్
విఱిగి చని వాలితనయుని, మఱుఁగునఁ జొరఁబాఱి రపుడు ♦ మలచపు వెఱచేన్.

← వజ్రదంష్ట్రుఁ డంగదుతోఁ బోరి చచ్చుట. →

ఉ. త్రస్తుల నాత్మయోధులను ♦ దారతనూజుఁడు గాంచి కిన్కమై
మస్తక మూఁచి చూపుల నె ♦ మానవభోజి దహించునట్టిఁ డై
శస్త్రజవంబునన్ హరి గ♦జంబుపయిం బడుమాడ్కి దూఁకి య
భ్యస్తసమస్తజన్యవిధుఁ ♦ డంకిలి లేకొక గ్రుద్దు గ్రుద్దినన్. ౧౧౩౧

కం. తోమరసంఘాతంబుల, సామజమును గ్రుమ్ముగతి ని♦శాచరుఁ డలుకన్
భీమశరసహస్రముల ను, త్రామజసుతుమేను నలిపె ♦ రక్తమయముగన్. ౧౧౩౨

ఉ. ఇవ్విధి బాణవర్షము న♦హీనగతిం గురియించి మర్మముల్
నొవ్వఁగఁ జేయ శక్రజుత♦నూభవుఁ డొక్కవిశాలసాలము
న్రువ్వన పీచి వైవఁ గని ♦ నూల్కొని లీల సురారి భూజమున్
గ్రొవ్వన నింత లింతలుగఁ ♦ గూల్చె ధరం బడ శౌర్యసంపదన్. ౧౧౩౩

ఉ. ఆశరువిక్రమంబు తెఱఁ ♦ గంతయుఁ గన్గొని శైల మొండు వే
కీశవరుండు గైకొని ప♦కీలున వైచె ససింహనాదుఁ డై
లేశముఁ గొంక కాతఁ డవ♦లీల గదం గొని దిగ్గదాఁటినన్
నాశముఁ జేసె భూధ్రము క్ష♦ణంబునఁ దేరి సచక్రవాజిగన్. ౧౧౩౪

కం. వెండియును వాలినందనుఁ, డొండొకతరుయుక్తభూధ్ర ♦ ముద్ధతి విసరన్
గండలు గ్రక్కుచు నద్దైత్యుండు ధరన్ పోలె గదను ♦ నూఁతగఁ గొనుచున్.

తే. ఊర్చుచును వ్రాలి యొకక్షణం ♦ బుండి లబ్ధ, సంజ్ఞుఁ డై లేచి కదసిన♦శక్రపౌత్రు
ఱొమ్ము లక్షించి బిట్టుగఁ ♦ గ్రుమ్ముటయును, వాలితనయుండు నగ్గదఁ♦బాఱఁ జిమ్మె.

కం. భీమబలాఢ్యులు దెగి ము, ష్టీముష్టిరణంబు సేయ ♦ ఢీకొన నన్యో
న్యామితఘాతములను ను, ద్దామంబగురక్తధారఁ ♦ దడిసె న్నేనుల్. ౧౧౩౭

కం. అంగారకబుధు లనఁగాఁ, జెంగక రక్షఃప్లవంగ♦శేఖరు లలుకన్
భంగముపడక భరంపడి, కంగా రొనరింప సందు ♦ గని ప్లవగుండున్. ౧౧౩౮

చం. అవిరళపుష్పభారసము♦దంచితభూమిరుహంబు వైచినన్
దివిజవిరోధి ఖడ్గనిహ♦తిం దెగవ్రేయఁగఁ జూచి యార్షభం[1]
బవు ఫలకంబు గజ్జియల ♦ నందము మీఱు కృపాణముం గొనెన్
బ్లవగవరుండు, దైత్యుఁడు కృ♦పాణము డాలును గొంచుఁ దాఁకినన్. ౧౧౩౯

కం. జయకాంక్ష నిద్దఱును ని,ర్దయచిత్తత నేటు పోటు ♦ దాఁటును బలముం
రయముం జూపుచు నొండొరు, భయపడక యుదగ్రవృత్తిఁ ♦ బడ నడువంగన్.

ఉ. పోటులగంట్ల నెత్తుటను ♦ బూచిన మోదుగుచెట్లఁబోలి యా
మేటిమగల్ శ్రమం బడర ♦ మేదిని జానుల నూఁది నిల్చుచో
వ్రేటునఁ బాముఁబోలె నెస♦రేఁగి కపీంద్రుఁడు దాఁటి మీఁదికిన్
బోటనబంతినా నసురు♦భూరిశిరంబును ఖడ్గధారచేన్ ౧౧౪౧

కం. ఖండించుటయున్ రోషో,చ్చండత గిరగిరను దిరుగు♦చతులుల తోడన్
నిండారు నెత్తురులతో, మొండెంబును విడిచి త్రెళ్లె ♦ మూర్ధము త్రుటిలోన్.

ఉ. అంతకుపాలికిం దమబ♦లాధిపుఁ డేగిన రక్కసుల్ భయా
క్రాంతమనంబులన్ నగచ♦రప్రవరుల్ దఱుమంగ లంకకున్
స్వాంతము పల్లటిల్లఁ జని ♦ రంతట నంగదుఁ డెల్లవానరుల్
శాంతలఁ గొల్వ నొప్పె సుర♦పుంజసమర్చితశక్రు కైవడిన్. ౧౧౪౩

## అకంపనుఁడు యుద్ధమునకుఁ బోవుట.

సీ. వాలిపుత్త్రునిచేత ♦ వజ్రదంష్ట్రుండు జ,న్యంబునఁ గూలుట ♦ యాలకించి
యమరారిభర్త ప్ర♦హస్తుతో దుర్దమ,శౌర్యధుర్యులను రా♦క్షసులఁ గూర్చి
పంపు మకంపనుఁ ♦ బ్రథనార్థ మీతఁడు, సర్వశస్త్రాస్త్రవి♦శారదుండు
సమరసమ్మతుఁడు శా♦స్తయు గోప్త నేతయు, మద్యూతికాముండు ♦ మహితబలుఁడు
తే. ఈతఁడు జయింపఁజాలు న♦రేంద్రవాన,రేంద్రుల న టన్న నాతఁ డ♦హీనసేన
భీమదర్శనరాక్షస♦స్తోమ మొనరఁ, గొలుతలు సేసి యిచ్చె న♦కుంఠగతిని. ౧౧౪౪

చం. కలన నిలింపకోటికి న♦కంపనుఁ డౌట సకంపనప్రథన్
జెలఁగెడివాఁడు నీరదరు♦చిన్ జలదాగ్భటి నొప్పువాఁడు మే
ల్దళుకుఁబసిండిపోఁగులవి♦లాసమువాఁడు మహారథంబుపైఁ
బొలిచె సరోజబాంధవుఁడు ♦ పుట్టుమలన్ వెలుఁగొందుచందమై. ౧౧౪౫

సీ. ఈరీతి నరుగుచోఁ ♦ దేరిగుఱ్ఱంబులు, నిర్నిమిత్తంబుగ ♦ నేల మ్రొగ్గ
డాకన్ను చలియించె ♦ దగ్గుత్తిక జనించె, వదనసీమను విన్నఁ♦బాటు దోఁచెఁ
బ్రతికూలవాయువు ♦ భయదమై వీచె దు,ర్దినముగాఁ[2] దోఁచె ను♦దినము. యయ్యు
ఖగమృగంబులు నించె ♦ ఖరతరస్వరములు, శార్దూలబలుఁ డవి ♦ సరకు గొనక

[1] ఆర్షభము = వృషభచర్మముతోఁ జేయఁబడినది. [2] దుర్దినము = మబ్బు క్రమ్మినదినము.

ఆ. కలని కుత్సహించె ♦ బలలాశిసైన్యంబు, లబ్ధి క్షోభ మొంద ♦ నార్భటింప
నులికి కీశసేన ♦ యుర్వీరుహాద్రుల, సిద్ధపఱిచి నిలిచె ♦ యుద్ధమునకు. ౧౧౪౬

చం. ఉభయచమూనమూహముల ♦ కుగ్రసమీక మనేకభంగి యై
రభస మెలర్పఁ జెల్లు నెడ ♦ రామదశాస్యజయార్థ మై కపుల్
ఋభుపరిపంథులుం దనువు ♦ లీయఁ గడంగి పరస్పరంబు దో
ర్విభవ మెలర్పఁ దాఁచిరి యు♦దీర్ణపరాక్రమ ముల్లసిల్లఁగన్. ౧౧౪౭

సీ. వారలతర్జన♦భర్త్సనగర్జలు, బధిరత్వ మొందించె ♦ భటులకెల్ల
నొక్కచో నరుణవ♦ర్ణోపమానరజంబు, పదిదిక్కులందును ♦ బ్రాఁకెఁ దోడఁగె
నొక చోటఁ బదఘట్ట♦నోద్ధూతధూళులు, చీఁకుల గావించె ♦ సేనవారి
వాజివర్గంబును ♦ ధ్వజము పతాకయుఁ, దే రనుభేదంబు ♦ తెలియరాదు

తే. రూప మొక్కెడుదోఁప కా♦టోపజనిత, వికటసంరావ మొక్కెడ♦వినఁగ నయ్యె
రాక్షసులు గొట్ట సాగిరి♦రాక్షసులనె, ప్లవగవర్యులు ద్రుంచిరి♦ప్లవగవరుల. ౧౧౪౮

కం. తనవార లెదిరివా రని, మనమున గుర్తింపరాక ♦ మహితాంధమునన్
తనవారి నెదిరివారిని, దునిమి రుభయయోధవరులు♦దుములపుటనిలోన్. ౧౧౪౯

తే. అస్రధారాప్రవాహంబు ♦ లమిత మగుడు
క్ష్మారజము రూపు మాయఁగఁ ♦ గాన వచ్చెఁ
గుణపశతములఁ జచ్చిన♦గుల్మములును
రాసులై నేలవ్రాలిన♦వేసడములు. ౧౧౫౦

కం. ద్రుమముల శక్తిశిలాప్రా,సముల గదాపరిఘపట్టి♦సంబులఁ గపియూ
థము రాక్షసయూథంబును, సమరం బొనరించె నసమ♦సాహసలీలన్. ౧౧౫౧

కం. నఖములఁ బ్లవగులు నొంప వి,శిఖముల రాక్షసులు ద్రుంపఁ ♦ జేతులఁ గ్రోతుల్
ముఖములఁ జింప శితశిలీ,ముఖములచేఁ ద్రెంచి రసుర♦ముఖ్యులు వానిన్. ౧౧౫౨

కం. అప్పు డకంపనచోదిత, మప్పలభుక్సమితి గపుల ♦ నడలఁగఁ జేయన్
గుప్పలు జా ల్గురియించుచుఁ, గప్పిరి వృత్కాటవరులు ♦ గం డడఁగంగన్. ౧౧౫౩

కం. చెట్టుల గుట్టల జాలం, గొట్టుచుఁ బైకుఱికి భ్రాంతి ♦ గొలుపుచు వారల్
పట్టినయాయుధముల బిగి,పట్టున లాగికొని వారి ♦ వసుధం గూల్పన్. ౧౧౫౪

తే. ఇంతలో వారలకు బాస ♦ ఉగుడెంచి
నలుఁడు కుముదుండు మైందుండు ♦ బలియుఁ డైన
ద్వివిదుఁడును వృక్షముల నరి♦వీరసమితిఁ
బీన్గుపెంటలు చేసిరి ♦ భీమగతిని. ౧౧౫౫

### అకంపనుఁడు వానరసేనపైఁ గవియుట.

మ. సమదప్రక్రియ వైరియోధులు భుజా♦సంరంభశుంభద్గతిన్
దమవారిన్ వధియించి మించుటయుఁ గ్రో♦ధస్ఫారతామ్రాక్షుఁడై
విమతప్రాణవినాశకారి ధనువున్ ♦ వే త్రిప్పుచుం దీవ్రవే
గమునం దోలుము సారథీ! మనశతాం♦గంబుం బరుల్ బెగ్గిలన్. ౧౧౫౬

ఉ. అల్లదె కీశనాథు లను♦రాళి బడల్పడఁ ద్రుంచు చున్నవా
రల్లతలంబుఁ జేరఁ జను♦మా, యట శైలమహీజసాధనుల్
పెల్లుగ నున్నవారు కపి♦వీరులు యుద్ధము వేచి, వారలం
జిల్లులు వాఱఁ ద్రుంపఁ దమి ♦ నేసెదఁ జూపఱ గుండె దిగ్గనన్. ౧౧౫౭

చం. అనవుడు సూతుఁ డట్ల తన♦స్యందన ముద్ధతిఁ దోలఁగా నకం
పనుఁడును దీవ్రబాణచయ♦పాతపురస్సరుఁ డౌచు వారిపైఁ
జని సరఘావితానముల[1]♦చందమునం బరఁగించి శస్త్రముల్
వనచరపాళి మూర్తమున ♦ లా వఱి తూలఁగ నేసి యార్చినన్. ౧౧౫౮

కం. ఆతనికోల్తలకుం గా,కాతతదరమునను వీఁగు♦నగచరవరులన్
వాతాత్మజుండు గని యా,దైతేయున కెదుట నిలిచె ♦ దర్ప మెలర్పన్. ౧౧౫౯

### హనుమంతునిచే నకంపనుఁడు హతుం డగుట.

కం. హనుమంతునిప్రాపును గని, వనచరయూథాధినాథ♦వర్గము మోదం
బునఁ బొదలి బలము గొని క్రం,దనము లెసఁగ వైరిసేనఁ♦దాఁకెం గినుకన్. ౧౧౬౦

మ. తన మ్రోలం బవమానసూనుఁడు మహీ♦ధ్రప్రక్రియన్ నిల్చినన్
జనితామర్షుఁ డయ్యకంపనుఁడు ప♦ర్జన్యుండు ధారావళిన్
మునుఁగం జేయుగతిన్ శరావళులచే ♦ ముంచెం దదాసార మే
పున నార్షభ్యము[2] వాన పైఁ దొరఁగఁ గొ♦మ్ముల్ వంచుచందంబుగన్. ౧౧౬౧

కం. శిర మొక్క యోర వ్రాలిచి, సరకు గొనక వానిచక్కి ♦ సమదగజంబుం
బురిడించుచు నుద్రేకిత, నెరవడిఁ జన రక్కసుండు ♦ నివ్వెర గొనుచున్. ౧౧౬౨

కం. తొలఁగి చని బాణవర్షము, నిలుపక కురియింప మండు♦నీరజహితునిన్
దలఁపించుచు నాహనుమయుఁ, దలఁగక గర్జించి వానిఁ ♦ దఱుముకొని చనెన్.

ఉ. వెంటనె పాఱివచ్చుకపి♦వీరునిపై నసురుండు వేగియై
మంటలు గ్రుమ్మరించు శిత♦మార్గణముల్ పరఁగించి నొంచినన్
గంటున సాధనం బెదియుఁ ♦ గైకొనకుంట దలంచి పాఁతుతో
నంటఁగఁ బీఁకి శైల మొక♦హస్తమునం గొని బొబ్బ వెట్టుచున్. ౧౧౬౪

[1] సరఘా వితానములు = తేనెటీఁగల గుంపు. [2] ఆర్షభ్యము = ఆఁబోతు.

కం గిరగిర ద్రిప్పుచు నముచిన్, స్వరుకరుఁ డై[1] మున్ను త్రిదశ♦పతి దఱిమినయ
క్కరణి నకంపనుఁ దఱుమఁగ, సురవైరియు దానిఁ జూచి ♦ సూటి మెఱయఁగన్.

చం కఱ కగునర్ధచంద్రవిశి♦ఖంబుల దవ్వుననుండియే గిరిం
దుఱు మొనరింపఁ గేసరిత♦నూభవుఁడుం దనకొండ మింటనే
నఱు మయి పోక గన్గొని ఘు♦నం బగుకిన్కను నశ్వకర్ణమున్
బిఱబిఱ వేరుతోఁ బెఱికి ♦ వేగమ యెత్తి హసించి త్రిప్పుచున్. ౧౧౬౬

మ. పదఘాతంబుల భూమి కంపిల భటా♦శ్వస్యందనవ్యూహమున్
రది[2]సంఘాతము నుగ్గునూచముగ రౌ♦ద్రస్ఫూర్తిఁ దున్మాడుడున్
బెదరెం బాఱెఁ గృతాంతుఁ గన్నపగిదిన్ ♦ విద్వేషిసైన్యంబు, దు
ర్మదుఁ డై చాపకళాప్రవీణత రహిం♦పన్ రాక్షసాధీశుఁడున్. ౧౧౬౭

ఉ. సాలముఁ ద్రుంచివైచి శర♦జాలవ్రణీకృతదేహుఁ జేసినన్
గాలిసుతుండు నెత్తురులు ♦ గాఱుశరీరముతో విధూమస
జ్వాలకృశానునట్లు సుమ♦సంచయరంజితకింశుకాగమున్
బోలి సమగ్రసత్త్వమున ♦ భూరుహ మన్యము పట్టి త్రిప్పుచున్. ౧౧౬౮

చం. పరులకు దుర్నిరీక్షుఁ డయి ♦ బాధరుషాపరిపూర్ణచిత్తుఁ డై
కరములరెంట బిట్టుగ న♦కంపను శీర్షము వ్రయ్య మోఁదినన్
సురపరిపంథి నేలపయి ♦ సోలెను సీల్గెను, దక్కురక్కసుల్
ధరణి వణంకినన్ ద్రుమవి♦తానములట్టులు వ్రాలి రుర్విపై. ౧౧౬౯

సీ. మోదరసావేశ♦మునఁ గపుల్ దఱుమంగ, సంభ్రాంతచిత్తులై ♦ చావుభీతి
విరిదలల్ దడఁబడు♦చరణంబులను గల్గి, త్రోద్రోపులుగఁ బడఁ♦ద్రోసి కొనుచు
నొండొరులను మీఱి ♦ యుఱికిరి లంకకు, వెనుప్రక్క మఱిమఱి ♦ కనుచు నంత
హరిసమూహంబులు ♦ హనుమంతు శ్లాఘించె, నిరుపమబలుఁడవు ♦ నీవ యనుచు

తే. నతఁడు ప్రతివాక్యముల వారి♦నాదరించె, మీరు దోడ్పడ నాకెది ♦ మేర యనుచుఁ
బ్లవగులును బొంగి యూపిరి♦పట్టునంత, బిగ్గ కేకలు వైచిరి ♦ ప్రియము చెలఁగ.

కం. కొఱకొఱ ప్రాణంబులతో, గుఱ గుఱ మను గొంతులోని♦గుఱకలతో న
త్తఱి నుండిన రాక్షసులన్, బఱబఱ వెస నీడ్చి పాఱ♦వైచిరి కీశుల్. ౧౧౭౧

చం. బలియు నకంపనుం దునిమి ♦ పావని తేజున మీఱె నయ్యెడన్
బలిని నడంచి మించు నల♦వామనుభంగిని, రామలక్ష్మణుల్
వలిముఖనేతయున్ దనుజ♦వల్లభుఁడున్ దివిజావళుల్ మహా
బలసుతు మేలివాక్యములఁ ♦ బ్రస్తుతి సల్పె ముదంబు పెంపునన్. ౧౧౭౨

[1]స్వరుకరుఁడు = వజ్రహస్తుఁడు. [2]రది = ఏనుఁగు.

### రావణుఁడు ప్రహస్తుని యుద్ధమునకుఁ బొమ్మనుట.

సీ. అనిలో నకంపనుం ♦ డంతకాతిథి యయి, చనుట దశాస్యుండు ♦ విని యొకింత
దీనుఁడై మంత్రివి♦తానంబుతో మంత్ర,నం బుండి యించుక ♦ నాఁటియుదయ
కాలంబునం బురిఁ ♦ గలయంగ నలువంక, యరిగి సేనలచొప్పు ♦ నరసి చూచి
కాపు లెసైన్య యుంట ♦ కన్గొని కపిసేన, చుట్టు ముట్టడిగొన్న♦ప ట్టెఱింగి
తే. మన్యుపరిదగ్ధచిత్తుఁ డై ♦ జన్యనిపుణు, నంతికస్థుఁ బ్రహస్తుని ♦ నతఁడు పలుకుఁ
గోట ముట్టడి డింపించు♦బాట యొండు,కలను దక్కఁగ వేఱొండు ♦ గానరాదు.
సీ. ఈమహాభారంబు ♦ నే నొండె ననుజుండు, కుంభకర్ణుండు ని♦కుంభుఁ డొండె
సేనాని వగుయోధ♦శేఖర! నీ వొండె, నింద్రజితుం డొండె ♦ నింత గాక
యేవారు చతురులు ♦ మోవఁగఁ జెప్పుమా, దాన నీవలసిన♦దానవాళిఁ
గొని యని కేగుము ♦ క్రోఁతులు నీధాటి, విన్నంత వెఱగొని ♦ విచ్చువారు
తే. బెదరుగొడ్డులు నవినీతు ♦ లదరుగుండె,వారు కీశులు నీమహా♦ర్భటుల విన్న
సైఁచువారలె? సింహగ♦ర్జనము విన్న,వారణములట్లు లూడనిఁ♦బొడువారు.
తే. సేన లేకున్న నే మొకో ♦ చేయువారు, రామసౌమిత్రు లెడలంగ ♦ రాజసంబు
దిక్కు గానక వడిచెడి ♦ దీను లగుచు, నీకు లోపడువారలు ♦ నిశ్చయముగ.
చం. మరణము గల్గు నిక్కముగ ♦ మందిరమం దిపు డూరకుండినన్,
మరణము సందియంబు రణ♦మండలి, గెల్తుమొ యేమొ, కొంతయేఁ
దొరకొనినన్ శుభంబె కద ♦ దోర్బలధుర్య! హితంబుఁ బల్కుమీ
మరణము వీట మేలొ రణ♦మండలమందున మేలొ యోధకున్? ౧౧౭౬
చం. అనవుడు వాహినీపతి ద♦శాస్యునితో నసురేంద్ర శుక్రున
ట్లను నిదియెల్లఁ బూర్వమె స♦మర్థులు మంత్రులు నేను యోజనం
బొనరిచినార, మేకమత♦ముం గొనకుండుట యెల్లవారమున్
బని చెడియెన్ వివాదమునఁ ♦ బల్కెద నామత మాలకింపుమీ. ౧౧౭౭
కం. శ్రేయము జానకి నిచ్చుట, చేయవ పో యట్లు రణము♦సేయుట శుభ మం
చీయనువున నేఁ జెప్పిన, వైయర్థ్యము గలిగె భేద♦వాదముచేతన్. ౧౧౭౮
చం. అది యటు లుండ నిమ్ము వివి♦ధార్థములన్ బహుమానవాక్యులన్
ముదమునఁ దన్పి యెల్లపు డ♦నూనగతిన్ నను సత్కరించి తీ
వద నిది నాకు నీఋణము ♦ నంతయుఁ దీర్పఁగ, నిట్టివేళ నే
బ్రదుకఁగఁ గోరి డాఁగుదునె ♦ పార్థివ! యంతటితీపె ప్రాణముల్? ౧౧౭౯
కం. పుత్రకమిత్రకళత్ర,క్షేత్రధనావళుల నాస ♦ సేయను నీకై
గాత్రము రణసవమున నే,మాత్రము పిఱుసనక వేల్తు ♦ మది నమ్ము పతీ. ౧౧౮౦

## ప్రహస్తుఁడు యుద్ధమునకు వెడలుట.

తే. అనుచు సేనాని నిజబలా♦ధ్యక్షులతోడఁ, జటులసైన్యంబుఁ గొని రమ్ము♦క్షణములోన
మచ్ఛితాశుగవినిహత♦మర్కటాళి,మాంసముల మెక్కు మాంసాద♦మండలంబు.

తే. అబ్బలాధ్యక్షుఁ డెల్ల నా♦యత్తపఱుపఁ, దిగ్మనానావిధాయుధ♦దీప్త మనుర
బలమతంగజసైంధవా♦కులమునయ్యె,లంకయంతయుఁ ద్రుటిలో భ♦యంకరముగ.

తే. జాతవేదుని వేల్చిన♦నేతిపొగల,వాసనలచేత బ్రాహ్మణ♦వరుల నర్చ
చేసి యర్పించుసుమముల♦శ్రీసుగంధ,ములఘుమాయించెనగరంబు♦మూలమూల.

కం. హారంబుల బలువివిధా,కారంబుల మంత్రితములఁ ♦ గలహోద్యమహా
స్థారంభులు మేను లలం,కారంబులు చేసికొనిరి ♦ క్రవ్యాదవరుల్. ౧౧౪

కం. మై మఱువు దొడిగి కేలను, భామానితకార్ముకములు ♦ పట్టి నిజం బౌ
హామిక దశకంఠుఁడు గన, నామోదముతోడ వచ్చి ♦ రసురవరేణ్యుల్. ౧౧౫

సీ. సకలాస్త్రశస్త్రసం♦చయసంయుతంబును, బటుతరాజానేయ♦వాహితంబు
రణకళాకుశలసా♦రథిచోదితంబును, నిష్ఠురజలధర♦నిస్స్వనంబు
ప్రత్యక్షశీతాంశు♦రవిభాస్వరంబును, హాటకజాలస♦మంచితంబు
భయదదర్వీకర♦ధ్వజదుర్ధరంబును, సురథగుప్తిరథాంగ♦శోభితంబు

తే. నన్యవస్త్వపహాసిప్ర♦భాధికంబు, నైనరథ మెక్కి రావణు♦నాజ్ఞఁ బూని
శంఖదుందుభినిర్ఘోష♦సంకులంబు, నైనసైన్యంబుతోడ సే♦నాని వెడలె. ౧౧౬

కం. నిర్ఝరహృద్భేదకముగఁ, బర్జన్యనదోపమాన♦బహుళరవముతో
గర్జిల్లుచు భుజశౌర్యా,వర్జితపరిపంథి యాహ♦వస్పృహఁ జనియెన్. ౧౧౭

## ప్రహస్తున కపశకునంబు లగపడుట.

సీ. ఘోరస్వరముల ది♦క్కూటముల్ వ్రయ్యంగ, భీమరూపులు మహా♦భీమతనులు
మున్నుగా నడువ స♦మున్నతుండు నరాంత,కుండు మహానాద♦కుంభహనులు
సచివు లీనల్వురు ♦ స్వపరివారములతో, బలసి రాఁ జనెఁ దూర్పు♦ద్వారమునను
వానిప్రయాణర♦వంబు సేనాధ్వేళ,లును లంకలో నున్న♦దనుజతతికి

ఆ. గుండె లగలఁ జేసెఁ ♦ గూపెట్టె సర్వభూ,తము లమేఘదివిఁ బ్ర♦దక్షిణముగ
రథముఁ జుట్టి పక్షి♦రాజులు తిరుగాడె,నదరు లుమిసె వఱఁడు♦లతనికెలన. ౧౧౮

చం. పరుషముగాఁ బ్రభంజనుఁడు ♦ వారక వీచె గ్రహాళు లెల్లనం
బరమునఁ బోరఁగాఁ దొడఁగె ♦ వ్రాలె మహోల్కలు మేఘవారముల్
ఖరతరరావముల్ నినిచె ♦ గృద్ధ ధ్వజంబున దక్షిణాస్య మై
యిరుదెస గీఱుకొంచు హరి♦యించె సమస్తము వానితేజమున్. ౧౧౯

తే. జాఱిపడెఁ జేతిసెలగోల ♦ సారథికిని
జాఁపకట్టుగఁ బడియెను ♦ సైంధవములు
సమతలమునందు వసుదుర్ల♦భము స్వతేజ
మపుడు త్రుటిలోన సమసెఁ బ్ర♦హస్తునకును. ౧౯౦

చం. పొడగని యిట్టిదుశ్శకున♦ముల్ మదిఁ గొంకక ఖ్యాతపౌరుషుం
డుడుగనితీవ్రవేగమున ♦ నుగ్రగతిం జను తేరఁ గ్రోఁతులున్
బుడమి వడంకు ఘోషములు ♦ పుట్టఁగఁ గొండలఁ జెట్లఁ బీఁకుచున్
నడచిరి వాని నెత్తికొని ♦ నాదవిదారితదిక్సమూహు లై. ౧౯౧

ఉ. అంకెలు వైచుకోఁడెల తె♦అంగున నయ్యిరువాఁగు నొండొరున్
బింకము మీఱఁ గన్గొనుచుఁ ♦ బిల్చుచు బొప్పుచు యుద్ధలంపటుల్
గొంకును జంకు లేనితమిఁ ♦ గో యని యార్చుచు డాసి రంత ని
శ్శంకము వహ్నిలో మిడుత♦చందమునం గపిరాజవాహినిన్ ౧౯౨

కం. కుమతి ప్రహస్తుఁడు గెలువం, దమకపడుచుఁ జొచ్చె నిట్లు ♦ తతభీమగతిన్
దమసేనలపై నడరెడు, తమిచరుఁ గని రామవిభుఁడు ♦ దరహాసముతోన్. ౧౯౩

## ప్రహస్తసేనలు వానరులతోఁ బోరుట.

కం. పలుకు విభీషణుతోడన్, బలితపుబలములు భజింప ♦ బలు పగు మేనన్
గలనికి వచ్చినవాఁ డా,బలియుఁ డెవం డనఁగ నతఁడు ♦ వచియించె నిటుల్.

ఉ. ఈతఁడె రావణాసురుని♦యెంతయు నమ్మినజోదు శూరుఁడున్
ఖ్యాతపరాక్రముండు మహి♦తాస్త్రవిదుండు సమస్తవాహినీ
నేత త్రిభాగ సైన్యయుత♦నిష్ఠురకర్ముఁడు వీర్యవంతుఁడున్
వీతభయుండు రామపృథి♦వీవర! పేరఁ బ్రహస్తుఁ డం చనన్. ౧౯౫

శా. ఈలో వాఁడు నదత్సురారియుతుఁ డై ♦ యెంతే రుషం బ్రస్ఫుట
క్ష్వేళాజాలవిభిన్నదిక్కుహరుఁ డై ♦ జేయంచుఁ బైవచ్చినన్
గోలాంగూలచయంబు భూమిరుహముల్ ♦ గొండ ల్వేసం గొంచు ను
ద్వేలక్ష్మాప్రగతిన్ సమీర్ష్యను గ్రుధాం♦ధీభూతచేతస్కమై. ౧౯౬

కం. ఎదురుకొనెన్ శూలంబులు, గదలున్ రోఁకండ్లు శక్తి ♦ ఖడ్గాశుగముల్
గుదియలు బరిసలు బరుచులు, మొదలగు కైదువులు మెఱయ ♦ మొగి రక్కసులున్.

ఉ. తాఁకిరి వారు వారు బల♦దర్పము లొప్పఁగ ఆలవానయున్
వీఁకను బాణవర్షమును ♦ బెన్జడిగాఁ గురియింపఁ దద్ధతిన్
మూఁకలు మూఁక లై యసుర♦ముఖ్యులు వానరులున్ వ్యథార్తు లై
కూఁకలు వెట్టుచు న్నలఁగి ♦ కూలిరి భిన్నశిరఃప్రతీకు లై. ౧౯౮

సీ. కాలాయసంబు లౌ ♦ శూలాయుధంబుల, గుదులుగాఁ గ్రుచ్చిరి ♦ క్రూరవృత్తిఁ
బరిఘాతనంబులఁ ♦ బ్రతిఘాతముల నిచ్చి, ప్రతిఘాతనముఁ జల్పి ♦ రతులరీతి
గండ్రగొడ్డలి యేట్లఁ ♦ గండలు వగిలించి, గండడఁగించి రు♦ద్దండభంగి
నొత్తి పైపడి త్రొక్కి ♦ క్రుత్తుక బిగఁబట్టి, యూఁగొప్పవకుండఁగ ♦ నొత్తరించి
తే. రసురవర్యులు క్రోఁతుల ♦ నగచరాళి, యంపపోటుల హృదయమ్ము ♦ లగిలి ఖడ్గ
ధారలను రెండునై శూల♦వారనిహతిఁ, గృత్తపార్శ్వైకమై యస్థి♦గెడసి చనియె.

ఉ. అజ్జగడంబునం గపులు♦హాయిఁకఁ గొండలఁ జెట్లు ఱువ్వినన్
బజ్జలు నూఱుఁబిండులును ♦ బచ్చడులుం బెనుముద్దలున్ మఱిన్
గుజ్జులు నైరి రాక్షసులు ♦ గూలిరి వ్రీలిరి పీటతాటమై
నజ్జగ నైరి వ జ్జతి వి♦నాశముఁ జెందిరి మ్రందిరందఱున్. ౧౨౦౦

సీ. ఛీట్కారకలితచ♦పేటఘాతములచే,[1] బొక్కినో ళ్లైనట్టి♦రక్కసులును
బిడుగుల కెనవచ్చు ♦ పిడికిళ్లపోటుల, గ్రుడ్లూడి గ్రుడ్లయి ♦ కూలువారు
సిగఁ బట్టి తల వంచి ♦ చేకొల్ది గ్రుద్దిన, భోక్కున నెత్తురు ♦ గ్రక్కువారు
నిరుగాలు బిగఁబట్టి ♦ గిరగిర మని త్రిప్పి, వీచి వైచిన యముఁ ♦ జూచువారు
తే. నుఱికి కఱ కగుకోఱలఁ ♦ గఱచి గోళ్లఁ, బెఱికి వారల ఖండాల ♦ నఱికి వైవ
బిఱుసు చెడి గర్వ ముడిగి త♦త్తఱిలి వెఱచి, యఱచిపఱచిరి మడసిరి♦యెఱచిదిండ్లు.

శా. బాహాస్ఫాలన మాచరించుచును శుం♦భద్భైరవాకారులున్
సాహంకారవివృత్తనేత్రు లయి ర♦క్షఃకీశసైన్యాళి హే
మాహేమీలు ఘటా ఘటీ ల్గడఁగి సిం♦హవ్యూహసంరంభులై
బాహాబాహిని మల్లసంగరకళా♦ప్రావీణ్య మేపారఁగన్. ౧౨౦౨

కం. పోరు నెడ వారిపటుగ, ర్జారవములు క్రందనములు ♦ జయనపరత్వే
శారభటుల్ దీనులదుః, ఖారావము లధిక మయ్యె ♦ నానమయమునన్. ౧౨౦౩

సీ. అంత్యకోపమకుంభ♦హానుసమున్నతనరాం, తకమహానాదులు ♦ దర్ప మొనరఁ
బొంగి వచ్చెడి కీశ♦పుంగవవార్ధికిఁ, జెలియలికట్ట లై ♦ నిలువరింపఁ
గొండపేటును ద్వివి♦దుండు వైచిన దాన, నంతకుఁ గొల్చె న♦రాంతకుండు
దుర్ముఖుం డొకమహా♦ద్రుమము ఱువ్విన వైవ, నుర్విపైఁ గూలె స♦మున్నతుండు
తే. ప్రష్టసుతుఁడు మహానాదు ♦ సరభసముగ, బండతోఁ దాఁప నాతండు♦దండిఁ జేరెఁ
దారకరముక్తభూరుహ♦తాడనమునఁ, గుంభినీధర మనఁ గూలెఁ♦గుంభహనుఁడు.

## ప్రహస్తుఁడు కపుల వధించుట.

ఉ. అద్రిచరక్రియం గని ప్ర♦హస్తుఁడు కార్ముకహస్తుఁడై లయో
న్నిద్రపయోధిచందమున ♦ నిర్జరభీకరుఁ డట్టె పొంగుచున్

---

[1] చపేటఘాతములు = అఱచేతి చెంపదెబ్బలు.

రౌద్రరసంబు మూర్తిగొను♦రాణ లయం బొనరించుభంగి న
క్షుద్రజనంబునం బఱపెఁ ♦ గ్రోఁతులు భీతులుగా శతాంగమున్. ౧౨౦౫

మ. ప్లవగాంభోనిధి మందరాయితరథ♦వ్యాపారపారీణుఁ డై
దివిజారాతిరణంబు కల్పనము మై ♦ దీపింపఁ దత్సాగరా
రవముం బోలెఁ జమూనినాదము కఠో♦రస్ఫారనారాచపా
తవినిర్భిన్నవలీముఖాంగవిగళ♦ద్రక్తంబు నీరంబుగన్. ౧౨౦౬

తే. దానికిని నీఁదఁబోవక ♦ తరుచరాళి, జన్య మొనరించి రాక్షస♦సంఘములను
బిలుకుమార్పఁగ నుభయ సే♦నల మహీధ్ర,సమశరీరంబు లొప్పె భీ♦మముగ నపుడు.

కం. దైతేయకీశరక్త,స్రోతస్విని చేతఁ దడిసి ♦ క్షోణి రహించెన్
స్ఫీతగతిన్ మాధవవే,ళాతతసుమయుక్తకింశు♦కాకృతి దోఁపన్. ౧౨౦౭

సీ. కూలినవీరుల♦కోటులు దరులుగా, విఱిగిన కైదువుల్ ♦ వృక్షములుగఁ
గీలాలజాలంబు ♦ కీలాలచయముగాఁ[1], గారిజంబును బ్లీహ ♦ మార బురద
ప్రేవుల ప్రోవులు ♦ శైవలవితతిగాఁ, గాలు సేతులతుండ్లు ♦ మీలు గాఁగ
గాత్రాంగనివహముల్ ♦ కసిమిడిపట్లుగాఁ, బెనుగ్రద్ధ గుమి యంచ♦పిండు గాఁగ

తే. మలయురాపుల్గు లుయ్యాల♦పులుఁగులుగను
మెదడు సురువుగ నేడ్పులు ♦ నదములుగను
గాపురుషదుస్తరము యమ♦కంధిగతిక
మాజిభూమయి నిమ్నగ ♦ యపుడు పాఱె. ౧౨౦౮

కం. శారదవేళను హంసక,సారసచయసేవితంబు ♦ శైవలినివలెన్
ధీరులు, వానరరాక్షస,వీరులు తన్నదిఁ దరించి ♦ వెలసిరి బలిమిన్. ౧౨౧౦

కం. పాదరజోవిధ్వస్తము, మేదురరక్తాభజలస♦మేతము సరసిన్
సాదరముగ నీఁదిన మద,వేదండము లనఁగ వారు ♦ వెలిఁగిరి రకిన్. ౧౨౧౧

## ⟷ నీలుఁడు ప్రహస్తుని వధించుట. ⟷

ఉ. ఎందును నడ్డు లేక తను ♦ నెవ్వఁడు మార్కొనువాఁడు లేక యా
స్యందనధాత్రిలోఁ దనదు♦స్యందనముం బఱపించి మీఁదమీఁ
దం దనుఁ జూచి క్రోఁతులు య♦థాయథ లై పరువెత్త నబ్ధిలో
నం దిరుగాడు పెన్గొఱ య♦నన్ విహరించునిశాటు నీలుఁడున్ ౧౨౧౨

చం. కనుఁగవ కెంపు పెంపు గొనఁ ♦ గాంచి సమంచితవేగుఁ డై వియ
జ్జనితమహాబలుండు ఘన♦జాలముపైఁ బడురీతి నాఁగినన్
దినమణిభాసమానరథ♦తీవ్రజవోద్ధతి చాపనైపుణం
బును మెఱయంగ వానిపయి ♦ మొక్కలుఁ డై పడి యేపు చూపుచున్. ౧౨౧౩

[1] కీలాలము = నెత్తురు; నీళ్లు.

శా. హుంకారస్ఫుటనాదుఁడై దితిభవ♦వ్యూహంబు మెచ్చన్ దను
ష్టంకారం బొనరించుచున్ నిశితకాం♦డంబుల్ మెయిం గ్రుచ్చి సా
హంకారోద్ధతి నార్భటించె, నవి కీ♦శాధ్యక్షు మేనన్ నిరా
తంకప్రక్రియఁ జించి చొచ్చి ధరణిం♦ దద్రక్తసిక్తంబులై ౧౨౧౪

ఉ. వెండియు నాప్రహస్తుఁ డట♦విచ్చుఁ జెంతలఁ జేరనీక యు
ద్దండశరప్రకాండముల ♦ దారుణవాహిని మీఁదఁ గొల్ప, నీ
లుండును సాలమొండు త్రుటి♦లోఁ గొని తా నెదు రేఁది పోయి దో
శ్చండిమ శూరవర్యుఁడు ని♦శాచరుపై నొకదెబ్బ దీసినన్. ౧౨౧౫

కం. క్ష్వేళాబధిరితదిగ్గజ,జాలుండై రాక్షసుండు ♦ శరధారాక
ల్లోలిని నీరంధ్రంబుగ, నీలువయిం బఱప నతఁడు ♦ నిశ్చేష్టుండై ౧౨౧౬

శా. వారింపం దరియింపరామిని గపి♦వ్యాఘ్రంబు క్షోణిన్ శర
ద్ధారాపాతమునన్ వృషంబువలె నే♦త్రద్వంద్వమున్ మోడ్చి దో
స్సారం బూఁతగ నిల్చియుండి యవకా♦శం బబ్బ వృక్షాహతిన్
ధీరుం డల్గి మనోజవాన రథవీ♦తిస్తోమముం గూల్చుచున్. ౧౨౧౭

ఉ. పైపడి వానికార్ముకముఁ ♦ బట్టి దృఢంబుగ నీడ్చి వైచి యా
టోపమునన్ నదించుచుఁ ద♦టుక్కున దానిని ద్రుంచి వైచినన్
జాపము లేమి రక్కసుఁడు ♦ స్యందనసంస్థితసాధనాళిలోఁ
జేపడినట్టిరోఁకలిస ♦ జేకొని భూమికి దాఁటెఁ జివ్వనన్. ౧౨౧౮

కం. రోఁకలి ద్రిప్పుచుఁ దన్నుం, దాఁకెడురక్కసునిఁ గాంచి ♦ తడఁబడ కేమిన్
వీఁకను నీలుఁ డెదుర్కొని, యాఁకట్టెన్ బాహుబలర♦మాధికుఁడగుచున్. ౧౨౧౯

ఉ. ఇద్దఱు వాహినీపతులు ♦ నిద్దఱు జాతవిరోధు లిద్దఱున్
గద్దఱికాండ్రు రిద్దఱును ♦ గాఢజవాన్వితు లొం డొకండు పె
న్నుద్దులు నొలమాసగొన ♦ నోటమి చెందక యోహటింప కా
పద్దశ నొంద కేపఱక ♦ పాయక లోఁగక స్రుక్క కార్తలన్. ౧౨౨౦

సీ. మత్తకుంజరముల♦మాడ్కిని బోరుచో, నెత్తుట మేనులు ♦ జొత్తిలంగ
నసమును గోరుచుఁ ♦ బసమెయిఁ గేరుచు, మసలక తారుచు ♦ మండలగతిఁ
గోఱలఁ గొఱుకుచు ♦ గోళ్లను బెఱుకుచుఁ, గత్తుల నఱుకుచు ♦ గండుమీఱి
దాసినఁ గొట్టుచుఁ ♦ బాసినఁ బట్టుచు, దూసినఁ దిట్టుచు ♦ దొరగిల్లి

ఆ. లేచి కవియు చిట్లు ♦ లీలమై రాక్షస,ప్లవగసైన్యపతులు ♦ బలము మెఱసి
వృత్రహరులరీతిఁ ♦ బిఱు దివియక యార్త, రోస ముజ్జగింప ♦ కేసరేఁగి. ౧౨౨౧

సీ. క్రొమ్ముతేనుంగుల♦కోమరున ఢీకొని, హనుమని తాఁకుడు ♦ రొక్కమాటు
తగరులవడువున ♦ దవ్వు దవ్వుగ వీఁగి, యురువడిఁ దగులుదు ♦ రొక్కమాటు
కోడిపుంజులరీతిఁ ♦ గూడి చుట్టుచు దాఁటు, లుగ్రత దాఁటుదు ♦ రొక్కమాటు
దందశూకము లనఁ ♦ గ్రిందు మీఁ దగుచును, నుర్విని బొరలుదు ♦ రొక్కమాటు

తే. ఆముటాఁబోతులట్లు సిం♦హములకరణి
వ్యాఘ్రములభంగిఁ బోరుచు ♦ నసమబలులు
నజితు లాహవవిక్రాంతి♦విజయు లుండ
దితిజపరివృఢుఁ డొక్కింత ♦ తెలిసిఁ గాంచి. ౧౨౨౨

కం. తటుకున ముసలంబును గొని, పటుజవగతిఁ గిశవీరు♦ఫాలము నడిచెన్
జొట జొట నెత్తురు గాఱఁగఁ, ద్రుటి నీలుఁడు విసరి చిమ్మెఁ ♦ దోరపుఁజెట్టున్.

చం. మినుగక దాని కేమి మిసి♦మింతుఁడు గాక ప్రహస్తుఁ డుగ్రుఁడై
ముసలము రెండుకేలఁ గొని ♦ మొగ్గలపుంబస మీఁది కెత్తి రా
గసిబిసిపాటు లేక ప్లవ♦గప్రవరేణ్యుఁడు దవ్వు దాఁటి పే
ర్వస నొకగుండు ఱివ్వనను ♦ నీచి శిరంబున మొత్తె సూటిగన్. ౧౨౨౪

కం. ఆరాతితాఁకునను దే,వారాతిశిరంబు పగిలి ♦ యఱవఱలుగ నై
ధారిణిఁ బడె లగుడంబుప్ర,హారంబునఁ బగులు కుంభ ♦ మన నిమిషమునన్.

కం. మూలము నఱకినఁ గుజ మన, వ్రాలె నతఁడు నేలపై శి♦రంబున మేనన్
జాలుగొనెన్ సెలయేఱుల,పోలిక నెత్తురులు భీమ♦ముగ నవ్వేళన్. ౧౨౨౬

మ. తమసేనాపతి యిట్లు లీల్గఁగ నవే♦తప్రీతిచిత్తుల్ నిరు
ద్యములున్ దీనులు నై నిశాచరులు వ్ర♦య్యం గట్ట నీరంబునా
సమరక్షోణిని వీడి లంకకును ద్రా♦సం బొత్తఁగాఁ బాఱి యా
యమరద్వేషినృపాలుశాలఁ జని మా♦టాడంగ లే కేమియున్. ౧౨౨౭

తే. ధ్యానమూకత్వమునఁ దెల్వి ♦ తప్పినట్లు, మహితశోకార్ణవంబున ♦ మగ్నులౌచు
వెఱ్ఱిచూపులు చూచుచు ♦ వెడలు బాష్ప,ధార లఱఁపఁగ నేమియు ♦ నేర రైరి.

కం. అద్భుతగతి, గపివంశ,ప్రోద్భవుఁ డిటు వైరిఁ జంపి ♦ భుజబలమున సం
యద్భూమి వెలిఁగెఁ గీశులు, ముద్భావముతోడఁ బొగడ♦మొనసినరక్తిన్.

కం. రాముఁడు మెచ్చెను మే లని, సౌమిత్రియు మిగుల నతని ♦ శ్లాఘించెన్ శా
ఖామృగసేనానియు నమి,తామోదముఁ జెందె దశర♦థాత్మజుకృపకున్. ౧౨౩౦

## రావణుఁడు తొలిసారి యుద్ధమునకు వెడలుట.

సీ. హతశేషసైన్యంబు ♦ లంతయు వినిపింప, విని రావణుఁడు క్రోధ♦వివశుఁ డగుచు
శోకార్దితుం డయి ♦ సురల సంబోధించు, వృద్ధశ్రవసురీతి ♦ నిట్టు లనియె

నాకపబలనాశు ♦ నాచమూపాలునిఁ, గపు లచే చంపిరి ♦ కదనసీమ
సానుయాత్రంబుగ ♦ సహాయగజంబుగ, నింక నుపేక్షింప ♦ హితవు గాదు

ఆ. ఔర! యెంతవింత ♦ యగచరులా రాక్షసులను జంపువారు ♦ చూతుఁ గాక
నేన పోయి వారి ♦ నిర్మూలితులఁ జేసి, జయముఁ గొందు స్థిరయ♦శంబుఁ గందు.

ఉ. ఏఁడురఁ నన్నుఁ దాఁకి మని ♦ యేగెడివాఁ డికఁ జూడుఁడీ నరుల్
మాఁడిచి వైచెదం గపిశ♦మాజముఁ గానను గారుచిచ్చు నాఁ
జూఁడెద రామలక్ష్మణులఁ ♦ జొక్కపు ముల్కుల, నింతచేసినన్
దూఁడరిపుర్వులన్ నరులఁ ♦ ద్రుంతును గా కిఁక నే సహింతునే? ౧౨౩౨

చం. అని జ్వలనప్రకాశ మగు♦స్యందనమున్ హయరాజియుక్తమున్
ఘనమణిదీప్యమానమును ♦ గ్రద్దన యెక్కి మృదంగభేరికా
నినదము శంఖరావమును ♦ నిస్తులరాక్షససింహనాదముల్
జనశుభవాక్యము ల్వెలయ ♦ సంగరకుర్దనలిప్సుఁ డై చనెన్. ౧౨౩౩

తే. అద్రిజలదాభరూపమాం♦సాదనులను, నగ్నిసందీప్తలోచను ♦ లనుగమించి
రా నిశాచరరాజేంద్రు ♦ నసురనాథు, రుద్రు భూతముల్ వెనుకొను♦మాద్రిఁ దోఁప.

తే. రావణుం డిట్లు వాహినీ♦రాజి గొలువఁ, బురము వెలువడి చనికాంచె ♦ భూజశైల
హస్త మర్ణవజలదర♦వాన్వితంబు, దృష్టిభీకర మైనక♦పీంద్రసేన. ౧౨౩౫

ఉ. వ్యాలధవోపమానభుజుఁ ♦ డద్రిచరేంద్రసమన్వితుండు సు
శ్రీలలితుండు రాముఁడు వి♦శృంఖల మై సమితిప్రచండ మై
యాలముఁ గోరివచ్చునసు♦రాధిపసైన్యముఁ జూచి శస్త్రవి
ద్యాలసితాగ్రగణ్యు సుగు♦ణాఢ్యు విభీషణుఁ గాంచి యిట్లనున్. ౧౨౩౬

శా. నానాకేతుకదంబజుష్టమును నా♦నాప్రాసశూలాదిసం
తానాభీలము దిగ్గజోపమమహా♦దంతావళాన్వీతమున్
నానాయోధవితానభీమ మయి సై♦న్యం బొప్పె నక్షోభ్య మై;
దానిన్ నా కెఱుఁగంగఁ జెప్పు మసురేం♦ద్రా! యద్ది యెవ్వారిదో. ౧౨౩౭

విభీషణుఁడు శ్రీరామునకు రాక్షసవీరుల నిరూపించి చెప్పుట.

కం. అనవుడు విభీషణుం డా, వనజాయతలోచనునకుఁ ♦ బంక్తిముఖునివా
హిని నిట్లని విశదంబుగ, వినిచెం దత్సేనఁ గలుగు♦వీరులతోడన్. ౧౨౩౮

మ. కరటిస్కంధగతుండు పూర్వగిరిశృం♦గభ్రాజమానాబ్జమి
త్రరుచిస్ఫీతముఖుండు శౌర్యఖని దో♦ర్దర్పప్రభాశాలి దు
ర్ధరతేజుండు స్వభారసంచలితవే♦దండోత్తమాంగుండు భూ
వరచంద్రా! యతఁడే యకంపనుఁడు దే♦వద్వేషిరాట్పుత్త్రుఁడున్. ౧౨౩౯

శా. జంభారాతిశరాసనద్యుతిలస♦చ్చాపంబుఁ దాఁ ద్రిప్పుచు౯
గుంభిద్వేషిపతాక మారథమునం ♦ గూర్చుండి ప్రాచీదిశా
కుంభింబోలి విస్తృత్తదంష్ట్రుఁ డయి ని♦క్కూల్ మీఱువాఁడే చుమీ
జంభారిస్మయహారి యింద్రజి వరా♦జయ్యుండు ధాత్రీశ్వరా! ౧౨౮౦

చం. అతిరథసింహుఁ డుత్తమశ♦రాసనటంకరణోగ్రుఁ డస్త మ౯
క్షితిధరము౯ మహేంద్రమును ♦ నిస్తులవింధ్యముఁ బోలువాఁడు దా
నతిపరివృద్ధకాయుఁడు శ♦తాంగగతుండు సమీకమం దనా
హతుఁ డతికాయనాముఁడు మ♦హాద్భుతకర్ముఁడు మానవేశ్వరా! ౧౨౮౧

శా. బాలార్కప్రతిమానలోచనుఁడు భా♦స్వద్ఘంటికానిస్స్వనా
భీలానేకపవాహనుండు నిజవి♦ద్విడ్భీతిసంధాత వీ
రాళీప్రాగ్రసరుండు భూరిఖరని♦ర్హ్రాదుండు రామావనీ
పాలా! వాఁడు మహోదరుం డనెడు దే♦వద్వేషి వీక్షింపుమా. ౧౨౮౨

శా. సాయాహ్నాభ్రగిరిప్రకాశవిలస♦జ్జాంబూనదాలంక్రియా
స్వాయత్తైంధవయానుఁ డై ధగధగ♦జ్జ్వాలావళీనద్ధగాం
గేయావిష్కృతముష్టికుంతవరముం ♦ గీలించి కేల౯ రణ
వ్యాయామాస్థను వచ్చునాతఁడు పిశా♦చాఖ్యుండు సీతాధిపా![1] ౧౨౮౩

ఉ. కింకరవజ్రవేగ మని ♦ కీర్తిత మైనవృషంబు నెక్కి ని
శ్శంకమతి౯ క్షణప్రభల♦జాలము[2] లీనెడి శాతశూలము౯
బింకము మీఱఁ బట్టి యతి♦వేగమునం జనుదెంచువాఁడు పు
ణ్యాంక రఘూత్తమా! త్రిశిరుఁ ♦ డన్బలియుండు జగత్ప్రసిద్ధుఁడున్. ౧౨౮౪

ఉ. కుండలిరాజకేతనుఁడు ♦ కుంభుఁడు వ్యూఢసుజాతపీనవ
క్షుం డమృతాశనోత్కరని♦షూదనదక్షుఁడు తాలతుల్యకో
దండవిధూననుండు భృశ♦దారుణకార్ముకటంక్రియావిరా
వుండు ప్రచండవిక్రముఁడు ♦ భూమిసుతారమణీమనోహరా![1] ౧౨౮౫

ఉ. ఆతనిసోదరుం డతిభ♦యంకరరూపుఁడు దైత్యవాహినీ
కేతనభూతుఁ డుగ్రరణ♦కేళ్యవిచింతితఘోరకర్ముఁడు౯
ఖ్యాతబలుండు రత్నమయ♦హాటకజుష్టవిధూమదీప్తిమా
లాతతసంజ్వలత్పరిఘ♦హస్తుఁడు రామ! నికుంభుఁ డాఖ్యచేన్. ౧౨౮౬

ఉ. చాపకృపాణకాండముఖ♦సాధనసంచయభాసమాన మై
దీపితహవ్యవాహనస♦దృక్షము వ్యోమచలత్పతాకమౌ

[1] సీతగతి మనస్సునకుఁ దెచ్చి రామునకుఁ గోపము కలిగింప నిట్లు సంబోధింపఁబడెను. [2] క్షణప్రభ = మెఱుపు.

శ్రీపరిణద్ధఘోటకవిశిష్టశతాంగముపై నుదగ్ర మా
రూపున నున్నవాఁడు నగయూథనుయోధి నరాంతకుం డగున్. ౧౨౪౭

సీ. నానావిధాకార నాగేంద్రశార్దూల,వృతిమృగోష్ట్రాస్య భూతచయము
బలసి రా రుద్రుని భాతి వెలుంగుచు, సూక్ష్మశలాకంబు సుందరంబు
సోమసంకాశంబు శుభ్రాతపత్రంబు, రహిమీఱ మకుటంబు రాణ దనరఁ
దళతళలాడంగఁ జలకుండలంబులు, ప్రాలేయధరవింధ్య పర్వతములఁ
ఆ. బోలు భీమతనుఁడు పురుహూతసమవర్తి,దర్పహంతి యపర తపనమూర్తి
నాకలోకమంది రార్తిఘుటకకీర్తి, సదయ! యతఁడె యసుర చక్రవర్తి. ౧౨౪౮

శ్రీరాముఁడు రావణుఁ జూచి యాశ్చర్యపడుట.

కం. శ్రీరాముఁ డానుడు ల్విని, యౌరా తేజంబు! పటుప రాక్రను మరరే!!
సూరుఁడు కరములచేవలె, నీరావణుఁ డమరె దుర్ని రీక్షుండగుచున్. ౧౨౪౯

కం. దేవతలయందు నేనియు, దేవారులయందు నిట్టి తేజోయుతరూ
పే వేళ వినఁగఁబడెనే, యీవీరునిదీప్తి కలుగ దిల నెవ్వరికిన్. ౧౨౫౦

కం. అందఱును శైలతుల్యులు, నందఱు నగయోధు లంద ఱాయుధధరుల్గా
మందేతర తేజులు వీ,రిం దిరు లయి గొలిచి వచ్చు నిశిచరవీరుల్. ౧౨౫౧

కం. భీమపరాక్రమముం దే,జోఽమితవిగ్రహము తీక్ష్ణ నుగుబహుభూత
స్తోమము గొలువఁగ నీతం, డామార్తండాత్మజాతు నట్లు వెలింగెన్. ౧౨౫౨

కం. ఈపగిది దైవవశమున, నీపాపాత్ముండు నాదు దృష్టిపథంబున్
బ్రాపించె వీనిపై నీ,తాపహరణజనితరోష మంతయు విడుతున్. ౧౨౫౩

కం. అని రామచంద్రుఁ డంతట, ధనువుం గొని యెక్కుపెట్టి దారుణశరమున్
దొన నుండి దూసికొని, యనుజునితో నిలిచె సంగ రార్పితమతి యై. ౧౨౫౪

సీ. అసురాధినాయకుం డనుచరులను బల్కు, నరుగుఁడు మీ రెల్ల మరలి పురికి
ద్వారచర్యాగృహ ద్వారగోపురముల, నిలువుఁడు మదిలోన నళుకు లేక
యెల్లరు నిటవచ్చు టెఱిఁగినచో వన,చారులు తమ కిదే సమయ మనుచు
శూన్యపట్టనమును జొచ్చి ధ్వంసముఁ జేసి, పాడుచేయఁగఁ బూను వారు సుండు
ఆ. పొం డటంచుఁ బంపి దండిమగం డంత, నర్ణవంబుఁ జొచ్చు నమితరూప
ఝషమువోలెఁ గీశ సైన్యసాగరమును, ప్రచ్చికొనుచుఁ జొచ్చెఁ గచ్చు మెఱసి.

రావణుఁడు సుగ్రీవాదులతోఁ బోరుట.

శా. సాహంకారకఠోరనాదదళితా శాకుడ్యభాగుండు నై
యాహాహోపురుషికం బ్రదీప్తవిశిఖే ష్వాసుండు నా రాక్షస

ఘ్నాహవాధీశ్వరుఁ జూచి సూర్యసుతుఁడుం ♦ బ్రోద్యన్మహారోషుఁ డై
బాహాటోపవిజృంభమాణుఁ డగుచుం ♦ బై వైచె శైలాగ్రమున్.  ౧౨౫౬

ఉ. వానరరాజముక్తకుజ♦వారసమంచితసానుయుక్తని
స్స్వనభయంకరాద్రి తన♦పై నరుదెంచుట గాంచి రుక్మపుం
ఖానుపమానవేగవిశి♦ఖావళిఁ జాపకళాప్రవీణుఁ డా
దానవభర్త యేసె శత♦ధాపికలం బయి నేల రాలఁగన్.  ౧౨౫౭

ఉ. ఏసియు వానరేంద్రు వధి♦యింపఁగఁ గోరి సరోషచిత్తుఁ డై
వాసవసాధనోపమ మ♦వారితమారుతతుల్యవేగముక్
భాసురశాతమార్గణముఁ ♦ బావకతేజము గాఢముష్టి నా
యాసురభర్త వైచె హృద♦యాంతరదేశము నాట సూటిగన్.  ౧౨౫౮

తే. షణ్ముఖప్రేరితం బైన♦శక్తి క్రౌంచ,పర్వతము నుచ్చిపోయిన♦పగిది గాఁగ
దశముఖవిముక్తదారుణ♦విశిఖ మపుడు, వేఁడివెలుఁగులదొరపట్టిఁ ♦ గాఁడిపాఱె.

కం. ఆసాయకవేదనచే, వానరపతిసుతుఁడు కూలె ♦ వైచుచుఁ బడినన్
మూసర మగుసంతసమున, నాసురసైన్యంబు లట్ట♦హాసము సేసెన్.  ౧౨౬౦

సీ. శాఖామృగేంద్రుని ♦ చందంబుఁ గనుగొని, తీవ్రవేగమున జ్యో♦తిర్ముఖుండు
గవయగవాక్షులు ♦ ప్లవగర్షభుం డైన,ఋషభుఁడు నభుఁడు మహీ♦ధరాళిఁ
దాల్చి సుదంష్ట్రుండుఁ ♦ దమకుఁ దోడ్పడ మేను,పెంచి రావణుమీఁద♦విసరి వైవ
వింశతిబాహుండు ♦ వివిధఖగంబుల, నేలఁ దూలఁగ నేసి ♦ నిశితబాణ

తే. జాలముల వారితనువుల ♦ జల్లెడలను,బోలె నొనరింప వారలు ♦ భూమిఁ బడిరి
పంక్తివదనుండు నెనిరించు♦వారు లేక,మూఁకపైఁ బడి నుఱుమాడె ♦ మీఁక మెఱసి.

చం. నగచరవీరవర్గము న♦నర్గళమార్గణవృష్టిఁ జేతిబ
ల్మిగు వెసఁగంగ ముంప నతి♦భీతిని క్రోఁతులు జాతదుఃఖు లై
వగచెడి పాఱి దీనజన♦వత్సలు లోకశరణ్యు రామునిన్
మొగి శరణంబు వేఁడ నృప♦ముఖ్యుఁడు వారలభీతి మాన్పుచున్.  ౧౨౬౨

⟶ లక్ష్మణుఁడు రావణుతోఁ బోర రామాజ్ఞఁ గొనుట. ⟵

కం. కరుణాపరుఁడు మహాత్ముఁడు, గురుతరచాపంబుఁ గేలఁ ♦ గొని రావణుపై
నరుగఁగ లక్ష్మణుఁ డిట్లనుఁ బరమార్థం బైనసూక్తిఁ♦బ్రాంజలి యగుచున్.  ౧౨౬౩

కం. దేవర లే కృతముఖు లీ,రావణు దురితాత్ముఁ జంప ♦ రణమున నైనన్
నే వధియించెద నీచుం, దేవా నా కానతిమ్ము ♦ నమ్మి న టన్నన్.  ౧౨౬౪

ఉ. రాముఁడు సత్యనిస్తులప♦రాక్రముఁ డిట్లనుఁ బొమ్ము లక్ష్మణా!
యేమఱఁబోకుమీ కలన ♦ నీయసురేశ్వరుఁ డాహవైకవి

ద్యామహీతాసముద్రవిభుఁ ♦ డద్భుతవీర్యుఁడు మూఁడులోకముల్
హామిక నెత్తి క్రుద్ధుఁ డగు♦నాతనిఁవ్రేలిని వంపలే వనిన్. ౧౨౬౫

కం. కను మాతనిచ్ఛిద్రంబులు, కను నీలోపములు వానిఁ ♦ గనఁబఱుపకు నిర్
ధనువునఁ గన్నుల హెచ్చరి,కను రక్ష యొనర్చికొనుచుఁ ♦ గడఁగుము పోరన్.

కం. నావుడు సౌమిత్రియు సీ,తావిభునిం గౌఁగిలించి ♦ తత్పదముల స
ద్భావమున మ్రొక్కి యుద్ధము,పై వేడుక నరిగెఁ గీశ ♦ వరులు నుతింపన్.

మ. ధరణీశాత్మజుఁ డేగి కన్గొనియె ను♦ద్యద్భీమకాండాసనుఁ
బరమాశీవిషతుల్యమార్గణకదం♦బచ్ఛాదితాత్మీయవా
నరసేనానివహున్ దశాస్యు శితకాం♦డవ్రాతనిర్భిన్నగా
త్రరవాక్రాంతదిశాంతు రక్తనయనాం♦తస్ఫీతవక్త్రాబ్జుఁ డై. ౧౨౬౮

## రావణ హనుమంతుల యుద్ధము.

కం. కరికరబాహుఁడు లక్ష్మణుఁ, డరుదెంచుట గాంచి యడ్డ ♦ మరిగి బలువిడిన్
మరుదాత్మభవుఁడు తోఁకం, బరుశరములఁ జెదర నడిచి ♦ పటుకోపమునన్.

ఉ. రావణు తేరిపై కుఱికి ♦ గ్రద్దన దక్షిణబాహు వెత్తి ర
క్షోవరుఁ డాత్మ బెగ్గలఁగఁ ♦ గ్రూరపుఁజూపులఁ జూచు చిట్లనున్
రావణ! నాగయక్షసుర♦రాక్షసదానవపక్షిజాతిచేఁ
జావక యుందు గాక కపి♦సంఘముచే మృతి నీకుఁ దప్పునే? ౧౨౭౦

మ. ఇదె నాదక్షిణబాహువుం గనుము రో♦రీ! పంచశాఖాన్వితం
బిది నీయున్నదినాలు కాచునను ఱి♦ప్డే దేహమందుండి వే
చెదరంగొట్టఁగ నెత్తితిం, దిరుఁడవై ♦ చేకొమ్ము, నా రావణుం
డుదితక్రోధుఁడు రక్తనేత్రుఁ డయి వా♦యుప్రోద్భవుం ధీరతన్. ౧౨౭౧

మ. అనియెం జూచెదఁ గాక నీకడిమి కీ♦శా! కొట్టుమీ వేగ న
న్ననుమానింపక పొందుమీ యశము నే ♦ నా వెన్క నీశౌర్యముం
గని నిన్నుం బరిమార్తు నన్న మును సం♦గ్రామంబునన్ మద్భుజున్
మనమం దక్షుని సంస్మరించుకొని య♦స్మచ్ఛౌర్య మూహింపుమీ. ౧౨౭౨

చం. అనవుడు శౌర్యదర్పమహి♦మాన్వితుఁ డైనసురేంద్రుఁ డామరు
త్తనయునురంబు గాఢతల♦తాడనపీడితమున్ ఘటింపఁగా
హనుమయుఁ దత్ప్రహారజని♦తాధికబాధను సారె సారె కొ
య్యనఁ జలియించి యూఁగి నిమి♦షార్థమునన్ మఱి స్థైర్య మూనుచున్.

కం. తీండ్రం బగుకోపంబునఁ, జంద్రులనిప్పుకలఁ బోలు ♦ చక్షుల ననురన్
గాంత్రించుమోమునన్ వెస, గోండ్రించుచుఁ బాణి నొక్క♦గ్రుద్దుం గ్రుద్దెన్.

కం.ఆకపివర్యునిపోటున, కాకంపించెను సురారి ♦ యధికవ్యథచే
భూకంపంబున గిరి యనఁ, బ్రాకటగతి వచ్చుపోవు ♦ ప్రాణంబులతోన్. ౧౨౭౫

కం.హనుమత్కరతలతాడన,మున గాసింబడినయసుర ♦ ముఖ్యునిఁ గని కా
ననచరఖచరమునీంద్రులు, మనములు భృశహర్షవార్ధి ♦ మగ్నంబులుగన్ ౧౨౭౬

కం.కొండాడిరి రావణుఁడుం, గొండొకవడిఁ దెప్పిఱిల్లి ♦ కొని మేల్ మేల్ మా
ర్తుండవ వైనను మెచ్చితి, దండిమగఁడ వన్నఁ బవన ♦ తనయుఁడు పలికెన్. ౧౨౭౭

ఉ. ఏటికి నన్ను మెచ్చెద వి ♦ సీ యది యేమిటిపోటు రావణా!
కాటికిఁ బోక తక్కితివి ♦ కాల్పనె మద్భుజశౌర్యసారముల్
పోటులతారతమ్యమును ♦ బోలనెఱుంగనిమూఢ! నన్ను నీ
మా ఱెది గ్రుద్దుమీ పిదప ♦ మద్దృఢముష్టిని నిన్నుఁ గూల్చెదన్. ౧౨౭౮

ఉ. నావుడుఁ గ్రోధరక్తనయ ♦ నంబుల మండుచు శక్తియంతయుఁ
బావిరిఁ బూని పెన్గడఁక ♦ వాయుతనూజునురంబు దక్షిణం
బావరముష్టిఁ దాఁచినఁ ద ♦ దాహతి నాతఁడు దద్దఱింపఁగా
రావణుఁ డింతలో నుఱికి ♦ క్రచ్చఱ నీలునిఁ దాఁకి యానునన్. ౧౨౭౯

## ⟵ రావణుఁడు నీలునితో యుద్ధము సేయుట. ⟶

శా.ఘోరాశీవిషతుల్యముల్ నిశితముల్ ♦ క్రూరంబులుఁ మర్మసం
వారచ్ఛేదనదక్షముల్ భయదముల్ ♦ బాణంబు లత్యుద్ధతిఁ
ధీరుఁ నీలుని ముంప నాతఁడు మహా ♦ ధీరాగ్రణుం గేల ర
క్షోరాజన్యునిమీఁద వైచెను; మరు ♦ త్సూనుండు నీలో స్మృతిన్ ౧౨౮౦

కం.కని నీలునితోఁ బెనఁగెడి,దనుజేంద్రునిఁ జూచి యహహ ♦ తప్పెం దప్పెఁ
జనరాదు గాక పగతుం, డని సేయఁగ నన్యులోడ ♦ నని చింతించెన్. ౧౨౮౧

ఉ. నీలవిముక్తశృంగమును ♦ నిష్ఠురమార్గణసప్తకంబునఁ
నేలను దున్కలై తొరఁగ ♦ నిర్జరవైరి ఘటింప నాతఁడుఁ
గాలకృశానుఁబోలి యధి ♦ కం బగురోషముతోడ మండుచుఁ
సాలధవాశ్వకర్ణకర ♦ సాలతమాలజటిద్రుమాదులన్. ౧౨౮౨

ఉ. వారక పైపయిం గురియ ♦ వానిని జెక్కలు ముక్కలై పడఁ
నారసముల్ గుముల్ రయము ♦ నం బరఁగించియు నంతఁ బోక య
వ్వీరునిపైఁ గలంబచయ ♦ వృష్టి నిరంతర మై పడంగ తే
ఖారి నిగుడ్చ వానరుఁడు ♦ హ్రస్వముగా ఘటియించి రూపమున్. ౧౨౮౩

చం.ఎగసి ధ్వజంబుపైఁ బడఁగ ♦ నెందుర పోయెద వంచు వానిపై
ఖగముల వైచు లోన హరి ♦ గర్జల నించుచు వింటికోపుపై

నాఁగపయిఁ గేతనంబుపయి ♦ నొప్పడరంగఁ గిరీటసీమపై
వగచెడి సైంధవాళిపయి ♦ వానికరంబులపై శిరంబుపై. ౧౨౪

కం.ఇక్కడ కక్కడ కక్కడ, కిక్కడకున్ లాఘవమున ♦ నెగురుచుఁ గపి పే
రక్కజపున్లాఘవమున, నొక్కింతయు గుఱికి చిక్క ♦ కుద్ధతి మెఱసెన్. ౧౨౫

కం.ఆతనిజవలాఘవముల, కాతతవిస్మయము నొంది ♦ రనిలాత్మజుఁడున్
సీతానాథుండు సుమి,త్రాతనయుఁడు సంప్రమోద♦తత్పరమతులై. ౧౨౬

కం.వానరలాఘవవిస్మితుఁ, డౌనరభోజనుఁడు పావ♦కాస్త్రము వింటన్
బూని కపినేయఁ గడఁగియు, వానియునికిఁ దెలియ లేక ♦ భ్రమ గొని యుండెన్.

కం.వికలస్వాంతంబునఁ గడుఁ,దికమిక గొనునసురనేత ♦ దృష్టించి కపుల్
ప్రకటాద్భుతుల న్నించిరి, మెకమెకపాటునను ముదము ♦ మిగులఁగ నంతన్.

కం.నీలునిగంతులకుం గపి,జాలము రంతులకు నసుర♦సత్తముఁ డెంతే
వ్యాలోలమనస్కుం డయి, తూలుచు నేమియును దిక్కు ♦ దోఁపక యుండెన్.

చం.కలవరపాటుఁ దేఱి దశ♦కంఠుఁడు కేతనసంస్థు నీలునిన్
దెలిసి కపీ! లఘుత్వమునఁ ♦ దేఱిన మేటివి, మాయచేతఁ[1] బె
క్కులు నిజరూపముల్ నెఱపఁ ♦ గూడితి వీయనలాస్త్ర మేసెదన్
దెలియుము, నీకు శక్తి గల♦దేనియుఁ బ్రాణముఁ గాచుకొమ్మికన్. ౧౩౦

కం.నీ వెంత యెగురు లాడిన, జీవముతో విడదు నిన్ను ♦ సిద్ధం బని యా
పావకబాణము వైచెను, బావకసుతుమీఁదఁ బంక్తి♦వదనుం డలుకన్. ౧౩౧

చం.తతభయదానలాస్త్రమునఁ ♦ దాడితుఁ డై పరిదహ్యమానుఁ డై
స్మృతిరహితుండు నై యొఱిగె ♦ మేదిని నీలుఁడు జాను లూఁతగాఁ
బితృసుమహానుభావమున ♦ స్వీయబలంబునఁ దేజుచే నసు
చ్యుతిఁ గనఁ డయ్యె నంత బల♦సూదనగర్వహరుం డహంకృతిన్. ౧౩౨

రావణ లక్ష్మణ సంవాదము.

చం.ముదిరము మ్రోయునట్లు రథ♦ముం బఱపించుచుఁ జేరి లక్ష్మణుం
గదిసి గుణధ్వనుల్ చెలఁగఁ ♦ గ్రచ్చఱ నడ్డము వచ్చువారలన్
గుదియఁగఁ జేయుచుండఁ గని ♦ కూళ నిశాచర! బక్కక్రోఁతులన్
మదమునఁ జంపు టంత విసు♦మానపుఁగర్మమె శూరధర్మమే. ౧౩౩

కం.ముదముపలే కీశుల, నదవదపడఁ జేసి యడరి♦నంతనె చనెనా
గొదగొద రా రమ్మిటు నే,నదమద మొనరింతు నీదు♦ స్మయ మసురేంద్రా!

కం.అనవుడు నాతనివాక్యం,బును నుగ్రము పూర్ణఘోష♦మును నగుమౌర్వీ
నినదంబును విని కినుకన్, దనుజాగ్రణి యను సుమిత్ర♦తనయునితోడన్. ౧౩౫

[1] మాయ = అద్భుతశక్తి. అసత్యమైన యింద్రజాలాదికము గాదు.

ఉ. ఎంతటిభాగ్య మార మను♦జేంద్రసుతా! విపరీతబుద్ధి వై
యంతకునంతికంబుఁ జన ♦ నాత్మఁ దలంచియొ వచ్చినాఁడ, వొ
క్కింత మదీయదృష్టిపథ ♦ మియ్యెడఁ బాయకు, నాదుబాణముల్
సుంతయు జాగులేక యమ♦లోకముఁ జేరఁగఁ బుచ్చు ని న్ననన్. ౧౨౯౬

ఉ. ఏపున బొబ్బరిల్లునసు♦రేంద్రుని వృత్తసితాగ్రదంష్ట్రునిన్
భూపతివర్యపుత్త్రుఁ డొక♦పోకకుఁ గైకొన కిట్లు పల్కె నో
పాపజనాగ్రగణ్య! యిటు ♦ పగ్గెలు గొట్టెడ వేల నీకు నీ
వే? పరమప్రభావు లిటు ♦ ప్రేలరు కాఱులు మున్న మున్నగన్. ౧౨౯౭

చం. ఎఱుఁగనివాఁడఁ గాను నసు♦రేంద్ర! భవద్బలముం బ్రతాపముం
గొలుపరాక్రమం[1] బెఱిఁగి ♦ కోరి రణం బరుదెంచినాఁడఁ గ్ర
చ్చఱ శరచాపపాణి నయి ♦ సాధనముల్ కయి నుండ నిట్టిప
ల్లఱపుల నేమికార్య మగు ♦ నాలము సేయఁగ రమ్ము నావుడున్. ౧౨౯౮

## రావణలక్ష్మణుల యుద్ధము.

ఉ. క్రోధపరీతచిత్తుఁ డయి ♦ క్రూరసుపుంఖకలంబసప్తకం
బేధితవేగముం బఱప ♦ నింతలు నింతలుచేసె వాని దు
స్సాధపరాక్రముండు నర♦సత్తముఁ డుజ్జ్వలరుక్మపుంఖ ము
త్సేధము శాతధార మగు♦తీవ్రపృషత్కసముత్కరంబునన్. ౧౨౯౯

సీ. సౌమిత్రినిర్ముక్త♦శాతాశుగంబుల, చేఁ దనబాణముల్ ♦ చిద్రుపలగుచు
నిర్ముక్త ఫణులట్లు ♦ నేలఁ దొరంగినఁ, దామ్రలోచనుఁ డయి ♦ దశముఖుండు
వెండియుఁ గురియించెఁ♦గాండప్రకాండప్ర,కాండంబులను మెండు♦దండి గాఁగఁ
దద్బాణవర్షంబు ♦ దశరథసుతుఁడును, గర్ణిభల్లక్షుర♦కాండములను

తే. నర్ధచంద్రశరంబుల ♦ నన్ని యంద, యంద తునుమాడి కలఁగక ♦ యంద నిలిచె
నెన్నిశరములఁ దా నేయ♦నన్ని వితథ,ములుగ నొనరించు లక్ష్మణు♦బలముఁ జూచి.

ఉ. అబ్బుర మంది యయ్యనఘు♦హస్తలఘుత్వపటుత్వలక్ష్మికిన్
గొబ్బున వెండియుం గురిసె ♦ ఘోరశరంబుల వాని నెల్ల బె
న్నిబ్బరమూని లక్ష్మణుఁడు ♦ నేలను గూలఁగ నేసి వీని పె
న్గబ్బితనం బడంచి వడిఁ ♦ గాలునిఁ గూర్చెద నంచు నెంచుచున్. ౧౩౦౧

శా. దంభోళిప్రతిమానచండనిభ శా♦తక్రూరబాణాళి సం
రంభం బొప్పఁగ వింటఁ గూర్చి హుతభు♦గ్రశ్మిచ్ఛటల్ గ్రక్కఁ త
చ్చుంభద్వేగితతిన్ నిగిడ్చె నల ర♦క్షోనాథు పై దర్పవి
స్రంభుం డాతఁడు వానిఁ ద్రుంచి మఱి వి♦శ్వస్రష్టృదత్తంబులన్. ౧౩౦౨

[1] ఇది పరిహాసవచనము.

శా. కల్పోషర్బుధతుల్యకాంతిశరపూ♦గంబుల్ లలాటస్థలిన్
గొల్వన్ గాఢముగా సుమిత్రసుతుఁడుం ♦ గ్రూరాస్త్రసంతానజా
తాల్పాన్యవ్యథ సంచలించి శిథిలం ♦ బౌచాపముం బట్టి పై
నల్పాదరం బ్రతిలబ్ధసంజ్ఞుఁ డయి ఖం♦డించెం దదిష్వాసమున్ ౧౩౦౩

శా. తుండెల్ చేసి నిరంకుశత్వరను దై♦త్యుల్ మూఁడుబాణంబులన్
గుండెల్ వ్రయ్యఁగ నాటఁగా నతఁడు గ♦గ్గో లొంది తబ్బిబ్బునై
ఖండీభూతశరాసనుండు భృశర♦క్తక్లిన్నగాత్రుండు మే
దోండవ్యాప్తతనుం డసంజ్ఞుఁ డయి కృ♦చ్ఛ్రాత్తస్మృతిం దెంపునన్. ౧౩౦౪

ఉ. తోయజగర్భుఁ డిచ్చినవి♦ధూమకృశానునిభం బమోఘ మ
త్యాయతశక్తి శక్తి యను♦నాయుధముం గపిగోటి బెగ్గిలన్
జే యని వీచి వైవఁ గని ♦ నిష్ఠురవహ్నిసదృక్శరంబులన్
దాయక యుండఁ గొట్టినను ♦ దాఱక యయ్యది భీషణాకృతిన్ ౧౩౦౫

మూర్ఛిల్లిన లక్ష్మణు రావణుఁ డెత్తఁ బ్రయత్నించుట.

చం. సరభసవృత్తి వచ్చి సువి♦శాలభుజాంతరసీమ నాటినన్
గురుతరశక్తిశాలి రఘు♦కుంజరుఁ డుజ్జ్వలగాత్రుఁ డై ధరం
దొరఁగెను మూర్ఛ ద్రెక్కొనఁగఁ ♦ దూర్ణము వింశతిబాహుఁ డామహా
పురుషుని నెత్తికొం చరుగ ♦ బుద్ధిఁ దలంచి కరాళి నెత్తఁగన్. ౧౩౦౬

ఉ. మాసితశక్తి మేరువును ♦ మందరముం దుహినాచలంబు ద్యో
యానచరాన్వితం బగుస♦మస్తజగంబును గేల నెత్త నో[1]
దానవభర్త యాభరతు♦తమ్ముఁ[2] గదల్పఁగ నేరఁ డయ్యె బల్
పూనికఁ బంగటించి పెద♦వు ల్బిగియించి యు నీల కర్చియున్. ౧౩౦౭

ఆ. వనజభవునిశక్తి ♦ వక్షంబు నాటంగ, నిట్టి దట్టి దనుచు ♦ నెన్నరాని
విబుధవినుత మైన♦విష్ణ్వంశభూత మా, స్వస్వరూప మతఁడు ♦ సంస్మరించె.[3] ౧౩౦౮

ఉ. మానక వైష్ణవాంశ మటు ♦ మానుషదేహసమాశ్రితంబుగా
దానవదర్పనాశకు ను♦దారబలాఢ్యు సుమిత్రపట్టి న
ద్దానవనాయకుండు భుజ♦దండములన్ బిగఁబట్టియున్ రవం
తేనియు నెత్తఁజాలక ర♦హిం బెనఁగాడుచు నుండె నింతలోన్. ౧౩౦౯

హనుమంతుఁడు రావణుఁ దన్ని లక్ష్మణు నెత్తికొని శ్రీరామునొద్దకుఁ బోవుట.

ఉ. పరువున వచ్చి వాయుజుఁడు ♦ వజ్రనిభం బగుముష్టి ఱొమ్మునం
బహుతరశక్తి గ్రుద్దుటయు ♦ మోములఁ గన్నుల వీనులందు నె

[1] ఎత్తనో = ఎత్తుటకు శక్తిగల. [2] రామునకుఁ జిన్న భరతుఁడు; భరతునికంటెఁ జిన్న లక్ష్మణుఁడు. ఇరువదిచేతుల లక్ష్మణుని గదలింపలేనివాఁడు రాముని నేమిజయింపఁగలఁడని భావము. [3] ఉత్తరపీఠికఁ జూడుఁడు.

త్తురు లురలంగ ది క్కెదియుఁ ♦ దోఁపక చేష్టలు దక్కి సోలి తా
నరదములోనఁ గూలఁబడి♦యైనను గానఁడు పూర్వసుస్థితిన్. ౧౩౧౦

ఆ. అతులశౌర్యధుర్యు ♦ నరసాపు చచ్చిన, పంక్తివదనుఁ జూచి ♦ ప్లవగతతులు
ఋషులు వాసవాది♦ఋభువితానంబులు, నెలమిఁ బొంగి కేక ♦ లిడియె నంత.

తే. రావణశరార్దితుని సుమి♦త్రాతనూజు, ననఘు తేజస్వి యైనవా♦తాత్మజుండు
బాహువుల నెత్తికొని చని ♦ స్నేహగరిమ, రామచంద్రునియంతిక♦సీమ నిలిపె.

తే. పవనతనయుండు సుహృదుండుఁ ♦ భరమభక్తి
గలుగువాఁడును నగుట ల♦క్ష్మణుఁడు పగఱ
కప్రకంప్యుండు నయ్యు వ♦నాటునకును
దేలికగ నయ్యె[1] నంత నా♦ధీరవర్యు ౧౩౧౩

కం. దుర్జయుఁ డగులక్ష్మణుని వి,సర్జించి విధాతృశక్తి ♦ చయ్యనఁ జనియెన్
నిర్జరకంటకు తేరికి; వర్జితశల్యుండు తేటి ♦ బడలిక దీఱెన్. ౧౩౧౪

తే. మనములోపల స్మరియించు♦కొనుచు నుండె, విష్ణు నవిచింత్యు నైనట్టి♦స్వీయభాగ
మంత సురవైరి తెప్పిఱి ♦ యాశుగములఁ, గార్ముకంబును ధరియించి ♦ కడఁగె ననికి.

శ్రీరాముఁడు హనుమంతుపై నెక్కి రావణుమీఁదికిఁ బోవుట.

ఉ. పాతితవీరయోధము ద్ర♦వద్ధరియూథముఁ జూచి రాముఁడున్
జాతరుషారుణాక్షుఁ డయి ♦ సత్వరుఁ డై దశకంఠుమీఁదఁ బో
వాతసుతుండు డాసి బల♦వంతు సుపర్ణుని విష్ణునట్లు నన్
ఖ్యాతనయేశ! యెక్కి సుర♦శాసను శాసితుఁ జేయు టొప్పగున్. ౧౩౧౬

సీ. అనవుడు నక్కపి♦వ్యాఘ్రుంబుమూఁపుపై, నారోహణ మొనర్చి ♦ యమితశౌర్య
ధనుఁడు రాముండు స్యం♦దనగతు వింశతి,బాహునివంకను ♦ బాఱఁజూచి
రోషవశమున నై ♦రోచనిపైఁ బాఱు,నుద్యతాయుధవిష్ణు♦నొప్పు మిగుల
వజ్రనిష్పేషని♦స్స్వనము మార్మ్రోవ, మంతకంతకు నిగు♦డారు చుండ

తే. జలధిగంభీరరవమునఁ ♦ బలుకు నిట్లు, నిలునిలుము విప్రియం బట్లు ♦ సలిపి నీవు
దనుజవల్లభ యెచటికేఁ ♦ జనెద వేని, విడుతు నంచుఁ దలంతువా ♦ వీరమాని.

కం. వినరా యింద్రునిఁ గాలుని, దిననాథు స్వయంభు శంభు ♦ దిగ్దశకంబున్
జనినను నిను విడువన్ నీ,తనువునకుం బ్రాణమునకుఁ ♦ దగులముఁ జెఱుతున్.

చం. తతగురుశక్తి నెవ్వనిని ♦ దాడితుఁ జేయుటఁ బొంగి పోయె దా
యతిబలశాలి లక్ష్మణుఁడె ♦ హావడి నీ కొనరింపఁ గోరి నిన్
సుతతరుణీసమేతు రవి♦సూనున కప్పన సేయువాఁడు నై
మతిగొని యుద్ధభూమి నిను ♦ మార్కొన వచ్చె నటంచు నెంచుమీ. ౧౩౧౯

[1] వాస్తవపు మూర్ఛితుఁ డొకరికిఁ దేలికగను, మఱియొకనికి భారముగను దానుగ నగుశక్తి తెలివి గలవాఁడు కాఁజాలఁడు. బ్రహ్మశక్తిని నగౌరవింపరాదు గావున దానిని సమ్మానింప నాగపాశబంధము నందువలె నీమూర్ఛ మాయామానుషనటనమున్మాత్రము. ఉత్తరపీఠికం జూడుఁడు.

కం. ఈనేను గాదె యసురవి, తానముఁ బదునాల్గువేలు ♦ దర్పోద్ధతమున్
నానాసాధనము జనస్థానంబునఁ జంపినాఁడ ♦ సంగరమందున్. ౧౩౨౦

## శ్రీరామరావణుల ప్రథమయుద్ధము.

చం. అనవుడు నాగ్రహం బడర ♦ నారఘురామునియెక్కిరింతఁ[1] బా
వని లయకాలవహ్నినిభ ♦ బాణములం బ్రహరించి నొంప నా
యనఘుస్వభావతేజ మది ♦ యంతకు నంతకు నెక్కుడయ్యె, నా
తని దశకంఠమార్గణకృ ♦ తవ్రణుఁ గాంచి రుషావశాత్ముఁడై. ౧౩౨౧

శా. ఆకర్ణాంతము లాగి చాపమును వే ♦ గాటోప మేపార నా
నాకిద్వేషిరథంబు నొక్కవడిఁ జ ♦ క్రాశ్వధ్వజచ్ఛత్రసూ
తాకుంతాశనిశూలఖడ్గసుపతా ♦ కాన్వితమై ధాత్రిపై
నాకారం బెఱుఁగంగరాని గతి ను ♦ గ్గై రాల బాణావళిన్ ౧౩౨౨

ఉ. కూలిచి యంతఁ బోక భృశ ♦ ఘోరమహాశనివజ్రసన్నిభం
బై లలిమీఱుబాణమును ♦ నాతనివ్యూఢభుజాంతరంబు దం
భోళిని మేరుశైలము బు ♦ భుక్షుఁడు వ్రయ్యఁగ మోఁదినట్లు లా
భీలముగాఁగ నాటుటయుఁ ♦ బెల్కుఱి నాతఁడు వీతచేష్టుఁడై. ౧౩౨౩

తే. మోఘుఁ డెవ్వాఁ డశనికులి ♦ శోగ్రహతుల, కించుకేనియుఁ గలఁగఁడు ♦ సంచలింపఁ
డట్టివీరుఁడు రామబా ♦ ణార్తి మిగుల, నడలి వడఁకుచు ధనువును ♦ విడిచెఁ బుడమి.[2]

ఉ. ఆకులపాటుఁ గూరుచు ని ♦ రాయుధుఁడై ధర నిల్చియున్న యా
నాకులవైరి యర్కరుచి ♦ నందముమీఱుకిరీట మర్ధచం
ద్రాకృతి గల్గుబాణమున ♦ నామహితాత్ముఁడు డొల్లనేసి య
ప్రాకృతయుద్ధధర్మకృతి ♦ బాధదయారసపూర్ణచిత్తుఁడై. ౧౩౨౪

కం. కోఱలు దీసినపా మన, నాఱిన వేఁడిమిగలట్టి ♦ యర్కుం డనఁగాఁ
దీఱఁగఁ గిరీట మాకృతి, మాఱి గతశ్రీకుఁడైన ♦ మనుజాదు ననున్. ౧౩౨౬

చం. అనితరసాధ్యముం బరభ ♦ యావహమైనరణంబు సేసి తిం
దనుక, హతప్రవీరునిఁగఁ ♦ దద్దయుఁ జల్పితి నన్నుఁ, గాన నీ
వనిఁ గడు డస్సినాఁడ వని ♦ యాత్మఁ దలంచి నిశాచరేంద్ర! నిన్
దునుమఁగ నొల్ల, రాముఁ డనిఁ ♦ ద్రుంపఁడు సుమ్ము నిరాయుధున్ జడున్. ౧౩౨౭

శా. పొమ్మీ లంక కనుజ్ఞయిచ్చితిని బో ♦ పో గాసి దీఱంగ రా
రమ్మీ క్రమ్మఱ ధన్వివై! రథివినై ♦ రాజన్మహాశస్త్రపూ
గమ్ముం గైకొని యప్డు చూచెదు శతాం ♦ గస్థుండవై నాదుశౌ
ర్యమ్మున్ రాత్రిచరేంద్ర! యన్న హతద ♦ ర్పానందుఁడై వాఁడునున్. ౧౩౨౮

---

[1] ఎక్కిరింత = వాహనము.   [2] విల్లు విడువకున్న రాముఁడు చంపునని భీతి.

→ రావణుఁడు పరాజితుఁడై లంకకుఁ బోవుట. ←

కం. చాపము విఱుగఁగ సూతుఁడు, రూపఱ గుఱ్ఱములు చావఁ ♦ గ్రూరశరహతిన్
దీపులు గొను మెయితో నతఁ, డేపఱి విరిశిరముతోడ ♦ నేగెం బురికిన్. ౧౩౨౯

ఉ. దానవదేవశత్రుఁ డతి ♦ దారుణశౌర్యుఁడు రాక్షసేంద్రుఁ డి
ట్లానతమూర్ధుఁ డౌచు సమ ♦ రావనిఁ బాసి పురిం జొరంగ నా
త్మానుజయుక్తుఁడై రఘుకు ♦ లాభరణంబు ప్లవంగవర్యుల
న్మానుగ వీతశల్యుల నొ ♦ నర్చి శ్రమం బఱఁజేసె నయ్యెడన్. ౧౩౩౦

కం. హరిహయరిపు వోటఱ ని, ర్జరు లసురులు భూతగణము ♦ సాగరధరణీ
చరజలచరములు మీదర్వీ, కరదిక్సంతాన మెల్లఁ ♦ గర మలరారెన్. ౧౩౩౧

→ రావణుఁడు తనపరాభవంబుఁ దలంచి దుఃఖించుట. ←

సీ. రావణుఁ డటు లేగి ♦ రామశరంబులఁ, దలపోసి తలపోసి ♦ తలఁకు చెంది
భగ్నదర్పం డయి ♦ వ్యథితేంద్రియుం డయి, గరుడాభిభూతనా ♦ గంబునాఁగ
హార్యక్షముఖముక్త ♦ హస్తినా రాముని, బారిని బడి కాలు ♦ బారి తప్పి
సర్వతోముఖరామ ♦ చంద్రశరంబులు, తనుఁ దాఁకు చున్నట్లు ♦ తలఁచి బెగడి
తే. దీర్ఘముగ నూర్పు పుచ్చుచు ♦ దివ్యమైన, చిత్రకనకాసనమున నా ♦ సీనుఁ డగుచుఁ
దోడి రాక్షసవీరుల ♦ తోడ నిట్టు, లార్తుఁ డగుచును వచియించె ♦ నాత్మగతము.

మ. అకటా! నాపరమాద్భుతంపుఁదప మా ♦ హా! వ్యర్థమై పోయెఁగా
వికటాయోధనసీమ వజ్రధరుఁ డౌ ♦ వృత్రారినిన్ గెల్చి నేఁ
డొకమర్త్యున్ గెలువంగ లేక చెడితిన్ ♦ యుద్ధక్షితిం, గాల మెం
తకు వచ్చెన్ మనుజాదవున్ మనుజుఁడే ♦ దర్పోద్ధతిన్ గెల్చెడిన్. ౧౩౩౩

కం. మానదు భయంబు కలనన్, మానవుచే నీ కటంచు ♦ నాళీకభవుం
డానాఁడు పలికె ఘోరపు, టానుడి ఫలియించె నేఁటి ♦ కవితథ మగుచున్. ౧౩౩౪

ఉ. దానవయక్షరాక్షసప ♦ దాకునభశ్చరదేవతాళిచే
నే ననిఁ జావకుండ నళి ♦ నీసుమసంభవుచే వరంబులన్
మానుగఁ గాంచినాఁడఁ దొలి ♦ మానవులన్ గణియింప నైతి దు
ర్మానము పేర్మి నిప్పు డది ♦ ప్రాణము మీఁదికిఁ దెచ్చెఁ గంటిరే. ౧౩౩౫

సీ. ఇక్ష్వాకుకులభవా ♦ ధీశుం డయోధ్యలో, ననరణ్యుఁ డనియెడి ♦ యవనివిభుఁడు
తొల్లి నాచే ననిఁ ♦ ద్రెళ్లుచో ననుఁ జూచి, రాక్షసాధమ! నిన్ను ♦ రణమునందు
సుతులతో బలముతో ♦ హితులతో సచివవ, ర్గంబుతోఁ దురగసా ♦ రథులతోడఁ
గులపాంసనా! చంపఁ ♦ గలశూరుఁ డుదయించు, నస్మదన్వయమున ♦ నడిచిపడకు.

తే. కుమతి! యంచును వచియించెఁ ♦ గువలయేశు
మాట నేఁటికి నూటి యై ♦ పాటి మీఱెఁ
దత్త్వ మిది యామాట రాముని ♦ దశరథాత్మ
జాతు మానుషుఁగా నెంతు ♦ స్వాంతమందు. ౧౩౩౬

చం. అవమతి నొంది మత్కృతిని ♦ నాఁకర[1] మూని శపించె నన్ను వే
దవతి యనంగ నొప్పు నొక ♦ తన్వి తపస్విని పూర్వ మిట్లు, దా
నవ! నిను నీకులంబును వి ♦ నాశముఁ జేసెదఁ జూడు మంచు నా
యువిద విదేహనాథునకు ♦ నుద్భవ మయ్యెను సీతనా నిటుల్. ౧౩౩౭

కం. గిరికన్యకయును రంభయు, వరుణునికన్యకయు నంది ♦ పలికిన యట్టుల్
జరుగఁ దొడంగెను రాక్షసవరులారా! ఋషుల నుడు ల ♦ బద్ధము లగునే. ౧౩౩౮

ఉ. శాపచయంబుచంద మిది ♦ చక్కనెఱుంగుచు నర్థ్యయత్నులై
యాపుగ మూలకోత్తళము ♦ లందును గోపురమూర్ధసీమలం
దేపున నిల్చి యుండుఁడ, య ♦ హీనగభీరుని దేవదైత్యద
ర్పాపహు బ్రహ్మశాపవివ ♦ శాత్ముని లేపుఁడు కుంభకర్ణునిన్. ౧౩౩౯

⟵ రావణుఁడు మంత్రులను గుంభకర్ణు నిద్ర లేప నియోగించుట. ⟶

ఉ. చచ్చెఁ బ్రహస్తుఁ డుగ్రరణ ♦ శౌండుఁడు, నే నని నిర్జితుండ నై
వచ్చితి, నెవ్వ రింకఁ బగ ♦ వారిని మార్కొని యోర్చువార? లా
పొచ్చములేనిబం టసుర ♦ పుంగవుఁ డౌఘటకర్ణుఁ డొక్కఁడే
హెచ్చినశక్తి వైరి వధి ♦ యింపఁ గలం డని నిశ్చితాత్ముఁ డై. ౧౩౪౦

సీ. ద్వారంబులెల్ల య ♦ త్నంబునఁ గావుఁడు, ప్రాకారముల నెక్కి ♦ పగఱఁ గనుఁడు
ఈలీల నే నుండఁ ♦ గాలోపహతమతి, హాయిగాఁ జింత లే ♦ కాద మఱచి
నిద్రించు చున్నాఁడు ♦ నిశిచరవర్యుండు, నేడు తొమ్మిది యాఱు ♦ నెనిమిదియును
మాసముల్ నిద్రించు ♦ మంతనం బుండి యిం,తకుఁ దొమ్మిదవనాఁడ ♦ తవిలె నిద్ర

తే. యిపుడు మేల్కొల్ప నుకరం బ ♦ హీనబలునిఁ, గుంభకర్ణుని రాక్షస ♦ కులవరేణ్యు
నతఁడు మేల్కొనె నేనియు ♦ హతము సేయు, రాజపుత్రాన్వితముఁ గీశ ♦ రాజి నిజము.

చం. అసురుల నెల్ల మేటి పర ♦ మార్థము భీకరసంగరస్థలిన్
గసిమసి చేయుశాత్రవుల ♦ కాండములం బనిపూన నట్టిఁ డౌ
నసమబలుండు గ్రామ్యసుఖ ♦ మందలిప్రీతిని మూఢుఁ డై మహా
లసగతి నుండు నెప్పుడుఁ, ద ♦ లంపఁగ లేఁడు మదీయదుఃఖమున్. ౧౩౪౨

కం. ఆతండు లేచె నేనియు, సీతాధవువలన నాకు ♦ సిద్ధించినయీ
యాతతపరిభవమంతయు, వే తీర్చుకొ సంతసమున ♦ వెలయుదుఁ బిదపన్. ౧౩౪౩

[1] ఆఁకరము = కోపము.

తే. శక్రతుల్యబలుం డతి♦సాహసాంకుఁ, డట్టివాఁ డనిలోన నా♦కిట్టిపాటు
సంభవించియుఁ దోడ్పడఁ♦జాలఁ డేని, యింక వాఁ డుండియును నాకు♦ నేమిఫలము.

సీ. వాని లేపుఁ డటన్నఁ ♦ బరమసంభ్రాంతులై, యసురలు గంధమాల్యములు భక్ష్య
వర్గముల్ గొని మహా♦ద్వారమై యెటుచూడ, యోజనాయతమయి♦యుండు కుంభ
కర్ణునిగుహ సర్వ♦గంధప్రవాహినిఁ, జొచ్చుచో నాతని♦ హెచ్చుటూర్పు
గాలిచే నబ్బల♦శాలులు గాలికి,వగుడాకులట్టులై ♦ యెగిరిపోవ

తే. వెండియును వార లెం తెంతొ ♦ దండికష్ట
మునను నిలఁ ద్రొక్కికొని పాద♦ములను లోనఁ
జొచ్చి కాంచనకుట్టిమ♦సుందరంపు
గుహను నిద్రించువానిని ♦ గుంభకర్ణు. ౧౩౮౬

సీ. భీమదర్శను నేల ♦ విఱిగి యొఱుగుగిరి,భంగిని బాన్పుపైఁ ♦ బడినవాని
విసదారి యనఁ బెనుఁ ♦ బుసలుగొట్టెడివాని, వికటంపునిట్ర వెం♦డ్రుకలవాని
భయదనాసాపుటుఁ ♦ బాతాళవిపులాస్యుఁ, గాంచనాంగదనద్ధ♦కాయు బలియు
మకుటమండితమూర్ధు ♦ మహితమేదోరక్త,గంధు నరిందముఁ ♦ గాంచి డాసి

తే. మేరుపర్వతసన్నిభా♦మిషచయంబు, మహిషమృగసూకరములసం♦ఘాతులు నద్భు
తంపుటన్నంపుఁబ్రోవుమ♦ద్యములు పెక్కు,రకములును నెత్రుకుండలు♦ ప్రక్కనుంచి.

↞ రాక్షసులు కుంభకర్ణుని నిద్ర లేపుట. ↠

కం. అలఁదిరి యుత్తమగంధము, లలిమాల్యంబులును బరిమ♦ళపువస్తువులుఁ
నిలిపిరి మేనఁ ధూపం,బుల వైచిరి స్తోత్రములను ♦ బొగడిరి యసురుల్. ౧౩౮౭

స్రగ్ధర. పూరింతుర్ చంద్రతుల్యం♦బులు బహుళదరం♦బుల్ దిశల్ ప్రిలిపోవఁ
ఘోరధ్వానంబు లోలిఁ ♦ గుమిగొని యసురుల్ ♦ గొల్పి రవ్వార లేకా
కారంబై కుత్తుకల్ ప్ర♦క్కలుగఁ జన నిరా♦ఘాటబాహావిరావం
బారూఢం బయ్యె క్ష్వేళా♦యతరవములు పెఁ ♦ హోవడిం గూర్చె లంకన్.

సీ. పణవభేరీశంఖ♦పటునినాదంబులు, క్ష్వేళితాస్ఫోటిత♦సింహనాద
ములు బహుళములైన ♦ మున్గి సాధ్వసమునఁ, బక్షులు దెసలందుఁ ♦ బఱచి పఱచి
దివికిని నెగఁ బ్రాఁకి ♦ దిగ్భ్రమ గొని గఱుల్, తడఁబడ సుడివడి ♦ తత్తఱమున
నేలపై వ్రాలె నా♦నిశిచరుల్ వేసరి, విసివి గాసినిబడి ♦ యసము దూలి

తే. రంతె గాకసురేంద్రుఁ డొ♦క్కింతయైన, మేలుకొనకున్న వెండియు ♦ జాలిమాలి
ముద్గరగదాద్రిభూరుహ♦ముసలతతులఁ, జేకొలందిని మోఁదిరి ♦ డాకమెఱసి. ౧౩౮౮

తే. అధిక బలవంతు లయ్యు న♦య్యసురవరులు, రావణానుజనాసికా♦రంధ్రజాత
మారుతోద్ధతి నిలువంగ♦ నేరరైరి, మహితవాతూలహతిఁ దూలు ♦ మబ్బులట్లఁగ.

ఉ. భీమబలాఢ్యు లొక్కపది♦వేలనిశాచరు లోలి నందఱున్
స్తోమముఁ జేరి యొక్కపరి ♦ తూర్యమృదంగఘటాళినాద ము
ద్దామముగాఁగఁ జేసియును ♦ దానవవీరుఁ డొకింత యేనియున్
దామెయి తెల్విగానమిని ♦ దారుణయత్నముఁ జేయఁ బూనుచున్. ౧౩౫౧

ఉ. దండకుశాంకుశంబులను ♦ దద్దయుఁ గొట్టుచు నుష్ట్రవాజివే
తండఖరాదిజంతువుల ♦ దానవవీరునిఁ ద్రొక్కఁ జేసియున్
దండిగ నల్లజంతులరొ♦దల్ పరఁగింపఁగఁ జేసి తారున్
మెండుగ శంఖభేరుల న♦మేయముగా ధ్వనిచేసి వెండియున్. ౧౩౫౨

కం. సుత్తెల దూలంబుల పెనుఁ, గత్తుల గునుపముల గుదెల ♦ ఖండపరశులన్
హత్తినశక్తులకొలఁదిని, మొత్తిరి లేకెదను దయయు ♦ మోమోటంబున్. ౧౩౫౩

కం. గింగురు మనె వీనులు లం,కం గల యసురులకు శైల♦కాననయుత మె
ల్లం గలయఁగఁ దన్నాద మ,భంగగతిం బూర్ణమగుచు ♦ వ్యాపింపంగన్. ౧౩౫౪

కం. అంతకును లేవ కున్నను, బొంతన వెయిభేరు లొక్క♦పూఁపున రక్ష
స్సంతతి పసిండికోడుపుల, నెంతయు మ్రోయింపఁ గదలఁ♦డించుక యేనిన్.

ఉ. శాపవశంబునం బరవ♦శత్వమునం బడియున్న రాక్షసుం
గోపవశాత్ములై మఱియు♦కొండుపరాక్రమ ముద్యమించి భే
రీపటలంబు నూతనము ♦ క్రేవలఁ గొట్టుచుఁ గేశసంఘముల్
మోపుగఁ బీఁకుచుం జెవులు ♦ మోఱుకులై క్షితిజంబు గాఱఁగన్ ౧౩౫౬

కం. కొఱకుచుఁ గరనఖరంబులఁ, బెఱుకుచు నుదకుంభములను ♦ వీనులలోనన్
నెఱపుచుఁ దలయును ఱొమ్మును, జఱచుచు ముద్గరము లెత్తి ♦ సంబాధింపన్.

చం. కదలక యున్నరజ్జుచయ♦గాఢనిబద్ధశతఘ్నికావళిన్
మదమున నెల్ల రొక్కమొగి ♦ మర్దనముం బచరించుచున్ మఱిన్
మదకరు లొక్కవేయి యొక♦మాఱుగఁ బాఱఁగ మీఁదఁ దోలఁగా
నెదొ తనుసోఁకిన ట్లయిన ♦ నించుక కన్నులు విచ్చె నంతలోన్. ౧౩౫౮

## ←→ కుంభకర్ణుఁడు నిద్ర లేచుట. ←→

చం. ధరకుజవారపాతములు ♦ దారుణశస్త్రచయప్రహారముల్
సురరిపుఁ డేమియుం దలఁపఁ♦జూడఁడు, నిద్దుర లేచినంతనే
దరికొనునాఁకటన్ వెఱచి ♦ దానవవీరుఁడు మే న్విదుర్చుచున్
సరగున లేచి నాగతను♦శైలనిభం బగు బాహుయుగ్మమున్. ౧౩౫౯

కం. జాడించి నీల్గి వెండియు, బాడబముఖతుల్య మైన♦వక్త్రముఁ దెఱవన్
జూడఁగఁ బాతాళమునకు, నీ డగు నది మేరుగతది♦నేశ్వరుఁ బోలెన్ ౧౩౬౦

ఆ. ఆవులించి లేచు ♦ నాతనియాకృతి, కొంగచాలుతోడ ♦ రంగు మీఱు
వాన గురియుమబ్బు♦వడువున రహి మీఱెఁ, గలయఁ జూచె నాల్గు ♦ కడలనతఁడు.

కం.జ్వలదగ్నికి సదృశము చం, చలలకుఁ దుల్యంబు నైన♦చక్షుర్ద్వయముల్
బలముగ మండుమహాగ్రహ,ములతోఁ బురిడించె నంత ♦ మునుకొను క్షుధచేన్.

ఉ. అచ్చట నున్న భక్ష్యవివి♦ధామిష కాసరసూకరాళిఁ దా
నిచ్చ భుజించి శోణితము ♦ నెంతయుఁ గ్రోలియు మద్య మాదిగా
హెచ్చుగఁ ద్రావి తృప్తిగొని ♦ యింద్రవిరోధి చెలంగు చుండ నం
దచ్చపుభీతి డాఁగినను♦రారులు వెల్వల వచ్చి మ్రొక్కుచున్.　　　౧౩౬౩

సీ. తనచుట్టు నిల్చినఁ ♦ గని కుంభకర్ణుండు, నిద్రావిశదభూరి♦నేత్రయుగుఁడు
కలుషీకృతేక్షణుఁ ♦ డల వారి నందఱ, వీక్షించి బోధన♦విస్మయమున
మీ రంద ఱిటు నన్ను ♦ మేలుకొల్పితి రేల?, రాక్షసేశునకు భ♦ద్రంబ కాదె?
భయకారణం బేమి ♦ పాటిల్ల లేదుగా?, యూహింప నాకు సం♦దేహ మొదవెఁ

తే. గడఁగి నన్నుఁ బ్రబోధించు♦కారణమున, సత్యముగ గొప్పయాపద ♦ సంభవించెఁ
బరులచే జాగ దేటికిఁ♦బలుకుఁ డిపుడు, నన్నుఁ బ్రతిబోధితునిఁ జేయు♦నున్నకతము.

ఉ. న్నెట్టెదఁ బాకశాత్రవుని ♦ నేని దివంబుననుండి త్రెళ్ళఁగాఁ
గట్టెద నాత్రయాశుఁ బెను♦గాటపుఁగట్టుల నింక నేరినేన్
గొట్టెద నుగ్గునూచముగఁ ♦ గూర్కెడు నన్నొకమాత్ర లేపఁగా
నిట్టుల నూల్కొనండు దను♦జేంద్రుఁడు చెప్పఁడ యేమి మూఁడెనో.　　　౧౩౬౪

↠ { యూపాక్షుఁడు కుంభకర్ణునితో నతని నిద్రలేపిన కారణము దెలుపుట. } ↞

కం.ఈపగిదిఁ గుంభకర్ణుఁడు, కోపరసావేశమునను ♦ గుఱుకొని పలుకన్
యూపాక్షుఁ డనెడిమంత్రిరి, యాపటుబలు డాసి యనెఁ గృ♦తాంజలి యగుచున్.

ఉ. దైవకృతంబుభీతి మన♦దైత్యుల కెన్నఁడుఁ గల్గ దిప్పు డో
దేవ మహాభయం బొదవెఁ ♦ దీరుపరాక మనుష్యపాళిచే
నీవఱ కెన్నఁడేన్ దితిజ♦బృందముచేతను దానవాళిచే
దైవతకోటిచేఁ గనని♦దాయము గల్గెఁ జుమా నరాళిచేన్.　　　౧౩౬౫

కం.భూమీధరకాయులు శా,ఖామృగములు లంకఁ జుట్టి ♦ క్రాలెద రధిపా!
భూమిసుతాహరణార్తుఁడు, రామునిచేఁ గీడు మూఁడె ♦ రక్షస్తతికిన్.　　　౧౩౬౬

ఉ. వచ్చి వనాటుఁ డొక్కగుఁ డ♦వార్యబలోద్ధతి లంక కంతకున్
జిచ్చిడె నక్షుఁ జంపె మును ♦ సేనలతో నిభపంక్తితోడ ని

ప్రెచ్చినశక్తి రాముఁడు ది॥ నేశ్వర తేజుఁడు సంగరంబునన్
జచ్చితి వోరి యంచు సుర॥ శాత్రవనాథునిఁ దోలె రావణున్. ౧౩౯౯

కం. రాణను దితిదనుభవగీ, ర్వాణులు సమకూర్పలేని॥ భంగము సీతా
ప్రాణేశ్వరుఁ డిడి రావణుఁ, బ్రాణంబులు పోయి పోని॥ వానిఁగఁ జేసెన్. ౧౩౨౦

కం. అని యూపాక్షుఁడు పలికిన, ననిఁ దనయగ్రజునిపాటు॥ నాలించి యనేక
గినుక విప్రుత్తాక్షుం డై, యనుపమబలశాలి రావ॥ ణానుజుఁ డతనిన్. ౧౩౨౧

→ మహోదరుఁడు కుంభకర్ణునితో రావణుఁ జూడఁ బొమ్మని చెప్పుట. ←

ఉ. ఈక్షణ మేగి రాఘవస॥ మేతముగా హరిసైన్యమెల్ల యూ
పాక్షు వధించి వెండి యసు॥ రాధిపుఁ గాంచెదఁ దృప్తిఁ గూర్చెదన్
రాక్షసకోటికిన్ వనచ॥ రప్రచయక్షతజామిషంబులన్
దక్షత రాఘవాస్త్రములఁ॥ ద్రావెదఁ దుష్టిగ నే స్వయంబుగన్. ౧౩౨౨

తే. ఇటులు పలికిన రోషవి॥ వృద్ధదోష, మైనయాతనిగరోక్తి॥ లాలకించి
యుచితగతి దోఁపఁ బల్కె మహోదరాఖ్యుఁ బరఁగునైఋతయూథప॥ పరివృఢుండు.

కం. రావణువచనంబుల విని, యావల గుణదోషముల స॥ మాలోచనముం
గావించి పదంపడి విజ, యావహగతి రణముఁ జేయ॥ నర్హమటన్నన్. ౧౩౨౪

శా. కాని మ్మంచును లేచె లేచుటయు ర॥ క్షస్సంఘముల్ వేగ ర
క్షోనాథుం గదియంగఁ బోయి కరముల్॥ జోడించి మేల్కొన్నవాఁ
డై నీసోదరుఁ డున్నవాఁ డసురలో॥ కాధీశ! నీ వేగ న
మ్మానింతో యతఁ డిందు వచ్చినను బ్రే॥ మం గారవింతో యనన్. ౧౩౨౫

ఉ. ఆతఁడు వచ్చుఁ గాక యిట॥ కాతని నర్హసమర్చనాదిసం
ప్రీతునిఁ జేయు టొప్పు నన॥ వే చని వారలు మిమ్ముఁ జూడ మీ
భ్రాత సురారినేత తమి॥ వర్తిలెడిం 'జనఁ గోరుదే? యనం
జేత మిగుర్ప వల్లె యని॥ శిక్షితశాత్రవుఁ డాత్మతల్పమున్ ౧౩౨౬

కం. విడిచి వెలి వచ్చి వదనముఁ, గడిగికొని నిమజ్జనంబుఁ॥ గావించి నగల్
దొడి బలవర్ధనపానముఁ, గడుపారఁగఁ ద్రావె దప్పి॥ కడమవడంగన్. ౧౩౨౭

తే. రావణాజ్ఞను వెస మది॥ రాఘటంబు, లమితవివిధోపహారంబు॥ లసుర లీయఁ
గుంభములు వేయి ద్రావి యా॥ కుంభకర్ణుఁ, డతుల తేజోబలోపేతుఁ॥ డయిమదించి.

చం. ప్రలయకృతాంతతుల్యవిభ॥ వంబున నన్నఁ గనుంగొనంగ న
బ్బలియుఁడు పోవుచోఁ ధరణి॥ పాదహతిన్ వడఁకాడెఁ దత్పురిం
గల యుపనిష్కరంబులును॥ గ్రాలెఁ దదీయపరిష్క్రియాతతిన్
వలనుగ రెండువంకలను॥ బద్ధకరాంజలిపంక్తి రాజిలెన్. ౧౩౨౮

చం. కమలజువీటి కేగుబల♦ఘస్మరుపోలికఁ బోవువానిఁ దే
జమున ఖరాంశునంటువిల♦సత్పరిమాణవిహీనకాయు భూ
ధ్రమహితశృంగకల్పు నల♦రాక్షస సత్తముఁ గుంభకర్ణుఁ బ
ట్టనము వెలి ముట్టడించినవ♦నౌకసులుం గని యబ్రపాటునన్. ౧౩౮౦

కం. ఎదవడి పరువిడి పదములు, గుదివడ నిలఁబడిరి కపులు ♦ కొందఱు రాముల్
గదిసి శరణంబుఁ జొచ్చిరి, మదమఱి యిలఁబడిరి భీత♦మతు లగుక్రోఁతుల్.

రావణుఁ జూడఁబోవు కుంభకర్ణుఁ జూచి
శ్రీరాముఁడు విభీషణుఁ బ్రశ్నించుట.

సీ. పర్వతాకారుని ♦ భయదశరీరుని, మున్ను నారాయణు♦చెన్ను దోఁప
నాకాశ మంటుదే♦హంబును గలవాని, సాంబుతోయదనిభుఁ ♦ డైనవానిఁ
గాంచనకేయూర♦కమ్రభూషాంచితుఁ, గని కీశసైన్యంబు ♦ కాందిశీక
మగుడు రఘూత్తంసుఁ ♦ డతులచాపముఁ గొని, యచ్చెరువున రావ♦ణానుజాతు
ఆ. నని యెవ్వఁడయ్య ♦ యద్రిసంకాశుండు, మకుటధారి మహికి ♦ మహితకేతు
వనఁగఁ దగినవాఁడు ♦ సైరావతీవారి,వాహమునకు నీడు ♦ వచ్చువాఁడు. ౧౩౮౨

తే. కపిలనేత్రుండు కోటప్రా♦కారమునకు
మీఁద నొక్కఁడ తెలిసెడి♦మేనితోడ
నరుగుచున్నాఁడు లంకలో ♦ నతఁడు రాక్ష
సుండొ యటుగాక బృందార♦కుండొ చెపుమ. ౧౩౮౩

ఉ. పాఱుచు నున్నవారు మన♦వానరు లెల్లరు వానిఁ జూచి దై
వాఱుభయానఁ బూర్వమిటు♦వంటిమహాద్భుతభూత మూర్విపైఁ
దేఱఁగఁ జూడలే దన సు♦ధీవరుఁ డైనవిభీషణుండు దాఁ
దాఱనిభక్తి నిట్టు లను ♦ దాశరథిప్రవరున్ నయంబునన్. ౧౩౮౪

విభీషణుఁడు శ్రీరామునకుఁ గుంభకర్ణుగుఱించి తెలుపుట.

సీ. భండనంబునఁ గిట్టి ♦ దండి వాసవుఁ బట్టి, యోటమిఁ గూర్చిన♦మేటిబంటు
విశ్రవసోముని♦విఖ్యాతపుత్త్రుండు, కుంభకర్ణుం డనఁ ♦ గొఱలువాఁడు
ఇంతటిపొడువును ♦ నింతటిలావును, బెరరక్కసులకు నె♦వ్వరికి లేదు
వరదానకృతబలుల్ ♦ సురవైరు లందఱు, నతఁడు స్వభావబ♦లాధికుండు
తే. అమరగంధర్వకిన్నర♦యక్షభుజగ,దనుజవిద్యాధరులఁ బ్రవి♦దారణమున
నొడిచి యున్నాఁడు వేనవేల్ ♦తడవ లితఁడు, సురల కీతని పేరుహ్వా♦చ్ఛాల మధిప!

కం. శూలంబు గేలఁ గ్రాలఁగ, నాలమున విరూపనేత్రుఁ♦డై వీఁ డడరన్
గాలుండో యని నిర్జర,జాలంబులు డాయ లేక ♦ సాధ్వస మందున్. ౧౩౮౬

సీ. పుట్టి పుట్టక మున్న ♦ భూరిబుభుక్షార్తి, వేనవేల్ జంతుల ♦ వీఁడు మ్రింగెఁ
గడఁగుడుఁ బ్రజలెల్లఁ ♦ గడుభయంపడి చని, వేలుపుఱేనికి ♦ విన్నవింప
జంభారి దంభోళిఁ ♦ గుంభకర్ణుని వైవ, నత్తాఁకునఁ జలించి ♦ యార్భటింప
నమ్మహారవమున ♦ కడలు భూవలయంబు, వెండియు దిగులున ♦ గం డడంగెఁ

తే. గుంభకర్ణుండు హరిహయ♦కుంభిరదముఁ, బీఁకి దానన మర్దించె ♦ వృత్రవైరి
నేటుపడి వాసవుం డార్తి♦ రాటుపడఁగ, వ్యసనసంతప్తు లైరి దై♦త్యర్షిసురులు.

ఉ. ఈతఁడు పెట్టురాయిడి స♦హింపఁగ లేక ప్రజాసమేతుఁడై
ధాతను డాయఁగాఁ జని శ♦తక్రతుఁ డింతయు విన్నవించె నీ
పాతకులోకభక్షణము ♦ స్వర్జనధర్షణ మన్యకామినీ
వ్రాతభృశాభిమర్శనముఁ ♦ బా డొనరించుట యాశ్రమస్థలుల్. ౧౩౮౮

కం. ఈకరణి వీఁడు నిత్యము, లోకుల భక్షించె నేని ♦ లోకేశ్వర! భూ
లోకము పాడఱు నన్న ది,వౌకస్తతి నూఱడించి ♦ యబ్జభవుండున్. ౧౩౮౯

తే. కుంభకర్ణునిఁ గనుఁగొని ♦ గుండెలదర, నిబ్బరము దెచ్చుకొని వాని ♦ నెమ్మిఁ బిలిచి
సత్యముగ నిన్నులోకనా♦శంబు కొఱకె,విశ్రవసుఁడు వినిర్మించె ♦ విశ్వవైరి. ౧౩౯౦

సీ. కావున నిది యాది♦గా నీవు పడియుండు, ఘటకర్ణుఁడా! మృత♦కల్పుఁడ వయి
యని శపియించిన ♦ నాతని మ్రోలన, తత్క్షణంబున వీఁడు ♦ ధరణిఁ ద్రెళ్ళెఁ
బరమసంభ్రాంతుఁ డై ♦ పంక్తికంధరుఁ డనుఁ, దాత నీ కిటు సేయఁ♦దగ వటయ్య
నీమనుమండు వీ♦నిని శపింపఁగఁ జన్నె, యుమ్మెత్తనైనఁ దా ♦ నెమ్మిఁ బెంచి

తే. నఱక న్యాయంబె ఫలవేళ ♦ నలినగర్భ! నీదుసూక్తిని దబ్బఱ ♦ నెఱయఁ గలదె
కరుణ దలపోసి శయనజా♦గరములందుఁ, గాలనిర్ణయ మొనరింపఁ♦గదె మహాత్మ.

కం. అని వేఁడిన దయగ్రాఁడిన,మనమున ననె నీతఁ డాఱు♦మాసంబులు గూ
ర్కొను నొక్కపగలు మేల్కొని, తినుఁ గావుత మగ్నిపగిదిఁ ♦ దిరుగుచు జగతిన్.

ఉ. అట్టిఁడు కుంభకర్ణుఁడు మ♦హాత్మక! యీతని మేలుకొల్పెని
ప్పట్టున నార్తిఁ గూరి దశ♦వక్త్రుఁడు త్వద్బలభీతుఁ డౌట, స్వా
రాట్టువిరోధిఁ గన్గొని ద♦రంబునఁ బాఱెడిఁ గ్రోఁతులెల్లఁ దా
మెట్టు పెనంగు వారో యని ♦ నీతఁడు మార్కొనె నేని రాఘవా! ౧౩౯౩

తే. తనదుశిబిరంబు వీడి యీ♦దర్పధుర్యుఁ, డరుగుదెంచుచు నున్నవాఁ♦డనికి దేవ
వానరులఁ బట్టి యిరుకేల ♦ వాత వైచి,కొనుచుఁ బరువునఁ జనుదెంచు♦గుణధురీణ!

చం. ఇది యొక కీలుబొమ్మ యసు♦రేశ్వరకల్పిత మాట దీనికై
యదరకుఁడీ కపిప్రవరు♦ లంచును జాటుట మేలు దానిచే

వదలి భయంబు వానరులు ♦ వర్తిలువార లటన్న హేతుమ
ద్గదితము లాలకించి ప్లవ♦గధ్వజినీపతి రాముఁ డి ట్లనున్. ౧౩౯౪

### శ్రీరాముఁడు నీలునితోఁ గుంభకర్ణుతోడ యుద్ధమునకు సేనల సిద్ధపఱుపుమని బోధించుట.

సీ. పావకీ! చని మన♦బలఁగంబు సర్వంబు, వ్యూహము ల్దీర్పుమీ ♦ యొప్ప మెఱయ
లంకద్వారంబుల ♦ సంక్రమస్థలములఁ, జర్యల నరికట్టు ♦ సత్వరముగఁ
గుధరశృంగంబులుఁ ♦ గుజవితానంబులు, శిలలును జతగూర్చి ♦ సిద్ధపడుము
సాధనహస్తులు ♦ శైలపాణులు నయి, వనచరుల్ నిలువంగ ♦ వలయు నన్న
ఆ. నీలుఁ డెల్లకపుల ♦ గోలి నెఱింగించె, రామునాజ్ఞఁ గీశ♦రాజు లెల్ల
నట్ల సిద్ధపడిరి ♦ యద్రిశృంగంబులు, వృక్షతతులుఁ గేల ♦ వెలయుచుండ. ౧౩౯౬
కం. శరభగవాక్షాంగదకేసరిసూనులు పెచ్చుపెరిఁగి ♦ శైలతటంబుల్
కరములఁ గొని ద్వారంబుల, నరికట్టిరి వైరిభీక♦రార్భటు లెసఁగన్. ౧౩౯౭
కం. నగములు కేలం దాలిచి, యగచరసంఘంబు నిలువ ♦ నద్రిసమీపా
నుగతమహాంభోధరతతి, పగటుం దలపించెఁ గన్గ♦నకు వ్రేఁగగుచున్. ౧౩౯౮

### కుంభకర్ణుఁడు రావణుఁ జూచుట.

కం. కొదనిద్దురమబ్బును నతి,మదిరాపానమున నైన♦మత్తును బెరయన్
మది యాకులితంబుగ దశ,వదనుం గన రాక్షసప్ర♦వరుఁ డరిగె వెసన్. ౧౩౯౯
సీ. రాక్షసవీరుల♦రాజి భజింపఁగఁ, బురజనుల్ చల్లఁగఁ ♦ బువ్వువితతి
రమ్యలక్ష్మీక మా♦రాజమార్గంబునఁ, జని హేమజాలక♦సమ్మితంబు
తతభానుభాస్వర♦వర్ణనంబును విశా,లం బగునన్నగృ♦హంబుఁ దరణి
యభ్రజాలముఁజొచ్చు ♦ నటుసొచ్చి లోఁ జని, కక్ష్యాంతరంబులు ♦ గడచి పోయి
తే. దూరమునఁ బాకవిద్వేషి ♦ తోయజభవుఁ,జూచుభంగిని నగ్రజుఁ♦జూచి యతఁడు
పుష్పకవిమానమునఁ జింత♦మునిఁగి యుండఁ, జేరఁ జనఁ గుంభకర్ణుండు శీఘ్రగతిని.
శా. రమ్మా నాయన! యంచు రావణుఁడు హ♦ర్షం బారఁగా లేచి ప్రే
మ మ్మీఁపారఁగఁ గౌఁగిలించుటయు స♦మ్మానంబుతో నన్నపా
దమ్ముల్ ఫాలము సోఁక మ్రొక్కి నికట♦స్థం బైనపీఠంబునన్
సమ్మోదంబున నుండి యిట్టు లనె రూ♦క్షప్రేక్షణుం డన్నతోన్. ౧౪౦౧
కం. భూవర! నాపైఁ బ్రేముడి, నీవేళను నన్ను లేప ♦ నేలా చెపుమా?
యేవంక భయము దొనరెనొ, యేవాఁడొకొ ప్రేతభావ ♦ మిపుడు సహించున్.
కం. త్వరగ వచింపుము యన సో,దరుకోపస్థితి నెఱింగి ♦ దశముఖుఁ డీష
త్పరివృత్తలోచనుం డై, యరమర లేకనియె నమ్మ♦హావీరునితోన్. ౧౪౦౩

### రావణుఁడు కుంభకర్ణునితో శ్రీరామునివలన రాక్షసుల కైనవిపత్తు దెలుపుట.

ఉ. తమ్ముఁడ! నీవెఱుంగవు గ♦దా సుఖసుప్తుఁడ వౌటఁ బెద్దకా
లమ్ముగ నన్ను రాఘవుఁ డ♦లంచెడిరీతి, దినేశసూతి సా
హాయ్య మ్మొనరింప సైన్యయుతుఁ♦డై వనరాశిఁ దరించి సోఁకుసై
న్యమ్మును సర్వ మాజిని వి♦నాశము సేసెడి మూలముట్టుగన్. ౧౪౦౪

తే. కంటివే సేతు వొక్కటి ♦ కల్పితంబు, సేసి లంకాపురీప్రాంత♦భాసమాన
నిష్కుటోపవనంబుల ♦ నెగడఁ జేసె, వానరైకార్ణవంబు భూ♦జాని యయ్యె.

ఉ. పోరికి రాక్షసోత్తములు ♦ పోవుచు కాని యొకండునే నిజా
కారముతోడఁ గ్రమ్మఱుట ♦ కానను, వానరులందు నొక్కఁడేఁ
బేరుగలట్టివీరుఁ డని ♦ బిద్దుటయుఁ వినరాదు, దాన లోఁ
గూరెను భీతి, నీపురముఁ ♦ గూరిమి కావుము వీరసత్తమా! ౧౪౦౬

ఉ. కూలుతు గాక యాప్లవగ♦కోటుల నంచును నిద్ర లేపితిఁ
జాలఁగఁ గోశసంచయము ♦ సత్త్వము నాశిలె, నమ్ముమీ, జర
ద్బాలజనావశిష్ట మగు♦పట్టన మన్ననిమిత్త మియ్యెడం
బాలన సేయుమా సలుపు♦మా యతిదుష్కర మైనకార్యమున్. ౧౪౦౭

ఉ. ఎన్నఁడు నీకు మున్ను వచి♦యించినవాఁడనె యిట్లు? స్నేహసం
పన్నత యాదరంబు నతి♦మాత్రము నీపయి నా కెఱుంగవే?
పన్నగ దేవతాసురుల♦భండనవేళల వారినెల్ల శౌ
ర్యోన్నతి గెల్వవే? మఱుపు ♦ నొందితినా యవి యన్ని యెప్పుడేన్? ౧౪౦౮

ఉ. భీమపరాక్రమాఢ్య! భుజ♦వీర్యము శౌర్యము ధైర్యముఁ సమి
ద్భూమిని నేఁడు చూపు, మిలఁ ♦ బోటుమగండు భవత్సమానుఁ డేఁ
డీ? మహితప్రియంబు ఘటి♦యింపుము నా కిది, బంధులోకసం
గ్రామకళాప్రియా! మనయ♦రాతులఁ ద్రుంపు తలంపు నెయ్యమున్. ౧౪౦౯

కం. నాకౌకసులం దోలిన, నీకు వనౌకసులు మాత్ర ♦ నిరుపమతేజ
శ్శ్రీక భవద్బలపవనో,ద్రేకవిఘాతములఁ జేయు ♦ ద్వేషిఘనములన్. ౧౪౧౦

### కుంభకర్ణుఁడు రావణు నిందించుట.

చం. అని యిటు లంగలార్చునను♦రాధిపుఁ గన్గొని నవ్వు దోఁప ని
ట్లను మును మేము మంత్రసమ♦యంబున నెట్టివిపత్తు మూఁడు నీ
కని మది నిశ్చయించితిమొ ♦ యట్టివిపత్తు హితాళులందు ర
క్తిని గొననట్టి నీకుఁ గలి♦గెఁ; విపరీతము లేదు దీనిలోన్. ౧౪౧౧

కం. దురితములు సేయువారలు, నిరయంబునఁ గూలునట్లు ♦ నీచేసినయా
దురితము తత్ఫలము న్నిను,విరియక చేసేత ననుభ♦వింపఁగఁ జేసెన్. ౧౪౧౨

చం. తొలుతను రాజ! నీ వెవరి♦తోడను గర్జముభంగి యోజనం
బలుపఁగ లేవు, కేవలము ♦ శౌర్యమదంబున భావ్యనర్థముల్
దలఁపఁగ వైతి, విత్తపుఁడు ♦ దా మును వెన్కలఁ జేయ నర్హమౌ
కెలసము లోలి వెన్క మును ♦ గేరి యొనర్చిన నీతివేత్తయే? ౧౪౧౩

సీ. హానిని సపాత్రుల ♦ కర్పించునట్టులు, కాల దేశవిహీన♦కార్యతతులు
విపరీతఫలముల ♦ వెలయించు నుత్తమ,మధ్యమాధమ కార్య♦మార్గములను
దేవ! ద్రవ్యం బన ♦ దేశకాలములునా, నాత్మప్రయోజనా♦ఖ్యలను బరఁగు
పంచసంబంధంబు ♦ లంచితగతిఁ గూర్చి, సచివులతోడ యో♦జన యొనర్చు
ఆ. ననుభవించుఁ జుమ్ము ♦ యతులనీతిఫలంబు, నీతి విడక కార్య♦నిర్ణయంబు
సచివమిత్రయుక్తిఁ ♦ జలిపెడునాతండు, కార్యజయముఁ గాంచి ♦ గణన కెక్కు.

చం. క్రమముగ ధర్మ మర్థమును ♦ గామము వేఱుగ నైన నన్నియేఁ
గ్రమమఱి రెండు రెం డయిన ♦ రాక్షసవల్లభ! నిత్య మర్హకా
లముల భజించుపూరుషుఁడు ♦ లక్ష్మికిఁ బట్టగు, నెల్లవేళఁ గా
మము కొనియాడువాఁడు నొక♦మానవుఁడే? సిరి వాని నొల్లునే? ౧౪౧౫

తే. దానఁ దత్త్రితయమున ను♦త్తమ మెఱింగి
నృపుఁడో నృపమాత్రుఁడో దాని ♦ నిష్ఠఁ దవుల
నొల్లఁడేఁ వాఁడు గుండెలు ♦ క్రుళ్ల మిగులఁ
జదివి యేటికిఁ గేవల♦శ్రమముచేటు. ౧౪౧౬

ఉ. సామము దానభేదములు ♦ సంహతి గాఁగనో యొక్కఁ డొక్కఁడో
నీమము దోఁప నీతియు న♦నీతి నెఱుంగుచు ధర్మవిత్తముల్
కామము మంత్రయుక్తుఁ డయి ♦ కార్యదృఢీకరణం బొనర్చి ని
ష్ఠామహితాత్ముఁ డౌనరుఁడు ♦ సత్యము కీడునఁ గుందఁ డెన్నఁడున్. ౧౪౧౭

తే. అర్థతత్త్వజ్ఞ మగుసచి♦వాళితోడఁ
గార్య మిట్టిది యిట్టి ద♦కార్య మనుచు
యోజన యొనర్చి హితఫల ♦ మొసఁగుదానిఁ
జలుపునాతఁడు జీవించు ♦ సౌఖ్యముగను. ౧౪౧౮

చం. తెలియక శాస్త్రమర్మములు ♦ దేఁకువమైఁ బశుబుద్ధు లైనజా
ల్ములు సురవైరివర్య! భ్రమ♦మోహితచిత్తనృపాలుమంత్రు లై

వెలయుచు మంత్రముల్ సలుపు♦వేళలఁ గేవల మాప్రగల్భతన్
బలుకఁగ ముందు నిల్చెదరు ♦ పాటిలుచేటుఁ దలంప రేమియున్. ౧౪౧౯

తే. అర్థశాస్త్రానభిజ్ఞు లై ♦ యధికలక్ష్మి, నంద నభిలాషపడెడి శా♦స్త్రార్థధీవి
హీనుల హితేతరోక్తుల ♦ నించు కేని, పాటిసేయంగఁ దగదు ని♦శాటరాజ.

తే. హితమువలెఁ దోఁచునహితంబు ♦ ధృష్టుఁ డగుచు
వాఁగుచెఱుపనచేటను ♦ వల నెఱింగి
కార్యములు యోజన యొనర్చు♦కాలములను
దవ్వు దవ్వుల నిల్పు లే ♦ తగవు పతికి. ౧౪౨౧

కం. కర్ణజ్ఞు లైనపగఱకు, మర్మంబులు చెప్పి యాత్మ ♦ మహిపునిచే దు
ష్కర్మంబులు చేయించుచు, దుర్మంత్రి విపత్పయోధిఁ ♦ ద్రోయఁడె తెనిన్.

కం. మిత్రులవలె వెలితోఁచున, మిత్రుల మంత్రంబువేళ ♦ మెలపున శాంతిన్
ధాత్రీపతి యెఱుఁగం దగు, శత్రుహరణ! వారిపలుకు♦సరణి యరయుచున్.

కం. త్వరపడి పని చేయుచు దు,శ్చరితు సచివుఁ డనుచు నమ్ము ♦ జనపతిమర్మం
బరయుచు లోఁ జొత్తురు పగు, లరిమర్దన! క్రౌంచనగము ♦ హంసలువోలెన్.

కం. ఉక్కివు నరి నెఱుఁగక తమ, నక్కఱఁ గాచికొన లేని♦యధిపతి కీడుల్
తక్కక పొరయఁగ సంపద, ప్రక్కలుగాఁ బొలియు నాత్మ ♦ పదవీచ్యుతుఁ డై.

కం. మును నీ కనుజుఁడు చెప్పిన,పనిఁ జేయుమ యదియె నీకుఁ ♦ బరమహితం బౌ
దనుజాధిప! నామత మిది, విను మావలఁ జేయుమీ య♦భీష్టముపగిదిన్. ౧౪౨౬

## ⟷ రావణుఁడు కుంభకర్ణుఁ గోపించి పలుకుట. ⟷

తే. ఇట్లు ఘటకర్ణుఁ డెంతయు♦హితముఁ బలుక
వింశతిభుజుండు విని రోష♦వివశుఁ డగుచుఁ
గనుబొమ ల్ముడివడఁ గను ♦ ల్గలఁక వాఱఁ
గటము లదరంగ సోదరుఁ ♦ గాంచి పలికె. ౧౪౨౭

ఉ. శౌర్యధనాఢ్య! నీతిగుణ♦శాలియు మాన్యుఁడు నైనదొడ్డయా
చార్యునిపోల్కి శాసనము ♦ సల్పెద వేలర? చాలుఁ జాలు, నీ
కార్యము వేళ యుక్త మగు♦కార్యము సల్పినఁ దీరుఁగాక యే
పర్యవసాన ముండెడిని ♦ బల్కుము కేవలవాక్ప్రపంచమునన్. ౧౪౨౮

కం. పొరపడియో తెలియమినో, యురుబలవీర్యాశ్రయమున♦నో తప్పి చనన్
గరణీయము మఱి మఱి యది, వర మని భాషింపనేమి♦వచ్చెం జెపుమా? ౧౪౨౯

కం. కడచినదానికి వగతురె? కడచినదో కడచినదియె ♦ కార్యం బిపు డే
వడువునఁ దీర్పఁగ నగు నది, కడఁగు; గత ముపన్యసింపఁ ♦ గార్యము గలదే? ౧౪౩౦

ఉ. నాపయి నీకు స్నేహము ఘ♦నం బగు నేనియు, నీ వెఱుంగుదేన్
నీపటుశౌర్య మింత యని ♦ నీమది, నిప్పటియెత్తికోల్ నిరా

క్షేపపుఁగార్య మంచుఁ బరి♦కించెద వేనియు, వేగ మామకీ
నాపదయోద్భవం బగున♦నర్థము శౌర్యముచేతఁ దీర్పుమీ. ౧౪౩౧

కం.ఇడుమగొను వెఱఁగి దీనత, మిడికెడినరుఁ జేరువాఁడె ♦ మిత్త్రుఁడు జగతిన్
దొడరి యపనీతి దుఃఖము,పడునాతనిఁ గాచువాఁడె ♦ బంధువు సుమ్మీ. ౧౪౩౨

కుంభకర్ణుఁడు రావణుని సమాధానపఱుచుట.

కం.అనిన క్షుభితేంద్రియుని ధీరుని దారుణవచను నన్న ♦ రోషవశుంగా
మనమున నెఱింగి మెల్లన, వినయంబున మధురసూక్తి ♦ విజ్ఞాపించెన్. ౧౪౩౩

సీ. చాలు రాక్షసరాజ! ♦ సంతపింపకు మింకఁ, దొలఁచుమీ కినుక స్వ♦స్థుండ వగుము
ఏ మనియుండఁగ ♦ నిది మది నిడఁబోకు, మెవ్వానివలన నీ ♦ కింత పుట్టె
వానిని బరిమార్తు ♦ బంధుభావంబున, సోదరస్నేహము♦ర్యాదకతన
నన్ని వేళల హిత ♦ మాడు టావశ్యక, మాట న ట్లాడితిఁ ♦ బాటి తెలఁగు

తే. ప్రేమగలచుట్ట మక్కఱ♦వేళఁ జేయు, నర్హసుగుశత్త్రునాశంబు ♦ నసురరాజ!
యసమ మగుమామకీనశౌ♦ర్యంబుఁ జేసి, చూడు నేఁ డని సలిపి నీ♦సూడు దీర్తు.

ఉ. చూడుము న న్నిదే సమర♦శూరుని రాముని వైరిఁ ద్రుంపఁగాఁ[1]
బాడుగఁ బొఱుచుండఁ బర♦వాహినులం గనులారఁ జూడుమీ
వేడుక రాము గూల్ప రణ♦వీథిని దొర్లు శిరంబుతోడ న
న్నేడుచుచుండ ని మ్మలము♦హీనుతయుం గరుణాత్తచిత్త మై. ౧౪౩౫

ఉ. మాతురుగాక యాజిఁ దమ♦చుట్టము లీల్గిన సర్వరాక్షసుల్
ప్రీతి రహిం గొనంగ నను ♦ బ్రేతత గాంచఁగ రాఘవుం గృతాం
తాతిథు లైన బాంధవుల♦కై విలపించెడివారి బాష్పముల్
స్ఫీతజవంబునం దుడుతుఁ ♦ జెచ్చెర వైరివినాశనంబునన్. ౧౪౩౬

ఉ. ఏగతిఁ బట్టునో కనుమ ♦ యింతలు నింతలు తున్కలై ధరం
బ్రోగయి వ్రాలి పర్వతని♦భుండు ససూర్యవలాహకాభుఁ డా
రాగమయూఖనందనుఁడు ♦ రామజిఘాంసువు లేను రాక్షసుల్
రాగము పూని కావ రఘు♦రామునువధ్యుఁడ వాడు వె ట్లొకో. ౧౪౩౭

ఉ. రాముఁడు నన్నుఁ దొల్త రణ♦రంగమునన్ వధియించెనా బల
శ్రీమహితుండు ని న్నిహతుఁ ♦ జేయక మానఁడు సత్య మేను సం
గ్రామములోన నొందెదఁ బ♦రాభవ మన్నవిచార మాత్మనా
కేమియు లేదు గాన నను ♦ నేడ్తెఱఁ బంపుము పంప కన్యునిన్. ౧౪౩౮

చం.హరిహయుఁ డైన నేమి ప్రళ♦యానలమారుతు లైన నేమి కి
న్నరపతి యైన నేమి జల♦నాయకుఁ డైనను నేమి శూలమున్

[1]రామునివైరి నన్నుఁ ద్రుంపఁగాఁ జూడుమనియు నన్వయము. ఇట్లే తక్కిన పద్యంబుల నన్వయించునది.

గరమునఁ గీలుకొల్పి గిరి♦కాయుఁడ నై శితదంష్ట్ర లొప్పఁగా
దురమునఁ దాకినన్ బెదరి ♦ తూలరె వ్రీలరె కూలరే యరుల్. ౧౪౩౯

ఉ. కేవలరిక్తహస్తములఁ ♦ గేరి విరోధుల నల్పి వైచుచో
జీవముమీఁద నాశగల♦జీవి యొకం డెదిరించి నిల్చు? బా
ణావళి యేల? యేల నిశి♦తాసిగదాదులు? నేల శక్తి? నా
కేవియు నేల? చేతులనె ♦ యింద్రుని నైనను ముద్ద సేయనే. ౧౪౪౦

ఉ. నామహితంపుముష్టిపత♦నంబు రఘూత్తముఁ డోర్వఁ గల్గినన్
రాముని బాణజాలములు ♦ రక్తము పానము సేయఁ గల్గు, నే
లా మనుజాశనేంద్ర! వ్యస♦నార్తుఁడ వయ్యెద వేను గల్గ? ను
ద్దామజవోద్ధతిం జని మ♦దం బణఁగింతు నరాతికోటికిన్. ౧౪౪౧

సీ. రామలక్ష్మణుల శా♦ఖామృగనేతను, మనలంకఁ గాల్చిన♦హనుమఁ దక్కఁ
గలపెనుమ్రానుమొ♦కంబులఁ గూల్తు నే, వదలుము రాముని♦వలని భయముఁ
గలిగెడు నీకు ని♦స్తులకీర్తి యింద్రు నే, నల్లస్వయంభువు ♦ నయిన ద్రుంతు
నేఁ గోపగించిన ♦ నిర్జరయూథంబు, చాఁపకట్టుగ నేలఁ ♦ జచ్చి పడదె
తే. శమను శమియింతు సర్వభ♦క్షకు గ్రసింతు
నుడుగణంబులతో నర్కుఁ ♦ బడఁగ నడుతు
జన్యసవపశు వొనరింతు ♦ శతమఖునిని
గ్రోలి వైచెద వరుణుని♦కొంపఁ గూల్చి. ౧౪౪౨

ఉ. దంచెదఁ బిండి పిండిగ మ♦దంబునఁ బట్టి కులాచలంబులన్,
జించెదఁ దున్క తున్కలుగఁ ♦ జేవ వసుంధర, నిన్నినాళ్లు ని
ద్రించినకుంభకర్ణుబల♦తేజము లియ్యెడఁ జూచుఁ గాక భ
క్షించుచు నుండ భూతములు ♦ గీడ్పడి చేడ్పడి మేడ్పడిన్ వెఱన్. ౧౪౪౩

ఉ. హోమిక మూఁడులోకముల ♦ నట్టె భుజించినఁ దృప్తి లేదు, శ్రీ
రామునికారణంబునఁ[1] ది♦రం బగుసౌఖ్యము నీకుఁ గూర్ప సం
గ్రామ మొనర్తు, రాఘవసు♦రక్షితసర్వకపీశవాహినీ
స్తోమము మ్రింగి తృప్తిఁ గొను♦దున్ దనుజేశ్వర! చింత యేటికిన్. ౧౪౪౪

తే. కోర్కులు భుజింపు మద్యంబు ♦ గ్రోలు కృత్య
మఖిలమును దీర్పు మేఁ బోదు ♦ హతుఁడు గాఁగ
రామవిభుఁ డక్షయంబుగ ♦ రమణి సీతఁ
బొందఁ గలుగును నీ కెదఁ ♦ బొగల వలదు.[2] ౧౪౪౫

---

[1]౧. రాముని + కారణంబునన్ = రాముఁడు హేతువుగన్. ౨. రాము + నికారణంబునన్ = రాముని మరణముచేతన్. [2]౧. ఏన్ హతుఁడుకాఁగఁ బోదున్ రామవిభుఁడు సీతను బొందఁగలుగు ననియు నొక యన్వయము. ౨. రామవిభుఁడు హతుఁడుగాఁగ నీవు సీతఁ బొందఁగలుగునని రెండవ యన్వయము.

⟶ మహోదరుఁడు కుంభకర్ణమతమును ఖండించుట. ⟵

కం. అని యతికాయుఁడు బలియుఁడు, ఘనబాహుం డైనకుంభ♦కర్ణుఁడు పలుకన్
విని యాతనిఁ గని యాగతి, ననియె మహోదరుఁడు వీత♦హర్షం డగుచున్.

ఉ. పుట్టితి గొప్పవంశమున ♦ బుద్ధి యొకింతయు లేదు, గర్వముం
బట్టయి యున్నవాఁడవును ♦ ప్రాకృతదర్శన! కార్యమెల్ల లో
పట్టు గనంగఁ జాల విసి ♦ బాల్యవశంబున నోటి కొర యె
ట్లెట్టులు వచ్చె నట్లు వచి♦యింపఁగఁ జూచెదు జ్ఞానహీనతన్. ౧౪౪౭

ఉ. రా జెఱు నీత్యనీతులత♦రంబు లెఱుంగఁడు? స్వాన్యహాని పే
రోజము స్థానముం దెలియు ♦ నొప్పుగ దేశము కాలభంగియున్
యోజనచేసినాఁడు, బల♦యుక్తుఁడు, ప్రాకృతబుద్ధి వృద్ధసే
వాజడునట్లు సల్పు నొకొ ♦ పండితుఁ డెందును గుంభకర్ణుఁడా. ౧౪౪౮

చం. కనుఁగొన ధర్మ మర్థమును ♦ గామ మొసంగుఁ బృథక్ఫలంబు లం
చును వచియించి, తీ వెఱుఁగు♦చొ ప్పొక టున్నను జెప్ప వయ్య యే
పని సిజమూర నేఫలముఁ ♦ బాయ కొసంగునొ? కర్మమే కదా
ఘనబల! యైహికాదిఫల♦కారణ మౌఁ దలపోసి చూచినన్. ౧౪౪౯

ఉ. శ్రేయము పాపశీలురను ♦ జెందఁగఁ జూడమె? ధర్మ మర్థమున్
శ్రేయము గూర్చు న ట్లొనరఁ♦జేయు నధర్మ మనర్థమున్ శుభం,
బేయెడనో యఘంబు ఘటి♦యించు నధర్మ మనర్థ, మింక నే
చాయను ధర్మమే నియత♦సత్ఫల మంచు దృఢీకరించెదో? ౧౪౫౦

ఉ. అచ్చపుఁబుణ్యకర్మముల ♦ నైహికసౌఖ్యపరత్రభోగముల్
హెచ్చుగఁ గూరు నంచు ఘటి♦యింతురు లోకులు సాధుకార్యముల్
కచ్చులు దీర స్వైరగతిఁ ♦ గార్యములం బొనరించువానికే
వచ్చును సంపదల్, సుమతి♦వర్య! కతం బది యేమి చెప్పుమా? ౧౪౫౧

ఉ. కామ మొకండ కైకొని సు♦ఖంపడఁ గోరె విభుండు దోషమా?
మామది కద్ది సమ్మతమ ♦ మార్తురపట్ల సురారినేత లెం
పేమి యొనర్చెఁ జెప్పఁ గల♦వే? యిఁక నెక్కటి పోరువాఁడ నం
చేమొ వచించి తద్ది యుచి♦తేతర మెట్లనదో వచించెదన్ ౧౪౫౨

ఉ. మానవభోజివీరుల న♦మానుష శౌర్యధనాఢ్యులన్ జన
స్థానమునందుఁ ద్రుంచిన ప్ర♦శస్తపరాక్రముఁ డెవ్వఁ, డేని పే
రానినభీతి నేఁటికిఁ ద♦దాప్తులు లంక స్మరించు చుందు, రా
మానితశౌర్యు రాము నని ♦ మార్కొన నీ వెటు పోయె దొంటిగన్. ౧౪౫౩

ఉ. రాముని గ్రుద్ధకేసరిప♦రాక్రమధాముని శౌర్యదర్పని
స్సీముని సుప్తసర్ప మవ♦శీకృతశేముషి లేపఁ బూనున
ట్లేమని లేపఁ బోయెద? వ♦హీనదురాసదరోషు మృత్యున
ద్భీమునిఁ దేఱి చూచుటకు ♦ ధీరగుణుం డెవఁ డోపు నాజిలోన్. ౧౪౫౪

కం. ఇందఱు సేనలతోడుత, నం దరుగఁగఁ జాల రన్న ♦ ననహాయత భూ
నందనివిభుఁ దొడరుట నా,కుం దగవుగఁ దోఁప దయ్యెఁ ♦ గుంభశ్రవసా.

కం. హీనార్థుం డెవ్వం డో, ప్రాణంబులయాశ విడిచి ♦ ప్రాకృతునట్టుల్
మానితసమృద్ధబలు నరిఁ, బూని వశము జేసికొనఁగఁ ♦ బోవుం జెపుమా.

ఉ. మానవులందు రామునిస♦మానులు లే రసురేంద్ర! వజ్రికిన్
భానునకున్ సముండు రఘు♦నాయకుఁ, డాతనితోడ నేల క
య్యానకుఁ బోవ నెంచెద? వ♦నర్థము చేకుఱ కున్నె? యంచు న
ద్దానవుఁ డాదశాస్యుఁ గని ♦ దర్పరుషాపరిరబ్ధచిత్తుఁ డై. ౧౪౫౫

తే. జానకీసతి నీచేతి♦లోని యదియ, నేల వదరఁగ దానికై ♦ యింతసేపు
వలతు వె ప్డప్పుడే నీకు ♦ వశముపడెడి, నందునకు నొక్కయుపమనే♦మందలింతు.

రావణునకు మహోదరుఁ డుపాయముఁ జెప్పుట.

సీ. విన సమ్మతం బేని ♦ వివరింతుఁ గుంభకర్ణుండును నే ద్విజి♦హ్వుండు మఱి వి
తర్దన సంహ్రాది ♦ దైత్యు లీయేవురు, రాము వధింప దు♦రమున కేగు
వారుగాఁ జాటింపఁ ♦ బంపు మీ పురిలోనఁ, జని మే మెయెట్లైన ♦ శక్తికొలఁది
రాముతోఁ బోరెద ♦ మేమె జయించుట, గలిగనే నుపమ య♦క్కఱయు లేదు

తే. మేము దెగి యెంతపోరిన ♦ రామవిభుఁడె
ప్రాణములతోడ నున్న న్న♦పాయ మొండు
నపుడ చేయంగఁ దగు దాని ♦ నంత నేను
యోజన యొనర్చి యున్నాఁడ ♦ రాజవర్య! ౧౪౫౬

ఉ. బింకముతోడ మేము రణ♦పీఠిని బోరినయట్ల రామనా
మాంకితశాతబాణముల ♦ నాత్మశరీరము లోలి వ్రచ్చి ఘో
రాంకమునందు రాఘవుని ♦ సానుజుఁ జంపితి మంచుఁ గేరి ని
శ్శంకమహోర్భటుల్ చెలఁగ ♦ సన్నిధిఁ జేరి భవత్పదంబులన్ ౧౪౬౦

ఉ. వ్రాలెదువార మో యసుర♦వర్య! ముదంబున నీవు కానుకల్
చాలఁగ మాకు నిచ్చియు గ♦జంబుశిరంబునఁ జాటఁ బంపుమీ
ప్రోలున రామలక్ష్మణులు ♦ భూరిచమూతతితోడ నాజిలోఁ
గూలి రటంచు వెండియును ♦ గోర్కులు దీరఁగ సేవకాళికిన్ ౧౪౬౧

చం.వివిధపదార్థసంతతులు ♦ ప్రీతి నొసంగుము యోధకోటికిన్,
నవవసనానులేపనక♦నన్మణిమండనమాల్యపేయముల్
సవరన నిమ్ము, నీవు నరు♦సంబున వారుణిఁ గ్రోలు, మంత రా
ఘవులవినాశవార్త పురిఁ ♦ గ్రచ్చఱ నల్లడ సుప్రసిద్ధ మౌ. ౧౪౬౨

ఉ. మెల్లగ నీవు సీతఁ గని ♦ మేలిమివాక్కుల నిచ్చకంబులన్
గల్లల ధాన్యవిత్తమణి♦కాండము లాసలు గూరఁ జూపి రం
జిల్లఁగఁ జేసి యాఁటడఁగఁ ♦ జెప్పి వశంపడఁ జేసి కొమ్ము నీ
యుల్లము తాప మాఱ నిది ♦ యుక్తి సుమీ భయశోకనష్టికిన్. ౧౪౬౩

చం.అవనిజ రంజనీయుఁ డగు♦నాత్మవిభుండు వినాశ మొందఁగా
నవిరళభోగభాగ్యమహి♦మార్థసుఖేధిత యౌట మున్ను దుః
ఖవికలచిత్త యౌస చెడఁ♦గా రమణీచలబుద్ధిఁ జేసి నీ
కు వశపడం దలంచు నెదఁ ♦ గూరిమి లేకయు నీవె దిక్కుగన్. ౧౪౬౪

సీ. ఇది సుమ్ము నానిర్ణ♦యించినపద్ధతి, యిది నీకు సుఖ మని ♦ యేఁ దలంతుఁ
బంక్తిరథాత్మజు♦బారిని బడితివా, సత్య మనర్థంబు ♦ చాల నొదవు
నింద సుఖంబుగా ♦ నెలమి నుండుము రణా,వనికిఁ బోవఁగ యత్న♦పడఁగ వలదు
భండనం బొనరింప ♦ కుం౹ఠిన సుఖలాభ, మధిప నావాక్యంబు ♦ లాదరింపు
ఆ. సూడుబలము[1] జూడఁ ♦ జూడక ప్రాణసం,శయము లేక తేఁడ ♦ జయము గొనుము
యశముఁ గీర్తిఁ బుణ్య ♦ మైశ్వర్యమును బొంది, చిరయశంబు నీవు ♦ చెందఁ గలవు.

## కుంభకర్ణుఁడు మహోదరు నిందించుట.

ఉ. చెప్ప మహోదరుం డిటు లి♦సీ యని యాతని నీసడించి పెం
పొప్పఁగఁ గుంభకర్ణుఁ డసు♦రోత్తముఁ గాంచి దురాత్ము రామునిన్
దెప్పునఁ జంపి నీభయముఁ ♦ దీర్చెద నిప్పరిపంథి వోచు నీ
వెప్పటియట్ల లెస్స సుఖ♦యింపుము రాక్షసలోకనాయకా! ౧౪౬౫

కం.నిర్జలమేఘంబులవలె, గర్జింపరు వ్యర్థముగను ♦ గడిమిం గలవా
రూర్జితయశ శాత్రవులను,నిర్జించి యొనర్చు గర్జ♦నెఱిఁ గనవన్నా! ౧౪౬౬

కం.పరధిక్కృతముల సైఁపరు, చోర రాత్మశ్లాఘులకును ♦ శూరులు వెలికిన్
వెరవిఁడుల ట్లుండియు దుష్కరముల సాధింత్రు రాక్ష♦సప్రాగ్రసరా! ౧౪౬౭

సీ. ఓరి మహోదర! ♦ యుద్ధకాపురుషులుఁ, బండితమానులు ♦ బాలిశులును
నిచ్చకమారులు ♦ హీనబుద్ధులు నినుఁ,బోలినవారలు ♦ బోద్ధ లగుట
మీవాక్యము ల్విని ♦ రావణుం డిటు లయ్యెఁ, గార్యఫలం బిట్టి ♦ గతికి వచ్చె
మిత్రచిహ్నుండు న♦మిత్రకుం డగు రాజు, వెను వెంటఁ దగిలి మీ ♦ రనవరతముఁ

[1] సూడుబలము = శత్రుసేన.

ఆ. బురము రాజశేష♦ముగ నొనరించితి, రెల్లకోశములును ♦ నెల్లబలము
నుఱువు మాపి యేటి♦యుక్తులు గిక్తులుఁ, జాలుఁ జాలు మున్ను ♦ సలిపినవియు.

కం.మీరాయొనరించినదుర్నయ, మారయోధనమునకు నేగి ♦ యనువుపడంగాఁ
జేయుదు నన నవ్వుచు నై, తేయవిభుఁడు కుంభకర్ణు♦ దెసఁ గని పలుకున్. ౧౪౨౦

రావణుఁడు కుంభకర్ణునిఁ బ్రశంసించుట.

ఉ. రాముకతన్ భయంపడి దు♦రంబు మహోదరుఁ డొల్లఁ డేమియున్
భీమబలంబునన్ మిగులు♦నెయ్యమునందును నాకుఁ నిన్నుఁబో
ల్భీమహితుండు వే ఱెవఁడు ♦ తెప్పున సంగరకేళి కేగుమీ
ప్రామిడి శత్రులం దునిమి ♦ ప్రాణభయంబును బాపు తమ్ముఁడా. ౧౪౨౧

ఉ. నే నలభీతిఁ గాదె నిను ♦ నిద్దుర లేపితి, నాకుఁ గూర్చువా
రానికిఁ దోడ్పడంగ సమ♦యం బిదియే, యటుగాన శూలముం
బూనుచుఁ బాశహస్తుఁ డగు♦పూషసుతుంబలె సూర్యతేజులన్
మానవనాథులం గపుల ♦ మానక యందఱ మ్రింగి వేయుమా. ౧౪౨౨

కం.నీయాకారముఁ గనిన య,ధాయధలై పాఱిపోవె ♦ తరుచరతతు ల
త్యాయతభీతిని రాఘవుఁ, డాయనుజుఁడు గుండె లగల ♦ హతులై పోరే. ౧౪౨౩

ఉ. ఈతెఱఁ గాడి రాక్షసకు♦లేశ్వరుఁ డాఘటకర్ణు, వానిప్ర
స్ఫీతభుజాబలంబుఁ బటు♦వీర్య మెఱుంగుటఁ జేసి తన్ బున
ర్జాతునిఁగాఁ దలంచుచు భృ♦శప్రమదంబునఁ దేలియాడుచున్
శీతమరీచిభంగి వెల♦సెం గడునిర్మలుఁ డై సభాస్థలిన్. ౧౪౨౪

రావణుఁడు కుంభకర్ణుతో నొంటిగ యుద్ధమునకుఁ బోవల దనుట.

సీ. అన్నయానతిమేర ♦ నాకుంభకర్ణుండు, యుద్ధసన్నాహంబు ♦ లొనరఁ జేసి
కాలాయసంబును ♦ గనకభూషితమును, శక్రాశనిసమంబు♦సాధ్వసదము
దానవదేవగం♦ధర్వసూదనమును, వమదుగ్రపావక♦జ్వాల మనమ
తేజంబు దీప్తంబు ♦ ధృతరక్తమాల్యంబు,, శాత్రవశోణిత♦సంయుతంబు
తే. నగుచు రహిమించు శూలంబు ♦ హస్తమందుఁ
దాల్చి దశకంఠుఁ గనుఁగొని ♦ తరలువాఁడ
నేకతమ యని సేయఁగ ♦ నింద నాదు
బలము లుండెడుఁగాక నా♦వచ్చు దాఁక. ౧౪౨౫

చం.తరమిఁడి మ్రింగువాఁడ వను♦ధారుహచారుల నన్నుఁ బంక్తికం
ధరుఁ డది నీతి గాదు, భయ♦దధ్వజినీచయము ల్భజింప ము

ద్గరముసలాయుధు ల్గొలువఁ॥గాఁ జనుమీ, కపు లన్నశౌర్యని
ర్భరు లతివేగు లాహవధు॥రంధరులుౕ సముదీర్ణసాహసుల్.        ౧౭౭౮

కం.ఒంటరిఁ బ్రమత్తు నినుఁ గని, కంటునఁ గోఱలను గోళ్లఁ ॥ గపికాండంబుల్
దుంటలుగఁ బెఱికి చంపెడు, నొంటిగఁ జన కన్న! చనుమ ॥ యుగ్రబలముతోన్.

చం.మనపగవారి నెల్లఁ బరి॥మార్పు మటంచును రావణుండు ది
గ్గన తనపీఠముం డిగి ప్ర॥కాశధురం బగురత్నహార మ
య్యనుజునికంఠసీమ ముద ॥ మారఁగ వైచి మణీమయోర్మిక
లగనకవిభూషణంబులు జ్వ॥లన్మహితాంగదకుండలంబులున్.        ౧౭౭౯

ఆ. తాన తొడిగి దివ్య॥మానిత పరిమళ,భరితమాల్యదామ॥పటలములను
మేన నుంప నతఁడు ॥ మేలిసొమ్ములు దాల్చి, సుహుతమైనయగ్ని॥శోభఁ దనరె

కం.మాసరసి తేతరశ్రో,ణీసూత్రము చేత నతఁడు ॥ నెఱిరాణించెన్
భాసురసుధాజననమున, నాసర్పానద్ధమంద॥రాద్రివిధమునన్.        ౧౭౮౦

మానిని. కాంచనభారసహంబు నివాత మ॥కాండవిదార్యము వైద్యుత తే
జోంచిత మాకవచంబు ధరించి మ॥హాత్ముఁడు వీరుఁడు సాంధ్యకభృ
త్సంచయసంవృతపర్వతరాజము॥చందమునన్ రహిమించె మఱిన్
జందనసూనవిభూషణభూషిత॥సర్వతనుం డయి శూలియు నై.        ౧౭౮౧

తే. వీరుఁడు త్రివిక్రమోత్సాహ॥వేళయందుఁ
బెరుఁగు నారాయణునిఁబోలె ॥ వెలిఁగి యాతఁ
డన్నకును దాఁ బ్రదక్షిణ ॥ మాచరించి
కౌఁగిటను గ్రుచ్చి మ్రొక్కిడి ॥ కదలె ననికి.        ౧౭౮౨

## కుంభకర్ణుఁడు యుద్ధమునకై వెడలుట.

సీ. అన్నచే దీవన ॥ లంది యాబలశాలి, యార్భటుల్ నించుచు ॥ నరుగుచుండ
శంఖదుందుభుల ని॥స్స్వనములు శూరుల,గారుల తురుకుల ॥ తేరిగములు
రవములు నిండారె ॥ రథికులు వెన్నంటి, చనిరి సింహద్వీప ॥ సర్పతురగ
మృగఖరోష్ట్రంబులు ॥ నేగె నాతనిబడిఁ, బురజనుల్ చల్లిరి ॥ పుష్పములను

ఆ. భటులు చనిరి శస్త్ర॥పాణులై సింహనా,దములు దెసల నిండ ॥ దారుణాక్షు
లగుచుఁ గుంభకర్ణుఁ ॥ డతిభీమరూపుఁ డై ,యస్రగంధమత్తుఁ ॥ డగుచుఁ జనుచు.

సీ. నూఱువిండ్ల వెడల్పు ॥ నాఱునూఱులయున్న,తియు రథచక్రముల్ ॥ దెగడుకనులు
రౌద్రరూపంబు ప॥ర్వతసన్నిభాంగంబు, దగ్ధశైలోపమ॥తనువుఁ దాల్చి
గహ్వరాస్యుండు ర॥క్కసులఁ గనుంగొని, నగుచు ని ట్లను దైత్య॥నాథులార!
మిడుతలపైఁ జిచ్చు ॥ పడువడువునఁ గ్రోఁతి, నెఱసరి[1] మిన్నల ॥ నిర్దహింతు

[1] నెఱసరి = శూరుఁడు.

తే. నాకు వా రపరాధ మొ♦నర్ప లేదు, మఱియు మావంటివారల ♦ మంజులోప
వనులకెల్ల నలంకృతి♦ప్రాయ లగుదు, రిట్టు లగుటను వారల ♦ నేల చంప?

చం. మననగరంబు ముట్టినది ♦ మానవనాథులు రామలక్ష్మణుల్
మును మును వారిఁ జంపిన స♦మూలముగా నశియించు సర్వ మం
చన మదిఁ బొంగి వారలు మ♦హాంబుధి క్షోభిల సింహనాదముల్
నినిచిరి రామలక్ష్మణులు ♦ నేఁటికిఁ దీఱె రటంచు నెంచుచున్. ౧౪౮౫

సీ. కుంభకర్ణుఁడు రణ♦కుతుకంబునను జన, దుశ్శకునంబులు ♦ దోఁచెఁ జాల
నుల్కాశనులతోడ ♦ నొప్పె మేఘంబులు, గర్దభారుణము లై ♦ గగనసీమఁ,
గలఁగె సాగరవనుల్ ♦ కంపించె మేదిని, వఱదులు వాపోయె ♦ జ్వాల లుమిసి
యప్రదక్షిణముగ ♦ నరిగె శకుంతముల్, మాలికనా మీఁద ♦ వ్రాలె గ్రద్ద

తే. యదరె డాకన్ను గేలు తే ♦ జాఱె రవికిఁ
బరుషముగ వీవఁ దొడఁగెఁ బ్ర♦భంజనుండు
వాని నేమియుఁ గైకోక ♦ వాసవారి
కాలబలచోదితుం డయి ♦ కదలె ననికి. ౧౪౮౬

కం. చంగునఁ బ్రాకారంబును, లంగించి యతండు పదము♦లన్ శంబరభృ
ద్భంగి వెలుంగుచు నుండు, ప్లవంగమసైన్యంబుఁ గాంచె ♦ వాలినకినుకన్.

ఉ. వచ్చినకుంభకర్ణుఁ గని ♦ వానరవాహిని విచ్చుమొగ్గ యై
పచ్చముపాడుగాఁ బఱచె ♦ వాతహతాంబుదజాలరీతి ని
ట్లెచ్చినభీతిఁ బాఱెడిక♦పీంద్రులఁ గాంచి ప్రహర్షవార్ధిలో
ముచ్చమునింగి భూరిజల♦ముగ్గతి బొబ్బలు నించె నించినన్. ౧౪౮౭

కం. బెడిదపుటులివున వడఁబడి, దడఁబడి యెదవడి సుడివడి ♦ తరుచరవీరుల్
తొడిఁబడి తొడితొడి బడి బడిఁ, బుడమిఁ బడిరి వేళ్లు తెగిన♦భూజము లనఁగన్.

కం. వారిఁ గనికుంభకర్ణుఁడు, వారక చెలరేఁగి కేలఁ ♦ బరిఘముఁ గొని తాఁ
దోరపుజవమునఁ గవిసెన్, వారిపయిన్ శత్రుభయద♦వర్తనుఁ డగుచున్, ౧౪౯౦

కుంభకర్ణునిఁ జూచి పరువిడు క్రోఁతులకు నంగదుఁడు ధైర్యముఁ జెప్పుట.

కం. వరుణయమవాసవులకున్, దురమున బొరిగొనఁగరాని♦దోర్బలధుర్యున్
బరభీకరాతు గళరవ,పరిదారితశైలు నశని♦వర్ష్మాపాదిన్ ౧౪౯౧

చం. కనుఁగొని క్రోఁతిమూఁకలు వి♦కావికలై పరిభిన్నదారదం
బనఁ జనె, నంత నీలుని గ♦వాతు నలుం గుముదున్ సహస్రనే

త్రునిమనుమండు డాసి సుత♦దోర్బలధుర్యుల రీరు, మీరలే
చనియెద రెందు?నాత్మకుల♦శౌర్యములుర్క మఱ పాయెనే మదిన్.        ౧౪౯౨

చం. వెఱ పెపు డభ్యసించితిరి ♦ వీరులు? ప్రాకృతవానరాళియు
త్తెఱఁగున మీరు పాఱుదురె ♦ తేఁకువఁ బ్రాణభయార్తిఁ బాఱినన్
బఱచినచోట మిత్తి కనుఁ♦బ్రామఁగ శక్యమె? మేలె దానికో
యఱగొఱ లేనికీర్తి హాతు ♦ లౌటయొ యాఱడిచావుఁ జచ్చుటో?        ౧౪౯౩

చం. కటకట ప్రాణవాయువులు ♦ కాచుకొనంగను లేర? రాక్షసుల్
పోటమఁగఁ జేయ భీతి వెఱ♦బొమ్మను దెచ్చిరి, పోటు చాల దీ
కుటిలత మీ రెఱింగి పడఁ ♦ గూల్చినఁ దీఱెడిఁ, గ్రోఁతులార! రం
డిటు తిరుగుండు దీని వధి♦యింతము మింతము నిత్యకీర్తులన్.        ౧౪౯౪

## వానరులు కుంభకర్ణుతోఁ బోరి యోడి పాఱిపోవుట.

కం. అనవుడు వారును ధైర్యం,బునుగొని సంక్రుద్ధు లగుచు ♦ భూరుహముల న
ద్దనుజవరేణ్యుని మోఁదిరి, ఘనమదలసితంబు లైన♦గజములమాడ్కిన్.        ౧౪౯౫

ఉ. అద్రిచరేంద్రు లొక్కమొగిఁ ♦ బ్రాంశుధరాధరశృంగపాళి భూ
రిద్రుమచక్రవాళముల ♦ రేయుచుఁ దాఁచినఁ గంప మొందఁ డు
న్నిద్రమదాతిరేకమున ♦ నిర్జరవైరి, సహస్రధాభిదన్
రౌద్రముగా ధరం దొరఁగె ♦ రాక్షసు సోఁకినచెట్లు గుట్టలున్.        ౧౪౯౬

కం. ఇద్ధబలుం డాతఁడు సం,క్రుద్ధుం డై వనిని జిచ్చు♦కొమరున భుజశౌ
ర్యోద్ధతి శోభిల నరిమద,వృద్ధిం బోకార్చె కూల్చె ♦ వికటాటముగన్.        ౧౪౯౭

ఉ. నెత్తురు గాఱు మేనుల వ♦నేచరయూథము కృత్తరక్తపు
ష్పొత్తకుజంబులట్లు సమ♦రావని వ్రాలెను గొంత, యాత్మలో
హత్తినభీతిఁ గొందఱు వ♦నాటులు పోయినదే పథంబుగాఁ
దత్తఱ వెన్కఁ గన్గొనక ♦ దాఁటులు వైచుచుఁ బాఱి రెల్లెడన్.        ౧౪౯౮

సీ. కొందఱువానరు ♦ ల్గొందలపాటున, జలధిలోఁ జొచ్చిరి ♦ సరభసముగ
సేతువు దాఁటి వ♦చ్చినవారు నడిత్రోవ,లోన వీఁగిరి భీత♦మానసముల
వెలవెల్ల నైనమో♦ములతోడఁ గొందఱు, లాఁగల మిట్టల ♦ డాఁగికొనిరి
యెలుఁగుబంటులుకొన్ని♦యెక్కె వృక్షంబులు,కొండలపైఁ బ్రాఁకెఁ♦గొన్ని వెఱను

ఆ. గుహాలలోనఁ దూఱెఁ ♦ గొన్నిజలంబుల,మునిఁగి యుండె దిక్కు♦మొగముల య్యె
దిక్కు తెలియ లేక ♦ తికమికపడె నేలఁ, గూలఁబడియె నెలుఁగు♦గ్రోఁతిగములు.

కం. ఈరీతిఁ బఱచువానర,వీరులకున్ వాలిసుతుఁడు ♦ వెస నడ్డం బై
వారించి నూలుకొల్పి ము,హారవమున నెల్లవారి ♦ కను నిబ్బంగిన్.        ౧౫౦౦

### అంగదుఁడు కపులకు భయముఁ బాపి క్రమ్మఱించుట.

ఉ. పోకుఁడు పోకుఁడీ ప్లవగ♦పుంగవులార! నిలుండు పోరికిన్
వీకునఁ గ్రమ్మఱుండు పర♦వీరులు నవ్వఁగఁ బాఱిపోవ న
స్తోకపుభీతి నీజగతి ♦ నుంతయు లేదు సుఖంబుఁ గీర్తియున్
బోకడఁ బెట్టి మాన మిటు ♦ పోవఁగఁ బ్రాణము లంతయెక్కుడే. ౧౫౦౧

కం. దిగవిడిచి కైదువుల నని, మగతనములు దూలఁ బఱచి ♦ మనికికిఁ జన మీ
మగువలె మిముఁ గని నగరే? మగవారల కున్న వేఱు♦మరణం బకటా. ౧౫౦౨

చం. అసమకులంబునన్ జనన ♦ మందితి రందఱు, బక్కక్రోఁతుల
ట్లసమఱి పాఱిపోదురె భ♦యంబునఁ? గీర్తియుఁ బౌరుషంబు మీ
రసదుగఁ జేసి పాఱుట న♦నార్యుల రీరలు గారె? మున్నునిం
డుసభ వచించుపగ్గెలు సు♦డుల్ దలపోయుఁడి భీతిఁ బాయుఁడీ. ౧౫౦౩

ఆ. మాన మెడల వెనుక ♦ మని యుండఁ గల్గినఁ, బిఱికిపంద యనుచుఁ ♦ బిలుచుజనము
హేయ మైనబ్రదుక♦ దేటికి? ధీరులా, సాధుజనులు చనెడి♦సరణిఁ బొండు. ౧౫౦౪

సీ. కొట్టెనా యాతఁడు ♦ కోఱయూపిరులఁబోడఁ, బడియుంద మవనిపైఁ ♦ బ్లవగులార!
చంపెనా యితరదు♦ష్ప్రాపంబు బ్రహ్మలోకంబున సౌఖ్యంబుఁ ♦ గనఁగవచ్చుఁ
జంపితిమా వీని ♦ సాహసరంబున నసా, మాన్య శాశ్వతకీర్తి ♦ మనఁగఁ గలుగుఁ
గాదేని క్రయ్యంబు♦గాఁ జేసి యసువుల, వీరలోకముఁ గొని ♦ వెలయ రాదె

ఆ. మనుజవిభుఁడు గనిన♦దనుక వీనిజవంబు, రాముబారిఁ బడిన ♦ రాక్షసుండు
వహ్ని నుఱుకు మిడుత♦వడువున మాఁడఁడే, ధీరతను గొనుండు ♦ తిరిగి రండు.

చం. ఒకనిని మించి యింకొకరుఁ ♦ డూరక పిక్కబలంబుఁ జూపినన్
దికమికఁ బ్రాణరక్షకయి ♦ దేబెలుపోలె యశంబు గల్గునే?
యొకనికి నోడి పాఱఁ గపి♦యోఘులయూథ మటన్ననింద తా
రకలును జంద్రసూర్యులు ధ♦రాస్థలి యుండెడిదాఁక నుండదే. ౧౫౦౬

కం. అనవుడు భీమాక్షుం డై, చనుదెంచెడికుంభకర్ణు♦చాయం గనుచున్
వనచరులు చెదరి పఱచుచు, నని రాతారేయుతో భ♦యాకులమతు లై. ౧౫౦౭

ఉ. క్రూరుఁడు రాక్షసుండు బల♦కుంఠితగాత్రులఁ జేసె వానితోఁ
బోరఁగ నెవ్వఁ డోపుఁ బర♦పుణ్యజనాళుల[1] యట్టివాఁడు కాఁ
డూరక చచ్చినంతఁ జల♦మో ఫలమో మఱి పేరొ పెంపొ, చాల్
ధీరత లింకఁ, బ్రాణములు ♦ దీ పసఁగా విన లేదె యంగదా! ౧౫౦౮

కం. అని పరు విడ నడ్డంబుగఁ, జని కారణములు వచించి ♦ సాంత్వనభక్తిన్
మనములు దేర్చిన వారలు, జనితామోదమున మరలి ♦ సత్వరు లగుచున్. ౧౫౦౯

---

[1] పుణ్యజనాళులు = రాక్షససమూహములు.

ఆ. మైంద ధూమ్ర కుముద ♦ మారుతి రంభ గ,వాక్ష పనస శరభ ♦ లమితబలులు
ఋషభ నీల తార ♦ లెసఁగి ద్వివిద సుషే,ణులును నెదురు చనిరి ♦ కలహవాంఛ.

→ కుంభకర్ణుఁడు వానరసేన హతముఁ జేయుట. ←

సీ. అంగదువాక్యంబు ♦ లాలించి యందఱుఁ, బ్రాణంబులందలి♦యాస,మాని
పేర్వాడి తమతమ♦బిరుదులు పలుకుచుఁ, గపివీరు లని సల్పఁ ♦ గడఁగి రేఁగి
కొండలు గుండులుఁ ♦ గుజములుఁ గైకొని, కుంభకర్ణునిఁ దాఁక ♦ ఘోరభంగి
నాతండుఁ గినిసి యు♦ద్యద్గదాహస్తుఁ డై, వారల నెల్లర ♦ బారి సమరె
ఆ. వ్రేటునకును నూఱు♦వే లేడు నెనిమిది,వేలు క్రోఁతిగములు ♦ నేలఁ గూలెఁ
బదియు నాలుగురను ♦ బదిమంది నిరువది,మందిఁ బట్టియొక్క♦మాఱు మ్రింగు.
కం. గరుటామంతుఁడు పాముల,సరణిని విదలించి మ్రింగ ♦ శాఖామృగముల్
పురి గొనుచు నెట్ట కేలకు, దుర మొనరించెను సమీక♦దోహల మగుచున్.

→ ద్వివిదుఁడు కుంభకర్ణుతోఁ బోరుట. ←

చం. ద్వివిదుఁడు కోపఘూర్ణితమ♦తిఁ శిఖరంబు నొకండుఁ బూని పె
న్జవమున గాలికిం జనుఘ♦నంబువలెం జని దాని నైన దా
నవవిభుఁ దాఁక కయ్యదియు ♦ నడ్మ బలంగములోనఁ గూలి సైం
ధవరథదంతిసైన్యముల ♦ నాశము సేసె నిమేషమాత్రలోన్. ౧౫౧౩
ఉ. వెండియు వానరుండు పృథి♦వీధర మొండు గ్రహించి దోర్యుగో
ద్దండతఁ జిమ్ముఁగా నదియు ♦ దానవసైన్యము వీతసాదివే
తండహయంబుఁ జేయుఁగ మృ♦ధంబు భయంకర మయ్యె భూమియుఁ
నిండె సురారిరక్తమున ♦ నిర్జరవైరు లుదగ్రమూర్తు లై ౧౫౧౪
శా. చండాంశుప్రతిమాన బాణపటలీ♦సంఛిన్నగాత్రంబుగా
ఖండీభూతశిరంబుగా దళితవ♦క్షఃఫాలదేశంబుగాఁ
బిండీభూతపలంబుగాఁ ద్రుటితనా♦భీశ్రోణిపాదంబుగాఁ
జెండం జొచ్చిరి కీశసైన్యము బల♦శ్రీయుక్తదోశ్శక్తులన్. ౧౫౧౫
కం. ధీరులు భుజబలసారులు, భూరుహచారులు కుజాళి♦శాత్రవసేనన్
దేరుల గౌరుల మావుల, వారక వధియించి బడలు♦పడఁ జేయునెడన్. ౧౫౧౬

→ హనుమంతుఁడు కుంభకర్ణుతోఁ బోరుట. ←

ఉ. మారుతి భీమరూపమున ♦ భూధరశృంగధరారుహాళి దు
ర్వారజవంబునన్ దనుజ♦వల్లభమూర్ధతలంబుపై మహా
సారమువోలె నభ్రపథ♦సంచరణంబునఁ గ్రాలి వైవఁగా
శూరుఁడు కుంభకర్ణుఁ డది ♦ శూలమునన్ శకలాయితంబుగన్ ౧౫౧౭

ఉ. చేసియు నంతఁ బోక కపి♦సేనల నుగ్రతఁ దోలి తోలి శూ
లాసమధారఁ ద్రుంపఁ బవ♦నాత్మజుఁడుం గురుశృంగహస్తుఁ డై
యాసురవైరికట్టెదుట ♦ నట్టె నిలంబడి వీచి వైవ వాఁ
డాసిగరంబుతాఁకున మ♦హావ్యథఁ జెంది భృశాస్రసిక్తుఁ డై. ౧౫౧౮

చం. తలఁకి కలంగి శాత్రవవి♦దారణశీలము శూలముం మెఱుం
గుల గొనబారుదాని గురు♦గోత్రముఁబోలినదాని వైచి య
గ్గలికను గొంచగ ట్టసిత♦కంఠతురంగుఁడు[1] శక్తిఁబోలె నా
వలిముఖవీరువక్షమును ♦ వ్రచ్చె నరాతులు పిచ్చలింపఁగన్. ౧౫౧౯

ఉ. శూలవిభిన్నవక్షుఁ డయి ♦ శోణితపూరము లారఁ గ్రక్కుచుం
వ్రాలి యుగాంతనీరదర♦వంబునుబోనిరవంబు నింప న
గ్గాలితనూజుపాటుఁ గని ♦ గాఢముదంబున రాక్షసావళుల్
క్ష్వేళల నించె డీలుపడి ♦ బెగ్గలి పాఱెఁ గపీంద్రసంఘముల్. ౧౫౨౦

చం. పరువిడువారి నిల్పి కపి♦వర్యుఁడు నీలుఁడు శృంగ మొండు దా
నురవడిఁ గుంభకర్ణుని మ♦దోద్ధతి వైచిన సోఁకు దాని ను
ద్ధురగతి ముష్టిఘాతమునఁ ♦ దూల నడంపఁగ మంటలుం మిడుం
గురు లురలం ధరాస్థలిని ♦ గూటము గూలెను జాలు గుండ్లు నై. ౧౫౨౧

## ←శరభాదులు కుంభకర్ణుతోఁ బోరుట.→

సీ. సాహసికాగ్రణుల్ ♦ శరభనీలగవాక్ష,గంధమాదనులు వి♦క్రమధనుండు
ఋషభుఁ డీయేవురు ♦ వృక్షశైలంబులఁ, గాళ్లను బిడికిళ్లఁ ♦ గరతలముల
నలుదెసలం దుండి ♦ చలమున నొప్పింప, నెనఁగు నయ్యేటుల ♦ నీఁగవ్రాలి
నట్టుల యైన ర♦క్షోధీశుఁ డది లెక్క,యిడక యాఋషభుని ♦ నొడిసి పట్టి

తే. రెండుచేతుల నదుమఁ గీ♦శుండు నల్లఁ,గ్రక్కిపడె గంధమాదనుఁ ♦ గాల ముష్టి
శరభు మోఁకాల నీలునిఁ ♦ గరతలమున, నాగ్రహంబునఁ దాఁచెగ♦వాక్షునసుర.

కం. దత్తప్రహారు లై యిటు, నెత్తురు ముక్కులను నోట ♦ నెఱి గ్రక్కుచు సం
కృత్తపలాశము లట్టులు, హత్తిన వెతఁ బడిరి వనచ♦రాగ్రణు లవనిన్. ౧౫౨౩

చం. మేటులు మ్రానిద్రిమ్మరులు ♦ మేదినిఁ గూలినఁ గుంభకర్ణునిం
గోటివనేచరుల్ గవిసి ♦ కొండను బ్రాఁకినయట్లు ప్రాఁకి పె
న్గాటులఁ బోటులం శితన♦ఖంబుల దంష్ట్రలఁ గేలిబ్రేటులం
గాటపువీఁక నొవ్వ గొనఁ♦గాఁ బ్రహరింపఁగఁ గుంభకర్ణుఁడున్. ౧౫౨౪

## ←కుంభకర్ణుఁడు వానరుల మ్రింగుట.→

కం. ధరణీరుహాపరిశోభిత,ధరణీధర మనఁగఁ బొల్చి ♦ తరుచరుతతులం
గరములను వారి నెల్లర, గరుడుం డహితతుఁబోలె ♦ గ్రసియింపంగన్. ౧౫౨౫

[1] అసితకంఠతురంగుఁడు = కుమారస్వామి.

ఉ. మ్రింగుడుపడ్డ యాప్లవగ♦బృంద మధోభువనోపమానకు
క్షిం గడువేగ చొచ్చియును ♦ జెచ్చెర ముక్కులనుండి వీనులన్
భంగము లేక వెల్వడియె ♦ నాఁడును హా యని నోరు విచ్చి పే
రంగదఁ[1] జాలుగా మెసవె ♦ నచ్చటికీశుల నెల్ల వ్రేల్మిడిన్. ౧౨౬

సీ. వజ్రహస్తుం డైన♦వాసవుఁ బాశహస్తుం డయికెరలెడి♦దండధరునిఁ
బోలుచు నసురుండు ♦ శూలహస్తుం డయి, తరుచరతతులలోఁ ♦ దిరిగి తిరిగి
కాలాగ్నిభంగిని ♦ గ్రాలుచు వధియింప, క్షితి మాంసశోణిత♦క్లేద మయ్యె
వేసంగి నెండిన♦విపినంబు దహనుండు, కాల్చుమాడ్కి దహించెఁ ♦ గపిబలంబు

తే. వానిధాటికి సైఁపక ♦ వనచరాళి, విస్వరంబుగ విలపించె ♦ విగతనాథు
లగుచుఁ దక్కినవా రెల్ల ♦ నరిగి రాము,శరణుఁ జొచ్చిరి దుఃఖంబు♦గరిమఁ గలఁగి.

## అంగదుఁడు కుంభకర్ణునితోఁ బోరుట.

ఉ. భగ్నుల వానరానళుల ♦ వానవపుత్రసుతుండు గాంచి యు
ద్విగ్నుఁడు గాక యొప్పుచును ♦ దీవ్రజవంబున శృంగ మొండు భీ
మగ్నముగాఁ బలాశులస♦మాజము రాక్షసభర్తృమూర్ధసం
లగ్నము గాఁగ వైచిన బ♦లంబుగ నొచ్చి యభుగ్నకోపుఁ డై. ౧౨౭

ఉ. ఇంద్రజసూనుదర్పము స♦హింపక రావణుసోదరుండు ని
స్తంద్రజవంబునం బ్లవగ♦జాలము బెగ్గిల గర్జ నించుచున్
రుంద్రతరప్రభాకలిత♦రూక్షము శూలము బిట్టు వైచె నా
యైంద్రజుమీఁద, సంగరర♦హస్యవిదుం డతిలాఘవంబునన్ ౧౨౮

ఉ. శూలముఁ దప్పదాఁటి చని ♦ శూరవరేణ్యుఁడు తారపట్టి యా
భీలతలప్రహారమున ♦ బిట్టుగ నొంచిన నాగ్రహంబునన్
సోలియు లబ్ధసంజ్ఞుఁ డయి ♦ సోఁకుఁడు దాఁ బెడకేలిముష్టిచే
వాలితనూజునిం బొడువ ♦ వ్రాలె నతండు విసంజ్ఞుఁ డై ధరన్. ౧౩౦

## సుగ్రీవుఁడు కుంభకర్ణుతోఁ బోరుట.

ఉ. అంగదుఁ డిట్లు గూలఁ దన♦యాయుధముం గొని సూర్యపుత్రుమీఁ
దం గవియంగ నాతఁడును ♦ దానవనాయకుసమ్ముఖంబుగా
శృంగమొకండు నెత్తికొని ♦ చేరి ప్లవంగమలోకరక్తసి
క్తాంగు ఘనాటఘస్మరు భ♦యంకరరూపునిఁ గాంచి యిట్లనున్. ౧౩౧

ఉ. త్రుంచితి కీశవీరులను ♦ దుష్కరకర్మము నాచరించి భ
క్షించితి క్రోఁతిగుంపులను ♦ జేపడె నీకు యశంబు దీనఁ జా

[1] అంగద = ఆఁకలి.

లించుట మేలు ప్రాకృతవ♦లీముఖమారణకర్మ మిట్టు లే
తెంచి మదీయపర్వతహ♦తిఁ గని సయిరింపుము రాక్షసోత్తమా! ౧౫౩౨

చం. అనవుడు సత్త్వధైర్యవిభ♦వాన్విత మైనహరీంద్రువాక్యముల్
విని హనుమంత వయ్యె నల♦వేధకు, ఋక్షరజస్సుతుండ వై
వినుతబలుండ వయ్యె నిటు ♦ ప్రేలెద వేల ప్లవంగమా! యనన్
ఘనతరపర్వతాగ్రమునఁ ♦ గంజహితాత్మభవుండు రాక్షసున్ ౧౫౩౩

ఉ. అక్కడరంగ వైచుటయు ♦ నాతనివక్షముఁ దాఁకి నంతనే
ముక్కలు ముక్క లైననగ♦ముం గని దైత్యులు సింహనాదముల్
దిక్కుల ముంపఁ జల్ప, మల♦ద్రిమ్మరు లెల్ల విషణ్ణచిత్తు లై
పొక్కిరి, కుంభకర్ణుఁడును ♦ భూధరశృంగనిపీడ్యమానుఁ డై. ౧౫౩౪

తే. వివృతవక్త్రుండునుఁ గ్రోధ♦వివశుఁ డగుచు
మెఱుఁగులు తుఱంగలించెడి ♦ మేటిమూఁడు
మొనలవాలును వానర♦ముఖ్యుఁ జంప
నెంచి పరఁగించె వానరు ♦ లెల్ల బెగడ. ౧౫౩౫

ఉ. కాంచనధాతుజుష్ట మయి ♦ క్రక్కుచు నిప్పులు వచ్చుదాని వీ
క్షించి మరుత్తనూభవుఁడు♦చివ్వన నడ్డము దూఁకి పట్టి వే
త్రుంచె ఫళుక్కునన్ విఱుగఁ ♦ దోరపుహర్షమునన్ వనౌకసుల్
గాంచి మదించి కేక లిడి ♦ గాఢుపుపట్టి నుతించి రెంతయున్. ౧౫౩౬

కం. తోరపుహూపం బై వెయి, బారువ్రేఁ గైనయుక్కు♦పటుశూలంబున్
వీరుఁడు మోఁకాలను రెం, డై రాలఁగ విఱిచి మిగుల♦హర్షం బందెన్. ౧౫౩౭

కం. శూలము భగ్నం బై చన, వైళమ లంకాస్థమలయ♦పర్వతతటమున్
దా లాగి దాన నసురుఁడు, హేళిసుతున్ డాసి యడిచెఁ♦బృథుదోశ్శక్తిన్.

మూర్ఛిల్లిన సుగ్రీవునిఁ గుంభకర్ణుం డెత్తికొని లంకలోనికిఁ బోవుట.

సీ. కుధరాగ్రహతిఁ జేసి ♦ కూలె సుగ్రీవుండు, నష్టసంజ్ఞుం డయి ♦ కష్టదశను
నాశ్చర్యఘోరప♦రాక్రముం డినసుతుం, డిటుచేష్టలను మాని ♦ యిలను బడినఁ
గని రాక్షసులు ఘోర♦గర్జల నింపఁగఁ, గుంభకర్ణుఁడు వానిఁ ♦ గూడ నరిగి
పట్టి యెత్తికొని య♦భ్రంబును వాయువు, గొనిపోవునట్టులు ♦ కొని యరుగుచు

ఆ. రాత్రిచరులస్తోత్ర♦రావముల్ విస్మిత,దివిజనాదములను ♦ దివిజవైరి
వినుచు ఘోరశృంగ♦విలసితమేరువు,భంగి లంకఁ జొచ్చె ♦ భయదరీతి. ౧౫౩౯

కం. ఇక్కరణిఁ జనుచుఁ దనలోఁ, జిక్కెను బ్లవగప్రభుండు ♦ చిక్కిన యట్లే
తక్కినరామబలం బని, పెక్కులు తలపోసికొనుచు ♦ బిఱ బిఱ చనఁగన్. ౧౫౪౦

సీ. చిక్కిన సుగ్రీవుఁ ♦ జెదరి పాఱెడిసేనఁ, గనుఁగొని మారుతి ♦ మనములోన
నేమి చేయఁగ వచ్చు ♦ నిప్పుడు దీనికిఁ, బ్రతివిధానము న్యాయ్య♦పథము విడక,
చలిపెద నెదియైన ♦ శైలనిభుండనై, మర్దింతునా త్రియా♦మాచరేంద్రు?
వీనిని జంపిన ♦ విడివడు హరిరాజు, ప్లవగులెల్లను హర్ష♦పడెదువారు
తే. విక్రమం బేను జూప ను♦పక్రమింప, నేల? సామాన్యుఁడే వాన♦రేంద్రుఁ డఱక
విబుధముఖ్యులుపట్టిన ♦ వీఁక మెఱసి, తాన విడిపించికొని వచ్చు♦ద్రఢిమఁ గలఁడు.
కం. ఈరీతిఁ జిక్కి యుంటకుఁ, గారణ మీతండు శైల♦ఘాతంబునఁ బ్ర
జ్ఞారహితుఁడు గా నోపుసు, మూరుతమునఁ దేఱి తనకు ♦ మూఁకకు హితమున్
చం. పౌనరుచుఁ గాక నే బలిమిఁ ♦ బూని మహాత్ముని ముక్తుఁ జేసినన్
ఘనతరకీర్తినాశమును ♦ గష్టము సమ్మదహాని గల్గు నీ
యన కిల శాశ్వతం బగుచు ♦ నట్టులు గాన ముహూర్త మోర్చి యీ
వనచరసేననివ్వెఱను ♦ బాచుచుఁ దేర్చెదఁ బ్రోవు గూర్చెదన్.　　౧౪౮౩
కం. అని చింతించుచుఁ జెదరిన, వనచరులం గూర్చు చుండ ♦ వడి ఘటకర్ణుం
డును సుగ్రీవుం గొని వడిఁ, జనుచుండెను లంక రాజ♦సరణిని సంతన్.　　౧౪౮౪

సుగ్రీవుఁడు కుంభకర్ణుని ముక్కు సెవులు కొఱికి రామునొద్దకు వచ్చుట.

సీ. ఇరువంక రాణించు ♦ గృహగోపురవిమాన, చర్యాగ్రవర్తులు ♦ చల్లు చున్న
లాజగంధోధక♦రాజుల మెల మెల్లఁ, దడియుట ఘంటాప♦థంబుశైత్య
మున నెట్టకేలకు ♦ మూర్ఛదేఱి ససంజ్ఞుఁ, డయి రాజమార్గంబు♦నందుఁ జనుట
యెఱిఁగి ప్రతిక్రియ ♦ యేమి చేయుదు నిప్డు, సలుపుదుఁ గాక కీ♦శులకు హితము
ఆ. నిష్ట మైనకార్య ♦ మిపు డని యోజించి, చంక నుండి దిగువ ♦ జాఱి సరగ
నింతలోన మీఁది♦కెగసి చివాలునఁ, గొఱికె ముక్కు గోళ్లఁ ♦ బెఱికెఁ జెవులు.
చం. చెవులును ముక్కుఁ బోవ మెయి ♦ సిక్తముగా క్షతజంబునన్ రుషా
వివశత మ్రాన్పకంపుఁబతి ♦ బిట్టుగఁ బట్టి నలంచి నేలపై
జవమునఁ గొట్టె, నీగతిని ♦ సంపరిపిష్టుఁడు నయ్యు మాంస భు
గ్నివహానుమర్దితుండు నయి ♦ కీశవిభుండు లఘుత్వ మేర్పడన్.　　౧౪౮౬
కం. నింగికిని దాఁటి రాముకు, ఱంగట నిలఁబడియె నచట ♦ ఱంపిలు నస్రం
బంగమ్ముఁ దడుపఁగ సెలయేర్లం గొఱలెడి కొండవోలె ♦ రక్తప్రభుఁడై.　౧౪౮౭

కుంభకర్ణుఁడు మత్తుఁడై వానరాదుల మ్రింగుట.

మ. అమితామర్షమునన్ నిశాచరుఁడు సం♦ధ్యాయుక్త మానీలమే
ఘమునాఁ బొల్చుచు యుద్ధభూమి కెదురై ♦ కాంతాళపుం బేర్మి యు

ప్రములం గ్రక్కుచుం బోవుచుం గరమునన్ ♦ శస్త్రంబు లే కుంట రౌ
ద్రము క్రూరం బగుముద్గరంబుం గొని ప్ర♦ధ్వంసించెం బ్రత్యర్థులన్. ౧౫౪౮

ఉ. మత్తమనస్కుండున్ క్షతజ♦మాంసముగృధ్నుం డెఱుంగ లేక తా
నత్తఱి వీరు వా రనక ♦ యాశరకీశపిశాచముఖ్యులన్
మిత్తి లయంబునందువలె ♦ మ్రింగం గడంగెను నొక్కకేలం జే
హత్తిన యిద్దఱిన్ ముగుర ♦ నారంగం బెక్కుర వాతంగూరుచున్. ౧౫౪౯

## ⟶ శ్రీరాముండు కుంభకర్ణుతో యుద్ధము చేయుట. ⟵

సీ. చుట్టును గ్రోంతులు ♦ బిట్టుచెట్టులం గొట్టి, సంపీడితునిం జేయ ♦ సరకు గొనక
సెలవుల నెత్తురు ♦ వలలంబు స్రవియింప, నేడ్వుర నూర్వుర ♦ నెనిమిదిగుర
దిగ మ్రింగుచును నిచ్చం♦దిరుగులాడంగం గపుల్, శరణుంజొచ్చిరి రామ♦చంద్రుం జేరి
యది గని లక్ష్మణుం ♦ డధికకోపంబునం, గుంభకర్ణుని నేడు ♦ క్రూరబాణ

తే. ములను గొట్టిన నాతని♦వలను గనక
రాముం డున్నెడకును బోఁ ♦ రౌద్రశరము
వింట సంధించి రాముండు ♦ వెడంద యురము
దాంక విడుచుటయును వాండు ♦ దరలి యదరి ౧౫౫౦

కం. అంగారమిత్రకీల ల,భంగురగతి నోరు వెడల ♦ భయదరవంబున్
నింగి పగులంగ నించి ప్లవంగులదెస మరలి పీఁక ♦ వారిం దఱిమెన్. ౧౫౫౧

తే. నెమ్మిగఱు లగురాఘవ♦నిష్ఠురాశు,గంబు లురమున నాటంగ ♦ గాటముగను
జేతిక్రైదువు లెల్లను ♦ క్షితితలమున, జాఱి తమయంతం బడిన ని♦శాచరుండు

కం. కాలను గేలను యుద్ధం, బోలి నొనర్చుచును నెత్రు♦టోడలున రక్షః
పాళులం గ్రోంతుల మ్రింగుచు, హాళిమెయిం దిరిగి యంత♦కాకారుం డై.

మ. ధరకూటంబు నొకండుం దెచ్చి వడి సీ♦తానాథుపై వైవ నం
తరమం దేడుశరంబులం దునిమి య♦ద్దానిన్ మఱిన్ శైల ము
ర్వరం గూలన్ ద్విశతంబు మర్కటులు చా♦వం గల్గునం చాశుగో
త్కరవర్షంబునం జూర్ణముం జలిపె వే♦గస్ఫీతుం డై రాముండున్. ౧౫౫౪

కం. ఈలో నాతనిం జంపంగ, నాలోచన సేయురాఘ♦వానుజుం డను న
న్నా! లాంతులం దమవారిని, వాలాయము మ్రింగు చున్న♦వాం డదె కంటే.

కం. వనచరుం డని నిశిచరుం డని, మనమునం దెలియంగ లేండు ♦ మత్తత రక్తం
బున వాసనచేం; గ్రోంతులు, గొనకొని పై నెక్కి రేని ♦ కోటులకొలందుల్

కం. గురుభారపీడితుం డై, దురితాత్ముండు నలంగి క్రోంతి♦తుటుముల నిట్టుల్
పొరిగొన నోపం డన విని, తరుచరసంఘంబు లెక్కె ♦ దానవుమీందన్. ౧౫౫౭

ఉ. మూపటిఁ గ్రిందఁ ద్రోయఁ జెడు◆మత్తగజేంద్ర మొదల్ విదుర్చున
ట్లావరసత్త్వశాలి తన◆యంగము లోలి విదిర్చి యెల్లకీ
శావళిఁ గ్రిందఁ ద్రోయు మను◆జాధిపుఁ డయ్యది గాంచి వీఁ డహో
కావలుఁ డంచుఁ దీవ్రశర◆కార్ముక హస్తుఁడు తోడు తోడుగన్. ౧౫౮

ఉ. వానిభయంబునన్ సురఁగు◆వానరు లెల్లరు మోద మంద రో
షానలతామ్రచక్షుఁ డయి◆ యాతనిఁ జూపులనే దహించుచం
దానను రాక్షసుం దఱిమి◆ తాన యదల్చుచు నడ్డగించె ర
క్షోనిచయంబు బెగ్గిలఁగఁ◆ గ్రూరగుణారవపూరితాశుఁ డై. ౧౫౯

ఉ. నల్లను గ్రక్కుచున్ మరల◆ నాలుక నాకుచు రోసి క్రోఁతులన్
గొల్లగ మ్రింగి వైచుచును◆ ఘోరపురూపునఁ గల్పకాలుఁ దా
నుల్లసమాడువానిని స◆ముజ్జ్వలితాంగదు స్వర్ణరత్నభూ
షోల్లసితాంగుఁ జేరఁ జన◆ నుగ్రత వాఁడును రోషదీప్తుఁ డై ౧౬౦

శ్రీరామకుంభకర్ణుల సంవాదము.

ఉ. సమ్ముఖ మేగుదేర రఘు◆చంద్రుఁ డి ట్లను రాక్షసేంద్ర! రా
రమ్ము విషాద మందకుము◆ రాముఁడ నే నిదె చాప మూని సి
ద్ధమ్ముగ నున్న వాఁడ నెటఁ◆ దారెద వింక ముహూర్తమాత్రలో
సమ్మును కాలువిందుగ నొ◆నర్చెద నార్చెద నీప్రతాపమున్. ౧౬౧

కం. అనవుడు నాతఁడె రాఘవుఁ, డని యెఱిఁగి సురారి వికృత◆హాసరవుం డై
వనచరుల గుండె లగలఁగ, స్తనితార్భటి ననియె రామ◆చంద్రునితోడన్. ౧౬౨

ఉ. కాను జుమీ విరాధుఁడను◆ గాను గబంధుఁడఁ, గాను వాలి, నేఁ
గాను ఖరుండ, రామ! విను◆ కా నలతాటక పట్టి, వచ్చితిన్
దానవదేవతానికర◆దారణకారణభీమహేతిదు
గ్రానలతుల్యముద్గరక◆రార్జితవర్ణుఁడఁ గుంభకర్ణుఁడన్. ౧౬౩

చం. చెవులును ముక్కు లే వని హ◆సింపకు న న్నని రామచంద్ర! య
య్యవి తెగిపోకఁ బీడ లవ◆ మైనను లేదు, భవద్బలంబు శౌ
ర్యవిభవ మేను గాంచి మఱి◆ యస్మదనూనపరాక్రమంబు నీ
కవితథభంగిఁ జూపి జవ◆ మారఁగ మ్రింగెదఁ బెం పెసంగెడన్. ౧౬౪

మ. ఘటకర్ణుం డిటు పల్క రాముఁడు సుపుం◆ఖస్ఫారవజ్రద్రుతో
త్కటబాణంబులఁ జిమ్మెఁ దద్ధతిని నా◆తం డేమి కంపింపమిన్
బటుసాలంబుల వాలిఁ ద్రుంచినశర◆వ్రాతంబులన్ వైచె న
చ్చటులాస్త్రంబులు నించుకే నతని నే◆చన్ లేవ, యద్దైత్యుఁడున్ ౧౬౫

కం. కురిసెడిశరవర్షంబును, శరవర్షమునా గ్రహించి ♦ శరవేగము ము
గ్గరవేగంబున నడుమఁ బుచుఁ, దరుచరతతి నెల్లఁ దఱిమెఁ ♦ దద్వాశమునన్. ౧౫౬౬

శ్రీరాముఁడు కుంభకర్ణుని కాలుసేతులు నఱకుట.

మ. అలఁతిం బోయెడువాఁడు గాఁ డనుచు వా♦యవ్యాస్త్రముం బూని శ్రీ
జలజాక్షుండు సముద్గరం బయినహ♦స్తం బుర్విఁ గూల్పంగ, నా
పలలాశిప్రవరేణ్యుఁడుం దుములరా♦వం బార నించెన్, శరో
ద్దళితం బైనకరంబు వృక్షచరసం♦తానాంత మై భూమిపై ౧౫౬౭

మ. పడినన్ భగ్న హతావశేషనికురుం♦బం బెల్ల దాడవ్వఁగాఁ
గడలం బాఱి విషణ్ణచిత్త మగుచుం ♦ గంపించు దేహంబులన్
గడుఘోరం బగురామరాక్షసులసం♦గ్రామంబు వీక్షించె న
య్యెడ గుండెల్ దిగు దిగ్గు దిగ్గుమన నం♦తే వీతహర్షంబునన్. ౧౫౬౮

ఉ. అంత నికృత్తబాహుఁ డసు♦రాంతకుఁ డొంకొక కేలఁ బీకి త
త్ప్రాంతగతంబు భూరుహము ♦ రాముని గొట్టఁగ వచ్చుచుండ దు
ర్దాంతమహైంద్రబాణమున♦రాముఁడు వృక్షముతోడిహస్త మ
భ్రాంతిని ద్రుంచి వైవఁగ ధ♦రం బడి కేలు ద్రుమాన్వితంబుగన్ ౧౫౬౯

కం. పొరలుచుఁ బొరలుచు శిలలం, దరుచరులన్ భూరుహములఁ ♦ దద్దయు మోఁదెన్
ధరఁ దొరఁగఁ జావ విఱుగన్, గిరినిభుఁ డగురక్కసుండు ♦ కెరలుచుఁ గినుకన్

కం. కరములు రెండును లేకయు, కరము భయంకరము లైన♦గర్జలతోడన్
సురవడి రాఁ గని యాతని, చరణంబుల నఱకె సర్ధ♦చంద్రద్వయిచేన్. ౧౫౭౧

కం. దిక్కుల విదిక్కులం బెను, రక్కసగుమి గిరుల సాగ♦రంబున గుహలం
దొక్కమొగి రవము పుట్టఁగ, నక్కాళులు రెండు దునిసి ♦ యవనిం బడియెన్.

తే. కృత్తబాహుండు మఱి వినికృత్తచరణుఁ
డయ్యు నాతఁడు హో యని ♦ యాస్యగహ్వ
రంబుఁ దెఱచి ఘోషించుచు ♦ రాముఁ జేర
వచ్చె శశి మ్రింగ రాహువు ♦ వచ్చుకరణి. ౧౫౭౩

ఉ. విచ్చిననోట రామపృథి♦వీధవవర్యుఁడు హేమపుంఖభా
స్వచ్ఛటులాంబకాళి రభ♦సంబుగ నిండఁగ వైచె, నోటిలోఁ
గ్రుచ్చుకొనంగ బాణములు ♦ క్రూరచరిత్రుఁడు మాట లాడలే
కెచ్చుగఁ గూఁత వేసి స్మృతి♦హీనత బమ్మెర పోవ నెంతయున్. ౧౫౭౪

శ్రీరాముఁడు కుంభకర్ణుశిరంబుఁ దెగ వ్రేయుట.

మ. జ్వలదర్కప్రతిమానమై నిశిత మై ♦ సంవర్తకాలాభ మై
ఖలభేదం బయి బ్రహ్మదండనిభ మై ♦ గాంగేయపుంఖంబు నై

బలవిద్విట్పవిమారుతస్యదముసై ♦ భాస్వత్ప్రదీప్తానల
జ్వలనం బై విలసించు నైంద్రశరము౯ ♦ సంధించి శ్రీరాముఁడున్. ౧౫౭౫

శా. ద్రాగాకృష్టగుణంబుగా దశదిశా♦క్రాంతైకఘోషంబుగా
వేగం బార నిశాటుపై విడువఁ ద♦ద్దివ్యాస్త్రము౯ ధూమరా
జీగర్భీకృతరోహితాశ్వసమ మై ♦ శ్రీరోచిరుద్దీపితా
శాగోత్రాధరజాలమై పిడుగునో♦జం బాఱి యాభీల మై. ౧౫౭౬

ఉ. భూరిమహీధరాగ్రనిభ♦ముం జలచారుసువర్ణకుండలం
బార వివృత్తదంష్ట్రమును ♦ నా నసురాధిపమూర్ధము౯ మహా
ఘోరతఁ ద్రుంప బిట్టెగసి ♦ కుండలరాజితతచ్ఛిరంబు పో
ల్పారెఁ బునర్వసూడుయుగ♦లాంతరచంద్రునిఁ బోలుచు న్నిశన్. ౧౫౭౭

ఉ. దబ్బున నేలపైఁ బడుచుఁ ♦ దత్పురిఁ గల్గినగోపురంబులు౯
బ్రబ్బినయిండ్లు నున్నతపు♦వప్రముఁ బా డొనరించె నాద మా
గుబ్బతిలం గళేబరము ♦ గూల్చుచుఁ గోటివనాటుల౯ జలం
బుబ్బఁగఁ గంధిఁ ద్రెళ్లె భుజ♦గోత్కరనక్రఝషాంతకారి యై. ౧౫౭౮

కం. దేవబ్రాహ్మణశాత్రవుఁ, డీవిధమున జన్యసీమ ♦ నీలుగ వణఁకె౯
భూవలయము దివి తుములం, బై వెలసెను దేవతాప్ర♦హర్షారభటిన్. ౧౫౭౯

ఉ. రామపరాక్రమంబునకు ♦ రంజిలె దేవమహర్షి పన్నగ
స్తోమసురర్షి యక్షతతి♦ద్యోచరభూతచయంబు లెల్ల, సం
గ్రామమున౯ సురాహితులు ♦ రాక్షసు లాహరిఁ జూచినట్లు శ్రీ
రామునిఁ జూచి యేడిచిరి ♦ రావణుచుట్టలు పేరెలుంగునన్. ౧౫౮౦

తే. సైంహికేయవిముక్తభా♦స్కరుఁడు దేవ, లోకతిమిరంబు బాపి వె♦లుంగుమాడ్కి
సంగరంబున ఘటకర్ణు ♦ సంహరించి, రామచంద్రుండు వెలిఁగె మ♦ర్కటులనడుమ.

ఉ. భీమబలు౯ దురాసదుని ♦ భీషణకాయునిఁ గుంభకర్ణు దు
ర్ధామబలంబునం దునుమ ♦ దాశరథిం గపిసంఘ ముల్లస
త్తామరసాభివక్త్ర మయి ♦ తద్దయు హర్షమున౯ నుతింపఁగా
రాముఁడు వృత్రుఁ జంపిన సు♦రప్రవరుం డన మోదముం గనెన్. ౧౫౮౨

హతశేషులు రావణునకుఁ గుంభకర్ణుమరణంబుఁ దెలుపుట.

కం. యోధాగ్రేసరుఁ డగుసీ, తాధవుచేఁ గుంభకర్ణ♦దనుజేంద్రుం డా
యోధనమునఁ జెల్లుట ర, క్షోధీశున కిట్లు చెప్పి ♦ రసురవరేణ్యుల్. ౧౫౮౩

శా. దేవా! తావకసోదరుండు నిజవి♦ద్విట్పూగముం బోరిలో
భీవిద్రావిత మాచరించి శుచికిం ♦ బెన్నుద్దియై మూర్త మై

తే విఖ్యాతగతిం బెనంగి కపులఁ ♦ హింసించి యాజానకి
దేవీవల్లభుచేత సంగరములోఁ ♦ దీఱం బ్రశాంతార్చి యై. ౧౫౭౪

ఉ. కృత్తగళోరుబాహుఁడయి ♦ కీర్తితశౌర్యుఁడు నేల నిండఁగా
నెత్తురు గాఱఁ గూలె రజ♦నీచరనాథ! తదర్ధదేహ మీ
పత్తన మడ్డగించెఁ జుమి ♦ ద్వారమునం బడి, మొండె మంబుధిఁ
హత్తినజీవజంతువుల ♦ కంతముఁ గూర్చుచుఁ గూలె భీమ మై. ౧౫౭౫

కం. నీతమ్ముఁడు సీతావిభు,శాతాశుగపీడితుఁ డయి ♦ చటులానలద
గ్ధాతతవసుంధరారుహ,భూతుం డై మఱి లగండ♦భూతుం[1] డయ్యెన్. ౧౫౭౬

తే. అనుచు హతశేషు లాడిన ♦ యసురభర్త, కుంభకర్ణుండు కలనిలోఁ ♦ గూలుట విని
తాళరానిభ్రాతృశోకసం♦తప్తుఁ డగుచు, మూర్ఛయగ్గలముగఁ దన్ను♦ముంపఁ ద్రెళ్లె.

ఉ. అంతకసన్నిభుండు హతుఁ ♦ డయ్యెఁ బితృవ్యుఁ డటన్న దుఃఖవృ
త్తాంతము నాలకించి పరి♦తాపమునం ద్రిశిరోతికాయదే
వాంతకులుఁ నరాంతకుఁడు ♦ హా యని యేడ్చిరి విహ్వలాత్ము లై
యెంతటిధైర్యశాలి మఱి ♦ యెంతబలాఢ్యుఁ డటంచు నెన్నుచున్. ౧౫౭౭

తే. రామవిభుచేత ఘోరసం♦గ్రామమునను
దమసహోదరుఁ డీల్గిన ♦ దారుణంపు
వార్త వినుకలిచే మహా♦పార్శ్వుఁ డడలె
హా యటంచును నేడ్చె మ♦హోదరుండు. ౧౫౭౮

తే. ఎట్టకేలకు నయ్యసు♦రేశ్వరుండు, జాతచైతన్యుఁ డై యను♦జాతుఁ దలఁచి
తలఁచి యాతనిశౌర్యంబు ♦ ధైర్యగరిమ, పరిపరివిధాల నేడిచెఁ ♦ బనవి పనవి.

కుంభకర్ణమరణంబునకు రావణుఁడు దుఃఖించుట.

సీ. హా! రిపుదర్పఘ్న! ♦ హా వీరరత్నమా!,హా కుంభకర్ణ! మ♦హాబలాఢ్య!
దైవచోదితుఁడ వై ♦ తరలితే తమ్ముఁడా!,యగ్రజు ననుఁ బాసి ♦ యమునిపురికి
బంధువులయు నాదు♦బాధలఁ బాపక, చనునె నీ వొంటిగఁ ♦ జనఁగఁ దండ్రి!
యెవ్వనిప్రాపున ♦ నింద్రాదులకు నైన, వెఱవక యుందు నో♦విపులశౌర్య!

తే. యట్టినాదక్షిణభుజంబు ♦ హతము గాఁగ, నింక నే నేమి సేయుదు ♦ హీనబలుఁడ
నైతిఁ బూర్వాపకారి న♦న్నమరవరులు, చూచి నవ్వరె నే నెందుఁ ♦ జొత్తు నయ్య!

కం. హేలాగతి సురదానవ,జాలస్మయ మణఁచినట్టి♦చతురుండవు హా
కాలానలరుద్రాభుఁడ, వాలంబున నీవుఁ దెగితి♦వా రామునిచేన్. ౧౫౮౧

ఉ. ఏ మిది శంబసాధనున♦హీనమహాశని నిన్నుఁ దాఁకఁగా
నేమియు డయ్య వట్టిమహి♦మేద్యుఁడ వార! మనుష్యమాత్రుఁ డా

[1] లగండము = ముద్ద; అజగరము. అగండభూతుఁడని పాఠాంతరము. గుర్తింపరానివాఁడని యర్థము.

రామవిభుండు వైచినశ♦రంబుల కోర్వఁగ లేక యార్తిచే
భూమిని బెద్దనిద్దురను ♦ బొందితివే యిటు లన్నె చిత్రముల్. ౧౫౯౩

కం. మునితతి వేల్పులగుంపులు, ననిలో నీ తెగుట గాంచి ♦ యడలు విడిచి లోఁ
బెనఁగొనుముదమునఁ గలకల, మని నవ్వుచుఁ ద్రుళ్లు చున్న♦యవి గగనమునన్.

కం. ధ్రువముగ నిదియే యద నని, ప్లవగులు నిస్తులితహర్ష♦పరవశు లగుచున్
జవమున నెక్కుదు రీపురి,గవఁకుల వాకిండ్లఁ గోట♦కడ నగ్గడలన్. ౧౫౯౫

ఉ. ఏటికి నాకు రాజ్య? మిఁక♦నేటికి నీపురి? యేల సీత? నా
కేటికి జీవితంబు? రుచి♦యించు నె నాయనుజుండు లేనిచో?
సాటికి భ్రాతృహంత రఘు♦చంద్రుము నే వధియింప నేని ము
మ్మాటికిఁ జావె మేలు, కొఱ♦మాలినయీబ్రదు కేల భూమిపై! ౧౫౯౬

కం. నాయనుజుఁ డుండుచోటికి, నే యరిగెద వాని విడిచి ♦ యే నొకక్షణమేన్
గాయంబు నిలుప నోపను, నేయెడ నే నట్టివాని ♦ నిలపైఁ గందున్. ౧౫౯౭

చం. హరిహయుఁ డెత్తిరాఁగ నిఁక♦నాతని నెట్లు జయింప నేర్తు? నా
వరమతి యావిభీషణుని♦వాక్య మయో ఫలియించి వచ్చెఁగా,
యరయక బుద్ధిమాలి మహి♦తాత్ముని యాతనివాక్యమం దనా
దరమతి చేసితిన్, ఫలము ♦ తప్పక తార్కొనె నేమి సేయుదున్. ౧౫౯౮

చం. అనిమొనఁ గుంభకర్ణుఁడు ప్ర♦హస్తుఁడు గూలినవార్తలన్ విన
మనమున నవ్విభీషణుని♦మాట లహో సరిదాఁకి వచ్చెఁగా
యని కడులజ్జ యయ్యెడు, మ♦హాత్ముని ధర్మరతున్ నిరస్తుఁ జే
సినఘనపాపమే యిటులు ♦ చేసెడు, శోకము పేరఁ గోసెడున్. ౧౫౯౯

కం. అని యేడ్చును బలవించును, ననుజా! యనుఁ గుంభకర్ణుఁ♦డా! యనునయయో
చనితా యను నిఁక నాగతి, ననుమా యను సోలు వ్రాలు ♦ నలదురుఁ జెడితిన్

త్రిశిరుండు రావణునకు దుఃఖశాంతివాక్యంబులఁ దెలుపుట.

చం. అని యిటు లేడ్చు చున్నయసు♦రాధిపతిం ద్రిశిరుండు పల్కు నీ
యనుజుఁడు నీవు పల్కుగతి ♦ నట్టిఁడ, వైరులచేత నీల్గె, నీ
యనువు పరాక్రమాఖ్యలకు ♦ నందఱకున్ సహజంబ కాని స
జ్జనులు యవద్విధంబుగ భృ♦శంబుగ నేడ్వరు తండ్రి యెయ్యెడన్. ౧౬౦౦

ఉ. బేలవుపోలె నేడ్వఁ దగ♦వే? భువనంబులు మూఁటి నైన నీ
వాలమునన్ జయింపఁగ స♦మర్థుఁడ వౌదువు, నీకు లేవె స
త్యాలయ[1]దత్తసాయకశ♦రాసనశక్తితనుత్రముల్ పయో
దాళినినాదసన్నిభస♦హస్రఖరోద్ధరథం బమోఘ మై. ౧౬౦౧

[1] సత్యాలయ = బ్రహ్మ.

ఉ. కేవల రిక్తహస్తముల ♦ గీ టణఁగింపవె యెన్నిమార్లొ దే
వావళి దానవాళుల? సమస్తవరాయుధయుక్తి నేగి నీ
తావిభు బాహుశౌర్యమున ♦ దండితుఁ జేయుమ, యంతయేల? యి
చ్చావిధి నింద నీవు నిలు ♦ సౌఖ్యముగాఁ బగ నేన తీర్చెదన్. ౧౬౦౩

మ. మహితవ్యాలకదంబకంబు గరుటా♦మంతుండు వారించున
వ్వహి నీశత్రులఁ జించి చెండెద బల♦ప్రత్యర్థి యాశంబరున్[1]
విహగాధీశ్వరసైంధవుండు నరకున్[2] ♦ భేదించిన ట్లీను దు
స్సహశాతాశుగపంక్తి రామవిభునిన్ ♦ సంహారముం జేసెదన్. ౧౬౦౪

కం. అను త్రిశిరునివచనంబుల, విని కాలప్రేరితుండు ♦ వింశతిభుజుఁ డా
త్మను దన్ను ధరఁ బునర్జాతునిఁగాఁ దలపోసి యలరి♦దుఃఖము మానెన్. ౧౬౦౫

తే. త్రిశిరువాక్యంబులను విని ♦ తేటకొని న,రాంతకుం డతికాయ దే♦వాంతకులును
రణసముత్సుకు లగుచు గ♦ర్జలను నించి, రహమహమికాప్రకారము ♦ లతిశయిల్ల.

ఉ. అందఱు నింగ్రిద్రిమ్మరులు ♦ నందఱు మాయలఁ బండితేంద్రు ల
య్యందఱు దేవదర్పవిని♦హంతలు నందఱు జన్యదుర్జయుల్
అందఱు శౌర్యధైర్యయుతు ♦ లందఱు విశ్రుతకీర్తిశాలు ల
య్యందఱు యుద్ధకేళి నప♦రాజితు లాదశకంఠనందనుల్. ౧౬౦౭

చం. మాటికి మాటికిన్ భుజగ♦మండలిఁ దోలెడిచోట దేవతా
ఘూటము[3] నేఁచుచోట నొక♦సారియు వారలు నోడి రన్నయ
మ్మాటయు లేని వీరు లతి♦మానితబుద్ధులు యుద్ధదుర్మదుల్
సాటులు లేనిపండితులు ♦ లబ్ధవరుల్ దిననాథతేజులున్. ౧౬౦౮

## దేవాంతక నరాంతకాతికాయత్రిశిరోమత్తయుద్ధోన్మత్తుల రావణుఁడు యుద్ధమునకుఁ బనుచుట.

ఉ. వారలు గొల్వ దేవవృత♦వాసవున ట్లయి ఱేఁడు పుత్రులన్
గారవ మారఁ గ్రుచ్చి బిగి♦కౌఁగిట భూమణభూషితాంగులం
బేరిమిఁ జేసి యందఱకు ♦ మేలిమి దీవన లిచ్చి పుచ్చె నీ
తారమణప్లవంగమవి♦తానముతో సమరం బొనర్పఁగన్. ౧౬౦౯

కం. తనయులకుం బాసట యై, యొనరఁ బనిచె ననికి మత్తు ♦ యుద్ధోన్మత్తున్
మనుజాశివరుల భ్రాతల, వినయంబున వారు మ్రొక్క ♦ విబుధద్వేషిన్. ౧౬౧౦

---

[1] ప్రద్యుమ్నుఁడు చంపినవాఁడు వీఁడు కాఁడు. [2] వీఁడు కృష్ణనిహతుఁడు కాఁడు. విప్రచిత్తికి-సింహికకుఁ బుట్టినవారిలో నొకఁడు. శ్లో. వాతాపి ర్నముచిశ్చైవ, ఇల్వల స్సృమరస్తథా । అంధకో నరకశ్చైవ కాలనాభస్తథైవ చ ॥ [3] ఘూటము = సమూహము.

కం. సర్వౌషధులన్ గంధము, నార్వేరు పేర్వేఱ పూసి ♦ యంగంబుల దో
ర్గర్వాంధులు రణకాంక్షను, నిర్వక్రజవంబునన్ వ ♦ నేచరతతిపై. ౧౫౧౧

సీ. వెడలి రారాక్షసుల్ ♦ విధివశంబునఁ జేసి, దేవాంతకుండును ♦ త్రిశిరసుండు
నతికాయుఁ డోలి న ♦ రాంతకుండును మహో,దరమహాపార్శ్వులు ♦ దరము లేక
నీలజీమూతస ♦ న్నిభము నైరావత,వంశజం బైనట్టి ♦ వారణంబు
కలితసుదర్శనా ♦ ఖ్యము సమస్తాయుధో.పేతం బుపాసంగ ♦ జాతయుతము

తే. సప్తగిరి భాస్కరుం డెక్కు ♦ ననువు దోఁప
నెక్కెను మహోదరుండు పే ♦ రుక్కు మెఱయ
నైలబిలుమాడ్కి గద కేలఁ ♦ గ్రాల భీమ
కాయుఁ డైనమహాపార్శ్వ ♦ ఖలుఁడు వెలిఁగె. ౧౫౧౨

శా. ఆజానేయ[1] చయాంచితంబు వరశ ♦ స్త్రాన్విత మా తేరిపైఁ
దేజం బార సవిద్యుదుల్కము సధా ♦ త్రీభృత్ప శేషాసనం[2]
బౌజీమూతముతోడి కూట మనఁగా ♦ నాభీలకోదండుఁడై
రౌజం దత్త్రిశిరుండు వెల్వడె రణో ♦ ద్యోగానురక్తాత్ముఁడై ౧౫౧౩

తే. మూఁడుబంగరుసిగరముల్ ♦ మొనసి వెల్గు
మంచుఁగొం డన నాత్రియా ♦ మాచపుండు
మకుటముల మూఁట రాణించు ♦ మస్తకముల
వెలిఁగె స్యందనమున లోక ♦ భీకరుండు. ౧౫౧౪

సీ. సర్వధానుష్క ప్ర ♦ శస్తచారిత్రుండు, కాంచనమకుటస ♦ మంచితుండు
కిరణభాసితమేరు ♦ ధరణీధరం బనఁ, బురురుక్మభూషణ ♦ భూషితుండు
దృఢరథాంగాక్షంబు ♦ భృశసుసంయుక్తంబు, స్వనుకర్షము సుకూబ ♦ రాన్వితంబు
శరధిబాణాసన ♦ సంప్రదీప్తంబును, బ్రాసాసిపరిఘాది ♦ భాసితంబు

తే. నైనరథసత్తమంబునం ♦ దసురభర్తృ,సూనుఁ డతికాయుఁ డెక్కె తేజ ♦ సూరెలందుఁ
బలలభోజుల తుటుములు ♦ బలసి కొలువ, నమరవృతవజ్రపాణియ ♦ ట్లతిశయిల్లె.

కం. శ్వేతము కనకాభరణో,పేతం బుచ్చైశ్రవంబు ♦ పెన్నద్ది జవ
స్ఫీతం బురుకాయం బగు, వీతిపయి నరాంతకుండు ♦ వెలుఁగుచు నుండెన్. ౧౫౧౫

కం. మాసర మగుశక్తి కయిన్, భాసిల రహించు కేకి ♦ వాహనుమాడ్కిన్
మీసర మగునుల్కాభ,ప్రాసంబును దాల్చి పొల్చె ♦ రావణుసుతుఁడున్. ౧౫౧౬

తే. వజ్రచయభూషితం బైన ♦ పరిఘ మొండు,హస్తమునఁ బూనియొప్పె దే ♦ వాంతకుండు.
భూధరంబును నిరుగేలఁ ♦ బూనినట్టి, యబ్ధిశయనుని నుల్లసం ♦ బొడుభంగి. ౧౫౧౭

తే. అమరు లమరావతిని వీడి ♦ సమరమునకుఁ, జనెడిభంగిని వెడలిరి ♦ సైన్యనిచయ
సంయుతంబుగ రథదంతి ♦ సైంధవములు,నాయుధోపేతు లగుభటు ♦ లనుగమింప.

[1] ఆజానేయము = ఉత్తమజాతిగుఱ్ఱము. [2] ఇంద్రధనుస్సుతోఁ గూడినది.

చం. మకుటమణిప్రభాళు లల♦ర్చుచు దిశలన్ గ్రహరాజిఁ బోలుచున్
జకచకపర్వకాంతులను ♦ సాంద్రము లౌ వరశస్త్రముల్ దివిన్
బ్రకటితశారదాంబుదని♦భం బగునంచలపిందు సాటిగా
మకురునఁ జావొ గెల్పొ యొక♦మాటయ నిశ్చయ మంచు నెంచుచున్. ౧౬-౨౦

కం. ఒప్పుచు వైరులబలముం, దెప్పుచు నార్భటు లెసంగఁ ♦ దీవ్రాయుధముల్
ద్రిప్పుచు గర్వము కన్నులఁ, గప్పఁగ వెల్వడిరి యుద్ధ♦కాంక్ష దలిర్పన్. ౧౬-౨౧

కం. వారలక్ష్వేళారవముల, వారిభుజాస్ఫాలనముల ♦ వారిపదదభ
క్కారంబుల గడ గడ మని, ధారిణి వడఁకాడెఁ బగిలెఁ ♦ దారాపథమున్. ౧౬-౨౨

ఉ. ఈగతి నిష్క్రమించి యసు♦రేంద్రు లతంద్రత నుద్యతోరుప్ర
యోగము యుద్ధకాంక్షను మ♦హాప్లవగేంద్రబలంబుఁ గన్గొనన్
నాగరథాశ్వసంకులఘ♦ణంఘణనాదితచారుకింకిణీ
పూగము యాతుధానబల♦ముం దిలకించిరి వానరేంద్రులున్. ౧౬-౨౩

వానర రాక్షససేనల యుద్ధము.

తే. అసితజీమూతనిభము దీ♦ప్తానలార్క,తుల్యము సముద్యతాయుధ♦స్తోమ మగుచు
నైఋతర్షభవృతము సై♦న్యంబుఁ జూచి, యార్భటులు నించి రగచరు♦ లగము లెత్తి.

ఉ. ఈసున శత్రుసేనల య♦హీనసముద్ధతి సైపఁ లేక పెన్
రోసముతోడ రాక్షసులు ♦ రోదసి ప్రీలఁ బ్రతిధ్వనుల్ మదో
ద్భాసితచిత్తు లై కొలుప ♦ వానరులున్ నగశృంగహస్తు లై
త్రాసవిహీను లై తెగి ప♦రధ్వజినిం జొరఁబాఱి యుగ్రు లై ౧౬-౨౪

ఉ. కొందఱు మింట నేల మఱి♦కొందఱు కొందఱు వృక్షహస్తు లై
కొందఱు శైలపాణు లయి ♦ కో యని యార్చుచు భూమిభృచ్ఛిలా
బృందము వర్షముం గురిసి ♦ పెంపు రహింపఁగ నంటఁ దాఁకి నా
స్కందన మెంతయుం బొలిచె ♦ సర్వదిదృక్షుభయప్రదాయి యై. ౧౬-౨౫

ఉ. దానికి నోహటింపక బు♦ధప్రతిపక్షులు శాతబాణసం
తాన మవారిగాఁ గురిసి ♦ తాఁకెడివారల నిల్వరింపఁగా
వానరు లీడఁబోక జల♦వాహరవోపమగర్జు లై జయా
ధీనమనస్కు లై పరులఁ ♦ దీర్చిరి పేర్చిరి బాహుసంపదన్. ౧౬-౨౬

ఉ. నిర్భయవృత్తిఁ గేరి ధ్వజి♦నీయుగళంబు పరాక్రమించి కం
ఠార్భటు లుల్లసిల్లఁ దెగి ♦ యాహవకేళుల నోల లాడుచో
నిర్భరదోర్బలంబున వ♦నేచరులున్ నిజబాహునీరదా
విర్భవశైలశృంగకుజ♦వృష్టిని ముంచుచుఁ దెంపు పెంపునన్. ౧౬-౨౭

మ. ద్విరదస్యందనసైంధవంబులపయిం ♦ దేదీప్యమానాంగు లా
　భరణాళీలసితాంగు లై దనుజులం ♦ బై దూఁకి వే గ్రుద్దినన్
　గిరులన్ మొత్తిన గ్రుడ్లు పెల్లగిలఁగా ♦ గీఁ యంచుఁ గూపెట్టుచున్
　ధరణిం బ్రాఁకుచు నేల దొర్లుచును దై♦త్యవ్యూహముల్ నీల్గినన్.　　౧౯౨౯

ఉ. చేయఁగలట్టిరాక్షసులు ♦ శీఘ్రము ముద్గరశూలఖడ్గకా
　ర్మేయకశక్తిసంఘములఁ ♦ జిమ్ముచు నెమ్ములు వ్రీలఁ గ్రుచ్చుచున్
　గాయములందు నెత్తురులు ♦ గ్రమ్మఁగఁ గ్రుమ్ముచు గెల్పుఁ గోరి నా
　నాయససాధనంబుల వ♦నాటులపో టణఁగించి రుగ్రులై.　　౧౯౩౦

కం. ఇరువాఁగీగతి బెడిదపు,టురవడిఁ బోరంగ నోకము♦హూర్తములో నె
　త్తురు వఱదలుగాఁ బాఱఁగ, ధర కుంకుమ పఱచినట్టి♦దశ వహియించెన్. ౧౯౩౧

ఉ. వానరు లాక్రమించి పడ♦వైచి ధరిత్రిని నెన్ను సోఁక వ
　త్తానఁ బదంబు లూఁది కర♦సాధనముల్ వడి లాగి వైచినన్
　దానవులుం గరాంఘ్రులను ♦ దా రొగి నోపినయంతఁ బోరుచున్
　మానముమీఁద దృష్టి నిడి ♦ మర్కటులన్ సొలయించి రుద్ధతిన్.　　౧౯౩౨

చం. ఫలపలభోజనుల్ సమర♦పాటవముల్ పచరించి పోరుచోఁ
　జెలమునఁ జెంతఁ బోరుసుర♦శాత్రవుకాళ్ళు గ్రహించి త్రిప్పుచున్
　మలికిత మింత లేక తన♦మాఱుతుఁ గీశుఁడు తాఁపఁబోవ నా
　ఖలుఁడును నొండుక్రోఁతిఁ గడ♦కాళ్లను బట్టి విరోధి వైచెడిన్.　　౧౯౩౩

కం. వానరులు వేయుశిలలన్, దానవులును ననురు లేయు♦దారుణశరసం
　తానంబుల వానగులును, మానకవారించు చాజి ♦ మలసిరి కడిమిన్.　　౧౯౩౪

తే. కొండమనుకుల యేటులఁ ♦ గూలి పుడమిఁ,బడినసోఁకులమూఁకలు ♦ దొడిగి యున్న
　బొందళంబులపగిలిన♦సందులందు, రక్తము స్రవించె ద్రుమముల♦రసమునట్లు.

కం. సింధురముల దంతులచే, సైంధవముల హరులచేత ♦ స్యాధరపాళీ
　బాంధవరథముల రథములు, బంధురబలు లైనప్లవగ♦పతు లణఁగింపన్.　　౧౯౩౬

చం. తతబహుశాఖ మైనవను♦ధారుహసంతతిఁ బూని రాక్షస
　ప్రతతుల నొంప వానరులు ♦ రాక్షసులున్ విశిఖక్షురప్రభ
　ల్లతతులఁ జెట్టులం బ్లవగు♦లన్ వధియింప సముత్సుకాత్ము లై
　క్షితిధరచారు లుగ్రగతిఁ ♦ జెండిరి తద్వివిధాస్త్రధారులన్.　　౧౯౩౭

కం. చెండియు శాఖామృగవే,తండంబులు సమరభూమిఁ ♦ దలఁగఁగ నెటు రా
　కుండఁగ జేసిరి దివిజులు, కొండాడఁగఁ బూర్వదేవ♦కుణపంబులచేన్.[1]　　౧౯౩౮

[1] పూర్వదేవకుణపములు = రాక్షసశవములు.

### నరాంతకుఁడు కపులఁ దునుమాడుట.

సీ. అంత నరాంతకుం ♦ డంతకాకారుఁ డై, బంధురజవనాఢ్య♦గంధవాహ
బాంధవసైంధవం ♦ బారోహణము సేసి, శక్తిధరుం డయి ♦ త్ర్యాధరాట
సైన్యంబు మీనంబు ♦ జలనిధిఁ జొచ్చిన,వడువునఁ జొచ్చి పె♦న్ప్రాసమునను
శాఖామృగంబుల ♦ సప్తశతంబుల, నొక్కక్షణంబున ♦ నుక్కడంచె
తే. నెందుఁ జూచినఁ దాన యై ♦ యేపు మీఱి
యిచ్చ విహరించు నయ్యసు♦రేంద్రసుతుని
మార్గ మంతయు శోణిత♦మాంసకర్ద
మితము వానరశవచయా♦వృతము నయ్యె. ౧౬౩౯

సీ. తలపడ నెవ్వండు ♦ తలఁచెడు నంతలోఁ, దల పడు నేల న♦బ్బలిముఖునకు
వృక్షంబు శైలంబు ♦ నెత్తెడునంతలోఁ, దరుచరు మే నిలఁ ♦ బొరలు చుండు
లాఘవంబున మీఁద ♦ లంఘించునంతలో, నూర్ధ్వకాయం బొండ♦యొద్దఁ బడును
దృష్టిని దనవంకఁ ♦ ద్రిప్పెడునంతలోఁ, గాలునిదృష్టికిఁ ♦ బాలుపడును
తే. మర్కటుం డెవ్వఁడే; నిట్లు ♦ మాఱు లేక, ప్రాసకరుఁ డయి శాత్రవ♦త్రాసకరుఁడు
నగుచు శుష్కాటవిదహించు♦హవ్యవాహు,భంగిఁ గ్రోఁతులసేనల♦పటిమఁ జెఱిచె.

తే. వానకారున నాలుగు♦వంకలందు, విసరి విసరియుఁ బెనుగాలి ♦ వీచునట్లు
దివిజశాత్రవుతనయుండు ♦ తిరిగి తిరిగి, నన్నివంకలఁ గీశుల ♦ హతులఁ జేసె.

చం. నిలువఁగ లేరు, ప ర్విడఁగ ♦ నేరరు, నిట్టటు లైన భీతిఁచే
దలఁగఁగ లేరు, వానరులు ♦ తద్దురవస్థ నరాంతకుం డనిన్
నిలిచినవారలన్ నెగసి ♦ నింగిని బ్రాఁకెడువారిఁ బాఱువా
రల బలదర్ప మేర్పడ న♦రాతులఁ ద్రుంచె నొకింతమాత్రలోన్. ౧౬౪౨

కం. పిడుగులు పడియెడివడువునఁ, బడుప్రాసపుఁ బోట్ల నోరు♦వం జాలక పె
ల్లడలున మలద్రిమ్మరు ల,య్యెడ నాక్రోశించి రొక్క♦యెలుఁగున భీతిన్. ౧౬౪౩

### అంగద నరాంతకుల యుద్ధము.

సీ. దంభోళిధారలఁ ♦ గుంభినీధరములు, వ్రీలు నవ్వడువున ♦ వృక్షచరులు
గూలుట గనుఁగొని ♦ కుంభకర్ణునిచేతి,బళువు వీక్షించిన♦ప్లవగపతులు
సుగ్రీవునొద్దన ♦ సుఖముగా నుండిరి, భాసుజుండును హరి♦సేన చెదరి
పాఱుట సోఁకుఁడు ♦ మీఱుట గనుఁగొని, జంభవైరి సమాన♦శౌర్య ధీరు
తే. నంగదకుమారుఁ గనుఁగొని ♦ హయముమీఁద
నడ్డు లే కరుదెంచుద♦శాస్యతనయుఁ

జూపి యాతఁడు మనసేన ♦ చూఱ పుచ్చెఁ
దనయ! యాతని వధియింపు ♦ దర్ప మెసఁగ. ౧౬౪౪

ఉ. రా జిటు లాడఁగా నతఁడు ♦ ఱ్ఱబ్బులు ప్రీల్చుచుఁ దోఁచుపద్మినీ
రాజువిధంబునం బ్లవగ ♦ రాజులనుండి నిజాంగదద్యుతుల్
రాజిల ధాతుమండితధ ♦ రాధరమో యన నేగుదెంచి యా
రాజకుమారుపైఁ జనె ని ♦ రాయుధుఁ డై నఖమాత్రశస్త్రుఁ డై. ౧౬౪౫

ఉ. వానికి ని ట్లనుఁ దనుజ ♦ వర్యుఁడ! ప్రాకృతకీశపాళులన్
మానక తున్మినంత బల ♦ మా యశమా ఫలమా యెదీ భవ
న్మానిత మైనప్రాసమును ♦ నాదునురంబున వైవుమీ యనన్
దానవుఁ డాతనిం గని ని ♦ తాంతరుషాపరిదగ్ధచిత్తుఁ డై. ౧౬౪౬

కం. రదములఁ బెదవులు గొఱుకుచు, మదమున రోఁజుచును ద్రాఁచు ♦ మాడ్కిని దారా
మదవర్ధనువక్షంబున, నదటున నడరించెఁ బ్రాస ♦ మతిదృఢశక్తిన్. ౧౬౪౭

చం. అదియును వాలిపుత్రకులి ♦ శాభమహోరముఁ దాఁకి తున్క లై
చెదరి ధరం దొరంగెఁ, గపి ♦ సింహము దానిని గాంచి మీఁదికిన్
గొదుకక దూఁకి గుఱ్ఱమును ♦ గ్రుద్దిన నద్ది నిమగ్నతాలు వై
చిదికినగ్రుడ్లతోఁ దెగిన ♦ జిహ్వకతోడ విశీర్ణమూర్ధ మై. ౧౬౪౮

కం. కొండవలెఁ గూలి తత్తడి, గండడఁగినఁ జూచి క్రోధ ♦ కలుషితమతి నా
ఖండలుమనుమనితల సోఁ, కుండును బిడికింట నొక్క ♦ గ్రుద్దుం గ్రుద్దెన్. ౧౬౪౯

ఉ. ముష్టివిభిన్నమూర్ధుఁడుగ ♦ ముష్కర మై బహులోష్ణరక్తముల్
దృష్టులు పాఱకుండ దొర ♦ లెం, బెనుమూర్ఛ మునింగి కీశుఁడున్
గష్టముమీఁదఁ దెల్వి గొని ♦ కార్కొనుకిన్కను మండుచుం బరో
త్కృష్టపరాక్రమంబునకు ♦ డెందము విస్మిత మాచు నుండఁగన్. ౧౬౫౦

ఉ. చివ్వున లేచి భూమిధర ♦ శృంగనిభం బగుముష్టిఁ బూని తా
నవ్విబుధారిఱొమ్ము నలి ♦ యం బొడిచెన్ రుధిరంబు కండలున్
గ్రొవ్వును మేన నిండె ధరఁ ♦ గూలె నతండును దూలి దవ్వగా
నవ్విబుధేంద్రువజ్రహత ♦ మై విధురం బగుశైలధరం బనన్. ౧౬౫౧

కం. వానరపతితనయునిచే, దానవపతితనయుఁ డిట్లు ♦ తనువు దొఱంగన్
వానరులరవము దివి ధిరి, జానీకరవంబు బెరసి ♦ నవఘుళ మయ్యెన్. ౧౬౫౨

కం. దుష్కర మగుతత్కృతిఁ గని, పుష్కరజేక్షణుఁడు రామ ♦ భూవరుఁడును శో
చిష్కేశతేజు నంగదుఁ, బుష్కలహర్షమున మెచ్చి ♦ పొరి మనిచెన్. ౧౬౫౩

→ అంగదుఁడు దేవాంతకమహోదరత్రిశిరులతోఁ బోరుట. ←

సీ. త్రిశిరోమహోదరుల్ ♦ దేవాంతకుండును, వగచి నరాంతకు♦పాటు గాంచి
యభ్రసంకాశగ♦జాధిరూఢుం డయి, యుగ్రవుఁగినుక మ♦హోదరుండు
పరిఘహస్తుం డయి ♦ గురురథస్థితుఁ డయి, దేవాంతకుండును ♦ త్రిశిరుఁ డొక్క
మొగి వాలితనయునిఁ ♦ దెగి తాఁకి నొప్పింప, నతఁడొకద్రుమము దే♦వాంతకాఖ్యు
తే. మీఁద వైవ దాని ♦ మేలిశరంబుల, విశసనం బొనర్చెఁ ♦ ద్రిశిరుఁ డలుక
వెండి వృక్షశైల♦వృష్టిని గురియింప, వానిఁ ద్రుంచె నతఁ డ♦వార్యబలుఁడు.
ఉ. త్రుంచియుఁ దృప్తిలేక రణ♦దోహలియై త్రిశిరుండు కీశుని
న్మించుచు ముల్కులం దఱుమ ♦ నూల్కొని యల్లమహోదరుండు క్రో
ధాంచితవృత్తిఁ దోమరను♦తాడితుఁ జేసెను, నున్నవాఁడు[1] మ
ర్దించి దృఢంబుగా గుదియఁ ♦ దెప్పున దవ్వుగ దాఁటి పోయినన్. ౧౬౫౫
ఉ. ముగ్గురు తన్ను నీగతిని ♦ ముట్టిన వాలితనూజుఁ డేమియున్
బెగ్గిల కాత్త నొవ్వ కతి♦వేగయుతుండు మహాజవాఢ్యుఁ డై
యగ్గజముం దలంబున శి♦రోగ్రమునం బ్రహరింప నేలపై
మ్రొగ్గుచు ఘీంకరించెఁ గను♦గ్రుడ్డులు రాలఁగ మిట్టిపాటునన్. ౧౬౫౬
ఉ. దంతివిషాణముం బెఱికి ♦ దానన వాలిసుతుండు మోఁదె దే
వాంతకు, వాఁడు దద్ధతిని ♦ నాశుగఘూతకుజంబుమాడ్కి నా
ద్యంతము మే న్వణంక బహు♦శాస్త్రము గ్రక్కుచు నేల వ్రాలి తా
నంతయు గాసిఁ దేఱి ప్లవ♦గేంద్రసుతుం బరిఘాన వ్రేసినన్. ౧౬౫౭
కం. ఏటు వడి మోఁకటిల్లియుఁ, బాటవమున లేచు నతని♦ఫాలమునందున్
గాటముగ నాటఁగ నిరా,ఘాటతఁ ద్రిశిరుండు వైచెఁ ♦ గాండచయంబున్. ౧౬౫౮

→ హనుమంతునిచే దేవాంతకుఁడు నీలునిచే మహోదరుఁడు చచ్చుట. ←

సీ. ముప్పురు రాక్షస♦ముఖ్యు లిట్లు కుమారు, నంగదుఁ దాఁకిన♦యను వెఱింగి
హనుమంతుఁడును నీలుఁ ♦ డచటికి నరుదెంచి, రందు నీలుండు శై♦లాగ్రమొండు
త్రిశిరునిపై వైవ ♦ దివ్యశరంబుల, భేదించె నతఁడు దృ♦గ్భీకరముగ
హర్షించి రేఁగి దే♦వాంతకుండును గేలఁ, బరిఘంబుఁ గైకొని ♦ పావమాని
ఆ. పైపడంగ రాఁగఁ ♦ బవికల్పముష్టిని, బొడిచెఁ గీశవరుఁడు ♦ నడిశిరమున
దానఁ గూఁత లిడుచు ♦ దంతముల్ వెలి రాఁగ, జిహ్వ వ్రేల మెదడు♦చెదరఁ జచ్చె.
సీ. దేవాంతకుం డిటు ♦ దేవలోకముఁ జేరఁ, ద్రిశిరుండు నీలుపై ♦ నిశితబాణ
వర్షంబుఁ గురియింప ♦ వడి మహోదరుఁడును, నుగ్రశరంబుల ♦ నురముఁ గ్రుచ్చె
వారలశరవృష్టి ♦ వదలఁగఁ సంధులు, సోలి ససంజ్ఞుఁడై ♦ లీల లేచి
కుజషండమండిత♦కుధరంబుఁ గొని మహో,దరు వైవ నాతండు ♦ ధరణిఁ గూలె.

[1] ఉన్నవాఁడు = తక్కినవాఁడు.

ఆ. వజ్రనిహత మైన♦వసుమతీధర మనఁ, బిన్నతండ్రి యిట్లు ♦ ప్రేత మైన
నంజనాతనూజు♦నిం జటులాస్త్రాళిఁ, గప్పెఁ ద్రిశిరుఁ డధిక♦గర్వ మెసఁగ. ౧౬౬౦

## హనుమంతునిచేఁ ద్రిశిరుండు చచ్చుట.

చం. గిరిశిఖరంబు నొండు గొని ♦ కేసరిసూనుఁడు వాని మైవ నా
శిరుఁడు సుతీక్ష్ణబాణముల ♦ సత్వరుఁడై పొడిచేసె దాని, నీ
కరణిని వ్యర్థ మైన గిరిఁ ♦ గాంచి ధరారుహవృష్టి కొండద్రి
మ్మరియొకిమీఁదు ముంచె నది ♦ మధ్యమునన్ హరియించె నాతఁడున్. ౧౬౬౧

సీ. చిద్రుపలుగాఁ జేసి ♦ సింహనాద మొనర్ప, నంజనాసంభవుం ♦ డాగ్రహమునఁ
దెప్పున లంఘించి ♦ దితిజారిహయములఁ, గేసరి కరి వ్రచ్చు♦క్రీడ దోఁప
నఖములఁ జీల్చిన ♦ నక్తంచరుండును, గాలరాత్రి నిగుడ్చు♦కాలుమాడ్కి
శక్తిని మారుత♦సంభవు వైచిన, నతఁడు దానిని బట్టి ♦ హతముఁ జేసె

ఆ. ఘోరశక్తి నిట్లు ♦ గూల్చిన హనుమని, మే లటంచుఁ గపులు ♦ మెచ్చి పొగడఁ
ద్రిశిరుఁ డధికరోష♦దీప్తుఁ డైఁ ఖడ్గ మం,కించి వైచెఁ దాఁకఁ♦గీశునురము.

కం. కశ నడచిన సింహం బన, దశరథతనయాగ్రగణ్యు♦దాసుం డఱచేఁ
ద్రిశిరునురంబునఁ దాఁప స్వ,వశత చెడి విసంజ్ఞుఁ డగుచు♦వ్రాలె ధరిత్రిన్.

ఉ. వ్రాలెడువానిఖడ్గమును ♦ వాయుతనూజుఁడు గుంజి యార్చె దై
త్యాళి భయాతురత్వమునఁ ♦ నారట మొందఁగఁ దన్నినాదముం
దాళక మిట్టిపాటున వ♦నాటునురంబునఁ దాఁప ముష్టిచేఁ
గేలను దత్కిరీటమును ♦ గేలియపోలె గ్రహించి క్రుద్ధుఁ డై. ౧౬౬౪

చం. గురుమకుటాంచితంబును స♦కుండల మైనశిరస్త్రయంబు భా
స్వరకరవాలధారను బ్ర♦భంజనపుత్రుఁడు పాకదైత్యసం
హరణుఁడు విశ్వరూపుఁ దును♦మాడినభంగిని ద్రుంచి వైచినన్
ధరణిఁ దొరంగె నవ్వి జ్వల♦నప్రతిమాయతనేత్ర పంక్తితోన్. ౧౬౬౫

తే. సుకృతఫలసంక్షయంబున♦సూర్యమార్గ,మునను ధర వ్రాలువానిని♦బోలి యసుర
నేల వ్రాలిన శాఖామృ♦గాళులెల్లఁ, బగఱు పరువెత్త నార్భటుల్ ♦ పరఁగఁ జేసె.

## ఋషభునిచే మత్తుండు చచ్చుట.

సీ. దేవాంతకుండును ♦ ద్రిశిరసుండును నరాం,తక మహోదరులు యు♦ద్ధప్రచండు
లరులచే హతు లైన ♦ యధికాగ్రహంబున, మత్తుండు శాత్రవ♦మాంసరక్త
ఫేనిలంబును భృశ♦బీభత్సమును హేమ,పట్టాన్వితము మహా♦పద్మసార్వ
భౌమవాసవగజ♦భయదంబు రక్తమా,ల్యాలంకృతంబు దీ♦ప్తాగ్ర మైన

ఆ. గద ధరించి కల్ప♦కాలసప్తార్చినాఁ, గపుల నెగచు చుండఁ ♦ గనలి ఋషభుఁ
డెగిరి ముందు నిలువ ♦ నిద్ధతేజుఁడు నిశా,చారుఁ డతని మొత్తె ♦ భూరిగదను.

చం. బలితపుఁదద్గదాహతిని ♦ వానరనాథుఁడు భిన్నవక్షుఁ డై
దెలివి దొఱంగి నేలపయిఁ ♦ ద్రెళ్లి స్రవింపఁగ నోట నెత్తురుల్
బలియుఁడు మీఁద దూఁకి ప్రస♦భంబునఁ జేతిగదన్ హరించి య
చ్చలమునఁ ద్రిప్పి త్రిప్పి వడి ♦ శాత్రవుమూర్ధముమీఁదఁ గొట్టినన్. ౧౬౬౮

కం. తనగదచేఁ దా హతుఁ డై, ఘనశైలము వజ్రహతిని ♦ గండడఁగు క్రియన్
దనుజుఁడు విశీర్ణరదలో,చనుఁ డై పీతాసు వగుచుఁ ♦ జనె యమపురికిన్. ౧౬౬౯

కం. ఆతండు పడినతోడనె, చేతోగతిఁ బల్లటిల్లి ♦ చెల్లాచెదరై
భీతిగొని యానిశాటుల,వ్రాతంబు పలాయనాతి♦పటుతం జూపెన్. ౧౬౭౦

అతికాయుఁడు కపులఁ బాఱఁదోలుట.

సీ. తనతోడఁబుట్టులుఁ ♦ బినతండ్రులును దెగ, బ్రహ్మదత్తవరుండు ♦ పర్వతాభ
కాయుండు దేవతా♦కాండభయావాది, యతికాయుఁ డర్క స♦హస్రనిభము
రథ మధిరోహించి ♦ రభసంబునను జాప,విస్ఫార ఘోష్పఁగఁ ♦ బేరువాడి
గర్జల వానరో♦త్కర మదలించుచుఁ, దఱుమఁ జొచ్చినఁ జూచి ♦ తరుచరాళి
తే. యసురవీరుని దేహమా♦హాత్మ్య మట్టి, చూచి మఱి కుంభకర్ణుఁడే ♦ లేచి వచ్చె
నో త్రివిక్రముఁడే యగు♦నో యటంచు, మూఁకలుగఁ దిరెఁ బోరెడి♦వీఁక దఱిఁగి.

చం. పర మగుసాధ్వసంబునను ♦ బ్రజ్ఞ చెడం జని లక్ష్మణాగ్రజున్
శరణముఁ జొచ్చినన్ నృపతి♦చంద్రముఁ డారథికున్ ధరోపమున్
గురుతరచాపహస్తుఁ గని ♦ కూరినవిస్మయపాటుతో వనే
చరులభయంబు దీర్చి హిత♦సత్తము నిట్లను నవ్విభీషణున్. ౧౬౭౨

శ్రీరాముఁడు విభీషణు నతికాయుఁ గూర్చి యడుగుట.

సీ. వీఁడెవ్వఁ డయ్య పృ♦థ్వీధరకాయుండు, హరిలోచనుండు చా♦పాయుధుండు
హయసహస్రక మైన♦స్యందనంబునఁ బ్రాస,శూలతోమరసురో♦చులు రహింప
భూతవృతుం డైన♦భూతేశ్వరునిఁ బోలి, శంపాసమంచిత♦జలద మనఁగఁ
గాలజిహ్వాభ మై ♦ క్రాలు శక్తి ధరించి, నాఁడు కాంచన పృష్ఠ♦నవ్యచాప
ఆ. సమితి శక్రచాప♦సమ మయి తేరికి, శోభ గూర్చు చున్న ♦ సొబగు గంటె
రాహువెక్కియంబు ♦ రవిరశ్మినిభశర,పంక్తి దెసలకెల్లఁ ♦ బ్రభలు గూర్చె. ౧౬౭౩

సీ. చాపంబు త్రిణతంబు ♦ జలదనిర్హ్రాదంబు, కాంచనపృష్ఠంబు ♦ ప్రాంచితంబు
రథము సధ్వజము సా♦రథిచతుష్కము సప,తాకానుకర్షంబు ♦ తతరవంబు

పదియు నెన్నిది యిరు♦వది తూణులును భీమ,కార్ముకంబులు మఱి ♦ కనకవర్ణ
గుణములు శోభిల్లఁ ♦ గొమరుగ నిరువంక, నాయుతి పదిమూర ♦ లగుచు నాల్గు

ఆ. మూర లైనపిడులు ♦ మొనయు ఖడ్గంబులు, గ్రాలె ధీరవరుఁడు ♦ రక్తపుష్ప
గళుఁడు కాలముఖుఁడు ♦ కాలుండు మేఘస్థ,దినకరాభుఁ డెవఁడు ♦ ధీరవర్య!

తే. హాటకాంగదసద్ధభు♦జాళి నితఁడు, తుంగశృంగస్థహిమవంతు♦దోయివాఁడు
కుండలంబులచే నొప్పు ♦ కొమరుమోము, రాజిలెఁ బునర్వసువుసడి♦రాజువోలె.

కం. ప్లవగులు వీనిం గని భీ,వివశత గొని వఱచి రిట్టి♦వీరుం డెవఁడో
జవము బలం బేమాత్రమొ, వివరింపు మ టన్న నావి♦భీషణుఁ డనియెన్. ౧౬-౨౧

సీ. రాజేంద్ర యీతఁడు ♦ రావణాసురునకు, ధాన్యమాలినికిని ♦ దనయుఁ డయ్యు
రావణప్రతిముండు ♦ రణమున శూరుండు, వృద్ధసేవియు నస్త్ర♦విత్తముండు
దారుణకృతి మహో♦త్సాహుండు శ్రుతిధరుం, డశ్వపృష్ఠమున శ♦తాంగమందు
నేనుఁగుపై నుండి ♦ యేపున వింటను, ఖడ్గంబులను బోరఁ ♦ గడువలంతి

తే. నయమునందును సామదా♦నంబులందు
భేదమున మంత్రములను బ్ర♦వీణుఁ డితఁడు
వీనిభుజబలమున లంక ♦ విగతభీతి
నతిశయిల్లెడి నతికాయుఁ ♦ డండ్రు పేర. ౧౬-౨౨

సీ. తపమున బ్రహ్మకుఁ ♦ దనివిఁ గూర్చినవాఁడు, క్రూరాస్త్రములను గై♦కొనినవాఁడు
నమరాదిచే నవ♦ధ్యత్వ మందినవాఁడు, నీదివ్యకవచంబు ♦ నీశతాంగ
మజునిచేఁ గొన్నాఁడు ♦ యక్షదానవనిర్జ,రులఁ దోలి యనురులఁ ♦ బ్రోచినాఁడు
పటుశరంబులఁ బాశి♦పాశంబుఁ బర్వత,భేదివజ్రంబు స్తం♦భించినాఁడు

తే. రాక్షసులకెల్ల మేటిధీ♦రతుఁడు బలియుఁ, బురుషపుంగవ వానిచే ♦ దురములోన
భూజచరసేన హతమయి ♦ పోకమున్న,యతని వధియింప సమకట్టు ♦ మ నెడు లోన.

శా. జ్యాఘోషం బతిభీషణంబుగ ధరా♦చక్రంబు కంపింప ని
ర్వ్యాఘాతాద్భుతవేగుఁడై ప్లవగసై♦న్యాబ్ధిఁ రణక్రీడనో
ల్లాఘుత్వంబునఁ జొచ్చి మందరము లీ♦లన్ హాల్లకల్లోల మై
మోఘప్రాణము నై కలంగఁ, దిరుగం ♦ బూనెన్ సురారాతియున్. ౧౬-౨౯

చం. వడిఁ గుముదుండు నీలశర♦భద్వివిదుల్ సహమైందు లొచుఁ బె
న్పిడుగులువోలె జాల నవ♦నీజములన్ గిరిశృంగకోటి దం
దడిఁ బయి వైవ బాణముల ♦ దానవనాథతనూజుఁ డన్నిటిన్
బొడి పొడి చేసి తత్కపుల ♦ భూరిశరంబులఁ గ్రుచ్చి నొంచినన్. ౧౬-౩౦

ఉ. ఓరువరానినొవ్వడర • నొం డెది సేయఁగలేక విచ్చి య
వ్వీరులు పాసి పోవఁ గని • వింశతిబాహుసుతుండు వారిఁ గం
ఠీరవ మోలి జింకల వ•నిన్ బెదరించెడిమాడ్కిఁ దోలుచున్
జేరఁగ వచ్చి భానుకుల•శేఖరు నిట్లను గర్వ మేర్పడన్. ౧౬౧

→ అతికాయుఁడు లక్ష్మణుఁ దూలనాడుట. ←

ఉ. వచ్చినవాఁడఁ జాపశర•పాణిని నై, బలవిక్రమంబులన్
హెచ్చినవాఁడఁ, బ్రాకృతుల • నేయనివాఁడ, రథస్థితుండ, నీ
యుచ్చటిసేనలోన నని • నీయ సమర్థుఁడు గల్గె నేని తా
నచ్చును గాక ముంగలికి • వైళ మ టన్న సుమిత్రపుత్రుఁడున్ ౧౬౨

ఉ. చంగున దాఁటి శాతశర•చాపములం గొని మున్ను నిల్చి మా
తంగకరాభహస్తమున • ధారిణిశైలదిశాబ్ధిదేవతా
ధ్వాంగణపూరణంబుగను • జ్యారవమున్ ఘటియింప భీతమై
పొం గణఁగన్ నిజానుచర•పూగము రావణనందనుండునున్ ౧౬౩

ఉ. దానికి విస్మయంబుపడి • దర్పమదాంధుఁడు గాన నిట్లనున్
మానవ! బాలకుండవు సు•మా రణమం దవిచక్షణుండవున్
మానుము పొమ్ము కాలనిభు • నన్నుబె తాఁకెడివాఁడ వీవు నుం
తేని పరాత్మశౌర్యవిధ • మెంచ వదెంతటిబాలిశుండవో. ౧౬౪

ఉ. మామకహస్తముక్తశిత•మార్గణపంక్తివడిన్ సహింపఁగా
హైమమహీధరంబు గగ•నావను లైనను నేర వన్న నీ
వేమిటి లెక్క, లేపుతలఁ • వేటికి నిద్రితకాలవహ్నిఁ, బో
పో మహి విల్లువైచి చెడి•పోవకు చావకు మద్గతుండవై. ౧౬౫

ఉ. పో నని కండకావరము•పొంగున నిల్చెద వేని యిప్పుడే
ప్రాణములం ద్యజించి యమ•పట్టనముం జనువాఁడ వోనరా
యీనిశితాశుగోత్కరము • హేమపరిష్కృత మాత్రిశూలముం
బోనిది ధ్వస్తశాత్రవస•మూహమదంబును లెస్స చూడుమీ. ౧౬౬

కం. ఆశీవిషములఁ బోలు మ,దాశుగములు నీదురక్త • మాస్వాదించున్
దాశరథి! క్రుద్ధకేసరి, యాశమెయిన్ నాగరాజు•నస్రముఁబోలెన్. ౧౬౭

→ లక్ష్మణుఁ డతికాయు ధిక్కరించి పలుకుట. ←

మ. అని నారాచము వింటఁ గూర్చఁగ సగ•ర్వాత్యుగ్రరోషోక్తులన్
విని వహ్నిప్రసవేక్షణుం డయి మహా•వీర్యుండు సౌమిత్రి యి

ట్లను వాఙ్మాత్రమునం బ్రధానుఁడవు దైత్యా! కావు, స్వశ్లాఘ స
జ్జనుఁ డన్ ఖ్యాతియు రా దిఁకేటికి వృథా♦జల్పంబు లీ వాడఁగన్. ౧౬౮౮

కం. శరములు శరాసనంబును, గరములఁ గొని నిల్చినాఁడఁ ♦ గదనము సేయన్
బిగుదంబు లాడ నేటికి!, దురితాత్మా! చూపు నీదు♦దోర్బలమెల్లన్. ౧౬౮౯

కం. ఊరక పొగడు కొనంగాఁ, గారియమే? చూపు నీకుఁ ♦ గలశక్తిఁ గ్రియన్
బౌరుషయుక్తుం డగున, ప్పూరుషుఁడే శూరుఁ డనఁగ ♦ భువి నెన్నఁబడున్.

ఉ. పోఁడిమి సర్వశస్త్రములు ♦ పూనినవాఁడవు, తేరిమీఁద ను
న్నాఁడవు, కేలఁ జాపము ఘ♦నంబుగఁ బట్టినవాఁడ, వింక నీ
వేఁడిమియుం బరాక్రమము ♦ విశ్రుతభంగిని జూపరాదె క్రొ
వ్వాఁడిలకోర్ల[1] నేని మఱి ♦ వాలినయస్త్రకులాళి నేనియున్. ౧౬౯౧

కం. భండనమున నీకుం గల, గండెల్ల నెఱింగి పిదప ♦ త్వాఁ గూల్చెద నీ
కాండంబుల నీశిరముం, బండినపెనుఁదాటిపండుఁ ♦ బవనుఁడువోలెన్. ౧౬౯౨

కం. కనియెదవు గాక మామక, సునిశితశరపాళి స్వర్ణ ♦ సుందరము భవ
త్తనుగతరుధిరము శరశ, ల్యనిచయకృతమార్గములను ♦ నాస్వాదింపన్. ౧౬౯౩

ఉ. బాలుఁడ నంచు న న్నసుర♦వర్యుఁడ! హేళన మేల సేయ? నే
బాలుఁడనో జరుండనో ధ్రు♦వం బిది నమ్ముము నీకు మృత్యువన్
బాలుఁడు గాదె వామనుఁడు ♦ బాలిశ! మూఁడుజగంబు లోలిఁ దా
హేళిఁ ద్రివిక్రమక్రమత ♦ నాఁచి కొనండె జగం బెఱుంగఁగన్. ౧౬౯౪

↞ లక్ష్మణాతికాయుల యుద్ధము. ↠

సీ. అని పల్క నతికాయుఁ ♦ డతిరోషవశుఁ డయి, తీవ్రాశుగమును సం♦ధించె వింట
వారలయుద్ధంబుఁ ♦ బరికింప మింటను, ఖచరదేవర్షులు ♦ గములు గట్టి
రసురుండు లక్ష్మణు ♦ నాశీవిషోపమాం, బకమునఁ దివి మ్రింగు♦భంగి వైచె
సౌమిత్రియును నర్ధ♦చంద్రశరంబుల, ఖండించి వైచెఁ ద♦త్కాండవరముఁ
ఆ. గృత్తభోగఫణిస♦దృక్షబాణముఁ గాంచి, పంచవిశిఖములను ♦ బరఁగఁ జేసె
నసురభర్తతనయుఁ ♦ డవియెల్ల రామానుజుండు చేరకుండఁ ♦ జెండి వైచె.

ఉ. అంతటఁ బోక హేతిసహి♦తానలతుల్యవృషత్కమొండు క
ర్ణాంతము సోఁక లాగి యమ♦రాహితుఁ డాలముఁ గాఁడ వైవఁగా
నెంతయు నెత్తుటం దడిసి ♦ యేర్పడి యాశర మొప్పె భూరిశై
లాంతగతోరగం బనఁగ ♦ నాతనిమోమునఁ జిత్రభంగిగన్. ౧౬౯౬

కం. ఆశరము తాఁకుపెట్టున, గాళరముఖుఁ డయ్యెండు సైఁప ♦ కాకంపించెన్
శ్రీశంకరశరహతకీ, నాశపురద్వారమనఁగ ♦ నాకులు పొంగన్. ౧౬౯౭

---

[1] లకోర్లు = బాణములు.

సీ. ఆయేటు పడి యసు♦రాధిపపుత్త్రుండు, చింతించి త న్నాశ్వ♦సించికొనుచుఁ
గర్తవ్యము విమర్శ ♦ గావించి లక్ష్మణుఁ, గాంచి యిట్లాడు న♦క్కడిమికాఁడు
మేలు నాయరి వైన ♦ మెచ్చితి నీబాణ,శక్తి లాఘవము రా♦జన్యతనయ
యని శిరంబును వంచి ♦ హస్తంబులను గ్రింద, మోపి రథస్థుఁ డై ♦ యేపు మెఱసి
తే. యిచ్చకొలఁదిని సమరోర్వి ♦ హెచ్చి తిరుగు
చొకటి మూఁ డైదు నేడును ♦ నుగ్రశరము
లెనఁగి గైకొని సంధించి ♦ యీడ్చి వైచెఁ
బుంఖహాటకకాంతులు ♦ పుడమి నిండ. ౧౬౯౮

ఉ. ఒక్కటి దక్క కుండ నృకు♦లోత్తముఁ డన్నిటిఁ జెండి వైచెఁ దాఁ
జెక్కుశరంబు లొక్క మొగిఁ ♦ జే రలుక న్నిగిడించి యేమియుఁ
ద్రుక్కక సంభ్రమంపడక ♦ సూరకులాగ్రణి యిట్లు మీఱినన్
గ్రక్కుచు నిప్పు లయ్యసుర ♦ కాండ మొకొండు స్తనాంతరంబునన్. ౧౬౯౯

తే. కీలు గొల్పిన నెత్తురుల్ ♦ జాలువాఱ, మత్తదంతావళవిముక్త♦మదజల మన
లక్ష్మణవిభుండు తద్బాధ ♦ లక్ష్య మిడక, శాతనారాచ మొక్కటి ♦ సంగ్రహించి.

సీ. పావకమంత్రానఁ ♦ బ్రజ్వలింపఁగఁ జేసి, గుణమునఁ గూర్పఁగఁ ♦ గుటిలచరితుఁ
డధికవేగమున సౌ♦రాస్త్రము సంధించె, నిరువురుఁ దెగఁదీసి ♦ యేయుటయును
నవి దాఁకి యొండొంటి ♦ నంబరంబునఁ గ్రుద్ధ,భూరిభోగులభంగిఁ ♦ బోరి పోరి
యొక్కటి నొక్కటి ♦ నురువు లే కుండఁగ, భస్మీకృతంబు లై ♦ పడియె నేలఁ
ఆ. దనమహాస్త్ర మిట్లు ♦ దగ్ధమై పోవ నై,షీక మెత్తి యసుర ♦ చిమ్ముటయును
నంబుజాప్తవంశ్యుఁ ♦ డైంద్రబాణంబున, దాని హతముఁ జేసెఁ ♦ దర్ప మెసఁగ.

కం. ఐషీకం బీగతి నిశ్శేషంబుగఁ జెడిన దనుజ♦శేఖరుఁడు మహా
రోషంబున యామ్యాస్త్రము, భీషణముగ వైచె నసుర♦భీకరుమీఁదన్. ౧౭౦౨

కం. ఆయామ్యశరవిజృంభణ, వాయుశరంబున సుమిత్త్ర♦పట్టియుఁ దఱుఁగన్
జేయుచు శరవర్షం బతి,కాయునిపైఁ గురిసెఁ దెఱపి ♦ గానకయుండన్. ౧౭౦౩

ఉ. ఆమహితాశుగోత్కరము ♦ లాతనిఁ దాఁకుచు మిట్టిపాటునన్
భూమిని వ్యర్థ మై తొరఁగ ♦ భూవరపుత్త్రకుఁ డుగ్రమూర్తి యై
యేమియుఁ దీవ్రతన్ విడక ♦ యేసె మహాంబకముల్ సహస్రముల్
భూమి దొరంగె నవ్వియును ♦ బొల్పఱి త్రుంప కవధ్యవర్మునిన్. ౧౭౦౪

## లక్ష్మణుచే అతికాయుండు చచ్చుట.

సీ. బాణ మొక్కం డైనఁ ♦ బలలాశు బాధింపఁ జాలక యున్నల♦క్ష్మణునిఁ జేరి
పవనసుఁ డి ట్లను వీఁ డ♦వధ్యతనుత్రాణుఁ, డజునివరం బది ♦ యణఁపరాదు

బ్రహ్మాస్త్రమున వీఁడు ♦ వధ్యుండు తక్కిన, యేవిశిఖంబునఁ ♦ జావఁ డాజి
వరలబ్ధకవచుండు ♦ పరమాస్త్రసంవేది, బలియుఁ డీతం డిట్టు ♦ లలఁతిఁ బోఁడ
ఆ. టన్న లక్ష్మణుండు ♦ నసమానవీర్యుండు, శ్వసనుమాటఁబట్టి ♦ చాపమునను
బ్రహ్మశరముఁ గూర్చి ♦ భాస్కరచంద్రగ్రహార్వి దిఙ్నభంబు ♦ లుదిల గొనియె.
కం. యమకింకరసన్నిభ మై, యమలసుపుంఖంబు నైన♦యాశరము నమో
ఘమహావేగము వైచెను, విమతునిపై నదరు లుమియు ♦ వీరుం డలుకన్. ౧౭౦౬
సీ. దానివచ్చుటఁ గాంచి ♦ దారుణశరములఁ, బెక్కిట నతికాయుఁ ♦ డుక్కు మిగిలి
పఱఁగింప వానిని ♦ భస్మీకరించుచుఁ, దనుఁజేర శక్తిగ♦దాకుఠార
శూలహులశాదుల ♦ శూరుండు తాఁచిన, నుడుగక యవ్వాని♦యుదుటు మాన్పి
మణికిరీటప్రభా♦మండితశిరమును, సశిరస్త్రముగఁ గూల్చె ♦ క్ష్మాతలమున
ఆ. హిమధరాధరంబు ♦ శృంగంబువడువున, నతనిశిరము ధరణిఁ ♦ బతిత మైన
నిహతశేషులైన♦నిశిచరుల్ దీను లై, యేడ్పుమోము లొప్ప ♦ నెల్లవారు. ౧౭౦౭
కం. అమితప్రహారజనితశ్రము లై వాపోవుచుం బు♦రంబుముఖముగా
సమరాభిలాష వీడి భయమునం బరువిడిరి క్రోఁతు ♦ లటమెడి ననుచున్.
కం. వికచాననులగుచుం ద్వర, సకలవనేచరులు వచ్చి ♦ సౌమిత్రిని హ
ర్షకలితహృదయంబులతోఁ, బ్రకటగతిం బూజ చేసి ♦ ప్రణుతించి రటన్. ౧౭౦౮

అతికాయాదులమృతి విని రావణుఁడు దుఃఖించుట.

కం. అహితాంతకుఁ డగులక్ష్మణు, మహితశరంబులను బేరు ♦ మాయఁగ సంయ
న్మహి నతికాయునిమృతి విని, బహుశవ్యథ రావణుండు ♦ పనవుచు ననియెన్.
సీ. ధానుష్కరత్నంబు ♦ దారుణకోపుండు, ధూమ్రాక్షుఁ డక్కటా ♦ తూలి పోయె
నిస్తులదోర్బల♦శస్త్రప్రహస్తుండు, కాలునివాకడి♦కండయయ్యె
సముదీర్ణభుజపరా♦క్రమసువిదీర్ణది,గ్గజకుంభుఁ డల కుంభ♦కర్ణుఁ డేఁడి?
హతుఁ డయ్యె నే దేవ♦తాసురసైన్యావి,కంపనుం డైనయ♦కంపనుండు
తే. వీరలెల్ల రసామాన్య♦వీర్యయుతులు, దోర్బలాఢ్యులు నాహవ♦దోహలులును
శత్రుసైన్యప్రధర్షణుల్ ♦ సాహసికులు, కటకటాకూలిరే రాము♦కాండములను.
ఉ. వారును వీ రటంచు నుడు♦వం బని యేటికి నెల్లవారలున్
ధీరులు భూరికాయులు సు♦ధీయుతులుం బరమాస్త్రశస్త్రవి
ద్యారతులున్ మహాత్ము లప♦రాజితులుం బరచిత్తశల్యముల్
శూరులు దేవదానవని♦షూదను లయ్యు రయె కూలిపోయిరే. ౧౭౧౨
సీ. ప్రఖ్యాతవిక్రమ♦ప్రణుతుండు నాపట్టి, యింద్రజి భండన♦పృథ్వియందు
వరలబ్ధశరముల ♦ భ్రాతల బంధించె, వానిని విడిపింప ♦ వశము గాదు

యక్షగంధర్వదే♦వాదుల కేనియు, నట్టిచో రామరా♦మానుజాతు
లక్కటా విడివడి ♦ రది యేమి మాయయో, వారిప్రభావంబొ ♦ వంచనంబొ

ఆ. యెఱుఁగ రాదు నాకు ♦ నే మనవచ్చును, నేను బొమ్మటన్న ♦ నిశిచరేంద్రు
లట్టె పోక కాని ♦ యరుదేర రెవ్వరు, క్రమ్మఱంగఁ గపుల♦కడిమిఁ జిక్కి. ౧౭౧౩

కం. ఈవీట నింక నాసీ,తావిభునిన్ సానుజాతుఁ ♦ దతసైన్యుని సు
గ్రీవు విభీషణు గెలువం,గా వలఁతిన్ వెదకిత్తియైనఁ ♦ గనలే నొకనిన్. ౧౩౧౪

కం. ఏమీ రాముపరాక్రమ, మేమీ యాయస్త్రబలము ♦ హింసితు లై నా
నామరవిరోధిముఖ్యులు, భూమిని బేరైన లేక ♦ పొలిసిరి కలనన్. ౧౭౧౫

తే. యోధవరులు నిశాటు లా♦యోధనమున, నెవనిశక్తిని యమపురి♦ కేగి రట్టి
వీరు రాము ననామయు ♦ విష్ణుమూర్తి, నాదినారాయణునిఁగ నే♦నాత్మఁ దలఁతు.

ఆ. అతనిభీతిఁ గాదె ♦ యకట యంతర్బహి,ర్ద్వారతతులు మూయ ♦ వలసి వచ్చె
లంక నన్నిచోట్ల ♦ నింక హెచ్చరికను, గావ వలయు మీరు ♦ కడిమి మెఱసి.



రావణుఁడు లంకయం దంతటఁ గాపుంచుట.

కం. నాముదలలే కశోకా,రామమునకు నందు సీత ♦ రహియించెడియా
సీమకు నెవరేనియుఁ జనఁ,గా మఱి వెలి రాఁగఁ దగని♦కార్యము వినుఁడీ. ౧౭౧౮

సీ. సైన్యముల్ నిలిచిన♦స్థలముల నెల్లను, బలములతోఁ గావ ♦ వలయు మీరు
కాఁదారి మాఁదారిఁ[1] ♦ గడసంజ నైనను, దెల్లవాఱెడివేళ ♦ నెల్లయపుడుఁ
బ్లవగులత్రోవలు ♦ పరికింపుఁడీ మీరు, కారా దలక్ష్యంబు ♦ కపులపట్ల
నహితు లుద్యుక్తులో ♦ యరుదెంచు చున్నారొ, యూరక నిలిచియే♦యున్నవారొ

ఆ. యనుచు నెఱుఁగ వలయు ♦ ననవరతంబును, జనుఁ డటన్న రాక్ష♦సవ్రజంబు
లేగి యట్లె చేసె ♦ నిట్టు లాజ్ఞాపించి, దైన్యతప్తుఁ డగుచు ♦ దశముఖుండు. ౧౭౧౯

కం. తనమందిరమునకుం జని, ఘనరోషానలము పేర్చిఁ ♦ గ్రాఁగుచు నతికా
యునిఁ దలఁచి తలఁచి పొక్కుచు, మనమునఁ జింతించి మాటి ♦ మాటికి నూర్చెన్.

ఇంద్రజిత్తు రావణు నూరార్చుట.

చం. తనయులుఁ దమ్ములుం దెగిన ♦ దారుణశోకభరంబునన్ దశా
ననుఁడు విమోహితాత్ముఁ డయి♦నం గని యింద్రజి చేరి పల్కు నీ
తనయుఁడు శక్రజిత్తు సుర♦దానవదర్పనిహంత లెస్స యై
మని యిట నుండ నేమిటికి ♦ మన్కితముం గొన రాక్షసేశ్వరా? ౧౭౨౧

ఉ. ఇంద్రజిబాణపాతముల ♦ నెవ్వఁ డొకో సయిరించువాఁడు ని
స్తంద్రత మేను గాచికొనఁ జాలెడి వాఁ, డది యేల యిప్డు మ
త్సాంద్రశరోగ్రవృష్టి సువి♦దారితభిన్నశరీరభూమిభృ
చ్చంద్రుల రామలక్ష్మణుల ♦ త్యాలురదంగులఁ జూచె దియ్యెడన్. ౧౭౨౨

[1] కాఁదారి మాఁదారి = నడిరేయి.

మ. వినుమీ పౌరుషదైవయుక్త మగునీ♦వృత్రాహితారిప్రతి
జ్ఞను రక్షోధిప! రామలక్ష్మణులఁ జం♦చద్భీషణామోఘకాం
డనికాయంబుల సంగరక్షితిని సం♦తర్పింతు; విష్ణ్వింద్రులున్
దిననాథాశ్వికృశానుచంద్రయములున్ ♦ వీక్షించి నాయుద్ధతిన్ ౧౭౨౩

చం. బలిసవనాలయంబునను ♦ వర్ధిలు విష్ణువో కో యటంచు లోఁ
దలఁపఁగఁ జేయువాఁడ నని ♦ తండ్రియనుజ్ఞను గాంచి వాయువే
గలలితరాసభాన్వితసు♦కాంతరథంబునఁ జాపపాణి యై
చెలువుగ నెక్కి తోడ హయ♦సింధురరోహకు లార్భటింపఁగన్. ౧౭౨౪

## ఇంద్రజిత్తు మొదటిసారి యుద్ధమునకు వెడలుట.

శా. భేరీనిస్స్వనశంఖరావములు వి♦న్వీదిం దలంబార, భా
పూరంబుల్ ప్రసవించు ముద్గరగదా♦పూగంబులుం బ్రాసముల్
నారాచంబులు మండలాగ్రములు నా♦నాశస్త్రముల్ దాల్చి పెం
పారన్ రాక్షసు లేగుదేర స్తుతివా♦క్యావాలవక్త్రుల్ వెసన్. ౧౭౨౫

తే. శంఖశశివర్ణ రాజత♦చ్ఛత్రకలన, నందగించెను రావణ♦నందనుండు
శారదాపూర్ణనీరేజ♦వైరిచేత, భాసురం బయి యొప్పు న♦భంబు వోలె. ౧౭౨౬

తే. విల్లు పట్టెడివారల♦కెల్లమేటి, యైనమందోదరీతన♦యాగ్రణికిని
జాళువాపిడులొప్పారు♦చామరములు, వైచి రిరుగడరాక్షస♦వర్యు లపుడు. ౧౭౨౭

తే. ఖరమయూఖునిచేతఁ బు♦ష్కరమువోలె, భానుసన్నిభ తేజుఁ డ♦ప్రతిబలుండు
నైనదశకంఠసుతునిచే ♦ నల్ల లంక, యధికశోభ వహించె న♦త్యద్భుతముగ.

కం. సమరాంగణమునకుం జని, యమరాహితుఁ డాత్తరథము ♦ నన్నిదెసల ద
ట్టముగఁ బలాశులఁ గాపుగ, నమరిచి వేలువఁగ జొచ్చె ♦ నగ్నులలోనన్. ౧౭౨౯

సీ. లాజల గంధమా♦ల్యంబులచే నొప్ప,హవిచేత నర్పించె ♦ నగ్నిహోత్రు
శరపత్రములు గాఁగ♦శస్త్రముల్ ఘటియించి, తాండ్రశాఖల సమి♦ధలుగఁ జేసి
యెఱ్ఱవస్త్రము లూని ♦ నినుపస్రువముఁ బూని, శరపత్రమధ్యదే♦శంబునందు
మిన్నటంబుగ నల్ల♦మేఁకను బలి యీయఁ, బొగ లేనిమంటలఁ ♦ బొలుపుమీఱి

ఆ. విజయలక్షణముల ♦ వెలికి సూచించుచు, సప్రదక్షిణముగ♦జ్వాల లెగయఁ
బసిఁడినగలు దాల్చి♦ప్రత్యక్షముగ రోహి,తాశ్వుఁ డెగయు దెంచి♦హవి గ్రహించె.

కం. తనరథమును దనచాపము, తనబ్రహ్మాస్త్రంబు మఱి ప♦దార్థము లెల్లన్
దనుజుఁడు మంత్రయుతంబుగ, ననలునిలో వేల్చె నిశ్చ♦లాత్ముం డగుచున్. ౧౭౩౦

కం. సేంద్రగ్రహనక్షత్రము, బృందారకపథము వడఁకె ♦ భీతి మయసుతా
నందనుఁ డిటు బ్రహ్మాస్త్ర మ,మందమతిన్ వేల్వ నగ్ని♦మధ్యమునందున్. ౧౭౩౨

చం. పవనసఖాభ తేజుఁ డగు♦పంక్తిముఖాత్మజుఁ డగ్నిదత్తసం
 ధవవరచాపమార్గణర♦థంబులు సూతుఁడు నై యదృశ్యుఁ డై
 దివికిని నుద్గమించి తన♦దిక్కు సురారుల నూలుకొల్పినన్
 బవరము సెల్లె నాయుభయ♦పక్షమువారికి రోమహర్ష మై. ౧౨౩౩

ఇంద్రజిత్తు మాయాబలంబునఁ గపిసేనల నుఱుమాడుట.

చం. భరముగఁ బోరు చున్నతన♦వారిఁ గనుంగొని సేను గల్గఁ గా
 తరపడ నేల మీకు నని♦ దానవులార! వధింపుఁ డీవనే
 చరులను నెల్లవారల ని♦జం బగు మీకు జయంబు నా నిశా
 చరులును గేరి తాఁకి యని♦ సల్పిరి వీఁక జయాభిలాషు లై. ౧౨౩౪

ఉ. మించి దశాస్యనందనుఁడు♦ మేలిశరంబులఁ గీశసేనల
 న్ముంచి పరాక్రమించుచు న♦నూనగదాముసలాయుధాళిచేఁ
 జించుచు శత్రుదేహములఁ♦ జీల్చుచుఁ గూల్చుచొ కొక్కముల్కిచే
 సంచుగఁ బంచసప్తనవ♦సంఖ్యలఁ గీశులఁ ద్రుంచె వ్రేల్మిడిన్. ౧౨౩౫

ఉ. ఆతని వీఁకఁ గన్గొని య♦గాయుధపాణులు కీశముఖ్యులున్
 స్ఫీతజవంబుమై నెదుర♦ సింగముభంగిని బొంగి గ్రీష్మఖ
 ద్యోతునిఁబోలి తేజి కన♦ దుష్కర మై రవితుల్యమార్గణ
 వ్రాతవిభిన్నకాయులుగ♦ వారల నెల్ల నొనర్చె నీసునన్. ౧౨౩౬

కం. అంగములు నలఁగినం బ్రథ,మాంగంబులు పగిలినన్ ద్రు♦మాటులు ధృతిమై
 సంగరము సలిపి రాసీ,తాంగనపతికొఱకునై చ్యు♦తాయువు లగుచున్. ౧౨౩౭

ఉ. రావణిఁ జుట్టుముట్టి నగ♦రాజచరుల్ జడివానపోలెఁ బెన్
 గ్రావములున్ శిలాగిరిని♦కాయములుం గురిపింప వాఁడునున్
 గేవలశౌర్యధైర్యపరి♦కీర్తిత చాపకళావిలాసముల్
 చేవ గొన న్నిమేషమునఁ♦ జేసెను నన్నిటిఁ దుండెతుండెముల్. ౧౨౩౮

సీ. వెండియు నతఁడు దో♦శ్చండిమ గంధమా,దనుఁ బదునెనిమిది♦ఘనశరముల
 దూరస్థుఁ డొనలుఁ♦ దొమ్మిదిఖగముల, మైందుని నొకయేడు♦మార్గణముల
 గజు నైదుముల్కుల♦ ఘను జాంబవంతునిఁ, బదిట నీలాఖ్యు ము♦ప్పదిట నేసి
 సుగ్రీవునిన్ వాలి♦సూనుని ఋషభుని, ద్వివిదుని వరలబ్ధ♦తీవ్రబాణ

తే. సంఘముల నేలఁబడఁగ ని♦ష్ప్రాణు లగుచుఁ
 గ్రూరుఁడై నొంచి తక్కిన♦క్రోఁతిగములఁ
 గాలపావకుఁ డన బహు♦కాండహేతి
 మాలికల నిర్దహించెను♦ మాఱు లేక. ౧౨౩౯

కం. ఖరకరనిభవిశిఖపరం,పరలన్ నిస్తులితఘనజ♦వంబుల భూభృ
చ్ఛరవాహిని మథియించె న,మరపతివిద్వేషి జాత♦మన్యుం డగుచున్. ౧౭౮౦

ఉ. దారుణబాణమోహితని♦తాంతసమాకులవైరిసేనలన్
వీరుఁడు గాంచి పొంగుచును ♦ వెండియు మింట నదృశ్యగాత్రుఁడై
ఘోరశరంబులం గురిసి ♦ క్రోఁతులచేతులు మూఁతు లంగముల్
తీరు చెడంగఁ జేసె నవ♦ధీరితనిర్జరుఁ డుగ్రమూర్తియై. ౧౭౮౧

చం. పవిహతశైలరాజముల♦భంగిఁ బ్లవంగమపుంగవుల్ ధరన్
జవమఱి కూలుటల్ నిశిత♦సాధనముల్ పరసేనమీఁద ను
ద్దవిడిని జోరునం బడుట ♦ తక్కఁ గనుంగొన నేర రైరి యా
బవరమునన్ క్షపాచరుల♦వర్గములున్ గపియోధవీరులున్. ౧౭౮౨

కం. అనితనివి లేక రావణి, సునిశితనిస్త్రింశపరిఘ♦శూలాదికముల్
ఘనవిస్ఫులింగసంజ్వల,దనలాభంబులను గురిసె ♦ నక్రిచరులపై. ౧౭౮౩

కం. ఆయంపవెల్లి తాఁకున, కాయగచరవార మెల్ల ♦ నలరులతోఁ గెం
జాయ వహించినమోదుగు,చాయలు గొని విస్వరముగ ♦ సలిపెను రొదలన్.

సీ. కన్నెత్తి చూచెనా ♦ కఱకుబాణమ్ములు, రెండుకన్నులలోన ♦ నిండియుండుఁ
తల వంచి తిరిగెనా ♦ తరముఁడికోలలు, నడినెత్తి బ్రద్దలై ♦ పుడమిఁ దొరఁగు
డాలు చేపూనెనా ♦ కేలుదోయి విఖండి,తం బయి పొరలాడు ♦ ధరణిమీఁద
ధరముఁ బైకెత్తెనా ♦ దాని క్రిందనె వాఁడు, నజగుజ్జై పడి ♦ నలఁగి పోవు
తే. నార్భటింపఁగ వావిచ్చు ♦ నంతలోన, నోరునిండఁగ బాణముల్ ♦ కూరుకొనెడిఁ
గ్రోఁతి యగునాతఁ; డౌరయా♦క్రూరచరితు,చాపపాండితి నే మని ♦ సంస్తుతింప.

సీ. హనుమంతు సుగ్రీవు ♦ నంగదు గంధమా,దను జాంబవంతు మైం♦దద్వివిదుల
హరిలోమ నీల గ♦వాక్ష గోముఖ వేగ,దర్శి సుషేణుల ♦ దధిముఖు గజు
జ్యోతిర్ముఖాఖ్యుని ♦ సూర్యాననుని వహ్ని,నయనునిఁ గేసరి ♦ నలునిఁ గుముదు
మంత్రసంహితతీవ్ర♦మార్గణప్రాసగ,దాశూలముఖ్యసా♦ధనవితాన
తే. ములను మర్దించి వారల♦బలువు చెఱిచి, తరణిరశ్మిసమేషుక♦దంబకముల
రామలక్ష్మణులను ముంచి ♦ రహి వహించి, విక్రమించెడిరావణి♦విధముఁ గాంచి.

శ్రీరాముఁడు లక్ష్మణునకు బ్రహ్మావరంబు మన్నించి యోర్చుకొను మని చెప్పుట.

కం. పరమాద్భుతధైర్యశ్రీ,నిరతుఁడు రాముండు బాణ♦నికరాసారం
బరవాయి లేక బిందూ,త్కరమునవలె సహించి పలుకుఁ ♦ దమ్మునితోడన్. ౧౭౮౪

సీ. అన్న లక్ష్మణ! దను♦జాధినేత్రాత్మజుం, డతుల మా బ్రహ్మాస్త్ర♦మాశ్రయించి
హరిసైన్యముల నెల్ల ♦ నవనిపా లొనరించి, మనలఁ బీడించెడి ♦ మాఱులేక
బ్రహ్మదత్తవరంబు♦బలమున నభమున, మఱిఁగి యస్త్రంబుల ♦ మాఱుకొనెడిఁ
గలన వీని వధింపఁ ♦ గల మెట్లు? స్వభు వగు,భగవంతుఁ డగునజు♦బాణ మిదియు
ఆ. నిది యచింత్య మహిమ ♦ నెసఁగెడి బాణావ,పాత మీవు నాదు♦భంగి ధైర్య
పరత నోర్చికొనుము ♦ సురవైరి దిక్కుల, నెల్లఁ గప్పె నిశిత♦భల్లములను. ౧౭౪౮
కం.ఆవీరునివిక్రమమునఁ, జేవ చెడం గీశసేన ♦ స్మృతి చెడి యత్నా
భావము గలమనలం గని, పోవుఁ జయలక్ష్మిఁ గొనుచుఁ ♦ బురి కసురుండున్.
కం.అనుచుండ బాణవర్షము, ఘనమై దుస్సహము నైనఁ ♦ గాకుత్స్థులు మూ
ర్ఛను గూరిరి రావణియును, మనుజేంద్రులపాటు గాంచి ♦ మది హర్షమునన్.
కం.పొంగఁగ హర్షారవము చెలంగఁగ నిటు కీశసేన♦లన్ రఘువరులన్
జెంగించి భంగపఱచి య,భంగపరాక్రముఁడు తనదు♦పత్తన మరిగెన్. ౧౭౫౧

విభీషణాంజనేయులు జాంబవంతుని వెదకుట.

సీ. రావణి యేటుల ♦ రహిచెడి సుగ్రీవ,జాంబవదంగద♦సైన్యనాథు
లేమియుఁ దోఁపక ♦ యెదవడి యుండ వి,భీషణుం డడలు క♦పిప్రముఖులఁ
గనుఁగొని కపులార! కార్యమా దుఃఖింప, రాఘవు లవశులై ♦ వ్రాలి రనుచుఁ
గాదిది దుఃఖింపఁ ♦ గాలంబు నృపతులు, కంజజువాక్యంబు ♦ గారవింప
ఆ. మదిఁ దలంచి యసురు♦మార్గణములఁ జిక్కి, యున్నవారు నీర♦జోదరాస్త్ర
మత్యమోఘవేగ ♦ మగుటను దాని స,మ్మానదృష్టిఁ గనిరి♦మాన్యులార! ౧౭౫౨
కం.ఏలా వగచెద రని మృదు,లాలాపంబులను వారి ♦ నాశ్వాసించెన్
జాలఁగ నయ్యస్త్రము వా,తూలసుతుఁడు గౌరవించి ♦ తోరపుభక్తిన్. ౧౭౫౩
చం.అనియె విభీషణుం గని మ♦హాత్మక యీమనసేనలోన నిం
కను మనియున్నవారలను ♦ గన్గొని యూఱడఁ బల్కఁ బోడి యా
నన నతఁ డట్ల యౌ ననఁగ ♦ హస్తములం గొఱవుల్ ధరించి చ
య్యన హతశేషవానరుల ♦ నయ్యనఘాత్ములు రోసి రానిసిన్. ౧౭౫౪
సీ. భిన్నలాంగూలురు ♦ ఛిన్నబాహాశయుల్,కృత్తాంగుళులును ని♦కృత్తపదులు
ఖండితశీర్షులై ♦ క్షతజముల్ దొరఁగంగఁ, గొండలవలెఁ బడి♦యుండు కపుల
శస్త్రముల్ భేదింప ♦ నస్త్రముల్ బాధింప, నొడళులు ఛేదింపఁ ♦ బడినవారి
గంధమాదనుని నం♦గదు నీలు సుగ్రీవు, ద్వివిదసుషేణుల ♦ వేగదర్శి
తే. నళునిఁ బనసు జ్యోతిర్ముఖు♦నాము మైందు
నాహుకు గవాక్షునిం దక్కు♦నద్రిచరుల

వీతచేష్టుల నిహతుల ♦ వీరవరులఁ
గాంచి రెంతయు మదిలోనఁ ♦ గలఁకఁదొడర. ౧౭౫౫

చం. ఆఱువదియేడుకోటులవ♦నాటులు భీమతరన్వ్య లిట్లు లు
క్కఱి దినపంచమాంశమున ♦ నబ్జజుప్రీతికిఁ బాత్రుఁడైనయా
కఱకుసురారిచేఁ దెగిరి ♦ కంధినిభం బగుకీశసేన యొ
క్కఱ నిటు గూపు మాఱుడును ♦ కేసరిపుత్రసురారిసత్తముల్. ౧౭౫౬

ఉ. ఎక్కడ నున్నవాఁడొకొ దె ♦ ఋక్షవిభుం డని రోయు చేగి తా
రొక్కెడ శాంతహవ్యవహుఁ♦డో యన మేన ననేకబాణముల్
చిక్కగ నాటినన్ మిగులఁ ♦ జేష్టుడి యున్న స్వభావవార్ధికు
న్నిక్కిలి వృద్ధు ధాతృసుతు♦నిం గని రావణుతమ్ముఁ డి ట్లనున్. ౧౭౫౭

జాంబవంతుఁడు హనుమంతు కుశలమును విభీషణు నడుగుట.

ఉ. ఓయతులప్రభావ! విశి♦ఖోత్కరముల్ నినుఁ బ్రాణహీనుఁగాఁ
జేయఁగ లేదుగా? యనినఁ ♦ జేవ శ్రమంబునఁ దెచ్చుకొంచుఁ దా
వా యొకయింత విచ్చి యిటు♦పల్కు మహాబల! రాక్షసేంద్ర! నీ
చాయ స్వరంబుఁ బట్టి చుమి ♦ చక్క నెఱింగితిఁ జూడ లేకయున్. ౧౭౫౮

కం. సునిశితశరములు నాటుటఁ, గను లేమియుఁ గాన రావు ♦ గాడుపుసుతుఁ డం
జనగాదిలిబిడ్డం డా, హనుమంతుం డున్నవాఁడె ♦ ప్రాణముతోడన్? ౧౭౫౯

చం. పలుకఁగ దయ్య యన్న రఘు♦వర్యులసేమము ప్రశ్న సేయ కో
యలఘుమతీ! మరుత్తనయు ♦ నాదటఁ బ్రశ్నము సేయ నేల? యా
బలియునిమీఁది ప్రేమ నృప♦వర్యులమీఁదను వాలిపుత్రు పై
జలరుహమిత్రసూనుపయి ♦ సత్యము నీ వెదఁ బూన వేలొకో? ౧౭౬౦

కం. అనుచు విభీషణుఁ డాడిన, విని భల్లూకేశ్వరుండు ♦ వినుమీ వినుతున్
దనుజేశ్వర! నే మారుత, తనయునిఁ బ్రశ్నించుటకు ని♦దానముఁ దెలియన్.

కం. హనుమంతుఁడు జీవించిన, మన సేనలు హతము లయ్యు ♦ మనియున్న వగున్
హనుమంతుఁడు లేకుండిన, మన మెల్లను బ్రతికియున్న ♦ మ్రందిన యట్లా.

కం. నుతమతి వాయుజుఁడు సదా, గతికిన్ సరి గమనమునను ♦ ఘనవీర్యమునన్
హుతవహుతుల్యుఁడు గావునఁ, బ్రతుకుదుఁ గా కనుచు నాశ ♦ బాధించె ననున్.

చం. అన హనుమంతుఁ డయ్యనఘు♦సంఘ్రిల వ్రాలి మహాత్మ! యే మరు
త్తనయుఁడ వచ్చినాఁడ ననఁ ♦ దల్లపితంబుల నాలకించి యున్
మనమునఁ గుంది వెండి నిజ♦మాతృదరంబునఁ బుట్టినట్టు ల
వ్వనజజసంభవుం డలరి ♦ వాయుతనూజునితోడ ని ట్లనున్. ౧౭౬౪

## జాంబవంతుఁడు హనుమంతుని సంజీవకరణిఁ దేర నియోగించుట.

కం. రక్షా హరిశార్దూలా! యిక్కర్కటబలముఁ గావ ♦ నీవే గతి శౌ
ర్యమ్మున నీసరు లే రీ, సమ్మతి మాకెల్లఁ బరమ♦సఖుఁడవు గావే. ౧౭౬౫

ఉ. అన్న! భవత్సమానబలు ♦ నన్యుని నారసి కాన నెందు లో
కోన్నతశౌర్యశాలివి త్వ♦దుగ్రపరాక్రమెల్లఁ జూపఁగాఁ
జెన్నగు వేళ యియ్యదియ ♦ చేకుఱెఁ గీశులు భల్లుకంబులుఁ
సన్నుతరామలక్ష్మణులు ♦ సంతస మొంద నొనర్పుమీ వెసన్. ౧౭౬౬

సీ. అంజనాతనయ! నీ ♦ వంబుధిఁ దరియించి, నెంతయు దూరంబు ♦ నేగి శీత
శైలంబుఁ గని వెండి ♦ స్వర్ణమయం బగు, ఋషభకైలాసమ♦హీధరములఁ
గనుఁగొని తన్మధ్య♦మున ఘనప్రభ మయి, సర్వౌషధులచే ♦ జానుమీఱు
నోషధిగిరిఁ గాంచు ♦ ముర్వీధరాగ్రంబు, నం దమదీప్తి న♦మందముగను

తే. దెసల వెలిఁగించునోషధుల్ ♦ పొసఁగు నాల్గు, వానికాంతులచే వాని♦వల నెఱింగి
నీవు వే మృతసంజీవ♦నిని విశల్య, కరణి సావర్ణ్యసంధాన♦కరణు లనఁగ ౧౭౬౭

తే. పరఁగువానిని గొని జగ♦త్ప్రాణతనయ, వచ్చి యీకీశసేనకుఁ ♦ బ్రాణ మిమ్ము
పొమ్ము నీకు శుభం బగు ♦ రమ్ము వేగ, మనిన నాతఁడు సంతోష ♦ మతిశయిల్ల.

## హనుమంతుఁడు సంజీవనిఁ దెచ్చుటకై పోవుట.

కం. అర్ణవము జలంబులచేఁ, బూర్ణం బగుభంగి దేహ♦మును బెంచి బలో
దీర్ణుండై గిరిశిఖరముఁ, దూర్ణమ తనపాదములను ♦ దొడిఁబడఁ జేసెన్. ౧౭౬౮

సీ. రెండవకొండనా ♦ గం డు మీఱినమారు, తాత్మజాతునిపాద♦హతుల కోర్వఁ
జాలక కంపించె ♦ శైలంబు శృంగముల్, కుజములు ధరణిపైఁ ♦ గూలఁ బడియె
నానగంబునఁ బ్లవ♦గావళి నిలువ లే, కడలున గడగడ ♦ లాడె నపుడు
ఘూర్ణిత ద్వార మై ♦ కుంఠితగేహ మై, భగ్నగోపుర మయి ♦ పట్టనంబు

తే. సాధ్వసాకుల మయి గొండ్లి ♦ నలుపునట్టు, లయ్యెనారాత్రి నీరీతి ♦ హాటకాద్రి
మందరనగోపమాన మా♦మలయగిరిని, నాకులప్రస్రవణము ను♦రాన్వితంబు.

కం. నానాలతాద్రుకీర్ణము, నానావికసితకువాల♦నళినచయంబుఁ
నానామృగసంకీర్ణము, నానాకందరము మాని♦నాథాంచితమున్. ౧౭౭౦

తే. అంఘ్రులను ద్రొక్కి బడబాము♦ఖాభముఖము, విచ్చి గర్జించె భూతాళి♦వీను లగల
నద్భుతారవ మాలించి ♦ యసురులెల్లఁ, గదల కిట్టటు లుండిరి ♦ కడుభయమున.

ఉ. భీమపరాక్రముండు హరి♦వీరుఁడు భక్తిని రామచంద్రునిఁ
దా మనసార మ్రొక్కు లిడి ♦ దాశరథిప్రియకార్యకర్తకుం

డై ముఖ మొప్ప విచ్చి మహిం♦తాహినిభం బగుతోఁకనెత్తి సం
ధామతి వీఁపు వంచి శ్రవ♦ణంబులు గుంచి ప్రచండవేగుఁడై. ౧౭౭౩

సీ. కుప్పించి యెగిరినఁ ♦ గుధరస్థశిలలును, వృక్షషండంబులు ♦ వెంటఁ బాఱె
యావేగ మణఁగిన ♦ నంబుధిలోఁ బడె, గరుడవేగుం డయి ♦ యురగయుగముఁ
బోలు చేతులు సాఁచి ♦ పోరిఁబోరి దిక్కులు, కంపింపఁగా విష్ణు♦కరవిముక్త
చక్రం బనఁగఁ బాఱె ♦ సంఘూర్ణితతరంగ,జాలము భ్రామిత♦సర్వసత్త్వ
తే. మైనవననిధిఁ గాంచుచు ♦ నరిగి యరిగి, మార్గమందు నదీనద♦మహిజషండ
హారిపురములఁ గనుచు నీ♦హారనగముఁ, గాంచి విధిసుతునుడుల స్మ♦రించి యేగి.

కం.బహుకందరనిర్ఝర మై, బహుళప్రస్రవణయుక్తిఁ ♦ బరఁగుచు నానా
మహిజగుహాన్వితం బై, మహితసితాభ్రాభశృంగ♦మంజుల మగుచున్. ౧౭౭౪

సీ. తనరారుహిమగిరిఁ ♦ దఱియఁగ నేగి ప్ర,వృద్ధఘోరోత్తమ♦శృంగతలము
పుణ్యాశ్రమంబులు ♦ మునిజనయుతములు, పరమమతిం గని♦బ్రహ్మకోశ
మలరజతాద్రిని ♦ హరిహయాలయమును, నుగ్రబాణప్రమో♦క్షోరుతలము
హయముఖు సందీప్త ♦ మగుబ్రహ్మశిరమును, యమునికింకరుల వ♦జ్రాలయంబు
తే. నబ్జహితతేజ మగుధన♦దాలయంబు, నర్కబంధనతలము బ్ర♦హ్మాసనంబు
నసుమతీనాభిఁ గైలాస♦పరిసరమున, నొప్పుహిమవచ్ఛిలను బుష♦భోగ్రధరము.

కం.సర్వౌషధిసందీప్తము, సర్వౌషధినగము సూర్య♦సన్నిభమును మే
ఘార్వనిదూతాత్మభవుఁ[1] డ,ఖర్వాశ్చర్యైకమతిని ♦ గనుఁగొనె నచటన్. ౧౭౭౫

హనుమంతుఁడు సంజీవనిఁ దెచ్చుట.

చం.వనచరభర్త యోషధుల ♦ వారక రోయుచు నొక్క వేయియో
జనములు సంచరింప నిజ♦సంగ్రహణార్థము వచ్చె నెవ్వఁడో
యని తలపోసి యోషధిచ♦యంబులు వే మఱిఁగెం, గపీంద్రుఁడుఁ
గినుకను దామ్రచక్షుఁ డయి ♦ కేరి మహార్భటిఁ బల్కుఁ దద్గిరిన్. ౧౭౭౬

ఉ. ఏమి నగోత్తమా! కరుణ♦యింతయు లేదుగ రామచంద్రుపై?
నే మని యోషధిప్రతతి ♦ నిట్టు లణంచితి లోన? నిద్దియే
నీమది నిశ్చితంబ యగు♦నేని మదీయభుజాభిభూత మై
యే మయి పోదువో యెఱుఁగు♦దే? యిదిగో నినుఁ బిండి గొట్టెదన్. ౧౭౭౭

చం.అనుచు సకాంచనంబును స♦నాగము ధాతుసహస్రజుష్టముఁ
ఘనతరశృంగముఁ రవిని♦కాశము శైలముఁ దోడఁ బాఁతుతో
ననఘుఁడు పెల్లగించి జల♦దాధ్వముమీఁదికి నుద్గమించి చ
య్యనఁ జనుదెంచె ఖేచరు ల♦హో యనుచుఁ స్తుతియించు చుండఁగన్. ౧౭౮౦

[1] మేఘార్వనిదూత = వాయువు.

కం. భాస్కరమార్గగుఁ డై యా, భాస్కరశిష్యుండు దాల్చి ♦ భాస్కరనిభముగ్
భాస్కరసమీపగునిఁ బ్రతి, భాస్కరునింబోలెఁ దీవ్ర ♦ భాస్కరుఁ డగుచున్.

కం. శైలధరుఁడు పావని యు, త్తాలాభీలము సహస్ర ♦ ధారము చక్రం
బోలి ధరించినవిష్ణువు, పోలెన్ రాజిల్లెఁ బగలు ♦ పొరి భీతిల్లన్, ౧౭౪౨

→ సంజీవనిచే వానరాదులు జీవించుట. ←

ఉ. వాయుసుతుండు దూరమున ♦ వచ్చుచు నుండఁగ నోషధీలతా
వాయువు సోఁకి వానరులు ♦ ప్రాణములం గని యెల్లవారు న
చ్ఛాయను జూచి కేక లిడ ♦ సమ్మద మారఁగఁ బావమాని గ
ర్జా యతి మాత్రలుం గడియె ♦ నాశరులున్ వెఱ బొబ్బరింపఁగన్. ౧౭౪౩

కం. ఈ నెఱి దించి గిరిం ద, ద్వానరమధ్యమునఁ బెద్ద ♦ వారికి మ్రొక్కన్
మానుగఁ గాఁగిటఁ జేర్చెన్, దానవవిభు గంధవాహ ♦ తనయుఁడు ప్రీతిన్. ౧౭౪౪

చం. వలనుగ నమ్మహౌషధుల ♦ వాసన మూర్కొని రామలక్ష్మణుల్
తెలివి వహించి లేచి కడఁ ♦ దేఱిరి, చచ్చినక్రోఁతిమూఁకలున్
బలితపునిద్ర నుండి తెల ♦ వాఱిన మేల్కనుభంగి లేచి క్రొం
జెలువు వహించె; రాక్షసుల ♦ జీవితుఁ డొక్కఁడు గాఁ డదే లనన్. ౧౭౪౫

కం. పోరుమొద లాశరులు కపి, వీరులచేఁ జచ్చునసుర ♦ వీరుల నపుడే
నీరనిధిఁ ద్రోయు చుండిరి, గౌరవహేతువునఁ బంక్తి ♦ కంఠునియాజ్ఞన్. ౧౭౪౬

కం. కార్యంబు దీర మహితా, హార్యంబును గొంచు మరల ♦ నరిగి త్వర హ తా
నార్యుం డెప్పటిస్థితి నిడి, యార్య్య రఘూత్తమునిఁ జేర ♦ నరుదేరంగన్. ౧౭౪౭

→ సుగ్రీవుఁడు లంకఁ గాల్పఁ గపుల నాజ్ఞాపించుట. ←

ఉ. వానరవల్లభుండు హరి ♦ వైరినికారసముద్భవాగ్రహా
నూనపరీతచిత్తుఁ డయి ♦ యుక్తవిధంబునఁ బల్కు నా హనూ
మానునితోడఁ దమ్ములుఁ గు ♦ మారులు చచ్చుట శోకతప్తుఁ డై
దానవవల్లభుం డనికిఁ ♦ దా నరుదేరఁడు కాన మీరలున్. ౧౭౪౮

కం. నెఱసరులును లాఘవయుతు, లఱగొఱ లే కెల్లవార ♦ లరిగి జవమునన్
గొఱవులఁ గొని లంకాపురిఁ, జుఱపుచ్చుఁ డటన్న నెల్ల ♦ శూరవరేణ్యుల్ ౧౭౪౯

శా. రౌద్రం బైననిశాముఖంబున రుషా ♦ రంభుల్ ప్లవంగేంద్రు లా
కద్రూసంభవు లట్లు లూర్చుచును ను ♦ ల్కాహస్తు లై లంక న
క్షుద్రాటోపముతోడఁ జొచ్చి పురర ♦ క్షుల్ రాక్షసుల్ భీతిమైఁ
బ్రద్రావోన్ముఖు లైన సంతసమునం ♦ బ్రాసాదగేహాళులన్. ౧౭౫౦

తే. గోపురాట్టప్రతోళులఁ ♦ గూటములను, నగ్నిసంతర్పణముఁ జేసి ♦ రార్పు లెసఁగఁ
గొండ లననుండుప్రాసాద♦ కాండములును, దబ్బుదబ్బను నులివు♦ధరణిఁ గూలె.

→ కపులు లంకఁ గాల్చుట. ←

సీ. అగలుచెక్కలు మేలి♦హరిచందనంబులు, మండుచు మేల్పరి♦మళము లీనె
మౌక్తికంబులు వజ్ర♦మణులు ప్రవాళముల్, శంఖసంఘములు భ♦స్మంబు లయ్యెఁ
గౌశేయరాసులు ♦ క్షౌమసంతానముల్, మడతలు మడతలు ♦ మాయ మయ్యెఁ
గంబళంబులు రమ్య♦కాంచనభాండంబు, లాజభాండపరిచ్ఛ♦దాళి చెడియెఁ
తే. గరులసొమ్ములు రథభాండ[1]♦పరికరములు
కవచములు గజవాజులఁ ♦ గప్పుచేల
లతులఖడ్గధనుర్శార్ఙ్గ ♦ లాయుధములు
శూలములు శక్తులును గాలి ♦ చూర్ణ మయ్యె. ౧౭౯-౨

సీ. వాలజరోమజ♦వ్యాఘ్రచర్మజములు,బహుళాండజంబులు ♦ పాడు లయ్యె
ముక్తామణివిచిత్ర♦ములు పెనుమేడలు, నస్త్రమందిరములు ♦ నణఁగి పోయె
వేనవే లసురుల♦వీడులు బూ దయ్యె, రాజితవరతను♦త్రాణధరులు
దామహారాంబర♦ధారులు మధుపాన,చంచలనేత్రులు ♦ జాతరుషులు
తే. వల్లభలతోడ నిద్రించు♦వారు త్రాగు,వారు తినువారు భీతిల్లు♦వారు పరుగు
వాఱువారును నాయుధ♦పాణు లైన,వార లెల్లరుఁ బావకు♦వాతఁ బడిరి. ౧౭౯-౩

సీ. భార్యలు తమకొంగు ♦ పట్టఁ బాఱెడివారు, పొగ నేది తోఁపక ♦ పొగులువారు
చంక బిడ్డలతోడ ♦ జలదరించెడివారు, పరువిడుచో నేలఁ ♦ బడెడివారు
తమవారికై యేగి ♦ తాముఁ గాలెడివారు, తోలఁగినవారిని ♦ బిలుచువారు
కొడుకా! యటంచును ♦ గోడలా! యంచును,గూఁతురా!యని బిగ్గ ♦ కూయువారు
తే. స్వర్ణచంద్రార్ధచంద్రరూ♦పములు గలుగు
చంద్రశాలలు మణిగవా♦క్షములు రత్న
విద్రుమాంచితములు చారు♦వివిధపక్షి
మందిరంబులు నగ్నుల ♦ మాఁడు టయ్యె. ౧౭౯-౪

చం. జ్వలనపరీతగేహములు ♦ వార్షికవేళలఁ జంచలాలతా
కలితపయోధసంఘముల♦కైవడి నొప్పఁగఁ గాలి కూలుశా
లలు కులిశాహతిం బడు ని♦లాధరశృంగములట్లు దోఁచెఁ ద
త్కలితమహానినాదములు ♦ గ్రమ్మి చెవు ల్పడఁ జేయఁ జొరులన్. ౧౭౯-౫

కం. మిద్దెల మేడల మీఁదను, నిద్దుర గొనుముద్దరాండ్రు ♦ నెగసెడిమంటల్
గ్రద్దన యూడిచి భూషలు, హద్దఱి పలవించి రపుడు ♦ హా హా యనుచున్.

[1] భాండము = అలంకారము.

కం. జ్వాలాపంక్తులతో హ,ర్మ్యాళి రహిం జెలాఁగె దీపి♦తౌషధివనికా
జాలాంచిత మగుమిహికా,శైలశిఖర మనఁగ దూర♦జనదృష్టులకున్. ౧౭౯-౭

తే. జ్వాలికాపంక్తు లెగురంగ ♦ సౌధశిఖర
తలములందు నిశావేళఁ ♦ దత్పురంబు
నిండఁ బూచిన మోదుగు♦పిండువోలె
దవ్వు చూడ్కికిఁ దోఁచెఁ ద♦త్సమయమునను. ౧౭౯-౮

తే. కట్లు విడిచినఁ జరియించు♦కరులతతులు, వారువంబులు నై ♦ లంక పరఁగె నపుడు
విలయసమయసముద్భ్రాంత♦వివిధనక్ర,యుక్తఘనరసనిధికిఁ బె♦న్నుద్ది యగుచు.

తే. బెదరి పరుగెత్తుగుఱ్ఱంబు♦విధముఁ గాంచి
తొలఁగి పోయె నొక్కొక్కచో ♦ దొడ్డగజము
భీతిఁ బఱచెడి యేనుఁగు♦రీతిఁ గాంచి
యొండుగడ సైంధవంబు దా ♦ నొదిగె చనియె. ౧౮౦౦

తే. అసురనగరంబు దహియించు♦హవ్యవాహు
మించుకాంతులతో నీరు ♦ మిశ్ర మగుచు
నంబునిధి యప్డు చూపట్టె ♦ నద్భుతముగ
లోహితోదంబు[1] నాఁగ స♦మూహ సేయు. ౧౮౦౧

తే. చెట్టుద్రిమ్మరు లెల్లెడఁ ♦ జిచ్చు నిడఁగ
నొప్పెఁ దత్పత్తనంబు ము♦హూర్తమునను
సర్వలోకాంతకర మైన♦సమయమునను
మండు చుండెడుధాత్రికి ♦ మాద్రి యగుచు. ౧౮౦౨

కం. ధూమము కన్నులఁ దట్టఁగ, నేమియుఁ దోఁపకయు మేన ♦ నెగయఁగ మంటల్
భీమముగఁ గూఁక లిడియెడి, భామలరావము లెసంగెఁ ♦ బదియోజనముల్.

కం. తనువులు గాలఁగ వెలుపలి,కిని వచ్చెడివారితోడఁ ♦ గీశులు పెనఁగెఁ
దనుజుల క్రోఁతుల భీకర,నినదంబులు దివియు భువియు ♦ నిండెం బెలుచన్.

సీ. తొలఁగ వేదన మహా♦త్ములు రామలక్ష్మణుల్, సంభ్రాంతరహితు లై ♦ చాపములను
గైకొని మౌర్వీటం♦కారంబుఁ గావింపఁ, గలగుండు కొనిరి రా♦క్షసులు భీతి
వేదమయం బైన♦విశ్రుత మౌర్వీని, మీఱెడినాకాశ♦జూటుభంగి
శ్రీరామవిభుఁడు సా♦రించుడు గుణమును, నాశబ్ద మొక్కటి ♦ యగచరులయు

ఆ. రాక్షసులయు నులివు ♦ గ్రక్కున మ్రింగెను, గీశయూథతతుల ♦ క్ష్వేళ లసుర
సంఘరవము రామ♦చంద్రునిజ్యాలతా,నిస్స్వనంబు దెసల ♦ నిండె బెరసి. ౧౮౦౫

ఉ. రామధనుర్విముక్తశర♦రాజి నిశాటపురాట్టగోపుర
స్తోమములం బడ ల్పడఁగఁ ♦ ద్రోచె నిలాస్థలి దాని కుల్కి ప్రో

[1] లోహితోదంబు = రక్తసముద్రము.

ద్దామజవంబునఁ దూరిరి సురల♦దాయలు సంకులయుద్ధయత్నులై

దీమస మారఁగ వెల్వడిరి ♦ దిక్కులు పిక్కటిలన్ రవంబులన్. ౧౫౦౭

తే. యుద్ధసన్నాహమున రాక్ష♦సోత్కరములు

సింహనాదంబు లొక్కటఁ ♦ జెలఁగ నరికి

బయలు వెడలఁగ నపుడు క్ష♦పాసమయము

రౌద్ర మయ్యెను భాస్కర♦ప్రభవుఁ డపుడు. ౧౫౦౮

కం. ఆసన్నద్వారంబును, డాసి కపుల్ ముట్టడింపుఁ♦డా సోమరి యై

యోసరిలునట్టిభూమిప, శాసనదూషకునిఁ బట్టి ♦ శాసింతుఁ జుఁడీ. ౧౫౦౯

సీ. అనవుడు వానరుల్♦హస్తతలంబుల, మండెడుకొఱవులు ♦ మెండుకొనఁగ

నికటంబునం దున్న♦నిశిచరనాథుని, ద్వారంబు నాఁకట్ట ♦ దశగళుండు

నాగ్రహోదగ్రస♦మ్యగ్రూక్షనేత్రుఁడై, రూపంబుఁ గైకొన్న ♦ రుద్రకోప

మనఁగ మండుచుఁ దన♦యంతికనున్నసురారు, లాకులపాటొంద ♦ నట్టె లేచి

తే. కుంభకర్ణునిసుతుల ని♦కుంభకుంభు, లనెడివారల మఱియు యూ♦పాక్షశోణి

తాక్షకంపనులను బ్రజం♦ఘాఖ్యుఁ బనిచెఁ,జటులసేనాచయంబుతో ♦ జన్యమునకు.

కుంభనికుంభులు యుద్ధమునకు వెడలుట.

చం. వెడలిరి కౌంభకర్ణు లతి♦వేగమునన్ సహసైన్యులై భయం

బడర నరాతిసేనకు జ♦యధ్వను లొక్కటఁ బర్వ జాళువా

యొడుములు[1] కాంతిపూరములు ♦ నుగ్రతరోజ్జ్వలసాధనప్రభల్

కడుకొని చంద్రకాంతు లధి♦కంబుగఁ బర్వె నభస్తలంబునన్. ౧౫౧౦

కం. వానరులు రగులఁ జేయుక్రొ, శానునిరోచులును రాక్ష♦సప్లవగతతుల్

మేన ధరించినభూషా,నూనద్యుతు లాకసమున ♦ కొకరుచిఁ గూర్చెన్. ౧౫౧౧

కం. శీతకరకిరణకాంతి ప్ర,భూతాలంకారశోభి♦పురగృహహితభు

గ్నౌతిద్యుతి యుభయధ్వజి,నీతతి వెలుగంగఁ జేసె ♦ నెఱి నవ్వేళన్. ౧౫౧౨

కం. ఇందులపైభాగంబుల, మండెడిమంటలు సముద్ర ♦ మధ్యములోనన్

నిండారఁగఁ జలదూర్ములు,కాండంబులు వింతకాంతిఁ ♦ గైకొని వెలిఁగెన్. ౧౫౧౩

సీ. అశ్వమాతంగశ♦తాంగసంయుతమును, భటనికురుంబసం♦బాధితంబు

ప్రజ్వలత్తోమర♦ప్రాసకార్ముకగదా,శూలఖడ్గాదిసం♦శోభితంబు

జ్వలితవర్మము హేమ♦జాలాంచితభుజంబు, కింకిణీశతరవ♦సంకులంబు

బాణసంసక్తచా♦పంబు వ్యాఘ్రమూర్తి,బంధురశస్త్రంబు ♦ గంధమాల్య

తే. మధుసముత్సేకమోదిత♦మారుతంబు, జలధరరవంబు శూరసం♦చయగతంబు

నగుచు వచ్చెడియసుర♦సై♦న్యంబుఁ గాంచి, యార్భటుల నించి శాఖామృ♦గాళి సేన.

[1] ఒడుములు = భూషణములు.

కం. మిడుతలు పావకకీలలఁ, బడు తెఱఁగునఁ దరులు గిరులు ♦ బలువడిఁ గొని పై
పడి పోరొనరించిన వా, రడిదంబుల నఱికి వైచి ♦ రగచరులతలల్. ౧౮౧౫

ఉ. మాదము పెక్కి వేదుఱుల ♦ మాడ్కి వెసం బఱతెంచి పండులన్
ఛేద మొనర్చి కర్ణములఁ ♦ జేకొలఁదిం బిడికిళ్ల శీర్షముల్
భేదిలఁ గొట్టి పెన్ సెలల ♦ వ్రేటుల నంగము ముద్దఁ జేసి సొం
పేదఁగ శత్రుసైన్యముల ♦ నేడ్తెఱఁ జేసిరి కీశవల్లభుల్. ౧౮౧౬

కం. ఆయిరువాఁగున మిక్కిలి, చేయంగలవారు శత్రు ♦ సేనాభటులన్
జే యని యార్చుచుఁ గూల్చి ర, మేయపరాక్రములు నుదురు ♦ మిడుకులు పోరన్.

సీ. కొట్టఁబోయెడువానిఁ ♦ గొట్టిపోయె నొకండు, త్రోయువానిని బడఁ ♦ ద్రోసె నొకఁడు
చంపఁ బూనెడువానిఁ ♦ జంపె వే ఱొకరుండు, కొఱికెడువానిని ♦ గొఱికె నొరుఁడు
తిట్టెడువానిని ♦ దిట్టె వే ఱొక్కరుండు, గ్రుద్దెడివానిని ♦ గ్రుద్దె నొకఁడు
నీచేతిబలువును ♦ జూచెద రార నా, నిదిగొ వచ్చితి నంచు ♦ నెదురు నొకఁడు

ఆ. బక్కవానిమీఁదఁ ♦ బౌరుషమా నిలు, మిటులు ర మ్మటంచు ♦ నిట్టు లొకరి
నొకరు గదిరిపలికి ♦ యుద్ధభూమిని దమ, భుజబలంబుకొలఁదిఁ ♦ బోరుచుండ.

ఉ. ఒల్లియ జాఱ సాధనము ♦ లూడఁ దనుత్రము లుర్విపాలుగా
నొల్లు నెఱుంగ కయ్యసుర ♦ యూథము లుద్యతశూలయష్టులన్
బెల్లుగ మోఁది కీశులను ♦ బ్బెల్లుఱఁ జేయఁగ వారు నీరసం
బుల్లము నిండఁ బోరఁగ మ ♦ హోగ్రగతిన్ దుర మొప్పె నయ్యెడన్. ౧౮౧౯

కం. పదుపుర నేడ్వురఁ గపులను, విదళింపఁగ నసురవరులు ♦ వివిధాస్త్రములన్
బదు నేడ్వురుగాఁ జంపిరి, వదలక వానరులు దైత్య ♦ వర్యుల నపుడే. ౧౮౨౦

కం. విరితలలు జాఱుచేలలు, చిరిఁగినకక్కములు మేలి ♦ జీరాలును నై
పరుగిడురక్కసులను దరు, చరు లుద్ధతిఁ జుట్టుముట్టి ♦ చంపుచు నుండన్. ౧౮౨౧

అంగదుఁడు కంపను వధించుట.

ఉ. వీరజనక్షయంబుగఁ బ్ర ♦ వృత్తము నా తుములాహవంబునన్
ధీరవరేణ్యుఁ డంగదుఁడు ♦ తెంపరి యై సమరోత్సుకత్వమే
పారఁగఁ గంపనుం దొడర ♦ నాతఁడు రా యిటు ర మ్మటంచుఁ గ్రో
ధారుణితాక్షుఁ డై యడిచె ♦ హస్తగతం బగు పెన్గదన్ వడిన్. ౧౮౨౨

ఉ. అంగదుఁ డాగదం బెఱికి ♦ యాతని దానన కొట్టెఁ గొట్ట స
ర్వాంగములుం జలింప జడు ♦ నట్లయి తెప్పిఱి మాఱుతాఁచినన్
శృంగ మొకండు నయ్యసుర ♦ శీర్షమునం బడ నేయ దానితో
సంగరభూమిఁ ద్రెళ్లె హత ♦ సత్త్వుఁడు ప్రాణము లెడ్డా పాయఁగన్. ౧౮౨౩

ఉ. గండటి వీఁకఁ గ్రై పడిన ♦ కంపనుఁ గన్గొని వేగ శోణితా
క్షుండు శరంబులం గురియు ♦ చుగ్రనిమస్సని నొంప వాఁడు ను
ద్దండతఁ జాపసైంధవర ♦ థంబుల ను గ్గానరింప ఖేటముం
జండతరాసిఁ గొంచు రథ ♦ సంబున మింటికి నుద్గమించినన్. ౧౮౨౮

తే. తోడనే వాలిసూనుఁడు ♦ కూడ నెగిరి, కరమునం దున్నయసి బలా ♦ త్కారముగను
గుంజుకొని యంసఫలకంబు ♦ నం జిరాన, వఱకె జందెము నట్లు మై ♦ పఱియ వాయ.

సీ. ఆఖడ్గమును గొని ♦ యరుల నొంపఁగ శోణి, తాక్షుండు నాయసం ♦ బైనగదను
గైకొని తాఁకె నొ ♦ క్కటఁ బ్రజంఘుండు యూ, పాక్షుండు గలసిరా ♦ యగచరేంద్రుఁ
డిరువంక రక్కసు ♦ లెసఁగ విశాఖన, డిమిపూర్ణచంద్రుచం ♦ దము వహించె
నాతని రక్షింప ♦ నరిగి మైందద్వివి, దులు సరభసముగఁ ♦ దోడుపడిన

ఆ. ముగురురాక్షసులకు ♦ ముగురువానరులకుఁ, బోరు ఘోర మయ్యె ♦ భూజచరులు
వైచు వృక్షములను ♦ వారక ఖండించె, నసిఁ బ్రజంఘుఁ డనెడి ♦ యసురవరుఁడు.

కం. శరముల యూపాక్షుఁడు త, త్తరువుల ఖండించె ద్వివిదు ♦ తరువుల ధరణిం
దొరఁగించె శోణితాక్షుఁడు, గురుగదచే నంత మిగులఁ ♦ గుపితుం డగుచున్.

కం. పరమర్మనికృంతనమును, గరము భయంకరము నైన ♦ ఖడ్గోత్తంసం
బిరుగేలఁ గొని ప్రజంఘుఁడు, సరభసముగఁ గవిసె వాలి ♦ సంభవుమీఁదన్.

## అంగదుఁడు ప్రజంఘుఁ జంపుట.

సీ. అభ్యాసగతుఁ డైన ♦ యసురఁ దారాసుతుం, డశ్వకర్ణద్రుమా ♦ హతునిఁ జేయ
నా యేటువడికిఁ జే ♦ యడిదంబు జాఱినఁ, బిడికిట నొసటను ♦ బొడిచెఁ గపిని
నంగదుండును మూర్త ♦ మాత్రంత కంపించి, తేఱి కరాచూరిఁ ♦ దెగఁగ వ్రేసె
నా ప్రజంఘునితల ♦ హతుఁ డైనపినతండ్రిఁ, గనుసీరు గాఱఁగఁ ♦ గాంచి బాణ

తే. హీనుఁ డౌటను దరవాగి ♦ నెత్తికొంచుఁ
బఱచె యూపాక్షుఁ డంగదు ♦ పైకి నింత
లోన ద్వివిదుండు దొడరి య ♦ వ్వానిఁ జొమ్ము
పగుల వెస గ్రుద్ది బంధించె ♦ బాహుయుగళి. ౧౮౨౯

తే. చిక్కువడి యున్నసోదరుఁ ♦ జేర నరిగి, శోణితాక్షుండు ద్వివిదుండు ♦ సొక్కగదను
నురముపై మోఁద నాతండు ♦ త్వరగ లేచి, యసురవీరుని చేగద ♦ నపహరించె.

కం. రూక్షబలుఁడు మైందుఁడు యూ, పాక్షు నురముఁ గేల నడిచె ♦ నటు క్రోతులకున్
రాక్షసులకుఁ బోరయ్యెను, జక్షూరమ్యంబు హృదయ ♦ సంభ్రమకర మై. ౧౮౩౧

చం. ద్వివిదుఁడు శోణితాక్షుఁ బృథి ♦ విం బడఁ ద్రోచి యురంబుఁ ద్రొక్కి రో
షవివశుఁడై నఖాళి నుర ♦ శ్శాత్రవునాస్యముఁ బీఁకి కుత్తుకం

దవులఁగ నొత్తి నుల్లి నిధ♦నం బొనగూరిచె నంతలోనఁ గీ
శవిభుఁడు మైందుఁడుగ్ గెడపె ♦ సత్వరుఁ డొచును యూపనేత్రుసిన్. ౧౮౩౩

## కుంభుఁడు వానరవీరుల నొప్పించుట.

సీ. హతవీర మైనసై♦న్యంబు వెల్వెలఁ బోయి, కుంభుఁ జేరఁగఁ బోవఁ ♦ గ్రోధమూర్తి
యయి యాతఁ డుగ్రత ♦ జ్యాలతానాదంబు, దిక్కులఁ బర్వఁగ ♦ నుక్కుమిగిలి
ప్రాదినీసంయు తై♦రావతాఖ్యనగారి, చాపంబుఁ దలఁపింపఁ ♦ జాప మూని
యాశీవిషోపమా♦నాశుగంబులఁ గపి, ప్రాణాశుగంబుల ♦ నాహరింప
తే. ద్వివిదు నాశ్రవణాకృష్ట♦విశిఖములను, వేయ నాతండు తద్గతి ♦ విహ్వలించి
కొండ యనఁ గూలె నిట్లు త♦మ్ముండు పడినఁ, బెద్దశిలఁ గుంభు మైందుండు♦విసరివైచె.

ఉ. పైపడవచ్చుతచ్ఛిలను ♦ బాణములేనిటఁ దున్మి దందశూ
కోపమబాణ మేయఁ బడె ♦ నుర్విని మైందుఁడు సైఁప లేక తా
నేపతి, మేనమామ లిటు ♦ పృథ్విఁ బడం గని యంగదుండు సా
టోపుఁడు కుంభుఁ దాఁకెను బ♦టుప్రతిహీనబలైకధుర్యుఁ డై. ౧౮౩౪

## అంగదుఁడు కుంభుచే నొచ్చి పడుట.

ఉ. వచ్చెడువాలిపుత్త్రు శర♦పంచకముగ్ మఱిమూఁటఁ బెక్కిటిగ్
జిచ్చులువోనివాసి వెసఁ ♦ జిమ్మె నమోఘము లైనముల్కులగ్
హెచ్చిన తెంపునం గపియు ♦ నేమియుఁ బ్రుక్కక యోర్చి నిల్చి పై
పెచ్చుగ జాలవాన యొద♦వించెను గుంభునిపై రయోద్ధతిన్. ౧౮౩౫

ఉ. ఆతఁడు దానినెల్లఁ దుము♦రై పడఁ జేసియు మీఁదవచ్చు తా
రాతనయుగ్ భ్రువుల్ దగుల ♦ రాజితపుంఖశరాళి నుల్కనం
ఘాతముచేఁ గరింబలె ది♦గాల్పడఁ గొట్టిన నెత్రు కాఱఁగా
జేతను మూసి నేత్రములు ♦ చేయలఁతిం[1] గలభూరివృక్షమున్. ౧౮౩౬

కం. రెండవకరమున యామొ,క్కండు వెసం బట్టి బోరఁ[2] ♦ గదలిచి మొదలుగ్
గండున గజ మనఁ బెకలిచి, చండోద్ధతి వైచె నసుర♦సత్త్వముమీఁదన్. ౧౮౩౭

ఉ. మందరసన్నిభంబు శత♦మన్యుధనుఃప్రతిమంబు వృక్షముగ్
జిందఱ చేసి యద్దనుజ♦శేఖరుఁ డంగవిభేదనంబు ల
స్యందజవంబు లైనదృఢ♦శాతశరంబుల మేను వ్రచ్చినగ్
గొందలపాటుతోడ ధరఁ ♦ గూలె సహింపఁగ రానివేదనన్. ౧౮౩౮

తే. అఱచి వేదన మూర్ఛపా♦లై సముద్ర, తీరమునఁ గూలి యున్న యా♦ధీరవరుని
పాటు కొందఱుకీశులు ♦ పలుక రామ, చంద్రుఁ డనిచెను దోడ్పడ ♦ జాంబవంతు

[1] చేయలఁతి = సమీపము. [2] బోర = వక్షము.

కం. తక్కినవీరులఁ గొందఱు, నెక్కుడుకోపమున వారు ♦ వృక్షశిలాదుల్
మిక్కిలిగఁ గొనుచుఁ గుంభుని, గ్రక్కునఁ దాఁకిరి కుమార ♦ రక్షణపరులై. ౧౮౪౦

సీ. వేగదర్శిసుషేణ ♦ విధినుతుల్ క్రుద్ధులై, తనమీఁద వచ్చుచం ♦ దంబుఁ గాంచి
స్రోతస్సువేగంబు ♦ ద్రుమనగాదులచేత, నరికట్టుగతి మార్గ ♦ ణౌఘములను
వారి నాఁకట్టెఁ ద ♦ ద్బాణపరంపరఁ, గంధి వేలనుబోలెఁ ♦ గడవ లేక
చిక్కువడం గని ♦ యెక్కుడుకోపాన, భాస్కరపుత్త్రుండు ♦ భ్రాతృతనయు
ఆ. వెనుక వేసికొనుచు ♦ వనగజంబును వెలి, బొబ్బమెకము తలుము ♦ పోల్కిఁ దఱిమి
యశ్వకర్ణధవము ♦ ఖావనీరుహముల, చాలు గురియఁ జేసెఁ ♦ జెదలు నిండ. ౧౮౪౧

సుగ్రీవుఁడు కుంభు నుపాలంభించుట.

ఉ. ఈనునఁ గొంభకర్ణియు న ♦ నేకశరంబుల వాని నెల్లఁ బోఁ
ద్రోసిన నవ్వి శంకుచిత ♦ రూక్షశతఘ్నులుపోలె నొప్పఁగా
భాసురతేజుఁ డర్కజుఁడు ♦ పైపయి రాలెడిబాణజాలము
న్వాసరపోనిధీరత గ ♦ ణింపక పైపడి దూఁకి చాపమున్ ౧౮౪౨

చం. విఱిచి సుదుష్కరంపుఁగృతి ♦ వే ఘటియించియుఁ గిన్క దంతముల్
విఱిగినమత్తకుంజరము ♦ లీల వహించినకుంభు నిట్లనున్
వెఱఁ గొనరించె నీవిశిఖ ♦ వేగము కుంభుఁడ! నీదుశౌర్య మ
ట్లులవగుసన్నతిన్ బలిమి ♦ నుద్దివి నీపెదతండ్రి కెంతయున్. ౧౮౪౩

సీ. బలపరప్రహ్లాద ♦ బలినికషాత్మజ, వైశ్రవణుల కెత్తు ♦ వత్తు వీవు
నీతండ్రిసముఁడవు ♦ నీ వొక్కఁడవె సుమ్ము, నైజదేహబలంబు ♦ తేజమునను
నిను మీఱ నేరరు ♦ నిర్జరులైనను, విజితేంద్రియుని నాధి ♦ బృంద మనఁగఁ
బ్రాజ్ఞుఁడా! నీయెల్ల ♦ బలము నేఁ జూడఁగఁ, గోరెదఁ జూపుమీ ♦ కొంకు లేక
ఆ. నీదు పెద్దతండ్రి ♦ నిరుపమవరశక్తి, సహజశక్తి నీదు ♦ జనకుఁ డమర
చయము నేఁచి రీవు ♦ చాపంబునను శక్ర, వైరి బలిమిఁ బంక్తి ♦ వదనుమాద్రి. ౧౮౪౪

చం. బలమునఁ బేర్కొనం దగిన ♦ వాఁడవు నీ వొకరుండ రాక్షసా
వళులను నాదునీపెనుకు ♦ వన్ హరిశంబరజన్యభంగి నీ
కలిగినభూతసంతతులు ♦ కాంచెడిఁ గాక, దృఢాస్త్రచాపకౌ
శలమునఁ గీశ వీరులను ♦ జంపితి వెంతటిశౌర్యశాలివో. ౧౮౪౫

కం. అపవాదభయంబున ని, న్నిపుడే వధియింప నొల్ల ♦ నిఁక నాయాసం
బపనీతముగాఁ బోఁడగుమ, యపు డీవు మదీయబలము ♦ నంతయుఁ గనుమా.

కం. అని గౌరవరూపకవా, క్యనిచయముల హేళనంబు ♦ గావింపఁగ న
య్యినతనయునిఁ బట్టుకొనెన్, ఘనమదబలయుతుఁడు కుంభ ♦ కర్ణసుతుండున్.

### సుగ్రీవుఁడు కుంభుని వధించుట.

ఉ. వానిని వీడఁ దన్నికొని ♦ వానరనాథుఁడు వెండి దండిచం
దానను బైపడంగ నిటు♦దానవవానరవీరు లుద్ధతిన్
బూనినరోషవేగములఁ ♦ బోనిమదంబులఁ గొంచెమేనియున్
న్యూనత లేనిబింకముల ♦ నుద్ధతిఁ బోరిరి దంతులో యనన్. ౧౮౪౮

ఉ. మాటికి మాటి కూర్చుచును ♦ మార్కొని యొండొరుతోఁ బెనంగుచున్
బాటిగఁ జేసినట్లు తను♦వల్లరు లొప్పఁగఁ గ్రిందఁ బొర్లుచున్
బ్రేటుల నొంచుచుం బరుశ♦రీరము నీడ్చుచు గాసి బోలుచున్
నోట సధూమకీలల స♦నూనముగా వెడలించు చిర్వురున్ ౧౮౪౯

మ. పదఘాతంబుల వార్ధి ఘూర్ణిలఁగ దు♦ర్వారంబుగాఁ బోరుచో
నద నైనన్ వెసఁ గుంభుఁ బట్టికొని పా♦రావారమధ్యంబునన్
మదమారన్ రవిసూనుఁ డేసినను విం♦ధ్యగ్రావతుల్యంబుగా
నుదధిన్ నీరము లేని యొడ్డటిమె, శౌ♦ర్యోదగ్రుఁ డై కుంభుఁడున్. ౧౮౫౦

ఉ. కోపము రూపముం గొనిన♦కోపున వారిధి నుద్గమించి పె
ల్లేపున దాపునం దుమికి ♦ యింద్రపవిస్ఫుటవేగముష్టి సా
టోపతఁ గ్రుద్దినన్ మెయి క♦డుంగడుఁ జీలి స్రవించె రక్తజా
లాపగ తత్ప్రహారమును ♦ నాఁచెఁ దదంగగతాస్థిసంతతుల్. ౧౮౫౧

తే. దివిజపతి మేరుపక్షముల్ ♦ ద్రెంచు నపుడు, వజ్రనిష్పేషసంజాత♦వహ్ని యనఁగఁ
బిడుగునకు నుద్ది యైనయా♦ప్రేటువలన, వింతరుచి దోఁచె నాహరి♦కాంతు మేన.

ఉ. హా యని వానరేంద్రుఁడు స♦ముజ్జ్వలహేతిసహస్రభాసురం
బమ్మహికారిమండలము♦నట్టి దృఢంబును శక్రవజ్రక
ల్పమ్మును నైనముష్టి బిగఁ♦బట్టి తదాశరువక్షమున్ ధృతిన్
గ్రమ్మినఁ దత్ప్రహారమునఁ ♦ గూలెను గుంభుఁడు విహ్వలాత్ముఁ డై. ౧౮౫౩

కం. శూలితిరస్కృతఖరకర,మాలి యనం బ్లవగనాథ♦మర్దితుఁ డై తా
నేలఁబడి తన్నికొని వి,జ్వాలం బగువహ్నిపోలెఁ ♦ బలలాదుండున్ ౧౮౫౪

కం. దివినుండి లోహితాంగుఁడు, భువిఁ గూలినయట్లు ప్లవగ♦పుంగవహతుఁ డై
భువిఁ గుంభుఁడు పడ వడఁకెన్, సవనాద్రిధరిత్రి యసుర♦సంతతి బెగడెన్. ౧౮౫౫

### నికుంభుఁడు కపులఁ బాఱఁదోలుట.

ఉ. కుంభు నిజాగ్రజుం బ్లవగ♦కుంజరుఁ డిట్లు వధింప రోషసం
రంభవిజృంభితుం డగుచు ♦ మంటలు గ్రమ్మెడిచూడ్కి చేత సం

స్తంభితుఁ జేయున ట్లసురి ♦ స్రక్కనకాంబరభూషితంబు ను
త్తంభితశృంగసన్నిభము ♦ దత్తకరాంగుళపంచకంబునున్. ౧౮౫౬

సీ. యమదండతుల్యంబు ♦ నఖిలరాక్షసలోక,భయనాశకం బైన♦పరిఘ మెత్తె
నలనికుంభుఁడు వక్ష♦తలగతనిష్కంబు, లంగదంబులు మెఱుఁ♦గారు చుండఁ
గుండలంబులు కాంతి♦మండలంబుల నీనఁ, బరిఘంబుతో వాఁడు♦ప్రజ్వలించె
శంపాలతాయుత♦జలదంబుమాడ్కని, దాని త్రిప్పునఁ బుట్టు♦దారుణాగ్ని

తే. చే మహావాయువులు మండు♦చెలువుఁ జూపె
నలక గ్రహతారకలును మ♦హాగ్రహాళి
చందురుండును భువనంబు♦సకల మింద్ర
పురముతోఁ గూడ భ్రమియించు♦కరణి నుండె. ౧౮౫౭

కం. పరిఘాభరణప్రభలం, బరఁగి నికుంభాగ్ని కీశ♦వరులకుఁ గల్పో
ద్ధురవహ్నివోలె సైఁపం, దర మేమియుఁ గామి మిగులఁ♦దరలిరి భీతిన్. ౧౮౫౮

కం. కదలక మెదలక యేమియుఁ, బెదవులఁ దడి లేక యెసఁగు ♦ వెఱపున నసురల్
మద మఱి కీశులు నిలఁబడి, రెదవడ కొక్కండు హనుమ ♦ యెదురఁగ నిలిచెన్.

## హనుమంతుఁడు నికుంభు వధించుట.

చం. నిలిచినవాయుపుత్త్రుఁ గని ♦ నిష్ఠురవృత్తి నురంబుఁ జూచి య
బ్బలియుఁడు దాని వైవ నది ♦ పావనిఁ దాఁకిన యంతఁ దున్కలై
పొలుపఱి పెక్కులుల్క లన ♦ భూమిని వ్రాలెఁ, దదాహతిం ధరా
చలనమునందు శైల మనఁ ♦ జంచలతం గని పావమానియున్. ౧౮౬౦

కం. ఉఱుగక వెంటనె బెడిదపుఁ, బిడికిటిపోటున నికుంభు ♦ వే తాఁచిన వాఁ
డడలియుఁ దెప్పిరి కపిపైఁ, బడి పట్టంగ దనుజు లార్వఁ ♦ బ్రముదితు లగుచున్.

కం. పట్టువడి యుండి గాడుపు,పట్టియు దృఢముష్టిఁ బొడిచి ♦ పగతుని బలిమిం
బట్టు విడఁగొట్టికొని మఱి,కొట్టెం గడు హెచ్చరికను ♦ గూలఁగ ధరిణిన్. ౧౮౬౨

తే. పృథివిఁ బడఁదన్ని యతనిపై ♦ కెగిరి వేగ
చక్కబిగఁబట్టి మెడఁ ద్రిప్పి ♦ శాత్త్రవుండు
గర్జిలుచు నున్న విడువక ♦ కాల నులిమి
మృత్యువును గూర్చె యొక్కని♦మేషమునను. ౧౮౬౩

ఇంద్రవంశము. కుంభానుజన్ముం డిటు♦గూల నేలపై
గంభీరరావంబున ♦ శాఖాధరాటులుం
శుంభద్గతిం సమ్మద♦శుద్ధ చిత్తులై
జృంభించి గర్జించిరి ♦ పృథ్వి యూడఁగన్. ౧౮౬౪

### మకరాక్షుఁడు యుద్ధమునకు వెడలుట.

సీ. కుంభనికుంభులు ♦ కుంభిని పాలౌట, విని రావణుఁడు రోష♦వివశుఁ డగుచుఁ
క్రోధశోకంబుల ♦ బాధితుం డై మండి,పడి మూర్ఛితుం డయి ♦ ప్రకటబలుని
ఖరపుత్త్రు మకరాక్షుఁ♦ గని పల్కెఁ బుత్త్రకా!, నాయాజ్ఞఁ బ్రబలసే♦నలు భజింపఁ
జని వానరుల రామ♦చంద్రుని లక్ష్మణు, హాతులఁ గావింపు నా♦యన! యటన్న
తే. వల్లె యనుచును వలగొని ♦ పంక్తివదను, నందనము సల్పి యి ల్వీడి ♦ బయట వచ్చి
సైన్యనాథునితోడ నా♦స్యందనంబుఁ, దెమ్ము సైన్యంబుఁ గూర్పు మా♦ ర్తమ్ములోన.
చం. అనవుడు నట్లు గూరుప శ♦తాంగము ముంగలఁ దాఁ బ్రదక్షిణం
బొనరిచి యెక్కి సూతుఁడ! స♦ముగ్రజవంబునఁ దోలుమీ యటం
చని నిశిచారులార! రభ♦సంబున మీరలు మత్పురస్థు లై
యని యొనరింపుఁ డేనును ద♦శాస్యునియానతిమీర కుద్ధతిన్. ౧౮౬౬
తే. రామలక్ష్మణులను గపి♦రాజుఁ దక్కు,గలవనేచరసంఘంబు ♦ ఖడ్గబాణ
శూలవహ్నుల దావాగ్ని♦శుష్కవనము,చందమున నిర్దహింతు న♦మందగతిని.
కం. అనవుడు రాక్షసవీరులు, సునిశితనానాయుధముల♦శోభలు నిండన్
ఘనకరు లన గర్జించుచు, మొన నిల్చిరి కామరూప♦ములఁ దాల్చి వెసన్. ౧౮౬౮
తే. శంఖభేరీసహస్రని♦స్స్వనములను, క్ష్వేళితాస్ఫోటితంబుల ♦ వికటరవము
చాపగుణటంకరణములు ♦ సంకులముగఁ, బర్వనడచిరి మకరాక్షు ♦ బలసి యనికి.
చం. అరుగుఖరాత్మజాతునిర♦థాగ్రగతంబు ధ్వజంబు నేలపైఁ
దొరఁగెను, సూతుచేచబుకు ♦ దూలె, హయంబులు గాళ్ళు తొట్రిలన్
గురువులు వాఱ కన్నులను ♦ గూర్చె నదైన్యము లై, సపాంసు లై
ఘోరిఁ బ్రతికూలవాయువులు ♦ భోరున వీచెను దారుణంబుగన్. ౧౮౭౦
కం. బహుదుశ్శకునము లైనను, సహియించి గజాహిమేఘ♦సమవర్ణులు దా
రహమహమిక[1] నసురులు దు,స్సహ తేజుని రామచంద్రు♦చక్కటి కరుగన్. ౧౮౭౧

### మకరాక్షుఁడు శ్రీరాముఁ దూలనాడుట.

చం. ప్లవగుల నంటఁ దాఁకుటయు ♦ వారల కద్భుతరోమహర్షణం
బవుసమరంబు చెల్లఁ బరి♦ఘాయుధశూలనిహంత లుర్విభృ
న్నివహకుజాళిమారకులు ♦ నిష్ఠురముష్టికలంబతాడితుల్
వివిధగదాసికుంతశర♦వృక్షశిలాచయభిన్నగాత్రులున్ ౧౮౭౨
చం. అయి సమరంబు చెల్ల మక♦రాక్షునివేఁడిమి కంపవెల్లికిన్
భయమున నెల్లవానరులు ♦ పాఱఁగ వెన్కొనిరాక్షసావళుల్

[1]అహమహమికన్ = నేను ముందు నేను ముందని.

రయమునఁ దోలఁ గోపమున ♦ రాముఁడు వారల నిల్వరించె దు
ర్జయపరసంఘభీతికర ♦ శాతమహాశుగతీవ్రవృష్టి చేన్. ౧౮౭౩

కం. వారితదనుజుల శరసం,వారము గురియించు రామ ♦ భద్రునిఁ గనిరో
షారంభుఁడు మకరాక్షుఁడు, ధీరత నిట్లనియె రామ ♦ దేవునితోడన్. ౧౮౭౪

చం. నిలు నిలు రామ! యేమిటికి ♦ నిక్కెదు? నే నిదె యున్నవాఁడ, నీ
బలువును జూడ వచ్చితిని ♦ ద్వంద్వరణంబున నీదుప్రాణముల్
బలియిడువాఁడ మేదినికిఁ ♦ బొలుపు, నాచను దేనిచోట
వలవున నాదుతండ్రి ఖరు ♦ నంతకుఁ గూర్చితి దండకాటవిన్. ౧౮౭౫

ఉ. నాయెదుటం బరాక్రమము ♦ నన్ విలసిల్లెడినిన్నుఁ జూచినం
గాయము నుండెడిన్ ఖలుఁడ ♦ కాలము నా కనుకూల మాటచే
సాయము చేసె దైవమును ♦ స్వల్పమృగంబు క్షుధార్త సింహసం
స్థాయముఁ గూర్చినట్లు నిను ♦ నాదట నిల్పె మదీయసన్నిధిన్. ౧౮౭౬

కం. నాచే నని నిహతిం గని, వే చని సూర్యాత్మజాతు ♦ వీటికి నట మున్
నీచేఁ జచ్చినవీరని,శాచరులున్ నీవు క్రీడ ♦ నల్పుఁడు చెలిమిన్. ౧౮౭౭

ఉ. ఏటికిఁ బెక్కుమాటలు న ♦ రేశ్వర! యెల్లరుఁ జూచువారు నీ
యేటును నాదుపోటు, నిపు ♦ డే గదనో యితరాస్త్రశస్త్రముల్
కోటినొ రిత్తచేతులనొ ♦ కోరెద వెయ్యది యెందు నీవు మేల్
పోటరి వద్దియే కొనుము ♦ పోరికి రమ్మన మందహాసి యై ౧౮౭౮

కం. ఏటికి వికత్థనములు[1] ని,శాటుఁడ! యే మేమొ ప్రేల ♦ వ్యర్థముగ ననిన్
బోటరితనమునఁ గాకిటు, మాటలబలమునను జయము ♦ మనఁగునె యెందున్.

ఉ. ఆలములోఁ జతుర్దశస ♦ హస్రనిశాటము సేన దండకన్
బాలిశ! దూషణుం ద్రిశిరుఁ ♦ దత్పితఁ నేఁ బొరిగొం టెఱుంగవా?
హాళిని దీక్ష్ణతుండనఖ ♦ రాంకురగృధ్రసృగాలమాకభుల్
చాలఁగఁ దత్ఛరీరతర ♦ సంబు భుజించుత ముక్కుబంటిగన్. ౧౮౮౦

## శ్రీరాముఁడు మకరాక్షు వధించుట.

చం. అనవుడు రామచంద్రునిశ ♦ రాధికవృష్టిని ముంచె దైత్యుఁ డా
ఘనశరపాళినెల్ల నిజ ♦ కాండములన్ హరియించె రాముఁడున్
దనుజనరేంద్రు, లీగతి మ ♦ దంబు జవంబు బలంబుఁ జూపుచున్
బెనఁగిరి జ్యారవంబులు ది ♦ విన్ ఘనఘుర్ఘణసన్నికాశ మై ౧౮౮౧

చం. పరఁగఁగ మాని దానవ సు ♦ పర్వమహోరగులుం దదీయసం
గరమును జెప్పహా టిడక ♦ ఖస్థలి నిల్చి కనుంగొనం బర

[1] వికత్థనములు = పొగడుకోలుమాటలు.

స్ఫురకరముక్తబాణముల ♦ భంగ మొనర్చుచు నంత కంతకుం
బెరుఁగుబలంబుతో నలఘు♦వీర్యము ధైర్యము శౌర్య మేర్పడన్. ౧౮౮౨

ఉ. రాముఁడు వైచుబాణముల ♦ రాక్షసవీరుఁడు నేలఁ గూల్పఁ గా
రాముఁడు రాక్షసాశుగప♦రంపరలన్ శతధావిభిన్న మై
భూమిని వ్రాలఁ జేసె, నిరు♦వు ర్నిగిడించుఖగాళి దిగ్విది
క్స్తోమము నిండె, నెద్దియును ♦ దోఁపక యుండె రణాజిరంబునన్. ౧౮౮౩

మ. తనతోసాటిగఁ బోరురాక్షసునిచం♦దం బంత వీక్షించి చ
య్యన రాముండు ధనుస్సుఁ ద్రుంచి వసుసం♦ఖ్యాకేషులన్ సారథిన్
దునిమెన్, వాజులఁ ద్రుంచెఁ దద్రథము ని♦ర్ఘాతంబుఁ గావించె, నం
త నిశాటుండు ధరాస్థలిన్ దుమికెఁ జే♦తన్ శూలముల్ గ్రాలఁగన్. ౧౮౮౪

కం. లోకభయంకరశూలము, భీకరగతిఁ ద్రిప్పి విసరి ♦ వేసెన్ రాముల్
గాకుత్స్థవరుఁడు దానిని, నాకసమం దొకశరత్ర♦యంబునఁ ద్రుంచెన్. ౧౮౮౫

కం. మిడుఁగురులు సెదర శూలము, పొడిపొడియై ధరణిఁ బడిన ♦ భూతములెల్లన్
బుడమిసుతవిభునిఁ బొగడెను, గడు మేల్ మేల్ మే లటంచు ♦ గగనము నిండన్.

ఉ. శూలము భగ్నమై చెడిన ♦ శూరవరుండు క్షపాచరుండు దాఁ
గేలిన ముష్టి గూర్చి రఘు♦కేసరి! నిల్చిలు మంచుఁ బైపడన్
రా లలితాల్పహాసవద♦నద్విజరాజు క్షమాత్మజామనో
జ్ఞాళి గుణంబుఁ గూరిచి భ♦యంకరపావకబాణ ముగ్రుఁ డై ౧౮౮౭

కం. చిమ్మిన నాయమ్మును వేగమ్మునఁ జని యసురుటొమ్ము ♦ గాఁడిన క్షణమా
త్రమ్మున ధరణిం బడి కా,యమ్మును విడి యమునియాల♦యమ్మున కరిగెన్. ౧౮౮౮

తే. రామచంద్రునిచే నిట్లు ♦ రాక్షసుండు, పడినఁ జెలరేఁగి పొంగెఁ బ్ల♦వంగతతులు
దశరథాత్మజబాణపా♦తంబుభీతి, యలమఁ బఱచెను హతశేష ♦ మసురసేన.

↞ ఇంద్రజిత్తు రెండవసారి యుద్ధమునకుఁ బోవుట. ↠

కం. పటుబలుఁ డగుమకరాక్షుం, డిటు హతుఁ డగు టాలకించి ♦ యింద్రారి క్రుధన్
బటపట రదములు కొఱుకుచుఁ, గుటిలచరిత్రునకుఁ దనదు♦కొడుకున కనియెన్.

ఉ. వీరుఁడ యింద్రజీ! యధిక♦వీరుల రాము సుమిత్రపుత్రకున్
బోర వధింపు మెట్లయినఁ ♦ బొంచియొ తోఁచియొ మాయ మించియో
యారయ నీవె యింతకు స♦మర్థుఁడవుం బ్రబలుండ వల్లభృం
దారకనాయకున్ సమర♦ధాత్రి జయింపవె వాల్మగండ వై. ౧౮౯౧

కం. మానవు లన లెక్కయె పుత్రా! నీమహిమంబునకును ♦ దరలు మటన్నన్
గా నిమ్మని సెలవుం గొని, తా నేగెన్ యజ్ఞభూమి ♦ దహనున్ వేల్వన్. ౧౮౯౨

తే. అరుణవర్ణంబు లైనమా♦ర్ధాంబరములు, చేతఁ దాలిచి భయమున ♦ శీఘ్రగతిని
 చాఱుదెంచిరి రాక్షస♦వనిత లపుడు, దేవపతిశాత్రవుఁడు వేల్పు♦దేశమునకు.

సీ. లాజలు గంధమా♦ల్యంబులచే నొప్పు,హావిచేత నర్చించి ♦ యగ్నిహోత్రు
 శరపత్రములు గాఁగ ♦ శస్త్రముల్ ఘటియించి, తాండ్రశాఖల సమి♦ధలుగఁ జేసి
 యెఱ్ఱవస్త్రము లూని ♦ యినుపస్రువముఁ బూని, శరపత్రమధ్య దే♦శంబునందు
 మిమ్మటంబుగ నల్ల♦మేఁకను బలి యీయఁ,బొగ లేనిమంటలఁ ♦ బొలుపుమీఱి

ఆ. విజయలక్షణముల ♦ వెలికి సూచించుచు, నప్రదక్షిణముగ ♦ జ్వాల లెగయఁ
 బసిఁడినగలు దాల్చి♦ప్రత్యక్షముగ రోహి, తాశ్వుఁ డెగయుఁ దెంచి♦హవిగ్రహించె.

సీ. దశకంఠసూనుఁ డం♦తర్ధానగతమును, వాజిచతుష్క వి♦రాజితంబుఁ
 గనకపరిచ్ఛదం ♦ బనల తేజంబును, జంద్రార్ధచంద్రని♦శాతవిశిఖ
 సంపూర్ణమును మృగ♦సంయుతంబును నగు,రథ మధిరోహించి ♦ రమ్యశాత
 కుంభకంబువు నయి ♦ జృంభితపావక, తులిత మై వైడూర్య♦కలిత మైన

తే. ధ్వజము మెఱయంగ సూర్యక♦ల్పంబు బ్రహ్మ
 శరము రక్షింప దుస్సాధ♦సత్త్వుఁ డగుచుఁ
 బురము వెలువడి రాక్షస♦పూగములకుఁ
 బలుకు నిట్లని నిజబాహు♦పటిమ తెలియ. ౧౮౪౫

⟵ ఇంద్రజి త్తదృశ్యుండై కపిసేనల రామలక్ష్మణుల నొప్పించుట. ⟶

చం. అనృతమునీంద్రవేషకుల ♦ నాజి వధించి జయం బొసంగెదన్
 జనకునకున్, ధరాతలము ♦ సత్యము నేఁడ యరామలక్ష్మణం
 బును నకపిప్రకాండ మగుఁ ♦ బూర్ణముదంబు సురారినేతకున్
 బొనరు నటం చదృశ్యుఁ డయి ♦ పోరికి నేగె జయాభిలాషి యై. ౧౮౪౬

చం. దశముఖచోదితుం డతుల♦దారుణరోషుఁడు దివ్యచాపవ
 ద్విశిఖధరుండు గాంచె నవ♦ధీరితనైఋతయోధులన్ రుషా
 వశులఁ ద్రిశీర్షపన్నగవి♦భాప్రవిభాసులఁ గాంచి పీ రహో
 దశరథపుత్రకుల్ ప్లవగ♦దండసమావృతు లంచు నెంచుచున్. ౧౮౪౭

ఉ. చాపము నెక్కు వెట్టి శర♦సంతతి వారలమీఁద ఘోరధా
 రాపతనంబుభంగిని బ♦రంపరగాఁ గురియింప భ్రాతలున్
 రోషపరీతగాత్రు లయి ♦ రోషమునన్ వినువీధి మార్గణ
 వ్యాపితముం బొనర్చ నొక♦బాణము నేనియుఁ దాఁక దింద్రజిన్. ౧౮౪౮

సీ. ధూమాంధకారంబు♦భీమంబుగాఁ జేసి,యభ్రంబు మూఁడమం ♦ చలమినట్టు
 లొనరించి శరవర్ష ♦ ముగ్రతఁ గురియంగ, గుణాలతాఘోషంబొ ♦ ఖురరవంబొ

నేమిధ్వనియొ మఱి ♦ యేమియు వినరాదు, బాణపాతం బొండ ♦ ప్రబలుచుండె
రావణి యెదు రేగి ♦ రామలక్ష్మణులమే,నులు ముంచె నారాచ♦ములను వారు

తే. హన్యమానశరీరులై ♦ యధికవృష్టిఁ, దాడితం బైనగిరులచం♦దంబుఁ దాల్చి
వానిశరములు వచ్చెడి♦వలను చూచి, కఱకుములుకులు చిమ్మిరి ♦ కడఁక మెఱసి.

మ. అతఁ డా బాణపరంపరం దరలి బా♦ధాయుక్తుఁ డై బాణసం
తతులం బైఁ గురియంగ దాశరథులు ♦ న్వావిర్ మహాస్త్రంబులర్
శతధాభిన్నముఁ జేయుచుం బెనఁగ ర♦క్షస్సత్తముం డుద్ధతిర్
శితనారాచము లుగ్రవేగమున వై♦చెర్ దేహముల్ వ్రీలఁగన్. ౧౯౦౦

ఉ. పూచినకింశుకంబు లనఁ ♦ బొల్చుచు రాఘవు లుండ నేరి కా
నీమనియూపమో ధనువొ ♦ నిల్చిన పోయెడు నట్టిచొప్పొ నా
రాచములో కనుంగొనఁ ద♦రం బెటుగా, దిటు వాఁడు మాయచే
నేచిన నూర్లు వేలుగ మ♦హిం బడె వానరసంఘ మెల్లెడన్. ౧౯౦౧

ఉ. ఆకుటిలాత్మచందమున ♦ కాగ్రహ మూని సుమిత్రపట్టి సీ
తాకమనుర్ వచించె విధి♦దారుణబాణముచే నరాక్షసా
నీకముఁ జేసెదర్ జగము ♦ నీకది సమ్మత మేని యన్న న
స్తోకదయాపరుండు పరి♦శుద్ధమనస్కుఁడు తమ్ము నిట్లనున్. ౧౯౦౨

ఉ. ఒక్కనికారణంబునను ♦ నుర్విఁ గలట్టిసమస్తదైత్యులర్
ద్రుక్కఁగఁ జేఁత ధర్మ మొకొ ♦ సొక్కినవాని నయుధ్యమానిఁ దా
నుక్కఱిపాఱువానిఁ గర ♦ యుగ్మము మోడ్చిన డాఁగి యున్న నా
దిక్కఁక నీవ యన్నను వ♦ధింపఁగ ధర్మముగాదు శాత్రవున్. ౧౯౦౩

ఉ. వీని వధించు నవ్వెరవు ♦ వేగ ఘటింతము, వీఁడు మాయచేఁ
గానఁగరాఁ డ డెట్లయినఁ ♦ గానఁగఁ జేసినయంతలోన నే
వానరు లే వధించెదరు ♦ వాఁడు రసాతల మేగినర్ దివం
బేని గమించినం దునుమ ♦ నే నిదె పూనెదఁ జక్కఁ జూడుమీ. ౧౯౦౪

కం. మామకశరదగ్ధుం డై, భూమిం బడుఁ జూడు మంచుఁ ♦ బురుషోత్తముఁ డు
ద్దామరుషామతి వికసిత, తామరసేక్షణుఁడు చూచెఁ ♦ దారాపథమున్. ౧౯౦౫

## ⟷ ఇంద్రజిత్తు మాయాసీతతో హనుమంతుఁ డున్నదిక్కున కేగుట. ⟷

కం. యోద్ధమణి యైనరఘుపతి, బుద్ధి యెఱేఁగి పంక్తికంఠ♦పుత్త్రుఁడు మరలెర్
యుద్ధంబు మాని పురికిని, గ్రుద్ధుఁడు రాఘవుఁ డటంచుఁ ♦ గొఱలెడిభీతిన్. ౧౯౦౬

కం. తనవారలమరణంబును, మనమునఁ దలపోసి పోసి ♦ మండుచుఁ గినుకర్
గనుఁగవ నిప్పుక లురలఁగ, మనుజాదుఁడు వచ్చెఁ బశ్చి♦మద్వారమునన్. ౧౯౦౭

ఉ. వచ్చి సుయుద్ధ్యమానరఘు ♦ వర్యులపొం గణఁగింప నెంచి రూ
పచ్చుపడంగ మాయజన♦కాత్మజఁ గల్పన చేసి తేరిపై
ముచ్చిరుదాని నిల్పి పెను♦మోహమునం గపిసేన ముంపఁగాఁ
గ్రచ్చఱ వారికట్టెదురు♦గాఁ జనియెక్ సతిఁ ద్రుంపఁ గోరుచున్. ౧౦౮

కం. పురనిర్గతుఁ గని కానన,చరు లందఱు నొక్కపెట్ట ♦ సాలధరాంచ
త్కరు లై వాయుభవపుర,స్సరులై పడిఁ జనిరి వానిఁ ♦ జంపెడియాసన్. ౧౦౯

చం. హనుమయుఁ గేలఁ గ్రాల మహి♦తాద్రి యొకం డెదురేగి స్యందనం
బునఁ గనె మాసియున్న యొక♦పుట్టముతోఁ బెనఁగొన్న వేణితోఁ
గనుఁగవఁ గాఱునశ్రువుల♦కాల్వలతో నుపవాసకారణం
బునఁ గృశియించి యున్న మెయి♦పోణిమితో గతభూషణాళితోన్ ౧౧౦

కం. దీన యయి ధూళి బ్రుంగిన,మేనం జెలు వేదియున్న ♦ మెలఁతుకను మరు
త్సూనుఁడు మూర్తము గనుఁగొని, జానకియే యీమె యనుచు ♦ సంతాపించెన్.

కం. కొన్నిదినంబులముందఱఁ, గన్నాతఁడుగాన సీత♦గా నెఱుఁగుట నా
పన్న యయి వానిరథమున, నున్నం గని హనుమహృదయ ♦ ముల్లల నుడికెన్.

↞ ఇంద్రజిత్తు మాయసీతఁ జంపఁ బూనుట. ↠

ఉ. ఏమి యొనర్చు నొక్కొ యితఁ ♦ డీసతి నీమెయిఁ బట్టి తేరఁగా
నేమొకొ హేతు వంచుఁ బ్లవ♦గేంద్రుఁడు వానరసైన్యయుక్తుఁ డై
భీమజవంబునం బఱవ ♦ వీరుఁడు శక్రజి వారిఁ గాంచి దు
ర్ధామరుషావశాత్ముఁ డయి ♦ క్రచ్చఱ ఖడ్గము దూసి యెత్తుచున్. ౧౧౩

కం. చేతఁ గొని ఖలుఁడు మాయా,సీతాకేశములు రామ ♦ శ్రీరామా! యం
చాతురణి యేడ్వ శిరముం, వే తఱుగఁగనున్న దైత్య♦వీరునితోడన్ ౧౧౪

చం. కనుఁగవబాష్పపూరములు ♦ గ్రమ్మఁగఁ జారుశరీర రామచం
ద్రునిప్రియురాలు దేవెరి మ♦నోజ్ఞచరిత్రను గాంచు చి ట్లనుం
గినుకను మూర్ఖ! యన్యసతి♦కేశకలాపము నాత్మనాశముక్
గన నిటు లేల పట్టితివి ♦ కావలుఁడా! దురితాత్మ! శుంఠుఁడా! ౧౧౫

ఉ. మానిత మైనబ్రహ్మఋషి♦మండనవంశమునందు రాక్షసీ
యోనిని సంభవించితివి ♦ రోరి దురాత్ముఁడ! కాన నీవు పా
పీ! నిరయాధ్వగామి యగు♦నిట్టిమహాకలుషప్రవర్తనం
బూనితి క్షుద్రశీల! ఖల ♦ యుగ్రచరిత్ర! దయావిహీనుఁడా! ౧౧౬

ఉ. ఏమిర నీమదిం గరుణ ♦ యేని జుగుప్సయ యేని దోఁపదా
భామినిఁ జంపఁ బూనెదవు ♦ పాపము! రాజ్యము నిల్లు వాకిలిక్

రామునిసన్నిధిన్ విడిచి ♦ రాడ్పడు చీయెడ నేమితప్పు రా
యీమిథిలేంద్రుకన్య ఘటి♦యించెను నీ కిటు నామెఁ ద్రుంపఁగన్. ౧౯-౧౭

కం.నీవే సతిఁ జంపితివా, జీవింపవు సుమ్ము నిజము ♦ చిరముగ నిను నే
నేవిధమున నేన్ ద్రుంచెద, రావణి! నా చేతఁ జిక్కి ♦ క్రమ్మఱి చనుదే? ౧౯-౧౮

కం.ఓలోకవధ్య! జడుఁడా!, స్త్రీలను వధియించుపాప♦శీలురలోకం
బోలిఁ గనె దీవు సుమి ని,స్త్వాలితకాయుండ వగుచు ♦ యాతుమనస్కా! ౧౯-౧౯

## ఇంద్రజిత్తు మాయాసీతను వధించుట.

చం.అని తనమీఁదవచ్చునని♦లాత్మజు సేనను గాంచి దాని నె
ల్లను శరవృష్టి ముంచుచుఁ బ♦లాయితముం బొనరించి వాయుపు
త్రున కిటు లాడు నీవు నల♦తోయజమిత్రసుతుండు రాముఁ డే
వనితకు నిందు వచ్చితిరొ ♦ వాయుజ! తత్సతి నీవ చూడఁగన్ ౧౯-౨౦

చం.తునిమి, మఱిన్ రఘూత్తములఁ ♦ ద్రుంచెద, నిన్ను దినేశపుత్రు నా
యనుచితమార్గవర్తి ఖలుఁ ♦ డైనవిభీషణుఁ జెండి వైచెదన్,
వనితను జంపరా దనుచు ♦ వానర! పల్కితి, శత్రుకోటికిన్
మనసులు నొచ్చుకార్యములు ♦ మానక చేత సమర్థమే యగున్. ౧౯-౨౧

కం.అని మాయామయి సీతను, దన చేతికృపాణధారఁ ♦ దఱిగెను నది రో
దన మొనరింపఁగ జన్నిద,మునచొప్పున దానితుండె♦ములు ధరఁ దొరఁగన్.

ఉ. ఈవిధిఁ ద్రుంచి రాము వయి ♦ నెత్తినకోపము పేర్మి నీధరి
త్రీవరకన్యకం దునిమి♦తిన్, వృథ యయ్యెను గాదె మీశ్రమం
బో వనచారి! యంచు దివి ♦ నొత్తురవంబున నార్భటించినన్
లావఱి పాఱెఁ గ్రోఁతులబ♦లంబు ప్రహృష్టుని వైరిఁ జూచుచున్. ౧౯-౨౩

## హనుమంతుఁ డింద్రజిత్తుతోఁ బోరుట.

కం.చెదరినపాదరసం బన, నదరున నాస్యములు వెల్ల♦నై పఱచెడియా
మొదకలఁ గని యి ట్లనియె, న్మృదులోక్తుల వాయుపుత్రుఁ♦డెల్లరు వినఁగన్.

ఉ. సాహసచిత్తులార! రణ♦సంభ్రమతత్పరులార! సంగరో
త్సాహము వీటిఁ బుచ్చి దృఢ♦ధైర్యరమం బెను వెల్లిఁ గల్పి పీ
రాహవముం దొఱంగి పరు♦లందఱు ఘక్కున నవ్వ దుర్యశం
బూహ యొనర్పలేక యిటు ♦ లొప్పునె కాలికి బుద్ధిఁ జెప్పఁగన్? ౧౯-౨౪

ఉ. శూరత యెందుఁ బోయె? మగ♦చొప్పది యె మ్మెడఁ బాసి పోయెనే?
భీరుత యెందు నేర్చితిరి ♦ పెంపుతలంపును లేక పోయెనే

కారియ మాని మార్గ్గము ♦ గైకొని పాఱఁగ? నంతభీతియే?
వీరవరేణ్యులార! నను ♦ వెన్కొనుఁ డేఁ జనువాఁడ ముంగలన్. ॥ ౨౬

సీ. అనవుడు వారెల్ల ♦ నద్రుల ద్రుమములఁ, గైకొని తనుఁ జుట్టి ♦ కదలిరాఁగ
నసమానవేగాఢ్యుఁ ♦ డాశుగనందనుం, డరివాహినులఁ బ్రళ♦యాగ్నివోలె
నిర్దహింపఁగఁ జొచ్చె ♦ నెఱికింక చూకురు, పెనఁగొన మనమునఁ ♦ భీమగతిని
నొండు విశాల మా♦బండను రావణి,రథమున వైవ సా♦రథియు మిగుల

ఆ. నొడికమునను దేరి ♦ నెడగాఁగఁ గొనిపోయె, నదియు నచట నున్న♦యసురతతుల
నలియఁ జేసి కొనుచు ♦ నిలయు బ్రద్దలు వాఱ, ధరణిఁ జొచ్చెఁ బరులు♦తత్తఱిల్ల.

ఉ. వానరు లంతలోఁ గలసి ♦ వాసవవైరిని సాంద్రభూజసం
తానశిలాప్రహారములఁ ♦ దద్దయు నొంచుచు వానిఁ గాచు నా
సేనను బీన్గుపెంటలుగఁ ♦ జేయఁగ నింద్రజి దీవ్రబాణసం
దానితమార్గ్వ యై ప్లవగ♦నాథులఁ దాఁకి తెరల్చె వారలన్. ॥ ౨౮

ఉ. ఏలినవానివిక్రమ మ♦హీనవిజృంభముఁ జూచి మత్తులై
శూలపరశ్వధాసులను ♦ సోఁకులమూఁకలు కీశపాళులన్
గూలుచు చున్నఁ జూచి కపి♦కుంజరుఁ డుగ్రమహోగ్రరోషణా
భీలుఁడు వారి నాఁగి కపి♦వీరులతోడ వచించె నీగతిన్. ॥ ౨౯

హనుమంతుఁడు రణంబు చాలించి శ్రీరాముఁ జూడఁబోవుట.

ఉ. వానరవీరులార! పర♦వాహిని నంతయుఁ ద్రుంచి వైచినన్
దాన లభించుమేలు గల♦దా? రఘురామునిమిత్తమై కదా
ప్రాణము లాస మాని బహు♦భంగులఁ బోరుట, యట్టిరాముని
జ్ఞానన యుద్ధహేతువు ధ♦రాత్మజయే హత యయ్యె వైరిచేన్. ॥ ౩౦

ఉ. ఈవిధ మంతయున్ దశర♦థేశ్వరుపట్టికిఁ గీశనేత సు
గ్రీవునకున్ వచించి యెది♦రీతిగ వారు దలంత్రు తద్విధిన్
బోవుట మే లటంచు హరి♦పుంగవులన్ మరలించి మెల్ల సీ
తావిభుఁ జూడఁ బోయెఁ గపి♦దండముతో నిట శక్రవైరియున్. ॥ ౩౧

చం. అనివని వీడి రాముఁ గన ♦ నంజనపట్టి చనంగఁ బొంగి పె
ల్చన విధివత్ప్రకారముగఁ ♦ జైత్యమునందలియానికుంభిలన్
ఘనతరహోమముం జలుపఁ♦గాఁ గడఁగెం బలలాస్త్రయుక్తమై
యనలము హేతిమంత మయి ♦ యస్తమయార్క రుచిన్ వెలుంగఁగన్. ॥ ౩౨

కం. రాక్షసులశుభముపొంటెను, రాక్షసపతిసుతుఁడు కడువ♦రం బగుహోమం
బాక్షణము సలుపఁ గడఁగెను, రక్షింప నయానయజ్ఞ♦రాక్షసవర్యుల్. ॥ ౩౩

←→ హనుమంతుఁడు శ్రీరామునకు నింద్రజిత్తు సీతాదేవిని వధించె నని తెలుపుట. ←→

కం. అక్కడ రాముఁడు వాయుజు, దిక్కునఁ గోలాహలంబు ♦ దివి కెగయుడుఁ బో
రెక్కు డని తలఁచి విధిసుతు, నిక్కరణిం బలికె వింటి♦వే యారవముల్. ౧౯౩౪

చం. వినవిన భీమ మయ్యెఁ బర♦వీరులయాయుధనిస్స్వనంబు, లా
హనుమకుఁ బోరు భార మయి♦నట్టులు దోఁచెడి నీవు బాసటై
చను మన నాత్మసేనఁ గొని ♦ చయ్యన నాతఁడు పోవుచుర్ మరు
త్తనయుని దీర్ఘనిశ్వసను ♦ దారితవైరిఁ గపీంద్రసంవృతున్ ౧౯౩౫

కం. తన కెదురై వచ్చెడివా, నిని డ్రోవం గనుడు నతఁడు ♦ నిలువఁగ నిలిచెర్
హనుమయు రామునిఁ జేరం, జని భృశదుఃఖమున భూప♦చంద్రునిఁ బలుకున్.

చం. అరిబలమర్దనా! కడుభ♦యంకరవృత్తిని మేము పోరుచో
దురితరతుండు రావణియుఁ ♦ దొయ్యలి సీతను నేడ్చుచానిఁ దాఁ
బొరిగొనె మాసమక్షమునఁ ♦ బొక్కునఁ జిత్తము తత్తఱింపఁగా
నరగున వచ్చినార మది ♦ సర్వము నీ కెఱిఁగించువార మై. ౧౯౩౭

చం. అనవుడు భిన్నమూలకుజ ♦ మై రఘురాముఁడు మూర్ఛ దన్నుఁ డె
క్కొన ధర వ్రాలె శోకమునఁ ♦ గూరినవంతఁ గపీంద్రులెల్లఁ గ్ర
క్కునఁ బ్రదహద్దురాసదశి♦ఖం బగు వహ్నినిబోలెఁ జల్లి రో
య్యనఁ గువ[1]పద్మినీపరిమ♦ళామలనీరముఁ దాపశాంతికై. ౧౯౩౮

←→ లక్ష్మణుఁడు శ్రీరామునితో ధర్మంబు నిరర్థకం బని చెప్పుట. ←→

కం. శోకావేశభరంబునఁ, జూకురుపడి తమ్ముఁ డగ్ర♦జుం గ్రుచ్చి యనుర్
బ్రాకటహేత్వర్థయుతం, బై కొఱలినవాక్యములను ♦ నస్వస్థునకున్. ౧౯౩౯

కం. కేవల ధర్మరతాత్ముఁడ, వీవు జితేంద్రియుఁడ వెంతొ ♦ హితకారివి నిర్
గావ దనర్థమువలనం, గావున ధర్మము నిరర్థ♦కంబు మహాత్మా. ౧౯౪౦

ఉ. స్థావరజంగమంబులవి♦ధంబున లోకములోనివారి కే
లా విశదంబుగా దది త♦లంపుము ధర్మమొకండు గల్గినర్?
పావిరి తత్ఫలంబు లయి♦నం బొడకట్టవె స్థావరాదు ల?
ట్లోవిపులేశ ధర్మమొకఁ ♦ డుండుట క ల్లని నేఁ దలంచెదన్. ౧౯౪౧

కం. కలదేని యధర్మము గన, వలయుర్ బహుదుఃఖములను ♦ బంక్తిముఖుండుర్
గలదేని ధర్మ మీఁగతిఁ, గలుగకయుండంగ వలయుఁ ♦ గద నీకు వెతల్. ౧౯౪౨

ఉ. కావలుఁ డైనరావణుఁడు ♦ కష్టము గానమి నిత్యధర్మస
ద్భావుఁడ వీవు దుఃఖముల♦పా లగు చుంట నధర్మధర్మముల్

[1] పవము = కలువ.

త్రోవలుగాఁ బరస్పరవి♦రుద్ధఫలప్రదముల్ దలంపఁగాఁ
ద్రోవగుఁ గీడు ధర్మమునఁ ♦ బొల్పగు సౌఖ్య మధర్మసంగతిన్. ౧౯౪౩

సీ. ధర్మప్రవర్తన ♦ శర్మంబు ఘటియిల్లు, ధర్మహీనత దుఃఖ♦తతులు గలుగు
నని తలపోసెదే ♦ యన్నయా! యది కల్ల, ధర్మంబు సౌఖ్యప్ర♦దంబ యేని
ధర్మాత్ము లగువారు ♦ ధర్మ మంద చరింపఁ, దద్ధర్మఫలములు ♦ దలఁగ కుండ
వలదె జగంబునఁ ♦ గలవె యీభంగులు, తలపోయుమా యింత ♦ ధర్మశీల!

తే. పాపు లగువారు సౌఖ్యముల్ ♦ పడయు చుండఁ
దలఁగకుండును గష్టముల్ ♦ ధార్మికులను
దానఁ జేసియె ధర్మం బ♦ధర్మ మనెడి
రెండును నిరర్థకములు భూ♦మండలమున. ౧౯౪౪

తే. పాపరతుల నధర్మంబు ♦ బాధపఱిచె
నేనియుఁ గ్రియాత్మకం బయి ♦ యిట్టిబాధఁ
గూర్చెడి యధర్మ మొకత్రుటిఁ ♦ గూడఁ బిదపఁ
దాను జెడి వేని కవల బా♦ధల ఘటించు? ౧౯౪౫

సీ. కర్మంబు చెడినను ♦ గర్మాధిదేవత, ఫలము గూర్పదె యని ♦ పలికి తేని
దైవ మెప్పుడు ధర్మ♦తత్పరు బాధించుఁ, గాదేనియును గర్మ♦కారుఁ డన్య
జనుని బాధించును ♦ సత్య మిట్లైనచోఁ, బాపకర్మంబుల♦ఫలము దుఃఖ
మది దైవమునె చెందు ♦ నందదు కర్మము, ధర్మంబు చందంబు ♦ తప్ప కిట్లె

ఆ. కానరాదు రూపు ♦ కడఁగి చిహ్నములచే, నైనఁ దెలియఁబడదు ♦ మాననీయ
యల యసత్స్వరూప ♦ మగుధర్మ మేరీతిఁ, బరమఫల మొసంగు ♦ భ్రాంతి గాక.

కం. ధర్మం బొకఁ డుండినచోఁ, ధార్మికమణి వైననీకుఁ ♦ దగులునె కీడుల్?
మర్మచ్ఛేదనదుఃఖము, లర్మటచే ధర్మ ముంట ♦ యనృతము సుమ్మీ. ౧౯౪౬

తే. క్లీబమును దుర్బలంబు త♦ర్కించి చూడఁ, బౌరుషము ననువర్తించి ♦ వ్యవహరించు
ధర్మ మట్లౌట ఫలములు ♦ తనకుఁ దాన, యీయ నేరనిధర్మంబు ♦ నేల సలుప.

చం. కనుఁగొన ధర్మమే పురుష♦కారవిశేషణభూత మైనచోఁ
బనిగల దొక్క ధర్మ మని ♦ బాధలు పొందఁగ? దాని వీడి యుం
దనుకను ధర్మముం గొలుచు♦తద్విధిఁ బౌరుషమున్ భజింపుమీ
జనవర! యన్నికార్యములు ♦ చక్కఁబడున్ నను విశ్వసింపుమీ. ౧౯౪౭

సీ. సత్యభాషణము శ్రే♦ష్ఠం బైనధర్మ మ,య్యది సల్పువాఁడ నం♦చనెదు గాని
యదియు నీచే సమ్య♦గాచరితము గాదు, సభలోన నెల్లరు ♦ చక్కవినఁగ

నీకు రాజ్యం బీయ ♦ నీకొని నిర్దయుండై తండ్రి నిన్నిట్టు ♦ లడవి కనిచె
నతని దండింపవ ♦ యాతని రెండవ,నుడి సల్ప నే మని ♦ కడఁగి తీవు

తే. ధర్మ మొండెను నొండె న♦ధర్మ మొకటి, వరఁగ నరుఁడాచరింప ని♦ర్బంధ మేని
దేవపతి యేల మాని వ♦ధింపకుండ, యజ్ఞ మొనరింపఁ డయ్యెనో ♦ యార్యవర్య!

కం. కేవల మధర్మ మేనియుఁ, గేవల ధర్మంబ యేని ♦ కీడొసఁగుఁ జుమీ
యేవేళకుఁ దగినటు లది,భావించుట మేలు సౌఖ్య♦పదకాములకున్. ౧౯౫౧

⟵ లక్ష్మణుఁడు శ్రీరామునితో ధనంబు సర్వార్థసాధకం బని చెప్పుట. ⟶

సీ. నామతం బిది తండ్రి! ♦ న్యాయంబుగా నీకు, లభియించు ధర్మమూ♦లంబు రాజ్య
రము వీడి క్షేమమూ♦లము పాడుచేసితి, ధర్మ మెట్టులు నిన్నుఁ ♦ దలఁగకుండు?
నర్థమూలము ధర్మ ♦ మది జనదత్త మా,కరములచే వృద్ధిఁ ♦ గాంచు చుండ
శైలజాతంబు లా♦శైవలినులఁ బోలు, నద్దాన ధర్మకా♦ర్యములు జరుగుఁ

ఆ. గాన సకలకార్య♦కాండంబులకు నెల్ల, ధన మొకండె కడుప్ర♦ధాన మట్టి
ధనముఁ గరగతంబుఁ ♦ దలఁగంగ నెట్లు స్వ,కార్యఘాతుకునకుఁ ♦ గలదె మేలు.

కం. ధనహీనుఁడె బలహీనుఁడు, ధనహీనుని విడుతు రన్న♦దమ్ముల యేనిన్
ధనహీనుఁడు తలపెట్టిన,పని వేసవియేటినీటి♦పగిది నశించున్. ౧౯౫౩

తే. సౌఖ్యపరుఁ డాత్మధనము వె♦చ్చం బొనర్చి, క్రమ్మఱ సుఖార్థియై తద♦ర్థంబు ధనము
సేకరింపఁగఁ బాపముల్ ♦ సేయు చుండు, దానఁ గల్మషవర్తియై ♦ తా నశించు.

కం. కలవాఁడే మిత్రంబులు, గలవాఁడును బంధుజనులు ♦ గలవాఁడు సుమీ
గలవాఁడే పురుషుం డిలఁ, గలవాఁడే సర్వశాస్త్ర♦గణపండితుఁడున్. ౧౯౫౪

కం. ధనవంతుఁడె బలవంతుఁడు, ధనవంతుఁడె ధీయుతుండు ♦ ధర్మాత్ముండున్
ధనికుండె మహాభాగియు, ధనికుండె మహాగుణుండు ♦ ధైర్యరతుండున్. ౧౯౫౬

ఉ. అర్థము లేమిఁ గల్గెడు న♦నర్థములన్ మును పల్కినాఁడ నే
యర్థముఁ గోరి రాజ్యమును ♦ దృక్తము చేసితొ నే నెఱుంగఁ, దా
నర్థము నర్థకామముల♦కై వ్యయపెట్టెడువాని కేదియున్
వ్యర్థము పోదు, నిర్ధనుఁ డ♦నర్థముఁ గూరు ధనాభిలాషి యై. ౧౯౫౭

కం. శమముఁ హర్షము కామము, దమముం గ్రోధంబు దర్ప♦ధర్మంబులు స
ర్వము నివి ధనమ్ముచే భూ,రమణా! వర్తించు నిలుచు ♦ రహిఁ గాంచు ధరన్. ౧౯౫౮

ఉ. ధర్మము ధర్మ మంచు నొక ♦ ధర్మమునే శర ణొందువారికిన్
శర్మ మిహంబునం గలుగఁ♦జాలదు, మేఘము లావరించినన్
ఘర్మసమాంశుముఖ్యఖగ♦పాళులు[1] దోఁపనిభంగి, నర్వస
చ్ఛర్మనిదానవిత్తములు ♦ చారుగుణా! విను నీకు లేవుగా. ౧౯౫౯

[1] ఘర్మ......పాళులు = సూర్యాదిగ్రహములు.

చం. జనకుని సత్యభాషణునిఁ ◆ జల్పుఁగఁ బూనితి, తత్ఫలం బిదే
కనితివె? నీదు ప్రాణములఁ ◆ కన్నఁ బ్రియాం భవదీయపత్నినిం
దనుజుఁడు ముచ్చిలించెను, గ◆తం బడి యేటికి? నింద్రజిత్కృతం
బునకుఁ బ్రతిం ఘటింతు రఘు◆పుంగవ లెమ్ము యనుజ్ఞ యి మ్మొగిన్. ౧౯౬౦

తే. పార్థివోత్తమ! యాజాను◆బాహుయుగళ!, నియమసద్వ్రత! లే లెమ్ము◆నిను మహాత్ముఁ
దైవయాత్ముని నెఱుఁగ తే ◆ కకట! నీవ, యిట్లు తపియింపఁ జేయ నే ◆ నేమి నేర్తు?

ఉ. నీకుఁ బ్రియం బొనర్పఁగ జ◆నించిన వీఁడు భవత్ప్రియావధం
బాకట వింట రోమకలు◆పాత్రకుఁ డయ్యెను దేవ! లంక న
స్తోకరథాశ్వసింధురముఁ ◆ దూర్ణను రాక్షసనాథయుక్తముం
బ్రాకటమత్కరోజ్ఝితశ◆రప్రకరంబులఁ గూల్చి వైచెదన్. ౧౯౬౧

విభీషణుఁ డింద్రజిత్తుమాయోపాయంబు శ్రీరామునకుఁ దెలుపుట.

సీ. అని భ్రాతృవత్సలుం ◆ డగులక్ష్మణుం డన్న, నూరార్చుచుండఁగ ◆ నుచితరీతి
గుల్మముల్ దీరిచి ◆ కుంజరసేవిత, యూథపభంగిని ◆ నుగ్రులైన
సచివులు గొల్వ నా◆స్థానంబునకు విభీ,షణుఁ డరుదెంచి బా◆ష్పములు రాల
నగచు లక్ష్మణు నున్న◆వానరులను లక్ష్మ,ణాంకాశ్రితుని వ్యస◆నార్తు రాముఁ

ఆ. గాంచి వగచి యేమి◆కతము దీనికి ననఁ, గనుల మిగులనీరు ◆ కార్చికొనుచు
నతనిఁ గపుల భాస్క◆రాత్మజుఁ జూచుచు, లక్ష్మణుండు పలికె ◆ సూక్ష్మఫణితి.

కం. హత యయ్యె నిపుడు ధరణీ,సుత యింద్రజిచే నటన్న ◆ నుద్దులను మరు
త్సుతుఁడు వచించిన రాఘవుఁ, డతిదుఃఖముచేత మూర్ఛ ◆ నందె మహాత్మా!

చం. అని వచియించు లక్ష్మణుని ◆ నాఁగి విభీషణుఁ డిట్లు పల్కె నో
యనఘ! మరుత్తనూజునుడి ◆ యంబుధి యింకె నటన్నరీతిగా
మనమున నమ్మరాదు, సుర◆మర్దనుచిత్తము నే నెఱుంగుదుం
జనకజపట్ల, నత్తరుణిఁ ◆ జంపఁడు నొంపఁడు నమ్ము రాఘవా! ౧౯౬౪

ఉ. ఎంతయు వేఁడినాఁడ మను◆జేశ్వర! యాతని మేలు గోరి భూ
కాంతతనూజ వీడు మని ◆ కర్ణము లీయఁడు నాహితోక్తికిం
శాంతము దానభేదములు ◆ జాలము దండము వీన నేరికిం
బొంతను బోయి మాచుటకుఁ ◆ బోలదు పో జనకాత్మసంభవన్. ౧౯౬౬

ఇంద్రజిత్తు నికుంభిల యాగముఁ జేయువార్త విభీషణుఁడు శ్రీరామునకుఁ దెలుపుట.

సీ. ఐన నీకృతిచేత ◆ నగులాభ మే మన్న, మోహాపటిచి కపి◆వ్యూహములను
గ్రూరుఁ డై చైత్యని◆కుంభిల రావణి, హోమంబుఁ జేయుచు ◆ నున్నవాఁడు

అది పూర్ణ మైనచో ♦ నమరాదులకు నైనఁ, గలన నజయ్యుఁడు ♦ కాన వాని
విక్రమక్రమమును ♦ విఘ్నముఁ గావింప, వానరవర్యులఁ ♦ బంపవలయు
ఆ. మాయఁ బన్నినాఁడు ♦ మనుజేంద్ర! సత్యంబు, వేల్మి ముగియుమున్న ♦ వీరవరులఁ
గపులఁ బంపు మిందుఁ ♦ గారణ హీన మా, వగపు మాను రామ♦భద్ర లెమ్ము.
కం. వ్యసనమున మునుఁగుని న్గని, పసచెడ సైన్యంబు శోక♦భరమున మాతో
వెస సౌమిత్రిని బంపుము, కసి తీరఁగ నీతఁ డతని♦గం డడఁగించున్. ౧౯౬౮
ఉ. శూరుఁడు లక్ష్మణుండు బల♦సూదన వైరిసవంబుఁ దొల్త దు
ర్వారశరంబులం జెఱిచి ♦ హానివధించును వెండి, శత్రుసం
హారమునం దుపేక్ష దగ ♦ దానతి యిమ్ము సుమిత్రపట్టికిన్
వైరి సమాప్తకర్ముఁ డయి♦నన్ విబుధాళికి నే నసాధ్యుఁ డో. ౧౯౬౯

←{ ఇంద్రజిత్తును జంప లక్ష్మణుఁ బంపు మని
విభీషణుఁ శ్రీరాము వేఁడుట. }→

కం. సవమారఁ దీరె నేనియు, దివిజారిసుతుండు దివి న♦దృశ్యుం డగుచున్
బవర మొనరించుఁ బదపడి, యవనీశ్వర! యతని గెల్వ ♦ నమరుల వశమే.
చం. అనవుడు దుఃఖతప్తమతి ♦ యానరపాలవరేణ్యుఁ డానుడుల్
వినియు గ్రహింపలేక ధృతి ♦ వెండియుఁ గైకొని లేచి యి ట్లనున్
విన మదిఁ గోరెదన్ దనుజ♦వీర! వచింపుము క్రమ్మఱంగ నీ
వనినహితోక్తు లన్న మహి♦తాత్మకుఁ డాయసురేంద్రుఁ డి ట్లనున్. ౧౯౭౧
కం. నీయానతిఁ గొని చని యా, యాయెడలన్ నిలిపి సేన ♦ లన్నియును యథా
న్యాయంబుగ విభజించితిఁ, జేయంగలయంతవట్టు ♦ చేసితి నధిపా! ౧౯౭౨
ఉ. నామన వాలకింపుమి మ♦నంబున హేతువు లేనియార్తి మీ
రీ మెయి సంతపింప నన ♦ నేటికి మాదురవస్థ దేవ! మా
యామయశోకమున్ విమత♦హార్దకరంబును వీడి నమ్మద
స్థాయిఁ బరాక్రమంబుఁ గొని ♦ శాత్రవులం బరిమార్పఁ జూడుమా. ౧౯౭౩
ఉ. జానకిఁ గ్రమ్మఱం గొనఁగ ♦ స్వాంతమునం గలదేనిఁ ద్రుంపుమీ
దానవపాళి నెల్ల, నల♦దానికి నే నుపమన్ వచించెదన్,
వానరసేనతోడ రఘు♦వర్య! నికుంభిల కిప్డు పంపుమీ
యానెఱబంటు లక్ష్మణుని ♦ నీయన రావణిఁ ద్రుంచుఁ బోరిలోన్. ౧౯౭౪
తే. మండలీకృతభీమకో♦దండుఁ డగుచు, భండనంబున నీతఁ డు♦ద్దండవృత్తి
గం డడంచును నిజభుజా♦చండిమమునఁ, గాండకాండప్రయుక్తి నా♦ఖండలారి.

చం. దశముఖనందనుండు మహి♦తం బగుఘోరతపం బొనర్చి బ్ర
　హ్మశిరము నస్త్ర మభ్రచర ♦ మైనతురంగతతిన్ పరంబుగా
　దశరథనందనా! పడసెఁ ♦ దామరసోదరుచేత, దాన నా
　నిశిచరుఁ డేగినాఁడు క్రతు♦నిర్వహణైకమనస్కుఁ డై నృపా!　　౧౬౭

చం. బలఁగము చుట్టునుం బలియ ♦ వాఁడు నికుంభిల కేగినాఁడు, వాఁ
　డలనవమున్ ఘటించి యని♦కై యరుదెంచిన మమ్ము నెల్లరం
　దలఁపుము చచ్చినా రని, పి♦తామహుఁడుం గ్రతువిఘ్నకర్తయే
　బలరిపువైరినిం దునుము♦వాఁ డని చెప్పి వరంబు నిచ్చెచోన్.　　౧౬౮

కం. కావున వానిం దునుమఁగ, నీ వనుమతి యిమ్ము జాన♦కీశ్వర! కలనన్
　రావణి తెగ హితతతితో, రావణుఁడుం జచ్చినట్ల ♦ రామా! యనుడున్.　౧౬౯

చం. తెలియనివాఁడఁ గాను సుమ♦తిప్రవరా! యలవానిమాయలున్
　బలము జవంబు, వాఁడు కడుఁ♦బ్రాజ్ఞుఁడు, బ్రహ్మశిరం బెఱుంగు, వే
　ల్పుల జలధీశు నైనఁ బోరి♦పుచ్చఁగ నేర్చు రథస్థుఁ డై, దివిన్
　జలధరసంప్లవార్కగతిఁ ♦ జక్షు రగోచరుఁ డై చరించెడిన్.　　౧౭౦

ఇంద్రజిత్తును జంప శ్రీరాముఁడు లక్ష్మణుని నికుంభిలకుఁ బంపుట.

సీ. అన దురాత్ముం డైన♦యసురేంద్రనందను,బల మెంచి యనుజుతోఁ ♦ బలికె నిట్టు
　లన్న! సుగ్రీవుని♦యఖిలసైన్యముతోడఁ, బవనజముఖయూథ♦పతులతోడఁ
　జాంబవంతునితోడఁ ♦ జని జాపిరము లేక, మడియింప వయ్య యా♦మాయలాని
　నరుదెంచు నీమహా♦త్ముఁడు మంత్రుల,తో విభీషణుఁడును ♦ దోడుగాఁగ
ఆ. నతనిసవనతలము ♦ నితఁడు చూపు నటన్న, నద్భుతోరువిక్ర♦మాఢ్యుఁ డైన
　లక్ష్మణుండు హేమ♦లసితచాపముఁ గేలఁ, గొన విభీషణుండు ♦ గొనియె నొండు.

కం. సన్నద్ధుం డై కవచం,బు న్నిశితతరాసిబాణ♦ములు గైకొని తా
　నన్నపదంబుల వ్రాలి ము,దున్నతి నచియించి నిజమ♦హోద్యమ విధమున్.

ఉ. ఇప్పుడు మత్కరోజ్ఝిత శి♦తేషువు లాదశకంఠపుత్రు మే
　నొప్పుగఁ దూఱి పుష్కరిణి ♦ వ్యూహములై చొరఁబాఱునంచలై
　తొప్పలుదోరలై పడెడిఁ ♦ దూర్ణము లంకపయిన్ మహాత్మ! వాఁ
　డిప్పుడు మచ్ఛరాహతి మ♦హిం బడు దారితసర్వగాత్రుఁ డై.　　౧౭౨

చం. అని వచియించి రావణివ♦ధాభిరతిన్ వలగొంచు భక్తి రా
　మునిచరణాంబుజంబులకు ♦ మ్రొక్కి విభీషణుతోడ నంజనా
　తనయునితోఁ బ్లవంగమవి♦తానముతోఁ జనువాఁడు జాంబవం
　తునిబలఁగంబుఁ గాంచి నడి♦త్రోవను దానిని గొంచు నేగుచున్.　　౧౭౩

చం. చని చని దూరమందుఁ గనె ♦ శస్త్రభయంకర మై విశాల మై
ఘనతరకేతనోగ్ర మయి ♦ గాఢజవం బయి దీప్తిమంత మై
కనుఁగొనఁ గారుమబ్బువకు ♦ గాదిలిచుట్టము నై రహించు నా
దనుజవరేణ్యు సేనఁ, గని ♦ దారుణకార్ముకదండహస్తుఁ డై. ౧౯౮౪

తే. పవనతనయునితోడను ♦ వాలితనయుతో విభీషణుతోడ న♦ద్ధూర్తుయజ్ఞ
మజ్జునివాక్యవిధమున ♦ హతము సేయ, సిద్ధపడి యుండె నప్పు డా♦సేనఁ జూచి.

⟶ విభీషణుఁడు లక్ష్మణునకు నింద్రజిత్తుండుచోటు చూపుట. ⟵

కం. బాధక మరులకు నై హిత,సాధక మారీతిఁ బలికె ♦ సౌమిత్రి! ద్విష
ద్యోధులయూథముఁ గనుము ప,యోధరనీలంబు దాని♦నుగ్రశరములన్. ౧౯౮౬

ఉ. పాయలు పాయఁ గొట్టు మది ♦ పాసినయంతనె తోఁచువాఁడు దై
తేయధవాత్మనందనుఁడు ♦ ధీరుఁడు క్రూరుఁడు వంచకుండు దు
ర్జేయపరాక్రముండు ఖల♦శీలుఁడు సర్వజగద్భయంకరుం
డాయధముండు సేన నడు♦మంతరమందు నవంబు సల్పెడిన్. ౧౯౮౭

కం. అనవుడుఁ బిడుగులఁబోలిన,ఘనశరముల లక్ష్మణుండు ♦ కడిమిం గురిసెన్
వనచరభల్లుకసంఘము, చని గవిసెన్ శైలభూజ♦సాధన మగుచున్. ౧౯౮౮

⟶ కపు లింద్రజిత్సేనలతోఁ బోరుట. ⟵

చం. కలఁగక రాక్షసుల్ ముసల♦ఖడ్గపరశ్వధతోమరాదులన్
బలిముఖసేనఁ దాఁకుటయు ♦ వారికి వీరికిఁ బోరు ఘోర మై
యులివె పురంబునల్గడల ♦ నుద్దవిడిం గలసెన్, నభంబు సం
కుల మయి తోఁచె నుద్యదసి♦కుంతశరాద్రిమహీజపూర్ణ మై. ౧౯౮౯

మ. తమపై భీకరశస్త్రముల్ గురియుచున్ ♦ దర్పించుకీనాశసం
ఘములం గీశులు వృక్షభూమిధరసం♦ఘాతంబులం గూల్చి దు
ర్దమదోశ్చండిమ చాటుచున్ శలభవా♦రం బోయనన్ మూఁగి సం
తమసాకారచమూసమూహముల ఛి♦న్నంబై చెడం గూల్చినన్. ౧౯౯౦

కం. వారల మునుమున నిలువఁగ, నేరక రాక్షసులు చెదర ♦ నిజసైన్యము దై
న్యారంభముఁ గని వేలిమి,కారియమున్ విడిచి లేచి ♦ కనలున వచ్చెన్. ౧౯౯౧

సీ. వృక్షాంధకారంబు ♦ విడిచి వెల్వల వచ్చి, మహితరోషంబున ♦ మండిపడుచుఁ
బూర్వకల్పితరథ♦మును నధిరోహించి, కాలాభనిభుఁ డుగ్ర♦కార్ముకంబుఁ
గొనుచు రక్తాక్షుఁ డై ♦ క్రుద్ధాంతకునిఁ బోలి, తరలిన లక్ష్మణుఁ ♦ దాఁక నున్న
బలము లాతనితేరు ♦ బలసి నిల్చుండిన, నీలోన రావణి ♦ యెఱుక పడమి

ఆ. మారుతాత్మజుండు ♦ మందరతుల్యుండు, కల్పవహ్నిఁ బోలి ♦ కాల్వఁ జొచ్చె
వృక్షహస్తుఁ డగుచు ♦ నెగచి యరాతుల, రూపుమాపె నసమ♦రూక్షవృత్తి.

## హనుమంతుఁడు రాక్షసుల నాశ మొనర్చుట.

సీ. జవనాధికుం డగు♦పవమాననుతుఁ దాఁకెఁ, బలలాశిసంఘముల్ ♦ భయదభంగి
శితశూలపాణులు ♦ శితశూలధారలఁ, గరవాలహస్తులు ♦ ఖడ్గములను
బట్టిసాయుధకరుల్ ♦ పట్టిసాయుధముల, శక్తిప్రయుక్తుల ♦ శస్త్రధరులు
పరిఘముద్గరగదా♦పరశుశతఘ్నుల, భిండిపాలంబుల ♦ భీమభంగిఁ
తే. దలములను ముష్టులను రేఁగి ♦ తాఁచు చుండ
నరకు గొన కేమియును వాని ♦ జదును చేసి
పీన్గుపెంటలు గావించె ♦ భీమణాహి
తాహితార్క్ష్యుండు గంధవ♦హాత్మజుండు.　　౧౯౯౩

చం. ఎదిరెడురాక్షసోత్కరము ♦ లేయుశరంబుల లోఁగ కేమియుఁ
గదనము సేయుచున్న బలి ♦ గాడుపుపట్టిని జూచి సారథీ
పదిలముగాఁగఁ బోగునల♦వానరుపై మన తేరు పోవ ని
మ్మెదుర కుపేక్షచేయ బల♦మెల్లను ద్రుంచు నతండు సుమ్మనన్.　　౧౯౯౪

## ఇంద్రజిత్తు హనుమంతు నెదుర్చుట.

ఉ. సారథి యట్లసేయుటయు ♦ సాయకసంహతి ఖడ్గవృష్టులన్
దారుణపట్టిసంబుల ని♦తాంతజవంబున శూలకోటులన్
మారుతి ముంచెఁ, గేసరికు♦మారుఁడు వానిని బాయఁ దట్టి యా
క్రూరునితోడ ని ట్లనియె ♦ రోషము వేషముఁ గొన్న కైవడిన్.　　౧౯౯౫

శా. ఓరీ దుష్టనిశాట! దుర్మతి! రణో♦ద్యోగంబునన్ నీవునున్
శూరుం డేనియు రమ్ము యుద్ధమునకుం ♦ జొక్కంపురీతిన్ బలో
దారున్ మారుతిఁ దాఁకి ప్రాణములతో ♦ దైత్యేంద్రపుత్రా! మఱిం
బోరా దెట్లు నియుద్ధకేళికిని రా♦పో చూచెదన్ నీగతిన్.　　౧౯౯౬

చం. ఎసఁగిననాదుపోటు సహి♦యించినచోఁ గద నీచ! బంట వం
చనమున ధిక్కరించుపవ♦నాత్మజు నేయ శరాసనంబుఁ దా
మసలక యెత్తుచుండ శత♦మన్యుజితుండు సురారి వాఁడె యా
దెసఁ గను మంచుఁ జూపె నిసి♦ద్రిమ్మరితేఁడు సుమిత్రపట్టికిన్.　　౧౯౯౭

కం. కవిసినవాఁ డనుమపయిన్, జవమునఁ జని నీదుతీవ్ర♦శరముల వానిన్
భువిఁ గూల్పు మంచు గర్జా,రవు ధరనిభు భీమబలుని ♦ రావణిఁ జూపెన్. ౧౯౯౮

### విభీషణుఁడు లక్ష్మణునకు నింద్రజిత్తు యజ్ఞముచేయు న్యగ్రోధముఁ జూపుట.

ఆ. చూపి యిట్లు ముదము ♦ నుబ్బఁగ లక్ష్మణుఁ
దోడుకొంచుఁ బోయి ♦ తూర్ణగతిని
ననతిదూర మొండు♦వనముఁ బ్రవేశించి
యందుఁ గానిపించె ♦ యజ్ఞవిధము. ౧౯౯౯

సీ. సౌమిత్రి మేచక♦జలదసంకాశంబు, ఘోరరూపంబు న్య♦గ్రోధ మిదియె
దైతేయసుతుఁ డిందు ♦ భూతబలుల్ దీర్చి, హోమంబు సాగించి ♦ యుద్ధమునకు
వచ్చు వచ్చినను నే♦వారి కదృశ్యుఁడై, సంగ్రామ మొనరించుఁ ♦ జటులబలుఁడు
వధియించుఁ గొందఱ ♦ బంధించుఁ గొందఱఁ, జిత్రవధము సల్పు ♦ శత్రువరుల

ఆ. మరల నింద్రజిత్తు ♦ మఱ్ఱి డాయఁగ నీక, తేరితోడ సాశ్వ♦సారథిగను
బిలుకు మార్పు మన్న ♦ నలరుచు లక్ష్మణుం, డట్లెయనుచు మీఱె♦ననమగుణము.

ఆ. అగ్ని వర్ణమైన♦యరదంబుపై నెక్కి, కవచి ధన్వి ధ్వజియు ♦ ఖడ్గి యగుచు
రావణాత్మజుండు ♦ గ్రక్కున నటకు రాఁ, జండకోపి లక్ష్మ♦ణుండు పలుకు. ౨౦౦౧

కం. వచ్చితి వెదకుచు నీకై, యిచ్చటికి రణాతిథేయ ♦ మిమ్మా నిను నే
నిచ్చుగఁ బిలిచెద రమ్మా, కుచ్చితుఁడా! నీదుమాయ ♦ కొనసాగ దిఁకన్. ౨౦౦౨

### ఇంద్రజిత్తు విభీషణు నధిక్షేపించుట.

కం. అనఁ దత్పరిసరవర్తిని, బినతండ్రి విభీషణాఖ్యు ♦ వీక్షించి యనుజ్
మన మెరియఁగ గోపంబునఁ, గనుఁగవ నిప్పుకలురాల ♦ గర్వం బెసఁగన్. ౨౦౦౩

కం. రాక్షస! యిటఁ బుట్టిపెరిఁగితి, సాక్షాదనుజఁడవు నాదు♦జనకునకును నో
రాక్షస! పినతండ్రివి ప్ర,త్యక్షపుద్రోహంబు తగునె ♦ తనయుని పట్లన్? ౨౦౦౪

ఉ. చుట్టమటన్న మాట యది ♦ సున్న, స్వజాత్యభిమాన మేని క
న్పట్టదు, స్నేహభావమొ య♦భావము, లేదు ప్రమాణబుద్ధి యేఁ
గట్టెఁడి! ధర్మచింతనము ♦ కానఁగ రాదుగ, దుష్టబుద్ధి! యోఁ
బుట్టినవాఁడ టన్నమతి ♦ పుట్టునె నీకును ధర్మదూషణా! ౨౦౦౫

కం. తనవారి విడిచి పరులం, బనివాఁ డయి కొలుచు నీయ♦వస్థం గని స
జ్జననిందనీయ! నీయెడ, మన మతిదుఃఖంబుచేత ♦ మఱిఁగెడుఁ గుమతీ! ౨౦౦౬

కం. ఎక్కడి స్వజనావాసం, బెక్కడి పరజనులసేవ ♦ యీమాత్రము నీ
కక్కట భేదము తోఁపద, చక్కఁగ నీచులకు బుద్ధి♦చతురత గలదే? ౨౦౦౭

కం. తనవార లగుణులేనియు, ఘనగుణములచేతఁ బరులు ♦ గ్రాలిర యేని
గన నుత్తము లగుణులెయగు తనవారలె, పరులు పరులె ♦ తథ్యము కుమతీ!

కం.తమవారి విడిచి పరప,క్షముఁ గొల్చెడివారు స్వజన♦సంఘము నిర్మూ
లము గాఁగఁ బిదపఁ దామును, విమతులచేఁ జెడుట నిజము♦వెంగలివిత్తా.

కం.దయ యన్న మాట లే కిటు, నయహీనా! తెగితె యింత♦నాశపుఁబని కీ
క్రియ ఘోరకృతికి నెవ్వఁడు, మెయికొనుఁ జుట్టమవు నీవు♦ మిగిలినఁ దండ్రీ!

విభీషణుఁ డింద్రజిత్తునకు సమాధానముఁ జెప్పుట.

తే. అనుడు నాయన్నకొమరున♦ కనె విభీష,ణుండు రాక్షసనాథసు♦తుండ! యనయ
శీల! నాశీల మెఱుఁగని♦లీల నేల, వదర? గౌరవవశమునఁ♦ బదర వలదు ౨౦౧౧

కం.జననము క్రూరాసురకుల,మున నైనను నేమి? గుణమె♦ ముఖ్యము గాదా
జనులకుఁ? గావున గుణమున, వినరా రాక్షసుఁడఁ గాను♦ వేమాఱులకున్. ౨౦౧౨

కం. రుచియింపవు దారుణములు, రుచియింప దధర్మ మెపుడు♦ క్రూరుఁడ! నాకుఁ
గుచరిత్రుఁ డన్న యెవ్వఁడు, వచియించుఁ బొకాలు మనుచు♦ భ్రాతక సభలోన్?

కం.ధర్మవిహీనునిఁ గల్మష,కర్మునిఁ గరగతముఁ బాము♦కరణిని విడి స
త్కర్మం డిహమునఁ బరమున, శర్మంబుల ననుభవించు♦ జాల్మఁడ వింటే. ౨౦౧౪

కం.పరధనములఁ బరదారల, హరియించుట హింస యీదు♦రాచారంబుల్
పురుషుఁడు మండెడుగేహము, కరణిక విడనాడవలయుఁ♦ గలుషాత్మకుఁడా!

కం.పరవిత్త మపహరించుట, పరదారలఁ గోరు చుంట♦ స్వసుహృత్తతి ని
ర్భరసంశయ మీమూఁడును, దురితాత్మ! వినాశ హేతు♦దోషంబు లగున్. ౨౦౧౬

చం.విను మునికోటిహింసనము♦ వేల్పులతోడ నెడ లేనిపోరులుక్
గనలును బద్ధవైరమును♦ గర్వము నన్యుల మేలు సైఁపమిక్
మనుగడ సర్వసంపదలు♦ మాన్చెడిదోషము లివ్వి యన్నయం
దనయము నిల్చి డాఁచె సుగు♦ణావళిఁ గొండను మేఘముల్వలెన్. ౨౦౧౭

కం.ఈదోషము లుండుటచేఁ, గాదే నాయన్న నీదు♦కన్నయ్యను నే
మోదమున విడుచు టిలపై, లే దీపురి నీవు లేవు♦ లేఁడు జనకుఁడున్. ౨౦౧౮

కం.అతిమానివి బాలుఁడవు, న్నతిహీనుఁడ వెఱుఁగ వీ న♦ణంకువ నైన
స్వతపాశబద్ధుఁడవు నీ,మతిఁ దోఁచినదెల్ల వదరు♦మా వైదేయా! ౨౦౧౯

ఉ. చేటు ఘటిల్లె నీ కిపుడు♦ చేసె డిదే మిఁక నీవు? రిత్తవా
కాటులతోడ నే మగును♦ గ్రమ్మఱ మట్టిని జేర లేవు, సం
స్ఫోటమునందు రాఘవుల♦ముంగల జీవమునిల్ప లేవు, నీ
కూటరణంబు చెల్ల దికఁ♦ గూల్చును లక్ష్మణు, డిప్డు ని న్ననిన్. ౨౦౨౦

చం.చని యొనరింపుమీ యమని♦నంయమినిక నిజదేవతార్చనక్
దనుబల మంతయుక్ సకల♦దారుణశస్త్రములుక్ వ్యయంబుగాఁ

బొనరుపుమీ, సుమిత్రసుతుఁ ♦ భూరిశరాళికి గోచరుండ వై
చనుటయ కల్ల యిమ్మెయిని ♦ సైన్యము నీవును లంకలోనికిన్. ౨౦_౨౧

↞ ఇంద్రజిల్లక్ష్మణులసంభాషణము. ↠

సీ. అనవుడు నామాట ♦ లాలించి కోపించి, యుద్యతాయుధుఁ డయి ♦ యుగ్రవృత్తిఁ
బ్రలయాంతకునిఁబోలి ♦ భయదచాపం బెత్తి, కఱకుబాణంబులు ♦ కాంతిఁ లీన
దృఢరథస్థితుఁ డయి ♦ తేజుచే దీపించు, నుదయాద్రిగతభాను ♦ నొప్పు గలిగి
హనుమంతుమూఁపుపై ♦ నాసీనుఁ డగువాని, సౌమిత్రి శత్రుహింసనసమర్థుఁ
ఆ. గాంచి యను మదీయ♦కార్ముక ప్రవిముక్త, ఘోరదుస్సహాశు♦గోరువృష్టి
మింట నుండి కురియ ♦ మిడికెద రేగతిఁ, జూడు నీవు నీదు♦తోడివారు. ౨౦_౨౨
ఉ. ఇప్పుడు నిన్ను నీబలము ♦ నెల్లను మత్కరముక్తబాణముల్
గప్పి దహించుఁ దూలికలఁ ♦ గాల్చెడునగ్నిబోలి లక్ష్మణా!
యిప్పుడె మీర లందఱును ♦ నేగెద రొక్కటఁ గాలుప్రోలికిన్
దప్పక మల్లఘుప్రదర♦దారుణవృష్టుల నోర్చు నెవ్వఁడో. ౨౦౨౩
చం. మఱచితి వేమొ లక్ష్మణుఁడ ♦ మత్పవితుల్యకలంబధారలన్
గొఱ కొఱ యూర్పుతోఁ దెలివి ♦ గోల్పడి ధారిణిఁ ద్రెళ్లి యుండుటన్
మఱవక యున్నచో యముని♦మందిరముం జనఁ గోరి వచ్చితో
కఱకరిసర్పముం జెనయుఁ♦గా నిట వచ్చితి వేమొ బేల వై. ౨౦౨౪
కం. అనవుడు నభీతవదనుం, డును గ్రోధియు నగుచు లక్ష్మ♦ణుఁడు పల్కెను జే
తనుగానిపగ్గె లాడితి, పని దీర్చి వచించువాఁడు ♦ ప్రాజ్ఞుం డెందున్. ౨౦౨౫
ఆ. పనికిరానికొన్ని ♦ పలుకులు పలుకుచు, నేరి కలవిపడని♦కారియములఁ
జలిపినట్ల చెప్పి ♦ సంతోషపడియెదు, ధన్యతముఁడ ననుచు ♦ దాశకంఠి! ౨౦౨౬
కం. పరికిని గోచరింపక, యారే యుద్ధమున మఱఁగి ♦ యటు లొనరింపన్
బౌరుష మెచ్చునె? యదియును, జోరునిమార్గంబు గాక ♦ శూరుని విధమే?
కం. నీశరపథమున నిల్చితి, నాశరవర! నీవు దొల్లి ♦ యగపఱచినబా
హాశక్తిఁ జూపుమీ కన, నాశించితి ఫలము గలదె ♦ వ్యర్థోక్తులచేన్. ౨౦_౨౭

↞ ఇంద్రజిల్లక్ష్మణయుద్ధప్రారంభము. ↠

ఉ. నావుడుఁ గోపఘూర్ణ నయ♦నద్వయుఁ డై నిశితాశుగంబు లెం
తేవడిఁ బైపయిం దెఱపి ♦ నింతయు నీక మహాద్భుతంబుగా
రావణి వైచె, వైచినశ♦రప్రకరంబులచే విధూమ మా
పావక మో యనం బొలిచెఁ ♦ బార్థివుఁడున్ క్షతజార్ద్రగాత్రుఁ డై. ౨౦_౨౮

ఉ. దానవ పొంగి తీర్చితిఁ గ♦దా కెలసం బని రాక్షసుండు గ
ర్జానినదార్భటిన్ నభము ♦ వ్రయ్యఁగఁ జేయుచుఁ బల్కె లక్ష్మణా!
మానితమర్ధనుర్గళిత♦మార్గణకుండలిమండలంబు నీ
ప్రాణసమీరణంబుల దు♦రంబున నిప్పుడు గ్రోలుఁ జూడుమీ, ౨౦౩౦

కం.నక్కలు డేగలు గ్రద్దలు గ్రిక్కిఱియుచు వ్రాలి, నావ♦రిష్ఠశరములన్
దిక్కఱి కూలిననిన్నుం, బొక్కలు పొడుచుచును దినుతఁ ♦ బోరుచుఁ దమలోన్.

చం.కవచము తున్కలై ధనువు ♦ ఖండిత మై పరిధూతశీర్ష మై
దెవి పడియున్నదుష్టుని న♦ధీరుని భక్తవరేణ్య క్షత్రబం
ధువు నినుఁ జూచుఁ బో పరమ♦దుర్గతి రాముఁ డ టంచుఁ బల్కె నా
పావరుఁ డుటారపు న్నడికి ♦ భూవరుఁ డాడు సహేతుకోక్తులన్. ౨౦౩౨

కం.పలువా! వాగ్బల మేలా, పలికితి వెది నీవు సలుపు♦వాఁడ వటంచున్
నలువుగ నది దీరిచి, కీర్తులఁ బొందఁగ రాదె రిత్త♦దూషణ మగునే? ౨౦౩౩

కం.అగ్గించు కొనెదు దేనిని, నిగ్గింపక మున్న నీవ ♦ నిష్ఠురచరితా
యొగ్గింపుము నీపల్కిన, పగ్గెలు నెఱవేర్చి నమ్ము♦వాఁడను నేనున్. ౨౦౩౪

కం.కఱకులు ప్రేలక యేదియుఁ, గొఱఁతల నిడఁబోక పొగడు♦కొనకే నిపు డీ
కఱకుశరంబుల నీతల,నొఱగించెద నేల నాదు♦నొఱపు రహింపన్ ౨౦౩౫

కం.అని యాకర్ణాపూరిత,సునిశితశరపంచకంబుఁ ♦ జొప్పించెను న
ద్దనుజునియురమున నవి వెలిఁ,గెను ఱొమ్మునఁ దీవ్రకరుని♦కిరణముఁ లనఁగన్.

తే. దాన రావణి నొచ్చి ని♦తాంతరోష,కలితుఁ డై వైచె మూఁడుమా♦ర్గణము లుఱక
రాముతమ్మునిమీఁదఁ బ♦రస్పరజయ,వాంఛలను బోరి రిద్ద ఱ♦వారితముగ.

ఉ. ఇద్దఱు విక్రమాన్వితులు ♦ నిద్దఱు భూరిభుజాబలాఢ్యు లా
యిద్దఱు సుప్రసిద్ధులును ♦ నిద్దఱు శస్త్రవరాస్త్రకోవిదుల్
తద్దయు దుర్జయుల్ హరిప♦దంబునఁ బోరుగ్రహంబు లట్టిరై
యుద్దిగఁ జెంగిపోక రణ♦ముగ్రతఁ జల్పిరి దుష్ప్రధర్షణుల్. ౨౦౩౮

కం.సింగము సింగముఁ దాఁకిన, భంగిని బెనఁగిరి నితాంత♦పౌరుషయుతు లై
లొంగక సడలక నిర్జర,పుంగవశత్రు లన మనుజ♦పుంగవదనుజుల్. ౨౦౩౯

ఉ. ఒండొరు మీఱుసంతసము ♦ నొండొరు మీఱెడిసాహసంబు దా
రొండొరు మీఱుశౌర్యమును ♦ నొండొరు మీఱురణాభిలాష ము
ద్దండధనుఃకళానిపుణ♦తల్ శరవేగము మీఱు చుండఁగా
నొండొరు ముంచి రుగ్రమహి♦తోగ్రకలంబకదంబకంబులన్. ౨౦౪౦

ఉ. ఒక్కరుఁ డేయుమార్గణము ♦ లొండొకగుం డెపఁ ద్రుంచి వైచు వే
ఱొక్కఁడు వేయులోన మఱి♦యొక్కఁడు ముంచు శరాళి నిట్లు దా
రెక్కువ తక్కువల్ దొడర ♦ కేడ్తెఱ శంబరవాసవాభు లై
మిక్కిలి తెంపు పెంపునను ♦ మేటిలి పోరిరి జల్లజంపు లై.[1] ౨౦౪౧

↞ ఇంద్రజిత్తు లక్ష్మణబాణంబులచే నొచ్చుట. ↠

సీ. శ్రవణావతంసిత♦జ్యాలతికుం డయి, సౌమిత్రి క్రుద్ధభు♦జంగ మనఁగ
నిట్టూర్పుచును గడుఁ♦బెట్టిదంబుగ నొక్క,దొడ్డ నారసమును ♦ దొడిగి యేయఁ
దద్గుణటంకృతి♦ధ్వానసమాకర్ణ,నంబున మోము తే♦జంబు వాయ
వెల్లవెల్లనయయి ♦ డిల్ల పాటున శక్ర,వైరి లక్ష్మణు మోము ♦ వంకఁ గనిన
ఆ. వానివిధ మెఱింగి ♦ ప్రధనసంయుక్తుఁ బ్రొ
ద్ధ్వీతలేంద్రజుని వి♦భీషణుండు
చేరి వైరియందుఁ ♦ జిహ్మముల్ గన వాఁడు
చెడుట నిజము త్వరయుఁ ♦ జేయ వయ్య. ౨౦౪౨

ఆ. అనుడు నగ్నిశిఖల ♦ కనుఁగుఁదోఁబుట్టు లౌ,వాలురంపగములఁ ♦ బాఁపపిండు
పుట్టలోనఁ దూఱు♦పోలుపున నాతని,మేను దూఱ నేసె ♦ మెత్తఁబడక. ౨౦౪౩

మ. బలభిత్సాధనతుల్యబాణచయసం♦స్పర్శంబునన్ వాఁడు వ్యా
కులసర్వేంద్రియుఁ డై జడుం డయి వ్యథా♦కుంఠీభవత్కార్యుఁ డై
కలనన్ మేడ్పడి యుండి తెప్పఱిలి ని♦ష్కంపప్రభావాఢ్యు ను
జ్జ్వలతేజున్ నృపసూతిఁ గాంచి యనె వా♦చాగర్వ మేపారఁగన్. ౨౦౪౪

చం. తొలిదివసంబుయుద్ధమున ♦ ధూళిని బ్రుంగుచు నేలఁ బొర్లఁగా
బలితపుశస్త్రపాశముల ♦ భ్రాతల మి మ్మటు కట్టివైచుటల్
తలఁపున లేదె? లేమిఁ గద ♦ దార్కొన వచ్చితి నన్నుఁ బోరిలోఁ,
బిలుచుచు నున్నదో యముని♦వీడటుగా కిటు వచ్చువాఁడవే. ౨౦౪౫

కం. ప్రథమదినంబున జరిగిన,ప్రథనంబున నాబలంబుఁ ♦ బరికింపనిచోఁ
బ్రథితంబుగఁజూపెద ని,ర్మథితుని నినుఁ జేసి నిమిష♦మాత్రము నిలుమీ. ౨౦౪౬

చం. అని శరసప్తకంబున నృ♦పాత్మజునిం బదిటన్ మరుత్సుతున్
బెనుఁగినుకన్ విభీషణుని♦భీషణబాణశతంబునన్ దశా
స్యునితనయుండు వైచుటయుఁ ♦ జూచి సుమిత్రసుతుండు చీరికిన్
గొన కవి నవ్వు చివ్వియ యొఁకొ యురులం బస దూలఁ జేసెడిన్. ౨౦౪౭

ఉ. లెక్కయె పొమ్మటంచు నప♦లీల శరంబులఁ గ్రుమ్మ నాతఁడున్
జిక్కఁగ నేయుబాణములు ♦ చిందఱవందఱ సేయు చిల్లనున్

[1] జల్లజంపులు = సాహసులు.

రక్కసుఁడా! భవచ్ఛిత శ♦రంబు లొకో యివి యిట్టివానిఁ దా
నుక్కరిశత్రు వుగ్ర వయిచు♦నో యెవఁ డేనియు గెల్వఁ గోరినన్. ౨౦౪౮

తే. లఘువులును నల్పవీర్యములా♦రాక్షసుండ!
త్వచ్ఛరంబులు వ్యథ లేదు ♦ తగులు చున్న
నిట్టివానిని నేయు నే ♦ దిట్టబంట
టంచుఁ గవచంబు ప్రయ్య శ♦రాళిఁ గురిసె. ౨౦౪౯

## ఇంద్రజిల్లక్ష్మణులు ఘోరంబుగఁ బోరుట.

ఉ. ఆవిశిఖోగ్రసృష్టికిని ♦ హాటకభూషితవర్మ మంతయున్
వావిరి తున్క తున్క లయి ♦ వ్రాలె రథంబున మింటనుండి వే
వే వసుధం దొరంగునుడు♦బృందములో యనఁ గృత్తవర్ముఁ డై
రావణి బాణవిద్ధుఁ డయి ♦ రాజిలె నష్ట ప్రరూఢశైల మై. ౨౦౫౦

ఉ. అంతఁ బరస్సహస్రభయ♦దాంబకసృష్టి సుమిత్రపట్టిమే
నంతయుఁ గప్పి నిస్తులిత♦మైనతనుత్రముఁ ద్రుంచి వైచి య
య్యంతకభీకరుండు కృతి ♦ కష్ట ప్రతీక ఘటియించె, నిట్టు ల
త్యంతరుషావశాత్ము లయి ♦ యన్నె అజోదులు సాటిదీటుగన్. ౨౦౫౧

కం. పోరుచు నన్యోన్యాశుగ, దారితసర్వాంగు లగుచుఁ ♦ దడయక జయముం
గోరుచు నెత్తురుగార్చుచుఁ, గారణ[1] నూర్చుచును దీర్ఘ♦కాలము పోరన్. ౨౦౫౨

చం. తనువుల నూటకాల్వలవి♦ధంబున నెత్తురు గాఱ గర్జలన్
నినుచుచు ఘోరరూపముగ ♦ నింగిపయోధరసంచయంబు మా
డ్కిని శరసృష్టులం గురిసి ♦ కీడ్పడ కేమియు గాసి లేక య
ద్దనుజనరేంద్రపుంగవులు ♦ ధైర్యము శౌర్యము తుల్యరూప మై. ౨౦౫౩

కం. దీపింపఁగఁ బోరుచు దృఢ, చాపంబులు గుడుసువడఁగ ♦ శస్త్రాస్త్రంబుల్
పైపయిఁ గురియుచు విశిఖ, వ్యాపారము చేత మింటి ♦ బంధించి రొగిన్. ౨౦౫౪

చం. ప్రిదులనిబాణవేగములు ♦ వీడనిచిత్రపరాక్రమంబులున్
వదలనిలాఘవంబులును ♦ వ్రాలనిచాపకళాచమత్కృతుల్
పొదలనిరోషము ల్వెలయఁ ♦ బోరిరి హారితలప్రహారముల్
నదములు వజ్రఘోషము ల♦నన్ విన నయ్యెను వేఱు వేఱుగన్. ౨౦౫౫

సీ. జనములు కంపించు♦చటులగర్జార్భటుల్, శరముల తాఁకుల♦చప్పుడులును
బధిరతాపాదు లౌ♦భయదగుణధ్వను, లాశుగంబులహతి ♦ నైనయులివు
లేకంబుగాఁ దప్త♦హేమపుంఖాంకిత, బాణంబులను మేన ♦ వ్రణము లెసఁగఁ
గాఱెడినెత్తుటి♦కాల్వలతోడను, బుష్పితాశోకముల్ ♦ పోలుపు దాల్చి

[1] కారణ = బాధ.

తే. యని యొనర్పఁగ వారిశ♦రాళి తనులు
గాఁడిపాటి వసుంధరా♦గర్భసీమఁ
దూఱె నొకకొన్ని నభమునఁ ♦ ద్రుంగిపోయె
మఱియు నొకకొన్ని యెదిరియం♦బకము లణఁచి ౨౦౫౬

ఆ. వెలుఁగు నగ్నియుగము♦కలిమి దర్భమయంబు, క్రతు వనంగ దాశ♦కంఠిదాశ
రథులరణము వెలిఁగెఁ♦ బ్రకటమార్గణమయి, మగుచు విబుధలోక♦హర్షద మయి.

ఉ. రావణిలక్ష్మణుల్ దెగి ప♦రస్పరసంజ్ఞపనాభిలాషు లై
కేవలరౌద్రమూర్తు లయి ♦ ఖిన్నత నొందక యీడఁబోక తెం
పావహిలంగఁ బ్రాణముల ♦ నాశ వహింపక మిన్ను మన్ను బా
ణావృతముం బొనర్చిరి ర♦వంతయు స్రుక్కక పెద్దకాలమున్. ౨౦౫౮

కం. ఆకొక్కటియును తే క,స్తోకం బలరులఁ జెలంగి ♦ సొబ గగురక్తా
శోకంబులు బూరుగు లనఁ, బాకారిజితుండు రాము♦భ్రాత వెలుంగన్. ౨౦౫౯

కం. కలహాపరిశ్రమ నింద్రజిఁ, బొలియింప విభీషణుండు ♦ పౌరిఁ బ్రియహితముల్
గలిగింపఁగ నపరాజిత,బలుఁ డగులక్ష్మణున కతని♦పజ్జన యుండెన్. ౨౦౬౦

విభీషణుండు కపులఁ బ్రోత్సాహపఱుచుట.

శా. అన్యోన్యప్రతిఘాతనైపుణు లమ♦ర్త్యద్వేషిమిత్రాన్వజుల్
జన్యాటోపము మీఱ గర్జితవన♦స్తంబేరమద్వంద్వసా
మాన్యంబుం దలఁపించుచుం బెనఁగుచో ♦ క్ష్మానాథపుత్రుండు ప
ర్జన్యారాతిపయి న్నిగిడ్చె శితధా♦రాఘోరనారాచముల్. ౨౦౬౧

కం. బర్హిశ్శ్వసనిభేషులు, బర్హిర్ముఖవైరిసేనఁ ♦ బడి ప్రతిభటని
స్తర్హణ మొనరిచెఁ బాకని,బర్హణుకులిశంబు శైల♦వారముఁ బోలెన్. ౨౦౬౨

తే. భీషణబలాఢ్యు లైనవి♦భీషణాను,చరులు శూలాసిపట్టస♦సాయకముల
గుములు గుములుగ రాక్షసకోటిఁ గూల,నైచి రప్పుడు తమకేలి♦వాఁడి మెఱసి.

కం. గున్నేనుంగులనడుమం, దున్నమదగజంబుమాడ్కి ♦ నొప్పెడిదృఢ శౌ
ర్యోన్నతుఁ డైనవిభీషణుఁ, డన్నగచరకోటి కనియె ♦ హర్షము గదురన్. ౨౦౬౪

ఉ. ఎక్కటిబంటులార! వినుఁ♦డీ దశకంఠున కీతఁ డొక్కఁడుల్
జిక్కినయీబలంగ మిది ♦ శేషము, వీఁ డిటఁ ద్రెళ్ళె నేనియుల్
రక్కసు లెల్లరుం దెగిర ♦ రావణుఁ డొక్కఁడు దక్కఁ, గాన మీ
యుక్కు జవంబునుల్ మెఱసి ♦ యుగ్రతఁ జంపుఁడు వీరి నందఱన్. ౨౦౬౫

సీ. కుంభకర్ణుండును ♦ గుంభ నికుంభ ప్రహస్తసుప్తఘ్ను ధూ♦మ్రాక్షు వికట
సంహ్రాదిదుర్ధర♦జంబుమాలులు వజ్ర,దంష్ట్రమహామాలి ♦ తపనదములు

నశనిప్రభుండును ♦ యజ్ఞకోపుండును, బ్రఘసప్రఘాసులు ♦ రశ్మికేతు
వగ్నికేతుండును ♦ సర్పశత్రుండును, జంఘుప్రజంఘులు ♦ చక్రమాలి
తే. కంపనుండు ద్విజిహ్వుఁ డ♦కంపనుండు, తీక్ష్ణవేగసుపార్శ్వులు ♦ ధీరనిఘ్నుఁ
డల్లదేవాంతకనరాంత♦కాదులెల్ల, బవరమునఁ గూలి రీతఁ డే♦పాటి వీఁడు.

కం. వారల నెల్ల వధించిన,వీరుల రీయసురఁ ద్రుంప ♦ వింతయె పారా
వారముఁ గరముల నీఁదిన,యీరలు గోష్పదము నీఁది ♦ యెసఁగుఁడు కీర్తిన్.

కం. మీ రింకఁ జేయ మిగిలిన,కారియ మీసేన యమున♦గారంబునకున్
వారక పనుచుటె క్రొవ్విన,వారెల్లరుఁ జనిరి మున్న ♦వరుసలు గొనుచున్. ౨౦౧౮

ఉ. నానుతు నేన చంపుట య♦సంగ నయుక్తపుఁగార్య మైనన్
వాసిగ రామహేతువునఁ ♦ బాసి దయన్ వధియింపవచ్చు నే
దోసము లేదు పో యితనిఁ ♦ ద్రుంపఁగ నాస వహించు నాకనుల్
మాసరబాష్పపూరములు ♦ మాటికి మాటికి నప్పళించెడిన్. ౨౦౧౯

ఉ. కావున వీని లక్ష్మణుఁడె ♦ గం డడఁచుం గపులార! మీరు నే
లా విత యూరకుండ లివ ♦ లావు వెలుంగఁగ నింద్రజిత్సమీ
పావనిసేనఁ ద్రుంపఁ దగ ♦ వన్నఁ గపుల్ చెలఁ రేగి శత్రుసే
నావళి డాసి పోరిరి య♦పారభుజావిభవంబు లేర్పడన్. ౨౦౨౦

తే. కారుమబ్బులఁ గాంచి మ♦యూరసమితి, యుబ్బి కేకలు వైచెడి♦యొప్పు దోఁప
యామినీచరసైన్యంబు ♦ నారఁగాంచి,గర్జల నొనర్చె శాఖామృ♦గములపిండు.

సీ. వారిలోపల జాంబ♦వంతుండు నిజయూథ,వృతుఁ డయి రాక్షస♦వితతిమీఁదఁ
గవిసి పోరొనరింపఁ ♦ గలఁక లే కసురులు, చుట్టుముట్టిరి వాని ♦ మట్టుమీఱి
శరములఁ బట్టస♦పరశుతోమరముల, భల్లూకపతిమీఁద ♦ జల్లువోలెఁ
గురిసి నొప్పించిన ♦ సరకు సేయ కతండు,పోర బీభత్సమై ♦ ఘోరమయ్యు
తే. దేవతాసురయుద్ధంబు♦ తెఱవు దోఁప, నల్లభీమస్వనంబులు ♦ పెల్లెగయఁగ
గాడ్పుపట్టియుఁ గ్రుద్ధుఁడై ♦ క్ష్మారుహమున, నేటునకు వేవు రిలఁ గూల♦నెగసి చంపె.

చం. తనపినతండ్రితోఁ బెనఁగి ♦ దానవనాథసుతుండు వెండియున్
దనుజనికారణున్ దశర♦థప్రభుపుత్త్రకుఁ గిట్టి తాఁకినన్
హనుమయు లక్ష్మణుం గొలిచె ♦ నంతట వారికిఁ బోరు చెల్లె భూ
తనివహహృత్ప్రకంపనని♦దానము నిర్జరరోమహర్ష మై. ౨౦౨౩

ఇంద్రజిల్లక్ష్మణు లఘోరంబుగఁ బోరుట.

కం. ప్రావృట్కాలంబున రవి,జైవాతృకబింబయుగము ♦ శరధరసంఘా
తావృత మగుచందంబున, నావీరయుగంబు మఱుఁగె ♦ నాశుగతతులన్. ౨౦౨౪

కం. తీయుట తొడుగుట దిగయుట, వేయుట కైమార్పు లక్ష్య ♦ వీక్షించుటయున్
బాయుట డాయుట దురమున, లాయుట గనరాదు వారి ♦ లాఘవగరిమన్.

తే. చాపవేగవినిర్ముక్త ♦ శరవితానములను నెద్దియుఁ దోఁప దే ♦ తలమునందు
నెందుఁ జూచినఁ బఱచెడి ♦ క్రిందఁబడెడి, తాఁకుచుండెడి బాణసం ♦ తాన మేచె.

తే. ఒండొరులమీఁద వార లు ♦ ద్దండవృత్తిఁ, జిమ్ము కాండంబు లభ్రప ♦ థమ్మునందుఁ
బందిరి ఘటించినట్లు గ ♦ న్పట్టుచుండెఁ, జిమ్మచీఁకట్లు ధరణిని ♦ ముమ్మరముగ. ౨౦౭౭

ఉ. వారలబాణవేగములు ♦ వారలశౌర్యవిజృంభణంబులున్
వారలహస్తలాఘవము ♦ వారల తెంపును బెంపుఁ జూడఁగా
నేరికొ గెల్పు వీని కిద ♦ మిత్థ మటంచు వచింపరాక పెం
పారుచు నుండె నాకదన ♦ మబ్బురపోవుచుఁ జూడ ఖేచరుల్. ౨౦౭౮

కం. దెసలును మూలలు బాణ,ప్రసరంబులచేత నిండ ♦ రవి లేనియెడన్
ముసరెడి పెంజీఁకటినా, నెసఁగెను సంతమస మపుడు ♦ దృగ్భీకర మై. ౨౦౭౯

సీ. నెత్తురుటేఱులు ♦ మొత్తంబు లైపాఱెఁ, గ్రవ్యాదములు నించెఁ ♦ గతినరుతము
లనలుండు జ్వలియింపఁ ♦ డనిలుండు వీవఁడు, స్వస్తి లోకేభ్య య ♦ టంచుఁ బలికె
ఋషిసంచయంబులు ♦ బృందముల్ గట్టి వీక్షించు గంధర్వాది ♦ ఖేచరతతి
సాధ్వసంబున సహ ♦ చారణమై దవ్వు, చని నిల్చి కనియె నా ♦ సమయమునను

ఆ. సుకృతహస్తుఁ డైన ♦ శూరుండు లక్ష్మణుం, డసురసింహు హాట ♦ కాంచితముల
నీలసైంధవముల ♦ నాలుగింటిని నాల్గు, వాలురమ్ము లేసి ♦ పటిమ మాన్చి ౨౦౮౦

లక్ష్మణుఁ డింద్రజిత్తుసారథిని జంపుట

కం. వేఁడిమిఁ బిడుగున కెన యై, వాఁడి మిగిలి మేలిగఱుల ♦ నఱలుచు డాలుం
బోఁడిమిగలయమ్మున న,వ్వాఁడిమగనిసూతు శిరము ♦ వసుధం గూల్చెన్. ౨౦౮౧

ఉ. సారథిఁ జంపి తత్క్షణమ ♦ చాపముఁ ద్రుంచిన దాశకంఠియున్
దేరిన దాన తోలుచును ♦ దేఁకునఁ గార్ముక మొండు పూని య
వ్వీరుఁడు పోరుటల్కిగుల ♦ వింతలు గొల్పెను, సూతకృత్యమున్
దీరుచువేళ లక్ష్మణుఁ డు ♦ దీర్ణరయంబునఁ ద్రుంచి వింటినిన్. ౨౦౮౨

ఉ. చాప మొకండు పుచ్చుకొను ♦ సందున వాజుల నొంచె నొంపఁ దా
నేపు దొఱంగ కాయసురుఁ ♦ డెంతయుధీరతఁ దాను వైచుబ
ల్తూపులలోన మార్గలయఁ ♦ దూర్ణను బాణపరంపరాహతిన్
జోపు గొనంగఁ జేయఁ దన ♦ సూతునిచావున కంగలార్చుచున్ ౨౦౮౩

ఉ. తేజు దొలంగియున్న నర ♦ దేవవిరోధిముఖంబుఁ గాంచుచున్
భూజచరావళుల్ పొగడె ♦ భూధవపుత్త్రకు సాధువాక్కులన్

వాజులపేర్మి నాతఁ డని • వారణశక్తిఁ జరించుచుంటచే
యోజనచేసి శౌర్యమద • యుక్తులు నల్వురు వానరేశ్వరుల్. ౨౦౮౪

చం. శరభుఁడు గంధమాదనుఁడు • సారబలుల్ రభసప్రమాథు లు
ద్ధురగతిఁ జివ్వున న్నెగసి • దూఁకి హయంబుల నాలుగింటినిన్
ధరణిని గూల్చి రావణిర • థంబును దున్కలు చేసి వెండి ని
ల్చిరి త్రుటిలోన లక్ష్మణుని • చెంతఁ గపీంద్రులు తమ్ము మెచ్చఁగన్. ౨౦౮౫

కం. హతతురగుఁడు హతసారథి, హతనిర్జరరాజుఁ డపుడు • క్షితి నిలఁబడి క్ష్మా
పతిసుతు నెదిరిన నాతఁడు, శితశరముల నతనియదుటు • చెఱిచెం ద్రుటిలోన్.

ఇంద్రజిత్తు కపుల వంచించి లంకకుఁ బోయి రథకుఁడై వచ్చుట.

ఉ. మానక కాండము ల్గురియ • మానవనాథసుతుల్ సురారి నా
నానిశితాస్త్రసంతతు ల • నంతముగాఁ గురియింప నిర్వురున్
మానము మచ్చరంబు విసు • మానముగాఁ బెరుఁగంగఁ బోరుచో
వానరరాక్షసావళులు • వారలప్రాపున వైరిసంఘముల్ ౨౦౮౬

కం. కుతిలపడఁ బెనఁగుచుం దమ, పతులన్ రక్షించుకొనుచుఁ • బలువిధముల ను
ద్ధతిఁ జూపఁగ నపు డాహరి, జితుఁ డసురుల మెచ్చి పొగడి • చేరి యిటు లనున్.

సీ. సకలకకుప్పుల • సంతమసం బతి, గాఢ మై పర్వె రా • కాసులార!
మనవారిఁ బెఱవారిఁ • గనిసింపఁగా రాదు, సలుపంగఁ దగు నొండు • సాహసంబు
తెలిపి నింతయు నీక • తికమిక గొనఁ గపుల్, ముసరి పోరుఁడు వారు • మోహపడఁగ
క్షణములో నరుదెంతు • స్యందనస్థితుఁడ నై, యంకిలి లేక నే • లంక కరిగి

తే. వార లెఱిఁగిన నడ్డము • వచ్చు వారు, వారలను మోసగింపఁగ • వలయు మీరు
శక్తిసామర్థ్యముల కిది • సమయ మన్న, వారు వల్లె యటంచును • బోరు చుండ.

కం. పురికిం జని కనకాలం, కరణోపేతంబు రథము • ఘనముసలగదా
కరవాలపూర్ణ ముత్తమ, తురగము హితసారథికముఁ • దొర సమకూర్చెన్ ౨౦౯౦

ఉ. పూని రథస్థుఁ డై భటుల • పుంజము వెంబడి రాఁగ వాఁడు లం
కానగరంబు వెల్వడియెఁ • గాలుఁడు దన్ బెరరేప వచ్చి రా
మానుజు నవ్విభీషణుని • నద్రిచరావళి శాతబాణధా
రానికరంబులం బొదివె • రాక్షసు లందఱు మేలు మే లనన్. ౨౦౯౧

కం. ఆతనిజవలాఘవముల, కాతతవిస్మయము గాంచి • రగచరులు సుమి
త్రాతనయవిభీషణులుల, జేతంబున నితఁడె యోధ • శేఖరుఁ డనుచున్. ౨౦౯౨

లక్ష్మణుఁ డింద్రజిత్తు నొప్పించుట.

ఉ. రక్కసునుక్రోధమూర్ఛఁ గపి • రాజుల రావణి మూర్ఛ వేలుగన్
జక్కఁగ సాల్పుడన్ నిశిత • సాయకము ల్నిగిడింపఁ దక్కువా

రుక్కటి రాఘవానుజుని♦ యోలముఁ జేర సురారిచాపమున్
ముక్కలు ముక్కలై విఱుగ ♦ ముల్కి నిగిడ్చె సుమిత్రపట్టియున్. ౨౦౯౩

చం. సరభసవృత్తి నయ్యసుర ♦ చాప మొకొండు గుణంబుఁ గూర్చుచోఁ
ద్వరపడి మూఁడుబాణముల ♦ దానిని ద్రుంచి సపక్షపన్నగో
త్కరములఁబోలు నైదువిశి♦ఖంబుల వక్షముఁ దూఱ నేయఁగా
నురవడి నవ్వి మే న్వడలి ♦ యుర్విని రక్తభుజంగమక్రియన్ ౨౦౯౪

ఉ. వ్రాలఁగ భిన్నవర్ముఁ డయి ♦ రక్తముఁ గ్రక్కుచు గాఢసారమౌ
వాలు శరాసనంబుఁ గొని ♦ పార్థివనందను నప్పురందరుం
బోలి శరోగ్రవృష్టులను ♦ ముంచిన సంభ్రమ మింత లేక య
య్యాలరిఁ బాఱఁ జూచె నృపుఁ ♦ డద్భుతమున్ ఘటియించెఁ జూపఱన్. ౨౦౯౫

ఉ. అంతట లక్ష్మణుండు విల♦యాంతకుకైవడి రేఁగి విద్విష
త్సంతతి నొక్క నొక్కనిని ♦ దప్పక యేసియు మూఁడు మూఁడు జీ
వాంతకభల్లకంబుల సు♦రారిధవాత్మజు ముంచె భీమవి
క్రాంతి యెసంగఁగా బహుళ♦కాండములం గనువారు బెగ్గిలన్. ౨౦౯౬

ఉ. వాఁడును నీడఁబోక కర♦వాఁడిలకోరులఁ దీవ్రవేగుఁ డై
వేఁడిమి చూప వాని నడు♦వీదిని దున్కలు చేసి యొండుక్రొ
వ్వాఁడిశరంబునం దునిమెఁ ♦ బాతకిసూతుశిరంబు శిక్షచే
నాఁడెము లైనమావులు పె♦నంగక సారథిలేక యుండియున్. ౨౦౯౭

కం. మండలవిభ్రమణంబుల, గం డడఁగక తిరుగ వింత ♦ గలిగించె; మహా
కాండంబుల సౌమిత్రియు, గుండె లదరఁగొట్టెవానిఁ ♦ గ్రూరుం డగుచున్. ౨౦౯౮

ఉ. ఆతనియేపుసైఁపక మ♦హాంబకముల్ కులిశాభము ల్జ్వల
స్ఫీతము లాసుమిత్రసుతుఁ ♦ జిమ్మిన నయ్యవి జోడుదాఁకి యు
ర్వీతలమందు వ్రాలఁగ న♦భేద్యతనుత్ర మటంచు నెంచి తా
శాతశరత్రికంబుఁ దొడి ♦ సత్వరుఁడై నొస లంట నేసినన్. ౨౦౯౯

కం. కరలాఘవమును నెఱపుచుఁ, బరఁగించినతచ్ఛరాళి ♦ ఫాలమునందున్
గర మరుదుగ మెఱయఁగ నెఱ,సరి లక్ష్మణుఁడుం ద్రిశృంగ♦శైలం బనఁగన్. ౨౧౦౦

చం. వెలయుచు రోషసంక్షుభిత♦వీక్షణుఁ డై వడి నైదునారసం
బులఁ దొడి వైరిఫాలమున ♦ భూరిబలుండు నిగిడ్చె నిట్టు లా
యలఘుపరాక్రముల్ మదుల ♦ నాఱనియానున నొం డొకళ్లు మే
నులు దలఁపింప జల్లెడల ♦ నూల్కొని పోరిరి గెల్పు గోరుచున్. ౨౧౦౧

మ. అతులామర్షణుఁ డాదశాస్యతనయుం ♦ డాకర్ణపూర్ణేషు ల
ద్భుతవేగంబున నవ్విభీషణునొసల్ ♦ దూఱంగ మూఁ డేసి తా
నితరోర్వీధరచారులం దవుల నే♦కైకాశుగం బేసినన్
తతరోషుండు విభీషణుండు గదచేఁ ♦ ద ద్వాజులం గూల్చినన్. ౨౧౦౨

→ ఇంద్రజిల్లక్ష్మణులు దివ్యాస్త్రంబులఁ బోరుట. ←

చం. తురగము లీల్గినన్ ధరణి ♦ దూఁకి బలారివిరోధి శక్తిచేఁ
ద్వరితగతిన్ విభీషణుని ♦ వారక వైవ సుమిత్రపట్టి భీ
కరశరము ల్పదిం దొడిగి ♦ త్రుంచె స్థలిఁ దెళ్లఁగ దాని నేసినన్
హరిహయసాధనాభభయ♦దాశుగముల్ దనయన్నపుత్రు పై ౨౧౦౩

ఉ. ప్రేసె వెసన్ విభీషణుఁడు ♦ ప్రీలఁగ ఱొమ్మువి దూసి పాటినన్
రోసముతోఁ బితృవ్యుపయిఁ ♦ గ్రూరచరిత్రుఁడు కాలసత్త్వమై
భాసిలు భీషణాస్త్రమును ♦ వైచిన స్వాస్నకు బేరదత్తది
వ్యాసమదుర్విషహ్యాపర♦మాస్త్రము లక్ష్మణుఁ డూని వైచినన్. ౨౧౦౪

కం. బలవంతులు బలవద్ధను,వుల బలవంతముగఁ దిగిచి ♦ పుచ్చిన జ్యావ
ల్లులు క్రౌంచంబులపోలిక, వెలయించెను ధ్వనులు సురలు ♦ వెఱఁగొందంగన్.

సీ. ఆయస్త్రములు రెండు ♦ ననలంబుఁ గ్రక్కుచుఁ, బిడుగులమాడ్కిని ♦ వడిగఁ బాఱి
చదల నొండొంటిని ♦ సరగ ఢీకీలున, ఢీకొట్టుకొనుచు న♦స్తోకధూమ
విస్ఫులింగంబులు ♦ విన్నెల్ల నఱుమంగ, భూరిగ్రహములట్లు ♦ పోరి పోరి
శతధాచ్ఛిదంబు లై ♦ త్రుంచె స్థలి వ్రాలిన, సౌమిత్రియును శక్ర♦శాత్రవుండు

ఆ. సిగ్గురోసములను ♦ జిడిముడి పడి రంత, వారుణాస్త్రమును నృ♦పాలసుతుఁడు
వైవ రౌద్రశరము ♦ వైచి రావణుపట్టి, యద్భుతముగ దాని ♦ నణఁచి వైచె.

చం. ఉడుగక యంతలోనఁ గడు♦నుగ్రత లోకములెల్లఁ గాల్చున
వ్వడువునఁ బావకాస్త్రమును ♦ వాసవవైరి గుణంబుఁ గూర్చి నె
వ్వడి రఘురాముతమ్మునపయి ♦ వైచిన నాతఁడు సౌరబాణముం
దొడిగి యణంచె దాని మదిఁ ♦ దొట్రిల శత్రువరుండు వెండియున్. ౨౧౦౫

కం. ఆసురబాణము వైచిన, భాసురముద్గరముసుంత ♦పరిఘగదాసుల్
రాసులుగ వెడలి రాఁ గని, ప్రేసెన్ లక్ష్మణుఁడు రౌద్ర♦విశిఖము సరగన్. ౨౧౦౬

మ. అనివార్యంబు సమస్తశత్రుహననో♦దాగ్రంబు రౌద్రాస్త్ర మా
దనుజాస్త్రంబును నాఁగినన్ గగనభూ♦తవ్రాతముల్ క్షుబ్ధమై
మను జేంద్రాత్మజుఁ జుట్టి యుండె, ననుర♦త్రుంచె నాథయుద్ధంబు స్వ
ర్జనతాశ్చర్యనిదాన మై భయద మై♦సంభ్రాంతిదం బై కడున్ ౨౧౦౭

ఆ. వర్తిలంగ ఋషి సు♦పర్వగంధర్వాహి,గరుడతతులు గూడి ♦ హరిహయుండు
మున్ను గాఁగఁ గలన ♦ సన్నుతశీలు లక్ష్మణుని హెచ్చరికను ♦ గాచు చుండ

→ లక్ష్మణుఁ డింద్రజిత్తును వధించుట. ←

సీ. అలఁతులఁ బోఁడు స♦ర్వాస్త్రవేది యితం డ,టంచు రోషించి రా♦మానుజుండు
మును సురాసురయుద్ధ♦మున హరి యెద్దానఁ, గీనాశసంఘంబు ♦ గీ టణంచె
నట్టివహ్నిస్పర్శ ♦ మసమసుపర్వంబు, సారపత్త్రంబు సు♦సంస్థితంబు
హాటకవికృతంబు ♦ నరినాశనకరంబు, దుర్నివారంబును ♦ దుస్సహంబు
ఆ. విబుధపూజితంబు ♦ విషధరప్రఖ్యంబు, నింద్రదేవతాక ♦ మైంద్రశరముఁ
గార్ముకోత్తమమునఁ ♦ గాండోత్తమంబును,బూరుషోత్తముండు ♦ పూని తిగిచి
తే. సారధర్మాత్ముఁడును సత్య♦సంధుఁడేని, రామచంద్రుండు దశరథ♦రాజసుతుఁడు
పౌరుషమునను నప్రతి♦ద్వంద్వుఁ డేని, శరమ! యీరావణాత్మజు ♦ సంహరింపు.
చం.అని నిజకార్యసాధకయ♦థార్థసుభాషణము ల్వచించి చ
య్యన దృఢముష్టిదృష్టిలఘు♦తాతిరయంబులు దోఁపఁగా దశా
స్యనిసుతుపై నిగుడ్చ నది ♦ సూర్యనిభప్రభ మై మహోద్ధతిం
జని సశిరస్త్రకుండలము ♦ శాత్రవుమూర్ధముఁ ద్రుంచె వ్రేల్మిడిన్. ౨౧౧౩
చం. తెగినశిరంబు హేమరుచి♦దీపిత మై రుధిరోక్షితంబు నై
బిగిచెడ కుర్విఁ గానఁబడె ♦ భిన్నశరాసము ఛిన్నవర్మముఁ
నొగిలినశీర్షకం బయి త♦నూగిరి ద్రెళ్ల విభీషణుండునుఁ
నగచరులెల్ల వృత్రవధ♦నాఁటిదివౌకసులట్లు మోదిలన్. ౨౧౧౪

→ ఇంద్రజిత్తు మరణంబునకు లోకంబులు సంతోషించుట. ←

కం.మింటను వేలుపులుఁ వాల్గంటులు ఋషివరులు యక్ష♦గంధర్వులు లో
నంటినసంతసమున రవ, గెంటింపక యుల్లసిలిరి ♦ కేకలతోడన్. ౨౧౧౫
ఉ. ఏలికచావుఁ జూచి తము ♦ వృక్షచరుల్ దఱుమంగ రాక్షసుల్
రాలఁగఁ జేతికైదువులు ♦ లంకకుఁ బాఱిరి కాందిశీకు లై
వేలకొలంది దిక్కులకు ♦ భీతిలి పాఱిరి చొచ్చి రంబుధిఁ
శైలము లెక్కి రొల్లియలు ♦ జాఱఁగ వ్రేలఁగఁ గేశబంధముల్. ౨౧౧౬
చం జలజహితుండు గ్రుంకఁ గర♦సంతతి యాతనివెంటఁ బోవు న
ట్చెలువునఁ గూలియున్న హరి♦జిత్తును గాంచి సురారికోటిలోఁ
నిలువఁడ యొక్కఁడే నచట ♦ నిర్వృతపావకుఁ డో ప్రశాంతర
శ్ములదిననాథుఁడో యనఁగ ♦ శూరవరుం డతఁ డొప్పె నయ్యెడన్. ౨౧౧౭

కం. దేవతలతోడ సంగ్రా,మావనికిఁ వచ్చి శక్రుఁ ♦ డసురం గని హ
ర్షావేశంబునఁ బొంగెను, ద్యోవీథిని నెసఁగె దేవ♦దుందుభిరవముల్. ౨౧౧౮

సీ. భాసురతేజుఁ డై ♦ భాస్కరుం డలరారె, శాంతదుఃఖము లయ్యె ♦ జగము లెల్ల
నాపదలను బాసి ♦ దీపించె లోకంబు, పాడిరి గంధర్వ♦వరులు మింట
నటియించి రప్సరో♦నాళీకవదనలు, కురిసెను బుష్పముల్ ♦ సురలగములు
నీరనిధానముల్ ♦ నిర్మలాకృతు లయ్యె,దెసలెల్ల నచ్చపుఁ♦దెలివిఁ దాల్చె

తే. సర్వలోకభయంకర♦శక్రవైరి,గూలినయుదంతమును విని ♦ గుములు గట్టి
చూచి లక్ష్మణు,శ్లాఘించి ♦ శుద్ధఫణితి, దీవన లొసంగె దనుజఘ్న♦దేవవితతి. ౨౧౧౯

కం. కలఁకయుఁ బరితాపము లే, కిల ధరణీనిర్జరాళి ♦ యిఁక నిర్భయమై
మెలఁగెడిననుచు ముదంబునఁ, బలికె సుపర్వోత్కరంబు ♦ బ్రహ్మర్షితతుల్. ౨౧౨౦

ఉ. పొంగుచు జాంబవత్పవన♦పుత్రవిభీషణు లోలి నమ్మహా
భంగపరాక్రముం దివిజ♦వల్లభజైత్రు వధించి మించురా
సింగముఁ జేరి సంస్తుతులఁ ♦ జేయుచుఁ దద్విజయంబు మెచ్చి వే
భంగులఁ దద్రణంబు నభి♦వర్ణన సల్పిరి శ్రద్ధధాను లై. ౨౧౨౧

కం. అఱచుచు లాంగూలంబులఁ, జఱచుచు దుముకుచును లంక ♦ సంక్షోభింపన్
బఱచుచు మెఱయుచు లక్ష్మణు, నెఱి మెచ్చుచు నతనిఁ జుట్టి ♦ నిలిచిరి కీశుల్.

కం. జే లక్ష్మణ జే లక్ష్మణ, జే లక్ష్మణ యనుచుఁ బ్లవగ♦శేఖరు లన్యో
న్యాలింగనరతి రణకథ, లోలిన్ వినిపించికొనుచు ♦ నుండిరి వేడ్కన్. ౨౧౨౩

కం. విని ప్రియసుహృదుఁడు లక్ష్మణుఁ, డొనరించినయసుకరంబు[1] ♦ నొగి నమ్మక తా
రనిభూమికిఁ జని కనుఁగొని, మనముల నుప్పొంగి చని ర♦మర్త్యులు ప్రీతిన్. ౨౧౨౪

## ఇంద్రజిత్తు వధ విని శ్రీరాముఁడు లక్ష్మణుఁ గొండాడుట.

సీ. ఇంద్రజిత్తు వధించి ♦ సాంద్రముదం బొంది, తోఁగుచు నెత్తుట ♦ ద్రుమచరులను
జాంబవంతుని వాయు♦సంభవునిం జేరి, సుగ్రీవరాములఁ ♦ జూడ మనము
పోదము పదుఁడని ♦ పూని విభీషణు,మారుతి కేలు ల♦క్ష్మణుఁడు వేగ
మమరేంద్రుఁ జేరుబృ♦హస్పతివిధమున, రామచంద్రుని డాసి ♦ ప్రణతిఁ జేసి

తే. పలికెఁ దిన్నగ సంకోచ♦పడుచు నింద్ర,జిద్వధంబును రాక్షస♦శేఖరుండు
మనము పొంగఁగసర్వంబు♦వినిచె రామ,చంద్రుఁ డలరారితత్కథా♦శ్రవణమునను.

శా. మేల్మేల్ లక్ష్మణ! నిన్ను మెచ్చితి బళే ♦ మేల్చేసితి వింక నా
జాల్మిం డీల్గుట సర్వకార్యములు లె♦స్సల్ చుమ్మటం చాతనిన్
మేల్మిం బల్కుచు లజ్జమాను నతనిన్ ♦ నిల్పె న్నిజాంకంబునన్
బల్మిన్ శీర్షము మూర్కొనెన్ దృఢపరి♦ష్వంగంబునం గ్రుచ్చుచున్. ౨౧౨౫

[1] అసుకరంబు = దుష్కరము, ప్రాణములఁ గలిగించునట్టిది. ఇంద్రజిత్తు ప్రాణముతో నుండు వఱకు దేవతలు ప్రాణములు లేనివారే.

కం.తను వెల్ల నిమురుచుం ద,మ్ముని మఱి మఱి చూచి దేహ♦మున శల్యసుసా
ధనకృతవ్రణముల గోఁజఁగ, మనమున వగచుచును దాను ♦ మాటికి నూర్చెన్.

కం.తడవును శిరముఁ మూర్కొను, నొడువును ననునయములఁ మ♦నోరుజ దీఱఁ
గడుసరి వాఁ డెంతగ నిసుఁ, గడగండ్లం బెట్టె ననుచుఁ ♦ గళవళమందున్. ౨౧౨౮

కం.అన్నా! నీ వొనరించిన,యిన్నెఱి దుష్కరము పో యి ♦ దెవ్వరి కేనిఁ
జెన్నారె శుభము లేక మన, కన్నిచుఁడు రావణుండు ♦ హతుఁ డాత్మజుతోన్.

సీ. రావణునకు నెష్టు ♦ రావణియే సుమ్ము, దక్షిణబాహువు ♦ తండ్రి! కలన
నట్టిపాలసుని నీ ♦ వంతంబు నొందింప, నిపుడుగా నేను జ♦యించినాఁడ
నెన్నఁగా శక్యమే ♦ యీవిభీషణవాయు,సంభవుల్ సలిపిన♦సాహసంబు
మూఁ డహోరాత్రముల్ ♦ వేఁడిమి మై పోరి, చచ్చెఁగా యొ ల్లెట్లొ ♦ శక్రజితుఁడు

ఆ. ఆత్మతనయుమరణ ♦ మాలకించిన యంతఁ,గలబలంబుతోడఁ ♦ గదలి వచ్చు
నసురవరుఁడు సంగ♦రాతిథ్య మిఁక నిచ్చు, నన్న! నాదుబలిమి ♦ నతఁడు చచ్చు.

కం.నా కిట దిక్కయి నీ వా,నాకపతివిరోధిఁ ద్రుంచి♦నం గద నేనా
త్మాకన్యను రాజ్యంబును, జేకొనఁగాఁ గలిగితిఁ వి♦శిష్టచరిత్రా. ౨౧౩౧

చం.అని యిటు లాశ్వసించి బిగి♦యారఁగఁ గ్రుచ్చి సుషేణుఁ బిల్చి యీ
యనఘుని మిత్రవత్సలు మ♦హామతి స్వస్థునిఁ జేయ వయ్య యీ
యన మెయినాటియున్న యవి ♦ యమ్ములు ముల్కు,లటే విభీషణుఁ
వనచరభుక్షుశూరులను ♦ స్వస్థులఁ జేయుము శీఘ్రకారివై ౨౧౩౨

ఉ. వారును వీరు నేల మన♦వారుగ సంగరకేళి నొచ్చిన
వ్వారలకెల్ల వేగముగ ♦ బాధఁ దొలంపు మటన్న నాతఁడుఁ
సారతరౌషధిఁ నృపతి♦చంద్రున కిచ్చెను, దాని మూర్కొనఁ
గూరె సుఖంబుఁ దక్షణమ ♦ కూలెను ముల్కులు మాని గాయముల్.[1] ౨౧౩౩

తే. మఱి విభీషణునకుఁ, దక్క♦మర్కటులకుఁజలిపెను జికిత్స రాముని♦శాసనమునఁ
దత్క్షణంబున లక్ష్మణ♦తరుచరేంద్రు, లెల్లరును వీతబాధులై ♦ యుల్లసిలిరి. ౨౧౩౪

తే. రామచంద్రానుజుండు ని♦రామయుండు, గాఁగ వానరభల్లూక♦కాండపతులు
నవ్విభీషణుఁడును జాల♦హర్ష మంది, రనుజు వెండియు మెచ్చె సీ♦తాత్మవిభుఁడు.

## ఇంద్రజిత్తుమరణమునకు రావణుఁడు విలపించుట.

చం.తరుచరవర్యు లిందుఁ బ్రము♦దంబునఁ దేలఁగ నందు రాక్షసే
శ్వరుసచివుల్ బలారిజితు♦వార్త వినిఁ సువినిశ్చితాత్ము లై
యురలఁగ బాష్పవారి యసు♦రోత్తమ నీయనుజుండు తోడ్పడం
బొరిగొనె నంట లక్ష్మణుఁడు ♦ పోర భవత్సుతు నింద్రజిత్తునిన్. ౨౧౩౬

[1] ఇట్టి వైద్య మిప్పటి నాగరక శిఖామణు లెంకను నేర్చుకొనవలసియున్నది.

ఉ. శూరవరుండు జన్యమున ♦ నుర్కు_టెఱుంగఁడు, శక్రజైత్రుఁడై
ధారిణిఁ గీర్తి కెక్కె_, బల♦ధాముఁడు నీసుతుఁ డట్టివాఁడు సీ
తారమణానుజుం దొడరి ♦ తద్దయు హోవడి పుట్టఁ జేసి దు
ర్వారశరాళి వీరజన♦భావితలోకముఁ జేరె నంచనన్. ౨౧౩౭

ఉ. దారుణహృద్విదారణసు♦తప్రలయంబును విన్నమాత్రలో
ఘోరపుమూర్ఛ డ్రెక్కొనఁగఁ ♦ గుంభిని డ్రెళ్లి విసంజ్ఞుఁడౌచు లం
కారమణుండు దీర్ఘతర♦కాలమునం దెలివొంది క్రమ్మఱన్
వారనిపుత్రశోకమున ♦ వ్యాకులుఁడై పలవించె దీనుఁడై. ౨౧౩౮

సీ. హా పుత్రరత్నమా! ♦ హా మహారథవర్య!, హా రాక్షసవ్యాఘ్ర♦వీరముఖ్య
నాపెన్నిధానంబ! ♦ నాపాలిభాగ్యమా!, ననుఁ బాయ నీ కెట్లు ♦ మనసు వచ్చె
వాసవునంతటి♦వాని జయించియు, సౌమిత్రిచే నెట్లు ♦ సమసి తయ్య?
కాలాంతకుని నైనఁ ♦ గాలుఁ గూర్చెదునీదు,నాశుగశక్తి యే♦మయ్యెఁ దండ్రి!
తే. మందరముశృంగముల నెల్ల ♦ మహిని ద్రోయఁ
జాలుదోశ్శక్తి యెట్టులు ♦ సమసెఁ బుత్ర
యట్టినీశౌర్య మాసుమి♦త్రాత్మజాతు
నణఁపఁజాలని దయ్యెనా ♦ హా కుమార! ౨౧౩౯

కం. కాలుండు నాకుఁ బూజ్యుఁడు, వాలాయము నేఁడు నిన్ను♦వంటిబలాఢ్యున్
గాలగతిఁ గూర్చె నౌరా!, కాలముగతి నెవ్వఁ డెఱుఁగఁ♦గాఁ గలఁ డెందున్.

శా. అన్నా! నాసుతరత్నమా! యిదియ పో ♦ యర్థంపుమార్గంబు శౌ
ర్యౌన్నత్యంబునఁ గ్రాలువారికి సమ♦స్తామర్త్యమర్త్యాళి క
స్కన్నస్థైర్యుల కాత్మభర్తకయి త్య♦క్తప్రాణు లౌవారి, కా
త్మన్నాదుస్థ్సితి దిక్కులేనివిధముం ♦ దర్కించి దుఃఖించెదన్. ౨౧౪౧

కం. ఎన్నండు నన్నుఁ బాయవు, కన్నాకై నన్ను బలముఁ ♦ గాచెద వికఁ నా
కున్నారె దిక్కు నీకుం, జన్నె నను నొంటి విడిచి ♦ జముపురి కరుగన్. ౨౧౪౨

కం. ఇప్పుడు పో యమరులును గ,కుప్పపతులు ఋషులు నీదు♦కూలుట వినుటన్
మప్పితము లేనిముదము, నొప్పిల్లఁగ నాద మఱచి ♦ నిద్రింత్రు సుతా. ౨౧౪౩

ఆ. పురము నగరు లున్న ♦ భూమి యాకస మున్న, వనము లున్న శైల♦వరము లున్న
జీవరత్న మింద్ర♦జితుఁ డొక్కరుఁడు లేమి, సర్వశూన్య మగుచు ♦ జగము దోఁచె.

కం. అక్కట యంతఃపురముల, రక్కసకన్నియల దుఃఖ♦రవములు గుహలన్
దిక్కేది యఱచుకరిణుల, వెక్కసపుం ధ్వనులువోలె ♦ విన నయ్యె నయో. ౨౧౪౪

ఉ. నన్నును యౌవరాజ్యమును ♦ నాయన! లంకను రాక్షసాళి నీ
యన్నులమిన్ననుఁ జనని ♦ నందఱ వీడి యొకండ పోవఁగాఁ
జన్నె కుమార! నీవు కద ♦ సల్పఁగ నర్హము ప్రేతకార్యముల్
మున్నుగఁ జన్న నాకు, విధి♦మోసమునన్ విపరీత మై చనెన్. ౨౧౪౬

ఉ. రాముఁడు లక్ష్మణుండు కపి♦రాజును బ్రాణముతోడ నుండఁగా
నామనమందు గాటముగ ♦ నాటినశల్యము లట్లు యుండఁగా
నే మని తీవ్రవేదనల ♦ కీగతిఁ బాలొనరించి నన్నుఁ బు
త్రా! మహితోర్ధ్వలోకసుఖ♦రాజికి నాస మొనర్చి తక్కటా. ౨౧౪౭

ఉ. నాయనురక్తి మర్వ నగు♦నా యను నిర్జితనిర్జరాళిసే
నా యను బాహువీర్యసద♦నా యను నీతలిదుఃఖ మార్పరా
దా యను జాయఁ దేర్పఁ దగ♦దా యను నీచల మేల మేఘనా
దా యను నీవె దిక్కువు గ♦దా యను నాతనుజాతరత్నమా! ౨౧౪౮

రావణుఁడు రాక్షసులతోఁ దనపరాక్రమంబు దెలుపుట.

చం. అని విలపించు చున్న సహ♦జాధికకోపనుఁ డైనరాక్షసేం
ద్రునకు సుతార్తిసంభవము♦రోషము భీషణ మై మనంబునన్
జననము నొంద వేసఁగిని ♦ సంజ్వలదశ్మలు రశ్మిమాలికిన్
ఘనతరతీక్ష్ణతం గొలుపు♦కైవడి నైన నతండు మండుచున్ ౨౧౪౯

సీ. సహానక్రకల్లోల♦సాగరుం డన నొప్పెఁ, గుటిలభ్రుకుటిలతా♦నటనయుక్త
ముఖుఁడు కోపవిజృంభ♦మున వానివక్త్రంబు, నింగలంబులఁ గ్రక్కు♦వృత్రునోరు
దలఁపించె సహజర♦క్తంబులు నేత్రముల్, క్రోధాగ్ని వెండియు ♦ గూఢ మయ్యెఁ
బ్రకృతిఘోరం బగు♦వపువుకింకను రేఁగ, రుద్రరూపముతోడ ♦ మూర్తి యయ్యె

ఆ. మండువత్తినుండి ♦ మండునూనియబొట్లు, పోలెఁ గనులనుండి ♦ రాలె నీటి
విప్రుషములు; దనుజ♦వేష్ట్యమానమహిత,యంత్రరవముఁబోలె ♦ నసురవిభుఁడు

కం. దంతములు నూఱుకుచప్పుడు, లంతకుగతి నతనిచూపు ♦ లడరిన యాయా
ప్రాంతముల నసురవీరులు,స్వాంతంబులు చెదర భీతిఁ ♦ బఱచిరి గుములై. ౨౧౫౦

తే. అపుడు తనవారికెల్ల భ♦యంబు దీఱ, దిటము కలుగంగ నిట్లనుఁ ♦ బటపటంచుఁ
బండ్లు నూఱుకుచు రాక్షస♦వర్యులార!, వినుఁడు నాశక్తి యెఱిఁగింతు ♦ విశదముగను

సీ. వర్షసహస్రముల్ ♦ పరమతపం బుండి, విధినప్పు డపుడు మె♦ప్పించినాఁడఁ
దపముబలంబున ♦ ధాతవరంబున, లేఖాసురభయంబు ♦ లేనివాఁడ
భిదురంబుచే నైన ♦ భేదింపఁగారాని,కవచంబు బ్రహ్మచేఁ ♦ గాంచినాఁడ
నట్టిచాపముఁ బూని ♦ స్యందనస్థితుఁడ నై, మాఱెందు లే కుర్వి ♦ మలయువాఁడ.

ఆ. గంజజాతదత్త ♦ కార్ముకశరములఁ, బూని నిలువ యుద్ధ♦భూమి నల్ల
యింద్రుఁ డేని నన్ను ♦ నెదిరింప నేర్చునే, రామలక్ష్మణాదు ♦ లేమి లెక్క.
కం. తెండీ తూర్యశతంబుల,నిండారురవంబుతోడ ♦ నిస్తులధనువుల్
జెండెద రాముని లక్ష్మణుఁ, జండాంశుసమానశాత♦సాయకతతులన్. ౨౧౫౪

→ రావణుఁడు సీతను జంపఁ బోవుట. ←

కం. అని సుతవధసంతప్తుఁ డ,తనురోషవశంగతుండు ♦ దశవదనుఁడు తా
జనకజఁ జంపఁగ నెంచుచు, ననియెన్ దీనస్వరమున ♦ నసురావళికిన్. ౨౧౫౫
ఉ. నాతనయుండు సంతురత♦నంబు వనేచరవంచనార్థమై
సీత యనంగ నొక్కతెను ♦ సృష్టి యొనర్చి వధించె దాని, నే
నాతరళాక్షి క్షత్రియకు♦లాధమరక్తపిదేహకన్యనే
వే తెగవ్రేయుదుం గనుఁడు ♦ వీడ తెగుల్ మన కామ్యగాత్రి తోన్. ౨౧౫౬
చం. అని విమలాంబరద్యుతిస♦మంచితమై సుమహారయుక్తమై
గొన బగుచంద్రహాసమును ♦ గొబ్బునఁ గైకొని పుత్రశోకసం
జనితభృశార్తిఁ జిత్త మవ♦శంబుగ జానకి యున్నచాయకై
చనియె జవంబునం దనదు♦జాయలు మంత్రులు వెన్నడింపఁగన్. ౨౧౫౭
సీ. చనురాక్షసేంద్రునిఁ ♦ గని ఘోష లిడుచు నొం,డొరులతో నని రందు♦నున్నవారు
సామాన్యుఁడా వీఁడు ♦ సకలదిక్పాలుర, నాహవంబునఁ దోలి♦నట్టివాఁడు
ఇట్టివీనిని గని ♦ పృథ్వీశనందను, లేగతిఁ బోదురో ♦ యెవ్వఁ డెఱుఁగు
దేవాదులను గెల్చి ♦ త్రిభువనరత్నాళిఁ, దివిరి బలాత్కృతిఁ ♦ దెచ్చినాఁడు
తే. విక్రమంబున బలమున ♦ వీనిపాటి, యెవనిఁ జెప్పంగ నీరేడు♦భువనముల న
టంచుభాషించుచుండ నా♦యసురవరుఁడు,చనియెనునశోకవనమున♦చాయఁ బట్టి.
చం. వల దని మంత్రు లాడినను ♦ బంధువు లందఱు నడ్డగించినన్
జెలిమరు[1] లాఁకగొన్నను వి♦శిష్టమతుల్ దగ దంచుఁ జెప్పినన్
నిలువక రోహిణిం బఱచు♦నిష్ఠురదుష్టఖగంబువోలెఁ దాఁ
బెలుచన సీతపైఁ బఱచె ♦ భీమగతిం గనువారు బెగ్గిలన్. ౨౧౫౮

→ రావణునిఁ జూచి సీతాదేవి దుఃఖించుట. ←

ఉ. వచ్చెడువానిఁ, గేలఁ గర♦వాలముఁ దాల్చినవానిఁ, గిన్కచే
హెచ్చినవాని, స్నిగ్ధజన♦బృందము లడ్డము వచ్చువాని, నా
సచ్చరితాగ్రగణ్య రఘు♦చంద్రముతో య్యాలి గాంచి యయ్యొ యీ
వచ్చెడిజాడఁ జూడఁగ న♦వశ్యము నన్ను వధింపఁ గోరెడిన్. ౨౧౬౦

[1] చెలిమరులు = మిత్రులు.

కం. దిక్కులకు నెల్లఁ దానే, దిక్కయినమహావ్రతుండు ♦ దిక్కుగఁ గలన
న్నక్కట యనాథవలె నీ, ముక్కడిరక్కసుఁడు నేఁడు ♦ ద్రుంపఁగఁ దలఁచెన్.

సీ. పతిదేవతను నన్నుఁ ♦ బలుమాఱు లీపాపి, భయనయంబులఁ దన ♦ పత్నిగాఁగ
బతిమాలి ఛీకొట్టఁ ♦ బడి నిరాశుం డయి, వేసరి మోహంబు ♦ రోస మాత్తఁ
బెనఁగొన ననుఁ ద్రుంపఁ ♦ జను దెంచుచున్నాఁడు, సత్యంబులే దిందు ♦ సందియంబు
అటుగాక నాకొఱ ♦ కమ్మహాభావులఁ, జంపెనో రామల ♦ క్ష్మణుల వీఁడు

తే. ఇన్ని సీమన్నిమిత్తంబు ♦ నృపతనూజు, లంత మొందిరో దైవమా! ♦ యెంత పుట్టెఁ
గాక యీపాపి పుత్రశో ♦ కమున వారిఁ, జంప లేకిటు వచ్చె నకట ♦ ద్రుంపఁగోరి.

ఉ. ఎంతటిబుద్ధిహీన హిత ♦ మెంచినసమ్మతిమంతుఁ డౌహనూ
మంతునిమాటలం గొనక ♦ మాలితి, నాతనిమాటఁ బట్టి ని
శ్చింతత వీఁపు నెక్కి చనఁ ♦ జిక్కక తేనియు లేక పోయి నే
నింతకు నాథునంకమున ♦ నిమ్ముగ నుండ నె యిట్టు లేడ్తునే? ౨౧౬౩

సీ. ఎంతశోకించునో ♦ యేకపుత్రక సాధ్వి, కౌసల్య కొమరుండు ♦ కదనసీమ
హతుఁ డైననుడి విని ♦ యార్యపుత్రునిఁ దాను, గానక కానక ♦ కన్నవిధము
బాల్యసంక్రీడలఁ ♦ బ్రజముద్దుబిడ్డఁ డై, ముద్దులసుద్దుల ♦ మురిప మిడుట
యౌవనమందుఁ దా ♦ వర్తిలఁ దన యెడఁ, జూపెడిభక్తియు ♦ శుద్ధచరిత

తే. ధర్మకార్యానురూపతఁ ♦ దలఁచి తలఁచి
గుండె లవియఁగ నిఁక నేటి ♦ కొడు కటంచు
నాసలను మాని శ్రాద్ధకా ♦ ర్యములఁ దీర్చి
తాను జితియందొ నీటియం ♦ దో నశించు. ౨౧౬౪

కం. ఇంతకు మూలం బౌజగ, జంత యసతి కుబ్జ దుష్ట ♦ చరితయ యిస్సీ
యెంతటిదుఃఖం బాను, స్వాంతకుఁ గౌసల్య కొదవె ♦ నామంథరచేన్. ౨౧౬౫

## సుపార్శ్వుఁడు రావణునకు నీతిఁ దెలిపి మరలించుట.

చం. అని యిటు భర్తృహీన యయి ♦ యల్లగ్రహంబునబారిఁ బడ్డచం
ద్రునిసతిఁబోలి యేడ్చు నృప ♦ తోయజలోచనఁ గాంచి ధీయుతుం
డును శుచి యాసుపార్శ్వుఁడు న ♦ నుత్తమమంత్రి హితావళీనిరు
ద్ధుని దశకంధరుం గదిసి ♦ తూర్ణము పల్కు మనంబు దాఁకఁగన్. ౨౧౬౬

ఉ. ఔర! దశాస్య! బ్రహ్మకుల ♦ మందు జనించి, కుబేరుతమ్ముఁ డై,
పారము ముట్ట వేదములు ♦ వల్లియ వైచి, వ్రతంబు లన్నియుం
దీర్చి, స్నాతకుండ వయి ♦ నిత్యనిజోచితకర్మశీలి వై
నీరజనేత్రనా తునుము ♦ నీవు తెగించితి? వీరసత్తమా! ౨౧౬౭

కం. కోపంబుచేత నెంతటి, పాపం బొడిగట్ట వలసెఁ ♦ బరికింపవుగా
యేపగిది ధర్మ మందును, నీపాపం జంపఁబూని ♦ తీ వసురేంద్రా! ౨౧౬౮

ఉ. మానవతీసురూపమహి♦మంబును జూడుమ, యెట్లు లోకో నీ
కీనవలా వధింపఁ జెయి ♦ యెత్తఁగఁ జిత్తము వచ్చె? రాక్షసే
శా! నెఱశూరు లైనమము ♦ సాయముగాఁ గొని రామచంద్రుపై
మానితభంగి నీవు మెద ♦ మండెడుకోపము, మెచ్చు లోకముల్. ౨౧౬౯

తే. కృష్ణపక్షచతుర్దశి ♦ నిపుడు లేచి
యభ్యమిత్ర్యుండ[1] వగుచుఁ బ్ర♦యాణసన్న
హన మొనర్చి యమావాస్య ♦ యగుట దేవ
బలఁగములతోడ నని కేగి ♦ గెలుపుఁ గొనుము. ౨౧౭౦

కం. శూరుండవు ధీరుండవు, సారతరకృపాణి వీవు ♦ స్యందనగుఁడవుర్
ధీరతుఁడవు రథి వై చని, శ్రీరామునిఁ జంపి సీతఁ ♦ జేకొను మధిపా! ౨౧౭౧

తే. అనిన దుష్టాత్ముఁ డాధర్మ్య ♦ మైనపల్కు, లాలకించి గృహంబున ♦ కరిగి యిష్ట
సచివజనసంయుతుండయి ♦ సభను దీరి, కేసరి యనంగ నూర్పుచ్చె ♦ రోసమునను.

## మూలబల యుద్ధము.

సీ. పరమదుఃఖితుఁ డయి ♦ బహుళదైన్యంబున, బలముఖ్యవర్యులఁ ♦ బారిఁ జూచి
కడుపుదుఃఖముదన్నుఁ♦గాల్పఁగఁ జేమోడ్పు, ఘటియించియనుఁగార్య♦ఘటకులార!
హస్త్యశ్వయుక్తంబు ♦ స్యందనభటరాజి, తం బగుసేనతో ♦ దాడి వెడలి
రాము నొక్కనిఁ జుట్టి ♦ ప్రావృడబ్దము లన, శరవర్షముల ముంచి ♦ చంపుఁ డీరు

ఆ. రేపు నేను మీకుఁ ♦ బ్రాపుగఁ జనుదెంచి
జానకీశుఁ ద్రుంచి ♦ జగ మెఱుంగ
జయముఁ గాంచి ♦ మిమ్ము ♦ సత్కరించెద నన్న
వారు వల్లె యనుచు ♦ బయలు వెడలి. ౨౧౭౩

కం. నానానీకంబులతో, సేనాపతులెల్ల వెడలి ♦ సితపట్టససం
తానంబులఁ బరిఘంబుల, వానరవీరులను వైచి ♦ బవరము సేయన్. ౨౧౭౪

సీ. భాస్కరోదయవేళఁ ♦ బ్రధనకేళికి నయి, దశకంఠుబలములు ♦ దాఁకుటయును
వానరవీరులు ♦ వసుధారుహంబుల, వసుధాధరంబుల♦వైచి వైచి
పోరొనరింపఁగ ♦ ఘోరఖడ్గాదుల, గదల రాక్షసకోటి ♦ కసి మసంగి
చంప నిట్లని వచి♦యింప రాకుండ సం,గ్రామ మవ్వేళ సు♦భీమ మయ్యె

తే. జరణనిహతిసముద్భూత♦ధరణిరజము, క్షతజకూలంకషలచేత ♦ శాంత మయ్యె
రక్తనదులందు నౌకలై ♦ రథము లమరెఁ, గీశరాక్షససంగ్రామ♦ఖేలనమున. ౨౧౭౫

[1] అభ్యమిత్ర్యుఁడు = శత్రువులపై దాడివెడలువాఁడు.

కం.కరిరథచయకూలంబులు, తురగఝషంబులు శరీర♦తుంగోడుపముల్
గురుకేతనభూరుహములు, పరఁగెన్ రుధిరాపగాని♦వహములు దఱిఁ జై. ౨౧౭౬

కం.నెత్తురులఁ దోఁగుచుం బెను,హత్తుల ఘోటులను ధ్వజచ♦యంబులఁ బైపై
మొత్తముగ నెగిరి యెగిరి ప్ర,మత్తత దోరఁగించి రిలను ♦ మర్కటవీరుల్. ౨౧౭౭

తే.జానుగుల నాసికలను నో♦సళ్ళ వెండ్రు
కలను గోళ్లను రదముల ♦ బలము మెఱయఁ
బెఱుకుచును గొఱుకుచుఁ దెగ ♦ నఱకు చిట్టు
లసురవర్యుల వేధించె ♦ నగచరాళి. ౨౧౭౮

కం.పండినవృక్షమునకు ఖగ,కాండంబులు పఱచునట్లు ♦ కపు లొక్కొకమా
ర్తుం డగునసురకుఁ గవిసిరి, దండిమగలు నూర్లకొలఁది ♦ దర్పము మెఱయన్.

చం.ప్రతిభటు లోహటింపక ప♦రశ్వధశూలకృపాణవల్లరీ
శితపరిఘాశుగంబులను ♦ జీల్చిరి కూల్చిరి నొంచి త్రుంచి వే
కుతిలపడంగ డీలుపడఁ ♦ గొందల మందఁగఁ దల్లడిల్ల లో
వెతగొనఁ బాఱఁ దోలిరి క♦పిప్రవరధ్వజినీచయంబులన్. ౨౧౮౦

కం.సురవైరిచయము లెగవఁగ,హరు లెల్లరు విఱిగి దశర♦థాత్మజు రాముః
బరమార్తశరణ్యునిఁ గని, శరణంబును జొరఁగ రామ♦చంద్రుం డలుకన్. ౨౧౮౧

↞ శ్రీరాముఁడు మూలబలంబు సంహరించుట. ↠

చం.పరమశరాసనంబుఁ గొని♦పార్థివవర్యుఁడు శత్రుకోటిలోఁ
జొరఁబడి బాణవర్షమున ♦ జోరున ముంపఁగ సూర్యు మేఘముల్
దరిఁ జన లేనిచందమున ♦ దానవమహాగ్నిని డాయ రానియ
క్కరణిని నొక్కఁడేని కనఁ♦గానఁడు డాయుట చెప్పనేటికిన్. ౨౧౮౨

చం.శిఖిశిఖ లొక్కటం గవియు♦చెల్వునఁ గ్రక్కుచు నిప్పు సర్వతో
ముఖ మతు రాము బాణములు ♦ ముమ్మర మై పఱవంగ నమ్మహా
ప్రఖరశితేషువుల్ దగిలి ♦ వ్రయ్యఁగ మేనులు సోఁకులుః మరు
త్సఖపరిదగ్ధ మామిడుత♦దండులఁబోలి రొకింత సేపులోన్. ౨౧౮౩

ఉ. ఇట్టి దటంచు నేరు వచి♦యింపఁగరానిజవంబునః నృపా
లేట్టు చలద్విరోధిబలుఁ ♦ డేస యెసంగ మహారథావళిః
దిట్టినఁ గూలునట్లు కడుఁ♦దీవ్రతఁ ద్రుంప నరణ్యవీథులః
గొట్టు మహాశుగంబుఁ[1] గనఁ♦గూడనిభంగిగ నయ్యె వారికిన్. ౨౧౮౪

కం.ఛిన్నము భిన్నము విభవ,స్కన్నము సన్నంబు నగుడు ♦ సైన్యము శవసం
ఛన్నం బయ్యె మహీస్థలి, కన్నులు కడుగోరగింపఁ♦గాఁ జూపఱకున్. ౨౧౮౫

[1] మహాశుగంబు = పెనుగాలి.

కం. కూలెడితల తూలెడితల, వ్రేలెడితల దగ్ధభగ్న ♦ వీడితతనువుల్
చాల నెటుచూడఁ దోఁచెన్, జాలమువలెఁ గానరాఁడు ♦ జనపతి యెచటన్.

ఉ. ఇవ్వని వచ్చి బాణములు ♦ ఇమ్మున నాటుట తోఁచుఁ గాని యా
చివ్వను క్షిప్రకారి రఘు ♦ శేఖరుఁ డెందును గానరాఁడుగా
యవ్విధి యింద్రియార్థముల ♦ కై మెయి నిల్చినయాత్మఁబోలె; నా
నెవ్వడిఁ దత్ప్రచారముల ♦ నేర్పును జెప్పఁగ నెట్లు శక్యమౌ. ౨౧౮౭

మ. వరచూడామణి రామభూవిభుఁడు గాం ♦ ధర్వంబునన్ మాడ్చుచోఁ
బరసేనాతతి మోహితాత్మ మయి ది ♦ గ్భ్రాంతిం గొనెన్, వే పర
స్పరమున్ రాముఁడుకాఁ దలంచుచును ద ♦ త్సాదృశ్యముం దోఁపఁగాఁ[1]
బోరి నన్యోన్యముఁ గ్రుద్ధచిత్తు లగుచుం ♦ బోకార్చి రారాక్షసుల్. ౨౧౮౮

సీ. ఈ యేనుఁగులఁ ద్రుంచు ♦ నితఁడే శ్రీరాముఁ, డీహయంబులఁ గూల్చు ♦ నితఁడె రాముఁ
డీరథికులఁ దీర్చు ♦ నితఁడే రఘురాముఁ, డీపదాతుల మాడ్చు ♦ నితఁడె రాముఁ
డీశరంబులఁ జిమ్ము ♦ నితఁడె సీతారాముఁ, డీపఱతెంచెడి ♦ యితఁడె రాముఁ
డీనన్నుఁ జూచెడి ♦ యితఁడె కోసలరాముఁ, డిదొకత్తియెత్తిన ♦ యితఁడె రాముఁ

తే. డంచు జగమెల్ల రామమ ♦ యంబుగాఁగ
నీవ రాముఁడు రాముఁడ ♦ వీవ యనుచు
నొండొరులఁ దాఁకి రాక్షసుల్ ♦ దండిశస్త్ర
సంహతులఁ గూలి మడసిరి ♦ సంఘములుగ. ౨౧౮౯

కం. ఒక్కనికిం బెక్కురుగను, బెక్కుర కొక్కండు గాఁగ ♦ భీమశరాసం
బక్కజము కొఱవిఁ ద్రిప్పిన, యక్కరణిం ద్రిప్పఁ[1] గోటి ♦ యగపడెడి బలే. ౨౧౯౦

సీ. అంగనాభియును స ♦ త్త్వార్చి శరారంబు, నేమిచాపంబు జ్యా ♦ నిస్వనార
వంబు తేజోబుద్ధి ♦ వరగుణజ్వాలంబు, దివ్యాస్త్రధారంబు ♦ దీపితంబు
రాక్షసాంతకరంబు ♦ రామచక్రంబును, గాలచక్రమువోలెఁ ♦ గనిరి ప్రజలు
పదివే లనీకముల్ ♦ పవనవేగంబులు, పెనురథంబులు పదు ♦ నెనిమిదియును

తే. వేలదంతు లనీకముల్ ♦ వీతిచయము, గ్రాల సాదులు పదునాల్గు ♦ వే లనీక
ములు పదాతులు రాక్షసుల్ ♦ పూర్ణశతస,హస్రయుగ్మం బనీకంబు ♦ లపుడె కూలె.

తే. మూఁడుముక్కాలుగడియలో ♦ వేఁడిమిగల. వాఁడిములుకుల రాముండు ♦ పాదచారి
నిస్సహాయుఁడునై యిట్లు ♦ నేలపాలు, సలిపె స్వచ్ఛందరూపుల ♦ శాత్రవులను.

కం. హతరథులును హతతురగులు, హత కేతను లగుచుఁ గొంద ♦ ఱరిగిరి పురికై
హతశేషులు హతగజహరి,తతిభటసముదాయు లగుచు ♦ దైన్యము గొనుచున్.

కం. క్రుద్ధుం డగుఫాలాక్షుస,మిద్ధాక్రీడం బనంగ ♦ నెసఁగెన్ ధరయున్
శుద్ధపరాక్రము రాముని, సిద్ధర్షులు మే లటంచుఁ ♦ జేసిరి వినుతుల్. ౨౧౯౪

[1] కొఱవిఁ ద్రిప్పిన నిప్పుచక్రమువలెఁ గానవచ్చునట్లు గమనవేగముచే రాముఁడును నందఱకు నంనందఱు రాములై యెందును దానై తోఁచెను గాని యింద్రజాలమువంటి మోసవిద్యచేఁగాదు.

ఉ. అంతయుఁ దీఱ నంతఁ బ్లవ♦గాధిపు రాక్షసనాథునిన్ హనూ
మంతుని బ్రహ్మజున్ ద్వివిద♦మైందులఁ దక్కినకీశవీరులన్
బొంతకుఁ జీరి మీకనిన♦భూరితరాస్త్రజవంబుశక్తి క
ల్పాంతకుఁ డౌ త్రిలోచనుని♦యందును నాయెడఁ గాన నయ్యెడిన్. ౨౧౯౫

కం. అన విని కూలినరాక్షస,జనముం గని యబ్రపడుచు ♦ సమ్మదమున నిం
తొనరించి గాసిఁ గాననిమను జేంద్రుఁ గృతాస్త్రు దేవ♦మండలి పొగడెన్. ౨౧౯౬

→ రాక్షసస్త్రీ విలాపము. ←

ఉ. రావణసంప్రయుక్త మను♦రధ్వజినీనిచయంబు రాము బా
ణావళి మూలముట్టుగ స♦నాగము సాశ్వము సధ్వజంబుగాఁ
జేవ యడంగిపోక హత♦శేషులు చెప్పిన రాక్షసాంగనల్
ప్రోవులు గట్టి హా యనుచుఁ ♦ బొక్కిరి యేడ్చుచు వాడవాడలన్. ౨౧౯౭

కం. హతపతులున్ హతసుతలున్, హతబాంధవ లైనరాక్ష♦సాంగన లెల్లన్
క్షితిఁ బడి పొరలుచు నేడ్చుచు, వెతఁ దలతలఁ గొట్టుకొనుచుఁ ♦ బెద్దరవములన్.

సీ. ఏమిటి కేగెనో ♦ యామదుసలిపక్క, మిట్టపండ్లది వ్రేలు♦పొట్టతోడఁ
జేటంతగోళ్లతోఁ ♦ జింపిరితలతోడ, నేనుంగుఁజెవులతో ♦ గూనితోడ
నిడిమిడిగ్రుడ్లతో ♦ మిడిమేలముగఁ బోయి, యడవిలో నెచటనో ♦ యడఁగియున్న
కందర్పసుందరుఁ ♦ గడుసుకుమారుని, శృంగారసదనుఁ బూ♦ర్ణేందువదను

ఆ. భూరిశక్తు సకల♦భూతహితాసక్తు, లోకనింద్య సర్వ♦లోక వంద్యు
సర్వసుగుణహీన ♦ సర్వగుణాఢ్యునిఁ, జెనకి గాదె యింత ♦ చేటు దెచ్చె. ౨౧౯౯

సీ. తానేడ నిండారుఁ♦దఱుల మోముకురూప, యతఁ డేడ రాకాసు♦ధాంశుముఖుఁడు
తానేడ నరసిన♦తల వెండ్రుకలడొక్క, యతఁ డేడ నిందింది♦రాలకుండు
తానేడ నవగుణ♦తతులకుఁ బుట్టిని, ల్లతఁ డేడ సుగుణర♦త్నాంబురాశి
తానేడ నుత్తాల♦తాలభీకరహస్త, యతఁ డేడ నాగక♦రాభబాహు

తే. తనకుఁ దనరూపమునకును ♦ దగినవాఁడు
రాముఁడా తోఁచె? నయ్యయో ♦ ప్రజలు విన్న
నవ్వరా? లిట్టివా భూజ♦నంబు? లిట్టి
యాగడంబులు వింటిమే ♦ యవని నెందు. ౨౨౦౦

కం. వనమున ఖరదూషణులకుఁ, బెనుమిత్తిగ నయ్యెఁ దాన ♦ వేరముఁ బెంచెన్
మనుజాసురనాథులకును, మనదురదృష్టం బదిట్లు ♦ మల్లడి పెట్టెన్. ౨౨౦౧

చం. నిజగళకాలపాశ మన♦నీసుతఁ దాఁ గొనివచ్చెఁ గాని భూ
మిజ నతఁ డేమొ పొందు టది ♦ మిథ్య, వృథాబలవద్విరోధ ము

ర్వ్రజపతితో ఘటిల్లెఁ బృథ♦వీజనుఁ గోర, విరాధుఁ డమ్మహా
భుజబలిమిన్ గతించె నదె♦పో తగినంతనిదర్శనం బిటన్. ౨౨౦౨

చం. పదియునునాల్గువేలు బల♦వంతులు రాక్షసు లొక్కపెట్ట పె
న్నదుటున రామునిం దొడరి ♦ యొక్కఁడు చిక్కక కూలి రామదా
స్పదులు ఖరుండు దూషణుఁడు ♦ సత్త్వధనుం డగునాత్రిశీర్షుఁడున్
బొదివిరి చచ్చి రల్ల యది♦పో తగినంతనిదర్శనం బిటన్. ౨౨౦౩

కం. యోజనబాహుఁడు శోణిత,భోజనుఁడు కబంధుఁ డతుల♦భూరిబలుం డం
భోజాక్షునిచేఁ జచ్చెను, యోజింప నిదర్శనం బిఁ♦కొండును వలెనే. ౨౨౦౪

కం. మేరునిభసారు బలిఁ బా,కారితనూజాతు వాలి ♦ నాశుగ మొకటన్
ధారిణిఁ గూల్చినరాముని,వీరతకు నిదర్శనంబు ♦ వేఱొం డేలా? ౨౨౦౫

కం. దీనుఁ డయి యాస చెడి తన,ప్రాణమునకు ఋశ్యమూక♦మందె నవియు నా
భానుజు రాజొనరించిన,జానకిపతిబలిమి కొండు♦సాక్ష్యం బేలా? ౨౨౦౬

చం. తలఁగక సర్వరాక్షసహి♦తప్రదదక్షము నర్థధర్మసం
కలితము నైననీతులు దె♦గంబడి వీనుల నిల్లు కట్టుకొం
చలఘుగుణాఢ్యుఁ డాసుమతి ♦ యాడె విభీషణుఁ డీదశాస్యతో
బలితపుమోహపాశముల ♦ బద్ధుఁడు గాన రుచింప వానుడుల్. ౨౨౦౭

అ. ఆనుడు లాలకించి ధన♦దానుజుఁ డప్పుడ సీత నీయ లం
కానగరం బిదేటి కిటు ♦ కష్టదశం గని వల్లకా డగున్?
మానవివంతసందరము♦నన్ జన మేటికి మున్గి చచ్చు? న
య్యో నెఱి మాలతేఁ డదియు ♦ నూరక పోవునె? గాసి పెట్టదే? ౨౨౦౮

ఉ. రామునిచేత నిస్తులప♦రాక్రముఁ డాఘటకర్ణుఁ డీల్గుటల్
రామునితమ్ముచేఁ బరదు♦రాసదుఁ డాయతికాయుపాటునున్
భీమజవుండు శక్రజితు♦బిద్దుట యిన్నియుఁ జూచి యైన నా
రా మతి యింతయుం గొనఁడు ♦ రావణుఁ డయ్యయొ యెంతమూర్ఖుఁడో.

కం. నాతనయుఁడ! నాయన్నా!, నాతమ్ముఁడ! తండ్రి! ప్రాణ♦నాథా! యని యా
ర్తాతతరవములె వినఁబడె, నేతట్టును జూడఁ బురిని ♦ నింటింటికడన్. ౨౨౧౦

సీ. రథముల వాజివా♦రణముల సేనల, లక్షలకొలఁదిని ♦ రాక్షసులను
నొక్కరాముఁడ వింట ♦ నుగ్రుఁడై వధియించె, విష్ణువో రుద్రుఁడో♦విబుధవరుఁడో
శ్రీరామరూపంబుఁ ♦ జేకొని త్రుంచె నవ్వ,యమ్ముగా వచ్చెనో ♦ యంతకుండు
పోటుబంటులు గూలి ♦ రేటిజీవిత మిఁక,నాపద దొలఁగెడి♦యనువు లేదు

ఆ. దిక్కుమాలి మనము ♦ దేవురించుచు నుండ, రామువలనఁ దనకు ♦ రాఁగలట్టి
ముప్పు గాన లేఁడు ♦ మొప్పదశాస్యుండు, కలవు వరము లనుచు ♦ గర్వపడెడు.

కం. శ్రీరాముబారిఁ జిక్కిన, వారిగ రక్షింప లేరు ♦ వసురాక్షసబృం
దారకగంధర్వులిఁకే, తీరున దశముఖుఁడు బ్రదుకు ♦ తెరువుం గనునో. ౨౧౨

తే. రావణుఁ డొనర్చుచున్నట్టి ♦ ప్రతిరణంబు, లోన నుత్పాతములు పెక్కు ♦ గాన నయ్యె
రావణుఁడు సంగరంబున ♦ రాముచేతఁ, జచ్చు నని వానఁ దోఁచెడి ♦ సత్యముగను.

చం. కమలజు నీదశాననుఁడు ♦ గాటపురక్తి వరంబు వేఁడుచో
నమరఖగాహిరాక్షసచ ♦ యాదుల మృత్యువు లేమిఁ గోరి గ
ర్వము మెయి మర్త్యులగ విడిచె ♦ వారక తత్ఫల మిప్పు డిట్లు ప్రా
ణముఁ గొన వచ్చె, రక్కసుల ♦ నాశము సిద్ధము పంక్తికంఠుతోన్. ౨౨౧౪

సీ. వరదానమదమునఁ ♦ బంక్తికంఠుఁడు పెట్టు, హోవడి కోర్వక ♦ యమరవరులు
ధాతతో మొఱవెట్ట ♦ దానవరాక్షసు, లిది మొదల్ భయమున ♦ మెదలువారు
జగములఁ బొం డన ♦ శంకరుఁ బురహరు, వృషభధ్వజునిఁ జేరి ♦ వేఁడికొనిన
సుప్రసన్నుం డయి ♦ సురలార! రాక్షస, నాశార్థముగనొక ♦ నారి పుట్టి

ఆ. దానవులకు మున్ను ♦ దావరించినట్టు, పోలె వారి నెల్లఁ ♦ బొలియఁ జేయు
ననుచుఁ జెప్పె సీత ♦ యాయింతి రావణు, ననురకులము మ్రింగ ♦ నరుగుదెంచె.

ఆ. కుటిలబుద్ధి తెల్వి ♦ గోరంతయును లేదు, నీతిపొంతఁ బోని ♦ పాతకుండు
పంక్తిముఖుఁడు వీని ♦ పాపంబుచేఁ బురి, పాడుపడియె దుఃఖ ♦ పాటు గలిగె. ౨౨౧౬

కం. లయకాలయమునిపోలిక, భయముగ ఘటియించు రామ ♦ భద్రునివలనగ
భయ ముడిపి కావ భువన, త్రయి నెవ్వరు లేరు మనకుఁ ♦ దథ్యము నుండీ. ౨౨౧౭

కం. వనదహన వేష్టితం బగు, వనకరిణీయూథ మనఁగ ♦ వనరుచు నుండగ
గనుఁగొని శరణ్యుఁ డగునా, ఘనుఁ డెవ్వఁడు దిక్కుమాలి ♦ కాలెడిమనకున్.

తే. విమలనీతిరతుండు వి ♦ వేకశాలి
యవ్విభీషణుఁ డర్హంబు ♦ నాచరించెఁ
గలిగె భయ మెందు నద్దానిఁ ♦ దెలిసి యాతఁ
డందుఁ జని యాశ్రయించి భ ♦ యంబు వాసె. ౨౨౧౯

కం. అని రజనీచరతరుణులు, పనవుచు నొండొరులఁ గ్రుచ్చి ♦ పలవించుచు హో
యని యేడ్చిరి దివి ముట్టెడి, పెనురవముల మాఱు మ్రోయ ♦ విదిశలు దిశలున్.

## రావణుఁడు పౌరుషోక్తులు పలుకుట.

ఉ. ఈవిధి నింట నింట జని ♦ యించుమహార్తిరవంబు ఘోర మై
రావణువీనులం బడ భ ♦ రంబుగ నూర్చుచు ధ్యానయుక్తుఁ డై

రేవి మహోరుసం గనులు ♦ ద్రిప్పుచు భూతభయంకరాస్యుఁ డై
యావిలయాగ్నిఁబోలె నసు♦రాళికి నేనియు దుర్నిరీక్షుఁ డై ౨౨౨౧

కం. కటకట రదములు కొఱుకుచుఁ, బుటపుట రక్తంబు మోవిఁ♦బొడమఁ గొఱుకుచుఁ
మటమట లాడుచు భీత్య, స్ఫుటవచనుం డనియె దాపు♦సోఁకులగమికిన్. ౨౨౨౨

సీ. మాయాజ్ఞ మేరకు♦మహితసైన్యముతోడ, మహాపార్శ్వుఁడును విరూ♦పాక్షుఁడును మ
హోదరుండును వేగ ♦ యుద్ధమునకుఁ బోవఁ, బయనింపుఁడీ యని ♦ పల్కఁ, దనిన
వా రట్ల తమరాజు♦పనుపున నొనరించి, దళవాయు లఖిలంబు ♦ దండు దీర్చి,
భయమున దరిఁ జేరి ♦ ప్రాంజలు లగుచును, నృపుజయంబును గోరి ♦ నిలిచి యుండ

తే. నవ్విరూపాక్షుఁ డాదియౌ♦నసురవరులఁ, జూచి యిట్లను సంవర్త♦సూర్యకల్ప
మార్గణంబుల రామల♦క్ష్మణులఁ దొలుతఁ, జెండి వైచెద మద్బాహు♦చండిమమున.

చం. ఖరహరిజిత్ప్రహస్తఘట♦కర్ణులకుం బుణ మేను దీర్చెదం
వరుసగ రామలక్ష్మణుల ♦ వానరనాథుల నెల్లఁ ద్రుంచి మ
ద్గురుతరబాణవారిధర♦కోటుల దుర్దినముం ఘటించి సా
గరగగనక్షమాధరని♦కాయము లేర్పడ కుండఁ జేసెదన్. ౨౨౨౪

సీ. *కండలుకండలు ♦ తుండెముల్ ముండెముల్, తుంటలుతుంటలు ♦ దుమ్ము దుమ్ము
తుండెలుతుండెలు ♦ తునుకలుతునుకలు, ముక్కలుముక్కలు ♦ వ్రక్క వ్రక్క
బ్రద్దలుబ్రద్దలు ♦ పఱియలుపఱియలు, వ్రయ్యలు వ్రయ్యలు ♦ వ్రప్పు వ్రప్పు
తుండులుతుండులు♦ఖండముల్ ఖండముల్, తునియలుతునియలు♦తుఱుముతుఱుము

ఆ. పాఱ దోఁకినట్టు ♦ బాడిసఁ జెక్కిన, కొమరు అంపమునను ♦ గ్రోఁత వండఁ
దఱిగినట్లు దోఁపఁ ♦ దరుచరవితతుల, నఱుకువాఁడ మీఁద ♦ నుఱుకువాఁడ.

కం. ఇప్పుడు వానరసేనలఁ, గప్పెద ధనురుదధిజనిత♦కాండోర్ములచేఁ
దెప్పిఱిల లేక కుప్పలు, కుప్పలుగా వారు నేలఁ ♦ గూలంబడఁగన్. ౨౨౨౬

కం. కేసరవర్ణము నీరజ, భాసురకాంతియును నైన♦ప్లవగేశ్వరయూ
థాసమసరసుల గజ మన, వాసి చెడం గలఁచువాఁడఁ ♦ బరమాస్త్రములన్.

కం. కాఁడఁగ శరములు వేగమున, వాఁడిమి చెడి నేలఁ బడిన♦వానరులతలల్
తూఁడులతోఁ గమలము లనఁ, బోఁడిమి గలిగించు సమర♦భూతలమునకున్

కం. ఒక్కొక్కశరముచేతనె, తక్కక నందలకొలంది ♦ తరుచరవరులం
జెక్కలు చెక్కలుగా ధర, నొక్కఱ నొఱగింతుఁ ద్రుంతు ♦ నుదుటు న్మాన్తున్.

కం. ఎవ్వరిపతు లెవ్వరిసుతు, లెవ్వరిసోదరులు కలన ♦ నీల్గిరి యిపు డే
నవ్వారికనులనీటిం, నెవ్వగఁ జనఁ దుడుతు నరుల ♦ నిర్జించి యనిన్. ౨౨౩౦

కం. చండభుజదండధృతకో, దండగళితనిశితకాండ ♦ దండంబులచే
భండనకుంభినిఁ జూపఱ, గుండెలు పగులంగఁ ద్రుంతుఁ ♦ గ్రోఁతుల దండున్.
కం. గండడఁచి రిపులమేనులఁ, గండలు తెగఁ గోసి శాత ♦ కాండంబులచే
మెండగునక్కలు గ్రద్దలు, దండిగఁ దిన నిత్తుఁ గడుపు ♦ దనియఁగ నిపుడే.

↞ రావణుఁడు యుద్ధంబునకు వెడలుట. ↠

ఆ. పన్నుమా రథంబు ♦ వరచాపమును దెమ్ము, యిపుడ మిగిలియున్న ♦ యెల్లయసుర
లరుగు దేరవలయు ♦ నాహవంబునకు నా, వెంట ననినఁ బలుకు ♦ వెంటనపుడ. ౨౨౩౩
కం. దళవాయులార! యందఱు, వెలలుఁడు సంగ్రామమునకు ♦ వేగమ యనుచున్
బలుక మహాపార్శ్వఁడు వా, రలసత లే కింటి కింటి ♦ కరుగుచుఁ బిలువన్.
సీ. ఒకముహూర్తములోన ♦ నుగ్రదర్శను లైన, రాక్షసు లాయుధ ♦ రాజితోడ
నడ్డకత్తులతోడ ♦ దుడ్డుకఱ్ఱలతోడ, బడితలతోడను ♦ బలకతోడ
బాగుదారులతోడ ♦ వాయిదారులతోడఁ, గత్తులతోడ రోఁ ♦ కండ్ల తోడ
గండ్రగొడ్డండ్లతోఁ ♦ గరవాలములతోడఁ, జబురుజంగులతో జ ♦ జాలతోడఁ
తే. దక్కుఁగలశస్త్రములతోడఁ ♦ దరలిరాఁగ, దీప్యమానంబు భీమంబుఁ ♦ దేరి నెక్కి
సత్త్వగాంభీర్యములకల్మి ♦ క్ష్మాతలంబు, ప్రీల దశకంఠుఁ డనికయి ♦ వెడలె నపుడు.
సీ. అధిపునానతి విరూ ♦ పాక్షమహాపార్శ్వ, లును మహోదరుఁడును ♦ ఘనబలాఢ్య
లాత్తశతాంగంబు ♦ లధిరోహణ మొనర్చి, యార్పులు పెడబొబ్బ ♦ లతిశయిల్ల
మేదిని భేదిల్ల ♦ మేదురారవములు, నించుచు జయకాంక్ష ♦ నిర్గమింప
నంతకుభంగి ను ♦ ద్యతకార్ముకుం డయి, జవనాశ్వయుక్త మై ♦ దివసకరుని
తే. భాతి వెలుఁగొందురథమునఁ ♦ బంక్తిముఖుఁడు
మహితజవమున రామల ♦ క్ష్మణులు మెలఁగు
చక్కటికి నల్లద్వారంబు ♦ చాయఁ గదలి
కర్కశాసురసేనతోఁ ♦ గదలి రాఁగ. ౨౨౩౬

↞ రావణున కపశకునంబు లగుట. ↠

ఉ. మాసె సరోజబంధు వతి ♦ మాత్రపుఁజీఁకటు లెల్ల దిక్కులన్
రేసె వణంకె నెంతయు ధ ♦ రిత్రి పలాశశకుంతసంతతుల్
గూసె మహాప్రవృష్టి పడె ♦ గుంపులు గట్టి సృగాలజాలముల్
చేసె శుభేతరారవముఁ ♦ జేరి ధ్వజంబున వ్రాలె గృధ్రముల్. ౨౨౩౭
ఉ. వాజులు కాళ్ళు జాఱిపడె ♦ వామభుజేక్షణముల్ చలించె స
త్తేజము మాసె మోమునకు ♦ దీనత నొందె గళస్వరంబు స్వా

రాజువిరోధికిం, బిడుగు ♦ రాలెడిభంగిని నుల్కరాలె, న
య్యాజిని జేటు దెల్పుచు శి♦వాళులు కాకులు గూసెఁ జుట్టుచున్. ౨౨౩౮
కం. ఘోరోత్పాతము లీగతి, దారుణముగఁ దోఁచు చున్న ♦ దశముఖుఁ డార్తిం
జేరంగ నీక కాల, ప్రేరితుఁ డై మోహమునను ♦ వేగమ చనియెన్. ౨౨౩౯
ఉ. వారిశతాంగఘోషముల ♦ వారలయార్పుల నాలకించి తెం
పార వనేచరుల్ మిగుల ♦ నాహవదోహలు లై యెదిర్చినన్
వారికి వీరికిన్ రణము ♦ వారక చెల్లె భయంకరంబుగా
వారల నెల్ల మీఱి దశ♦వక్త్రుఁడు చాపగుణంబు మీటుచున్. ౨౨౪౦

## రావణుఁడు కపిసేన నుఱుమాడుట.

సీ. కాంచనమండిత♦కాండప్రకాండంబు, లొండొండ మెండుగ ♦ నుద్దవిడిని
బఱప శిరంబులు ♦ పగిలినవారును, గుండెలు దబ్బలై ♦ కూలువారుఁ
జెవులు దెగినవారుఁ ♦ జెంప చీలినవారుఁ, బ్రక్కలు డొక్కలు ♦ పగులువారు
ముక్కులు తోఁకలు ♦ మొక్కవోయినవారు, నూపిరి తిరుగక ♦ యురలువారుఁ
ఆ. గనులు లేనివారుఁ ♦ గాళ్లు దెగినవారు, మెడలు దెగినవారు ♦ మిడుకువారు
నైరి కీశవర్యు ♦ లాతని రథమెందుఁ, బఱచె నందు సేన ♦ పాదుపడియె. ౨౨౪౧
సీ. కత్తుల నఱకిన♦యత్తెఱఁ గొప్పార, బాడిసఁ జెక్కిన ♦ పగిదిగాఁగ
ఱంపానఁ గోసిన♦సొంపు సంపాదింపఁ, ద్రోపుడు పట్టిన♦త్రోవఁ దనర
నులులను మలచిన♦చెలువు దీపింపఁగఁ, దఱిమెనఁ బెట్టుచం♦దంబు దోఁపఁ
దుఱిమినచాడ్పునఁ ♦ దఱిగినభంగిని, గొఱవులఁ జూఁడిన♦తెఱఁగు వెలయఁ
ఆ. గారుచిచ్చు గవిసి ♦ కాల్చినమాడ్కిని, నేపు మెఱసి పరుల♦యేపు మాపెఁ
జండదీర్ఘబాహు♦కాండవితతశరాస,రాజదండుఁ డైన♦రావణుండు. ౨౨౪౨
సీ. ఎందును దానయై ♦ యేపారి తెంపారఁ, బిడుగులు గురియించు ♦ నెడను లేక
యేచాయఁ దానయై ♦ రోచులు గ్రక్కుబా,ణాళులఁ జించి చెం♦డాడు చుండు
నేవంకఁ దానయై ♦ యేవంకయును లేని,ములుకుల హావళి ♦ గలుగఁజేయు
నేమూలఁ దానయై ♦ యామూల మరులనై,న్యంబులు పఱవఁ జీ♦కాకు సేయుఁ
ఆ. జక్కసూటి పోవుఁ ♦ బ్రక్కప్రక్కలు నొక్కుఁ, గోణసీమలందు ♦ రాణ మెరయుఁ
జిత్రమండలములఁ ♦ జిందువం దొనరించు, నరిదివిల్లుకాఁడు ♦ సురలసూడు.
కం. ఆశరనాథకరోజ్ఝిత, మాశరవారంబు దాఁక ♦ నగచరసైన్యం
బాశుగసఖసంప్రోషిత, మాశలభవ్రాత రీతి ♦ నాకృతి మాపెన్. ౨౨౪౪
ఉ. మారుతఘాతమేఘముల♦మాడ్కి దవానలదహ్యమానకాం
తారగజంబు లట్లసుర♦నాథశరార్దితమర్కటాగ్రణుల్

పోరు దొలంగి పోయినదె ♦ పోకగఁ బాఱిరి కాందిశీకులై
యారవపూరితాశు లయి ♦ యాపద నొంది నలంగి దీనులై. ౨౨౮౪

## సుగ్రీవుఁడు రాక్షసుల వధించుట.

చం. ప్లవగులు మూల కొక్కఁడుగఁ ♦ బాఱ రఘూద్వహుపై శతాంగముల్
జవమునఁ దోలఁ బంచెఁ దన ♦ సారథి నయ్యెడ సూర్యనందనుం
డవిరళకీశసైన్య మిటు ♦ లాఱడిపోవఁ దనంత వానిఁ గీ
శవిభు సుషేణు గుల్మమున ♦ స్థాపితుఁ జేసి రయం బెలర్పఁగన్. ౨౨౮౫

ఉ. శూరులు యూథనాయకులు ♦ సూరెల రా ద్రుమశైలపాణులై
పేరిమిమీఱి రాక్షసుల ♦ వీఁచ మడంపఁ దొడంగి శైలముల్
భూరుహముల్ మహోగ్రగతి ♦ బో రన మేఘము కానలో శిలా
సారము పుల్గులం గురియు ♦ చందమునం గురియించె నీసునన్. ౨౨౮౬

కం. లయసమయజనితపవనో,చ్చయనిహతిం ద్రెళ్లు భూజ ♦ సముదయ మనఁ ద
ద్రయమునకుఁ దెరలి రాక్షస,చయములు సాల్పడియె నేల ♦ సత్త్వము దూలన్.

చం. అగచరనాథముక్తవివి ♦ ధాశ్మచయాహతిఁ జేసి శీర్షముల్
పగుల నరంబులుం దెగ మొ ♦ లల్ విఱుగం గరపాదజాలముల్
నొగులఁగ నెత్రు గ్రక్కుచును ♦ లోఁగుచు విచ్చుచు క్షీయమాణమై
మొగి నసురేంద్రశూరతతి ♦ మోఁదు వడెన్ మొగతప్పి బెగ్గిలెన్. ౨౨౮౭

## సుగ్రీవుఁడు విరూపాక్షు వధించుట.

ఉ. శిక్షితరాక్షసుండు హరి ♦ శేఖరుఁ డీగతి మీఱినన్ విరూ
పాక్షుఁడు పేరు వాడుచు శ ♦ తాంగము డిగ్గి గజంబు నెక్కి ప్ర
త్యక్షలయాంతకుం డన వ ♦ నాటుల మార్కొని భానుసూనుపై
రాక్షసు లెల్ల మోదమున ♦ రాజిల వైచెఁ గలంబసంతతుల్. ౨౨౯౦

ఆ. వాని బాణవృష్టి ♦ వనచరపతి నొచ్చి, రూపు గొనిన రేపు ♦ కోప మనఁగఁ
గుజ మొకండు ద్రిప్పి ♦ కుప్పించి యెగిరి త,ద్గజముముఖము మీఁదఁ ♦ దాఁచుటయును.

చం. కరివర మా ప్రహారమునఁ ♦ గంపిలి యొక్కధనుఃప్రమాణముల్
సురిఁగి పిఱిందికిన్ ధరణి ♦ సోలె రవాన్వితమై సురారియున్
గరి విడనాడి ఖేటకము ♦ ఖడ్గమునుం గొని ధీరవర్యుఁ డా
హరిపతిమీఁదికిం బఱవ ♦ నాతఁడు వైచెను బ్రస్తరంబునన్. ౨౨౯౧

ఉ. రాతిని తప్పఁ దాఁటి యల ♦ రాక్షసుఁ డాయినసూతిఁ గత్తిచేఁ
జేతికొలంది మోఁదఁ గపి ♦ చేష్పడి మూర్ఛ మునింగి తేఱి సం

జాతరుషాతిరేకమునఁ ♦ జక్కనిముష్టి నురంబు నొంపఁగా
వే తరవారి మైమఱపు ♦ ప్రీలఁగఁ జేసియుఁ గాలఁ దన్నినన్.　　२३४३

ఉ. ధారిణిఁ ద్రెళ్లి లేచి తల♦తాడితుఁ జేసిన రాక్షసుండు త
ద్ఘోరతరప్రహారమును ♦ ద్రోపుడు పుచ్చి యురంబు మోఁదినన్
వీరుఁడు సూర్యసూతి తన♦ప్రే టటు తప్పిన సందు వేచి యా
వైరిలలాటదేశమున ♦ బాఢదృఢోగ్రసుముష్టి గ్రుద్దినన్.　　२३४४

కం. నెత్తురు గ్రక్కుచు దేహము, నెత్తుటఁ దడియంగ వికృత♦నేత్రుం డగుచున్
గుత్తుక మెదలఁగ నూపిరి, హత్తిన వేదనను ఱోలి ♦ యవనిం ద్రెళ్లెన్.　　२३४५

కం. ఇలఁ బడి ప్రక్కలఁ బొరలుచు, విలవిల మని తన్నికొనుచు ♦ వికృతరవంబుల్
బలియించు చెగిరిపడుచో, బలియు విరూపాక్షుఁ బ్లవగ♦వర్గము చూచెన్.

కం. ఇత్తెఱఁగున నయ్యసురుఁడు, మిత్తికి హత్తఁగ నిశాటు ♦ లగచారులు సు
న్నత్తసురవాహినీగతి, నత్తఱిఁ గనరయ్యె శోక♦హర్షాధికతన్.　　२३४६

♦ ⟶ సుగ్రీవుఁడు మహోదరుఁ జంపుట. ⟵

ఉ. ఈసున రెండుసైన్యములు నేర్తెఱఁ దాఁకి మహోనిదాఘవే
ళాసరసీజలంబు లన ♦ లావు దొఱంగి నశింప, నందు నా
త్మాసురసైన్యదుస్థితి బ♦లాఢ్యవిరూపవిలోచనుండు స్వ
ర్వాసము బోక గాంచి దశ♦వక్త్రుఁడు కోపము ముబ్బడింపఁగన్.　　२३४७

కం. గ్రావాలయు లఱుముటయును, దేవారులు విఱుగుటయును ♦ దేఁకువఁ గని చే.
తోవేదన గొని వగచెన్, దైవవిపర్యాస మిట్లు ♦ తనరునె యనుచున్.　　२३४८

చం. వరబలుఁ డంతఁ జేయలఁతి♦వానరముఖ్యులఁ ద్రుంచునమ్మహో
దరుఁ గని పల్కె నోయిలఘు♦దర్పనిధీ! విను మజ్జయాశ త్వ
త్కరగత మయ్యె నీబలము ♦ గాఢపరాక్రమ మెల్లఁ జూపి యీ
పరుల వధింపు, వేళ యిది ♦ స్వామిఋణం బఖిలంబు దీర్పఁగన్　　२३५०

చం. అనవుడు వల్లె యంచు నతఁ ♦ డగ్నిఁ బతంగముఁబోలె శత్రునా
హినిఁ జొరఁ బాఱి తేనినుడు ♦ లెంతయుఁ దోడ్పడ నాత్మశక్తికిన్
వనచరనాథయూథమును ♦ వారక కిట్టి వధింప మర్కటుల్
ఘనకుజశైలసంతతుల ♦ గాటముగాఁ బ్రహరించి రాతనిన్.　　२३५१

సీ. అమ్మహోదరుఁడు రో♦షావేశమునఁ దీవ్ర,శరపొరముల శైల♦చరుల నెల్ల
భిన్నపాదులుగ సం♦ఛిన్నపాణులుగ ని,కృత్తోరువులుగను ♦ నుత్తరింప
వెఱచి క్రోఁతులు పాఱ ♦ వెఱవకుఁ డంచు సుగ్రీవుండు వాని భం♦గింప నొక్క
విపులపాషాణంబు ♦ విసరి వైచిన దానిఁ, దుత్తుమురుగఁ జేయఁ ♦ దూర్ణముగను

ఆ. గృధ్రచక్ర మనఁగ ♦ గిరగిర దిరుగుచు, ధరణిఁ ద్రెళ్లఁ గాంచి ♦ తరణిసుతుఁడు
సాల మొండు ద్రిప్పి ♦ చావుము రాక్షసా!, యనుచు వైవ దానిఁ ♦ దునిమె నతఁడు.

చం. హరిపతి నేల నున్న పరి♦ఘాయుధముం గొని త్రిప్పి యమ్మహో
దరురథసైంధవావళులఁ ♦ దాఁచిన నయ్యవి నేలఁ గూలె వాఁ
డురవడి నేల దూఁకి యొక♦యుక్కుగదం గొనె, వీరు లిద్దఱుం
బరిఘగదాధరుల్ గెరలి ♦ మార్కొని కోడెలువోలె బొప్పుచున్ ౧౨౬౩

చం. పెనఁగఁగ నమ్మహోదరుఁడు ♦ భీమగతిన్ గదఁ ద్రిప్పి వైచినన్
దినకరనందనుండు కడుఁ♦దీవ్రత నాపరిఘంబు వైచె ని
ట్లనుపమసాధనద్వయము ♦ లాహవభూమిఁ బరస్పరాహతిన్
దునిఁగి ధరాస్థలిం బడినఁ♦దూర్ణను వానరలోకనాథుఁడున్. ౧౨౬౪

సీ. ముసలంబుఁ గాంచన♦లసితంబుఁ గైకొని, విసరి వైచిన వాఁడు ♦ వేఱొకండు
గద దాని నడిచిన ♦ త్మో రెండునున్ వ్రాలె, నాయుధంబులు వ్యర్థ ♦ మగుటఁ జేసి
ముష్టియుద్ధమునకు ♦ మొనసి యయ్యిరువురు, మండెడునగ్నుల♦మాడ్కిఁ దనరి
బిగిఁ గిలారించుచు ♦ మొగిని గర్జించి ముష్టీముష్టి కదనంబు ♦ సేయుచుండ

ఆ. నలఘుసారుఁ డైన♦యసురాధినాయకుం, డనతిదూరవర్తు ♦ లైనఖడ్గ
ఖేటకములఁ గొన వ♦నాటేశుఁ డట్టుల, వేఱుకత్తి డాలు ♦ వేగ్రహించె. ౧౨౬౫

మ. కడు విక్రాంతులు కీశరాక్షసులు ఖ♦డ్గాఖడ్గి పాటించుచోఁ
గుడిగా మండలచారణంబులను సం♦కోచంబు లేకేమియున్
వడిగాఁ జుట్టుచుఁ దాఁకుచున్ మరలుచున్ ♦ శౌర్యంబుమైఁ బోరుచోఁ
జెడుగం డాయసురుండు ఖడ్గమున వై♦చెం జర్మమున్[1] నాటఁగన్. ౧౨౬౬

ఉ. నాటినకత్తిఁ దీయ నద♦నంబుగ రాక్షసుఁ డూన నంతలో
హాటకరత్నకుండలస♦మంచిత మాసశిరస్త్రమూర్ధమున్
మీఱె దివాకరాత్మజుఁడు ♦ నిస్తులశాతకృపాణధార న
ప్పాట సురారిపాటుఁ గని ♦ పాఱిరి తక్కినరాక్షసాధముల్. ౧౨౬౭

కం. ఖరకరసుతుఁ డరిఁ గూలిచి, ఖరకరుఁడు స్వకాంతి వెలుఁగు♦కరణి వెలుంగన్
సురయక్షసిద్ధసాధ్యులు, ధరణీభూతంబు లతనిఁ ♦ దద్దయుఁ బొగడెన్. ౧౨౬౮

## మహాపార్శ్వుఁ డంగదుచే హతుం డగుట.

సీ. దురమున నిటు మహో♦దరుఁడు సుగ్రీవుచే, హతుఁ డౌటగనిమహా♦ప్రతిఘుఁడయిమ
హాపార్శ్వుఁ డుగ్రసా♦యకవితానంబులఁ, గనుపు గొట్టెను వాలి♦తనయు బలిమి
బెడిదపుగాలిని ♦ దొడిమె లూడిన రాలు,ఫలములునా నేలఁ ♦ దలలు దొరలెఁ
గొందఱకరములు ♦ కొందఱచరణముల్,కొందఱపార్శ్వముల్ ♦ గూల్చి వైచె

[1] చర్మము = తోలుతోఁ జేయఁబడిన డాలు.

ఆ. వానితీవ్రబాణ♦వర్షంబు నోపక, విముఖ మగుచు శిరము ♦ వ్రేల వైచి
విన్చె బలఁగమెల్ల ♦ వీరుఁడు తారాసు,తుండు చూచి సమర♦దోహలమున.

ఉ. పున్నమవార్ధిపోలె మెయి ♦ పొంగఁగఁ బట్టె మొకండు సూర్యతే
జు న్నగుదానిఁ ద్రిప్పి సుర♦సూదను వైవఁగ వాఁడు సూతుతోఁ
గ్రన్నన నష్టసంజ్ఞుఁ డయి ♦ త్క్ష్మాస్థలి దొర్లిన జాంబవంతుఁడుర్
బన్నఁగ భీకరాశ్మమున ♦ వానిశతాంగము నుగ్గు సేయుచున్. ౨౨౨౦

తే. వాజులను గూల్చఁగా మహా♦పార్శ్వుఁ డింత,లోనఁ దెప్పిరి శక్రజు♦సూనుమేను
బాణవిద్ధంబుఁ గావించి♦బ్రహ్మసుతుని, బొమ్ము మూఁడుశరమ్ములఁ♦గ్రుమ్మి మఱియు

కం. ఋక్షచయనాయకునిని గ,వాక్షుని బహుళాంబకముల ♦ వ్యథపెట్ట సహ
స్రాక్షుని మనుమఁడు క్రుధ ర,క్తాక్షుండై పరిఘ మొకటి ♦ యలవునఁ గొనుచున్.

ఉ. రక్కసు నుక్కడంపఁగఁ గ♦రంబుల రెంటను ద్రిప్పి త్రిప్పి యా
సెక్కఁగ వైవఁ దద్గతి మ♦హిం బడె బాణముతోడిచాపముర్
జిక్కని తచ్ఛిరస్త్రము ను ♦ జేతిశరాసన మూడ వెంటనే
కుక్కివడంగ గ్రుద్దెఁ జెవి♦గూ బదరం దల దిమ్ము పట్టఁగన్. ౨౨౨౩

ఉ. దాన సురారి రోసపడి ♦ దారుణ మాపెనుగండ్రగొడ్డలిర్
నూనె మెఱుంగు లీనుచు మ♦నోభయదం బగుదాని శైవముం
బోనిబలంబుదానిఁ గయిఁ ♦ బూని వెసం గపివామజత్రుదే
శాన రయోద్ధతిర్ వయివ ♦ శక్రసుతాత్మభవుండు నేర్పునన్. ౨౨౨౪

తే. తొలఁగ దాఁటుచుఁ బితృతుల్య♦బలుఁడు మర్మ
విదుఁడు తారేయుఁ డాగ్రహా♦వేశమునను
గట్టిపిడికిలి వజ్రంబు♦నట్టిదానిఁ
బూని హృదయంబునను దాఁచెఁ ♦ బూర్వలేఖు. ౨౨౨౫

కం. పోటున నసురుఁడు హృదయ,స్ఫోటముగఁ బరాసు వగుచు ♦ భువిఁ గూలఁ ద్రియా
మాటుల సేనలు కళవళ,పాటున సంక్షోభ మంది ♦ పాఱం దొడఁగెన్. ౨౨౨౬

కం. వానరగర్జలచే లం,కానగరము సాట్టవప్ర♦ఘనసౌధం బై
మానక వణంకి ప్రీలెడు, నోనా నపు డొప్పె రాక్ష♦సోత్కర మడలన్. ౨౨౨౭

కం. నాకౌకోనాదములు వ,నౌకోగర్జలను బెరయ ♦ నుత్కటరోష
వ్యాకులుఁ డయి వింశతిభుజుఁ, డేకోద్యముఁ డగుచు నడచె ♦ వృక్షౌటుల పై.

## రావణుఁడు కపులఁ బొలియించుట.

సీ. ప్రబలశౌర్యులు మహా♦పార్శ్వమహోదరు, లతులధీరుఁడు విరూ♦పాక్షుఁ డట్లు
హాత్తులైన దుర్విష♦హ్యాగ్రహంబున రథ,చోదకు ని ట్లును ♦ శూరులైన

మంత్రులు చచ్చిన ♦ మహితదుఃఖంబును, రుద్ధపురార్తియు ♦ యుద్ధభూమి
మడియించి రామల♦క్ష్మణులఁ బోకార్చెదఁ, దోలుమీఁ రథ మతి♦తూర్ణముగను
ఆ. హరిజవిధిజకుముద♦హనుమన్నలాంగద, ద్వివిదమైందముఖ్య♦వృక్షచారు
లనెడుకొమ్మ లమరు♦నవనిజాసుమఫల,ప్రదము రామకుజముఁ ♦ బడఁగ నడుతు
ఉ. సారథియుఁ రథంబు రభ♦సంబునఁ దోలె రథాంగనిస్స్వనం
బార దిశానమూహముల♦యందుఁ బ్రతిధ్వను లుబ్బు చుండఁ గాం
తారనదీమహీధరక♦దంబసమేతవసుంధరాతలం
బారవపూర్ణ మై వణఁకె ♦ నంబుధి వేల నతిక్రమింపఁగన్. ౨౨౮౦
కం. తామసుఁ డగుదశవక్త్రుఁడు, తామసపడ కాస్త్రవంగ♦తతిపై నేసెఁ
దామసబాణవరంబును, దా మసిఁ జేయంగఁ బూని ♦ తత్సైన్యంబున్. ౨౨౮౧
ఉ. ధాతృవినిర్మితం బయిన ♦ దారుణమార్గణ మాఁగ రాక త
ద్భీతికరార్చులం బ్లవగ♦వీరతతిఁ దహియింపఁగా సమి
ద్భూతలముం దొఱంగి కపి♦పుంగవు లొక్కటఁ బాఱఁ దద్రజో
వ్రాతము కల్గెఁ జీఁకటులు ♦ పర్వె నిరంతర మక్షిరోధ మై. ౨౨౮౨
కం. దానవుఁ డస్త్రమున నసే,కానీకములఁ దహించి ♦ యవనిం గలుపఁ
గానీరా యని మహిజా,జాని శరాసము గ్రహించె ♦ సంగరకాంక్షన్. ౨౨౮౩

→ రామరావణ యుద్ధము. ←

సీ. ఈలోన నసురుఁ డు♦పేంద్రయుతుం డైన,శక్రునిఁబోలి ల♦క్ష్మణునితోడ
నిలిచి కేలను మహా♦నిరుపమధను వూని, మింటను లిఖియించు ♦ దంటవోలెఁ
దనరారు నీరేజ♦దళవిశాలాక్షుని, నాజానుబాహుఁ గా♦లాంతకాభుఁ
గదియ రాముండును ♦ గపిసంఘములచేటు, పంక్తివక్త్రుఁడు వచ్చు♦భంగిఁ గాంచి
ఆ. కుంది ముదము నొంది ♦ కోపరక్తాక్షుఁ డై
చాప మెత్తి భూమి ♦ శకలములుగ
గుణము మీటుటయును ♦ గ్రోఁతులు రక్కసుల్
గుములు గుములు గాఁగఁ ♦ గూలి రవని. ౨౨౮౪
కం. ఆరాజశేఖరాత్మజు,నారాచపథంబుఁ దఱిసి ♦ నాళీకాప్తా
ర్యారుల డాసినరాహువు,నా రజనీచారలోక♦నాథుం డుండెన్. ౨౨౮౫
చం. తొలుత రణంబు సేయుతమిఁ ♦ దుర్ణను లక్ష్మణుఁ డానిశాటుపై
జ్వలదనలాభశాతశర♦జాలముఁ గప్పిన వాని నన్నిటిఁ
బలియుఁడు రావణుండు కర♦పాటవ మేర్పడ నొంటి నొంట మూఁ
డలుగుల మూఁటిచేఁ బదిట ♦ నన్నిశరంబులఁ ద్రుంచె వ్రేల్మిడిన్. ౨౨౮౬

చం. అతని నతిక్రమించి గిరి♦య ట్లచలుం డయియున్న రాము పై
శితవిశిఖోత్కరంబులను ♦ జెచ్చెర వైచిన భల్లమూని త్రో
పతితనయుండు సర్వశర♦వార మణంచి నిశాచరేంద్రుపై
శతములు నారసంబులు ప్ర♦శస్తగతిం బరఁగించె నేర్పునన్. ౨౮౭

శా. కాండీరద్వయ మద్వయాద్భుతలస♦త్కాండప్రకాండంబు కో
దండారావవిభిన్నదిక్తటముగా ♦ దర్పించి వైవంగ బ్ర
హ్మాండాంతర్గతభూతసంచయము హా♦హాకారపూర్ణాస్య మై
మెం డాక్రోశ మొనర్చి గుండె లదరన్ ♦ మేడ్పాటు గాంచెం ద్రుటిన్. ౨౮౮

ఉ. సంతతసంప్రయుక్తశర♦జాల మఖర్వగతి న్నభస్థ్సలిన్
బంతులు గట్టి పాఱఁగను ♦ వార్షికవారిధరాళి చంచలా
సంతతిదీప్త మై పఱచు♦చందము మీఱె గవాక్షముల్ దివిన్
దొంతర గూడెనో యనఁగఁ ♦ దోఁచె శిలీముఖపంక్తు లయ్యెడన్. ౨౮౯

చం. అతులజవంబు లై శితము ♦ లై మఱి గ్రద్దగఱుల్ చెలంగునా
యతిరథముక్తసాయక చ♦యంబులు పర్వఁగఁ బ్రొద్దు గ్రుంకినన్
దత మగుమబ్బు గ్రమ్మినను ♦ దట్టపుఁజీఁకటి వ్యాప్త మౌనటుల్
క్షితి పొలుపారె, వీరజన♦శేఖరు లిద్దఱు నప్పు డుగ్రు లై ౨౯౦

చం. కదిసి పరస్పరక్షణన♦కాంక్ష బలారియు వృత్రదైత్యుఁడున్
గదనము సేయుభంగిఁ గర♦కౌశల మొప్ప నచింత్యమున్ దురా
సదముగ నస్త్రశస్త్రసువి♦శారదు లుగ్రశరాసనుల్ భయ
ప్రదబలధుర్యవర్యులు దు♦రం బొనరించిరి రామరావణుల్. ౨౯౧

కం. వాతహతిఁ గంధిభంగ,వ్రాతం బుప్పొంగురీతి ♦ వారలశరసం
ఘాతంబు వారు చనియెడు,నా తెరువుల వరుస వరుస ♦ లై ప్రసరించెన్.

ఉ. రక్కసమూఁక ఱేఁడు నిజ♦రౌద్రశరాసనముక్తబాణముల్
చక్క నరేంద్రఫాలతల♦సంధిని నాటఁగ వైవ నించుకేన్
లెక్క గొనండు రాముఁడు స♦లీలవినీలకువాలపంక్తినా
స్రుక్కక తాల్చి రోషమున ♦ రుద్రమనూజ్జ్వలబాణసంతతుల్ ౨౯౩

చం. ధనపతితమ్ము సేయుటయుఁ ♦ దద్విశిఖంబు లవధ్యవర్గమున్
జెనకి వృథా మహిం బడిన ♦ శీఘ్రకరుం డఖిలాస్త్రవేది యా
దనుజులలాటదేశము వి♦దారిత మై గొన బేవ నేసె ధా
రణిసుతనాథుఁ డేను ప్రద♦రంబులఁ బంచముఖాహులట్లుగన్. ౨౯౪

కం. వెండియు శర మేసిన సుర,ఖండనుఁ డది త్రుంచి వైచి ♦ కలుషాత్మకుఁ డై
చండాసురాస్త్ర మేసెను, దండిజవంబునను రోష♦తామ్రాక్షుం డై. ౨౨౯౭

సీ. పంచాస్యశార్దూల♦వాయసదక్షాయ్య,ఖరగృధ్రపోత్రిసృ♦గాలపంచ
వదనభుజంగను♦వదనబాణంబులు, సింహమృగాస్యముల్ ♦ వృశ్చికాండ
జాతకుక్కుటనక్ర♦సారమేయముఖంబు, లగు పెక్కు బాణంబు♦లసురుఁ డేయ
వచ్చెడునసురాస్త్ర♦వరముఁ గనుంగొని,రాముండు వహ్నిశ♦రంబు వైన

ఆ. నగ్నిదీప్తముఖము ♦ లర్కముఖంబులు, నర్ధచంద్రశీత♦లాంశుముఖము
లుడుఖగాస్యములును ♦ నుల్కాముఖంబులు, కేతువక్త్రములును ♦ నాతతముగ

కం. జనియించి వాని నన్నిటి,వినువీధి హరింప నంద ♦ విలయం బొందెన్
వనచరులు పొంగి యార్వఁగ, వనచరనాథాదు లధిపు ♦ బలసి భజింపన్. ౨౨౯౮

కం. రావణముక్తశరంబును, భూవిభుఁ డిటు లణఁగఁ జేసి ♦ ముదమున నఱలెన్
రావణుఁడును దనయస్త్రం, బీవిధిహతమైనఁ గోప ♦ మినుమడి గాఁగన్. ౨౨౯౯

## రామరావణులు దివ్యాస్త్రంబులఁ బోరుట.

చం. మయవిహితంబు రౌద్ర మగు♦మార్గణ మొండు గుణంబు గూర్చి దు
ర్జయుఁ డగురాముపైఁ బఱపఁ ♦ గ్రచ్చఱ శూలగదాముసుంఠ లా
లయసమయప్రవాతముల♦లాగున ముద్గరకూటపాశసం
చయములతోడ వెల్వడుఁ ♦ సర్వమహాస్త్రవిదుండు రాముఁడున్. ౨౨౯౯

కం. బంధురజవసంయుతుఁ డై,గాంధర్వాస్త్రంబుఁ దనదు♦కార్ముకమందున్
సంధించి వైచి దాని సు,ధాంధసు లరుదందఁ ద్రుంచె ♦ నాక్షణమందున్. ౨౩౦౦

సీ. ప్రతిహతం బగుడు న♦స్త్రం బౌడు గఱచుచు, సౌరాస్త్ర మేసె దా♦శరథిమీఁదఁ
జక్రసంతతులతోఁ ♦ జనుదెంచునద్దాని, దివియెల్ల వెలిఁగించు♦తేజు దానిఁ
బుష్పవంతులఁబోలి ♦ పొలుపు దాల్చినదాని,రాముండు శంపాళి♦నామ మణఁచె
నదియును హత మైనఁ ♦ బదిబాణముల రాము,నుర్మముల్ నొప్పింప ♦ ధర్మశీలుఁ

తే. డించుకేనియు స్రుక్కక ♦ యిషునికాయ
ములను రావణు నొప్పించె ♦ నలవు మెఱసి
యంతలో లక్ష్మణుఁడు తన♦యన్నతోడ
సరిగఁ బోరెడియసురేంద్రు♦చంద మరసి ౨౩౦౧

## రావణలక్ష్మణ యుద్ధము.

చం. కనలి రథస్థుఁ డౌ టితఁడు ♦ కాల్నడ నిల్చినయన్నతోడఁ దా
బెనఁగెడినింతద వ్వనుచు ♦ వీరుఁడు బాణము లేడు పూని కే

తనము మనుష్యశీర్షకము ♦ ధాత్రిఁ దొరంగఁగ నేసి యొంటఁ జ
య్యన మణికుండలాంచితని♦యంతృశిరంబు నొకంటఁ ద్రుంచుచున్. ౨౩౦౨

కం. తక్కిన శరపంచకమున, దిక్కరికరతుల్య మైన♦దృఢచాపంబున్
బెక్కులు దునియలుగాఁ గెం, పెక్కకనుంగవను ద్రుంచె ♦ నేడ్తెఱ నాలోన్

తే. కాలమేఘనిభంబులు ♦ శ్యామధరాభములును నగు తేరిగుఱ్ఱాల ♦ బలియుఁ డావి
భీషణుం డొక్కదూఁకున ♦ భీమగదను, మొత్తివధియించె నన్నింటిఁ ♦ దత్తిలక.

కం. హయములు గూలినయంతన, రయమున భూస్థలికి దాఁటి ♦ రథగతశక్తిన్
భయదాకృతిఁ గొనితమ్ముని, లయముం బొందింపఁ జూడ్కు♦లన్ సెగ లెగయన్.

ఉ. హా యని వేయ నద్దిపిడు♦గో యన వెల్వడునంతలోన బా
ణమ్ములు మూఁడిటిం దొడిగి ♦ నాశముఁ జేసె సుమిత్రపట్టి యు
గ్రమ్మగుశక్తితున్కలయి ♦ కాంచనమాలికతోడ రాలె న
భ్రమ్మునఁ దోఁకచుక్కనఁ బ్ల♦వంగమసైన్యము లుబ్బి యార్వఁగన్. ౨౩౦౬

చం. తనయసమానశక్తి యిటు ♦ దారిత మౌటయు మండుఁగన్నులన్
దనుజవరేణ్యుఁ డుగ్రతర♦దండధరాప్రతికార నైజకాం
తినిచయదీప్త మైనయొక♦దివ్యతరాశనితుల్యహవ్యవా
హనసఖశక్తిఁ గేలఁ గొను♦నంతటిలో రఘురాముతమ్ముఁడున్ ౨౩౦౭

ఉ. జడ్డొకయింత లేక యసు♦సంశయదుస్థితు నవ్విభీషణున్
జడ్డన వెన్క వేసికొని[1] ♦ సాయకవర్షము వైరిమీఁద ము
జ్జడ్డుగ ముమ్మరమ్ముగను ♦ జేస్ప్రడఁ దిక్కటమక్కటంగొనన్
సడ్డొకయింతఁ జేయ కతి♦సాహసవృత్తిని ముంచి వైచినన్ ౨౩౦౮

ఉ. అడ్డము దూఁకి యిట్లు వసు♦ధాధిపసూతి నిజానుజాతు పే
రెడ్డఁమిఁ బాప వైచిన శి♦తేషువులన్ నిజశౌర్య మంతయున్
జడ్డుపడంగఁ దమ్ము నిటు ♦ చావునకుం దొలఁగించి యున్నయా
దొడ్డబలిష్ఠు లక్ష్మణుని ♦ దుష్టచరిత్రుఁడు రావణుం డనున్. ౨౩౦౯

చం. తవిలి విభీషణున్ మృతికిఁ ♦ దప్పఁగఁ జేసినశౌర్యసార! నీ
యవితథవిక్రమంబునకు ♦ నచ్చెరు వయ్యెడు మెచ్చితిం జుమీ
నవరన నిల్వు లక్ష్మణుఁడ! ♦ చావక తప్పను రాక్షసుండు నీ
పోవ రడఁగింతు నీహృదయ♦మున్ వెసఁ జీల్చి హరింతుఁ బ్రాణముల్. ౨౩౧౦

## ↔ లక్ష్మణుఁడు రావణుశక్తిచే మూర్ఛ పోవుట. ↔

ఉ. తాళు మటంచు రావణుఁడు ♦ దారుణరావము భీషణాష్టఘం
టాలసితం బమోఘ మరి♦నాశకమున్ మయదైత్యశాంబరీ

[1] శరణాగతరక్షణము దనప్రాణమిచ్చి యైనఁ జేయవలయును గనుక.

జాలసుకల్పితంబు నగు♦శక్తి దురాత్ముఁడు రాముతమ్ముని
ద్వేలజవాన్వితంబుగను ♦ వ్రేసిన వచ్చెడుశక్తిఁ గాంచుచున్. ౨౩౦౧

ఉ. స్వస్తి సుమిత్రపట్టికిని ♦ వ్యర్థము గమ్ము శరమ్ము! యంచు భూ
శస్తుఁడు రామభద్రుఁడు ప్ర♦శాంతికరోక్తులు పల్క భీతిస
న్న్యస్తుని లక్ష్మణుం గదిసి ♦ వ్యాళవరేణ్యముజిహ్వఁబోలె వి
ధ్వస్తభుజాంతరుండుగను ♦ వైళమ వక్షమునాటె భీమ మై. ౨౩౦౨

ఉ. గాటముగాఁగ శక్తి మెయిఁ ♦ గాఁడిన మూర్ఛ మునింగి లక్ష్మణుం
డోటఁబడి నేల వ్రాలుడు స♦హోదరుదుస్థ్సితిఁ జూచి వేదనా
స్ఫోటితచిత్తుఁ డై మనుజ♦పుంగవుఁ డించుక పల్లటిల్లి యా
మేటిబలాఢ్యుఁ జూచుచును ♦ మేద్పడి కన్నుల నీరు నించుచున్. ౨౩౦౩

కం. కాల మిది గాదు వగవఁగ, నాలమునకు సమయ మనుచు ♦ నాగ్రహవశుఁ డై
చాలించి వగవు వింటిని, గేలఁగొని దశాస్యుఁ జంపఁ ♦ గృతయత్నుం డై.

## ⟶ శ్రీరాముఁడు లక్ష్మణునిఁ గవుల కప్పగించుట. ⟵

సీ. తివిరి రక్షోవిభుఁ ♦ డవిరళశరవృష్టి, తనమీఁదఁ గురియింప ♦ దైన్య పడక
ప్లవగనాయకులెల్లఁ ♦ బాపఁజాలనిశక్తి, నవలీలఁ బెఱికి తు♦న్మాడి వైచె
నదె సమయం బని ♦ యసురేంద్రుఁ డాతని, మర్మదారణశీల♦మార్గణముల
వైవ గణింపక ♦ భ్రాతఁ గౌఁగిటఁ గ్రుచ్చి, సూర్యప్రభంజన♦సుతులతోడ

ఆ. ననియె వీరులార! ♦ యప్రమత్తుల రయి
బలసి నాదుతమ్ము ♦ నిలువ రయ్య
యెంతకాలముగనొ ♦ యెదురు చూచుచు నున్న
కాల మొదవె నింత♦కాలమునకు. ౨౩౦౫

శా. ఆసాసం గొని వేచి మిన్ను గనుసా♦రంగంబు ఘర్మాంతవే
ళాసంలక్షితవారిదంబుఁ గనులీ♦లం గంటి సంగ్రామఖే
లాసంరబ్ధు దశాస్యు నేను జిరకా♦లం బెంతేయుఁ వేచి యే
లా సందేహము వీనిఁ దున్మెదను స♦త్యం బింతేయుఁ నమ్ముఁడీ. ౨౩౦౬

కం. నావచనము వినుఁడీ నే, రావణు నీక్షణమ వేగ ♦ రణమునఁ ద్రుంతుఁ
రావణుఁడో రాముఁడో కా, కీవసుమతి నిల్ద ఉంట ♦ యిది మిథ్య యిఁకన్.

ఉ. లచ్చిని గోలుపోక, వను♦లం జరియించుట, దండకాటవిఁ
ముచ్చిరుచుంట, జానకిని ♦ మూర్ఖుఁడు ముట్టుట, సోఁకుమూఁకతోఁ
హెచ్చినపోరు, ఘోర మగు♦నీనిరయోపమదుఃఖ, మిన్నియుఁ
గ్రచ్చఱఁ బాయువాఁడ దశ♦కంఠు రణావనిఁ దున్మి యీత్రుటిన్. ౨౩౦౭

ఉ. ఏమినిమిత్త మేను వధి♦యించితి వాలిని, భానుసూను శా
ఖామృగరాజుఁ జేసి కపి♦కాండము నెల్లను గూర్పఁ గంటి, నే
నేమిటి కబ్ధిఁ గట్టి తరి♦యించితి, నింతకు మూల మైన నీ
చీమనుజాశనుండు ప్లవ♦గేశ్వరులార! యిదే కనంబడెన్. ౨౩౧౯

కం. చూపుల విష ముండెడిఫణి, చూపులపాల్పడినవాని♦చొప్పున నేఁడీ
పాపి యని నాదుదృష్టికిఁ, జేపడియును బ్రదికి పోవఁ♦ జెల్లదు సుండీ. ౨౩౨౦

ఉ. నెమ్మది నిమ్మళంబుగ వ♦నేచరులార! సమీపధారిణీ
ధ్రమ్మునఁ గూరుచుండి ఖలు♦రావణునాదుదురంబుఁ జూడుఁడీ
యిమ్ముగ మూఁడులోకములు♦ నెల్లనిలింపులు నింద్రహానియు
క్కమ్ముగఁ జూచువారలు ప్ర♦కాశముగా రఘురాము రామతన్.[1] ౨౩౨౧

కం. నాకులు సచరాచర మగు, లోకంబులు గుములు గట్టి♦ శ్లోకయుతముగా
నాకదనమువిధ మెప్పుడు, వాకొన నొనరింతు భూమి♦ వఱలెడిదాఁకన్. ౨౩౨౨

రావణుఁడు పరాజితుం డై లంకకుఁ బరువెత్తుట.

చం. అనుచు సువర్ణభూషణస♦మంచితశాతశరాళి పఙ్క్తివ
క్త్రునిమెయిఁ గాఁడ నేయుటయుఁ♦ గ్రూరత నాతఁడు దీప్తబాణముల్
పెనుముసలంబులన్ ముదిర♦బృందము నీరమువోలె రాముమీఁ
దను గురియింప వాని శత♦ధాపరిభగ్నముఁ జేసె రాముఁడున్. ౨౩౨౩

చం. ప్రకటబలప్రతాపనర♦వల్లభరాక్షసరాజముక్తసా
యకనిచయంబు లుప్పరము♦నందు నొకొంటిని దాఁకుచప్పుడుల్
సకలదిశాంతవీథుల న♦సహ్యము లై పరఁగెన్ ధరాస్థలిన్
శకలము లౌచు రాలి పృథు♦శైలవితానములట్లు లొప్పఁగన్. ౨౩౨౪

ఉ. ఏమిర! యింతదాఁకఁ దెగి♦ యీతఁడు పోరెడు నంచు నల్కమై
రాముఁడు నిప్పుగ్రక్కెడిశ♦రంబులఁ గోటుల లస్తకంబునన్
స్తోమముగాఁగ నీనుగతిఁ♦ దొప్పలు దోరలు పర్వఁ జేసినన్
దీమస మేది రావణుఁడు♦ దీనతఁ బాఱెఁ బురంబులోనికిన్. ౨౩౨౫

మూర్ఛిల్లిన లక్ష్మణుఁ జూచి రాముఁడు దుఃఖించుట.

ఉ. రావణుతోడఁ బోరుచు నె♦ రామవిభుం డొకకంట రక్తసి
క్తావయవున్ నిజానుజుని♦ నార్తిని గాంచు చనెన్ సుషేణుతో
హా! వరవిక్రముండు సుగు♦ణాంబుధి ప్రాణముకన్న మిన్న యీ
ధీవిభవుండు తమ్ముఁడు క్షి♦తిం బొరలాడెడిఁ బాముకైవడిన్. ౨౩౨౬

[1] రామతన్ = రామనామ సార్థక్యమును; రామావతార ప్రయోజనమును; జగదేకవీరత్వమును; సత్యధర్మశౌర్యములచే మూఁడులోకములను రమింపఁజేయుటను.

ఉ. ఈతనిపాటుఁ గన్న మన • మెంతయు నారటమందఁ జొచ్చెడిన్
నాతర మౌనె యింకఁ గద•నం బొనరింపఁగ? శౌర్యశాలి నా
భ్రాత ప్రశస్తలక్షణవి•రాజితమూర్తి సుమిత్రపట్టి య
య్యో! తెగె నేని నే బ్రదికి•యుండుట యేటికి? సౌఖ్య మేటికిన్? ౨౩౨౮

ఉ. జాఱెడిఁ జాపదండ, మవ•శం బయి పోయె మనంబు, బాణముల్
పాఱెడి నెట్టిటో గుఱిని • బాసి, యయో కనులందు బాష్పముల్
మీఱెడి దృష్టి నాఁగుచును • మేను భరింపఁగ నాశ లన్నియుం
దీఱె, విషాద మెచ్చెడిని • దీనతఁ దమ్ముని పాటుఁ జూచినన్. ౨౩౨౯

ఆ. స్వప్నయానమందు • జనులకుఁ బోలె నా,యంగకములు సడలి • యవనిఁ గ్రుంగఁ
బడుచు నున్న వయ్య • పటిమ లే దొడలను, సడలి డీలు పడియె • సంధులెల్ల.

కం. నాకనుల మ్రోలఁ దమ్ముం, డీకరణి గరాసుచేత • మృతి గన నిస్సీ
నాకడిమిఁ దలఁప సిగ్గా, నా కెక్కడిబల? మిఁ కేల • నా కీధనువున్? ౨౩౩౦

చం. అని వ్యసనాభిపీడితు శ•రాభిహతాంగు వినష్టవంతుఁ ద
మ్ముని వెలిప్రాణమై తనరు • మోహనగాత్రునిఁ జూచి చూచి తాఁ
గనులను నీరు గార్చుచును • గాఢతరార్తిపరాయణుండు నై
మన ముఱియంగ మిక్కిలి వి•మూతనయారమణుండు దీనుఁ డై. ౨౩౩౧

కం. ఏలా నా కీయుద్ధం?, బేలా ప్రాణంబు? సీత • యేలా యింకన్?
లాలితగుణుఁ డగుతమ్ముం, డీలీలన్ ధూళి బ్రుంగి • యిలఁ బడియుండన్. ౨౩౩౨

కం. నాముద్దుఁదమ్ముఁ డీతఁడు, భూమి నిహతుఁ డైన యేని • భోగము రాజ్యం
బేమిటికి? బ్రదికి యేటికి?, నేమిప్రయోజనము గెలిచి • యేనియు ననిలోన్?

కం. ఊరూరఁ గళత్రంబులు, నూఱూరన్ బాంధవులును • నొదవెద రకటా!
యారయ భ్రాత సహోదరుఁ,[1] డాఁగఁగ లభియించు దేశ • మవనిం గలదే? ౨౩౩౪

## సుషేణుఁడు శ్రీరాము నూరార్చుట.

తే. అనుచు నిట్టూర్పు నిగిడించు • నవనిఁ బొరలుఁ
గన్నులను నీరు నించు శో•కంబు నొందుఁ
బనవుఁ బలవించు నిట్టున్న•యనఘుఁ గాంచి
చేరి యూరార్చి పలుకు సు•షేణుఁ డపుడు. ౨౩౩౫

కం. లక్ష్మీవర్ధనుఁ డగుమన,లక్ష్మణుఁడు మృతుండు గాఁడు • శ్లాఘితచరితా
లక్ష్మణములఁ గనుఁగొనుమీ, సూక్ష్మమతీ! నీకు నిట్లు • సుక్కఁగ నేలా? ౨౩౩౬

తే. కాంతి దొఱఁగదు నీలంబు•గాదు మోఱు,పాటు నొందదు వదనంబు • పార్థివేంద్ర!
సుప్రభంబు ప్రసన్నంబు • సొబగు గలదు, పాణులును రక్తనీరజ•ప్రభల నొప్పె.

[1] భ్రాత = తమ్ముఁడు. సహోదరుఁడు = తనతో సమానుఁడు. రామలక్ష్మణభరతశత్రుఘ్నులవి ప్రాకృతశరీరములు గావు. దివ్యావృతకారణమైన యప్రాకృత దివ్యమంగళ విగ్రహములు. ఒక పాత్రములోని పాయసము భాగములయినట్లు లోకతేజస్సు నాలుగురూపములఁ ధరించెను గనుక సమానములు.

కం. కనులందుఁ దేజు మాఱదు, మనుజేంద్రా! యిట్టికాంతి ♦ మహిమయుఁ గలదే
 వినశించినవారికి? నీ,తనిముఖ మెఱ్ఱఁగించు దీర్ఘ♦తరజీవితమున్. ౨౩౩౮

ఉ. కాన మృతుండు గాఁడు సుమి ♦ గాదిలితమ్ముఁడు భద్రమూర్తి స
 ప్రాణుఁడు దుఃఖ మొందకుము ♦ రాజవరా! యదె మాటిమాటికిన్
 గానఁగ నయ్యెడిన్ హృదయ♦కంపన ముచ్ఛ్వసనంబు చూడుమీ
 మాను విషాద మంచు హను♦మంతునిఁ జూచి వచించె నీగతిన్. ౨౩౩౯

## హనుమంతుఁడు సంజీవనిపర్వతంబు దెచ్చుట.

కం. హనుమా! మందులమలకై, చనుమా వేగంబ మున్ను ♦ చతురాస్యసుతుం
 డనినపథంబున నగ్గిరి, గొనబా రెడి దక్షిణంపుఁ♦గూటమునందున్. ౨౩౪౦

సీ. కలదు సుమ్ము విశల్య♦కరణి యైన విశల్య,కరణి శ్వశ్శ్రేయస♦కారి యగుచుఁ
 గల వందున సవర్ణ♦కరణి సంజీవని, సంధానకరణియు ♦ శస్తవేగ!
 కొని తెమ్ము లక్ష్మణు♦మనుదల గూర్పఁగఁ, బొమ్ము వీరుఁడ వేగ ♦ రమ్ము టన్నఁ
 జివ్వునఁ జని యటఁ ♦ జేరి మహౌషధి, నెల వెఱుంగఁగలేక ♦ నెమకి తలఁచె

తే. నేల యీజాగు గిరిని స♦మూలముగను, బెకిలికొనిపోదు మందులు ♦ వఱలు నిందు
 నట్లు చెప్పె సుషేణుండు ♦ నౌషధంబు, గొనక మసలిన నెంతయుఁ ♦ గూడదుఁ గీడు.

కం. పౌరుషహానియు నా కని, వీరుఁడు చింతించి యల్ల♦పృథివీధరమున్
 వారక ముమ్మా ఱూఁచెను, జారుతరోత్ఫుల్లభూజ♦సంతతితోడన్. ౨౩౪౨

సీ. పెకలించి పై కెత్తి ♦ వినువీదికిని దాఁటి, పుట్టచెండునుబోలె ♦ భూమిధరము
 నెగవైచి పట్టుచు ♦ జిగి జలపూర్ణమే,చకఘన మగుదాని ♦ సరగఁ దెచ్చి
 వనచరావళిమధ్య♦మున డించి యించుక, గాసి దీఱ సుషేణుఁ ♦ గాంచి పలికె
 నిందలిమందుల ♦ నెఱుఁగఁజాలక కొండఁ, బెకలించి తెచ్చితి ♦ వీరవర్య!

ఆ. యనిన మెచ్చుకొనుచు ♦ నతని సుషేణుండు, దీసె నోషధులను ♦ దీవరముగఁ
 బావమానికృతికి ♦ వానరరాక్షస,చయము లబ్రపడె న♦సాధ్య మనుచు. ౨౩౪౩

## లక్ష్మణుఁడు మూర్ఛ దేఱుట.

ఉ. అంత సుషేణుఁడుం బతి మ♦హౌషధి మూర్కొనఁ జేసినంతలో
 నెంతయుఁ దేజు మీఱి వ్యథ ♦ యేమియు లేక విశల్యుఁ డై వెసన్
 సంతసమార లేచెఁ, గపి♦సంఘము లాకపివర్యశక్తి క
 త్యంతము మెచ్చి మే లనుచు ♦ నర్హగతిం గొనియాడె నాతనిన్. ౨౩౪౪

కం. రా రమ్మీ లక్ష్మణ! యని, గారామునఁ దమ్ము నపుడు ♦ కౌఁగిటఁ గ్రుచ్చెన్
 శ్రీరాముఁడు కనుఁగవలన్, నీరము దొలఁకాడ నిండు♦నెయ్యము పేర్మిన్. ౨౩౪౫

కం.అన్నా! లక్ష్మణ! యెంతటి, పున్నెంబో నిన్ను మరలఁ ♦ బొడగనఁ గలిగెన్
జెన్నటి యముబారిం బడి, క్రన్నన చనుదెంచి తీవు ♦ గాదిలియనుజా! ౨౩౪౬
కం.నీవు మరణింప నా కిల, జీవితమున నేమిఫలము ♦ సీతయు నేలా?
రావణునిఁ జంపి జయమున, నే వఱలఁగ నేల? చెప్పవే సౌమిత్రీ? ౨౩౪౭

లక్ష్మణుఁడు శ్రీరాముని రణంబునకుఁ బ్రోత్సాహపఱుచుట.

కం.అనవుడుఁ బలుకులు తడఁబడ, మనమున నెగు లూని యనియె ♦ మహితబలాఢ్యా!
తనుమిదు రావణు రాజ్యం, బనఘ! విభీషణున కిత్తు ♦ నన వే చెపుమా. ౨౩౪౮
కం.పలికిన బాస మహాత్మకు, లలఘుమతీ! తప్పిపోదు ♦ రా యెపుడేనిన్?
బలికిన బాసను దీర్పుచు, యలఘుగుణాఢ్యులకుఁ జిహ్నా ♦ మతిబలధుర్యా! ౨౩౪౯
కం.బలవంతుఁడ వీ వయ్యును, బలహీనునిమాడ్కిఁ బేద ♦ పలుకులు తగునే
వలవదు నాకై కార్యము, నిలుపఁగ రావణు వధించి ♦ నెఱపుము ప్రతినన్.
కం.ఖరదంతం బతిశాతన, ఖర మయి గర్జిలు మృగేంద్రు ♦ కనులం బడినన్
గరి యరుగ లేనిగతిఁ ద్వచ్ఛరపథగతుఁ డసుర బ్రదికి ♦ చన లేఁ డన్నా. ౨౩౫౦
చం.అరుణమయూఖుఁ డీతఁ డింక ♦ నస్తముఁ జెందక మున్న[1] పంక్తికం
ధరుఁ దునుమాడు ఘాతనివ ♦ ధం బభివాంఛిత మేని, త్వద్వచః
కరణము కార్య మేని, యిది ♦ కైకొన నీ కభిలాష మేని, యో
నరవర! యిప్డ శీఘ్రముగ ♦ నావచనం బొనరింపు మగ్గలిన్. ౨౩౫౧

శ్రీరామరావణుల కడపటియుద్ధము ప్రారంభము.

చం.అనవుడు రామచంద్రుఁడు ని ♦ జానుజువాక్యము లాత్మ నుంచి వే
ధనువుఁ గొనెన్, దశాననుఁడు ♦ దా నొకస్యందన మెక్కి వేగ మై
దినకరుపైఁ దమోగ్రహము ♦ తీవ్రత వచ్చెడిమాడ్కి వచ్చి యా
మనుజవరేణ్యు వజ్రమయ ♦ మార్గణతాడితుఁ జేసెఁ గ్రూరతన్. ౨౩౫౩
కం.సీతాపతి పావకనిభ, శాతాశుగపంక్తి తప్త ♦ జాంబూనదభూ
షాతతభూషితము గొని, యాతని తను వెల్ల వ్రణమ ♦ యంబుగఁ జేసెన్. ౨౩౫౪
సీ. దేవగంధర్వాది ♦ దివిజు లప్పుడు చూచి, భూమిస్థితుండు శ్రీ ♦ రామవిభుఁడు
రథికుండు రావణ ♦ రాక్షసుం డిది సమ, యుద్ధంబు గా దంచు ♦ నుగ్గడింపఁ
గాంచనరుచిరంబు ♦ ఘంటికాశతభూషి, తము తరుణార్కసి ♦ భము విదూర
భవకూబరంబును ♦ భర్మపరిష్కార, మును సితచామరం ♦ బును బలాశ
ఆ. కాంతి కలిగి రవిని ♦ కాశ మాహారితతి, గ్రాల రుక్మవేణు ♦ కలిత మైన
ధ్వజము మెఱయు తనర ♦ థంబును శక్రుండు, పంపె నపుడు రామ ♦ భద్రుకడకు.

[1] దీనివలన లక్ష్మణమూర్ఛ పగటియంద కావున హనుమంతుఁడు కాలనేమిని జంపుట కల్పితకథ యని తెలియనగు. రావణుఁడు లంకకుఁబోయి రథికై వచ్చెడిలోపల లక్ష్మణుఁడు మూర్ఛ తేఱెను.

↞ మాతలి శ్రీరామునికడకు నింద్రుపనుపున రథంబుఁ దెచ్చుట. ↞

కం. ప్రీతిని హరిహయుపనుపున, మాతలి స్యందనముఁ గొనుచు ♦ మహికిం డిగి శ్రీ
సీతాపతికిన్ మ్రొక్కెను, జేతన కళ యుండ దిగక ♦ స్వీయరథంబున్. ౨౩౫౬

శా. దేవా! నీవిజయంబుఁ గోరి పనిచెన్ ♦ దేవేంద్రుఁ డీస్యందనం
బీ వుత్సాహముతోడ నెక్కి కొనుమీ ♦ యీయైంద్రకాండాసనం
బీవైశ్వానరతుల్యవర్మము దినా♦ధీశాభబాణోత్కరం
బీవిద్యున్నిభశక్తియున్ రఘుపతీ! ♦ యీవైరినాశార్థమై. ౨౩౫౭

కం. సారథినై యే నుండ బ,లారి దనుజసమితి మున్ను ♦ హరియించినటుల్
సారథినై యే నుండఁగ, నీరావణుఁ ద్రుంపు మిప్పు ♦ డీవు మహాత్మా. ౨౩౫౮

సీ. అనవుడు వలగొని ♦ యభివాదనము సల్పి, భువనముల్ లక్ష్మిచేఁ ♦ బూరటిల్ల
రాముఁడు రథ మెక్కి ♦ రణ మొనరింపఁగ, రోమహర్షణము సం♦గ్రామ మయ్యె
రాముఁడు రథికుఁడై ♦ రాణించుటను గాంచి, దశకంఠుఁ డాగ్రహో♦దగ్రుఁ డగుచు
గాంధర్వశర మేయ ♦ గాంధర్వశరమున, దైవశరం బేయ ♦ దైవమునను

ఆ. రాముఁ డడఁచి వైవ ♦ రాక్షసనాథుఁడు, పరమరోషుఁ డగుచుఁ ♦ బటుమహోగ్ర
రాక్షసాస్త్ర మేయ ♦ రాజతభూషణ,ఫణులు గవిసె రామ♦భద్రుమీఁద. ౨౩౫౯

ఉ. మంటలు గ్రక్కుచున్ మిగుల♦మండెడుమోములతోడ వాసుకిన్
జంటగఁ జెప్ప నర్హమయి ♦ సర్వదిశల్ వెస నాక్రమించుచున్
గంటకపున్విషంబులు ప్ర♦కాశసముజ్జ్వలదీర్ఘభోగముల్
మంటలమారు లైకవియు♦మార్గణము ల్గని నిర్వికారుఁ డై. ౨౩౬౦

కం. గరుడాస్త్ర మేయఁ గార్తస్వరతార్క్ష్యాకారములను ♦ సాయకచయముల్
సరభసగతిఁ జని కాకో,దరనికరముఁ ద్రుంచి వైచెఁ ♦ దత్క్షణమందున్. ౨౩౬౧

మ. తనసర్వాస్త్రము లిట్లు వ్యర్థ మగుడున్ ♦ దర్పించి సంరంభి యై
ఘనదుర్వారశరోగ్రసృష్టి పఱపెం ♦ గాకుత్స్థుపై సూతుపైఁ
దనువుల్ నాటఁగ నొండుబాణమున దో♦ర్దర్పంబు నిండారఁ గాం
చనకేతుం బడ వైచి యశ్వములపీఁ♦చం బార్చె నెం తేవడిన్. ౨౩౬౨

ఉ. వానియసాధ్యకార్యమును ♦ వానివిజృంభణ రామచంద్రుపై
న్దీనతఁ గాంచి సిద్ధముని♦దేవనభశ్చరచారణాదులున్
వానరులున్ విభీషణుఁడు ♦ వావిరి గుందిరి దుఃఖతప్తు లై
మానవభోజియే గెలిచి ♦ మాడ్చు నొకో జగ మంచు నెంచుచున్. ౨౩౬౩

సీ. రామసుధాంశుండు ♦ రావణరాహుచే, సంగ్రస్తుఁ డైనఁ ద♦త్క్షణమునంద
శశికిఁ బ్రియంబు ప్రా♦జాపత్య మగురోహి,ణిని నాక్రమించె నిం♦దునిసుతుండు

ప్రజ కరిష్టంబుగఁ ♦ బ్రజ్వలితాంబుధి, ధూమస్పృష్టోర్మికా♦స్తోమ మగుచు
గ్రహరాజు నంటెడి♦గతి నుబ్బె సూర్యుండు, నీలవర్ణుండును ♦ నిష్ఠురుండు
తే. ద్యుతివిహీనుండు భీకర♦ధూమకేతు, సక్తుఁడు కబంధలక్షణ♦సంయుతుండు
నగుచుఁ దోఁచెను రావణుఁ ♦ డాక్రమింప, బాణసంధానశక్తి గో♦ల్పడియెఁ బతికి.
తే. కోసలేంద్రులకులతార ♦ వాసవాగ్ని, దైవతంబు విశాఖను ♦ ధరణితనయుఁ
డణఁచె వింశతిభుజుఁడు శ♦రాసకరుఁడు, పంక్తివదనుండు మైనాకు♦పగిది నిలిచె.

⟵ శ్రీరాముఁడు విజృంభించి రావణుశూలంబుఁ దునియలు చేయుట. ⟶

ఉ. హానికడిందివీఁక తన♦వారల వెల్వెలఁబోక గాంచి భూ
జాని సురక్తనేత్రుఁడు రు♦షామతియుం భ్రుకుటీద్ధఫాలుఁ డై
వానిని దృష్టిమాత్రమున ♦ భస్మము చేయువిధానఁ జూడఁ గ్రో
ధానను రాముఁ జూచి భయ ♦ మందె సమస్తము లైనభూతముల్. ౨౩౬౬

చం. పుడమి వడంకె, సత్త్వయుత♦భూధరముల్ ధరణీరుహాళితో
గడ గడ లాడె, సాగరుఁడు ♦ గాకుపడెన్, ఖగజాతి మింటిపైఁ
గడుఁ బరుషధ్వనుల్ నెఱపెఁ ♦ గర్కశరావము నించె మేఘముల్
పిడుగులు రాలె, రావణుఁడు ♦ భీతిలెఁ దద్భయదాకృతిం గనన్. ౨౩౬౭

శా. కల్పాంతప్రతిమానభీమతరసం♦గ్రామంబుఁ జూడన్ దివిన్
వేల్పుల్ దానవదైత్యసిద్ధఋషులున్ ♦ విద్యాధరుల్ గూడు చో
స్వల్పాన్యప్రియతన్ రఘూత్తముఁడు గె♦ల్వం గోర బృందారకుల్
జల్పింతుర్ దశకంఠుఁడే గెలువ ను♦త్సాహంబుమై నాశరుల్. ౨౩౬౮

సీ. ఈలోన రావణుం ♦ డెసఁగెడికోపాగ్ని, జానకీవల్లభు ♦ సంహరింప
వజ్రసారము సర్వ♦వైరినిబర్హణం, బతులనాదము పర్వ♦తాగ్రతుల్య
కూటచితంబును ♦ క్రూరంబు దృష్టిభ, యావహంబును సుతీ♦క్ష్ణాగ్ర మధిక
రౌద్రం బనాసాద్య ♦ మద్రిదారణమును, శూలంబు నొక్కటిఁ ♦ గేలఁ బూని
ఆ. మండిపడుచు నెత్తి ♦ చండరవంబున, గర్జ సలిపెఁ బృథివి ♦ గగనతలము
దిశలుఁ గోణములును ♦ దిర్దిర దిరుగంగ, జలధి క్షోభ మొంద ♦ జగము లదర.

చం. కరమునఁ బూని రాక్షసని♦కాయము లుబ్బఁగ రామచంద్రునిన్
బరుషవచస్కుఁ డై యనియెఁ ♦ బార్థివనందన! వజ్రసారమై
పరఁగెడిసాధనం బిదియు ♦ భ్రాతృసహాయుని నిన్నుఁ ద్రుంచి సం
గరహతరాక్షసావళులఁ ♦ గానఁగఁ బంచెడిఁ దోడుగూడఁగన్. ౨౩౭౦

చం. నిలు నిలుమీ నిమేష మిఁక ♦ నీల్గితి నంచును వీచి వైచినన్
గలితమహాష్టఘంట మయి ♦ క్రాయుచుఁ జంచల లభ్రవీథి రా

జలజవిలోచనుండు దృఢ♦సారశరంబులఁ గప్పవహ్నిపై
జలములు చల్లినట్లు రభ♦సంబున వైచిన వాని నన్నిటిన్ ౨౩౭౧

కం. దహనుఁడు మిడుతలపిండును, దహియించినమాడ్కిఁ గూల్చి ♦ తనపై రాఁగన్
మహీపతితనయుఁడు గని దు, స్సహశక్రప్రేషితోరు♦శక్తిన్ వైచెన్. ౨౩౭౨

ఉ. మాతలి తెచ్చినట్టిబల♦మర్దనశక్తియు ఘంటికారవం
బాతతభంగిఁ బర్వఁ జని ♦ యాశరుశక్తిని దాఁక నద్దియున్
ఘాతలమందుఁ గూరె ♦ జవసత్త్వ మఱన్ శకలీకృతంబు నై
భూతము లార్వ వానరులు ♦ బొబ్బలు పెట్టఁగ వేల్పు లుబ్బఁగన్. ౨౩౭౩

ఉ. రాఘవుఁ డంతఁ బోక ఖల♦రావణు తేరిగుఱ్ఱాలఁ దీక్ష్ణభా
ణౌఘములన్ జవం బడఁగ ♦ నాశుగతిన్ ఘటియించి నిస్తులా
మోఘశరాళి దైత్యు నుర♦ముం బగిలించి ఖగత్రికంబునన్
లాఘవ మొప్ప నాతనిల♦లాటము బ్రద్దలు వాఱఁ జేసినన్. ౨౩౭౪

తే. భిన్నగాత్రుండు రక్తసం♦క్లిన్నతనుఁడు, నగుచుఁ బూచునశోకంబు ♦ జిగి వహించి
బాణవేదన సైరింప ♦ వశము గాక, దుఃఖసంతప్తుఁ డై కుందె ♦ దురమునందు.

శ్రీరాముఁడు రావణు నిందించుట.

కం. ముచ్చిరి వెంటనె రోషము, హెచ్చఁగ దశకంధరుం డ♦హీనజవుం డై
చిచ్చుఱములుకుల రఘుపతిఁ, జుచ్చుఱుకున మొగులు కొలఁకు♦సొబగున నించెన్.

చం. ఘనశరపూరితాంగుఁ డయి ♦ కంపము నొందక తచ్ఛరంబులన్
దినకరభానుతుల్యముల ♦ దేవపథంబునయంద త్రుంచుచున్
బెనఁగుచుఁ దద్విముక్తశిత♦భీకరకాండపరంపరాహతిం
దను వెఱవాఱ రాజిలి వ♦నస్థితిపుష్పితకింశుకం బనన్ ౨౩౭౭

మ. ప్రళయాదిత్యునిఁబోలి రాఘవుఁడు క్రూ♦రస్ఫారనారాచధా
రల రక్షోవిభుబింక మాఱ భుజశౌ♦ర్యస్థైర్యముల్ మాన్పినన్
బలియుం డాఖలుఁ డీడఁబోక కురిసెన్ ♦ బాణాళి నన్యోన్యచా
పలతాముక్తకలంబసంతతికృత♦ధ్వాంతంబు నీరంధ్ర మై ౨౩౭౮

మ. కనులం గప్పినఁ దోఁప రై రెవరి క♦క్కాలంబునన్ రాముఁ డి
ట్లనుఁ జిర్నవ్వున రోషవాక్యముల శుం♦ఠా! నీవు నాలేనిచో
మును నాభార్యను బాలికన్ వివశనున్ ♦ మూఢాత్ముఁడా! యాగతిం
గొని తెచ్చిన్ మది నిక్కి పొంగెద విసీ ♦ కూళుండ వీరుండవే? ౨౩౭౯

కం. క్రూరా! మద్విరహిత వెతఁ, గూర వనీస్థలిని సీతఁ ♦ గోమలిని బలా
త్కారంబున హరియించియు, వీరుఁడ ననుకొనియెదే వి♦వేకవిహీనా! ౨౩౮౦

కం. శూరుఁడ వనాథసతులన్, ధీరత మ్రుచ్చిల్లఁ బరస♦తీకాముకుఁడా?
చోరునిగతిఁ గృతి సల్పియు, వీరుఁడ ననుకొనెదవా వి♦వేకవిహీనా! ౨౩౮౧

కం. దూరీకృతమర్యాదా, ధీరరహితా! సాధుమార్గ♦హీనా! బలిమిన్
జేరిచి చేరువ మృత్యువు, వీరుఁడ ననుకొనెదవా వి♦వేకవిహీనా! ౨౩౮౨

కం. పుట్టి కుబేరునకును దోఁ,బుట్టువ వై బలము గలిగి ♦ పోటుమగఁడ వై
దిట్టా జగములు మెచ్చెడు, నట్టిమహాకృతిని జల్పి ♦ తీవు దురాత్మా! ౨౩౮౩

కం. అడిగొట్ట వగుచు లోకము, చెడఁదిట్టెడినీచకృతిని ♦ జేసితి విస్సీ
కుడువుము తత్ఫల మిప్పుడు, వెడఁగా! దురితంబుసేఁత ♦ వృథగాఁ జనునే?

ఉ. సిగ్గును నీకు లే దటర ♦ సీతను జోరునిఁబోలె దుర్గతీ
యగ్గహనంబునన్ బలిమి ♦ నట్లు హరించియు నీవె శూరుఁడం
చెగ్గతి నెంచెదో? యపుడ ♦ యే నట నుండఁగ సీతఁ దాఁకినన్
నిగ్గులు దేఱుబాణముల ♦ నీయనుజన్ ఖరుఁ గూర్పనే నినున్. ౨౩౮౫

ఉ. ఎంతటిభాగ్యమో చెనఁటి ♦ యిన్నిదినాలకు నిన్నుఁ గంటి ని
న్నంతకుఁ జేరఁ బుత్తు నిలు♦మా యిపుడే మణికుండలప్రభా
వంతము శీర్షముం బలల♦భక్షకపక్షులు లాగి లాగి యిం
తింతలుచేసి మ్రెక్కఁ బరి♦హృష్టము లై తనివార నిచ్చెదన్. ౨౩౮౬

కం. నేలపయి నూఱువిధముల, వ్రీలిపడిననీయురంబు ♦ గృధ్రంబులు చం
చ్వాళిం జీల్చుచు క్షతజము, హాళిం బానంబు సేయు ♦ నాపోక చనన్. ౨౩౮౭

కం. మన్నిశితకాండచయుని,ర్భిన్నాంత్రంబులఁ బతంగ♦బృందము లిపుడే
పన్నగుల వైన తేయుని,చెన్నునఁ బడవైచు బ్రదుకఁ ♦ జెల్లదు నీకున్. ౨౩౮౮

రావణురథంబును సారథి మరలించుట.

చం. అని ప్రతిపక్షఘాతమున ♦ కై ద్విగుణీకృతవీర్యముద్బలుం
డును బరమాస్త్రశక్తియును ♦ నూత్నసముత్సుకుఁ డై సమస్తసా
ధనముల లోఁ దలంచుటయుఁ ♦ దక్షిణ మస్త్రములన్ని మ్రోల ని
ల్చినఁ గని తీవ్రవేగుఁ డయి ♦ చిత్తమునన్ శుభచిహ్నలన్నియున్. ౨౩౮౯

చం. గెలు పెటఁగింపఁ బొంగుచుఁ బ్ర♦కృష్టశరంబుల నొంప వాఁడు కీ
శులయుపలంబులున్ మనుజ♦శూరుశరంబులు దాఁకి గుండియల్
గులగులగాఁగ నోటఱియె ♦ గ్రుక్కలు మ్రింగె నలంగెఁ దేజఱిన్
గళవళపాటు చెందె మదిఁ ♦ గాతరతన్ వహియించె డీల్పడెన్. ౨౩౯౦

ఉ. చాపముఁ బట్టలేఁడు శర♦సంతతిఁ గూర్పఁగ లేఁడు జ్యాలతన్
గోపునఁ గట్టలేఁడు ప్రతి♦కూలశరంబులఁ ద్రుంపలేఁడు వే

పైపయి దూఁకు బాణముల♦పై నిగిడించుపృషత్కసంఘ మే
దో పెరమార్గముం గొనెడిఁ ♦ దోఁప దొకింతయు దేహవిస్మృతిన్. ౨౩౯౧

తే. కాలునకు గోచరించిన♦కరణి నున్న, రథికుగతిఁ జూచి సారథి ♦ రణధరిత్రి
దైత్యవరుఁ[1] డున్నఁ జచ్చుట♦సత్య మనుచు, నెంచి మెల్లఁగ ననిఁ దొలఁ♦గించెరథము.

—— రావణుఁడు సారథిని దూషించుట. ——

చం. అనికిఁ దొలంగ దవ్వుగ శ♦తాంగముఁ దెచ్చిన సూతుఁ జూచి యి
ట్లనియెఁ గృతాంతచోదితసు♦రాహితుఁ డాగ్రహరక్తనేత్రుఁ డై
వినర యశక్తునట్లు బల♦విక్రమపౌరుషహీనుమాడ్కి భీ
రునిగతి మానహీనువలె ♦ రోషవివర్జితుపోల్కి దుర్మతీ! ౨౩౯౩

ఉ. ఏమిటి కీరథంబు నిపు ♦ డీడకుఁ దెచ్చితి శత్రుసన్నిధిన్
నామదిచొ ప్పెఱుంగక య♦నాదరబుద్ధిని నిచ్చవచ్చిన?
ట్లేమయి పోయె నస్త్రతతు ♦ లే మయి పోయెర నాదుమాయ లి
స్సీ మరియొంద దప్పి చెనఁ♦టీ పరువంతయుఁ బాడు చేసితే. ౨౩౯౪

కం. చిరకాలసమార్జిత మై, పరఁగిననాయశము తేజు ♦ బలమును నీచా!
దురమున వెనుదీయం డా,శరపతి యనునమ్మకంబు ♦ సమసెను నీచేన్. ౨౩౯౫

కం. భువనప్రసిద్ధవీర్యం, డవిరళబలరంజనీయుఁ ♦ డరి కనుచుండన్
బవరమున కానసడునా,బవి సార్చితె దేబెభంగిఁ ♦ బాపాత్మకుఁడా! ౨౩౯౬

సీ. పరుని పై రథమును ♦ బఱపక మూలకు, నిటు తెచ్చితివె దేహ ♦ మెఱుఁగ లేక
నామేలు కోరెడు♦నాసుహృదుం డిటు, సలుపునా యెప్పుడైనఁ ♦ బలువ తూళ?
పగతుండు సలుపంగఁ ♦ దగుకార్య మిది గాక, నీయట్టివానికి ♦ నీతి యగునె?
నీ విట్టు సేయుట ♦ నిక్కంబు పరులచే, నేదియో మే లొంది ♦ తీవు దుష్ట

ఆ. నాదుసొమ్ము బహుది♦నంబుల నుండియుఁ, దినుట మఱవ వేని ♦ దీర్ఘకాల
మీవు నన్నుఁ గొలిచి♦యెసఁగుట తలఁ తేని,రథముఁ బఱపు మతఁడు♦రాకమున్న.

—— సారథి రావణునకు సమాధానము చెప్పుట. ——

కం. మతిమాలిన యసురేశుఁడు, హితమతి యగుతనదుసూతు ♦ నిటు నిష్ఠురభా
షితముల నన నాతఁడు కడు,హితముగ సానునయసూక్తి ♦ నీగతిఁ బలికెన్. ౨౩౯౭

చం. వెఱచినవాఁడఁ గాను, మఱి ♦ వెంబరవిత్తను గాను, మార్తుచే
నెఱి చెడి కానుక ల్గొనిన♦నీతివిహీనుఁడఁ గాను, నేను మై
మఱచినవాఁడఁ గాను, గొఱ♦మాలినవాఁడను గాను, నీదు మేల్
మఱచినవాఁడఁ గాను, విను♦మా చెలికారము మాన నే నెదన్. ౨౩౯౮

[1] దైత్య - దానవ - రాక్షసాసుర జాతులు భిన్నములైనను గవిసమయమున నివి పర్యాయపదము లుగ వాడఁబడును. వీరిలో వీరికిఁ బరస్పరవైషమ్యమును గలదు. రావణాసురుని కీడు రోయువారు దానవాసులఁ గలరు.

కం. నీకల్యాణమె కోరుచు, నీకీర్తిం గాచువాఁడ ♦ స్నేహావశమునన్
నీ కేను బ్రియము సేయఁగ, నీకది యప్రియము దోఁచె ♦ నే నేమందున్. ౨౪౦౦

సీ. ఈవిషయంబున ♦ దేవ! నానుడి విను, తావకప్రియహితా ♦ త్మకుఁడ నేను
నేదియో కులమునఁ ♦ బ్రాదుర్భవించిన, యులుచ యోతరిపోలెఁ ♦ దలఁప వలదు
నన్ను నున్నతభూమి ♦ నున్నవాహినిఁ గ్రిందఁ, దెచ్చినగతి నీదు ♦ తేరి నిప్పు
డనిలోన మరలించి ♦ నట్టివిధంబును, సర్వంబు వినిపింతుఁ ♦ జక్క విసుము

ఆ. బవరమునను మిగుల ♦ బడలిక గని తని, గెలివి లేమి మోము ♦ తెలివి లేమిఁ
దలఁచినాఁడ గుఱ్ఱ ♦ ములు సుడినడి డస్సి, డీలుపడుచుఁ జెమట ♦ జాలువాఱ

తే. అధికవృష్టిని మేడ్పడు ♦ నా లనంగఁ, దోఁచె; నెన్నియొ శకునముల్ ♦ దుష్టఫలము
లన్ని యగపడె; నిట్టిచో ♦ నసురనాథ!, సూతునకు నర్హకృత్యంబు ♦ రీతి వినుము.

సీ. దేశకాలంబుల ♦ తెఱఁగు లెఱుంగుచు, నశుభశుభాంకంబు ♦ లరసి కొనుచు.
రథికునిముఖమునఁ ♦ గ్రాలెడిదైన్యంబు, ఖేదంబు తెంపును ♦ మోద మెఱిఁగి
రాజుబలాబల ♦ తేజంబు లరయుచుఁ, బల్లంబు మిట్టల ♦ భంగిఁ గనుచు
సమవిషమస్థలీ ♦ క్రమము లూహించుచు, సమరకాలంబును ♦ జక్కఁ దెలిసి

తే. పరులరంధ్రంబు వెదకుచుఁ ♦ బగతునకును
బ్రక్క యెదురుగఁ బిఱిఁదికిఁ ♦ బఱచు వేళ
లిన్ని కనిపెట్టి రథికున ♦ కేవిపత్తు
రాకయుండఁగఁ జేత సా ♦ రథికిఁ దగవు. ౨౪౦౩

ఉ. వాజులగాసి దీఱఁగ, భ ♦ వచ్ఛ్రమముం దొలఁగింప, నీదుని
స్తేజత ఖేదముం దొలఁగఁ ♦ జేసితిఁ గాని స్వతంత్రవృత్తి నో
రాజ! యొనర్ప లేదు, పతి ♦ రాగపరీతుఁడ, నమ్ము మింక నే
యోజ నొనర్పు మన్న నటు ♦ లొప్పుగఁ జేసెద రాక్షసేశ్వరా! ౨౪౦౪

కం. తీరుపఁగా నీదుఋణం, బేరీతి ఘటింపు మన్న ♦ నేఁ గడఁగెద నా
సారథివాక్యంబుల వే, సారులు మెచ్చుచును రాక్షస ♦ ప్రభు వనియెన్. ౨౪౦౫

కం. పోనిమ్ము స్యందనము సీ, తానాథున కభిముఖముగఁ ♦ దడయకుమీ ర
క్షోనాథుఁ డహితునునుఱుక, మానుపకే దప్పనుండి ♦ మరలఁడు వింటే. ౨౪౦౬

కం. అని సంతసించి రావణుఁ, డనుపమహస్తాభరణము ♦ నాతని కీయన్
దనుజేంద్రుముదల స్యందన, మును సారథి పఱపె రామ ♦ భూవరుమీఁదన్. ౨౪౦౭

## అగస్త్యుఁడు శ్రీరామున కాదిత్యహృదయం బుపదేశించుట.

కం. అంతట సంగ్రామపరి, శ్రాంతునిఁ జింతాకులాత్ము[1] ♦ రక్షోనాథున్
బ్రాంతంబునఁ గని రణపి, క్రాంతికి మును నిలిచి యున్న ♦ రఘురామవిభున్. ౨౪౦౮

[1] చింతాకులాత్మున్ = పరత్వముఁ బ్రకటింపక యెట్లు వీనిఁ జంపుదునాయని యాలోచించు రామవిభునిన్.

కం. వ్యోమంబున వారలసం,గ్రామంబును జూడఁ గోరి ♦ గమి గొనినదివౌ
కోమండలితో నుండెడి, శ్రీమహితుఁ డగస్తి రాముఁ ♦ జేరి వచించెన్. ౨౮౦౯

కం. శ్రీరామ రామ! విను శ్ర,ద్ధారతి గుహ్యంబు మఱి స♦దాతన మిది నీ
వైరుల నెల్లర సంగర,ధారిణి నిద్దాన గెలిచె♦దవు దీర్ఘభుజా! ౨౮౧౦

సీ. ఆదిత్యహృదయంబు ♦ శ్రీదంబు పుణ్యంబు, నఖిలవిరోధిసం♦హారకంబు
పరమశివంబును ♦ భద్రకారణమును, నిత్య మక్షయ్యంబు ♦ నిఖిలపాప
విదళనక్షమమును ♦ విజయకారణమును, శోకచింతాదిని♦షూదనంబు
నుత్తమమంత్ర మా♦యుర్వర్ధనము సర్వ,మంగళమాంగల్య♦మహితయశము

తే. భక్తి జపియింపఁ; దన్నమా♦హాస్యమాను, రశ్మిమంతు సముద్యతు ♦ రవిసురాసు
రాదివందితు భాస్కరు ♦ నఖిలలోక,వల్లభునిఁ గొల్వుమీ వివ♦స్వంతుఁ దండ్రి.

సీ. ఈతండె తేజస్వి ♦ యీతండు సర్వదే,వస్వరూపుఁడు రశ్మి♦భావనుండు
ఈతండ సుమి సర్వ♦బృందారకాసుర,గణము జగం బోముఁ ♦ గరచయముల
నీతండె బ్రహ్మయు ♦ నీతండె విష్ణువు, స్కందుండు శివుఁడు ప్ర♦జాపతియును
నితఁడెమహేంద్రుఁడు♦నీతండెధనదుండు,యముఁడుకాలుఁడుసోముఁ♦డప్పతియును

తే. నితఁడె పితరులు వసువులు ♦ నీతఁ డితఁడ
మరుతులును సాధ్యు లశ్వులు ♦ మనువు నితఁడె
వాయువును వహ్నియును బ్రజా♦ప్రాణ మితఁడె
భద్రగుణ! ఋతుకర్త ప్ర♦భాకరుండు. ౨౮౧౧

## ఆదిత్యహృదయము.

సీ. నీవె యాదిత్యుండ ♦ వీవె సవితృఁడవు, నీవె సూర్యుండవు ♦ నీవె ఖగుఁడ
వీవె పూషుండవు ♦ నీవె గభస్తిమం,తుండవు హేమరే♦తుండ వీవె
భానుండు తపనది♦వాకరులును నీవె, నీవె సుపర్ణుండ ♦ వీవె త్వష్ట
హరిదశ్వుఁడవు సహ♦స్రార్చివియు మరీచి,మంతుండవును నంశు♦మంతుఁడవును

తే. సప్తసప్తివి తిమిరారి ♦ శంభు వీవ, నీవ మార్తండుఁడవు రవి ♦ వీవ యగ్ని
గర్భుఁడవు శంఖుఁడవును భా♦స్కరుఁడ వీవ, శిశిరనాశనతపనులు ♦ శిశిర మీవ.

ఉ. నీవె హిరణ్యగర్భుఁడవు ♦ నీవదితిప్రియపుత్త్రుఁడుఁ సువ
హ్నావహుఁడుఁ నభోధవుఁడ ♦ వహ్నులమిత్రము భక్తహృత్తమో
భావవిభేదివిఁ నిగమ♦పారగుఁడుం గవిరాజు వింధ్యవీ
థీపరవర్తనీప్లవగ ♦ దేవ సమస్తభవోద్భవుండవున్. ౨౮౧౪

తే. పింగళుండవు మృత్యువు ♦ విశ్వ మీవు, నాతపివి మండలివియు స♦మస్తతాప
నుండు రక్తుండు భూరి తే♦జుండు విశ్వ,భావనుఁడు ఖగతారోడు♦పతివి నీవు. ౨౮౧౫

కం. తేజస్వులలో మిక్కిలి, తేజస్వివి ద్వాదశాత్మ ♦ దిననాయక దే
వా జయభద్రా జయ యం,భోజధవా నీ కివే న♦మోవాకంబుల్. ౨౪౧౬

కం. మ్రొక్కెదఁ బ్రాక్శైలమునకు, మ్రొక్కెదఁ జరమాచలంబు♦ మ్రొక్కు గ్రహకుల్
మ్రొక్కెద జ్యోతిర్గణపతి, మ్రొక్కెద హర్యశ్వసకును ♦ మ్రొక్కెద జయునిన్.

సీ. మ్రొక్కెద నాదిత్యు ♦ మ్రొక్కెద వేవెల్గు, మ్రొక్కెద సారంగ♦మూర్తి వీరు
మ్రొక్కెద మార్తండు♦ మ్రొక్కెద బ్రహ్మేశ్వ,రాచ్యుతు నాదితే♦యార్చి సూర్యు
భాస్వంతుని సమస్త♦భక్షు రౌద్రాకారు, విశ్వకర్మఁ దమోఘ్ను ♦ విశ్వసాక్షి
నమితాత్ము శత్రుఘ్ను ♦ హిమవైరిని దమోభి,నిఘ్నుఁ దప్తస్వర్ణ♦నిభుని వహ్ని
తే. గ్రహపతిని గృతఘ్నఘ్నునిఁ ♦ గంజహితుని
మ్రొక్కెద సమస్కరించెద ♦ మోడ్పుఁగేలు
గూర్తు నంజలి ఘటియింతు ♦ గొణిగె లోలిఁ
జన్నిపూ ల్నతు లిచ్చుచు ♦ సన్నుతింతు. ౨౪౧౭

కం. భూతములఁ ద్రుంచి మఱి త,ద్వ్రాతముల సృజించి మనుచు♦ ప్రభు వీతండే
యీతఁడె తపియింపించును, నీతండె కరాళిచేత ♦ వృష్టిం గురియున్. ౨౪౧౮

చం. భువనము నిద్రపోవుతఱి ♦ పొల్పుగ నీతఁడె జాగరూకుఁ డౌ
దవఁగ సమస్తభూతములఁ ♦ దాఁ బరినిష్ఠితుఁ డీతఁడే శ్రుతుల్
సవములు నగ్నిహోత్రులఫ♦లంబు క్రతుల్ఫల మగ్నిహోత్రుఁ డిం
కెవి భువిఁ గృత్యముల్ సకల ♦ మీరవియే ప్రభుఁ డెల్లవానికిన్. ౨౪౨౦

కం. అనునీమంత్రం బాపద,లను గష్టములందు వనము♦లను భయవేళన్
జననాథ నరుఁడు కీర్తిం,చిన దుఃఖపడండు నిజము ♦ సీతానాథా! ౨౪౨౧

కం. ఏకాగ్రమనస్కుఁడ వై, లోకపతిన్ దేవదేవు ♦ లోకేశునిన్
బ్రాకటమతిఁ బూజింపుము, శ్రీకర ముమ్మాఱు చదువ ♦ సిద్ధము జయమౌ.

కం. ఈనిమిషమునన్ రావణు, మానితభుజశౌర్య నీవు ♦ మ్రందింతు వటం
చీ నెఱి వచించి యంత, ర్ధానంబును జెంది ముని య♦థామతి నరిగెన్. ౨౪౨౩

చం. ఇది విని దివ్యతేజుఁడు మ♦హిష్ఠముదంబున మంత్ర మూని నె
మ్మది వ్యసనంబు మాని రవి♦మండలముం గనుచున్ జపించి హృ
త్పదవిఁ ద్రివారముల్ శుచిత ♦ వార్చి శరాసముఁ బూని రావణుం
గదనములోనఁ జంప మతి ♦ గైకొని యుద్ధము సేయఁ బూనఁగన్. ౨౪౨౪

కం. రామునిజపమున రవియును, సామోదహృదబ్జుఁ డగుచు ♦ ననురపతివధన్
దా మది ననుగ్రహించుచు, నామరగణమధ్యగుఁడు ర♦యంపడు మనియెన్.

రావణుఁడు మరల రాముమీఁదికి యుద్ధమునకు వచ్చుట.

సీ. శాత్రవవాహినీ♦సంప్రధర్షణమును, గంధర్వనగరని♦కాశమూర్తి
యున్నతధ్వజము సం♦పన్నజాంబూనద,హారవిరాజిత♦హయయుతంబు
యుద్ధోపకరణస♦మిద్ధంబు నై మిన్ను, మ్రింగెడినో యన♦ రంగుమీఱి
యవని వణంకఁగ♦ నహితులు గ్రుంగఁగఁ, దనసైన్యములు పొంగఁ♦ దనరుదాని

తే. రావణురథంబు నడపె సా♦రథి నితాంత,హృష్టుఁ డై శీఘ్రముగ నిట్టు♦లేగుదెంచు
ప్రబలనిస్స్వనమును గృష్ణ♦వాజియుతముఁ, జంచలాధ్వజగహనంబు♦సారతరము

కం. ఇంద్రాయుధోపమాయుధ,సాంద్రంబును రౌద్రకాంతి♦సంకలితము ని
స్తంద్రాంబుదధారోపమ,రుంద్రశరాసారపతన♦రూక్షురథంబున్. ౨౪౨౭

శ్రీరాముఁడు మాతలిని హెచ్చరికగ నుండఁ జెప్పుట.

చం. కనుఁగొని బాలచంద్రనత♦కార్ముకముం గులిశాభిమృష్టమై
తునియలువాఱుశైలతతి♦తోరపుమ్రోఁతఁ జెలంగుదానిఁ గై
కొని సురనాథుసారథిని♦ గూర్చి వచించెను గంటె మాతలీ!
మనపగవాని తేరి నస♦మానజవంబున వచ్చువైఖరిన్. ౨౪౨౮

ఉ. చావఁగఁ గోరి తాన యప♦సవ్యముగాఁ జనుదెంచుచున్నవాఁ
డీవును నిందు హెచ్చరిక♦ నేగు మెదుర్కొని మారుతుండు ప్రో
ద్భావఘనంబునుం జెదరఁ♦ దాఁచువిధంబున రూపుమాపెదఁ
రావణు, నేఁ దదేకమతిఁ♦ గ్రాలెద వాలెద విక్రమంబునన్. ౨౪౨౯

ఆ. దృష్టి చెదరనీక♦ హృదయ మేకాగ్రత, నిలిపి డీలుపడక♦ కలఁగిపోక
భ్రాంతమతివి గాక♦ పగ్గముల్ విడుచుచోఁ, లాగుచోట నెఱపు♦ లాఘవంబు.

చం. అఱగొఱలేక వాసవుశ♦తాంగము దిద్దెడునంతవానికిన్
గఱదలు నేను జెప్పుదునె♦ కార్యభరంబునఁ జిత్త మంతయున్
గుఱికొని యుద్ధమంద యిడి♦కొందును గావున హెచ్చరించితిన్
గఱపుట కా దటన్న గిరి♦ఖండనుసారథి ప్రీతచిత్తుఁ డై. ౨౪౩౦

తే. అసురపతిరథ మపసవ్య♦ మగువిధాన
ధరణిరజ మరిఁ గప్ప ర♦థంబుఁ బఱప
రావణుఁడు కింక నెదు రేగి♦ రాము నేసెఁ
గాండకాండముల్ దండోప♦దండములుగ. ౨౪౩౧

రావణుమరణంబుఁ దెలుపుచిహ్నంబు లగపడుట.

తే. ధర్షణామర్షితుండు సీ♦తావిభుండు, రోషభీషణుఁ డయి ధైర్య♦భూషణుండు
వజ్రిచాపంబుఁ గొని యేసె♦భానురశ్మి,సమమహాప్రభముల శాత♦సాయకముల.

ఉ. రావణరామచంద్రులు ప♦రస్పరనిర్జనాభిలాషులై
చేన దలిర్ప మత్తవన♦సింహయుగంబులపోల్కిఁ బోరుచో
దేవత లభ్రవీథి గుమి♦గూడిరి మహారథయుగ్మయుద్ధ మా
పోవక చూచి రెప్పు పోరి♦పోవునొ రావణుఁ డంచుఁ గోరుచున్. ౨౮౩౪

కం. రావణునాశము ధరణిసు, తావిభువిజయంబుఁ దెలుప ♦ దారుణమయి మేన్
వావిరి గగ్గురు పొడువఁగ, నావేళను లక్షణంబు ♦ లగపడఁ జొచ్చెన్. ౨౮౩౫

సీ. రావణురథముపై ♦ రక్తవర్షము వ్రాలె, సుడిగాలి డాచుట్లు ♦ చుట్టి విసరెఁ
వానిశతాంగము♦బడిఁ బెనుగ్రద్దలు, గుములుగ మింటను ♦ గూడి యాడె
దాసనపుంబువ్వు♦తర మైనడాలున, సంధ్య లంకాపురి ♦ సవరించె
దినమయ్యుఁ దత్కాంతిఁ ♦ దేజరిల్లె ధరిత్రి, మండెడుభంగి భీ♦మంబుగాఁగఁ

ఆ. దోఁకచుక్క లురలెఁ ♦ దోరంపుఁబిడుగులు, పడియె నసురచయము ♦ పల్లటిల్ల
సోఁకు లనిని గపులఁ ♦ దాఁకుచో వారిహ, స్తంబు లెవరొ బిగియు♦చంద మయ్యె.

కం. రావణుని తేరు చనియెడి, చో వసుధ వణంకుచుండె ♦ సూర్యమరీచుల్
రావణునంగముపైఁ బడెఁ, గావి పసిమి తెల్ల కళియ♦కాంతులతోడన్. ౨౮౩౭

కం. వెంబడి వచ్చెడిపెనుగృ, ధ్రంబులు ముఖములను మంట ♦ గ్రక్కుచుఁ దద్వ
క్త్రంబును గని యశివనినా, దంబులు గావించె దెసల ♦ దళ మయ్యె నిరుల్.

సీ. ప్రతికూలవాయువుల్ ♦ పాంసుజాలంబుతో, రావణాసురు దృష్టి♦ద్రఢిమఁ జెఱిచె
నుఱుములు లేకయె ♦ యురలె నిం ద్రాశను, లందందు సైన్యంబు♦నందుఁ గలయఁ
బాంసువర్షంబునఁ ♦ బరికింపరా దయ్యె, జలధరమార్గంబు ♦ సైన్యములకు
శారికాకోటులు ♦ జగడంబు లాడుచుఁ, బరుషధ్వనులతోడఁ ♦ బడియె దేరఁ

తే. గటుల జనియించె విస్ఫులిం♦గములు కనుల, నూరె నీరంబు బాబాల ♦ కొక్కసారి
యిట్టియుత్పాతములు రాక్ష♦సేంద్రుకీడు, పలువిధంబులఁ దెలిపెను ♦ భండనమున.

కం. రామునకును సౌమ్యంబులు, క్షేమావహములును నైన♦చిహ్నము లయ్యెన్
రాముఁడు వానిని గని మది, నామోదం బొందెఁ జచ్చె ♦ నసురుం డనుచున్.

వానరరాక్షసులు రామరావణయుద్ధంబు దిగ్భ్రమగొని చూచుట.

శా. హర్షోల్లాసవికాసభాసురముఖుం ♦ డై రామచంద్రుండు జ్యా
కర్షారావము ఘోర మై పరఁగ వీఁ♦కం బాణపాతంబులన్
ధర్షించెన్ సురవైరి వాఁడును రణో♦త్కంఠన్ మహాశస్త్రముల్
వర్షించెం ద్రిజగద్భయానకముగా ♦ వర్తిల్లెఁ దజ్జన్యమున్. ౨౮౪౧

ఉ. మర్కటసైన్యముల్ దనుజ♦మండలియున్ రణకాంక్ష గల్గియున్
గర్కశసాధనావళులు ♦ గ్రాలుకరంబులతోడ రాక్షసే

శార్కకులీనభండనము ♦ నక్కఱిఁ జూచుచుఁ జేష్ట లేది సం
తర్కముతోఁ దదేకమతిఁ ♦ దప్పనిచూడ్కులఁ జూచె నెంతయున్.　४४४२

కం.అబ్బురపడు మనములతో, నిబ్బరపడి నిలిచి డాయు♦నిజశత్రులపై
దెబ్బమి దీయ రిరుదెస, నబ్బలియుల పోరు చూచు♦నఖిలామమునన్.　४४४३

కం.రావణుఁ గను నసురులు నీ,తావిభుఁ గనువానరులును ♦ దతవిస్మయఫు
ల్లావిఘ్నాలోకనముల, వా విచ్చి రహింత్రు సాల♦భంజికలట్లై.　४४४४

⟶ శ్రీరాముఁడు రావణుధ్వజంబు నఱకుట. ⟵

శా.అంతన్ రావణరాఘవుల్ నిజనిమి♦త్తాళీసమీక్షోద్యధ
స్వాంతుల్ లేశము నీను డింపక భయం ♦ బావంతయున్ లేక దు
ర్దాంతప్రౌఢిఁ బోరుచో నసుర మ♦ర్త్యవ్యం బటంచున్ ధరా
కాంతుండున్ విజిగీష స్వస్వబలవి♦క్రాంతుల్ సమగ్రంబుగన్.　४४४५

శా.హోరాహోరి పెనంగుచో సురపరుం ♦ డుగ్రోగ్రదుర్వారన
న్నారాచోత్కరముల్ నిగిడ్చె ధరణీ♦నాథధ్వజం బంటఁ ద
న్నారాచంబులు దానిఁ దాఁకక ధరన్ ♦ వ్యర్థంబులై రాలుడున్
శ్రీరాముండు ప్రతిక్రియం జలుప నెం♦చెన్ వంచె విల్లుద్ధతిన్.　४४४६

కం. తెగ నిండఁ దిగిచి యొక్కటి,ఖగముం బరఁగింపఁ ద్రుంచి ♦ క్రవ్యాదు ధ్వజం
బొగిమహిఁ జొచ్చెను వేగమ,బిగిచెడి యది యురలె వాని♦బీరముపోలెన్.　४४४८

చం.ధ్వజ మిటు గూల రావణుఁడు ♦ దారుణరోషపరీతచిత్తుఁడై
భుజబల మెల్లఁ జూపి రఘు♦భూవరువాజుల ముంచె నమ్ములన్
గజిబిజిలేక తామరస♦కాండహతంబులుఁ బోలె సైంధవ
వ్రజములు స్వస్థతన్ వెలసె ♦ వానిని జూచి సురారి వెండియున్.　४४४७

కం.మాయావిహితశరంబుల, నాయసపరిఘముల గదల ♦ నతిభీకరచ
క్రాయతశూలపరశ్వధ,సాయకగిరిశృంగవృష్టి ♦ సాధ్వసదముగన్.　४४४९

కం.ఆకసము భూమి నిండ న,నేకంబులు శస్త్రసమితు ♦ లెల్లెడఁ బఱపెన్
గాకుత్స్థనరథము దక్క న,నీకమ్ము నిరంతరముగ ♦ నిండెన్ వానన్.　४४५०

శా.ఏకోద్యోగవిజృంభమాణుఁ డయి దై♦త్యేశుండు నశ్రాంత మ
వ్యాకీర్ణం బగుచిత్తవృత్తి శరసా♦హస్రంబు కీశావళుల్
చీకాకుం గొన నేసె నేయుటయు శ్రీ♦సీతేశుఁడున్ సుస్మిత
వ్యాకోచాననుఁడై నిజాస్త్రసమితిన్ ♦ వైశంబపై వైచినన్.　४४५१

చం. వడిగొని నూర్లు వేలుగను ♦ వచ్చెడి రాముశరాళిఁ గాంచి తా
నుడుగక యట్లపైపయి స♦ముగ్రత వైచె సురారినాథుఁడున్
గడుకొని వారిబాణముల ♦ ఖస్థలి సాయకబద్ధమైనకై
వడిఁ బొలుపారి రెండవన♦భం బనఁ బందిరి వైచినట్టులై. ౨౪౫౨

కం. గుఱి తప్పదు వ్యర్థం బై, పఱి వోవద యెదిరిఁ బఱియ ♦ పాపక పోది
ద్దఱిశరముల నొక టేనియు, బిఱుసేదదు వాఁడి చెడదు♦పిఱువో దనిలోన్. ౨౪౫౩

సీ. ఒండొరుబాణంబు ♦ లొండొంటి ఢీకొని, తుత్తుమురై నేలఁ ♦ దూలిపడఁగ
సవ్యాపసవ్యసం♦చారభేదంబుల, నెఱపుచు విశిఖముల్ ♦ పఱపి పఱపి
రావణుహయముల ♦ రాముండు రాముని, హయముల రావణుం ♦ డడిచి యడిచి
కృతికిని బ్రతికృతి ♦ ద్రుతగతిఁ జలుపుచు, నొక్కముహూర్తం బిట్టు ♦ లుక్కుమెఱసి
ఆ. యీడఁబోక యిద్ద ♦ ఱేటాడు చుండఁగ, సకలభూతములును ♦ సంభ్రమమున
వెఱగుపాటుతోడ ♦ వీక్షించు చుండెను, గాన మెన్నఁ డిట్టి♦కల నటంచు. ౨౪౫౪

## రావణుఁడు భీమంబుగ శ్రీరాముతోఁ బోరుట.

సీ. దాయుచుఁ బాయుచుఁ ♦ దద్దయుఁ గదియుచు, నన్యోన్యము వధింప ♦ యత్నపడుచు
నొండొంటిఁ జుట్టుచు ♦ నొరయు నట్లరుగుచు, నిండారు తేజున ♦ మండిపడుచు
విచ్చుచు జవమున ♦ హెచ్చుచుఁ బగడీలు, పుచ్చుచు నెదురు త♦ప్పులను గనుచు
సారథిసారథ్య♦సామర్థ్యమునఁ జేసి, చిత్రయానంబులఁ ♦ జెలువు మెఱసి
ఆ. రథయుగంబు నప్డు ♦ రావణరాఘవుల్, డాయుచోట మరలఁ ♦ బాయుచోట
గమనజవము వెలయఁ ♦ గాండము ల్గురియింప, వారివాహయుగము♦భాతిఁ దనరె.

ఉ. ఏవును నేపునుం గ్మెఱయ ♦ నీగతి నిద్దఱుఁ జిత్రభంగి సా
టోపగతిం జరించుచుఁ గ♦డు న్వడి నెట్టెదు రాచు వర్ధిలం
గోపము కాఁడికాఁడియును ♦ గుజ్జుముమూఁటియు మూఁటి టెక్కెముల్
చేపడి ఢీకొనం బఱవఁ ♦ జేసిరి వారిశతాంగ రాజముల్. ౨౪౫౬

ఉ. అట్టియెడం గ్రఘుప్రవరుఁ ♦ డాశరనాయకు నాల్గువాజులం గ్
గొట్టెను నాల్గుబాణములఁ ♦ గ్రూరతఁ దత్తఱు లోసరిల్లినన్
నెట్టన దీర్ఘరోషి రజ♦నీచరవర్యుఁడు రామచంద్రుపై
గుట్టలు గొట్టుశస్త్రమున♦కుం దులఁదూఁగెడిముల్కు లేసినన్. ౨౪౫౭

తే. బంతి నేరులయొడయని♦పట్టి వాని, తాఁకునను నోవు గొనక ని♦తాంతశాత
సాధనము లేసె దాని కా♦శక్రవైరి, సారథిని నేసె నిరుపమ♦సాయకముల. ౨౪౫౮

కం. మాతలియును దద్విశిఖా, పాతంబులఁ జీమకుట్టు♦పాటియు నొవ్వేఁ
భీతియు మోహము గానక, శ్రీతఱుఁగక యుండె నసుర♦శేఖరుఁ డిట్టుల్. ౨౪౫౯

కం.తనసారథి నొప్పించినఁ,దను నొంచినఁ గనలనట్టి ♦ ధైర్యనిధి రుషాఁ
తనురక్తాననుఁ డై యసు,రుని విముఖుని జేసె బహుళ♦రూక్షేషువులన్. ౨౪౬౦

చం.ఇరువది ముప్పదిన్ నలువ ♦ దేఁబది యర్వది నూఱు వేలు భీ
కరశరవార మొక్క మొగి ♦ గాత్రము తూఁటులు వోవ నేయుడున్
సురపరిపంథి శాతతర♦శూలగదాపరిఘాదిసాధనో
త్కరముల నేసెఁ బెన్రవము ♦ దద్దయు దిక్కులఁ బిక్కటిల్లఁగన్. ౨౪౬౧

శా.నారాచంబులు చొచ్చురాయిడికి నా♦నాభంగి క్షోభిల్లెఁ గూ
పారంబుల్, సుతలాలయుల్ విషధర♦ప్రాగ్ర్యుల్ మహావేదనన్
గూరం జొచ్చిరి, దానవుల్ బెగడి గ♦గ్గో లొంది రెంతేని, కాం
తారక్ష్మాధరయుక్తభూవలయ మా♦ర్తం బయ్యెఁ గంపించుచున్. ౨౪౬౨

తే. కాంతిఁ గోల్పడెఁ బద్మినీ♦కాంతుఁ డపుడు
గతులు చెడి మ్రానుపడె సదా♦గతియు సిద్ధ
విబుధగంధర్వపరమర్షి ♦బృందమెల్ల
దిక్కు దోఁపక చింతచే ♦ దీన మయ్యె. ౨౪౬౩

సీ. స్వస్తి గోబ్రాహ్మణే♦భ్యోస్తు లోకాస్సమా, శ్శాశ్వతాస్తిష్ఠన్తు ♦ చణ్డసమితి
విజయతాం రాఘవో ♦ విశ్వవిద్వేషిణం, రాక్షసనాయకం ♦ రావణంచ[1]
యని జపించుచు నాత్మ♦లను నిరీక్షింపఁగ, రోమహర్షణ మైన♦భీమజన్య
మమరులు గంధర్వ ♦ లసమానతత్సంప్ర,హారంబుఁ గనుఁగొని ♦ యబ్రపడుచు

ఆ. నభ్రమునకు నభ్ర ♦ మంబుధి కంబుధి, రామరావణోగ్ర♦రణమునకును
రామరావణోగ్ర♦రణమె సమం బని, చూచు చుండి రపుడు ♦ శుద్ధమతుల.

## శ్రీరాముఁడు రావణు శిరంబు నఱకుట.

శా.చండామర్షవిభీషణుండు రఘువం♦శక్ష్మీరవారాశిచం
ద్రుం డాశీవిషతుల్యసత్క్షురముఁ దో♦డ్తోఁ బూని రత్నోజ్జ్వల
చ్చండాంశూపమకుండలాంచితము శీ♦ర్షం బంత ఛేదించె బ్ర
హ్మాండం బంతయుఁ జూచె రావణుప్రధా♦నాంగంబు నేలం బడన్. ౨౪౬౪

ఉ. ఆతల యట్టిదే మొలచె ♦ నచ్చటనే యపుడే నృపోత్తముం
డాతతవేగహస్తుఁ డయి ♦ యద్ది హరింపఁగ వెండి మొల్చె నీ
తాతరుణీవిభుం డడియుఁ ♦ దప్పక త్రుంపఁగ వెండి మొల్చె నా
క్ష్మాతలభర్త నూఱునొక♦మాఱును ద్రుంచె సురారిమూర్ధముల్. ౨౪౬౫

కం.త్రుంచినవెంటనె తల మొల,చెంచెడినే కాని వాఁడు ♦ తెగియెడిభంగుల్
గొంచెము దోఁపమికిం జిం,తించెం జిత్రం బటంచు ♦ నృపతిలకుండున్. ౨౪౬౬

[1] వక్తలు దేవతలు ఋషులుగావున దేవభాషయందు వ్రాయఁబడియె.

సీ. మారీచుఁ జంపితి ♦ మడియించితిని ఖరు, దూషణుఁ ద్రుటిలోనఁ ♦ ద్రుంపఁ గంటిఁ
క్రౌంచవనస్థు వి♦రాధు మ్రందించితి, దండకను గబంధు ♦ దారితాంగుఁ
జేసితి నెప్పుడు ♦ వీసరవోవవ, యస్త్రశస్త్రములు ప్ర♦త్యాయికములు
నేఁ డేల నడిచెడి ♦ వాఁడి వాసినయవి, కా నిట్టు లది యేమి♦కారణంబొ
తే. యనుచుఁ జింతాపరుం డయి♦యసమును డింప, కప్రమత్తత వెండియు♦నతులబాణ
వృష్టి నక్షుంబుఁ జించిన ♦ వెగడుపడక, యసురవర్యుండు ముసలగ♦దాది వైచె.
తే. వారు రథవేగగరిమ న♦భంబునందు
భూతలంబునఁ దద్గిరి♦మూర్ధమునను
నిశయు దినమును మూర్తంబు ♦ నిమిష మేని
నిలుపకయె సర్వరాత్రంబు ♦ కలను సలుప. ౨౪౬౯
తే. వారిరణమున విజయంబు ♦ వారిజాప్త
వంశ్యున కటంచు నిశ్చయిం♦పఁగను లేక
యతులమతిశాలి మాతలి ♦ యూహనైక
హృదయుఁ డగురామవిభుతోడ ♦ నిట్టు లనియె. ౨౪౭౦

## శ్రీరాముఁడు బ్రహ్మాస్త్రంబున రావణు వధించుట.

ఉ. ఏమి మహానుభావ! మది ♦ నేమి యెఱుంగనివానిమాడ్కి నే
మేమొ మహాస్త్రముల్ పగతు ♦ నేసెదుఁ దత్కృతికిం బ్రతిక్రియల్
గా,మడియింప నియ్యసురుఁ ♦ గంజభవాస్త్రము వీడ వయ్య శ్రీ
రామ! సురోక్తశాత్రవవ♦రాసనకాల మ దిప్డు సంధిలెన్. ౨౪౭౧
చం. అనవుడు సర్వలోకవిజ♦యార్థికి శాకవిరోధి కర్థిమై
మును వనజాసనుండు కర♦ముగ్ మహిమంబు మెయిగ్ సృజించి యి
చ్చిన నతఁ డాస్థ నిచ్చె ముని♦శేఖరుఁ డైనయగస్తి కాతఁడుగ్
దన కతిరక్తిచేఁ దొలుత ♦ దండక నిచ్చిన యమ్మహాస్త్రమున్. ౨౪౭౨
సీ. పక్షభాగంబులఁ ♦ బవనుండు ముఖమునఁ, బావకభాస్కరుల్ ♦ పరఁగుచుండ
నాకాశమయ మైన♦యంగంబు భాసిల్లి, మేరుమందరముల♦గౌరవమున
రాజిల్లి దివ్యమై ♦ రజతభూషిత మయి, జాజ్వల్యమాన మ♦హాసంహననము
సవితృవర్చస్సును ♦ సకలభూతావళీ, తేజంబు దృఢపుంఖ♦దీప్తి దనర
ఆ. నాగ్రహమున రోఁజు♦నాశీవిషంబును, ధూమకలితకాల♦ధూమకేతు
వెనయుదాని శాత్ర♦వేభాశ్వపరిఘాళి, ద్వారములను జెండి ♦ వైచుదాని. ౨౪౭౩
కం. మేదోదిగ్ధము భూధర,భేదనదక్షంబు రుధిర♦పిహితంబు మహా
నాదంబు వజ్రసారము, ఛేదననిరుపమము భూత♦చిత్తభయదమున్. ౨౪౭౪

ఉ. అప్రతిమానవీర్య మన♦యంబు శివాచయకంకగృధ్రభ
క్షప్రద మంతకాభము ప్ర♦శస్తతమేషువు వానరాళిచి
త్తప్రమదావహం బసుర♦సంఘభయావహ మాత్మసంశకీ
ర్తిప్రతిపాదకంబు పర♦బృందయశోహరణాసమానమున్. ౨౭౭౫

కం. గారుడపక్షవిచిత్రిత, సారాద్భుతవాజయుతము ♦ శతధృతిమంత్రో
దారము విధ్యుక్తంబుప్ర, కారమునన్ వింటఁ గూర్చెఁ ♦ గాకుత్స్థుండున్. ౨౭౭౬

శా. ఆబ్రహ్మాస్త్రము మార్చిఁ గూర్చుటయు హా♦హాకారయుక్తంబుగా
నబ్రహ్మాణ్యము లోలిఁ జేసె సకలా♦శాంతస్థభూతాళి; స
ర్వాబ్రాసుల్ కలఁగెన్, వణంకె ధర, తీ♦వ్రాటోపసంరంభుఁ డై
యాబ్రహ్మఘ్నునిమీఁద నైన రఘురా♦మాధీశుఁ డయ్యస్త్రమున్. ౨౭౭౭

కం. దంభోళిధరవిముక్తము, దంభోళి యనం గృతాంత♦దారుణ మగుచున్
జంభార్యరిబొమ్మున సం, రంభంబునఁ బడియెఁ దీవ్ర♦రంహస్స్ఫుట మై. ౨౭౭౮

ఉ. అమ్మహితాస్త్ర మిట్టు లసు♦రాధిపువక్షము వ్రక్కలించి ర
క్తమ్మునఁ దోఁగి ప్రాణములు ♦ కాయము నుండి వెలార్చి భూమిగ
ర్భమ్మునఁ జొచ్చి వెల్వడి ధ♦రాతనయాపతితూణిఁ జొచ్చెఁ గా
ర్యమ్మును దీర్చి వేగ వినయమ్మున లోహితవర్ణితాంగ మై. ౨౭౭౯

కం. ప్రాణంబుతోడఁ జాపము, బాణంబును నసురనాథుఁ ♦ బాసి యిలఁ బడెన్
ద్రాణము చెడి పడె గాత్రము, క్షోణిని హరినిహతవృత్ర♦సురవైరి యనన్ ౨౭౮౦

ఉ. ఏలినవానిపాటుఁ గని ♦ యెంతయు భీతిని జావకున్నవా
రోలిని లంకకుం బఱచి ♦ రుగ్రత రామజయప్రహృష్టకీ
శాళులు వెన్నడించి తము ♦ నారటపెట్టఁగ శొప్పవారితో
వ్రేలెడుమోముతోఁ జెడిన♦బీరముతోఁ దడి లేనినాల్కతోన్. ౨౭౮౧

కం. రావణుమరణంబును సీ, తావిభువిజయంబు రణక♦థాసామగ్రిన్
వేవిధములఁ బొగడుచు హ, ర్షావేశవశాత్ము లైరి ♦ యగచరవర్యుల్. ౨౭౮౨

## రావణుమృతికి లోకంబులు సంతోషించుట.

సీ. అందమై త్రిభువనా♦నంద మై మింటను, దుందుభిధ్వానంబు ♦ క్రందుకొనియె
బృందమై విగళన్న♦రందమై వర్షించె, మందారసుమతతి ♦ స్యందనమున
మందమై పరిమళా♦మందమై సుఖమూల, కందమై వీతెంచెఁ ♦ గమ్మగాలి
నందమై హితకర♦చ్ఛందమై స్తవవృష్టి, కందమై విబుధవా♦క్యంబు లెసఁగె
తే. సర్వలోకభయంకర♦శాత్రవుండు, రావణుండు త్రిభువనవి♦ద్రావణుండు
శ్రీరఘూత్తముచే నామ♦శేషుఁ డైనఁ, జారణామరు లెసఁగిరి ♦ సమ్మదమున. ౨౭౮౩

సీ. శాంతమానసముల ♦ సంతసించె బుధాళి, దిశలు ప్రసన్నతా♦దశ వహించె
గగనంబు నిర్మలా♦కారమై రాణించెఁ, గంప మందుట మానె ♦ క్ష్మాతలంబు
కమ్మగ నెమ్మిగఁ ♦ దెమ్మెర పై వీచె, దిగులు లే కర్కుఁడు ♦ తేజ మెఱసె
విచ్చలవిడి జనుల్ ♦ వీధులఁ దిరిగిరి, యధ్వరధూమంబు ♦ లభ్ర మంటె
ఆ. నాద మఱచి నిద్ర ♦ నందిరి లోకులు, గుండె లదరు టుడిగెఁ ♦ గోమలులకు
నఖిలలోకవైరి ♦ యగు నసురేశుండు, ఖచరలోకమునకుఁ ♦ గదలిపోవ. ౨౪౮౪
ఉ. అంత విభీషణార్కతన♦యాదులు లక్ష్మణయుక్తులై విభు
ప్రాంతముఁ జేరి యాహవజ♦యంబున భాసిలు చున్నయస్మహా
స్వాంతునిఁ బెక్కుభంగులఁ బ్ర♦శంస యొనర్చుచుఁ జుట్టి దేవతా
కాంతుని దేవబృందముల♦కైవడిఁ గొల్చిరి పొల్చి రంతటన్. ౨౪౮౫

విభీషణుఁడు రావణు కళేబరముఁ జూచి యేడ్చుట.

కం. అన్నను రామాశుగసం,ఛిన్నుఁ గని విభీషణుండు ♦ చేరం జని యా
పన్నుం డై కాల్వలుగాఁ, గన్నుల నీ రొలుక నేడ్చెఁ ♦ గడుదీనుం డై. ౨౪౮౬
శా. ఎన్నో యుద్ధములన్ జయించి ప్రథచే ♦ నేపారి వీరుండ వై
యెన్నో శాస్త్రములం బఠించి సుమనీ♦షీడ్యుండ వై యుండి య
స్కన్నానూనసుసౌఖ్యతల్పముపయిం ♦ గైసేఁత నిద్రించునీ
వన్నా! నేఁ డిటు నేలపా లయితివే ♦ హా! దైవమా! యే మనన్. ౨౪౮౭
ఆ. కాళ్ళు పాఱఁజాఁచి ♦ కనకాంగదసుభూ, షాంచితంబు నీదు♦హస్తయుగము[1]
క్షితిని విడిచి వీత♦చేష్టుండ వై యిట్లు, పుడమి మకుట[1] మెడలఁ ♦ బడఁగఁ దగునె.
కం. అన్నా! యీగతి నగు నని, యెన్నోమాఱులు వచింప♦నే నీతోఁ? గా
మోన్నతి మోహంబున నీ, కన్నుడులు రుచింప వయ్యె ♦ నసురాధీశా! ౨౪౮౯
సీ. కుంభకర్ణుం డేని ♦ కులిశకరారియే, నాప్రహస్తుండు న♦రాంతకుండు
నైనను నతిరథుఁ ♦ డాయతికాయుఁ డేన్, బలిమికల్మిని నీకెఁ ♦ దలఁప రైరి
నీవును జింతింప ♦ వీవిధం బద్దాని,ఫలము వో నేఁ డిటు ♦ ప్రాప్త మయ్యె
నెంతయో చెప్పితి ♦ నంతయు వృథయయ్యెఁ, గాలంబుఁ దప్పింపఁ ♦ గలుగు నెవఁడు
తే. పోయెను సునీతిసేతువు ♦ పోయె ధర్మ
విగ్రహము సత్త్వసంగ్రహ♦విధము చెల్లె
స్తోత్రపాత్రంబు విషయంబు ♦ శూన్య మయ్యె
నన్న! నీ వొక్కఁ డిలఁ బాసి ♦ యరుగుకతన. ౨౪౯౦
ఆ. ఇనుఁడు నేలఁ ద్రెళ్ళె ♦ నిరులలో శశి మున్గె, నగ్ని చల్లఁబడియె ♦ ననని మీఁద
నుద్యమంబు లేద ♦ యుత్సాహమునకు నీ,వీరవరుఁడు మేను ♦ విడుచుకతన.

1 రావణుఁ డీ యుద్ధకాలమున నొంటితల రెండుచేతులవాఁడయి యుండెను.

ఆ. రణతలంబునందు ♦ రాక్షససింహంబు, ధూళి బ్రుంగి నిద్రఁ ♦ దేలుభంగి
మృతినిఁ గూర నిపుడు ♦ హతవీర మీలోక, మందు నేమి గలదు ♦ మందలింప.

ఆ. ధీరతాప్రవాళ ♦ మోరుపు పుష్పంబు, భృశతపోబలంబు ♦ వీర్యబద్ధ
మూల మైనయసుర ♦ మూర్ధన్యవృక్షంబు, రామమారుతమున ♦ భూమిఁ ద్రెళ్ళె.

ఆ. బలవిషాణయుతము ♦ కులవంశవంశంబు, కినుక కరుణ యనెడి ♦ తనువు కరము
గలుగు రాక్షసేంద్ర ♦ గంధేభ మడఁగారె, రామసింహవరప ♦ రాక్రమమున.

తే. విక్రమోత్సాహజృంభిత ♦ వికటహేతి, దీర్ఘనిశ్వాసధూమంబు ♦ దేహసత్త్వ
సత్ప్రతాపంబు గలరాక్ష ♦ సప్రకాండ, వహ్నిఁ జల్లార్చె రాఘవ ♦ వారిధరము.

తే. అసురవాలకకుద్విషా ♦ ణాన్వితంబు, శాత్రవధ్వంసనంబు హిం ♦ సారతంబు
చపలకర్ణేక్షణము సుర ♦ శత్రువృషముఁ, దాఁకి రాఘవద్వీపి వ ♦ ధం బొనర్చె.

కం. అని శోకసమాకులుఁ డై, పనవి పనవి హేతుయుక్త ♦ వాక్యంబులతో
వనరుభీషణుఁ గని భూ, తనయానాథుండు పల్కె ♦ దయ దైవాఱన్. ౨౪౯౭

⟶ శ్రీరాముఁడు విభీషణునకు దుఃఖోపశమనంబు చేయుట. ⟵

ఉ. ఏమిటి కేడ్చె దయ్య బల ♦ హీనత నీతఁడు దూల లేదు, సం
గ్రామకుతూహలుం డతిప ♦ రాక్రమశాలి మహోత్సుకుండు దై
ర్యామరభూధరంబు రవ ♦ యంతయు జంకును గొంకు లేక ని
స్సీమధృతిం బెనంగి తన ♦ చే నయినంతయుఁ, గూరె మృత్యువున్. ౨౪౯౮

కం. పరలోకసుఖముఁ గోరెడి, పురుషులు పెనువీఁకఁ బెనఁగి ♦ పొలియుదు రనిలో
ధర క్షత్రధర్మమున సం, గరమునఁ దెగువారి కేడ్వఁ ♦ గా న్యాయం బే? ౨౪౯౯

కం. లోకత్రయిఁ గారించెను, నాకుల భంగించెఁ గలన ♦ నసమబలుం డై
చేకొనె వీరస్వర్గము, శోకింపఁగఁ దగునె యిట్టి ♦ శూరున కనఘా! ౨౫౦౦

తే. ఇట్టివాఁడె జయించు న ♦ న్నట్టినియమ
మున్న యెపు డైనఁ జెప్పుమా ♦ యుద్ధములను?
దాను బరు గెల్చుఁ బరులచేఁ ♦ దాను జచ్చు
గెలుపు నోటమి నెవ్వాఁడు ♦ పలుక నేర్చు. ౨౫౦౧

కం. క్షత్రియసమ్మతము పురా, ధాత్రీశాదిష్టితమ్ము ♦ తగుగతి యిది యా
క్షత్త్రియున కాహవోజ్ఝిత, గాత్రున కై కార్పరాదు ♦ కన్నీ రెందున్. ౨౫౦౨

కం. ఇది నిశ్చయించుకొని నీ, మదిఁ దత్త్వార్థంబు నిలిపి ♦ మానుము వగపుం
బిదపటికెలసముఁ దీర్పఁగ, గొదగొను మను నతఁడు పలుకు ♦ గురుశోకమునన్.

ఉ. ఈతఁడు దేవతాచయస ♦ మేతుఁడు వాసవుఁ డొడ్డి తాఁకినన్
ఖ్యాతిగ లోఁగ కాతని య ♦ హంకృతి మాపె జగం బెఱుంగఁ బ్ర

స్ఫీతభుజాబలోద్ధతిని ♦ వీరవరా! నినుఁ దాఁకి సాగరం
బాతతవేలఁ దాఁకి చెడు♦నట్టులు భంగముఁ జెందె నేఁ డసిన్. ౨౫౦౪

సీ. ఎన్నెన్నియో మేలి♦యావు లిచ్చినవాఁడు, గురుల దైవతములఁ ♦ గొలిచినాఁడు
అఖిలసుఖంబుల ♦ ననుభవించినవాఁడు, నాశ్రితావనుఁ డయి ♦ యలరినాఁడు
హితులకు నర్థంబు ♦ లెలమిఁ గూర్చినవాఁడు, వైరులఁ గారించి ♦ వాలినాఁడు
అగ్నుల నేవేళ ♦ ననుసరించినవాఁడు, దీర్ఘతపంబునఁ ♦ దేజినాఁడు
తే. వేదవేదాంతవిదుఁ డయి ♦ వెలసినాఁడు, కర్మచణుఁ డనుయశమునఁ ♦ గ్రాలినాఁడు
ఔర్ధ్వదైహికకృత్యంబు ♦ లాచరింప, నాన తిచ్చెదె యనిన ద♦యాళుఁ డనియె.
కం. వైరము మరణాంతము మన, కారియముల్ దీరె మీఁది♦కార్యములను సం
స్కారాదులఁ దీర్పుము నీ, కారయ నితఁ డెట్టివాఁడొ ♦ యట్టిఁడ నాకున్. ౨౫౦౬

## రావణుభార్యలు రావణుఁ జూచి విలపించుట.

కం. అని పలుకు చుండ రాఘవ, సునిశితశరములను సురని♦షూదనుమరణం
బును విని రాక్షసకాంతలు, వనరుచు నంతఃపురంబు ♦ వదలి భృశార్తిన్. ౨౫౦౭
సీ. విరిసినజడలు పూ♦సరములతోఁ గూడి, వెన్నులఁ బ్రక్కల ♦ వ్రేలు చుండ
జడిగొనికాఱుబా♦ష్పములపెల్లున జాఱి, తారాడుపైఁటలు ♦ దడియుచుండఁ
గరతాడనంబుల♦గసిబిసిగొని హార,రత్నముల్ నేలపై ♦ రాలుచుండఁ
గనునీరు కప్పినఁ ♦ గనులు గానమిఁ గటి,భరమునఁ గాల్దడఁ♦బడుచు నుండ
ఆ. మేను దూలిపోవ ♦ మేదినిఁ బొరలుచు, నెత్తి మోఁదికొనుచుఁ ♦ దత్తఱిలుచు
నధికశోకమునను ♦ హతవత్సగోవుల,పగిదిఁ బతిని జూడ ♦ వచ్చి రపుడు. ౨౫౦౮
తే. ఉత్తరద్వారమునఁ గాచి♦యున్నయసుర,వరులు తమతోడ రాఁ బతి♦నరసికొనుచు
వచ్చి రెల్లరు శోణిత♦బహుకబంధ,భీమమునకును ఘోరసం♦గ్రామమునకు.
సీ. హారాజనందనా! ♦ హా జీవితేశ్వరా!, హా ప్రాణనాయకా! ♦ హా మదీశ!
హానాథ! హానాథ!♦హాపతీ! యనుచును, నశ్రుసంపూర్ణనే♦త్రాబ్జ లగుచుఁ
బ్రాణేశు శోకప♦రాయణల్ కాంతలు, హతయూథపకరేణు♦వితతివోలె
నఱచుచు వెదకి మ♦హాకాయుఁ బటువీర్యు, నంజనచయతుల్యు ♦ బ్రాణనాథుఁ
ఆ. బ్రధన పాంసుపతితుఁ ♦ బరికించి సంఛిన్న,వనలతాళు లనఁగఁ ♦ బైనవ్రాలి
తలలు మోఁదికొనుచు ♦ విలపించి రెల్లరుఁ, బెక్కుభంగి రవము ♦ పిక్కటిల్ల.
సీ. ఒక్కతె బహుమాన♦యుక్తిఁ గౌఁగిటఁ జేర్చి, తనచన వెల్లను ♦ దలఁచి యేడ్చె
నొక్కర్తు పదముల ♦ మక్కువమైఁ గ్రుచ్చి, తనునేలురీతిని ♦ బనవి యేడ్చె
నొక్కతె కంఠంబు ♦ నుపగూహన మొనర్చి, తను గారవించువి♦ధంబు నేడ్చె
నొక్కర్తుపతిఁ గని ♦ యుద్ధృతహస్త యై, ప్రాణేశ్వరా! యని ♦ యవనిఁ బొరలె

ఆ. మూర్ఛపోయె నొకతె ♦ ముస్వరం బగుశోక,మునను బలుక లేద ♦ ముగుదయోర్తు
తనదుతొడను నాథు♦తల[1] యుంచి తిలకించి, బాష్పవారి ముంచె ♦ వదనతలము.

కం. రావణు ధరణీతలగతు, నావనితలు చూచి చూచి ♦ యతిదుస్సహశో
కావిష్టచిత్తలై వా,పోవం గడఁగిరి గుణాళి ♦ బుద్ధిఁ దలఁచుచున్. ౨౫౧౨

సీ. ఏమహాబలు నని ♦ నెదిరించి పాకారి, మానంబుఁ గోల్పోయె ♦ దీనుఁ డగుచు
నేమహావీరుని ♦ నెదిరించి శమనుండు, త్రాసంబునను నోల♦మాసగొనియె
నేశూరవరుఁడు గౌ♦రీశమిత్రుని నోర్చి, పుష్పకంబు హరించెఁ ♦ బొలుపు వెలయ
నెవ్వనిపే రన్న ♦ ఋషులు గంధర్వులు, తల నిక్కఁ బెట్టఁగఁ ♦ దలఁకువార

ఆ. లెవనినామధేయ ♦ మెల్లసురాళికి, గుండెగాల మట్టి♦గండుమగఁడు
అట్టిదోర్బలాఢ్యుఁ డక్కటా! నేఁ డిట్టు, విగతజీవుఁ డగుచుఁ ♦ దెగినవాఁడు.

ఆ. అసురతతికి వెఱవఁ ♦ డమరులకును జంకఁ, డహివరేణ్యులకును ♦ నదరఁ డట్టి
పరమసాహసునకు ♦ భయవిదూరునకును, మనుజువలన భయము ♦ దనరె నేఁడు?

ఆ. దానవాళిచేత ♦ దానవారులచేత, నసురవితతిచేత ♦ హతుఁడు గాని
కడిఁదిబంట వీవు ♦ కాల్నడ మనుజుచే, ననిని హతుఁడ వైతె ♦ యనదవోలె?

కం. విన వైతివి సుహృదులనుడి, విన వైతివి మేలుకోరు♦పెద్దలపలుకుల్
గొని తెచ్చితి మృతికొఱకై, జనకాత్మజ దాన నసుర♦సంఘము సమసెన్. ౨౫౧౬

ఉ. నీదుహితంబుఁ గోరువర♦నీతివిదుండు విభీషణుండు నీ
సోదరుఁ డింత వచ్చు నని ♦ యూరక నీచెవి కూఁటిపోయఁడే?
కా దని ధిక్కరించితివి ♦ కాఱులు పల్కితి వట్టివాని ని
ప్డీదనుజాళి నీవు మఱి ♦ యేమును గూలితి మింద ఱొక్కటన్. ౨౫౧౭

ఉ. సీతను నీవు రామునకుఁ ♦ జెల్మితలంపున నిచ్చియున్న నీ
భ్రాతయు సంతసించు, రఘు♦రాముఁడు నీకు హితార్థి యౌను, మా
కీతలవ్రాఁత ప్రాణధవ♦హీనత పాయు, విరోధిసంచయా
ఖ్యాతము రిత్తయౌ, నసుర♦కోటి సమూలము ద్రుంగ కుండదే. ౨౫౧౮

కం. పాపపుమనమున సీతను, జేపట్టఁగఁ గోరి హరము ♦ చేయుటఁ గాదే
యీపురమునవారును మే, మీపగిది న్నీవు ముగుర ♦ మిటు పొడగుటన్. ౨౫౧౯

కం. కావు పతీ! కాముకుఁడవు, కావు స్వతంత్రుఁడవు నీవు ♦ కార్యముపట్లన్
దైవంబ సలుపు సర్వము, దైవోపహతు న్వధించుఁ ♦ దక్కెది యేనిన్. ౨౫౨౦

కం. వనచరకోటులకును మన,మనుజాశనసంఘములకు ♦ మఱి నీకు వినా
శన మిటు చేకూరుటకును, దనుజేంద్రా! కారణంబు ♦ దైవంబ చుమీ. ౨౫౨౧

---

[1] ఈ యుద్ధకాలమున రావణుఁ డొంటితలవాఁడు.

కం. కలిమిని నైనను గామము, బలమున నేఁ మిగుల దేహ♦బలమున నాజ్ఞా
కలనమున నేని శక్యమె, బలవద్విధిగతిని ద్రిప్పఁ ♦ బ్రకటబలాఢ్యా. ౨౯౨౨

కం. అని యీగతి శోకాకుల, మనములఁ గన్నీరు దొరఁగ ♦ మనుజాశనుభా
మిను లెల్లఁ గురరులో యనఁ, బనవి పనవి యేడ్చుచుండ♦వారలలోనన్.

## మండోదరీ విలాపము.

తే. పెద్దభార్య మండోదరి♦పేరిచెలువ, రావణునిప్రియురాలు భ♦ర్తను గకుత్థ
గోత్రదీపకహతుని గ♦న్గొనుచు దుఃఖ, పాటు సైరింపలే కిట్లు♦పలవరించు. ౨౯౨౪

చం. అకట మహానుభావ! ధన♦దానుజ! నీ వొకయింత యల్గినన్
వికలత నొందు వాసవుఁడు ♦ వేలుపులున్ ధరణీసురోత్తముల్
తికమికలాడి పాఱుదురు ♦ దిక్కులవెంబడి నట్టినీ వయో
యొకనరమాత్రుచేఁ బడుట ♦ కోర్చితి వింతగ సిగ్గుమాలితే. ౨౯౨౫

కం. పొడిచితి ముల్లోకంబులు, నొడిచితి వెల్లెడలఁ గల్గు♦నుత్తమలక్ష్మిన్
బడసితివి పేరుఁ బెంపును, నడవిమనుజుచేతఁ దుదకు ♦ హతుఁ డైతె పతీ! ౨౯౨౬

కం. మనుజుల కవిషయ మగునీ, వననిధి వసియించు♦కామ♦వర్తుని నిన్నున్
మనుజుఁ డొకఁడు ద్రుంచె నన, న్మనుజాశనవర్య! యేమి♦న్యాయము చెపుమా?

కం. ఇమ్ముగ సమస్తశస్త్రా, స్త్రమ్ములఁ బరిపూర్ణు నిన్ను ♦ రథికుని సంగ్రా
మమ్మున రాముఁడు చంపుట, నమ్మంగా నేర నేను ♦ నాకపవైరీ! ౨౯౨౮

కం. పరఁగ జనస్థానంబున, ఖరుని సహభ్రాత్రు నెల్ల♦క్రవ్యాదులతోఁ
బరిమార్చుట విన రాముఁడు, నరమాత్రుఁడు గాఁ డటంచు ♦ నాకుం దోఁచెన్.

కం. సురలకు దనుజుల కైనను, జొరరానిది లంక దానిఁ ♦ జొచ్చి బలిమి మైఁ
గరువలిసుతుఁ డప్పుడె నేఁ, బరితాపముపడితిఁ జేటు ♦ పాటిలు ననుచున్. ౨౯౩౦

కం. గిరికోటులతో నీరా, కరమున వనచరులు కట్టఁ ♦ గట్టినయపు డే
సురనాథవైరి! రాముఁడు, నరమాత్రుఁడు గాఁ డటంచు ♦ నమ్మితిఁ జుమ్మీ. ౨౯౩౧

కం. ఆయముఁడె తా స్వయమ్ముగ, నీయవనీనాథురూప ♦ మిటుం గొని నిన్నున్
మాయింప నప్రతర్కిత, మాయన్ ఘటియించె నొటు ♦ మత్ప్రాణేశా! ౨౯౩౨

కం. కాకున్న వృత్రవైరియొ, పోకార్చె నొ నిన్ను? నట్టి♦బూమెలు గలవే
నాకాధిపతికి నీదెస, నేకరణిం జూడ శక్తి ♦ యెక్కడ వచ్చెన్? ౨౯౩౩

సీ. కాన రాముండు నిక్కము మహాయోగి య, నాదిమధ్యాంతస♦నాతనుండు
పరమాత్ముఁడును బరా♦పరుఁడు మహాత్ముకుఁ, బరమమహాత్మును ♦ బరమధాత

శ్రీవత్సవక్షుండు ♦ శ్రీనిత్యనిలయుండు, శంఖచక్రగదాది♦సాధనుండు
శాశ్వతుండు ధ్రువుం డ♦జయ్యుండు సత్యప,రాక్రముఁ డగువిష్ణు ♦ వవనిమీఁద

తే. మానుషశరీరమును బూని ♦ వానరత్వ
కలితవిబుధులతోడ జ♦గద్విభుండు
భువనహితకామ్యమున నిన్నుఁ ♦ బూర్వదేవ
సంతతులతోడ ద్రుంచెం ♦ సంగరమున. ౪౫౩౪

కం. ఇంద్రియముల మును గెలిచి య,తంద్రవ్రత ముల్లోకములను ♦ ధర్షించితి వా
యింద్రియములు పగ మది నిడి, యింద్రారి! నిన్ను గెలిచె ♦ నియ్యెడ మరలన్.

ఉ. చెప్పఁగ లేదె నేను రఘు♦శేఖరుతోఁ బగ మాను మంచు? నీ
వప్పలుకుల్ గ్రహించితివె ♦ యాఫల మిప్పుడు దాపరించె, నీ
గొప్పతనంబు ప్రాణమును ♦ గూరిమిచుట్టము లెల్లసంపదల్
తెప్పునఁ గూల నేకతము ♦ లేకయె కోరితి వాధరానుతన్. ౪౫౩౬

కం. మతిలేవు గాక చంద్రుని,సతికి నరుంధతికి మిన్న♦జానకిని బతి
వ్రత నతిమాన్యను బఱచితి, మతిమంతులు చనెడిసాధు♦మార్గమె యదియున్.

సీ. వసుధకు వసుధ యా ♦ భర్తృవత్సల సీత, శ్రీకిని శ్రీ యగు ♦ చెలువ మిన్న
యనవద్యసర్వాంగి ♦ యఖిలశుభాస్పద, మెచటనో యడవిలో ♦ నెవరు లేని
తలమునఁ గ్రమ్మఱు♦దానిని వంచించి, మొఱ్ఱో యటంచును ♦ మొఱలు పెట్ట
నాత్మదూషక! యట్టు ♦ లపహరించితి గాని, యేమిసౌఖ్యముఁ గంటి ♦ వింతివలన?

ఆ. నమ్మహానుభావు♦రాలిపాతివ్రత్య,తపముబలిమి నీవు ♦ దగ్ధుఁ డైతి
వడఁతిఁ దాఁకినపుడె ♦ భస్మమె పోని నిఁక, జూచి యడలి రగ్ని ♦ నురలు హరియు.

కం. పాపం బొనరుచునాతఁడు, పాపములఫలంబు కాల♦పక్వం బగుదుర్
జేపడఁగ ననుభవించును, ద్రోహాడినఁ బోదు నిజము ♦ దోషాటవరా. ౪౫౩౯

తే. శుభములొనరించువానికి♦శుభము గలుగుఁ,బాపమొనరింపఁదప్పదు♦పాపఫలము
పుణ్యరతుని విభీషణుఁ ♦ బొందె సుఖము, పాపశీలివి నీకిట్టి♦పాటు గలిగె. ౪౫౪౦

కం. అంచితరూపంబున నా,చంచలలోచనను మించు♦సౌందర్యవతుల్
పంచన నీకుం గల రది, పంచశరునివలలఁ జిక్కి ♦ పరికింప వయో. ౪౫౪౧

ఆ. కులముచేత నైన ♦ గుణముచే నైనను, జక్కఁదనముచేతఁ ♦ జదురుచేత
నాకు మిన్న గాదు ♦ నాయీడు గాదు వై,దేహి; యెఱుఁగ వైతి ♦ మోహమునను.

ఆ. నింద లేక పోదు ♦ బొంది యు న్నానుడి, నిఖిలభూతములను ♦ నిశ్చయంబ
యెచటసీత? నీ వ♦దెచ్చుట? నెట నుండి, మిత్తిఁ దెచ్చికొంటి ♦ మెలఁతమిషను. ౪౫౪౩

కం. సీతాసతి రామునితోఁ, జేతోగతి సమ్మదమునఁ ♦ జెలఁగి రమింపన్
పీతసుకృత నగు నే నిఁక, నాతతదుఃఖాబ్ధి మునిఁగి ♦ యడలఁగ వలసెన్. ౨౫౪౪

ఉ. మందరకందరంబులను ♦ మానితరాజతశైలభూములన్
సుందరమేరుకూటముల ♦ సుందర! యక్షవనాళులన్ మణీ
మందిరసీమలన్ సురవి♦మానములం దనివార మాలికా
బృందసుచేలయుక్తిఁ జరి♦యింతు రమింతు భవత్సమేత నై. ౨౫౪౫

కం. కోరినభోగంబుల నే, నారీతిగ ననుభవించి ♦ హతుఁడవుగా నో
వీర యిటు మూలఁ బడితిని, ఘోరమణుల సిరు లవేల ♦ క్షణభంగురముల్? ౨౫౪౬

సీ. హా మహారాజేంద్ర ♦ యా సౌకుమార్యంబు, నా సుభ్రువును మఱి ♦ యాసమున్న
సంబు నా సుత్వక్కు ♦ చంద్రాబ్జరవితుల్య, కాంతిలక్ష్మీద్యుతి ♦ కామనీయ
మా కిరీటోజ్జ్వల ♦ మాదీప్తకుండల, మా మదాకులితలో♦లాక్ష మామ
నోహరస్రగ్ధరం ♦ బాహాసరుచిరంబు, నగు తామ్రవక్త్రమా ♦ ప్రాణనాథ
ఆ. రామబాణభిన్న♦మై మాంసమస్తిష్క, రుధిరయుక్తి మిగుల♦రూక్ష మగుచు
రథపరాగసమితి ♦ రహి తప్పి యీగతి, నేలఁ బడిన యదియు ♦ నిర్జితేంద్ర! ౨౫౪౭

కం. మందమతి నొట నెన్నఁడు, డెందంబునఁ దలఁపనట్టి♦ డెప్పర మిపు డీ
చందంబున వైధవ్యం, బందితి నది నీకుఁ బ్రాణ♦హానిం గూర్చెన్. ౨౫౪౮

కం. జనకుఁడు దానవరా జఁట, ఘనబలుఁ డగు నసురభర్త ♦ గాంతుం డఁట నా
తనయుఁడు శక్రజితుం డఁట, యని మిక్కిలి గర్వపడుదు ♦ ననవరతంబున్. ౨౫౪౯

కం. కేవలవిఖ్యాతబల, ప్రావీణ్యులు దృప్తవైరి♦పరిమర్దనులున్
భీవిరహితచిత్తులు వో, నావార లటంచు మిగుల ♦ నమ్మితి నాథా! ౨౫౫౦

కం. ఇట్టిప్రభావముఁ గలిగిన, దిట్టలు నీసుతుఁడు నీవుఁ ♦ దెగితిరి నరుచే
ని ట్టగుట దలఁప మెన్నఁడు, చిట్టలువో మీరు మనుజు♦చేతం దెగుటల్. ౨౫౫౧

సీ. నిద్దంపునీలంపు♦నీలిడాలు వహించి, ప్రాంశుమహీధరా♦భంబు నగుచు
నంగదవైడూర్య♦హారప్రగుజ్జ్వలం, బై విహరణకేళి♦హారి యగుచు
సంగ్రామతలముల ♦ సందీప్యమానమై, శంపాలతాయుత♦జలద మనఁగఁ
బరమాభరణచయ♦భావిభాసితమయి, కాంతుల నీనుచుఁ ♦ గమ్ర మైన
ఆ. నీ శరీర మకట! ♦ యాశుగసందోహ, శాతశల్యనికర♦సంచిత మయి
తాఁకుటకును లేమిఁ ♦ దమిఁ గౌఁగిలించెదు, భాగ్య మైన లేదు ♦ ప్రాణనాథ.

ఆ. సలుగుముండ్లువోలె ♦ సాయకంబులు మర్మ, తలము లంటఁ దాఁక ♦ దారుణముగఁ
దెగినసిరలనుండి ♦ తెఱపి లేక స్రవించు, రక్తమునను మేను ♦ సిక్త మయ్యె. ౨౫౫౩

కం. కట్టా! వాసవసాధన, కుట్టాకం బైన మేను ♦ గురుతరరఘువం
 శోట్టుశరంబులఁ బవిహత, కుట్టారముఁబోలె[1] నేలఁ ♦ గూలెనె యనిలోన్. ౨౫౫౪

కం. సత్యమ్ముగ స్వప్నం బిది, మృత్యువునకు మృత్యు వగుచు ♦ మీఱితివి నీవున్
 మృత్యువునకు వశపడుదె? య, సత్యముఁబో రామవిభుఁడు ♦ చంపుట నిన్నున్.

సీ. సకలజగజ్జాల ♦ సర్వార్థభోక్తను, వైరిహృత్స్ఫోటన ♦ పరుషవక్త
 సర్వదిశాపాల ♦ సముదయ జేతను, నఖిలజగత్సుభ ♦ యప్రదాత
 సహరాజతాహార్య ♦ శంకర శ్లేష్టను, లంకాపురీద్వీప ♦ లలితగోప్త
 సమదశాత్రవలోక ♦ సంఘాతనిగ్రహీత, శరనివాతకవచ ♦ సంగ్రహీత
ఆ. బహుళయజ్ఞలోప్త ♦ స్వజనయూథపగోప్త, దానవేంద్రహంతఁ ♦ దతనియంత
 లోకచయవిహర్తఁ ♦ బాకారిమదహర్తఁ, బంక్తికంఠధర్తఁ ♦ బ్రాణభర్త. ౨౫౫౬

కం. త్రాతను రణమాయాని, ర్ఘాతను బరకీయయువతి ♦ రాజీబాధా
 దాతను స్వజనానందవి, ధాతను మత్ప్రమదశామ ♦ దాతను వీరున్. ౨౫౫౭

కం. ఉత్తమశాస్త్రశ్రుతిచయ, వేత్తను సద్ధర్మమార్గ ♦ విధిమర్యాదా
 భేత్తను బుణ్యజనాది, చ్ఛేత్తను సురనరసతీవి ♦ శేషాహర్తన్. ౨౫౫౮

కం. నిను నాప్రాణేశ్వరు రా, మనిశితశరనిహతుఁ జూచి ♦ మరణింపక నా
 తనువునఁ బ్రాణముఁ దాల్చుట, దనుజేశ్వర యింక శాశ్వ ♦ తము నాబ్రదుకున్.

తే. మేను నునుటంచతక్కల ♦ మెత్తలందు, వ్రాల్చి హాయిగ నిదురించు ♦ రమణ నీవు
 రేణుపాటల మైనయీ ♦ క్షోణియందు, నేమిసుఖ మని పన్నుండ ♦ నెత్తికొంటి?

కం. సౌమిత్రిశరంబుల సం, గ్రామంబున శక్రజితుఁడు ♦ కడచుట విని నే
 భూమిఁ బడితి ననుకొంటిని, నీమరణముచేత నేఁడు ♦ నీతైతిఁ బతీ! ౨౫౬౦

కం. చుట్టములు లేరటంచును, బుట్టదు వో చింత నాకుఁ ♦ బురుభోగంబుల్
 నెట్టన యొసఁగెడినిను విడి, యెట్టుగ శాశ్వతసమల్ స ♦ హింతు స్వనటన్. ౨౫౬౧

కం. నేను సహధర్మచారిణిఁ, గానా? నే నిట్లు వగవఁ ♦ గడుద వ్వయి పో
 రానియెడ కేగుటలు దగ, వౌనా? నిను విడిచి బ్రదుక ♦ వగునా నాకున్. ౨౫౬౩

కం. దీన నయి దుస్సహవ్యథ, చే నిటు పలవించు నన్నుఁ ♦ జే విడిచి చనం
 గా నాయమె? యేడువకే, మానిని యని ప్రీతి నొక్క ♦ మాటనరాదా? ౨౫౬౪

ఉ. కోమలనీలదేహా! యవ ♦ కుంఠనముల్ విడనాడి కాల్నడన్
 నీసుహితింబు బురంబు విడి ♦ నే నిటువచ్చినఁ గోపగింప వే
 లా మనుజాశనేంద్ర! ప్రియు ♦ రాండ్రు మునుంగులు వీడి సిగ్గుపో
 నీమెయి రాఁగ నింద అది ♦ యేలొకొ కింక వహింప వింతయున్? ౨౫౬౫

[1] కుట్టారము = పర్వతము.

కం. సీలాలించుజనంబులు, ఖేలాసహచరులు నాథ ♦ కెలఁకుల నేడ్వన్
లాలింప వూఱడింపవు, పోలునె నీ కిట్టికఠిన♦బుద్ధి హృదీశా! ౨౫౬౬

సీ. పరమపాతివ్రత్య♦భవ్యశీలలఁ గుల,పాలికలను ధర్మ♦పరల భవ్య
వృద్ధశుశ్రూషణా♦విరతచిత్తల నీవ, యొందఱనో పతి♦హీనురాండ్రఁ
జేసితి వాసతు ♦ లీనున దుఃఖంబు,గరిమను దిట్టిరి ♦ కఠినఫణితి
వారిశాపము దాఁకి ♦ వైరిచేఁ జెడితివి, వా రెట్లుతిట్టి రా♦పగిది నయ్యెఁ

తే. బరమసాధ్వులకన్నీరు ♦ ధరణిఁ బడవు, మనసునొప్పించువారిచే♦టునకుఁ గాక
యనెడులోకప్రవాదంబు ♦ ప్రాణనాథ!, సత్య మయ్యెను నీయందు♦జగతియందు.

కం. శూరుఁడ వై రణముల భుజ,వీరత గెలిచితివి నిఖిల♦విశ్వము నయ్యా
భీరుగతి శూరమానీ, నారీచౌర్యంబు సేఁత ♦ నైచ్యము గాదే. ౨౫౬౮

సీ. హరిణమిషంబున ♦ నాశ్రమంబుననుండి,దాశరథిని దవ్వు ♦ దలఁగఁజేసి
జానకిఁ దెచ్చితి ♦ మానధనా! యిది, పిఱికితనానకు ♦ గుఱుతు గాదె
భీమాహవములనేన్ ♦ బిఱికివి గా వని, సత్య మే నెఱుఁగుదు ♦ సాహసాంక
యట్టినీ విటు సేఁత ♦ యరయ దౌర్భాగ్యసు,పక్వలక్షణ మయి ♦ పరిణమించె

ఆ. నలత్రికాలవేది ♦ యైననాదుమఱంది, నీవు సీతఁ దేర ♦ నిశ్వసించి
చూచి సత్యభాషి ♦ శుభచరిత్రుఁడు దాన, నసురతతికిఁ జేటు ♦ పొసఁగు ననియె.

కం. కామక్రోధంబులచే, నీమెయి సమకూరె నింత ♦ కీవే మూలం
బౌమూలము చెడె నసుర,స్తోమము దిక్కేది లేక ♦ తూలించితివే. ౨౫౭౦

తే. నీవు సడిసన్నవాఁడవు ♦ నిఖిలజగతి, బలపరాక్రమముల నీకు ♦ వగవఁ దగద
యనుచు నెఱుఁగుదు నైనను ♦ నాఁడుదానఁ,గాన నాబుద్ధి దుఃఖాబ్ధి ♦ లీన మయ్యె.

కం. ఓగో బాగో యొనరిచి, నీగతికిం జనితి వీవు ♦ నేనో నీసం
యోగంబుఁ బాయుకతమున, నాగతి యే మనుచు వగతు♦నాకై నాథా![1] ౨౫౭౧

సీ. నీహితకాముల ♦ నీతివాక్యాళికిఁ, బెడచెవి నిచ్చితి ♦ వీరవర్య!
శుభము వచించిన♦సోదరపాళికి, మాఱుమో మిడితివి ♦ మహితశౌర్య!
హేతుయుక్తంబుగ ♦ నీతియుతంబుగ, శ్రేయస్కరంబుగఁ ♦ జెప్పలేదె
తిన్ననిమాటల ♦ నెన్నియోమాఱులు, పిన్నతమ్ముఁడు చెవి ♦ విచ్చి వింటె

తే. కొఱఁత లేకుండ మారీచ♦కుంభకర్ణు, లపుడె నాతండ్రియును నీకు ♦ నాస్థఁ జెవులఁ
గూరిపోయరె? విన వైతి ♦ వారిపల్కు, బలమదంబున; దాన నీ♦ఫలము గలిగె.

తే. కాలజీమూతసంకాశ♦కనకచేల,తనువు సర్వంబు నెత్తుటఁ ♦ దడిసి యుండ
ధరణి నిద్రించుగతిఁ బండి ♦ దైన్యగరిమ, నేడ్చునాతోడ మాటాడ♦వేల చెపుమ?

[1] ఇది సత్యము. లోకమునఁ జచ్చినవారికై యేడుచువారు లేరు. తమకుఁ గలిగిన ధనధాన్యసుఖసంతోషాది నష్టులకై తమకై యేడ్తురు.

కం. సాహసవీర్యధనుండను, నాహవమున విజయి దక్షుఁ ♦ దర్పితశత్రు
వ్యూహుఁ డగుమాల్యవంతుని, దౌహిత్రుఁడ యేల చూడఁ ♦ దలఁపవు నన్నున్.

కం. లే లెమ్ము క్రొత్తపరిభవ, మీలంకాపురికిఁ[4] గలిగె ♦ నిపు డినరక్షుల్
చాలఁగ నివె యెల్లెడలన్, వాలాయము చొచ్చి సైఁప ♦ వచ్చునె నీకున్? ౨౫౬

ఉ. నీరజబాంధవాభ మయి ♦ నిర్జితసర్వవిపక్షజాల మై
భూరివిభూషణాంచితము ♦ పుష్పతతిన్ సతతార్చితంబు నై
ఘోరము నై పురందరున ♦ కున్ శతకోటి యనంగ నీకుఁ జె
న్నారు సముజ్జ్వలంపుఁబరి ♦ ఘాయుధముం జెడె వేయితున్క లై. ౨౫౭

కం. ఏమీ ప్రియురా లన సం, గ్రామమహిం గ్రుచ్చి నీవు ♦ కౌఁగిట నాతో
నేమియుఁ బలుకక యప్రియ, భామినివలెఁ జూడ నీకు ♦ భావ్యమె చెపుమా?

కం. ఎట్టిహృదయ మిది ఛీఛీ, పట్టని వేతునుక లగుచుఁ ♦ బగులదు నిన్నీ
పట్టున రణనిహతుం గని, కట్టా యని స్నేహగరిమఁ ♦ గనునీ రురలన్. ౨౫౯

ఆ. మనసు నిలుపలేక ♦ మయునితనూభవ, యసురనాథువక్షమందు వ్రాలె
మూర్ఛ తన్ను మిగుల ♦ ముంప సంధ్యారక్త, జలదమందు వెలుఁగు ♦ శంపవోలె.

చం. సవతులు హా! యటంచు నల ♦ సాధ్విని జుట్టి నితాంతశోకభా
రవశమునన్ మునుంగుచును ♦ రామ! యెఱుంగవె రాజలక్ష్మియున్
భువనచయస్థితుల్ దశల ♦ పోకలతోడన మాఱు చుంట య
ధ్రువము లటంచు నిబ్బరముఁ ♦ దొయ్యలి! తాల్పుము మమ్ముఁ దేర్పుమీ.

కం. అనుచెలులకు సతి యయ్యో, యని ధారగఁ గనులఁ గాఱు ♦ నంబువులం దా
స్తనములఁ దడుపుచు నిజపతిఁ, బనవి పనవి యేడ్వ రామ ♦ భద్రుం డంతన్.

( విభీషణుఁడు శ్రీరామునితో రావణుఁడు
సంస్కారార్హుఁడుకాఁ డని చెప్పుట. )

కం. అయ్యా! విభీషణ నీ వీ, తొయ్యలులం గడకుఁ బంచి ♦ తూర్ణమ నీయ
న్నయ్యకు సంస్కారంబులు, నెయ్యమున నొనర్పు మన్న ♦ నెమ్మదిఁ దనలోన్.

కం. ఆలోచించి విభీషణుఁ, డోలిన్ ధర్మంబు తెఱఁగు ♦ నూహించి ధరా
పాలానువృత్తికై[1] హిత, శీలుం డుత్తర మొసంగు ♦ శ్రీరామునకున్. ౨౬౪

సీ. ధర్మవృత్తంబులు ♦ దలఁగఁ ద్రోసినవాఁడు, కరుణావిదూరుండుఁ ♦ గల్లరీఁడు
గలుషచిత్తుం డన్య ♦ కాంతాళిమర్శియు, భ్రాతృరూపముఁ గొన్న ♦ పరమవైరి
సకలాహితరతుండు ♦ జగదుపద్రవకారి, వీనికా నే నిప్డు ♦ విధిహితముగ
సంస్కారములు సేయఁ? ♦ జాల నాపనికిని, నన్న యాటను బూజ ♦ కర్హుఁ డైన

[1] రామరావణులు విరోధులు. రావణసంస్కారము గావించెదనని తానే ముందుగఁ బూర్వము చెప్పుటచేఁ దనయందు రామునకు సందేహకోపములు గలుగునేమో యని యాయన యాజ్ఞగొన నిప్పు డిట్లు చెప్పుచున్నాఁడు.

తే. సంస్కృతికిఁ గాఁడు నే నది♦సలుప కున్న, నెట్టివారలు నను మున్ను ♦ కట్టెఁడి యని
  తిట్టువారలో వార లీ♦చెట్టగుణము, విన్న నను మెచ్చువార లు♦ర్వీతలేంద్ర!

కం. అనవుడు నాతనిపలుకులు, విని పరమప్రీతి[1] ధర్మ♦భృద్వరుఁడును వా
  క్యనిపుణుఁ డగుసీతాపతి, చనవున నొడికారి నసుర♦సత్తము ననియెన్. ౨౪౬

కం. నాకుం బ్రియ మగుకార్యము, నీకుం దగుఁ జేయ జయము ♦ నీమహిమను గా
  దే కలిగె నాకుఁ[2] గావున, నీకు హితము నేను జెప్ప ♦ నెఱి యసురేంద్రా! ౨౪౭

చం. ఎఱుఁగుదు నే నధర్మమున ♦ కేమియుఁ గొంకఁ, డసత్య మాడఁగన్
  వెఱవఁడు, రాక్షసేంద్రుఁ డవి♦నీతి, యయైనను వీర్యవంతుఁడున్
  నెఱసరి తేజువాఁడు సుర♦నేతృముఖాదులచేతనైన నో
  టఱఁ డని లోకరావణుఁ డ♦హార్యసుధీరుఁడు కేవలుం డొకో. ౨౪౮

కం. వైరము మరణాంతము మన, కారియముల్ దీరె మీఁది♦కార్యంబుల సం
  స్కారాదులఁ దీర్పుము నీ, కారయ నితఁ డెట్టివాఁడొ ♦ యట్టిఁడ నాకున్[3]. ౨౪౯

కం. కావునఁ బంక్తిగ్రీవుఁడు, నీవలనన్ విధిహితముగ ♦ నిఖిలక్రియలన్
  గోవిద! సంస్కృతుఁడు, పావనయశ మబ్బు నీకు ♦ భావింపు మెదన్. ౨౫౦

### విభీషణుఁడు రావణునకు దహనాదిక్రియలు దీర్చుట.

సీ. అనుడు విభీషణుఁ ♦ డామాట లాలించి, సంస్కారమునకయి ♦ జతనపడుచుఁ
  జందనకాష్ఠసం♦చయములఁ జితిఁ బేర్చి, పద్మకోశీరము ♦ ల్పఱచి మీఁద
  శాస్త్రోక్తముగ రంకు♦చర్మంబుఁ బైఁ గప్పి, పశ్చిమవిధు లెల్లఁ ♦ బరఁగఁ జేసి
  పితృమేధ మెల్లను ♦ విధ్యుక్తముగఁ జల్పి, చితికి నాగ్నేయంపు♦క్షితిని వేది
తే. నమరఁ జేసి యథాస్థాన♦మందు నిల్పి, వహ్నిఁ బృషదాజ్యపూర్ణస్రు♦వంబు వైచి
  చరణములయొద్ద శకటంబు♦సరగఁ దొడల, యొద్ద నుంచిరి యారాక్ష♦సోత్తమునకు.

సీ. అరణియు దారుపా♦త్రాళియు నుత్తరా, రణి యన్యముసలంబు ♦ క్రమముగాఁగఁ
  దత్తత్స్థలంబులఁ ♦ దగ నిల్పి ఋష్యుక్త, పద్ధతి మేధ్యంపుఁ♦బశువుఁ జంపి
  చితియొద్ద వేలిచి ♦ ఘృతసిక్తదర్భలఁ, బఱచి కన్నీళులు ♦ పాఱుచుండ
  దశకంఠుమాల్యగం♦ధంబులఁ గైసేసి, వస్త్రంబుఁ గప్పి యా♦వారుచితిని
తే. బొరుగులను జల్లి రంతటఁ ♦ బొక్కుమది వి, భీషణుం డగ్నినిచ్చి యా♦పిదపమునిఁగి
  యార్ద్రవస్త్రంబుతోడ దూ♦ర్వాభిమిశ్ర, తిలలు నీళ్లను విడిచె సు♦ధీరతుండు. ౨౫౨

కం. ఉదకంబు లిచ్చి మ్రొక్కుచుఁ, బదపడి యూరార్చి సతులఁ ♦ బనిచి నగరికిన్
  సదమలమతిఁ జని వినయా, స్పదగతి శ్రీరామవిభుని♦సన్నిధి నిలిచెన్. ౨౫౩

కం. రాముఁడు సహసైన్యం డై, సౌమిత్రియు భానుసుతుఁడు ♦ సంసేవింపన్
  భీమ బలువృత్రుఁ జంపిన, భూమీధరవైరివోలెఁ ♦ బొలుచుచు నుండన్. ౨౫౪

---

[1] పరమప్రీతి = పరమ + ప్రీతి; పరమ్ + అప్రీతి. సంస్కరింపనని చెప్పుటచే నప్రీతి.
[2] దీనివలన సందేహభయనివృత్తి. [3] ఇప్పుడు రావణుఁడు నీకువలె నాకును సంస్కార్యుఁడు కావున నీవు సంస్కరింపకుండిన నేను సంస్కరింతునని భావము.

### మాతలి శ్రీరామునిచే ననుజ్ఞాతుండై దివంబునకుఁ బోవుట.

సీ. రావణవధమును ♦ రామవిక్రమమును, రాక్షసవానర♦రణవిధంబు
సౌమిత్రివీర్యంబు ♦ సౌభ్రాత్రగరిమంబు, మార్తండనందను♦మంత్రితంబుఁ
గథలుగాఁ జెప్పుచుఁ ♦ గలను వీక్షింపఁగ,వచ్చినదానవా♦స్వప్నచయము
మరలి పోయెను హర్ష♦భరమున నంతట,రాముండు మాతలిఁ ♦ బ్రేమఁ బొగడి
ఆ. యనుమతించె రథము ♦ హరిహయుకడకును, మరలఁ గొంచుఁబోవ♦మాతలియును
నట్ల సలిపె నంత ♦ నర్కజుఁ గౌఁగిటఁ, గ్రుచ్చి లక్ష్మణుండు♦గూర్మిఁ దెలుప.
తే. అఖిలకపిసేన గొల్వ బ♦లాలయంబుఁ, జేరి పరిసరతలవర్తి ♦ సారకీర్తి
దివ్యకాంతిస్ఫురన్మూర్తి ♦ భవ్యచరితు, లక్ష్మణు సుమిత్రపట్టిని[1]♦లలితగతిని ౨౫౯౬

### విభీషణ పట్టాభిషేకము.

కం. చేరఁగఁ బిలిచి విభీషణుఁ, డారయ రక్షుండు భక్తుఁ ♦ డత్యుపకృతి నా
కార ఘటించెను గావునఁ, గోరెద నభిషిక్తుఁ జేయఁ ♦ గొమరుగ లంకన్. ౨౫౯౭
కం. పరమాభీష్టం బిది నా, కురుమతి నీ వరిగి దాని ♦ నొనరింపు మనన్
సరభసముగ సమ్మదమునఁ, బురికిం జని కనకకలశ♦ముల వేగమునన్. ౨౫౯౮
సీ. కొనిపోయి కీశులు ♦ వననిధిజలములఁ, దెం డన్నవారలు ♦ తెచ్చుటయును
నం దొండు దాఁ గొని ♦ యర్హోత్తమాసనం,బున విభీషణు నిల్పి ♦ బుధవిరోధి
మధ్యంబునందు స♦మంత్రకంబుగ నభి,షిక్తునిఁ గావింపఁ ♦ జెలఁగి యతఁడు
ప్రకృతిజనంబులఁ ♦ బ్రముదంబునను దేల్చి, సచివవర్గంబులు ♦ సంతసింప
ఆ. రామదత్త మైన♦రాజ్యంబుఁ గైకొని, యసుర ముఖ్యు లిచ్చు ♦ నక్షతలును
మోదకములుఁ బుష్ప♦ములు లాజలును గొని, భద్రకరము లైన♦వస్తువులను
చం. కొని రఘురాముఁ జేరఁ జని ♦ కూరిమి వానిని వారి కిచ్చినన్
గని కృతకార్యు శ్రీకలితు ♦ గాదిలిమిత్రముఁ బొంగి యన్నియుం
గొని యతఁ డుల్లసిల్లఁగ న♦కుంఠితభక్తిని నొద్ద నున్న యా
హనుమను జూచి యి ట్లనియె ♦ నాశుగనందన యి ట్లొనర్పుమా. ౨౬౦౦

### శ్రీరాముఁడు హనుమంతుని సీతాదేవియొద్దకుఁ బంపుట.

సీ. చనుము విభీషణు♦సమ్మతి మై లంక, కందు రావణుగృహ♦మందు నున్న
పృథ్వీజఁ బొడఁగని ♦ విజయవార్త వచించి, మిత్రతనూజ సౌ♦మిత్రియుక్తి
నేను సేమం బని ♦ యింద్రారి రావణు, నే జయించినమాట ♦ నెఱుకపఱిచి
సంతసింపఁగఁ జేసి ♦ జలజాక్షి సందేశ,మును గొని చనుదేరు ♦ మనఘ యనిన
ఆ. రామునాజ్ఞ తనశి♦రంబున వహియించి, యసురులెల్లఁ దన్ను ♦ నాదరింపఁ
బంక్తికంఠువేశ్మ♦వాటిఁ బ్రవేశించి, హర్షహీన యగుచు ♦ నడలుదాని ౨౬౦౧

[1] చెప్పినట్లు చేయువాఁడని తెలుపుటకై యీ విశేషణము.

## హనుమంతుఁడు సీతాదేవికి విజయవార్తఁ దెలుపుట.

కం. సాతంకరోహిణీగతిఁ, జేతస్సుఖహీన యగుచుఁ ♦ జెలువతి రక్షః
స్త్రీసతతిపరివృత యగుభూ,జాతక్ భూజాతమూల ♦ సంస్థం గనుచున్. ౨౬౦౨

కం. వినయమున నణఁగి మణఁగియుఁ, జని తనవే ర్వాడి భక్తి ♦ సాష్టాంగముగా
వినతు లొనర్చి యచంచల,తనుఁ డై నిలఁబడినవాయు ♦ తనయుం గనుచున్.

కం. స్మరియించి యతనికృత్యముఁ, బరమానందమున సీత ♦ పలుకక యున్నన్
ధరణిజసౌమ్యాననముం, బరికించి ప్లవంగవరుఁడు ♦ పలుకం దొడఁగెన్. ౨౬౦౪

కం. అమ్మా! మైథిలి! గాదిలి,తమ్మునితో నంబుజాప్త ♦ తనయునితో సై
న్యమ్ములతో రావణుపిన,తమ్మునితో రామవిభుఁడు ♦ తనరుఁ గుశలి యై. ౨౬౦౫

కం. సీతాసాధ్వీమణి! నీ,చేతః పతి యరుల గెలిచి ♦ సిద్ధార్థుం డై
ప్రీతిని దనకుశలంబును, మాతా! నీతోడఁ జెప్పు ♦ మా యని పనిచెన్. ౨౬౦౬

కం. బాసట గాఁగ విభీషణుఁ, డోసతి! నీపతి ప్లవంగ ♦ మోత్తమతతితో
శ్రీసౌమిత్రినయముచేఁ, దా సమరమునందుఁ గూల్చె ♦ దశకంధరునిన్. ౨౬౦౭

కం. రచితాద్భుతకార్యుఁ డసం,కుచితపరాక్రముఁడు నీదు ♦ కుశల మడుగుమన్
వచియింపు మనుచుఁ జెప్పిన,వచనంబులు వినుము కర్ణ ♦ పర్వంబులుగాన్. ౨౬౦౮

సీ. ప్రియముఁ జెప్పెద దేవి ♦ వినుము నీ కనురక్తుఁ,డను జుమ్మి మిక్కిలి ♦ వనజనేత్ర!
మద్భాగ్యవశమున ♦ మనియున్న దానవు, మత్పరాక్రమమున ♦ మనకు జయము
ధర్మవేదిని గల్గెఁ ♦ దలఁగి దుఃఖంబును, స్వస్థచిత్తవు గమ్ము ♦ జనకతనయ!
హతుఁ డయ్యె రావణుం ♦ డఖిలలంకాపురి, మనవశంబున నున్న ♦ దనుచుఁ దలఁపు

ఆ. కన్నుమోడ్పు లేక ♦ కలికి నీ కీచెఱఁ,బావఁ బ్రతిన చేసి ♦ వార్ధియందు
సేతు వొకటిఁ గట్టి ♦ చేసిన బాసను, దీర్చుకొనఁగఁ గంటిఁ ♦ దియ్యఁబోణి. ౨౬౦౯

చం. అణుసమమధ్య! రావణుగృ ♦ హం బని భీతిలఁ బోకుమీ, విభీ
షణునకుఁ గైవసం బిపుడు ♦ సర్వము లంక సమస్తలక్ష్మి, ధా
రిణిసుత! స్వాలయంబునఁ జ ♦ రించుగతిన్ మది నూఱడిల్లుమీ
క్షణమున నిన్నుఁ జూచు కుతు ♦ కాన విభీషణుఁ డేగుదెంచెడిన్. ౨౬౧౦

కం. అన రాకేందునిభానన, విని దిగ్గన లేచి నిలిచి ♦ విగతక్రియ యై
మునిగతి నుండఁగ సతి! యో,జన సేసెద వేల పలుకఁ ♦ జాలవు నాతోన్? ౨౬౧౧

## సీతాదేవి హనుమంతుఁ బ్రశంసించుట.

కం. అని హనుమంతుం డడిగిన, వినియమపర[1] యిట్టు లనియెఁ ♦ బ్రియమున హర్షం
బున గద్గదకంఠంబున, వినుమీ మానంబుకతము ♦ వినుతుఁ గపీంద్రా! ౨౬౧౨

[1] వినియమపర = ధర్మనియతియం దాసక్తిగలది.

సీ. ప్రాణేశువిజయంబు ♦ భాషించు నీప్రియ,వాక్యముల్ విని పర♦వశతఁ జేసి
నిర్వాక్యనైతిని ♦ నిమిష మంజనపుత్ర!, మత్ప్రియంబు వచించు♦మాన్యునకును
సర్వోక్తు లే మని ♦ యందునా యని యెంతొ,యోజించితిని గాని ♦ యొకఁడు లేద
యర్హ వస్తువు నైన ♦ [1]నర్పింతు నందునా, యీడైన దీయిల ♦ నేది లేదు
ఆ. వివిధమణులు గాని ♦ విశ్వంబునం గల,వెండిగాని పైడి♦కొండగాని
యెల్లలోకములయు ♦ నేలికతన మైన, సాటి గాదు నిజము ♦ మాటకైన[1]. ౨౯౧౩

కం.నావుడుఁ బ్రాంజలి యగుచుం, బావని పతిహితముఁ గోరు♦భవ్యచరిత్రా!
పావని! పతిజయకాంక్షిణి, నీ వే తగుదమ్మ యిట్టి♦స్నిగ్ధోక్తులకున్. ౨౯౧౪

చం.పతివిజయంబు వాకొనిన♦వాని కొసంగఁగ సర్వవస్తు వీ
క్షితిఁ గన నంచు నర్మిలి వ♦చించినపల్కది స్నేహపూర్ణ మై
యతులితసారయుక్త మయి ♦ యన్నివిధంబుల దివ్యసన్మణీ
వితతులకంటె నావిబుధ♦విశ్రుతరాజ్యముకంటె మిన్నయా. ౨౯౧౫

కం.హతశత్రుని విజయిని సుస్థితునిఁ శ్రీరాముఁ జూచి ♦ దేవీ! యమర
క్షితిరాజ్యాదులకంటెను, నతిమాత్రోత్కర్ష మంది ♦ యలరెద నేనున్. ౨౯౧౬

కం.అని హనుమంతుఁడు పల్కిన, జనకాత్మజ శుభతరోక్తి♦సంపద వెలయన్
గనుఁగవ నానందాశ్రులు, చినుకఁగ నిట్లనియెఁ బ్లవగ♦శేఖరుతోడన్. ౨౯౧౭

కం.అతిలక్షణసంపన్నం, బతిమాధుర్యగుణభూష♦ణాంచితమును స
మ్మత మష్టాంగ యుతం బగు,మతి యొప్పఁగ నీవ నేర్తు ♦ మాటాడంగన్. ౨౯౧౮

చం.అనిలునకున్ సుతుండవు మ♦హాత్మ! పరం బగుధార్మికుండవున్
ఘనబలశౌర్యసత్త్వశ్రుత♦కాంతిపరాక్రమధీరతాక్షమా
వినయధృతిప్రశస్త గుణ♦విశ్రుతదాక్ష్యగుణాదులెల్ల నో
యనఘ! త్వదాశ్రయంబున మ♦హారుచిసంపదఁ దాల్చి వెల్గెడిన్. ౨౯౧౯

### హనుమంతుఁడు రాక్షసస్త్రీలఁ జంప సీతాదేవి యనుమతి వేఁడుట.

తే. ఆమెవచనంబులను విని ♦ హస్తయుగళి
మోడ్చి వినయంబు దొలఁకఁగ ♦ ముగుద కనియె
హనుమ యో తల్లి! యీరాక్ష♦సాంగనాళి
ననుమతించెద వేని నే ♦ హత మొనర్తు. ౨౯౨౦

సీ. పతి దైవముగ నీవు ♦ భావించి యీవనిఁ, గడుదుఃఖములఁ గుందఁ♦ గరుణ లేక
ఘోరరూపంబులఁ ♦ గ్రూరశీలంబులఁ, గ్రూరతరాక్షులఁ ♦ గ్రూర లైన
రాకాసు లెల్లఁ బూ♦ర్వము నిన్ను నదలించి, బెదరించి కష్టంబు♦ పెట్టువారు
వారి నెల్లర నేఁడు ♦ పదములఁ గరముల, మోఁకాల డాకాల ♦ ముష్టిహతులఁ

[1] ఇప్పుడు గావున్నఁ గాలాంతరమందైన నిచ్చుటకు లోకములోఁ దగిన దేదియు లేదు. [2]సర్వజగత్ప్రభువగు రాముఁడు తన్నాంజనేయునికి సమర్పించుకొనెను గాని యదియుఁ జాలదని సీతభావము.

తే. జంపువాఁడను జెవులను ♦ ద్రెంపువాఁడ
వెంట్రుకలు లాగి మొగములఁ ♦ బెటికి బటికి
యెగిరి దూఁకి పడం ద్రోచి ♦ యీడ్చి పండ్లు
రాలఁ గొట్టెద నిట్టి వ ♦ రమ్ము నిమ్ము. ౨౬-౨౧

**సీతాదేవి హనుమంతునితో రాక్షసస్త్రీలఁ జంపరా దనుట.**

కం. ఈరీతిఁ గూల్తు సీ కప, కారిణులం గిల్బిషాత్మి ♦ కలఁ గ్రూరల నాఁ
జారుగుణ సద్యశస్విని, మారుతసుతు ననియె ధర్మ ♦ మార్గస్థిత యై. ౨౬-౨౨

కం. రాజాశ్రయమున బ్రదుకుచు, రాజాజ్ఞకుఁ జిక్కి మిగుల ♦ ప్రగ్గి కెలస మ
వ్యాజగతిఁ దీర్చునీదా, సీజనములమీఁదఁ గినియఁ ♦ జెల్లునె నీకున్. ౨౬-౨౩

కం. విను నాదురదృష్టంబున, మును చేసినఘోరపాప ♦ మున దుఃఖము లో
హనుమ! యిటు లనుభవించితిఁ, దనచేసినకర్మ మెందుఁ ♦ దప్పుట గలదే? ౨౬-౨౪

కం. ఇది యొందుదశాకాలము, కదిసెను నా కనుభవింతుఁ ♦ గా కని హనుమా
మది నిశ్చయించి వీరల, బెదరులు నే సైఁచుకొంటి ♦ విధిలే కబలన్. ౨౬-౨౫

కం. నిర్జరవిరోధిపనుపునఁ, దర్జించిరి వీర లతని ♦ దాసులు గానన్
నిర్జితుఁ డౌట దశాస్యుఁడు, దర్జింతురె యింక నన్నుఁ ♦ దరుచరవర్యా! ౨౬-౨౬

కం. మున్నొకవ్యాఘ్రంబునకుం, బన్నుగ వచియించె నొక్క ♦ భల్లుక మీయ
త్యున్నతధర్మాన్విత మై, సన్నుతి గను నొకపురాణ ♦ సచ్ఛ్లోకంబున్. ౨౬-౨౭

కం. తన కపకార మొనర్చిన, మనుజున కపకృతి నొనర్ప ♦ మదిఁ దలఁపఁడు స
జ్జనుఁ డీనియతిం బ్రోవఁగఁ, బూనరుఁ; సజ్జనులు శీల ♦ భూషణు లెందున్. ౨౬-౨౮

కం. కపివర! పుణ్యులలోఁ బా, పపుజనములలోన వధకుఁ ♦ బాత్రులపట్లన్
గృపఁ జూపవలయు సజ్జనుఁ, డపరాధముఁ జేయనట్టి ♦ యతఁడుం గలఁడే. ౨౬-౨౯

తే. పాపములె చేయుచును గామ ♦ రూపు లగుచు
భువనహింసావిహారు లై ♦ పొలుచుచున్న
యసురులకుఁ గీడు సేఁత కా ♦ ర్యంబు గాదు
సుమ్ము టన్నను హనుమ యా ♦ సుదతి కనియె. ౨౬-౩౦

**సీతాదేవి శ్రీరాముఁ జూడఁగోరుట.**

కం. రామునకుఁ దగినపత్నివి,[1] శ్యామా! సత్కీర్తియుక్త ♦ వగునీ వికఁ నే
రామునికడ కేఁగెద నీ, వేమి బదులు చెప్పె దనిన ♦ మృగలోచనయున్. ౨౬-౩౧

కం. పతిఁ గనఁ గోరెద మారుత, సుత! యన నతఁ డనియెఁ బూర్ణ ♦ శుభ్రాంశుముఖున్
హతవైరి లక్ష్మణాన్వితు, సతి! నిర్జరయుక్తశక్ర ♦ సముఁ గనెదు విభున్. ౨౬-౩౨

[1] ఈ స్త్రీలు సీతను శరణాగతిచేసిరి. శరణాగతరక్షణవిషయమున రామవాక్యము లిమె వాక్యములేక విధము. దీనసీత దయాళుత్వము అపరాధసహిష్ణుత్వము ఘటకత్వము చెప్పఁబడియె.

కం. అని సాక్షాచ్ఛ్రీయనఁ దగు, వనజాక్షికిఁ జెప్పి భక్తి ♦ వలగొని రాముం
గనుఁగొనఁ దన్నికటమునకుఁ, జనియెన్ వాయుజుఁడు వేగ♦సంపద వెలయన్.

→ సీతాదేవిసందేశమును హనుమ శ్రీరామునితోఁ జెప్పుట. ←

మ. చని కోదండగురూత్తముం గదిసి వా♦చాదక్షుఁ డానామరు
త్తనయుం డిట్లను నేమొకై కమునసా♦ధ్యంబైన కార్యంబులన్
ఘనశక్తిన్ ఘటియించి తత్ఫలము లం♦కానాథనాశంబు నీ
వొనరంజేసితి వట్టిసీత బహుదుః♦ఖోపేతఁ గానం దగున్. ౨౬-౩౪

కం. శోకాకులమతి యై య,స్తోకాశ్రులు గాఱ వనట ♦ స్రుక్కుచు నుండెన్
క్ష్మాకన్యక నీవిజయం, బాకర్ణించినక్షణంబ ♦ యతిముద మందెన్. ౨౬-౩౫

కం. మునుపటినమ్మకమున నా, జనకాత్మజ నన్ను నమ్మి ♦ సహలక్ష్మణునిన్
గనఁ గోరెద సుకృతార్థుని, వనజేక్షణుఁ డైననాదు♦వల్లభు ననియెన్. ౨౬-౩౬

→ శ్రీరాముఁడు సీతాదేవిఁ దోడి తేర విభీషణు నియోగించుట. ←

చం. అని హనుమంతుఁ డాడ సుకృ♦తాత్మవరేణ్యుఁడు రామభద్రుఁడున్
గనుఁగవ నశ్రు లుబ్బ నిలఁ ♦ గాంచుచు హుస్సను వెచ్చనూర్పుచున్
దనమదిఁ జింతచేసి సవి♦ధస్థితు మేఘనిభున్ విభీషణున్
గనుఁగొని ధర్మసంశ్రయ వి♦కారవిదూర సురారినాయకా. ౨౬-౩౭

కం. సీతను వసుంధరాసం,జాతను దివ్యాంగరాగ♦సకలాభరణో
పేతను వేగమ మూర్ధ,స్నాతనుగాఁ జేసి తోడి ♦ చయ్యనఁ దెమ్మా. ౨౬-౩౮

సీ. అనుడు వేవే పోయి ♦ యంతఃపురస్త్రీల, ననిచె సీతాసతి♦కిని వచింప
దివ్యాంగరాగ వై ♦ దివ్యభూషాంచిత, వై దేవి చతురంత♦యాన మెక్కి
మీ నిన్ను నీభర్త ♦ యీక్షింపఁ గోరెడు, నీకు భద్రం బగు ♦ నియమశీల
యనిన జానకి పల్కె ♦ నస్నాత నగుచును, నసురేంద్ర! పతిఁ జూడ ♦ నభిలషింతు

తే. నన విభీషణుఁ డనియె నీ♦ప్రాణవిభుని, యాజ్ఞ యది రాజు ప్రాణేశుఁ ♦ డైనరాముఁ
డెట్లువచియించె నారీతి ♦ నీవు సేయ, నర్హ మగుఁ గాదె యనిన నా ♦ యవనితనయ.

తే. భర్తృదేవత నిజభర్తృ♦భక్తిశీల, సాధ్వి వల్లె యటంచట్లు ♦ సలిపె నంత
జలక మాడించి భూషణ♦జాలభూషి, తాంగి నొనరించి దివ్యవ♦స్త్రాళు లిచ్చి.

తే. మెఱుఁగు లీనెడువస్త్రముల్ ♦ మేలిముసుఁగు, గాఁగ రాక్షసగుప్త మై♦క్రాలుదివ్య
శిబిక జానకి నెక్కించి ♦ శీఘ్రగతిని, విభుని డాయంగఁ దెచ్చె వి♦భీషణుండు.

→ సీతాదేవిరాక శ్రీరామునకుఁ విభీషణుఁడు దెల్పుట. ←

కం. జానకి వచ్చుట యెఱిఁగియు, ధ్యానస్థితుఁ డైనదశర♦థాత్మజుఁ గని ర
క్షోనాథుఁడు వినయంబున, జ్యానాయక సీత వచ్చె ♦ నని తెలుపుటయున్.

కం.చిరకాలము రాక్షసుమం,దిరమున వసియించి మాని♦నీమణి యపుడం
దరుదేర వినుడు రాముని, పరుసము దైన్యంబు రోష♦మావేశించెన్. ౨౬౪౩

కం.అంతట సవిమర్శంబుగఁ, జింతించుచుఁ గనియె ముదము♦ చెదరఁగ సరమా
కాంతుని నుద్విజయరతా,చింతకుఁ గొని రమ్ము వేగ♦ సీత నటన్నన్. ౨౬౪౪

సీ. రామునినుడి విని♦ రాక్షసనాథుండు, జతన మొనర్చెఁ ద♦జ్జనము నెల్ల
దూరంబు దొలఁగింపఁ♦ దూర్ణంబ కంచుకుల్, పాగాలవారును♦ బాఱు దెంచి
తొలఁగుఁడు పో పొండు♦ దూరంబు చనుఁడని, బగళంబు సేయుచు♦ భల్లుకముల
నసురులఁ బ్లవగుల♦ నదలింప వారల,పెనురొదాళము విను♦వీఁది దాఁకె

తే. వానరాదులు దొలఁగుచో♦వారిరవము,వాయువశమునఁ దిరుగుడు♦పడుపయోధి
స్వనముఁబోలినఁ దజ్జాత♦సంభ్రములను,గాంచి దాక్షిణ్యవశమునఁ♦గనలు పూని.

→ శ్రీరాముఁడు విభీషణుఁ గోపించుట. ←

కం.కోపారుణనయనుం డై, చూపులనె దహించుభంగిఁ♦ జుఱచుఱ గనుచున్
భూపతి విభీషణుని నిటు, సోపాలంభముగ ననియె♦ నుత్తమమేధున్. ౨౬౪౬

కం.ఏలా నన్ను విభీషణ!, యేలిద మొనరించి జనము♦ నిటు లేఁచెదిసీ
చాలింపుము నీయత్నము, చాలుగ వీరెల్ల నాకు♦ స్వజనులు సుమ్మీ.[1] ౨౬౪౭

కం.చేలములు ప్రహరులాలయ,జాలంబులు నిట్టిరాజ♦సత్కృతులు తెఱల్
చాలవు చెలువలఁ గావఁగ, స్త్రీలకు సంరక్షకంబు♦ శీలంబె సుమీ. ౨౬౪౮

కం.సమరంబుల వ్యసనములన్, డమరముల స్వయంవరంబు♦నం బెండ్లియెడన్
సుమతీ! యజ్ఞములందుం, గమలాక్షులదర్శనం బ♦కార్యం బగునే? ౨౬౪౯

కం.ఈసీత రణతలస్థిత, మాసరదుఃఖములఁ బొంది♦ మఱిఁగెడి నందున్
నాసవిధంబున నుండఁగ, దోసం బెయ్యదియు లేదు♦ దోఁచిన బయలన్. ౨౬౫౦

→ సీతాదేవి శ్రీరామునమీపంబునకు వచ్చుట. ←

కం.కాన సుహృజ్జనసంవృతుఁ, డౌ ననుఁ గనుఁగాక జనకు♦నాత్మజ తోడితె
మ్మీ నావుడు శంకించుచు, దానవసత్తముఁడు దేవిఁ♦దఱియఁగఁ దెచ్చెన్. ౨౬౫౧

కం.రామునివాక్యంబులకున్, సౌమిత్రియు మారుతాత్మ♦సంజాతుండున్
దామరసాప్తతనూజుం, డేమోయని దుఃఖ మంది♦రెంతయు మదులన్. ౨౬౫౨

కం.రామునిపలుకువిధంబును, నాముఖచిహ్నములు గాంచి♦ యర్కజముఖ్యుల్
భూమిజపై రామునకుం,బ్రేమము లేదనుచుఁ దెలిసి♦ మిడుకుచు నుండన్. ౨౬౫౩

ఉ. ఆవనజాక్షి సిగ్గున ని♦జావయవంబులు ముడ్చికొంచు ర
క్షోవిభు వెంట వచ్చి నృప♦శూరునిముందట నిల్చి గోష్ఠిలో

[1] భగవంతుఁడు తన్నవమానించిన సైఁచునుగాని నిజభక్తపరాభవము సహింపఁడు.

మైవసనంబునన్ ముఖము ♦ మాటుచు వల్లభుఁ జేరఁ బోయి య
ప్పావని యేడ్చె బిగ్గఱగఁ ♦ బ్రాణధవా! యని యార్తిఁ దూలుచున్. ౨౬౫౪

ఉ. దీనతఁ గూరి వెంశి పతి♦దేవత విస్మయమున్ ముదంబు నెం
తేనిని నెయ్యము న్నది వ♦హించి వినిర్మలపూర్ణచంద్రతు
ల్యానన దీర్ఘకాలముగ ♦ నర్మిలిఁ జూడనినాథుజాతిరా
కానళినారిబింబసమ♦కమ్రముఖంబును[1] జూచె నాదటన్. ౨౬౫౫

### శ్రీరాముఁడు సీతాదేవికిఁ దనజయంబుఁ దెలుపుట.

కం. తనప్రక్కన వినయమునన్, వినమితతనులతిక యగుచు ♦ నిలుచుండిన సీ
తను గని హృదయాంతర్గత, ఘనతరకోపమున నృపతి ♦ కడఁగెం బలుకన్. ౨౬౫౬

ఉ. కంటకుఁ డైనశాత్రవుని ♦ గం డడఁగించితి జన్యమందుఁ, గై
కొంటిని నిన్ను, నెయ్యది య♦కుంఠితశక్తి నొనర్పఁ జెల్లు వా
ల్గంటిరొ! యంతయుం జలుపఁ ♦ గంటిని, సార్థక మయ్యెఁ గింకయున్,
గెంటితి శత్రుధిక్కృతిని ♦ గీర్తి వహించితి భూతలంబునన్. ౨౬౫౭

కం. పగవానిని నవమానము, యుగపత్తియుఁ జెఱిచినాఁడ ♦ నుదుటున నాదా
మగఁటిమి జగము లెఱింగెను, మగువా! ఫలియించె నాస♦మస్తశ్రమమున్.

కం. నాపలికినయాబాన వృ,థాపడ కొనరించి నే స్వ♦తంత్రుఁడ నైతిన్
బాపురె యన నాసరిధా,త్రీపాలకులం దలెత్తి ♦ తిరుగం గంటిన్. ౨౬౫౯

కం. నే విడిచి యుండు నెడ నిను, నావిధిఁ జలచిత్తుఁ డసుర ♦ హరియించెఁ గదా
దైవకృతం బగుదోషము, నావలన నిరస్త మయ్యె ♦ నరగురుశక్తిన్. ౨౬౬౦

కం. పరిభవము దొడరె నేనియు, గురుశక్తిం దానిఁ దీర్చ ♦ గొనకొనఁ డేనిన్
బురుషుఁడు పురుషుం డగు నే, పురుషార్థము లట్టినీచ♦పురుషున కున్నే. ౨౬౬౧

కం. జలనిధి లంఘించుటయున్, బలవద్రిపుపురము లంక ♦ భంగంబు మహా
బలసుతు శ్లాఘ్యక్రియ లో,జలజాక్షీ! నేఁడ చుమ్ము ♦ సఫలము లయ్యెన్. ౨౬౬౨

కం. ఆలమున మహాశౌర్యం, బాలోచనములను హితస♦మంచితమంత్రం
బోలి వెలయించువానర,జాలేశ్వరు శ్రమము నేఁడు ♦ సఫలం బయ్యెన్. ౨౬౬౩

ఆ. దోషశీలుఁ డైన♦తోడఁబుట్టినవానిఁ, బాసివచ్చి నాదు♦ప్రాపుఁ గాంచె
నివ్విభీషణుండు ♦ నీవరభక్తుని,శ్రమము సకల మిపుడు ♦ సఫలమయ్యె. ౨౬౬౪

చం. అని వచియించు చుండ హృద♦యాధిపుఁ డామృగశాబనేత్ర లో
చనముల నశ్రువారిచయ♦సంకలితంబులఁ జేయ రాముఁడు
న్గని నెయి వోయ మండుజ్వల♦నం బనఁ గ్రోధవివర్ధితాకృతిం
బొనరెడిభ్రూకుటిన్ భువన♦మోహినిఁ జక్కఁగఁ జూడ కిట్లనున్. ౨౬౬౫

[1] పూర్ణచంద్రబింబ ముదయించువేళ నెఱ్ఱగానుండును.

కం. నాతీ! యరాతికృతపరి,భూతిం దొలఁగింపఁ గోరు♦పురుషుం డెది వి
ఖ్యాతిగ నొనర్పఁ దగు నది, త్రాతల మెఱుఁగంగఁ జలుపఁ ♦ గంటినిశక్తిన్. ౨౬౬౬

తే. జీవలోకంబులకు నెల్ల ♦ నేగి సేయు,రాక్షసులచేత మును దురా♦రాధ్య మైన
శమనుదిశఁ గుంభజుఁడు ముక్త ♦ సలిపినట్లు, శాత్రవార్దిత నిను ముక్త ♦ సలిపినాఁడ.

→ శ్రీరాముఁడు సీతాదేవిని దా నొల్ల నని చెప్పుట. ←

కం. నెయ్యుర సాహాయ్యంబునఁ, గయ్యంబున నరులఁ ద్రుంచి ♦ గాసి పడుచు నేఁ
గ్రయ్యుట నీకై కాదని, తొయ్యలి నీమదిని దెలియు♦దువు గాక యిటన్. ౨౬౬౮

కం. కులగౌరవంబుఁ గావఁగ, వలరింపఁగ నాదుశీల ♦ మపవాదంబుల్
దొలఁగింపఁ గీర్తి నిలుపఁగ, బలితపుఁగయ్యముల గాసి♦పడితిఁ వింటే. ౨౬౬౯

కం. జనశంకితచారిత్రవు, జనకసుతా! నీవు నాదు ♦ సన్నిధినిలువన్
గనుకలకవానిముందటి, పెనుదీపమువోలె దాయ♦విధ మైతి చుమీ.[1] ౨౬౭౦

కం. సీతా! యనుజ్ఞ యిచ్చితి, వే తరలుము నీ కభీష్ట♦విధమున నాశా
వ్రాతంబుల నెట కేనియు, నీతోఁ గార్యంబు లేదు ♦ నిజముగ నాకున్. ౨౬౭౧

కం. ఉత్తమకులజుం డెవ్వఁడు, స త్తేజోయుక్తుఁ డన్య♦సదనస్థిత యౌ
నత్తరుణి మరల నెయ్యపుఁ,జిత్తమునఁ బరిగ్రహించుఁ ♦ జెపు మెవుడేనిన్. ౨౬౭౨

ఉ. దుష్టుఁడు చూచె నిన్నుఁ గడు♦దోసపుఁజూడ్కులచే, దదంకసం
భ్రష్టవు నైతి, విట్టి నిను ♦ రాజకుమారిక! వంశశీలతన్
శిష్టుఁడ నంచుఁ జెప్పికొను♦నే నెటు వెండి గ్రహింప నేర్చెదన్?
గష్టము మానహానికర♦కార్యము రాముఁడు చేయఁ డెన్నఁడున్. ౨౬౭౩

ఉ. కావున నాదుకీర్తి నిలఁ ♦ గాచుకొనన్ దశకంఠుఁ ద్రుంచి సీ
తా! విడిపించినాఁడ నినుఁ ♦ దథ్యము నీవయి స్నేహమోహముల్
భావమునందు లేవు, మగు♦వా! చను మిచ్చట నుండి నీకు మో
దావహ మైనభంగి నెట ♦ కైనను, నీకు ననుజ్ఞ యిచ్చితిన్. ౨౬౭౪

సీ. మానినీ! మఱి మఱి ♦ చక్కఁగ యోజించి, పలుకుచు నున్నాఁడ ♦ స్పష్టఫణితి
నిలుము లక్ష్మణునొద్ద ♦ నేనియు భరతుని,యొద్ద నేనిఁ గపీంద్రు♦నొద్ద నేని
నీవిభీషణునొద్ద ♦ నేని నీ కెది సుఖ, మబ్బంగిఁ జేయుమీ ♦ యవనితనయ
దివ్యరూపవు మనో♦దృష్ట్యభిరామ వై, తనయింటఁ జిక్కిన♦తరుణి నిన్నుఁ

తే. గాంచి దశకంఠుఁ డెటు చాల♦కాల మోర్చి
యూరకుండెడివాఁడు రంభోరు! వింటె
కాన నిను నొల్ల నీయెడఁ ♦ గాముకుండఁ
గాను జను మిచ్చకొలఁది ని♦శ్శంక ముగ యనిన. ౨౬౭౫

[1] దోషము దీపమునందువలె సీతయందును లేదు. కనులను గలక బాధించునట్లు నే నపవాదభీతి బాధపడుచున్నానని భావము. జనకసుత సీత యిట్టి విశేషణముల సార్థక్య మూహించునది.

చం. ప్రియము వినంగ నర్హ యయి ♦ విశ్రుతశీల ప్రియంబు వేచుచోఁ
ప్రియుఁ డిటు లప్రియంబు లనఁ ♦ బెద్దయుఁగాలము చెల్లి యిట్టివా
క్ప్రియములు వింటఁ జేసి మద♦సామజహస్తనికృత్తసల్లకీ
క్రియ వడఁకాడి బొమ్మలకు♦రికి వెలి గాఱిచె దుఃఖతప్తయై. ౨౬౭౬

→ శ్రీరామునివాక్యంబులకు సీతాదేవిదుఃఖించి ప్రత్యుత్తరం బిచ్చుట. ←

సీ. ఎన్నఁడు మును విని♦యేనియు నెఱుఁగని, రోషనిష్ఠురఘోర♦భాషణముల
నిండినసభను గాం♦తుం డిటువల్కిన, లజ్జచేఁ దల వ్రాల్చి ♦ లలితశీల
తనువు నిల్పఁగ లేక ♦ దారుణభాషణ, శరతాడ్యమానత ♦ చ్ఛల్యనమితి
మర్మంబులను నాటి ♦ మఱి మఱి కోయఁగఁ, గన్నీటికాల్వలఁ ♦ గార్చుకొనుచు
తే. నశ్రుజలములఁ దడిసిన♦యాననంబుఁ, బైఁటకొంగునఁ దుడుచుచు ♦ భర్తఁ జూచి
యింతి గాద్గదికం బగు♦నీరెలుంగు, కలుగ మెల్లన వచియించుఁ ♦ గళవళమున.

ఉ. క్షుద్రుఁడు క్షుద్ర నాడుగతి ♦ శ్రోత్రవిదారణ రూక్షవాక్యముల్
భద్రచరిత్ర! పల్కఁ దగ♦వా ననుబోఁటిని? నీ వదేమిగా
ఛిద్రము సంశయించితివి ♦ శీలమునం దటువంటిదానిఁగా
హృద్రస నెంచఁబోకు సుచ♦రిత్రనుపై శపథంబు సేసెదన్. ౨౬౭౮

ఉ. స్త్రీలను నీతిహీన లగు♦చెన్నఁటిఱాఁగల నాత్మ నుంచి యో
షాళులజాతి యంతయును ♦ నట్టిదిగాఁ దలపోయ నేల? మ
చ్ఛీలపరీక్ష నీవు మును ♦ చేసియు యుండిన నిట్టిశంకలఁ
బోలఁగ వీడుమీ, కతము ♦ పుట్టదు పో యిటువంటివానికిన్. ౨౬౭౯

కం. నే వివశగ వ్రాలినచోఁ, నావపు వతేఁ డంటెఁ గాని ♦ నాసమ్మతిఁగా
దీవిషయంబునఁ జూడఁగ, దైవంబే దోషకారి ♦ తథ్యము నాథా! ౨౬౮౦

కం. మానసము నాయధీనము, మానక నీయంద నిలిచె ♦ మానధన పరా
ధీనపుగాత్రము నెడ నో, ప్రాణేశ్వర! యనద నేమి ♦ యగు నొనరింపన్. ౨౬౮౧

చం. చిరముగఁ గూడి యుండితిమి ♦ చిత్తము లేకము గాఁగ, హాళిమైఁ
దిరిగితి మొక్కటై, పెరిఁగి♦తి న్నినుఁ గూడి, పరస్పరంబు దాఁ
పుర మొకయింత లేద, యిటు♦పొల్పుగ నుండియు నాదుశీలమే
యరయవ యేని నీవు హత♦నైతి హృదీశ్వర! శాశ్వతంబుగన్. ౨౬౮౨

సీ. ఏటికి దాఁచితి ♦ వింతాఁకఁ బ్రాణేశ!, నను నెమకంగ నాఁ♦నాఁడు పవన
తనయుని లంకకుఁ ♦ బనుచుచో నప్పుడే, యేటికి విడనాడ ♦ వీవు చెపుమ
యప్పుడే యతనితోఁ ♦ జెప్పి యుండిన నీవు, విడిచిన ట్లునుఉను ♦ విడుచుఁ గాదె
నే మేను వాసిన ♦ నీకును బ్రాణగొం,డ్లం బగు నిట్టిశ్ర♦మంబు లేద

[1] నా ప్రయత్నములేకయే ప్రాణములు తమంతఁ దామే వెడలిపోయియుండును.

ఆ. నీదు నెయ్యురకును ♦ నిర్భరక్లేశంబు, నిష్ఫలంబుగాక ♦ నెగడి యుండు
నీసుహృత్తులకును ♦ నీకును నాకెంత, శ్రమము నిడితి కంటె ♦ జాగు సేఁత. ౨౬-౧౩

ఉ. కేవలకోప మూనుటను ♦ గీడును మేలుఁ దలంప లేక యో
భూవర! నీచమానవుని ♦ పోలిక యూఁదుతనంబు నొక్కటే
భావన చేసె, దే జనకు ♦ వ్యాజమునన్ ధరనుండి పుట్టుటల్
నావలపున్ సువృత్తముఁ ద ♦ లంపవు వృత్తవిధిజ్ఞ యే మనన్. ౨౬-౧౪

సీ. నీచిన్నతనమున ♦ నేఁ జిన్నదాన నై, వఱలుచు నిన్ను వి ♦ వాహ మగుట
నాఁటఁగోలెను నిన్ను ♦ నాథ! దైవంబుగఁ, దలపోసి నే భక్తి ♦ సలుపు చుంట
యిద్దఱహృదయంబు ♦ లేకంబుగా నెప్డుఁ, గలసియు మెలసియుఁ ♦ గ్రాలు చుంట
నీకష్టసుఖము లే ♦ నాకష్టసుఖములం, చన్నియవస్థల ♦ ననుసరించి

ఆ. నేను దిరుగు చుంట ♦ నిర్మలశీలంబు, నీ వెఱుంగనవియె ♦ నీరజాక్ష
యేలయొక్కొ యిప్పు ♦ డిన్నియు వెనుకకు, నెట్టి శంక నొండె ♦ పట్టి తీవు.

↞ సీతాదేవి యగ్నిప్రవేశముఁ జేయుట. ↠

మ. అని డగ్గుత్తికతోడఁ బల్కుచును దుః ♦ ఖాక్రాంత యై దీనుఁ డై
ఘనచింతాబ్ధి మునింగి యున్నమఱఁదిం ♦ గంజాక్షి వీక్షించి యీ
పెనుశోకంబున కౌషధం బగు చితం ♦ బేర్పంగదే లక్ష్మణా!
యనఘా! యిట్టిమహాభిశాపహత నై ♦ ప్రాణంబు నిల్పం జుమీ. ౨౬-౧౬

కం. నుతగుణతతులన్ మెచ్చని, పతిచేఁ బేరోలగమునఁ ♦ బరిహృత యగు నా
సతికిన్ యోగ్యం బగు నా, గతిఁ జనెదన్ వహ్నిఁ జొచ్చి ♦ కాకుత్స్థవరా. ౨౬-౧౭

చం. అని జనకాత్మజాత యిటు ♦ లాడిన దీనత లక్ష్మణుండు రా
మునివదనంబుఁ జూచి నృప ♦ ముఖ్యునియాకృతిసూచితాశయం
బును గొని తన్మతంబునను ♦ భూరిచితన్ సమకూర్ప సీతయున్
వినతశిరస్కఁ డైనరఘు ♦ వీరునకున్ వలగొంచు మెల్లఁగన్. ౨౬-౧౮

కం. ప్రవిమలగుణ జానకి హ, వ్యవహు సమీపించి మోడ్చి ♦ హస్తములు మదిన్
దివిషద్విప్రుల మ్రొక్కుచుఁ, బవనసఖుం గూర్చి యిట్లు ♦ పలికెన్ భక్తిన్.

కం. సత్యంబుగ నాహృదయము, నిత్యంబుగ రామునంద ♦ నిలిచి తలఁగదేన్
బ్రత్యయగతి నెల్లెడలం, దత్యంతము ప్రోచు నన్ను ♦ హవ్యవహుండున్. ౨౬-౨౦

కం. శిష్టచరిత్రను నన్నున్, దుష్టగ భావించె విభుఁడు ♦ దుష్టను గాదేన్
స్పష్టముగ లోకసాక్షి య, నిష్టముఁ దొలఁగించి దహనుఁ ♦ డెల్లెడఁ గాచున్.

కం. మనమున నేన్ వాక్కున నేన్, దనువున నే నెపుడు సర్వ ♦ ధర్మజ్ఞుని రా
ముని నే నతిక్రమింపక, చనియెడ నేన్ బ్రోచు నన్ను ♦ జ్వలనుం డెందున్. ౨౬-౨౨

చం. దినకరుఁడున్ నిశాకరుఁడు ♦ దిక్కులు వాయువు రేలు సంధ్యలున్
దినములు భూమి తక్కఁగల ♦ దేవత లెల్లరు నాదుశీలమున్
మనము నెఱింగి రేని నను ♦ మానము నాయెడ లేద యేని యీ
జన మఖిలం బెఱుంగ నను ♦ సమ్మతిఁ గావుము హవ్యవాహనా! ౨౬౯౫

తే. అనఘ యటు పల్కి సంగహీ ♦ నాంతరాత్మ, శిఖికి సద్భక్తితోఁ బ్రద ♦ క్షిణముఁ జేసి
మహితశిఖ లొప్ప ధగధగ ♦ మండుచుండు, శుచిఁ బ్రవేశించె శుచితర[1] ♦ శుద్ధచరిత.

చం. గడ గడ లాడె నప్పు డటఁ ♦ గల్గినబాలకవృద్ధసంఘముల్
దడ దడ గుండె కొట్టుకొనఁ ♦ దద్దయు భీతిని, మేలిజాళువా
యొడిమెలు గ్రాల మేనఁ బుట ♦ ముంచినపుత్తడిబొమ్మచంద మై
పుడమికుమారి యెల్లజగ ♦ ముల్ గన మండెడుమంటఁ జొచ్చినన్.[2] ౨౬౯౬

ఆ. అమ్మహానుభావ ♦ యగ్నిలోఁ జొరఁబడ, జలదరించి మూఁడు ♦ జగము లప్పు
డమలినాగ్నిలోని ♦ యాజ్యపూర్ణాహుతి, భంగిఁ గాంచె తెప్ప ♦ పాటు లేక.

శా. అచ్చెం బైనమహాధ్వరాగ్నిఁ బడునా ♦ జ్యంబో యనన్ వహ్నిలో
సచ్చారిత్ర వికారశూన్యమతి యై ♦ శాంతిం జొరం బాఱఁగా
నచ్చో మూఁగినమానినీజనులు హా ♦ హాకారపూర్ణాస్య లై
విచ్చుంగన్నులతోడఁ జూచిరి భయో ♦ పేతాత్మికల్ దిగ్భ్రమన్. ౨౬౯౭

తే. సౌరలోకంబునందుండి ♦ శాపనిహతి, నిరయమునఁ ద్రెళ్లు నిర్జర ♦ నీరజాక్షి
నాఁగఁ జూచిరి దేవతా ♦ నాగయక్ష, సిద్ధగంధర్వదానవుల్ ♦ సీత పడుట. ౨౬౯౮

కం. మంటల దూఁకెడియావా, ల్గంటిం గని మూఁగియున్న ♦ కపులును నసురుల్
టంటమ్మను మదులన్ దివి, నంట వెస న్నించి రపుడు ♦ హాహారవముల్. ౨౬౯౯

{ దేవతలు శ్రీరామునకుఁ బ్రత్యక్షంబై సీతాదేవి నిర్దోషురా లని చెప్పుట. }

కం. ఆరవములు విని ధర్మా, చారుఁడు రాముండు బాష్ప ♦ సంపూర్ణాక్షుం
డారఁగ దుర్గనుఁ డగుచును, మూరుత ముండెం దనంత ♦ మునుఁగుచుఁ జింతన్.

సీ. అంత వైశ్రవణుండు ♦ నఘశీలకర్మనుం, డగుదండధరుఁడు స ♦ హస్రనయనుఁ
డగుమహేంద్రుండును ♦ నరిభంజనుం డగు, వరుణుండునున్ వృష ♦ ధ్వజుఁడు శివుఁడుఁ
ద్రినయనుఁ డగుమహా ♦ దేవుండు సర్వలో, కస్రష్ట బ్రహ్మజ్ఞ ♦ కాండవరుఁడు
నగుపితామహుఁడు నీ ♦ యందఱు సూర్యస, న్నిభవిమానంబుల ♦ నింగి విడిచి

తే. లంక కరుదెంచి శ్రీరాముఁ ♦ బంకజాక్షు, నెదుట నిలఁబడ నవతప్త ♦ హేమభూష
ణాన్వితంబులు విపులక ♦ రాంబుజంబు, లెత్తి పల్కిరి చేమోడ్చి ♦ యెదుట ధరణి[3]

[1] శుచితర = అగ్నిహోత్రునికంటెఁ బవిత్రురాలు. [2] భర్తృఁ డిట్టిపరీక్షకు సిద్ధపడి యుండవలయును. [3] దీనిచే రాముఁడు భగవన్నారాయణుఁడగుట స్పష్టము.

చం. నిలఁబడియున్నరాముఁ గని ♦ నీవ మహాత్మ! సమస్తలోకము
 ల్గలుగఁగఁ జేయఁజాలినస♦లంతివి, మిన్నవు జ్ఞానికోటిలో,
 జలజదళాక్షి జానకి కృ♦శానుశిఖావళిలోనఁ జొచ్చినం
 దలఁక కుపేక్ష సేయఁ దగు♦నా? నిను నీవ యెఱుంగ వేటికో? ౨౦౨

సీ. సకలనాకాలయ♦సంఘనాథుండవు, వసువులలోఁ బ్రజా♦పతివి మున్న
 ఋతుధాముఁ డనుపేర ♦ నుతి గన్నవాఁడవు, నఖిలలోకములకు♦నాదికర్త
 నీవ స్వయంప్రభు ♦ వీవ రుద్రులలోన, నష్టమరుద్రుండ ♦ వసమతేజ
 యేనవమూర్తి వీ♦వెల్లసాధ్యులయందు, నశ్వులు కర్ణంబు ♦ లక్షియుగము
తే. చంద్రసూర్యులు జగములు ♦ సమయువేళ, నాదికాలంబుననునుండు ♦ వనఘ నీవు
 ప్రాకృతునిభంగి వైదేహిఁ♦బాయఁ దగునె, కరుణఁ జూడుము భూపుత్రిఁ ♦ గంజనేత్ర

కం. అని లోకపాలు రెల్లరు, వినయంబున విన్నవింప ♦ విని జగములకున్
 వినియమకరణుఁడు రాఘవుఁ, డనియెం దత్త్రిదశనాయ♦కావళితోడన్. ౨౦౪

కం. మనుజుఁడ నని దశరథనృప, తనయుఁడ నని రాముఁడ నని♦తలఁతును నన్నున్
 వినిపింపుఁ డెవ్వఁడను నె, వ్వనివాఁడను నేల నేను ♦ బ్రభవించితినో.[1] ౨౦౫

కం. అని నుడివెడుకౌసల్యా, తనయుంగని బ్రహ్మవిత్ప్ర♦ధానాగ్రణి యా
 వనజజుఁడు సత్యవిక్రమ, వినుమా సత్యంబు రామ ♦ విజ్ఞాపింతున్. ౨౦౬

## ←→ బ్రహ్మ శ్రీరాముని నుతించుట. ←→

దండకము. శ్రీరామరామా! మహాభావ! నారాయణా! దేవ! లక్ష్మీసనాథా! యనాథాధినాథా! విభూ! శంఖచక్రాయుధా! నీవ మున్నొంటికొమ్ముంగంబుభూదార మై భూమికాధార మై నిల్చి పెన్వేల్పవుం, జన్న రానున్నయాసూదులం గీడులం గూర్చి వేధించి సాధించి బాధించుబల్ప్రోడవున్, నీవ బ్రహ్మంబు, సత్యంబు నీ, వక్షరం బెల్లకాద్యుండు మధ్యాంతసంస్థుండును న్నీవ, లోకాళికిన్ సిద్ధధర్మంబు కర్మంబు మర్మంబునున్ నీవ, నీవే చతుర్బాహువున్ స్వామియున్ శార్ఙ్గివిన్ శంఖివిన్ ఖడ్గివిం గృష్ణుండున్ విష్ణుఁడున్ బుద్ధియున్ సిద్ధియున్ సత్త్వముం దత్త్వమున్ శాంతియుం దాంతియుం బూరుషాఖ్యుండవుం బూరుషోత్కృష్టరూపంబును న్నీవ, నీవే హృషీకేశ విఖ్యాత మూర్తీ! యజయ్యుండవున్ సర్వసేనానివిన్ గ్రామణీరత్నమున్ స్రష్టవుం ద్రష్టవున్ నీవ, నీయందె డిందున్ సమస్తంబు పేంద్రా! హరీ! మధ్వరీ! యింద్రకర్తా! మహేంద్రా! నరేంద్రా! మునీంద్రాదివంద్యా! పరా! పద్మనాభా! విరోధ్యంతకారీ! శరణ్యుండవున్ నీవ, నిన్నే సుమీ సర్వరక్షైకసామర్థ్యదక్షుండవున్ లోకచక్షుండ

[1] ఇది యజ్ఞానముచే నడిగిన ప్రశ్న కాదు. తన్నుఁ దాను జెప్పుకొనుటకంటెఁ బరులు చెప్పిన లోకులు విశ్వసింతురు. కావునఁ దన పరత్వము సుగ్రీవాదులకుఁ దెలియఁజేయుటకై యడుగఁబడెను. పరత్వమునకంటె మనుష్యాభినయము, అందు దశరథకుమారత్వము, అందు రామత్వము నాకుఁ బ్రియమని భావము.

వం బెల్లదివ్యర్షు లుత్కృష్టభావించి సేవించి స్తోత్రంబుఁ గావింత్రు, శాఖాసహస్రాత్త
కామ్నాయరూపా! మహర్షిప్రవేశా!యనేకోరుజిహ్వ జగత్పాళి కీవాద్యుఁ డాకర్త
వుఁ ధర్తవుఁ హర్తవుఁ నీవ, నీవే స్వయంభర్తవుఁ, సిద్ధసాధ్యాశ్రయుం డీవ, నీవే
సుమీ సృష్టికి న్నుందు భాసిల్లురూపంబు, యజ్ఞంబును న్నీవ, నీవే వషట్కార
మోంకారమున్నీవ, నీవే సముత్కృష్టయోగైకగమ్యుండవుఁ, భక్తరమ్యుండవుఁ
నీవ, నీపుట్టువుం బట్టునుఁ గిట్టుటఁ వెండి నీ విట్టివాఁ డంచు నెవ్వాఁ డెఱుఁ
గుఁ, రమాధీశ! గోజాతభూనిర్ఝరాక్రాంత భూతావళీ శైలదిగ్జాలకాంతార
దేశంబులఁ నిండి రాణింతు వో దేవదేవేశ! నీవే కదా వేయిపాదంబులఁ
వేయిశీర్షంబులఁ వేయినేత్రంబులం బూని భూతంబులఁ గోత్రసంఘాతసం
స్థిత మాభూతధాత్రిఁ వహింపఁ సహింపంగ దక్షుండ, వీక్షోణి కల్పాంత
వేళఁ మహాహీంద్రతల్పుండవై దేవ! గంధర్వదైతేయసంఘంబులం దాల్చి
ప్రత్యక్షమై యుందు, వో రామ! నీచిత్త మే నేను, నీజిహ్వయే వాణి, రోమాళి
దేవాళి, యోగీశహృద్ధామ! శ్రీధామ! కఁ రెప్పలఁ మూయఁగా రేయి, విప్పం
బగల్, నీదునిశ్వాసముల్ వేదముల్ రామ! నీకాని దావంతయుఁ లేదు,
సర్వంబు లోకంబు నీకుఁ శరీరంబు, స్థైర్యంబు భూగోళ, మగ్నుల్ ప్రకోపంబు,
శ్రీవత్సచిహ్నా! ప్రసాదంబు సోముండు, నీవే కదా మున్ను వైరోచనిం జేరి దానం
బునుం గోరి పాదత్రయీన్యాసరూపంబునఁ సర్వలోకంబులుఁ నిండి దండించి
తాదైత్యు, దైత్యారికిం బట్టముం గట్టి రక్షించి తో దివ్యమూర్తీ! లసత్కీర్తి!
శ్రీలక్ష్మియే సీత, విష్ణుండవే నీవు, కృష్ణుండునుఁ నీవ, నీవే ప్రజానాథవాచ్యుండ
వాపంక్తికంఠుఁ వధింపంగ నై మానుషీదేహముం జొచ్చి రక్షోధిపుం ద్రుంచి
మాకార్యముం దీర్చి లోకంబులం దేర్చి తీ వింక హృష్టుండ వై ధాత్రిఁ బాలించి
యాపై దివిం జేరుమా, యోరమానాథ! నీవీర్యసారం బమోఘంబు, నీఘోర
శౌర్యం బమోఘంబు, నీదర్శనం బే నమోఘంబు, నీస్తోత్రముఁ మోఘ మే వేళ
నేవారికిం గాదు, నిఁ భక్తిచేఁ గొల్చి చిత్తంబునం దాల్చునీభక్తు లావారి కేలోప
ముల్ లేవు, నిన్నుం బురాణుఁ సదాపూరుషోత్తంసు నిశ్చంచలం బైనసద్భక్తి
సేవించుభక్తుల్ జగద్రక్షకా! యైహికాత్యంతసౌఖ్యంబు లెల్లప్పుడుం గందు రీశా!
నమస్తే నమస్తే నమః. ౨౭౦౭

ఆ. అనఘమును బురాణ ♦ మైతిహ్య మార్షంబు నైనయీస్తవంబు ♦ ననుదినంబుఁ
బరమభక్తితోడఁ ♦ బఠియించువారికి, రాద దెప్పుడేఁ బ♦రాభవంబు.[2] ౨౭౦౮

[1]కౌసల్య గర్భమును. శ్రీరాముఁడు శుద్ధసత్త్వమయ దివ్యమంగళ విగ్రహుఁడుగదా. [2]పరాభవము = మఱుజన్మము. బాహ్యాభ్యంతర శత్రు తిరస్కారము.

### అగ్నిహోత్రుఁడు సీతాదేవిని శ్రీరామునకు మరల నర్పించుట.

కం. అని మంగళకరసూక్తులు, వనజాసనుఁ డాడుచుండ ♦ వైశ్వానరుఁడున్
జనకసుత నంకతలమునఁ, గొని నరుఁడై చితను జిమ్ము♦కొనుచున్ వచ్చెన్. ౨౭౯

సీ. తరుణార్కబింబంబు ♦ నిరసించుదానిని, నవ్యహాటకభూష♦ణములదాని
నీలకుంచితకేశ♦జాలకంబులదాని, రక్తాంబరంబునఁ ♦ గ్రాలుదాని
వాడనిమాలికా♦భరణము ల్గలదానిఁ, జెక్కుచెదరనిమేని♦నిక్కుదాని
సంకురింపనిచిత్త♦సంకోచ మగుదాని, మునుపటిరూపంబ ♦ మొనయుదాని

ఆ. సర్వలోకసాక్షి ♦ జాతవేదుఁడు బాల, నొడిఁ గదించి తెచ్చి ♦ పుడమితేని
కిచ్చి యిట్టు లనియె ♦ నీమె నీవైదేహి, యీమెయందుఁ బాప ♦ మేమి లేదు.

కం. మానసమున భాషణమున, ధ్యానంబునఁ గనుల నైనఁ ♦ దరుణీమణి యీ
జానకి సువృత్త నిన్నుం, దా నెప్పుడు మీఱలేదు ♦ తతశుభచరితా. ౨౮౧

ఉ. ని న్నెడఁబాసి దీన యయి ♦ నిర్జనసీమను నస్వతంత్ర యై
యున్నసుశీల నీమె దురి♦తోగ్రచరిత్రుఁడు బల్మిఁ దెచ్చె, నుం
చె న్నిజగేహమందు, నటు♦చేసిననున్ నినుఁ జింత సేయుచున్
నిన్నె భజించెఁ జూ వికృత♦నేత్రలు రక్కసు లెప్డుఁ గావఁగన్. ౨౮౨

తే. మోసగించెను దా నెంతో♦యాసముంచె, ధిక్కరించెను బెదరించెఁ ♦ గ్రక్కసించె
నేమిసేసిన లక్షింప ♦ దీమె యతని, ననఘ నీయంద తనహృద♦యంబు నిలిపి

కం. రామా! విశుద్ధమానస, నేమాత్రం బైన బాప ♦ మెఱుఁగనిసాధ్విన్
నామాటఁ బట్టి యేలుమ, యీమెను నడ్డంబు లాడ ♦ కేమియు నిపుడే. ౨౮౪

### శ్రీరాముఁడు శ్రీ సీతాదేవిని బరిగ్రహించుట.

కం. అని యాశ్రయాశుఁ డాడిన, విని ప్రీతాత్ముండు రామ♦విభుఁ డశ్రుతతుల్
కనుదోయి ముంప మూర్తం, బనఘుఁడు చింతించి యిట్టు ♦ లను దహనునకున్.

ఉ. జానకి శుద్ధురా లగుట ♦ సత్యమ యైనను దీర్ఘకాల మీ
దానవనాథునంతిపురిఁ ♦ దా నివసించుట నిప్పు డూరకే
యేను గ్రహించినన్ దశర♦థేశ్వరుపుత్త్రుఁడు రాముఁ డెంతధీ
హీనుఁడు కాముకుండు గ్రహి♦యించె సతిం బరికింప కేమియున్. ౨౮౬

చం. అని యిటు ముజ్జగంబులను ♦ నార్యులు పల్కరె నన్ను? దానికే
జనకజ భర్తురా లనియు ♦ సాధ్వి యనన్యమనస్కయంచు నా
మనము నెఱింగి వర్తిలెడి♦మానితశీల యటం చెఱింగియున్
జనముల నమ్మఁ జేయ సతి ♦ సత్యరతుండ నుపేక్షసేసితిన్. ౨౮౭

చం. చెలువలమిన్న దన్నెపుడు ♦ శీలమహత్త్వము పేర్మిఁ గాచుకోఁ
గల దని, పంక్తికంధరుఁడు ♦ కాండధి వేలనుబోలె మీఱఁగా
వలఁతియు గాఁడటంచు, సతిఁ ♦ బావుఁడు మండెడుమంటపోలికం
దలఁపున నేని ధిక్కృతి యొ♦నర్పఁగ లేఁ డని నే నెఱుంగుదున్. ౨౭౧౮

తే. రావణాంతఃపురంబున ♦ రమ్యశీల, యర్హ్యాదు సుఖశ్రీల ♦ ననుభవింప
సూర్యునకు నెండవోలె నీ♦సుందరాంగి, నన్ను విడనాడి యుండ లే ♦ దెన్నఁడేని.

ఉ. పూతచరిత్ర యీజనక♦పుత్త్రిక శుద్ధ జగత్త్రయంబునన్
స్ఫీతసుకీర్తినిన్ సుమతి ♦ వీడఁగఁ జాలనిభంగి నెట్లు భూ
జాతను బాయనేర్తు? సుర♦సత్తములార! త్రిలోక్యపూజ్యులున్
ఖ్యాతులు స్నిగ్ధు లీర లిటు ♦ లా నన నే నొనరింప కుందునే. ౨౭౨౦

కం. ఇటు తనయెఱిఁగినవిషయము, స్ఫుటముగ వచియించి నిఖిల♦సురసన్నుతుఁ డై
కుటిలాలక సీతం గొని, పటుతరసౌఖ్యంబు రామ♦భద్రుఁడు గూరెన్.[1] ౨౭౨౧

శ్రీ సీతారామలక్ష్మణులు దశరథు సందర్శించుట.

సీ. సూర్యకులేశ్వరు♦శుభసుభాషితముల, విని శుభతరసూక్తి ♦ ననియె శివుఁడు
భూరిభుజా! సిత♦పుష్కరలోచన!, పీనవక్షా! శస్త్ర♦భృద్వరేణ్య!
మాభాగ్యమున వైరి♦మర్దనా! యిప్పుడే, కార్యంబుఁ జలిపితి ♦ కౌనలేయ!
మాయదృష్టంబున ♦ మహితదారుణతమం, బను రేంద్రభవము భ♦యంబుఁ బాపి

ఆ. తఖిలలోకములకు ♦ నాశ్వసింపుము దీను, భరతు నీదుజననిఁ ♦ బ్రథితచరిత
యైనకైక లక్ష్మ♦ణాంబామణి సుమిత్రఁ, బట్టి మయ్యయోధ్యఁ ♦ గట్టుకొనుము.

కం. అలరింపు సుహృజ్జనముల, నిలుపుము యిక్ష్వాకుకులము ♦ నిరుపమకీర్తిన్
వెలయుముతురంగమేధము, సలుపుము సువదాన్యయశము ♦ జగముల నిలువన్.

కం. త్రిదివంబునకుం జనుమీ, పదపడి; యదె చూడు భూమిఁ ♦ ద్విజనకుం డై
యుదితయశుం డై గురుఁడై, విదితుం డగుదశరథుండు ♦ వియదధ్వమునన్.

తే. పుత్త్రరత్నంబ వగునీదు♦భూరిమహిమఁ, దారితుం డయి శక్రప♦త్తనమునందుఁ
గలితసుశ్రీలఁ దేలుచు ♦ గగనయాన, మందు నిలిచినవాఁడు మ♦హానుభావ!

కం. సౌమిత్రితోడ నీవును, ధీమహితా! మ్రొక్కు మన్నఁ ♦ ద్రిపురహరునుడిన్
రాముఁడు సానుజుఁ డై యా,వ్యోమరథస్థున్ సుకాంతి♦యుక్తున్ జనకున్. ౨౭౨౬

కం. విరజోంబరధారిని గని, కరములు ముకుళించి మ్రొక్కె ♦ క్ష్మానాథుఁడు ము
ద్భరమునఁ బ్రాణప్రియతను, వరసుతు నంకంబుఁ జేర్చి ♦ పరిరంభించెన్. ౨౭౨౭

దశరథుఁడు శ్రీరాముని బ్రశంసించుట.

ఉ. ఈమెయిఁ గౌఁగిలించికొని ♦ యెంతయురక్తి మహీశుఁ డిట్లనున్
రామ! నిజంబు చెప్పెద సు♦రస్థిర మానిసురాళిచేత న

[1] జీవునికి సాయుజ్యప్రాప్తి యిట్టిది. ఆకారత్రయసంపన్నతచేఁగాని యది లభింపదు.

నోర్నిమహనీయసత్కృతుల ♦ నొందుచు గౌరవ మందు చుండియున్
నామది లేదు సంతసము ♦ నాయన! నిన్నెడఁబాసి యుండుటన్. ౨౭౨౮

కం. దుర్నయులం బోరిగొని సం,పూర్ణాత్ముఁడ వైననిన్నుఁ ♦ బొడఁగనుటను ని
స్తీర్ణవనవాసు నిప్పుడు, పూర్ణమనస్కుండ నైతిఁ ♦ బుణ్యచరిత్రా. ౨౭౨౯

ఉ. కానల నిన్నుఁ ద్రోయు మని ♦ కైక వచించినసిష్ఠురోక్తు లీ
మానసమందు నాటినవి ♦ మానక యిప్పుడు కౌఁగిలించి స
మ్మానితు నిన్ను లక్ష్మణుని ♦ మానితి దుఃఖము, మంచుపాయుటన్
భానుఁడువోలె నే మరల ♦ భాసిలఁ గంటిఁ గదయ్య పుత్రకా! ౨౭౩౦

కం. శిష్టుఁడు ధర్మాత్ముఁడు నగు, నష్టావక్రుఁడు కహోళు ♦ ననువున నీవా
శ్రేష్టుఁడ వగుపుత్రుఁడ వై, విష్టమునఁ దరింపఁ జేసి ♦ తివి నను వత్సా. ౨౭౩౧

కం. రావణవధాభిలాషులు, దేవత లెల్లరును నాకృ ♦ తిన్ విఘ్నంబున్
గావించిరి పురుషోత్తమ, యావిధ మే నిపు డెఱుంగు ♦ టయ్యెం దండ్రీ. ౨౭౩౨

కం. జన్యమున నరులఁ బోరిగొని, వన్యావళి నుండి మరలి ♦ వచ్చిననిను దుః
ఖాన్యమతిఁ గనఁగఁ జాలెను, ధన్య గదా నిన్నుఁ గన్న ♦ తల్లి కుమారా. ౨౭౩౩

కం. వన్యాగతు సుఖయుతు సౌ,జన్యధనా! యాభిషేక ♦ జలసంక్లిన్నున్
మాన్యుని రాజుగఁ గందురు, ధన్యులువో పురముజనులు ♦ ధర్మవిచారా! ౨౭౩౪

కం. అనురక్తుండును భక్తుఁడు, వినియమవంతుండు శుచియు ♦ విక్రమవరుఁ డౌ
ననుజుఁడు భరతుఁడు నీవును, గనఁ గోరెదఁ గలసి మెలసి ♦ గరిమఁ జరింపన్.

సీ. పదునాల్గువర్షముల్ ♦ వనములఁ గడపితి, సీతతో ధీశాలి ♦ భ్రాతతోడఁ
బ్రతినయు నెఱవేర్చెఁ ♦ బంక్తికంధరుఁ ద్రుంపఁ, బరితోషమందిరి ♦ సురలు మునులుఁ
గెలసము ల్దీర్చితి ♦ వలఘుకీర్తిని గంటి, పట్టాభిషేకోత్స ♦ వంబుఁ గాంచి
తమ్ములతోడ సు ♦ ఖమ్ముగ దీర్ఘాయు, వగుచు రహింపుమీ ♦ యన్న! యనిన

ఆ. జనకుఁ జూచి రామ ♦ చంద్రుఁ డిట్లనుఁ దండ్రి!, కరుణఁ దలఁపు కైక ♦ భరతులందుఁ
గొడుకుతోడ నిన్ను ♦ విడిచితి నంటివి, తొలుత శాప మదియుఁ ♦ దొలఁగుఁ గాత.

### ⟵ దశరథుఁడు లక్ష్మణునకు శ్రీరామసేవ కర్తవ్య మని బోధించుట. ⟶

కం. అనవుడుఁ గా ని మ్మనుచు, న్వినయమ్మునఁ గేలు మొగిచి ♦ నిలుచుసుమిత్రా
తనయునిఁ గని తమి నాలిం,గనముం బొనరించి పలుకుఁ ♦ గరుణాయుతుఁ డై.

సీ. జానకీరాముల ♦ చరణసేవ యొనర్చి, ధన్యుండ వైతివి ♦ తనయ! నీవు[1]
అత్యంతతుష్టుండ ♦ నైతి నీచరితకు, ధర్మఫలం బెల్లఁ ♦ దనరె నీకు
స్థిర మయ్యె నీకు స ♦ త్కీర్తి ధర్మము ధర, రామునికరుణ స్వ ♦ ర్గంబు మహిమ
సమకూరెఁ జుమి రామ ♦ చంద్రు భజింపుము, రాముఁడే త్రిభువన ♦ క్షేమరతుఁడు

[1] కైంకర్యమే మోక్షప్రదము.

ఆ. సేంద్రు లగుచు నెల్ల♦సిద్ధులు ఋషులును, మూఁడులోకములును ♦ మొనసి వచ్చి
యిమ్మహానుభావు ♦ నీపురుషోత్తముఁ, బూజ సేయుచుండుఁ ♦ బుణ్యశీల ౨౭౩౮

మ. ఇతఁ డవ్యక్తుఁడు నక్షరుండు దివిష ♦ ద్బృందాంతరాత్ముండునున్
శ్రుతిసంస్థాపితతత్త్వమూర్తి యనఘా ♦ శుద్ధుండు వైరిఘ్నుఁడున్
శ్రుతిసంవేద్యుఁడు నైనబ్రహ్మ మనుచున్ ♦ క్షోణీస్థలిన్ రాము నా
కృతి జన్మించె నటంచుఁ జెప్పిరి సుమీ ♦ యీయున్ననా రెల్లరున్. ౨౭౩౯

కం. సీతాయుతుఁ డీరామునిఁ, బ్రీతిం బరిచర్యఁ దనిపి ♦ ప్రిదులనిభక్తిన్
బూతం బగుసత్కీర్తియు, నాతతధర్మాచరణము ♦ నందితి తనయా. ౨౭౪౦

దశరథుఁడు సీతాదేవి నూరార్చుట.

కం. అని సౌమిత్రికి దశరథ, జనపాలుఁడు పల్కి పగమ♦చరితఖ్యాతన్
జనకేశ్వరసంభూతను, గని సీతన్ శుభతరోక్తి ♦ స్థ్మాపతి యనియెన్. ౨౭౪౧

మత్తకోకిలము. కోపగింపకు మమ్మ నీపతిఁ ♦ గోడలా! యిటు సేతకున్
నీపతివ్రతమున్ జగంబుల ♦ నిత్యమై వెలుఁగొందెడిన్
బాపదూర వటంచుఁ దెల్పఁగఁ ♦ బాల్పడెన్ హితకామి యై
సాపరాధుఁడు గాఁడు కూరిమి ♦ సైఁప వమ్మ సతీమణీ! ౨౭౪౨

కం. పతిశుశ్రూషారత వై, క్షితి వెలయు మటంచు నేను ♦ జెప్పఁగ నేలా?
పతికన్న వేలువరదై, వతమే లే దమ్మ నీకు ♦ వసుధాతనయా. ౨౭౪౩

కం. అని కోడలి నూరారిచి, జనవినుతుఁడు దశరథుండు ♦ చనె నాకంబున్
దనదువిమానంబున మఱి, దినకరకులమణిని గాంచి ♦ దేవేంద్రుఁ డనున్. ౨౭౪౪

ఇంద్రునివరంబుచే మృతవానరులు పునర్జీవితు లగుట.

సీ. నీదర్శనము సేత ♦ నెగడ సార్థకమయి, ప్రీతుల మైతిమి ♦ ఖ్యాతచరిత
యిష్ట మెయ్యది నీకు ♦ నెఱిఁగింపుమా యన, జానకీలక్ష్మణ♦సహితుఁ డగుచు
నభివాదన మొనర్చి ♦ యనియె శ్రీరాముండు, కరుణ నాపై నీకుఁ ♦ గలద యేని
వచియింతుఁ దీర్పు నా♦వాంఛ నాకై యని, హతులయి యముపీటి ♦ కరిగినట్టి

ఆ. వారలెల్ల మరలఁ ♦ బ్రాణసంయుక్తులై, సతులతోడ ముద్దు♦సుతులతోడ
వెలయవలయు నాదు♦ప్రియు లనురక్తులు, మృత్యుముక్తు లగుత ♦ సత్యముగను.

కం. నీరుజములు నిర్వ్రణములు, పౌరుషబలయుక్తము లయి ♦ భల్లుకకపిసం
వారంబులు విలసిల్లఁగఁ, గోరెదఁ దొల్లింటియట్ల ♦ కుధరచయారీ. ౨౭౪౬

కం. కాలంబు గాకయును నే, వేళన్ వారున్నచోట ♦ వివిధఫలంబుల్
మూలంబు లమరవలయును, నేళుల జలములు సమృద్ధి ♦ నెసఁగ న్వలయున్.

కం.ఇవి నాకోరువరంబులు, దివిజపతీ! యొసఁగు మనిన ♦ దేవేంద్రుఁ డనున్
భువనేశ! మహావరముల, నివి యొసఁగితి నాడి తప్పు ♦ లెఱుఁగను గానన్.

చం.అనిమొన రక్కసు ల్దునుమఁ ♦ బ్రాణము వాసినభల్లుకంబులున్
వనచరు లాదిగాఁగలుగు♦వారలు నీరుజులై వ్రణచ్యుతిన్
మనుపతిశౌర్యదర్పముల ♦ నూల్కొని నిద్దుర లేచుభంగి నో
జనవర! లేచువారు తమ♦జ్ఞాతులతో హితమిత్రపాళితోన్. ౨౬౯

కం.కాలంబు గాకయును హే,రాళంబుగ వెలయుఁ గుసుమ♦రాజులు ఫలముల్
మూలంబులు వృక్షంబుల, నేళుల శుభజలసమృద్ధి ♦ యొసఁగుం గాతన్. ౨౭౦

కం.గాయములు మాని దృఢతర,కాయంబుల లేచువారు ♦ కపు్యాదు లనన్
మాయురె నిదురను మేల్కొను,నాయనువున లేచి రెల్ల ♦ రచ్చెరువు పడన్. ౨౭౧

కం.ఏమిది యేమిది యని యెం,తో ముదమబ్బురము మదులఁ ♦ దొలఁకాడఁగ శ్రీ
రామునిఁ జేరం జని శా,ఖామృగములు మ్రొక్కి నిలిచె ♦ ఘనతరభక్తిన్. ౨౭౨

ఉ. అంత సురల్ ప్రపూర్ణహృద♦యాంతరు రాము నుతించి జానకీ
కాంత! వనాటులన్ విడిచి ♦ క్రన్న నయోధ్యకుఁ బొమ్ము యీశుచి
స్వాంతఁ దపస్విని బ్రియను ♦ సమ్మతిఁ దేర్పుము, దుఃఖకారణా
క్రాంతల నెల్లతల్లులను ♦ గారవ మారఁగ నూఱడింపుమా. ౨౭౩

కం.నీకై శోకించుచు న,స్తోకవ్రత మూనియున్న♦శుభతరశీలున్
గైకసుతుం గనుమీ మహి,మాకలితుం బిన్నతమ్ము ♦ నరయుము ప్రేమన్. ౨౭౪

కం.పట్టాభిషేకమును గొని, పట్టనజనములను ముదము♦పఱుపుము మామా
పట్టుల కరిగెద మని భూ,మిాట్టుముదల నొంది దివిజు ♦ లేగిరి దివికిన్. ౨౭౫

చం.సుర లిటు లేగ రాఘవులు ♦ సొంపును సింపును నివ్వటిల్ల వా
నరవరులన్ సమర్హగతి ♦ నవ్యతలంబుల నెల్ల నిల్ప నా
గురుతరసేన మేర యని ♦ గుర్తిడరాని ముదంబుతో నిశా
కరయుతయామినీగతిని ♦ గ్రాలె మనోహర మై ప్రభాఢ్య మై. ౨౭౬

విభీషణుఁడు శ్రీరాము సంస్కారాదు లంగీకరింపఁ బ్రార్థించుట.

కం.రాతిరి గడిపి సుఖంబుగఁ, బ్రాతఃకాలమున లేచి ♦ రాజిలురామ
త్మ్యాతలవిభుఁ గని సుఖవా,కూ్యతముగ విభీషణుండు ♦ కొమరుగఁ బలుకున్.

ఉ. ఘమ్మనుదివ్యతీర్థములు ♦ కమ్రతర మ్మగుమేలియంగరా
గమ్ములు స్థానకమ్ములు ని♦గారపుఁగ్రొత్తపసిండిపట్టువ
స్త్రమ్ములు సొమ్ములున్ మలయ♦జమ్ములు దైవతవృక్షపుష్పమా
ల్యమ్ములు సిద్ధ మైనయవి ♦ యంబుజపత్రవిశాలలోచనా. ౨౭౭

కం.వివిధాలంకారకళా,సువిదిత లీపద్మముఖులు ♦ సుఖముగ నీ కా
ప్లవ మొనరింతురు నా పైఁ, దవిలినగురుకరుణ సమ్మ♦తము జూపఁ గదే. ౨౭౫౯
చం.అనవుడు రామచంద్రుఁ డను ♦ నాదటస్నానము సేయ వేఁడుమీ
యినతనయాదులన్, భరతుఁ ♦ డెంతొ సుఖార్హుఁడు నానిమిత్త మై
యనఘుఁడు సత్యసంశ్రవుఁ డ♦నంతబలుండు కుమారుఁ డుగ్రని
ష్ఠను వనరంగ నా కిచట ♦ సౌఖ్యపడన్ మన సెట్టు లొప్పెడిన్. ౨౭౬౦
కం.జననుతధర్మచరిత్రుం, డనుజుఁడు భరతుండు లేక ♦ యాభరణంబుల్
గొన వస్త్రంబులఁ గట్టను, ననఘా! యభ్యంజనంబు ♦ నాసం జేయన్. ౨౭౬౧
కం.మానగర మరుగుమార్గము, కాననదుష్టంబు గానఁ ♦ గష్టం బిపుడే
మానగుఁ బయనింపఁగ నన, మానవపతిఁ జూచి సుగుణ♦మండితుఁ డనియెన్.
సీ. మార్తండతుల్యవి♦మానంబు గల దొండు, పుష్పకాఖ్యంబు స♦త్పూజ్యతరము
రణమున యక్షేశు ♦ రావణుండు జయించి, హరియించెఁ గామగం ♦ బదిన్పపాల
దివ్యంబు నీకు నై ♦ తివిరి నిల్పితి వారి,వాహనిభం బొక♦పగటిలోన
నిన్న యోధ్యకుఁ జేర్చు ♦ నిశ్చింతముగ నుండు, నామీఁద లవమేని♦ప్రేమ యున్న
ఆ. నాగుణాళి నీకు ♦ జ్ఞప్తియం దున్నను,స్నేహభావ మైన ♦ నివ్వటిలిన
రామచంద్ర! నీవు ♦ రమణితో ననుజుతో, నిలఁగదయ్య యిచట ♦ లలితశీల!
ఉ. మిమ్ము మహానుభావులను ♦ మేలిసపర్యలఁ దన్పఁ గోరెదన్
సమ్మతి నెల్లమిత్రులను ♦ సైన్యములన్ విహితార్చనాళి సౌ
ఖ్యమ్ములఁ దేల్పఁ గోరెద మ♦హాపురుషా! బహుమానభక్తిన
ఖ్యమ్ములఁ బేర్మి వేఁడెదను ♦ గా దిది యాజ్ఞ త్వదీయదాసుఁడన్. ౨౭౬౪
కం.నావుడు వానరులున్ రక్షో వరులున్ వినుచు నుండ ♦ శుభచరితుఁడు సీ
తావిభుఁ డిటు లను నారక్షోవిభునకు నయముఁ బ్రియముఁ ♦ జూపుచు నెలమిన్.
కం.నచ్చికచే మచ్చికచే, హెచ్చగుసాచివ్యమున సు♦హృద్భావముచే
నచ్చపుఁజేఁతల సాయము, మెచ్చగ నొనరించితివి సు♦మీ కొద వేమీ.
ఉ. నీవచనంబులన్ విననినిష్ఠురచిత్తుఁడ నంచు నెంచ కో
పావనశీల! నామనసు ♦ భ్రాతపయిం జనుచున్న, దమ్మహా
భావుఁడు చిత్రకూటమునఁ ♦ బాదములం బడెఁ జేతు, లొగ్గ, నెం
తోవడి వేఁడె నన్నరలఁ ♦ దోడ్కొనిపోవ నిరాకరించితిన్. ౨౭౬౭

## ⟶ శ్రీరాముఁడు విభీషణునిఁ బుష్పకంబుఁ దేర నియోగించుట. ⟵

ఉ. అంతియ కాక మిత్రమ మ♦దంబ సుమిత్రను గైకఁ జూడ నా
స్వాంతము త్రొక్కులాడెడిని ♦ పౌరుల మిత్రుల వారిబిడ్డలన్

శాంతుల మద్గురూత్తముల ♦ సంతస మారఁ గనంగఁ గోరెదన్
జింతిలఁ బోకు పుష్పకముఁ ♦ జెచ్చెర నిమ్మెడఁ దేరఁ బంపుమీ. ౨౨౧౮

కం. వనవాసము ముగియుటచేఁ, దనవారిని జూడఁ గోరు♦తమి నిట నిలువన్
మన సొప్పదు క్షమియింపుము, కినియకు నా కాజ్ఞ నిమ్ము ♦ కీర్తితశీలా! ౨౨౧౯

ఉ. ఈ వొనరించునర్చనల ♦ నెల్ల గ్రహించితి, వేగ మందు నేఁ
బోవలయున్, విభీషణ! సు♦బుద్ధివి పుష్పక మిమ్ము చాలు నా
త్మావిభునాజ్ఞ నైన నతఁడు ♦ క్రచ్చఱ లంకకుఁ బోయి వచ్చి సీ
తావరు మ్రోల నద్భుతవి♦ధానవిధానము నవ్విమానమున్. ౨౨౨౦

సీ. వైదూర్యమణిమయ♦వేదికాంచిత మయి, కాంచనచిత్రాంగ♦కలిత మగుచు
రాజతప్రభలచే ♦ రమ్యతరం బయి, యుప్పరిగలపంక్తి ♦ నొప్పు మిగిలి
భూరినీరేజవి♦భూషిత మై హేమ, హర్మ్యతలంబుల ♦ ననువెసంగి
పాండుపతాకలు ♦ ధ్వజములు రాణింపఁ, గింకిణీజాలప్ర♦కీర్ణ మగుచుఁ

తే. జారుముక్తామణీగవా♦క్షములతోడ, రణితఘంటాళిమధురస్వ♦రములతోడ
హాటకగిరీంద్రసన్నిభం ♦ బగుచు మున్ను, విశ్వకర్మకృతం బయి ♦ వెలయు దాని.

కం. స్ఫాటికచిత్రాంగం బై, హాటకవైడూర్యమయవ♦రాసనమై స
త్పాటాస్తరణాయుతం బై, సాటి యొకట్ లేక చిత్త♦జవనం బగుచున్. ౨౨౨౨

↞ శ్రీరాముఁడు విభీషణుచే వానరులకుఁ గానుక లిప్పించుట. ↠

తే. అంద మగుదాని నిల్పి యా♦య్యసురభర్త
యాజ్ఞ యిఁక నేమి యనఁగ ని♦జానుజాతు
తోడ యోజించి సెయ్యంబు ♦ దోలఁకఁ బలుకు
నో విభీషణ! నామాట ♦ నొకటి వినుము. ౨౨౨౩

చం. పనిఁ గొని నాకుఁగా సకల♦వానరవర్యులు సంగరంబునన్
దనువుల నాస మాని తెగి ♦ దారుణభంగిని బోరి, యోరి కే
నిని గెలువంగరాని దగు ♦ నిర్జరవైరిపురంబు లంక బ
ల్మిని బడఁగొట్టి రిందఱకు ♦ మే లొనరింపఁగ నాస యయ్యెడిన్. ౨౨౨౪

కం. వీరల కెల్లరకును న, వ్వారిగ మణిరత్నములును ♦ వసుచయములు వే
ర్వేర నొసంగుము తద్వ్య, పారంబులు సఫలమగుచుఁ ♦ బసదనములుగన్. ౨౨౨౫

కం. మానద! మానసమర్థులు, వానరనాథులు కృతజ్ఞ♦వర నీచే స
మ్మానితు లై చనెదరు స్వ, స్థానములకు సంప్రమోద♦సంగతమతు లై. ౨౨౨౬

కం. దాతవును సంగ్రహీతవు, జాతానుక్రోశమతివి ♦ శక్తి వటం
చాతతగతిఁ దలఁచెద రా, హేతువునన్ నాకు వలసె ♦ హెచ్చరికింపన్. ౨౨౨౭

కం. పెట్టును బోఁతయు దయ యె, ప్పట్టున నేఁ లేక రిత్త ♦ భండనమందున్
గిట్టించు నృపతిఁ గని వెఱ, పుట్టఁగఁ గష్టముల విడిచి ♦ పోదురు బంటుల్. ౨౭౭

↞ శ్రీరాముఁడు పుష్పకం బెక్కి సుగ్రీవాదుల కనుజ్ఞ యిచ్చుట. ↞

కం. అని రాముఁడు వచియించిన, ధనములు రత్నములు తెచ్చి ♦ తగుగతి నిచ్చెన్
వినయమున గౌరవించెను, మనముల వారెల్ల హర్ష ♦ మాణులు గాఁగన్. ౨౭౮

సీ. అది గని శ్రీరాముఁ ♦ డానందమగ్నుఁడై, మక్కువఁ బుష్పకం ♦ బెక్కి యందు
లజ్జమానను యశో ♦ లలిత వైదేహిని, నంకతలంబున ♦ నారఁ జేర్చి
వీరుండు సౌమిత్రి ♦ విల్లు కేల నహించి, చెంత నిల్వంగ సా ♦ సీనుఁ డగుచు
వానరరాక్షస ♦ వల్లభులను జీరి, బహుభంగులను వారి ♦ బహుమతించి

తే. వానరోత్తములార! మీ ♦ వలన మిత్ర, కార్య మియ్యది సెఱవేఱెఁ ♦ గడమ వడక
నాకుఁగా నెంతగాసిల్లి ♦ నారు మీరు, సెల వొసంగెదఁ జనరయ్య ♦ నెలవులకును.

కం. నీవు సుహృత్తును మిత్రం, బౌవాఁ డొనరింప యోగ్య ♦ మగు నంతయు సు
గ్రీవా! ధర్మభయంబునఁ, గావించితి పురికిఁ జనుము ♦ కపిసేనలతోన్. ౨౮౧

కం. నెమ్మిని నాయొసఁగిన రా, జ్యమ్మున లంకన్ వసింపు ♦ మా సుఖముగ ని
న్నమ్మఘవాదుల కైనఁ ద, రమ్మిటుఁ గాదయ్య చెనక ♦ రాక్షసరాజా! ౨౮౨

తే. తండ్రి యేలినయాగాజ ♦ ధాని కేన, యోధ్యకును బోవ నిప్పుడ ♦ యుత్సహించి
నాఁడ నో మిత్రజనులార! ♦ నాకుఁ గరుణ, సెల వొసంగఁగ విజ్ఞప్తి ♦ సేయువాఁడ.

ఉ. రాముఁ డిటుల్ వచింపఁ గపి ♦ రాజును రాక్షసరాజు నో దయా
ధామ! భవత్పురంబుఁ గనఁ ♦ దద్దయుఁ గోరెద, మందు నేరి కే
నేమి యుపద్రవం బిడక ♦ యిచ్చఁ జరించెద మయ్య సద్వనీ
స్తోమములం బురంబునను ♦ దోయజలోచన! సమ్మతింపవే. ౨౮౪

కం. మీయభిషేకము మీస్థా, నీయంబును జూచి మ్రొక్కి ♦ నీజనయిత్రిన్
మా యిండ్ల కరుగువారము, చేయుము మామీఁదఁ గరుణ ♦ సీతానాథా!

↞ శ్రీరాముఁడు సుగ్రీవవిభీషణాదు లయోధ్యకు వచ్చుటకు సమ్మతించుట. ↞

సీ. అని వారు పల్క ధ ♦ ర్మాత్ముండు రాఘవుం, డినజానురేంద్రుల ♦ కిట్టు లనియెఁ
బ్రియముకంటెను మేలి ♦ ప్రియతరం బిది యబ్బె, మిత్రవరేణ్యుల ♦ మిమ్ముఁ గూడి
మాపురి కేగెడి ♦ మహితభాగ్యము గల్గె, నెక్కుము సుగ్రీవ ♦ యెల్లకపులు
నీవు విభీషణా! ♦ నీసచివాళితో, నెక్కు మీ పుష్పకం ♦ బిపుడ యనిన

తే. వార లెల్లరు నెక్కఁగ ♦ బేరయాన
మాధరాధిపునాజ్ఞ చే ♦ నభ్రవీథి

కెగసె హంసాన్వితం బయి ♦ యొసఁగునందు
రాజరా జన వెలుఁగొందె ♦ రామవిభుఁడు. ౨౭౬

తే. నవ్యతర మైనయావిమా♦నంబునందు. నిఱుకు లేక సుఖంబుగ ♦ నెడ మెడముగఁ
గూరుచుండిరి రక్కసుల్ ♦ కుధరచరులు, కాంచుచిత్రంబులెల్ల వ♦ర్ణించికొనుచు.[1]

←→ శ్రీరాముఁడు సీతాదేవికిఁ బూర్వపరిచితస్థలంబులఁ జూపుట. ←→

ఉ. రామునిచే ననుజ్ఞఁ గొని ♦ రమ్యవిమానము మారుతోద్ధతం
బాముదిరం బనంగ వియ♦దధ్వమునన్ వడి నేగువేళ ది
క్సీమలు పాఱఁ జూచుచును ♦ శీతకరానన సీతఁ జూచి యెం
తోముద మార నిట్లనియెఁ ♦ దోయజలోచనుఁ డోమృగేక్షణా! ౨౭౮

కం. మానుగ హారగిరిశిఖరముఁ, బోనిత్రికూటంబుశిఖర♦మునఁ బొల్చెడిఁ గం
టే నెమ్మి విశ్వకర్మని, చే నిర్మిత మైనలంక ♦ శీతాంశుముఖీ! ౨౭౯

సీ. మాంసశోణితకర్ద♦మంబు రాక్షసకపి,రణరంగ మియ్యది ♦ రాజవదన
నీనిమిత్తంబుగ ♦ నేనిందుఁ ద్రుంచితి, రావణు దుష్టునిఁ ♦ బ్రాప్తవరునిఁ
గుంభకర్ణుం డిందుఁ ♦ గూలె నాదోశ్శక్తి, నంతకుఁ జేరెఁ బ్ర♦హస్తుఁ డచట
ధూమ్రాక్షు నియ్యెడఁ ♦ దూలించె మారుతి, బలియు విద్యున్మాలి ♦ భంగపఱిచె

ఆ. నిట సుషేణుఁ డందుఁ ♦ గుటిలచారిత్రుని, మేఘనాదు నని సు♦మిత్రపట్టి
గీ టడంచె వికటు♦పోటుమాన్చెను వాలి, నందనుండు బలపు♦రందరుండు. ౨౮౦

కం. పాపులు మహోదరుండు వి,రూపాక్షుఁ డకంపనుండు ♦ రూక్షబలుం డు
త్కోపుండు మహాపార్శ్వుం, డాపదఁ గని రిందు వనచ♦రావళిచేతన్. ౨౮౧

ఆ. పంక్తికంఠుజ్యేష్ఠ♦భార్య మందోదరి, కనుల నీరు గారఁ ♦ గరుణముగను
వేలకొలఁదిసవతి♦వెలఁదుకలును దాను, నేడ్చె వివిధగతుల ♦ నిందుఁ జెలియ.

కం. ఉడురాజబింబముఖి యి,య్యెడఁ జుమ యంభోధి దాఁటి ♦ యేను గపులతోఁ
గడుకొని యారే సుఖముగఁ, గడపితి నినుఁ దలఁచికొనుచుఁ ♦ గళవళపడుచున్.

ఉ. నూతనపల్లవాంగిరో! క♦నుంగొనుమీ యదె సాగరంబునన్
సేతువు నీదు హేతువున ♦ నిర్మితిఁ జేసితి నుత్తరింపఁగా
ఖ్యాతి యెసంగ వైరిహృద♦యంబులు ప్రీల నసాధ్యపద్ధతిన్
సీత! యిదే జగాన నల♦సేతువు నాఁగఁ బ్రశస్తిఁ గాంచెడిన్. ౨౮౪

ఉ. రంగదరాళకుంతల! త♦రంగపరంపర రంగుమీఱ దు
ర్భంగగతిం జెలంగుచు భ♦రంబుగ మ్రోఁగుచు శంఖశుక్తులన్
రం గగుసాగరంబు నుడు♦రాజముఖీ! కను మందు మధ్యమం
దుం గనుఁగొంటె హాటకమ♦నోహరశృంగహిరణ్యనాభమున్. ౨౮౫

[1] ఆకాశయాన విద్యయందు మన పూర్వులు పండితులు. ఆ విద్యయం దిప్పటివా రక్షరాభ్యాసము చేసికొనుచున్నారు.

కం.మరుదాత్మజుండు జలనిధిఁ, దరియించెడిసమయమునను ♦ దన్వీ గాసిన్
హరియింప నీనగేంద్రం, బరుదెంచి జలంబునుండి ♦ యాశ్వాసించెన్. ౨౮౯౬

కం.స్కంధావారనివేశము, సింధువరము కుక్షియందుఁ ♦ జెలఁగెడిఁ గంటే
సింధురగమనామణి! కడు,బంధుర మైయున్నదాని♦భంగిం గంటే. ౨౮౯౭

కం.బింబాధర! జలనిధితీ,రంబునఁ గనుఁగొంటె తీర్థ♦రాజము సురపూ
జ్యంబు నరార్చ్యము ఘుతపా,పంబు పవిత్రంబు సేతు♦బంధం బబలా. ౨౮౯౮

తే. దేవి మున్నుప్రభుఁడు మహా♦దేవుఁ[1] డిందుఁ, గంజనేత్ర ప్రసన్నతా♦కారి యయ్యె
వెలఁది!రాక్షసరాజు వి♦భీషణుండు, వచ్చికలసినతల మిది ♦ పల్ల వోష్ఠి. ౨౮౯౯

కం.మానిని! యదిగోఁ గిష్కిం,ధానగరముచిత్రవనము ♦ తరణిజపుర మిం
దేను వధించితి వాలిని, నా నీరజనేత్ర భయవి♦నయములఁ బలుకున్. ౨౯౦౦

సీతాదేవి తారాదికాంతల నయోధ్యకుఁ దోడ్కొనిపోవఁ గోరుట.

ఉ. శ్రీమహిమాభిరామ! విను ♦ చేసెద నే నొకవిన్నపంబుఁ దా
రామహితాదిముఖ్యకపి♦రాజసతుల్ మఱి యన్యవానరీ
స్తోమము గొల్వ సమ్మదము♦తోఁ జనఁ గోరెద నయ్యయోధ్యకున్
నా ముదమార వల్లె యని ♦ నారదగాత్రుఁడు నిల్పి యానమున్. ౨౯౦౧

ఉ. భానుజుతోడ నిట్టు లను ♦ వానరనాథులకెల్లఁ జెప్పవ
య్యా నిజదారయుక్తి జన♦కాత్మజతోఁ జనఁగా నయోధ్యకున్
జానుగ నీవు నీయువతి♦సంఘముతోఁ జనుదెమ్ము జాగులన్
మాను మ టన్న నాతఁ డస♦మత్వర నంతిపురంబులోనికిన్. ౨౯౦౨

చం.చని నిజదారఁ దారఁ గని ♦ చంద్రముఖీ! సకలప్లవంగమాం
గనలును నీవు తత్క్షణమ ♦ త్మానుతప్రీతికి నై యయోధ్యకున్
ఘనమతి నేగుదెం డనుచు ♦ గాటపుఁబ్రేమను రామచంద్రుఁ డే
యనియెను రమ్యయోధ్యయును ♦ నాజసతీతతిఁ గాన నా ననన్. ౨౯౦౩

సీ. ప్రాణేశుఁ డీగతి ♦ భాషింపఁగాఁ దార, సర్వాంగసుందరి ♦ సంభ్రమమునఁ
గపులభార్యలనెల్లఁ ♦ గడు వడిఁ బిలిపించి, యనియె మ మ్మెల్లర ♦ నర్కతనయుఁ
డాయయోధ్యకును ♦ నగుదేర ముదలిడె, నీరెల్లఁ నాతోడ ♦ నేగుదెంచి
రామునిపురముఁ బు♦రంబునజనముల, దశరథపత్నుల♦తతవిభూతిఁ

ఆ. గాంచు నాకు ముదముఁ ♦ గలిగింపుఁ డీ యన, నట్లకాక యనుచు ♦ నతివలెల్లఁ
గడుముదంబుతోడఁ ♦ గైసేసి తొడికట్టి,సురవిమానమునకుఁ ♦ జట్టు దిరిగి ౨౯౦౪

కం.సీతాదర్శనకాంక్షను, బ్రీతిని రాజాస్యలెల్ల ♦ వే యెక్కిన సం
జాతత్వరఁ బుష్పక ము,త్పాతింపన్ సతికి రామ♦భద్రుఁడు పలుకున్. ౨౯౦౫

[1] మహాదేవుఁడు=సముద్రుఁడు. బ్రహ్మహత్యఁ బాపుకొన శివలింగమును స్థాపించె ననుమాటను 'మున్ను' అను పదము నిరాకరించుచున్నది. ఉద్వృత్తాయుధుల హిరణ్యకశిప్వాదులఁ జంపినపుడులేని లక్ష్మణాదులకు లేని బ్రహ్మహత్య యిప్పు డెచటనుండి వచ్చెనని యెదురువాదము. భగవంతునకు బ్రహ్మహత్య బాధగలదా.

ఉ. అల్లదె ఋశ్యమూకము ల♦తాంగిరో నే నటఁ గాంచి భానుజున్
వల్లభ! చరిపుత్రుఁడఁ జామి ♦ వాలి నటంచుఁ బ్రతిజ్ఞఁ జేసితిన్
బల్లవపాణి! చిత్రతర♦పాదపసంగత పంప యద్దిగో
మొల్లపుఁగానసంబులను ♦ మోదముఁ గూర్చెడి పింత వింతగన్. ౨౮౦౬

కం. నినుఁ బాసినకతమున నో,సన జేక్షణ! విరహతాప♦భరమున నిందే
వనరితిఁ జుమ్మీ యశ్రులు, కనులం బ్రవహింప నాప♦గాతతివోలెన్. ౨౮౦౭

సీ. దానితీరంబున ♦ ధర్మచారిణి యైన, శబరిని గంటి నో♦శఫరనయన!
పడఁతిరో! యోజన♦బాహుఁ గబంధుని, నయ్యెడఁ ద్రుంచితి ♦ హరిణనేత్ర!
యదె జనస్థానంబు♦నందు జటాయుని, త్వారుహాం బగపడె ♦ ఖంజనాక్షి!
నీకయి యిట గృధ్ర♦నేతకు రక్కస,కూళకుఁ బోరు చ♦కోరలోచ

తే. నా! యిటం గద ఖరదూష♦ణత్రిశిరులు, మామకీనశరంబుల ♦ మడిసి రబల
యంబుజేక్షణ! మనమున్న♦యాశ్రమంబు, పదము నుత్పలనేత్ర! య♦ల్లదిగోఁగంటె.

కం. నిన్ను బలాత్కారంబున, మున్నట దశకంధరుండు ♦ ముచ్చి లె నవలా
మిన్నా! యదె పర్ణశాల ప్ర,సన్న మతిం గనుము దాని ♦ సంతోషమునన్. ౨౮౦౯

కం. గోదావరి యదె చూడు కృ,శోదరి నిర్మలినతరళ♦భోదకయుతమున్
సాదరమతిలోపాను,ద్రాశయుతునియాశ్రమంబు ♦ దర్శింపు తమిన్.[1] ౨౮౧౦

తే. అదియ చూడు సుతీక్ష్ణుని♦యాశ్రమంబు, నదియె శరభంగునాశ్రమం♦బంబుజాక్షి
యందె కాదె మహాముని ♦ నాదరింప, వచ్చె నాఁ డల్లశక్రుండు ♦ వైభవమున.

మ. అట నేఁ ద్రుంచితి నమ్మహాతను విరా♦ధాఖ్యున్ సతీ యల్లవే
జటిలావాసము లత్రిమానిని వివ♦స్వత్పావకాభప్రభున్
బటుమాహాత్మ్యఁ దపస్వినిన్ మునిసతిం ♦ బద్మాక్షి నీకాంచు టి
చ్చటనే చుమ్మదె చిత్రకూటము మనో♦జ్ఞం బిందుబింబాననా. ౨౮౧౨

కం. ఇచ్చటఁ గాదే భరతుఁడు, సచ్చరితుఁడు నన్నుఁ జూడ ♦ సమ్మతిమైన
న్నిచ్చగఁ బురికిం గొనిపో,వచ్చెను నది యెట్లు మఱవ♦వచ్చును జెలియా! ౨౮౧౩

కం. దూరమున గోచరించెడి, హరివనోదార! యదిగో ♦ యమునానది రం
భోరు! భరద్వాజాశ్రమ,మారం గను మదిగో సుప్ర♦భాంచిత మతివా! ౨౮౧౪

కం. వరవర్ణిని నానాద్విజ,వరకీర్ణయుఁ బుష్పితోరు♦వనపంక్తియు నై
కర మొప్పెడు భాగీరథిఁ, బరికింపుము దేవి కనుల♦పండువు గాఁగన్. ౨౮౧౫

తే. శృంగిబేరపురం బదె ♦ శ్రీనివాస, మనలఁ గన వచ్చె గుహుఁ డందు ♦ మధురవాణి
యూపమాలినియును బుష్ప♦యుతవనాళి, యైనసరయువుఁ గంటివే♦హంసగమన.

[1] ఈ వరుసనుబట్టి చూడ గోదావరికి దక్షిణము పర్ణశాల యని యేర్పడుచున్నది. కావుననే సీతాన్వేషణమున నదీతరణము కవి చెప్పఁడయ్యె.

కం.మాజనకురాజధానికి, నోజనకతనూభవా! య♦యోధ్యకు రక్షిన్
జేజే లోనరింపుమి శుభ,యోజితగతి మరలఁ గనుట ♦ యెదవెను మనకున్.

చం.అనవుడు వానరావళులు ♦ నాశరభర్తయు లేచి లేచి యా
జననుతపాండుహర్మ్యచయ♦జాలకయుక్ సువిశాలకక్ష్యయుక్
ఘనతరవాజివారణని♦కాయసమాకుల మేఘవాహప
త్తనినిభ నయ్యయోధ్యను ము♦దంబునఁ జూచిరి యద్భుతంబుగన్. ౨౮౧౯

⟷ శ్రీరాముఁడు భరద్వాజాశ్రమంబునఁ బుష్పకంబు డిగుట. ⟷

సీ. పదునాల్గువర్షముల్ ♦ పరిపూర్ణ మగుడును, బంచమి శ్రీరామ♦భద్రవిభుఁడు
వరవిమానము భర♦ద్వాజునాశ్రమమున, డించి యమ్మునినాథుఁ♦గాంచి మ్రొక్కి
పురిని సుభిక్షమా? ♦ మునిచంద్ర! యెవు డైన,వింటిరా యవ్వార్త ♦ విశ్వవినుత?
మాతల్లులంగఱు ♦ మనియున్నవారుగా?, ప్రజలపోషణమున ♦ భరతుఁ డున్నె?

ఆ. యనుచుఁ దన్ను నడుగు♦నంబుజాక్షునిఁ జూచి, యాననమున మంద♦హాస మొనర
మానివర్యుఁ డనియె ♦ మనుజేంద్రనందన!, యెల్లవారు సుఖుల ♦ యింటిలోన.

ఆ. పంకదిగ్ధుఁ డగుచు ♦ భరతుండు జడ లూని, నీదుపాదుకలను ♦ నిత్య మెదుటఁ
బూని నీదురాక ♦ ఫుల్లలోచనుఁ డయి, వేచియున్నవాఁడు ♦ వీరవర్య!. ౨౮౨౦

సీ. జనకసంప్రీతికై ♦ సర్వంబుఁ బోనాడి,రాజ్యంబు విడిచి ధ♦ర్మం బొకండ
యర్థమైఁ గైకొని ♦ యడవుల వెతఁబడి, స్త్రీతృతీయుండ వై ♦ నీతి విడక
నారచీరలు గట్టి ♦ నాకంబు విడిచిన, దేవతవోలె నో♦దేవ! నీవు
కాల్నడఁ దిరుగుచుఁ ♦ గానలఁ గందమూ,లాదులఁ గడుపుచి ♦ చ్చార్చికొనుచు

ఆ. వనటపడఁగ నిన్నుఁ ♦ గనఁ గన నక్కటా!, కైకమాట కింత♦కష్టపడెడుఁ
గదె మహాత్ముఁ డనుచుఁ ♦ గడుపు భ గ్గనిమండ, వనరుచుండువాఁడ ♦ వారిజాక్ష!

కం.హితజనబాంధవయుక్తుని, నతులసమృద్ధార్థుఁ జూచి ♦ హతపరిపంథిన్
నుతగుణ యిప్పుడు నీయెడ, నతిహార్దము గలిగె సజ్జ♦నావనదీక్షా! ౨౮౨౨

కం.కానల నీ కైనజన,స్థానవధాదికసుదుఃఖ♦సౌఖ్యము లెల్లన్
నే నెఱుఁగుదు బ్రాహ్మణార,క్షానియతిఁ జరింప దండ♦కావనిలోనన్. ౨౮౨౩

కం.మారీచదర్శనము సీ,తారమణిన్ భవ్యశీల! దశముఖుఁడు బలా
త్కారించి హరించుటయును, దారుణవనిలోఁ గబంధు♦దర్శించుటయున్.

కం.పంపాభిగమన మర్కజుఁ, బెంపుమెయిన్ నెయ్యుఁ జేత ♦ వృత్రారిసుతుం
జంపుట సీతను వెదకుట, తెంపరి హనుమంతుచేత ♦ తెలియును నాకున్.

కం.నల సేతువినిర్మాణమ్ము, బలములతో మిత్రపుత్ర♦బంధులతోఁ గీ
శులు నీవును రక్కసులన్, బల వైరివిరోధిఁ గలనఁ♦బరిమార్చుటయున్. ౨౮౨౬

కం. సురలును బ్రత్యక్షం బై, వరములు నీ కిడుట తపము♦బలమున సర్వం
బురుగుణ! యెఱుఁగుదు నేనుఁ, వరమిచ్చెదఁ గోరుకొనుము ♦ వరధర్మమతీ!.
కం. నిలువుము యీదిన మియ్యెడ, నలఘుగుణా! యనిన వల్లె ♦ యని శిరమున నా
పలుకు గ్రహించి ముదమున, బలభిన్నుతుఁ డిట్లు వేఁడె ♦ వరముఁ బూనిన్.
శా. ఏకాలంబు నయోధ్య కేగుపథమం♦దెందుఁ సుధాకల్ప మ
స్తోకం బౌ ఫలసంతతుల్ బలిసి యెం♦తో యొప్పుతం జెట్లచా
లో కారుణ్యమయాంతరంగక యనఁ ♦ ద్యోరత్న తేజం డటఁ
గా కన్నం బురి కేగుతన్నిఖిలమా♦ర్గంబుల్ మనోజ్ఞంబు లై ౨౮౨౯
కం. ఇగురులఁ బూవులఁ బిందెల, జిగిగల కాయలను బండ్లఁ ♦ జెలఁగుచుఁ దరువుల్
దగుగతిఁ గల్పకకుజముల, పగిదిం దనరారె సర్వ♦ఫలసంగతులన్. ౨౮౩౦
కం. కుసుమములు లేనియగములు, గుసుమంబులఁ బండ్లు లేని♦కుజములు పండ్లన్
బస రేదినయవి పసరునఁ, బసనీటెను మ్రోడులెల్లఁ ♦ బచ్చాకులచేన్. ౨౮౩౧
కం. ఎటు చూడఁగ మూఁడామడ, యిటు కుజసంతతులు దేవ♦సృక్షము లట్లై
పటిమ చెలంగఁగఁ గపు లు,ద్భటముదమున మెక్కి రెల్ల♦తత్ఫలరాజుల్. ౨౮౩౨

## శ్రీరాముఁడు హనుమంతుని భరతుకడ కనుచుట.

కం. అంతట భూమీతనయా, కాంతుం డొనరింపఁ దగిన♦కార్యం బెల్లన్
జింతించి యనియె నాహను,మంతుం దనుఁ జేరఁ బిలిచి ♦ మహితజవాఢ్యా.
సీ. నీ వయోధ్యాపురి ♦ నృపతిగృహంబున, నెల్లరు సేమమా ♦ యెఱిఁగి రమ్ము
ఏగుచోఁ ద్రోవను ♦ శృంగిబేరంబున, గుహుఁడు నిషాదుండు ♦ కూర్మిసఖుఁడు
గలఁ డాతనికి నాదు♦పలుకుగా నాసేమ, మంతయుఁ దెలుపు నా♦యాత్మసముఁడు
నా ప్రాణమిత్రుండు ♦ నాకుశలంబును, విగతరోగుఁడ నంచు ♦ వినిన యంత
ఆ. నిండుముదముఁ గాంచు ♦ నీకు నయోధ్యకుఁ, జనెడి మార్గ మతఁడ ♦ వినుచుఁ బ్రీతి
నంత భరతుఁ జేర ♦ నరిగి నామాటగాఁ, జెప్పవయ్య నాదు♦సేమ మెల్ల. ౨౮౩౪
కం. అనుజునితో జనకజతోఁ, జనుదెంచినవాఁడ జనకు♦శాసన మెల్లన్
బూనరించి కృతార్థుఁడ నై, యనుమీ తొలుదొల్తఁ బిదప ♦ నసురుం డడవిన్
కం. సీతను హరించుటయు రవి, జాతునితో మైత్రి వాలి♦సంహారము భూ
జాతాన్వేషణమును నీ, వాతరుణికి నబ్ధిదాఁటి ♦ యట సతిఁ గనుటన్. ౨౮౩౬
ఆ. దాడిపోక జలధి♦దర్శించుటయు సేతు, బంధనంబు నసుర♦పతివధంబు
వాసవాజవరుణ♦వరదానమును మహా, దేవుకరుణ జనకు ♦ దివిని గనుట. ౨౮౩౭
కం. హరినాయకుతో రాక్షస, వరుతో నారాక నీవు ♦ వచియింపుము యా
భరతుం డది యంతయు వినఁ, బరికింపుము యెట్టిరూపు ♦ వహియించెడినో.

ఉ. మార్తురఁ నెల్లరం దునిమె ♦ మానితశక్తి, జగంబునందు స
త్కీర్తిని నిల్పె, నిస్తులిత♦తేజముఁ గూరె, నిజేప్సితంబులం
బూర్తి యొనర్చె, మిత్రులను ♦ భూరిబలంబును గూడి పెంపుమై
వర్తిల వచ్చె రాముఁ డని ♦ పల్కుము, పల్కెడివేళ నీవునున్ ౨౮౩౯

ఆ. అతనియింగితములు ♦ నాననకాంతియుఁ, జూపువిధము పలుకు♦చొ ప్పెఱింగి
వానిచిత్తవృత్తి♦వర్తన మఖిలంబుఁ, దెలిసి రమ్ము వేగ ♦ తెల్లముగను. ౨౮౪౦

కం. కరిహయరథసంకుల మై, వరభోగ్యము లమరి వంశ♦పారంపర్యం
బరుదైనధరారాజ్యము. మరగింపక యున్నె యెట్టి♦మనుజుమనంబున్. ౨౮౪౧

కం. చిరపరిచితిచే శ్రీమ,ద్భరతుఁడు రాజ్యార్థి యగుచు ♦ వఱలిన యేని\
ధరణీతల మంతయుఁ దా, నిరవుగ రఘునందనుండె ♦ యేలెడుఁ గాతన్.[1] ౨౮౪౨

చం. సరసత వానిబుద్ధివ్యవ♦సాయ మెఱింగి ధరాభిలాషి యే\
బరువున మేము దూరముగ ♦ వచ్చుటకున్ మునుమున్న ర మ్మన\
నరవపువున్ ధరించి వడి ♦ నాగజిఘృక్షను మింటఁ బాఱున
గ్గరుడునిపోల్కి నేగె భుజ♦గప్రవరాలయమున్ శుభంబునన్. ౨౮౪౩

కం. గంగా యమునా వేణీ,సంగమమున శృంగిబేర♦జనపదమందున్
బొంగుచు గుహుఁ గని మధువా,క్సంగతి ని ట్లనియె హనుమ ♦ సంతోషముగన్.

కం. అయ్యా గుహా! రాముఁడు నీ,నెయ్యుఁడు సానుజుఁడు సావ♦నీజుఁడు నై నన్
జయ్యన నీ సేమము నే, నియ్యెడ నెఱుఁగంగఁ బనిచెఁ ♦ గృతకృత్యుం డై.

తే. పంచమీరాత్రి మునిభర♦ద్వాజుతోడఁ, గడపి యాయనచే నాజ్ఞఁ ♦ బడసి వచ్చు
కమలలోచను నిప్పుడ ♦ కనెద వనుచుఁ, జెప్పి యుప్పొంగి చనియె నే♦చింత లేక.

సీ. రామతీర్థంబును ♦ రమ్యవాలుకినియు, గోమతీనదియును ♦ భీమసాల
వనమును వేనవే♦ల్ప్రజలను నూళ్లను, గనుచును జనిచని ♦ కపివరుండు
సరగ నందిగ్రామ♦సన్నిదేశంబునఁ, బుత్రులతో నాడు♦పువ్వుఁబోండ్లు
వృద్ధులు చెలువార ♦ వెలసెడిదానిని, జైత్రరథంబును ♦ సౌరవనము

తే. తోడఁ దులఁదూఁగుదానిని ♦ దోర మైన
కుసుమఫలసంతతుల చేత ♦ నెసఁగుదానిఁ
గని యయోధ్యకుఁ గోసుద♦వ్వున రహించు
నాశ్రమం బొండు గాంచి వా♦తాత్మజుండు. ౨౮౪౭

## హనుమంతుఁడు భరతు సందర్శించుట.

సీ. అందు నారలును గృ♦ష్ణాజినంబును గట్టి, తపసివేషంబునఁ ♦ దనరువాని
నన్నుఁ బాసినచింత ♦ ఖిన్నుఁడై దీనుఁ డై, మిగులశుష్కించిన♦మేనివాని

[1] సుందరి యువతి సతియగు భార్యతో నేకశయ్యయందుఁ దరుణుఁడు భర్త పరుండియు భోగింపకుం డుట కసిధారావ్రత చర్యయనిపేరు. అట్లే కరగతమైన రాజ్యలక్ష్మిని సమర్థుఁడయ్యు భరతుఁ డొల్లఁడయ్యె.

ధూళి గ్రుంగినమేను ♦ వ్రేలాడుజడలు నై, బ్రహ్మర్షి తేజున ♦ వఱలువాని
ఫలమూలభోజి యై ♦ భావితాత్ముండు నై, దాంతుఁ డై నియతిని ♦ దాల్చువాని

తే. నన్నపావలు మున్నిడి ♦ యఖిలజగతి, వర్ణములు నాల్గు తమతమ♦పద్ధతులను
దలఁగకుండఁగ దిటముగ ♦ నిలిచి యుండ, నేలువానిని గనియె భూ♦పాలసుతుని

తే. కావివస్త్రంబు లూని సౌ♦ఖ్యములఁ బాసి[1]
సచివవర్గంబు సైన్యశ్రే♦సంచయంబు
శుచి పురోహితతతులును ♦ శుద్ధమతులు
పౌరులును గొల్వ నుండెడి♦భరతుఁ గనియె. ౨౭ ౪౯

తే. తనువుఁ గాంచినధర్మమో ♦ యనఁగఁ జాలి
వ్రాలు ధర్మజ్ఞు దరిసించి ♦ కేలు మొగిచి
వినయగరిమంబు దీపింప ♦ విన్నవించె
గంధవాహతనూజుండు ♦ క్రమ్రఫణితి. ౨౭ ౫౦

కం. ఏ రాముఁడు దండకలోఁ, జీరాజినధారి యనుచుఁ ♦ జింతించెదవో
యారాముఁడు నీ సేమము, గారామున వినఁగఁ గోరెఁ ♦ గాకుత్స్థవరా! ౨౭ ౫౧

సీ. ప్రియము వచించెద ♦ విడువుము దారుణ, దుఃఖంబు నీకూర్మి♦తోడఁబుట్టు
రాముని నీముహూ♦ర్తంబునఁ గాంచెదు, రావణు వధియించి ♦ దేవిఁ బడసి
సౌమిత్రితోఁ గూడి ♦ శచితోడిదేవేంద్రు, వగిది వైదేహితోఁ ♦ బరమమిత్ర
కోటితో సేనతోఁ ♦ గోమరార వచ్చుచు, నున్నవాఁ డన నుడి ♦ విన్నమాత్రఁ

ఆ. బరమహర్షమునను ♦ భరతుండు ధర వ్రాలి, మూర్ఛవోయె నంత ♦ మూర్తమునను
లోనఁ దెలివిఁ గూరి ♦ మానవనాయకుం, డాశ్వసించుకొని న♦యంబు దొలఁక.

చం. ప్రియము వచించువాయునుతుఁ ♦ బ్రీతిని గౌఁగిటఁ గ్రుచ్చి యశ్రుసం
చయముల భూరిబిందువుల ♦ సమ్మతి నాతనిమేను దడ్పి కై
కయిసుతుఁ డిట్లు పల్కు నన♦ఘా మనుజుండవొ, నిర్జరుండవో
దయగొని సమ్మదం బిడు ను♦దంతముఁ జెప్పఁగ వచ్చి తీక్రియన్. ౨౭ ౫౩

కం. ఈమాటకుఁగా నూటిని, గ్రామంబుల నూఱు వేల♦గవుల సతులుగా
శ్రీమహితలఁ గులకన్యల, హైమాంగల భూషితలఁ బ♦దార్వుర నిత్తున్. ౨౭ ౫౪

కం. అని యద్భుతోపమము రా, మునిరాక విని ప్రహర్ష♦మున రఘురాముం
గనుతమి వెండియు నిట్లను, హనుమంతునితోడఁ గుతుక ♦ మాగుబ్బతిలన్.

## హనుమంతుఁడు భరతునకు శ్రీరామవృత్తాంతమంతయుఁ దెలుపుట.

కం. ఎన్నోవత్సరములకున్, మున్ను రఘూత్తముఁ డరణ్య♦ములకుం జనెఁ దా
నిన్నాళ్లకు శ్రుతివిందుగ, మన్నాథునికీర్తనంబు ♦ మరలన్ వింటిన్. ౨౭ ౫౬

[1] సన్న్యాసాశ్రమము గైకొనకున్నను మనస్సున సన్న్యాసియగుటచే నిట్టి వేషము.

కం. తనువునఁ బ్రాణము లుండినఁ, గనుఁగొను నూఱేండ్లకైనఁ ♦ గడుహర్షంబుల్
మనుజుం డనుసామెత ము,న్ననుకొనఁగా వింటి నది య♦థార్థము చూడన్.[1]

కం. ఏలా యే దేశంబున, శైలచరావళికి రామ♦చంద్రున కెటు లో
ర్కో లభియించెను నెయ్యం, బోలిన్ వినిపింపు సర్వ ♦ ముత్తమచరితా! ౨౦౫౪

కం. నావుడు దర్భాసనమునఁ, బావని కూర్చుండి రామ♦భద్రునిచరితన్
దా వినిపించెను సర్వము, క్ష్మావిభుపుత్త్రునకు సుజన♦సమ్మతమతికిన్. ౨౦౫౫

సీ. మీతల్లి కోరిన ♦ సీతాధినాథుండు, మౌనివేషం బూని ♦ కాన కరుగఁ
దనయశోకంబున ♦ దశరథుం డీల్గుట, దూతల మి మ్మిందుఁ ♦ దోడి తేరఁ
బనుచు టయోధ్యకుఁ ♦ జనుదెంచి రాజేంద్ర, యుర్వీభరం బూన♦నొల్లమియును
ధర్మనిష్ఠుండ వై ♦ తరలి యాచిత్రకూ,టంబున రాము రా♦జ్యంబుఁ గొనఁగ

ఆ. వేఁడుకొనుట భూమి♦విభునాజ్ఞ రాముండు, మీఱమియును బిదప ♦ మీర లన్న
పాదుకల గ్రహించి ♦ వచ్చుట మీ కెల్ల, నెఱుక యవలిచరిత ♦ మెల్ల వినుము.

ఉ. మీరలరాకపోకలను ♦ మిక్కుటపు న్వెఱఁ బక్షిసత్త్వసం
వారము కాందిశీక మయి ♦ బస్సుర వోవ వనం బవాసనం
చారసమర్థ మైన రఘు♦సత్తముఁడుల్ ద్విపఖడ్గసింహభూ
దారవిహారఘోర మగు♦దండకఁ జొచ్చె సతీతృతీయుఁ డై ౨౦౬౧

ఉ. వారలు పోవుచుండ సుర♦వైరి విరాధుఁడు భూరినిస్స్వనో
దారుఁడు వచ్చి తాఁకుటయు ♦ దైత్యు నధోముఖు నూర్ధ్వబాహుఁగా
ధారిణిఁ బాఁతిపెట్టిరి ప్ర♦తాపధురంధరు లన్నదమ్ము, ల
వ్వారలు సంజవేళ శర♦భంగునిఁ గాంచిరి ముక్తసంగునిన్. ౨౦౬౨

కం. శరభంగుఁడు దివి కరిగిన, వరసత్యపరాక్రముఁడు త♦పస్వుల కెల్లన్
గురుమతిఁ గావించి నతుల్, నరనుతుఁడు వసించె నాజ♦నస్థానమునన్. ౨౦౬3

ఉ. రామునిఁ జూపునాతి యను♦రక్కసి డాసిన రామునాజ్ఞ చే
శ్రీమహితుండు లక్ష్మణుఁడు ♦ చెక్కును ముక్కును వీను లంత సం
గ్రామమునన్ రఘూత్తముఁడు ♦ రాక్షసులం బదునాల్గువేవురన్
నామ మడంచె నొక్కఁడ ది♦నంబున నాలవభాగమం దొగిన్. ౨౦౬౪

ఉ. ఈకరణిన్ మహాబలుల ♦ హీనచరిత్రుల భీమకర్ములన్
బ్రాకటసంయమిప్రకర♦బాధకులన్ ఖరముఖ్యరాక్షసా
నీకములన్ వధింపఁగఁ జ♦నెన్ ఖల[2] గావణు డాయ వాఁడు సీ .
తాకమలాక్షి మ్రుచ్చిలఁగఁ ♦ దా మది నెంచి నిజానుయాయినిన్ ౨౦౬౫

[1] భరతుఁడు శ్రీరాముఁడు మన్నాథుఁడనుటచేతను సీత హనుమంతునితోఁ జెప్పిన యీ మాటలే చెప్పుటచేతను శ్రీరామవిషయమున సీతాభరతులు సమానభక్తిపారతంత్ర్యములు గలవారు. [2] శూర్పణఖ.

కం. క్రూరుని ఘోరాకారుని, మారీచునిఁ బనిచె రత్న♦మయమృగ మైమె సీ
తారమణి నాశ గొల్పఁగ, నారమ్యమృగంబుఁ జూచి ♦ యవనీసుతయున్.

కం. తనపతిఁ గని యీహరిణము, మనయాశ్రమమృగమ యైన ♦ మంజుతరం బై
కనుఁగవవిందై యుండదె, యన రాముఁడు ధనువుఁ బూని ♦ హరిణము వెంటన్.

కం. చని యది పరువిడు చుండఁగ, సునిశితశరమునను దాని ♦ స్రుక్కించెను రా
మునిపోక యు లక్ష్మణుఁడుం,[1] జనుటం గని పంక్తిముఖుఁడు ♦ సత్వరుఁ డగుచున్.

ఉ. క్రూరపుదుర్గ్రహంబు దివి ♦ రోహిణి డాసెడుభంగి జానకిం
జేరఁగఁ బోయి యాసతిని ♦ జెన్నఁటి భీతిలఁ జేయుచుఁ బలా
త్కారమునన్ హరించి చనఁ♦గా వినువీదిని వే జటాయు వన్
పేరిటిగ్రద్దతేఁ డెయిది ♦ పేఁక మహాసమరం బొనర్చినన్. ౨౧౯

ఉ. వానిని ద్రుంచి రక్కసుఁ డ♦వార్యజవంబునఁ బోవు చుండ న
వ్వానిని జానకిం గనిరి ♦ పర్వతసన్నిభు లద్రిమూర్ధసం
స్థానులు విస్మితుల్ ప్లవగ♦నాయకు లాగతిఁ బోయి పోయి లం
కానగరంబునందు నిజ♦కాంచనవేశ్మమునందు జానకిన్. ౨౨౦

కం. దనుజవరుఁ డుంచి యెన్నో, యనునయములు పల్కఁ దృణము♦నట్లు తదుక్తుల్
గొనక యశోకవనంబున, ననరుచుఁ బడియుండెఁ బ్రాణ♦వల్లభుచింతన్. ౨౨౧

సీ. అచట రాముండు మా♦యామృగమును ద్రుంచి, క్రమ్మఱి వైదేహిఁ ♦ గాన లేక
నెమకుచుఁ ద్రిమ్మరి ♦ నిహతు గృధ్రేశునిఁ, దనతండ్రి నెయ్యునిఁ ♦ గని తపించి
దహియించి, యడవులఁ ♦ దరుణిని వెదకుచు, దశరథసుతులు గో♦దావరీవ
నాళుల రోయుచు ♦ నడవిలోనఁ గబంధు, వధియించి యాతని♦వాక్యమునను

తే. ఋశ్యమూకంబునందు సు♦గ్రీవుఁ జూడ, నతఁడు తనయన్నవాలి వి♦ఖ్యాతబలుఁడు
తన్ను నిరసించు టాదిగా ♦ విన్నవించె, వారి కన్యోన్యసంవాద♦కారణమున

కం. స్నేహాభివృద్ధి యగుడును, బాహుబలోద్ధతిని ద్రుంచి ♦ ప్రథితబలున్ భీ
మాహవమున వాలిని స, న్నాహంబునఁ గీశరాజ్య♦నాథుఁగ నినజున్ ౨౨౩

ఉ. రాముఁ డొనర్పఁగాఁ బ్లవగ♦రాజు ధరాసుత రోయఁ గ్రోఁతులన్
భూమిసమస్తదిక్కులకుఁ ♦ బొల్పుగఁ దాఁ బదికోట్లు పంచె, నా
స్తోమములోన దక్షిణపుఁ♦జొప్పును రోయుచు వింధ్యకూటమం
దేము చరించు చుండఁ జని♦యెన్ గడు వంతయు దాన నాత్మలోన్. ౨౨౪

ఉ. ఆతతదుఃఖ మంది మను♦నాశయుఁ బాసి మఱుంగు చుండ సం
పాతి జటాయుతమ్ముఁడు క్ష♦మాసుత రావణునింట నుండుటల్
ప్రీతి వచించె, దుఃఖభర♦పీడితమిత్రులశోక మార్పఁగా
స్ఫీతజవోద్ధతిన్ మకర♦వేశ్మము నామడ లొక్కనూఱిటిన్. ౨౨౫

[1] సీతాలక్ష్మణ సంవాదము వారు ముగ్గురు దప్ప మఱియెవ్వరు నెఱుఁగరు.

కం. వీకునఁ దరించి లంక న,శోకవనిన్ వీతహర్ష ♦ శుద్ధవ్రత దుః
ఖాకుల మలినాంబర యై, యేకాంతము వనరుచున్న♦యింతిం గంటిన్. ౨౮౭౬

ఉ. ఆనవలాను డాసి తదు♦దంతము సర్వ మెఱింగి నేనభి
జ్ఞానముగా రఘూత్తముఁ డొ♦సంగినముద్రిక నిచ్చి మాఱుగా
జానకి యిచ్చినట్టిమణి ♦ సమ్మతిఁ గైకొని ధన్యచిత్తతన్
మానవనాథుఁ జేరి మణి♦మండన మిచ్చితి నే సభిజ్ఞగన్. ౨౮౭౭

కం. ప్రాణాంతవేళ వ్యాధిత,మానవుఁ డమృతంబుఁ గ్రోలి ♦ మనినవిధమునన్
జానకివార్తం దెలిపిన, క్ష్మానాథుం డాస చేసె ♦ మనఁగ ధరిత్రిన్. ౨౮౭౮

చం. ప్రలయమునన్ జగంబులను ♦ భస్మము సేయఁగఁ బూనువహ్ని నా
జలజవిశాలనేత్రుఁ డరి♦సంఘములన్ వధియింప నెంచి క్రోఁ
తులబలఁగంబుతోడఁ జని ♦ తోయధి సేతువుఁ గట్టఁ బంచినన్
నలుఁ డటు సేయ రాఘవుఁ డ♦నంతబలంబులతోఁ దరించుడున్. ౨౮౭౯

కం. నీలుఁడు చంపెఁ బ్రహస్తునిఁ, గూలిచె ఘటకర్ణ నృపతి♦కుంజరుఁ డంతన్
దూలించె రావణాత్మజు, నాలమున సుమిత్రపట్టి ♦ యద్భుతభంగిన్. ౨౮౮౦

ఉ. రాముఁడు ద్రుంచె రావణు సు♦రప్రభుఁడున్ వరుణుండు కాలుఁడున్
గామవిరోధి వాగ్యువతి♦కాంతుఁడుఁ బంక్తిరథుండుఁ దోఁపఁగా
శ్రీమహితుండు మానిసుర♦శేఖరదత్తవరుండు తత్ప్రసా
దామితభూతివానరస♦మాగతుఁ డై తమిఁ బుష్పకంబునన్. ౨౮౮౧

కం. తాను వెసఁ దరలి కిష్కిం,ధానగరముఁ జేరి కీశ♦తరుణులఁ గొని గం
గానదితటమున నున్నాఁ, డోనృప మునియాశ్రమమున ♦ నుత్తమభక్తిన్. ౨౮౮౨

తే. ఎల్లిపుష్యయోగంబున ♦ నీవు రాముఁ,గాంచెదవు నిజ మనఁ బొంగి♦కరము మోడ్చి
యెన్నినాళ్ళకీడేరె నా♦యిష్ట మనుచు, భరతుఁడు వచించి వీనుల♦పండువుగను.

→ శత్రుఘ్నుం డయోధ్యానగరంబు శృంగారింపించుట. ←

సీ. శత్రుఘ్నుఁ గనుఁగొని ♦ సకలచైత్యంబుల, దైవతంబుల నెల్లఁ[1] ♦ దగినభంగిఁ
జందనసుమమాల్య♦సంతానముల వాద్య,ముల నరుల్ శుచు లయి ♦ పూజ సేయ
నియమింపుము పురాణ♦నిచయజ్ఞులను స్తుతి,విదులను వాదిత్ర♦విజ్ఞజనుల
గణికల వైతాళి♦కప్రచయంబుల, భటచయంబుల నెల్లఁ ♦ బరమవేష

తే. ధరుల శ్రీరామచంద్రుని♦తారకేంద్ర
తుల్యముఖమును దర్శింపఁ ♦ దూర్ణముగను
బయన మగునట్లు సేయుమా ♦ వలయుతక్కు
కెలసముల నెల్లఁ దీర్పుమా ♦ లలితభంగి. ౨౮౮౪

[1] ఇవి యర్చావిగ్రహములు కాకుండిన నీ వర్ణన మనన్వయము.

కం. అన శత్రుఘ్నుఁడు వెట్టులఁ, బనివాండ్రుర వేనవేలు ♦ పనిచెను మూర్తం
బున వెస నందిగ్రామం,బున నుండి యయోధ్యదనుక ♦ భూమిస్థలమున్

కం. మిట్టలుఁ బల్లంబులు నొక,మట్టంబుగఁ జేయ నీట ♦ మార్గము లెల్లన్
గట్టింపఁగ హిమవారిని, నెట్టన చల్లింపఁ గుసుమ♦నిచయము లాజల్ ౫౮౬

చం. తెరువుల నెల్లఁ జల్ల, శుమ♦దీధితు లొప్పుపతాక లెల్లడన్
బురమున నెత్త, భాస్కరుని♦పుట్టువువేళకు సర్వవేశ్మముల్
సురుచిరభంగిఁ జిత్రముగ ♦ శోభన మార నలంకరింపఁగా
హరువుగఁ దోరణంబులు ల♦తాంతచయంబులు గట్ట వీడులన్ ౫౮౭

కం. పరిమళసంభరసుమభా,స్వరములుగాఁ జేయ నైదు♦వన్నెల మ్రుగ్గుల్
కర మరుదుగ నిడ నెల్లెడఁ, బురమునఁ జాటింపఁ బంచెఁ ♦ బురుహర్షమునన్.

భరతాదులు శ్రీరాము నెదుర్కొనఁ బోవుట.

తే. రాజపత్నులు మంత్రులు♦బ్రాహ్మణులును, రాచవారును సైన్యముల్♦రాజముఖులు
పరమముదమున వరుసలు ♦ వరుసలుగను, బయలు దేరిరి మఱువఱు♦వాత లేచి.

తే. మంత్రపాలుండు ధృష్టి సు♦మంత్రుఁ డర్థ
సాధకుండు జయంత వి♦జయు లశోక
మంత్రి సిద్ధార్థు లనువారు ♦ మహితకనక
లసితకరియుక్తిఁ బయనించి ♦ రసము మించి. ౫౮౮

తే. హేమకన్యాన్వితంబు లా♦నిభములందు
నాఁడుదంతులయందు హ♦యాళిపూని
నట్టిరథములఁ గొందఱు ♦ నధిపునాంత
రంగికులు తర్లిపోయిరి ♦ రంగుమీఱి ౫౮౯

ఆ. ప్రాసశక్తి చంద్ర♦హాస యష్ట్యాదులు, ధ్వజపతాకలును ము♦దంబుతోడఁ
గేలఁ బూని తురగ♦పాళి నారోహించి, భటులతోడ వీర♦పటలి తరలె. ౫౯౦

కం. కౌసల్యయును సుమిత్రయు, భాసురగతి మున్ను గాఁగఁ ♦ బంక్తిరథుసతుల్
వాసిగ వారలతో సం,తోసంబున వాహనములఁ ♦ దొరపురక్తిన్ ౫౯౧

తే. ఎక్కి చనిరి నందిగ్రామ♦పృథ్విఁ జేరఁ, గైకయును బోయె నందఱఁ ♦ గలసి యటకుఁ
బట్టనంబున నున్నట్టి♦వారలెల్ల, మురిసి చనిరి నందిగ్రామ♦మునకుఁ దమిని.

తే. హరులఖురశబ్దములను శ♦తాంగనేమి,నిస్స్వనంబుల దుందుభి♦నినదములను
శంఖరావంబులను జన♦స్వనముచేత, సంచలించెను మేదినీ♦చక్ర మెల్ల. ౫౯౨

మ. పురవాసుల్ వణిజుల్ ద్విజాతివరులుం ♦ బుష్పావళీమోదకో
త్కరహస్తుల్ సచివుల్ దను న్వెనుకొనన్ ♦ ధర్మాత్ముఁ డారామసో

దరుఁ డాయూర్యునిపాదుకల్ శిరమునం ♦ దాల్చెన్ మృదంగధ్వనుల్
వరవందిస్తుతులుం జెలంగఁ దరలెన్ ♦ భ్రాతృక్షుణాసక్తుఁడై. ౨౫౯౬

మ. ధవళశ్వేతసుమోపశోభితము శ్వే♦తచ్ఛత్రముం బూని స్వ
ర్ణవిరాజద్వ్యజనంబు లొప్పు మృగచ♦ర్మశ్లేషముం డై నారలన్
సవురారంగ ధరించి యార్తి నుపవా♦సక్లిష్టుఁడై యన్నరా
క వినం గల్గిననమ్ముదంబునఁ జనెం ♦ గాకుత్స్థు దర్శింపఁగన్. ౨౫౯౭

చం. చని భరతుండు నాలుగుదె♦స ల్పరికించి రఘూత్తముండు రా
మిని హనుమంతుఁ జూచి యను ♦ మిత్రకులాభరణంబు రాముఁ డ
య్యనఘుఁడు రాఁడు, వానరుల♦యం దొకఁడేనియుఁ గామరూపి యేన్
కనుఁగొన లేఁడు, నీ కిపుడు ♦ కల్గదుగా కపిలోలబుద్ధియున్? ౨౫౯౮

→{ వానరులురాక జాగగుటకుఁ గారణంబు హనుమంతుఁడు భరతున కెఱింగించుట. }←

కం. ఈవిధి భరతుఁడు పలికిన, జా వగుటకుఁ గారణంబు ♦ శ్వసననుతుం డా
భూవరుతో సత్యబల,శ్రీవరుతో విన్నవించెఁ ♦ జిత్తం బలరన్. ౨౫౯౯

సీ. రాజేంద్ర! మునిభర♦ద్వాజు ప్రసాదంబు,కతనఁ గుజంబులు ♦ కమ్రపుష్ప
ఫలసంయుతంబు లై ♦ భ్రమరనాదితము లై, తేనెలఁ గురిసెడిఁ ♦ దేట లొలుక
వానరు లుండెడి♦వసతులు వనము లా, తెఱఁగున నుండఁగ ♦ దేవపతియు
వర మిచ్చి యున్నాఁడు ♦ వరగుణాన్వితముగా, విందు చేసెను ముని♦విభుఁడు గాన

తే. దానఁ బ్రొద్దులు పుచ్చెడిఁ ♦ దరుచరాళి,యదియుఁ గాక దె విన నయ్యె ♦ నద్రిచరుల
కలకలంబులు గోమతిఁ ♦ గపులసేన, దాఁటు చున్న దటంచును ♦ దలఁచువాఁడ.

కం. వాలుకినీనదివంకను, ధూళులు మిన్నంటెఁ గనుము ♦ తోరంబుగ నా
సాలవనంబును గ్రోఁతులు, సాలుపడం జేయు చున్న♦చందము దోఁచెన్. ౨౬౦౧

మ. అదె దూరంబునఁ జూడుమీ విమలచం♦ద్రాభంబు దోయానమున్
హృది నిర్మించెను బ్రహ్మ పుష్పకము దా♦నిన్ బాంధవోపేతునిన్
గదనం బందు వధించి రావణుని త్యా♦కన్యామనోనాథుఁ డి
య్యదనం గైకొనె సూర్యసన్నిభము ది♦వ్యంబున్ మనోవేగమున్. ౨౬౦౨

కం. ఈరామవాహనంబును, సారససంభవుఁడు దొలుత ♦ స్థాణుసఖునకున్
గూరిమి నొసంగె నాతని, వైరంబున గెలిచి యసుర♦పతి హరియించెన్. ౨౬౦౩

→{ విమానమున నున్నశ్రీరామాదుల భరతునకు హనుమంతుఁడు కనఁబఱుచుట. }←

ఆ. అమ్మహానుభావు ♦ డగుఁ జుమ్ము రాముండు, సీతతోడ నసుఁగు♦భ్రాతతోడ
నున్నవాఁడు వాన♦రోత్తముఁ డదిగొ వి,భీషణుండు వాఁడె ♦ ప్రియరతుం డు.

ఉ. రాముఁడు వాఁడె యంచుఁ గపి♦రాజు వచింపఁగ మిన్ను చూచి యో
షామణివృద్ధమాణవక♦సంఘములుఁ దరుణాళి వాఁడె శ్రీ
రాముఁడు వాఁడె రాముఁ డదె♦ రాముఁ డటంచును వ్రేలఁ జూపుచుఁ
స్తోమము లబ్బులెత్తి కని ♦ తోరపురావము నించె నర్మిలిన్. ౨౯౦౫

కం. అంబరమున శీతాంశుని, నింబునఁ గనుమాడ్కి రథము ♦ లిభములు గంధ
ర్వంబులు డిగి నిలిచి విమా,నంబునఁ జెలువొందురాము ♦ నర్మిలి లోకుల్.

మ. కని యుల్లాసముఁ బొంది రబ్బరతుఁడుం ♦ గైదామర ల్మోడ్చి భూ
తనయావల్లభసమ్ముఖుం డయి యథా♦ర్థవ్యాహృతిఁ స్వాగతుఁ
గని దీర్ఘాక్షుని నాదితేయవరసం♦కాశుఁ విమానస్థుఁ గాం
చనశైలస్థదివాకరుం గొలుచు న♦చ్ఛందంబునఁ మ్రొక్కినన్. ౨౯౦౭

ఆ. హంసయుక్తమైన♦యయ్యనుత్తమవిమా,నంబు ధరణి వ్రాలె ♦ నంబుజాక్షు
నాజ్ఞఁ జేసి భరతుఁ ♦ డద్దానిపై కెక్కి, రాము డాసి వ్రాలి ♦ ప్రణతి సేసె.

## శ్రీరామభరతసమాగమము.

ఉ. క్రన్నన రామచంద్రుఁడును ♦ గైకయిపుత్త్రకు లేవ నెత్తి యె
న్నెన్నిదినాలకో కనిన♦యెంతయుగాదిలితమ్ము నంకమం
దు న్నెఱప్రీతి నిల్పి కను♦దోయి ముదశ్రులు రాలఁ గౌఁగిటఁ
మన్ననఁ గ్రుచ్చి తండ్రి! సుఖ♦మా యని సాదరవాక్కు లాడినన్. ౨౯౦౯

చం. ముదమున లక్ష్మణుం గదిసి ♦ మ్రొక్కెడునాతనిఁ గౌఁగిలించి యా
పదపడి ప్రీతితోడ నభి♦వాదనముఁ ఘటియించి సీతకుఁ
విదితముగాఁగ స్వాఖ్యకపి♦వీరుని భానుసుతుఁ విధాతృజుఁ
భిదురధరాత్మజాతభవుఁ ♦ బ్రేముడిఁ గౌఁగిటఁ జేర్చి వెండియున్. ౨౯౧౦

తే. మైందు ద్వివిదు గంధ♦మాదను వాహినీ,నాథు శరభుఁ బనసు ♦ నలగవాక్షు
లను సుషేణు నెనరు♦నను గౌఁగిలించిన,నంద తిష్టరూపు ♦ లగుటఁ జేసి. ౨౯౧౧

కం. మానవరూపంబులతో, మానవపతిఁ గుశల మడుగ ♦ మదిఁ బొంగుచు నా
సూనృతరతుఁ డినజుని డెం,దానం గదియించి యనియె ♦ నవ్యప్రీతిన్. ౨౯౧౨

కం. పావనసౌహృదమున సు,గ్రీవా! మిత్త్రుండు గల్గుఁ ♦ గీ డరిగుఱు తోఁ
గావున మానలువురిలో, నీ వైదవసోదరుఁడవు ♦ నిర్మలచరితా! ౨౯౧౩

కం. అని యవల విభీషణునిఁ, సనయంబుగఁ గౌఁగిలించి ♦ సాంత్వోక్తుల నో
యనఘా! నీతోడ్పాటున, ననుపమదుష్కరము సాధ్య ♦ మయ్యెఁ మాకున్.

తే. అంత శత్రుఘ్నుఁడును రాము♦నం ఘ్రులందు, వ్రాలి లక్ష్మణునకు మ్రొక్కి♦భక్తి సీత
పాదకంజాతముల కభి♦వాదనంబు, సలిపి నిలిచిన శ్రీరామ♦చంద్రుఁ డంత.

[1] లక్ష్మణునికంటెను వయస్సున భరతుఁడు పెద్దవాఁడు. పుష్యమునందు భరతుఁడు, ఆశ్లేషయందు లక్ష్మణుఁడు జనించిరి.

తే. వనట పెంపున నవసిన◆జననిఁ జేరి, పాదముల సాఁగిలంబడి ◆ పట్టుకొనుచు
నంబ! విన నైతి నీనుడి ◆ నల్లనాఁడు, నన్ను క్షమియింపు మనుచుఁ బ్ర◆సన్నఁ జేసి
కం. మ్రొక్కె సుమిత్ర యశస్విని, కక్కైకకుఁ దక్కుఁగల్గు ◆ నంబల కెరఁగెన్
మక్కువఁ బురోహితుం డగు,నక్కంజజనిభవసిష్ఠు◆నంఘ్రుల వ్రాలెన్. ౨౯౧౭
తే. స్వాగతము నీకు శ్రీరాము◆భద్రదేవ, సేమమా నీకు మాతండ్రి ◆ రామచంద్ర!
సౌఖ్యమా దీర్ఘబాహు కౌ◆సల్యనంద,నా! యటంచును బౌరజ◆నంబు లెల్ల.
కం. అంజలి ఘటించి పలుకన్, రంజిలి కైమోడ్పులెల్ల ◆ రమణీయము లౌ
కంజంబుల మొగ్గ లనం, గంజహితకులుండు గాంచెఁ ◆ గడురాగమునన్. ౨౯౧౯
ఉ. అంతట రాముపావలు స్వ◆యంబుగఁ గైకొని కైకపట్టి భూ
కాంతునిపాదపద్మముల ◆ గాటపురక్తిని బూన్చి నిల్చి స
త్స్వాంతుఁడు కేలు మోడిచి నృ◆పా! భవదీయము రాజ్య మెల్ల; నే
నింతకుఁ గాచి యుండి యిదె ◆ యిప్పుడు క్రమ్మఱ నీ కొసంగితిన్.[1] ౨౯౨౦
కం. రాజుగ నిన్ను నయోధ్యను, నోజమెయిం జూచుపుణ్య ◆ ముదయించుటచే
నాజన్మం బిదేతెను, రాజవరా! నేఁడ నేను ◆ రస ధన్యుండన్. ౨౯౨౧
కం. కనుమీ కోశాగారము, ధనములు పట్టనము బలము ◆ త్వత్తేజమునన్
జనవర! దశగుణ మయ్యెను[2], గొనుమీ సకలంబు నీవు ◆ గుణనుత యనుడున్.
తే. భ్రాతృవత్సలుఁ డైనయా◆భరతుఁ జూచి, తమ్ముఁ డన నిట్టివాఁ డయి తనర నలదె
యనుచు నానందబాష్పంబు◆లగచరాళి,యువ్విభీషణుఁడును నించె ◆ నంత విభుఁడు

## ⊰ శ్రీరాముఁడు భరతునాశ్రమంబునకుఁ బోవుట. ⊱

కం. పరమానందంబున నా,భరతుని నంకమునఁ జేర్చి ◆ పయనించెను సో
దరునాశ్రమభూమికిఁ ద,త్సురయానముతోడ సైన్య◆శోభితుఁ డగుచున్. ౨౯౨౪
కం. నందిగ్రామంబున డిగి, యందఱితోఁ బుష్పకంబు ◆ నవని నిలిచి యా
బృందారకయానంబున,కుం దా సెల విచ్చె ధనదుఁ◆గొలువం జనఁగన్.[3] ౨౯౨౫
చం. అదియును రామునాజ్ఞ నుద◆గాశఁ జనెన్ భజియించె శ్రీదునిన్;
ముదమున రాముఁడున్ విబుధ◆ముఖ్యుఁడు జీవునిఁ గొల్చుమాడ్కి న
వ్విదితపురోహితాంఘ్రులను ◆ వే స్పృశియింపఁగ నిద్దఱుం బృథ
క్సదమలపీఠికాస్థలుల ◆ సమ్మతి నొక్కటఁ గూరు చుండినన్. ౨౯౨౬

## ⊰ భరతుండు రాజ్యంబు శ్రీరామునకు నప్పగించుట. ⊱

చం. శిరమున నంజలిం గదియఁ ◆ జేరిచి కైకయిముద్దుఁబట్టి శ్రీ
భరతుఁడు సత్యవిక్రముని ◆ భ్రాతను జ్యేష్ఠుని రామభద్రునిన్

[1] ఇట్టులే భక్తుఁడును దన దేహములోనుగఁ దనది యనుకొను చిదచేతనాత్మకమైన సర్వస్వము భగవంతునిదే. ఆయన మనకుఁ దరణోపాయసాధనముగ నిచ్చియున్నాఁడు. మనది పరతంత్రకర్తృత్వమే యని తలంచి యిల్లడ సొమ్ముంచుకొన్నవాఁడు సొత్తుస్వామికి సొత్తును జేర్చినట్టు భగవంతునకు సమర్పించి భారము తొలఁగించుకొనును. [2] దీనివలన భరతరాజ్యమును లోకోక్తి నిరాకరమని యేర్పడుచున్నది. [3] విమానము నడపువానికని యర్థము.

వరమతిఁ బల్కు నాజనని♦వాక్యముఁ బాలన సేసి రాజ్యముం
సిరి విడి గౌరవించితివి ♦ శ్రీకరసద్గుణ! యామె, నావలన్ ౨౯ ౨౮

కం. ఇచ్చితివి రాజ్యమెల్లను, సచ్చరితా! నీవు నావ♦శంబున మును నీ
విచ్చినయది యట్టుల నే, నిచ్చెద గ్రహియింపవయ్య ♦ యిప్పుడు మరలన్.

తే. బలిమి నొంటిగ నెంతైన♦బరువు మోయు, పోతరించిన పెద్దయాఁ♦బోతుబరువు
లేఁగలు భరింపఁజాలని♦లీల నేను, నురుభరంబును మోయంగ ♦ నుత్సహింప.

ఉ. భీషజలాతివేగమున ♦ భిన్నము ఛిన్నము నైన సేతువున్
రామ! మహాప్రయత్నమున ♦ రక్ష యొనర్చినఁగాని నిల్వన
ట్లీమహి ఛిద్రరాజ్యము న♦హీనతరావరణంబుచేతఁ గా
కేమియు నిల్పశక్య మగు♦నే తలపోయుము మానవేశ్వరా! ౨౯ ౩౦

ఆ. వాయసంబు హంస♦వలెఁ బోవఁ జాలునే?
ఖరమునకును హయము♦గతియుఁ గలదె?
యట్లు నీదుమార్గ ♦ మనుసరింపఁగను నా
యట్టివాఁడు నేర్చు♦నా? మహాత్మ! ౨౯ ౩౧

సీ. ఒకఁడు ఫలాకాంక్ష ♦ నొక్కవృక్షంబును, నంతర్ని వేశన♦మందుఁ బెంప
నదియును బెరిఁగి దు♦రారోహ మై మహా,స్కంధంబు శాఖలు ♦ చాలఁ గలిగి
చక్కఁగాఁ బూచియు ♦ నొక్కఫలంబును, నొసఁగ దేనియుఁ బెట్టు♦నుంచినతఁడు
వ్యర్థయత్నుం డగు ♦ నట్ల నీవును మను,జేంద్ర! యీభక్తుల ♦ భృత్యజనుల
ఆ. హితులఁ బ్రోచుపొంటె ♦ నిల నేల వేని యీ,యుపమ నీకె చెల్లు ♦ నురుగుణాఢ్య!
చెట్టు నింట నాటి♦నట్టివాఁ డగుఁ జుమ్మి, నీదుజనకుఁ డింత ♦ నిజము దేవ!

తే. నట్టమధ్యాహ్నమున దీప్తి♦మంతుఁ డైన,ఖరకరునిసూర్యుఁ గన్గొను♦కరణినిపుడు
నిన్నుఁబట్టాభిషిక్తుఁ డై♦ చెన్ను మీఱు,వానిఁ గాంచెదరయ్య! భూ♦ప్రజలు రామ![1]

కం. అంచితతూర్యధ్వనులను, గాంచీనూపురకలాప♦ఘల్ ఘల్ శింజా
సంచయముల నిఁక మెలఁకువ, గాంచం దగు నీకు మధుర♦గానధ్వనులన్.

కం. ఎందాఁక వెలయు వసుమతి, యెందాఁక ఖగోళ ముండు ♦ నెసఁగుచుఁ దిర మై
యందాఁక నీవు ప్రభుతం, బొంది జగం బెల్లఁ గావఁ ♦ బూనుము నెమ్మిన్. ౨౯ ౩౨

కం. అనుభరతునివచనంబుల, విని శాత్రవహరుఁడు రామ♦విభుఁడును వల్లే
యన భరతుఁడు తనపీఠం,బునకుం జని కూరుచుండెఁ ♦ బొంగుచు మదిలోన్.

### శ్రీరామాదులు జడలు విడుచుట.

సీ. అంత శత్రుఘ్నుని♦యానతి సుఖకరుల్, శ్మశ్రువర్ధనకళా♦చణులు[2] వచ్చి
కాకుత్థ్సునకు క్షుర♦కర్మంబుఁ దీర్చిన, భరతుండు దొలుత న♦వ్వల సుమిత్ర
పట్టి సుగ్రీవుండు ♦ పదపడి రాక్షస,నాయకుం డోలి స్నా♦నంబు సేయ
జడలు చిక్కుడలించి ♦ స్నాతుఁడై చిత్రమా,ల్యానులేపముల మ♦హార్హవసన

[1] ఇదివఱకు సౌశీల్యసౌలభ్యవాత్సల్య కారుణికత్వపరమోదారత్వ మధురభావములు ప్రకటించితివి. ఇఁక నీశ్వరత్వము ప్రకటింపుమని భావము. [2] క్షత్రియులకు మీసముల కత్తిరింపేగాని శిరఃక్షౌరము లేదు.

తే. ములను గైసేసి కొని శ్రీలఁ ♦ జెలఁగు చుండు
రామునకును ద్రిలోకాభి♦రామునకును
లలితలక్ష్మీకుఁ డైన శ్రీ♦లక్ష్మణునకుఁ
దొడిగె మణిభూషణములు శ♦త్రుఘ్నుఁ డెలమి. ౨౯౩౭

కం. కైసేసి రంత సీతకు, భాసురగతి దశరథేశు♦పత్నులు కడుసం
తోసంబునఁ దామే నా,నాసురుచిరలీల లెసఁగ ♦ నవ్యతరముగన్. ౨౯౩౮

కం. సుతలాలస కౌసల్యా,సతి ముదమున యత్నమునను ♦ సకలవనచరీ
తతులకు సింగారించెను, హితగతి భూషావళుల న♦నేకవిధములన్. ౨౯౩౯

## శ్రీరామాదు లయోధ్యకుఁ బ్రయాణ మగుట.

సీ. అంత శత్రుఘ్నవా♦క్యమున సుమంత్రుండు, సర్వాంకశోభన♦సహిత మగుచు
నర్కమండలనిభం ♦ బయి దివ్య మగు తేరి, సజ్జీకృతముఁ జేసి ♦ సరగఁ దేర
నాజానుబాహు కం♦జాయతలోచనుఁ, డిద్ధవిక్రముఁ డందు ♦ నెక్కె తరలె
స్నాతు లై కుండలో♦పేతు లై దివ్యసం,కాశవస్త్రంబులఁ ♦ గ్రాలి చనిరి
ఆ. యమరనాథతేజు ♦ లైనసుగ్రీవుండు, మారుతాత్మజుండు ♦ మహిమ వెలయ
రామురథము వెంట ♦ రమణీయభూషణ, వారదివ్యతాళ♦పత్త్రధరలు ౨౯౪౦

కం. వానరసతులంద అయో,ధ్యానగరముఁ జూచుతమిని ♦ దరలిరి జనక
క్ష్మానేతృతనయతోడెం,దానన్ మురియుచు నితాంత♦నవ్యోత్సుక లై. ౨౯౪౧

సీ. మున్ను మున్న యయోధ్య♦పురి కేగి దశరథు,మంత్రు లశోక సు♦మంత్ర విజయు
లనువారలు పురోధ♦సునిఁ గూడి యోజింప, రామాభివృద్ధికిఁ ♦ బ్రజలవృద్ధి
కమ్మంత్రు లిట్లని ♦ రయ్య జయార్హుఁ డౌ, నామహాభావుని ♦ రామచంద్రు
మంగళపూర్వక♦మహితాభిషేకార్థ, మెల్లను దీర్పుఁడీ ♦ యిప్పు డనుచుఁ
తే. జెప్పి శ్రీరామచంద్రు ద♦ర్శించుపొంటెఁ, బురము వెలువడి వచ్చి రా♦భానుతుండు
హరితసైంధవయుతరథ♦మందు నింద్రు,చెన్నుదోఁపఁగ స్యందనా♦సీనుఁ డగుచు.
కం. తుఱఁగలి గొను సమ్మదమున, మెఱవడి చనె మేనిరుచులు ♦ మీఱి ప్రజలకున్
మిఱుమిట్లు గొలుపఁ బురమునఁ, బఱ పగునగరంబురాచ♦బాటల వెంటన్.
సీ. పగ్గముల్ చేఁబూని ♦ భరతుండు నొగ నుండి, సారథ్య మొనరించె ♦ సమ్మదమునఁ
బరమాతపత్త్రంబుఁ ♦ బట్టె శత్రుఘ్నుండు, సౌమిత్రి రాముశీ♦ర్షంబుపైన
వ్యజనంబు వీచుచు ♦ సవ్యహస్తంబున, వెలిచామరముఁ బూని ♦ నిలిచి యుండెఁ[1]
బృథుకీర్తి యైనవి♦భీషణుండు మఱొండు,చంద్రసన్నిభ మూనెఁ ♦ జామరంబు
ఆ. నింగి పిక్కటిల్ల ♦ నిలిచిన వేల్పుల,మునుల మధురనుతులు ♦ వినఁగ నయ్యె
శైలనిభము గజము ♦ శత్రుంజయంబును, నినతనూజుఁ డెక్కె ♦ యెలమి వచ్చె.

[1]అహంసర్వం కరిష్యామి యని చెప్పినవాఁడు గావున లక్ష్మణుఁడు రెండుచేతుల రెంటిని ధరించెను.

కం. మానుషవిగ్రహధరు లై, నానాభూషలు ధరించి ♦ నగచరవర్యుల్
మానుగ నొకతొమ్మిదివే, లేనుంగులమీఁదఁ జనిరి ♦ హృదయము లలరన్. ౨౯౪౬

కం. దుందుభులపేరుటులిపులు, దండడి శంఖములమ్రోఁత ♦ తతఘనరవముల్
దొండడిగాఁ బురుషోత్తముఁ, డందంబుగఁ జనియెఁ గనుచు ♦ హర్మ్యశ్రేణుల్.

చం. అతిరథుఁ డైనవాని నిజ♦హారిశరీరవిరాజమానునిన్
క్షితిజనకోటిసంవృతుని ♦ శ్రీరఘురామునిఁ గాంచి మంత్రు లం
చితగతిఁ జేరి దీవనలఁ ♦ జిత్త మిగుర్పఁగఁ జేయ నాతఁ డా
హితసచివాళులం దనిపె ♦ నెంతయు గారవ మారువాక్కులన్. ౨౯౪౭

ఉ. వారును దమ్ములం గలసి ♦ వచ్చిరి వెంబడి; నిట్లమాత్యులుం
బౌరులు ధారణీసురులు ♦ ప్రాభవ మొప్పుతనున్ భజింప నీ
తారమణుండు నిస్తులని♦తాంతరుచిన్ వెలుఁగొందెఁ దారకా
వారముతోడఁ బొల్చుహిమ♦భానునకున్ సరియీడుజోడు నై. ౨౯౪౮

సీ. మంగళవాద్యముల్ ♦ రంగుగ మొరయంగఁ, దాళహస్తులు జాణ♦తనము దెలుప
స్వస్తికపాణులు ♦ సామర్థ్యమును జూప, గీతముల్ కొందఱు ♦ కెరలి పాడ
వాద్యంబు లన్నియు ♦ హృద్యంబు లై మ్రోగ, నడజోదులెల్లరుఁ ♦ గడిమిమెఱయఁ
బచ్చనియక్షతల్ ♦ పట్టి బ్రాహ్మణులును, గన్నెలు గోవులు ♦ మున్ను చనఁగ
ఆ. సచివతతికి రామ♦చంద్రుండు వచియించె, నినజుతోడిచెల్మి ♦ యనిలతనయు
మహిమ నగచరాళి ♦ మహితకృత్యమ్ము వి,భీషణాగమంబు ♦ విశదఫణితి. ౨౯౪౯

శా. త్వాకాంతోక్తుల నెల్లలోకు లధికా♦శ్చర్యాబ్ధి నిర్మగ్ను లై
యాకర్ణింపఁగఁ దెల్పి చొచ్చెను నయో♦ధ్యన్ హృష్టపుష్టప్రజా
నీకోపేతను గేతుమండితగృహా♦న్వీతన్ రఘూత్తంసుఁ డై
క్ష్వాకాభీష్టముఁ దండ్రిమందిరము వే♦డ్కం జొచ్చె నుల్లాసి యై. ౨౯౫౦

కం. తల్లులకు ముప్పురకు వే, సల్లలితవిధంబు దోఁప ♦ సాఁగిలి మ్రొక్కెన్
మొల్లముగ నర్థహితమధు,రోల్లసితోక్తులను భరతు ♦ నొయ్యనఁ బలికెన్. ౨౯౫౧

కం. నాయుత్తమభవనంబు మ,హాయతము నశోకవనిక ♦ మతులితముక్తా
స్ఫాయద్వైడూర్యచయ,శ్రీయుత మట దింపుమా హ♦రి ప్రభు ననినన్. ౨౯౫౨

శా. కేలుం గేలుఁ గదించి తోడ్కొనుచు ను♦గ్రీవున్ వెసంబోయి ను
శ్రీలాలిత్యమనోజ్ఞశాల విడియిం♦చెం దైలదీపంబులున్
లీలామంచము లాసనంబులును గే♦లీతల్పముల్ లోనుగాఁ
జాలన్ లక్ష్మణుతమ్మునాజ్ఞ నిడి రా♦సద్మంబునన్ సేవకుల్. ౨౯౫౩

తే. రాముతమ్ముండు కపిరాజు♦తో మహాత్మ, రాముపట్టాభిషేకంబు ♦ రమణఁ జలుపఁ
బుణ్యతీర్థజలంబులు పోయి తేర, దూతలకు నాజ్ఞ సేయుమీ ♦ తూర్ణ మనిన.

ఉ. సూరతనూభవుండు కపి♦శూరుల నల్వురఁ జూచి నాల్గుబం
గారపుబిందె లిచ్చి యివి ♦ కైకొని తివ్వనఁబోయి నాల్గిటన్
వారిధినీరముల్ గొని ప్ర♦భాతములోపల రండు పొందు నిం
డారుజవాన మ్మెదురు ♦ నాదటఁ జూడుఁడు వచ్చి యిర్యోడన్.　　౨౯౫౫

చం. అనవుడు వారణోపమవ♦నాటవరుల్ దివి కుద్గమించి య
ద్వినతతనూజుఁబోలి కడు♦వేగమునం జని రయ్యెడన్ మరు
త్తనయుఁడు వేగదర్శియు వి♦ధాతృజుఁడున్ ఋషభుండు దివ్యతీ
ర్థనిచయపూర్ణకుంభములఁ ♦ గ్రన్నన తెచ్చిరి ముహూర్తమంతలోన్.　　౨౯౫౬

ఆ. ఐదునూర్లనదుల♦యందుండి పుణ్యతీ, ర్థములు కనక కలశ♦రాజిఁ దెచ్చి
వరుస నిల్పినారు ♦ వానరుల్ కొందఱు, మందిరంబు నిండ ♦ మంజులముగ.

కం. లలితమణీమయభూషిత, కలశంబును గొంచుఁ దూర్పు♦కడలికిఁ జని త
జ్జలములు బలసంపన్నుఁడు, చెలువుగఁ గొని వచ్చె వెస సు♦షేణుఁడు భక్తిన్.

కం. వే రొక ఋషభుఁడు దక్షిణ, వారాశికిఁ బోయి కడుజ♦వంబునఁ దెచ్చెన్
నీరము లోహితచందన, భూరుహశాఖాపినద్ధ♦పురురుక్మఘటిన్.　　౨౯౫౮

కం. పడమటిమొగ మై గవయుఁడు, కడలికిఁ జని రుచిరరరత్న♦కలశంబునఁ ద
జ్జలతీర్థము మారుతగతిఁ, గడిమిం గొని తెచ్చె నల్ప♦కాలములోనన్.　　౨౯౬౦

కం. ఉత్తమగుణసహితుండును, సత్త్వముఁ దగునలుఁడు పవన♦శకునేశ్వర వే
గాత్తుం డై కొనివచ్చెను, నుత్తరపుంజలధిజల మ♦నుత్తమమతితోన్.　　౨౯౬౧

తే. వానరోత్తము లిటుగొని♦వచ్చినట్టి, తోయములనెల్లఁ గాంచి శ♦త్రుఘ్నుఁ డలరి
సచివమిత్రపురోహిత♦జనుల కెల్ల, నధిపు నభిషేక మొనరింపుఁ ♦ డనుచుఁ దెలిపె.

## ⟵ శ్రీరామపట్టాభిషేకమహోత్సవఘట్టము. ⟶

కం. అంతట వృద్ధు వసిష్ఠుఁడు, శాంతుఁడు భూసురవరేణ్య♦చయయుతుఁడు మణీ
కాంత మగుపీఠి సీతా, కాంతునిఁ గూర్చుండఁ బెట్టి ♦ త్స్నానుతతోడన్.　　౨౯౬౩

సీ. అవల వసిష్ఠ కా♦త్యాయనజాబాలి, కాశ్యపవిజయులు ♦ గౌతముండు
వామదేవసుయజ్ఞ ♦ వర్యులు వసువులు, శక్రుని నభిషిక్తుఁ ♦ జలుపుభంగిఁ
గమ్మనివలపుల♦ఘ మ్మనునిర్మల, జలముల నభిషిక్తుఁ ♦ జలిపి రంత
ఋత్విగ్గరామర♦బృందకన్యామంత్రి, యోధులతో నర్య♦యూథయుక్తి

ఆ. దివ్య మాామహాాష♦ధీరసంబులచేత, దివిని మూఁగియున్న♦దేవతతుల
తో దిశాధిపతిచ♦తుష్కంబుతో నభి, షేకకార్యమెల్లఁ ♦ జేయఁ బిదప.　　౨౯౬౪

సీ. [1][బ్రహ్మనిర్మితమయి ♦ బహురత్నశోభిత, మై దీప్తతేజుఁ డై♦ యలరు మనువు
మున్నభిషిక్తుఁ డై ♦ చెన్నుమీఱిన వేళఁ, దాల్చినయది యయి ♦ తరతరంబు

[1]ఇది మూలమునఁ బ్రక్షిప్తము.

త ద్వంశ్యు లెల్లరుఁ ♦ దప్పక యభిషేక,మునఁ దాల్చునది యయి ♦ తనరుదాని
సకలమహాజన ♦ సంశోభితంబయి, కాంచన క్ష్మాస్తంబు ♦ కమ్రతరము

తే. బహు విధామూల్య మణిగణ♦భాసమాన, మైన సభయందు దేదీప్య♦మానరత్న
పీఠమున శాస్త్రచోదిత♦విధిని నిల్పి,నర్చితముఁ జేసి పదపడి♦హర్ష మార ౨౯౬౫

కం. శ్రుతిమంత్రమైన ఋత్విక్,క్షతిఁ గూడి వసిష్ఠ మౌని ♦ కమనీయపరి
ష్కృతి తోడ రామవిభున,స్తుతిఁ దాల్పఁగఁ జేసెఁ జెలఁగ ♦ మంగళరవముల్]

సీ. శత్రుఘ్నుఁ డన్నకు ♦ శస్తమంగళకర,పాండురచ్ఛత్రంబుఁ ♦ బట్టె భక్తి
వెల్లనిచామర ♦ విసరె సుగ్రీవుఁడు, వే ఱొండుసంపూర్ణ ♦ విధునిభంబుఁ
బట్టెను రాక్షస♦ప్రభువు విభీషణుం, డమరేంద్ర చోదితుం ♦ డగుచుఁ బవనుఁ
డర్పించె శతకమ♦లాంచితం బయి ధగ,ద్ధగిత తేజం బయి ♦ తనరు కనక

ఆ. మాలికయును సకల♦మణిసమాయుక్తంబు, దివ్యరత్నతరల♦దీప్యమాన
మౌక్తికప్రకాండ♦పుంజులహారంబుఁ, గొంచువచ్చి యిచ్చెఁ ♦ గొమరుమిగుల.

కం. పాడిరి గంధర్వులు దివి, నాడిరి సంతోషగరిమ ♦ నచ్చరవెలఁదుల్
గూడిరి గుము లై సిద్ధులు, వీడిరి వెఱ తదభిషేక♦విధిఁ గని మౌనుల్. ౨౯౬౮

కం. ఇల నిండెఁ బైరుపచ్చలు, ఫలములు నిండారె సకల♦పాదపతతులన్
వలపులు నిండెను సుమముల, మలయుచుఁ బట్టాభిషేక♦మహమున నెందున్.

చం. తవిలినప్రీతి రాఘవుఁ డు♦దారత వాజుల నూఱువేలు గో
నివహము లక్ష కోడియుల ♦ నిస్తులవీర్యము లొక్కనూఱు భూ
దివిజుల కిచ్చి వెండియును ♦ దేవనిభుండు మహార్హవస్త్రముల్
వివిధవిభూషణంబులును ♦ లీలగ ముప్పదికోట్లనిష్కముల్. ౨౯౭౦

కం. దానంబుఁ జేసి భాస్కర,భానుద్యుతిదివ్యరత్న♦పరిఖచితం బై
జా నగుకాంచనమాలిక, భానుజునకు నిచ్చె రామ♦భద్రుఁడు ప్రీతిన్. ౨౯౭౧

కం. హీరమణిభూషితమ్ము వి,దూరజమణిచిత్రితంబు ♦ తోరపుఁగాంతిన్
దీ రగునంగదముల నీ,తారమణుం డంగదునకు ♦ దయతో నిచ్చెన్. ౨౯౭౨

చం. అమలమణిప్రవేకనిచ♦యాన్విత మై పరిపూర్ణచంద్రమ
స్సమవిమలప్రభంబు నయి ♦ చారుతరంబు నసుత్తమంబు నై
కొమ రగునాణిముత్తెములఁ ♦ గూడినమేలిసరంబు నిచ్చె న
త్యమితసురక్తిభూమితన♦యామణికిన్ జనకేంద్రకన్యకున్. ౨౯౭౩

## ←→ శ్రీసీతాదేవి హనుమంతు బహూకరించుట. ←→

కం. నిర్మలసుదుకూలంబులు, భర్మమయాభరణములును ♦ బతిఁ జూచుచుఁ దా
నర్మిలి జానకి కరువలి,కూర్మినిసుంగునకు నిచ్చె ♦ గుణమణినిధికిన్. ౨౯౭౪

ఉ. ఇచ్చియుఁ దుష్టి లేక జన♦కేశ్వరనందిని యాత్మకంధరన్
ముచ్చట గూర్చుచున్ మెఱుఁగు♦పుంజము లీనుచు స్వర్ణహారమున్

హెచ్చినప్రీతిఁ జేకొని హా♦రీశ్వరపాళులనెల్లఁ జూచుచున్
మచ్చిక ప్రాణనాథుముఖ♦మండలముం గనె మాటిమాటికిన్. ౨౮౫

ఉ. రాణ నెసంగుహారముఁ గ♦రంబునఁ దాలిచి తన్నుఁ జూచుపూఁ
బోణితలం బెఱింగి రఘు♦పుంగవుఁ డిట్లను హార మి మ్మళీ
వేణిరో! నీకు మెచ్చుగొలి♦పెన్ గుణపాళి నెనం డెవండు క
ళ్యాణి! సుధీపరాక్రమబ♦లంబుల నెప్పుడుఁ బొల్చు వానికిన్. ౨౮౬

కం. అనఁ గువలయలోచన యది, యనిలాత్మజునకు నొసంగె ♦ హారముఁ దాల్పన్
హనుమయు శశికరధవళం,బును సితఘనయుతము శైల♦మునుబోలె రహిన్.

ఆ. పిదప మైందునకును ♦ ద్వివిదనీలురకును, వారు వారు ప్రీతి ♦ వలచినట్టి
వరమహార్హవస్తు♦వర్గంబు లన్నియు, వేఱు వేఱ రామ♦విభుఁ డొసంగె. ౨౮౭

ఆ. ప్లవగవృద్ధులకును ♦ వానరనాథుల,కెల్ల యోగ్యముగను ♦ హితవిధముగ
గౌరవించి వస్త్ర♦కనకభూషణముల, నిచ్చి వారికెల్లఁ ♦ దృప్తిఁగూర్చె. ౨౮౮

ఉ. ఈవిధి రాక్షసప్లవగ♦ఋక్షవిభుల్ హనుమంతుఁ డెల్లఁ గీ
శావళి యర్హభంగి సము♦దారగతిన్ మణిభూషణాదిపూ
జావివిధప్రకామములు ♦ సంతసమారఁగఁ బొంది భూమిక
న్యావిభుచే ననుజ్ఞఁ గొని ♦ స్వావనిఁ జేరఁగఁ బోయి రందఱున్. ౨౯౦

కం. వానరసత్తములున్ సీ,తానాథున కెరఁగి తత్స్వ♦తంబునఁ గిష్కిం
ధానగరికిఁ జని రట్టుల, భానుజుఁడుం జనియె భూమి♦పతి యనుమతిచేన్.[1] ౨౯౧

చం. కులధనమున్[2] గ్రహించి రఘు♦కుంజరుచేత ననుజ్ఞఁ గాంచి స
ల్లలితగతిన్ విభీషణుఁడు ♦ లంకకుఁ బోవ మహాయశుండు ని
ర్దళితవిరోధివర్గుఁడు వ♦దాన్యశిరోమణి రాఘవుండు దా
నిల సకలంబు నేలెఁ బరి♦హృష్టుఁడు తుష్టుఁడు నై నయంబునన్. ౨౯౨

సీ. ధర్మవత్సలుఁ డైన ♦ ధరణిజానాథుండు, సౌమిత్రి కిట్లనుఁ ♦ జనవు దోఁప
ధర్మజ్ఞ! పూర్వభూ♦ధవపాలితం బగు,నీధరారాజ్యంబు ♦ నీవు బలిమి
నాతో సమంబుగా ♦ నర్మిలిఁ బాలింపు, మిది కులాగత మయి ♦ యిట్లు వచ్చె
యౌవరాజ్యభరంబు ♦ నీవు దాల్పు మటంచు, నెన్నెన్నివిధముల ♦ నెంత చెప్ప

తే. మేకొనం డయ్యె దాని సౌ♦మిత్రి;[3] భరతు
యౌవరాజ్యంబునన్ నిల్పి ♦ యశ్వమేధ
పౌండరీకంబులును మఱి ♦ వాజపేయ
మాది సవతతు లొనరించె ♦ నవనివిభుఁడు. ౨౯౩

[1]ఇది యుత్తరకథ సూచించుటేకాని గ్రంథసమాప్తిగఁ జెప్పినది కాదు. తరువాతి సర్గకథను బూర్వసర్గాంతమునఁ బెక్కుచోట్ల సూచించినట్లే యిదియు. ఇట్టి సంగ్రహవాక్యములు వ్యాసవాక్యములకుముందు కావ్యముల మధ్యంబునను గాననగు. చూడుఁడు. ౨౫౬-౨౬౦ వఱకుఁ బద్యములు. [2]కులధనము ఇక్ష్వాకువంశజుల కులధనమును శ్రీరంగనాథమూర్తినని పురాణాంతరములఁ గలదు. [3]కైంకర్యవిఘ్నకారి గనుక.

సీ. ఆజానులంబబా♦హార్గళుం డతులిత, విక్రమవంతుండు ♦ వినుతగుణుఁడు
దృఢమహాస్కంధుండు ♦ దివ్యతేజస్కుఁడు, లక్ష్మణానుచరుండు ♦ లలితగతిని
నుత్తమరాజ్యంబు ♦ నొంది ధర్మాత్ముఁ డై, పదివేలయేండ్లు భూ♦పాలనంబు
సలిపి యనుత్తమ♦సైంధవంబుల వీడి, భూరిదక్షిణలతోఁ ♦ బుణ్యవిధిని
తే. జేసి నూఱశ్వమేధముల్ ♦వాసి చెలఁగ, జ్ఞాతిబాంధవహితసుహృ♦త్సహితుఁడగుచు
బహువిధంబుల నధ్వరా♦వళులు సలిపె, భువనవినుతుండు శ్రీరామ♦భూవరుండు.
కం. ఆధులు పొసఁగవు జను లహి,బాధలచేఁ గుంద రబ్జ♦పత్త్రేక్షణలున్
వైధవ్యదుఃఖ మెఱుఁగరు[1], వ్యాధులు లే వెందు రామ♦పాలనమందున్. ౨౯౮౫
తే. దొంగ లనుపేరు జగతి వి♦నంగ రాదు, కలుగద యనర్థ మొకఁ డైన ♦ క్ష్మాజనులకుఁ
బిన్నలకుఁ బ్రేతకార్యముల్ ♦ పెద్ద లెందుఁ, జలుప రుర్విని శ్రీరామ♦చంద్రుఁ డేల.
ఉ. రామునిఁ జింత సేయుచు ని♦రంతరముం సకలంబు ధర్మధీ
ధామమునై ప్రమోదకలి♦తంబుగ నయ్యెఁ, బరస్పరం బహిం
సామతిఁ గూడి యుండిరి ప్ర♦జల్ బహుపుత్త్రకులై యరోగులై
క్షేమముదంబు లుబ్బఁగ వ♦సించిరి తత్పురి నేండ్లుపూండ్లుగన్. ౨౯౮౭
కం. రాముఁడు రాముఁడు రాముఁడు, రాముఁ డటంచు తనికథలు ♦ ప్రజ వర్ణింపన్
రామమయ మయ్యె భువనము, రాముండు సమస్తధరణి♦రాజ్యం బేలన్. ౨౯౮౮
సీ. నిత్యపుష్పంబు లై ♦ నిత్యఫలంబు లై, శాఖోపశాఖ లై ♦ శాఖు లమరెఁ
గఱవుల వెఱ పాయఁ ♦ గాలంబు దప్పక, రమణ వర్షించెఁ బ♦ర్జన్యుఁ డప్పు
డంద మై భూప్రజా♦నంద మై మంద మై, మలయమారుత మొప్పు ♦ మలయు చుండె
బ్రాహ్మణక్షత్త్రియుల్ ♦ వైశ్యులు శూద్రులు, లోభదూరగు లయి ♦ శోభ దాల్చి
ఆ. వారివారినియత♦వర్తనంబునఁ దృప్తిఁ,గనుచు వారివారి♦కర్మవిధుల
ధర్మనిరతు లగుచుఁ ♦ దతశుభచిహ్నులై, వఱలి రవని రామ♦పాలనమున.
కం. పదివేలవత్సరంబులుఁ, బదినూఱేఁడులును దనదు♦భ్రాతలతో స
మ్మదమున శ్రీమంతుఁడు భూ,విదితుఁడు శ్రీరామవిభుఁడు ♦ విశ్వం బేలెన్. ౨౯౯౦

ఫలశ్రుతి

సీ. ఆదికావ్యం బిది ♦ యార్షంబు పూర్వంబు[2], వాల్మీకి రచియించి ♦ ప్రకటపఱిచె
ధన్య మాయుష్యంబు ♦ తతయశోజనకంబు, భూవరులకు విజ♦యావహంబు
దీనిని బఠియింపఁ ♦ దీఱుఁ బాపంబులు, పుత్త్రకాములకును ♦ బుత్త్రఫలము
ధనకాములకుఁ జాల♦ధనములు లభియించు, రామాభిషేచన♦క్రమము విన్న
ఆ. రాజు గెలిచి వైరి♦రాజుల వసుమతీ,పాలనంబు సేయుఁ ♦ బ్రాభవమునఁ
బ్రజలు వినిర యేని ♦ రామాయణము రాము,విజయ మాయు వధిక♦వృద్ధిఁ గూరు.
కం. రామునిచేఁ గౌసల్యయు, సౌమిత్త్రులచే సుమిత్త్ర♦సతి భరతునిచే
శ్రీమతి కైకేయియువలె, శ్యామ లెసఁగుదురు చిరాయు♦ లగుపుత్త్రులచేన్.

[1]కౌసల్యాదులకు వైధవ్యప్రాప్తి రామరాజ్యమునఁ గాదని యెఱుంగునది. [2]ఇది సీత వాల్మీకి యాశ్రమమున నుండఁగఁ జెప్పఁబడినది గనుకఁ బూర్వమనఁబడియె.

మ. జితరోషుండును శ్రద్ధధానుఁ డగుచుం ♦ జిత్తంబు నేకాగ్రసం
గతముం జేయుచు వల్మికోద్భవుని స♦త్కావ్యంబు సార్థంబు స
మ్మతి నెవ్వండు పఠించు వాఁడు తరియిం♦పం గల్గు దుఃఖంబులన్
మతిలోఁ గల్గినకోర్కులుం బడయు రా♦మశ్రీకటాక్షంబునన్. ౨౯౯౩

కం. ఈకావ్యంబును వినియెడి, లోకులయెడ నెల్ల వేల్పు♦లున్ ముదపడెదర్
భీకరభూతగ్రహములు, వ్యాకులపడి పాఱిపోవు ♦ వారలయిండ్లన్. ౨౯౯౪

కం. నరపతి ధరణి జయించును, బరదేశియు సుఖము చెడక ♦ పయనము సేయున్
దరుణి రజస్వల[1] వినినన్, వరగుణులం బుత్రకులను ♦ బడయఁగఁ జాలున్. ౨౯౯౫

ఆ. ఈపురాతనంబు♦నితిహాసమును నరుం, డెవఁడు పూజ చేసి ♦ యిచ్చ భక్తిఁ
బఠన మాఱఁ జేయు ♦ వాఁడు పాపంబులఁ, జెదర నణఁచి దీర్ఘ♦జీవి యగును.

కం. శిరమున నిత్యము మ్రొక్కుచు, ధరణీసురుచేత దీని ♦ ధరణిపతి వినన్
సిరియును సుతలాభంబుం, బొరయును నిస్సంశయముగ ♦ ముమ్మాటికినిన్.

ఉ. పాయనిరక్తిచే వినిన ♦ భక్తిఁ బఠించిన యేని నెల్లరా
మాయణ మట్టివానిఁ గరు♦ణార్ద్రకటాక్షముచేతఁ జూచు నా
రాయణుఁడుం బ్రభుండు హరి ♦ యాదిమదేవుఁడు దీర్ఘబాహుఁడున్
మాయధినేత విష్ణుఁడు స♦నాతనుఁ డౌటను రాముఁ డెప్పుడున్. ౨౯౯౬

సీ. ఈశుభకావ్యంబు ♦ నెలమి నాలించిన, ధనధాన్యవృద్ధి సం♦తానవృద్ధి
వరగుణోపేత లా♦సరసిజనేత్రల, సంగతి యుత్తమ♦సౌఖ్యతతియు
నఖిలార్థసిద్ధి మ♦హార్థసంసిద్ధియుఁ, బ్రాపించు నరులకు ♦ భవ్యరీతి
నాయువుఁ గీర్తియు ♦ నారోగ్య మొనగూర్చు, సౌభ్రాతృకరమును ♦ సౌఖ్యకరము

తే. సాధుధిషణాకరంబు నో♦జస్కరంబు, నైన యీపుణ్యకావ్యంబు ♦ నభ్యుదయముఁ
గోరి వినునట్టిసజ్జనుల్ ♦ కొఱఁత లేక, నియమయుతు లయి వినవలె ♦ నిశ్చలమతి.

మానిని. ఈరహి మించుమహత్త్వముఁ గల్గిన ♦ యిట్టిపురాతనవృత్తమణిన్
మీరు పఠింపుఁడు సంశయ మూనక ♦ నిండుమనంబున నమ్మి జనుల్
దూరము లైచను దోషము లన్నియుఁ ♦ దోరవుభద్రము మీకు నగున్
వారక విష్ణుమహామహిమోన్నతి ♦ వర్ధిలుతం గడువర్ధిలుతన్. ౩౦౦౦

కం. రామాయణపఠనంబున, రామకథాశ్రవణముననను ♦ రంజిలి దేవ
స్తోమంబు పితరు లెల్లరు, నామోదము నొందువార ♦ లనవరతంబున్. ౩౦౦౧

కం. వాసిగ ఋషివిరచిత మగు, నీసంహిత నెవఁడు రాము♦నెడఁ గడుభక్తిన్
వ్రాసిన[2] వ్రాయించినస్వ, ర్గావాసం బామానవునకు ♦ వఱలు సతంబై. ౩౦౦౨

[1] ముట్టుస్నానమైనతరువాత ౧౩ దినములవఱకు. [2] ఈ వాక్యముచేతను, రామముద్రికయందును రామబాణంబులమీఁదను రామనామమును చెక్కినట్లు చెప్పియుండుటచేతను లిపిలేఖనము పూర్వము లేదను వాదము నిరాధారము.

కం. అని యార్ష మాదికావ్యం,బను నగురామాయణంబు ♦ మును వల్మీకసం
జనితుఁడు తపస్వి సంహిత,గను బల్కెను భూప్రజోప♦కారకబుద్ధిన్. 3003

## ⊶ యుద్ధకాండాంతపద్యములు. ⊷

కం. నయనీకృతరవిచంద్రా! యయనీకృతసాగరేంద్ర ♦ యవితసురేంద్రా
శయనీకృతభుజగేంద్రా,జయ జయ శ్రీరామ జనక♦జాహృద్ధామా. 3004

ఉ. శ్రీకమనీయశీల! ఖల♦శిక్షణలోల! దయాలవాల! నీ
రాకరగర్వభంజన! ఘు♦తాఘ! నిరంజన! భక్తరంజనా!
ప్రాకట కీర్తిధామ! యప♦వర్గదనామ! హితైకకామ! ఖ్యా
తైకశిలావిహార! జన♦కాత్మభవాహృదయాబ్జభాస్కరా! 3005

### మంగళమహాశ్రీవృత్తము.

ధీర!రసఖాభ్రశుచి♦దృష్టిగతపద్యనుత ♦ దేవహితఘోరరణవృత్తా!
సూరకుల! దాశరథి ♦ సూరిహితతాశరధి ♦ శూర! వరధీ! విరథి! వైదే
హీరమణ! హీరమణి♦హేమరమణీయ వర♦హీరశయనా! వనధివాసా!
భూరమణవర్య! గుణ♦పూతశుభచర్య! నత♦భూమిరథ మంగళమహాశ్రీ. 3006

## — గద్యము. —

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిం
దాయమాన మానసత్వ మహావైభవ వావిలి
కొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ సుబ్బరాయ
నామధేయ ప్రణీతం బైన శ్రీమదాంధ్రవాల్మీకిరామా
యణ మనునిర్వచనమహాకావ్యంబునందు
యుద్ధకాండము.

---

శ్రీ రా మా ర్ప ణ మ స్తు.
శ్రీ. శ్రీ. శ్రీ.

శ్లో. నమోస్తు రామాయ సలక్ష్మణాయ, నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మభువే వరాయ, నమోస్తు వల్మీక భవాయ తస్మై.

---




శ్రీః

శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

శ్రీ శారదాయై నమః.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము.

## ఉత్తరకాండము.[1]



శ! నతకమ్రులభవ! సీ
తేశా! దేవాధినాథ ♦ భృతధీరా! గౌ
రీశేడ్యా! యమిరాట్స్వర
గా! శివకర! యభవ! మండ ♦ నప్రియక నమః[2].

### అగస్త్యాదిమహర్షులు శ్రీరామదర్శనార్థులై వచ్చుట.

ఆ. ప్రబలరాక్షసులను ♦ భండనంబునఁ ద్రుంచి, ప్రాప్తరాజ్యుఁ డగుచు ♦ రామవిభుఁడు
వఱలుచుండఁ జూడ ♦ వచ్చిరి రాఘవు, స్తవమొనర్చు పొంటె ♦ సకలమునులు. ౨

తే. కౌశికుండు యవక్రీత ♦ గార్గ్యకణ్వ,మునివరులును మేధాతిథి ♦ పుత్రకుండు
గాలవుండును లోనుగాఁ ♦ గలమహర్షి,వరులు తూరుపుదెసవారు ♦ భవ్యమతులు. ౩

కం. నముచియు స్వస్త్యాత్రేయుఁడుఁ, బ్రముచియు ఘటసంభవుండు ♦ భగవంతుం డా
సుముఖుండు నత్రి విముఖ,ప్రముఖులు దక్షిణదిశాని ♦ వాసు లెల్లన్. ౪

కం. పడమటిదెస నుండెడియా,జడదారులు కవష ధౌమ్య ♦ సంయమివరులున్
గడుధన్యుఁడు రౌద్రేయుఁడు, జడజాప్తద్యుతి నృషద్గు ♦ సత్యవచనుఁడున్. ౫

[1] పట్టాభిషేకమునకు నుత్తరకాలమున జరిగిన చరిత్ర చెప్పునది కావున నుత్తరకాండము. ఉత్తరమనఁగా శ్రేష్ఠమనియు నర్థము. సీతారాముల మహిమయుఁ బరత్వము పూర్వ భాగమునకంటె నిందు విశేషముగఁ దెల్పఁబడినవి కదా. [2] వ్యాయమంత్రోత్తరార్థ మిందు సంపుటితము. పూర్వార్థము పూర్వభాగమునఁ గలదు.

తే. ఉత్తరంబున నెప్పుడు ♦ నుండువారు, కశ్యప వసిష్ఠ జమదగ్ని ♦ గౌత మాత్రి
గాధితనయ భరద్వాజ♦కలితనామ,కులు మునీశ్వరులేడ్వురు ♦ కుతుకమునను. ౬

ఉ. అందఱు వహ్ని తేజులు మ♦హాత్ములు వేదతదంగవిత్తముల్
దొందడిగాఁగ వచ్చి నృప♦ధూర్జటిమోసల నిల్చి రంత న
య్యందఱిలో నగస్తి ప్రతి♦హారుఁ గనుంగొని నీవు భూపసం
క్రందనుతోడ నీమునుల♦రాక వచింపు మటంచుఁ బల్కినన్. ౭

కం. ధీరుఁడు దక్షుఁడు విహితా,చారుండు నయేంగితప్ర♦చారుండు ప్రతీ
హారుఁడు బిర బిర నని రా,కారాజసమాన తేజుఁ ♦ గాకుత్థ్సమణిన్. ౮

ఉ. చేరి నమస్కరించి నృప♦శేఖర! కుంభభవాదిమానిరా
డ్వారము మిమ్ముఁ జూచుతమి ♦ ద్వారతలంబున నిల్చె నన్న సీ
తారమణుండు బాలరవి♦ధాములరాకకు మోద మంది పెం
పారఁగఁ దోడితె మ్మనిన ♦ నాతఁడు నట్ల యొనర్చె భక్తిమై. ౯

చం. ఋషితతిరాకఁ గాంచి యెదు♦రేగి కృతాంజలి యౌచుఁ భూమి భృ
ద్వృషభుఁడు పాద్య మర్ఘ్యమును ♦ నింపు దలిర్పఁగ గోవు నిచ్చి క
ల్మషరహితంబు లౌకనక♦మండితచిత్రకుశాసనంబులన్
విషనిధిపాయిముఖ్యులకు ♦ వేఱుగ వేఱుగ సంఘటించినన్. ౧౦

కం. వారెల్ల నిండుఁబ్రమదం, బారఁగఁ గూర్చున్నతఱి మ♦హాత్మకులారా!
మీరెల్ల సుఖులె? శిష్యుల, కారోగ్యమె? నిర్భయములె♦కా వను లనుచున్. ౧౧

కం. రాముఁడు కుశలప్రశ్నముఁ, బ్రేమంబునఁ జలుప వేద♦వేదాంతవిదుల్
సామోదమనంబుల సు,శ్రీమహితుం జూచి యిటు వ♦చించిరి రక్తిన్. ౧౨

## మానులు శ్రీరాముఁ బ్రశంసించుట.

కం. మాభాగ్యవశంబున నీ,తాభామారమణ! నిహత♦దర్పితవైరి
శ్రీభద్రుని నినుఁ గంటిమి, మాభద్రంబులకుఁ గొఱఁత♦మాటయు నున్నె? ౧౩

కం. నీవు ధను వందుకొన లో,కావళి హావళి భజించు ♦ నన భువనాళీ
రావణు రావణుఁ గొడుకుల,తో వారలసుతులతోడఁ ♦ ద్రుంచుట బరువే! ౧౪

శా. మాపుణ్యంబున మిమ్ముఁ గంటిమి మహా♦త్మా? దుష్టచారిత్రు లౌ
నాపౌలస్త్యుల సంహరించి జయి వై ♦ యాత్మేశ్వరిం దవ్వనమ
స్యాపారంగతునిన్ హితాచరణునిన్[1] ♦ సౌమిత్రినిం గూడి యి
ట్లీపెత్త్రం బగులక్ష్మి నొంది సుఖి వై ♦ యేపార భూపాలకా! ౧౫

కం. తల్లులతోఁ దమ్ములతో, నుల్లం బలరంగ నుండి ♦ యుర్విం బ్రోవం
దల్లినలెఁ గంటి మతులు,చల్లఁగ మాపూర్వపుణ్య♦సంపత్తి నృపా! ౧౬

సీ. ఏవారియాకార ♦ మీక్షించి నంతనే, బ్రద్ద లౌ గుండియల్ ♦ పగతురకును
నేక్రూరచారిత్రు, ♦ లెఱుఁగనిశస్త్రాస్త్ర,బృంద మిం కెందును ♦ వినఁగ రాదు

[1] ఈ విశేషణములు లక్ష్మణుని భగవచ్ఛేషత్వమును సూచించెడిని.

ఏవారి రణములో ♦ నెదిరించి మానంబుఁ, దక్కించుకొన లేరు ♦ ధాత్రి నెవ్వ
రట్టికాలాంతక♦యమతుల్యమత్తయు,ద్ధోన్మత్తుల నకంప♦నోగ్రచరితు
తే. నట్టిదేవాంతకనరాంత♦కాతికాయ,కుంభనికటప్రహస్తని♦కుంభముఖులఁ
ద్రిశిరు మత్తవిరూపాక్షు♦దివిజరిపుని, నలమహోదరు ధూమ్రాక్షు ♦ యజ్ఞకోపు.

చం.మడియఁగఁ జేసి తౌర! పరి♦మాణమునన్ సరి చెప్పరానియా
బెడిదపురూపువాని సుర♦భీకరశీలునిఁ గుంభకర్ణునిన్
బొడ వడఁగించి తో మనుజ♦పుంగవ! మాసుకృతంబుచే, ననిన్
ముడిబొమ యైన లేని[1] నిను ♦ ముక్కున వ్రేలిడి చూచె లోకముల్. ౧౮

కం.బంధుర మగుజవమున దశ,కంధరు సురదానవమహో♦కంధరుఁ ద్రిజగ
త్సంధాహారు వధియించితి, సింధురవరనఖరతుల్య♦శితకాండములన్. ౧౯

చం.అలఁతులఁ దీరుకార్య మొకొ ♦ యాతనిఁ ద్రుంచు ట దట్టు లుండనీ
కలనను వైరిజాలలయ♦కాలు సురస్వయసంవిఘాలు ని
స్తులకపటైకశీలుఁ బెను♦దొమ్మిదురమ్మున రావణాత్మజున్
బొలియఁగఁ జేయుటే పురుష♦పుంగవ! యద్భుతకార్య మిన్నిటన్. ౨౦

కం.అంతకనిభఫణిశరములు, దొంతరలై కురిసి మిమ్ముఁ ♦ దూలింప ధరా
కాంత విడి వడితి శౌరా!, యం తిం తన వశమె మాము♦హాపుణ్యంబున్. ౨౧

మత్తకోకిలము. ఎన్నిమాయలయందొ ప్రోడయు ♦ నెట్టివారి కజయ్యుఁడున్
గన్నుదోయికిఁ గానరాఁ డనిఁ ♦ గర్కశుండు సురేంద్రజి
త్తన్నిశాచరుఁ డాజిఁ గూలుట ♦ యాలకించినయంత య
న్నన్న! మమ్ముఁ బ్రమోదముం బర♦మాద్భుతంబును ద్రెక్కొనెన్. ౨౨

ఆ. కామరూపధరులఁ ♦ గఠినవిగ్రహులను, రాక్షసులను ఘోర♦రతుల నీవు
హతులఁ జేసి మాకు ♦ నభయదక్షిణ నిచ్చి, తిటులు మాయదృష్ట ♦ మే మనంగ.

కం.అనుఋషివరవచనంబుల, విని సీతానాయకుండు ♦ విస్మయవార్ధిన్
మునుఁగుచుఁ బ్రాంజలి యగుచున్, వినుతతపోధనుల కిట్లు ♦ విజ్ఞాపించెన్. ౨౪

### శ్రీరాముఁడు మునుల నింద్రజిత్తు నాధిక్యమునకుఁ గారణ మడుగుట.

మ. అతిదుర్దాంతపరాక్రమాఢ్యుఁ డయి ర♦క్షోధీశుఁ డా రావణుం
డతులామేయతనూబలుండు ఘటక♦ర్ణాఖ్యుండు వీ రుండఁగా
నతికాయత్రిశిరఃప్రహస్తఖరధూ♦మ్రాక్షోగ్రకుంభాదు లా
కృతకర్ముల్ రహిమించ రావణిని మీ ♦ రేలా ప్రశంసింపఁగన్. ౨౫

కం.మత్తుని దేవాంతకు ను,న్మత్తు మహోదరుని వికటు ♦ మకరాక్షు ననిన్
మిత్తుల నెన్నక వాసవ,జిత్తును మీ రిటు ప్రశంస ♦ సేయఁగ నేలా? ౨౬

[1] కోపగింపకయే యాటవోలె శత్రుసంహారము చేసితివని భావము. సృష్టిస్థితిలయములు భగవంతునకు లీలామాత్రములే కదా.

ఉ. వానిప్రభావ మెట్టిదొకో? ♦ వానిపరాక్రమ మేకొలంది? య
వ్వానిబలం బ దెంత? దశ♦వక్త్రునికంటెను శౌర్యధైర్యముల్
వానికి నెట్టు లగ్గలము? ♦ పల్కుఁడు గోప్యము గాద యేని స
మ్మానితశీలురార! విన ♦ మానస ముబ్బట లూఁగెడిం జుఁడీ. ౨౭

కం. వినఁగా నర్హుఁడ నేనియు, వినిపింపుఁడు వినయమునను ♦ వేఁడుకొనియెదన్
మునివర్యులార! యియ్యది, గనఁబోకుం డాజ్ఞ గాఁగఁ ♦ గరములుమోడ్తున్. ౨౮

కం. ఏరీతి గెలిచె శక్రుని?, నేరీతి వరంబు లొందె? ♦ నెటు జనకునకున్
శూరుఁ డయి నెగడెఁ? దద్వ్యా,పారంబు సమస్త మెఱుక♦పఱుపుఁడు మానుల్.

## అగస్త్యుఁడు శ్రీరామునకు రావణుజన్మాదివృత్తాంతముఁ దెల్పుట.

కం. అనురామధరావరచం,ద్రునిఘణితుల నాలకించి ♦ తోలఁకాడుముదం
బునఁ గుంభభవుఁడు రామునిఁ, గనుఁగొని యిట్లనియె వాక్య♦కౌశల మెసఁగన్.

ఉ. రామ! గుణాభిరామ! యల♦రావణి తేజము తద్బలం బరి
స్తోమము గెల్చు పెంపు బల♦సూదనగర్వహరత్వ ముగ్రసం
గ్రామములం దజయ్యుఁ డయి ♦ క్రాలిన హేతువు విన్న చెప్పెదన్
నీమది సంతసిల్ల రజ♦నీచరసాధునిశాబ్జభాస్కరా! 3౧

కం. రావణిచరితమునకు మును, రావణుకులజన్మములు వ♦రప్రతిలబ్ధిన్
నే వివరించెద వినుమా, యావద్వృత్తంబుమూల♦మై యది యునికిన్. 3౨

సీ. పూర్వంబు కృతయుగం♦బునఁ గంజలోచన!, పరమేష్ఠితనయుండు ♦ వరగుణుండు
మాఱటబ్రహ్మ యై ♦ మలసెడి బ్రహ్మర్షి, పేరఁ బులస్త్యుండు ♦ వినుతశీల
మహిమ ధర్మమున న♦న్మహనీయుఁ గీర్తింప,వచ్చునే ధర నెట్టి♦వారి కైన
బ్రహ్మపుత్త్రుం డను♦పలుకుమాత్రమె శక్య, మతఁ డజునుతుఁ డైన♦కతనఁ జేసి
ఆ. విబుధకోటికెల్లఁ ♦ బ్రియుఁ డయి శుభగుణ,పూగములను సకల♦భువనములకు
నిష్టుఁ డగుచు ధర్మ♦వృత్తంబు వీడక, హేమకుధరపార్శ్వ♦సీమయందు. 33

కం. వెలయు తృణబిందునాశ్రమ,తలమునఁ బుణ్యార్జనేచ్ఛఁ ♦ దప మొనరించెన్
దొలిచదువులు చదువు చచం,చలమతి నియతేంద్రియుండు ♦ సద్వ్రతుఁ డగుచున్.

ఉ. ఆఋషియాశ్రమోర్వి యన♦యంబు సమస్తఋతూపభోగ్య మై
హారిమరాళసారసవి♦హారమనోహరసారసాకరో
దారము నై సుకుట్మలల♦తాంతఫలప్రకరాభిరామభూ
మీరుహరాజితం బగుచు ♦ మీఱు సుఖాశ్రయగంధవాహ మై. 3౪

ఉ. ఆరమణీయదేశమున ♦ నాడుచుఁ బాడుచుఁ జిత్రచిత్రఖే
లారమమాణ లౌచును వి♦లాసముగాఁగ విపంచి మీటుచున్

సారెకు సారెకుఁ విబుధ♦సారసనేత్రలు భోగికన్యకల్
భూరమణాత్మజల్ ముదము ♦ పొంపిరి వోవఁ జరింతు రర్థిలిన్. ౩౬

తే. ఆయనిందితచరితల♦యాటపాట
యాపులస్త్యునినియతికి ♦ హానిఁ గూర్చు
దానఁ గోపించి యమ్మౌని ♦ తరుణి యెవతె
వచ్చు ననుఁ జూడ నద్ది గ♦ర్భము వహించు. ౩౭

కం. అనవుడు నాపల్కులు విని,వనజేక్షణ లెల్ల శాప♦భయమున నచ్చో
టను జేరరు; తృణబిందుని,తనయామణి యోర్తు వినమిఁ ♦ దచ్ఛాపంబున్. ౩౮

కం. ఎప్పటియట్ల చరించుచు, నప్పట్టునఁ గనద యొక్క♦యలికుంతలనే
నప్పుడు పులస్త్యశ్రుతిరవ, ముప్పతిలెఁ శ్రవణమాన♦సోల్లాసకమై. ౩౯

కం. విని యెవ్వరిధ్వనియో యిది, యని డాయఁగ నేగి కాంచె ♦ నమ్మునిఁ దోడ్తోఁ
దనువెల్లఁ బలక పాఱెను, మునుకొనియెఁ గర్భచిహ్న♦ములు కన్యకకున్. ౪౦

కం. చెలి యాత్రేఁకటిగుర్తులు, తిలకించి యిదే మటంచు ♦ దిగులుం గొని తా
నలసత జనకునియాశ్రమ,తలమునకుం బోయి తండ్రి♦దాపున నిలువన్. ౪౧

ఉ. కన్నియవంక నాతఁడు నె♦గాదిగఁ బాఱఁగఁ జూచి గర్భపుం
జిన్నెలు మేనఁ గాంచి యిసి♦సీ యని యాతరళాక్షిఁ జూచి నీ
కన్నెఱికంబు దూలి యిటు♦కాఁ గత మేమి యయోగ్యరీతి నో
చిన్నికుమారి యన్నఁ జెలి ♦ సిగ్గున భీతిని మ్రగ్గుచి ట్లనున్. ౪౨

ఉ. అన్నముపున్నమే నెఱుఁగ ♦ నయ్య యి బొటకుఁ గారణంబు నేఁ
గన్నది లేద, యెప్పటిప్ర♦కారమునఁ విహరింపఁ గోరి నే
మున్నుగ నొంటినై సఖుల♦మొత్తము రోయఁ బులస్తియాశ్రమం
బు న్నెఱిఁ జొచ్చి యందుఁ బువుఁ♦బోణి యొకర్తె యుఁ గానరామికిన్. ౪౩

కం. కారణ మే మని యిట నట, నారయు చుండంగ నిట్టి♦యాకృతి గలిగెఁ
గూరినభీతిని మిమ్ముం, జేరఁగఁ బరువెత్తితిఁ వి♦శిష్టచరిత్రా! ౪౪

తృణబిందుఁడు తనకూఁతుఁ బులస్త్యున కర్పించుట.

చం. అనవుడు నల్ల రాజఋషి ♦ ధ్యానసమాస్థితుఁడై సమస్తముం
గని యిది మౌనిచేత యని ♦ గ్రక్కునఁ గన్యను దోడికొంచు న
మ్మునివరుపాలి కేగి ప్రియ♦ముం బచరించి మహాత్మ! దీని నా
తనయ స్వభావసద్గుణవి♦తానవిభూషితఁ గన్యకామణిన్. ౪౫

కం. మాన్యవరా! స్వయముద్యత,నన్యాసులభాభిరూప్య ♦ నతులితవరసౌ
జన్య న్ననన్నుం గృపఁ గని, కన్యాభిక్షగను దీనిఁ ♦ గైకొనఁ గద వే. ౪౬

చం. అతులతపస్సమాధి శ్రమ ♦ మందిననీకు మహాత్మకా! యనా
రతపరిచర్యఁ దృప్తి యొన♦రం జరియించు నిజంబు, వహ్నులన్
సతతముఁ గాచు నన్న ముని♦చంద్రముఁ డీప్సితధర్మపద్ధతిన్
హితమతిఁ దా గ్రహించెఁ, జని♦యెం దృణబిందుఁడు స్వాశ్రమోర్వికిన్. ౪౮

చం. లలనయు సద్గుణంబులఁ బు♦లస్త్యునకుం బ్రమదంబుఁ గూర్చుచున్
గొలుచుచు నుండ నాకుసుమ♦కోమల నిర్మలశీలవృత్తముల్
జలజభవాత్మజాతునకు ♦ సమ్మదమున్ ఘటియింప నొక్కనాఁ
డలజలజాస్యఁ గాంచి ప్రియ♦మారఁగ నిట్లను వామలోచనా. ౪౯

కం. మెచ్చితి నీగుణములకును, నిచ్చెద నీకున్ వరం బ♦హీనగుణాఢ్యన్
సచ్చరిత! మత్సమానునిఁ, గ్రచ్చఱఁ గనుఁగొనఁగఁ గలవు ♦ కాంతా! సుతునిన్.

తే. ఉభయవంశంబులను నాతఁ ♦ డుద్ధరించు
వెలఁది పౌలస్త్యుఁ డని కాంచు ♦ వినుతి నీవు
నాఁడునధ్యయనము విని ♦ నాఁడు చూలు
పడుట విశ్రవసుం డన ♦ వాఁడు వెలయు. ౫౦

చం. అనవుడు సంతసిల్లె విక♦చాంబుజలోచన కొంతకాల మే
విన జనియించె సాధుమతి ♦ విశ్రవసుండు త్రిలోకవిశ్రుతుం
డనుపమతుల్యదర్శి సుయ♦శోంచితుఁ డుత్తమధర్మవర్తి త
జ్జనకనిభుండు సద్వ్రతుఁడు ♦ సర్వకళాఢ్యుఁడు వేదవంతుఁ డై. ౫౧

ఉ. ఆతఁడు తండ్రిఁబోలి నియ♦మాధికుఁ డై తపముండి సత్యశాం
తాతతశీలవంతుఁ డయి ♦ యధ్యయనావిరతిన్ సమస్తభో
గేతరచిత్తవృత్తి యయి ♦ యెంతయు ధర్మపరాయణుండు నై
ఖ్యాతి నెసంగె నాతనిగు♦ణాఢ్యత విన్కిఁ బ్రహృష్టచిత్తుఁ డై ౫౨

↞ విశ్రవసునకుఁ గుబేరుండు జన్మించుట. ↠

సీ. ముని భరద్వాజుండు ♦ తనతనూజాతను, దేవవర్ణి మహాను♦భావునకును
నిచ్చి పెండిలి సేయ ♦ నింతిని గ్రహియించి, రెండవయాశ్రమ ♦ ముండి భద్ర
గుణుని శ్రేయోవంతుఁ ♦ గొమరు నాసతియందు, వీర్యాధికునిఁ గాంచె♦విశ్రవుండు
బ్రహ్మ సద్గుణయుతు ♦ భావిధనాధ్యక్షుఁ, గని తాత సంతోష♦గరిమఁ దనరి

ఆ. విబుధఋషులఁ గూడి ♦ విశ్రవుతనయుండు, వై శ్రవణుఁ డనంగ ♦ వఱలు ననుచుఁ
బేరు పెట్టె నతఁడు ♦ పెద్దవాఁ డయి తపో, వనముఁ జేరి నియతి♦పరత నుండె. ౫౩

ఆ. ఆహుతులను మండు♦ననలుండు నాఁ దప,శ్శి నతండు వెలిఁగి ♦ చిత్తమునను
దలఁచె ధర్మమొకఁడె ♦ తగు నుత్తమోత్తమ, మైనగతి యటంచు ♦ నట్లు దలఁచి.

కం.అతులితనిశ్చలనియమ, ప్రతుఁ డై యుదకాశనుండు ♦ పవనాశనుఁడున్
జ్యుతభుక్తుఁడు నై యొక్కొ,క,శతదశవర్షంబు తపము ♦ సలుపన్ సొరిదిన్. ౫౫

చం.ఇటు లొకవేయియేఁడు లొక♦యేఁడుగ ఘోరతపం బొనర్ప న
చ్చటికి విధాత దేవగణ♦సంవృతుఁ డై చనుదెంచి ప్రీతి నీ
పటుతరనిష్ఠ మెచ్చితిని ♦ వత్సక! లెమ్ము వరంబుఁ గోరుమీ
తటుకున నన్న నాతఁడు య♦థావిధి మ్రొక్కి వచించె నీగతిన్. ౫౬

కం.కోరెద దిగధీశత్వముఁ,గోరెద ధనరక్షణంబుఁ ♦ గూర్మి నొసఁగవే
గీరమణీరమణ యనన్, గారవమున నతనిఁ జూచి ♦ కంజజుఁ డనియెన్. ౫౭

←→ బ్రహ్మ కుబేరు నుత్తరదిక్కున కధిపతిఁ జేయుట. ←→

సీ. లోకపాలురను న♦ల్వుర నేను సృజియింప, జతనంబుఁ గావించి ♦ శక్రరవిజ
వరుణుల నిలిపితి ♦ వరుసఁ దత్పదముల, నందు నాలవవాఁడ ♦ వగుము నీవు
నిధులకు నేతవై ♦ నెగడుము దివ్య మీ, మార్తండ నిభము వి♦మానవరము
దీనిని గైకొని ♦ దేవతాసముఁడ వై, విహరించు చుండుము ♦ వేడ్కఁ గోలఁది
తే. స్వస్తి యగుఁ గాక నీకు నేఁ ♦ జనెద నింక, నీకు వరముల రెండిటి ♦ నిచ్చుకతన
నేనుఁ గృతకృత్యుఁడ నటంచు ♦ నిర్జరాళిఁ, గలసి స్వస్థానమున కేగె ♦ జలజభవుఁడు

చం.వనజజుఁ డిట్లు పోవుటయు ♦ వైశ్రవణుండును దంత్రిఁ గానఁగాఁ
జని కరముల్ మొగిడ్చి జల♦జప్రభవుండు ప్రసన్నుఁ డై యొసం
గినవరముల్ వచించి యొక♦గీము విధింపఁడు నిల్వ ధాత నా
కనయము సౌఖ్యదాయి నిల♦యంబు నబాధ మెఱుంగఁ దెల్పవే. ౫౯

మ.అనుడున్ దక్షిణవారిరాశిని త్రికూ♦టాఖ్యాద్రిశృంగంబునన్
గొన బొ లంక యనంగ నొక్కపురి ర♦క్షోనాథవాసార్థ మై
మును పానిర్జరశిల్పినిర్మితము సొం♦పుం గూర్చు నెంతేని నీ
వనుమానింపకు శక్రపట్టనముతీ♦రై మించు ధాత్రీస్థలిన్. ౬౦

సీ. స్వర్ణవప్రంబున ♦ శస్త్రయంత్రాస్సృత,పరిఖ వైడూర్యసు♦వర్ణతోర
ణంబులతోఁ గడు ♦ డంబు మీఱుచు నుండు, హరికిని వెఱచి ము♦న్నసురవరులు
దానిని విడనాడి ♦ తరలి రసాతల,వసుధఁ జేరుట నిప్డు ♦ ప్రభువు లేక
శూన్యమైయున్నది ♦ సుఖద మబాధంబు, నిర్దోష మది నీవు ♦ నెలవు కొనుమ
ఆ. యచట నన్నజనకు♦వచనంబులకుఁ బొంగి, లంక కేగి యందు ♦ శంక లేక
నైరృతాళిఁ గూడి ♦ నానావిధార్థస,మృద్ధిఁ గూడి యుండె ♦ నిచ్చకోలఁది. ౬౧

చం.కలుములరాయఁ డిట్లు పరి♦ఖాయితవార్ధిపురంబులోనఁ దా
వెలయుచు యోగవస్మరుద♦భిష్టుతమై సురసుందరీవిలా

సలలిత మైనయానమున ♦ సారసమిత్త్రుఁడువోలె భానులన్
వెలుఁగుచు రాకపోకలను ♦ బ్రీతిని గూర్చుచు నుండెఁ దంద్రికిన్. ౬౨

→ శ్రీరాముఁ డగస్త్యునిఁ బూర్వరాక్షసులవృత్తాంత మడుగుట. ←

చం. అనుచు నగస్తి పల్కఁగ హు♦తాశనతుల్యు మునీంద్రుఁ బల్కుఁ
గనుచు సవిస్మయాత్ముఁ డల ♦ కంజవిలోచనుఁ డేమి లంక ము
న్దనుజుల కాటపట్టొకో? వి♦నం గడువిస్మయ మయ్యె; రాక్షసుల్
మునిప! పులస్త్యవంశు లని ♦ మున్ విని యుంటిమి, మీర లిట్లెడన్ ౬౩

సీ. అన్యులు గల రని ♦ యాడితి రిప్పటి,దశకంఠ ఘటకర్ణ ♦ తత్తనూజ
మంత్రు లే బలియురో♦మఱి తొల్లివార లే,శూరులో? చెప్పుమీ ♦ వార లెవరు?
వారలపే ర్లెవ్వి? ♦ వారలబల మెంత? యేమిదోషంబున ♦ నెట్లు శౌరి
దఱిమె లంకాపురిఁ ♦ దలఁగి పర్వెత్తఁగ? నీనాదుకుతుకంబు ♦ భానుమాలి

ఆ. యిరుల జోపురీతి ♦ హరియింపవే యన, నలఁతినగవుతోడ ♦ నమ్మహాత్ముఁ
డాథరాసుతామ♦నోజ్ఞార్కుఁ గని యను, వినుతు వినుము పూర్వ♦వృత్త మెల్ల.

→ యక్షరాక్షసుల యుత్పత్తి. ←

ఉ. అంబుజసంభవుండు మును ♦ పంబువులన్ సృజియించి పెక్కుస
త్త్వంబుల దాని రక్షకయి ♦ తా నొనరింపఁగ క్షుత్పిపాసలన్
డంబఱి యవ్వి దైన్యమున ♦ డాసి స్వకర్తను మాకు నేమి కా
ర్యంబు వచింపు మంచు విన♦యంబున నన్నియు విన్నవించినన్. ౬౫

కం. వానిని గని నవ్వుచు నా,మానదుఁ డిట్టనియె మీరు ♦ మత్సృష్టజలం
బూనిక రక్షింపుఁడు మీ,కీనెఱి కర్తవ్య మంచు ♦ నెలమి వచింపన్. ౬౬

కం. రక్షామ యనియె నం దబ్బు,భుక్షితసత్త్వములు దేవ♦పూజితుతోడన్
జక్షామ యనుచుఁ బల్కె బు,భుక్షితములు బ్రహ్మయంత ♦ భూతముల కనెన్. ౬౭

కం. రక్షామ యనిన వారలు, రాక్షసు లగువారు భూత♦రాసులలోనన్
జక్షామ యనిన వారలు, యక్షుల రగుఁ డంచు ననియె ♦ నవ్వారలలోన్. ౬౮

కం. హేతి ప్రహేతినాములు, భ్రాతలు జనియించి రుగ్ర♦రాక్షసు లతిస
త్త్వాతులమధుకైటభనిభు, లాతతబలదర్పశౌర్య♦హతపరిపంథుల్. ౬౯

ఉ. అందుఁ బ్రహేతి ధర్మనిర♦తాత్ముకుఁ డై వనసీమ కేగె, రా
కేందునిభాననన్ శమను♦నిష్టసహోదరినిన్ భయాఖ్యఁ బ్రే
మం దగవేఁడి పెండ్లి యయి ♦ మానితరీతిని హేతి గాంచె నా
సుందరియందు నందనుని ♦ శూరవరేణ్యు విభావిభావసున్ ౭౦

కం. విద్యుత్కేశుని నాతఁ డ,నద్యైతర తేజుఁ డగుచు ♦ వాలుచును బయః
ప్రోద్యత్కమలముభంగిని, మాద్యద్గతి సొరిది వృద్ధి♦మంతుఁడు కాఁగన్. ౨౦

సీ. యౌవనవంతుఁ డై ♦ యలరుపుత్రునిఁ గాంచి, హేతి సంప్రీతి మై ♦ నాతనికిని
బెండ్లి సేయఁగఁ గోరి ♦ పెంపున సంధ్యను హాసి,యించుదాని సం♦ధ్యాత్మజాతఁ
బుత్రునిమిత్తమై ♦ పోలఁతిని వేఁడంగఁ,బడఁతి పుట్టినయప్డె ♦ పరులసొమ్ము
గావుట భావించి ♦ కన్నె సాలకటంక,టాఖ్య నొసంగిన ♦ నమరవిభుఁడు

ఆ. శచియుఁ బోలె నసుర♦జంపతుల్ దమి మీఱ,సుఖపయోధిఁ దేలి ♦ సోలు చుండఁ
గంధవలన మబ్బు ♦ గర్భంబుఁ దాల్చిన,కరణిఁ దరుణి దాల్చె ♦ గర్భ మంత. ౨౧

## సుకేశుని జన్మవృత్తాంతము.

ఉ. అంగన మందరాద్రికడ ♦ నగ్నిభవం బగుభూరిగర్భముల్
గంగ యనంగ వారిధర♦గర్భనికాశము నాత్మగర్భముల్
వెంగలి యొంటి నేగి ప్రస♦వించి నిసుంగును నంద వైచి తా
నంగజకేళికారతిని ♦ నాత్మధవుం దఱిసెఁ యథామతిన్. ౨౩

కం. పుట్టినబిడ్డం డేగతిఁ, బట్టినొ యోజింప మఱచెఁ ♦ బడఁతుక కట్టా!
యెట్టెట్టిపనులు సేయరు, కట్టిఁడిజంతలు మనోజ♦కాండాహత లై? ౨౪

ఉ. బాలుఁడు శారదాబ్జహిత♦భాపటలిన్ వెలుఁగొంది తానుగా
వ్రేళుల నోరఁ గూరుకొని ♦ పెద్దగ నేడ్వఁగ నాలపోతుపై
నాలును దాను బోవుచుఁ బు♦రాహితుఁ డవ్యయుఁ డక్షరుండు నై
లాలయుఁ డభ్రవీథిఁ జను ♦ చారవముల్ విని గౌరిప్రేరణన్. ౨౫

కం. కరుణార్ద్రచిత్తుఁ డై యా,శరబాలకుఁ గాంచి యిచ్చె ♦ జననివయస్సున్
బుర మాకాశగ మమరత, గిరిజయు నబ్బాలుఁ గాంచి ♦ కృప దళుకొత్తన్ ౨౬

కం. సద్యోగర్భప్రాప్తియు, సద్యఃప్రసవంబు జనని ♦ సమ మగు వయసుల్
సద్యోవయోప్తి యొసఁగెను, జోద్యంబుగ నసురతతికి ♦ సుర లరు దందన్. ౨౭

చం. హరవరదానగర్వమున ♦ నాయసురుండు సుకేశనాముఁ డం
బరచర మాపురంబుఁ గొని ♦ సైర్వరవిహారరతిం ద్రిలోకసం
చరణధురీణుఁ డయ్యె బల♦శాసనుమాడ్కి, నసహ్యవిక్రమ
స్థిరుని సుకేశు ధర్మరతు ♦ సిద్ధవరుం గని ప్రీతి యుక్తుఁ డై ౨౮

కం. గ్రామణి యనుగంధర్వ,గ్రామణి విశ్వావసునిభ♦ఘన తేజుఁడు శ్రీ
భామానిభ సుందరతా,ధామం దనముద్దుఁగూఁతుఁ ♦ దారుణ్యనిధిన్ ౨౯

కం. ఇచ్చి వివాహ మొనర్చిన, నచ్చెలి వరలబ్ధనిస్తు ♦ లైశ్వర్యయుతుల్
సచ్చరితుఁ బ్రాణధవు ని,ష్పచ్చరమున[1] వేఁగుజీవి ♦ భాగ్యముఁ బోలెన్ ౩౦

---

[1] నిష్పచ్చరము = దారిద్ర్యము.

కం. పొంది యమందానందము, నం దనిసె; నతండు నంగ♦నం గూడి యనం
గుం దగుగతిఁ బూజించుచు, నందించెను నంజనభవ♦నాగం బనఁగన్. ౧౧

## సుకేశునకు మాల్యవదాదులు జన్మించుట.

సీ. తేజరిల్లఁగ వారు ♦ దేవవతీసతి, మూఁడులోకంబుల ♦ మూఁడుకనుల
నగ్నిత్రయంబును ♦ నామయత్రయమును, మంత్రత్రయంబును ♦ మచ్చరించు
వారల ముగురఁ గు♦మారులఁ గాంచెను, మాల్యవంతుండు సు♦మాలి నాఁగ
మాలి నాఁ బరఁగెడి♦మహితబలాఢ్యుల, వార లుపేక్షిత♦వ్యాధు లనఁగఁ

తే. గ్రమముగా వృద్ధిఁ జెంది న♦రంబు పేర్మిఁ, గలుములెల్లను జనకుండు♦గాంచు టెఱిఁగి
తపము సేయఁ దలంచి భ్రా♦తలు సువర్ణ, శైలనికటంబునకు నేగి ♦ సారనిష్ఠ ౧౨

తే. శమము సత్యార్జవంబు ల♦స్ఖలితములుగ, నఖిలభూతభయావహ ♦ మైనఘోర
తపముఁ గావింప దేవగం♦ధర్వమాన, వాదిలోకత్రయంబును ♦ హోవళించె. ౧౩

ఉ. అంతఁ జతుర్ముఖుండు విబు♦ధావళితోడ సుకేశనందనా
భ్యంతిక దేశముం దఱిసి ♦ వాంఛిత మెయ్యది దీర్తు నన్నఁ బా
కాంతక ముఖ్యదైవతస♦మావృతుఁ డిష్టదుఁ డైనభారతీ
కాంతుఁ డటం చెఱింగి ద్రుమ♦కాండములట్లు ప్రకంపితాంగులై ౧౪

చం. కరములు మోడ్చి యి ట్లనిరి ♦ కంజభవా! వరదుండ వేనియుం
జిర మగుజీవితంబును న♦జేయత శత్రునిహంతృతం బర
స్పర మనురక్తియుం బ్రభవ♦శాలితయుం గరుణింపవే దయా
కర! నతకంజభాస్కర! వి♦కారవిదూర! య టంచు మ్రొక్కినన్. ౧౫

తే. అట్టులగు నంచు నచియించి ♦ యవ్విరించి
బ్రహ్మపురి కేగె బ్రాహ్మణ♦వత్సలుండు;
వరములను బొంది యానిశా♦చరులు వెఱపు
లేక గారింపఁ దొడఁగిరి ♦ లోకములను. ౧౬

## మాల్యవదాదులు లంకయందుఁ జేరుట.

ఉ. వారు సురాసురాళిముని♦వర్గములం వధియింపఁ జొచ్చినం
జేరుగ డేఁడు లేక కడుఁ♦జేడ్పడె నారకజీవకోటినా
నారజనీచరుల్ పిదప ♦ నామరశిల్పిని విశ్వకర్మునిం
జేరి వచించి రిట్లు గృహ♦సీమ యొకం డొనరింపుమీ వెసన్. ౧౭

కం. ఓజస్తేజోబలయుతు, లౌ జేజేతేండ్ల కీవ ♦ యతిహృద్యం బై
రాజిలుదివ్యనికేతన, రాజిం నైపుణి రహింప ♦ రచియింతు గదా. ౧౮

ఉ. మాకును నీవ మేరుగిరి♦మందర హైమధరాశ్రయంబు సు
శ్రీకము శంకరాలయస♦దృశము నొగృహ మొండు దీర్పు మ
స్తోకవిభాయుతం బనఁగఁ ♦ దోడనె యాతఁడు దక్షిణాబ్ధితీ
రాకలితత్రికూటకుధ♦రాగ్రము పొల్పుగఁ దద్దృతియ మై. ౮౯

సీ. అంబుదసన్నిభం ♦ బైన త న్నగ్రము,కూటంబునను బక్షి♦కోటి కైన
దుష్ప్రాప మయి దిక్చ♦తుష్కంబునను డంక,సంభిన్న మగుచు యో♦జనశతంబు
నిడివియు ముప్పదా♦మడ వెడలుపు నయి,పసిఁడిప్రాకారముల్ ♦ పైఁడితోర
ణంబుల నింపయి ♦ శంబసాధనునాజ్ఞ, మయుఁడు నిర్మించిన♦మహితనగరి

తే. లంక యన నొప్పు దాని ని♦శ్శంకముగను, జొచ్చి యమరావతీపురి♦సురలయట్లు
పాలనము సేయుఁడీ శత్రు♦వర్గములకుఁ, దలఁపునం దేని మీరు దు♦ర్ధర్ష లగుచు.

కం. అని విశ్వకర్మ చెప్పిన, ననుచరసాహస్రయుక్తు ♦ లై యారక్షో
జననాథులు చని పరిఖా,కనకగృహాన్వీత లంకఁ ♦ గ్రాలిరి సుఖు లై. ౯౧

సీ. వా రిట్లు స్వేచ్ఛావి♦హారులై వర్తిల్ల, నర్మద యనెడుగం♦ధర్వతరుణి
కీర్తి ధీ శ్రీ సమ♦మూర్తుల ముగ్గురఁ, దనయల నిచ్చె నా♦దనుజులకును
వారును వరుసగ ♦ వారి నుత్తర ఫల్గు,నీతారఁ బెండ్లాడి ♦ నిర్జరాంబు
జాక్షులతో సుర♦లట్లు క్రీడించిరి, మాల్యవంతుం డాత్మ♦మహిషి యైన

ఆ. సుందరీసమాఖ్య ♦ సుప్తఘ్న దుర్ముఖో, న్మత్త యజ్ఞ కోప ♦ మత్త వజ్ర
ముష్టులను విరూప♦దృష్టి విరూపాక్షు,సుతుల నవల యనెడు♦సుతను గనియె. ౯౨

సీ. ప్రాణంబులకుమిన్న ♦ యగు కేతుమతియందుఁ, గనియె సుమాలి య♦కంపనాఖ్యుఁ
గాలకార్ముకభాస♦కర్ణసుపార్శ్వుల, సంహ్రాదినిం బ్రఘు♦స ప్రహస్త
వికటధూమ్రాక్షుల ♦ వికటశీలుం డైన, దండుఁ డన్ సుతుల ను♦ద్దండబలుల
రాకఁ బుష్పోత్కటఁ ♦ గైక సీ కుంభీన,సీ సమాఖ్యలు గల♦స్త్రీల నవల

తే. మాలి వసుధాఖ్య యనియెడి♦మగువయందు
ననిలు ననలుని సంపాతి ♦ హరునిఁ గనియె
వీరలె విభీషణునిమంత్రు ♦ లై రహించి
రవల నిట్లు తదీయాన్వ♦యంబు పెరిఁగె. ౯౩

మాల్యవదాదులకు వెఱచి సురలు శివుశరణముఁ జొచ్చుట.

కవిరాజగి[illegible]ము. సుతశతకంబును గూడి నిశాచర♦శూరులు ముగ్గురు గర్వితు లై
హితముఁ దలంపక బ్రహ్మవరంబున ♦ నెల్లజగంబుల రేఁగి సదా
గతిగతిఁ ద్రిమ్మరుచున్ ఋషిపన్నగ♦కాండములన్ సహశక్రమరు
త్తతులను యక్షుల నేఁచిరి వేఁచిరి ♦ తాఁచిరి పూఁచి దురాసదు లై.

అంబురుహాము. వారలు పెట్టెడిబాధల నెల్ల సు♦పర్వకోటులు మానులున్
సైరణ సేయఁగఁ జాలక యెల్లరు ♦ సాధ్వసార్తులు నొక్కటై
మారునివైరిఁ బురారిఁ ద్రినేత్రు ను♦మాధవున్ హరునిన్ జగ
త్కారణు మారణు లోకనమస్కృతు ♦ దైవతాధిపు శంకరున్. ౯౫

ఉ. చేరఁగ నేగి హస్తములఁ ♦ జేరిచి తొట్రిల మాట భీతిచే
నీరజసూతిదత్తవర♦నిర్భరగర్వముపెర్గి దేవతా
వారములం బ్రజావళుల ♦ బాధలు పెట్టిరి భూతకోటికిన్
గూరిచి రెల్లకీడులను ♦ గ్రూరతఁ బేర్చి సుకేశనందనుల్. ౯౬

కం. దేవా! నాకమువలనన్, దేవతలను దఱిమి వైచి ♦ దేవతలవలెన్
దేవనముల నుపవనముల, వావిరి క్రీడించు చున్న♦వార లభీతిన్. ౯౭

శా. నేనే విష్ణుఁడ నేన రుద్రుఁడను నే♦నే బ్రహ్మ నే నింద్రుఁడన్
నేనే కాలుఁడ నేన చంద్రుఁడను నే♦నే పాశి నే సూర్యుఁడన్
నేనే యప్పతి నంచు సంగరమదో♦న్మేషంబునన్ సర్వలో
కానీకంబుల అంపు చేసెదరు భ♦ర్గా! మమ్ము రక్షింపవే. ౯౮

కం. క్రూరపురూపముఁ గొని యమ,రారిని నమ్మాల్యవంతు ♦ ననుజసమేతున్
బోర వధించి జగంబుల, నారయు మనఁగా సుకేశు♦నందలిప్రేమన్. ౯౯

చం. హరుఁడు వచించె నోయమరు♦లార! యవధ్యులు వారు నాకు, నేఁ
బొరిగొన నేర, నైన నొక♦పోఁడిమి చెప్పెద వారు ద్రుంగఁగా
హరి శరణంబు వేఁడుఁడు, మ♦హావిభుఁ డాతఁడు వారి నెల్లరన్
బరువడిఁ ద్రుంచుఁ బొం డనఁగ ♦ వారు జయోక్తులు పల్కుచున్ వెసన్. ౧౦౦

### దేవతలకు విష్ణు వభయ మిచ్చుట.

కం. చని శంఖచక్రధరునిం, గని తమదుఃఖంబు లెల్లఁ ♦ గమలాధవుతో
మనవి యొనర్చిరి దేవా!, వినవే మాపడెడిపాట్లు ♦ విశ్వశరణ్యా!. ౧౦౧

సీ. అగ్నిత్రయముఁబోలు ♦ నసురులు ముగురు ను,కేశునిసుతులు సు♦రేశ వైరు
లలత్రికూటాద్రి లం♦కాఖ్యపురంబును, రాజధానిఁగఁ గొని ♦ క్రాలువారు
కమలజువరమున ♦ గర్వించి దర్పించి, కాకు సేసెదరయ్య ♦ లోకములను
మాదుఃఖములనెట్లు ♦ మనవి యొనర్తుము, త్రుంపవే వారలఁ ♦ దుర్గమముగను

ఆ. నీవ మాకు దిక్కు ♦ నిఖిలలోకేశ్వర!, శరణ మీవ భూత♦చయశరణ్య!
యొక్కఁ డీవు దక్క ♦ దిక్కెవ్వరును లేరు, మాభయంబుఁ బాప ♦ మాకళత్ర.

కం. మంచు విరియించురవిగతిఁ, ద్రుంచి నిశాచరుల హితుల♦తో బంధులతో
నించి జగంబుల ముదమునఁ, బంచాయుధహస్త! మమ్ముఁ ♦ బాలింపు మనన్. ౧౦౩

ఉ. వారలభీతిఁ దీర్చి నవ♦వారిజలోచనుఁ డిట్లు పల్కె న
వ్వారల నే నెఱుంగనె శి♦వాధవలబ్ధవరప్రమత్తునిన్
వీరు సుకేశు నయ్యసురు♦పెద్దకుమారుని మాల్యవంతునిన్
నీరజగర్భదత్తవర♦నిష్ఠురశీలుని సానుజన్మునిన్. ౧౦౪

చం. తమకొలఁదుల్ దలంపక మ♦దంబున రేఁగి చరించు దుష్టులన్
విమతుల రాక్షసాగ్రణుల ♦ వే వధియించెదఁ గ్రమ్మఱుండు మో
దమునను మీరు మీనిలుచు♦తావులకున్ విగతామనస్కులై
యమరవరేణ్యులార! యన ♦ హర్షరసోల్లసితాంతరంగులై. ౧౦౫

కం. విష్ణుని బ్రభవిష్ణుని రో,చిష్ణు నరినిరాకరిష్ణు ♦ జిష్ణున్ బలవ
ర్ధిష్ణుని నలంకరిష్ణు స,హిష్ణుని నిజభక్తలోక♦హితవర్ధిష్ణున్. ౧౦౬

చం. తెలచుచు మ్రొక్కుచున్ మునులు ♦ దేవతలుం దమవీడుపట్లకై
యెలమిఁ జనంగ నయ్యమర♦వృత్తి మెఱుంగుచు మాల్యవంతుఁడున్
బలియురఁ దమ్ములం బిలువఁ ♦ బంచి వచించెను దమ్ములార! మీ
రలు విన లేదె వార్తయమ♦రప్రముఖాచరితంబు నియ్యెడన్. ౧౦౭

మాల్యవంతుఁడు సురలపై దండెత్త నాలోచించుట.

చం. సురలును మానులున్ హరునిఁ ♦ జూడఁగ నేగి సుకేశనందనుల్
వరబలదర్పితుల్ పఱచు ♦ పాటుల నేమని యుగ్గడింప మా
యిరవుల నుండుటే కడిఁది ♦ యింకఁ ద్రిలోచన! వారి నెల్లరం
బొరిగొనుమీ జగంబు హిత♦ముం దలపోసి పురాసురాహితా! ౧౦౮

కం. అని విన్నవింప శివుఁడును, దనహస్తములన్ విదిర్చి ♦ తలయూఁపఁగ ని
ట్లనె నట వారలతో నో,యనిమిషవరులార! యాసు♦రాదుల నాకున్ ౧౦౯

ఉ. త్రుంపఁగ రాదుగాని యలదుష్టులు ♦ త్రుంగును పాయమొందు భా
షింపుదు శంఖచక్రధరు ♦ శ్రీరమణీరమణున్ ముకుందు సే
వింపుఁడు భక్తిమై శరణు ♦ వేఁడిన రక్తి జనార్దనుండు దీ
పింప వధించి వారి సుర♦బృందము డెందము కుందు మాన్పెడిన్. ౧౧౦

కం. గౌరీపతి యిటు చెప్పిన, నారాయణునిలయమునకు ♦ నరిగి మునిసురు
ద్వారము లింతయుఁ జెప్పిన, వారలవెఱ మాన్పి శౌరి ♦ వఱలినప్రీతిన్. ౧౧౧

కం. సుతలార! సురారుల నేఁ, బరిమార్చెద మీకు సుఖముఁ ♦ బరఁగించెద మీ
యిరవులకు యథాసుఖముగ, నరుగుండా యని వచించె ♦ నఁట నే వింటిన్. ౧౧౨

ఆ. అభయ మిచ్చె నఁట సు♦రావళి కెల్లను, మనలఁ జంపఁ బ్రతిన ♦ గొనియె నంట
చక్రి యిపుడు మనకు ♦ సలుపఁగ నర్హ మౌ,తంత్ర మెద్ది చెపుఁడు ♦ తమ్ములార!

సీ. ఖండించెను హిరణ్య♦కశిపునంతటిహానిఁ, గాలనేమిని బంచెఁ ♦ గాలుపురికి
ప్రోదిని యయ్యె సం♦హ్రాదశైలమునకు, నముచి మహాబలు ♦ నామ మణఁచె
శుంభనిశుంభుల ♦ జంభంబు నణఁగించె, హార్దిక్యు మర్దించె ♦ నమితశౌర్యు
యమళార్జునుల సమూ♦లము రూపు మాపెను,బహుమాయిరాధేయు♦భంగపఱిచె
తే. సత్త్వవంతుల ధీరుల ♦ సాహసికుల, నఖిలశస్త్రాస్త్రనిపుణుల ♦ నసురవరుల
దానవుల సంహరించె దో♦ర్దర్పమునను, బీతవసనుండు సామాన్యుఁ♦డే తలంప.
కం. ఎల్లరు మాయాకుశలులు, నెల్లరు శతయజ్ఞకర్త ♦ లెల్లరు శూరుల్
పొల్లువడి పోయి రెందఱొ, యల్లోకాధ్యక్షుచేత ♦ నసురవరేణ్యుల్. ౧౧౫
ఉ. యోజన చేసి యింతయు సు♦యోగ్యముఁ గార్యముఁ జెప్ప రయ్య యే
యోజఁ జరించువార మన♦ ♦ నుగ్రబలాఢ్యుని నగ్రజాతు స్వా
రాజును నవ్వులట్లు గని ♦ భ్రాతలు పల్కిరి లోకపాలకో
ద్వేజనకారణా! మనము ♦ వేఁడిమిఁ జూపుటె కార్య మిత్తఱిన్. ౧౧౬
చం. చదివితి మెల్ల వేదములు ♦ శాస్త్రములుం మితిమీఱుభాగ్యసం
పదలను నోల లాడితిమి ♦ భద్రగతిం గొద లేక దానముల్
విదితముగా నొసంగితిమి ♦ లెస్స నిరామయ మైనయాయువుం
బొదలెద మర్హధర్మములు ♦ పూర్ణముగా నొనరించి వెండియున్. ౧౧౭
కం. అనివార్యసురాంభోనిధి, ఘనశస్త్రవితానములనె ♦ కలఁగించి మఱిం
దునిమి యరాతుల నెల్లర, మనుచో మరణంబుభయము ♦ మనకుం గలదే? ౧౧౮
కం. నారాయణుఁడును శక్రుఁడు, గౌరీనాథుఁడును దండ♦కరుఁడును మనలం
బోర నెదుర్కొందురె మన, పే రన్నం వణఁకుచుండ్రు ♦ భీతి సతంబున్. ౧౧౯
ఉ. దోషము లేదు శౌరియెడఁ ♦ దోయజలోచనుమానసంబు వి
ద్వేషులదోషహేతువునఁ ♦ దిరుచెడెం జుమి గాన నిప్పు డా
దూషణశీలురం సురలఁ ♦ దూర్ణ మ హింస యొనర్చి వారి ని
శ్శేషులఁ జేసి వచ్చుటయె ♦ చిత్తములం శుభ మంచుఁ దోచెడిన్. ౧౨౦
చం. అనుచు సుమాలి మాలు లిటు ♦ లాడిన వల్లె యటంచు దేవతా
జనములమీఁద దాడి చన ♦ సర్వసురారుల కాజ్ఞ చేయుచుం
మొనలను దీర్పఁగా నసుర♦ముఖ్యుఁడు సైన్యపులం విధించినం
ఘనతరశౌర్యధుర్యులు ర♦ణంబునకుం జతనంబు సేయుచున్. ౧౨౧

మాల్యవంతుఁడు దేవతలమీఁదికి యుద్ధంబునకుఁ బోవుట.

చం. ఉరవడి స్యందనద్విపహ♦యోష్ట్రఖరర్షభశింశుమారభీ
కరపవనాశ నాండరుహ♦కచ్ఛపమత్స్యసుపర్ణతుల్యవి

ష్కరకిరినక్రకోలవర♦సింహవృకాకుముఖాన్యసత్త్వముల్
పరఁగఁగ వాహనంబులుగ ♦ స్వర్గము ముట్టఁగ దాడి వెట్టినన్. ౧౨౨

సీ. లంకకుఁ జేకుఱు♦లయము భావించి లం,కను వసించెడిభూత♦గణము లెల్ల
దైవతంబులతోడ ♦ దైన్యంబు నొందుచు, వానితోఁ బురమును ♦ బాసిపోయె
సురవైరినాశంబు ♦ సూచించుచును మింట, ధరణిని జెలఁగె ను♦త్పాతకములు
కాలేరితంబు లై♦కడుభీకరంబు లై, యెమ్ములు వేఁడి ర♦క్తమ్ముతోడ

ఆ. వృష్టిగురిసె శైల♦బృందంబు లురియాడెఁ, బొంగి పొరలి వేల ♦ మ్రింగె జలధి
యుఱిమినట్లు వఱడు ♦ లఱచె భీమంబుగ, గ్రద్దపిండు మీఁదఁ ♦ దద్ద తిరిగె. ౧౨౩

కం. కాలగతి నసురసేనా,జాలముపైఁ దిరిగె రక్త♦చరణములు కపో
తాళులు గూసెను గాకబ,ళాలంబులజాల ముద్భ♦టం బగుధ్వనులన్. ౧౨౪

చం. బలముగఁ గాలపాశచయ♦బద్ధులు కావుట మాల్యవత్సుమా
లులు నలమాలి యేమియును ♦ లోఁగక జంకక కీడు గూర్చుచి
హ్నాలఁ గనియుఁ బలంబునకు♦నంతటికిఁ మునుమున్నవోయి రు
జ్జ్వలదహనాకృతిం దనుజ♦వర్యులు వెన్నడి వచ్చుచుండఁగన్. ౧౨౫

ఆ. మాల్యవంతమునకు ♦ మాద్రి యై యచలుఁ డౌ
మాల్యవంతు బలసి ♦ మహిమ వెలసి
యసురు లంద జేగి ♦ రజ్జసూతిని గొల్చు
నాకవాసు లనఁగ ♦ జోక మెఱసి. ౧౨౬

కం. మాలికివశగత మై విబు,ధాలయవిజిగీష దాన♦వానీకము మే
ఘాళులపోలిక గర్జలఁ, దూలించుచు దిక్తటంబు ♦ తోడఁదోడి చనియెన్. ౧౨౭

విష్ణువు దేవతలకుఁ దోడ్పడి రాక్షసులఁ బాఱఁదోలుట.

చం. దనుజసమూహముల్ విబుధ♦ధామము పైఁ జనుదెంచుటల్ సురల్
పనిచినదూత దెల్పుటయు ♦ భండనతత్పరుఁ డై రమాధవుం
డనుపమకోటిసూర్యనిభ ♦ మాకవచంబును దొడ్గి భీమరో
పనిచయపూర్ణతూణపరి♦భాసితుఁ డై కటిసూత్రయుక్తుఁ డై. ౧౨౮

చం. అరిదరశార్ఙ్గనందకము♦ఖాయుధుఁ డై కనకాద్రిఁ బోలు న
గ్గరుడుని నెక్కి దుష్టసుర♦కంటకనాశనసంభ్రమంబునన్
దొరపడి నిర్గమించె విబు♦ధుల్ ఋషి సిద్ధులు యక్షులున్ మునుల్
కరములు మోడ్చి మ్రొక్కి తనుఁ ♦ గమ్రమధూక్తుల సన్నుతింపఁగన్. ౧౨౯

కం. హేమాంబరుఁ డగుజలద,శ్యాముఁడు లక్ష్మీవిభుండు ♦ సంశోభించెన్
హేమాద్రిమీఁదిసతటి,జ్జీమూత మనంగ సంత♦సింపఁగ జగముల్. ౧౩౦

ఉత్సాహము. పక్షిరాజపక్షజాత♦వాతధూతకేతువై
యాక్షణంబ కీర్ణశస్త్ర♦మై చలోపలంబు నీ
లక్షమాధరాగ్ర మనఁగ ♦ లక్షితంబు నౌచు నా
రాక్షసేంద్రసైన్య మెల్ల ♦ భ్రాంతిఁ దూలి బెగ్గిలన్. ౧౩౧

కం. అడ్డం బై శరముల ముజ్జిడ్డుగఁ గపయంగఁ జేయఁ ♦ జేడ్పడ కసురల్
గడ్డుకొనురోషమువఁ దమ, యొడ్డెల్లను నేకముగ మ♦హోత్సాహమునన్. ౧౩౨

కం. నెత్తుట నెఱచిని మేనులు, జొత్తిలి యున్నను సురారి♦సూదనుమీఁదన్
మొత్తములుగాఁ గురిసిరి, తత్తఱ మొకయింత లేక ♦ దనుజవరేణ్యుల్. ౧౩౩

ఆ. రాక్షసాంబుదములు ♦ ప్రకటగర్జారవత్రుటితదిక్చయములు ♦ ఘోరముగను
బరభయంకరముగ ♦ శరవృష్టి గురిసె నా, రాయణాద్రిమీఁద ♦ నాఁకకొనక. ౧౩౪

కం. శ్యామావదాతుఁ డగుహరి, శ్యామాసురపంక్తి బాణ♦జాలము గుఱియం
గా మెఱసె వర్షమాణమ, హాముదిరాచ్ఛాది తాంజ♦నాద్రివిధమునన్. ౧౩౫

సీ. మడిమీఁదమున రెడి♦మిడుతలపోలిక, మంటపై వ్రాలుదో♦మలవిధానఁ
దేనెకుండకు మూఁగఁ ♦ దివురునీఁగలభంగి, సంరంభమునందు మొ♦సళ్ళలీల
దానవచాపము♦క్తంబులు శరములు, కల్పంబువేళ లో♦కంబులట్లు
హరిఁ జొచ్చె రథికులు ♦ కరిగతుల్ రౌతులు, బంటులు నట్లట్ల ♦ మింటి కెగసి
తే. యసురవర్యులు బాణాళి♦యష్టితోమ
రాదులను జిమ్మి చిమ్మి దా♦మోదరుండు
నవనిసురుఁడు ప్రాణాయామ♦మందుఁబోలె
స్తంభితోచ్ఛ్వాసుఁడుగ వేగ ♦ సలిపి రపుడు. ౧౩౬

మ. శకులిక్షోభితవారిరాశియటు లై ♦ శార్ఙ్గంబు మ్రోయించి నం
దకహస్తుండు స్వరూపమానవమా♦నక్షిప్రతాభీలపూ
ర్ణకరాకృష్టనిశాతసాయకముల‌న్ ♦ రాత్రించరశ్రేష్ఠుల‌న్
వికలీభూతశిరస్కులం జలిపె వే♦వే వేలుగాఁ గూలఁగన్. ౧౩౭

ఉ. దైన్యముఁ గూర్చి యిట్లు నిశి♦తప్రదరప్రకరైకవృష్టిసా
జన్యధనుండు శౌరి బల♦శాలిత నొత్తఁగఁ బాంచజన్యము‌న్
జన్యసమాగతత్రిదశ♦శాత్రవకోటులు సింహగర్జన‌న్
వన్యగజంబులట్లు పఱ♦వం దొడఁగెన్ హృదయంబు బెగ్గిలన్. ౧౩౮

శా. త్రైలోక్యంబు వ్యథాప్రపూర్ణముగ నా♦ధ్వానంబు నిండారిన‌న్
సోలెన్ దంతులు నేల నిర్మదము లై ♦ స్రుక్కెం దురంగంబులు‌న్

వ్రాలెన్ స్యందనముల్ దొఱంగి రథిక♦వ్రాతంబు నిస్తేజ మై
తూలెం బద్ధసముత్కరంబు ధరణిం♦దోడ్తోడ నిక్షిప్త మై. ౧౩౯

శా. నీరంధ్రంబుగ బాణవర్ష మసురా♦నీకంబుపై వేగి యై
నీ రేజాంబకుఁ డంతటం గురియఁగా ♦ నిర్భిన్నగాత్రంబు లై
స్వారాట్ప్రత్రువిదారితాద్రు లన ర♦క్షఃపాలకస్తోమముల్
తీరుం బాసెఁ జెడెం బడెన్ సమసె బి♦ద్దెం డింకవేసెం దెగెన్. ౧౪౦

కం. హరిచక్రకృతవ్రణములఁ, దొరఁగెన్ నెత్తురులు సోఁకు♦తుటుములమేనన్
ధరణీధరములఁ గాఱెడి, గిరిభవధాతువులనంగఁ ♦ గెంజాయలతోన్. ౧౪౧

తే. పాంచజన్యరవంబు దు♦ర్వార మైన, శార్ఙ్గమౌర్వీనినాదంబు ♦ శత్రునికర
కంఠరవమునునిన్నింటిఁ♦గడఁచి మ్రింగెఁ, గాంచనాంబరుభయదహుం♦కారరవము.

సీ. తరణిబింబమునుండి ♦ కిరణంబు లట్టుల, జలనిధినుండి యూ♦ములవిధాన
నగరాజముననుండి ♦ నాగరాజులభంగి, వారిదంబుననుండి ♦ ధారలట్లు
శౌరిసంప్రేరిత♦శార్ఙ్గవినిర్ముక్త, కాండముల్ దమమీఁదఁ ♦ గవయుటయును
దునిఁగినమెడలును ♦ దునిసినయొడలును, బగిలినతేరులు ♦ నొగులువిండ్లు

ఆ. మొగ్గువాహనములు ♦ ప్రగ్గడికరులను, నెగయు కేతనములు ♦ తెగినకేలు
గాఁగ నసురసేన ♦ కళవళించెఁ దపించెఁ, గందెఁ గుందె డిందె ♦ మ్రందె నపుడు

సీ. శరభంబులకుఁ బాఱు♦హరిసంఘములభంగి, హరికిని వెఱచెడి♦కరులసరణి
వారణంబుల కుల్కు♦వ్యాఘ్రంబులట్టుల, వ్యాఘ్రంబునకును జీ♦వంగులట్లు
చివ్వంగికిని గ్రామ♦సింహముల్ తీరున, శ్వానంబునకును మా♦ర్జాలరీతి
మార్జాలమున కహి♦మండలంబులత్రోవ, కాకోదరమున కె♦ల్కలవిధాన

ఆ. హరికి వెఱచి పఱచి ♦ ధరణిని బన్నుండి, యసురవరులసేన ♦ హతము గాఁగ
వారిధరవరంబుఁ ♦ బర్జన్యునట్టులు, సించె వారిజంబు♦నీలతనుఁడు. ౧౪౪

కం. నగధారిబాణములకున్, బెగడుచుఁ బలలాశిబలము ♦ బిగిచెడి లంకా
నగరాభిముఖముగాఁ జన, మగిడినరోసంబుతో సు♦మాలియుఁ గడిమిన్. ౧౪౫

## విష్ణువు సుమాలితోఁ బోరుట.

చం. తరణిని ముంచు మంచుగతిఁ ♦ దాఁకి శరంబుల విష్ణు ముంచినన్
మరలినసైన్య మంతయు స♦మగ్రధృతిం జెలరేఁగి క్రమ్మఱన్
సురపరిపంథియున్ దనుజ♦సూదనుఁ గిట్టి సురారిజీవసం
భరణచణంబుగా గళర♦వంబును నించె నితాంతధీరతన్. ౧౪౬

మ. తపనీయాభరణోజ్జ్వలం బయినహ♦స్తం బుద్ధతిన్ వీచుచున్
దపనీయాంశకుఁ బిల్చుచున్ సహతటి♦ద్ధారాధరంబో యనన్

విపులారావము రోదసీకుహరని♦ర్భేదంబుగా నించినన్
దపనాభప్రదరంబునన్ హరియుఁ ద♦త్కర్ణోజ్జ్వలద్భూషలన్. ౧౪౭

కం. త్రుంచియు సారథిశిరముం, ద్రెంచినఁ దత్సైంధవములు ♦ తికమిక గొనుచున్
మించిన వెఱ గిరగిర మని, పంచజనాదునిరథంబు ♦ బలువిడిఁ ద్రిప్పెన్. ౧౪౮

కం. భ్రాంతము లగుడును రథహయ, సంతతి భ్రమచే సుమాలి ♦ చలియించెఁ బరి
భ్రాంతేంద్రియాశ్వములచేఁ, జింతధృతి దొలంగు నరుని♦చెలువున నాలోన్.

చం. సుడివడు చున్నయగ్రజునిఁ ♦ జూచి మహోగ్రహస్ప్రత్తి మాలియున్
బిడుగులఁబోలుబాణములు ♦ వెన్నుని హంసలు క్రౌంచశైలమున్
గడువడిఁ దూఱి యేగుగతి♦గా నిగిడించిన నాధికిన్ వశం
పడనిజితేంద్రియుం డనఁగ ♦ మాధవుఁ డేమిచలింప కాత్మలోన్. ౧౫౦

→ విష్ణువు సుమాలిని వధించుట. ←

శా. మార్వీరావము దిక్ప్రపూర్ణముగ భీ♦మప్రోదిసీవప్రభా
దుర్వారాశుగవేగబాణముల దై♦త్యున్ నాటఁగా నేసినన్
సర్వాంగంబులఁ దూఱి పాములు సుధా♦సారంబుభంగిన్ మనః
పర్వం బారఁగఁ గ్రోలె నెత్తురులు వి♦భ్రాంతిం గొనన్ వైరియున్. ౧౫౧

ఉ. అంతటఁ బోక శౌరి యసు♦రాధము మాలి ధ్వజంబు చాప మిం
తింతలుగాఁగఁ ద్రుంచి హయ♦బృందములన్ వధియింప మాలి దు
ర్దాంతజవంబుతో డుత గ♦దాధరుఁ డై చని పక్షిరాట్చిరః
ప్రాంతమునందు మోఁదె హరు ♦ నంతకున ట్లిరుకేల హుంకృతిన్. ౧౫౨

మ. స్వరుధారాహతి నద్రియ ట్లడలి యా♦సర్పారి దిగ్భ్రాంతి మై
మరలం బాఱి భృశార్తి మాధవునకున్ ♦ మార్గోము గావించినన్
సురవైరిప్రకరంబులందు గగన♦స్ఫోటంబుగా రావ ము
ద్ధురతన్ వెల్వడె హర్ష హేతు వయి త♦ద్ఘోరారవోద్భూతికిన్ ౧౫౩

ఉ. ఆగ్రహ మార శ్రీరమణుఁ ♦ డడ్డముగాఁగ మలంగి తార్క్ష్యుపై
వ్యగ్రతఁ గేలఁ దాల్చి పెడ♦వాటుగ నయ్యును వైచె భాస్కరో
దగ్రవిభావిభాసము ది♦శావళిసంగతసైజతేజమున్
విగ్రహభీషణంబు నరి♦వీరశిరఃప్రతిభేదదక్షమున్ ౧౫౪

తే. కాలచక్రంబుఁ బోనిచ♦క్రంబు నసుర, వరునిపైనది మును రాహు♦శిరముఁ ద్రుంచు
కరణి మాలిశిరంబును ♦ ధరణిఁ గూల్చె, నమరు లరుసంబునను గర్జ♦లార నింప.

→ రాక్షససేన పలాయిత మగుట. ←

సీ. మాలి గూలినఁ జూచి ♦ మాల్యవంతుండు సు,మాలియు శోకని♦ర్మగ్ను లగుచు
బలఁగంబుతో భీతిఁ ♦ బాఱిరి లంకాము, ఖమ్ముగ నింతలో ♦ ఖగవరుండు

తెప్పిఱితక్రోధ♦తీవ్రత నిజపక్ష,వాతూలనిహతిని ♦ వారి నొంపఁ
బెనుగాలి నొగుడాకు ♦ లనఁ జెల్లచెదరులై, సేనలవారలు ♦ చెదరి పోవ
తే. శరగణచ్ఛిన్నగాత్రులు ♦ చక్రకృత్త,మూర్ధు లసిదారితాంగులు ♦ ముసలహతివి
ఘటితశీర్షులు లాంగల♦గ్లపితకంధ,రులు గదాహతవక్షులు ♦ త్రుటితకరులు ౧౫౬

చం. అగుచును వెంద్రుకల్ విరియ ♦ నాహవముఁ విడి పాఱ రాక్షసుల్
నగధరుఁడుఁ శితాయుతక♦లంబకవృష్టిని నాతపత్రముల్
తెగఁ దురగాళిఁ గూలఁ జెడఁ ♦ దేరులు ప్రేవులు ప్రోవులై పడఁ
బిగిచెడఁ దత్తఱింపఁ బురి♦విచ్చఁగఁ దద్దఱిలంగఁ జేసినన్. ౧౫౭

కం. సుడివడఁగా నేత్రంబులు, తడఁబడఁగాఁ బాదములును ♦ దటతట మనఁగా
నెడదలు సైనికులందఱు, వెడఁగులవలె నగుదుఁ జలము ♦ వీడ్కొని పఱవన్.

చం. కని నరసింహమూర్తి ఘన♦గర్జల నించిన సింహగర్జలఁ
వినినమతంగజంబు లన ♦ విభ్రము నొందుచుఁ జాపముక్తరో
పనికరమారుతాహతికి ♦ వారిదసంఘములట్లు లైరి త
త్కనకమణీమయాభరణ♦కాండములఁ ధరయెల్ల నిండఁగన్. ౧౫౯

కం. నీలబలాహకతుల్యులు, లోలంబలలంతికోజ్జ్వలులు హరిశరధా
రాలుళితచిత్తు లగుచును, నీలాంజనగిరు లనంగ ♦ నేలం ద్రెళ్ళన్. ౧౬౦

చం. పరువిడురాక్షసోత్కరము♦పాటును వెన్కను శౌరిపోటు నా
శరకులనాయకుండు గని ♦ సంభ్రము వేలను దాఁకి మర్లున
క్కరణిని వెన్కకుం దిరిగి ♦ కంజదళాక్షునిఁ జూచి యిట్లనుఁ
గరువతనంబుతోడఁ గినుకం జలియింపఁగ వాలి రేఁగుచున్. ౧౬౧

మాల్యవంతుండు విష్ణుని నిష్ఠురమాడుట.

కం. ప్రాకృతజనునట్టులు నీ, వీకరణిని క్షత్రధర్మ ♦ మెఱుఁగక యుద్ధం
బాకాంక్షింపనివారల, నాకులపడఁ జంప నగునె ♦ నారాయణుఁడా! ౧౬౨

కం. విను సమరవిముఖులఁ వెన్కొని చంపెడిపూరుషుండు ♦ కోటికోలందుల్
ఘనసుకృతంబులు చేసియుఁ, జన నేరఁడు స్వర్గమునకు ♦ సత్యవిచారా! ౧౬౩

కం. యుద్ధమొనర్పఁగ నంతటి, శ్రద్ధయుఁ గల దేని రమ్ము ♦ చక్రధరుండా
సిద్ధముగ నున్నవాఁడఁ బ్ర,సిద్ధంబుగఁ జూపు నీదు♦చేవయు బలమున్. ౧౬౪

సీ. అని మాల్యవంతంబు♦ననువున నమ్మాల్య,వంతుండు నిలిచిన ♦ వనజపాణి
యి ట్లను మీభీతి ♦ బృందారకుల్ నన్ను, శరణంబుఁ జొచ్చినఁ♦గరుణఁ దలఁచి
మిమ్ము నుత్సాదింప ♦ మేకొంటి నానుడి, రక్షించుకొనువాఁడ ♦ రాక్షసేంద్ర!
నాప్రాణములకంటె ♦ నాకనివాసుల, కార్యంబు ప్రియము మఱి ♦ క్రాలు నాకుఁ

తే. గాన మీరు రసాతలా♦గతులరైన, హతులఁ జేయక విడువ దు♦రాత్ములార!
యనిన నసురుండు శక్తిచే ♦ నంబుజాక్షు, వక్షమున నాట దృఢశక్తి ♦ నైవ నదియు.

కం. జలదంబున సౌదామిని, చెలువునఁ గడు వెలిఁగె దైత్య♦జిద్వక్షమునన్
బలియుఁడు శక్తిధరప్రియుఁ, డలవున నద్దాన వైచె ♦ నయ్యసురేంద్రున్. ౧౬౬

చం. అదియును మాల్యవంతుసుర♦నందుఁ బడెన్ గిరికూటసీమ పై
భిదురముచంద మై యసుర♦వీరునివర్మము దాన భేదిలెన్
హృదయముఁ గాఁడుతన్నిహతి ♦ నెంతయు నొచ్చి చలించి క్రమ్మఱన్
మదమునఁ దెప్పిఱిల్లిధృతి♦మంతుఁడు నిల్చి మహానగం బనన్. ౧౬౭

చం. అతులితకంటకావృతమ♦హాయసశూలముఁ ద్రిప్పి దైత్యుఁడు
ధ్వతిని స్తనాంతరస్థలిని ♦ దాఁచి దృఢంబుగ నంతఁ బోక యా
దితిసుతవైరి ముష్టిహతిఁ♦దీవ్రత నొంచియు గ్రుద్ది తార్క్ష్యున
చ్చతురుఁడు దాఁటె వెన్కకు వె♦సన్ నలుమూరకొలంది నేలకున్. ౧౬౮

మ. వినతానందనుఁ డంతరోషవశుఁ డై ♦ పేర్చెన్ గరుద్వంద్వమున్
దనుజాధీశ్వరుఁ డెండి నాకుపలెఁ ద♦ద్వాతూలవేగంబున
న్జనియెన్ నిల్వఁగ లేక, యగ్రజుగతిం ♦ దద్భ్రాత వీక్షించి త
క్కినసేనాతతిఁ గొంచు లంక దెస నే♦గెన్ హ్రీనతాస్యంబుతోన్. ౧౬౯

## ⟵ రాక్షసులు పరాజితులై లంకఁ జొచ్చుట. ⟶

కం. ఈవిధమునఁ బలుమాఱు ర, మావిభుచే భగ్న మగుచు ♦ మనుజాశననా
థావళి హావళి గొనియెన్, శ్రీవరు నెదిరింప దైత్య♦సేనకు వశమే? ౧౭౦

కం. పంకజనేత్రున కడలుచు, లంకాపురి విడిచి యాత్మ ♦ లలనలతోడన్
బింకం బఱి పాతాళము, తెంకిగఁ గొని నిల్చి రదలు ♦ దిగ్గన నసురుల్. ౧౭౧

కం. సాలకటంకటు లనఁగా, వాలినవా రీసురారి♦వర్యులు రామా!
పౌలస్త్యనామకీర్తితు, లాలంబున నీవు చంపి♦నట్టిసురారుల్. ౧౭౨

కం. పౌలస్త్యులకంటెను బల, శాలులు మఱి సాంపరాయ♦చతురులు ప్రజ్ఞా
శాలులు ధైరస్థైర్యర, మాలసితులు రామచంద్ర! ♦ మాల్యవదాదుల్. ౧౭౩

కం. సురకంటకు లగునసురులఁ, బరిమార్పఁగ నెవరి వశము ♦ పద్మాక్షుండౌ
నరిదరశార్ఙ్గగదాయుధ, ధరునకు నారాయణునకుఁ ♦ దక్క నొకనికిన్. ౧౭౪

తే. నీవ నారాయణుండవు ♦ నీవ యవ్య, యుండవు సనాతనుండవు ♦ నుత్పలాంగ
దివిజవరదచతుర్భుజుం♦డవు నజయ్యుఁ, డవుఁ బ్రభుండవు నీవ మా♦ధవ! మురారి!

చం. అసురుల సంహరింప మను♦జాకృతి నొందితి వీవు, ధర్మముల్
పసచెడ నప్పు డప్పుడు వ్య♦వస్థ మఱిన్ ఘటియించుపొంటె నీ

రస జనియించు చుండుదు వ♦రాతులఁ ద్రుంపఁగ సాధుకోటికిన్
వ్యసన మణంచి ప్రోవ శ♦రణాగతరక్షణ! ధర్మవీక్షణా![1] ౧౭౬

కం. సరసిజనయనా! నీ కీ,కరణిని రాక్షసులజన్మ♦కథఁ దెలిపితి శ్రీ
కర యింక రావణాసురు,చరిత వచించెదఁ దదీయ♦జనిసత్త్వంబుల్. ౧౭౭

మ. చిరకాలంబు రసాతలంబునన ల♦క్ష్మీనాథుభీతిన్ నిశా
చరయుక్తుండు సుమాలి యుండెఁ దనయా♦స్యం బుర్విపైఁ జూప, కీ
శ్వరమిత్రుండు సపుత్రపౌత్రుఁ డయి య♦క్షస్వామి లంకాపురిన్
స్థిరసౌఖ్యంబున నేలు చుండె నిటు లెం♦తేఁ గాల మొయ్యం జనన్. ౧౭౮

సుమాలి కూఁతుం దోడ్కొని భూలోకంబునకు వచ్చుట.

సీ. ఒక్కనాఁడు సుమాలి ♦ యుజ్జ్వలగాత్రను, బద్మంబుఁ బాసిన♦పద్మఁబోలు
తనకూఁతుఁ దోడ్కొని ♦ ధరణికి నేతెంచి, వరుని నన్వేషించు♦వాంఛతోడఁ
జరియించు చోకచోటఁ ♦ బరికించెఁ దండ్రికి, నభివాదన మొనర్చి ♦ యరుగువాని
స్వచ్ఛందు ధననాథు ♦ వాసవనిభునిఁ బు,లస్త్యతనూజుని ♦ లలితరూపుఁ

తే. గాంచి క్రమ్మఱి తనదులో♦కమున కేగి, యెట్లు సేయఁగ మే లగు ♦ నీసురారి
వంశమున కిది యభివృద్ధిఁ♦బరఁగు నెట్ల,టంచు నూహించి కూఁతుడా♦యంగఁ బిలిచి.

ఉ. బాలిక! నీకు యౌవనము ♦ వర్తిలు చున్నది, పెండ్లి సేయఁగాఁ
గాల మిదే, తిరస్కృతినిఁ ♦ గందు నో యంచును సాధ్వసంబునన్
మే లగుచుట్ట మెవ్వఁడును ♦ మేకొనఁ డయ్యెను ని న్వరింప, ల
క్ష్మీలలనాసమానవు వి♦శిష్టగుణాన్విత వీవు కూఁతురా! ౧౮౦

కం. కావున నీ కర్హు మహా, భావునిఁ బెనిమిటిని గూర్పఁ ♦ బడెదఁ బ్రయాసం
బో వెలఁదుక! నీకతమున, నీవంశము వెలయఁగా న♦భీష్టము నాకున్. ౧౮౧

కం. గౌరవముం గాంక్షించెడు,పూరుషునకుఁ గూఁతు రోకతె ♦ పుట్టిన యేనిన్
గూరును దుఃఖం బెవఁడా, యీరమణికి మగఁ డటంచు ♦ నెసఁగినచింతన్. ౧౮౨

కం. జననీవంశమువారిని, జనకుకులమువారి స్వపతి♦సంతతివారిన్
దనయా! కన్యక సంశయ,మునఁ ద్రోయు సదా యకీర్తి ♦ ముంచునొ యనుచున్.

ఉ. కావున నీవు విశ్రవునిఁ ♦ గంజభవాన్వయు మౌనివర్యు స
ద్భావమునన్ వరింపు పతి♦భావముఁ దాలిచి తన్మహానుకం
పావిభవంబునన్ సుతుల ♦ భాస్కరతేజులఁ గాంచుదాన వ
మ్మా! విదితప్రభావుల ధ♦నాధిపునిం బురిడించువారలన్. ౧౮౪

కైకసి విశ్రవసు నాశ్రమంబునకు వచ్చుట.

ఉ. భాసురతేజ! పుణ్యజన♦వల్లభు నీవును గంటి గాదె యు
ల్లాసము మీఱఁ బోవ నబ♦లా! చనుమీ యనఁ దండ్రియానతిం

[1] పరిత్రాణాయ సాధూనామ్మను శ్లోక మనుసంధించునది.

జేసి పథూపుతల్లి చని ♦ చెచ్చెరఁ గైకసి మౌనియాశ్రమ
స్థా సౌబగారఁ జేయుచు వి♦కాసముఖాంబుజయై రహించుచున్. ౧౮౫

చం. వినుత సుశీలుఁ జేరఁ జన ♦ విశ్రవుఁ డప్పుడు వేల్చి సంజవే
ళను వెలుఁగొంద నాగ్నిపజ్వ♦లద్దహనుం డనఁ గ్రూరకాలమం
చును గణియింప కాయుపతి ♦ చూచుచు మక్కువ నమ్మునీశ్వరుఁ
దనకొనయుంగుటంబునను ♦ ధారిణి గీయుచు నేలఁ జూచుచున్ ౧౮౬

చం. నిలిచినఁ బూర్ణచంద్రముఖి ♦ నీరజలోచన సింహమధ్య నా
కులపతి గాంచి యిట్టు లనుఁ ♦ గోమలి యెవ్వరిదాన వేల యిం
దుల కరుదెంచి తేమిపని ♦ తొయ్యలి పల్కు మ టన్న హాస్తముల్
సలలితశీల మోడ్చి ముని♦సత్తము మ్రొక్కి వచించె నీగతిన్. ౧౮౭

చం. మునివర! తండ్రియాజ్ఞను మి♦ముం గన వచ్చితి, బేరఁ గైకసిఁ
వనజభవాన్వవాయమణి! ♦ నామత మాత్మమహానుభావత
న్గన నగు నన్న నాతఁడు క్ష♦ణంబు తలంచి యెఱింగి సర్వముఁ
వనితకు నిట్లు పల్కె మగు♦వా! భవదాశయ మే నెఱింగితిన్. ౧౮౮

కం. తనయాభిలాష వచ్చితి, కన వైతివి క్రూరవేళ ♦ కావునఁ గ్రూరుల్
తనయులు క్రూరాకారులు, జనియింతురు నీకు రాక్ష♦సప్రాగ్రసరుల్ ౧౮౯

## ⟵ రావణ కుంభకర్ణ విభీషణ జననము. ⟶

సీ. అనవుడుఁ గైకసి ♦ యనియె నో బ్రహ్మవా,దీశ్వర! నను క్షమి♦యింపు నీకుఁ
గలిగెడుపుత్రులు ♦ కఠినచిత్తులు దురా,చారులు గావుట ♦ సమ్మతింప
ననిన నీకడగొట్టు♦తనయుఁడు ననువంటి,వాఁడు ధర్మాత్ముఁ డై ♦ పరఁగు నిజము
కొమ్ము యన్నను సతి ♦ నెమ్మది నట నుండి, కొంతకాలం బేగఁ ♦ గొడుకుఁ గనియె
తే. దీర్ఘదంష్ట్రు దశగ్రీవు ♦ దీప్తకేశు, నంజనచయాభుఁ దామ్రోష్ఠు ♦ నతులభయద
రూపు వింశతిభుజు మహా♦క్రూరు రాక్ష,సాకృతిని నప్పు డశనిచ♦యంబు లురలె.

కం. కురిసెను నెత్తురువానలు, మొరసె ఖరస్వనము లగుచు ♦ మొగుళులు సత్త్వో
త్కర మపసవ్యము దిరిగెను, ధరణి వణఁకెఁ దేజు మాసెఁ ♦ దరణియు నంతన్.

కం. విశదయశుండును ధాతృస,దృశుఁ డగునమ్మౌని వచ్చి ♦ దృష్టించి సుతుఁ
దశకంధరుఁ డగుకతమున, దశకంధరుఁ డనుచు నిడియెఁ ♦ దన్నామంబున్.[1]

సీ. కొలఁది చెప్పఁగరాని♦క్రూరరూపమువాఁడు, కుంభకర్ణుం డను♦కొడుకు పుట్టె
నావల శూర్పణ♦ఖాఖ్య సంభవ మందెఁ,గుటిలవిరూపాస్య ♦ కూఁతు రగుచుఁ
బశ్చిమసుతుఁ డయి ♦ ప్రభవించె ధర్మాత్ముఁ, డగువిభీషణుఁ డంబ ♦ హర్ష మంద
నతఁడు జనించిన♦యదనునఁ బుష్పవర్షము రాలె దుందుభి♦రవము నెఱసె

[1] పుట్టువుచే రావణుఁడు పదితలలవాఁడనియుఁ గోరిన రూపము ధరించు శక్తిగలవాఁడు గావున నొంటితలతోడ నప్పు డప్పుడు విహరించుచుండుననియుఁ దెలియఁదగు.

ఆ. మింట భూతవితతి ♦ మేలు మే లని మెచ్చె, వారలెల్ల హాని ♦ వడ్యునాత్ర
మంబునంద పెరిఁగి ♦ మహిత తేజస్కులై, తనరు చుండఁ బిన్న ♦ తనమునుండి
తే. క్రూరు లయిదశకంఠుండుఁ ♦ గుంభకర్ణుఁ, డుర్వికిని బాధఁ గలిగించు ♦ చుండి రందుఁ
గుంభకర్ణుండు మానులఁ ♦ గూల్చి తినుచు, దుష్టచరితల మిగులసం ♦ తుష్టిఁ గనియె.
కం. శ్రుతులఁ బఠించుచు నింద్రియ,తతి గెల్చి మితాశనుండు ♦ ధర్మాత్ముండై
మతిమంతుండు విభీషణుఁ, డతులిత సాధుత్వగరిమ ♦ యశముం గాంచెన్. ౧౯౫
చం. అరుగఁగఁ గొంతకాల మిటు ♦ లావల నొక్కదినంబునందుఁ గి
న్నరపతి మ్రొక్కి తండ్రికి ఘ ♦ నం బగు తేజముతోడఁ బోవ నా
సురసతి పంక్తికంఠుఁ గని ♦ చూచితె పుత్రక! నీదుభ్రాత యే
కరణి మహానుభావతను ♦ గ్రాలెడినో విభవాభిరాముఁ డై. ౧౯౬
చం. అటువలె నీర లెప్డు డొకొ ♦ యూట యటన్నను బంక్తికంఠుఁడుఁ
స్ఫుటతరరోష మూని తలిఁ ♦ జూచి వచించెను, బాసఁ జేసెదన్
బటుతరవైభవంబునను ♦ వాలెద నీతనికంటె మిన్న నై
యటు లోనగూడ కున్న సరి ♦ యయ్యెద పీడుము నీమనోవ్యథన్. ౧౯౭
కం. పెనుఁదపమున నాకార్యముఁ, గొనసాగించెద నటంచు ♦ గోకర్ణంబుఁ
జని తమ్ములతోఁ దపముం, బొనరించె నభీష్టవరముఁ ♦ బొందెన్ విధిచేన్. ౧౯౮

అగస్త్యుఁడు శ్రీరామునకు రావణాదుల తపోవిధంబుఁ జెప్పుట.

కం. నావుడు నాదేవాహితు, లేవిధమునఁ దపము చేసి ♦ రెఱిఁగింపుము పా
రావారపానచణ యని, ఠ్మావిభుఁ డడుగంగఁ గలశ ♦ సంభవుఁ డనియెన్. ౧౯౯
సీ. ధర్మమార్గంబును ♦ దలఁగక తపియించెఁ, గుంభకర్ణుం డతి ♦ ఘోరభంగి
మండునెండల నైదు ♦ మంటలనడుమన; వానకారున జడి ♦ వానలందు
మంచుకారున నీటి ♦ మధ్యంబునను నిల్చి, పదివేలవర్షముల్ ♦ పరమతపము
సలిపె విభీషణుం ♦ డలఘుధర్మస్థితి, నేకపాదంబున ♦ నిలను నిల్చి
తే. యైదువే లబ్దములు తప ♦ మాచరించి
యంతకాలంబ మఱియు సూ ♦ ర్యాభిముఖుఁడు
నగుచు స్వాధ్యాయదృఢచిత్తుఁ ♦ డగుచు నూర్ధ్వ
మూర్ధబాహుఁకుఁ డగుచు ని ♦ ర్మోహమతిని. ౨౦౦
కం. నందనమున నాకాలయు, చందంబునఁ దప మొనర్ప ♦ సదయాత్మునిపైఁ
జిందెను సుమనోవర్షము; బృందారకు లంత సంతు ♦ ష్టితు లై యడలన్ ౨౦౧
సీ. పదివేలయేఁడులు ♦ పంక్తికంఠుఁడు నిట్రు,పాసంబు గాఁగఁ ద ♦ పం బొనర్చె
వర్షసహస్రంబు ♦ పరిపూర్తి యగుడును, దల నొండు గోసి య ♦ గ్నులను వేల్చె

వేయింటి కొకటి నీ♦విధిఁ దలల్ తొమ్మిది, యగ్ని కాహుతిఁ జేసె ♦ నజునిగుఱించి
పదియవ వేయేఁటి♦తుదఁ బదియవతల, హోమంబుఁ గావింప ♦ నున్నయంత
తే. నిర్జరాన్వితుఁ డగుచు వా♦ణీవిభుండు, వానిఁ జేరంగ వచ్చి యో♦పంక్తివదన!
మెచ్చితిని నీదుతపము నీ♦యిచ్చఁ జెపుమ, సఫల మొనరింతు నీపరి♦శ్రమము వత్స!

## బ్రహ్మ రావణునకు వరము లిచ్చుట.

కం. అనవుడుఁ బంక్తిగ్రీవుం, డనుపమహర్షాబ్ధిఁ దేలి♦యాడఁగ జిత్తం
బనియెఁ గరంబుల మోడిచి, వనజాసన! వరద! భక్త♦వత్సల! దేవా! ౨౦౩
కం. జీవికి మరణభయము గా, కావల భయ మేది గలుగ ♦ దనవరతంబున్
జీవికి మృత్యువుతో సరి, యావైరియు లేదు గాన ♦ నమరత నిడవే. ౨౦౪
కం. నావుడుఁ బద్మజుఁ డిట్లను, నేవారికి నైన వచ్చు♦నే యీయ దశ
గ్రీవా! యమరత్వంబును, నీ వొండువరంబుఁ గోరు♦మీ యన నతఁడున్. ౨౦౫
చం. అనిమిషదైత్యయక్షదను♦జాహిసుపర్ణపలాశికోటిచే
వనజజ! మృత్యువుం గనమి ♦ వాంఛిత మీవర మిమ్ము సత్కృపన్
మనుజులఁ దక్కువారిఁ దృణ ♦ మాత్రము గాఁగ గణింతు, లెక్కగాఁ
గొనుదునె వారి, నన్న నల♦కోర్కి యొసంగి విధాత వెండియున్. ౨౦౬
ఉ. ప్రీతుఁడ నైతి నీవలన ♦ వేలోకమేలు ఘటింతు మస్తక
వ్రాతము నీవు వేల్చినది ♦ క్రమ్మఱ నెప్పటియట్ల గల్గు, నీ
చేతమునం దలంచినటు ♦ చేకొనఁ జాలుదు వెట్టిరూపమేన్
ఖ్యాతచరిత్ర నావరము ♦ కల్మినటంచన నింతలోవలన్. ౨౦౭
కం. రాక్షసుఁడు మున్ను లోకము, వీక్షింపఁగ నగ్నులందు ♦ వేల్చినశిరముల్
లక్షింపఁ గలిగెఁ దొమ్మిది, యాక్షణమున నెల్లవార♦లౌ రా యనఁగన్. ౨౦౮

## బ్రహ్మ విభీషణునకు వరంబు లిచ్చుట.

చం. అవల విభీషణుం గదిసి ♦ యంబుజగర్భుఁడు ధర్మబుద్ధివై
భవకలితుండ వీ వగుటఁ ♦ దద్దయు మెచ్చితి ధర్మశీల! నేఁ
డివుట నొనర్తు నీమతముఁ ♦ దెల్పుము నీయభికాంక్షితంబు నా
దివిజనుతుండు హస్తములు ♦ దెప్పున మోడ్చి వచించె నీగతిన్. ౨౦౯
కం. లోకగురుం డఁట తానై, నాకెదురుగ నిల్చి మెచ్చి ♦ నాఁడ నటంచున్
వాకొనె నఁట యింతకు వే, ఱేకలదే భద్ర మైన ♦ నిచ్చెద వేనిన్.! ౨౧౦
కం. పరమాపత్కాలము నను, దొరసిన యేనియు మనంబు ♦ దొలఁగక యెపుడున్
బరఁగుత ధర్మమునందే, నెరయుత బ్రహ్మాస్త్ర మెవరు ♦ నేర్పక నాకున్. ౨౧౧

చం. ఏయే యాశ్రమమందును, నే యేమతి సంభవించు ♦ నీశ్వర! నిరతం
బా యాయది ధర్మమునం, దే యనువర్తించుఁ గాక ♦ హిత మిటు సేయన్. ౨౧౨

కం. పరమాభీష్టము లగునీ, వరములు నా కమరవినుత ♦ వాణీనాథా
వరధర్మరక్తునకు దుష్కర మెందును లేదు నాఁగఁ ♦ గమలజుఁ డనియెన్. ౨౧౩

చం. ఒసఁగితి నీవు గోరినవ♦రోత్తమముల్ సుకృతాత్మ! నీవు రా
క్షసకులమందుఁ బుట్టియును ♦ గల్గ దధర్మమునందు రక్తి, నీ
కసమశుభంబుఁ గూర్తు నహి♦తాంతక! నీ కమరత్వ మిచ్చితిన్
రస మెసఁగంగ నంచు విధి ♦ క్రచ్చఱ నాఘటకర్ణుఁ డాయఁగన్ ౨౧౪

బ్రహ్మ కుంభకర్ణునకు నిద్ర నిచ్చుట.

చం. అరుగఁగ వేల్పు లోసురహి♦తా! వర మీయఁగరాదు వీనికిన్
సురపరిపంథి వీఁ డమిత♦శూరుఁడు లోకభయంకరుండు న
చ్చరలను మ్రింగె నేడ్వురను♦సౌరవనంబున శక్రభృత్యుని
ర్జరదశకంబుఁ జంపె నర♦సంయమివర్గముఁ ద్రుంచెఁ గ్రూరుఁడై. ౨౧౫

కం. ఏవరములు లేకయె యీ, కైవడి హావడి ఘటించు♦కలుషాత్మునకున్
నీవు వరంబుల నిచ్చిన, వే వార్తన్ వేసికొనఁడె ♦ విశ్వం బెల్లన్. ౨౧౬

కం. వర మని తెలివి దొఱంగఁగఁ, గరుణించిన జగములకును ♦ గల్యాణంబౌ
సురనాయక! యన వాణీ, తరుణీమణి నవ్విరించి ♦ తలఁచెఁ దలఁచినన్. ౨౧౭

కం. ప్రాంజలియై నిలువంబడి, సంజయదను వేల్పుసాని ♦ సమ్మతి మై నా
కుం జలుపఁ గర్జ మెయ్యది, రంజితసుజనా! యటన్న ♦ బ్రహ్మ వచించెన్. ౨౧౮

కం. దేవీ! రాక్షసునోరను, నీ వుండి వరంబువేళ ♦ నిర్జరవాంఛన్
గావింపుము నాభారతి, తీవరమున నేగి నిలిచె ♦ దితిజునినోరన్. ౨౧౯

ఉ. ఆవలఁ గుంభకర్ణునిక♦టాపసికిం జతురాస్యుఁ డేగి నీ
భావగతంబుఁ జెప్పు మన ♦ వాఁడును నిద్దురఁ గోరెఁ[1] బెక్కులేం
డ్లావిధి యట్టు లౌతమని ♦ స్వాలయముం జనె దేవయుక్తుఁడై
దేవవిరోధివా వెడలి ♦ దేవి సరస్వతి పోయెఁ బోయినన్. ౨౨౦

కం. తెలివి గొని తనదునుడికిం, బలువిధముల వగచి యేమి ♦ పలికితి నయ్యో
తెలిసి యిటు మోహపడుటలు, ఖలమతు లగుసురలచేఁత♦గా యని మఱిఁగెన్.

తే. భ్రాత లీరీతి విధిచేత♦వరము లొంది, చనిరి శ్లేషాత్మకవనంబు♦జాడఁ బట్టి
జనకుఁ డారఁ దపంబును ♦ జలుపు నెడకు, నందు సుఖముండి రిచ్ఛావి♦హారములను.

సుమాలి రావణాదులఁ జూడ భూలోకంబునకు వచ్చుట.

సీ. రాక్షసుల్ వారు వ♦రంబులఁ గాంచుట, యాలకించి సుమాలి ♦ హర్ష వశత
నాత్మమంత్రులు విరూ♦పాక్షమారీచప్ర, హస్తమహోదరు ♦ లనెడివారు

[1] నిత్యత్వమనఁబోయి నిద్రాత్వమనియెనఁట.

గొలున నిర్భయమతిఁ ♦ గుతలంబునకు వచ్చి, పంక్తికంఠునిఁ గ్రుచ్చి♦ప్రమదమునను
నాయనా! నెఱవేఱె ♦ నాకోర్కి యజునిచే, నుత్తమవరము నీ ♦ వొందుకతన

ఆ. మనది సుమ్ము లంక ♦ యనుపురం బందుండ, విష్ణుభీతి నెఱచి ♦ వీడు విడిచి
చనినవార మారఁ♦సాతలసీమకు, మేము పడెడిపాటు ♦ లేమి చెప్ప. ౨౨౩

ఆ. రాక్షసోచితంబు ♦ రహివిరాజు నాలంక, మనది తండ్రి! యిపుడు ♦ ధనవిభుండు
నీవిమాతృజుండు ♦ నెలవుగాఁ జేకొన్న,వాఁడు దానిమరలఁ ♦ బాడి పడయ.

ఉ. సామముచేత నొండె బలి ♦ సత్తమ! దానముచేత నొండె దు
ర్దామపరాక్రమంబుననొ ♦ క్రమ్మఱఁ దత్పురి నీవు గొమ్ము, దుః
ఖామితవార్ధి మున్గినసు♦రారికులంబు సముద్ధరించి లం
కామహిపప్రశస్తి వెసఁ ♦ గాంచు మనక్ దశకంఠుఁ డిట్లనున్. ౨౨౪

ఉ. అన్న యనంగఁ దా జనకు♦నంతటివాఁడు గదయ్య యిట్లు నీ
విన్నుడి తాత! చెప్పఁ దగ♦వే? యన వానిమనం బెఱుంగుచుఁ
మిన్నక యుండె, రక్కసుల♦మేటి యొకానొకనాఁడు నట్టులే
యన్నఁ బ్రహస్తుఁ డాదశము♦ఖాసురుతో వినయంబు దోఁపఁగన్. ౨౨౬

ప్రహస్తుఁడు లంక గ్రహింప రావణునకు బోధించుట.

కం. ఇన్నీతి నీవు పలుకఁగఁ, జన్నె శూరాగ్రణీ! ప్ర♦శస్తబలుఁడ వై
యన్నాదమ్ములవావులు, సున్నవొకో! శూరులం ద♦నుత్తమచరితా! ౨౨౭

కం. అక్కా చెల్లెండ్రై పెను, మక్కువ నదితియును దితియు ♦ మలయుచు నాం డ్రై
రక్కశ్యపమౌనికి నం, దక్క గనియె భువనపతుల ♦ నమరోత్తములన్. ౨౨౮

చం. దితియును గాంచె దైత్యవిత♦తిన్, సనగార్ణవకాననంబుగా
క్షితితలమెల్ల వారలది ♦ కీర్తిధనా! యులవంశమందు నీ
వతులితశౌర్యవిక్రమధ♦నాఢ్యుఁడ వై జనియించి తయ్య, శ్రీ
పతి దితిజాళిఁ జంపి యని♦వారితవిక్రముఁడై జగత్త్రయిన్ ౨౨౯

ఉ. దైవతకోటి కిచ్చె; నల♦దాయలు తమ్ము లటంచు నన్నలం
చీవిధి నీతు లాడగు సు♦మీ, చరియింపు మదుక్తి నా దశ
గ్రీవుఁడు యోజనం జలిపి ♦ హృష్టమనంబున వల్లె యంచుఁ దెం
పావహిలంగ స్వీయము వ♦నావనిఁ జేరి తదన్వితంబుగన్. ౨౩౦

కం. ఆనాఁడ త్రికూటస్థుం, డై నుడికారంపుఁబ్రోడ ♦ ననియెఁ బ్రహస్తుక్
గానఁగఁ బొమ్మీ ధనపతి, నానుడి గా నిట్టు లనుము ♦ నయపూర్వముగన్. ౨౩౧

→ రావణుఁడు ప్రహస్తునిఁ గుబేరునొద్దకుఁ బంపుట. ←

సీ. ఈలంక రాజేంద్ర! ♦ యింతకు మున్ను ప,రాక్రమశాలు లౌ♦రాక్షసులది
నీవిందుఁ జేరుట ♦ నీయట్టియనఘున, కర్హము గా దని ♦ యాడవలెనె?
కావున నీపురిఁ ♦ గ్రమ్మఱ నాకిచ్చి, తేని నే సంప్రీతి ♦ నెసఁగువాఁడ
నీవును ధర్మంబు ♦ నెఱి కాచి నటు లగు, నని చెప్పుమీ యన్న ♦ నాతఁ డరిగి
తే. యత్త్యుదారునిఁ గిన్నరా♦ధ్యక్షుఁ జూచి, యధిప! నీతమ్ముఁ డైనద♦శాననుండు
పనిచె నను దూతఁగాఁగ నీ♦పాలి కిప్పు, డతనివాక్కుల వినిచెద♦నాలకింపు. ౨౩౨

ఉ. దేవ! సుమాలిముఖ్యులు ది♦తిప్రభవుల్ మహనీయశక్తిసం
భావితు లేలి రీపురిని♦ బ్రాక్తనవేళల, నియ్యెడన్ దశ
గ్రీవుఁడు నీదుసోదరుఁడు ♦ కీర్తిధనా! నిను నీయ వేఁడెఁ దం
డ్రీ! విహితంబు గాదె యిపు ♦ డిచ్చుట వారలసొత్తు వారికిన్. ౨౩౩

→ కుబేరుఁడు లంక విడిచిపోవ సమ్మతించుట. ←

చం. అనవుడు విత్తనాథుఁ డసు♦రావళి దీనిని బాసి పోవఁగా
జనకుఁడు నన్ను నిల్పె నిట ♦ జక్కులతోడుత నున్న వాఁడ నో
దనుజవరా! దశాస్యునకుఁ ♦ దక్షణ మేగి వచింపు మిందు ర
మ్మనుము మదీయరాజ్యనగ♦రాఖిలవిత్తము లేల హాయిగన్. ౨౩౪

ఉ. పొమ్మని పంచి తత్క్షణమ ♦ భూవర! యాయన దండ్రిఁ జేరి పా
దమ్ముల వ్రాలి రావణుని♦దంతము సర్వముఁ జెప్పి లంక పూ
ర్వమ్మునవానివారి దఁట ♦ క్రమ్మఱ దానిని గోరె నంట నే
నెమ్మెయిఁ బోవువాఁడ వచి♦యింపుము నాకు యథార్థమం చనన్. ౨౩౫

ఉ. ఇట్టు వచించె విశ్రవసుఁ ♦ డీవిషయంబు మదీయసన్నిధిన్
దిట్టతనంబునం బలికె ♦ దీమసమారఁగఁ బెక్కుమార్లు ఛీ
కొట్టితిఁ గాని వాఁడు మదిఁ ♦ గొంకఁడు నానుడి చీరికిం గొనం
డెట్టును వాఁడు మానఁ డిఁక ♦ నేటికిఁ దేరకు రచ్చ వానితోన్. ౨౩౬

ఉ. మత్తిలియున్నవాఁడు తన♦మానితమైనవరంబు నెంచుచున్
జిత్తమునందుఁ బెద్ద లని ♦ చిన్న ల టంచు నెఱుంగ లేఁడు, నై
మిత్తికమద్వచస్సరణి ♦ మిక్కిలిదారుణ మాస్వభావమున్
హత్తెను వానికిన్ విను శు♦భావహధర్మ్యపథంబుఁ జెప్పెదన్. ౨౩౭

శా. కైలాసంబున కేగి నీవు తనయా! ♦ కావించుకొ మ్మాలయం
బాలంకన్ విడుమీ సహానుగుఁడ వై ♦ యారమ్యమందాకినీ
కూలంబందు వసింపు తజ్జలము వ్యా♦కోచార్కసంకాశస
న్నాళీకాళిసమావృతంబు కడు నా♦నందంబుఁ గల్గించెడున్. ౨౩౮

కం.అచ్చట నచ్చరచెలులు వి,యచ్చరగంధర్వకిన్న♦రాదులతోడన్
దెచ్చుముదంబుననాటల, మచ్చికవిహరించు చంద్రు♦ మానుగ సతమున్. ౨౩౯
కం.ఆకూళరక్కసునితో, వాకాటుల కీవు చొరకు ♦ వనజాసనుచే
జేకొన్నవరముచందము, నీ కెఱుకయె కాదె యన వి♦నీతుం డగుచున్. ౨౪౦
కం.ఆనతిగొని ధనదుఁడు భా, ర్యానందనసచివవాహ♦నార్థయుతుం డై
యానిమిషమ కైలాసము,హానగ దేశంబుఁ జేరి ♦ హాయిగ నుండెన్. ౨౪౧

రావణుఁడు లంకాప్రవేశము సేయుట.

ఉ. అంతఁ బ్రహస్తుఁ డాదశముఖాసురుఁ జేరి వచించె నెల్లవృ
త్తాంతము విత్తపాలుఁడు య♦థాగతి నేగెను లంక వీడి యే
చింతయు లేదు పట్టనముఁ ♦ జేరి స్వధర్మము రక్ష సేయుమీ
కాంతుఁడ వై సురాహితని♦కాయము పాలికి నంచుఁ బల్కెన్. ౨౪౨
కం.సానుజుఁ డై శూన్యము లం,కానగరవరంబుఁ బంక్తి♦కంఠుఁ డమందా
నూనానందంబున నిం,ద్రాణీపతి నాకపురివి♦ధంబునఁ జొచ్చెన్. ౨౪౩
తే. ఇట్లు లంకఁ బ్రవేశించి ♦ యెలమి మించి, దనుజరాజ్యాభిషేకంబు ♦ ఘనత గాంచి
ప్రాప్తసంపూర్ణకాముఁ డై ♦ పరిఢవించి, యెదురుబెదురును లేక ర♦హించెఁ బిదప
కం.తనయనుఁగుంజెల్లెలు శూ,ర్పణఖకుఁ దగువరుని వెదకి ♦ పాణిగ్రహణం
బున విద్యుజ్జిహ్వుం డ,న్దనుజుం డగుకాలకేయు♦నకుఁ దా నొసఁగెన్. ౨౪౫

రావణునకు మయుఁడు మండోదరీ వృత్తాంతముఁ జెప్పుట.

ఉ. ఆవల నొక్కనాఁడు మృగ♦యాభిరతిం జరియించువాఁడు ర
క్షోవరుఁ డొక్కచోఁ గనియెఁ ♦ గోమలి కన్యక యొర్తు కూడరాఁ
ద్రోవను వచ్చువాని మయుఁ ♦ దోడన కాంచఁగ నేగి పల్కె న
య్యా! వని నిర్జనమ్మతల♦మందుఁ జరించెదె మీర లెవ్వరో. ౨౪౬
కం.ఈమృగలోచనతో మీ,రేమినిమిత్తంబు తిరుగ ♦ నెంచితి రనఁగా
నామయుఁడు యథావృత్తం, బామనుజాశనున కిట్టు ♦ లాదృతిఁ జెప్పెన్. ౨౪౭
ఉ. నాయన! నీవు హేమ యను♦నాతిని ముందు వినియుందువే కదా
యాయువిదన్ శచీపతి బ♦లారికి నిచ్చినయట్లు దేవతల్
జాయగ నాకొసంగ సుఖ♦లంపటవృత్తిని దానిఁ గూడి నేఁ
బాయక యుంటి వర్షములు ♦ పంచశతంబులు, నిర్జరాజ్ఞచేన్ ౨౪౮
ఉ. అయ్యలివేణి వాసి చని ♦ హాయనముల్ పదునాలు గయ్యె,నే
నయ్యబలానిమిత్త మయి ♦ హైమమయంబుఁ బురంబుఁ గట్టి యం

దయ్యెలనాఁగఁ గూడితిని ♦ నాసతి లేమిని నందు నిల్వ నో
యయ్య! మనంబు లేదు విర♦హానలతప్తుఁడ నౌటఁ గావునన్. ౨౪౯

కం. ఆపురి విడి హేమాత్మజ, నీపాపను నాదుకూఁతు ♦ నిటు దోడ్కొని భూ
మీపర్యటనముఁ జేసెదఁ, జేపడుఁ గా కర్హవరుఁడు ♦ చెలువ కటంచున్. ౨౫౦

కం. కన్యాజనకత్వ మసా,మాన్యంబుగ దుఃఖకరము ♦ మా నేప్పులకున్
గన్యక రెండుకులంబుల, దైన్యంబున ముంచు శీల♦తాశంకఁ జుమీ. ౨౫౧

కం. ఇరువురుకొడుకులు నాకు న,మరసుందరియందుఁ గలరు ♦ మాయావి యనన్
బరఁగెను జ్యేష్ఠుఁడు దుందుభి, వరబలుఁడు ద్వితీయుఁ డగుచు ♦ వర్తిలు జగతిన్.

కం. వాకొంటి నాదుచరితము, నీకథ నీకఁ దెలుప వయ్య ♦ నీ వెవ్వఁడవో
యాకాంక్షించెద విన ననఁ, గైకసితనయుండు వినయ♦గరిమ వచించెన్. ౨౫౩

ఉ. నేను బులస్త్యమున్నఁడను ♦ నీరజగర్భునకుం దృతీయుఁ డై
మానితుఁ డైనవిశ్రవుసు♦మారుఁడఁ, బేరను బంక్తికంఠుఁడన్
నా నతనిన్ మునిప్రవరు♦నందనుఁ డంచు మయుం డెఱింగి మో
దానఁ దనూజ నాతనికి ♦ దారగ దానముఁ జేయ నెంచుచున్. ౨౫౪

మయుఁడు రావణునకు మండోదరి నిచ్చి వివాహము చేయుట.

ఉ. ఆదర మారఁ బంక్తిముఖు♦హస్తముఁ గేలఁ గదించి పల్కె, హే
మాదివిజాంగనాభవయు ♦ మామకపుత్రిక యైనదీని మం
డోదరి పేరికన్య నసు♦రోత్తమ! భార్యగ నీ కొసంగెదన్
మోదముతోడఁ గొమ్మనిన ♦ నూల్కొని వల్లె యటంచుఁ బల్కినన్. ౨౫౫

కం. పైతామహకులుఁ డనియును, ఖ్యాతమునిప్రవరశాప♦గతి నెఱుఁగుటఁ[1] గ
న్యాతిలకము మయుఁ డొసఁగెను, దైతేయుఁడు వహ్నిమ్రోలఁ♦దరుణిం గొనియెన్.

కం. అనఘంబుఁ దపోలబ్ధం,బును గరమాశ్చర్యకర మ♦మోఘం బగుశ
క్తిని మయుఁ డల్లున కొసఁగెను, మనలక్ష్మణు నొంచె దాన ♦ మనుజాశనుఁడున్.

రావణుఁడు తనసోదరులకు వివాహములు చేయుట.

సీ. స్వీకృతదారుఁ డై ♦ చేరి లంకాపురిఁ, బంక్తికంఠుఁడు తన♦భ్రాతలకును
బరిణయంబు లొనర్ప ♦ భావించి కుంభక,ర్ణునకు వైరోచను♦తనయతనయ
సారసవదన వ♦జ్రజ్వాల యనునొక్క,ప్రేయసిఁ గూర్చి వి♦భీషణునకు
దారఁగాఁ జేసె గం♦ధర్వవిభుం డైన,శైలూషుతనయను ♦ సరమ యనెడి

తే. సాధుధర్మజ్ఞ నామె శై♦శవమునందు, మానసముపొంతఁ జరియింప ♦ వానలకును
గొలను పొంగిన భీతిల్లి♦కూఁతుఁ గాంచి, తల్లి యిట్లని యఱచె వా♦త్సల్యగరిమ.

[1]తానుగ నీయకుండిన రావణుఁడు క్రూరుఁడు బలవంతుఁడగుటచె బలాత్కారముగనైన నత్యంత సుందరి మండోదరిని గ్రహించునని యెఱింగి మయుఁ డిచ్చెనని భావము.

కం. రామ! సరో మా వర్ధయ, నా మాతృతదుక్తిఁ బట్టి ♦ నవలామిహికిన్
భూమి సరమాభిధానము, ప్రేమోక్తిగ వెలసె నంత ♦ వీరవరేణ్యా! ౨౫౯

కం. గంధర్వులు నందనమున, బంధుర కేళీవిహార♦పరు లౌనట్టుల్
సింధురగమనలతో దశ, కంధరముఖు లుండఁ గొంత♦కాలంబునకున్. ౨౬౦

మ. కనె మండోదరి యొక్కపుత్త్రు నతఁడున్ ♦ ఖ్యాజాతమాత్రంబునన్
ఘననిర్ఘోషమునన్ ధ్వనించుటయు లం♦కాపట్టనం బెల్లఁ ద
ద్ధ్వని నిశ్చేష్టము గాఁగ రావణుఁడు మో♦దం బారఁగా దానఁ ద
త్తనయుం బిల్చెను మేఘనాదుఁ డనుచుం ♦ దాత్పర్యసంయుక్తుఁడై. ౨౬౧

కం. మీ రింద్రజితుం డనియెడి, పేరఁ బిలుచువాఁడు వాఁడె ♦ పెరిఁగెను రక్ష
స్స్త్రీనరక్షితుఁ డింధనముల, చే రక్షిత మైనవహ్ని ♦ చెలువున నంతన్. ౨౬౨

రావణుఁడు లోకంబుల బాధించుట.

సీ. నీరజసంభవ♦ప్రేరిత మై నిద్ర, యాఁపఁగా రాక త♦న్నలముకొనుడుఁ
గుంభకర్ణుం డన్నఁ ♦ గొలువఁగ నేగి పై, కొను నిద్ర సముచిత♦కూటమొండు
కట్టింపుమీ యన ♦ గ్రక్కునఁ బనివాండ్రఁ, బనుప రావణుఁడువా ♦ రనుపమాన
శాల యోజనము వి♦శాలంబుగా రెండు, యోజనంబుల నిడు ♦ పొప్పుచుండ

ఆ. స్ఫటికకాంచనముల♦ స్తంభముల్ కింకిణీ, జాలకములు దాంత♦చారుతోర
ణములు స్ఫటికవేదు ♦ లమల వైడూర్యంపు, సోపనములు గలిగి ♦ సొబగుమీఱ.

ఉ. కట్టిరి విశ్వకర్మవలెఁ ♦ గాంచన శైలగుహావిధంబునన్
దిట్టము గాఁగ నందుఁ, దను ♦ నిద్దుర ద్రెక్కొనఁ గుంభకర్ణుఁడున్
నెట్టన పెక్కువర్షములు ♦ నెమ్మది నుండె, సురర్షియక్షులన్
బట్టి నిరంకుశుం డగుచుఁ ♦ బఙ్క్తిముఖుండు వధించెఁ గ్రూరుఁడై. ౨౬౪

సీ. తోఁటలఁ గనుఁగొన్నఁ♦దోరంపుగాడ్పునా, మించి చెట్టులఁ గంచు♦మించుఁ జేయు
నేఱులఁ గనుఁగొన్న ♦ నేనుఁగువలెఁ జొచ్చి, సంచు నశింపఁ గ♦లంచి యాడుఁ
గొండలఁ గనుఁగొన్నఁ ♦ జండవజ్రముభంగిఁ, బిండిపిండిగ నేలఁ ♦ జెండివైచు
నందనోద్యానంబు♦చందంబుఁ గనుఁగొన్న, నేపున నెసరేఁగి ♦ రూపుమాపు

తే. వేల్పులను బట్టు గంధర్వ♦వితతిఁ గొట్టు, సిద్ధులను గట్టు మగువలఁ ♦ జెఱలఁ బెట్టు
సాధువుల నెట్టు కిన్నర♦సమితి మొట్టు, రట్టుమీఱుచుఁ గైకసి♦పట్టి కినిసి. ౨౬౫

కుబేరుండు రావణునకు నీతిఁ దెలుప దూత నంపుట.

ఉ. ఆతనిదుష్టచేష్టల ధ♦నాధిపుఁ డెల్ల నెఱింగి తమ్మునిన్
బ్రీతి నిజాన్వవాయముసు♦వృత్తము ధర్మము సంస్మరించుచున్
దూతను బుచ్చె లంకకును ♦ దూర్ణము వాఁడును బోయి మున్ను వి
ఖ్యాతయశున్ విభీషణునిఁ ♦ గన్గొని యాతఁడు ప్రశ్న సేయఁగన్. ౨౬౬

కం. తన యాగమనము హేతువు, వినిపించినయంత నతఁడు ♦ వింశతిబాహుం
గనిపింప సభాసీనుని, వినయమున జయోక్తిఁ బల్కి ♦ విభుతో ననియెన్. ౨౬౭

తే. అధిప! యక్షవిభుండు మీ ♦ యగ్రజుండు
ప్రీతి నను బంపె నిచటికి ♦ దూతఁ గాఁగఁ
గులము మీతల్లిదండ్రుల ♦ గుణముఁ దలఁచి
యాడు మనెఁ గొన్నినుడులు మీ ♦ తోడ వినుము. ౨౬౮

కం. చేసినవి యేమొ పూర్వము, చేసితి వవి చాలు నింకఁ ♦ జేయకు మట్టుల్
వాసిగ శక్యం బేనియు, భాసురశుభ మొదవ ధర్మ ♦ పద్ధతి నడుమీ. ౨౬౯

ఉ. కంటిని నందనంబు బహు ♦ కాలవివృద్ధము పాడుపాడుగా
వింటిని మౌనిసంఘములఁ ♦ బెట్టితి బాధ లటంచు, వెండి నీ
కొంటెతనంబు లాఁపుతమిఁ ♦ గూరిరి దైవతవర్యు లంచు నే
వింటిని, నీకు నిట్లు తగ ♦ వే జగ మేఁచుతలంపు తమ్ముఁడా! ౨౭౦

కం. ఏలిదముగఁ జూచితి ననుఁ, జాలఁగఁ బలుమాఱు దాని ♦ సైఁచితిఁ జుమ్మీ
బాలుఁడు దుడుకం డైనను, బాలించుట నీతి యతని ♦ బాంధవతతికిన్. ౨౭౧

ఉ. ఉగ్రతపంబు సేయఁ జని ♦ యుండితి హైమధరంబుపొంత కం
దుగ్రుఁడు పార్వతీసహితుఁ ♦ డొప్పఁగఁ గంటి నతుల్య తేజ మా
విగ్రహ మార నున్నపృథి ♦ వీధరకన్యకఁ జూచినంతఁ ద
న్నిగ్రహకారణంబునను ♦ నేత్రము సవ్యము దగ్ధమై చనెన్. ౨౭౨

తే. రేణుకలుషీకృతజ్యోతి ♦ రాణ దనరఁ, గన్ను తద్గిరి నన్యశృం ♦ గంబుఁ జేరి
నూటయెనిమిదియేఁడులు ♦ గాట మైన, వ్రతము సల్పితి శ్రీమహే ♦ శ్వరునిఁ గూర్చి.

సీ. వ్రతము సాంతం బైన ♦ భర్గుఁడు దోఁతెంచి, కరుణాతరంగి తే ♦ క్షణము లొప్ప
ననుఁ గాంచి పల్కెనో ♦ యనఘ! యీవ్రతమును, నేనొక్కఁడను మఱి ♦ నీవు నిట్లు
చేసినవారలు ♦ చేయఁ డన్యుం డెవఁ, డీవ్రతంబును నేన ♦ సృష్టి చేసి
నాఁడఁ బూర్వంబు నీ ♦ నయనంబు దేవిచేఁ, బింగళత్వంబుఁ బ్రా ♦ పించుకతన

తే. నేకపింగళుఁ డనుపేర ♦ నెసఁగ వయ్య
నిర్జితుండను నీతపో ♦ నిష్ఠచేత
మత్సఖిత్వంబుఁ గోరుమీ ♦ మాననీయ
యనుచుఁ గరుణించి యిడియె నా ♦ కాజ్ఞ చనఁగ. ౨౭౪

ఉ. ఆతనిచే ననుజ్ఞఁ గొని ♦ స్వాలయముం జనుదెంచి వింటి నీ
యాతతపాపకార్యముఁ, గు ♦ లార్హము ధర్మపథంబుఁ దప్పఁగా
నీతి య టయ్య? లోకముల ♦ నింద వహించుట మేలె? నిర్జర
వ్రాతము నిన్నుఁ ద్రుంప సదు ♦ పాయము రోయుచు నున్న దంచనన్. ౨౭౫

### రావణుఁడు కుబేరుదూతను వధించుట.

ఆ. కటము లదరఁ గోప♦గరిమ సంరక్తలో,చనుఁడు పంక్తిగళుఁడు ♦ ధనదుదూత
మోముఁ జూచి పలికె ♦ నీమాటలందలి,భావమెల్లఁ దెలియ ♦ వచ్చె లేర. ౨౭౬

ఉ. దూతవు గావు నీవు ఖల♦ధూర్తుఁడ! ని న్నిటఁ బంచినాతఁడుక్
భ్రాత యటంచు నన్నుఁ దలఁ♦పండు నిజం బిఁక నీదుప్రేలుడుల్
నీతులు గావు, శంకరుని♦నెయ్యము గల్గె నటంచు స్వీయ మా
ఖ్యాతియుఁ బెంపు చాటుకొనఁ♦గా నిటు పంచెను నిన్ను మూఢుఁడా. ౨౭౭

ఆ. పెద్దవాఁడు గురుఁడు ♦ పీడింపరా దని, తలఁచి యుంటి నింత♦వనుక నోరి
యింక సైఁపఁగూడ♦దితఁడు కారణముగఁ, ద్రుంతుఁ గకుబధిపచ♦తుష్క మిపుడ.

చం. గెలిచెద మూఁడులోకములఁ ♦ గీర్తితబాహువిలాససంపదక్
గలఁచెద దేవతావితతి ♦ గండఁడ నై యని రాక్షసేశ్వరుం
డలఘుజవంబునక్ నఱకి ♦ యాతనిమూర్ధముఁ జెంతనున్న య
ప్పలలభుగుత్కరంబునకు ♦ భక్ష్యము గాఁగ నొసంగెఁ గ్రూరుఁ డై. ౨౭౮

కం. అప్పుడ స్వస్త్యయనంబును, దెప్పునఁ గావించి లేచి ♦ దిగధీశతతిన్
ముప్పున ముంపఁగ నెంచుచు, నప్పిశితాశనుఁ డుదగ్ది♦శాభిముఖుం డై. ౨౮౦

### రావణుఁడు కుబేరు జయింపఁ బోవుట.

సీ. ధనదుని గెలువంగఁ ♦ దరలి రథస్థుఁ డై, సచివులు ధూమ్రాక్ష♦సారణులును
శుకమహోదరులును ♦ శూరవర్యులు ప్రహ,స్తుండు మారీచుండు ♦ తోడఁ రాఁగ
జగములు దహియించు♦చందంబునను గిన్క,సమరకాంక్షను బుర♦శైలములును
వనములు నదులు జ♦వంబునఁ దరియించి, కైలాసగిరిఁ జేర ♦ క్షణములోన

ఆ. యక్షచయము చూచి ♦ యక్షపుత్త్రుఁ డక్,మతిని దాఁక నోడి ♦ యతనిఁ గలనఁ
జక్క నరిగి యీశ♦సఖునకు నెఱిఁగించి, యతని ముదలఁ గాంచి ♦ యరుగుదెంచి.

శా. కైలాసంబు చలింపఁ బైపడు చుర♦క్షస్సైన్యముక్ దాఁక నా
భీలం బైనదురంబు చెల్లె నమర♦ద్విడ్యక్షసైన్యాళికిక్
దాళం జాలక యక్షధాటికిని బ్ర♦ద్రావించు సైన్యంబుఁ దా
నాలోకించి దశాననుం డెదిరె సాం♦హంకారహుంకారుఁ డై. ౨౮౨

### యక్షరాక్షస యుద్ధము.

ఉ. తోడన వానిమంత్రులును ♦ దోడ్పడి వేయికి వేయి యుద్ధిగా
వీడనియీసునం దొడర ♦ వింశతిబాహుని యక్షవీరులుక్
క్ష్వేడల నించుచుం గవిసి ♦ కేరుచు శక్తికృపాణికాగదా
తాడితుఁ జేయ వారిదము♦ధారలకుక్ గిరి నాఁగ ధీరతన్. ౨౮౩

చం. కలఁగక రావణుండు లయ♦కాలునిదండముఁబోని పెన్గదన్
జెలమునఁ ద్రిప్పుచున్ విమత♦సైన్యములోఁ జొరఁ బాఱి కుప్పకు
ప్పలుగను యక్షులం దునిమి ♦ వాయుసహాయుఁడు దండుగడ్డి క
ట్టెల దహియించునట్టులు ద్రు♦టిం దెగఁ గాల్చె నరాతిసైన్యమున్. ౨౮౪

తే. శుక మహోదరసచివులు ♦ ప్రకటశౌర్య, లెగవ నెగవంగ యక్షచ♦యేంద్రులెల్ల
గాలికిని దూలుమబ్బుల♦కరణిఁ దాల్చి, చనిరి కొందఱు సమసిరి ♦ సమరభూమి.

కం. పెదవులు గొఱుకుచుఁ గినుకన్, గదికొనుచును భ్రష్టశస్త్ర♦కూటంబులతో
నెద నన్యోన్యముఁ గ్రుచ్చుచు, నదియొరయిక నొడ్డుబోలె♦నలఁగిరి యక్షుల్.

కం. సమరమున నీల్గి ధరణిని, నమరపురికి నరుగువారి♦యలజడిచే న
భ్రమునం జూచెడిఋషిసంఘములకు నిలువంగఁ దలము ♦ కలుగద యేమిన్.

కం. విచ్చిన సేనలఁ గనుఁగొని, హెచ్చినకినుకను గుహ్య♦కేశ్వరుఁ డనుపన్
వచ్చి సురారుల శరములఁ, గ్రుచ్చెను సంయోధకంట♦కుఁడు భీకరుఁడై. ౨౮౮

ఉ. ఏచినశౌర్యగర్వమున ♦ నెల్లెడఁ దానయి వచ్చువాని మా
రీచుఁడు దాఁకెఁ దాఁకుటయు ♦ రేఁగి సుదర్శనతుల్యచక్రధా
రాచకితాత్ముఁ జేసి ధర ♦ వ్రాలఁగఁ ద్రోసిన వాఁడు సోలియున్
లేచి బలాతిరేకమున ♦ లీలగఁ బాఱఁగఁ దోలె నాతనిన్. ౨౮౯

చం. తొలఁగినవానిఁ గాంచి రణ♦దుర్జయుఁ డాదశకంధరుండు పే
రెలమిని హేమరత్ననిచ♦యోద్ధము ద్వారముఁ జొచ్చెఁ జొచ్చినన్
బలియుఁడు సూర్యభానుఁ డను♦వాఁడు దశాస్యు నెదిర్చి యాఁగి ని
ల్చలుఁ డయి యొక్క స్తంభమునఁ ♦ జయ్యన మోఁదె సురారిమూర్ధమున్. ౨౯౦

తే. తోరణస్తంభహతి నిశా♦చారి గ్రక్క, రక్తమును గొండ ధాతువుల్ ♦ గ్రక్కుపగిది
వరముబలమునఁ జేసి యే♦బాధ లేక, వాని నద్దాన దానవ♦భర్త వైచె. ౨౯౧

కం. యక్షుఁడు తత్ప్రహరణమున, నాక్షణము నశించె భస్మ♦మై వెఱచేతన్
బక్షులకైవడిఁ దక్కిన, యక్షులు తటినీగుహాంచ♦యంబులఁ జొరఁగన్. ౨౯౨

కం. పురివిచ్చినసైన్యముఁ గని, నరవాహనుఁడు మాణిభద్రు♦నకు ననె దశకం
ధరుఁ బాపాత్మునిఁ ద్రుంపఁగ, నరుగుము దిక్కగుము శూర ♦ యక్షులకెల్లన్.

ఉ. నావుడు వాఁడు వల్లె యని ♦ నాలుగువేవురు యక్షశూరు లెం
తేవడిఁ దోడరా నరిగి ♦ తీవ్రగదాముసలాసిశక్తులన్
జేవ దలిర్ప నొంచి వెఱఁ♦జేప్పడ శత్రులు డేగయో యనం
గా విహరించె లాఘవము♦కల్మి సురర్షి చయంబు మెచ్చఁగన్. ౨౯౪

ఉ. యక్షుల నొక్క వేవురఁ బ్ర♦హస్తుఁడు ద్రుంచె మహోదరుండునున్
దక్షుల వేవురం దునిమెఁ ♦ దాటకపుత్త్రుఁ డుదగ్రమూర్తి సం
ధుక్షితరోషవేగమునఁ ♦ ద్రోచె ధరం బడ రెండువేల ధూ
మ్రాక్షుఁడు మాణిభద్రునుర ♦ మం దొకరోఁకటఁ దాఁచె బిట్టుగన్. ౨౯౫

కం. చక్కటిఁ బోరాడెడియా, జక్కులబలఁగంబు లేద? ♦ శాంబరి పేర్మిన్
నిక్కెడి రక్కసు లెక్కడ?, నక్కతమునఁ జూవె యెక్కు♦డగు టాయసురల్.

కం. ముసలము వ్రేటునకును దా, నిసుమంతయు జంక కాతఁ ♦ డెసఁగినకినుకన్
వెస ధూమ్రాక్షుని గదఁ జే, కసిమిరి తీఱంగ నెత్తు ♦ గ్రక్కఁగ మోఁదెన్. ౨౯౭

కం. వ్రేటు వడి పడినమంత్రిని, శాటునిఁ గని రావణుండు ♦ సక్రోధుం డై
దీటొనరని వేగము పరి, పాటిని సమ్మాణిభద్రు♦పైఁ బఱ తెంచెన్. ౨౯౮

కం. పఱతెంచుపంక్తిముఖుఁ గని, బిఱుసగుశక్తిత్రయమున ♦ వ్రేయ నతండున్
వఱలెడిగదచేఁ బగతుని, మొఱకపడం బిట్టు దాఁచె ♦ ముకుటస్థలమున్. ౨౯౯

ఆ. ఆప్రహారంబునను మహా♦యక్షుమకుట
మొఱగె నొక పార్శ్వమున కాతఁ ♦ డుత్తలంబు
నొందఁ డయ్యెను గాన నా♦యుఱిదిబంటు
పార్శ్వమౌళి య టంచును ♦ వాసిఁ గాంచె. ౩౦౦

## ←→ కుబేరుఁడు రావణు నిష్ఠురంబు లాడుట. ←→

ఉ. దవ్వున నుండి విత్తపతి ♦ దానవనాథుని యేపుఁ గాంచి బ
[1]ల్రివ్వునఁ బద్మశంఖకప♦రీవృతుఁడై హితశుక్రయుక్తుఁడై
యవ్విబుధారిఁ జేరి మరి♦యాద దలంపని శాపమూఢునిన్
గ్రొవ్వునఁ గన్నుఁ గానని య♦ఘోరచరిత్రునిఁ బల్కె నివ్విధిన్. ౩౦౧

చం. వలదుర కీడు చేఁత లని ♦ భ్రాత వ టంచును బుద్ధి చెప్పినన్
నిలువవ, యాత్మలోఁ దలఁప ♦ నేరవ యుక్త మయుక్త మేనియున్
దెలిసెదు దుర్గతిం బొరసి ♦ దీనిఫలానుభవంబువేళ హా
సలిపితి ఘోరపాపమును ♦ సల్పను బుణ్య మ టంచు నేడ్చుచోన్. ౩౦౨

కం. పరికింపక మీఁ దెవ్వఁడు, గరళంబును ద్రావు వాఁడు ♦ కర్మఫలంబుల్
బరిణామవేళఁ దలఁచున్, గురుసుల నయ్యది కసిండి♦కోఁతలు కోయన్. ౩౦౩

తే. స్వల్ప మేదియొ ధర్మంబు ♦ సల్పినట్టి, నిన్నుఁ గని సంతసింపదు ♦ నిర్జరాళి
యిట్టిక్రూరంపుబుద్ధి వ♦హించి దుష్ట, కార్యముల నిప్డు డొనరించు♦కారణమున.

కం. జననీజనకుల నాచా, ర్యుని నవమానించునాతఁ ♦ డోదుర్గతి కా
లునకున్ వశపడి భృశయా, తనలం దపియించు వేళఁ ♦ దత్కృతిఁ దలఁచున్.

1 సంయుక్తముగావున లఘురేఫమయ్యె.

కం.తను వర్ధనంబు ధరణిన్, మను వేళన తపముఁ జలుప ♦ మానినయేనిన్
దనగతికిఁ జనిన వెనుకన్, బనవును బో మానవుండు ♦ పరితప్తుం డై. ౩౦౬

కం.ధర్మమున రాజ్యధనములు, శర్మంబు నధర్మమునను ♦ సంతాపం బౌ
ధర్మము సౌఖ్యార్థము దుష్కర్మమును వదలి చేయఁ♦గా సుమతి కగున్. ౩౦౭

ఆ. పాపమునకు నెపుడు ♦ ఫలము దుఃఖము యగు,దాని నిందుఁ గుడువఁ ♦ దగు నరుండు
అట్టు గాన మూఢుఁ ♦ డాత్మాపఘాతార్థ, మాచరించు చుండు ♦ నఘచయంబు.

కం.కట్టేఁడి కెవనికి శుభమతి, పుట్టంగాఁ బోదు గురులఁ ♦ బూజింపకయే
యెట్టిది కర్మ మొనర్చునొ, యట్టిది ఫల మనుభవించు ♦ ననురేశ్వరుఁడా!. ౩౦౮

తే. పుణ్యకర్మవినిర్జిత♦పురుషులకును
బుద్ధి కనురూప మగు ఫలం♦బులు ఘటిల్లు
శౌర్య మేనియుఁ బుత్రులేన్ ♦ ధైర్య మేని
బుద్ధికొలఁదియ యైయుండు ♦ బుద్ధిహీన. ౩౧౦

కం.పాపాత్ముఁడ వై నిరయున,మాపాదకకర్మకరుఁడ ♦ వగుటను ఛీ నీ
తోఁ పాటు పలుకఁ జెల్లదు, పాపులతో సుజనుఁ డెపుడుఁ ♦ బలుకఁడు నియతిన్.

## రావణ కుబేర యుద్ధము.

మ.అని మారీచముఖాసురుల్ గదియ య♦క్షాధీశుఁ డాసోఁకులన్
ఘననారాచపరంపరానిహతి వీఁ♦గం జేసి రక్షోధిపున్
దనచే నున్నగదన్ శిరస్థ్సలమునం ♦ దాఁచెన్ రవం తేని య
ద్దనుజుం డుత్తలపాటు లేక నిలిచెన్ ♦ ధైర్యంబు దీపింపఁగన్. ౩౧౨

శా.అన్యోన్యంబును శ్రాంతి లేక సురయ♦క్షాధీశ్వరుల్ లోకసా
మాన్యాన్యప్రథమానవిక్రమకళా♦మాత్సర్యసందీప్తు లై
జన్యోద్రేకిత నొంప యక్షుఁ డనలా♦స్త్రం బేయ దైత్యుం డుప
ర్జన్యాస్త్రంబున నార్చి మాయఁ గొనియెన్ ♦ శత్రుప్రహారార్థ మై. ౩౧౩

కం.పులులయు వృక్షంబుల యే,కలముల కొండలయు మల్ప♦గములయు మున్ని
రులయున్ యక్షుల దైత్యుల,పలువిధములతనులు వేలు ♦ వందలు దాల్చెన్.

కం.మాయారూపంబుల దై, తేయునిశరవృష్టి నొకఁడ ♦ త్రినయనమిత్రుం
డాయెడఁ గనెఁ గాని కనం, డాయనురాధముని సంభ్ర♦మాకలితుం డై ౩౧౫

## రావణుఁడు కుబేరు జయించి పుష్పకంబుఁ గొనుట.

ఉ. అంత దశాననుండు విమ♦మాస్త్రముఁ బూని మనుష్యధర్మ దు
ర్దాంతజనంబు మై నడవఁ ♦ గ్రమ్మినమూర్ఛ మునింగి వ్రాలె మే

నెంతయు రక్తసిక్తముగఁ ♦ గృత్తమూలము మశోకమో యనన్
జెంతలఁ జేరి పద్మముఖ ♦ శేవధు లాధననాథుఁ దేర్చుచున్ ౩౧౬

కం. నందనమునకుం గొని చన, నందితుఁ డై యసుర ధనదు ♦ నగరికిఁ జని యం
దంద మగుపుష్పకము న,స్పందమదంబునను గొనియె ♦ జయచిహ్నముగన్. ౩౧౭

సీ. జాతరూపోజ్జ్వల ♦ స్తంభసంవీత మై, వైడూర్యతోరణ ♦ భ్రాజిత మయి
సరసముక్తాజాల ♦ సంప్రతిచ్ఛన్న మై, సర్వకామఫలవృ ♦ క్షంబు నగుచుఁ
గామరూపం బయి ♦ కామజవం బయి, కామగమం బయి ♦ ఖచర మగుచు
భర్మమణీద్ధసో ♦ పానసంఘం బయి, తప్తకాంచనవేది ♦ తలము నగుచు
తే. నాకనిలయోపవాహ్యమై ♦ నవ్య మగుచు
దృష్టిహృదయసుఖం బయి ♦ దివ్య మగుచు
సర్వఋతుసుఖదం బయి ♦ శైత్యతాప
హీన మై బ్రహ్మనిర్మిత ♦ మైనదాని. ౩౧౮

కం. కడిమి మెయి నవ్విమానము, నొడిచి దురాత్ముండు విక్ర ♦ మోద్ధతి జగముల్
వడ నడచినట్లు పొంగుచు, వడి దిగియెన్ వెండికొండ ♦ ధ్వజినీయుతుఁ డై. ౩౧౯

కైలాసప్రాంతంబునఁ బుష్పకము చన కుండుట.

కం. సేనలతోడ విమానము,పై నెక్కి కుమారజన్మ ♦ వసుధ శరవణం
బౌ నెలవు హేమమయమున్, భానూపమ మైనదానిఁ ♦ బర్వతవరమున్ ౩౨౦

శా. ఆరోహించుచుఁ బోవుచోట నొకర ♦ మ్యారామముం గాంచె వాఁ
డారారాజువిమాన మేగ కట ని ♦ ర్వ్యాపారమై నిల్చినన్
జేరం బిల్చి యమాత్యవర్యులను ని ♦ ల్చెం బుష్పకం బిష్టసం
చారం బయ్యు నిదేల యెవ్వఁ డిటు సం ♦ స్తంభించెనో దీనినిన్. ౩౨౧

సీ. అన బుద్ధికోవిదుం ♦ డైనమారీచుండు, నిష్కారణమ్ముగ ♦ నిలువ దిద్ది
కత మేదియో కల్గుఁ ♦ గాకున్నఁ గిన్నర,ముఖ్యుఁ దప్పఁగ నన్యు ♦ మోవ దేమొ?
యని యిట్లు యోజించు ♦ నవసరంబునఁ గృష్ణ,పింగళుండును ముండి ♦ వికటుఁడొకఁడు
కుఱుచచేతులవాఁడు ♦ గుజ్జదేహమువాఁడు, బలవంతుఁడును మిట్ట ♦ పండ్లవాఁడు
తే. ఈశ్వరునియనుచరుఁడు నం ♦ దీశ్వరుండు, పంక్తికంఠునిఁ జేరంగ ♦ వచ్చి నిలిచి
కొంకు మది లేక రాక్షస ♦ కోటి వినఁగ,వానితో నను గంభీర ♦ భాషణముల. ౩౨౨

కం. దశకంఠ! మరలి చను మీ,దశ రాకుము శంకరుండు ♦ దేవియుఁ గ్రీడా
వశు లై యున్నా రరుగఁగ, వశపడదు సురాహియమర ♦ వరులకు నైనన్. ౩౨౩

తే. అనినఁ గంపితకుండలుఁ ♦ డగుచు రోష,సంభ్రమంబున నెవ్వఁ డా ♦ శంకరుం డ
టంచుఁ బుష్పకమును డిగ్గి ♦ యద్రిమూల,మరిగి యచ్చోట రెండవ ♦ హరుఁ డనంగ

తే. దీప్తశూలంబు చేఁ గ్రాలఁ ♦ దేజరిల్లు, కీశముఖు నందిఁ గనుఁగొని ♦ యాశరుండు
వారిదము మ్రోఁగునట్టు ల ♦ వజ్ఞఁ దోఁపఁ, బకపక మటంచు నవ్వినా ♦ భద్రుఁ డనియె.

## నందీశ్వరుఁడు రావణు శపించుట.

ఉ. మర్కటవక్త్రుఁ డంచు నవ ♦ మానము దోఁపఁగ నవ్వెదే నను
దర్కమి దేల? నిన్ను రణ ♦ దర్పసమగ్రులు మద్బలాకృతుల్
కర్కశవిగ్రహుల్ గిరిని ♦ కాశులు పుత్రకమిత్రభృత్యసం
పర్కభవద్బలంబు రణ ♦ మండలిఁ ద్రుంపఁగఁ బుట్టువా రిలన్. ౩౨౬

కం. మందుఁడ నిన్నుఁ మృత్యువుఁ, బొందింపఁగ నిపుడ శక్తిఁ ♦ బొరయుదు నైనన్
నిందలఁ జచ్చినవాఁడవు, ద్రుందింపఁగఁ జన్న మున్నె ♦ మడిసినవానిన్. ౩౨౭

కం. అనునందికేశ్వరునిపై, విను తెరువున నుండి పుష్ప ♦ వృష్టియుఁ గురిసెన్
ఘనదేవదుందుభిస్వన, మొనరెన్ దశకంఠుఁ డద్ది ♦ యుఱక మదమునన్. ౩౨౮

చం. బసవఁడ! మద్విమానగతి ♦ భంగముఁ గూర్చిన యల్లరుద్రునిం
బసచెడ నీధరాధరముఁ ♦ బట్టి పెకల్చెద మూలముట్టుగా
వెస నిదె చూడు మేబలము ♦ పెంపున భర్గుఁడు రాజువోలె నం
దనమునఁ గ్రీడ సల్పెడిని ♦ దార్కొను భీతిఁ దలంప కెప్పుడున్. ౩౨౯

## రావణుఁడు కైలాసంబుఁ బెల్లగించుట.

కం. ఆమహిమఁ జూతుఁ గా కని, యామహీభృద్వరముఁ బెఱికి ♦ హస్తంబులచే
నామొలకుం డాడించిన, నామల యాపాదశిఖర ♦ మల్లల నాడెన్. ౩౩౦

కం. చోద్యంబుగ నతఁ డిగ్గిరి, మాద్యద్గతి నూఁపఁ బ్రమథ ♦ మండలి వణఁకెన్
బ్రోద్యత్కంపంబున దే, వాద్యుని గిరి రాజతనయ ♦ యాశ్లేషించెన్. ౩౩౧

తే. అంతటఁ గపర్ది పాదంబు ♦ నంగుటమున
నదుమ నగ్గిరి తొల్లిటి ♦ యట్టు లుండఁ
గే లిఱికికొన్న దైత్యుండు ♦ జాలిపుట్ట
బిట్టు వాపోయెఁ బెనునొవ్వి ♦ పుట్టుటయును. ౩౩౨

చం. అరరె జగత్త్రయంబు ♦ సకలాబ్ధిచయంబులు క్షోభ మొందె గ్ర
క్కదలె ధరాధరంబులు ది ♦ గాలున నిర్జరయక్షసంతతుల్
బెదరె నిదే మటంచు సురబృందము సేంద్రముగాఁ దలంబులన్
జెదరె నమాత్యకోటి వెఱ ♦ చెన్ లయకాలమహాశనిభ్రమన్. ౩౩౩

ఉ. రావణుఁ డిట్లు రోదనప ♦ రాయణుఁ డౌటయు మంత్రులెల్ల నా
చావినయంబు దోఁప హరు ♦ శంకరు భర్గు నుమేశునిన్ మహా

దేవుని వేఁడుమీ యతఁడ దిక్కయి త్రిక్కణఁగించు నన్న నా
దేవవిరోధి యట్లు వినుతించెఁ గృపాలుని భక్తపాలునిన్. ౩౩౪

### శివుఁడు రావణునకు వరంబు లిచ్చుట.

ఉ. ఈగతి వేయివత్సరము లేఁడ్చిన నంతట నంతకారి యా
ప్రాగమరాధినేత కరవర్గము నూఁడగఁ దీయఁ బంచుచున్
రాగరసంబు దోఁప నసురప్రవరా! భవదీయధీరతా
భోగపరాక్రమంబులకుఁ బూర్ణముదంబు వహించితిం జుమీ. ౩౩౫

కం. శైలాక్రాంతుఁడ వై నీ, వీలీలమహారవంబు నెల్లజగంబుల్
వ్యాలోలంబుగఁ జేయుట, హాళిన్ ఘటియింతు రావణాఖ్యను నీకున్. ౩౩౬

కం. దేవతలు నరులు యక్షులు, భూవలయమునందుఁ గల్గుభూతము లెల్లన్
రావణుఁ డంచును జగతీ,రావణు నినుఁ బిల్చు నింక రాక్షసరాజా! ౩౩౭

కం. పొ మ్మెట కేగెదవో యథే,చ్ఛమ్ముగ నిశ్శంక మనుడు సంతసమున నా
ముమ్మొనవాలుండాలుపు, నమ్మనుజాశనచయేశుఁ డార్తశరణ్యా! ౩౩౮

ఉ. ప్రీతుఁడ వేని నాయెడల వేఁడెద నొండు ఘటింపవే దయన్
ధాత యొసంగె దేవఫణిదానవగుహ్యక యక్షరాక్షస
వ్రాతముచే నవధ్యత దురంబున, దుర్బలమానవావళిన్
జేతమునన్ గణింప, దయచేసెను వెండియు దీర్ఘమాయువున్. ౩౩౯

ఉ. అల్లవిరించిదత్త మగునాయువునందు గతించెఁ గొంత నీ
వెల్లను దొల్లియట్ల ఘటియింపుము నీమహనీయశస్త్రము
ద్యల్లలితానుకంప గిరిశా! దయసేయు మటన్న దేవతా
తల్లజ మిచ్చె భాస్కరశతప్రవిభాసముఁ జంద్రహాసమున్. ౩౪౦

చం. ఇటు తనఖడ్గ మిచ్చి మది నెంచి గతాయువుఁ బూరణించి ధూ
ర్జటి సురవైరితో ననియె రావణ! నీవు మదీయశస్త్రమున్
స్ఫుటతరభక్తిఁ బూజలను బొల్పుగఁ జల్పక నాదరించినన్
గుటిలత మమ్ముఁ జేరు నది గొబ్బున నిక్కము పొ మ్మటం చనన్. ౩౪౧

మ. హరుచే నిట్టులు పేరు గాంచి దురితస్వాంతుండు స్వచ్ఛందసం
చరణక్రీడ రహించెఁ బుష్పకమునన్ క్ష్మాభర్తలన్ శౌర్యదు
ర్ధరుల న్నొంచుచు మాఱుకొన్నయెడ సంగ్రామంబునం ద్రుంచుచున్
శర ణన్నన్ విజితాస్త్ర యన్నఁ గరుణన్ రక్షించుచున్ గర్వియై. ౩౪౨

**రావణుఁడు వేదవతితో సంభాషించుట.**

చం. ఇటు చరియించుచుఁ హిమమ♦హీధరచారువనాంతరంబునన్
జటలు మృగాజినంబు నయి[1] ♦ సాధుగతిఁ నిగమైకచోదిత
స్ఫుటశుభసద్వ్రతాఢ్య యగు ♦ సుందరిఁ గన్యకఁ దేవరూపిణిన్
గుటిలుఁడు గాంచి కామవశ♦గుం డయి చిక్కొర యంచు నవ్వుచున్. ౩౪౩

మ. తరుణీ! యెవ్వతె వీవు? యౌవనవిరు♦ద్ధం బైన యీనిష్ఠ లం
బరివర్తింపఁగ నేటికే? యసమ మా♦ప్రాయంబు సౌందర్యముం
బురుషుం వేఁదుఱుఁగొల్పఁజాలుఁ, దగవే ♦ పూఁబోణి నీయట్టినుం
దరియుం దాపసివోలె మేనిఁ గసుగం♦దం జేయ శాతోదరీ! ౩౪౪

కం. ఎవ్వరిదానవు చెలువా! యెవ్వఁడు నీభర్త? బాల♦మృగలోచన నిన్
బువ్విలుతుకేళిఁ దేల్చెడి, యవ్వరపురుషుండె సుకృతి ♦ యంబుజవదనా! ౩౪౫

కం. అడుగుచు నున్నాఁడను నినుఁ, బడఁతీ! నీ విట్లు కష్ట♦పడ♦నేల వనిన్?
నొడువుము సర్వం బన నా,జడదారి నెలంత యతని ♦ శాస్త్రహితముగన్. ౩౪౬

**వేదవతి రావణునకుఁ దనవృత్తాంతముఁ దెలుపుట.**

సీ. ఆతిథ్యమునఁ దన్పి ♦ యనియె బ్రహ్మర్షి నా,జనకుండు పేరఁ గు♦శధ్వజుండు
గీష్పతిపుత్త్రుండు ♦ గీష్పతితుల్యుండు, బుద్ధివైభవమునఁ ♦ బుణ్యమూర్తి
యాతండు దినము వే♦దాభ్యాస మొనరించు, నప్పుడు వాఙ్మయి ♦ నైన నేను[2]
గన్యనై పుట్టిన♦కారణంబున వేద,వతి యనుపేరు నా ♦ కతఁ డొసంగె
తే. దివిజగంధర్వయక్షాహి♦దితిజపతులు[3]
న న్నొసంగఁగ వేఁడిన ♦ నాదుతండ్రి
మూఁడులోకంబు లేలెడు♦వాఁడు ఘనుఁడు
విష్ణుఁ డొక్కఁడె యోగ్యుఁ డౌ ♦ పెండ్లికొడుకు. ౩౪౭

కం. అనుచుండు నతనిపల్కులు, విని దంభుం డనెడిదనుజ♦వీరుఁడు కినుకన్
జనుదెంచి యర్ధరాత్రం,బున నిద్రితుఁ దండ్రిఁ జంపి ♦ పోయెన్ ఖలుఁ డై. ౩౪౮

కం జననియు దుఃఖభరంబునఁ, దనభర్తం గౌఁగిలించి ♦ దహనార్చులకున్
దనమే నర్పించెను నా,జనకునిసంకల్ప మేను ♦ సత్య మొనర్పన్. ౩౪౯

ఉ. చేయుచు నేఁ బ్రతిజ్ఞ నిటు ♦ చేసెదుదానఁ దపంబు నిష్ఠ, నా
రాయణుఁడే మదీయధవుఁ ♦ డాతఁడుగాక మఱేఁడుఁ గాఁడు, దై
తేయుఁడ! నాచరిత్ర మిది ♦ తెల్పితి నెల్లఁ బులస్త్యపౌత్ర! వి
చ్చేయుము నేను శక్తను వి♦శిష్టజగచ్చరితం బెఱుంగఁగన్. ౩౫౦

తే. అనుచు నమ్మహావ్రత తన్ను ♦ నాడు చుండఁ
బుష్పకము డిగ్గి మరుముల్కి♦పోటుకతన

[1]అయి = కలదై, ధరించి. [2]కావుననే యయోనిజ. [3]సతులపాతివ్రత్యమును జెఱుచు రావణువంశము నిర్మూలింప నెపము గల్పించుటకై యిట్లు శ్రీమహాలక్ష్మి జనించెను.

రావణుఁడు ఋషికన్యఁ జేరంగఁ బోయి
యిట్టు లనియెను దనమది ♦ యెఱుక పడఁగ. ౩౫౧

## రావణుఁడు వేదవతిని దురుక్తు లాడుట.

ఉ. సుందరి యెంతగర్వితవె ♦ స్రుక్కఁగఁ జేసెదు కాయమున్, మహా
మందతపంబులన్ సవసి ♦ మానవినిష్ఠల సద్వ్రతంబులన్
వందుర నౌనె జవ్వనులు ♦ బాలికలున్ ముదుసళ్ళఁ గాక? నీ
యందముచంద మెంచ కిటు♦లాడఁగఁ జెల్లునె పల్లవాధరా! ౩౫౨

కం. నీవు జగత్సుందరి వై, కేవలముం బిటికి వయి మృ♦గీనయన! సుఖా
భావంబున వర్తించెదు, యౌవన ముడి వోవ సౌఖ్య ♦ మావలఁ గలదే? ౩౫౩

ఉ. పోయెడి నీకు యౌవనము ♦ పొల్తుక! యెన్నఁడె యింక హాయిగాఁ
గాయజు కేళిఁ దేలుచు సు♦ఖింపడె దీ? వటుగాన నేను లం
కాయుతరాజ్యనాథుఁడ మ♦హాబలవంతుఁడఁ బంక్తికంధరా
ఖ్యాయుతుఁడన్ మదాత్మసతి ♦ వై సుఖియింపుము భోగభాగ్యముల్. ౩౫౪

ఉ. ఎవ్వని నీవు విష్ణుఁ డని ♦ యెన్నెదు వాఁ డెవఁ డైన నేమి? యో
జవ్వని భోగదర్పబల♦శౌర్యతపోవిభవంబులందు నా
కెవ్వఁడు నీడు లేఁడు, నిజ ♦ మియ్యది, నన్ను వరింపు మన్న నా
క్రొవ్వరిభాషణంబులకుఁ ♦ గ్రొవ్విరిఁబోఁణి వచించె నీగతిన్. ౩౫౫

ఆ. అట్టు లనకు మోరి ♦ హరిని నారాయణు, సర్వలోకవంద్యు ♦ సర్వలోక
రమణు విష్ణుదేవు ♦ రాక్షసుండా! నీవు, గాక సూరి యెవఁడు ♦ కఱకు లాడు.

కం. అని తూలఁగు వేదవతిని, దనుజాధముఁ డొడిసి తిగిచెఁ ♦ దల వెండ్రుకలన్
వనితయు నంతకుఁ గురులం, దన కేలన కత్తిఁబోలెఁ ♦ దటుకున నఱకెన్. ౩౫౬

## వేదవతి రావణు శపించి యగ్నిలోఁ జొచ్చుట.

చం. తెగ నిటు వ్రేసి రోషమున ♦ దీప్తహుతాశనునట్లు మండుచున్
మెగువ నిశాటు దృక్తతుల ♦ మాడ్చెడున ట్లయి మేను పాయఁగాఁ
దెగి యనుకేంద్రునితో ననియె ♦ దేవవిరోధి! భవత్ప్రధర్షితం
బగుతను వింక నిల్పను, హుతాశనుఁ జొచ్చెద నీవ చూడఁగన్. ౩౫౭

శా. పాపీ! నేను వనంబులోఁ దపసి నై ♦ వర్తింప నన్నేఁపఁగా
నీపట్లం జనుదెంచితే? యబల నై ♦ యే నుంట నిన్ బూరుషున్
వ్యాపాదింపఁగ రాదు, నాతపము శా♦పం బీయ నాశిల్లుటన్
నీపీచం బడఁగింప, వెండియును జ♦న్మింతుం జుమీ రావణా![1] ౩౫౮

---

[1]లక్ష్మణుఁడు తనతోడనుండిన రావణాపహృతయై లంకఁ జేరుటకు రావణుకొంపఁ దీయుటకు వలను పడదు గావుననే నిష్ఠురములాడి యామున తొలఁగిపోవునట్లు సీత చేసెను. వేదవతియే సీతాదేవి.

ఉ. హోమము దానముం జలిపి ♦ యుండితి నేనియుఁ గొంచెమైన ధ
ర్మామితరక్తు నాత్మభవ ♦ నౌచు సయోనిజ నౌచు సాధ్వినై
నే మెయిఁ గొందుఁ జూడు మని ♦ నిర్మలశీలిని చొచ్చె నగ్నులం
దామరసంచయంబు గురి♦యన్ సుమవృష్టిఁ దథా స్తటంచునున్.　　౩౬౦

ఆ. అల్ల వేదవతియె ♦ యధిప వైదేహుని,తనయ యగుచుఁ బుట్టి ♦ ధరణియందు
నిఖిలనాథు విష్ణు ♦ నిను సనాతనమూర్తి, విభునిఁ గాఁగఁ బొందె ♦ వెలఁది మిన్న.

ఉ. ఏమె రుషాతిరేకమున ♦ నీల్గెను బూర్వ[1] మెవండు నిర్జర
స్తోమవిరోధి యాతఁడె వ♦సుంధరఁ బుట్టి యమానుషోగ్ర తే
జోమహితుండ వౌచు నల♦సుందరికే పతి వైననీదుదు
ర్దామశరాగ్నికీలలఁ బ♦తంగమునట్ల నశించె నియ్యెడన్.　　౩౬౧

తే. ఈమహాభాగ జనియించె ♦ నిట్లు మర్త్య
భువనమునయందుఁ బాలమునఁ ♦ బూజ్యభంగి
వేదియం దగ్నిశిఖవోలె ♦ విశ్వవినుత!
రమ్యగుణభద్ర! పట్టాభి♦రామభద్ర!　　౩౬౩

తే. వేదవతి యనఁ గృతయుగ♦వేళఁ బుట్టెఁ, ద్రేతయందు వధింపఁగ ♦ దితిజనాథు
సంభవించెను జనకవం♦శంబునందు, సీత[2]యం దుదయించుట ♦ సీత యయ్యె.

↞ రావణుఁడు మరుత్తు యజ్ఞశాలకుఁ బోవుట. ↠

సీ. వహ్నులలో వేద♦వతి చొచ్చుటను గాంచి, పుష్పకం బెక్కి యా♦పుణ్యజనుఁడు
ధరణిఁ జరించుచో ♦ దైవతాన్వితుఁ డై, క్రతువు మరుత్తను♦క్ష్మాధవుండు
సలుప నుశీరబీ♦జంబునఁ గని యందు,జనవర! బలుని దు♦స్సహుఁ గాంచి
దేవతలందఱుఁ ♦ దిర్యక్స్వరూపముల్, గొని రందుఁ బాకశా♦సనుఁడు నెమిలి

ఆ. యయ్యె,యముఁడు కాక ♦ మయ్యెఁ, గుబేరుండు
తొండ యయ్యె, జలవి♦భుండు హంస
మయ్యెఁ, దక్కువార ♦ లన్యరూపంబుల
మఱుఁగుపడిరి నిలువ ♦ వెఱచి యచట.　　౩౬౫

ఉ. జేన్నపువాడ జాగిలము♦చందమునన్ సురవైరి చొచ్చి యం
దున్నమరుత్తుఁ గాంచి నృప ♦ యుద్ధము సేయఁగ రమ్ము శక్తి లే
కున్న జితోస్మి యం చనుమ ♦ యూరక పోదు న టన్న దైత్యభ
ర్త న్నరభర్త యెవ్వఁడవు♦రా యిటు లాడెడినీ పటం చనన్.　　౩౬౬

కం. పక పక నగి యసురుఁడు నీ,యకుతూహలభావమునకు ♦ హర్షించితిఁ ద్రవ్యం
బకసఖుననుజాతుని భృశ,వికటబలున్ సన్నె యెఱుఁగ♦వే రావణునిన్.　　౩౬౭

[1] సీతాదేవి తేజస్సుచేతనే రావణుఁడు శవప్రాయమయ్యెనని భావము.　[2] సీత = నాఁగేటిచాలు.

కం. అన్నను గెలిచి రణంబున. నిన్నిరుపమపుష్పకము గ్రహించిన వీరున్
నన్ను నెఱుంగనివాఁడును, మన్నీఁడా నీవు గాక మఱియొకఁ డున్నే. ౩౬౮

కం. నావుడు మరుత్తుఁ డనియెన్, నీవే ధన్యుఁడవు జ్యేష్ఠు నిర్జించి తనిన్
నీవంటి శ్లాఘ్యపురుషుఁడు, త్రైవలయమునందు లేఁడు మాంసాదనుఁడా. ౩౬౯

కం. లోకంబు మెచ్చుకార్యముఁ, బ్రాకటగతిఁ జేసి చెప్పువాఁ డుండు ధరన్
లోకవిరుద్ధాధర్మము, నీకరణిం జేసి చెప్పు నెఆసరి నెఱుఁగన్. ౩౭౦

కం. కేవలధర్మవ్రతమున, నీవు వరంబులను గొంట నే వింటిని మున్
నీవే యిప్పుడు చెప్పిన, యావృత్తాంతంబు వినినయది లే దసురా. ౩౭౧

చం. నిలు నిలు దుర్మతీ! యిపుడ నిష్ఠురఘోరకఠోరమార్గణా
వళి నినుఁ గాలువీటికిని బంపెద నంచు శరాసనంబు న
మ్ములుఁ గొని క్రుద్ధుఁడై చనఁగఁ బూనఁగ నడ్డము వచ్చి నిల్చి య
బ్బలియునిఁ జూచి దేవగురుభ్రాతయు యాజకుఁడున్ మహాత్ముఁడున్ ౩౭౨

సంవర్తుఁడు మరుత్తుని శాంతుఁ జేయుట.

తే. ఆఖ్య సంవర్తు డనెడిబ్రహ్మర్షివరుఁడు, స్నేహసంయుక్తముగ నిట్లు చెప్పె రాజ!
వినఁదగునయేని నానుడి వినుము సంగరంబు సేయుట నీకు యోగ్యంబు గాదు.

తే. ఇదియు మాహేశ్వరం బయి యొనఁగు సత్ర
మంతరాయంబు గొంచెమేన్ బ్రాప్తమైనఁ
గర్తృవంశంబు దహియించుఁ గాన లేఁడ!
యింత యోజించి యని సేయ నెత్తికొనుము. ౩౭౪

తే. దీక్షితుం డేడ? యుద్ధంబు తెరువ దేడ?, దీక్ష యెచ్చట? నిట్టిక్రోధిత్వ మెచట?
రాక్షసుఁడు దుర్జయుండు దురంబులోన, నీవగెలిచెద వను లేమినిశ్చయంబు?

తే. అనిన గురువాక్య మాలించి యవనివిభుఁడు
చాపబాణాళి విడనాడి స్వస్థుఁ డగుచు
మఖము సంపూర్తి చేయంగ మరలి చనియె
దానిఁ గనుఁగొని శుకుఁ డనుదానవుండు. ౩౭౬

తే. గెలిచె రావణుఁ డనుచును బలములోనఁ
జాటఁగాఁ బంచె నసురుఁ డచ్చోటనున్న
నధ్వరాగతఋషులను హతులఁ జేసి,
నెత్తురులు ద్రావి యాపోక హత్త నరిగె. ౩౭౭

ఇంద్రాదులు మయూరాదులకు వరము లిచ్చుట.

కం. దనుజాధినేత యరిగినఁ, దనతనరూపంబుఁ దాల్చి దైవతనాథుల్
పెనుముదమునఁ దత్సత్త్వము,లను గని యి ట్లనిరి ప్రీతిలక్షణ మమరన్. ౩౭౮

సీ. నల్లపించెముల నె♦మిళ్ళను గనుఁగొని, హరిహయుఁ డిట్లని ♦ వరము లిచ్చె
లేదు మీ కిటమీఁద ♦ లేలిహానభయంబు, వేయికన్నులపురి ♦ వెలయుఁ గాక
నేను వర్షించుచో ♦ నెమ్మి మీ కబ్బుత, మని యన్న నవి యేగె ♦ హర్షమునను
బ్రాగ్వంశమున నున్న♦వాయసంబులఁ గని, ప్రాణులకును రోగ♦బాధ లిడఁడు
ఆ. నేన కాన మీకు ♦ నీరోగభయమును, లేదు మృత్యుభయము ♦ లేదు మీకు
జనము లెంతదాఁకఁ ♦ జంపరో మి మ్మంత,దాఁకఁ బ్రాణయుక్తి♦దనరు మీకు.
కం. నాలోకంబున క్షుద్వ్యథ, పాలగువా రిందు మీరు ♦ భక్షించినఁ జు
ట్టాలును దారును దృప్తిం, జాలఁగఁ గనువా రటంచు ♦ సమవర్తి యనన్, ౩౮౦
ఉ. అప్పతి హంసలం గని సు♦ధాంశుసమంబును ఫేనతుల్య మై
యొప్పు మనోహరాకృతి జ♦లోగ్రతయుక్ లభియించు వెండి మీ
రప్పుల నాడ నుప్పతిలు ♦ హారివిభాతిశయం బటన్న మై
కప్పు దొలంగి హంసములు ♦ క్రాలె మనోజ్ఞ వళక్షకాంతులన్. ౩౮౧
కం. రామా! హంసంబులు మును, శ్యామలములు వానిఱెక్క♦యంచులు నలు పై
కోమల మై యుండు జల,స్వామివరముపేర్మి శుభ్ర♦వర్ణము లయ్యెన్. ౩౮౨
కం. కృకలాసమ్ములకును గు,హ్యకనాథుఁడు మీకు శిరము ♦ హాటకరుచి యై
చకచక మనుచుండు నటం,చకలంకమనీష నిచ్చి ♦ యలరఁగ నంతన్. ౩౮౩
కం. నరపతియజ్ఞముఁ దీరుప, సురనాథులు తృప్తిఁ జెంది ♦ శుభమతు లగుచున్
ధరణీశ్వరుతో స్వర్గం, బరిగిరి రావణుఁడు సంగ♦రాకాంక్ష ధరన్. ౩౮౪

## అనరణ్యుఁడు రావణుతో యుద్ధం బొనర్చుట.

సీ. క్రుమ్మరి రాజుల♦ఘోరవిక్రములను, జేరి యుద్ధమున కే♦ తేరుఁ డొండె
విజితాస్మ యనుఁ డొండె ♦ వెరవొండు లేదు నా,ధాటిసహింప నా ♦ ధరణిపతులు
ప్రాజ్ఞులభీరులు ♦ బాగుగ యోజించి, యన్యోన్య మతఁడు వ♦రాధ్యుఁ డగుట
దుర్జయుఁ డని ♦ యెంచి నిర్జితాస్మ యటంచుఁ, బలికిరి యీరీతిఁ ♦ బలికినట్టి
తే. వారు సురథుండు గాధి పు♦రూరవుండు
గయుఁడు దుష్యంతుఁ డనువారు ♦ కంజనయన
వీర లందఱు నిటు పల్క ♦ వీరవరుఁడు
యుద్ధకాంక్షను వచ్చె న♦యోధ్య కపుడు. ౩౮౫
కం. ధీరుండు పురందరసమ,వీరుం డనరణ్యుఁ డనెడు♦పృథ్వీపతి పా
కారి దివంబునుబోలిక, ధారిణిఁ బాలించు చుండ ♦ దశకంధరుఁడున్. ౩౮౬
ఉ. ఆతనిఁ గాంచి యుద్ధమున ♦ కైనను రమ్ము జితోస్మి యంచు నేక్
భీతిఁ గలంగినం బలుకు ♦ నీవు మదాజ్ఞ యి దన్నధారిణీ

నేతయుఁ గోపవేగమున ♦ నేత్రయుగం బరుణంబు గాఁగ నో
యాతుఁడ![1] నిల్వుమీ నిమిష ♦ మాహవ మే నొనరింప వచ్చెదన్. ౩౮౮

చం. అని మును వానివృత్తము స♦మస్తము విన్కలి సిద్ధ మైనవా
హినిఁ జతురంగయుక్తము మ♦హీస్థల మెల్లను నావరింపఁగాఁ
గొని చని దైత్యసేనల న♦కుంఠితరీతిని దాఁకి పెక్కు లా
దినములు పోరు సల్పె నిన♦తేజుఁ డనుత్తమవిక్రమంబునన్. ౩౮౯

కం. జ్వలనజ్వాలలఁ దాఁకెడి, శలభంబులు నాఁగ వహ్ని♦సంపతితహవి
స్సులఁబోలి తనదు యోధులు, పొలియఁగ ననరణ్యనృపతి ♦ పురురోషమునన్.

ఉ. అంబుధిలో నణంగెడివ♦నాపగ లట్లు నశించునాత్మసై
న్యంబులఁ గాంచి వాసవశ♦రాసనతుల్యము భీమ మైనచా
పంబును గేలఁ బూని దశ♦వక్త్రుని దాఁకి మృగేంద్ర మల్పస
త్త్వంబులఁ దోలునట్లు తనుఁ♦దాఁకుప్రహస్తశుకాదిమంత్రులన్ ౩౯౦

కం. పాఱఁగఁ దోలియు నెనిమిది, నూఱులు బాణంబు లామ♦నుష్యాదుశిరం
బీఱమ్ముగ నొక్క మొగిం, దూఱఁగ నేయుటయుఁ గొండ ♦ తోరపుజడికిన్ ౩౯౧

చం. కలఁగని యట్లు రావణుఁడు ♦ కంపము నొందక మీఁద దూఁకి చే
తొలఁదిని మోఁద భూపతియుఁ ♦ గూలె రథంబున నుండి భూమి వి
హ్వలుఁ డయి వేపమానుఁ డయి ♦ వజ్రహతిం బడు చెట్టువోలె; ని
ట్లిలఁ బడియున్నపుణ్యు నసు♦రేశుఁడు గాంచి హసించు చిట్లనున్. ౩౯౨

ఉ. ఏమిఫలంబు నొంది తవ♦నీశ్వర! న న్నెదిరించి? యుద్ధమం
దేమగవాఁడు నీ జెనకి ♦ యేగు నొకో మెయితోడ? స్త్రీలతోఁ
గామితభోగసక్తుఁడవు ♦ కావుటనో వినవోటు నా బలో
ద్దామత నన్న భూమిపతి ♦ దానవుతో నను నీరెలుంగునన్. ౩౯౩

## అనరణ్యుఁడు రావణు శపించుట.

ఉ. ఏల ప్రగల్భభాషణము ♦ లిట్లు వచించెదు రాక్షసేంద్ర! న
న్గూలుప లేదు నీ విపుడు ♦ గూలితిఁ గాలముచేత, నెవ్వఁడో
కాలము మీఱఁ జాలెడిని ♦ గారణమాత్రము వీవు, నీనుడుల్
చాలును, బ్రాణ మేగుతఱి ♦ శక్యమె నా కెదియేని చేయఁగన్. ౩౯౪

ఉ. భీరువఁగాక ని న్నెదిరి ♦ వీరుఁడ నై సమరం బొనర్చితిన్
బోరను నన్ను నొంచితివి ♦ పోలును నీ కది; యంతఁ బోక దు
శ్చారుఁడ! నాదువంశము న♦సహ్యతరోక్తి నవజ్ఞ చేసెదే
యోరువఁజాల నయ్యది మ♦దుక్తిని విన్ము పలాశనాధిపా. ౩౯౫

[1] యాతుఁడు = రాక్షసుఁడు.

కం.దానము హోమము సుకృతం, బే నొనరించినను జనుల ♦ నేలిన ధర్మా
ధీనుఁడ వై నావాక్యము, దానవకులపరివృఢుండ! ♦ తథ్యం బగుతన్. ౩౯౬

ఉ. రాముఁ డనంగ దాశరథి ♦ రావణ! పుట్టి మదన్వయంబునన్
శ్రీమహితుండు నిన్ను రణ♦సీమ వధించు నటన్న దుందుభి
స్తోమము మింట మ్రోఁగె సుర♦సూనము లానృపుమీఁద వ్రాలె ఖో
ణీమహిళాధవుండును జ♦నన్ దివికిన్ దశకంఠుఁ డంతటన్. ౩౯౭

→ నారదుఁడు రావణునకు మనుష్యవధ మాన బోధించుట. ←

కం.భూమీధవభీకరుఁ డై, దీమసమున నేగుచోట ♦ దివి తెరువున వీ
ణామౌనిఁ గాంచి మ్రొక్కుచు, సేమముఁ బ్రశ్నించి కతము ♦ చెప్పుము మౌనీ!

ఉ. నీ విట కేగుదేర నన ♦ నీరదపృష్ఠగతుండు నారదుం
డావిబుధారికిం బలికె ♦ నాశరనాథ! పులస్త్యవంశదీ
పా! విని నీదువిక్రమము ♦ బాధముదంబును గంటి, నిల్వుమీ
నావచియించునొక్కవచ♦నంబును విన్ము వినం దలంచినన్. ౩౯౯

కం.హరి దైత్యుల వధియింపఁగఁ, బరికించి ముదంబుఁ జెందు♦వాఁడను నీ వ
ట్లురగుల గంధర్వాదులఁ, బరిమార్పఁగఁ గాంచి ముదము♦పడు టెన్నండో. ౪౦౦

సీ. అనిమిషగంధర్వ♦యక్షరక్షోసుర,వరులకు నేని య♦వధ్యుఁ డీవు
తండ్రి! యే మని చంపఁ♦దలఁచితి మృత్యువు చేఁ, జచ్చియ యున్నట్టి♦జనులఁ జెపుమ
మే లగుదానిని ♦ మేకొనఁ జాలని,మూఢు లనిష్టముల్ ♦మొగి ఘటించి
వ్యాధులచేతను ♦ వార్ధకంబున నేడ్చు,వారలు క్షుధను బి♦పాసచేత

ఆ. నిష్టజనులఁ బాసి ♦ యేడ్చుటచే స్రుక్కి, దైవనిహతు లయి స♦దా క్షయించు
నరులఁ జంప నీకు ♦ న్యాయమా నాయనా!,యెంచి చూడ వేమొ ♦ యింతదనుక.

చం.గడియకు నేమివచ్చునది ♦ కానరు, క్షుద్రవిచిత్రవస్తువుల్
గడన యొనర్చు టంద తమ♦కాలముఁ బుత్తురు,వాద్యఘోషలన్
గడుముద మందు చుండి జడి ♦ కాఱఁగ నశ్రువు లర్ధరాత్రమం
దుడుగక యేడ్చుచుండుదు[1], ర♦యో కనుఁగొంటివె మూఢమర్త్యులన్. ౪౦౨

కం.జనని యని జనకుఁ డంచును, దనయుం డని భార్య యనుచుఁ ♦ దమచుట్టము లం
చును జంజాటం బిడుకొని, వనటం బడువారు స్వకృత♦బంధంబులచేన్. ౪౦౩

మానిని.కావున మోహనిరాకృతులం గడు♦కాఱియలం బడుమానవులన్
నీవు జయించినవాఁడవె చాల్, యము♦నిం గన నేగుదు రెల్లజనుల్
నావచనంబున దండధరుం గద♦నంబున గెల్వు మవశ్యము నీ
వావిభు గెల్చిన నందఱ గెల్చిన♦యట్ల యగుం జుమి నిక్కముగన్. ౪౦౪

[1] నాకిటఁ గంచుతాళాలు. ఇంట్లో నోటితాళాలన్నట్లు.

→ నారదునితో రావణుఁడు తాను యముని జయింపఁ బోయెద ననుట. ←

తరలము. అనిన నవ్వుచు మ్రొక్కి పల్కె మ♦హాత్మ! గీతకళాప్రియా
ఘనవిదారణలాలసా జయ♦కాంక్ష నేను రసాతలం
బునకు నీ వచియించినట్టుల ♦ పోయి గెల్చి జగత్త్రయం
బును సురాహులు నాదునానతి ♦ మోవఁ జేసి బలోద్ధతిన్ ౮౦౫

కం. అమృతార్థము మథియించెద, నమృతనిధానంబు జలధి ♦ నన నారదుఁడున్
యమపురిమార్గము కడుదుర్గమ మెన్నఁడు పోవు నీవు♦కా కసురేంద్రా. ౮౦౬

ఉ. నావుడు శారదాభ్రనిభు ♦ నారదుఁ బల్కుఁ గృతంబు సర్వమున్
దేవమునీ! యిదో యముని ♦ దేఁకువఁ జంపఁగ దక్షిణాశగాఁ
బోవుచు నున్నవాఁడఁ గినుఁ♦పుం గొని బాస యొనర్చినాఁడ నా
శావిభులందు నల్వురను ♦ సంగరభూమి జయింతు నం చొగిన్. ౮౦౭

ఉ. అనుడిఁ దీర్చు పొంచె నిదె ♦ ప్రాణుల నెల్లర గాసిపెట్టునా
భానుతనూజు మృత్యునకుఁ ♦ బాల్పడఁ జేయఁగఁ బోవువాఁడ నం
చానియమాత్ము మ్రొక్కి సచి♦వాన్వితుఁ డై మదిలోనఁ బొంగుచున్
దానవనాథుఁ డట్టె చనె ♦ దక్షిణదిక్కుగఁ గాలుప్రోలికిన్. ౮౦౮

తే. రావణుఁడు పోవఁగ విధూమ♦పావకాభుఁ
డైనవిప్రోత్తముండు బ్ర♦హ్మాత్మజుండు
నొక్కమార్గంబు యోజించె ♦ యుద్ధభూమిఁ
గాలు నెట్లుజయించునో ♦ కటకటసుర. ౮౦౯

→ నారదుఁడు రావణుఁ డెట్లు యముని జయించు నని యోజించుట. ←

సీ. సచరాచరంబులు ♦ శక్రసమేతముల్, ముల్లోకములు చావు ♦ మూఁడువేళ
ధర్మవిధానంబు ♦ తప్పక యెవనిచేఁ, గారింపఁబడు నట్టి♦కాలు నెట్లు
గెలుచువాఁ డొకోదశ♦గ్రీవుండు మఱియును, దనతనచేసిన♦దాన విధికి
సత్క్రియాదులకును ♦ సాక్షియు రెండవ, పావకునట్టుల♦వఱలువానిఁ

ఆ. బ్రాప్తసంజ్ఞు లేమ♦హాత్మునను గ్రహ, వశముకలిమిఁ దిరుగు♦వారు క్రియల
నెవని కడలు భీతి ♦ నెల్లలోకంబు లా, దండధరుని నెట్లు ♦ దాయు ననుర. ౮౧౦

ఆ. పుణ్యపాపములకుఁ ♦ బోలినపద్ధతి, నింతొ యంతొ ఫలము ♦ నిచ్చువాఁడు
గెలిచినాఁడు భువన♦ములనెల్లఁ దాన యా, కడిఁదిబలుఁడు గెలువఁ♦బడుట యెట్లొ.

ఆ. కాల మెల్ల పనులఁ ♦ గావింప శక్తంబు, పంక్తికంఠుఁ డన్య♦బలము దేనిఁ
బూని గెలుచువాఁడొ ♦ దా నాహవంబున, దక్షిణాధిపతిని ♦ దండధరుని. ౮౧౨

కం. ఈయమరాక్షసనాథుల, యాయోధనముం గనంగ ♦ నా సయ్యెడి నే
వే యరిగెద వైవస్వతు, దాయఁగ నని యరిగె దండ♦ధరుపురమునకున్. ౪౧౩

రావణునుద్దేశంబు నారదుఁడు యమునితోఁ జెప్పుట.

చం. చని లఘువిక్రమాఢ్యుఁడు కృ♦శానుపురస్కృతుఁ బ్రాణికోటి చే
సినసుకృతాఘపాళులకుఁ ♦ జేకుఱ నర్హఫలంబు లోలి శా
సన మొనరించువానిఁ గనఁ ♦ జయ్యన నాతఁడు ధర్మపద్ధతిన్
మునిజననాథు నర్ఘ్యమునఁ ♦ బూజ యొనర్చి సుఖాసనస్థునిన్ ౪౧౪

తే. క్షేమమా మీకు మునినాథ ♦ ఖిలము గాదు, గాదె ధర్మంబు? గంధర్వ♦కాండ దేవ
సేవితా! మీర లిటకు వేం♦చేయు కార్య, మెద్ది యానతి యిండు నా♦ఋషివరుండు.

ఉ. అంతక! యాలకింపుమ యు♦దంతము నంతయు, నంత యుక్తముం
జింతన సేయుమీ, యసుర♦శేఖరుఁ డైనదశాస్యుఁ డిప్డు వి
క్రాంతిని నిన్ను దుర్జయ! దు♦రంబున గెల్వఁగ వచ్చుచున్నవాఁ
డింత యెఱుంగుటం దెలుప ♦ నే నిటు వచ్చితి మున్ను మున్నగన్. ౪౧౬

తే. కాలదండధరుండ వై ♦ క్రాలునీకు, నేమి యయ్యెడు నో యని ♦ యేగు దెంచి
నాఁడ నని యెడు నీలో తు♦ణాటవిభుని, వ్యోమయానంబు దోఁచె ద♦వ్వులను మింట.

రావణుఁడు యమలోకంబున బాధింపఁబడుజీవులఁ జూచుట.

ఉ. పుట్టెడుసూర్యుఁబోలి ప్రభ ♦ పూరటిలం దెసలందుఁ జీఁకటిన్
నెట్టుచు నెల్లచో నసుర♦నేతృవిమానము డాసెఁ బ్రేతరా
ట్పట్టనముం, దశాస్యుఁడును ♦ బ్రాణులు పాపఫలంబుఁ బుణ్యమున్
నెట్టన పొందు చుండఁగఁ గ♦నెం బురబాహ్యతలంబులం దొగిన్. ౪౧౭

సీ. శమనానుచరయుక్త♦సైనికులను జూచె, ఘోరరూపుల మహా♦క్రూరమతులఁ
గట్టంగఁబడువారిఁ ♦ గొట్టంగఁబడువారి, నయ్యొ యయ్యో యని ♦ యఱచువారి
బాధ తాళఁగలేక ♦ పలవించువారిని, బురుగులు దొలువంగఁ ♦ బొగులువారి
బెడిదంపుఁగుక్కలు ♦ పీఁకఁ గండలు నోట, హా హా యటంచును ♦ నఱచువారి

ఆ. వినిన గుండె లగల ♦ విలపించువారిని, రక్తవారి వైత♦రణిని లాగఁ
బడెడివారి మఱియుఁ♦బడ వైచి మండెడు, నినుక వేఁపఁబడఁగ ♦ నేడ్చువారి.

కం. అసిపత్రవనాంతరమునఁ, గసి మసఁగంబడునధర్మ♦కారుల నీరం
బొసఁగరె యని పెను డప్పిని, గసమసపడువారిఁ గాంచెఁ ♦ గష్టాత్మకులన్. ౪౨౦

సీ. ఆఁకటి పెల్లున ♦ నటమటించెడివారి, ఘోరరౌరవమునఁ ♦ గూయువారి
నుప్పుటేఱులలోన ♦ నుమ్మలించెడివారి, మంగలికత్తుల ♦ మలయువారిఁ

బీనుఁగులట్టు లై ♦ వెలవెల్లనగువారి, బక్కచిక్కినవారి ♦ స్రుక్కువారి
విరిసినవెండ్రుకల్ ♦ వ్రేలాడువారిని, నేఁడ్చి స్రుక్కుచుఁ బరు♦విడెడువారి
తే. మన్ను బురదయు మెయి నిండి ♦ యున్నవారి, వన్నె మాజినవారిని♦బంక్తిగళుఁడు
వందలుగ వేలుగను దన♦వచ్చుత్రోవఁ, బ్రేతసంఘంబులనుగాంచి ♦ వేఱుచోట.
కం. సంగీతవాద్యనిస్వన, భంగుల వీనులకు విందు ♦ పచరించుచు ము
త్సంగతి స్వసుకృతఫలము ల, భంగంబుగ ననుభవించు♦వారలఁ గనియెన్. ౪౨౨
సీ. ఆవులదానంబు ♦ నాచరించినవారు, గోరసంబులు ద్రావి ♦ కోలలు చుంట
అన్నదాతలు రుచి♦రాన్నంబులను మెక్కి, యామోదమున నడ♦యాడు చుంట
గృహదాత లగువారు ♦ మహితగృహంబుల, సంతోషయుక్తు లై ♦ సౌఖ్యపడుట
హాటకమణిమౌక్తి♦కాభరణోజ్జ్వల, సుందరీతతితోడఁ ♦ గొంద ఱుంట
తే. వారు వార లొనర్చిన♦పరమపుణ్య, ఫలముఁగోలఁదిని ధార్మిక♦వరులు కొంద
ఱమల మగుస్వీయదివ్య తే♦జమున వెలుఁగ, వారి నెల్లరఁ గనుఁగొని♦పంక్తిముఖుఁడు.
కం. తమ తమ దుష్కృతములకుఁ, శమనభటుల్ బాధపఱుప ♦ సంకట పడు ప్రే
తముల బలాత్కారంబుగ, నమితబలుఁడు విడిచి పుచ్చె ♦ హాయిఁ జరింపన్.

యమభటులు రావణుతోఁ బోరుట.

ఆ. అప్రతర్కిత మవిచింత్య ♦ మైనభంగి, జీవు లిట్లు ముహూర్తంబు ♦ చెంద సుఖము
ప్రేతరక్షకు లాదశ♦గ్రీవుఁ గినుక, రేఁగి తాఁకిరి మూఁకలు ♦ మూఁగి సరగ.
కం. హాలహాలరవములఁ గోలా, హల ముదయింపంగ దెసల ♦ నన్నిట యముయో
ధులు గూడి యుద్ధమునకుఁ, వెలియనిజడివానపోలె ♦ వివిధాయుధముల్ ౪౨౬
కం. పరిఘములు ప్రాసములు తో, మరశక్తులు ముసలములును ♦ మహితబలాఢ్యుల్
సురవైరివిమానముపైఁ, గురిసిరి యెడతెఱపి లేక ♦ కోటికొలందుల్. ౪౨౭
కం. వారలు మధుకరములవలెఁ, దోరణములు హర్మ్యములును ♦ దోరపువేదుల్
మూఁకతమునఁ బుష్పకమున, వారక ఛేదించి రసుర♦వర్గము బెగడన్. ౪౨౮
తే. దేవనిర్మాణభూత మై ♦ తేజరిల్లు
నవ్విమానంబు బ్రహ్మమా♦హాత్మ్యమునను
బూర్వవిధమునఁ బూర్ణ మై ♦ పొలుపు దాల్చె
భాస్కరాత్మజభటులచే ♦ భగ్నపడియు. ౪౨౯
ఉ. ఆమహితాత్ముశూరులు స♦హస్రములుఁ శతముల్ మహోగ్రసం
గ్రామ మొనర్ప వృక్షముల ♦ గ్రావములఁ మఱి ప్రాసనంతతిఁ
స్తోమముగాఁగ వైచుచును ♦ దోర్బలధుర్యులు రాక్షసుల్ యథా
కామముగా యథాబలము ♦ గర్వ మెలర్పఁగఁ బోరి రుగ్రు లై. ౪౩౦

సీ. నిఖిలాయుధావళి ♦ నిహతసర్వాంగు లై, నెత్తుట జొత్తిల్లి ♦ నెఱి దొఱంగి
రావణుమంత్రులు ♦ రణ మొనరింపఁగ, వైవస్వతామాత్య♦వరులు గెరలి
వారల నొప్పించి ♦ బడలించి యటఁ బోయి, పంక్తికంఠుని శూల♦వర్షమునను
నొడలెల్లఁ జిల్లులు ♦ పడ మోఁద శోణిత,దిగ్ధాంగుఁడై వాఁడు ♦ తేజరిల్లె
ఆ. బుష్పకాంతరమున ♦ ఫుల్లకింశుకమున, కుద్ది యగుచు నాతఁ ♦ డుగ్రశక్తి
నస్త్రబలముఁ జేసి ♦ యశ్మతోమరగదా,శక్తిశూలవృక్ష♦సాయకముల ౪౩౧

చం. పరఁగఁగ జేయ నయ్యవియు ♦ వర్షముపోలిక శ్రాద్ధదేవుకిం
కరులపయిన్ పడిం గురియఁ ♦ గాలభటాగ్రణులుం దదీయభీ
కరశరవర్ష మాఁపుచును ♦ గ్రాసముపై బలుమబ్బులట్టు లా
సురపతిమీఁద వ్రాలి శిత♦శూలపరశ్వధహేతిహేతులన్. ౪౩౨

ఉ. ఊపిరి యాడకుండఁ గడు♦నుగ్రత సం దొకయింత యీక యా
పాపచరిత్రుఁ జైపయిని ♦ బాఁదఁ దదాహతిముక్తవర్ముఁ డై
యాపగవోలెఁ గాఱురుధి♦రాంబులఁ దోఁగి సమన్యుచిత్తుఁడై
యాపలలాశినేత సుర♦యానము వీడి ధరన్ నిలంబడెన్. ౪౩౩

రావణుఁడు పాశుపతాస్త్రంబున యమకింకరుల దహించుట.

చం. నిలఁబడి చాపబాణముల ♦ నిష్ఠురుఁ డై కొని లబ్ధసంజ్ఞుఁ డై
ప్రళయకృతాంతునట్టు లయి ♦ పాశుపతాస్త్రముఁ గూర్చి మార్వికిన్
నిలు నిలుఁ డంచు నార్చి మును ♦ నీలగళుండు పురత్రయంబుపైఁ
బెలుచన వైచినట్లు దృఢ♦విక్రముఁ డై చెవి సోఁక నీడ్చుచున్ ౪౩౪

ఉ. వైవ విధూమవహ్నివలె ♦ భర్గునియస్త్రము భూతకోటితోఁ
దావకృపీటజాతుఁడు ని♦దాఘము వేళను శుష్క మానర
ణ్యావళి నేర్చునట్టులు ద్రు♦మాళుల గుల్మములన్ దహించుచున్
వే విలయంబుఁ గూర్చె యమ♦వీరభటాళికి జ్వాలమాలియై. ౪౩౫

తే. కారుచిచ్చునఁ గాలిన♦స్థూరుహంబు,లట్లు కాలునిసైన్యముల్ ♦ హతము గాఁగ
సచివయుక్తుండు రాక్షస♦సత్తముండు, పుడమి వడఁకాడ గర్జలఁ ♦ బొరి ఘటించె.

యముఁడు రావణుతో యుద్ధమునకై వెడలుట.

సీ. ఆమహానాదంబు ♦ నాలించి యముఁడు ని,జవ్యూహయోధుల ♦ సంక్షయంబుఁ
బగతునివిజయంబు ♦ భావించి క్రోధసం,రక్తనేత్రముల సా♦రథిని గాంచి
తెమ్ము తే రన వాఁడు ♦ నిమ్ముగా సమకూర్చి, తెచ్చిన నది యెక్కెఁ ♦ దీవ్రగతిని
నవ్యయం బగుభువ♦నావళి దేనిచే, హరియింపఁ బడుచుండు ♦ నట్టిమృత్యు
ఆ. వతని మున్ను నిలిచె ♦ హస్తంబునను బాశ, ముద్గరములఁ దాల్చి ♦ మూర్తిమంత
మగుచుఁ గాలదండ ♦ మనుయమసాధనం,బతనిప్రక్క నిలిచె ♦ నగ్నిదీప్తి. ౪౩౬

తే. కాలపాశంబు లతనిప్ర♦క్కల రహించె, ముద్గరము వహ్నితుల్యమా♦మూర్తిఁదాల్చి
యతని సేవించె లోకంబు ♦ హాపళించె, సర్వలోకభయావహా ♦ శమనుఁ జూచి.

ఉ. సారథిచోదితంబు లయి ♦ స్యందనఘోటకముల్ మనోజవో
దారము లేగి యాహరిహ♦యంబులభంగి, రణంబు చెల్లు త
ద్ధారిణిఁ జేర మూర్ధమునఁ ♦ దద్రథముం గని మృత్యుయుక్తముల్
ఘోరవికారరూపమును ♦ గుండెలు వ్రీల దశాస్యమంతురుల్. ౪౩౯

కం. మనమా యీతనిఁ దొడరఁగ, మనుమార్గము కల్ల యనుచు ♦ మదమటి సత్త్వం
బును లేమి భయార్దితు లై, చనిరి మదులు నుడివడంగ ♦ సహాసోత్థితు లై. ౪౪౦

## ⟵ యమరావణ యుద్ధము. ⟶

ఉ. అట్టిభయానకాకృతి మ♦హారథముం గని పంక్తికంఠుఁడుల్
దొట్టనిభీతి నెట్టెదుటఁ ♦ దొట్రిలకుండినఁ దోమరాదులన్
నెట్టనవర్షముం బఱపె ♦ నేర్పునఁ గాలుఁడు వానిమీఁద వాఁ
డిట్టల మైనధీరతఁ బ♦రేతపుతేరిపయిన్ శరావళిన్ ౪౪౧

ఉ. అంబుధరంబురీతిఁ గురి♦యన్ యముఁడున్ విబుధారిపై న్విశా
లం బగుటొమ్ము శక్తులఁ గ♦లంబకపంక్తుల వ్రచ్చినన్ మహా
డంబర మూని నొచ్చియుఁ గ♦డంకను బోరుచు మాఱు సేయ లే
కంబరచారివైరి పెనఁ♦గాడెను రాతురు లేడు మాని యై. ౪౪౨

కం. నానాప్రహరణనిహతుల, నానారీతులను నొచ్చి ♦ నరభక్షకుఁడున్
హీనస్మృతి యై విముఖుం, డై నెఱిదొఱఁగియు జయంబు♦నందలియాశన్ ౪౪౩

కం. వెండియుఁ దాఁకె దండధరు ♦ వీరవరేణ్యులు గెల్వఁగోరి యు
ద్దండపరాక్రమంబునను ♦ దాఱక మాఱుమొగంబు గాక దో
శ్చండత భండనం బిటులు ♦ సల్పఁగ మింట మహర్షులున్ మరు
త్కాండము వచ్చి నిల్చెను వి♦ధాతృఁడు మున్నుగఁ బోరు చూడఁగన్. ౪౪౪

కం. సమవర్తికి దశముఖునకు, సమరము వర్తిల్లె నపుడు ♦ జగములకెల్లన్
సమయుట లభియించెనొ నాఁ, దమిచరుఁ డవ్వేళ వజ్ర♦ధరుదంభోళిన్ ౪౪౫

కం. తలఁపించు చాపదండం, బలఘుధ్వను లీన శరచ♦యంబులచే దో
తలము నిరంతర మొనరిచి, యలుకన్ మృత్యువును నాలు♦గంబకములచేన్.

కం. సూతుని శరసప్తకమునఁ, బ్రేతపతిన్ నూఱువేల♦యిషువుల నేయన్
జాతరుషావేగసము, త్సీతుం డగుయమునివదన♦వివరము వెంటన్. ౪౪౭

కం. జ్వాలామాలాభీలవి, శాలవిభావసుఁడు ధూమ♦సహితుం డగుచున్
గాలుని నిశ్వాసముతోఁ, బోలం జనియించి వెడలె ♦ భువనము వణఁకన్. ౪౪౮

తే. ఆమహైశ్వర్యమును గాంచి ♦ యమరదాన
వాళిసన్నిధి మృత్యువు ♦ కాల మధిక
హర్షమును రోషమును గూరె ♦ నపుడు క్రుద్ధ
తరము మృత్యువు భాషించు ♦ దండధరుని. ౫౫౯

కం. అంపుము నన్నిపు డీవు ని,లింపవిరోధిని వధింతు ♦ లీలగను స్వభా
వంపుదృఢశక్తి నా కిది, తెంపరి పాపాత్ముఁ డితఁడె ♦ దీకొను నిన్నున్. ౫౬౦

సీ. హేమకశిపుఁడును ♦ ధూమకేతుండును, శంబర నముచి వి♦సంధిబలులు
శంభుఁడన్ దైత్యరా♦జన్యుండు బాణుండు, శాస్త్రసంవిదులు రా♦జర్షి వరులు
దైత్యయక్షాహిగం♦ధర్వాప్సరోజనుల్, ఋషులును లోనగు♦నెల్లవారు
సద్రుమ సార్ణవ ♦ సగ్రావ సావగా,వనిచక్రమెల్ల సం♦వర్త వేళ

తే. మఱి దురాసదవిక్రమ♦మహితులెల్ల, వార్పై నాదుచూపులు ♦ వ్రాలినంత
సమసిపోవరె యీనిశా♦చారి యెంత, పంపుమీనన్ను దేవ! శు♦భంబుఁ గూర్తు.

కం. ఎంతబలవంతుఁ డేనియు, నంతక! నాదృష్టి సోఁక ♦ నవనిని మనఁగా
నంతస్వతంత్రుఁ డె? ధర్మ,స్వాంతా! నను విడుము వీని♦పాటుం గనుమీ. ౫౬౨

తే. దేవ! నాశక్తి గాదు స్వ♦భావముగనె, కలిగె నాకట్టిబలము నా♦కన్నుఁగవకుఁ
గాన వచ్చినవాఁ డొక♦గడియ యైన,బ్రదుకఁజాలఁడు నిక్కంబు ♦ శ్రాద్ధదేవ!

## యముఁడు రావణుపై యమదండము వైవఁ బూనుట.

చం. అనవుడు ధర్మరాజు నిలు♦మా వధియించెద వీని నంచుఁ బె
న్గినుక నమోఘభీతికర♦నిష్ఠురదండముఁ గేలఁ బూనె నా
తనికెలనన్ సమీరసఖ♦దారుణముద్గర మూర్తరూప మై
దనరెను గాలపాశములు ♦ దద్దయు నాల్కలు గ్రోయుచుండఁగన్. ౫౬౪

తే. దర్శనముచేతఁ బ్రాణిక♦దంబకంబు, ప్రాణము వెలార్చు నది ప్రేత♦రాజు కేలఁ
బూని వెసఁ ద్రిప్పి వైవఁగఁ ♦ బూని నంతఁ, బలుకనేటికి దానిరూ♦పంబురీతి.

కం. జ్వాలలఁ బరివృత మై యవ,లీలగ రాక్షసునిఁ దునుము♦లీలలతో నా
భీలమ్ముగ బలవంతుని, కేల మహాసాధనంబు ♦ కెరలం గనుచున్. ౫౬౬

కం. అందఱు రణతలము న్విడి, చిందఱవందఱగఁ బాఱఁ ♦ జేడ్పడి మింటన్
బృందారకు లుద్యద్దం,డుం దరణిజుఁ గాంచి కలఁక ♦ నూల్కొని రెదలన్. ౫౬౭

## దండము వైవ వల దని బ్రహ్మ యముని వారించుట.

కం. రావణునిమీఁద దండము, వైవఁగఁ దమకింప యముఁడు ♦ వారిజభవుఁ డా
వైవస్వతుముంగలఁ దా, నే విస విస వచ్చి నిలిచి ♦ యిట్లు వచించెన్. ౫౬౮

మ. శమనా! తాళుము తాళు చంపకుము ర♦క్షశ్శ్రేష్ఠునిన్ నీదుదం
డమునన్, నే వర మిచ్చినాఁడను నిశా♦టస్వామి చావుండఁ గా
న మదీయోక్తి ససత్యముం జలుప కో♦నా నీకు? నెవ్వండు దే
వమనుష్యాదులఁ బొల్లు సేసినను మ♦ద్వాక్యంబు నయ్యాతఁడున్ ౮౫౯

కం. అనృతంబుగ ముజ్జగములఁ, బొనరించినవాఁడ యగును ♦ బుధసత్తమ కా
వున విడువకుమీ దండము, ననుఁ గల్లరిఁ జేయ నీమ♦నంబున లేదేన్. ౮౬౦

చం. జయ మెదఁ గోరి కోపమువ♦శంబున వైచితి వేని దండమున్
బ్రియుఁడును నప్రియుం డనెడి♦భేదము నెంచక లోకపాళికిన్
భయ మొదవించుచున్ దునుముఁ ♦ బ్రాణుల నెల్లను, నేన దాని దు
ర్జయము నమోఘ మై నఱలఁ ♦ జల్పితి మృత్యుపురస్కృతంబుగన్. ౮౬౧

ఉ. నీ విపు డీనిశాటుపయి ♦ నిష్ఠురదండము వైచి తేనియున్
జావక వీఁడు మూర్తమును ♦ జాలఁడు ప్రాణముతోడ నుండఁగాఁ
జావక యుండెనేనియును ♦ జచ్చిన యేని యసత్య మై చనున్
నావచనంబు రెంట శమ♦నా! నను సత్యవచస్కుఁ జేయుమా. ౮౬౨

కం. విడువకుమీ దశముఖుపైఁ, బెడిదపుదండం బటన్న ♦ విని ధర్ముండున్
విడుచుట మానితి దండము, నొడయండవు మాకు నీదు♦సూక్తులె యొజ్జల్.

చం. వరములు గొంట వీఁ డిపు డ♦వధ్యుఁ డటంటివి యుద్ధసీమ నో
సరసిజసంభవా! నిలుపఁ ♦ జాలుదు నెయ్యది నిల్చి? కాన నా
శరవరుదృష్టిలో నిలువ♦ సమ్మతి లే దని సాళ్వశస్త్రుఁ డై
యరదముతోడ మాయ మయి ♦ యంతకుఁ డేగినఁ బంక్తికంఠుఁడున్ ౮౬౩

కం. గెలిచితి యముని నటంచుం, బలుకుచు బీరంబు తనవి♦మానముపైఁ బే
రెలమిని నారోహించెను, నలకాలునిపురము విడిచి ♦ యరిగెను స్వేచ్ఛన్. ౮౬౪

కం. సమవర్తియు హృష్టుం డై, యమరజ్యేష్ఠాన్వితముగ ♦ నరిగెం దివికిన్
సుమనోముని నారదుతో, సమరవిధం బెంచికొనుచు ♦ స్వాంతమునందున్.

రావణుఁడు నివాతకవచులతో సంధి సేసికొనుట.

సీ. దశకంఠుఁ డనిలోన ♦ ధర్మరాజును గెల్చి, తనసహాయులఁ జూడఁ ♦ దడయ కేగ
సాయకసంఘాత♦జర్జరీకృతదేహు, రక్తసిక్తాంగుని ♦ రాక్షసేంద్రు
విస్మయపరు లయి ♦ వీక్షించి జయ జయ, వాక్కులఁ బొగడిరి ♦ వారలెల్ల
మారీచుఁ డాదిగా ♦ వారల నందఱ, నలరించి పుష్పకం ♦ బెలసి యసుర

తే. నురగదైత్యగణాధ్యుష్ట♦వరుణరక్షి, తాబ్ధి వాసుకిపాలిత ♦ మైనభోగ
వతిని గనుఁగొని నాగుల♦భంగపఱిచి, మణిమయాఖ్యపురిం జేరె ♦ రణముఁ గోరి

ఆ. పంక్తికంఠుఁ డనికి ♦ వచ్చుట యాలించి, ప్రస్తనరులు నొని ♦ వాతకవచు
 ల నెడిదైత్యవర్యు ♦ లాహవకాంక్షను, వెడలి తాఁకి రోలిఁ ♦ గడిమి మెఱసి. ౮౧౮

కం. దైతేయులకును రక్షో, వ్రాతంబున కయ్యె భీక ♦ రం బగునభిసం
 పాతంబు శూలశరపరి, ఘాతనపట్టసకుఠార ♦ కరవాలములన్. ౮౧౯

కం. ఒండొరులను భేదించుచు, భండన మొకయేఁడు సాగ ♦ వారలలోనన్
 రెండు వడద యేపక్షము, గండున విజయంబు నెదియుఁ ♦ గానద యంతన్. ౮౨౦

చం. ద్రుతగతి దేవయానమునఁ ♦ దోయజసంభవుఁ డేగుదెంచి యా
 దితిజులఁ బోరు నిల్పఁగ వి ♦ ధించి వచించెను దైత్యులార! నా
 మతిఁ జనుఁ డీరు రావణుఁడు ♦ మద్వరలాభముఁ జేసి దేవతా
 తతులకు దానవాళులకుఁ ♦ దథ్య మజయ్యుఁడు మీవిధంబునన్. ౮౨౧

కం. కావున మీలో మీకే, లా వల వనిపోరు మీర ♦ లందఱు నొరిమన్
 జేవ నెసంగుఁడు నెయ్యుర, వేవస్తువు లైనభోజ్య ♦ మితరేతరమున్. ౮౨౨

ఆ. అట్టిఫలము గలుగు ♦ నైకమత్యంబున, ననుచు నేగ దశము ♦ ఖానుఁ డంత
 వహ్నిసాక్షికముగ ♦ వారితో స్నేహంబు, సలిపి ప్రీతుఁ డగుచు ♦ సంతసమున

చం. తనపురియందుఁబోలె నమి ♦ తప్రియసౌఖ్యము లాపురంబునం
 దనవి సనంగ నొందుచును ♦ దా నొకయేఁడు వసించి వారిచే
 దనుజులమాయలం దొకశ ♦ తంబును నేరిచి కంధిరాజుప
 ట్టనము రసాతలంబున దృ ♦ ఢం బగుయత్నముతోడ రోయుచున్. ౮౨౪

## రావణుఁడు కాలకేయుల జయించుట.

సీ. కాలకేయగణంబు ♦ లేలెడునశ్మన, గరమును గనుఁగొని ♦ కలహమునకు
 వారలఁ బిల్చి దు ♦ ర్వారబలాఢ్యుల, వధియించెఁ బెక్కుర ♦ బలము పేర్మి
 శూర్పణఖాభర్త ♦ శూరుని మఱఁదిని, దనవారి గ్రింగెడి ♦ దనుజవర్యు
 బలియు విద్యుజ్జిహ్వుఁ ♦ బటుశక్తిఁ దరవారి, ఖండించి శీర్ష మా ♦ క్షణమునంద
తే. నాల్గునూఱులదైత్యుల ♦ నామ మణఁచి, జయముఁ జేకొని పాండుర ♦ జలధరాభ
 మగుచుఁ గైలాసశైలంబు ♦ నగెడిదానిఁ, బూర్ణచంద్రప్రభాయుక్తిఁ ♦ బొలుచుదాని

## రావణుఁడు వరుణనగరంబు పైఁ బోవుట.

తే. వరుణపట్టనముం గాంచి ♦ పాలధారఁ, గార్చుసురభిని నయ్యెడఁ ♦ గాంచె నసుర
 వర్యుఁ డాయావ తనపాల ♦ వఱలఁ జేసె, రామ! యుదధిని క్షీరోద ♦ నామకంబు.
ఆ. అందు వృషభేంద్రునంబయు ♦ హరిశీత, కరుని యుత్పత్తిహేతువై ♦ క్రాలుదాని
 నురువుద్రావియు జీవించు ♦ నుత్తమర్షి, వితతులకు జీవగఱ్ఱయై ♦ వెలయుదాని. ౮౨౫

తే. దేవతాళికి సుధ పిత్రు•దేవతలకు, స్వధయు నొసఁగెడిదానిని • జనములెల్ల
సురభి యని పిల్చుదానిని • బరమచిత్ర,మైనదానినిగని పల•లాశనుండు ౪౭౮

చం.వలగొని మ్రొక్కి యేగి బల•వర్గముచే బహుధానురక్షితం
బలఘుశరద్ఘనాభము భ•యంకరమున్ జలపూరకీర్ణమున్
లలితము నిత్యహృష్టము జ•లప్రభుగేహవరంబుఁ జూచి కా
వలిభటులన్ వధించి బల•వర్గముచేతను దాడికాంగుఁ డై. ౪౭౯

ఉ. యోధులతోడ నిట్టు లను • యుద్ధము సేయఁగఁ గోరి వచ్చె దు
స్సాధపరాక్రముండు సుర•శాత్రవుఁ డౌదశకంఠుఁ డంచు మీ
రేధితవేగ మేగి వచి•యింపుఁడు తేనికిఁ, బోర సాహసో
త్సేధము లేక యేనియును • జేతులు మోడ్చి జితోస్మి యం చనన్ ౪౮౦

వరుణతనయులు రావణుతోఁ బోరి యోడిపోవుట.

కం.చని యెద నని వచియింపుం,డని రావణుఁ డాడు చుండ • నాలోఁ గినుకన్
వననిధినాయకుమనుమలు, తనయులు గోపుష్కరాఖ్య•దళపతియుతు లై. ౪౮౧

చం.బలధృతివిక్రమాన్వితులు • వారియనీకిను లెల్లఁ గొల్వఁగాఁ
జలమునఁ గామగంబు లగు•స్యందనపాళుల నెక్కి పోరికిన్
వెలువడివచ్చి రంత భృశ•భీతిదసంఖ్యము చెల్లె రెండువాఁ
గులభటకోటి కం దసుర•కుంజరసాధనమర్దితంబు లై ౪౮౨

ఉ. వారుణసైన్యముల్ చెడిన • వారుణు లాత్మచమూవిధంబుఁ గ్రూ
రారియుఁ బుష్పకంబున న•భోంతరవీథిని నుంటఁ గాంచి దు
ర్వారరయోత్థితంబు లగు•భాస్వరభీమశతాంగపాళితో
వీరులు మింటికై యెగసి • వ్రేసిరి రావణు నారసంబులన్. ౪౮౩

కం.పావకసన్నిభశరముల, రావణు విముఖునిఁగఁ జేసి • రంజిలి వివిధా
రావంబుల నించిన తమ,భూవిభుదుస్థితియు వరుణ•పుత్రులయుదుటున్. ౪౮౪

చం.కనుచు మహోదరుండు రణ•కాంక్షను మృత్యుభయంబు వీడి చ
య్యన గదఁ గేలఁ బూని యెదు • రై చని వారల ఘోటకాళి స్యం
దనముల నేలఁ గూల్చినను • దద్వరుణాత్మజు లుర్విఁ గూల స్యం
దనరహితారులం గని ము•ఖంబున నార్భటి నించె నాతఁడున్. ౪౮౫

కం.హతతురగస్యందను లై, క్షితి దొరఁగియు వరుణసుతులు • స్వీయమహిమచే
వెత గూర కెగసి మింటికిఁ, గృతహస్తు లధిజ్యచాప•భృతిభీషణు లై. ౪౮౬

చం. ఉరుతరబాణవృష్టిని మ♦హోదరు దారితగాత్రుఁ జేసి భా
స్వరపరమాయుధంబులను ♦ శైలము నబ్ధము గప్పురీతి నా
శరపతిఁ గప్ప రావణుఁడు ♦ జాజ్వలదుగ్రలయాగ్నితుల్యుఁ డై
శరముల వారిమర్మములఁ ♦ జక్కడిచెఁ నిపుణత్వ మేర్పడన్. ౪౮౭

చం. ముసలవిచిత్రభల్లశత♦ముల్ శితతోమరశక్తికుంతప
ట్టిసములు భీషణంబులు ప♦టిష్ఠము లైసశతఘ్నిసంతతుల్
కసరున నొక్కరీతి నవి♦కారిత దొప్పలు దోర లేయఁగా
నసలున పొప్పిపోయనగ♦జావళి మున్గినరీతి వారలున్ ౪౮౮

చం. ఇలఁ బడి లేవ లేక తపి♦యింపఁగ వారలఁ జూచి రావణుం
డెలమి మహాంబుదం బనఁగ ♦ నేర్చి ధ్వనించి యనేక సాధనం
బుల దళితాంగులం జలుపఁ ♦ బోరు దొఱంగి స్వకీయు లెత్తికొం
చలఘుగతిం జనంగ నిల♦యాళికి, వారలతో దశాస్యుఁడున్ ౪౮౯

కం. నారాక ప్రచేతసునకు, మీ రెఱిఁగింపుఁడ యనం ద♦మీచరవిభుతో
వారుణుఁ డైనప్రభాసుం, డోరాజా! లేఁడు వీట ♦ నుదధీశుండున్ ౪౯౦

తే. ధాతృలోకంబునందు గాం♦ధర్వ మొలయ, నాలకింపఁగ నరిగినాఁ ♦ డయ్య పాశి
రాజు లేనప్పు డీవృథా♦శ్రమము తగునె? జితులు నీచేత నాతని♦సుతులు వీరు.

చం. అనవుడు గెల్చె రావణుఁ డ♦టంచును జాటఁగఁబంచి హృష్టుఁ డై
ఘనగళనాదముల్ నినిచి ♦ క్రచ్చఱఁ దత్పురి వీడి తాను వ
చ్చినసరణిఁ విమానమున ♦ శీఘ్రము లంకకుఁ బోవు చుండెఁ జు
ట్టును సచివాళి గొల్చుచుఁ గ♦డుం గడుఁ బ్రస్తుతి సల్పు చుండఁగన్. ౪౯౨

## రావణుఁడు నానాస్త్రీలఁ జెఱపట్టుట.

చం. చనుచును రావణుండు బల♦సంపద పొంపిరి వోవుచుండఁ గ్రొ
వ్వునఁ దనమార్గమందు నృప♦పుష్కరనేత్రల మానికన్యలన్
దనుజకులాంగనామణుల ♦ దైవతకాంతల వీరు వా రటం
చన కగపడ్డసుందరుల♦యావతిముం గులకన్యకాతతిన్ ౪౯౩

చం. బలిమిని ముట్టి యడ్డపడు♦బంధువులం బడఁగొట్టి కేలుఁ గొ
ప్పులు బిగఁబట్టి యచ్చెలులు ♦ బ్రుయ్యఁగఁ దిట్టఁగ మొత్తుకోఁగ నీ
డ్గిలఁబడ నీడ్చి కొం చరిగి ♦ పెక్కువపెక్కువఁ బుష్పకంబునన్
దలరక పాప మంచనక ♦ దానవుఁ డందఱ నుంచె మోహి యై. ౪౯౪

కం. ఈనెఱిఁ బన్నగకన్యల, మానవభామలను నసుర♦మానినులన్ ర
క్షోనారుల యక్షసతుల, దానవయోషల విమాన♦తలముం జేర్చెన్. ౪౯౫

సీ. వారలు శోకాగ్ని♦భయసంభవంబు లౌ, బాష్పంబులను వహ్ని♦భాస్వరములఁ
గార్చిరి వారల♦కన్నీరు మున్నీటి, నేళ్లనాఁ బుష్పకం♦బెల్ల నించె
నిడువెండ్రుకలచెలు♦లుడురాజవదనలు, పీనపయోధరల్♦వేదిమధ్య
లతిహృద్యగాత్రలు♦హాటకవర్ణలు, రథకూబరకటుల్♦ప్రాయవతులు
తే. కన్యలును స్త్రీలు దేవతా♦కాంతలట్టి, వారు శోకంబు దుఃఖంబు♦భయము పేర్మి
విహ్వలార్తిక లై వెల♦వెల్లఁ బాఱి, దీన లై తపియించిరి♦దిక్కు లేక. ౯౬

కం. వారలయూరుపుగాడు ప, వారిగ సందీప్త మగుచుఁ♦బర్వ నలుగడల్
ఘోరజ్వలనజ్వాలా, పూరితకుండం బనంగఁ♦బుష్పక మొప్పెన్. ౯౭

కం. దశకంఠాసురపతికిన్, వశపడి యాశ్యామలెల్ల♦వనిఁ గేసరికిన్
వశపడినకరిణులట్లు వి, వశ లై దీనంబు లైన♦వదనాత్ములతోన్. ౯౮

చెఱఁబడిన స్త్రీలు విలపించుట.

ఉ. అక్కట! నన్ను నీయసురుఁ♦డాగ్రహ మెత్తి భుజించు నేమొ యం
చొక్కతె యేడ్వ నీఖలజ♦నోత్కరశేఖరుఁ డయ్యొ నన్నుఁ దా
ముక్కలు సేయునో యనుచు♦మొత్తలు వెట్టఁగఁ దోడఁబుట్టులన్
మక్కువప్రాణవల్లభుల♦మాతలఁ దండ్రుల నెంచఁ గొందఱున్. ౯౯

చం. *అనయముఁ గూర్మి మీఱఁ దన♦ప్రాణము నెత్తుగ బుజ్జగించుచున్
ననుఁ గులదీపమా! యని గు♦ణప్రతిమా! యని మెచ్చిపిల్చు నో
జనకుఁడ! యిప్పు డెట్లుయితొ♦సంకట మెట్లు సహింతొ? కూఁతు ర
య్యును సుతునట్టి దంచుఁ గడు♦నుబ్బుదు వేగతిఁబట్టినాఁడవో! ౧౦౦

ఉ. *ఒక్కతె నాకుఁ గూఁతురు గు♦ణోదధి రూపసి యర్హకాంతుతో
మక్కువఁ గూర్చువాఁడ నని♦మానుగఁ జేసితి పెండ్లియత్నమున్
దిక్కఱినట్లు కర్కశమ♦తిన్ హరియించెను రక్కసుండు న,
న్నక్కరణిన్ సహింతువొ గ♦దే యిఁకఁ దండ్రి! దురంతతాపమున్. ౧౦౧

సీ. *కన్నతల్లీ నన్ను♦గర్భంబునను మోచి, పడరానిపాటులు♦పడుటలెల్లఁ
గంటవత్తిడికొని♦కంటికి ఱెప్పనా, నను సాఁకి పెంచిన♦యనువు లెల్లఁ
దెలిసి తెలియక నేను♦జలిపినదోషముల్, క్షమియించి బుద్ధులు♦గఱపులెల్లఁ
గులము శీలంబును♦గుణము యోగ్యతయును, నలవరింపఁగ నీతు♦లాడులెల్ల
తే. నడుగు లిలమీఁద నుంచిన♦నఱిగిపోదు, నంచు నఱచేత నిడి పెంచు♦నవఘులెల్లఁ
దుదకు వ్యర్థంబు లైపోయె♦దుష్టుఁ డైన, కఱకుటసురకు నేఁ జిక్కి♦గాసిపడుట

ఉ. *ఆటల కేను బోవఁ ద్రుటి♦యైనను గానక యున్ననత్తు వే
మాటికి మాటికిన్ వెదక♦మక్కువఁ గూర్చుదు వాలకింప నా

మాటలు తేనెమూట లని ♦ మాత ♦ యిఁ కెవ్వరిపల్కు విందు వే
పాటిగఁ గూఁతురా యనుచు ♦ వా విడి యెంతగ నేడ్తొ తల్లిరో!. ౫౦౩

చం. *కటకట! యెంతదుర్దినమొ ♦ గాడ్పడి పోయెఁ గులంబు మానముం
బటుతరసద్వ్రతంబు, సరి♦వారలలో నగుఁబాటు కూరె, నీ
కుటిలచరిత్రురాయిడిని ♦ గూర్చితిఁ దండ్రికిఁ బ్రాణభర్తకుం
స్ఫుటముగ హీనభాగ్య నయి ♦ భూమిపయిం దలవంపు లయ్యయో. ౫౦౪

ఉ. *మానిని నీవు నాథ! యవ♦మానము గూరెను మన్నిమిత్త మై
యే నెటి సైఁచెదో? వ్యసన ♦ మేగతి నాఁగెదొ? యెట్టు లయ్యెదో?
దానవుచేతఁ జిక్కి యిటు ♦ తత్తఱ లాడుచు నున్నదాన నీ
యానన మెట్లు నేఁ గనఁగ ♦ నౌనొ కదే హృదయేశ వల్లభా! ౫౦౫

కం. *మనమున నెంతటిశోకము, పెనఁగొను చున్నను మదాస్య♦బింబముఁ గనినం
వనటెల్లఁ దొలఁగ నలరెద, వనయము నింకెట్లు దుఃఖ ♦ మందెదొ నాథా! ౫౦౬

కం. *బాలా! యని నూతనశశి,ఫాలా! యని నన్ను నొంటి ♦ పాటున నేమే
మోలీలలఁ దేల్చెదు గద, బాళిం నీవెట్టు లాదొ ♦ ప్రాణేశ యిఁకన్. ౫౦౭

సీ. *అందఱిలోఁ బసి♦సందడి నే నుండ, మందునిగతి దవ్వు♦నంద యుండి
కార్యంబుపైఁ గేలు ♦ కడకన్ను నాపయి, నెం దెందొ యుంచుచు ♦ సందు వేచి
నర్మగర్భంపుస♦న్నలఁ జేసి నవ్వింతు, పెద్దలు గన్నను ♦ బిడియపడెదు
నీతమాతమాకును ♦ నే నవ్వ నది యేమి, యన్నవారికి బొంకు ♦ లాడు చుందు

ఆ. *నీకు నెలమిఁ గూర్ప ♦ నేఁ దఱిఁ గల్పించి, వచ్చి పోవుచుందుఁ ♦ బ్రాణనాథ!
నీదువలపుపెంపు ♦ నీదుకూరిమియింపు, నప్పు డెఱుఁగ నైతి ♦ ననద నైతి. ౫౦౮

కం. *వనపాళుల జలకేళుల, మనము చరింపంగ నాదు♦మనసుం దాఁకం
గనఁబఱిచి గుచ్ఛఫలతతు, లనియెడినర్మోక్తిఁ దలఁచి ♦ యడలెద నాథా! ౫౦౯

ఆ. *ఆఁడుబిడ్డ ననుచు ♦ నత్తగారింటికి, నేఁగుదానఁ గాని ♦ యింటనుండ
ననుచు మీరు నన్ను ♦ నధికమౌకూరిమి, నాదరింత్రు గాదె ♦ యన్నలార! ౫౧౦

ఉ. *అక్కట! యేయపూర్వపుఁబ♦దార్థము మీకు లభించె నేని యిం
పెక్కఁగ నేమిగైకొనక ♦ యింటికిఁ దెచ్చియుఁ జెల్లెలా! యటం
చక్క! యటంచుఁ బిల్చి చన♦వారఁగ మీర లొసంగు చుందురే
యెక్కృతిఁ దోడులార! తపి♦యింతుగొ నాగతి యిట్టు లౌటకున్. ౫౧౧

ఆ. *సతులతోడ మీరు ♦ సంసార మొనరింప, భర్తతోడ నేను ♦ వచ్చి యటకు
నాఁడుబిడ్డతనము ♦ నమరించుకొందుఁ గా, కనుచునుబ్బుదాన ♦ నన్నలార! ౫౧౨

ఆ. *చన్ను గుడుచు చున్న ♦ చిన్నారితొలిచూలు, నీడ్చి వైచి బిగ్గ ♦ యేడ్చు చుండ
నన్ను లాగి తెచ్చె ♦ నిన్నీచుఁ డయ్యయ్యొ, కన్నముద్దుబిడ్డ ♦ గతి యదేమొ. ౫౧౩

సీ. *నాకన్నబిడ్డకు ♦ నేకరుణావతి, చన్నిచ్చి జననియై ♦ సాఁకు నొక్కొ?
నో రెఱుంగనిబిడ్డ ♦ కేరామ దయ యుంచి, వేళకు నన్నంబుఁ ♦ బెట్టు నొక్కొ
మంచి చెడ్డ లెఱుఁగఁడు ♦ మూర్ఖ్యంబు మానఁడే, గతిఁబట్టునో కసు ♦ గందు నేఁడు
ఆటల మరగుచు ♦ నాఁకలి యెఱుఁగఁడు, పిలిచి యెవ్వ రొకింత ♦ పిడుచ నిడుదు
తే. రక్కటా! పుత్ర! నాయనా! ♦ హాకుమార!, యేలరా పుట్టితివి తండ్రి ♦ యిట్టిహీన
భాగ్యకడుపున నేగతి ♦ బ్రతుకఁగలవొ, తల్లిలేనట్టిబిడ్డవై ♦ తనయ కుట్ర. ౫౧౪

చం. *అలరుదుఁ జీర చిక్కనది ♦ యాదిగ ముద్దుఁగుమారుఁ గందు నా
లలితమనోజ్ఞ మూర్తిఁ గడు ♦ లాలనఁ జేయుదు ముద్దు లాడుదున్
గలకల నవ్వఁజేసి పని ♦ కారణ మంచును దండ్రిచేతికిన్
జెలువుగ నిచ్చి యానెపము ♦ చేఁ బతి హృష్టు నొనర్తు నం చెదన్. ౫౧౫

ఉ. *అన్న! కుమార! నిన్నుఁగడ ♦ పారఁగఁ గాంచుటె గాక బాల్యపుం
జిన్నెలొ వన్నెలొ కొమరుఁ ♦ జేఁతలొ తేనియ లొల్కుమాటలోఁ
జెన్నగునాటలోఁ గనఁగఁ ♦ జేయన పుణ్యము, పూర్వజన్మమం
దెన్నవలామిహీన్ సుతవి ♦ హీనను జేసితినో కుమారకా! ౫౧౬

చం. కటకట! పూర్వ మెంతటియ ♦ ఘంబుల నే నొనరించి యుంటినో
యిటు సహియింపరానిగతిఁ ♦ గృచ్ఛ్రమహాంబుధి మున్గఁ గల్గె, నిం
కెటు దరిఁ జేరుదాన నొకొ ♦ మృత్యువ! నీకు నమస్కరించెదం
దటుకునఁ గొంచుఁబొమ్ము వ్యస ♦ న త్రుటితాత్త్విక నన్నుఁ బుణ్యమా. ౫౧౭

ఆ. ఏల మనుజలోక ♦ మిన్ని సీ యింతకు, నధమ మొండు గలదె ♦ యర్కుఁ డుదయ
కాలమందుఁ జుక్క ♦ గమిరూపు మాపున, ట్లితఁడు చంపెఁ బతుల ♦ హీనబలుల.

శా. వ్యాపాదప్రణయుండు నూతనవధూ ♦ పాయంబులన్ సక్తుఁడై
పాపంబుల్ ఘటియించు చుండెడు జుగు ♦ ప్సాహీనుఁడై యెయ్యవో
పాపాత్ముండు పరాక్రమంబునను దు ♦ ర్వ్యాసపారపారీణతా
లేపం బందనముండు వీనిఁ దునుమన్ ♦ లేఁడే విభుం డొక్కఁడున్. ౫౧౯

చెఱఁబడినస్త్రీలు రావణు శపించుట.

చం. అతులితపాపహేతువు ప ♦ రాంగనలం దమి నేఁత, వీఁడు దు
ర్గతి పరకాంత లైనమము ♦ రాగమునం జెఱుపంగఁ గోరెడిన్
హతుఁ డగుఁ గాక యీచెనఁటి ♦ యన్యతలోదరి కారణంబుగా
సతులము యేని మే మిదియె ♦ సత్యము గావుత మంచుఁ దిట్టినన్. ౫౨౦

కం.మొరసెను దివి దుందుభులుఁ, గురిసెఁ సుమసృష్టి యంతఁ ♦ గూఁ రుఁడు సత్యో
త్కరశాపనిహతిఁ బ్రభ చెడెఁ, బరమపతివ్రతలు దిట్టఁ ♦ బ్రభ చెడు టరుదే? ౫౨౧
శా.ఆసాధ్వీజనరోషభాష వినుచుం♦డై యాత్మలో రాక్షసా
ళీసంపూజితుఁ డొచు లంకకును హా♦ళిం బోయెనో లేదొ యా
లో సంతాపితచిత్త శూర్పణఖ జా♦లుంబొఱఁ గన్నీరు బా
ష్పాసారంబునఁ బాదముల్ కడుగుచుఁ ♦ హా యంచు వ్రాలెఁ ధరన్. ౫౨౨

→ శూర్పణఖ రావణు నిష్ఠురంబు లాడుట. ←

కం.వ్రాలినభగినిఁ రక్షః,పాలుఁడు లేవంగ నెత్తి ♦ పరిసాంత్వోక్తిఁ
గోలా! యేలా యేడ్చెదు?,నీలోఁ గలగోర్కి తెలుప ♦ నెఱి యొనరింతున్. ౫౨౩
చం.అనవుడు రక్తనేత్ర నయ♦నాంబులు పాయఁగఁ ద్రోచి పల్కెనే
మని వచియించుదానను బ♦లాఢ్యుఁడ వీవు భవద్బలంబుచే
ననుఁ బతిహీనఁ జేసితివి ♦ న్యాయమె వీరులఁ గాలకేయులం
దునుముచు మత్ప్రియుం బతిని ♦ ద్రుంచితి వీ నయె చేతులారఁగన్. ౫౨౪
కం.ఈవిధి స్వబంధుచేతనె, తా విధి మూఁడెఁ మదాత్మ♦ధవుఁ డస్తత్ప్రా
ణావళికన్నను బ్రియుఁ డో,రావణ! నాసౌఖ్యమెల్ల ♦ రహి చెడ నీచేన్. ౫౨౫
కం.అన్నవె నాపాలికి నీ, విన్నఁటి విధవనుగఁ జేసి ♦ హింసించితి ని
న్నెన్న న్న నేమిఫల మిఁక, నన్నలు నీవంటివార ♦ లవని గలరే? ౫౨౬
శా.*చెన్నౌభూషలు వస్త్రముల్ ధనములుం ♦ జెల్లెండ్రకై యిచ్చుచుం
గన్నం బ్రీతిఁ జరించు చుందు రవనిం ♦ గాకున్న సంప్రీతిచే
మన్నింపఁ మృదుభాషలాడఁ దగదా ♦ మానంబు మేలే కదా
యన్నా! నీవలెఁ జెల్లెలి న్విధవఁ జే♦యం జాలిరే యెవ్వరున్? ౫౨౭
చం.దురముల నేని యల్లురను ♦ ద్రుంపఁగ రాదు గదయ్య యేరు, సం
గరమున నీవె త్రుంచితివి ♦ కాదె మఱందిని? న ట్లొనర్చియుఁ
దురితము లజ్జయుం గనవు ♦ తోరపుదుఃఖము నీకతంబునఁ
ధర మనినన్నినా ళ్ళొదవెఁ ♦ దాల్చితి నే విధవాఖ్య నయ్యయో. ౫౨౮

→ రావణుఁడు శూర్పణఖ నూరార్చుట. ←

సీ. అని యేడ్చుచెల్లెలి ♦ నాదట నూరార్చి, యమ్మా! యిదేమిటి ♦ కమ్మ నీవు
పరితపించెద వేరి♦వలన భీతిల్లకు, నెందేని నీయిచ్చ ♦ నెలమి నుందు
నీకోరినవి యెల్ల ♦ నెమ్మి నే నిచ్చెద, గారవించెద నేమి ♦ కడమవడక
సంగరమత్తత ♦ జయము నాకాంక్షించి, శరములఁ జిమ్మితి ♦ సాంద్రముగను

తే. నెవరు మనవారొ శత్రువు ♦ లెవ్వరో యెఱుంగ నైతిని సంగర♦రంగమునను
సంపడిని నీదుభర్తను♦జంపినాఁడ, గతమునకు నేడ్చుచుండినఁ♦గలదెఫలము ౫౨౯

సీ. ఇప్పుడు కార్యంబుఁ ♦ జెప్పెద వినవమ్మ, తల్లితోఁబుట్టిన♦దానికొడుకు
ఖరుఁడు నీతోఁబుట్టు ♦ గలిమియుఁ గలవాఁడు, దండకాటవిఁ జతు♦ర్దశసహస్ర
ములురాక్షసులు గొల్వ♦బలియుఁడై వసియించుఁ,జరియించు నీయాజ్ఞ♦సమ్మతమున
దానప్రయాణస♦మ్మాన కార్యములెల్ల, నాతఁడ కూర్చెడు ♦ నడల వలదు

తే. వీరి దండక కనిపెద ♦ వేగ దూష,ణుండు దళవాయిగాఁగ ♦ నీ వుండు మతని
యొద్ద నాతండె మనరాక్ష♦సోత్కరమున, కేలికై యందు నాయాజ్ఞ♦నేలు చుండు.

కం. అని పదునాలుగు వేవురు,ఘనశూరులతోడ ననిచె ♦ ఖరు దండక కం
దున యాతఁ డుండఁగా శూ,ర్పణఖయు వసియించె నతని♦పజ్జను సుఖతన్. ౫౩౦

→ రావణుఁ డింద్రజిత్తుఁ జూడ నికుంభిలకుఁ బోవుట. ←

తే. పంక్తివదనుండు దండకా♦వనము నేల, ఖరుని నియమించి భగినికిఁ♦గరముముదముఁ
గూర్చి తాస్వస్థచిత్తుఁడై ♦ కొడుకుఁ జూడఁ,జనె నికుంభిల యనునుప♦వనమునకును.

తే. అచట యూపశతాకీర్ణ ♦ మగుచుఁ జైత్య
శోభితం బయి కాంతిచే ♦ సొంపుఁ గూర్చు
యజ్ఞమును జూచి యందు ని♦జాత్మసుతుఁ గ
నుండులుశిఖాధ్వజునిని మా♦ర్తండ తేజు. ౫౩౩

కం. హరిణాజినధరునిఁ భీ,కరునిం గని మేఘనాదుఁ ♦ గొఁగిట నిడి నా
వరతనయా! చెపుము సమా, చరితం బగుకార్య మేది ♦ సకలం బనినన్. ౫౩౪

సీ. శుక్రుండు పలికె నీ♦సుతుఁడు రాక్షసరాజ!,జన్నముల్ పెక్కింటిఁ ♦ జలిపినాఁడు
కెరలి గోమేధ మ♦గ్నిష్టోమ వైష్ణవ,రాజసూయంబులు ♦ వాజిమేధ
మును దక్షిణలతోడఁ♦బొనరించినాఁడు దు,ష్కరము మహేశ్వరా♦ధ్వర మొనర్చి
ప్రత్యక్ష మైనశ్రీ♦భవుచేత నీసుతుం, డద్భుతవరముల ♦ నందినాఁడు

ఆ. గగనచరము కామ♦గంబుధ్రువం బగు,దివ్యరథ మొకండు ♦ భవ్యమైన
తామసీసమాఖ్య ♦ దారుణమాయయుఁ, గాంచినాఁడు తేజు ♦ మించినాఁడు. ౫౩౫

కం. ఆమాయాబలమున సం,గ్రామంబున నితఁడు దిరిగి ♦ గగనచరుండై
శ్రీమహిత సురాసురులకు, నేమాడ్కిని గానరాక ♦ యేఁచుం బరులన్. ౫౩౬

కం. తూణంబు లక్షయము లగు,బాణంబులఁ బూర్ణములు న♦పరభేద్యం బౌ
బాణాసన మస్త్రం బరి,ప్రాణంబుల నపహరింపఁ ♦ బటుశక్తంబౌ. ౫౩౭

కం. ఈవరముల నన్నిటినో,రావణ! నీసుతుఁడు గాంచెఁ ♦ గ్రతువును బూర్ణం
బై నెలసె నీవు వచ్చుట,కై వేచియ యున్నవాఁడ ♦ ననుడు నతండున్. ౫౩౮

ఉ. దీనను మేలు లేదు, మనద్వేషుల నింద్రముఖామరాదులన్
మానితరీతి భక్తిని సమంచితవస్తువులన్ యజింతురే?
యైనది యేమొ యయ్యె నదియైనను మేలె నిజంబు పోదమా
మానిలయంబుఁ జేర బుధమండలమండన రండు తోడుతన్. ౫౩౯

తే. అనుచు దశకంఠుఁడు విభీషణాత్మజాత
సహితుఁడై పోయి బాష్పముల్ జాలువాఱు
కనులవారిని నానీతకంజముఖులఁ
బుష్పకమునుండి దింప నప్పువ్వుఁబోండ్ల ౫౪౦

విభీషణుఁడు రావణుతో మధుఁడు కుంభీనసి నపహరించినవార్తఁ దెలుపుట.

చం. కనుఁగొని వారిపట్ల దశకంఠునికాంక్ష యెఱింగి ధర్మధీ
ఖని యగునవ్విభీషణుఁడు కార్య మటయ్య యశోర్థవంశనా
శనకరకార్యముం జలుప జ్ఞాతులఁ జంపి యథేచ్ఛ మీపరాం
గనలను వార లశ్రులను గార్పఁగఁ దేఁ దగు నయ్య నీ కిటుల్. ౫౪౧

ఉ. ఈనవలాలఁ చుట్టముల నీవు వధించి హరించి నట్లు నిన్
మానసమందుఁ గైకొనక మత్తుఁడు బల్మి హరించి యేగెఁ గుం
భీనసి నామధుం డనిన వింశతిలోచనుఁ డిద్ది యేదియో
నేనెఱుఁగన్ మధుం డెవఁడు నీవ వచింపు మటన్నఁ గ్రుద్ధుఁడై ౫౪౨

కం. నీసలుపుపాపముఫలము, చేసేతన దాపరించెఁ జెప్పెద వినుమా
యాసురవర్యుఁడు ప్రాజ్ఞుఁడు, భాసురచరితుండు మాల్యవంతుం డనఁగన్. ౫౪౩

సీ. అన్న మాతామహుఁ డైనసుమాలికి, మనతల్లికిని జ్యేష్ఠజనకుఁ డతఁడు
కావున మనతాత యావీసుపుత్రిక, యనల యాయమకుఁ బ్రియాత్మజాత
కుంభీనసీనామ్ని కూఁతురు మనతల్లి,చెల్లెలికిని మన చెల్లెలె కద
స్మృతికి వచ్చెనె యిప్పు డేనియు నవ్వావి? పెండ్లికినెదిగిన పిన్నపడుచు

తే. యజ్ఞ మొనరించుచుండె నీయాత్మజుండు, నీళ్లలోపల నుంటి నే నియతిఁ బూని
కుంభకర్ణుండు నిద్దురఁ గూరి యుండెఁ, గాన నీమంత్రివరుల రాక్షసులఁ ద్రుంచి

కం. నీయంతఃపురమున నిద్రాయుత యై యుండుదాని రమణిని మధుఁ డ
త్యాయతమదమునఁ గొని చనె, ధీయుత మే మతనిఁ జంపఁ దివురమ శాంతిన్.

ఉ. కన్నియ నర్హుఁ డైనయొక కాంతున కిచ్చుట యోగ్య కార్య మా
కన్నియతోడఁబుట్టులకుఁ గాని యయో యటువంటియీవి నో
పున్నెముగల్గుభాగ్య మది పొల్లు వడెం జుమి, త్వత్కృతాఘమే
యున్నెఱి దాపరించె నిపుడే, వృథ పోవునె ఘోరపాపముల్. ౫౪౬

### రావణుఁడు మధునిమీఁదికి దండయాత్ర పోవుట.

సీ. అనుడు నాతియుమహాఘంబునను బీడి,తుం డయి సంతప్తతోయధిగతి
సైన్యేశుతోడ నాస్యందనం బిప్పుడ, సిద్ధంబు సేయింపు సేన లతిర
యంబున నాల్గువే లక్షౌహిణుల నిప్డ, కదలింపుమీ కుంభకర్ణుఁ డాది
గాఁగలరక్షఃప్రకాండముల్ యానాళి,పై నెక్కవా రిప్డు పంక్తికంఠ
తే. నిర్భయుని మధు వధియించి నిర్జరాల,యంబు గెలువంగ వరిగెద ననుచుఁ గ్రోధ
దీప్తుఁడై పల్కె మంత్రియు దీవరించి, నిఖిలసేనలతోడఁ దా నిర్గమించె. ౫౪౭

చం. చనియెను మేఘనాదుఁడు వెసన్ బలఁగంబులమున్ను మధ్యమం
దును దశకంఠుఁడుం జనియె దోర్బలధుర్యుఁడు కుంభకర్ణుఁడున్
వెనుదెసఁ గాచె సేనల,విభీషణుఁ డుండెను లంకయందతోఁ
చినఘనధర్మ కార్యములు సేయుచుఁ, బోయిరి తక్కు రెల్లరున్. ౫౪౮

కం. ఖరశింశుమారపన్నగ,తురగమయపితతుల నెక్కి తూర్ణంబ నిరం
తరమొనరించుచు గగనం, బరిగిరి మధుపురముఁ బట్టి యసురవరేణ్యుల్. ౫౪౯

కం. దేవతలమీఁదివైరము, భావించుచు దైత్యవరులు వందలకొలఁదుల్
రావణు వెన్నడి నడచిరి, యావీరుం డింద్రు గెల్వ నరుగు టెఱుఁగుటన్.

### కుంభీనసి మధుని రక్షింప రావణు వేఁడుకొనుట.

సీ. పంక్తికంఠుం డిట్లు బలువడిఁ జని మధు,పట్టనంబున కందు వానిఁ గనఁగ
రామిఁ జెల్లెలిఁ గాంచె రావణుఁ గనుఁగొని, కుంభీనసియుఁ దనగుండె లదురఁ
దల వ్రాల్చి యతనిపదంబులపైఁ దూలె, నతఁడును భీతిల్ల కమ్మ లెమ్ము
నీ కేమి యొనరింతు నేను జెప్పు మటన్న, యన్న! నాపై దయ యున్న దేని
తే. చంపవలవదు నావిభు సారశౌర్య!, భయములందెల్ల దుస్సహాభయ మటందు
రన్న! వైధవ్యభయము కులాంగనలకు; సాధ్వులకు దాని మించిన జడుపు లేదు.[1]
తే. సత్యవచనుండ వగుదు రాక్షసకులేంద్ర!, నాదుప్రార్థన మన్నించి యాదరింపు
నీవు భయపడ వల దని నెమ్మి నంటి, వల్లవాక్యంబె పాలింపు మసురనాథ!

చం. అనవుడుఁ జెల్లెలిం గని దశాననుఁ డిట్లను నేఁడి నీవిభుం?
డనిమిషసంచయంబుల రణావని గెల్వఁగఁ బోదు దీనినిన్
వినిచి త్వదీయభర్తకును వేగమ బాసట గాఁగ రమ్మటం
చను మింక నీదు నెయ్యమున నాతనిఁ జంపఁగ నొల్ల సోదరీ! ౫౫౩

ఉ. నావుడు వల్లె యంచు సదనంబునఁ గూర్కెడు నాథు లేపుచున్
రావణుఁ డస్మదగ్రజుఁడు రాక్షసనాథుఁడు శక్రు గెల్వఁగాఁ

[1] విధవశూర్పణఖచర్యవలనను, కుంభీనసి వాక్యములవలనను, పతివ్రతలగు రాక్షసస్త్రీలుగూడ విధవావివాహము గర్హ్యమని భావించిరనియు విధవావివాహము బహిరంగ వ్యభిచారమునకు మాఱుపేరనియు నేర్పడుచున్నది.

బోవుచు నీదుసాహ్యమును ♦ బొందెడికోరిక వచ్చినాఁడు ర
క్షోవర! నీవు నీయనుఁగుఁ♦జుట్టములుం గని స్నేహయుక్తునిన్　　　౫౫౭

తే. తగినపద్ధతి నర్ఘ్యపా♦ద్యముల నిడుచు, బాసటలు గం డటన్నను ♦ వల్లె యనుచు
న్యాయ్యరీతిని రాక్షస♦నాథుఁ గనుచు, నాదరించి సమర్పించె ♦ నర్ఘ్యభంగి.　౫౫౫

కం. ఈవిధమున మధుపురమున, రావణుఁ డర్చల గ్రహించి ♦ రాతిరి యొకఁ డం
దే వాసముఁ గొని వేకువఁ, దా విడిసెన్ వెండికొండ♦దాపున బలిమై.　౫౫౬

→ రావణుఁడు మధునితోఁ గైలాసప్రాంతంబున విడియుట. ←

కం. ఇటు లాదశకంఠుఁడు గిరి,కటకంబున విడిసి యుండఁ ♦ గంజహితుండున్
బటుతఁ జెడి పశ్చిమాచల,తటమునకుం బోయి యుండుఁ ♦ దనువుం దాఁచెన్.　౫౫౭

చం. తనడిగియున్న కొండరుచిఁ ♦ దాల్చి మృగాంకుఁడు నిర్మలద్యుతిన్
గొనబుగ నుద్భవించుటయుఁ ♦ గూర్కుచు సైన్యములెల్ల నుంటయున్
గని నగమూర్ధమందు దశ♦కంఠుఁడు రాగరసావశాత్ముఁడై
వనజవిరోధిపాదచయ♦భాసితశైలవినోదసంపదల్　　　౫౫౮

కం. కనుఁగొన నాసీనుండై, ఘనతరఫుల్లాబ్జినివి♦కాసితమందా
కినిజలములసొంపును ద,క్వనములజగజంపుపెంపు ♦ ప్రమదం బొనఁగన్.　౫౫౯

కం. మందారచూతపాటల,బృందార్జునలోధ్రతగర♦వేణీగణికా
తిందుకకేతకకదళీ,కుందాశోకాదితరులఁ ♦ గొమ రగువనులన్.　౫౬౦

→ రావణుఁడు వెన్నెలకాఁకకు వేఁగుట. ←

కం. క్రొన్ననవిలుతునిములుకుల,కన్నఱ రాగమున మధుర♦కంఠులు మోహా
భ్యున్నతిఁ దమవలచినయా,కిన్నరులం గూడి పాడి ♦ క్రీడలఁ దేలన్.　౫౬౧

కం. చెందంబునకుం జాడ్కి, కమందానందం బొసంగ ♦ మదనుఁడు మదిలో
దందడి సందడి పెట్టఁగ, మందుసవలెఁ జూచు చుండె ♦ మనుజాశనుఁడున్.　౫౬౨

సీ. కావి పాటినవాలుఁ♦గన్నుంగవలతోడ, మత్తున సొక్కిన♦చిత్తములను
దారుణ్య సౌందర్య♦ధన్య లౌసతులతో, విద్యాధరులు కేళి ♦ వెలయు చుండ
లిబ్బులదొరయింటి♦గుబ్బలాఁడులగీతు, లబ్బురం బగుతీపి ♦ గుబ్బతిల్లఁ
దుంటవిల్తునితియ్య♦వింటికోపున మ్రోఁగు,గంటలరవళినాఁ ♦ గలయఁ బర్వ

తే. మందమారుతకంపిత♦మహీరుహములు
తేన లొలికెడిపూవుల♦వానఁ గురిసి
భూధరంబును బుక్కాము♦పొళ్ళ ముంచు
భాతిఁ దనరారఁ దిలకించెఁ ♦ బంక్తిముఖుఁడు.　　　౫౬౩

కం. మకరందబిందురజములఁ, బ్రకటం బగుపరిమళంబు ♦ వహియించి మనో
వికలతగొన ననురుఁడు మఱు, సెక లీనుచు వీచెఁ గమ్మఁ ♦ జిలువల మేఁతల్. ౧౬౪

సీ. మానవతీమణి ♦ మంజులగానంబు, పొలుపారవిరిసిన ♦ పూలడంబు
మొల్లంపువలపుల ♦ చల్లగాడ్పులసొంపు, కొండలత్రేఁ డెదఁ ♦ గూర్చునింపు
అఖిలమనోహర ♦ మయి సాగు రేతీరు, నిండారుచందురే ♦ యెండసోరు
మదనతాపంబున ♦ మఱుఁగుజక్కవకుందు, జీవజీవకములఁ ♦ జెల్లువిందు

తే. నేకమై సాగ రక్షోజ ♦ నేశ్వరుండు
కామునకుఁ జిక్కి పస దక్కి ♦ కళవళించి
వగచి తపియించి చందురు ♦ వంకఁ జూచి
యూర్చి యూరిచి తల యూఁచి ♦ యూఁచి నలఁగె. ౧౬౫

## రంభ కైసేసికొని రావణసేనామధ్యంబునఁ జనుట.

సీ. వెడవిల్తుకాఁకల ♦ వేఁగుచు నతఁ డుండ, దివ్యాభరణదీప్త ♦ దేహ యగుచు
నందనసుమమాల్య ♦ బృందముల్ మెయిఁ బ్రేల, ననువారఁ జందనం ♦ బలఁది మేన
మందారకుసుమముల్ ♦ పొందించి కురులందుఁ, బూర్ణచంద్రునిమోము ♦ పొలుపునవ్వఁ
గన్నుదోయికి విందు ♦ గావించు నెఱిమించి, రత్యుపాయన మయి ♦ త్రాలు బలుపు

తే. పిఱుఁదులను జాఱు మొలనూలు ♦ మెఱయు చుండఁ
జెక్కటను మోముఁదమ్మిని ♦ జుక్కబొట్టు
దనర ఋతుషట్కభవసుమ ♦ దామపంక్తి
సౌరభంబుల మొగి వెద ♦ చల్లు చుండ. ౧౬౬

కం. హ్రీ, కాంతిద్యుతికీర్తుల, శ్రీకిన్ మా అగుచు సజల ♦ జీమూత మనన్
జోక వెలుంగు ముసుం గిడి, టీకునఁ జను చుండె సొగసు ♦ తీవి రహింపన్. ౧౬౭

కం. బొమ్మలు వెడవిల్తునిచా, పమ్ములు నెమ్మోముఁదమ్మి ♦ పర్వేందునిబిం
బ మ్మూరులు శుండాకా, రమ్ములు కిసలమ్ములే క ♦ రమ్ములు గాఁగన్. ౧౬౮

కం. తన సేనలమధ్యంబునఁ, జనియెడి క్రొమ్మించుఁబోణి ♦ స్మరశరవశుఁ డై
కని దిగ్గనఁ జని కేల్గొని, చెనఁటియసురుఁడనియెఁ దమిని ♦ సిగ్గరికత్తెన్. ౧౬౯

## రంభారావణసంవాదము.

సీ. ఎందుల కేగెదే ♦ యిందీవరేక్షణ, యేసిద్ధి కై నీవ ♦ యేగెదబల
యెవ్వనిపుణ్యంబు ♦ లిపుడు ఫలించెనే, ప్రమదాబ్ధిఁ దేల్చె దె ♦ వ్వానిఁ జెలువ
యెవ్వఁడే భోగించు ♦ నింతి నీతో నిప్డు, డసమచాపునితాప ♦ మాఱిపోవఁ
బద్మోత్పలసుగంధి ♦ వదనామృతంబును, సుధవోలెఁ ద్రావుచు ♦ సౌఖ్య మెవఁడు

ఆ. పిఱికిదాన! వెలసి ♦ యిఱిసియు నిఱుకుగ, నురము నఱిమి చూడ్కి ♦ కుత్సవముగ
మిట్టి మిన్ను చూచు ♦ మేలిబంగరుగిండ్ల, నెనయుకుచము లెవని ♦ యెదను గ్రుమ్ము

కం. హాటకచక్రంబునకుఁ, దీ టగుచుఁ స్వర్ణదామ ♦ దీపిత మై స్వ
ర్వాటీసుఖదం బగుకటిఁ, గూటమి కై యెవ్వఁ డొక్కొ ♦ కోమలి యెక్కున్. ౫౭౧

చం. వనితరో నన్ను మించుమగ ♦ వాఁ డెవఁ డే జగతీత్రయంబునఁ?
వనరుహనాభుఁ డైన సుర ♦ వల్లభుఁ డైనను వేల్పు వెజ్జులేఁ
నను సరిపోలువారె? తగు ♦ నా లలనా యిటు నేను రక్తి వే
డ్కన నను వీడి వేఱొకనిఁ ♦ గూడఁగఁ బోవ నరాళకుంతలా! ౫౭౨

తే. మూఁడుజగములయందు నో ♦ ముద్దుగుమ్మ, నే విధాతను బతులకు ♦ నేన పతిని
నన్నుఁ గా దని వేఱొక ♦ నాయకుండు, గలుగఁ డింతయు నిక్క ంబు ♦ కంజనేత్ర.

ఉ. అట్టిమహానుభావుఁడ ద ♦ శాననుఁడఁ మృగరాజమధ్య లోఁ
బుట్టినమారుకాఁకలను ♦ బొంగఱి కేల్మొకుళించి వేఁడెదఁ
నిట్టుల మైనకూర్మిఁ దరు ♦ ణీమణి యేల వె నన్ను సౌఖ్యపుఁ
నిట్టల దేల్పవే శుభము ♦ నీ కగు నీశిల విశ్రమింప వే. ౫౭౪

కం. అనురావణువచనంబుల, విని గడగడవడఁకు గదుర ♦ వెఱ హస్తయుగం
బును మోడ్చి రంభ రావణు, ననియెఁ నీ కిట్లు పలుక ♦ నర్హము టయ్యా. ౫౭౫

చం. గురుఁడవు నీవు, నీయనుఁగుఁ ♦ గోడల నేను గదయ్య, నాపయిఁ
గరుణ దలంపవయ్య, సరి ♦ గా దిటుపల్కఁగ మానవయ్య, నఁ
బరులు పరాభవించినను ♦ బ్రాపయి ప్రోవఁగఁ గర్త వీవ యై
పరునివిధాన నన్ను నగుఁ ♦ బాటులపా లొనరింపఁ జెల్లునా? ౫౭౬

కం. మామా! పలుకకు మీఁగతి, మా మా మన్నింపు నన్ను ♦ మానుము నాపైఁ
గామము మానము దీయకు, మామయె కోడలిని బట్ట ♦ మరియా దగునే? ౫౭౭

కం. నావుడు నారమణీమణి, కేవలపుంజూడ్కి మాత్ర ♦ గెలవున భృశహ
ర్షావేశవశుండు దశ, గ్రీవుఁడు చరణానతాస్యఁ ♦ గేరుచుఁ బలికెన్. ౫౭౮

కం. భామామణి! ననుఁ బిలిచెదు, మామా యని నీకు నెట్లు ♦ మామను జెపుమా
యేమీ నానుతుసతి వై, సీమాటీ! కాఁపురంబుఁ ♦ జేసితి వటవే? ౫౭౯

చం. అనవుడు రంభ యిట్టు లను ♦ నో నసురేశ్వర! న్యాయ్యరీతి నీ
తనయుని కేను బెండ్లమును ♦ దథ్యము, నీవును విత్తనాయకుం
డనుజుఁడు నన్నయుం గద? ధ ♦ నాధిపుకూరిమిపుత్రుఁడే కదా
విను నలకూబరుండు భువి ♦ విశ్రుతచర్యుఁడు శౌర్యధుర్యుఁడున్. ౫౮౦

తే. పరమధర్మగుణంబున ♦ బ్రాహ్మణుండు
శత్రుభీకరభుజశక్తి ♦ క్షత్రియుండు
నాగ్రహించిన లయనహ్ని ♦ యట్టివాఁడు
క్షాంతిగుణమున ధారిణీ♦సముఁడు సుమ్ము. ౫౮౧

ఉ. అట్టిఁడు నీసుతుండు, మహి♦తాత్మునితోఁ నొసఁబాటు కల్గి నే
నిట్టిహొయల్ రహింప నట ♦ కేగెడుదానను మెప్పు వానికిం
బుట్టఁగఁ జేయు, నా కితఁ♦పూరుషు పై వల పేమి లేదు, నీ
పట్టిపయిన్ మదీయదృఢ♦భావము పాయ దొకప్పు డేనియున్. ౫౮౨

చం. వినఁగద వయ్య నామనవి ♦ వీషఁగదయ్య నసుం దశాస్య! నీ
తనయుఁడు నాదురాక కయి ♦ తత్తఱపాటున వేచి యోవలన్
గనుఁగొను చుండు, వాఁ డచటఁ ♦ గంతుశరావళి స్రుక్కు చుండఁగా
నను నిట నాఁగ నీకుఁ దగు♦నా? సుతసౌఖ్యముఁ బాప న్యాయ్యమా? ౫౮౩

తే. సజ్జనులు పోవుపథమునఁ ♦ జనఁగదయ్య, మహినిసత్కీర్తియుక్తిని ♦ మనఁగదయ్య
మాన్యుఁడవు నీవు నాకు నో♦మామగార, రక్షణీయను నీకు నే ♦ రాక్షసేంద్ర!

కం. సతి యిట్లు పలుక వినయా,న్వితయై తా నాలకించి ♦ నిశిచరుఁ డనియెన్
శతపత్రేక్షణ యేలా, పతి నొక్కనిఁ గూడు సాధ్వి♦వావులు పలుకన్. ౫౮౪

చం. అమరపురిం గలట్టిసురి♦యూదలు వావులు నే నెఱుంగనా?
కమలదళాక్షి యొక్కఁడె మ♦గం డమరాంగన కన్న న్యాయ మం
దమునె? యాదితేయునకు ♦ నాలు నొకర్తుక యంచు నున్నదే?
యమరులకెల్ల లంజ వయి ♦ యాడెదవా మగనాలిపోఁడుముల్. ౫౮౬

→ రావణుఁడు రంభను జెఱిచి విడుచుట. ←

కం. అని పట్టి బండమీఁదన్, ననఁబోఁడిం బండఁబెట్టి ♦ ననవిల్తునికే
ళిని గాసిపెట్టి యసురుఁడు, చను మని విడువంగఁ ద్రిదశ♦జలజేక్షణయున్.[1] ౫౮౭

కం. రాలినమాల్యంబులతోఁ, దూలినభూషాచయంబు♦తోడను లీలా
ఖేలామథితాపగ నా, హేలాచ్యుతిఁ గలఁకఁబాటి ♦ యేగెన్ మెల్లన్. ౫౮౮

చం. చెదరినకొప్పువెండ్రుకలు ♦ చెన్నుదొఱంగిన కేల్చిగుళ్లు నై
సుదతి ప్రభంజనాహతము ♦ సూనభరాంచిత మైనదీవె నాఁ
గొదరువణంకు సిబ్బితియుఁ ♦ గూడఁగ భీతి ధనేశనందనున్
మదవతి చేరఁ బోయి యల♦మానధనుం గని కేలు మోడ్చుచున్. ౫౮౯

తే. పాదములఁద్రెళ్ల నాసతి♦పాటుఁ గాంచి, శ్రీదనందనుఁ డిది యేమి ♦ చిగురుఁబోణి
యేల నాచరణంబుల ♦ వ్రాలి తనిన, వెచ్చనూర్చుచు వణఁకుచు ♦ వెలఁది పలికె.

[1] ఇది రసాభాస రతివర్ణనము.

రంభ రావణునకృత్యంబు నలకూబరుతోఁ దెలుపుట.

సీ. వల్లభా! వాసవ♦భవనంబుపైఁ జన, దుర్వారసైన్యంబు♦తోడ నేఁడు
పంక్తికంఠుం డిందుఁ ♦ బాళెంబు దిగినాఁడు, త్వత్సన్నిధికి నేను ♦ వచ్చుచుండఁ
గని త్రోవ కడ్డమై ♦ గ్రక్కున యరుదెంచి, నాకేలొడిసిపట్టి ♦ నాతి యెందుఁ
జనెద వెవ్వరిదాన ♦ వనవుడు సర్వంబు,వినిచితి మ్రొక్కితి ♦ వేఁడుకొంటి
తే. నయ్య యంటిని నీసుతు♦నాల నంటిఁ, గోడల నటంటి మామవు ♦ కూఁత దంటి
వావు లాడితి ధర్మంబు♦త్రోవ అంటి, నేమిచెప్పిన విడువఁ డా♦హీనగుణుఁడు.
కం.వింటివె యే మందును సుర,కంటకుపై చేత బలిమిఁ ♦ గాంతుఁడ యయ్యో
యొంటిగ జక్కని చిక్కినఁ, దుంటరి యెదిసేయు నట్టి♦దోసము చేసెన్.　౫౯౨
కం.సుగుణాభరణా! సదయం, బగుదృష్టిని నన్నుఁ జూచి ♦ యపరాధంబుల్
దగు క్షమియింపఁగ నబలను, మగవానిబలంబు గలదె ♦ మగువల కెందున్?
కం.అన విని యక్షాధీశ్వరు,తనయుం డొక్కింతసేపు ♦ ధ్యానస్థితుఁ డై
కని వృత్తాంతము సర్వముఁ, గనుఁగవఁ గెంపొదవ జలముఁ ♦ గైకొని కేలన్.

నలకూబరుఁడు రావణు శపించుట.

ఆ. ఆచమించి నీట ♦ నాననాదికముల, నంటి శాస్త్రవిహిత ♦ మైనరీతిఁ
బాపశీలి యైన♦పంక్తికంధరుఁ గూర్చి, శాప మిచ్చె ఘోర♦రూపముగను.　౫౯౫
కం.త న్నొల్లనినిను బలిమిని, నన్నీచుఁడు పరిభవించె ♦ నటుగానఁ జెలీ
తనొ్నల్లని జలజాక్షి నిఁ, కెన్నఁ డతఁడు తాఁక కుండ ♦ నే నొనరింతున్.　౫౯౬
కం.ఎప్పు డితఁడు దన్ను నొల్లని,యప్పడఁతిం జెఱుచు రావ♦ణాసురుఁ డపుడే
యప్పలలాశిశిరంబులు, తప్పక యిలఁగూలు సప్త♦ధాభిన్నము లై.[1]　౫౯౭
కం.అని జ్వలితాగ్నిసమప్రభుఁ, డనినంతనె కురియఁ దొడఁగె ♦ నలరులవానల్
ఘన మయ్యె దేవదుందుభి,నినదంబులు మింట సురలు ♦ నీరజభవుఁడున్　౫౯౮
చం.మునులును బంక్తికంఠునకు ♦ మూఁడినకీడు దలంచి సంతసం
బును గొని రా దశాస్యుఁడును ♦ బోలఁగ శాపవిధం బెఱింగి యా
దినముమొదల్ పరాంగనలఁ ♦ దియ్యనివిల్తునికేళిఁ గూడఁగా
మనమున నెంచఁ డయ్యెఁ, దగు♦మందు గదా భయ మెట్టివానికిన్.　౫౯౯
కం.రావణుఁడు బల్మిఁ దెచ్చిన,యావనితలు సాధ్వులెల్ల ♦ యక్షేశసుతుం
డావిధి నొసఁగినశాపము, వావిరిహర్షమున వినిరి ♦ భయ మెదఁ బాయన్.　౬౦౦

రావణుఁ డింద్రపురిపై దాడి వెట్టుట విని సురలు యుద్ధప్రయత్నులగుట.

సీ. కైలాసనగమును ♦ గడచి దశాస్యుండు, సైన్యసమేతుఁ డై ♦ శక్రలోక
మరుగ నాకంబున ♦ నర్ణవమథనవి, రావంబుపోలిన♦రావ మెగసె

[1] చూడు యుద్ధకాం. ౨౫౯ పద్యము. ఇట్టి శాపమే బ్రహ్మ పెట్టియున్నాఁడు. నలకూబరశాపము ప్రథమము. ప్రాకృత నలకూబర శాపము లక్ష్యముసేయక యంతకంటెఁ దపోధికుఁడైన రావణుఁడు పుంజికస్థలను జెఱచెను. కావున బ్రహ్మశాపము. పరస్త్రీని జెఱచినచో చచ్చునట్లు నలకూబరశాపము. దుర్వ్యాపారమునకై కడఁగి సమీపించినఁ జచ్చునట్లు బ్రహ్మశాపము. వని మాతృభావనచే సీతను దాఁకెను.

ననురవర్యనిధాటి ♦ నాలించి శక్రుండు, వడఁకుచుఁ దనుఁ జూడ ♦ వచ్చి యున్న
విశ్వుల వసురుద్ర♦విబుధుల నాదిత్యు,లను గాంచి చనుదెంచె ♦ మనల గెలువఁ
ఆ. బాపబుద్ధి యైన♦పంక్తికంఠుఁడు మీరు, సిద్ధపడుఁడు వేగ ♦ యుద్ధమునకు
ననఁగ వారలెల్ల ♦ నరిగి సైన్యంబుల,తోడ నుండి రనికిఁ ♦ దొడరుటకును. ౬౦౧

కం. నిర్జరనగరంబుపయిన్, దుర్జయుఁ డగురావణుండు ♦ దోఁడెంచుటచే
నిర్జితబలుఁ డింద్రుఁడు ధృతి,వర్జితుఁడై యరిగి దీన♦వదనుం డగుచున్. ౬౦౨

ఇంద్రుఁడు విష్ణువుఁ జూడఁ బోవుట.

చం. హరిఁ గని యేమి సేయుదు మ♦హాత్మ! దురాత్ముఁడు రావణుండు సం
గరమున కాంక్ష సేసి సుర♦కాండము గెల్వఁగ వచ్చినాఁడు నేఁ
డురుతరవీర్యవంతుఁ డిఁక ♦ నూరకపోఁడు వరంబు పేర్మిఁ గా
వరమునఁ గన్నుగానఁడును ♦ బ్రహ్మవరం బది పాలనీయ మౌ. ౬౦౩

కం. కాకున్న వీఁడు లెక్కయె, నీకరుణన గెలిచినాఁడ ♦ నే నముచి బలిన్
వీకున వృత్రున్ శంబరుఁ, బ్రాకటబలశాలి నరకు ♦ భండనమందున్. ౬౦౪

సీ. సచరాచరములైన♦జగములకెల్లను, గతియు నాశ్రయమును ♦ గంజనేత్ర!
నీవ కావే మఱి ♦ నీకన్న దేవదే,వేశ! యెవ్వరు నాథు ♦ లింతటికిని
మధుసూదనుండవు ♦ మాధవుండవు పద్మ,నాభుండ వీవె స♦నాతనుఁడవు
జగముల నన్నిటి ♦ స్థాపించితివి నీవ, నీవలనన కదా ♦ నేను నగుట
ఆ. సర్వలోకములను ♦ జనియింపఁ జేసెద, వన్ని ప్రళయవేళ ♦ నిన్నె చొచ్చుఁ
బలుకవయ్య యొక యు♦పాయ మాశరు గెల్వఁ, జక్ర మూని నాకు ♦ సాయపడుదె.

విష్ణు వింద్రునితోఁ దాను యుద్ధమునకు రా నని చెప్పుట.

ఉ. భీయుతచిత్తుఁడై యిటులు ♦ వేఁడు సురేంద్రునిఁ జూచి పల్కె నా
రాయణుఁడో మహేంద్ర! భయ ♦ మందకు కార్యముతీరు విన్మ నీ
వీయసురుం డజయ్యుఁడు సు♦మీ విబుధాసురకోటి కింక నే
చాయ వధింప శక్య మగు ♦ సారసగర్భువరంబు పెంపునన్. ౬౦౫

చం. తెలిసితి నే నిసర్గ మగు♦ధీమహిమంబునఁ బుత్రయుక్తుఁడై
సలిపెడిఁ బంక్తికంధరుఁడు ♦ చాలభయంకర మైనకృత్యమున్
బిలిచితి నన్నుఁ దోడ్పడఁగ ♦ భీమరణంబున కేను వానితోఁ
గలహ మొనర్ప నిప్పు డరు♦గన్ మదిఁ గోల్పద దేల యంటివేన్. ౬౦౬

కం. వెన్నుండు శత్రువరులన్, మన్ని గొనక సంగరమున ♦ మరలఁడు సుమ్మీ
యన్నియమ మిపుడు చెల్లద, యన్నిశిచరవరుఁడు విధివ♦రావితుఁ డగుటన్. ౬౦౭

[1]ఇది యింద్రుఁడు చెప్పఁబడుటే. గౌతమశాపము వ్యర్థమయిపరాగుగదా.

చం. ప్రతిన వచింతు విష్ణు సుర♦వల్లభ! రావణు నేన చంపెదన్
హితమతితో ముదంబు ఘటి♦యింతు బుధాళికి నిక్క మౌ శచీ
పతి! సమయంబు వేచి, ధృతిఁ ♦ బాయకు, భండన మిమ్ము వానికిన్
వితతబలంబుతో నరిగి ♦ వేగ మ టన్నను బాకవైరియున్ ౬౦౯

దేవ రాక్షస యుద్ధము.

సీ. ఆదిత్యవసురుద్రు ♦ లశ్వినుల్ మరుతులు, వెంటరా ననికయి ♦ వెడలి చనుడు
రజనీక్షయంబున ♦ రావణసేనతోఁ,బలమున సురసేన ♦ తలపడంగ
నక్షయం బైనయా♦యసుర సైన్యముఁ గాంచి, సంక్షోభ మందిరి ♦ సకలసురులు
పోరు ఘోరం బయ్యెఁ ♦ గ్రూరనానాయుధ,కోటుల నిరువాఁగు ♦ కొట్టుకొనఁగ
ఆ. నంతలోన రావ♦ణాసురమంత్రు లు,కంపన ప్రహస్త ♦ ఖరనికుంభ
యజ్ఞకోపశుకన♦రాంతకసంహ్లాద,జంబుమాలిసూర్య♦శత్రువులును. ౬౧౦

సీ. మారీచసుప్తఘ్ను ♦ సారణదుర్ముఖ,ధూమకేతువులును ♦ దూషణుండుఁ
గరవీరనేత్రత్రి♦శిరులు మహాపార్శ్వుఁ,డును మహాదంష్ట్రుండు ♦ ఘనబలుండు
అతికాయుఁడును విరూ♦పాక్ష ఘటోదరు,లలఘుమహోదర మహా♦ప్రోదు లొగి మ
హాకాయుదుర్ముఖు ♦ లతిబలుఁ డైన దే,వాంతకుండును గూడి ♦ యరుగు దేర
తే. రావణునితాత శౌర్యధు♦రంధరుండు, వెస సుమాలి సురావళి ♦ విచ్చలింప
ఘోరశస్త్రాస్త్రసమితిని ♦ గూల నడిచి, తోలె వాయువు మబ్బులఁ ♦ దోలునట్లు
ఉ. పైపడితాఁచు చున్నసుర♦వైరుల వేఁడిమి కోహటించి తా
రేపఱి సింహముల్ దఱుమ ♦ హీనమృగంబులు పాఱునట్టు లై
యోపిక లేక పాఱఁ గని ♦ యోధవరాగ్ర్యులు త్వష్టృపూషు లా
క్షేపపురస్సరం బరుల♦సేనల మార్కొని విక్రమించినన్. ౬౧౨

తే. అధికబలశాలి వసువుల ♦ నష్టముండు, వీరసత్తముఁ డైనసా♦విత్రుఁ డప్పు
డరులు గగ్గోలువడఁ దాఁక ♦ నాహవంబు, భూతజాతమహాభీతి♦హేతు వయ్యె.
కం. నిశితాయుధధారాహతి, దశముఖసైన్యంబు దేవ♦తల వధియింపన్
విశసన మొనరిచి రమరులు,వశమఱి కూలంగ శత్రు♦బలసంఘంబున్. ౬౧౪

ఉ. అప్పుడు నాకలోకనిల♦యాంబుదమార్గణవృష్టి జోపుచున్
దెప్పున భీమమారుతము♦తీరున వచ్చి సుమాలి శూలముల్
గుప్పలుగాఁ బయిం బఱపి ♦ కొండలపా టొదవించి శీర్షముల్
దొప్పలు చేయ దేవతలు ♦ దూలిరి పాఱిరి భీతి ముంపఁగన్. ౬౧౫

ఆ. ఆసుమాలి తెంపు ♦ నీసుమాలుచు సురల్, దిక్కు మొగము లైన♦ తెరువుఁ గాంచి
యాసుమాలిఁ బోలి ♦ యల్లసావిత్రుండు, స్వీయసైన్యవితతి ♦ చేరిరాఁగ. ౬౧౬

కం. ఆమరువరి కెదురుగఁ జని, జీమూతముమాడ్కి నిలిచి ♦ చెచ్చెర శరధా
రాముండలిఁ గప్పుచు బల,భీమునిఁ గుదియింప నుభయ♦వీరుల కచటన్. ౬౧౭

శా. భీమం బయ్యెను సంగరంబు వసుస♦ద్వీరుండు శాతాంబక
స్తోమంబుల్ గురియించి శత్రురథముం ♦ ముత్తున్కలం జేసి ని
ర్ధూమజ్వాలపరీతవహ్నికెన యై ♦ రూక్షంబు నాపెన్గదన్
దా మూర్ధంబునఁ గాలదండ మనఁ గ్రో♦ధస్ఫూర్తిమై వైచినన్. ౬౧౮

ఉ. రక్కసుఁ డాగదాహతి శి♦రం బిది మాంసము నెమ్ము లివ్వి యం
చెక్కడ గుర్తు చిక్కక మ♦హిం వెసఁ గూలెను భస్మితుండుగాఁ
దక్కినసోఁకు లద్ది గని ♦ తత్తఱఁ బాఱిరి రోదనాదముల్
మిక్కిలిగాఁగ నట్టియెడ ♦ మేటిబలిష్ఠుఁడు మేఘనాదుఁడున్ ౬౧౯

ఉ. వారల నెల్లఁ గ్రమ్మఱఁగఁ ♦ బల్కి మహోగ్రము కామగంబు నౌ
తేరిపయింగ్రశానుఁ డన ♦ దీప్తిరహించుచు శత్రుసేనలన్
ధీరతఁదాఁకి వానిఁ గని ♦ తేఁకువఁబాఱెను దేవకోటి, పా
కారియు సేనపాటుఁ గని ♦ యందఱ నెల్గిడి పిల్చి యి ట్లనున్. ౬౨౦

కం. తగునా దేవతలారా!, మగతనముల విడిచి పాఱ ♦ మరలుఁడు పోరన్
దెగ వ్రేయఁగ నాసుతుఁ డిదె, పగవానిన్ మాఱుకొనియెఁ ♦ బరికింపుఁ డనన్.

జయంత మేఘనాదుల యుద్ధము.

చం. సురలు పులోమజాతనయుఁ ♦ శూరు జయంతసమాఖ్యు రావణా
సురసుతుఁ దాఁకఁ గాంచి ధృతి ♦ చొప్పడఁ దారును బాసటైన సం
గర మతిరోమహర్షమయి ♦ క్రాలెను రావణశక్రనందనుల్
పరిసరి గాఁగఁ బోరిరి చ♦లంబు బలంబును బాయ కిద్దఱున్. ౬౨౧

సీ. మండోదరిసుతుండు ♦ మాతలినందను, గోముఖుఁ దనువానిఁ ♦ గ్రూరబాణ
ములను నొప్పించిన ♦ బలి జయంతుం డట్లె, యొనరించి రావణు ♦ నుగ్రబాణ
వితతి నొప్పించిన ♦ వీరుఁడు సోఁకుఁడు, నట్టె జయంతుని ♦ నడిచె నంత
విడక మాయను గొని ♦ బెడిదంపుఁజీఁకట్లు, గవియంగఁ జేసి సం♦గ్రామధరణిఁ

ఆ. బ్రాసహూలఖడ్గ♦పరిఘశతఘ్నికా,ముసలభూరిగదల ♦ ముసురు వోలెఁ
గురిసి ధారిణీధ్ర♦కూటకోటుల శత్రు,సేనమీఁద వైచెఁ ♦ జేడ్పడంగ. ౬౨౩

కం. మాయాతిమిరము చేతను, వ్యామోహిత మగుడు నుభయ♦బలములు రక్షః
స్తోమము రాక్షసుల దివౌ,కోమండలి దేవతలను ♦ గూల్పఁగఁ జొచ్చెన్ ౬౨౪

కం. ధ్వాంతము పెల్లున నెచట జ,యంతునిఁ గానంగలేక ♦ యలమటను మరు
త్సంతతి విశాఖుఁ గొనె ని,ట్లంతట వ్యాపించియున్న ♦ యాతిమిరమునన్. ౬౨౫

తే. శచికి జనకుండు-దితికుల♦సత్తముండు
వీరుఁడు పులోముఁ డనువాఁడు ♦ వేగ వచ్చి
తనదు దౌహిత్రు గ్రహియించి♦కొని మఱింగి
యరిగి సాగరమును జొచ్చె ♦ నమరు లిచట    ౬౨౬

చం. హరిహయపుత్రుఁ గానక మ♦హావ్యసనంబున వీతహర్షులై
దరమున నిల్వఁజాలక య♦థాయథ లై చన మేఘనాదుఁడున్
గురుతరసైన్యయుక్తుఁ డయి ♦ కో యని యార్చుచు నంటఁ దాఁకి త
త్సురులను దోలె, నింద్రుఁడు సు♦తుం డటఁ గానఁగరామి వేల్పులున్    ౬౨౭

## ఇంద్రుఁడు యుద్ధమునకు వెడలుట.

చం. కలవరపాటు చెందుటయుఁ ♦ గాంచి రథంబును దేరఁ బంప మా
తలి యటుసేయఁగా ననికిఁ ♦ దర్లె మహేంద్రుఁడు ప్రోదినీలతా
కలితపయోధరోత్కరము ♦ గర్జల నించుచు మున్ను వాయుసం
చలితములై చనెన్, సటన♦సంభ్రమతత్పరలైరి యచ్చరల్.    ౬౨౮

తే. నవ్యగతి వాద్యములను గం♦ధర్వసమితి, పరగఁ జేసెను నిర్జర♦వసుమరుద్గ
ణములు రుద్రులు సాధ్యులు ♦ గుములు గాఁగ, సకలసాధనములతోడఁ♦జనిరికూడ.

కం. పరుషగతి వీచెఁ బవనుఁడు, దొరలె మహోల్కాచయంబు ♦ తోయజహితుఁడున్
బరిధుత తేజుం డయ్యెను, హరిహయుఁ డాలంబు సేయ ♦ నరిగెడివేళన్.    ౬౩౦

కం. ఈలోన మహాభోగా,భీలాశీవిషవితాన♦స్మృత మగుచును ద
ద్వ్యాళవినిశ్వాసానిల, జాలంబులచేత మండు♦చందం బగుచున్    ౬౩౧

తే. విశ్వకర్మకృతం బయి ♦ వెలయు చున్న,స్యందనం బెక్కి దైత్యని♦శాచరాళి
బలసి రాఁ బంక్తికంఠుండు ♦ భండనమున, కేగుదెంచెను శక్రున ♦ కెదురు గాఁగ.

కం. అరుదెంచుచు సుతుతో సం,గరమును జాలింపు మీవు ♦ గాసి దొలంగన్
హరిహయు నే గెలిచెద నన, దురమును జాలించి యతఁడు ♦ దూరం బుండెన్.

## కుంభకర్ణుఁడు దేవతలతోఁ బోరుట.

ఉ. అప్పుడు దేవతావళికి ♦ నాశరకోటికిఁ బోరు ఘోర మై
యొప్పెను గుంభకర్ణుఁడును ♦ యుద్ధము చేయుట యేరితోడ నా
చొప్పు నెఱుంగకే యెదుటఁ ♦ జూచ్చికిఁ దోఁచినవారి నెల్ల దా
నుప్పెన మాఱుకోఁ గడఁగె ♦ నుద్యతభీషణశస్త్రజాలుఁ డై.    ౬౩౪

కం. కరములఁ బదములఁ గోఱల, గురుతరశక్తులను బాణ♦కోటుల నసితో
మరముల నిర్జరులను సం,గరమున వధియింపఁ దొడఁగె ♦ గసిబిసి గాఁగన్.    ౬౩౫

కం. ఆతనివడిఁ గని రుద్రులు, జాతమహాక్రోధమున ని♦శాచరు నానా
హేతిముఖసాధనంబుల, నాతతగతి మోఁదఁ గాఁజొ ♦ నస్రపుధారల్. ౬౩౬

ఉ. రుద్రులు విక్రమించి యద♦రుం బెదరుం గొన కుత్సహించి ని
ర్నిద్రపరాక్రమంబునను ♦ గ్రీడయపోలె నరాతిసేనలన్
రౌద్రము గాఁగఁ ద్రుంచిరి శ♦రంబుల భీకరసాధనంబులన్
క్షుద్రమృగాళి సింహములు ♦ గూల్చువిధంబుగ నేపు చూపుచున్. ౬౩౭

## ⟵ సురసహాయుం డై యింద్రుఁడు రాక్షసుల వధించుట. ⟶

కం. మరుతులు నానాప్రహరణ, కరు లై యరు లైనవారిఁ ♦ గదనంబున ని
ర్భరబలజవగరిమంబులఁ, బరుషగతిన్ నఱికి వైవఁ ♦ బసచెడి సోఁకుల్. ౬౩౮

సీ. కాలుసేతులు దెగి ♦ క్ష్మాస్థలిఁ బడువారు, వాహనంబులతోడ ♦ వ్రాలువారు
రథనాగతురగఖ♦రంబులఁ బన్నగో, ష్ట్రంబుల శింశుమా♦రములఁ గిరుల
నాలింగనము చేసి ♦ యట్టె యుండెడివారు, నిలఁబడినట్టుల ♦ నీల్గువారు
చేష్టావిహీను లై ♦ చేష్పడువారుగా, రణ మొప్పెఁ జిత్ర♦క♦ర్మంబురీతి

తే. శక్రసంభిన్ననిహతని♦శాచరాళి, తనువులను గాఱుశోణితో♦దకము గృధ్ర
కంకసంఘాకులిత మయి♦కాండనక్ర, మగుచు నే ఱయి ప్రవహించె ♦ నద్భుతముగ.

చం. తనబలఁగంబు సర్వమును ♦ దైవతకోటులు ద్రుంపఁగా దశా
ననుఁడు భయంకరాకృతి ఘ♦నస్వన మీనెడిభూరిమార్గికిన్
సునిశితబాణజాలముల ♦ నూర్లకొలందులుఁ గూర్చి దేవవా
హినిపావరెల్ల మాన్పి విబు♦ధేంద్రునిఁ దాఁకినఁ బాకవైరియున్. ౬౪౦

కం. పదిదిక్కుల గుణరావము, గుది గొన నసలాభబాణ♦కోటులు పఱపన్
మదమున దశముఖుఁడు శిత, ప్రదరంబుల నేసెఁ బుష్క♦రము భువి నిండన్. ౬౪౧

## ⟵ రావణుఁడు సురసేనామధ్యమునఁ జొచ్చి యుద్ధము సేయుట. ⟶

చం. ఇరు లలమెం దలంబుగ మ♦హీష్ఠశరోన్నతి, నట్టిచీఁకటిన్
సురలును రాక్షసుల్ పరని♦షూదనదక్షతఁ గ్రాల మత్తు లై
పరమబలాఢ్యు లై పదవ♦భాగము దక్కఁగఁ దక్కరాక్షసో
త్కరముల నాకమందిరులు ♦ కాలునిప్రోలికిఁ బంచి రుద్ధతిన్. ౬౪౨

సీ. స్వీయసైన్యంబుల ♦ క్షీణస్థితిని గాంచి, యాశరేశ్వరుఁడు రో♦షారుణితము
లైనలోచనముల ♦ స్యందనచోదకుఁ, గని యిట్టు లను దివౌ♦కసుల నెల్ల
శక్రునితోడుత ♦ సంహరించెద నేఁడు, శత్రుసేనాంతంబుఁ ♦ జనఁగ నిమ్ము
మన తేరు, వరుణుని ♦ ధనదుని వాసవుఁ, బేరు మాపెదఁ జూడు ♦ పేర్మి వెలయ

తే. విడువుము విషాద మిరుమాఱు ♦ నుడివినాఁడ
నాల మేటికి నందన♦ప్రాంతసీమ
నున్నవారము పూర్వాద్రి♦యొద్ద కిపుడు
పఱపుమీ తేరు సారథీ! ♦ భయము వలదు. ౬౪౩

చం. అనుడు మనోజవంబుల హ♦యంబుల సారథి దోలె శత్రువా
హినినడుమంతరంబున సు♦రేశ్వరుఁడుర్ దశకంఠునిశ్చయం
బును దలపోసి దేవతల♦పూగముఁ గాంచి విబుండు నిర్జరుల్!
వననిధిఁ బర్వవేళఁ జొరఁ♦బాఱెడునట్టులు పంక్తికంఠుఁడున్ ౬౪౪

→ ఇంద్రుఁడు రావణుని బంధింపఁ బ్రయత్నించుట. ←

చం. సురపృతనాంతరంబునను ♦ జొచ్చెడి నిగ్భయుఁ డౌచు వీనినిర్
బొరిగొనరాదు బ్రహ్మవర♦ముం దలపోసి యశౌట బల్మి సం
గరమున బద్ధుఁ జేయఁ దగు ♦ గం డడఁగం బలి బద్ధుఁ జేసి సౌ
ఖ్యరమ జగత్త్రయంబు వెతఁ ♦ గానక యుండఁగఁ బ్రోవఁగాఁ దగున్. ౬౪౫

చం. అని దశకంఠునిర్ విడిచి ♦ యన్యతలంబున కేగి పాకశా
సనుఁ డసురౌఘముం దునుమఁ ♦ జాఁగె దశాననుఁ డుత్తరంపుది
క్కున సురసేనఁ జొచ్చుడును ♦ గొబ్బున వజ్రియు దక్షిణంపువై
పున బలఁగంబుఁ జొచ్చె, మద♦పూర్ణమనస్కుఁడు రాక్షసేంద్రుఁడున్ ౬౪౬

కం. యోజనశతంబు శాత్రవ,రాజిని దాఁ జక్కఁ జని శ♦రంబుల సురలర్
వాజులఁ దేరుల వీరులఁ,దేజు చెడర్ నఱికి వైచె ♦ ధృతి బాసటగన్. ౬౪౭

కం. రావణుబీరముఁ గాంచి శ,చీపిభుఁ డవ్వానిఁ బట్టఁ ♦ జింతించి దివౌ
కోవారము తోడ్పడ ర,క్షోవిభునిం దాఁకె నతఁడు ♦ సుడివడ భ్రమచేన్. ౬౪౮

కం. అయ్యెడ నిటు దశవదనుఁడు,కయ్యంబున గ్రస్తుఁ డైన♦గతి నుండుడు హా!
యయ్యో!యయ్యో!చచ్చితి,మయ్యో!యనియఱవఁదొడఁగి♦రసురులు గుములై.

→ మేఘనాదుఁడు మాయచే నింద్రుని బంధించుట. ←

చం. అది విని మేఘనాదుఁడు శ♦తాంగము నెక్కి రుషోగ్రమూర్తి యై
త్రిదులనివీఁకఁ దూర్ణగతి ♦ వేల్పులమూఁకలలోనఁ జొచ్చి యీ
శ్వదయను లబ్ధమైన భృశ♦శాంబరిఁ గైకొని దేవతాళిలర్
వదలి మహేంద్రు నొక్కరు న♦వక్రపరాక్రమ ముల్లసిల్లఁగన్. ౬౫౦

ఉ. నొంపఁ గడంగ రావణత♦నూజునిఁ గానక వృత్రవైరి యో
జింప విముక్తవర్మఁ డయి ♦ చేపడి వధ్యుఁడు నయ్యు మాయ ర

క్షింపఁగ మేఘనాదుఁ బర♦సేనల నెవ్వఁడు నేమి సేయఁగాఁ

దెంపరిగాఁడు, రావణియుఁ ♦ దీవ్రశరంబుల నొంచె మాతలిన్. ౬౫౧

చం. తికమిక లాడ దీలుపడఁ ♦ దేఁకువఁ గూరఁగ శాతమార్గణ

ప్రకరము లన్నివంకల ఘు♦రంబు లనం దనునాట శక్రుఁడున్

వికలుఁడు గాక మాతలిని ♦ వీడి రథంబును బాసి వెల్లయే

నికపయి నెక్కి వైరిసుతు♦నిన్ నెమకెన్ దివి నాల్గువంకలన్. ౬౫౨

శా. మాయారక్షితుఁ డౌట రావణియు జం♦భద్వేషికిం దోఁప కే

చాయం దానుగ నుండి శాతశరపుం♦జంబుల్ మహావేగముల్

కాయం బంతయుఁ గ్రుచ్చి గాసిగొనఁగాఁ ♦ గావించి శ్రాంతాత్ముఁడౌ

నాయాదిత్యవిభున్ మహేషువుల మా♦యాబద్ధుఁ గావించుచున్. ౬౫౩

కం. కొనిపోవ నిర్జరాళులు, గని యే మిది యెవ్వఁ డొక్కొ ♦ కనరాక సురేం

ద్రుని మాయావిద్యావిదుఁ, దనమాయం గట్టె బలిమి ♦ దారుణరీతిన్. ౬౫౪

మ. అని రోషంబున రావణాసురుని వ♦స్వాదిత్యు లత్యుగ్రులై

ఘనసారాచపరంపరానిహతులన్ ♦ గాసిల్లఁగాఁ జేసినన్

దనుజేంద్రుండు ప్రతిక్రియాకలనకున్ ♦ దార్ఢ్యంబు లేకాద్విష

జ్జనతాతాడన మోడ్చి డీల్పడెఁ, దనూ♦జాతుండు దా నంతలోన్ ౬౫౫

←→ రావణుఁడు యుద్ధముఁ జాలించి మేఘనాదునిఁ బ్రశంసించుట. ←→

సీ. గాటంపుఁటేటులఁ ♦ బోటులఁ దూఁటు లౌ, మేనితో గాసిల్లి ♦ మిడుకువాని

జనకునిఁ గనుఁగొని ♦ చాలింపు నాయనా!, సంగర మింకేల ♦ జయము మనది

సత్య మెఱుంగుము ♦ స్వస్థచిత్తుండ వై, మరలింపు సేనల ♦ సురవిభుండు

మూఁడులోకములకు ♦ ఱేఁ డైనవాఁ డిప్డు, బద్ధుఁ డయ్యెను సుర♦పటలి పఱచె

ఆ. బలిమి నరిని గెలిచి ♦ యెలమి ముల్లోకంబు, లీవ యేలు మేల ♦ వృథగ శ్రమము?

రణము నిష్ఫలంబు ♦ రమ్ము బృందారకుల్, కదనమున నివృత్త♦కర్ము లైరి. ౬౫౬

కం. నావుడుఁ గుదుటఁ బడన్ మది, రావణుఁడు నితాంతహర్ష♦రసవివశుం డై

పో విడిచి యుద్ధకర్మం, బావీరునిఁ జూచి యనియె ♦ నన్నా! తనయా! ౬౫౭

ఉ. ఏమి భవద్బలంబు త్రిది♦వేశ్వరు బద్ధు నొనర్చి దేవతా

స్తోమముఁ బాఱఁదోలితివి ♦ తోరపుఁగీర్తి గడించి తీవు పు

త్రా! మనయన్వయంబు ప్రథి♦తం బొనరించితి కాన నీవు, సు

త్రాముఁడు త్వద్రథస్థుఁడుగఁ ♦ దర్లుము లంకకు నెల్లసేనతోన్. ౬౫౮

కం. నీ వెనుక నేను వచ్చెద, సేవింపఁగ నాదుమంత్రి♦శేఖరులెల్లన్

నీవే కద జిష్ణుండవు, నీవిజయముఁ బొగడఁ బడెడి ♦ నెఱి నం చనినన్. ౬౫౯

తే. మేఘనాదుండు బంధించి ♦ మేఘవాహుఁ, దనరథంబునఁ గొని నిజ♦ధ్వజిని గొల్వ
స్వీయభవనంబునకు నేగి ♦ వీరవరుల, నెల్లఁ దమతమయిండ్లకు ♦ నేగఁ బనిచె.

◆⟶ బ్రహ్మ లంకకుఁ బోయి రావణమేఘనాదులఁ బ్రశంసించుట. ⟵◆

కం. రావణతనయుం డిటులై, రావణవాహనుని దనపు♦రంబునకుం బెం
పావహిలం గొని యేగిన, దేవత లజుఁ దోడుకొనుచు ♦ దీనత దోఁపన్. ౬౬౧

ఉ. లంకకుఁ బోవ మింటన ని♦లంబడి పద్మభవుండు దేవతా
సంకటహేతు భ్రాతృతను♦జాతసమావృతుఁ బంక్తికంఠు ని
శ్శంకమదోద్ధతుం బలుకు ♦ సాహసశీలక! వత్స! రావణా!
యంకమునన్ భవత్సుతప♦రాక్రమ మెంతయు మెచ్చు గూర్చెడిన్. ౬౬౨

కం. నీకొడుకు నీకుఁ దుల్యుఁడొ, నీకును నధికుండొ ప్రతిన ♦ నీసుతుబలిమిన్
బ్రాకటముగ నెఱవేర్చితి, లోకంబులు మూఁడు నీకు ♦ లోఁకువ యయ్యెన్.

కం. అతిబలుఁడు వీరుఁ డగునీ, సుతుఁ డింద్రజి యనెడికీర్తి ♦ శూరవరా! శా
శ్వతముగఁ గాంచెడు నమర, క్షితి దుర్జయుఁ డగును విమత ♦ చీవిభు నింకన్. ౬౬౪

చం. ప్రతిఫల మెద్ది కోరెదవు ♦ వాసవమోక్షముపొంటె నావుడున్
శతధృతిఁ జూచి పంక్తిముఖ♦నందనుఁ డిట్లను నోపితామహా!
శతమఖు వీడెదన్ దయ నొ♦సంగవె నాకమరత్వ మన్న వా
క్పతి భువిఁ బ్రాణికోటులను ♦ గల్గునొకో సకలామరత్వమున్. ౬౬౫

కం. పులుఁగులలో నాలుగుపద, ములజంతులలోన నిఖిల♦భూతంబులలోఁ
గలకాల మెట్టిదానికి, నలవడునే బ్రదుక మిత్తి ♦ నందక యెపుడేన్. ౬౬౬

◆⟶ { బ్రహ్మ మేఘనాదుఁడు కోరిన వర మిచ్చి యింద్రుని విడిపించుకొని పోవుట. } ⟵◆

చం. అనవుడు నింద్రజిత్తనియె ♦ నట్టిదయేని రణంబువేళ నేఁ
డునుమఁగ శత్రులన్ నియతి♦తో యజియించెద వీతిహోత్రుఁ, దా
నన జనియించునశ్వయుత♦నవ్యశతాంగము నెక్కి సంగరం
బొనరుచుచో నమర్త్యతను ♦ నొందఁగ ని, మ్మసమాప్తి యద్దియై ౬౬౭

కం. దురమున కేఁ గడఁగినచో, మరణంబున కీయకొంటి ♦ మఘవుని విడుతున్
సరసిజసంభవ! నీ వీ, వరమున్ దయచేసి తేని ♦ వాత్సల్యమునన్. ౬౬౮

కం. అందఱుఁ దపమున నిన్నా, నందింపఁగఁ జేసి కడున♦ణంకువ దీనిన్
బొందెద రే భుజబలమున, నందెద దేవా! యమర్త్య♦తాతిమహిమమున్. ౬౬౯

కం. అన నట్లకాక యన వ, జ్రిని విడిచెన్ దాశకంఠి ♦ త్రిదివేశులు నా
తనిఁ దోడ్కొని నాకమునకుఁ, జను నెడ దుఃఖమునఁ జింత ♦ సంకట పడుచున్, ౬౭౦

కం దీనుం డై యమరద్యుతి,హీనుం డై నేలఁ జూచు ♦ చెంతో వగచే
మ్లానుం డగుపాకారికి, జ్ఞానం బుదయింప నబ్జ♦సంభవుఁ డనియెన్. ౬౨౧

బ్రహ్మ యింద్రునితో నతఁడు బద్ధుఁ
డగుటకుఁ గారణముఁ జెప్పుట.

కం. నవ్వుచుఁ జేసినపాపం, బెవ్వరుఁ గుడువంగ వలదె ♦ యేడ్చుచుఁ బిదపన్?
గ్రొవ్వున నీచేసినయఘ, మివ్విధిఁ దలకొనియె నేల ♦ యేడ్చెద విట్టుల్. ౬౨౨

సీ. ఇంద్ర! నాబుద్ధిచే ♦ సృజియించితిని బ్రజ, నేకవర్ణంబుగ ♦ నేకరూప
ముగ నేకభాషగ ♦ మొదల వారలలోన, దృష్టికి భేదమే ♦ యెఱుక పడదు
పదపడి వేఱొక♦పద్ధతి దానికి, మిన్నగఁ గల్పింప ♦ నెన్ని నేను
బ్రజల విశిష్ట మౌ♦ప్రత్యంగమును దీసి, రూప గుణంబుల ♦ రూఢిఁ గన్న
తే. మెలఁత నొక్కయహల్య ని♦ర్మించినాఁడ
హాల మనంగ వైరూప్యంబు ♦ హాల్య మనఁగఁ
దద్భవం బట్టిహల్య మా♦తరుణి కెందు
లేమిని నహల్య యనఁగ నే ♦ నామ మిడితి. ౬౨౩

చం. ఇటు సృజియించి యెవ్వనికి ♦ నీకుటిలాలక నిత్తు నంచు సం
కటపడు చుండఁ జిత్తమునఁ ♦ గామినిఁ గోరితి వింద్ర! నీవు ను
త్కటపదగౌరవంబున జగ♦త్ప్రభుతం దగు నాకుఁ గాక యీ
స్ఫుటజలజాక్షి నిస్తులిత♦సుందరి యెవ్వని కర్హ యం చెదన్. ౬౨౪

ఉ. ఇల్లడగాఁగ గౌతముని♦యింటన యుంచితిఁ బెక్కులేఁడు లు
త్ఫుల్లసరోజలోచనను ♦ దోసపుఁగర్జముపొంతఁ బోక తాఁ
గల్లరి గాక తత్సతిని ♦ గ్రమ్మఱఁ బంచె నతండు, దాని కే
నుల్లము లోనఁ దన్నియతి ♦ కూర్జిత మైనతపంబుసిద్ధికిన్. ౬౨౫

కం. మెచ్చిజలజాక్షి నతనిక, యిచ్చితి నిల్లాలు గాఁగ ♦ నీ వెఱిఁగి మదిన్
మచ్చరమున ముని వనికిం, జెచ్చెరఁ జని యందు నగ్ని♦శిఖ కెన యగుచున్ ౬౨౬

కం. రాజిలురాజీవాక్షిని, రాజీవశరార్తిఁ జిక్కి ♦ రతిఁ గూడఁగ నా
లో జటి యాశ్రమగతుని బి,డౌజా! నిను దుర్దశాప్తు ♦ నుగ్రతఁ దిట్టెన్. ౬౨౭

కం. ఏమిర వాసవ! నీవే, కాముకమతి నాదుపత్నిఁ ♦ గవిసితి వటరా!
ధీమసమున నిర్భీతిని, నీమార్తునిచేతఁ జిక్కి ♦ నెవ్వగఁ గనుమీ.[1] ౬౨౮

మ. కుమతీ! నీ విపు డాచరించినమహా♦ఘోరాఘకర్మంబు లో
కములన్ మానవులందునుం బరఁగెడిం♦గా కింక, జారత్వపా

[1] బాలకాండమునఁ జెప్పఁబడిన శాపమున కిది పర్యాయముగాదు. సహస్రయోనిత్వము. శత్రుకృత పరాభవము రెండు నేకకాలమున నిచ్చిన శాపంబులే.

పమునం దగ్ధము కర్త నొందెడు, నినుం ♦ బ్రాపించు శేషార్ధ, ము
త్తమ మానీమపదం బశాశ్వత మగుం ♦ దథ్యంబు నీ కీపయిన్. ౬౭౯

కం. నీకే కాదుర దుర్గతి, నీకైవడి నెవ్వఁ డెవఁడు ♦ నిర్జరపతి యాఁ
బ్రాకటగతి నాతండును, నీకరణిని భ్రష్టుఁ డగును ♦ నిజ మని మఱియున్. ౬౮౦

కం. సతిఁ గని గర్జించుచు ముని,పతి యనియెన్ దుష్టురాల ♦ పడియుండుము నీ
యతిసౌందర్యము పాడుగ, క్షితిపై నీయాశ్రమంబు♦చెంతన యసతీ! ౬౮౧

కం. సౌందర్యము ప్రాయంబును, బొందియు మది చంచలత్వ♦ముం బొరయుటచే
సుందరి వీ వొకతవె గా, కుందువుగా కిలను నీకు♦నుదు టణఁగంగన్. ౬౮౨

కం. ఏసౌందర్యముకలిమిని, నీసరణిని మిడిసి పడితి ♦ వీవు కృతఘ్నీ!
యీసౌందర్యము జనముల,లో సాధారణమ యగుత ♦ లుప్తవివేకా! ౬౮౩

కం. అని తిట్టె నాఁడు మొదలుగ, వనితలు సౌందర్యవతులు ♦ ప్రభవించిరి భూ
మిని లొల్లిగ నెల్లయెడన్, వనజాక్షి విధేయ యగుచుఁ ♦ బతి కిట్లనియెన్. ౬౮౪

కం. నీయాకృతిఁ గొని యింద్రుం, డీయాగడమున్ ఘటించె ♦ నెఱుఁగక చెడితిన్
నాయజ్ఞానము సైఁపుము, చేయను జుమి కామమదము♦చేఁ బాపంబున్.[1] ౬౮౫

సీ. అని వేఁడుకొనిన మ♦హర్షి యాసతికి ని,క్ష్వాకువంశంబున ♦ సత్యరతుఁడు
రామనామంబునఁ ♦ బ్రథితుండు జనియించు, మానుషవిగ్రహం ♦ బూనియున్న
యావిష్ణుమూర్తి బ్రా♦హ్మణునిమిత్తమై, యరుదెంచు నిటకు నీ ♦ వతనిఁ గాంచి
పూత వయ్యెదవు త♦త్పుణ్యుండు దక్క నీ, పాపంబు నెవ్వఁడుఁ ♦ బాప లేఁడు

తే. తథ్య మియ్యది యతని కా♦తిథ్య మిచ్చి
వెండి ననుఁ జేరఁ గలవు వే♦తండయాన
యవల నాతోడ వసియింప ♦ నగును నీకు
ననుచు స్వాశ్రమమును జొచ్చె ♦ నమ్మహర్షి. ౬౮౬

ఆ. బ్రహ్మవాదిపత్ని ♦ పచరించె నట్టు లే, యమ్మహర్షి తిట్టె♦నట్టులెల్ల
దాపచరించె నీకుఁ ♦ దప్పునే యెందైనఁ, బాపఫలము విప్ర♦శాపఫలము. ౬౮౭

కం. స్మరియింపుము నీచేసిన,దురితంబును శక్ర! యిట్టి♦దోషంబున నీ
కరణి నరిచేతఁ జిక్కితి, వరయఁగ నిద్దాని హేతు ♦ వదియే వింటే. ౬౮౮

కం. నీతనయునకై వగవకు, నీతుం డై యతఁడు జలధి♦నీరంబులలో
మాతామహరక్షితుఁ డై, చేతోమోదంబుఁ గనెడిఁ ♦ జింతాచ్యుతుఁ డై. ౬౮౯

కం. కావున వైష్ణవయాగముఁ, గావింపుము దానఁ దొలఁగఁ ♦ గల్మషచయముల్
దేవేంద్ర! నాకమునకుం, బోవచ్చు న టన్న నట్ల ♦ ఘొనరిచె నతఁడున్. ౬౯౦

[1] జంకాడ నేర్చినమ్మ బొంకాడ నేర్వదా.

ఉ. ఇంద్రజితుం డనంగ నతఁ ♦ డెంతటివాఁడొ నృపాల వింటివే
యింద్రునిఁ బట్టి కట్టె నన ♦ నేమిటి లెక్క తదన్య లంచనన్
సాంద్రతరాద్భుతంబుఁ గొని ♦ జ్ఞాతనయాపతి లక్ష్మణుండు కీ
శేంద్రులు మెచ్చి రౌర యని ♦ యిట్లు మునీరితగాధ యంతయున్ ౬౯౧

తే. విని రఘూత్తముకెలనివి♦భీషణుండు, పూర్వ మెప్పుడొ కనినది ♦ పూర్ణముగను
స్మృతికి వచ్చెను నేఁ డన ♦ క్షితిధవుండు,మెచ్చెను నగస్త్యమానీంద్రు♦ మేలినుతుల. ౬౯౨

కం. ఈవిధమున దశవదనుఁడు, దేవేంద్రజితుండు తనకు ♦ దేనికిఁ దో డై
రా విశ్వకంటకుం డై, యేవారిని సరకు గొనక ♦ యెసఁగుచు నుండెన్. ౬౯౩

## ←→ రావణుఁడు కార్తవీర్యార్జును గెలువఁ బోవుట. ←→

సీ. అని యిట్లు ముని పల్క ♦ నాశ్చర్యమగ్నుఁ డై, జననాయకుం డను ♦ మునివరేణ్య!
క్రూరుఁ డై పోఁకుండు ♦ గ్రుమ్మర లోకంబు, శూరత్వశూన్య మై ♦ స్రుక్కె నయ్య?
రా జొండెఁ గాకున్న ♦ రాజమాత్రుం డైనఁ,గలుగఁడా యొక్కఁడా♦బలియుఁ గెలువ
నక్కటా! క్షత్త్రియుల్ ♦ హతవీర్యు లైరికా, నిర్జితు లైరికా ♦ నిఖలనృపతు

తే. లేమి! పరమాస్త్రవిదులు బ♦హిష్కృతులుగ
నైరె యనుడును మునివర్యుఁ ♦ డమ్మహాత్ముఁ
గాంచి నవ్వుచు నీశ్వరుఁ ♦ గమలభవుఁడు
పలుకునట్టులు ప్రీతి మైఁ ♦ బలికె నిట్లు. ౬౯౪

మ. ధరణీపాలుర నెల్ల నేఁచుచును దో♦ర్దర్పాంధుఁ డై ధారిణిం
జరియించెన్ దశకంఠుఁ డట్లు చనుచున్ ♦ సత్త్వాఢ్య మాహిష్మతీ
పురినాథున్ విని శక్రపత్తననిభం♦బున్ వహ్నిసాన్నిధ్యమున్
శరకుండస్థితపావకంబు నగుచున్ ♦ సప్తార్చికిం దుల్యుఁ డౌ ౬౯౫

కం. అర్జునుఁ డేలెడితత్పురి, కర్జునుతో రణము సలుపు ♦ నభిలాషను న
త్యూర్జితజవమునఁ జనినం, దర్జితశాత్రవచయుండు ♦ తరుణులతోడన్ ౬౯౬

## ←→ కార్తవీర్యార్జునుఁడు నర్మదయందు స్త్రీలతోఁ గ్రీడించుట. ←→

చం. వనజదళాక్ష! రావణుఁడు ♦ వచ్చిననాఁడ యతండు నర్మదా
వనములఁ గేళిఁ దేలఁ జనెఁ ♦ బంక్తిముఖుండును మంత్రికోటిన
ర్జునుఁ డెట నున్నవాఁడు రణ♦శూరుఁడు రావణుఁ డేగుదెంచె నిం
దని కని మీర లేగ సర♦యుంబుగఁ దెల్పుఁడు పొం డటంచు చనన్. ౬౯౭

సీ. వారలు మహిపతి ♦ యూర లేఁ డన విని, పురమును బాసి యా♦భూరిబలుఁడు
నీహారశైలస♦న్నిభ మైనదానిని, నభ్రంబుగతి మింటి ♦ నంటుదానిఁ

బుడమి నుద్భేదించి ♦ పుట్టినా౽ దగుదాని, గగనమార్గం బరి♦కట్టుదాని
వేశిఖరంబుల ♦ వెలుఁగుచుండెడిదాని, హరిచయనిబిడకం♦దరముదానిఁ
తే. దటులఁబడియెడువంకల♦ధ్వనులచేత, నట్టహాస మొనర్చున ♦ ట్లమరుదాని
స్త్రీలతోఁ గ్రీడ సల్పెడి♦దేవదనుజ,కిన్నరులు గల్గి దివ మన ♦ నున్నదాని ౧౯౭

→ రావణుఁడు నర్మదాతీరంబున విడియుట. ←

చం. పటికపుఱాలఁబోలి కడు♦స్వచ్ఛము లౌ సెలయేళ్ళనీరముల్
తటముల నుండిజాఱెడివి♦ధంబుల నాల్కలు గ్రోయువాయుభు
క్పటలముపాఱురీతిఁ దలఁ♦పన్ ఘటియించెడిదాని వింధ్యముం
గుటిలచరిత్రకుండు గని ♦ గొబ్బునఁ జేరఁగఁ బోయె నర్మదన్. ౧౯౮

చం. పడమటివారిధిం గలియఁ♦బాఱెడిదాని శిలాచలోదకన్
వడఁబడి యెండకుం దలరి ♦ వారణ ఘోణిమృగేంద్రముల్ తృషన్
వడి జలమందు దూఁకి కలఁ♦పన్ మలినం బగుదాని నింపుగా
విడువక క్రోళ్ళు జక్కవలు ♦ బెగ్గురు లంచలుఁ గూయుదానినిన్. ౨౦౦

సీ. ఉత్ఫుల్లభూజకృ♦తోత్తంసయును జక్ర,వాకయుగస్తని ♦ వారిఫేన
నిర్మలాంశుక నీల♦నీరజలోచన, హంసావళీమేఖ♦లానుబద్ధఁ
బ్రాకటవిస్తీర్ణ♦సైకతసుశ్రోణిఁ, బుష్ప రేణ్వనులిప్త♦పుణ్యసుభగ
సలిలావగాహసు♦స్పర్శ యానర్మద, స్రోతస్వినీవరఁ ♦ జూచి యసుర
ఆ. యిష్టురాలితోడ ♦ నెలమిఁ గ్రీడించెడి,భంగి స్నానమాడి ♦ పరమమౌని
సేవ్యమాన మైన♦భవ్యతరంగిణీ,తీరమందు నిసుక♦దిన్నె మీఁద. ౨౦౧

చం. ఎలమిని గూరుచుండి యిది♦యే చుఁడి గంగ యటంచు మెచ్చి మం
త్రులశుకసారణాఖ్యుల న♦నున్ జగమంతయుఁ బైఁడివోలె నీ
జలజహితుండు తీవ్రకర♦సంతతులన్ ఘటియించి మింటిపైఁ
దలఁకుచు నూటిగా నిలిచె ♦ దానవసత్తములార! కంటిరే? ౨౦౨

చం. ఖరకరుఁ డయ్యె నాయిచటఁ ♦ గ్రాలెడిరీతి నటింగి భీతిచేఁ
బరఁగెఁ దుషారభానుగతి ♦ వాయువొ శైవలినీజలార్ద్రుఁడై
సరససుమావళీసురభి♦సంపద కానుకగాఁగఁ దెచ్చి నా
కరుసము గూర్చి నిర్భరసు♦ఖావహుఁడై చరియించెఁ గంటిరే? ౨౦౩

తే. నర్మవర్ధన యగుచును ♦ నర్మదయును, నక్రమీనవిహంగ గోష్ఠి ♦ నవ్యయగుచు
నిన్వెఱను దటకాపడి ♦ నిలిచియున్న,జవ్వని యనంగ ఘటియించె ♦ సమ్మదంబు.

ఉ. కావున నింద్రతుల్యమహి♦కాంతులతోడఁ బెనంగి వారిశ
స్త్రావళి గాయముల్ పడితి ♦ రంగములన్ హరిచందనద్రవం

బై విలసిల్లె నెత్తురులు ♦ హాయిగ శర్మద యైనన ర్మదన్
వావిరిసార్వభౌమముఖ ♦ వారణవర్గము జాహ్నవిం బలెన్ ౨౦౪

ఉ. మీ రవగాహనంబునకు ♦ మేకొనుఁడీ, నది సర్వపంకని
స్తారక, నేనునున్ మునిఁగి ♦ శారదసారసశాత్రవోపమం
బై రహియించుసైకతము ♦ నందుఁ గపర్దిని బూజఁ జేసెదన్
మీ రరుగుం డనంగ రజ ♦ నీచరవల్లభునాజ్ఞ మంత్రులున్. ౨౦౫

సీ. తూర్ణంబ సారణ ♦ ధూమ్రాక్షశుకులు ప్ర, హస్తమహోదరుల్ ♦ హర్ష మెసఁగ
నదిఁ జొచ్చి రాసుర ♦ నాగసంక్షుభిత మై, వామనాంజనపద్మ ♦ వారణముల
చేత క్షుబ్ధం బైన ♦ శ్రీజాహ్నవినిబోలె, వారును జల కేళి ♦ వదలి లేచి
రావణునకు బలి ♦ కై వన్యసుమములఁ, దేరంగ నేగి త ♦ త్తీరమునను

ఆ. గోరినన్నిపూలు ♦ కొల్లలుగా నుంట, రాశిపోసి రందు ♦ గ్రావ మనఁగఁ
బంక్తిముఖుఁడు దోఁగి ♦ పరమజప్యంబున, జప మొనర్చి దరికిఁ ♦ జయ్యి వచ్చి.

రావణుఁడు శివలింగపూజ సేయుట.

కం. తడిచేల విడిచి వేఱొక, పొడివస్త్రముఁ దాల్చి లింగ ♦ మున కర్హంబౌ
పుశమికా వెదకుచుఁ గరములు, ముడిచి కొనుచు నరిగె; నసుర ♦ ముఖ్యులు వెంటన్

కం. గూపములు కొనినకొండల, కోపున నతఁ డరుగు నెడకుఁ ♦ గొని చనిరి దినం
బాపంక్తిముఖుఁడు పూజా, వ్యాపారితఁ దన్ను జాళు ♦ వాలింగంబున్. ౨౦౯

కం. ఆకనకలింగ మొకచో, సైకతవేదికను నిల్పి ♦ శ్రద్ధాయుతుఁ డై
శ్రీకరగంధసుమాదులఁ, బ్రాకటగతిఁ బూజ చేసె ♦ రావణుఁ డంతన్. ౨౧౦

కం. వరదుఁడు చంద్రకళాలం, కరణసముంచితుఁడు గరళ ♦ కంఠుండు వ్యథా
హరుఁ డగుశివుఁ బాడుచుఁ దాఁ, గరములు పైకెత్తి నటన ♦ కార్యముఁ దీర్చెన్.

అర్జునుఁడు తనభుజములచే నర్మద నడ్డగించుట.

సీ. ఆతఁ డీవిధి శివు ♦ నర్చించు నెడకు దా, పున నె మాహిష్మతీ ♦ పురవిభుండు
సారసలోచనా ♦ సహితుఁ డై జల కేళిఁ, దేలుచు నుండె నా ♦ స్త్రీలనడుమ
నాఁ డేనుఁగులనడు ♦ మంతరమందు వే, తండమో యన నర్జు ♦ నుండు పొలిచె
బాహువుల్ వేయింటి ♦ బలమును బరికింప, నయ్యేటి నాఁకట్టె ♦ నద్భుతముగ

ఆ. వానిమీఱి రాక ♦ వాహిని యెదు రొడ్డి, నక్రమకరమీన ♦ నవ్యపుష్ప
దర్భసంస్తరసహి ♦ తంబుగాఁ బ్రవహించె, వానకాలమందు ♦ వలెఁ గనంగ. ౨౧౨

కం. రావణుకార్యముఁ జెఱుపఁగ, నీవహి నర్జునుఁడె పంపె ♦ నేమో నది నా
నావాహిని దశముఖునకు, మావళి సంతయును వఱద ♦ యందుం గలిపెన్. ౨౧౩

⟷ నర్మద యెదురొడ్డిపాఱి రావణుపూజాద్రవ్యంబుల ముంచుట ⟷

చం. నగము సమాప్త మైనగిరి♦జాపతిపూజను మాని నర్మదా
పగ ప్రతికూలకాంత యనఁ ♦ బై నెదు రై చనుదేరఁ బశ్చిమం
బుగఁ బ్రవహించునీతటిని ♦ పూర్వముఖంబుగఁ బాఱ హేతు వే
మిగ ఘటియిల్లె, నింతకును♦మీఁద స్వభావపుశాంతిఁ దాల్చుచున్ ౨౧౪

తే. ఉరుతరభ్రాంతి విహగంబు ♦ లొప్పు చుండ
నిర్వికారాంగనయుఁబోలె ♦ నీటు మెఱయు
నాపగను గాంచి కుడికేలి♦యంగుళమున
సైఁగఁ గావించె నాశుక♦సారణులకు. ౨౧౫

⟷ శుకసారణులు నర్మద యెదురెక్కి పాఱు కారణము రావణుతోఁ జెప్పుట. ⟷

ఉ. అన్నయుఁ దమ్ముఁ డానృపుని♦యానతిఁ గైకొని పశ్చిమంబుగాఁ
గ్రన్నన మింటిత్రోవఁ జనఁ♦గా నఱయామడదూరమందుఁ దాఁ
గ్రొన్ననఁబోఁడిపిండులను ♦ గూడి జలంబులఁ గ్రీడ దేలు చ
త్యున్నతసాలమో యనఁగ ♦ నుండెడివానిని బూరుషోత్తమున్ ౨౧౬

కం. తోయవ్యాకులకుంతలుఁ, డై యెఱ్ఱనికనులతో మ♦దాకులతేజుం
డై యుర్విని హాటకగిరి, వేయిపదంబులను నిలుపు♦విధ మొప్పారన్. ౨౧౭

సీ. తన వేయికరములఁ ♦ దటినీలలామంబు, నాఁకట్టి క్రీడించు♦నతులశౌర్య
సమదవశాసహ♦స్రములతోఁ గ్రీడించు, మదవారణమునకు ♦ మాద్రి యగుచు
బాలావరాంగనా♦జాలవృతుం డయి, కేళీవిలోలుఁ డై ♦ క్రాలువాని
సరిజనభయదుఁ డై ♦ యద్భుతచరితుఁ డౌ, నర్జునుఁ జూచి ద♦శాస్యుఁ జేరి

తే. వార లి ట్లని రధిప వే♦బాహు లొప్ప, వాఁడు జల కేళిఁ దేలుచు♦న్నాఁడు నదిని
నంగనలతోడఁ దన వేయి♦హస్తములను, నడ్డకట్టఁగ నది యెదు♦రొడ్డి పాఱె. ౨౧౮

⟷ రావణుఁడు కార్తవీర్యార్జునుతోఁ బోరఁ జనుట. ⟷

చం. అని శుకసారణుల్ పలుక ♦ నాతఁడె యర్జునుఁ డంచు రావణుం
డనిపయిఁగల్గుకాంక్ష వసు♦ధాధిపుఁ డున్నెడ కేగుచుండ ని
స్స్వనయుత మై రజంబుఁ గొని ♦ వాయువు వీచెను సమ్ముఖంబుగా
వనదము రక్తవర్షమును ♦ వ్రాల్చె సకృత్కృతభీమరావ మై. ౨౧౯

తే. అపుడు శుకసారణులును ధూ♦మ్రాక్షుఁడును మ
హోదరుండు మహాపార్శ్వుఁ ♦ డుక్కు మెఱసి
తోడ రాఁ జని మేచక♦తోయదాభుఁ
డనతిదూరంబునను గాంచె ♦ నవనినాథు. ౨౨౦

కం. తోయ్యలులతోడ సీటను, నెయ్యంబునఁ గ్రీడసలుపు ♦ నెఱసరిఁ గని తాఁ
జయ్యనఁ జని కన్నెఱ్ఱగ, నయ్యవనిపుసచివతతికి ♦ ననియె మదమునన్. ౨౨౧

కం. తెప్పునఁ జని మీపతికిం, జెప్పుఁడు దశకంఠుఁ డసుర ♦ శేఖరుఁ డనికై
కప్పరపడి వచ్చె నటం, చప్పలుకుల నాలకించి ♦ యమ్మంత్రివరుల్. ౨౨౨

కం. బలెబలె రాక్షసనాయక, కలనికిఁ దగువేళఁ జక్కఁ ♦ గా నెఱిఁగితి వౌఁ
జెలువలను గూడి మత్తునఁ, జెలువారెడు వేళ రణము ♦ సేయఁగఁ బిలుతే? ౨౨౩

కం. కుంజరగమనలకూటమి, రంజిల్లుచుఁ గరిణిచయము ♦ గ్రాలఁగఁ జుట్టున్
గుంజర మన నుండెడినృప, కుంజరుతో నిదియ యదనొ ♦ కో పోరంగన్. ౨౨౪

## అర్జునరావణమంత్రుల యుద్ధము.

సీ. సైరింపు దశకంఠ! ♦ యీరేయి చన నిమ్ము, యుద్ధమందాసక్తి ♦ యున్న దేని
వఱువాతఁ జనుదెమ్ము ♦ పతితోడఁ బోరఁగఁ, గాదు కూడ ద టంచుఁ ♦ గడఁగె దేని
రా రమ్ము మము గెల్చి ♦ రాజు డాయఁగఁ బొమ్ము, టన్న రావణమంత్రు ♦ లన్నృపాలు
ప్రెగడలఁ దాఁకిన ♦ బీభత్సముగఁ బోరు, భయద మై హాలాహలా ♦ ర్భటులఁ జెలఁగె

తే. నృపతిసచివులు శూలఖ ♦ డ్గేషునికర, పాతముల రావణుని ముంపఁ ♦ బ్రబలు లౌప్ర
హస్తశుకసారణులు వారి ♦ నతులశక్తి, నేలపా లొనరించిరి ♦ నిమిషమునను. ౨౨౫

ఉ. ద్వారము రక్షసేయుభట ♦ వర్గము దెల్పఁగ నీయుదంత మా
భూరమణుండు లేచి పువుఁ ♦ బోణులకున్ ధృతిసూక్తు లాడి యా
నీరము నుండి వెల్వడి చ ♦ నెన్ గదఁ గొం చెదఁ గొంకు లేక రో
షారుణనేత్రకంజుఁ డయి ♦ యాశరుమీద మణంప వేగమై. ౨౨౬

## కార్తవీర్యార్జునుఁడు ప్రహస్తునిఁ బడ నడుచుట.

ఉ. గారుడవేగ మైనగద ♦ గ్రాలఁ గరంబున వచ్చునర్జునున్
వీరవరుం బ్రహస్తుఁడును ♦ వింధ్యము భాస్కరునట్లు నాఁగుచున్
గ్రూరము లోహబద్ధ మగు ♦ రోఁకలి ఱివ్వన వైచి యార్చినన్
మారుతమిత్రునట్టు లయి ♦ మండుచు వచ్చెడుదాని భూపుఁడున్. ౨౨౭

కం. లీలగఁ దనగదచేతం, దూలించి ప్రహస్తుమీఁద ♦ దుమికి జవమునన్
గాలాయసగద బాహా, జాలంబులఁ ద్రిప్పి నడువ ♦ శతకోటిహతిన్ ౨౨౮

కం. పర్వతముపోల్కి నాతం, డుర్విపయిం గూల మిగిలి ♦ యున్నయమాత్యుల్
గర్వంబు వీడి తొలఁగిరి, పర్వెన భక్తికిని మిన్న ♦ ప్రాణభయం బే. ౨౨౯

కం. మారీచమహోదరశుక, సారణధూమ్రాక్షు లడలి ♦ చనుటఁ బ్రహస్తుం
డీరీతిఁ ద్రెళ్లుటయుఁ గని, భూరమణునిఁ దాఁకెఁ బంక్తి ♦ ముఖుఁ డుగ్రుం డై. ౨౩౦

## రావణకార్తవీర్యార్జునుల గదాయుద్ధము.

సీ. పదినూర్ల చేతుల ♦ వసుమతీనాథుండు, నిరువదిచేతుల ♦ సురవిరోధి
గదలను జేకొని ♦ కదిసి రొండొరుఁ బొంగు,కడలులో మూలముల్ ♦ విడిచి తాఁకు
కొండలో మండుమా ♦ ర్తండులో దహియించు,నగ్నులో కరిణికై ♦ యాగ్రహించి
దాఁకెడుమదయుక్త ♦ దంతావళంబులో, గర్జిల్లుమబ్బులో ♦ కడిమిమీఱు

తే. బొబ్బ మెకములో క్రుద్ధుఁ డౌ ♦ గిబ్బరాతో
గుదియదాలుపో నాఁ బోర ♦ గదలు దాఁకు
నులివు పిడుగులరవళికి ♦ నుద్ది యగుచు
దండిధ్వను లీను చుండె ది ♦ ఙ్మండలముల. ౨౩౧

కం. మెఱుఁగుందీఁగె నభంబు, న్మెఱయించెడిమాడ్కిఁ దనరె ♦ నృపవరుఁడు గదన్
జిఱ జిఱ త్రిప్పి సురాహితు, పఱపగువక్షమునఁ బడఁగఁ ♦ బరఁగింపంగన్. ౨౩౨

కం. రక్షోధిపుగద యర్జును,వక్షంబున గిరిని నుల్క ♦ పగిది వెలింగెన్
దక్షులకు మున్ను బలికి ఋ,భుక్షునకుం బోలెఁ జెల్లెఁ ♦ బోరు భయద మై. ౨౩౩

కం. కొమ్ములతోఁ గోడెలు దం,తమ్ములతోఁ గరులు కెరలి ♦ తాఁకెడిగతి వా
రిమ్ముగ నొండొరుఁ దాఁకి భ,యమ్ము కలంకువయు లేక ♦ యడిచిరి గదలన్. ౨౩౪

ఉ. ఆయెడఁ గార్తవీర్యుఁడు ని ♦ జాఖిలశక్తికొలంది మాంసభు
గ్నాయకువక్షముం గదను ♦ గాటముగాఁ బ్రహరింప దేవతా
ప్రియవరావితుం డగుటఁ[1] ♦ గీడ్పడఁ డాతఁడు, బెండువోలె రెం
డై యొఱగెన్ ధరాస్థలిని ♦ నా గద,యట్టుల యయ్యెఁ దద్ధతిన్. ౨౩౫

## కార్తవీర్యార్జునుఁడు రావణు బంధించి పురికిఁ గొనిపోవుట.

కం. ఓలుచుఁ బిఱిఁదికి వెసఁ జని, నాలుగు మూరలతలంబు ♦ నం బడె బాధా
లోలితుఁ డై విహ్వలుఁ డై, యాలావరిపాటుఁ గాంచి ♦ యవనీవిభుఁడున్. ౨౩౬

కం. పామునకై కవిసెడిగరు,టామంతునిఁ బోలుచుం ద ♦ టాన నతనిపై
భూమీశుఁడు పడి బలినిన్, వామనుగతిఁ బట్టి కట్టె ♦ బలవంతముగన్. ౨౩౭

ఉ. రాక్షసనాథుఁ గట్టినధ ♦ రాపతి మెచ్చిరి సిద్ధచారణుల్
యక్షులు దేవతావళి యి ♦ లాపతి పై సుమవృష్టి రాల్చె హ
ర్యక్షము దంతినిం బలె సు ♦ రారిని బట్టి గళార్భటుల్ జగ
త్ప్రక్షుభితంబుగా నినిచెఁ ♦ బంక్తిముఖాసురుఁ డున్నదుస్థితిన్ ౨౩౮

తే. తెప్పిఱిల్లి ప్రహస్తుండు ♦ తేఱిచూచి, కలసురారుల జతఁ గూర్చఁ ♦ గారుమబ్బు
లోలి మూఁగెడిరీతి భూ ♦ పాలు ముసరి, వివిధసాధనచయముల ♦ విసరి విసరి. ౨౩౯

---

[1] బ్రహ్మ శివదత్త దీర్ఘాయువుండుటచేఁ జావఁడయ్యె. మనుష్యులచేఁ జావనట్లు వరములేదు.

చం. నిలు నిలు పోకు పోకు రజ♦నీచరనాయకు వీడు వీఁడు మం
చలఘురవంబునం బలుకు ♦ చర్జును పైఁ బలలాశిసంఘముల్
పిలపిల మూఁగి శూలములఁ ♦ బెద్దకటారుల వైవ వాని న
బ్బలియుఁడు పట్టి వారిపయి ♦ వైచె భయంపడి వారు పాఱఁగన్ ౭౮౦

కం. పెనుగాలికి మబ్బు లనఁ, దనుజావళి దూలి పఱవ ♦ దశవక్త్రునితోఁ
డననగరముపౌరులు జయ,నినదంబుల మెచ్చ ధారి♦ణీపతి చొచ్చెన్. ౭౮౧

## ←— పులస్త్యుఁడు రావణుని విడిపించికొని పోవుట. —→

ఉ. గాలిని మూటకట్టినప్ర♦కారము రావణు బంది నుంచుటల్
జలదపథంబునన్ సురలు ♦ సమ్మతిఁ జెప్పికొనం బులస్త్యుఁ డా
పలుకుల నాలకించి తన♦పట్టిసుతుం డను నెయ్య మూని తాఁ
బెలుచని వేగమార నుడు♦వీథిని వచ్చె మహుజ్జనంబునన్. ౭౮౨

తే. వచ్చి యమరావతీసన్ని♦భంబు పుష్ట,హృష్టలోకాన్వితంబు మా♦హిష్మతీపు
రంబు ముని చొచ్చి తనరాక ♦ రాజునకును, జెప్పి పుచ్చిన వారలు ♦ క్షితితలేంద్రు

కం. చేరం జని నృప! పదసం,చారుం డగుఁగవినిబోలి ♦ చండమహోతే
జోరాజిదుర్నిరీక్షుం,డై రాజిలుముని పులస్త్యుఁ ♦ డరుదెంచె ననన్. ౭౮౩

సీ. అర్ఘ్యంబుమధుపర్క ♦ మాత్తపురోహితుల్, గొని వెంట రాఁగ శ♦క్రుండు గురుని
నెదురుకొనం బోవు♦చదురున శిరమునఁ, గరములు చేరిచి ♦ కదలిపోయి
యర్ఘ్యంబు పాద్యంబు ♦ నావును మధుపర్క,మిచ్చి సంతోషంబు ♦ హెచ్చ మదిని
లోనికిఁ దోడ్తెచ్చి ♦ మానితసూక్తుల, సంస్తుతించుచు హర్ష♦సంభ్రమమున

తే. గద్గదోక్తుల ని ట్లనుఁ ♦ గంజసంభ,వాభ! నీ విందు వచ్చుట ♦ నమరపురికి
దీటుగా నయ్యె మాహిష్మ♦తీపురంబు, నేను జేసినభాగ్యంబు ♦ నిస్తులంబు. ౭౮౪

కం. ఎవ్వరికి గోచరింపక, యవ్విబుధులచేతఁ బూజ ♦ లందెడినిన్నే
నివ్విటఁ గాంచి పూజల, నివ్విధి నర్చించుటను ద్వి♦జేంద్రుఁడ నైతిన్. ౭౮౫

కం. ఇప్పుడువో నాకుశలం, బిప్పుడువో నావ్రతంబు ♦ లీడేఱెను నా
కిప్పుడు జన్మము సార్థక, మిప్పుడువో తపము పండెఁ ♦ గృతమతి నైతిన్. ౭౮౬

కం. ఈరాజ్యం బీపుత్త్రులు, నీరమణులు నెల్లవార ♦ లేను మునీ! నీ
వారము కార్యం బెయ్యది, కారుణ్యమతీ! యనుజ్ఞఁ ♦ గావింపఁ గదే? ౭౮౭

ఉ. నావుడు హైహయాధిపుని ♦ నందను లెల్లరు లెస్సలా? సుఖం
బా వరవర్ణినీతతికి? ♦ నగ్నులు చక్కఁగ నున్నె? ధర్మ మెం
దేవిధలోపమున్ గలుగ ♦ కెప్పుడు వర్తిలునే? యటంచు స
ద్భావుఁడు ప్రశ్న చేసి దశ♦వక్త్రుని గెల్చిన కీర్తిపూరితా! ౭౮౮

ఉ. ఎవ్వనిపోరు విన్నఁ జలి♦యింపక నిల్చు మరుత్సహోదధుల్
నివ్వెఱ? నట్టివీరు నన♦నీధన దుర్జయు నాదుమన్ననిన్
జివ్వను బట్టి బద్ధునిఁగఁ ♦ జేసి కుమారునికీర్తిపూరముల్
క్రొవ్వెఱఁ గ్రోలి వైచితివి ♦ కోటివిధంబుల నిన్ను మెచ్చితిన్. ౭౯౦

కం. మాపిల్లవానిపై నీకఁ, గోపంబును మాను నాదు♦కోరిక యిది వే
పాపుము చెఱ నుండి నృపా,లా! పంక్తిగ్రీవు ననఁ ద♦లంపక యొండున్ ౭౯౧

కం. మునివర్యునిప్రీతికి నై, జనవర్యుఁడు విడిచి పుచ్చె ♦ సమ్మదమున శ
ద్దనుజాధిపు వా రిరువురు, జననుత గావించి రగ్ని♦సాక్షిగఁ జెలిమిన్. ౭౯౨

కం. ఒండొరు లిఁక బాధింపక,యుండఁగ నెయ్యంబు చేసి ♦ యుర్వీంద్రుండున్
నిండారుభక్తి మునివే,తండమునకు మ్రొక్కి చనియెఁ ♦ దనగృహమునకున్. ౭౯౩

కం. ఆతిథ్యముఁ గొని నృపుచే, నీతులు బోధింపఁ దాత ♦ నెఱి విని లజ్జా
న్వీతుం డై లంకకుఁ జనె, దైతేయుఁడు చనియె ముని పి♦తామహాభువికిన్. ౭౯౪

ఉ. వింటివె రామచంద్ర! నృప♦వీరునిచే దశకంఠుఁ డెట్లు దా
గంటున బద్ధుఁ డై పిదపఁ ♦ గాంచె విముక్తిఁ బులస్త్యవాక్కుచే
గొంటుతనాన నన్యులకుఁ ♦ గూడ దవజ్ఞ యొనర్ప నెంత దా
బం టయినన్, ధరిత్రి బల♦వంతులకుం బలవంతు లుండరే? ౭౯౫

తే. రక్కసులఱేఁడు హైహయ♦రాజుతోడ
మైత్రి యొనరించి వెండియు ♦ ధాత్రిఁ దిరుగు
చుండెఁ బోవరున ధారణీ♦శోత్కరమున
గోటమిని గూర్ప లజ్జ యన్♦మాట లేక. ౭౯౬

రావణుఁడు వాలితో యుద్ధంబుసేయఁ గిష్కింధకుఁ బోవుట.

ఉ. గంధగజేంద్రసన్నిభుఁడు ♦ క్ష్మాజనులందును రాక్షసాళి నే
బంధురవిక్రముల్ వినినఁ ♦ బంక్తిముఖుం డటకేగి పిల్చు ద
ర్పాంధత నాజి కిట్లు భువ♦నాళిఁ జరించుచు నొక్కనాఁడు కి
ష్కింధకు వచ్చి పిల్చె రణ♦కేళికి వాలిని హేమమాలినిన్. ౭౯౭

కం. తారుండును సుగ్రీవుఁడు, తారాజనకుండు వచ్చి ♦ దశకంధరుతో
నూరను లేఁడు భవత్ప్రతి,వీరుం డగువాలి యెవరిఁ ♦ బిలిచెద వనికిన్. ౭౯౮

సీ. ఎవ్వనచారి ని♦న్నెదిరింపఁ జాలెడి, వాలి దక్కఁగ దశ♦వక్త్ర! యతఁడు
సంధ్య వార్వఁగ నాల్గు♦సంద్రంబులకు నేగె, నించుక నిలు మతఁ ♦ డిపుడ వచ్చు
వాలితో నని సేయ♦వచ్చినవారల, శంఖవళాస్థి♦చయముఁ గనుము
అమృతంబుఁ ద్రావి నీ ♦ వరుదెంచి తేని వాలిఁ, జెనకిన నంతతోఁ ♦ జెల్లె దీవు

తే. సర్వజనచిత్రశీలి మా♦స్వర్ణమాలిఁ, బోడరితివ యేని నీమన్కి ♦ దుర్లభంబు
గానఁ జక్కఁగ నూరికిఁ ♦ గదలు గాక, చావవల తేని వాలికై ♦ సరగఁ జనుము.

శా. ఆతం డిప్పుడు దక్షిణాబ్ధితటి సం♦ధ్యాసక్తుఁ డై పావక
స్ఫీతాతుల్యమహోగ్ర తేజుఁ డయి యు♦ర్వీస్థుండు నై యుండు నా
నాతారప్లవగేంద్రునిం గదిమి చ♦య్యం బుష్ప కారూఢుఁ డై
దైతేయాగ్రణి దక్షిణాంబునిధికై ♦ తాఁ బోయి యం దొక్కచోన్. ౨౬౦

కం. భాసురహాటకగిరినిభు, వాసవసుతు బాలసూర్య♦వదనుని సంధ్యో
పాసనతత్పరుఁ గనుఁగొని, యాసోఁకులఱేఁడు వ్యోమ♦యానము డిగియెన్. ౨౬౧

కం. తెప్పున డిగి తనపదములు, చప్పుడు గా కుండ నరిగి ♦ సౌత్రామిని దాఁ
దప్పక పట్టఁ దలంచుచు, నెప్పునఁ జనుచుండ వాని♦నిర్భాగ్యమునన్. ౨౬౨

కం. ఎట్టులొ యదృచ్ఛ నింద్రుని, పట్టియుఁ గడకంటఁ జూచి ♦ పాపాశయుఁ దా
నిట్టట్టు కదల కేమియుఁ, దొట్టగిలంబడక యుండెఁ ♦ దొల్లిటిరీతిన్. ౨౬౩

తే. చెవులపిల్లిని జూచిన♦సింహ మనఁగఁ, బాముఁ గనుఁగొన్నగరుడుని♦పగిది గాఁగ
సరకు సేయక తనుఁ బట్టఁ♦జక్కవచ్చు, పంక్తికంఠునిగూర్చి యు♦వ్వాలి దలఁచు.

ఉ. పాపపుబుద్ధి వీఁడు ననుఁ ♦ బట్టఁ దలంచెను బొంచి వీని నే
నేపునఁ జంకలో నిఱికి ♦ యేగెద నబ్ధులమూఁట నాడఁగా
వ్యోపథమందు వ్రేలఁ దన♦యూరులు హస్తము లంబరంబునన్
జేపడి వైనతేయునకుఁ ♦ జేష్టడుపామునుబోలి స్రుక్కఁగన్. ౨౬౫

కం. అని తలపోయుచుఁ జెవి యా, తనిమీఁదనె యుంచి మునితఁ ♦ దగుశ్రుతిమంత్రం
బును జపియించుచు నుండెను, ఘనబలు లొండొరును బట్టఁ♦గా జతనముఁనన్

→ వాలి రావణుఁ జంక నిఱికి సముద్రంబుల ముంచుట. ←

చం. తలఁపఁగ నంత రావణుఁడు ♦ దాసినజాడ పరాఙ్ముఖుండు నై
వలిముఖనాయకుం డతని♦పాదరవాన నెఱింగె, నింతలో
పల దనుజుండు వానరునిఁ ♦ బట్టఁగఁ జేతులు సాఁప గ్రక్కునన్
బలియుఁడు వాసవాత్మజుఁడు ♦ పాము సుపర్ణుఁడు పట్టుకైవడిన్. ౨౬౭

చం. తటుకున నట్టిపట్టి దృఢ♦దర్పసమగ్రుఁడు చంక నొత్తి ప్ర
స్ఫుటజవయుక్తుఁ డై యెగసి ♦ చుక్కలత్రోవకు, వాని గిచ్చుచు
న్నొట్టమఁగ నేత్రువాఁక శ్వస♦నుండు మహాభ్రముఁబోలె వెంట న
క్కుటిలచరిత్రు లాగుకొని ♦ గొబ్బునఁ బోవుచు నుండ నింతలోన్. ౨౬౮

సీ. రావణుగతిఁ జూచి ♦ రావణుమంత్రులు, విడిపింప వానరు♦వెంటఁ బడఁగ
నతఁ డభ్రపదగుఁ డౌ♦నద్కునిఁబోలుచు, విలసిల్ల నెయిద లే ♦ కలసి యతని

బాహూరుజవభవ♦వాయువిధూతు లై,సడలిరి యవ్వాలి♦చనెడిచోట
వసుధాధరము లైనఁ♦ బాయుచుఁ దెసవిచ్చి, జీవయుక్తులమాటఁ♦ జెప్ప నేల

ఆ. పక్షివితతి కైనఁ♦ బఱవంగ రానియ,చ్చోటఁ జనుచు శక్ర♦సూనుఁ డోలి
సర్వసాగరముల♦ సంధ్య నుపాసించె, మెచ్చఁ దన్ను దివి వి♦యచ్చరాళి. ౨౧౯

కం.ఇడుకొని రావణుఁ జంకన, పడమటికడలికిని బఱచి♦ వారిచి సంధ్యన్
వడి నుత్తరజలధికి వెం,బడి రావణు నీడ్చికొనుచు♦ మసలక యరిగెన్. ౨౨౦

ఉ. ఆమడ లెన్నివేలో యసు♦రాధిపుతో వినువీదిఁ బాఱి సు
త్రామసుతుండు వాయువువి♦ధంబున మానసవైఖరిన్ జవో
ద్దామత నుత్తరంబు విడి♦ దాశరథీ! చని తూర్పువార్ధికిన్
నేమముతోడ నందుఁ దన♦నిష్ఠను దీర్చి సహాసురేశుఁడై. ౨౨౧

కం.క్రమ్మఱి కిష్కింధాప్రాం,తమ్మునఁ గలవనిని డిగ్గి♦ దశకంఠునిభా
రమ్మున గాసిలి బలియుని, నమ్మొఱకుం జంకనుండి♦ యచ్చట విడిచెన్. ౨౨౨

కం.ఇక్కరణి విడిచి రావణు,ప్రక్కకుఁ దా మరలి యెపుడు♦ వచ్చితి వయ్యా!
యిక్కడకుం బని యేమో, యెక్కడ నుండి యొకో యనుచు♦ నెలనవ్వాలయన్

రావణుఁడు వాలితో స్నేహ మొనర్చుట.

చం.పలికిన విస్మయంబుపడి♦ పంక్తిముఖుండు కపీంద్రుచంకలో
నలఁగుడుపాటు చెంది నయ♦నంబులఁ బ్రాణము లుండ గాసిఁ జూ
డ్కులు చలియింప నిట్టు లనుఁ♦ గ్రోఁతులనాయఁక! రాక్షసేంద్రుఁడన్
గలహముఁ గోరి వచ్చితిని♦ గావర మాఱఁగ నీకుఁ జిక్కితిన్. ౨౨౩

కం.రావణుఁడను శక్రారిభుఁడ, పీ వగచరనాథ! యహాహ♦ యేమీ బల మా
హా! వేగము గాంభీర్యం,బీవిధి నే నెందు నెఱుఁగ♦ నీజగమందున్. ౨౨౪

కం.ననువంటివానిఁ బసరము, ననువున నీడ్చికొని♦ యేగి♦ యబ్ధిచతుష్కం
బున ముంచి లాగి తెచ్చితి, మనమున నేన్ గాసి గొనవు♦ మర్కటనాథా! ౨౨౫

కం.మనమునకున్ వాయువునకు, వినతాతనయునకు నిట్టి♦ వేగము భువనం
బున విదితం బట్టిఁడ వో,వనచరవర! సందియంబు♦ పని లే దిందున్. ౨౨౬

కం.నీవేగము నీశౌర్యము, వావిరి నాకెఱుక యయ్యె♦ బాగుగ నీతో
నే వాంఛించెద స్నేహము, పావకసాక్షికము గాఁగ♦ వనచరనాథా! ౨౨౭

కం.దారలు పుత్రులు పురమున్, శ్రీరాష్ట్రము భోగములును♦ జేలలు సకలా
హారంబులు నవిభక్తము, లారఁగ మన కిరువురకు వ♦నాటేశ! యగున్ ౨౨౮

కం.రగిలిచి యుగ్మల నీగతి, నగచరనిశిచరవిభుల్ స♦మాలింగితులై
నగఁ జేతఁ జేయి వైచుచు, జగ మెఱుఁగఁగఁ జలిపి రపుడు ♦ సౌభ్రాత్రంబున్.[1]

కం.అంత హరిరాక్షసులు మృగ,కాంతులు గుహలోనఁ జొచ్చు ♦ కైవడి శుద్ధ
స్వాంతములఁ గేలు కేల్గ, సంతసమునఁ గొనుచు మెల్లఁ ♦ జని కిష్కింధన్.౭౦౧

కం.ఎలమిఁ జరియించి రట నొక, నెల సుగ్రీవునివిధాన ♦ నిశిచరవిభుఁడుర్
గలఁ కేమి లేక యుండఁగఁ, బిలువఁగ వచ్చిరి యమాత్య♦వీరుల్ వానిన్ ౭౦౨

కం.లోకంబుల నేపఁగఁ జన,నాకర్కశశీలుఁ డరిగె ♦ ననుగులబడిఁ దా
నీకరణిఁ బురావృత్తము, కాకుత్స్థాన్వభరణ! చెల్లెఁ ♦ గంజదళాక్షా! ౭౦౩

కం.వింటివి కద రావణుకథ, వింటివి గద వాలిశక్తి♦విధ మంతటిబ
ల్దంటయు నీశరమునఁ దా,నుంటంబడుభుడుత యయ్యె ♦ మహితబలాఢ్యా!౭౦౪

శ్రీరాముఁ డగస్త్యుని హనుమంతుఁగూర్చి ప్రశ్నించుట.

చం.అన విని దక్షిణాశ నిల♦యంబుగ నున్న మునీంద్రుఁ జూచి భూ
తనయమనోహరుండు ముని♦తల్లజ! వాలియుఁ బంక్తికంఠుఁడుర్
ఘనబలశాలులై యతుల♦గాఢపరాక్రమవంతు లయ్యు మా
హనుమకు నీడు గా రని మ♦హాత్మక నామదిఁ దోఁచె నారయన్. ౭౦౫

కం.శౌర్యము నయసాధనమును,ధైర్యంబు పరాక్రమంబు ♦ దాక్ష్యము బలముర్
స్థైర్యము ప్రాజ్ఞత మహిమయు, నార్యగుణా! నెలవుకొనియె ♦ హనుమంతు నెడన్.

సీ. వననిధిఁ గని స్రుక్కు♦వనచరుల్ మోదింప, యోజనశతముఁ బే♦రోజ దాఁటె
రావణునంతఃపు♦రంబు శోధించి సీ,తను జూచి మాట్లాడి ♦ యనునయించె
దళవాయులను మంత్రి♦తనయకింకరులను, నక్షుని నొక్కండ ♦ హతులఁ జేసె
బంధ మూడఁగఁ దన్ని ♦ భాషించి రావణు,తో లంక మసిచేసె ♦ లీలవోలె

తే. సంగరమున హనుమ ♦ సలిపినకృత్యముల్, కాలుఁ డైన విబుధ♦పాలుఁడైన
హవ్యవాహుఁ డైన ♦ యక్షేశ్వరుం డైన,నాచరింప వింటి♦మా? మహాత్మ! ౭౦౬

కం.ఈతనిబలవిక్రమముల,చేతనె కద లంక గెల్చి ♦ చినతమ్మునితో
సీతాసతితో బంధు,వ్రాతముతో నలరఁగంటి ♦ రాజ్యమునందున్. ౭౦౭

కం.వానరపతిసఖుఁ డీహను,మానుఁడు లే కున్న నెవరు ♦ జ్ఞానుతవార్తల్
దే నేర్చువార లంతటి,భూనుతవిక్రములు గలరె ♦ భువనంబులలోన్?. ౭౦౮

చం.రవిజునిమేలు గోరుచుఁ జి♦రంబుగ నాతనియొద్ద నుండియుర్
బవనజుఁ డేల యాతనికి ♦ వాలికి వైరము గల్గ నింద్రజుర్

1 దేవతాకార్యముఁ దీర్ప రామునకు సహాయపడ వానరులు దేవతలచే సృష్టింపఁబడిరి. ఈ సమయమునకు విరుద్ధముగ నింద్రునికొడుకే యింద్రవిరోధితోఁ జెలిమిచేయుటే గాక రామకార్యమునకు సహాయము చేయఁగల సుగ్రీవుని హింసింప నెంచెను. కావున వాలి వధ్యుఁడయ్యెను. ఈ యర్థమే "సమయే తిష్ఠ సుగ్రీవ మా వాలి పథ మన్వగా" యను రామవాక్యంబులఁ గననగు. చూ. కిష్కింధాకాండము. ౮౪౯ పద్యము. రామసహాయమే తొలుతటి సమయము.

దవము వొదల దహించుగతి ♦ నాశము చేయక యాత్మమిత్రుఁ డ
ట్లవిరళదుఃఖతప్తుఁ డయి ♦ యూరట నుండఁగఁ జూచు చుండెనో? ౭౯౦

కం. తనబలము తనకుఁ దెలియదు, హనుమ కటం చేను దలఁతు ♦ ననఘా! చెపుమా
వినవలఁతు దీని నవుడు, హనుమంతుసమక్షమంద ♦ యతఁ డి ట్లనియెన్. ౭౯౧

సీ. నీయభిప్రాయంబు ♦ నిక్కంబు శ్రీరామ', బలగమనంబులఁ ♦ బ్రజ్ఞయందు
హనుమకుఁ దుల్యుండు ♦ గనరాఁ డొకం డేని,మును మునివర్యు ల♦మోఘశాప
మొసఁగుటఁ జేసి యా♦యుత్తమగుణరాశి, తనశక్తి యెఱుఁగండు♦ఘన మ దయ్యఁ
బిన్నటనాఁట ని♦ర్వీరుఁడు చేసిన,యది తెలియండు బా♦ల్యమునఁ జేసి

తే. పావమానిచరిత్ర స♦ర్వంబు నీవు, విన నభిప్రాయ ముండిన ♦ వినఁ గదయ్య
వినుచువాఁడను సకలంబు ♦ విశ్వవినుత, రమ్యగుణసాంద్ర! దశరథ♦రామచంద్ర!

## ఆంజనేయోపాఖ్యానము.

సీ. భాస్కరవరమున ♦ బంగారువన్నెల, రాణించు మేరుప♦ర్వతము గలదు
అచ్చట రాజయి ♦ యలరారు కేసరి, పేరిటిబలియుఁ డ♦వీరుతండ్రి
యతనికి భార్యయై ♦ యంజనాఖ్య రహించు, నామెవాయువున కీ♦యనఘుఁ గాంచె
వరిగింజకొనముల్లు♦వంటి వన్నెఁగలాని; ఫలములుగొనితేరు♦వాంఛఁ జేసి

ఆ. యడవి కామె పోవ ♦ నాఁకటి పెల్లునఁ, దల్లి విడిచి చనుట ♦ తాళ లేక
శరవణంబునందు ♦ షణ్ముఖుపోలిక, రోదనం బొనర్చి ♦ ఖేదయుక్తి. ౭౯3

కం. అప్పుడు దాసనవుంబువు,చొప్పున జిగి మీఱి ప్రాగ్వ♦సుమతీధ్రమునం
దుప్పరమున నుదయించెడి,యుప్పంకజమిత్రుఁ గాంచి ♦ యాతనిఁ బట్టన్. ౭౯౪

చం. ఫల మనుబుద్ధి మింటికిఁ జి♦హాలునఁ దా నెగిరెన్ నవార్కుతోఁ
దులితుఁడు బాలసూర్యునకుఁ ♦ దూర్ణము సమ్ముఖమాచుఁ దా జనన్
బలిముఖబాలు మింటఁ జను♦వాని మహర్షులు దేవదైత్యయ
తులు కడువిస్మయంపడుచుఁ ♦ జూచుచు మానసవాయువేగునిన్ ౭౯౫

కం. పిల్లతనంబునయం దే, చెల్లంబో యిట్టిశక్తి ♦ చేకూరినచో
మెల్లమగుయౌవనంబున, నెల్లిలంగ్రాలు నొక్కొ ♦ యితఁ డనుకొనఁగన్. ౭౯౬

చం. తనయుఁడు మింట నేగ రవి♦దగ్ధుఁడుగాక సుఖంబు గూరఁగాఁ
దనుపుగ శీతలుం డయి స♦దాగతి వెంటనె పోవు చుండె, న
య్యినుఁడును బాలుఁ గాంచి మది ♦ నేమియెఱుంగనిబిడ్డఁ డంచు నీ
తనివలనన్ మహాకృతులు ♦ తప్పక కాఁ గల వంచు నెంచుచున్. ౭౯౭

కం. తన వేఁడిమి చూపకయుం,డెను నీతఁడు జనకుశక్తి ♦ నిజఘనశక్తిన్
జని మింట వేనవేల్ యో,జనములు రవి దాసె నాఁడ ♦ స్వర్భానుండున్. ౭౯౮

చం. దినకరుఁ బట్ట వచ్చి ఖర♦దీధితు డాయఁగ వచ్చుచున్న యీ
వనచరబాలుఁ గాంచి భయ♦పాటునఁ బాఱి మహేంద్రుఁ జేరి పెం

గనరునఁ బల్కె మున్ను దిన♦కాంత మృగాంకుల మేము పట్టఁగా
వినియతిఁ జేసి యేమిటికి ♦ వే యొకనిన్ నియమించి తీయెడన్. ౯౯

కం. ఈనాఁడు పర్వకాలం, బే నేగ మఱొండు రాహు ♦ వే తెంచెఁ జుమీ
భానునిఁ బట్టఁగ నావుడు, దీనుని దా నూఱడించి ♦ తెప్పున లేచెన్. ౧౦౦

ఉ. వాసవుఁ డిట్లు లేచి యతి♦భాసుర కాంచనమాలఁ దాల్చి కై
లాసనగాగ్రసన్నిభము ♦ లాలితభూషణభూషితంబు ఘం
టాసముదాయఘోషితము ♦ నాలుగుకొమ్ములగారు నెక్కి వే
వే సని రాహుమున్నుగ ర♦విప్లవగార్భకు లున్న చోటికిన్. ౧౦౧

ఉ. రాహువు మున్ను మున్న దిన♦రాజు గ్రహింపఁగఁ బాఱె నో మహా
బాహు! మహీధ్రకూట మన ♦ వాలి రయంబున వచ్చు నాతనిన్
సాహసిఁ జక్కఁ గాంచి కపి♦సత్తముఁ డియ్యది మే లటంచుఁ దా
రాహువు వెంట నంటె గ్రహ♦రాజును వీడి యతండు భీతిచేన్. ౧౦౨

కం. గ్రక్కునఁ బరాఙ్ముఖుం డై, దిక్కే వే యింద్ర యింద్ర ♦ తెంపరి కపిచేఁ
జిక్కక యుండఁగఁ గావవె, మక్కువ నన్ననుచు మాటి ♦ మాటికి నఱచెన్. ౧౦౩

ఉ. అమ్ముఖశేషుఁ డిట్టులు భ♦యమ్మునఁ దా నభయంబు వేఁడఁగా
నమ్మఘవుండు భీతిలకు ♦ మర్భకుఁ ద్రుంచెద నంచుఁ బల్కుచో
నిమ్మరుదాత్మజుండు విబు♦ధేంద్రుకరీంద్రముఁ గాంచి నిండు మో
దమ్మునఁ బెద్దపం డనుచు ♦ దానిని బట్టఁ జనెన్ రయంబునన్. ౧౦౪

కం. అభ్రమువల్లభుఁ బట్టఁగ, నభ్రంబునఁ బాఱుదెంచు ♦ నంజననుతుపై
నభ్రపతి చేతికులిశ మ,దభ్రం బగుకినుక నేసెఁ ♦ దద్ధతిఁ గపియున్. ౧౦౫

కం. అవనీధరశిఖరంబున, వివశుం డై పడియె బాధ ♦ విహ్వలుఁ డై భూ
ధవ! తత్పాతంబునఁ, బవనజునకు వామహనువు ♦ భగ్నం బయ్యెన్. ౧౦౬

### వాయునిరోధంబున లోకంబులు బాధపడుట.

చం. హరిహయుఁ డాత్మపుత్త్రునకు ♦ నాపదగూర్చినఁ గోపగించి యా
హరిణహయుండు లోకముల ♦ కన్నిటి కె గ్గొనరింపఁ బుత్త్రుతో
గిరిదరిలోని కేగి ప్రజ ♦ కీ డ్పడ దేహములందు నాత్మసం
చలనము మాని యుండె నట ♦ శక్రుఁడు వర్షము నాఁగు కైవడిన్. ౧౦౭

కం. వెడలవు విణ్మూత్రంబులు, వెడలదు నిశ్వాస మేమి ♦ భేదిలి సందుల్
జడము లయి కట్టెలట్టులు, ముడుచుట చాఁచుట యసాధ్య♦ముగఁ బ్రజ కయ్యెన్.

తే. శ్రుతులపఠనంబు హోమంబు ♦ సున్న యయ్యె, నిత్యకర్మంబు లెల్లను ♦ నిలిచిపోయె
ధర్మకార్యంబు లెల్లను ♦ దలఁగి పోయె, నాగ్రహంబున వాయువు ♦ నిగ్రహింప. ౧౦౯

తే. అపుడు గంధర్వు లసురులు ♦ నమరులెల్లఁ, జూడ నేగిరి మిక్కిలి ♦ గోడుకొనుచు
నుబ్బుపొట్టలతోడ మ♦హోదరములు, గలుగువారలఁ బోలుచుఁ ♦ గదల లేక. ౧౧౦

కం. కంజభవు డాయఁగాఁ జని, ప్రాంజలులై నలువిధములఁ ♦ బ్రజలను నీవే
రంజిల్లఁ జేసి మాకుఁ బ్రభంజనునిం బ్రాణములకుఁ ♦ బతిఁ జేసితిగా. ౮౧౧

కం. అట్టిజగత్ప్రాణుఁడు నేఁ, డిట్టులు మము నంతిపురవు♦టింతులవలె ని
ట్టట్టు చరింపక యుండఁగఁ, బెట్టిం బెనుబాధ లెట్లు♦వేఁగుదు మభవా. ౮౧౨

చం. శరణము నీవె మాకు మముఁ ♦ జంపఁ గడంగెను వాయు వీవ్యథా
భరముఁ దొలంచు మన్నజన♦వర్గముఁ జూచి యజుండు కారణాం
తరమున మారుతుం డిటు లొ♦నర్చెడి, సింహికసూనుమాటచే
సురపతి వాయుపుత్రకుని♦సొమ్ములు పోవఁగ వజ్రధారచేన్ ౮౧౩

చం. అడిచినఁ గోప మూని కద♦లాడక గంధవహుండు నిల్చెఁ జుం
డొడలను వాయువే తనువు ♦ లుంచు సుఖస్థితి దాని లేమిచే
జడత వహించి కట్టియల♦సాటి యగుం గద, గాడ్పుఁ దేర్చి మీ
యడ లుడుగంగఁ జేయుదు జ♦నావళులార! పదండు వచ్చెదన్. ౮౧౪

కం. పవమాను శాంతుఁ జేసెద, భువనంబులబాధఁ దీర్తుఁ ♦ బొండఁడని వాణీ
ధవుఁడు సురగుహ్యకాహులు, దవిలినభక్తిఁ భజించి ♦ తనతో రాఁగన్. ౮౧౫

చం. చని దిననాథకాంచనకృ♦శానుసమానతనుం దనూజునిఁ
దనతొడఁ జేర్చి యుండెడు స♦దాగతిఁ జేరఁగఁ బోయి యాదరం
బున శిశువుం గనంగ నలు♦మోముల వేలుపు రాకఁ గాంచి స్ప
ర్శనుఁడు కుమారు నెత్తుకొని ♦ గ్రక్కన లేచి సుతార్తితప్తుఁడై. ౮౧౬

## ⟵ బ్రహ్మాదులు హనుమంతునకు వరంబు లిచ్చుట. ⟶

సీ. చలితకుండలమాళి♦స్రక్తపనీయభూషణుఁ డయి మ్రొక్కిన ♦ సాఁగి మ్రొక్కఁ
బవను లేవఁగ నెత్తి ♦ బాలుని దేహంబు, నిజకరాంబుజముల ♦ నిమిరినంత
వాడినసస్యంబు ♦ వారి సోఁకినభంగి, మరల జీవించుడు ♦ మారుతుండు
తతము హర్షించి య♦థాపూర్వముగను శ,రీరంబులందుఁ జ♦రించుచుండె

ఆ. వాయుబాధ విడిచి ♦ ప్రజ లుల్లసిల్లిరి, వీతశీతవాత♦జాతబాధఁ
దోయజములతోడి♦తూఁడు లనంగను, ననిలహితమనస్కుఁ ♦ డబ్జభవుఁడు. ౮౧౭

చం. హరిహయ! యీశ! యప్పతి! ధ♦నాధిప! దండధరా! మరుత్సుతుం
డరుదగుభావికార్యము స♦మర్థతఁ దీర్పఁగలాఁడు, మీకు నె
ల్లర కిది చక్కఁగాఁ దెలియు ♦ లావరి యానటు గాడ్పుపట్టికిన్
వరము లొసంగుఁడీ, ముదము ♦ వర్ధిలుఁ గావుత వాయుమూర్తికిన్. ౮౧౮

చం. అనవుడు శక్రుఁ డంబుజము♦యం బగుమాలిక నిచ్చి యీమరు
త్తనయునకున్ మదీయపవి♦ధారఁ గదా హను విట్లు నొచ్చె దా

నన హనుమత్సమాఖ్య భువ♦నంబు తెలుంగఁగ గాంచుఁ గాక యిం
కను శతకోటిపాతమునఁ ♦ గాంచక యుండెడిఁ గాక మృత్యువున్. ౧౯

చం. అనవుడు భాస్కరుండు కరు♦ణార్ద్రమనంబునఁ బల్కె నాదు తే
జునను శతాంశ మిచ్చితిని ♦ శూరవరుం డగుగాడ్పు పట్టికిఁ
దనయుఁడు శాస్త్రముల్ చదువ♦శక్తి రహించిననాఁడు వీని వా
గ్మిని ఘటియించు శాస్త్రమును ♦ గీర్తి రహింపఁగ నేర్పఁ బూనెదన్. ౨౦

తే. శాస్త్రదర్శనమున వీని♦సముఁడు లేక, యుండఁ జేసెద నన వరు♦ణుండు పల్కె
నీళ్ళనైనను మత్పాశ♦నిహతి నైన, మృతిని గాంచఁడు పదిలక్ష♦లేండ్ల కైన. ౨౧

తే. కాలదండాదులను జావు ♦ గాన కునికి
యెల్లపుడు వ్యాధి యనునది ♦ యెఱుక కుంట
యుద్ధభూమి విషాదంబు ♦ నొంద కుంట
వరములుగ నిత్తు నని దండ♦ధరుఁడు పలికె. ౨౨

చం. తనగదచేత మృత్యువశ♦తం గనకుండఁగ యక్షనాయకుం
డనుపమ మైనయాత్మ మహి♦తాయుధసంతతి నీల్గమిం ద్రిలో
చనుఁడు వరంబు లీయ జల♦జప్రభవుండు చిరాయు విచ్చి యీ
యనఘుఁడు బ్రహ్మదండముల ♦ కన్నిటి కౌత మవధ్యుఁ డంచనన్. ౨౩

తే. బాలసూర్యోపమాను న♦ర్భకునిఁ గాంచి, విశ్వకర్మ వచించె నీ♦విశ్వనుతుఁడు
మద్వినిర్మితశస్త్రాళి ♦ మడియ కుండుఁ, గాత దీర్ఘాయు వగుచును ♦ గ్రాలుఁ గాత.

చం. అనవుడు సంతసించి నలి♦నాసనుఁ డి ట్లను గాడ్పుతోడ నీ
తనయుఁ డమిత్రభీప్రదుఁడు ♦ తప్పక మిత్రముదావహుం డగుఁ
ఘనబలశాలి దుర్జయుఁడుఁ ♦ గామచరుండును గామరూపి యెం
దును నెదు రేది గల్గనియ♦నుత్తమకీర్తియుఁ గామగుం డగున్. ౨౫

కం. రావణనిధనంబున సీ♦తావిభునకు బాస టగుచుఁ ♦ దా నద్భుతకా
ర్యావళి ఘటియించును జ♦న్యావని నని బిడ్డ నిచ్చి ♦ యరిగెద ననుచున్ ౨౬

ఆ. సురలతో విరించి ♦ యరుగఁగఁ గరువలి, బిడ్డతోడ వచ్చి ♦ ప్రేమమీఱ
నఖిలవార్తఁ దెలిపి ♦ యంజనచే నిచ్చి, యరిగె నంత నితఁడు ♦ వరముబలిమి. ౨౭

## మునులు హనుమంతు శపించుట.

చం. జలనిధియట్లు పొంగి ముని♦సత్తమకోటులయాశ్రమస్థలుల్
దలరక చొచ్చి వల్కలవి♦తానముఁ జించుచు నగ్నిహోత్రముల్
మలపుచు స్రుక్స్రువంబులను ♦ మాయఁగఁ దన్నుచు అరపు చేయుచుఁ
వలిముఖబాలుఁ డుండ ముని♦వర్యులు బ్రహ్మవరం బెఱుంగుటన్. ౨౮

ఉ. శాంతముఁ దాల్చియుం గపియొ♦సంగెడికష్టము సైఁప లేక య
త్యంతముకోప మూనక వ♦నాటుఁడ! యేవరశక్తిబల్మిచే
నింతలు సేసె దట్టిబల♦మెల్లను విస్మృతి నొందెదీవు, ని
న్నెంతయు నెవ్వరేఁ బొగడి ♦ రేనియు నప్పుడు దోఁచుఁ గావుతన్. 29

కం. అని ఋషులు శపింపఁగ నీ, యనఘుఁడు తనశక్తి మఱచి ♦ యది మొదలుగ నెం
దును గడుమృదుభావంబున, జనవర! చరియించు చుండె ♦ సాధుచరితుఁ డై. 30

సీ. పదపడి కపికుల♦వర్గంబులకు వాలి, సుగ్రీవజనకుండు ♦ శూరవరుఁడు
ఋక్షరజుండు దా ♦ నేలిక యై యుండె, రవితేజుఁ డతఁడు చి♦రంబు గాఁగ
రాజ్యంబు నేలి స్వ♦రాష్ట్రంబుఁ జేరిన, సచివులు వాలిని ♦ జనకపదము
నందు సుగ్రీవుని ♦ నగ్రజుపదమున, నిలిపి రీహనుమయు ♦ నిర్మలంబు
ఆ. ఛిద్రవర్జితంబు ♦ స్నేహ మద్వైధంబు, బాల్య మాదిగాఁగ ♦ భాస్కరాత్మ
జాతుతోడఁ జలిపె ♦ జానకీవల్లభ!, వింటె హనుమజనన♦వీర్యములను. 31

కం. మానులశాపవశంబునఁ, దా నెఱుఁగక తనదుశక్తిఁ ♦ దరుచరపతి యా
భానుజుఁ డఱుమఁగ వెంటనె, తానును బరువెత్తు చుండె ♦ ద్రాబయపోలెన్. 32

కం. తెలియమి సుగ్రీవుండును, దలఁపింపఁడు దానఁ గాదె ♦ దంతి గవసినన్
బలవంతము హరి పఱచెడి, చెలువున నతఁ డుండె యుద్ధ♦సీమన్ వింటే. 33

మత్తకోకిలము. స్థైర్యధైర్యపరాక్రమక్రమ♦సాహసంబుల శౌర్యగాం
భీర్యబుద్ధులఁ జాతురీనయ♦వీర్యయుక్తుల సూక్తి మా
ధుర్యకార్యధురీణతాజన♦తుష్టికారణచర్యలన్
సూర్యశిష్యున కీప్రభంజన♦సూతికిన్ సము లుందురే. 34

కం. పుట్టుముల నుండి గ్రుంకుడు, గట్టుదనుక సూర్యుతోడఁ ♦ గడువడిఁ జనుచున్
బట్టుగ వ్యాకరణంబును, గట్టిగ వల్లించె నితఁడు ♦ కంజదళాక్షా! 35

తే. సూత్రములతోడ వృత్తియు ♦ సూత్రములకు
నర్థము పదంబు మఱియు మ♦హార్థ మన్య
శాస్త్రనిచయంబు ఛందస్సుఁ ♦ జక్క నేర్చెఁ
గీర్తితచరిత్రుఁ డీతండు ♦ కేవలుం డె. 36

తే. సకలవిద్యల దేవతా♦చార్యుతోడ, నెనయఁ జాలెడి యీతండు ♦ జనవరేణ్య!
యభ్యసించెను దొమ్మిది♦వ్యాకరణము, లగును బ్రహ్మగఁ దావకీ♦నానుకంప. 37

తే. జగములను ముంపఁ బూనిన♦సాగరుండు
భువనములఁ గాల్పఁ బూనిన♦భువనభవుఁడు

ప్రళయవేళను రేఁగువై ♦ పస్వతుండు
వాయుజుఁడు వానియెదుట నె ♦ వ్వాఁడు నిలుచు? ౧౩౮

ఉ. పావనివోలె నీకు నని ♦ బాసటగా విబుధాళిచేత సు
గ్రీవుఁడు మైందుఁడుఀ ద్వివిద ♦ కేశుఁడు రంభుఁడు సైన్యనాథుఁడుఀ
దైవతనాథపౌత్త్రుఁడును ♦ దారుఁడు జన్మముఁ గాంచి రుర్వి రా
మా వినిపించితిఀ సకల ♦ మంజనసూనువిధంబు నావుడున్. ౧౩౯

కం. రాముఁడు సౌమిత్రియు శా,ఖామృగవరు లద్భుతంబు ♦ గాంచిరి మఱి లో
పాముద్రాహృదయేశుఁడు, ప్రేమంబునఁ బలికె రామ ♦ పృథ్వీశ్వరుతోన్. ౧౪౦

## అగస్త్యాదులు శ్రీరాముచే ననుజ్ఞగొని పోవుట.

చం. వినిచితి నెల్లవృత్తములు ♦ వింటివి నీ వఖిలంబు నింక మా
కనుమతి యిచ్చెదే చనఁగ ♦ నార్తజనావనదక్ష! యన్న న
మ్మునివరుఁ బల్కె రాఘవుఁడు ♦ మోదమునం గరము ల్మొగిడ్చి యో
యనఘ! భవద్విలోకనమ ♦ హాసుకృతం బిటు నేఁడు గల్గుటన్. ౧౪౧

చం. తనిసిరి నాదుదేవతలు ♦ తాతలుఁ దండ్రియుఁ దుష్టి గూరిరో
మునివర! నాదుబాంధవులు ♦ మోదముఁ గాంచిరి శాశ్వతంబుగా
వినుఁ డొకవిన్నపంబు మిము ♦ వేఁడితి నేనియు నిందు రాఁగ నా
మనవి గ్రహించి మీరు దయ ♦ మాలక యిం దరుదేరఁగాఁ దగున్. ౧౪౨

చం. అడవుల నుండి క్రమ్మఱితి ♦ నందఱుఁ బౌరులు స్వీయకార్యముల్
తడఁబడ కుండఁ జేయఁగ య ♦ థావిధి నిల్పి సవం బొనర్పఁగాఁ
గడఁగెద, మీర లధ్వరము ♦ కాలమునందు నజస్ర మియ్యెడఀ
గడుకొని నిల్వఁగా వలయుఁ ♦ గార్యము లన్నియుఁ దీర్పఁగా దయన్. ౧౪౩

కం. ధుతకల్మషజాలుర మిము, హితమతి నే నాశ్రయించి ♦ యీడేరఁ గృతుల్
పితరులయనుగ్రహమునకు, స్తుతగతి నేఁ బాత్ర మగుదుఁ ♦ జుం డన మౌనుల్.

కం. అందఱు నగుఁ గాకని యగు,గం దశరథనందనుండు ♦ క్రతువిషయకచిం
తం దవిలి యుండి సూర్యుఁడు, మందకరుం డగుడుఁ బనిచి ♦ మర్కటవరులన్.

ఆ. తాను సంధ్యవార్చి ♦ తమి ప్రవర్తిల్లఁగ, నంతిపురమునందు ♦ హాయి నుండెఁ
బట్ట మందినట్టి ♦ ప్రథమరాత్రం బిట్టు, లేగెఁ బౌరహర్ష ♦ వృద్ధియొనఁగ. ౧౪౬

సీ. ఆరాత్రి వేగుచో ♦ నతిమనోహరకంఠ,వందిజనంబులు ♦ సుందరముగఁ
గౌసల్యనందనా! ♦ కరుణాఢ్య! మేల్కొమ్ము, నీవు నిద్రించిన ♦ నిఖిలజగము
నిద్రించు వీరాగ్ర ♦ ణీ! నీవు విక్రమం,బున విష్ణుఁడవు రూప ♦ మునను నశ్వి
లను బోలెదవు బుద్ధి ♦ నెనయుదు సురగురుఁ, బరమేష్ఠికిని నీడు ♦ వత్తు వీవు

ఆ. క్షమను గాశ్యపికిని ♦ సముఁడవు తేజున, భాస్కరుండ వీవు ♦ పవను నుద్ది
ఘనజవంబునందు ♦ గాంభీర్యగుణమున, సాగరంబుఁబోలఁ ♦ జాలు దీవు. ౮౪౭

కం. స్థాణుండ నప్రకంప్యత, నేణాంకుఁడె సౌమ్యతను స♦వృత్తుఁడు నీకున్
క్షోణీపాలుర మున్ను ప్ర,మాణంబుగ లేరు నీదు♦మాదిరి రాజుల్. ౮౪౮

కం. అతిదుర్ధర్షుఁడ వగుటను, క్షితిజనహితకరణవృత్తిఁ ♦ జెలఁగుట సతమున్
క్షితిపా! కీర్తియు లక్ష్మియు, సతతము ని న్నాశ్రయించుఁ ♦ జన కెచ్చటికిన్. ౮౪౯

కం. సిరియును ధర్మము నృపతీ! తిరముగ నీయంద కడుఁ బ్ర♦తిష్ఠితము లటం
చరుసంబున నిటు పల్కఁగఁ, గరము మధురసూక్తి సూత♦కాండము పొగడన్.

కం. ఫణిరాజశయ్య నారా,యణుచందంబుగను బాండు♦రాచ్ఛాదిత మా
మణిమయ మగుశయ్యను ధా,రణితనయాధవుఁడు లేవఁ ♦ బ్రాంజలు లగుచున్

ఉ. ప్రాకటశుభ్రపాత్రముల ♦ వారి నొసంగఁగ శుద్ధిమంతుఁడై
శ్రీకరు హవ్యవాహుని న♦రీణగతిన్ యజియించి రాముఁ డి
క్ష్వాకుసుసేవితంబును శు♦భం బగుదేవగృహంబుఁ జొచ్చి శ్ర
ద్ధాకలితుండు దేవపితృ♦ధారిణినిర్జరపూజ లన్నిటిన్. ౮౫౧

కం. బలి యథావిధిఁ దీరిచి, క్రాలుముదంబునను బాహ్య♦కక్ష్యకు రా మం
త్ర్యాళులు వసిష్ఠముఖులున్, గీలులవలె వెన్నడింపఁ ♦ గీర్తింప జనుల్. ౮౫౩

కం. నానాభూపతులు సమా,సీనుండగు రామవిభుని♦చెంతల నుండన్
మానుగఁ ద్రయి నాఁగ సుమి,త్రానందనయుగము కైక♦తనయుఁడు తనరన్. ౮౫౪

కం. సేవకులు పెక్కు రానం,దావిష్టులు మ్రొక్కి పార్శ్వ♦మందు సముచితం
బౌవివిధాసనతతిపై, వావిరిఁ గూర్చుండ ముఖ్య♦వానరవర్యుల్. ౮౫౫

కం. ఖరకరసుతముఖు లిరువది,గురు సచివచతుష్కయుతుఁడు ♦ గురుమతి దశకం
ధరసోదరుఁడును గొల్వఁగ, ధరణీశుఁడు గుహ్యకవృత♦ధనదునిఁబోలెన్. ౮౫౬

తరలము. నిగమవృద్ధులు సత్కులీనులు ♦ నీరజాక్షుని హస్తముల్
మొగిచి మ్రొక్కి నిజోచితాసన♦ముల్ గ్రహించి భజింపఁగన్
జిగి దొలంకఁగ మాసివర్యులు ♦ నిర్జరుల్ గొలువన్ దివిన్
నగవిరోధిని మించుశీవిఁ ద♦నర్చె రాముఁడు గొల్వులోన్. ౮౫౭

కం. కౌసల్యాతనయుం డిటు, భాసిలఁ బేరోలగమునఁ ♦ బౌరాణికు ల
త్యాసక్తిఁ బురాణకథా, వ్యాసంగము జరపి రర్హ ♦ మగుమార్గమునన్. ౮౫౮

→ శ్రీరాముఁడు జనకాదిరాజుల వారివారిపురంబుల కనుచుట. ←

చం. దినము దినంబు నిట్లు జగ♦తీపరిపాలన మార్గపద్ధతిన్
జనపదరాష్ట్రదేశజన♦సమ్మతిగా నొనరించు చొక్కనాఁ

డనఘుని మైథిలుం గని కృ♦తాంజలి యై జననాథ! నీ వె మా
కనయము దిక్కు, పంక్తిరథ♦నాసురు నీమహిమన్ జయించితిన్. ౮౫౯

ఉ. నీకృప రక్షణీయులము ♦ నిర్మలశీల! విదేహభూమిపే
క్ష్వాకుల బాంధవంబు భృశ♦సమ్మద హేతువుకీర్తిదంబు మీ
రీకడ కేగుదెంచి చని♦రెం బలునాళ్లు జనావనక్రియా
స్తోకరతాత్ము లీరు పురిఁ ♦ జూడఁగఁ బోయెద రేని ప్రేముడిన్. ౮౬౦

కం. ఈరత్నంబులఁ గొనిచనుఁ, డీరలు భరతుండు వెంట ♦ నేతెంచెదు నా
శ్రీరామునివాక్కుల విని, గారామున జనకుఁ డనియెఁ ♦ గాకుత్స్థవరా! ౮౬౧

కం. నీదర్శనమున రాజా! నీదువిధేయతకు మనము ♦ నెఱి మోదించెన్
నాదుహితల కీరత్నము, లాదృతి నొసఁగితి నటంచు ♦ నరిగెం బురికిన్. ౮౬౨

తే. అవలఁ గేకయుతో రాముఁ ♦ డనఘశీల!
భరతుఁడును లక్ష్మణుండు మా ♦ సిరియు రాజ్య
మెల్ల మీయది మీ రె మా ♦ కెపుడు దిక్కు
వైన మీ రిందుఁ బెక్కునా ♦ ళ్లయ్యె వచ్చి. ౮౬౩

ఉ. అచ్చట వృద్ధు తండ్రి మది ♦ నారట మొందెడు మీరు లేమి, మీ
రిచ్చ చెలంగ నేఁడ చన ♦ నెంచెద రేనియు లక్ష్మణుండు తో
వచ్చు మహార్హరత్నధన♦వర్గముఁ గొంచు నటంచు మ్రొక్కనీ
కెచ్చును నిచ్చ రత్నము ల♦హీనగుణా! యని మ్రొక్కెఁ గ్రమ్మఱన్. ౮౬౪

కం. వృత్రవధానంతరమున, జైత్రుఁడు వాసవుఁ డుపేంద్ర♦సహితునివలె సౌ
మిత్రిసహాయుఁడు గేకయ,ధాత్రీపతి చనియెఁ బిదప ♦ దశరథసుతుఁడున్. ౮౬౫

## రావణయుద్ధమునఁ దనకుఁ దోడ్పడ మూఁగినరాజుల శ్రీరాముఁడు సత్కరించి పంపుట.

చం. తనదుసుహృజ్జనాగ్రణిఁ బ్ర♦తర్దనుఁ గాశిపతిన్ దయారతిన్
జనవునఁ గౌఁగిటం బొదివి ♦ క్ష్మావర! ప్రీతియు నిండు నెయ్యమున్
గనఁబడఁగా మహోద్యమము ♦ కైకతనూభవుతోడఁ జేసి తే
మని నిను మెచ్చువాఁడ సుగు♦ణాభరణా! పురి కేగి వచ్చె దే. ౮౬౬

కం. తోరణయుత మై సుప్రా,కారాన్విత మగుచు మిగులఁ ♦ గమ్రం బగుచున్
శూర! భవత్పరిపాలిత,వారాణసి వఱలు చుండుఁ ♦ బరమగుణాఢ్యా. ౮౬౭

కం. అని సింహాసనమును రఘు,తనయుఁడు డిగి డాయ వచ్చి ♦ ధరణీపువక్షం
బునఁ గ్రుచ్చి గౌరవోక్తుల, ననుమతి యిడ నాతఁ డరిగె ♦ నావల విభుఁడున్. ౮౬౮

తే. మూఁడువందలన్నృపసత్తములను జూచి, మందహాసంబు మోమున నందగింప
స్వీయతేజంబునను సురక్షితుల్గు మీర, లతులసంప్రీతి నుంచితి రఘులార!
చం. నిరతము ధర్మనిష్ఠులరు నిత్యము సత్యమునున్కిపట్టులుక్
వరబలశాలులుం ద్వసనుభావము తేజముచేతఁ; బంక్తికం
ధరుఁ డఘశీలి దుష్టమతి దండధరుం గన నేగె బాంధవో
త్కరములతోడఁ, దత్త్రియను గారణమాత్రమ నేను జూడుఁడీ. ౨౦
కం. జనకావనీశునందిని, వనముల హృత యైనవార్త భరతుఁడు విని మి
మ్మనఘాత్ములార! పిలిపించిన వచ్చితి రెల్ల రీరు స్నేహము ప్పెరిన్. ౨౧
కం. ఎత్తిచనర్ రావణుపై, నెత్తికొనిన మీకు నిచట నేగెను బలునా
ళ్లుత్తమమతులారా! మీ, రిత్తఱిఁ బురి కేగు టొప్పు నిష్టం బేనిన్. ౨౨
కం. అనవుడు నృపాలు రందఱు, జనకసుతాప్రాణనాథుసావ్దూక్తులకుక్
మనమున నలరి వచించిరి, వినయము నీసహజగుణము విశ్వస్తుత్యా! ౨౩

రాజులు శ్రీరాముఁ గొండాడి సెలవు గొని పోవుట.

సీ. మాయదృష్టంబున మహిపతీ! సుఖముగా, వనములయం దుండి వచ్చి తయ్య
మాయదృష్టంబున మహిమ పెంపారఁగఁ, బట్ట మందితి వీవు భద్రచరిత!
మాయదృష్టంబున మార్తుర నెల్లర, రణసీమఁ ద్రుంచితి రామచంద్ర!
మాయదృష్టంబున మరల భూమిసుత, గ్రహియింపఁ గంటివి కౌసలేయ?
ఆ. శాత్రవులను జంపి జయశాలి వగునిన్నుఁ, గన్నులారఁ గనఁగఁ గలిగెఁ బుణ్య
మిదియె మాయభీష్ట మిదియె మాప్రీతియు, రమ్యసుగుణసాంద్ర రామచంద్ర!
ఉ. ఎంతప్రశంస కేక్ దశరథేశ్వరనందన! నీవ యర్హుఁ డి
ట్లింతగ మమ్ము మెచ్చి వచియించెద వే మన? నిట్టిచర్య నీ
కెంతయు యోగ్య, మీకరణి నేని వచింపఁగ మేము నేర, మో
చింతితసత్ఫలప్రద విశిష్టచరిత్రక! పోయి వత్తుమే? ౨౪
కం. ఒక్కటి మాకోరిక మే, మెక్కరణిని నిన్ను నిరత మెద నుంచెద మో
యక్కరణిని నీవును మము, నక్కఱ మది నిలుపవయ్య యవనిసుతేశా! ౨౬
కం. అన నట్టుల కానిం డని, జనవరుఁడు వచింప వారు సమ్మదమున నా
తనిచే సత్కృతు లగుచుం, జని రాత్మపురంబులకును సైన్యంబులతోన్. ౨౭

సకలరాజులు వారివారిరాజ్యంబులకుఁ బోవుట.

కం. భరతునియానతిచొప్పున, ధరణీశులు దెచ్చి యున్న ధ్వజినీచయముల్
కరితురగము లక్షోహిణు, లనుదారఁగ నడచెఁ బుడమి యాకంపింపన్. ౨౮

సీ. అప్పుడు దర్పబ♦లాన్వితుల్ భూపతుల్, పలికి రొండొరులతో ♦ భరతుఁ డకట
రణమునకై మమ్ము ♦ రప్పించు టది యెల్ల,వ్యర్థమై పోయె ద♦శాస్యుపోరుఁ
గనమైతి మసురుల ♦ క్ష్మావరు లే శీఘ్ర,మునఁ జంపి నైచి రే♦మనఁగ వచ్చు
రామసౌమిత్రుల♦ప్రాపునఁ జింత లే, కంబుధి దాఁటి ప్ర♦త్యర్థివితతిఁ

తే. దునుమఁజాలమె యని కొంద ♦ అనుకొనంగఁ
గొంద ఱవనీశుచరిత లా♦నందయుక్తిఁ
బలికికొంచును ధనధాన్య♦పటలపూర్ణ
రాష్ట్రముల కేగి రామహా♦ర్షంబుపొంది. ౧౨౯

ఉ. స్యందనవాజివారణము♦హార్ద్రమణీచయయానసంతతుల్
చందనలేపనంబులును ♦ స్వర్ణవిభూషణమౌక్తికంబులుఁ
సుందరులైనదాసులును ♦ జొక్కపుఁగంబళము ల్ప్రవాళముల్
వందలుగా సభక్తిక ము♦పాయనరాజుల నిచ్చి రందఱున్. ౧౩౦

తే. భరతలక్ష్మణశత్రుఘ్ను ♦ లరుసమునను
వానిఁ గైకొని పురిఁ జేర ♦ వచ్చి రామ
విభున కిచ్చిరి వేర్వేఱ ♦ విశదపఱచి
రాముఁ డవియెల్ల గ్రహియించి ♦ రాగమునను. ౧౩౧

శ్రీరాముఁడు సుగ్రీవాంగదహనుమదాదుల బహూకరించుట.

చం. ఒసఁగెను భాస్కరాత్మజున ♦ కుత్తమ మశ్వము భూషణాళి రా
ఘుసపతి కిచ్చె వెండియును ♦ జారువిభూషణముల్ వనాటరా
ఘుసతతికీయ నందఱును ♦ సంతసమార శిరఃకరంబులం
దసదృశభక్తిఁ దాల్ప వసు♦ధాధిపుఁడుం బరిహృష్టచిత్తుఁ డై. ౧౩౨

కం. అంగదహనుమంతుల ను,త్సంగంబునఁ జేర్చి సూర్య♦తనయునితో నీ
యంగదుఁడు నీసుతుం డఁట,సంగాతియు మంత్రి పవన♦జాతుఁడు నీకున్. ౧౩౩

ఉ. మేలగుయోజన ల్దెలిపి ♦ మేలు దలంచుచు నుంద్రు, నాకు స
చ్ఛీలురు వీర లిర్వురు వి♦శేషముపూజ్యత త్వన్నిమిత్త మై
పోలఁగఁ గాంచ నర్హు, లని ♦ భూషణముల్ తనమేనివెల్ల భూ
పాలుఁడు వారికిం దొడిగె ♦ వానరులెల్లరు మేలు మే లనన్. ౧౩౪

సీ. పదపడి నలనీల♦పనసకేసరిగంధ,మాదనకుముదుల ♦ మైంద ద్వివిదు
జాంబవంతుని నింద్ర♦జాను దరీముఖు,దధిముఖు సన్నాద♦తరుచ శేంద్రు
వినతు సుషేణు ధూ♦మ్రుని దధిముఖునిఁ బ్ర,జంఘు గవాక్షుని ♦ శారభుని
వినుతవీర్యుల మహా♦విక్రమశీలురఁ, బతికార్యసాధన♦రతులఁ గీశ

తే. యూథపులఁ గాంచి తియ్యని♦సూక్తు లొప్ప
నాకు నెయ్యురు మీరెల్ల ♦ నాదుతనువు
సోదరులయట్టివారలు ♦ శూరులార!
యేమి ప్రతికృతి సేయ నే ♦ నేమి నేర్తు? ౨౨౫

ఉ. అంత మెఱుంగరానివ్యస♦నాబ్ధిని మున్గి తపించు నన్ను వి
భ్రాంతి సముద్ధరించితిరి ♦ కాఁగల దెయ్యది దానిసాటి? మీ
యంతలు నెయ్యు రైనతస♦నాత్మజుభాగ్యమె భాగ్య మార! స
త్స్వాంతముచేత నాయిడెడి♦స్వల్పము మీరు పరిగ్రహింపరే. ౨౨౬

చం. అనుచు యథార్హరీతి మణు♦లాభరణంబు లొసంగి కౌఁగిటం
జనవరుఁ డంటఁ బొదివి ♦ సమ్మదవారిధిఁ దేల్చె నీగతిం
దనివి సనంగఁ దేనియలు ♦ ద్రావుచు మాంసఫలాళి మెక్కఁగఁ
జ్జనియెను సాగ్రమాసము క్ష♦ణం బన; రాక్షసకీశపాళితోన్ ౨౨౭

కం. అవనీవిభుఁడు వినోదం, బవురీతిని గడుపు చుండ ♦ నట్టులె చనె రెం
డవశిశిరమాస మీగతి, నవిరళసుఖపరత హార ♦ లలరుచు నుండన్.[1] ౨౨౮

### శ్రీరాముఁడు సుగ్రీవాదులం గిష్కింధ కనుచుట.

సీ. సుగ్రీవుతోడ ద♦శగ్రీవపరిపంథి, యనియెఁ గీశేంద్ర!సు♦రాసురులకుఁ
జేరంగరానికి♦ష్కింధకుఁ జను మీవు, సపరివారుండ వై ♦ జాగులేక
మంత్రియుక్తుండ వై ♦ మహిఁ జక్కఁ బాలింపు, శాత్రవచయముల ♦ సంహరింపు
మీయంగదుని నితాం♦తాయతప్రీతితోఁ, జూడుమీ పవమాన♦సూనునట్ల

ఆ. మహితబలునినలుని ♦ మామ సుషేణుని, మైందు ద్వివిదు గంధ♦మాదనునిని
దారుఁ గుముదు నీలు ♦ వీరుని శతవలి, గజు గవాక్షు శరభు ♦ గవయు ఋషభు. ౨౨౯

కం. ఈకమలాసనతనయునిఁ, బ్రాకట మగుప్రేమతోడఁ ♦ బాలింపవయా
నాకై ప్రాణము లిచ్చిరి,యీకీశులబుణ మదెట్టు ♦ లేఁ దీర్పఁ గలన్. ౨౩౦

### శ్రీరాముఁడు విభీషణు లంక కనుచుట.

ఉ. వీరల కెప్పు డేనియును ♦ విప్రియముల్ ఘటియింపఁ బోకు మం
చారఁగఁ బల్కి రాక్షసకు♦లాధిపతిం గని యవ్విభీషణున్
ధీరచరిత్ర! విత్తపతి♦దివ్యపురంబును లంక నేలుమీ
సారసుధర్మమార్గమునఁ ♦ జారుగుణా యవినీతిఁ బాయుచున్. ౨౩౧

ఆ. ధర్మరీతి విడక ♦ ధరణీతలేంద్రుండు, బుద్ధిమంతుఁ డగుచుఁ ♦ బుడమి నేల
నవనిఁ బ్రాభవంబు ♦ నఖిలసంపదలును,నిత్య మతనియొద్ద ♦ నిలిచి యుండు. ౨౩౨

[1] చైత్రమునఁ బట్టాభిషేకము. కావున ఫాల్గునమువఱకు నుండుటచేఁ గపు లొక సంవత్సర మయోధ్య యం దుండిరని దేర్పడుచున్నది.

కం.నన్నును సుగ్రీవుని నీ, వెన్నుండును మఱవ కుండు♦మీ నెమ్మదిఁ బొ
మ్మన్నను గపిరాక్షసతతు, లన్నన్నా మే లటంచు ♦ నధిపుం బొగడెన్. ౮౯३

కం.నీమతి విధియందుంబలె, నేమంబున వెలసియుండు ♦ నిర్వక్రం బై
నీమాధుర్యము నీయతు,లామితవీర్యంబు శక్య♦మా పొగడంగన్. ౮౯४

శ్రీరాముఁడు హనుమంతునకు వరంబు లిచ్చుట.

చం.అనునెడ వాయుసూతి విన♦యంబున ని ట్లను రామచంద్ర! నా
మన మెదివేళ నీయెడల ♦ మానని నెయ్యముఁ బూనుఁ గాక, నా
కనయము నీదుభక్తి చెలు♦వారెడుఁ గాక, మనం బిఁ కెందునుఁ
జనకయ యుండుఁ గాక మహి♦జాధవ! నన్ను ననుగ్రహింపుమీ. ౮౯५

కం నీదివ్యచరిత్రం బీ, మేదిని నెందాఁక నిలుచు ♦ మిహిరకులేంద్రా!
నా దేహంబునఁ బ్రాణము, లాదరమున నిలువ నిమ్ము ♦ యందాఁకఁ బతీ! ౮౯౬

కం.అచ్చరలు నీచరిత్రము, సచ్చరితా వినుచువారు ♦ సత మది వినుటన్
హెచ్చుగనుత్కంఠను నే,వ్రచ్చెద ననిలుండు మేఘ♦పటలంబు నసన్. ౮౯౭

చం.అనవుడు రామభద్రుఁడు వ♦రాసనమున్ విడి లేచి యాంజనే
యునిఁ దనకౌఁగిటం బొదివి ♦ యుత్తమరక్తి వచించె నీమనం
బునఁ గలయట్లు కాఁగలదు ♦ మోదము దాల్పుము నాచరిత్ర భూ
మిని గలదాఁకఁ గీర్తియును ♦ మేనను బ్రాణము నీకు నుండెడిన్.[1] ౮౯౮

కం.లోకంబు లుండుదాఁకను, నాకీర్తియు నిలిచియుండు ♦ నాప్రాణములన్
నీ కొక్కొకయుపకృతికే, యో కేసరితనయ! యీయ♦నో పనివడినన్. ౮౯౯

కం.ఉపకృతి చేసినవానికి, నుపకారముఁ జేయఁ దలఁచు ♦చుండుట తానా
యుపకారి యాపదం గనఁ, గపివర! ధ్యానించుచుంట ♦ గాదే యరయన్. ౯౦౦

కం.అని చంద్రాభము హారం, బనుపమవైదూర్యతరళ ♦ మాత్మగ్రీవం
బున నుండి తీసి కంఠం,బున వయిచెన్ గంధవహుని♦పుత్త్రున కర్థిన్. ౯౦౧

కం.ప్రాలేయకిరణబింబము, హాళిని ధరియించుకనక♦మహీధర మనఁగా
మాలాదీపితతనుఁ డై,వాలాయము పవనసుతుఁడు ♦ ప్రభ రాణించెన్. ౯౦౨

కం.రామునివాక్కులఁ గీశ,స్తోమము విని లేచి లేచి ♦ తోరపుభక్తిన్
రామునిపదకంజములకు, వేమఱు నతులన్ ఘటించి ♦ వెడలెను బోవన్. ౯౦३

ఉ. భానుజుఁడున్ విభీషణుఁడుఁ ♦ బార్థివవర్యుఁడు తమ్ముఁ గౌఁగిటన్
మాననిరక్తిఁ జేర్చి బహు♦మానపురస్సరసాంత్వవాక్కు లెం
తే నయమారఁ బల్కఁ గను♦నీళ్లను గార్చుచు మూఢు లై ధరా
జానిని బాసిపోవుటకు ♦ సమ్మతి లేక తపించు చుండఁగన్. ౯౦४

[1] ఇది శ్రీరాముల యమానుషత్వమును దెలుపును.

తే. అశ్రుపూర్ణాక్షు లగుచు న్వృ♦ద్ధాటవరులు
బొమ్మలట్లయి స్మృతి లేక ♦ పోయి రెట్లొ
దేహి దేహంబుఁ బాసిన♦ తెరువు దోఁప
ముదము లే కాత్మలం దాత్మ♦సదనములకు. ౯౦౫

కుబేరు నొద్ద నుండి పుష్పకము శ్రీరాముఁ గొల్వ వచ్చుట.

సీ. అందఱ నీగతి ♦ ననిపి శ్రీరాముండు, హాయి నుండఁగ నప♦రాహ్ణమునను
గగనంబు నుండి వా♦క్యం బొండు వీ తెంచె, నావంకఁ గనుము భూ♦నాథచంద్ర!
నేను బుష్పకమును[1] ♦ నీకడ కనిచెఁ గు,బేరుండు మరల సం♦ప్రీతుఁ డగుచు
నీయాజ్ఞ గొని పోవ ♦ నాయక్షనాథుండు, నాతోడ నిట్లనె ♦ నయము దొలఁక

ఆ. రామచంద్రవిభుఁడు ♦ రావణు వధియించి, యొడిచె నిన్ను! బంధు♦యుక్తుఁ డగుచుఁ
గలన రావణుండు ♦ పొలియుట నాకును, బూర్ణహర్షకరమ♦పుష్పకంబ!. ౯౦౬

కం. రామునిదానవు నీ వట,కే మరలం జనుము ముదల ♦ నిడితిని జగమం
దామహనీయుఁడు నీపై, నామోదముతోడఁ దిరుగ ♦ నర్హమ టన్నన్. ౯౦౭

ఉ. వచ్చితి నిందు రాఘవ! ప్ర♦భావమునం గనరాక యేరికిన్
నిచ్చఁ జరించుచుండు నవ♦నీతనయేశ త్వదాజ్ఞ చేత నీ
యిచ్చకు వచ్చున ట్లన మ♦హీపతి యట్లగు నేని నీకు నే
నిచ్చెద స్వాగతంబు కొను♦మీ యనుచున్ సుమధూపలాజలన్. ౯౦౮

ఆ. పూజచేసి యనియెఁ ♦ బుష్పకంబా! నిన్నుఁ, గెలన మున్న వేళఁ ♦ దలఁచువాఁడ
నపుడు రమ్ము యంత ♦ కరుసంబుతో నీవు, తిరుగు మడ్డులేక ♦ సురపథమున. ౯౦౯

భరతుఁడు శ్రీరామునకుఁ బ్రజలసుఖస్థితిఁ దెలుపుట.

చం. అనవుడు నట్ల కాక యని ♦ యయ్యది యేగినయంతఁ గైకయీ
తనయుఁడు లేచి కేల్మోగిచి ♦ దాశరథీ! నెల యొక్కఁ డంతలోఁ
గనుఁగొన నీవు దేవుఁడవు♦గాఁ గనిపించెదు, వీతరోగులై
మనుగడ గూరి రెల్లరు న♦మానుషసత్త్వము లారఁ బల్కెడిన్ ౯౧౦

ఆ. పూర్ణవార్ధకమున ♦ జీర్ణ మయ్యును మేను, మరణభయము లేదు ♦ మానవతులు
నెగులు దిగులు లేక ♦ నీళ్లాడు చున్నారు, ప్రజలు బలిసి యున్న♦వార లెందు.

ఉ. మానవకోటు లెందు నస♦మానముదంబునఁ గ్రాలుచుండెడున్
వానలు కారునం దొనరె ♦ వాయువు లెల్లెడ వీచె హాయిగా
నీనృపుఁడే స్థిరంబుగ మ♦హీపతి యై యలరారుఁ గాక యం
చీ నెఱి నెల్లవారు పచి♦యించెద రన్న ముదంబుఁ గాంచుచున్ ౯౧౧

[1] పుష్పకము నిర్జీవమైన యాకాశయానము. ఇవి దానిని నడపువాఁడు చెప్పెడుమాటలు.

### ⟵ శ్రీరాముఁ డశోకవనంబున సీతాదేవితోఁ గ్రీడించుట. ⟶

సీ. చందనాగరుచూత♦మందారపున్నాగ,పనసకాలేయక♦పారిజాత
చంపకదాడిమ♦జంబూప్రియంగునీ, పార్జునసప్తప♦ర్ణాతిముక్త
తుంగకకదళిమ♦ఘూకనాగకదంబ,భూజముల్ సర్వదా♦పుష్పగుచ్ఛ
ఫలసమానతము ల♦బ్బంగిని దివ్యముల్, శిల్పికల్పితములు ♦ చెన్నుమీఱ
తే. మత్తహిందోళఝుంకార♦మానితంబు, భృంగరాజవనప్రియ♦హృద్యవివిధ
వర్ణపక్షిమనోజ్ఞంబు ♦ స్వర్ణహేతి, మేచకాంజననిభనగ♦మేదురంబు. ౯౧౩
ఆ. సురభిపుష్పములును ♦ సురుచిరమాల్యముల్, నిగ్గుదేఱు పెక్కు♦డిగ్గియలును
మంజులంబు లైన♦మాణిక్యసోపాన,కోటి స్ఫటికకలిత♦కుట్టిమనులు. ౯౧౪
కం.ఫుల్లోత్పలపద్మంబులు, సల్లలితరథాంగమిథున♦సంచయములు ను
త్ఫుల్లప్రసూనవత్తరు, లుల్లాసము గొలుపఁ దీర ♦ మొప్పారంగన్. ౯౧౫
కం.సారసదాత్యూహశుకీ,వారములు మరాళములు ర♦వంబులు నింపన్
జారుతరం బగుచును న,య్యారామము మీఱె హృదయ♦హారమై శివిన్. ౯౧౬
సీ. బహుళరూపంబు లౌ♦ప్రాకారములును వి,శాలంబు లౌనునుఁ♦జాఁపఱాలు
వైడూర్యమణిసన్ని♦భములు పచ్చికపట్లు, క్రమ్రముల్ పుష్పిత♦కాననములు
వినువీదిఁ జుక్కల♦విధమున ఱాలపై, రాలినపూవులు ♦ రమణ మీఱ
నందనంబో బ్రహ్మ♦మందిరంబో చైత్ర,రథమొ నా మిక్కిలి♦రమ్య మగుచు
ఆ. మిసిమి మెఱయుపట్లు ♦ కుసుమాసనంబులు, పూవుఁబొదరుటిండ్లు♦పొలుపుఁ గనినఁ
తనయశోకవనము ♦ దశరథతనయుండు, చొచ్చి మెచ్చుగొలుపు ♦ శుభతలమున.
కం.జనకసుతాహస్తంబును, దనకేల గ్రహించి వజ్రి ♦ తనసతివలెఁ బా
వనమధుమైరేయముఁ, దనివారఁగఁ ద్రావఁ జేసెఁ ♦ దత్ప్రియురాలిన్. ౯౧౭
కం. తేరఁ బనివాండ్రు ఫలములఁ, జారుసుమృష్టామిషంబుఁ ♦ జవిగొనఁ బిదపన్
ధారిణిధవుసంప్రీతికి, నారఁగ నృత్యంబు గీత ♦ మట వర్తిల్లెన్. ౯౧౯
కం.రామలు మనోభిరామలు, రాముని రంజింపఁ జేయ ♦ రమణుల కెల్లన్
శ్రీమహితుం డాభరణ,స్తోమాంచితుఁ డారఁ గూర్చెఁ ♦ దోరపుఁగృప్తిన్. ౯౨౦
కం.సీతాసహితుఁడు కౌస,ల్యాతనయుఁ డరుంధతీస♦హాసీనుం డై
భాతిం దనరువసిష్ఠుని,రీతిం జెన్నారె నిట్లు ♦ శ్రీరాముండున్. ౯౨౧
ఆ. సురతనూజఁబోలు ♦ ధరణీశుమారితో, నమరునట్లు సుఖము ♦ లహరహంబు
ననుభవింప నిరత♦మతిభోగదం బైన,శిశిరకాలమెల్లఁ ♦ జెల్లె మెల్ల.[1] ౯౨౨
ఆ. వివిధభోగములను ♦ వేడుక మీఱఁగ ననుభవించు చుండ ♦ నమ్మహాను
భావులకును గడచెఁ ♦ బదివేలవర్షముల్,[2] శిశిరకాల మిట్లు ♦ చెల్లుటయును. ౯౨౩

---

[1]పట్టాభిషేకానంతర మొకయేఁడు వానరాదుల నాదరించుటలో సరిపోయెఁగాని సీతతోఁ గ్రీడింప ననువుపడదయ్యె. పట్టాభిషేకానంతరము రెండవసంవత్సర మిట్లు గడచెను. [2] వర్షములు దినపర్యాయములని కొందఱు వివాహము మొదలెంచిన నించుమించు సరిపోవును.

ఆ. దినము పూర్వభాగ♦మున ధర్మకార్యముల్, ధర్మవిదుఁడు నడపి ♦ ధర్మవిధిని
దక్కఁ-సగముదినము ♦ మక్కువతో నంతి,పురమునందుఁ జేరి ♦ ప్రొద్దు పుచ్చు.
కం.ఉర్వీతనయామణియును, బౌర్వాహ్ణిక కార్యములు సు♦పర్వార్చనలున్
సర్వంబుఁ దీర్చియత్తల, గుర్విగఁ బూజించి తనదు♦కూటంబునకున్　　　౯२४
కం.చిత్రాభరణాంబర యై, పుత్రహరుం జేరవచ్చు♦నింద్రాణివలెన్
గోత్రాసుత వచ్చిన వై,చిత్రిం గని మెచ్చె భూప♦శేఖరుఁ డెలమిన్.　　　౯२६

## సీతాదేవి ఋష్యాశ్రమంబులకుఁ బోవఁ గోరుట.

కం.సుతగతిఁ గల్యాణసము,న్వితపత్నిం గాంచి మాని♦నీ నీయెడలన్
సుతలాభచిహ్న[1] దోఁచెడి, నతివా! నీకోర్కి దెలుపు ♦ మది ఘటియింతున్. ౯२८
చం.అన స్మితచంద్రికావికసి♦తాననపద్మ తపోవనంబులం
గనుఁగొన వల్లభా! మదిని ♦ గల్గెను గోరిక గాంగతీరమం
దొనరినయాశ్రమస్థలుల ♦ నున్నతపస్వులఁ జూచి పూజలం
దనిపెద నొక్కరేయి యయి♦నన్ మన సయ్యెడి నందు నిల్వఁగన్.　　　౯२७
కం.నావుడు నీరజనయనా!, నీవలచినయట్ల తేప ♦ నేఁ బంతు మదిన్
నీ వనుమానము విడు మని, తా వచ్చెన్ నడిమికక్ష్యఁ ♦ దనమంత్రులతోన్. ౯२९

## శ్రీరాముఁడు భద్రుని లోకవార్త లడుగుట.

సీ. ఇటు లుపవిష్టు లై ♦ హితులు విచక్షణుల్, భజియింపఁ బెక్కురూ♦పములు గలుగు
హాస్యకారులు విజ♦యకుటకాశ్యపమధు,మత్తకాళియులు సు♦మాగధుండు
భద్రుండు మఱి దంత♦వక్త్రసురాజులు, పింగళుల్ తమనేర్పు♦పెంపు మెఱసి
పరిహాసవార్తలు ♦ పలుకుచు శ్రీరాము, నలరించు చుండఁ గ♦థాంతమందు
తే. భద్రుఁ డనువానిఁ గని రాము♦భద్రుఁ డనియె, వార్త లేమిర పల్లెలఁ ♦ బట్టనముల
భరతలక్ష్మణశత్రుఘ్న♦ధరణిసుతలఁ, గైకయిని గూర్చి యే మంద్రు ♦ లోకు లెల్ల.
చం.జనులకు మేలు గూరఁగఁ బ్ర♦జాపరిపాలన సేయురాజు దా
వినఁదగుఁ దన్నుఁగూర్చి తన♦పేటను రాష్ట్రమునందు లోకు లే
మనుకొనువారొ సర్వవిష♦యంబుల రా జటు సేయఁ డేనియున్
వనములఁ బల్లెలం బురము♦నన్ జననిందితుఁ డౌ నిజంబుగన్.　　　౯3०
చం.అనవుడు భద్రుఁ డి ట్లనియెఁ ♦ బ్రాంజలి యై ధరణీశ! పట్టనం
బున మఱి పల్లెలందు జన♦ముల్ భవదద్భుతవార్తలే సదా
యనుకొనువారు మేలుగ ద♦శాననుఁ జంపుట తజ్జయంబు వా
కొనియెడివార లెల్లయెడఁ ♦ గూరిమితోడ ననన్ నరేంద్రుఁడున్.　　　౯3१

[1] గర్భము.

చం. కలదికలట్టు చెప్పుము జ♦గజ్జన మేమని మేలు పల్కెడున్
బలికెడి నేమికీడులను ♦ వార్తల నన్నిటిఁ జెప్పు, మన్నియుం
దెలిసినఁ గాదె కీడులను ♦ దీర్చి శుభంబులు గూర్పనచ్చు, లోఁ
గలఁగకు పాప మే మనెడి ♦ త్మాజనము ల్వివ వాంఛ చేసెదన్. ౩౩

భద్రుఁడు శ్రీరామునకు సీతావిషయకాపవాదంబుఁ దెలుపుట.

సీ. ధృతి గూరఁ బలికిన♦పతికి వాఁ డిట్లనుఁ, దోఁటల బాటలఁ ♦ దోఁపులందు
సంగళ్ల శాలల ♦ నఖిలతలంబుల, రామభద్రుం డర♦రే! మహాత్ముఁ
డమరదానవనిర్జ♦రాళి కసాధ్య మౌ, సేతువుఁ గట్టించె ♦ సింధువునను
సేనలతోడ ని♦ర్జించెను రావణు, వానరులను వశ ♦ వర్తుఁగఁ జేసె
ఆ. ఋక్షశతుల నేలె ♦ రాక్షసకోటుల, కేలి కయ్యె నైన ♦ నేమికాని
దనుజుఁ డపహరింపఁ ♦ దనభార్య నయ్యది, మఱచినాఁడు మరల ♦ మరగినాఁడు.
మ. బలవంతంబుగఁ జేర్చి స్వాంకమున దే♦వద్వేషి కొంచేగ, నా
ఖలుఁడే లంక నశోకవాటి నునిచెం ♦ గాపుంచె స్వస్త్రీల, న
చ్చెలువం గ్రమ్మఱఁ దెచ్చి యింట నునిచెన్ ♦ సీ యాత్మగర్హింపఁ డా
పొలఁతిం గూడి నృపుండు మోహమున సం♦భోగింప నేసౌఖ్యమో. ౩౫
కం. తామునుఁ డగురాక్షసుగృహ, సీమను జిరకాల ముట్లు ♦ చెఱఁబడినసతిన్
రాముఁడుఁ రోయక కూడెడిఁ, గాముకు లగువారి కెందుఁ ♦ గన్నులు గలవే? ౩౬
కం. రాజానుమతము ధర్మము, రాజువిధం బనుసరింపఁ ♦ బ్రజ కర్హంబౌ
రాజునలె మనకు నాత్మస,తీజనచర్యలు సహింపఁ ♦ దీ రగు నింకన్. ౩౭
కం. అని వారు వారు దోఁచిన, యనువునఁ బురి జనపదముల ♦ ననుకొనువారల్
జనులెల్ల నని నరాముఁడు, మనమునఁ బరమార్తికతన ♦ మల్లడి గొనుచున్. ౩౮
కం. అనె నందఱు మిత్రులఁ గని, వినినారలె మీర లిట్టి♦విధము లటన్నన్
వినతశిరంబుల వారలు, వినతు లొనర్చుచును ధరణి♦విభునిన్ దీనున్ ౩౯
కం. అందఱుఁ బలికిరి దీనన్, సందియ మేమియును లేదు ♦ జనవర! యనఁగా
డెందము విచారభరడో,లాందోళిత మగుడు వారి♦నందఱఁ బనిచెన్. ౪౦

శ్రీరాముఁడు సోదరులఁ బిలిపించుట.

ఉ. అందఱఁ బోవఁ బంచి తద♦నంతరకార్యము నిశ్చయించి సం
క్రందనతేజుఁడం దఱుత♦కావలివానిని బిల్చి కైకయీ
నందనుఁ బుణ్యశీలు శుభ♦నవ్యసులక్ష్మణు లక్ష్మణుం బరా
స్పందితుఁ దత్సహోదరునిఁ ♦ జయ్యనఁ దోడ్కొని రమ్ము నావుడున్. ౪౧

చం. జవమున వాఁడు లక్ష్మణుని ♦ శాలకు నేగి నమస్కరించి రా
ఘవ! మిము రాజు రాఁబనిచె ♦ గ్రక్కన నంచు వచింప వెంటనే
భవనము వీడి తేరిపయి ♦ భ్రాతృగృహంబున కేగె లక్ష్మణుం
డవనిపువీటి కేగఁ గని ♦ యావలఁ ద్వారస్థుఁడు కైకయీసుతున్. ౯౪౨

కం. చేరఁ జని మ్రొక్కి నృపునడి, తీరు వచించుడు నతండుఁ ♦ దెప్పునఁ బదసం
చారంబునఁ జనె నది గని, ద్వారాధ్యక్షుండు చూచి ♦ త్వర శత్రుఘ్నున్ ౯౪౩

కం. డాసి కైమోడ్పుతోఁ బతి, శాసన మెఱిఁగింపఁ జక్కఁ ♦ జనె నాతండున్
గౌసల్యానందనునకుఁ, దా సరగన్ గొల్ల[1] వినిచెఁ ♦ దమ్ములరాకల్. ౯౪౪

చం. అనుజులు వచ్చి రంట విని ♦ వ్యాకులచిత్తుఁ డవాఙ్ముఖంబుతో
ననియెను ద్వారపాలకుని ♦ నందఱ లో విడు, వారె నాప్రియుల్
తనువునఁ బ్రాణవాయు లనఁ ♦ దద్విధ మాతఁడు దెల్ప ముప్పురున్
వినయనతోత్తమాంగు లయి ♦ వే ముకుళీకృతహస్తపద్ము లై ౯౪౫

చం. చని యుపరాగసంకలిత ♦ చంద్రుఁడో? సంజను సూర్యుఁడో? యనన్
ఘనతరకాంతి మాసి నయ ♦ నంబుల నీరు తొలంక నున్నయ
న్నను హతశోభ మైననళి ♦ నంబునుబోలు తదాస్యబింబమున్
గని చరణంబులం దొఱఁగఁ ♦ గన్నులనీరము లోన మ్రింగుచున్. ౯౪౬

ఉ. తమ్ములఁ గౌఁగిలించి యుచి ♦ తమ్ముగుపీఠులఁ నుంపఁ బంచి నె
య్యమ్మునఁ బల్కె నోయనఘు ♦ లార! సహోదరు లన్న మీరె ప్రా
ణమ్మన మీరె సర్వము ధ ♦ నం బన మీరె త్వదార్జితమ్ము రా
జ్యమ్మును నేను బాలనము ♦ సల్పెద భూపతులార! వింటిరే? ౯౪౭

కం. మీరలు కృతశాస్త్రార్థులు, ధీరులు మతినిష్ఠితులును ♦ దెలిపెద నొండున్
గారియము నాకుఁగా నది, గారా దని యనక మీరు ♦ గావింపఁ దగున్. ౯౪౮

కం. అనవుడు నేమి వచించునో, యని యుద్వేగంపుమతుల ♦ నవధానముతో
ననుజాతు లుండ దీనా,ననముల నవ్వారి కుర్వి ♦ నాథుం డనియెన్. ౯౪౯

### శ్రీరాముఁడు భరతాదులకు లోకాపవాదవిధంబుఁ దెలుపుట.

మ. వినుఁ డేకాగ్రతఁ జక్క నానుడులఁ బృ ♦ థ్వీకన్యకం గూర్చి భూ
జనము ల్పల్కెడిచందముల్ పురములన్ ♦ సర్వప్రదేశంబులన్
వినరానట్టివి కుత్సితంబు, లవి నే ♦ విన్నాదిగా మర్మభే
దన మయ్యెం దలపోయ నెట్టు లలనిం ♦ దావాక్యము ల్పల్కెడన్? ౯౫౦

సీ. లోకసత్ప్రథితు లి ♦ క్ష్వాకు లవ్వారల, పుణ్యవంశంబునఁ ♦ బుట్టినాఁడ
సీత మహాత్మాళి ♦ శ్రేష్ఠుఁ డౌ జనకుని, సద్వంశమందుఁ దా ♦ సంభవించె

[1] గొల్ల = ద్వారపాలుఁడు.

దండకాటవియందుఁ ♦ దశకంఠుఁ డుర్విజ, నపహరించుటయు నే ♦ నతనిఁ జంపు
టే వెఱుంగవె యప్పు ♦ డే నాకు మదిలోనఁ,బరు నింట నుండిన ♦ పడఁతి సీత

తే. నెట్లు గొనిపోదుఁ బురి కని ♦ యే జూడుంగఁ
బ్రత్యయార్థంబు సతి వహ్నిఁ ♦ బడఁగ లేదె?
యగ్నిసీత పతివ్రత ♦ యనఁగ లేదె?,
నీవు సౌమిత్రి యచ్చట ♦ లేవె యపుడు?. ౯౫౧

ఉ. సీత యపాప యంచు సర ♦ సీరుహబాంధవచంద్ర మారుతుల్
ఖ్యాతిగఁ బల్క లేదె? సుర ♦ కాండము మ్రోల ఋషీశులెల్ల భూ
జాత యపాప యం చనరె? ♦ సాధ్వి సతీమణి యంచు దేవతా
నేత మదీయహస్తమున ♦ నిర్మలశీల నిడంతె లంకలోన్? ౯౫౨

తే. అంతెగా దయ్య నాయంత ♦ రాత్మకూడఁ, బూత యంచు నెఱుంగును ♦ భూమిజాత
గావునఁ గదా యయోధ్యకుఁ ♦ గ్రమ్మఱంగఁ, దోడి తెచ్చితి లక్ష్మణా! ♦ తోయజాక్షి.

కం. అపవాదము దుస్సహ మై, తపియింపఁగఁ జేసె నన్నుఁ ♦ దద్దయుఁ జూడం
బిపుడు పురంబులఁ బల్లెల, విపరీతపువార్తలెల్ల ♦ వినఁబడెడిఁ జూడీ!. ౯౫౪

చం. ఎవనియకీర్తి లోకమున ♦ నెందనుకన్ వినఁ గల్గువో యధో
భువనములందు నందనుకఁ ♦ బూరుషుఁ డుండెడుఁ బాపభోజియై
దివిజు లకీర్తినిం దెగడి ♦ తెల్పుచు నుంద్రు సు కీర్తిఁ, గాన మా
నవుఁడు సుకీర్తిఁ గోరియె య ♦ నారతముం బను లొప్పఁ జేయఁగన్. ౯౫౫

కం. విడిచెద మి మ్మెల్లర నే, విడిచెద నాప్రాణమేని ♦ విమలయశముకై
పొడమినయకీర్తి భీతిని, విడుచుట చిత్రంబె నేను ♦ బృథివీతనయన్. ౯౫౬

కం. ఎట్టియపవాదమునకుం, బట్టైతినొ మీరె కనుఁడు ♦ పార్థివులారా!
యిట్టి మహాదుఃఖము నే, నెట్టిదశలఁ గాంచి యెఱుఁగ ♦ నే మందు నిఁకన్. ౯౫౭

### శ్రీరాముఁడు సీతాదేవిని వాల్మీకియాశ్రమంబుపొంత విడువ లక్ష్మణు నాజ్ఞాపించుట.

సీ. ఎల్లియ వఱువాతఁ ♦ బృథ్విజఁ దోడ్కొని, తేరు సుమంత్రుండు ♦ తేర నీవు
సౌమిత్రి! చని సర్వ ♦ జనపదాంతంబున, గంగ కావొడ్డునఁ ♦ గ్రాలుచున్న
వాల్మీకియాశ్రమ ♦ వనములఁ దమసాధు,నీతీరవసుమతి ♦ నిర్జనంపుఁ
దలమున విడిచి గ్ర ♦ ద్దన రమ్ము నేఁ జెప్పి,నట్టులు చేయు మా ♦ ఱాడవలదు

తే. దీన యోజింపఁదగిన దే ♦ దియును లేదు, కూడదం చన నీపయిఁ ♦ గోపగింతు
మచ్చరణజీవితములపై ♦ మాన్యచరిత, శపథ మిడితిని బదులాడఁ ♦ జనదు నీకు.

కం. అడ్డం బెవరేఁ బలుకుచు, నొడ్డారించినను వారి ♦ నూహించెద నా
దొడ్డపగవారికైవడి, నెడ్డము గలిగించుటన్ మ♦దిష్టమునందున్. ౯౫౯

కం. నాయాజ్ఞ నుందు రేనియు, నాయెడ గౌరవము మీమ♦నంబుల నున్నన్
నాయాడినట్ల చేయుం, డాయీనుడు లాశకుండ ♦ నానతి యిడితిన్. ౯౬౦

కం. గంగాతీరంబున కేఁ,గంగా వాంఛిత మటంచుఁ ♦ గామిని పలికెన్
సంగతిగా నవ్వాక్యం,బంగనఁ దోడ్కొంచు లక్ష్మ♦ణా! చను సరగన్. ౯౬౧

కం. అని వారిఁ బొమ్మటంచును, ననుమతి యిడి బాష్పపూరి♦తాననుఁ డగుచున్
జని తనమందిరమున క,య్యనఘుఁడు నిట్టూర్పుచుండె ♦ నాగం బనఁగన్. ౯౬౨

## లక్ష్మణుఁడు సీతాదేవిని ఋష్యాశ్రమంబుల కని పిలుచుకొని పోవుట

సీ. పఱువాత నతిదీన♦వదనుఁడై సౌమిత్రి, సారథిని సుమంత్రు ♦ సరగఁ బిలిచి
వాడినమోముతోఁ♦బలికె నోయి సుమంత్ర!,యరదంబుఁబన్నుమీ♦యతిజవమున
స్వాస్తీర్ణ మధిపుగృ♦హంబునఁ గొనితెచ్చి, పఱువుము నృపునాజ్ఞ♦వలన సీత
ఋష్యాశ్రమములకు ♦ నేన తోడ్కొనిపోదు, ననవుడు నతఁ డట్ల ♦ యన్ని దీర్చి
ఆ. తేరు సిద్ధ మయ్యె ♦ దేవ! నా నాతండు, క్షితిపుగృహముఁ జొచ్చి ♦ సీతఁ గాంచి
వదినె! నీహృదీశు ♦ వరముఁ గోరితి వఁట, యాయనయును వల్లె ♦ యనియె నంట.

తే. జాహ్నవీతీరమున ముని♦సత్తమాశ్ర
మమ్ములకు నిన్నుఁ దోడ్కొని ♦ పొమ్మటంచు
నాజ్ఞ యిడె నాకు భూవిభుఁ ♦ డరుగుదెమ్ము
దేవి! శీఘ్రంబ యనఁగ వై♦దేహి యెలమి. ౯౬౪

కం. నిన్నని చుమి లక్ష్మణ! మీ,యన్నను నే నడుగ నట్టు ♦ లౌఁ గా కనియెన్
ని న్నింతలోనఁ బుచ్చెనె? వెన్న గదే నాదుప్రాణ♦విభుహృదయంబున్. ౯౬౫

ఉ. ఏ మని రిక్తచేతుల ము♦నీంద్రులపత్నులఁ జూడఁ బోదు నే
భూమిపుపత్నినై, వసన♦ముల్ రుచిరంబులు భూషణంబులున్
బ్రేముడిఁ గొంచు బోయి ముని♦భీతమృగాక్షుల కే నొసంగెదన్
దామస మేది లే దనుచుఁ ♦ దన్వి సమస్తము నేటి లక్ష్మణా! ౯౬౬

కం ఇవి వారికిఁ గొన యోగ్యమె, యివి మన కీయంగఁ దగునె ♦ యివి మంచివె కా?
యవుఁ గా దన వే లన నతఁ, డవు నవు నని నణఁచికొనుచు ♦ నలమట తనలోన్.

కం. ఎంతెంతముదము సతిగొను, నంతంతసుమిత్రతనయుఁ ♦ డడలెన్ మదిలోన్
సుంతయు వెలిఁ దోఁపద ధృతి,మంతుఁడు గావుటను జెలి స♦మస్తముఁ గొనుచున్.

కం. పయనింపఁగ నరదముపై, నయమున నెక్కించి సతిని ♦ నాథుననుజ్ఞన్
హయములఁ దోలుము సూతా!, రయమున నన నాతఁ డట్లె ♦ రథముం గడపన్.

↔ సీతాదేవి యపశకునంబులఁ గని పరితపించుట. ↔

కం. అనుఁగుమఱందిం గని యి, ట్లను జానకి లక్ష్మణా! మ♦హాపశకునముల్
గన నయ్యెడి నిది యేమో, మన నేటికొ తేరకిపుడు ♦ మల్లడిగొనియెన్. ౯౨౦

కం. కుడికన్నదరెడి నేటికొ?, యొడలు వణంకెడిని జిత్త ♦ ముదిలగొనెన్ నా
యెడఁదయుఁ దటతట లాడెడిఁ, గడఁకయుఁ జెడ నేమికీడు ♦ కలుగం గలదో? ౯౨౧

సీ. ఆశ్రమంబులఁ జూడ ♦ నాశ మెండయ్యెను, ధృతి యేమియును లేదు ♦ ధీరచరిత!
పాడుగాఁ దోఁచెఁ బ్ర♦పంచమంతయు నాకు, నిబ్బరమెల్లను ♦ నీటఁ గలసె
నయ్యలక్ష్మణ! పల్కు♦మా భ్రాతృవత్సల, మీయన్నకును సేమ♦మే కదయ్య!
యత్తలందఱకు సౌ♦ఖ్యంబె కా? చెప్పుమా, యని కేలు మోడ్చి క్ష్మా♦తనయ పలుకుఁ

ఆ. బౌరులకును జాన♦పదులకు సుఖ మిడ, వేల్పులార! మిమ్ము ♦ వేఁడుదాన
ననుచు మ్రొక్కు నామె ♦ కభివాదనము సల్పి, యెల్లరకు సుఖంబ ♦ యెల్లకడల.

కం. అని పలికి మతిని వెత గొద,కొనులక్ష్మణుఁ డరిగి కనియె ♦ గోమతి నట రే
యిని నాశ్రమమునఁ గడపుచు, నినుఁ డుదయింపఁగనె సూతు ♦ నిట్లను రథమున్

కం. తెమ్మా; భాగీరథినీ,రమ్మును ధరియింతునే శి♦రమ్మున భూమీ
ధ్రమ్మున హరుగతి నన శీ,ఘ్రమ్మున నతఁ డట్లచేసి ♦ క్ష్మాసుతతోడన్. ౯౨౪

కం. దేవీ! రథ మెక్కు మనఁగ, క్ష్మావిభుసతి యెక్కె నెకఁ ♦ సౌమిత్రియు నెం
తో వేగ మరిగె నరదము, పావనగంగాతటంబుఁ ♦ బ్రాపింపంగన్. ౯౨౫

కం. అరదినమున భాగీరథిఁ, బరికించి సుమిత్రపట్టి ♦ వ్యసనము పట్టం
దిరఁ డెట్లుఁ గాక హా! యని, గురురవమున నేడ్వఁ దొడఁగె ♦ గుర్వగునార్తిన్.

↔ సీతాదేవి లక్ష్మణుఁడు దుఃఖింప నూరార్చుట. ↔

ఉ. ఆతనిరీతిఁ గాంచి జన♦కాత్మజ యిట్లను నేల యేడ్చెదో?
పూతచరిత్ర! యిట్టెఱఁగు ♦ పోలునె? యెన్నిదినాలనుండియో
చేతమునందుఁ గల్గినది ♦ సిద్ధిలె నేఁటికి నాకుఁ, బుణ్యగం
గాతటినీతటంబుఁ గనఁ♦గల్గియు నేడ్చెద వేల? లక్ష్మణా! ౯౨౨

కం. సంతోషకాలమున నిటు, లింతగ నేడ్చుచును నాకు ♦ నెంతో మదికిన్
వంతఁ గలిగింపఁ దగునే?, విం తాయెను జూడ నీదు♦విధము మఱంది! ౯౨౩

ఉ. ఎప్పుడు రాముకోల్వఁ ద్రుటి♦యేనియుఁ బాయువునే నెఱుంగుదున్
దప్పు ద్విరాత్రముల్ నిజము ♦ దానికి నింతగ నేడ్చె దన్న? నా
కప్పురుషోత్తముండు విను ♦ ప్రాణముకంటెఁ బ్రియుండ యయ్య నే
నిప్పగిదిన్ వెతం గొనితి♦నే? విడు లక్ష్మణ బాలిశత్వమున్. ౯౨౯

కం. గంగానది దాఁటింపు మ,భంగురగతి నేగి ఋషుల♦పత్నుల కెల్లన్
బంగారునగలు చేల లొ,సంగుచు నభివాదనంబు ♦ సలిపి సభక్తిన్. ౯౮౦

కం. ఒక్కనిశయె మన మక్కడ, మక్కువ మై నుండి పురికి ♦ మరలుదము వెసన్
జక్కనినాపతిఁ గన నా, కెక్కుడతహతహ జనించె ♦ నెద త్వరపడెడిన్. ౯౮౧

లక్ష్మణుఁడు రామాజ్ఞ చెప్పలేక యేడ్చుట.

చం. అనవుడు లక్ష్మణుండు నయ♦నాశ్రులు పాయఁగఁ ద్రోచి నావికా
జనముల నామతించుడును ♦ జయ్యన వారలు నావఁ గూర్చి చె
ప్పినఁ జని దాని నెక్కి పృథి♦వీసుతతో రథయుక్తుఁ డౌసుమం
త్రుని నిలువంగ నాన యిడి ♦ తూర్ణము జాహ్నవి దాఁటె తత్తటిన్. ౯౮౨

కం. అన్నులమిన్నను మైథిలు,కన్నం గని దేహమెల్లఁ ♦ గంపం బెసఁగన్
గన్నులసీటం దడియుచు, విన్నప మొనరించె నిట్లు ♦ విహ్వలమతి యై ౯౮౩

చం. కటకట దన్ను నిట్టికడు♦కష్టపుఁగార్యముఁ జేయఁబంచి ప్ర
స్ఫుటముగ లోకనిందలను ♦ బ్రుంగఁగఁ జేసెఁ గదమ్మ యన్న యే
పటుతరశల్య మై యదియ ♦ బాధలు పెట్టెడి నన్ను, శ్రేయమాఁ
దటుకున మృత్యువేఁ దొడర ♦ దారుణశీలున కిట్టివానికిన్. ౯౮౪

కం. ఘోర మగునిట్టికృత్యము, దీరుపఁగా నేను దొరకి♦తిఁ భూపతికిన్
ధీరమతీ యిది తగునే? చారుగుణుం డైనరామ♦చంద్రున కయ్యో! ౯౮౫

కం. పాపపుఁబని యిది యైనను, బాపాత్ముఁడ నంచుఁ దలఁప♦వలవదు తల్లీ?
నాపాపము క్షమియింపుము, భూపుత్త్రీ యనుచు నతఁడు ♦ పుడమిం ద్రెళ్లెన్. ౯౮౬

కం. రాదే మృత్యు వటంచును, రోదనముం జలుపువాని ♦ రోహితనయునన్
మేదురదుఃఖాన్వితుఁ బ్ర,సాదింపఁగఁ గేలుమోడ్చు♦సౌమిత్రివరున్. ౯౮౭

కం. కని మిక్కిలివెఱపుం గొని, జనకజ యిది యేమి యెఱుఁగఁ♦జాల నొకండున్
వనరెద వేటికి లక్ష్మణ!, యనుమా కతమెల్ల సేమ♦మా రాజునకున్? ౯౮౮

కం. ఆన యిడితి భూపతిపై, మానక వచియింపు నాన♦మక్షమునం దే
లా నీవు వగచె దీగతి? నానతి నీ కిడినదాన ♦ నని యెసకొలుపన్. ౯౮౯

లక్ష్మణుఁడు సీతాదేవికి రామాజ్ఞ నెఱింగించుట.

కం. తల వ్రేలవైచి బాష్పం,బుల గద్గదపాటు దనరఁ ♦ బొక్కుచు మదిలోఁ
గలది గలయట్లు సర్వం, బలివేణికి విన్నవించె ♦ నాతం డిట్టుల్. ౯౯౦

ఉ. తల్లి వచింతు నే మనుచు? ♦ దారుణవార్తలు పట్టనంబులం
బల్లెల నిన్నుఁ గూర్చి జన♦వర్గము పల్కెట తాను గొల్వులో

నెల్లరుఁ జెప్పఁగా విని మ♦హేంద్రుఁడు దుఃఖము పేరి హృద్గతం
బెల్ల వచించి నాకుఁ దన♦యింటికి నేగెఁ బతివ్రతామణీ!. ౯౯౦

కం. ఆమాటలన్నియును నే, నీముంగలఁ జెప్పరాదు ♦ నేఁ గన్నారన్
నీమహిమఁ గంటి; నిన్నున్, భూమిజనులసడికి వెఱచి ♦ భూపతి విడిచెన్. ౯౯౧

ఉ. అంతియ కాని వేఱొకటి ♦ నాత్మఁ దలంపకు, మాశ్రమంబుల
న్వొంతల నిన్ను నే విడిచి ♦ పోవఁగలాఁడను రాజునాజ్ఞ, భూ
కాంతుఁడు నీకు వేఁకటిని ♦ గల్గినకోర్కులనాకు పెట్టి యి
ట్లింతలు చేయు మం చనియె ♦ నియ్యవి గాంగతటీతపోవనుల్ ౯౯౨

కం. రమణీయంబులు కడుఁ బుణ్యములున్ వెతపడకు మమ్మ ♦ యట దశరథభూ
రమణుసఖుం డగువిప్రుఁడు, విమలమనస్కుఁడు తపస్వి ♦ వితతయశుండున్. ౯౯౪

కం. ముని వాల్మీకి వసించును, జనకసుతా! యతనిపాద♦సంసేవను నీ
దినములు గడపుము రాముని, మనమున నిలుపుచు సతీత్వ♦మానితనియతిన్. ౯౯౫

రామాజ్ఞ విని సీతాదేవి విలపించుట.

ఉ. నీకు శుభంబు గూడు నన ♦ నిష్ఠురవాక్యము లాలకించి సు
శ్లోకమహావిషాదమున ♦ సోలి ముహూర్తము లబ్ధసంజ్ఞయై
శోకము కూరఁగాఁ గను♦నూతి సృజించె మదీయదేహమున్
జేకుఱె సర్వదుఃఖతతి ♦ చెప్పకొనన్ ఫల మేమి లక్ష్మణా! ౯౯౬

ఉ. ఎట్టియఘోరపాపముల ♦ నే నొనరించితి నొక్కొ, పూర్వమం
దెట్టిమహాత్ము రాలిఁ బతి ♦ నే నెడఁబాపితి నొక్కొ, కాదయే
నిట్టులు నిర్నిమిత్తముగ ♦ నేయఘ మైన నెఱుంగనట్టిన
న్నట్టడవిన్ విడంగ నర♦నాథుఁడు పంచునె? దోస మెంచునే? ౯౯౭

ఉ. స్వామిరఘూత్తమాంఘ్రిపరి♦చర్య యొనర్చుముదానఁ బూర్వ ము
గ్రామితదుఃఖసంతతుల ♦ నమ్మెయి నోర్చితి నాశ్రమంబులం
దేమవి నిర్జనాటవుల ♦ నిప్పుడు నే వసియింతు నొంటిగా
నేమని నాదుదుఃఖముల ♦ నేరికి నే వచియింతు లక్ష్మణా! ౯౯౮

ఉ. ఏటికిఁ బుణ్యశీలుఁడు న♦గేంద్రుఁడు రామవిభుండు ని న్వనీ
వాటికిఁ బంచె నిందు? నటు♦వంటియసత్కృతి యేమి చేసితో
బోటి? యటంచు నన్ను ముని♦పుంగవు లాడఁగ నేమిపల్కుదున్
బాటిదొఱంగి నావిభుని♦పై నెటుచెప్పుదు నిర్దయత్వమున్. ౯౯౯

కం నామగనిరాజవంశము, భూమిపయిన్ ఛిన్నమగుచుఁ♦బోవద యేనిన్
సౌమిత్రీ! జాహ్నవిలో, నామేను త్యజింపకుందు♦నా యాత్రుటిలోన్? ౧౦౦౦

కం. అదిగాక దుఃఖపాటున, మది రోసి శరీర మేను ♦ మానినచో ని
న్దదయుఁ డని రఘుకులంబున, వదలనియపకీర్తి నాదు♦పతికిం గలుగున్. ౧౦౦౧

⟶ సీత రామాదులకుఁ గడవాక్యంబులు చెప్పి పంపుట. ⟵

ఉ. కావున రాజు నానతిప్ర♦కారముఁ జేయఁగదయ్య లక్ష్మణా
యీవనవాటి నన్ను దుర♦వృష్టను వీడుము దుఃఖభాగినిన్
భూవరునాజ్ఞ లో నిలుము ♦ పుణ్యము నీ కగు నాదుపల్కులన్
వావిరి విన్మ మ్రొక్కితిని ♦ ప్రాంజలి నై యను మత్తగార్లతోన్. ౧౦౦౨

కం. నామాటుగ భూపతికిన్, సౌమిత్రీ! మ్రొక్కి వ్రాలి ♦ చరణంబుల మీా
సేమంబు నడిగె ననుమీా, యామాడ్కిని జెప్ప వన్న ♦ యత్తల కెల్లన్. ౧౦౦౩

సీ. ధరణీశ్వరునితోడ ♦ ధర్మమార్గంబున, దృష్టి పాయక ప్రవ♦ర్తిల్లు మనుము
జానకి నిర్మల♦స్వాంత యంచును దత్త్వ, మంత నీయెఱిఁగిన♦యదియ యనుము
నీహితకాంక్షిణి ♦ నీభక్తురాల నే, సతి యంచు నీమది ♦ స్పష్ట మనుము
అపవాదమునకు భ♦యంపడునీచేత, ననదయట్టులు త్యక్త ♦ నైతి ననుము

ఆ. నీవు పరమగతివి ♦ కావున నాకు నీ,యపయశంబుఁ బాప ♦ నర్హమనుము
నాదువాక్యములుగ ♦ నాయనా! మీాయన్న,తోడ నిన్ని కరుణ♦తోడ ననుము.

ఉ. పౌరుల నెల్లవారిఁ దన♦భ్రాతలరీతిని జక్కఁబ్రోచుచున్
సారపుధర్మమార్గమున ♦ సంతత ముర్వి భరించుచేఁడు ధా
త్రీరమణా! యనుత్తమగ♦తిన్ భజియించును ధర్మమున్ సదా
భూరిసుకీర్తియుం బడయఁ ♦ బోలునటంచును విన్నవింపుమీా. ౧౦౦౪

కం. స్వశరీరము దుఃఖంబునఁ, గృశియించెడి ననుచు నేను ♦ ఖేదముపడ బా
లిశు లగుపౌరులభృశకర్కశవాక్కులఁ దలఁచి తలఁచి ♦ కడుదుఃఖంతున్. ౧౦౦౫

ఉ. పౌరులరిత్తనిందలకుఁ ♦ బొల్పడ కుండెదునట్లు ధారిణీ
భారముఁ బూను మం చనుము ♦ భార్యకుఁ బ్రాణవిభుండె దైవతం
బారఁగఁజుట్టమున్ గురువు ♦ నొటను బ్రాణముకంటె మిన్నగా
సారసనేత్ర భర్తకెల♦సంబులు దీర్చు టె యుక్త మెప్పుడున్. ౧౦౦౬

కం. అని నాసంగ్రహవాక్యం,బును జెప్పుము పతికి నింకఁ ♦ బురికిం బొమ్మా
కనుమీా నను గర్భముచి,హ్నాను దాల్చినదాన నెట్టి♦యలజడి గలిగెన్. ౧౦౦౭

⟶ లక్ష్మణుఁడు సీతాదేవిచే ననుజ్ఞ గొని మరలి గంగ దాఁటుట. ⟵

చం. అనవుడు దీనచిత్తుఁ డబ♦లాంఘ్రులమ్రోల ధరిత్రి సోఁకఁగాఁ
దనదుశిరంబు వ్రాల్చి పసు♦ధాతనయామణితోడ నొక్కప

ల్కను వచియింప లేక వల ♦ గొంచు మహారవ మార నేడ్చుచున్
జనమది నొక్కమూరుతము ♦ ధ్యాన మొనర్చుచుఁ బల్కె సీతతోన్.[1] ౧౦౯

చం. అనఘ చరిత్ర! యే మనుచు ♦ నాడితి వేను భవత్స్వరూపమున్
గనినది లేద యింతదను ♦ కన్ భవదంఘ్రియుగంబుఁ దక్కఁగా,
జనములు లేనియీయడవి ♦ సాధ్వరొ రాముఁడు లేనివేళ నేఁ
గనుటయుఁ గల్గునే? యనుచు ♦ గ్రక్కున మ్రొక్కె కలంబుఁ జేరఁగన్ ౧౧౦

కం. చని నావ యెక్కి నడుపుము, యని నావికుఁ దీవరించి ♦ యావలియొడ్డుం
గని డిగ్గి దుఃఖభరమున, వసరుచు మూర్ఛాత్మునట్లు ♦ పడె రథమందున్. ౧౧౧

కం. మాటికి మాటికి నృపుసీ, మాటిం గనుఁగొనుచు ననదఁ మాడ్కిని హృదయ
స్ఫోటముగా ధరఁ బొరలుచు, గాటంబుగ నేడ్చు కాంతఁ ♦ గనుచుం జనియెన్.

కం. అరదంబును దవు దవ్వగ, నురవడిఁ జనఁ జూచి చూచి ♦ యుదరఁగ గుండెల్
తరుణీమణి యేకాంతము, దురపిల్లుచు నుండె నేల ♦ దొరలుచు నుండెన్. ౧౧౩

కం. దిక్కు చెడి దుఃఖభరమున, స్రుక్కుచు కేకానినాద ♦ సుభగాటవిలో
నక్కమలాక్షి యశస్విని, మిక్కిలియెలుఁ గొప్ప నేడ్చి ♦ మిడుకుచు నుండన్.

మునికుమారులు వాల్మీకికి సీతావృత్తాంతముఁ దెలుపుట.

కం. మునిబాలు రాయశోధనఁ, గని పరువున వాల్మీకిమునిఁ ♦ గనఁ జని నతులం
బొనరించి యామె తెఱఁగును, వినిపించిరి తాము గనిన ♦ వృత్తాంతంబున్. ౧౧౫

సీ. ఏమహాత్ముని ♦ యిల్లాలొ మునినాథ, శ్రీమహాసతి యని ♦ చెప్పవచ్చు
నింతకు మున్నామె ♦ నెన్నఁడుఁ గన లేదు, దివి నుండి త్రెళ్లిన ♦ దేవకాంత
యన నొప్పు చున్నది ♦ యనఘ యాలోచింపు, మేటియొడ్డున నామె ♦ యేడ్చు చున్న
దేము కంటిమి యది ♦ యేటికో యెఱుఁగరా, దొక్కతే యున్నది ♦ దిక్కు లేని

ఆ. దానియట్లు మనుజ ♦ తరుణిగాఁ దోఁపదు, దుఃఖముల కనర్హ ♦ దుఃఖపడెడి
నాశ్రమంబుపొంత ♦ ననతిదూరంబున, నుంట నీవె శరణ ♦ మువిద కింక. ౧౧౬

కం. కాపాడువాఁడు లేమిని, దాపంబునఁ బడెడి మిగులఁ ♦ ద్రాణవు నీవై
కాపాడుమా యశోవతి, నీపట్ల నటన్న మాని ♦ యెద యోజించెన్. ౧౧౭

ఆ. జ్ఞానదృష్టి చేత ♦ సర్వంబుఁ బరికించి, పాదములన పరువు ♦ పాఱి తోడ
శిష్యులెల్ల రాఁగ ♦ శీఘ్రంబ యర్ఘ్యంబుఁ, గొంచు గంగఁ జేరి ♦ కాంచె సకిని.

వాల్మీకి సీతాదేవి నూరార్చి యాశ్రమంబునకుఁ దోడ్కొని చనుట.

కం. రాముని ప్రియురాలిని దుః, ఖామితపరితప్త ననద ♦ యటు లుండెడి సీ
తామహిళామణిఁ గని ముని, యామోదము దవర నిట్టు ♦ లను నాసతికిన్. ౧౧౯

[1] ఆర్యచరిత్ర రత్నావళియందలి సీతాదేవి చరిత్రయందు సీతావిషయమైన విశేషము లెఱుఁగనగు.

సీ. దశరథధారిణీ♦ధవుకోడలవు నీవు, మహిమివి శ్రీరామ♦మహిపుసతిను
జనకనృపాలుని♦తనుజాతవును బతి,వ్రతలమేల్బంతి! స్వా♦గతము నీకు
నీరాకహేతువు ♦ నిఖిలంబు నే యోగ,దృష్టిని జూచితి ♦ శిష్టవినుత
సర్వలోకంబుల ♦ జరగెడు నవియెల్ల, విదితముల్ నాకు నో♦ నెలఁదిమిన్న
తే. మత్తపోలబ్ధచక్షులు♦మహిమఁ జేసి, కంటి నీయందుఁ బాపమొ♦కండు నైనఁ
గలుగ నేరదు, భీతిల♦ వలదు తల్లి, యుండుమీ యిందు నీమది♦ నుదిల గొనకు.
శా. అమ్మా నమ్ముము నన్ను నార్తి విడుమీ ♦ యర్ఘ్యంబుఁ గైకొమ్ము సొం
తమ్మాగేహమునందు నున్నయటు లా♦నందింపుమీ తల్లి ని
త్యమ్ముర్ నిన్నరయన్ మదాశ్రమముప్రాం♦తంబందు నున్నారు నే
మమ్ముం గల్గుతపస్వినుల్ సుతవలెన్ ♦ మన్నించి రక్షింపఁగన్. ౧౦౨౧
కం. అనవుడుఁ బరమాద్భుత మగు,మునిపల్కులు నాలకించి ♦ మూర్ధ శిరమునన్
బ్రణతి ఘటియించి కరముల, వినయమ్మున మోడ్చి యొప్పి ♦ వెంబడి నరిగెన్.

## వాల్మీకి సీతాదేవిని మునిసతుల కప్పగించుట.

ఉ. జానకితోడ వచ్చుముని♦సత్తముఁ గాంచి తపస్వినుల్ ముదా
ధీనమనంబులన్ మునివ♦రేశ్వర! స్వాగత, మెన్నినాళ్లొ మీ
రీనెల వేగు దెంచి, దయ ♦ నిందఱ మ్రొక్కులు గొంచుఁ గార్య మే
మానతి యిందు నా ననియె ♦ నమ్మునిపత్నులకున్ మునీంద్రుఁడున్. ౧౦౨౩
సీ. ఈమె సీతాదేవి ♦ రామునిప్రియపత్ని, దశరథుకోడలు ♦ తనయ జనక
నరపాలునకు సాధు♦చరిత పతివ్రత, పాపహీనయ యయ్యు ♦ భర్తచేత
సంత్యక్త, సతము మ♦త్సంపరిపాల్య యీ,యమను నచ్చంపు నె♦య్యమున మీరు
కాపాడవలయును ♦ గౌరవంబుగ మఱి, నాదువాక్యమున నో♦నారులార
ఆ. యనుచు మీఁద మీఁద ♦ నావరంబున నొక్కి, చెప్పి సతిని వారి♦కప్పగించి
శిష్యయుక్తుఁ డగుచుఁ ♦ జేరె స్వాశ్రమమును, సీత యాశ్రమంబుఁ ♦ జేరు టెల్ల.

## లక్ష్మణుఁడు రామునిగుఱించి సుమంత్రునితోఁ జెప్పి యేడ్చుట.

చం. కనుఁగొని లక్ష్మణుండు వెతఁ ♦ గాతరభావమునన్ సుమంత్రుతోఁ
గనితివె జానకీవిరహ♦కారణమా రఘురాముదుఃఖమున్
జనకతనూజ లోకనుత♦సాధ్విని దా విడనాడె, నింతకం
టెను వెత యొండు రాఁ గలుగ♦నే నుతకీర్తికి రామమూర్తికిన్. ౧౦౨౫
కం. శ్రీవైదేహీరహితుం,డై వనరుట రామభద్రుఁ ♦ డరయఁగ నూతా
దైవంబు చేష్టయే చుమి, దైవంబు నతిక్రమింప ♦ ధర నరువశమే. ౧౦౨౬

కం. దేవతలన్ గంధర్వుల, దేవారుల రాక్షసులను ♦ దెగ నడిచిన నీ
తావిభుఁడు నేఁడు దీనత, దైవమునకు లొంగె దాని ♦ దాఁటఁగ లేమిన్. ౧౦౨౭

చం. జనకునిమాటఁ బట్టి వన♦సంతతి నిర్జనదండకాటవిన్
వనటలఁ గుందెఁ దాఁ బదియు♦నాలుగువర్షము, లంతకంటె నీ
జనకసుతావియోగమును ♦ సైచుట కష్టము, పౌరవాక్యముల్
విని ప్రియురాలి సచ్చరిత ♦ వీడఁగ నెంత దయావిహీనుఁడో. ౧౦౨౮

చం. ఎఱుఁగును సీత సాధ్వి యని ♦ హీనవచస్కులు పౌరు లంచుఁ దా
నెఱిఁగియుఁ గానలో విడిచె ♦ నింతిని, నింతట నింద దప్పెనే?
కఱకరి యంచుఁ బల్కు రొకొ ♦ కాఁగల దే మిఁక? నేమి ధర్మ మె
త్తెఱఁగున సేకరించు? మతి ♦ ద్రిప్పఁ డయో యెటువంటిధీరుఁడో? ౧౦౨౯

→ సుమంత్రుఁడు లక్ష్మణునకు మనస్తాపోపశమనంబు సేయుట. ←

కం. అని పలుతెఱఁగుల దుఃఖం,బునఁ బలుకుసుమిత్రతనయు♦మోముం గని ధీ
ధనుఁడు సుమంత్రుం డి ట్లని,యనునయసూక్తులఁ దదార్తి ♦ నణఁగఁగఁ జేసెన్.

సీ. సంతాప మేటికి ♦ సౌమిత్రి! జానకీ,విషయంబునను ము న్నె ♦ విదిత మద్ది
సౌఖ్యార్హుఁ డగురాము♦చంద్రుండు ప్రేయసీ,విరహంబునను దుఃఖ♦విషయమగును
గొంతకాలం బేగ ♦ గురుమతీ! నిన్నును, భరతశత్రుఘ్నుల ♦ ధరణితనయ
నెడఁబాయు; దీని నీ♦ వెవ్వరితోడను, భరతుతో శ్రీరామ♦భద్రుతోడ

ఆ. నైనఁ జెప్పకుండు ♦ వేని దుర్వాసుండు, క్షితివిభుండు నే వ♦సిష్ఠమౌని
వినఁగఁ జెప్పినట్టి♦వృత్తాంత మెల్లను, నీకుఁ జెప్పువాఁడ ♦ నిర్మలాత్మ. ౧౦౩౧

చం. మనుజవిభుండు దీనిని సు♦మంత్ర! రహస్యము చెప్పఁబోకు మె
వ్వని కని యాజ్ఞ చేసె, నృప♦వర్యునియానతి నేను భక్తితో
వినయముతోడ నెప్డు నెఱ♦వేర్చుచు నుండుదు, నీకు నైన నే
వనఁ దగ, దట్టు లయ్యు వశ ♦ మానొకొ దాఁటఁగ దైవతంత్రమున్. ౧౦౩౨

ఉ. ఈదృశ మైనదుఃఖమున ♦ నీవు శ్రమంపడు చుంటఁ జూడఁగా
నీదురవస్థ నాఁపుటయె ♦ నేఁడు శుభం బని తోఁచెఁ గావునన్
భూదయితా! వచింప నిటు♦పూనితి నీకు వినంగ నిష్ట మే
నేదశయందు నైన వచి♦యింపకు తమ్మున కన్నగార్లకున్. ౧౦౩౩

కం. నావుడు సుమిత్రపట్టియు, నీవచనముభంగి నడతు ♦ నేను సుమంత్రా
యావార్తల నెఱిఁగింపు య,థావృత్తము నటన్న నతఁడు ♦ దడయక పలికెన్. ౧౦౩౪

దశరథదుర్వాసులసంభాషణము సుమంత్రుఁడు లక్ష్మణునకుఁ దెలుపుట.

తే. అత్రితనయుండు దుర్వాసుఁ ♦ డనుమహర్షి, వాన నెలలఁ జాతుర్మాస్య♦పరమనియతి
జరుపఁగ వసిష్ఠునాశ్రమ♦స్థలమునందు, నుండ నచటికి మీాజన♦కుండు గురుని

కం. సందర్శింపఁగఁ జని మ,ధ్యందినమార్తండునట్టు ♦ లతికాంతి వెలుం
గొందెడువసిష్ఠు సవ్యం,బం దుండుయతీంద్రుఁ గాంచి ♦ యతులితభక్తిన్. ౧౦౩౬

కం. మునియుగ్మమునకు మ్రొక్కిన, నసఘులు పాద్యంబు ఫలము ♦ లాదిగ నిడి య
మ్మనుజేంద్రు సత్కరించిరి, వినిచిరి మధురోక్తి నర్థ♦విధ మగుగాథల్. ౧౦౩౭

ఉ. అంబరమధ్యసీమ వన♦జాప్తుఁడు వెల్గుచు నుండఁగాఁ గథాం
తంబునఁ గేలు మోడ్చి వసు♦ధావరుఁ డి ట్లను నత్రిసూనుతో
నంబుజసంభవోపమ! మ♦హాత్మ వచింపవె భూమి నాదువం
శంబు ప్రమాణ మెంత? ముని♦సత్తమ రామునియాయు వెంతయో? ౧౦౩౮

తే. తక్కుసుతు లెన్నినాళ్లు ల్లీ♦ధరణి నుండు
వారొ? కొడుకులు శ్రీరామ♦భద్రునకును
గలుగుదురె? వారియాయుఃప్ర♦కార మెంత?
వేఁడుకొనియెద నావంశ♦విధముఁ జెపుమ. ౧౦౩౯

భృగుమహర్షి విష్ణువును శపించుట.

కం. ఉర్వీవిభుఁ డిటు లడిగిన, దుర్వాసుం డనియె వినుము ♦ తొల్లిసురారుల్
గర్వింప వారినెల్ల సు,పర్వులు దఱుమంగ వారు ♦ పఱచి భయమునన్. ౧౦౪౦

కం. భృగుపత్ని శరణుఁ జొచ్చిన, మగువయు నభయం బొసంగె ♦ మనుజాదులకున్
దిగు లేమి లేక వారలు, దగుగతి సుఖయింపఁ జక్రి ♦ తద్భృగుపత్నిన్. ౧౦౪౧

కం. శితచక్రధారఁ ద్రుంచిన, సతిపాటున కలిగి భృగువు ♦ శాపం బిడె నా
సతిని నవధ్యను జంపుట, క్షితిపై జన్మించి నీవు ♦ శ్రీవత్సాంకా! ౧౦౪౨

కం. దార వియోగవ్యథచే, శౌరీ! తపియింపు పెక్కు♦సమ లని తనవ్యా
హారములకుఁ దపియించుచు, వారనిదృఢభక్తిఁ గొలిచి ♦ భజియించె హరిన్.

ఉ. పాపుల కా పొసంగినస్వ♦భార్యకువృత్తము లోకనాథుఁ డాఁ
గోపముతో శపించుటయుఁ ♦ గుంజరరక్షకుఁడున్ స్వదత్త మా
శాపము నిగ్రహించినభృ♦శం బగునారకబాధ యిన్నియుం
దాపముఁ గూర్ప శాంతుఁ డయి ♦ తన్ను మునీంద్రుఁడు పూజ సేయఁగన్. ౧౦౪౪

ఆ. భక్తవత్సలుండు ♦ పరమదయాళుండు, భువనసంప్రియార్థ♦మునకు మౌని
శాపమును గ్రహించె ♦ జన్మాంతరంబునఁ, బూర్వవృత్త మిదియు ♦ భూపవర్య.[1]

[1] ఇది శ్రీరాముల యేకపత్నీత్వమును, విష్ణ్వవతారమూర్తిత్వమును స్థాపించుచున్నది.

### శ్రీరామువృత్తాంతంబు దుర్వాసుఁడు దశరథున కెఱింగించుట.

ఉ. సీతనయుం డటంచిటకు ♦ నెమ్మిమెయిం జనుదెంచి రాముఁడక్
ఖ్యాతి నెసంగ లోకముల ♦ నమ్మునిశాపఫలంబు నొందెడిక్
ష్మాతలనాథ! రా జగుచుఁ ♦ జాలఁగఁ గాల మయోధ్య నేలు, ను
శ్రీశతసౌఖ్యవృద్ధులను ♦ జెంది తదాశ్రితు లుందు రెప్పుడున్. ౧౦౪౭

కం. పది వేలవత్సరంబులు, పదినూర్లేఁడులును భూమిఁ ♦ బాలించి జనుల్
ముదమునఁ దేలఁగ రాముఁడు, పదపడి చను బ్రహ్మలోక♦పదముం[1] జేరన్. ౧౦౪౮

తే. అశ్వమేధంబులెన్నియో ♦ యాచరించు, దండిగాఁగ నొసంగును ♦ దక్షిణలను
రాజవంశంబులను బెక్కు ♦ రామవిభుఁడు, ధరణి స్థాపించు ధర్మత♦త్పరత రాజ. ౧౦౪౯

కం. రామునకు సీతయందుఁ, భూమీశా! కనలు సుతులు ♦ పుట్టెదు వారల్
భూమిపతులై యయోధ్యను, సామంబున నేలు చుండ్రు ♦ జనవల్లభులై. ౧౦౫౦

కం. రాముఁడె యభిషేకించును, ధీమహితా సుతుల ననుచుఁ ♦ దెలియఁగ సకలం
బామాని చెప్ప నాఋషి, భూమీశుఁడు గౌరవించి ♦ పురి కరుదెంచెన్. ౧౦౫౦

చం. ఇది ముని చెప్పఁగా వినితి ♦ నిన్నిదినాలుగ నుంచినాఁడ నా
యెద, నిది తప్పఁబోవ దిటు ♦ లేటికి రిత్తకు సంతపింప నా
సుదతికి రామచంద్రునకు ♦ శుద్ధమనంబున నిబ్బరించు కో
మ్మదవద మాను మన్నఁ బర♦మాద్భుతసూక్తికి నిచ్చ మెచ్చుచున్. ౧౦౫౧

కం. మే లని దుఃఖము విడిచె నృపాలుఁడు వారిరువు రిట్లు ♦ భాషించుచుఁ బో
నాళీకాప్తుఁడు పడమటి, శైలముఁ జేరంగఁ జనియె♦సంధ్యయు మిగిలెన్. ౧౦౫౨

### లక్ష్మణుఁడు రాము దర్శింపఁ బోవుట.

కం. అంతట వారలు కేశిని, పొంతన రేయెల్లఁ గడపి ♦ ప్రొద్దు పొడువ న
త్యంతరయంబునఁ జని దిన, కాంతుఁడు నడిమింట నిలువఁ ♦ గాఁ బురిఁ దఱియన్.

చం. చను నెడ లక్ష్మణుండు తన♦స్వాంతమునం దలపోయు నిట్లు లే
మని వచియింతు రామునకు ♦ నాయనమో మది యెట్లు గందు? సీ
తను విడి తన్నకుం దగిన♦తమ్ముఁడ వీ వని పల్కుతెల్లులం
గని బదు లేమి చెప్పుదును ♦ గట్టిడి యందురు నన్ను నెల్లరున్. ౧౦౫౪

ఉ. ఔర! యటంచు నూర్పుచును ♦ నారట మందుచు రాజమందిర
ద్వారముఁ గాంచి యందు డిగి ♦ వ్రాల్చిన మోమున నేగి తన్మహా
గారమునందు దీనమతిఁ ♦ గాంచన పీఠి వసించువానిఁ గ
న్నీరు దొలంకు నేత్రముల ♦ నివ్వెఱఁ గూరిన వాని రామునిన్. ౧౦౫౫

[1] వైకుంఠము.

→ లక్ష్మణుఁడు సీతావృత్తాంతంబుఁ దెలిపి శ్రీరాము నూఱడించుట. ←

కం కని లక్ష్మణుఁ డతిదీనత, వినయంబున విన్నవించె ♦ విహితాంజలి యై
జనవర! యానతి మేరకు, జనకజ నే విడిచినాఁడ ♦ జాహ్నవిపొంతన్. ౧౦౫౬

కం.విమలం బగువాల్మీకా,శ్రమమున శుభశీల సద్య♦శస్విని విడి వే
గమునం దావకచరణా,బ్జములన్ సేవింప మరలి ♦ వచ్చితి నిటకున్. ౧౦౫౭

కం.పురుషోత్తము దుఃఖింపకు, దరిసింపఁగఁ గాలగతివి♦ధం బిట్టిద కా
నరవర! దుఃఖింతురె ధృతి,నిరతులు సర్వజ్ఞులైన ♦ నినుఁ బో లఁసుమతుల్? ౧౦౫౮

కం.ధనములు నిధనాంతంబులు, విను వృద్ధిమదర్థములును ♦ విలయాంతంబుల్
జననము మరణాంతం బగు,నొనరెడి సంయోగములు వి♦యోగాంతంబుల్.

కం.కావునఁ బుత్త్రులయెడ భా,ర్యావిత్తములందుఁ మిత్త్ర♦లం దతిరక్తిం
గావింప రాదు సుమతికి, నేవేళనొ విప్రయోగ ♦ మేర్పడి యునికిన్. ౧౦౬౦

కం.నిను నీవు మనసుచే మది, జనముల నెల్లరను నిగ్రహ ♦ జాలెద వనఘా
వనరెద వేలా ప్రాకృతు,ననువున? నీ కిట్టిచేత ♦ యగునె? మహాత్మా! ౧౦౬౧

ఉ. నీ వపవాదభీతి నవ♦నీసుత వీడితి కాదె? వెండియున్
నీ విటు లేడ్చు చున్నఁ జన ♦ నేరదు నింద, మఱింత యెక్కుడై
భూవలయంబున న్నిలుచుఁ ♦ బోలదు నీకిది, మాను తాపమున్
భూవరచంద్ర! దుర్బలపు♦బుద్ధిని నెట్టుము గొమ్ము ధీరతన్. ౧౦౬౨

చం.అనవుడు రామచంద్రుఁ డను♦జా! నిజ మాడితి వీవు హర్షముం
గనితి మదాజ్ఞఁ దీర్చుటను ♦ గ్రమ్మఱ ధైర్యముఁ గొంటి, శోకమున్
బనిచితి దూరమున్, మధుర♦వాక్కులు త్వద్గదితంబులన్ వినన్
మనమునఁ దుష్టి గూరె నని ♦ మాటికి మెచ్చుచు వెండి యిట్లనున్. ౧౦౬౩

→ రాముఁడు లక్ష్మణునకు నృగుచరిత్ర దెలుపుట. ←

కం.అక్కఱ వేళల నీవలె, మక్కువఁగలచుట్ట మున్నె ♦ మన్నతమునకున్
జక్కఁగఁ జెప్పితి వన్నా, నిక్కం బొకఁ డున్నె యిట్టి♦నీతిజ్ఞుండున్. ౧౦౬౪

సీ. నామనంబున నొండు ♦ నాటి యున్నది చింత, చెప్పెద నీ వట్లు ♦ చేయ వయ్య
నాలుగునాళ్లాయె ♦ నాయనా! పౌరుల, కార్యంబు లారసి ♦ క్రమము గాను
గావునఁ బ్రకృతులఁ ♦ గార్యార్థిజనములఁ, బురుషులస్త్రీలను ♦ సరగఁ బిలువఁ
బంపు పురోధకుఁ ♦ బంపుము వార్తను, గొలువుకూటమునందుఁ ♦ గూడుఁ డనుచు
తే. ననుదినంబును బౌరకా♦ర్యములఁ దీర్పఁ, బ్రాలుమాలెడినృపతి ని♦ర్యాతనరక
మునను దుఃఖించు నిక్కంబు ♦ మున్ను నృగుని,చరిత విన లేదె నీవు స♦త్సాధుశీల.

సీ. మున్ను బ్రహ్మణ్యుండు ♦ సన్నుతాచారుండు, సత్యసంధుఁడు నృగు♦జనవిభుండు
పుష్కరంబున స్వర్ణ♦భూషితధేనుల, దూడలతోఁ గోటి♦బాడబులకు
దానంబుగా నిచ్చె ♦ వానిలో నిఱుపేద, యాహితాగ్నియు నగు♦నవనిసురుని
యావొండు కలసిన ♦ నాకస్మికంబుగ, నిచ్చె దానిని మది ♦ నెఱుఁగలేమి

ఆ. నుంఛవృత్తి బ్రదుకు ♦ నుర్వీసురుండు తు,ధార్తి నందు నందు ♦ నరసె దానిఁ
బెక్కువత్సరంబు ♦ లెక్కడఁ గానక, కడకుఁ గనఖలంబు♦గ్రామమునను. ౧౦౬౬

కం. తనయావుజీర్ణవత్సముఁ, గని యొకబ్రాహ్మణునియింటఁ ♦ గావం బడఁగాఁ
జనుదెమ్మా శబలా యనఁ, దనవిప్రునిస్వర మెఱింగి ♦ తడయక యదియున్. ౧౦౬౭

కం. అనలనిభుం డగుబ్రాహ్మణు, వెనుకం జనె సాఁకుచున్న♦విప్రుఁడు తోడ్తో
జని నాయది యీధేనువు, చనునే తోడ్కొని చనంగ ♦ ద్విజసుర దీనిన్? ౧౦౬౮

కం. దానంబు గాఁగ భూమీ,జాని నృగుం డొసఁగె ననుడు ♦ ద్విజసురుఁ డిది నా
ధేనువు రా జెట్టు లొకో, దానము నీకిచ్చె? ననుడుఁ ♦ దరతర మిట్టుల్. ౧౦౬౯

కం. వాకాటులకుం జొచ్చి మ,హీకాంతునిఁ దారు చేర ♦ నేగఁగ నందున్
వాకిటికావలివారలు, భూకాంతునిఁ జూడ నరుగఁ ♦ బోనీయమిచేన్. ౧౦౭౦

కం. పెక్కుఁడు లుండి వినువున, మిక్కిలి కోపించి వారు ♦ మేదినికాంతున్
గ్రక్కనుడుల శపించిరి, యిక్కరణిని జన్నె నృపతి ♦ కెందేఁ జేయన్? ౧౦౭౧

ఉ. కార్యము గల్గియర్థు లిటు ♦ కావలి కావఁగ ద్వారమందు నై
శ్వర్యమదంబుచేఁ గొలువు♦శాలను దర్శన మీయ కున్నవాఁ
డార్యుఁడె వీఁడు? భూతనిచ♦యంబులకెల్ల నదృశ్యుఁ డౌచు నీ
యర్యుఁడు పెక్కులేండ్లు బిల♦మం దొక యూసరవెల్లి గావుతన్. ౧౦౭౨

తే. నరుఁడు నారాయణుండును ♦ ధరణిభార, మణఁపజన్మింత్రు ద్వాపర♦మందుఁ దుదను
యదుకులంబునఁ బురుషుఁడై ♦ యవతరించు, వాసుదేవునిచే వీని♦వనట పాయు.

చం. అని శపియించి భూమిసురు ♦ లామొదవున్ బలహీన వృద్ధ యా
టను మఱియొండువిప్రున కొ♦టన్ విడి దానము గాఁగఁ బోయి రా
జనపతి వేఁగు చుండెడిని ♦ శాపవశంబున నిప్పు డోరిమిన్
జనుల విమర్శ సేయమిని ♦ ద్వాపతి దుర్గతిఁ జెందు లక్ష్మణా. ౧౦౭౪

కం. కలహము కార్యార్థులలోఁ, బలపడుటకుఁ గారణంబు ♦ ప్రభుదోషంబే
కలహములు లేక ప్రజలన్, మెలపున రక్షించుపతికి ♦ మే లొనగూడున్. ౧౦౭౫

కం. కావునఁ గార్యముకొఱకై, యేవారేన్ గాచి యున్న ♦ నెఱుఁగం జనుమీ
నీ వన; లక్ష్మణుఁ డనియెన్, భూవర! యమదండసదృశ♦మును శాపంబున్. ౧౦౭౬

← నృగోపాఖ్యానశేషము. →

కం. విని యేమి చేసె నృగుఁ డన, జనపతి తద్వార్త యెఱిఁగి ♦ సచివుల హితులన్
దనకడకుఁ బిలిచి దుఃఖం, బునఁ బొగులుచు నిట్టు లనియె ♦ భూదేవవరుల్. ౧౦౭౭

కం. నారదుఁడును బర్వతుఁడును, ఘోరం బగుశాప మిచ్చి ♦ గొబ్బున దివికిన్
మారుతు లై చని రే మన, మీరలు నాసుతుని వసువు ♦ మేదిని నేలన్ ౧౦౭౮

కం. అభిషేకముఁ గావింపుఁడు, శుభముగఁ బెనుబిల మొకండు ♦ సుఖకరముగ నా
కభినిర్మింపఁగ శిల్పి, ప్రభువుల నియమింపుఁడీ కృ ♦ పారతు లగుచున్. ౧౦౭౯

సీ. అం దుండి శాపంబు ♦ ననుభవించెదను వ, ర్షఘ్నంబు గాఁగ హి ♦ మఘ్నముగను
నాతపఘ్నంబుగ ♦ ననువార బిలములు, మూఁడిటిఁ గావించి ♦ పోఁడిమిగను
వానిచుట్టును మేలి ♦ ఫలవృక్షములఁ బుష్ప, వంతంబు లగులతా ♦ వళుల నాటి
దట్టంపునీడలు ♦ దనర గుల్మము లుంప, నందు నాశాపాంత ♦ మందు నర్ధ

తే. యోజనము దాఁకఁ బుష్పంబు ♦ లొప్ప నుండఁ
జేయుఁ డీ యని వసువును ♦ జేరఁ బిలిచి
ధర్మమార్గంబు విడువకు ♦ తనయ! నీవు
క్షత్రధర్మంబు మై నేలు ♦ ధాత్రి నెల్ల. ౧౦౮౦

కం. అపరాధలేశమునకున్, విపరీతపుశాప మిడిరి ♦ విప్రులు కంటే
తపియింపకు దైవం బే, నిపుణము పో మేలుగీల్లు ♦ నెఱి సమకూర్పన్. ౧౦౮౧

కం. కలుగునవి యేవొ కలుగును, దొలఁగునవో తొలఁగుఁ దామె ♦ దొరకొనుఁ బ్రాప్తం
బులు సుఖములు దుఃఖంబులు, తొలి మనుజుఁ డొనర్చుసుకృత ♦ దుష్కృతఫలముల్.

కం. అని చెప్పి నందనునకుం, జనియెన్ నృగుభూవరుండు ♦ సమ్యక్కృత మై
యొనరినబిలంబులోనికి, దినము లటం గడపుచుండె ♦ దీనత్వమునన్. ౧౦౮౩

← రాముఁడు లక్ష్మణునకు నిమికథఁ దెలుపుట. →

కం. ఈవిషయంబున మఱియొం, డే వినిచెద నీకు విన న ♦ భీష్టం బేనిన్
బావనకథ నన లక్ష్మణుఁ, డే విస్మయకరకథాళిఁ ♦ దృప్తిం గానన్. ౧౦౮౪

సీ. అనవుడు శ్రీరాముఁ ♦ డనియె నిక్ష్వాకుని, పండ్రెండవసుతుండు ♦ పరమధర్మ
నిరతుండు నిమి యను ♦ ధరణీశ్వరుఁడు గౌత, మాశ్రమప్రాంతంబు ♦ నందు శక్ర
దేవపురోపమం ♦ బౌ వైజయంత మ, న్నగరంబు నిర్మించి ♦ తగినరీతి
దీర్ఘసత్త్ర మొనర్పఁ ♦ దివిరి యిక్ష్వాకుని, నామతించి వసిష్ఠు ♦ యజ్ఞకార్య

తే. నిర్వహణమునకును బిల్వ ♦ నేను మున్న
వాసవునిచేత వరియింపఁ ♦ బడినవాఁడఁ

దాళుమీ నేను వచ్చునం♦దాఁక ననుచు
నరుగ నిమి యత్రిగౌతమాం♦గిరులఁ బిలిచె. ౧౦౮౫

ఉ. వారలు దోడ్పడంగ హిమ♦వంతముపొంతఁ బురంబు దాపునన్
త్సౌరమణుండు జన్నమును ♦ సాగఁగఁ జేయుచు నైదువేలయేం
డ్లార రహింప వాసవుని♦యజ్ఞముఁ దీర్చి వసిష్ఠమౌని త
ద్ధారిణిఁ జేరి జన్నము య♦థావిధి గౌతమమౌని దీర్పఁగన్. ౧౦౮౬

కం. కని యాగ్రహించి భూమీం,ద్రునకై మూర్తంబు వేచె ♦ దురదృష్టమునన్
జనవిభుఁడు నాఁడు నిద్రిం,చెను బగటం; గాచికొని వ♦సిష్ఠుఁడు కినుకన్. ౧౦౮౭

ఉ. నన్ను నిరాకరించి సవ♦నం బొనరింపఁగ నన్యుఁ దెచ్చి తీ
విన్నతిఁ జెప్పవచ్చినను ♦ నింటన యుండియు నీవు దర్శనం
బు న్నృప! నీ వచేతనతఁ ♦ బొందు మ టం చని శాప మీయ భూ
భృన్నళినాహితుం డెఱిఁగి ♦ వేగమ వెల్వల వచ్చి క్రుద్ధుఁ డై. ౧౦౮౮

కం. ఒడ లెఱుఁగక నిద్రింపఁగఁ, గడుఘోరముగా శపింపఁ ♦ గార్యం బగు నే
చెడు నీ వచేతనత నీ,యొడలున్ రుచిరత్వమెడల♦కుండెడిఁ గాతన్. ౧౦౮౯

కం. అని రోషవశంబున న,య్యనఘులు శపియించి రిట్టు ♦ లన్యోన్యంబున్
గన లేమి చేయ లే దన, విని లక్ష్మణుఁ డనియె నెట్లు ♦ విగతశరీరుల్. ౧౦౯౦

### వసిష్ఠుఁడు దేహము ధరించుట.

చం. తనువులు గ్రమ్మఱం గొనిరి ♦ తత్కథఁ దెల్పు మటన్న రాముఁ డి
ట్లనుఁ దమ దేహముల్ విడిచి ♦ యాధరణీశ్వరుఁడున్ మహాతపో
ధనుఁడును వాయుభూతు లయి ♦ తారుచు నుండిరి మింటఁ, దండ్రినిన్
గనఁగ వసిష్ఠుఁ డేగెఁ బర♦కాయము నొందఁగఁ గాంక్ష చేయుచున్. ౧౦౯౧

కం. అరిగి విధాతకు మ్రొక్కిడి, సరసిజభవ! యండజాత♦సర్వసుపర్వో
త్కరవల్లభ! నే నిమిభూ,వరు శాపము చేతఁ దనువుఁ ♦ బాయఁగఁ గంటిన్. ౧౦౯౨

కం. మేనులు లేకుండిన న,న్యూనవ్యసనములు దొడరు ♦ నొదవును లోపం
బో నళినాసన! క్రియలకుఁ, గాన నొసంగుము మఱొండు♦కాయం బనినన్. ౧౦౯౩

సీ. ధాత యి ట్లనియె మి♦త్రావరుణుల తేజ,మునఁ జొచ్చి వసుధను ♦ జనన మొందు
మీ యయోనిజుఁడ వై ♦ మేదినీసురవర్య, మహితతపంబున ♦ మద్వశుండ
వయ్యెద వనిన సం♦యమి మ్రొక్కి చయ్యన, వరుణాలయమునకు ♦ వచ్చె నపుడు
మిత్రుండు వరుణస♦మ్మేళనంబున రాజ్య,పాలనం బొనరించె ♦ వచ్చె నటకుఁ

తే. బద్మదళనేత్ర పూర్ణేందు♦వదన చెలుల
తోడ నూర్వశి వరుణుఁ డా♦చేడెఁ గాంచి

వలపు దెలిపిన మిత్త్రుండు ♦ వలచెఁ దొలుతఁ
జను నె నీతోడఁ గూడంగ ♦ ననిన నతఁడు ౧౦౯౪

ఉ. ఓరువఁ జాల దర్పకుని ♦ యుద్ధతి కేను మృగాక్షి! దివ్యభృం
గారువునందుఁ దేజమును ♦ గామిని వీడెద నన్ను నుర్వశీ
సారసనేత్ర యిట్టు లను ♦ సమ్మత మయ్యెది మిత్త్రుఁ డొందు శా
రీరసుఖంబు, నీయదియ ♦ హృత్కమలం, బది గాదె మిన్నయా. ౧౦౯౫

తే. అనిన జ్వలదగ్నిశిఖకుఁ దు ♦ ల్యంబు తేజ, మతఁడు కుంభంబునం దుంచె ♦ నతివ చనియె
మిత్త్రుఁ జేరంగ నాతఁ డా ♦ మెలఁతఁ గాంచి, క్రోధకలుషితచిత్తుఁ డై ♦ కొమ్మ కనియె.

ఉ. ఓసి దురాత్మికా! కలుష ♦ యుక్తచరిత్త్రిక! మున్ను మున్న నా
కాస వచించి యీనడుమ ♦ నన్యునిఁ గూడఁగ లంజ వైనను
దోసము గాదె? యీయతుల ♦ దోషమునన్ ధరపై వసింపుమీ
వాసి తఱుంగ మానవుని ♦ భార్యవుగా నొకకొంతకాలమున్. ౧౦౯౭

కం. సుతుఁ డయి బుధునకుఁ గాశీ, పతియైనపురూరవుండు ♦ పతిగా మనుమీ
మతిహీన! యనఁ బురూరవు, సతిఁ జేరఁగ నేగి యతని ♦ సతియై మెలఁగెన్. ౧౦౯౮

కం. అతని సుతుం డాయువు త, త్క్షితిపతికిన్ నహుషుఁ డొదవెఁ ♦ గీర్తితగతి భూ
పతియై యింద్రుఁడు వృత్త్రుని, హతుఁ జేసి భ్రమింప నింద్రుఁ ♦ డై దివ మేలెన్

తే. నూఱు వేలేఁడు; లిచ్చట ♦ నూత్నచంద్ర, ఫాల కంజదళాక్షి యు ♦ ర్వశి ధరిత్త్రిఁ
జాలసంవత్సరము లుండి ♦ శాప మంత, మొందఁ గ్రమ్మఱఁ జేరె బి ♦ డౌజువీడు.

## వసిష్ఠుఁడు మైత్త్రావరుణుఁ డయి జన్మించుట.

చం. అనవుడు లక్ష్మణుం డనియె ♦ నమ్మునిపార్థివు లెట్లు క్రమ్మఱన్
దనువులు గాంచి రవ్విధము ♦ దాశరథీ! వినిపింపు మన్న న
య్యనుజునిఁ బల్కు రాముఁడు మ ♦ హాత్ములవారల తేజు నుండి సం
జననము గాంచి రాఘటిని ♦ సంయమివర్యులు పూర్ణతేజులై. ౧౧౦౧

తే. ఉర్వశీకారణంబుగ ♦ నుంచెఁ దొలుత, దివ్యఘటమున మిత్త్రుండు ♦ తేజు దాన
వరుణుఁ డావల నుంచెఁ ద ♦ ద్వ్యాజమున న, గస్త్తి మున్నుగ జన్మించి ♦ కాంచిమిత్త్రు.

తే. నేను నీదుతనూజుఁడఁ ♦ గా నటంచుఁ, జనియె మఱికొంత కాలంబు ♦ చన వసిష్ఠు
డందు జన్మించె నుభయ తే ♦ జోప్తి దాన, నతఁడు మైత్త్రావరుణుఁడన ♦ ఖ్యాతి గాంచె.

తే. ఆమహా తేజు నిక్ష్వాకుఁ ♦ డాశ్రయించి, తమపురోహితుఁ గాఁ గొనె ♦ ధర్మవిదుని
నింక వచియింతు వినుముని ♦ మీశ్వరుండు, తనువుఁ గాంచినవిధముఁ ద ♦ త్త్వజ్ఞవినుత.

## దేవతలు ఋషులు నిమికోరినవర మిచ్చుట.

చం. ఋషులు విదేహనాయకుశ♦రీరముఁ బ్రోచుచు గంధమాల్యకి
ల్బిషరహితాంబరంబులను ♦ వేలిమిఁ దీర్చుడుఁ బ్రత్యగాత్మతో
ఋషిభృగు విట్లు పల్కె నిమి!♦ యేమివరంబును గోరె దీవు క
ల్మషరహితా! వచింపు మట ♦ మానుగ నిల్పెద నీదుజీవమున్. ౧౧౦౪

చం. పలికిరి తుష్టులై సురలు ♦ పార్థివసత్తమ! నీదుజీవముల్
నిలుపుదు మెందుఁ గోరు మన ♦ నిర్జరులార! సమస్తభూతదృ
ష్టుల నిలువంగ నామనసు♦చొప్పన, వారలు వాయురూప మై
నిలువుము యట్లె నీకతన ♦ నేత్రనిమీలన మొందు భూతముల్. ౧౧౦౬

కం. అలఁత దొలంగఁగ జెప్పలు, పలుమాఱును మూయు భూత♦పటలి యటంచున్
బలికి సుర లేగ మానులు, చిలికిరి నిమిమేన నరణిఁ ♦ జేర్చి సవిధిగన్ ౧౧౦౭

కం. తనయార్థంబుగ దానన్, జనియించెను మిథి యనంగ ♦ క్ష్మాపతి మథనం
బునఁ బుట్టుట మిథి యయ్యెన్, జననం బందుట నతండు♦జనకుం డయ్యెన్ .౧౧౦౮

కం. ఆతఁడు విదేహమున సం,జాతుం డగుహేతువునను ♦ జనె వైదేహ
ఖ్యాతిని మిథి నిర్మించుట, భూతలమున మిథిల యనఁగఁ ♦ బురవర మొప్పెన్.

## రాముఁడు లక్ష్మణునకు యయాతిచరిత్రముఁ దెలుపుట.

చం. అనవుడు లక్ష్మణుం డనియె ♦ నౌర! విచిత్రచరిత్ర మెట్టులా
జనపతి క్షత్రియుండు బల♦శౌర్యధురంధరుఁ డందు దీక్షితుం
డును గద కోపముల్ నిలుప ♦ నూల్కొన కట్లు వసిష్ఠునిన్ శపిం
చినకత మేమొ శాంతిని భ♦జింపఁ డదేటికో? భూవరోత్తమా!, ౧౧౧౦

ఉ. నావుడు రాఘవుం డనియె ♦ నాయన! కోప మణంప దుస్సహం
బావిధి శక్య మానొకొ య♦యాతికిఁ దప్పఁగఁ దక్కువారికిన్
భూవిభులందు సత్త్వగుణ♦పూర్ణుఁ డతండు వచింతు విను త
త్త్సానరుపూర్వవృత్త మని ♦ సమ్మతిఁ జెప్పఁ దొడంగె నివ్విధిన్. ౧౧౧౧

సీ. నహుషునకును బ్రియ♦నందనుండు యయాతి, యతని కిద్దఱురూప♦వతులు సతులు
వృషపర్వతనయ శ♦ర్మిష్ఠ యన్ దైతేయి, శుక్రునికూఁతురు ♦ సుందరాంగి
దేవయాని యనంగ ♦ నావరవర్ణినుల్, తనయులఁ గాంచిరి ♦ దర్పధనులఁ
బూరుండు శర్మిష్ఠ♦పుత్రకుండు, యదుండు దేవయానిసుతుండు ♦ భూమిభుజుఁడు

తే. తల్లి శర్మిష్ఠ ప్రియ యగుటఁ ♦ దనయుఁ బూరు
మిగుల లాలింప యదువు లో ♦ వగపు చెంది

తల్లి డాయంగఁ జని శోక♦దైన్యములను
బలుకుఁ దనహృద్గతం బెల్లఁ♦ దెలియఁబడఁగ.　　౧౧౧౨

ఉ. పుట్టితి వీవు భార్గవుని♦పుణ్యకులంబున రాజు భార్యవై
యిట్టిమహావమానమును ♦ నీవు సహించెద వెట్లొ? యేల యీ
రట్టడిజీవనంబు? వెస ♦ రమ్ము హుతాశనుఁ జొత్త మిర్వు రీ
వట్టు లొనర్ప వేని యిపు♦డానతి నా కిడు మేను జొచ్చెదన్.　　౧౧౧౩

కం. మన మిర్వురుఁ బోయిన న,మ్మను జేశ్వరుపీడ తెగును ♦ మఱి దానవితో
మనసారఁగ సుఖియించెడు, నని యేడ్చుచు తనయఁ జూచి ♦ యతివయుఁ గినుకన్.

చం. తనజనకుం దలంచిన య♦థాత్వర మాతఁడు వచ్చి యేడ్చున
త్తనయను గాంచి యేటి కిటు ♦ దైన్యము నొందితి కూఁతురా? యనం
దనువు విషాగ్నినీరముల ♦ నాశముఁ జేసెద, నింక భూమిపై
మన మన సొప్ప, దేల యవ♦మానపుమన్గడ బ్రాహ్మణోత్తమా!　　౧౧౧౫

కం. ఇచ్చితివి కాని యొకనికి, వచ్చితివో? కీడు మేలు ♦ ప్రశ్నించితివో?
చచ్చితినో యున్నానో, మచ్చరితము నీ వెఱుంగ ♦ మన సొల్లదుగా?　　౧౧౧౬

కం. నాకడుపుమంట యే మని, నీకుఁ వినిపింతు నెఱుఁగ ♦ నీ వొల్లని-చో
లోకమున వృక్ష మెండిన, నాకులు పూ లిగురులుం ద♦మంతటఁ జెడెడిన్.౧౧౧౭

కం. పెద్ద వని నీకె సత్కృతి, దుద్దిడె నఁట యేల నాగ♦తు ల్పలుకంగా
నద్దానవి వలలం బడి, పద్దుగ నీయల్లుఁ డెపుడుఁ ♦ బలుకఁడు నాతోన్.　　౧౧౧౮

ఉ. నామొగ మేనియుం గనఁడు ♦ నాయిలుచాయను ద్రొక్కఁ డొల్లఁ డే
మేమొ వినోదము ల్పలుపు ♦ చెప్పుడు దానవియింట నుండెడిఁ
భూమివిభుండు దా నగుట ♦ భూమిధవాత్మజఁ గోరుఁ గాక తా
నే మని కోరుఁ జుక్కగమి ♦ నెన్నఁడి బాఁపనవాని కన్నియన్.　　౧౧౧౯

యయాతి పూరునకు వార్ధకమిచ్చి యౌవనంబుఁగొనుట.

చం. అనవుడుఁ గోపరక్తనయ♦నాంతుఁడు కావ్యుఁడు భూమినాథుతో
న నె నిది యేమి భూపతి! మ♦దాత్మజ నొల్లక న న్నవజ్ఞ సే
సిన నయిరింతు నే? కుమతి ♦ చెచ్చెర యౌవన మూడి డొక్కవై
దినములు ద్రోయుమీ యనుచుఁ ♦ దిట్టె ప్రసన్నను జేసి యాత్మజన్.　　౧౧౨౦

కం. అరిగెఁ దనయింటి కానృప,వరుఁడు జరాక్రాంతుఁ డగుచు ♦ వనరుచు యదువుం
బరికించి విషయసుఖములఁ, బరితృప్తుఁడఁ గాను గలదు ♦ వాంఛ సుఖింపన్.

కం. నీజవ్వన మొసఁగుము నా,కీజర గ్రహియింపు మనిన ♦ ని ట్లను నతఁడుఁ
రాజా! నీముద్దులసుతు, నీజర గ్రహియింప నిమ్ము ♦ నే నిందునకా?　　౧౧౨౨

చం.జనకుఁడ వై బహిష్కృతునిఁ ♦ జల్పితి వీవు సుఖాళిప ట్లు, నన్
జనవునఁ జేర నిచ్చితివె ♦ సమ్మతి నెయ్యెడ నేని? దీనికిన్
దనయుఁడ నైతి నోటు? నిర♦తంబును లాలన చేసి పెంచు నీ
తనయుఁడు పూరుఁ డే జరను ♦ దాల్చెడు,నే సహియింప దీనినిన్. ౧౧౨౩

కం.ఆడఁగఁ బాడఁగ వేడుక, గూడఁగఁ బూరుండు జరను ♦ గొన యదు వహహా
పాడి గదా యిటు ప్రజఁ గా,పాడెడితేనికిని దాయ♦భాగము పెట్టన్. ౧౧౨౪

చం.అనుడు యయాతి పూరుని మ♦దర్థము నీవె జరన్ గ్రహింపుమీ
యన నతఁ డేనె ధన్యుఁడ మ♦హాత్మక! కాదన నోరు వచ్చునే
జనకునియాజ్ఞ నానృపతి ♦ సంతస మొందుచు వార్ధకంబుఁ ద
త్తనయున కిచ్చి యౌవనముఁ ♦ దాఁ గొని యేఁడులు పూఁడు లాదటన్.౧౧౨౫

చం.అతులితసౌఖ్యసంపదల ♦ నందుచు నుండి తదాశ దీఱుడున్
సుతుఁ గని వారకంబుగను[1] ♦ సుందర యౌవన మే గ్రహించి త
త్ప్రతిగ జరాభరం బిడితిఁ ♦ దాల్పఁగ నీకడ, నింక నాజరన్
వెతలు దొలంగ నీకు గుణ♦విక్రమధుర్య మొసంగు క్రమ్మఱన్. ౧౧౨౬

కం.నాయాజ్ఞం బాలించుట, నీయువనికి ని న్నొనర్తు ♦ నేలికగా నం
చాయువనీశుఁడు కోపము,తో యదువుం గాంచి పలికె ♦ దుష్టాత్ముఁడా! ౧౧౨౭

కం.తనుజుఁడవు గావు నీ వొక,దనుజుండవు పుట్టి తింటఁ ♦ దనయాకృతి వై
నను ధిక్కరించి పలికితి, చను నే? రాజ్యాధిపత్య♦సరణిం జెడుమీ. ౧౧౨౮

కం.జనకుఁడ నంచు గౌరవము ♦ సల్పక నోరికి వచ్చినట్లు న
న్ననియెదు? యాతుధానుల మ♦హాకఠినాత్ముల నీవు గాంచుమీ
వినయవిదూర! సోమకుల♦విశ్రుతి యొందదు నీదుసంతతిన్
గనియెదు దుర్వినీతులఁ బొ♦కాలు మటంచు సుశీలుఁ బూరునిన్ ౧౧౨౯

కం.ధర కధిపతిఁగా నొనరిచి, యరిగెన్ విదితాత్ముఁ డగుచు ♦ నాశ్రమమునకున్
జరుగ నటు కొంతకాలము, సురపురి కతఁ డేగ నతని♦సుతుఁడు ప్రభుం డై.౧౧౩౦

కం.పూరుఁడు కాశీరాజ్యము, ధీరతఁ బాలించెఁ బురి ప్ర♦తిష్ఠానముగాఁ
గ్రూరులను యాతుధానుల, వారక పెక్కురను యదువు♦వంశము నిలుపన్ ౧౧౩౧

కం.కాంచెను బహిష్కృతుం డై, క్రౌంచవనంబునను దుర్గ♦రస వసియించెన్
మించినకినుకను గవి శపి,యించిన నాహుషుఁడు మరల ♦ నే మనఁ డయ్యెన్.౧౧౩౨

తే. ఆలకించితె యనుజ య♦యాతిశాంతి
మనల నృగుదోష మంటమి ♦ కనఁగవలయు

[1] వారకము = ఇల్లడ.

ననుచు నుండఁ గుసుంభస♦స్త్రావకుంతి
తముగతిని మిన్ను సాంధ్యరా♦గమునఁ బొలిచె.　　　　౧౧౩౩

## చ్యవనాదులు రాము దర్శింప వచ్చుట.

సీ. అన్నదమ్ములు ముచ్చ♦టాడుచుండిరి యిట్లు, లవని రక్షాక్రియా♦నంతరమున
జరుగఁ గొన్నిదినాలు♦చలియు వేఁడియుఁగాక, సౌఖ్యంబుఁగూర్చువా♦సంతరాత్రు
లొదవఁగ నొకనాఁటి♦యుదయంబునను నాహ్ని,కంబులఁ దీరిచి♦కార్య మొనరి
పౌరులు వచ్చిరే♦పరికింపు మనఁగ ను,మంత్రుండు రాజేంద్ర! ♦మౌనివరులు
తే. వచ్చి యున్నార, లాఁగిన♦ద్వారమందు
నిలిచి యున్నారు, నినుఁ జూడఁ♦దలఁచినారు
వారు చ్యవనుండుమున్నుగా♦వచ్చినారు
కార్యభర మేదియో వారు♦కలిగినారు.　　　　౧౧౩౪

కం. యమునాతీరనివాసులు, మిముఁ జూడఁగఁ దొందరపడి♦మీతో భూమీ
రమణా! చెప్పఁగఁ బంచిరి, విమలాత్మకు లనిన వారి♦వే తోడెమ్మీ.　　　　౧౧౩౫

ఉ. నావుడు రాజునాజ్ఞ ముని♦నాథులకుం నతిచేసి లోనికిం
గావలివాఁడు పో విడువ♦గాఢతపోజ్వలితాంగు లందఱుం
త్క్ష్మావిభుమందిరాంతరము♦చయ్యనఁ జొచ్చిరి నూర్వ్య ద్రష్టుహో
భావులఁ బూజ చేసె గుణ♦భద్రుఁడు రాముఁడు యుక్తరీతిగన్.　　　　౧౧౩౬

చం. మునులు సమస్తతీర్థపరి♦పూర్ణసుసత్కృతపూతపాత్రముల్
జనపతికిం మనోజ్ఞఫల♦సంచయ మీయఁగఁ బ్రీతియుక్తిఁ గై
కొని మునులార! నాయెడలఁ♦గూరిమిఁ జేసి సమర్హపీఠులం
గొనుఁ డన హేమపీఠములఁ♦గూరుముదంబునఁ గూరుచుండినన్.　　　　౧౧౩౭

కం. భూపతి కరములు మోడిచి, తాపసులం గాంచి యనియె♦దయ సెల విడుఁడీ
యేపనికై యిట రా నా,జ్ఞాపింపుఁడు దేనిఁ జేయ♦సమ్మతి మీకున్.　　　　౧౧౩౮

కం. ఈరాజ్యం బిదేహం, బీరమయును జీవితంబు♦నిన్నియు ద్విజసం
వారనిమిత్తము చూడుఁడు, సారతపశ్శీలురార! ♦సత్యం బంటిన్.　　　　౧౧౩౯

## చ్యవనుఁడు లవణవృత్తాంతము రామునకుఁ దెలుపుట.

చం. అనవుడు మేలు మేలని మ♦హర్షులు మెచ్చుచుఁ బల్కి రోజనా
వనకుశలా! మహాత్మ! యిటు♦పల్కఁగ నీ వొకరుండు గాక యే
జనపతిశక్తియుక్తుఁ డగు♦క్ష్మాపతు లెందఱో యాలకించి మా
పని మఱి కార్యగౌరవము♦భావనచేసి వచింప రేనుడిన్.　　　　౧౧౪౦

కం. నీ వన మాకార్యము తెలిఁ, గావంతయు నెఱుఁగకయును ♦ నాడితి బాసల్
గావింతు ననుచు విప్రజ, నావళిపైఁ గరుణఁ జేసి ♦ యనఘగుణాఢ్యా!. ౧౧౪౧

కం. కావున మాకార్యంబును, గావింపఁగ నీవ నేర్తు ♦ కాకుత్థ్సవరా!
మా వాక్యము విని మఱి మా, కావహిలం జేసి సౌఖ్య ♦ మఁడుపుము ఖీతిన్. ౧౧౪౨

చం. అనవుడు రాముఁ డిట్లను భ ♦ యం బెది కల్గెను మీకు? దానిన్
వినిచితి రేని దీర్త నన ♦ నిస్తులనిష్ఠుఁడు మౌని భార్గవుం
డను జననాథ! యాదియుగ ♦ మందు మహాబలశాలి లోలకుల్
దనయుఁడు జ్యేష్ఠుఁ డుండె మధు ♦ దైత్యుఁడు విప్రులకుల్ శరణ్యుఁ డై. ౧౧౪౩

కం. మతిఁ బరినిష్ఠితుఁ డై సుర, తతులం బూజించి వారి ♦ దయ కర్హుం డై
యతులితతపంబు గౌరీ, పతి మెచ్చఁగఁ జేసెఁ బెక్కు ♦ వర్షము లంతన్. ౧౧౪౪

కం. వానికి మెచ్చి గిరీశుఁడు, మానిత మై మిగుల దీప్తి ♦ నుంతం బయి యౌ
న్న్యానబలం బగుశూలముఁ, దా నొసఁగెం బ్రీతి లాగి ♦ తనశూలమునన్. ౧౧౪౫

ఉ. ఇచ్చుచు వాని కి ట్లను ఋ ♦ షీశ్వరనిర్జరులందు భక్తిమై
సచ్చరితుండ వై తపముఁ ♦ జల్పుట మెచ్చితి దీని నిచ్చితిన్
మచ్చర మూని నీవు సుర ♦ మండలి విప్రుల నేఁచె దేని నీ
కిచ్చటులాయుధంబు పని ♦ యేమియుఁ జేయద న్యర్థమై చనున్. ౧౧౪౬

కం. నీతో రణమున కెవఁడే, నే తెంచిన యేని వాని ♦ నిలఁ గూల్చి యథా
రీతిఁ జనుదెంచుఁ జుమి నీ, చేతికి మఱి యనిన దనుజ ♦ శేఖరుఁ డనియెన్. ౧౧౪౭

తే. ఇమ్మహాసాధనం బమ ♦ రేంద్రవంద్య! నాదువంశంబునంద సం ♦ తతము నిల్వ
నిమ్ము నావుడుఁ గా దట్టు ♦ లిచ్చువాఁడ, నీదుసుతునొద్ద మాత్రంబు ♦ నిల్చునట్లు.

చం. అనవుడు వల్లె యంచు నతఁ ♦ డాత్మగృహంబున కేగుదెంచి దా
నిని మహితార్చనాదివిధి ♦ నిత్యముఁ బూజ యొనర్చు చుండె, నా
దనుజుఁడు భూరిమందిరము ♦ దానికి నై రచియించె నమ్మధుం
డనలతనూజ విశ్రవసు ♦ నన్వయమందు జనించినట్టి దై ౧౧౪౮

కం. కుంభీనసి యను పేరం, గుంభిని విశ్రుతిని గన్న ♦ కోమలి నేలెన్
జంభారి భయంకరసం, రంభుఁడు లవణుండు సుతుఁడు ♦ రామ! యతనికిన్. ౧౧౫౦

ఉ. పిన్నటనాఁటి నుండియును ♦ భీకరశీలుఁడు వాఁడు దుష్టుఁ డై
యెన్నియొ పాపకార్యముల ♦ నెప్పుడుఁ జేయుచు నుండు, దుర్వినీ
తి న్నిజనందనుం గని య ♦ తివ్యథఁ జెందియుఁ గోపగించియుఁ
గన్నకుమారుఁ డౌట యెది ♦ గాదన కూరక యుండెఁ దండ్రియున్. ౧౧౫౧

తే. జనకుఁ డీలోకమును వీడి ♦ చనియె వరుణు
నాలయమునకు సుతునకు ♦ శూలమహిమఁ
దెలిపి; యంతటనుండియుఁ ♦ గలుషహృదయుఁ
డల్లసాధనశక్తి జ♦గాళి నేఁచు. ౧౧౫౨

తే. అందుఁ దాపసు లనినఁ బా♦పాత్మకునకుఁ, బేలపిండియ; శూలంబు ♦ విధము వింటె.
వానిశక్తి యెఱింగితే ♦ వారిజాప్తవంశ్య! మాకింక గతి వీవె ♦ పరమపురుష.

ఉ. కోరితి మయ్య! యెందఱనొ ♦ క్రూరచరిత్రభయార్తిఁ గుందుచున్
వీరవరేణ్యులన్ నృపుల ♦ వీని వధింపుఁ డటంచు, నొక్క రేన్
ధీరత వాని మార్కొనఁగఁ ♦ దెంపు వహింపరు, పంక్తికంఠసం
హారము నీదుచేత విని ♦ హర్షముతో గతి వీవె యన్యతిన్. ౧౧౫౪

కం. అరుదెంచితి మిచ్చటి కో, ధరణీవర! మాకు నెపుడుఁ ♦ ద్రాతవు నీవే
కరుణింపుము మాపయి నా,శరవరునిన్ లవణుఁ ద్రుంప ♦ సమకట్టి నృపా! ౧౧౫౫

కం. మా కొదవినయాపద యిది, నీకంటె నెవండు లేఁడు ♦ నిశిచరుఁ ద్రుంపన్
మాకోరికఁ దీర్పఁగ ననఁ,గాకుత్థ్సుఁడు పల్కు మౌని♦కాండంబులకున్. ౧౧౫౬

రాముఁడు మౌనులను లవణునాచారాదుల నడుగుట.

కం. ఆచారాహారములు ని,శాచరునకు నెవ్వి? యెందుఁ ♦ జరియించును స
త్యాచారులార! పలుకుఁడు, నీచుని వధియింతు మీకు ♦ నెమ్మదిఁ గూర్తున్. ౧౧౫౭

మ. జననాథాగ్రణిఁ జూచి మౌనులు తదా♦చారంబు రౌద్రంబ, యా
తనియాహారము జంతులెల్లను, బరా♦ర్థ్యం బందు వాచంయముల్,
మనుజవ్యాఘ్రమృగద్విపాదులను రా♦మా! చంపి భక్షించెడిన్
దినముల్ వేలుగ, వాస మా మధువనీ♦దేశంబు భూమీశ్వరా! ౧౧౫౮

తే. ప్రలయవేళను గాలుండు ♦ ప్రజలనెల్ల, మ్రింగుమాడ్కిని వా విచ్చి ♦ మ్రింగుచుండు
నంతరాంతరములను స♦త్త్వాళి ననిన, రామచంద్రుండు తన్మౌని♦రాజి కనియె.

కం. వదలుఁడు భీతిని రాక్షసుఁ, గదనంబునఁ ద్రుంతు ననుచుఁ ♦ గని తమ్ముల నా
మదయుతు లవణుం జంపఁగఁ, గదలెడివం డెవ్వ రిపుడు ♦ గైకొనువారో? ౧౧౬౦

శత్రుఘ్నుఁడు తాను లవణుఁ జంపఁ బోయెద ననుట.

తే. భరతశత్రుఘ్నులందు నీ♦పాలు గొనఁగ, నెవ్వరొకో కోరువా రన ♦ నెలమి లేచి
భరతుఁ డిట్లను నే నుండ ♦ బాలుఁ డైన, లక్ష్మణానుజుఁ బంపఁ ద♦లంప నగునె?

కం. నావంతు గాఁగ నిడుఁడీ, యావీరుని లవణుఁ జంపు ♦ టన శత్రుఘ్నుం
డావాక్యము లాలించి మ,హావినయముతోడ ననియె ♦ నవనీపతితోన్. ౧౧౬౨

సీ. భరతుండు శూన్యమా♦పట్టనంబు నయోధ్యఁ, బాలించె మీరలు ♦ వనుల నుండ
మీవచ్చునందాఁక ♦ నేవిధసుఖమును, దా నెఱుఁగండు సం♦తాపగరిమ
ననుభవించెను మహా♦వ్యసనంబు లిన్నన్ని, యని చెప్ప నౌనె దుః♦ఖావహుండై
బడకను బన్నుండె ♦ ఫలమూలములు మెక్కి, జడలుధరించె వ♦స్త్రములు మాని
తే. నారచీరలు దాల్చె నీ♦కారణమున, వనట గూరెను సౌఖ్యంబు♦పడఁగ వలదె
యిప్పు డైనను నే నుండ ♦ నెల్లవేళ, బంట నై భరతుని దుఃఖ♦పఱుప నగునె?

→ రాముఁడు లవణుఁ జంపి మధురాపురి నేల నాజ్ఞాపించుట. ←

చం. అనవుడు రాముఁ డిట్లను మ♦హాభుజ! యట్టుల యౌత, నాదుశా
సనమునఁ బొమ్ము నీవు, సుర♦శాత్రవుఁ డౌమధుపట్టనంబునన్
నిను నభిషిక్తుఁ జేసెదను ♦ నీమతిచొప్పున నింద కైకసం
దనుఁడు నిలంగ నిమ్ము, రణ♦దక్షుఁడ వీవు వధించి రాక్షసున్ ౧౧౬౪
తే. మేలిపట్టన మందు ని♦ర్మించి యంద
నీవు రాజ్యంబు చేయుచు ♦ నెమ్మినుండు,
శత్రువధ సల్పి రాష్ట్రంబు ♦ సంగ్రహించి
నృపతి నీయని యతఁ డేగు ♦ నిరయమునకు. ౧౧౬౫
కం. బదులాడకు మెదియేనియు, నెదు రాడఁగ రాదు పిన్న♦జ్యేష్ఠున కతఁడె
య్యది చెప్పిన నొనరుపఁ దగు, నద నిదియే కొనుము నేఁడ ♦ యభిషేకంబున్.
తే. అవనిబుధులు వసిష్ఠాదు ♦ లర్హ భంగి, నీకు నొనరించువా రభి♦షేక మనిన
సిగ్గువెలుచ శత్రుఘ్నుండు ♦ శిరము వంచి, యల్ల నల్లన నిట్లను ♦ నగ్రజునకు. ౧౧౬౬

→ పట్టాభిషేకం బొల్లక శత్రుఘ్నుఁడు పరితపించుట. ←

కం. అన్నా! జ్యేష్ఠుం డుండం, బిన్నకు నభిషేక మర్హ♦మే? ధర్మంబే?
యిన్నెఱి నీనుడిఁ బోవుదుఁ, బన్నుగ దాఁటంగ లేమిఁ ♦ దద్వచ్ఛాసనమున్. ౧౧౬౭
సీ. జ్యేష్ఠునకును బిన్న ♦ యెదురాడ రా దని, నీచేత శ్రుతులందు ♦ నేను వింటి
వినియు నెఱింగియు ♦ విపరీతబుద్ధిచే, భరతునిఁ గా దని ♦ పలికినాఁడ
లవణు వధించెద ♦ బవరాన నే నని, యాదురుక్తం బె యో♦యనఘచరిత!
యిట్టిదుర్గతిఁ గూర్ప ♦ హేతు వయ్యెను నాకు, వెనుకఁ జింతించుట ♦ వెఱ్ఱితనము
ఆ. చేసినట్టికృతికి ♦ శిక్షయియ్యది చాలు, నీకు మాఱు పలుక ♦ నిశ్చలాత్మ!
దండనంబు నాకు ♦ రెండవ యది కల్గ, కుండుఁ గాక మన వొ♦కండు వినుము.
ఉ. కోరను రాజ్యమేను రఘు♦కుంజర! నీనుడిఁ దీర్పఁ బోయెదన్
దారితవైరిసంచయ! య♦ధర్మము నన్ను స్పృశింపకుండఁగాఁ

గారుణికాగ్రణీ! కరుణఁ ♦ గావు మటన్నను సంతసించి ధా
త్రీరమణుండు లక్ష్మణుని♦దిక్కుఁ గనుంగొని పల్కె నిట్లుడే ౧౧౨౦

రాముఁడు శత్రుఘ్నుని మధుర కభిషిక్తునిఁ జేయుట.

కం.భరతుండును నీవును నున,పురజనముల మంత్రివరుల ♦ భూమీసురులన్
సరగం బురోహితుల నిట, కరుదేరఁగఁ బిలువఁ బంపుఁ ♦ డనఁగా వారల్. ౧౧౨౧

కం.అటు లే యందఱఁ బిలువఁగ, భటులం బంపంగ వారి♦బడి నెల్లరు రాఁ
దటుకున విధియుక్తంబుగఁ, బటుబలశాలికి సుమిత్ర♦పట్టికిఁ బ్రీతిన్. ౧౧౨౨

కం.రాముఁ డభిషేక మొనరుప, శ్రీమహితుం డై యతండు ♦ చెన్నారెను సు
త్రామాదులచేఁ బూర్వము, సామి వెలింగినవిధాన ♦ జనములు పొంగన్. ౧౧౨౩

ఆ. పౌరు లలరుచుండ ♦ బ్రాహ్మణుల్ మోదింప
ముగురుతల్లు లాత్మ ♦ ముదముఁ గూర్చి
దీవనల నొసంగఁ ♦ దేజరిల్లెడిసుమి
త్రాత్మజాతుఁ గని ప్ర♦హర్షమునను ౧౧౨౪

కం.యమునాతీరగు లగుసం,యములును లవణాసురుండు ♦ హతుఁడే యంచుం
దమమనముల సమ్మఁగ నరి,దమనుఁడు శత్రుఘ్నుఁ జేర్చి ♦ తనయంకమునన్. ౧౧౨౫

రాముఁడు శత్రుఘ్ననకు నారాయణాస్త్రం బొసంగి లవణుఁ జంపు నుపాయంబుఁ దెల్పుట.

సీ. అన్న! శత్రుఘ్న! ది♦వ్యం బైనయీశరం,బును గొమ్ము లవణు దీ♦నన వధింతు
మున్ను మహార్ణవ♦మున స్వయంభువు దేవుఁ, డజితుండు సర్వసు♦రాసురులకు
నెల్లభూతాళి క♦దృశ్యుఁ డై శయనించి, యున్న వేళ సృజించె ♦ నుగ్రరుషను
మధుకైటభాసుర♦మథనంబునకు సర్వ, రాక్షసులను ద్రుంప ♦ రణములోన

ఆ. మూఁడులోకములను ♦ మునుకొని సృజియింపఁ, జంపి కైటభు మధు ♦ జగముసృష్టి
జనులభోగమునకుఁ ♦ జలిపె నీశరశక్తి, వింటె దీని మహిమ ♦ వీరవర్య! ౧౧౨౬

ఉ. వైవఁగ లేదు రావణుని♦పై నిది యాతనిఁ జంపఁ గోరియున్
హావడిఁ గూర్చుభూతతతి ♦ కంచును, శూలము నీశదత్తమున్
దా విడి యింటఁ బూజకయి ♦ దానవుఁ డేగుఁ బురంబుఁ బాసి యి
చ్ఛావిధి గ్రాసకాంక్షఁ, దను ♦ శత్రువు చీరిన యేని పోరికిన్ ౧౧౨౭

కం.శూలముఁ గొని వచ్చును నీ, వాలవణుఁడు పురముఁ బాసి ♦ యాహారము కై
హాళిఁ జరియించునదనున, నాలమునకుఁ బిలిచి యతని ♦ నాఁగుము పీఁకన్. ౧౧౨౮

తే. పురము ద్వారంబునను నిల్చి ♦ సురవిరోధి
పట్టనముఁ జొరకుండఁగ ♦ బవరమునకుఁ

బిలిచి తేనియుఁ జచ్చు నీ♦బలిమి నాతఁ
డన్యవిధమునఁ జంప శ♦క్యంబు గాదు. ౧౧౭౯

కం. గిరిజానాథునిశూలము, దురతిక్రము మాట దాని ♦ దోషాటుఁడు దాఁ
గరమునఁ దాల్పని వేళను, బరిమార్పు మటంచు నతనిఁ ♦ బరిబోధించెన్. ౧౧౮౦

సీ. మఱి యిట్టులను నీవు ♦ మాతంగశతమును, నరదముల్ రెండువే ♦ లశ్వములను
నాలుగువేలును ♦ నానాపదార్థంబు, లంగళ్లు నట నర్త♦కావళులును
నియుతంబు హేమంబు ♦ నీతోడఁ గొనిపొమ్ము, భటులకు జీతంబు ♦ బత్తె మిచ్చి
సల్లాపములచేత ♦ సంప్రదానంబుల, సంతోషపఱుపుము ♦ సంగరమున

తే. నచటివారికి భార్యలో ♦ యాత్మభవులొ
యైనవారలొ స్వీయప♦దార్థతతులొ
యేవియును లేమి యెఱిఁగి నీ♦వే ముదంబుఁ
గూర్పు వారికి మాటల ♦ గుణివతంస! ౧౧౮౧

ఉ. ముంగల గాఁగఁ బంపుము చ♦మూతతి గంగను దాఁటుఁగాక యిం
కం గోద వుండ గ్రీష్మము, సు♦ఖంబుగ నావలియొడ్డు చేరి యం
దంగగుచోటులన్ విడిసి ♦ యాబల మొప్పఁగ, వెండి నీవు కే
లం గొని చాప మొక్కఁడవె ♦ లాఘవ మేర్పడ నేరి కేనియున్. ౧౧౮౨

చం. తెలియఁగ రాక యుండుగతిఁ ♦ దెప్పునఁ బొమ్ము, రవంతయేని యా
ఖలుఁ డెద సందియంబు గొనఁ♦గాఁ దగ దీమునువెల్ల మున్నుగా
బలఁగముతోడఁ బోయెదరు ♦ వాహిని యెల్లను జాహ్నవీతటిన్
నిలిచియ యుండ మున్నుగను ♦ నీవు చనం దగుఁ జాపపాణివై. ౧౧౮౩

చం. అరి చనుదెంచువార్త తెలి♦యంబడఁగా లవణుఁడు శూలమున్
గరమునఁ దాల్చి శాత్రవుల ♦ గం డడఁచుం, జన నిమ్ము వేసవిన్
దొరఁకొన వానకా రతనిఁ ♦ ద్రుంపుము, శూలము లేక యొంటిఁ గ్రు
మ్మరు జడివానలం దెవఁడు ♦ మార్తుఁడు మార్కొనవచ్చు నన్నతిన్. ౧౧౮౪

→ శత్రుఘ్నుఁడు సేనలముందుగనంపి తానొంటిగ లవణుపైఁబోవుట. ←

కం. అనవుడు నగ్రజుపలుకులు, విని సేనాపతుల వేగఁ ♦ బిలిపించి యనీ
కినులోలి నిలువ నెలవులు, మనమున మీ రెఱిఁగినవియ ♦ మాట లిఁ కేలా.

ఉ. కావున మీరు సేనలును ♦ గ్రచ్చుఱఁ బోయి దిగంగ యోగ్యమా
తావులఁ బాళెమున్ డిగుచుఁ ♦ దద్ధరణీప్రజ నేమిబాధలం
ద్రోవక పొందఁ డటం చని మ♦నోజ్ఞ చరిత్రుఁడు వారిఁ బంపి తా
నావల ముగ్గురమ్మలకు ♦ నంఘ్రుల వ్రాలి కృతప్రణాముఁడై. ౧౧౮౬

తే. రామునిఁ బ్రదక్షిణించి శిరంబుచేత
మ్రొక్కి లక్ష్మణు భరతుని మ్రొక్కి కేలు
మోడిచి వసిష్ఠునకు భక్తి మునుకొనంగ
వినతు లొనరించి సెల వొంది వెడలి చనియె. ౧౧౮౭

చం. తురగరథాదిసంకులముఁ దోరపుసైన్యము ముందు పంచి తాఁ
బురమున నిల్చి యెక్క నెల పూర్వజమాతపురోధలన్ మహా
గురుమతి మ్రొక్కి యాజ్ఞ గొని గొబ్బున నొక్కఁడ యేగి రెండురా
తులను లక్ష్మణానుజుఁడు త్రోవన త్రోసి నితాంతపుణ్య మౌ ౧౧౮౮

## శత్రుఘ్నుఁడు వాల్మీకి యాశ్రమంబునఁ జేరుట.

తే. వల్మికోద్భవునాశ్రమవాటిఁ జేరి
మౌనివరునకు భక్తి నమస్కరించి
యంజలి ఘటించి ఋషివర్య! యగ్రజాతు
వాక్యమున నేను బోవుచు వచ్చినాఁడ. ౧౧౮౯

కం. ఈ రే యిక్కడ నిల్వఁగఁ, గోరెద మీ క్రియకు హాని గూరద యేనిన్
దారుణపశ్చిమముగ నా,దారిం జనువాఁడ వేఁగ తత్త్వజ్ఞ యనన్. ౧౧౯౦

కం. నరవరు నుడులకు మునిపతి, దరహాసముతోడ స్వాగతము నీకు నృపా
యెరవుగఁ బలికెద వే?రఘు,వరులకు నిది సొంతసొమ్ము భావింపు మెదన్. ౧౧౯౧

కం. అని పాద్యం బర్ఘ్యం బా,సన మొసఁగఁగ నాతఁ డలరి చారుఫలాదుల్
తనివార మెసఁగి సమ్మద,మున నిట్లను నాశ్రమంబు పొంతన మౌనీ! ౧౧౯౨

కం. యాగం బెవ్వరొ చేసిన,యాగుఱుతులు కానఁబడెడి నతఁ డెవ్వఁ డనన్
యోగీంద్రుఁ డిట్టు లను గుణ,సాగర! మీపూర్వుఁడొకఁడు సత్త్వ ధనుండున్

## వాల్మీకి శత్రుఘ్నునకు సౌదాసుచరిత్రంబుఁ దెలుపుట.

సీ. పరఁగె సుదాసుఁ డన్ పార్థివుఁ డాతనిసుతుఁడు వీరసహుండు శుద్ధచరితుఁ
డతఁడు బాల్యమునందు యటవికి వేఁటకై,పలుమాఱుఁ బోవుచు వచ్చుచుండు
రాక్షసు లిర్వు రరణ్యమందలి మృగ,కోటులఁ బులు లయి కూల్చి తినఁగ
నిర్మృగ మయ్యె వనీదేశమంతయు, నది గని సౌదాసుఁ డాగ్రహమున

ఆ. ఘోరమార్గణమునఁ ద్రుంచి యొక్కని వానిఁ, జూచుచుండ నమిత శోకయుక్తిఁ
దోడివాఁడు పల్కె దోసంబు లే కేమి, నాసహాయుఁ జంప న్యాయ్య మగునె.

ఆ. దీనిమాఱుకీడు నేను నీకు ఘటింతుఁ, గను మటంచుఁ జెప్పి కానఁ బడక
చనియెఁ గొంతకాల మునకు నమ్మిత్రసహుండు దాల్పఁ గలిగె నుర్విభరము.

ఉ. ఆనృపుఁ డశ్వమేధ మఖ♦యాగ మొనర్ప నిటన్ వసిష్ఠుఁ డ
ద్దానిని నిర్వహించు నెడఁ♦ దత్పరిపూర్తిని బూర్వవైరమున్
మానసమందు నిల్పి యల♦మానవభోజి వసిష్ఠ రూపి యై
మానవనాథ! నా కిపుడు♦ మాంసయుతాన్నముఁ బెట్టు మం చనన్. ౧౯౬

చం. క్షితిపతి బానసీనిఁ గని♦ చెచ్చెర సామిషభుక్తినిం బురో
హితునకుఁ దృప్తి గూర ఘటి♦యింపు మటంచు వచింప నాతఁడున్
ద్రుతగతి సంభ్రమంబు గొనెఁ♦ దొల్లిటిసోఁకుఁడు సూదకారునా
కృతి మనుజామిషంబును న♦రేంద్రునకుం గొనివచ్చి భూపతీ!. ౧౯౭

కం. ఇది స్వాదుహవిష్యము ముని, మది మెచ్చున్ సామిషంబు♦ మంజుల మన న
య్యది పత్నియుతుఁ డై ముని, కెదఁ గల్మష మేమి లేక♦ నృపుఁ డిడెఁ గుడువన్.

వసిష్ఠుఁడు సౌదాసుని సపించుట.

కం. భాజనమం దుంచినయా, భోజనమున్ మనుజమాంస♦ముగ నెఱిఁగి మదిన్
రాజా! యెది నాకిడి తది, భోజన మగుఁ గాక సిక్క♦ముగ నీ క నుచున్. ౧౯౯

కం. ముని శపియించిన రోషం, బున సౌదాసుండు నీర♦ములఁ గేలఁ గొనన్
మునిని శపించెద నని యా, తనిసతి మదయంతి ప్రాణ♦ధవు నిట్లనియెన్. ౨౦౦

కం. భగవంతుఁ డగువసిష్ఠుం, దగవే శపియింప నీకు♦ ధరణీశ యనన్
మగువవచనంబులం గొని, దిగవిడిచె జలంబు రోష♦దీప్తం బగుచున్ ౨౦౧

కం. తేజోబలయుత మగుజల, మాజనపతి తనదుసంఘ్రు♦లందున్ విడువన్
దేజోహతి నాభూమిబి,డౌజునిపాదములు కమరె♦ నది మొద లతఁడున్. ౨౦౨

తే. పరఁగెఁ గల్మాషపాదుఁ డన్♦ బ్రథ నరేంద్రుఁ
డాత్మపత్నియుతుం డయి♦ యమ్మహర్షి
వేఁడె నిర్దోషి తా నని♦ వేయిగతుల
నృపతినుడి మాని తనయోగ♦దృష్టిఁ జూచి. ౨౦౩

కం. అక్కపటవ్యాపారము, రక్కసుపని యంచు నెఱిఁగి♦ రాజా! విను నా
వాక్కును ద్రిప్ప నశక్యము, యొక్కవరము నొసఁగువాఁడ♦ నూఱడు దానన్.

చం. పదియును రెండువర్షములు♦ పార్థివవర్య! సహింపు శాపమున్
బదపడి శాపముక్తి యగు♦ భావమునందు గతంబు విస్మృతిన్
బొదలెదు, నాఁగ వట్టు లని♦ భూపతి శాపము సైఁచి మీఁదఁ దా
సదనముఁ జేరి క్రాలెను బ్ర♦జాపరిపాలనసక్తచిత్తుఁ డై. ౨౦౫

కం. ఆతని యజ్ఞాయతనం, బీతల మని మాని చెప్ప♦ నెలమిఁ గని సుమి
త్రాతనయుఁడు మునినాథున, కాతతమతి మ్రొక్కి చొచ్చె♦ నాకులగుడిసెన్.

### సీతాదేవి కుమారులఁ గనుట.

కం. యామవతి దేనియందా, రామానుజుఁ డుండెఁ బర్ణ♦రమ్యగృహమునన్
భూమిజాతనుజాతయు నా, యామవతీవేళ సుతుల ♦ నమడలఁ గాంచెన్. ౧౨౦౭

తే. తపసిపాలకు లర్ధరా♦త్రమున వచ్చి, వాల్మికిం గని గాముని♦పత్ని గనియె
సుతులనిద్దఱ భూతముల్ ♦ సోఁక కుండ, బాలచంద్రాభులను గావు ♦ బాలకులను.

చం. అనవుడు మౌని యేగి జన♦కాత్మజపుత్త్రులఁ గాంచి భూతనా
శన మగుమంత్రముల్ చదివి ♦ చయ్యన మంత్రిత మైనదర్భలన్
గొనలను బుత్త్రు నొక్కనిని ♦ గూర్చ మొదళ్ల మఱొండుపుత్త్రు మా
ర్జన మొనరింపఁ బంచె ముని ♦ సంయమివృద్ధసరోజనేత్రలన్. ౧౨౦౯

తే. అనిమిత్తంబుచేతఁ గు♦శాఖ్య నొకని, కిచ్చి లవుఁ డనుపే రిచ్చి ♦ యింకొకనికి
నమడలిద్దఱుఁ గుశలవు ♦ లనెడి పేరఁ, బరఁగువా రిద్దియే నామ♦కరణ మనుడు.

కం. ఆరక్షను గొని చని ముని, నారులు తద్విధిని మార్జ♦నం బొనరిచి రా
భూరమణుఁడు శత్రుఘ్నుం, డారఁగ మునిసతుల పలుకు ♦ లాలించి నిశన్. ౧౨౧౧

కం. కవలం గనియెనె భూమీ,భవ భాగ్యము! తల్లి! యనుచుఁ ♦ బలికెను హర్షం
బవిరళముగఁ గను చుండఁగ, రవి దోఁచెన్ శ్రావణికపు♦రజనియుఁ జనియెన్

కం. పౌర్వాహ్ణికకార్యంబుల, సర్వంబును దీర్చి మ్రొక్కి ♦ సంయమిమణికిన్
శర్వరు లేడిటిఁ గడపి య,ఖర్వజవుఁడు త్రోవ మునిని♦ కాయముఁ గాంచెన్.

### శత్రుఘ్నునకుఁ జ్యవనుండు లవణుచే మాంధాత మడిసినవిధంబుఁ దెలుపుట.

తే. భార్గవుండాది యైనత♦పస్విజనుల,యాశ్రమంబుల నుండి సం♦యములు పల్కు
చిత్రగాథల వినుచు ని♦శీథ మెల్లఁ, గడపుచో నిట్టు లడిగె భా♦ర్గవుని నృపుఁడు.

చం. చ్యవన! మహానుభావ! గిరి♦జాధవదత్తము శూల మూని యా
లవణుఁడు సంగరంబున ని♦లాధవులన్ వధియించె నోటు మున్?
లవణుబలంబు శూలముబ♦లంబు విధంబు వచింపుమీ యనన్
జ్యవనుఁడు రామచంద్రు నను♦జాతునిఁ గన్గొని పల్కెఁ బ్రీతితోన్. ౧౨౧౪

సీ. ఎందఱో మడిసిరి ♦ యేటికి నాకథ, లిక్ష్వాకువంశ్యుఁ డ♦హీనబలుఁడు
యువనాశ్వనందనుం ♦ డుగ్రతేజుండు మాం,ధాత నా నడిసన్న ♦ ధరణివిభుఁడు
ధారణీచక్రంబుఁ ♦ దనయాజ్ఞలో నిల్పి, స్వర్గలోకజిగీషఁ ♦ జనియె దివికి
హరిహయుతోడ ♦ నర్ధాసనంబుననుండి, దివిజులు మ్రొక్కంగఁ ♦ దేజరిల్లఁ

తే. గోరు నాతనిపాపపుఁ♦గోర్కె నెఱిఁగి, సాంత్వపూర్వోక్తి నతనికి ♦ శక్రుఁ డనియె
నేమి రాజేంద్ర! నీయాజ్ఞ ♦ పృథివియందఁ, జెల్లదే యేలస్వర్గంబుఁ ♦ జేర రాఁగ.

కం. భూలోకం బంతయు నీ, వేలం గలిగినను దివికి ♦ నే తెమ్మి చమూ
పాళులతో నావుడు భూ,పాలుఁడు తలవంచి సిగ్గు♦పడి యి ట్లనియెన్. ౧౨౧౭

తే. ఎందు నాయాజ్ఞ చెల్లదో ♦ యింద్ర! పుడమిఁ
బలుకుమీ యన లవణుఁ డన్ ♦ పలలభోజి
మధువనంబున నున్నాఁడు ♦ మనుజనాథ!
చెల్లడి నె యందు నీయాజ్ఞ ♦ చెప్పు మనిన. ౧౨౧౮

మాంధాత లవణుచే హతుఁ డగుట.

ఉ. ఘోరపువిప్రియంబు సుర♦కుంజరుఁ డాడిన సిగ్గు చెంది ధా
త్రీరమణుండు వెండి చను♦దెంచెద నంచు నవాజ్ముఖంబునన్
శూరుఁడు వీడ్కొ ల్పడసి ♦ శూలధరున్ గెలువంగ రాక్షసున్
గోరి పురంబుఁ జేరఁ జని ♦ గొబ్బునఁ బంచెను దూత నొక్కనిన్. ౧౨౧౯

కం. మధుపుత్రు నొద్దకును వాఁ, డధికంబుగ నందుఁ బ్రేల ♦ నప్రియభాషల్
క్రుధచే లవణుఁడు వానిన్, వధియించి భుజించె నృపతి♦వర్యుం డచటన్. ౧౨౨౦

ఆ. తడవు చాల నయ్యెఁ ♦ దనదూత రా కున్నఁ, దాన యరిగి లవణుఁ ♦ దాఁకి ఘోర
బాణవృష్టి ముంపఁ ♦ బలలాశి శూలంబు, వైచె రాజుమీఁద ♦ బలముమీఁద.

ఆ. అదియు నృపతితోడ ♦ నఖిలసేనాతతి, దగ్ధముగ నొనర్చి ♦ దనుజనాథు
చేత వచ్చి నిలిచెఁ ♦ బూతచరిత్ర శూ,లాయుధంబు మహిమ ♦ యతులితంబు.

ఉ. శూరవరేణ్య! వేగినను ♦ శూలము నాలయమందు వీడి యా
హారము పొందె దైత్యుఁడు వ♦నాంతరవీథులఁ గ్రుమ్మరంగ దు
ర్వారపరాక్రమంబునను ♦ వాని వధించెద వీవటంచు నీ
తీరున మందలించు నెడఁ ♦ దెల్వి వహించెను దూరు వంతటన్. ౧౨౨౩

శత్రుఘ్నుఁడు లవణుఁ బురంబులోనికిఁ బోకుండ నిరోధించుట.

ఉ. ఆవలువాత దైత్యవరుఁ ♦ డామిషకాంక్షఁ బురంబు వీడి వ
న్యావళి కేగె, దాశరథి ♦ యంతట సూర్యసుతం దరించి యా
కావలుపీటివాకిటను ♦ గాచి శరాసనహస్తుఁ డౌచు స
ద్భావనుఁ డుండె మింటి నడి♦భాగము సూర్యుఁ డలంకరింపఁగన్. ౧౨౨౪

ఉ. క్రూరుఁడు రాక్షసుండు మృగ♦కోటుల నెల్ల వధించి మోచి త
ద్భారముతోడ వచ్చి పురి♦వాకిట లక్ష్మణుతమ్ముఁ గాంచి యే
కారియ మిందుఁ జేసెదవు ♦ కాండశరాసము లూని? నాకు నా
హారము పూర్ణ మయ్యె వద♦నాంతర మీ విటు వచ్చి చొచ్చుటన్. ౧౨౨౫

చం. అని కడుబిగ్గనవ్వదను♦జాధముఁ గాంచి సుమిత్రపట్టి పె
న్గినుకను బాష్పము ల్దొరలఁ ♦ గీలలు వెల్వడ గాత్రదేశమం
దనియె దురాత్మ ని న్దొడరి ♦ యాహవ మే నొనరింప వచ్చినాఁ
డను, నినుఁ గాలుప్రోలికిఁ గ♦డంకను బంపెద నేల నవ్వఁగన్. ౧౨౨౬

కం. తనయుండను దశరథునకు, ననుజుండను రామునకు ని♦శాటవరేణ్య!
వినరా! నే శత్రుఘ్నుఁడ, జనరక్షాపరుఁడ నిత్య♦శత్రుఘ్నుండన్. ౧౨౨౭

ఉ. కావున ద్వంద్వయుద్ధమున♦కాంక్ష దలిర్పఁగ వచ్చినాఁడ, నీ
చావు నిజంబు నావుడు ల♦సత్పరిహాసవికాసవక్త్ర ర
క్షోవరుఁ డాగ్రహంబునను ♦ గూళుఁడ! నాతలితోడఁబుట్టు వా
రావణుఁ, డాతనిం దునిమె ♦ రాముఁ డనిం దరుణీనిమిత్త మై. ౧౨౨౮

కం. మునుపటివారల నధునా,తనులను బోరి గొంటి నృపులఁ ♦ దక్కినవారిన్
మనమునఁ దృణీకరించితిఁ, గనుకం జుమి శాంతిఁ దాల్చి ♦ కదలక యుంటిన్.

ఉ. రావణువంశ మెల్లను దు♦రంబునఁ గూలుటయున్ సహించితిన్;
నీ విట వచ్చినాఁడవె య♦నిన్ ననుఁ దాఁకఁగ? నేను శూలమెం
తేవడిఁ దెత్తుఁ దాళు మొక♦యింత యనన్ నృపసూతి నవ్వి నే
జీవముతోడ నుండ నెటు♦చేకొనఁ బోయెద వోరి శూలమున్? ౧౨౩౦

కం. పగతుఁడు యాదృచ్ఛికముగ, నగపడినన్ విడుచుమూఢుఁ ♦ డవనిం గలఁడే?
జగములకెల్లను శత్రువ, వగు నే దుష్టాత్మ! నీకు ♦ నంతర మొసఁగన్? ౧౨౩౧

## లవణశత్రుఘ్నులయుద్ధము.

సీ. అనవుడు మధుపుత్త్రుఁ ♦ డట్టహాస మొనర్చి, పాణిఁ బాణిని నల్పి ♦ పటపట మన
దంతముల్, పోరికి ♦ ధరణీశుఁ బిల్వంగ, నతఁడు రక్కసుతోడ ♦ ననియె నోరి!
మున్ను నీగెలిచిన♦యన్నృపతులలోని,వానిఁగా నన్నెంచ ♦ వలదు నిన్నుఁ
బరిమార్చి ఋషుల ని♦ర్భయులను గావింతు, మత్క్రూరబాణాగ్ని ♦ మహిని బడిన
తే. నిన్ను రావణు సమరులు ♦ గన్నులారఁ, గాంచినట్టులు విప్రులు ♦ ఘ్నాజనంబు
కాంచుఁ గావుత క్షేమంబుఁ♦గనెడిఁ గాక,యూళ్లుఁ బల్లెలు నేఁడాది♦యుదిల గొనక.

ఉ. మామకహస్తముక్తశిత♦మార్గణరాజులు వజ్రతుల్య తే
జోమయముల్ దివాకరరు♦చుల్ సరసీజముఁ జొచ్చుభంగి దు
ర్ధామజవంబునన్ ఖలుఁడ ♦ తావకహృత్తనలిఁ జొచ్చుఁ జూడుమీ
నా మధునందనుండు రఘు♦నందను వైచె ధరారుహంబునన్. ౧౨౩౩

ఉ. దానిని నూఱుతున్కలుగ ♦ ధారిణి డొల్లఁగ నేయఁ గింకచే
దానవుఁ డుగ్రభంగి వసు♦ధారుహవర్గము మీఁదఁ గొల్పినన్

కానవనాయకుండు ఖర♦మార్గణపంక్తి నణంచె దాని ని
శ్శైన నిశాటుఁ డుద్ధతి ద్రు♦మాహతి నొంచె నరేంద్రమూర్ధమున్. ౧౨౩౪

కం. శత్రుఘ్నుఁడు నడలుడు నిజ, గాత్రంబునసంధు లెల్లఁ ♦ గడిమి చెడి పడెన్
ధాత్రిపయి మూర్ఛముంప సు, మిత్రాసుతుఁ డిట్లు కూల♦మింట న్వేల్పుల్. ౧౨౩౫

కం. చారణగంధర్వులు ఋషి, వారంబులు నప్సరసలు ♦ భయపడి హాహా
కారంబులు నింపఁగ దే, వారియు హతుఁ డయ్యె శత్రుఁ ♦ డనుచున్ మదిలోన్.

తే. సడ్డ సేయక శూలంబు ♦ సంగ్రహింపఁ
జనఁడ, లబ్ధావకాశుఁ డై ♦ సత్త్వములను
గొనుచు నుండఁగ శత్రుఘ్నుఁ♦డును ముహూర్త
మాత్రమునఁ బ్రాప్తసంజ్ఞుఁ డై ♦ మాను లలర ౧౨౩౬

## ← శత్రుఘ్నుఁడు లవణు వధించుట. →

సీ. శత్రువు నెదిరించి ♦ శంబాననంబును, శతకోటివేగంబు ♦ శాతకుంభ
శైలమందరధర♦సన్నికాశంబును, నతపర్వ ముగ్ర మ♦నాహతంబు
శోణితచందన♦శోభితంబును జాను, పత్రంబు దానవ♦భంజనంబు
ప్రలయకాలానలా♦భంబు మహాస్త్రంబు, సర్వభూతంబులు ♦ సంభ్రమింపఁ

తే. దీయఁ గిన్నరగంధర్వ♦దేవసమితి, మునులతోడుత నప్సరో♦జనముతోడ
ధాతఁ గానఁగఁ జని భూత♦ధాత్రి యెల్ల, భువనములు నాశనం బగు♦పోల్కిఁ దోఁచె

చం. అనవుడు బ్రహ్మ పల్కె నమృ♦తాంధసులార! భయంబు హేతువున్
వినుఁడు సుమిత్రనందనుఁడు ♦ విశ్వపరున్ లవణున్ వధింపఁగా
ధనువునఁ గూర్చినాఁడు భయ♦దం బగునస్త్రము దాని తేజనన్
మన మతిమూఢ మయ్యెఁ జూఁడి ♦ నాకును మీకుఁ బ్రపంచ మంతకున్ ౧౨౩౯

తే. అది సనాతనుఁ డైనలో♦కాదికర్త
దగుటఁ దేజోమయంబు ము♦న్నసురులైన
మధునిఁ గైటభుఁ దునుముంగ ♦ మాధవుండు
దాని సృజియించె; దాని నా♦తం డొకండె ౧౨౪౦

చం. తెలిసినవాఁడు, వెన్నునకుఁ ♦ దేజమ యియ్యది కాన మీరు త
త్తలమున కేగి దైత్యునివ♦ధంబును జూడుఁ డటన్న వారలున్
గలహాధరిత్రికిం జనిరి ♦ కార్ముకమందు శరంబుఁ గూర్చి తాఁ
బిలిచె విరోధి, నాతఁడును, ♦ బేర్చిన కింకను బాలుదెంచినన్. ౧౨౪౧

శా. ఆకర్ణాంతము లాగి తచ్ఛరము దై♦త్యాధీశునిన్ వ్రేయ న
వ్యాకీర్ణద్యుతిపూర మభ్రపదవిన్ ♦ వ్యాపింపఁగా నేగి యా

లోకద్వేషియురంబు వ్రచ్చియు నధో♦లోకంబుఁ బ్రాపించి యి
క్ష్వాకుప్రోద్భవుతూణిఁ జొచ్చెసురలా♦శ్చర్యంబున న్మగ్నఁగన్. ౧౨౮౩

కం. లవణుఁడు శరనిర్భిన్నుం, డవనిం బడె వజ్రహతమ♦హాశైల మనన్
దివిజులు గన శూలము నని, శివుఁ గలసె యమున్ సురారి ♦ చేరిన మాత్రన్.

కం. ఖరకరుఁ డిరులం దోలెడి, పరుసన రామానుజుండు ♦ పటుశరమొకటన్
హరియించెన్ భువనత్రయి,పురుతరసాధ్వసము బుధులు ♦ పొగడుచు నుండన్.

ఆ. మధుసుతుండు గూల ♦ మానులు వేల్పులు, పన్నగులును బాము♦వలని భయము
విడిచినట్లు మోద♦విభవంబు పొల్పార, శాంతచిత్తు లగుచుఁ ♦ జనినయంత.

← దేవతలు శత్రుఘ్నునకు వర మిచ్చుట. →

సీ. అగ్నిపురోగము ♦ లమరులు పాకారి,తోడ శత్రుఘ్నునిఁ ♦ జూడ వచ్చి
మధురోక్తిఁ బల్కిరి ♦ మధునందను నదృష్ట,వశమునఁ జంపితి ♦ ప్రథితశౌర్య!
వర మిచ్చుకోరిక ♦ వచ్చి యున్నారము, మాదర్శనం బెప్డు ♦ పోదు వృథగ
నెద్ది నీకోరిక ♦ యెఱిఁగింపుమీ యన, శిరమునఁ గరములు ♦ చేర్చి పలికె
తే. రాజధానిగ నీమధు♦రాపురంబు, దేవనిర్మిత మమరుత ♦ దివ్యులార!
యనిన నౌఁ గాక మఱియు రా♦మానుజన్మ, శూరసేనగ నౌనని ♦ వారలెల్ల.

ఆ. వర మొసంగి దివికి ♦ నరుగ శత్రుఘ్నుండు, పిలువఁ బంచెఁ దనదు♦దళము నెల్ల
వచ్చి మధురయందు ♦ నల నగుచోటుల, నెలవు కొనియె జనము ♦ లలితభంగి.

← శత్రుఘ్నుఁడు మధురాపురంబు నభివృద్ధి పఱుచుట. →

తే. శ్రావణంబున నిట్లుప్రా♦రంభ మయ్యెఁ, దన్నివేశన మాది యా♦ద్వాదశాబ్ద
మునను నిండారి సేనాస♦మూహములను, దద్విషయములుఁ నిర్భయ♦తను రహించె.

సీ. కారు కాదనను బా♦కారి వాన లొసంగెఁ, బైరులుఁ బచ్చలుఁ ♦ బ్రబల మయ్యె
నారోగ్యయుక్తులై ♦ రఖిలమానవులును, సుందరగృహముల♦సొగసు లెసఁగె
నంగడివీదులు ♦ రంగారుచుండెను, వాణిజ్యసంపద ♦ బహుళ మయ్యె
లవణకల్పితమహా♦భవనంబు సుకృత మై, పెక్కువన్నెలకల్మిఁ ♦ బ్రేర్మిఁ గాంచె
తే. నర్ధచంద్రనిభం బయి♦యమునతీర,మందుఁ బుర మొప్పుచుండె వా♦హ్యాళియోగ్య
సుందరారామములు చాల♦శోభఁగూర్చె, హాళి శత్రుఘ్నుఁ డాపురి ♦ నేలు వేళ.

తే. అన్యతలముల నుండి వై♦శ్యాళి వచ్చి, నెలవు కొనె నందు నీరీతి ♦ నిర్భయముగఁ
బురము ప్రోపు వహించినఁ ♦ బొంగి లక్ష్మ,ణానుజుఁడు పదిరెండవ♦హాయనంబు

కం. పుట్టిన రామునిపదములు, పట్టి నమస్కృతిని జేయు♦భావము దనకున్
బుట్టమితజనవృతుం డై, పట్టనమున్ మంత్రిజనుల ♦ వశమున నిడుచున్. ౧౨౯౧

## శత్రుఘ్నుఁడు వాల్మీకియాశ్రమంబున విడియుట.

సీ. అరదముల్ నూఱుతో నరుదేర నియమించి, యేడెనిమిది తావు లేర్పరించి
యందంద నిలుచుచు ననఘుఁడా వాల్మీకి, యాశ్రమంబును జేరి యమ్మహాత్ము
పాదంబులకు మ్రొక్కి పాద్యంబుఁ గైకొని, యర్ఘ్యమాతిథ్యంబు నందియుండ
నెన్నియో కథలు మునీశుండు వచియింప, వినుచుండె నృపసూతి వేడ్క మీఱ

తే. వాల్మికుండును బ్రస్తావవశముఁ జేసి, లవణువధఁ గూర్చి యిట్లను లలితచరిత
దుష్టచరితుని లవణునిఁ ద్రుంచి నీవు, జగములకు మేలు సేసితి సత్యశౌర్య!

కం. నీతేజంబున లోకము, భీతి యణంగెను దశాస్యుఁ బెనుజతనమునన్
సీతాపతి గూల్చెను నీ, వీతనిఁ బొరిగొంటి యత్నహీనత నరరే! ౧౨౫౩

ఉ. వాసవుతోడ నుండి సురవర్తమునం గనుఁగొంటి నీవు దు
ష్టాసురుఁ జంపుభంగి భవదద్భుతవిక్రమశక్తి కెల్లరున్
వాసి రహింప మెచ్చి రెదఁ బార్థివనందన! నాకు నెంతొసం
తోసము గల్గె భూతపితతుల్ ప్రియమందెను నీదుసత్కృతిన్. ౧౨౫౪

కం. ప్రేమ సమగ్రము నాకును, నీమూర్ధము మూరుకొందు నే నే నిపుడో
రామానుజ! యిదియే కద, ప్రేమమునకుఁ బరమగతి వివేకధురీణా!. ౧౨౫౫

కం. అని శిరమును మూర్కొని తన, నెనరుం గనఁబఱిచి యాతనిం గొలిచెడిత
జ్జనముల కాతిథ్యంబును, మునివరుఁడు ఘటించె వారు మోదముఁ గూరన్.

## శత్రుఘ్నుఁడు శ్రీరామాయణమును వినుట.

సీ. శత్రుఘ్నుఁ డాహారసంతుష్టిఁ గాంచి య, క్కాలంబునను యథాక్రమము గాఁగఁ
దంత్రీలయయుతంబుఁ దాలాన్వితంబును, సంగీతమాధుర్యసంయుతంబు
సంస్కృతంబును సులక్షణసముపేతంబుఁ, ద్రిస్థానకరణసందీపితంబుఁ
బూర్వకృతంబునై పొలుపొందు శ్రీరామ, చరిత యథావృత్తసరణి మొదటి

ఆ. నుండి వినియె సర్వముర్వీశుఁ డది పీత, చేష్టుఁ డగుచుఁ గనులు చెమ్మగిల్ల
విగతసంజ్ఞుఁడగుచు వెఱను నిట్టూర్చుచు, వినియె నపుడుజరుగువిధము దోఁప.

చం. నరపతితోడ వచ్చినజనంబులు గీతము నాలకించి య
చ్చెరువడి దీనతం గనుచు శీర్షము లొయ్యన వ్రాల్చి వారిలోఁ
బరఁగునె యిట్టిచిత్ర ?మిది స్వప్నము, యెచ్చట నున్నవార, మే
కరణిని గంటిమో మునుపు కార్యము లయ్యవి యాశ్రమంబునన్ ౧౨౫౬

ఆ. వినఁగఁ గలిగె గానవిధముగ నేమి యీ, వింత యనుచు వారు విభునిఁ జేరి
యేమి యిది యటంచు ఋషివర్య నడుగుమీ, యనిన వారి కనియె నవనివిభుఁడు.

కం. ఇట్టివిచిత్రము లీముని, రాట్టాశ్రమమం దనెన్నొ ♦ క్రాలెడి నివి యి
ట్టట్టని మూలము నెఱుఁగం, బుట్టఁగఁ గౌతూహలంబు ♦ పోలదు చుండీ!

కం. అని చెప్పి మానివరునకు, వినయంబున మ్రొక్కి తనని ♦ వేశనమునకుఁ
జని రామగీతవిషయం, బునఁ జిత్తము నిలిచి పెక్కు ♦ పోకలఁ బోవన్. ౧౨౬౧

↞ శత్రుఘ్నుఁడు రాము దర్శింప నయోధ్య కేగుట. ↠

ఉ. నిద్దుర లేక శ్రవ్య మయి ♦ నిండుముదంబును గూర్చుతత్కథల్
ముద్దులమాటలన్ భువన ♦ మోహన మానునుఁ బాటలన్ వినన్
బ్రొద్దుదయింపఁ గల్యవిధి ♦ పుంజముఁ దీర్చి మునీంద్రు మ్రొక్కుచున్
మద్దయితున్ రఘూత్తముఁ గ ♦ నన్ మది యుబ్బట లూఁగె సంయమీ. ౧౨౬౨

కం. అనుమతి యిచ్చినఁ జనియెద, ననవుడు నెదఁ గ్రుచ్చి చను మ ♦ టన్న శతాంగం
బున వడి వడిఁ జనె రామునిఁ, గనుకౌతూహలము దానిఁ ♦ గడవం బౌఱన్.

సీ. చని యయోధ్యాపురం ♦ బును జొచ్చి శ్రీరాముఁ, డున్నెడ కేగి హే ♦ మోజ్జ్వలంపు
సింహాసనంబున ♦ శ్రీరాము మంత్రిమ, ధ్యస్థుని రాకామృ ♦ గాంకవదను
నమరమధ్యస్థుఁ డౌ ♦ హరిహయుఁబోలిన, వానిని దర్శించి ♦ వసుధ వ్రాలి
మ్రొక్కిడి కరములు ♦ మోడిచి మీయాజ్ఞ, లవణు వధించితి. ♦ బవరమునను

ఆ. బట్టనంబుఁ జక్కఁ ♦ బఱిచితి జనులు ని, వేశనములు గొనిరి ♦ ప్రీతిమతుల
నేండ్లు పదియు రెండు ♦ నేగె మిమ్ములఁ బాసి, యుండ నొల్లనందు ♦ నొంటి నింక.

↞ రామశత్రుఘ్నుల సంభాషణము. ↠

ఉ. తల్లిని బాయువత్సమువి ♦ ధంబున మి మ్మెడఁ బాసి యెన్నియో
నాళ్లట సంతపించుచు న ♦ నాథువలెన్ మనియుండ నేర, నీ
యుల్లమునం దలంపు దయ ♦ యుత్తమకారుణికాగ్రగణ్య! నాఁ
దల్లడ మందుతమ్ముఁ గని ♦ తద్దయుఁ బ్రీతి వచించె రాముఁడున్. ౧౨౬౫

చం. వగవకు మన్న యివ్విధపు ♦ వర్తన మర్హము గాదు క్షత్రియుం
డగుపురుషాగ్రగణ్యునకు ♦ నర్హము జేసికి క్షత్రధర్మమం
దొగి దృఢచిత్తుఁ డై ప్రజల ♦ నోపి భరించుట, కాన నిల్వఁగాఁ
దగ దిట నప్పుడప్పుడు య ♦ థామతి వచ్చుచుఁ బోవు చుండుమీ. ౧౨౬౬

ఉ. కూరిమి నాదుప్రాణముల ♦ కుం గడు నెక్కుడ వీ వయైననున్
ధారణిపాలనంబు విధి ♦ తప్ప దవశ్యముకార్య మాట చేఁ
గోరిక దీర నిందు మముఁ ♦ గూడి చరింపుమ యేడునాళ్లు లా
పై రథదంతివాజియుత ♦ వాహినితోఁ బురిఁ జేరఁ బోవుమీ. ౧౨౬౭

చం. అనఘుఁడు ధర్మయుక్త మగు ♦ నప్పలుకుల్ విని దీనుఁ డౌను నా
య్యన నటు లౌత మంచు నని ♦ యందు వసించెను సప్తరాత్రముల్
జనపతియాజ్ఞఁ గాంచి మఱి ♦ చయ్యన నన్నలు సాగనంపఁగాఁ
దనపురి కేగె నిట్లు పిన ♦ తమ్ముఁడు పోవఁగ రామభద్రుఁడున్. ౧౨౬౮

**బ్రాహ్మణుఁడు మృతబాలకుకళేబరమును రామునియింటివాకిట నైచి యేడ్చుట.**

చం. అనుజులతోడఁ గూడి సుఖ ♦ మార సధర్మవిధిం బ్రజావనం
బొనరుచు చుండ నొక్కయపు ♦ డొక్కద్విజుండు మృతాత్మజాతుతో
జనపదమందునుండి రఘు ♦ చంద్రమునిం గన వచ్చి ద్వారసీ
మను మృతబాలు నైచి పలు ♦ మార్గములన్ విలపించె నార్తుఁ డై. ౧౨౬౯

కం. కొడుకా! కొడుకా! యనుచును, గడుపుపయిన్ బాదుకొనుచుఁ ♦ గను నీరంబుల్
జడిగొన నేడ్చుచు నిట్లనుఁ, జెడుపాపం బేమి మున్ను ♦ చేసితి నొక్కో. ౧౨౭౦

కం. కాకున్నఁ బుత్రుఁ డొక్కఁడ, యీకరణిని మరణ మొందు ♦ నే ప్రాయమునన్?
నాలుగుపదివర్షంబుల, కాలంబునఁ జచ్చె న్నాదు ♦ కర్మముబలిమిన్. ౧౨౭౧

ఉ. నాయన! నిన్నుఁ బాసియు మ ♦ నం గలమా? యిఁక నల్పకాలమం
దే యముఁ గాంతు మయ్య! జన ♦ యిత్రియు నేను, నిఁకేల యయ్యెనో?
యేయెడఁ గల్లలం దలఁచి ♦ యేని వచించియ యే నెఱుంగ, నే
నేయెడ నెట్టిప్రాణికిని ♦ హింస స్మరింపను నిక్కవంబుగన్. ౧౨౭౨

కం. ఏపాపముచే నీమా, పాపఁడు మాయిర్వురకును ♦ బైతృకవిధిఁ దా
నోపి యొనర్పకమున్నే, యీపగిదిం జనియె దండ ♦ భృన్నగరంబున్. ౧౨౭౩

చం. కనినది లేదు మున్ను వినఁ ♦ గానము రామునిరాజ్యమందుమా
ర్కొని యిటువంటిఘోర మగు ♦ కీడు నకాలమునందుఁ జావు, రా
మునిమహితాఘ మిట్లు మము ♦ ముంచెడి, నేదియొ ఘోరపాప మీ
జనపతి సల్పె, నయ్యదియ ♦ చంపెను నాదుతనూజు బాలకున్. ౧౨౭౪

కం. బాలురమృతి వినఁబడదు నృపాలా! నీరాజ్యమందు ♦ నవలె నితరనృపుల్
పాలించెడివిషయంబుల, బాలకునిన్ నీవ యిపుడు ♦ బ్రదికింపవమా!. ౧౨౭౫

కం. బ్రతికింప వేనియును భూపతి! రాజద్వారమందుఁ ♦ బత్నియు నేనున్
మృతిఁ గందు మనాథులవలె, క్షితిసురహత్యాప్తి నీవు ♦ చెలఁగుము సుఖి వై.

ఉ. దీనన నీవు తమ్ములును ♦ దీర్ఘతరాయువుఁ గాంచి భోగముల్
మానక యుండుఁడీ! మునుపు ♦ మానవనాయక దుఃఖ మెట్టిదో

కానక నీదు నేలుబడిఁ ♦ గామితముల్ గొనసాగ నుంటి, మి
ప్డినెటి దుస్సహార్తి లభి♦యించె సుతుండు మృతుండు గావుటన్. ౧౨౭౭

కం. బాలురను జంపుభూమీ,పాలుం డిటు దాపరింపఁ ♦ బ్రజ లిఁక నైక్ష్వా
కేలామండలి దెస చెడి, వాలాయముఁ జచ్చువారు ♦ పతిపాపములన్. ౧౨౭౮

కం. రాజు లొనర్చినదోషము, భూజనములఁ బెక్కుగతులఁ ♦ బొలియించుఁ జుమీ
రాజు లసద్వృత్తులుగా, భూజనులు నకాలమృత్యు♦వును గందురు గదా? ౧౨౭౯

కం. జనపదములఁ బట్టనముల, ననుచితముల భూమినాథుఁ ♦ డణఁపఁడ యేనిన్
జనముల నకాలమరణము, గన నయ్యెడి సందియంబు ♦ గలుగదు దీనన్. ౧౨౮౦

కం. రామా! నీవే చేసితి, వేమో పాపంబు గాన ♦ నీబాలుఁడు దా
నేమియు నెఱుఁగనివాఁ డ,య్యో! మరణముఁ గాంచె ననుచు ♦ నుర్వీశునకున్.

తే. అడ్డముఁగఁ బోవుచును బాలు ♦ నగపఱుచుచుఁ
గడుపుదుఃఖంబునను గడుఁ♦గ్రాఁగు చున్న
నాతనిం గని రాముఁ డ♦త్యంతదుఃఖ
తప్తుఁ డై భ్రాతృయుక్తుఁ డై ♦ ధరణిసురుల ౧౨౮౨

నారదుఁడు రామునకు బాలకుండు మృతుం డైనకారణముఁ దెలుపుట.

ఉ. పౌరుల మంత్రులం బిలువఁ ♦ బంప వసిష్ఠుఁడు వామదేవుఁడున్
ధారుణిదేవతాష్టకము ♦ తప్పక వే యరుదెంచి దీవనల్
గూరిచి భూమిభర్తకును ♦ గొల్వున యోగ్యపుటాసనంబులం
జేర రఘూత్తముండు నతి ♦ చేసి కరంబులు మోడ్చి భక్తిమై. ౧౨౮౩

సీ. కాత్యాయనాఖ్య మా♦ర్కండేయ మౌద్గల్య,గౌతమ జాబాలి ♦ కాశ్యపులను
వామదేవాఖ్య దే♦వమునినారదు మంత్రి, పౌరులఁ గనుఁగొని ♦ బ్రాహ్మణుండు
వాకిటికడ్డంబు ♦ పండిన విధ మెల్లఁ, బలికి యేటికి నిట్లు ♦ దెలుపుఁ డనినఁ
బార్థివవరు దీన♦భాషణమ్ముల విని, మునులసమక్షంబు♦నను వచించె

ఆ. నారదుండు రాజ! ♦ కారణంబు వచింతు, బాలుఁ డిట్లు మరణ♦బాధఁ జెంద
నాలకించి దాని ♦ కర్హప్రతిక్రియ, నాచరింపఁ దలఁపు ♦ మాత్మలోన. ౧౨౮౪

సీ. పూర్వంబు కృతయుగం♦బున బ్రాహ్మణులు మాత్ర, మధిప! తపంబుల ♦ నాచరింత్రు
బ్రాహ్మణేతరుఁడు త♦పస్వి యెందును లేఁడు, బ్రహ్మభూతం బయి ♦ ప్రజ్వలించి
యజ్ఞానరహిత మై ♦ యయ్యుగంబు రహింప, జనులెల్ల దీర్ఘద♦ర్శను లమృత్యు
వులు నయి యుండిరి ♦ భూమీశ! పదపడి, త్రేతాయుగంబు దోఁ♦తెంచుటయును

తే. మానవాళివపుష్మంత ♦ మైనకతన[1], క్షత్రియులు తప మొనరింపఁ ♦ గడఁగి మున్ను
కంటె వీర్యంబునను దపః♦కలన మిన్న, యైరి పూర్వులకును[2] నక్కు♦వైరి రామ!

[1] మాన...కతన = మనువంశపురాజులు దేహబలముగలవారగుటచేత. [2] క్షత్రియులు తపస్సునఁ గృతయుగమువారల మించఁజాలరైరి.

ఉ. త్రేత మహాత్ము లౌ వసుమ♦తీజనవర్యులకంటె మున్ను వా
రాతతవీర్యవంతులుఁ ద♦పోధికులుం[1]; సమవీర్యయుక్తులై
త్రేతను క్షత్రియుల్ ద్విజులు ♦ తేజునఁ గ్రాలిరి, వారిలోన వి
ఖ్యాతిగ నెచ్చులొచ్చుల మ♦హాత్మ! వచింప నశక్య మయ్యెడిన్. ౧౨౮౬

ఉ. అప్పుడు నాల్గు వర్ణముల ♦ కారసుసమ్మత మైనపద్ధతుల్
చెప్పిరి నిల్పి రప్పటివి♦శిష్టు, లధర్మము పాద మొందు దా
నుప్పతిలెన్ ద్వితీయయుగ ♦ ముద్భవమౌట ధరిత్రియందు[2], నా
ముప్పునఁ దేజుఁ గోల్పడిరి ♦ మోహమతుల్ జను లెల్లవారలున్. ౧౨౮౭

కం. కృతమున బ్రహ్మజ్ఞానం, బతివేలం బగుట మహిమ ♦ మతిశయ మగుటన్
మతి విమలజ్ఞానైక స,హిత మగుటను ననృత[3] మూన ♦ రెండును లోకుల్. ౧౨౮౮

కం. కృతయుగజనము లమేధ్యము,గతిఁ జూచెడి రాజసంపుఁ♦గర్షకవృత్తిన్
బ్రతుకున కై త్రేతాజన,తతి గైకొనె మహిను మన స్వ♦తంత్రత లేమిన్. ౧౨౮౯

సీ. అనృతంబుతో ధర్మ♦హానియు జనియించె, నద్దాన దీర్ఘాయు ♦ వణఁగఁ దొడఁగె
నాయువు దఱుఁగుట ♦ నడలి శుభంబులు, సత్యధర్మాసక్తిఁ ♦ జలుపుచుండ్రు
త్రేతాయుగంబున ♦ ద్విజులును క్షత్రియుల్, తప మాచరింపఁగఁ♦దక్కువారు
పరిచర్య సలుపుచుఁ ♦ బరిఢవిల్లిరి యందు, శూద్రులకెల్ల శు♦శ్రూష పరమ
తే. ధర్మ మయ్యెను బదపడి ♦ ద్వాపరంబు, దాపరింప ద్వితీయపా♦దం బధర్మ
ముద్భవిల్లెను దాన న♦భ్యుదయ మొందె, ననృతంబు నధర్మంబు ♦ నవనియందు.

కం. ఎక్కువ కృషికష్టముగాఁ, దక్కువఫల మయ్యె నందుఁ ♦ దప మొనరింపన్
మక్కువ గొందురు వైశ్యులు, తక్కువ మే మెట్టు లనెడి♦తాత్పర్యమునన్. ౧౨౯౧

తే. మూఁడుయుగములయం దిట్లు ♦ మూఁడువర్ణ
ములజనంబులు తపమును ♦ జలుపఁగలుగు
శూద్రుఁ డిమ్మూఁడు యుగముల ♦ శుభచరిత్ర!
తపముఁ జలుపంగఁ దగఁడు త♦థ్యంబు రామ! ౧౨౯౨

చం. కలియుగవేళ శూద్రులు ప్ర♦కాశముగాఁ దప ముండువారు, త
త్కలుషపువర్తనంబు నృప! ♦ ద్వాపరమందె ఘటిల్లె నేనియున్
బలుకఁగ నేల ఘోర మని ♦ పార్థివ! నాలవజాతివాఁ డొకం
డిలఁ దపమున్నహాఁ డదియ ♦ యిట్టియకాలపుఁజావుఁ గూర్చెడిన్. ౧౨౯౩

ఉ. బాలిశుఁ డెవ్వఁడో యిటు భ♦వద్విషయంబున నుంటఁ జేసి నీ
బాలకుఁ డీల్గె, రాష్ట్రమునఁ ♦ బట్టిన మం దెవఁ డే నలక్ష్మికిన్

---

[1] పూర్ణ బ్రహ్మజ్ఞానవంతులగుటచేత. [2] త్రేతయందు క్షత్రియులు దేహపుష్టి దేహాసక్తిగలవారై బ్రాహ్మణులతో నేమి పనియని స్వతంత్రించి తపస్సుచేయుటచే బ్రహ్మజ్ఞానము కొంతతపడియెను. వారి సహాయముకోరు బ్రాహ్మణులు నట్టివారే యైరి. కాన నధర్మ మొక పాదము ప్రవేశించెను. ఇఁకఁ దక్కిన యుగములందు నిట్లే క్రమముగ బ్రహ్మజ్ఞాన హీనులైరి. [3] అనృతము = సేద్యము.

మూలముఁ బాపముం జలుప ♦ మూఢత శిక్ష యొనర్ప లేనిభూ
పాలుఁ డధోగతిం బడెడి ♦ వారిజమిత్రకులావతంసమా! ౧౨౯౪

కం. తపమున నధ్యయనంబున, విపులేశ్వర? సుకృతకర్మ♦వితతులలోఁ దా
నెపుడాఱవభాగముఁ గొను,నృపునకు ధర్మమునఁ బ్రజల ♦ నేలమి తగునే. ౧౨౯౫

ఉ. కావున నీదురాష్ట్రమునఁ ♦ గావలుఁ డెవ్వఁ డధర్మశీలముర్
భావన చేసెనో నెమకి ♦ భవ్యవిధిం బ్రతి యాచరింపుమీ
భూవరుఁ డెప్డు ధర్మమును ♦ బ్రో పొనరింపఁగ వృద్ధిఁ గూరెడిన్
జీవిత మెల్ల వారికిని ♦ జీవితుఁ డయ్యెడు బాలకుం డనన్. ౧౨౯౬

రాముఁడు పుష్పకంబుపై నెక్కి శూద్రమునిని వెదక నేగుట.

చం. అమృతముతోడఁ దుల్య మగు♦నమ్మునివాక్యము లాలకించి హా
ర్షమున సుమిత్రపట్టిఁ గని ♦ బ్రాహ్మణు సువ్రతు నూఱడింపు శీ
ఘ్రమునఁ గుమారు దేహమును ♦ గమ్మనినూనెలకాఁగులోన నుం
పుము చెడిపోక యుండఁ దను♦వుం దనుసంధులు ఫ్రీల కుండఁగన్. ౧౨౯౭

చం. అని నియమించి పుష్పకము ♦ నాత్మఁ దలంపఁగ నద్ది వచ్చి యే
పని గలదో మహాత్మ యనఁ ♦ బార్థివవర్యుఁడు మౌనికోటికిన్
వినతు లొనర్చి తమ్ములను ♦ నిల్పి పురిన్ శరచాపధారి యై
చనియెఁ బ్రతీచిగా నచట ♦ సర్వము రోసి యుదఙ్ముఖంబుగన్ ౧౨౯౮

చం. అరిగి హిమావనీధరము♦నందలినేలలు చూచి శక్రది
గ్ధరణిని బుష్పకస్థుఁ డయి ♦ క్రన్నన రోసి యఘంబుఁ గాన కా
ధరణివిభుండు దక్షిణపుఁ♦దావులు చూడఁగ శైవలంబు నాఁ
బరఁగుమలన్ సరోవరము♦ప్రాంతమునందు నధశ్శిరస్కుఁ డై ౧౨౯౯

కం. వ్రేలుచు నుత్తమతపమున్, వాలాయముఁ జలుపు నొకనిఁ ♦ బరికించి ధరా
పాలుఁడు చేరం జని యో,శీలీ! ధన్యుండ వీవు ♦ చెపు మెవ్వఁడవో? ౧౩౦౦

కం. జాతి యెది నీకు సువ్రత! కౌతూహలమునను బ్రశ్న ♦ గావించెద ధా
త్రీతలనాథుఁడ దశరథ,సూతిని రాముఁడను నన్నుఁ ♦ జూడు తపస్వీ? ౧౩౦౧

ఉ. ఏమి ప్రయోజనంబు మది ♦ నెంచితి వీవు? దివంబుఁ బొందఁగా
నో? మఱి యొండొ? యింతటిమ♦హోగ్రతపం బొనరింప నేలొకో?
భూమిసురుండవో? నృపతి♦వో? మఱి వైశ్యుఁడవో? జఘన్యజుం
డో? మహితాత్మ నిక్కముగ ♦ నున్నది యున్నటులే వచింపుమీ. ౧౩౦౨

### రాముఁడు శంబుకుని వధించుట.

సీ. అనవుఁడు నాతండు ♦ నవనతవదనుఁడై, రామచంద్రున కను ♦ రాజచంద్ర!
శూద్రయోనిని నేఁ బ్ర♦సూతిఁ గాంచితి నయ్య, శంబుకుం డను పేరఁ ♦ జనెడివాఁడఁ
దేహంబుతోడనే ♦ దేవత్వ మొందెడి,వాంఛను దపమున ♦ వఱలు వాఁడ
స్వర్గలోకజిగీష ♦ వర్తిల్లువాఁడను, గల్ల లాడెడివాఁడఁ ♦ గాను దేవ!
తే. శూద్రుఁడను నేను శ్రీరామ♦భద్ర! తపము
సలుపు చున్నాఁడ నన రామ♦చంద్రుఁ డపుడ
ఖడ్గ మొఱఁ దూసి యాతని♦కంఠతలముఁ
దెగఁగ నఱకెను దేవతల్ ♦ పొగడుచుండ. ౧౩౦౩

ఉ. కమ్మనిపూలవాన రఘు♦కాంతునిపైఁ గురియంగ దిగ్విశా
లమ్ముల మందమారుతుఁడు ♦ నవ్యసుగంధవహుండు వీచె మో
దమ్మున నగ్నియుక్తవిబు♦ధవ్రజముల్ దివిజేంద్రుఁ గూడి య
భ్రమ్మున నిల్చి యి ట్లనియె ♦ రామవిభుం గరుణాపరాయణున్.[1] ౧౩౦౪

కం. సురకార్యముఁ దీర్చితి భూ,వరచంద్రా! లెస్స నీకు ♦ వర మొసఁగంగా
నరుదెంచితి మీశూద్రుఁడు, సురపురికిం జనఁడు నీవు ♦ సూదితుఁ జేయన్.

చం. అనుసురనాథు మ్రొక్కి వసు♦ధాధిపుఁ డిట్లను నాయెడన్ సురల్
మనమున సంతసించినను ♦ మర్త్యులుపాహతు విప్రబాలకున్
మనఁగ నొగర్పఁడీ మరల ♦ మాట యొసంగితి నీతనూభవున్
మనగడ గూర్తు నంచు సభ♦మధ్యమునందు ద్విజాతి నేతకున్. ౧౩౦౬

కం. నానుడి యసత్యదోషముఁ, గానక యుండఁగను జలుపఁ♦గాఁ దగు ననినన్
మానుము వెత ద్విజబాలుఁడు, ప్రాణంబులఁ గాంచి మరల ♦ బంధులఁ గలసెన్.

కం. ఏనిమిషంబున శూద్రుని, నీనిశితతరాసిధార ♦ నీల్గించితివో
యానిముసంబున బాలుఁడు, ప్రాణంబులఁ గాంచి సుఖిత♦వఱలెడుఁ జుమ్మీ. ౧౩౦౭

### రాముఁ డగస్త్యుఁ జూడఁ బోవుట.

సీ. అదిపోవ నిమ్ము మే ♦ మరిగెద మిప్పుడు, కలశీతనూభవుఁ ♦ గాంచుతమిని
బదిరెండువర్షముల్ ♦ పన్నుండెఁ జలముల, దీక్షయు ముగిసె నా♦దేవనిభుని
నభినందితునిఁ జేయ ♦ నర్హంబు వచ్చె దే, మాతోఁ దదాశ్రమ♦మహికి నతని
దర్శింపుమీ నీకుఁ ♦ దవులు శుభంబులు, మానిచేతోబ్జబం♦భర యనంగ
ఆ. నగుత మంచుఁ బుష్ప♦కారూఢుఁడై వ్యోమ, యానగతను దేవ♦తాళితోడ
మునితపోవనంబుఁ ♦ గన నాతఁడును వారి, నర్చ ముదముఁ గూర్చె ♦ నరభంగ.

[1] శాస్త్రవిహితకర్మములఁ జేసినవానికి స్వర్గప్రాప్తి. శంబుకుఁ డధికారములేనికర్మ మవిధిఁ జేసెను. ఇట్టివాఁడు స్వర్గార్హుఁడు కాఁడు. శ్రీరాములచేఁ జచ్చుటను మరణకాలమున భగవద్దర్శనప్రాప్తివలనను వానికి మోక్షము ఫలము. మోక్షమున కెవ్వఁడైన నధికారియే.

ఉ. అంతట దేవతల్ చనిరి ♦ నాకముఁ జేరఁగ, రామధారిణీ
కాంతుఁడు పుష్పకంబు డిగి ♦ కంజభవాభు మునీంద్రు, మొక్కినన్
స్వాంతము పొంగ మౌనియును ♦ స్వాగతముక్ వచియించి భూమిపా!
యెంతయు మోద మయ్యె దయ ♦ నీ విటు రాఁ బరమాదరంబునన్. ౧౩౦౦

సీ. నాకుఁ బూజ్యుండ వ♦నంతకల్యాణగు,ణాఢ్యుఁడవును గొప్ప♦యతిథి వీవు
నామానసమున న♦నారతంబును రామ, నిల్చియున్నాఁడవు ♦ నీవు దేవ
వింటి నిర్జరులచే ♦ విప్రబాలునకయి, శూద్రమౌనిని నీవు ♦ స్రుక్కఁ జేత
యీరేయి నిలు మిందు ♦ నెల్లి వేకువఁ బుష్ప,కంబునఁ జనెదవు పు♦రంబునకును

తే. నాదిలక్ష్మీశుఁ డైననా♦రాయణుఁడవు, నిలుచు నీయందు సర్వంబు ♦ నీవ ప్రభువు
భూతములకెల్ల నీవె స♦నాతనంపుఁ,బురుషుఁడవు రామభూపాల! ♦ పుణ్యశీల!

⟵ అగస్త్యుఁడు శ్రీరామునకు దివ్యాభరణ మొసఁగఁ బోవుట. ⟶

సీ. ఈభూషణోత్తమం ♦ బీవు గ్రహింపుము, దివ్యంబు నిజదివ్య♦తేజమునను
దివ్యదేహంబున ♦ దీప్యమానం బిది,నీవు గైకొన నాకు ♦ నెమ్మి మీఱు
విశ్వకర్మకృతంబు ♦ వే ఱె వ్వరును దీనిఁ, దాల్ప శక్తులుగారు ♦ ధరణియందు
శక్రసమన్విత♦సర్వసురవర్యుల, నీవ సంరక్షింప♦నేర్తు వట్లు

ఆ. గాన నొసఁగువాఁడఁ ♦ గాకుత్స్థ నీకిది, శాస్త్రవిహితరీతి ♦ సమ్మతింపు
తనకు దత్త మైన♦దాని నుత్తమపదా,ర్థంబుదాన మొసఁగఁ ♦ దతఫలంబు. ౧౩౦౨

కం.అనవుడు క్షత్రియధర్మం,బును లోస్సరించి రామ♦భూవరుఁ డనియెన్
మునినాథ! బ్రాహ్మణున కీ,విని గొనఁదగు క్షత్త్రియునకు ♦ విహితం బగునే.౧౩౦౩

కం.భూమీపతి నే నయ్యును, భూమీసురుచేత దాన♦మును గొనఁ దగునే?
యేమి సమాధానం బన, రామునితో నిట్లు మౌని♦రాజు వచించెన్. ౧౩౦౪

⟵ { దివ్యాభరణముఁ గొనవచ్చు నని యగస్త్యుఁడు శ్రీరాము సమాధానపఱుచుట. } ⟶

సీ. కృతయుగంబునఁ దొల్త ♦ క్షితిపతి లేకయే, జనము గ్రాలఁగఁ బాక♦శాసనుండు
సురలకు రా జయి ♦ శోభిల్లు చుండఁగ, నమరులపోలికఁ ♦ దమకు నొక్క
రా జుండఁ దగు నని ♦ బ్రహ్మకుఁ దపముండి, దేవతలకుఁబోలె ♦ దేవ మాకు
రాజు నొసంగుము ♦ రక్షణార్థంబుగాఁ, బ్రజలు పాపంబుల♦పాలఁ బడక

తే. యుండువా రనఁ దామర♦సోద్భవుండు, లోకపాలురతోడ మీ♦లో నొకొక్క
యంశ మొసఁగుఁడు దాన ధ♦రాధినాథు, సృష్టిచేసెద నన వారు ♦ నిచ్చి రట్ల.

చం.క్షుప మొనరింపఁ దామరస♦సూతి జనించె క్షుపుం డనంగ నొ
క్కపురుషుఁ, డాతనిన్ నలువ ♦ క్ష్మాపతిఁ జేసి మహేంద్రునంశముక్

విపులఁ దదాజ్ఞ చెల్లఁగను ♦ నీరపునంశము మేను బ్రోవఁగా
విపులధనం బొసంగఁగఁ గు♦బేరుని యంశము, లోకశాస్తికిన్[1] ౧౩౧౬

కం.దండధరునంశ మొసఁగెను, దండితఖలసంఘు నన్నుఁ ♦ దరియింపింపన్
మండన మిది గైకొను మా,ఖండలు భాగమున లేదు ♦ కల్మష మనఘా! ౧౩౧౭

తే. పరమధార్మికుఁ డగుమహా♦భావువాక్య,మునను దానిని గైకొని ♦ మునిని గాంచి
యద్భుతం బగునిట్టిది♦వ్యాభరణము, భద్రచారిత్ర మీ కెట్టు ♦ ప్రాప్త మయ్యె.

కం.అచ్చెరువులగను లగు మీ,రచ్చరితముఁ జెప్పఁ డనిన ♦ నమ్ముని యనియెన్
సచ్చరితా! నాకడ కది, వచ్చినవిధ మెల్ల సొరిది ♦ వాక్రుత్తు వినన్. ౧౩౧౯

## ←→ శ్వేతోపాఖ్యానము. ←→

సీ. మున్ను త్రేతాయుగ♦మున యోజనశతంబు, మృగపక్షివర్జిత ♦ మగుచు నొక్క
నిర్జనాటవి యుండ ♦ నే నందు నిలువఁగఁ, దలఁచి యేగితి నది ♦ ఫలవితాన
మూలసుమాదుల ♦ మోహన మై యుండె, నాకాననడుమఁ ద♦టాక మొండు
చక్రవాకములచేఁ ♦ జక్రాంగములచేతఁ, గారండవములచేఁ ♦ గన్ను మగుచుఁ

తే. బూర్ణముగఁ బద్మకైరవా♦కీర్ణ మగుచు, శైవలాన్విత మయి మహా♦శ్చర్యకరము
సౌఖ్యకర మయి యుండెఁ ద♦త్సవిధభూమి,జనవివర్జిత మైనయా♦శ్రమ మొకండు

ఉ. చూచితిఁ, దన్నిదాఘునిశ ♦ సుప్తుఁడ నై యట వేగఁ గొల్నికై
వే చని యాజలంబుపయిఁ ♦ బీనుఁగునొండు సుపుష్టమున్ వయ
శ్శ్రీచతురంబుఁ గాంచితి న♦జీర్ణముఁ బంక్తి విభేదబుద్ధిచేఁ
బ్రోచినదాని దానిఁ గని ♦ బుద్ధిని నేమియుఁ దోఁప కయ్యెడన్. ౧౩౨౧

కం.ఎవ్వరి దీతను వని నే, నివ్విధిఁ దలపోయుచుండ ♦ నీలో వేల్పుం
గ్రొవ్విరిఁబోఁడులు గొలువఁగ, మవ్వం బగుమేనివాఁడు ♦ మణిభూషలతోన్

ఉ. రాజిలువాఁ డొకండు సుర♦రాజసమానుఁడు దేవకామినీ
రాజులు వీవఁ జామరలు ♦ రమ్యవిమానమునందుఁ గంటి నీ
రేజదళాక్షు హాటకగి♦రిన్ డిగు సూర్యునిఁబోలి స్వీయ మా
తేజము ముంప దిక్కులను ♦ దిగ్గి విమానముఁ గొల్నియొద్దనన్. ౧౩౨౩

చం.బలిసినపీనుఁగుం దినియె ♦ వాఁచినయట్టులు పొట్టనిండ న
వ్వల సరసీజలంబులను ♦ స్వర్గనివాసకుఁ డాచమించి పోఁ
దలఁచిన వ్యోమయానమును ♦ దాసిన నాతనిఁ గాంచి యంటి స్వ
ర్నిలయుఁడ! చెప్పు మెవ్వఁడవు ♦ నీ కిటు లేవపుఁదిండి యేటికిన్. ౧౩౨౪

ఉ. ఏటికిఁ బీనుఁగుం దినెద ♦ వియ్యది యర్హమె చెప్ప వయ్య స్వ
ర్వాటి వసించువారలకు ♦ భావ్యము గా దని తోఁచె నన్నవా

[1] ఇది రాజుగా గ్రహించిన దానముగాదు. భగవద్భావంబున దాతలఁ దరింపఁజేయ నంగీకృతము.

మాటల నాలకించి సుర♦మండలవర్తి నమస్కరించి యి
ప్పాట వచించె మౌనివర ♦ పల్కెద విను మదీయవృత్తమున్. ౧౩౨౬

## శ్వేతుఁడు తనవృత్తాంత మగస్త్యుతోఁ దెల్పుట.

సీ. నే ననతిక్రమ♦ణీయ మౌ నాదరవస్థ నే మని చెప్ప♦వాఁడ నయ్య
మున్ను మజ్జనకుండు ♦ సన్నుతశీలుండు, వైదర్భుఁడు సుదేవ♦భూదయితుఁడు
ఇద్దరుసుతు లందు♦నిర్వురఁ గాంచెను,సుతుల నన్ శ్వేతుని ♦ సురథుఁ బిదపఁ
బెక్కువేలేండ్లు నేఁ♦బృథివిఁ బాలించియు, నాయువస్థిర మని♦ యాత్మ నెఱిఁగి
ఆ. యనుజు రాజుఁ జేసి ♦ యరుదెంచి యీయరణ్యమున కీసరస్సు♦ప్రాంతమంద
మూఁడువేలయేండ్లు ♦ మునివరా! తపముంటిఁ, దుదకు బ్రహ్మలోక♦పదముఁ గంటి.

కం. అక్కడ నాఁకలిదప్పులు, మిక్కిలి బాధింప నన్ను ♦ మిడుకుచు నజునిన్
మ్రొక్కి వచించితి నాగతి, నిక్కరణి సరోజగర్భ ♦ యెందుం గలదే? ౧౩౨౭

ఆ. బ్రహ్మలోకమంట ♦ భగవంతుఁడా! యుంట, యాఁకలియును దప్పి ♦ యలుగవంట
గడుసుఁబాప మేది ♦ పడియెనో నావెంటఁ, గడుపు మంట యెట్లు♦గడపు చుంట?

చం. అనవుడు బ్రహ్మ యిట్టులనె ♦ నాత్మశరీరముమాంస మెప్పుడున్
దిని క్షుధ నార్చుకొమ్మిఁక సు♦దేవతనూభవ! యేల యంటివా
తనువును జక్కఁ బ్రోచితివి ♦ దాన మెఱుంగ వదెట్టిదో నృపా
విను మిల విత్తు నాటక యె ♦ వృక్షము గల్గునె ధీరసత్తమా! ౧౩౨౯

చం. తపమును లెస్స చేసితివి ♦ తన్నిసనం దిని మేను ప్రోచి తీ
వెపుడొకకొంచెమేన్ బరుల ♦ కిచ్చిన దెయ్యది లేదు, దానిచే
నృపవర స్వర్గముం గనియు ♦ నిష్ఠుర మాక్షుధచేత దప్పిచేఁ
గృపణత బాధ నొందెదవు ♦ రిత్తగఁ బోవునె కర్మమేదియున్. ౧౩౩౦

ఉ. కావున నిన్ను నీవ తిని ♦ కాంచుము తృప్తి, నగస్త్యమౌనిరా
జావనిఁ జేర వచ్చు దళి♦తాఘునిఁ జేయు నినున్ నృపాల! దే
వావళి నైన నాయనఘుఁ ♦ డాదటఁ బ్రోవ సమర్థుఁ డట్టిచోఁ
బ్రోవఁగఁ జాలు నిన్ననుచుఁ ♦ బూని వచింపఁగ నేల నావుడున్. ౧౩౩౧

కం. నీరేజభవుని నుడి నా,హారముఁ జేసితి మునీంద్ర ♦ యాత్మశరీరం
బీరీతిఁ బెక్కువర్షము, లారఁగఁ జనెఁ గుణపమే మె ♦ యఱుగదు కొంతేన్.

కం. ఆపోక నాకు దీనన, చేపడియెడి నన్నుఁ గావు ♦ చెచ్చెర మౌనీ
యీపాప మణఁపఁ గదవే, యోపావనశీల తాప♦సోత్తమ ఘటజా. ౧౩౩౩

కం. కలశీసూనుఁడు తక్కఁగఁ, దలమే యన్యులకు నిందుఁ ♦ దలఁ జూపఁగ నీ
లలితాభరణముఁ గొని న,న్నలఘుమతి తరింపఁ జేయు ♦ మా నీమహిమన్. ౧౩౩౪

చం. కరుణ దలంప వయ్య ననుఁ ♦ గావఁ గదయ్య యటన్న శ్వేతభూ
వరువ్యసనోక్తులన్ విని ద్ర♦వన్మతి భూషణ మేను గొంటి, నా
భరణము నేను గొన్నపిద♦పన్ నృపుతొల్లిటిమర్త్యకాయమా
సరసిని నాశమొందెఁ గడు♦సంతస మందెను నాకవాసియున్. ౧౩౩౫

కం. ఆరా జొసంగినది యిది, తారాధిపవదన నేను ♦ దరియింపంగాఁ
గోరి యొసంగితి నీకున్, గారామునఁ గొమ్ము లేదు ♦ కలుషభయంబున్. ౧౩౩౬

దండకారణ్యచరిత్ర మగస్త్యుఁడు రామునకుఁ దెలుపుట.

సీ. అనుడు నత్యద్భుత ♦ మైనవాక్కుల విని, గౌరవవిస్మయ♦కారణముల
రామచంద్రుం డిట్లు ♦ ప్రశ్నించె మౌనీంద్ర! శ్వేతు నరణ్యంబు ♦ వీతజీవి
యగుట యెట్లొకొనిర్జ♦నారణ్యమునను వై, దర్భుండు తప మూనఁ♦దలఁచు టెట్లొ
వినిపింపు మనవుడు ♦ ముని వల్కె మును కృత,యుగమున మను వేలె ♦ నుర్వి నెల్ల
తే. నతనిపుత్రకుఁ డిక్ష్వాకుఁ ♦ డమితశౌర్యుఁ
డతని రాజుగ నొనరించి ♦ యవని రాజ
వంశకర్తవు గ మ్మని ♦ పలుక నట్ల
కాక యంచు వచించె ని♦క్ష్వాకువిభుఁడు. ౧౩౩౭

చం. మనువును సంతసిల్లి గుణ♦మండన నిక్కము నీవ కర్త వీ
జనముల దండపద్ధతిని ♦ జక్కఁగ రక్ష యొనర్పు మెవ్వనిం
గినియకు నిర్నిమిత్తముగఁ ♦ గీడరి దండితుఁ జేయ వేఁడు వా
నిని నదియే దినంబునను ♦ నిల్పుఁ జుమీ సుఖహేతుభూత మై. ౧౩౩౮

చం. అని హితముల్ వచించి యజు♦నాలయ మేగ నతండు పిమ్మటన్
జనకునిమాటఁబట్టి బహు♦సత్క్రతులన్ ఘటియించి నూర్వురన్
దనయుల దేవసన్నిభుల ♦ ధర్మరతాత్ముఁడు గాంచె వారిలో
జనవర పిన్నవాఁడు కడు♦జ్ఞానవిహీనుఁడు నీతిశూన్యుఁడున్. ౧౩౩౯

చం. చదువరి గాక పూర్వజుల ♦ సమ్మతిఁ గొల్వక తెల్వి లేక దు
ర్మదుఁ డయి సంచరింపఁ గని ♦ మానవపాలుఁడు దండ మెందుఁ ద
ప్పద యని యెంచి దండుఁ డని ♦ వానికిఁ బే రిడి ఘోరభూమి యె
య్యది యని వింధ్యశైవలన♦గాంతరరాజ్యము నిచ్చె నేలఁగన్. ౧౩౪౦

ఉ. చారుతరాద్రిరోధమున ♦ స్థాపతి యై మధుమంత మన్పురిన్
హారివిలాసయుక్తముగ ♦ నందు వినిర్మితిఁ జేసి శుక్రునిన్

గారవమార వేఁడుకొని ♦ కాంచి పురోహితుఁ గాఁగ స్వర్గముల్
వారితవృత్రుఁ డేలుగతిఁ ♦ దాను బ్రహృష్టజనావమర్దమున్ ౧౩౪౧

## దండుఁడు శుక్రుకూఁతు నరజను జెఱుచుట.

ఉ. ఆవిషయంబు పెక్కు లగు♦హాయనముల్ నిహతారి యేలుచో
భూవరుఁ డొక్కచైత్రమునఁ ♦ బో ల్భృగుభార్గవునాశ్రమంబు దు
ర్భావుఁడు చొచ్చి యందు వన♦భాగమునం జరియింప దేవతా
భావినిఁబోలుసుందరిని ♦ భార్గవుకన్యకఁ గాంచి మోహి యై. ౧౩౪౨

కం.పువ్విలుతుబారిఁ బడి యా, క్రొవ్విరిఁబోణిని వచించుఁ ♦ గుంజరగమనా!
యెవ్వతెవు నీ వి శేలా, యివ్వనిఁ గ్రుమ్మరెదు చెప్పు♦మీ ని న్గనినన్ ౧౩౪౩

కం.వలరా జేఁచెడి ననఁగాఁ, గలికి యతని మోహమత్తుఁ♦గా నెఱిఁగి యనెన్
దలఁపుము శుక్రునికూఁతుఁగ, నలఘుమతీ! పేర నరజ ♦ నంటకు నన్నున్. ౧౩౪౪

తే. తండ్రివశమున నుండెడు♦దాన నేను, గన్యకను నీదుగురు వెకా ♦ కవియు? నతఁడు
కోపగించిన భువనముల్♦ గూపుమాయు, నీ వనఁగ నెంత? చెడియెదు♦నిక్కమధిప!

ఉ. నన్ను వరింపఁ గోరినను ♦ నాజనకున్ నయమార వేఁడుమీ
మన్ననతోడ నాతఁ డను♦మానము లేక యొసంగు నీకుఁ బో
మ్మన్నను హస్తముల్ శిరము♦నందుఁ గదించి భవన్నిమిత్త మై
కన్నెరొ ప్రాణము ల్చనెడిఁ ♦ గాలవిలంబన మెట్టు లోర్చెదన్. ౧౩౪౬

ఉ. చంపినఁ జంపుఁ గాక మఱి ♦ శాపము నిచ్చిన నిచ్చుఁ గాక యో
చంపకగంధి న న్నిపుడు ♦ చక్కెరవిల్తుని కేలిఁ దేల్పుమీ
చంపెడి వాఁడు న న్ననుచుఁ ♦ జయ్యనఁ గ్రుచ్చి బలాత్కృతిన్ సతిన్
మంపున సిగ్గు దీసి మధు♦మంతముఁ జేరె; నెలంత యేడ్చుచున్. ౧౩౪౭

## శుక్రుఁడు దండునిదేశముపై మట్టివాన గురియ శపించుట.

చం.దరమున నాశ్రమంబుదరిఁ ♦ దండ్రికి వేచి ధరిత్రిఁ బోర్లఁగా
గురువున కాయుదంతమును ♦ గొబ్బునఁ దెల్పిరి శిష్యులెల్ల, నా
పరమతపోధనుండు విని ♦ బాధరుషావశుఁ డై క్షుధార్తుఁ డై
సరగ నిజాశ్రమంబునకుఁ జక్కఁగ వచ్చి రజోభిసంప్లుతన్ ౧౩౪౮

కం.దీన నరజఁ గని శుక్రుఁ డ,నూనరుషాయుక్తుఁ డగుచు ♦ నుర్వీశుండా
యీ నెఱిపాప మొనర్చెను? గానఁడు వో కన్ను లతఁడు ♦ కండపావరుఁనన్. ౧౩౪౯

చం.అసమున నాశ్రయాశుశిఖ ♦ లంటఁగఁ జూచెడి, స్వీయయుక్తుఁ డై
మసీ యయి పోవు నింక గతి ♦ మాలి దురాత్ముఁడు పాపశీలుఁ డీ

యసమనుహాఘుకార్యమున ♦ కర్త ఫలంబును గాంచుఁ గాక యీ
వసుధయు సప్తరాత్రములఁ ♦ బా డగుఁ గావుతఁ బాంసువృష్టి చేన్. ౧౩౯౦

కం. యోజనశతంబు ధర యీ, రా జేలెడియంత మేర ♦ రజము గురిసి స్వ
రాజు వినాశ మొనర్చుత, భూజనులు చరాచరములు ♦ పొలియుత మిచటన్.

చం. అని శపియించి యాశ్రమము♦నందలివారలఁ గాంచి మీర లీ
జనపదసీమ దాఁటి చని ♦ స్థానముఁ గొం డన వార లెల్లరుం
జనఁ గవికూఁతుఁ గాంచి మతి♦చాలనిదాన! సమాహితాత్మ వై
దినములు త్రోయు మియ్యెడన ♦ తీవ్రతపఃపరినిశ్చితాత్మవై. ౧౩౯౧

కం. ఈకొలనియోజనంబున, నీకీడు పొసంగ దల్ల ♦ నృష్టిదినములన్
నీకడ వసించుజంతువు, లే కాఁటియు నొందకుండు ♦ నింతీ యనినన్. ౧౩౯౩

కం. అటు లొంత మంచుఁ దన్నుడిఁ, గుటిలాలక దుఃఖగరిమఁ ♦ గొనె నుశనుం డ
ప్పటినుండి వేఱుతావున, వటువులతో నెలవుకొనియె ♦ వారిజనయనా! ౧౩౯౪

కం. దితిజాచార్యుఁడు చెప్పిన,గతి దండునిదండు భటులుఁ ♦ దక్కినవా ర
ద్భుతపాంసువృష్టిఁ జచ్చిరి, గతిచెడి దినసప్తకమునఁ ♦ గడు ఘోరముగన్. ౧౩౯౫

కం. దండునివిషయము మునివే,తండము చే శాపమునను ♦ ధరఁ గలయుట చే
దండక యని పేర్కొనఁబడు; నుండుటచే మాను లిందు ♦ నుర్వీరమణా! ౧౩౯౬

తే. కనె జనస్థాన మనుపేరు ♦ కంజనేత్ర!
యడిగినదియెల్లఁ జెప్పితి ♦ నబ్జహితుఁడు
పశ్చిమాద్రికి నరిగె వా♦ర్వంగ మునులు
స్నాన మొనరించి రవిఁ గొల్వఁ ♦ జనెడివారు. ౧౩౯౭

కం. రవి యస్తంగతుఁ డయ్యెను, రవివంశ్యవరేణ్య సాంధ్య♦రాగం బెసఁగెన్
దవుఁ గాదె నీకు సంధ్యా,సువిహితకర్మములు దీర్ప ♦ శుద్ధచరిత్రా! ౧౩౯౮

రాముఁ డగస్త్యుచే నాజ్ఞ గొని యయోధ్యకు మరలి చనుట.

సీ. అనవుడు శ్రీరాముఁ ♦ డర్చింప సంధ్యను, సురసతీయుతసరో♦వరముఁ జేరి
సంధ్య వారిచి ముని♦చంద్రు నాశ్రమమున, కరుగ నాతండు శా♦ల్యన్నరుచిర
భోజనంబును ఫల♦ములు మూలముల నిడ, నమృతోపమాన్నంబు ♦ నారగించి
సంతుష్టుఁ డై రేయి ♦ జరపి యచ్చోటన, వేకువ నాహ్నిక♦విధులఁ దీర్చి

తే. కుంభసంభవునకు మ్రొక్కి ♦ గురుత దోఁప
నాజ్ఞ యిడ నయ్య పురమున ♦ కరుగువాఁడఁ
దాపసోత్తమ! నే భవ♦ద్దర్శనమున
ధన్యతను గంటిఁ దత్వత్కృపా♦ధనముఁ గొంటి. ౧౩౯౯

ఉ. ఏను బవిత్రతం గనఁగ ♦ నిం దరుదెంచుచుఁ బోవుచుందు నా
కానతియే యటన్న వసు♦ధాధిపునద్భుతసూక్తిపంక్తికిన్
మౌని వరుండు ధర్మనయ♦నప్రవరుండు వచించె రామచం
ద్రా! నినువంటిపావనుఁడు ♦ తథ్యము లేఁ డెట భూతకోటిలోన్. ౧౩౬౦

ఉ. అచ్చెరు వయ్యె నీదుమధు♦రాక్షరముల్ విన రామచంద్ర! ని
న్నొచ్చెములేనిప్రీతిని ము♦హూర్తము చూచిన స్వర్గభూతుఁ డై
నిచ్చలు దేవపూజ్యుఁ డయి ♦ నిర్మలుఁ డౌ నరుఁ డెవ్వఁడేని, ని
న్నచ్చనిక్రూరదృష్టిఁ గని♦నన్ యమదండహతుండు తత్త్రుటిన్ ౧౩౬౧

ఉ. పోవును నారకాధ్వమునఁ ♦ బొక్కుచు; నీ వన భూతరాశిలోఁ
బావనమూర్తి విట్టినినుఁ ♦ బాయక కీర్తన సల్పి రేనియున్
భూవర సిద్ధిఁ గాంచెదరు ♦ భూజను లింక శుభాధ్వసీమఁ బొ
మ్మా! వసుధాతలంబు నయ♦మార్గమునన్ భరియింపు రాఘవా! ౧౩౬౨

చం. అనుడు ఘటాత్మసంభవున ♦ కచ్చటిమానుల కెల్ల మ్రొక్కి వా
రనుమతి సేయఁ బుష్పకము ♦ నవ్విభుఁ డెక్కిన వారలెల్ల దీ
వన లిడి యర్చ సేసిరి సు♦పర్వులు శక్రునిఁ బోలె, వార్షికా
బ్దనికటచంద్రునట్లు జన♦వర్యుఁడు పుష్పకమందు మింటిపై ౧౩౬౩

ఉ. రాజిలి యభ్రమధ్యమునఁ ♦ గ్రాలఁగ నర్కుఁ డయోధ్యఁ జేరి పే
రోజను నడ్మికక్ష్య డిగి ♦ యొయ్యన సూక్తులఁ బుష్పకంబు రా
రాజును గొల్వఁ బంచి తన♦భ్రాతలకుం దనరాక దెల్పఁగా
వే జడ నేది లేక యని♦పెం దొడితేరఁగ ద్వారపాలకున్. ౧౩౬౪

రాముఁడు రాజసూయంబుఁ జేయఁ దమ్ములతో యోజించుట.

కం. అతఁ డేగి వారిఁ బిల్వఁగ, ద్రుతగతి నరుదేర వారు ♦ తోడన చెప్పన్
బతి కతఁడు వారు వచ్చుట, యతులముదంబునను రాముఁ ♦ డనుజయుగంబున్

సీ. ఆలింగన మొనర్చి ♦ యనియె బ్రాహ్మణకార్య, మాచరించితిఁ జక్క ♦ ననుజులార!
అక్షయ్య మవ్యయం ♦ బగుధర్మసేతువు, ధర్మవర్ధక మఘ♦దారణంబు
రాజసూయంబు మీ♦రలు దోడుపడఁ జేయ, నిచ్ఛయించెద ధర్మ♦వృద్ధిపొంటె
రాజసూయసమాచ♦రణమునఁ గాదొకో, మిత్రుండు వరుణుఁ డై ♦ మెల్గిగనియె

తే. రాజసూయంబునన ద్విజ♦రాజు శాశ్వ
తంబు సత్కీర్తినిలయంబు ♦ ధర్మవిధిని
గాంచె నిప్పుడ మీరు యో♦జించి చెపుఁడ
యధ్వరం బెద్ది సేయ మే ♦ లగునొ యనిన.[1] ౧౩౬౬

[1]ఇది తమ్ములమనస్సు పరీక్షచేయ వేయఁబడిన ప్రశ్న. లక్ష్మణ విభీషణులవిషయంబులందువలె.

### భరతుఁడు రాజసూయ మధర్మముగా దని నొడువుట.

కం. ప్రాంజలియై భరతుఁడు జన,రంజనశీలా! వసుంధ♦రాధర్మయశః
పుంజంబు శాశ్వతం బరి,భంజన! నీయందు న్యాయ్య♦పద్ధతి నడువన్. ౧౩౬౭

చం. అమరులు కంజజుం గొలుచు♦నట్లు మహీంభుజులెల్ల నిన్ను మో
దమున భజంపఁ గోరెదరు ♦ తండ్రి వటంచును లోకులెల్ల ని
త్యము నినుఁ జూచువారు, వసు♦ధాస్థలిఁ గల్గినభూతకోటి కో
యమలదయాంతరంగ విను ♦ ప్రాణము నీవ నిజంబు చూడఁగన్. ౧౩౬౮

ఉ. ఇట్టిమహానుభావునకు ♦ నేటికొకో నృపవంశనాశనం
బెట్టును గూర్చు నధ్వరము ♦ నెత్తికొనం జలుపంగ? రోషముల్
పుట్టెడి రాజసూయమున ♦ భూధవపాళికి, దాన భూజనుల్
బిట్టువినాశ మొందెదరు ♦ భీషణరోషకృతాజిధారిణిన్. ౧౩౬౯

కం. భూవలయంబు సమస్తము, నీవశమున వర్తిలంగ ♦ నిస్తులితదయా
శ్రీవిభవ లోకులను దగ,వా విలయముఁ గూర్పఁగా స♦వవ్యాజమునన్? ౧౩౭౦

చం. అన నమృతోపమాన మగు♦నానుడులం గడుమెచ్చి కైకయీ
తనయునిఁ జూచి యిట్టు లనుఁ ♦ దథ్యము పథ్యము భూహితంబుగా
ఘనమతిఁ బల్కి తీవు మదిఁ ♦ గల్గినతత్త్వతుచింత వీడితిఁ
జనులకు బాధఁ గూర్చుపనిఁ ♦ జల్పఁగఁ జెల్లునె భూమినేతకున్. ౧౩౭౧

కం. బాలురవాక్యం బైనను, వాలాయము గ్రాహ్య మగు శు♦భం బగునేనిన్
శ్రీలక్ష్మణపూర్వజ! నీ,యాలాపము వినెద శుభద ♦ మాటను సుమతీ! ౧౩౭౨

### లక్ష్మణుఁడు వృత్రుకథ రామునితోఁ జెప్పుట.

చం. అనునెడ లక్ష్మణుండు తన♦యగ్రజుఁ గన్గొని సర్వపాపముల్
పొనుఁగువడంగఁ జేయు నతి♦పుణ్యము పావన మశ్వమేధముం
బొనరుపవచ్చుఁ గాదె, సుర♦ముఖ్యుఁడు వృత్రునిఁ జంపి బ్రహ్మహ
త్యను వొలఁగించుకో నదియ ♦ తా నొనరించె నటంద్రు పెద్దలున్. ౧౩౭౩

సీ. శతయోజనంబు వి♦స్తృతియుఁ దత్త్రిగుణ ము,న్నతిగలవాఁ డొక్క♦దితిసుతుండు
వృత్రుఁ డన్వాఁడు జ♦గత్త్రయిఁ బాలించె, నైయ్యంబు దియ్యంబు ♦ నేర్పు మెఱసి
ధర్మజ్ఞుఁడును బ్రాజ్ఞ♦తముఁడు కృతజ్ఞుండు, వానిపాలనమున ♦ వసుధయెల్లఁ
గామధేనువుపోలెఁ ♦ గమ్రమూలఫలాళిఁ, గుసుమచయంబుల ♦ నొసఁగుచుండె

తే. దున్నకయ పండె ధాత్రి సం♦పన్న మగుచు
నిట్టు లుండఁగ నాతని ♦ కితరసుఖము

లెల్ల మాయయు తపమె య♦హీనఫలద
మనుచుఁ దోఁచిన వనముల ♦ కరుగఁ దలఁచి. ౧౩౭౪

కం. మధురాపురి కగ్రసుతుం, బ్రథితబలుఁ రాజుఁ జేసి ♦ వనములలోనన్
భృగునిష్ఠం దప ముండిన, వ్యథితాత్మకు లైరి యింద్రుఁ ♦ డాదిగ వేల్పుల్. ౧౩౭౫

చం. హరిహయుఁ డంతఁ జక్రధరు ♦ నార్తిని జేరి మహోత్త వృత్రుఁ డన్
సురరిపు వుగ్ర మాతపము ♦ నూల్కొన లోకము తత్తఱించె వాఁ
డురుతరశక్తిశాలి కద♦నోర్వ జయింపఁగ నా కసాధ్య మీ
కరణిని దత్తపంబు కడ♦గాంచిన లోకము లుండునంతకున్ ౧౩౭౬

కం. మే మతనికి దాసుల మై, యీమేనులు ప్రోవవలయు ♦ నిప్పుడు వానిన్
శ్రీమహిళేశ్వర! తీర్పఁగ, సామం; బది యెంత నీకు ♦ క్షణ మల్గినచోన్. ౧౩౭౭

కం. నీకరుణ గన్న దాదిగ, లోకంబుల నెల్ల వాఁడు ♦ లోఁ గొనె నిపు డీ
వే కరుణాకలితాత్మక, నాకుల రక్షింపఁ దలఁపు ♦ నాళీకాక్షా. ౧౩౭౮

కం. నీవలన న్స్వస్థమానసు,లై వెలయఁగ నెదురు చూచు ♦ చమృతాంధసు లో
దేవా! యున్నా రాశరు, కావర మడఁగించి జగముఁ ♦ గావం గదవే. ౧౩౭౯

తే. ధీరధర! సాధు లైనబృం♦దారకులకు, నిచ్చలును నీవ గతి వయి ♦ నివ్వటిలుదు
వింక దుస్సహ మెవ్వరి ♦ కేని దీనిఁ, జక్కదిద్దఁగఁ గాన మా♦దిక్క వీవ. ౧౩౮౦

→ విష్ణువు వాసవుతో వృత్రుఁ జంప నుపాయంబు దెలుపుట. ←

కం. వాసవుఁ డిటు పల్కిన హరి, యే సౌహృదబద్ధుఁడం జుఁ♦డీ వృత్రు నెడన్
మీసంతోషంబునకై, యే సంపఁగ నొల్ల నచటి ♦ కే తెంచి యునిన్. ౧౩౮౧

ఉ. ఐనను మీకు భద్రము న♦యింబుగఁ గూర్చెద, నాదు తేజమున్
మానితశీలురార! బల♦మర్దనునందు శతారమందు భూ
మీనిలయంబునన్ నిలుప ♦ మేకొనువాఁడను, దాన వృత్రహిం
సానిపుణత్వ మొందుఁ బవి♦సాధనుఁ డంచన వేల్పులెల్లరున్. ౧౩౮౨

కం. మ్రొక్కుచు నీ వతికరుణను, దిక్కగుటను మేము బ్రదికి♦తిమి లక్ష్మీశా!
రక్కసుఁ దునుమఁగ వాసవు, మక్కువ భరియింపు మాత్మ♦మహిమ నటంచున్.

చం. బలరిపుఁ గూడి వృత్రుఁడు త♦పం బొనరించువనంబుఁ జేరి ని
స్తులనిజభూరితేజమునఁ ♦ దోయదమార్గము నిర్దహించున
ట్లలఘుతపంబునం గొఱలు ♦ నాతనిఁ గాంచి భయంబు నొంది రీ
బలియునిఁ జంపు టెట్లు? పరి♦భావముఁ బొందక యుండు టెట్లొకో? ౧౩౮౪

మ. అని చింతింపఁగ వేల్పు లెల్లరు సహ♦స్రాక్షుండు వృత్రాసురున్[1]
దునిమెం గ్రూరతఘోరవజ్రహతిఁ బ్రో♦ద్భూతజ్వలజ్జ్వాలముల్

[1] బ్రాహ్మణుఁ జంపిన వెంటనే బ్రహ్మహత్య ప్రాప్తింపనుగాని కొందఱు శ్రీరాములవిషయమునఁ జెప్పినట్లు కొన్నిదినములు గడపి యథావకాశముగఁ గాలాంతరమున రాదు.

జనతాభీతికరంబుగా నెగసెఁ గ♦ల్పంబో యనన్ సాధుచిం
తను నిష్కారణ మింద్రుఁ డిట్లు నఱికం♦ దద్ఘోరపాపం బొగిన్. ౧౩౮౫

→ ఇంద్రునకు బ్రహ్మహత్య ప్రాప్తించుట. ←

ఆ. బ్రహ్మహత్య వెంటఁ♦బడ శచీవల్లభుఁ, డుఱుక విడువ కదియు♦ నతిమె నతని
నాకవిభుఁడు వసరి♦ లోకంబుకడపలఁ, దమమునందు దాఁగె♦ నమరు లిచట

చం. హతవిమతుల్ ప్రణష్టవిబు♦ధాధిపు లగ్నిపురోగముల్ రమా
పతిఁ గన నేగి పల్కుఱు స♦పర్యలఁ దన్పి జగత్పితా! జగ
ద్గతి పరమేశ పూర్వజ జ♦గత్పరిపాలనహేతు వూని వి
ష్ణుతఁ గొని తీవు మ మ్మిపుడు♦ చూడుము సారదయార్ద్రదృష్టులన్. ౧౩౮౬

కం. చచ్చెను నీచే వృత్రుఁడు, వచ్చె నిపుడు బ్రహ్మహత్య♦ వాసవునకు నా
సచ్చరితుఁడు దుష్కృతమున, ముచ్చిర కుండఁగ నుపాయ♦ముర్ సెల విష్ణూ.

కం. అనవుడు విష్ణుం డి ట్లను, ననుఁ గూర్చి సవంబు సలిపి♦నన్ శక్రుఁడు పా
వనుఁగా నొనరించెదఁ గా,వున నొక హయమేధ మతఁడు♦ వూనఁగ నిండీ.

తే. మరల సురలఁ గలయు♦ నరుగుఁ డటన్నను, వారు వల్లె యనుచుఁ♦ బని వినంగ
బ్రహ్మహత్యబలిమి♦ వాసవుఁ డంధత,మసమునందు వేష్ట♦మానుఁ డగుచు.

→ ఇంద్రుఁ డశ్వమేధ మొనర్చి బ్రహ్మహత్యఁ దొలఁగించుకొనుట. ←

చం. ఉరగముఁ బోలి నష్టమతి♦యుం గతచేతనుఁ డొచు నుండఁగా
ధరణి తపించెఁ, గాననవి♦తానము లెండెఁ దరంగిణుల్ సరో
వరములు శోషిలెన్, వఱపు♦ వర్తిలె, భూతచయంబు లన్నియున్
దరమునఁ దత్తఱిల్లె, విబు♦ధప్రకరం బప్డు డజ్ఞ రీతిగన్. ౧౩౯౧

చం. హరిహయు నున్కిప ట్టెఱిఁగి♦ యాతనిఁ దెచ్చి సవంబుఁ జేయ న
ధ్వరముతుదన్ మహోఘము బు♦ధప్రతతిం గని నాకు నిల్వఁగా
నిరవు వచింపుఁడీ యనఁగ♦ ని ట్లని రెల్లరు నాల్గుపాళ్లుగా
దురితమ! కమ్ము గట్టుపగ♦తున్ విడి యుండుమ యెందు నేనియున్. ౧౩౯౨

సీ. అనవుడు నాబ్రహ్మ♦హత్య యిట్లు వచించె, వానకాగున నాల్గు♦పక్షములను[1]
గామవారిణి నయి♦ కలుషమానసదర్ప,నాశిని నై పూర్ణ♦నదులయందు
నేకాంశమున నుందు♦ నింకొక్కభాగానఁ, జవుడుగా నెప్డు♦ త్యో వసింతు
దర్పసంపూర్ణలై♦ తనరు యౌవనయుక్త,నారులయందు మూ♦న్నాళ్లు లుందు

ఆ. వారికామమదము♦ వారింప మూఁడవ,యంశమునను; మిగులు♦నంశమునను
గల్లలను నదూష♦కబ్రాహ్మణులఁ జంపు,వారియం దమర్త్య♦లార! యుందు.

[1] పక్షములనఁగా నిచట మాసములు. "పక్షావైమాసాః". వానకాలము నాలుగు నెలలు నదులకు రజోదోషముగలదు. అప్పుడు పూర్ణప్రవాహమున స్నానమాడరాదు. "సింహకర్కటయోర్మధ్యే, సర్వానద్యోరజస్వలాః"

కం. అనవుడు నీకోరినవిధ, మున నుండు మటంచు నమర♦ముఖ్యులు పలుకం
జనె నదియుఁ బూతుఁ డౌశ, క్రునిఁ దోడ్కొని చనిరి సురలు ♦ కువలయ మలరన్.

### శ్రీరాముఁడు లక్ష్మణునకు నిలుని వృత్తాంతముఁ దెలుపుట.

ఉ. ఇట్టిది యశ్వమేధ మన ♦ నీ వొనరింపుము దాని నంచుఁ దో
బుట్టు వచింప రాఘవుఁడు ♦ పొంగి హసించుచు నశ్వమేధ మా
నట్టిద కర్దమాత్మజుఁ డ♦నంతయశుం డిలనామధేయధా
త్రీ ట్టగు బాహ్లికేశ్వరుఁడు ♦ నియ్యది సల్పెను మున్ను లక్ష్మణా! ౧౩౯౫

చం. తనవశమున్ ఘటించి వసు♦ధాతల మంతయు ధర్మపద్ధతిన్
జనులను నాత్మపుత్రకుల♦చందమునన్ భరియించె, వేల్పులున్
దనుజులు నాగరాక్షసులు ♦ తత్పరులై భయయుక్తి నమ్మహా
త్ముని భజియింతు, రీభువన♦ముల్ వణఁకుం గిను పొతఁ డూనినన్. ౧౩౯౬

చం. ఇలుఁ డిటు ధర్మవీర్యమతు ♦ లెంతయు వాసి ఘటింప నేలుచోఁ
జెలువపుఁ జైత్ర మంతఁ దఱి♦సెన్ మృగయాభిరుచిన్ నృపాలుఁడున్
బలభటవాహయుక్తుఁ డయి ♦ బంధురకాననసీమ కేగి జం
తులఁ బరిమార్చి వేలకొలఁ♦దుల్ దనివిం గనఁ జాల కొక్కటన్. ౧౩౯౭

తే. షణ్ముఖుం డుదయించిన♦స్థలముఁ జేరె, నందు గౌరీసమేతుఁ డై ♦ హరుఁడు కేళిఁ
దేలుచుండెను బరిచర♦జాలయుక్తి, భార్యప్రీతికి నాఁడురూ♦పంబుఁ దాల్చి. ౧౩౯౮

ఉ. అందలి భూరుహంబులును ♦ బ్రాణులు సర్వము నాఁడురూపముం
జెంది రహించు చుండె నటఁ ♦ జేరి ధరాపతి వింత చూచుచో
సుందరి యయ్యెఁ దాను నది ♦ చూచి మహావ్యసనాబ్ధి మున్గి బా
లేందుకిరీటుకృత్య మని ♦ యెంచి సభృత్యుఁడు సానుగుండు నై. ౧౩౯౯

### ఇలుఁడు స్త్రీ యై పార్వతీపరమేశ్వరుల శరణుఁ జొచ్చుట.

కం. త్రినయను శరణముఁ జొచ్చినఁ, గని యీశుఁడు నగుచు బెమ్మె ♦ కర్దమతనయా
వనితాత్వచ్యుతి తక్కఁగ, మనుజేశ్వర! వరము కోరు♦మా యెది యైనన్. ౧౪౦౦

కం. శంకరువాక్యములకుఁ బలి, సంకటపడి యన్య మేది ♦ సమ్మతి లేమిన్
శంకరిపదముల వ్రాలెం, గింకరుఁడను దల్లి! ప్రోచి ♦ కీర్తిం గొనుమా. ౧౪౦౧

ఉ. ఏలికసాని వీవు జగ♦మెల్లనుఁ బ్రోవఁగ దేవి కామితా
ర్థాళి ఘటింప శక్తవు ద♦యామతివిన్ వరదానకర్త్రి వే
వేళఁ ద్వదీయదర్శనము ♦ విశ్రుతసౌఖ్యనిదాన మౌట శ్రీ
లోలవిలోచనా! యఘము ♦ లోఁగొని నన్ను క్షమింపు మీశ్వరీ! ౧౪౦౨

ఆ. నన్నుఁ గరుణఁ జూడు ♦ కన్నతల్లివి నీవు, తల్లి గాక యెవరు ♦ తనయు మొఱల
నాలకించువార ♦ లంబ నీచరణముల్, వదల నన్నుఁ జేయి ♦ వదలితేని. ౧౮౦౩

కం. నావుడు ధరణీవల్లభు, భావంబు నెఱింగి పల్కె ♦ భవసమ్మత యో
భూవర! నేను వరార్ధం, బీ వచ్చు హరుండె కర్త ♦ యీయఁగఁ గోఱఁతేన్. ౧౮౦౪

↞ { ఇలుఁ డొకనెల స్త్రీగను నొకనెల పురుషుఁడుగ నుండఁ బార్వతి యనుగ్రహించుట. } ↠

ఆ. ఏదికోరె దనిన ♦ నృపుడు సంతోషించి, శైలతనయ! సుప్ర♦సన్న వేని
మాస మొండు పురుషు♦మూర్తి నై యొకనెల, యనుపమానసుంద♦రాగి నగుచు

తే. ఉండ వర మి మ్మటన్న వే♦తండయాన
యుండు మట్టుల నృప పురు♦షుండ వగుచు
నుండు వేళల స్త్రీభావ ♦ మువిద యైన
వేళఁ బురుషత్వ మాత్మలో ♦ విస్మరింపు. ౧౮౦౫

కం. వర మొంది యిట్లు కార్దమి, పురుషుండుగ నెలయు నెలయుఁ♦బొలఁతుక యగుచున్
బరఁగె నిల యనఁగఁ బేరను, నరపతి యయి రాజ్యపాల♦నము గావించెన్. ౧౮౦౬

↞ ఇలుఁడు స్త్రీ యై బుధునియాశ్రమంబుఁ జేరుట. ↠

చం. అన విని విస్మయంబున ధ♦రాధిపుఁ గన్గొని తమ్ము లాడి రా
మనుజవిభుం డ దెట్టులొకొ ♦ మానిని యై చరియించె నంతకం
బెను గలుగంగ నేర్చునొకొ ♦ నీచపుదుర్గతి? యేమి చేసెనో
వనజదళాక్షి యాచు మగ♦వాఁడుగ నై వినరింపుమీ యనన్. ౧౮౦౭

చం. తొలుతటిమాసమం దతఁడు ♦ తోయజలోచన యాచుఁ బూర్వభృ
త్యులు సతు లై భజింపఁగ న♦తుల్యమనోహరరూపకాంతి ది
క్కులు వెలిఁగింప భూమిరుహ♦గుల్మలతాపరికీర్ణకాననం
బులఁ జరియించెఁ గాల్నడన ♦ మున్పటియానము లెల్లఁ బాయుచున్. ౧౮౦౮

కం. ఇటు హాళిఁ జరించుచు న,క్కుటిలాలక గాంచెఁ బూర్ణ♦కువలయమిత్ర
స్ఫుటరోచుల వెలిఁగెడుబుధుఁ, దట దేశసదేశమునను ♦ దప మొనరింపన్. ౧౮౧౦

కం. జలజారిసుతు వయస్థునిని, జలమధ్యమునందుఁ దపము ♦ సలుపఁగఁ గని యా
యిల పరిజనవనితలతో, జలకేళిం జలుపఁ జొచ్చె ♦ సరసీవారిన్. ౧౮౧౧

↞ బుధుఁ డిలాదేవిని జూచి మోహించుట. ↠

చం. నళినదళాక్షిఁ గాంచి శశి♦నందనుఁడుం స్మరబాణపాతసం
చలితమనస్కుఁ డై తపము ♦ సల్పుట మాని తదేకచిత్తుఁ డై

చెలువమొగంబుఁ గాంచుచు వి♦శిష్టచరిత్రుఁడు వాసవాలుక
న్నెలతలఁదన్ను సోయగము ♦ నీటును గాంచె ని దేపొలంతియో? ౧౪౧౨

కం. అచ్చరలమిన్నలందు వి,యచ్చరసతులందు నాసు♦రాంగనలందున్
మెచ్చిచ్చు పాఁపపాపల, నిచ్చిగురుంబోఁడి నెనయు ♦ నింతిని గానన్. ౧౪౧౩

కం. పరుసం బెం డ్లాడనిచోఁ, దరుణీమణి నాకుఁ దగిన♦దయితయ యంచున్
సరసీజలనిర్గతుఁ డై, యరిగి నిజాశ్రమములోని ♦ కబ్జేక్షణలన్ ౧౪౧౪

చం. పిలిచి మృగాక్షులార! యలి♦వేణి యెవర్తుక? యేల యీవనీ
తలమున సంచరించెడి? య♦థాస్థితి సర్వముఁ దెల్పరే యనన్
సలలితవాక్యము ల్విని వ♦శాగమనామణి మాకు భర్త్రి, య
ప్పొలఁతికిఁ బెండ్లి లేదు, వన♦భూముల మాబడి సంచరించెడిన్. ౧౪౧౫

కం. అని శశివదనలు పలికినఁ, దనవిద్యామహిమ వారి♦తత్త్వం బెల్లన్
మనమున నెఱింగి వారల, కనియెన్ మీరెల్లఁ బర్వ♦తావనియందున్. ౧౪౧౬

తే. వాసమును గొంచు నుండుఁడు ♦ వనితలార!
వలయుఫలములఁ గూర్తును ♦ వలసినన్ని
పురుషు లౌదురు మీకుఁ గిం♦పురుషు లనిన
నెలవుకొని రందు వారెల్ల ♦ నిమ్మళముగ. ౧౪౧౭

## ఇలాదేవి బుధునితోఁ గలియుట.

కం. భరతుఁడు సౌమిత్రియుఁ గిం,పురుషాబ్జేక్షణలపుట్టు♦వున్ విని రామా!
ధరణీనాయకు నావలి,చరితము వినిపింపు మనిన ♦ క్ష్మాపతి యనియెన్. ౧౪౧౮

కం. కిన్నరయోషల దవ్విగ, నన్నియమివరుండు పంచి ♦ హాసంబున నం
దున్నయిలాసతికిం దాఁ, జెన్నగునుడి నిట్టు లనియె ♦ శీతాంశుముఖీ! ౧౪౧౯

కం. సోమునిసుతుఁడను బుధుఁడను, భామిని ననుఁ జూడు స్నేహ♦పర్యాకులదృ
క్కోణుంబుల నన నిర్జన,భూమిని గామిని వచించెఁ ♦ బురుమోదమునన్. ౧౪౨౦

ఉ. నేను స్వతంత్ర సోమసుత! ♦ నీకడ నుండెద నెద్ది పంచినన్
మానక చేయుదాన నన ♦ మానినిమాటకుఁ బొంగి యాతఁడున్
దానిని గూడియుండ సుఖ♦తత్పరుఁ డై త్రుటివోలె నెప్పుడో
యానెల మాధవం బరిగి ♦ నంతట సుప్తుఁడు లేచి దిగ్గనన్. ౧౪౨౧

చం. ఉదకములోన నిల్చి కర♦యుగ్మము నెత్తి తపం బొనర్చునా
సదయునిఁగాంచి మానివర! ♦ సానుచరుండన్ను దుర్గసీమ నేఁ

గదకొని వేఁట వచ్చితిని ♦ గానను భృత్యుల నెందుఁ బోయిరో
మదిఁ దలపోసి చెప్పు మన ♦ మానవపాలునితో బుధుం డనున్. ౧౪౨౨

ఆ. రాలవాన గురిసి ♦ రాజ! నీసైన్యంబు, మంటిఁ గలసె నాశ్ర♦మంబునందు
వాతవర్షభయము♦వలన నుండుటఁ జేసి, బ్రతికినాఁడ వేల ♦ భయముపడెదు?

కం. ఫలమూలంబులఁ దినుచుఁ, నిలుమీ నీ వింద టన్న ♦ నిజసైన్యాళీ
విలయంబునకుఁ వగచుచుఁ, బలికెం దా రేయుతోడ ♦ వ్యసనార్తుం డై. ౧౪౨౪

కం. విడిచితి రాజ్యము భృత్యులు, మడిసిరి నే నిందు నిలువ ♦ మరియా దగునే?
యిడు మాజ్ఞఁ జనెద నాకుం, గొడు కగుశశిబిందుఁ జలుపఁ ♦ గువలయపతిగన్.

కం. చనియెద భృత్యుల దారల, జనముల సౌఖ్యముల విడిచి ♦ సంయమివలె నే
వనముల నుండఁగఁ దగునే? మునినాథా! యశుభ వాక్య♦ములు పల్కకనన్.

కం. రాజేంద్రునిసూక్తులకుఁ, రాజసుతుం డబ్రపడుచు ♦ రాజా! యేలా
యోజన చేసెదు? నిలు మిట, రాజితహిత మేను వత్స♦రము గడ చనినన్ ౧౪౨౬

ఇలా దేవి పురూరవుం గనుట.

కం. కూరుతు నీ కనఁ గార్దమి, కూరిమి నట నిలిచి సలిపె ♦ ఘోరతపంబుఁ
వారక నెల చనఁ గ్రమ్మఱ, నారీమణి యగుచు నిందు♦నందనుఁ గలసెన్. ౧౪౨౭

కం. తొమ్మిది నెల లిటు లరిగినఁ, గొమ్మ పురూరవుఁ డనంగఁ ♦ గొడుకుం గని తా
నమ్మానవకుం దంద్రికిఁ, గొమ్మని యప్పుడ యొసంగెఁ ♦ గుతుకము మీఱన్.

తే. ఏఁడు గడచినపదపడి ♦ ఱేఁడు పురుష
రూపమును గాంచఁగా నను♦రూపసూక్తి
గరిమ హృద్యకథాళులఁ ♦ గంజవైరి
తనయుఁ డతనికి హర్షంబు ♦ దనరఁ జేసె. ౧౪౩౦

బుధుఁ డిలునకు శాశ్వతపురుషత్వముఁ
గలిగింప నశ్వమేధంబు సేయుట.

సీ. అన వత్సరాంతంబు ♦ నం దేమి యొనరించె, నిలుఁడని యనుజులు ♦ పలుక రాముఁ
డనియెఁ దారాసుతుం ♦ డాత్మమిత్రులను సం,వర్తునిఁ జ్యవనునిఁ ♦ బ్రముదదాయిఁ
గశ్యపు దుర్వాసుఁ ♦ గలయోగివర్యుల, రప్పించి యి ట్లను ♦ రాజవరుఁడు
కార్దమేయుఁడు భవ♦త్కరుణకుఁ బాత్రుఁడు, తద్దశ మీకు హృ♦ద్గతమ కాదె

ఆ. సరగ మేలు చేయు ♦ సదుపాయ మొక్కటి, చేయవలయు ననుచుఁ ♦ జెప్పు చుండఁ
గర్దముండు వచ్చెఁ ♦ గదలి యచ్చోటికి, దివ్య తేజు లైన♦ ద్విజులతోడ. ౧౪౩౧

తే. క్రతువును బులస్త్యుఁడును వష♦ట్కార మనల
నోంకృతియు వచ్చె నచటికి ♦ నుల్లమలర

నెల్ల వారునును నృపతికి ♦ హితము సేయఁ
దలఁచి భాషించు చుండఁ గ♦ర్దముఁడు పలికె. ౧౪౩౨

ఉ. దీనికి మందు శంకరునిఁ ♦ దేర్చుట దక్క మఱొండు లేదు శ
ర్వాణి విభుండు మెచ్చెడుస♦వంబు తురంగమమేధ మొక్కఁడే
కాన హయుండు ప్రీతి గొనఁ♦గా మన మెల్ల నృపార్థమై తగన్
దాని నొనర్ప నన్న ముని♦దండము దానికి నీయకొంటయున్. ౧౪౩౩

ఆ. శంకరార్పితముగ ♦ సప్తతంతువుఁ దీర్ప, విప్రవరులు గడఁగ ♦ విధియుతముగ
సకలవస్తువులను ♦ సంవర్తరాజర్షి,ఛాత్రుఁ డగు మరుత్తు ♦ సంఘటించె ౧౪౩౪

కం. హరిణాంకతనూజాశ్రమ,ధరణీనికటమ్మునన్ య♦థావిధి సవమున్
జరుపఁగఁ బ్రీతుండై య,ధ్వరమునతుదఁ బురహరుండు ♦ ప్రత్యక్షుం డై. ౧౪౩౫

ఇలుఁ డెప్పటియట్ల పురుషత్వముం గనుట.

చం. ఇలునకు నేమిమేలు ఘటి♦యింపఁగఁ గోరెద రన్న వార ల
స్ఖలితము గాఁగ దేవ! పురు♦షత్వమునన్ వసుధామహేంద్రుఁడున్
జెలఁగెడిఁ గాక నా నటుల ♦ చేకుఱు మీయభికాంక్ష యంచు బూ
చులదొర కన్నొఱంగుడును ♦ సూరిజనుల్ ముగియించి యజ్ఞమున్. ౧౪౩౬

కం. తమతమయాశ్రమముల కు,త్తమమతు లేగుటయు నిలుఁడు ♦ తరలి చనెన్ రా
జ్యమునకు నట శశిబిందుని, విమలమతిన్ రాజుఁ జేసి ♦ వెలువడి పురమున్.

తే. మధ్యదేశంబునందు క్ష♦మావిభుండు
స్థాపితు నొనర్చి యొక ప్రతి♦ష్ఠానపురము
నందుఁ బతిగఁ బురూరవు ♦ నధికనియతి
సంచరించి దివిం జేరె ♦ సమయ మగుడు. ౧౪౩౭

కం. వింటిరె హయమేధం బిటు,వంటిమహామహిమ మీఱు ♦ వసుధాపతి వా
ల్గంటి యయి పురుషుఁ డయ్యెను, గుంటుపడ ద దెట్టికొర్కె ♦ గుఱ్ఱపువేల్మిన్.

రాముఁడు పురోహితాదులఁ బిలిపించి
యశ్వమేధం బొనర్తు నని చెప్పుట.

సీ. మనపురోధల వసి♦ష్ఠుని వామదేవుని, జాబాలిఁ గాశ్యపు ♦ శ్యావిబుధుల
సౌమిత్రి! తోడి తెమ్ము ♦ సాగింతు హయమేధ, మఖిలలక్షణయుతం ♦ బశ్వమొండు
విడిచెద నావుడు ♦ వెస నతఁ డేగి వా,రలఁ బిల్వ వా రెల్లఁ ♦ గ్రన్న వచ్చి
కృతనమస్కారుని ♦ క్షితినాథు దీవించి, యుచితాసనంబుల ♦ నుండు నంత

ఆ. రామచంద్రవిభుఁడు ♦ ప్రాంజలి యగుచును, వారిఁ జూచి నేను ♦ వాజిసవము
సలుప నెంచినాఁడ ♦ సెల విత్తురే యన, మదుల వారు హరు న♦మస్కరించి.

తే. అశ్వమేధం బొనర్ప స♦ర్వాంబు సకల
రాజవర్యులకును శుభ♦ప్రద మటన్న
సంతసించి సుమిత్రాత్మ♦జాతుఁ గాంచి
పలికె ని ట్లని శ్రీరామ♦భద్రుఁ డపుడు. ౧౪౪౧

సీ. యజ్ఞమహోత్సవం ♦ బనుభవింపఁగ సర్వ,కీశులతోడ సు♦గ్రీవు నిటకుఁ
బిలువంగ దూతల ♦ వేగమ పంపుము, దోషాచరులతో వి♦భీషణుండు
మత్ప్రియాసక్తు లా♦మహీపులు పరివార,ములతోడ రాఁగ దూ♦తలను బంపు
దేశాంతరస్థు లా♦ద్విజుల ధర్మాత్ములఁ, బిలిపింపు సతులతో ♦ వేల్మికొఱకు

ఆ. మునుల నెల్లవారి ♦ మునుకొని రప్పింపు, నటులఁ దాలధరుల ♦ నర్తకులను
బిలువ నంపు యజ్ఞ ♦ వేశ్మాళి నిర్మింపు, గోమతీతటమున ♦ నైమిశమున. ౧౪౪౨

చం. అనఘుల ధర్మవేదుల మ♦హాత్ముల నెల్లరఁ బిల్వఁ బంపుమీ
తనివి సనంగ నధ్వరవి♦ధానముఁ జూచి సుఖానుషంగు లై
మన మలరంగఁ బుష్టు లయి ♦ మందిరము ల్గన నేగువారుగా
కనుజుఁడ! నూఱువేల్ దృఢమ♦యంబులపై భరతుండు బియ్యమున్ ౧౪౪౩

సీ. పదివేలయెద్దుల♦పైఁ బెసల్ నూవులు, సెనగలు నులువలు ♦ మినుము లుప్పుఁ
దదనురూపంబుగఁ ♦ దైలాదులును మఱి, గంధపుఁజెక్కలు ♦ ముంద రరుగఁ
గొని కోటిహేమముల్ ♦ కోటులు పది వెండి,నాణెముల్ చనెడుఁ; జ♦నంగవలయు
నటులు నర్తకులును ♦ నైగమజనములు, సూదకారులు భటుల్ ♦ శూరవరులు

తే. వర్ధకులుఁ గోశనాథులుఁ ♦ బనులవారుఁ
దల్లులును జిన్నవాండ్రయం♦తఃపురంబు
వారు; నాపత్ని కాంచన♦ప్రతిమ దీక్ష
కైన వస్తులఁగొని యతఁ ♦ డరుగుఁగాక. ౧౪౪౪

కం. రాజులకు గొప్పవారికిఁ దేజన గొనబారి నిగ్గు ♦ దేటి సుఖం బై
రాజిలు నప్పరిగల గృహ, రాజుల నిర్మింపఁ బంపు ♦ రాజకుమారా! ౧౪౪౫

<-> శ్రీరాముఁ డశ్వమేధయాగము సేయ నుపక్రమించుట. <->

చం. అనవుడు నట్ల తీర్పఁగ స♦మస్తము రాముఁడు నట్లయిష్టితో
నెనయు సలక్షణాశ్వమును ♦ ఋత్విజులుక్ ఘననాదవైరియుక్
గొనకొని కావ వీడి మఱి ♦ గొబ్బునఁ జేరఁగ వచ్చి నైమిశం
బును గ్రతువాటిఁ గాంచి ముద♦ముం గనె నద్భుత మంచు నాత్మలోన్. ౧౪౪౬

సీ. నైమిశంబున రఘు♦నాయకుం డుండఁగ, నవనినాయకు లుప♦హారములను
గొని రాఁగఁ గైకొని ♦ కూర్మిఁ బ్రత్యర్చించి, విపులగృహంబుల ♦ విడియఁ బంచి

సానుచరాళికిఁ ♦ బానంబు నన్నంబు, వస్త్రంబు లేవి కా♦వలయు నన్ని
సమకూర్చ భరతుండు ♦ శత్రుఘ్నుఁడును బూని, రక్షజుతోడివ♦నాటు లెల్ల
తే. క్షితిసురావళి నెమకి పూ♦జించు చుండ
వృద్ధులను ఋషిజనుల వి♦భీషణుండు
రాక్షసాన్వితుఁ డగుచు న♦ర్చావిధాన
ములను సంతుష్టిఁ గూర్చుచుఁ ♦ జెలఁగు చుండె. ౧౪౪౭
కం. తురగము సుమిత్రతనయుఁడు, పరిరక్షింపఁగను విహిత♦పద్ధతిఁ గ్రతువుల్
జరుగఁగ నిడుఁడీ, యిడుఁడీ, పరితుష్టిగ ననెడునులివె ♦ బహుళంబయ్యెన్. ౧౪౪౮
తే. కండచక్కెర బెల్లంబు♦పిండినంట
లాగఁ జాల్వాలు నంచును ♦ యాచకాళి
పలుకునందాఁకఁ దెం డను♦పలుకు రాక
మున్నె యొసఁగిరి వడ్డించు ♦ చున్నవారు. ౧౪౪౯
చం. మలినుఁడు దీనుఁడుం గృశుఁడు ♦ మాటకు నైన మహాధ్వరంబునన్
గలుగఁ డొకండు, దీర్ఘతర♦కాలముగా మనియున్న మానివ
ర్యులు మును పెన్నఁ డేని గని ♦ యుండఁగ లే దిటువంటివేళ్మి, కో
ర్కులు దనివారె నెల్లరకుఁ ♦ గోరినయట్లు మణీధనాదులన్. ౧౪౫౦
తే. కాంచనముఁ గోరువారలు ♦ కాంచనంబు
విత్తములఁ గోరువారలు ♦ విత్తచయము
వస్త్రములఁ గోరువారలు ♦ వస్త్రములను
గోరిన ట్లెల్లఁ గాంచిరి ♦ కొఱఁత లేక. ౧౪౫౧
కం. చూచితిమి శక్రుమఖముం, జూచితిమి ధనేశుక్రతువు ♦ సూర్యజుసవమున్
జూచితిమి వరుణువేల్మిని, జూచితి మవి దీనిసాటి ♦ సుంతయు నగునే. ౧౪౫౨
కం. అని యబ్బురపడుచుఁ దపో,ధనులు వచింపఁగను గీశ♦దండముః సోఁకుల్
గొని హస్తంబుల వాసో,ధనభోజనవస్తుతతులఁ ♦ దత్తత్స్నెలులన్. ౧౪౫౩
ఆ. నిలిచి యాచకులకు ♦ వలసిన వన్నియు, నిచ్చు చుండి రిట్లు ♦ లొచ్చు లేక
సర్వగుణసమేత♦సప్తతంతువు సాగె, నద్భుతమైన ముగియ ♦ కతులితముగ. ౧౪౫౪

## వాల్మీకిమహర్షి కుశలవులరామాయణముగానము సేయ నియమించుట.

ఉ. ఈకరణిం బ్రవర్తిలు న♦హీనసవంబుఁ గనుంగొనంగ వా
ల్మీకి సశిష్యసంఘుఁ డయి ♦ మేదురరక్తిని వచ్చి తాపసా
నీకము లున్న వాటికి స♦నీడతలంబునఁ బర్ణశాలలం
గైకొని యుండె మూలఫల♦కాండలసచ్ఛకటంబు లొప్పఁగన్. ౧౪౫౫

కం. రాజవరుచేతఁ దాపస, రాజవరులచేత నర్చ ♦ గ్రహియించి మహా
తేజుం డాత్మజ్ఞుం డట, రాజిలి నిజశిష్యయుగము ♦ రక్షిం బలికెన్. ౧౮౫౬

ఉ. నాయనలార! బ్రాహ్మణజ♦నంబులపట్టుల మానివాడలం
దాయతరాజమార్గముల ♦ క్ష్మాధిపులిండుల రామచంద్రుసం
స్థాయమువాకిటం గ్రతువు ♦ సాగెడిచోటను రథ్యలందు రా
మాయణ మెల్లఁ బాడుఁడు ము♦దాప్తిని గర్ణరసాయనంబుగన్. ౧౮౫౭

కం. అందు విశేషము బుత్విగ్, బృందంబులు వినఁగఁ బాడుఁ♦డీ! యద్రిజముల్
సుందరమధురఫలంబులు, పొందుగ భుజియించి గాన♦మును గొల్పఁ దగున్.

కం. పురబాహ్యదేశభవముల, సురుచిరఫలములను మెక్కి ♦ సొలపే నలపేఁ
బరఁగదు తా పెక్కుదు మీ, స్వరమున కెంతేనిఁ బాడ ♦ బాలకులారా! ౧౮౫౯

చం. పిలువఁగఁ బంచె నేని పృథి♦వీవిభుఁ డారఘురాముఁ డీరు త
త్తలమున కేగి తాపసవి♦తానము లెల్ల వినంగఁ బాడుఁడీ
లలితమధూక్తి నాకఱపు♦లాగునఁ బెక్కుప్రమాణము ల్గదిఁ
నిలిపి దినంబు నిర్వదిగ ♦ నెమ్మిగ సర్గములం గుమారకుల్! ౧౮౬౦

కం. ధనకాంక్ష కొంచెమైనను, గొనకుఁడు లోభంబు దగదు ♦ గుణయుతులారా!
ధన మేల యాశ్రమస్థుల,కును ఫలమూలోపజీవి♦కూటంబులకున్. ౧౮౬౧

ఆ. ఎవరిచిన్నవాండ్ర ♦ రీరని రాముండు, పుడమిఱేఁడు మిమ్ము ♦ నడిగె నేని
మీరు చెప్పవలయు ♦ మేము వాల్మీకిమ,హర్షి శిష్యుల మని♦యలుకు లేక. ౧౮౬౨

ఆ. మున్ను వోలె మీరు ♦ మూర్ఛనాపద్ధతి, తప్పనీక వీణ ♦ తంత్రులం ద
పూర్వసుస్వరంబు ♦ పొలుపొంద గానంబు, జంకు లేక లెస్స ♦ సలుపవలయు.

ఆ. పాడఁ డాదినుండి ♦ వసుధేశుపట్ల న,వజ్ఞ దగదు మీకు ♦ బాలురార!
సర్వభూతములకు ♦ క్ష్మానాథుఁడే కద, జనకుఁ డగును ధర్మ♦సరణిఁ జూడ. ౧౮౬౪

ఉ. రేపటి నుండి మీరు, పరి♦హృష్టమనంబుల వీణె లూని నా
నేపినయట్లు పాడుఁ డని ♦ నిర్మలచిత్తుఁడు చెప్ప వారలుఁ
మీపలు కాచరింతు మని ♦ నిండుముదంబునఁ జెప్పి పోయి యా
మాపు గురూక్తు లాత్మ నిడి ♦ మానుగఁ బుచ్చిరి యుత్సుకాత్ము లై. ౧౮౬౫

కుశలవులు రామాయణము గానము సేయ రాముఁడు వినుట.

తే. వారు వఱువాత మేల్కని ♦ వారి నాడి
యగ్నులను వేల్చి బుషివర్యు♦నాజ్ఞ సరణి
గాన మొనరింప రాఘవ♦క్ష్మాధవుండు
వీనులకు విందుగా దాని ♦ వినియె నంత. ౧౮౬౬

సీ. హర్షంబుతోడఁ బూ♦ర్వాచార్యనిర్మిత, మై యపూర్వం బయి ♦ యమరుదాని
బాహ్యజాతుల గాన♦పరిపాటి నొప్పి ప్ర,మాణాతిశయముచే ♦ మానితమయి
తంత్రీలయసమన్వి♦తం బగుదానిని, బాలురు పాడఁగ ♦ నాలకించి
కౌతూహలపరుండు ♦ కాకుత్స్థతిలకుండు, కర్మాంతరంబున ♦ ధర్మవిదుల
ఆ. మానివరుల బుధుల ♦ మహీపుల నైగమ,జనములం బురాణ♦శబ్దవిదుల
స్వరకళానిపుణులఁ ♦ బాదాక్షరసమాస,విదుల జ్యోతిషమున ♦ విజ్ఞవరుల. ౧౪౬౭

కం. సాముద్రికవిత్తములఁ గ, ళామాత్రాభాగకుశలు♦లన్ వేదజ్ఞ
స్తోమము గాయకులను బుర,ధాముల హేతూపచార♦దక్షోత్తములన్. ౧౪౬౮

తే. కార్యనిపుణుల సత్క్రియా♦కల్పవిదుల, వృత్తసూత్రజ్ఞులను గీత♦వృత్తవిదుల
నీతినిపుణుల శాస్త్రజ్ఞ♦నిచయములను, నింగితజ్ఞుల భాష న♦హీనమతుల. ౧౪౬౯

కం. వేదాంతార్థసుబోధక, వైదికఛందోవిదగ్ర♦పౌరాణికులన్
వాదవచనకుశలులఁ జి,త్రాదికవిత్వజ్ఞులన్ స♦భావనిఁ గూర్చెన్. ౧౪౭౦

కం. అందఱు వినుచుండఁగ నా,సుందరబాలకులు గీతి♦సొం పలరింపన్
డెందముఁ గరంపఁ బాడ న,మందానందమున వినుచు ♦ మఱి తజ్జనముల్. ౧౪౭౧

← కుశలవులయెడ రాముని మొక్కట్లు చూచి జనులు విస్మితు లగుట. →

కం. భూపాలకు గాయకులను, నాపోవక కనులఁ ద్రావు♦నట్టులు కనుచున్
రూపంబున బాలకు లు,ర్వీపతినింబోలి రిట్టి♦వింతయుఁ గలదే? ౧౪౭౨

కం. బింబప్రతిబింబములవి,ధంబున రాముండు మౌని♦దారకు లారా
డంబున రాణించిరి చి,త్రం బిది యే మొక్కొ యెట్లు ♦ దల మగుఁ దెలియన్.

కం. జడలును వల్కాజినములు, విడిచినచో బాలకులకుఁ ♦ బృథ్వీశున కే
ర్పడఁ గలదే భేదం బని, నుడువఁగ గానంబు జనమ♦నోహర మగుచున్ ౧౪౭౪

కం. అతిమానుష మై వర్తిలె, నతిమధురం బగుచు శ్రోత ♦ లందఱు లవ మేన్
మతిఁ దనివిగొనక విని వి, స్మృతి గాంచఁగఁ దమ్ము నంత ♦ సీతాతనయుల్ ౧౪౭౫

తే. మానినారదదర్శిత ♦ మైనప్రథమ, సర్గమున నుండి యిరువది♦సర్గములను
గాన మొనరించి రపరాహ్ణ♦కాలముననను, స్వర్గముల నిర్వదిని విని ♦ సంతసమున

← రాముఁ డిచ్చినకానుకలఁ గుశలవులు నిరాకరించుట. →

కం. అనుజులఁ గని రాముఁడు పదు, నెనిమిదివేల్ స్వర్ణముల ము♦నీంద్రసుతులకున్
మనసార నిడుఁడు మఱి వే,నిని గోరిన నిండు వేగ ♦ నెమ్మి నటన్నన్. ౧౪౭౭

కం. భరతుండును సౌమిత్రియు, సరగం దద్ధనముఁ దెచ్చి ♦ సంయమిసుతులన్
గర మనురాగంబున నివి, గురుమతి వేర్వేఱ మీరు ♦ గొనుఁడీ యనినన్. ౧౪౭౮

కం. పచ్చనిబంగరుమాడల, నచ్చెఱుతలు గాంచి విస్మి♦తాత్మకు లయి తా
రిచ్చగొన రైరి గైకొన, వచ్చెడుఫల మెద్ది వీన ♦ వనవాసులకున్? ౧౪౭౯

చం.వనములలో వసించుచును ♦ బక్వఫలంబులు వేరు వెల్లకుల్
దినుచును ముక్కుఁ బట్టికొని ♦ తేఁకువ నెప్పుడు దైవచింతనన్
దినములు ద్రోయుమాకు నృప♦తీ! కనకంబు లి వేల? యెందు నే
పని యగు మాకు వీనిఁ గొని ♦ పాతఱ వెట్టిన భూమిలోపలన్. ౧౪౮౦

### రామాయణముఁ గూర్చి రాముఁడు కుశలవులఁ బ్రశ్నించుట.

చం.అనునుడు లాలకించి వసు♦ధాధిపుఁడున్ సభవారు విస్మయం
బున మునుఁగన్ రఘూత్తముఁడు ♦ మోదిలి పల్కుఁ గుమారులార! యే
మునిరచితంబు కావ్యమిది? ♦ మూల మదెయ్యది? దేనిఁ గూర్చి? నే
విన మది నాసఁ గొంటి విని♦పింపుఁ డటన్నను మానిబాలకుల్. ౧౪౮౧

సీ. భగవంతుఁ డగుమాని♦వాల్మీకి కృతికర్త, సవనావనీసదే♦శంబునంద
వసియించినాఁడు కా♦వ్యంబున విషయంబు, త్వచ్చరితంబు స♦ర్వంబు ఱేఁడ!
యిర్వదినాల్గు వే ♦ లెసఁగ శ్లోకంబులు, నూ ఱుపాఖ్యానముల్ ♦ మీఱునట్టు
లేనూఱు సర్గంబు ♦ లిందు రాణింపఁగఁ, గాండంబు లాఱు మ♦ఱొండు కాండ
ఆ. ముత్తరంబు నాఁగ ♦ నుర్వీశ! శోభిల్లు, మాగురుండు పల్కె ♦ మానివరుఁడు
భార్గవుండు నీదు♦వర్తనంబె శుభా,శుభములెల్లఁ దెలియ ♦ శుద్ధఫణితి. ౧౪౮౨

కం.వినఁ గోరిక కల దేనియు, జనవర! కర్మాంతరముల[1] ♦ సహజాతులతో
వినుమీ వినిచెద మన ముని,తనయులతో వల్లెయనుచు ♦ ధరణీశుఁ డనన్.
కం.అరిగిరి వారలు ముదమున, గురుఁ జేరఁగ నుటజములకుఁ ♦ గువలయపతియున్
వర మగుసంగీతము సు,స్వరతాలలయాన్వితంబు ♦ సర్గాన్వితమున్ ౧౪౮౪

### కుశలవులు దనకొమరు లని రాముఁ డెఱింగి వాల్మీకిమహర్షి యొద్దకు దూతల నంపుట.

ఆ. ఆలకించి కర్మ♦కాలకుఁ జనియెను, మునులతోడ నాప్త♦జనులతోడఁ
బిదప దినము దినము ♦ వినియెఁ దద్గీతంబు, నృపులతోడఁ గొల్చు♦కవులతోడ.
కం.గీతమువలన నెఱుంగుచు, సీతాతనుజాతు లీకు♦శీలవు లనుచున్
ఘాతలపతి సభ వినఁగా, దూతలఁ బిలిపించి యనియెఁ ♦ దోడన మీరల్[2]
కం.చని నాపల్కుగ నాకుజ,మునితో ని ట్లనుఁడు మాని♦పుంగవ! ధాత్రీ
తనయ పరిపూత యని మీ,మనమునఁ గల దేని తెలియ ♦ మా కెల్లరకున్.
ఆ. పూతశీల యనుచు ♦ వీతకల్మష యని, మీయనుజ్ఞ నొంది ♦ మెలఁత తేప
శపథ మొండు సేయఁ ♦ జాలెడినా? యని, తపసిమతము సీత♦తలఁపు నెఱిఁగి

[1] కర్మాంతరములు = రెండుకార్యములకు నడిమి విరామకాలములు.

[2] ఉత్తరకాండములోఁ గుశలవోత్పత్తి వినువఱకు నా బాలకులు తన కుమారులని శ్రీరాముఁ డెఱుఁగఁడు. ముందెందు నీ విషయము చెప్పఁబడలేదు. తమ గానము విను ప్రభువు శ్రీరాముఁడు తమ జనకుఁడని కుశలవు లెఱుఁగరు.

తే. అరుగుదెం డన వినువార ♦ లద్భుతం బ
టంచుఁ బలుకంగ దూత ల♦త్యంతజవము
తోడఁ జని మ్రొక్కి మునినాథు♦తోడ నెల్ల
మృదుమధురోక్తులఁ బలుకంగ ♦ ఋషివిభుండు. ౧౪౮౯

♦ సీత శపథంబు సేయు నని వాల్మీకిమహర్షి రామునకుఁ జెప్పి పంపుట. ♦

ఉ. రాముఁడు చెప్పినట్టుల ధ♦రాసుత సల్పెడుఁ గాక తేపటన్
భామల కెందు దైవతము ♦ ప్రాణవిభుండె కదా యటం చనన్
రామునిదూత లాపలుకుఁ ♦ గ్రమ్మఱి తెల్పఁగ మౌనిభూపతి
స్తోమముఁ గాంచి యిట్టు లనుఁ ♦ దోయజనేత్రుఁడు హృష్టచిత్తుఁడై. ౧౪౯౦

చం. పరిచర యుక్తులౌ నవని♦వల్లభులార! సశిష్యులౌ మునీ
శ్వరతతులార! యాత్మలను ♦ సందియ ముండెడిలోకులార! యె
ల్లరుఁ జనుదెండు తప్పక యి♦లాసుత రేపు జగం బెఱుంగఁగా
వరశపథం బొనర్చు నప♦వాదముఁ బాపుకొనంగ నం చనన్. ౧౪౯౧

కం. మే లని మెచ్చిరి మౌనులు, వాలాయము పొగడు చవని♦పాలురు రామా!
యీలీల నీకె తగెడిం, జాలునొకో యెవ్వఁ డేని ♦ సలుపఁగ నిట్టుల్. ౧౪౯౨

కం. అని పలుకఁగ మీ రెల్లరుఁ, జనుదెండీ! రేప టంచు ♦ జనపతి సెల వి
చ్చిన వా రాముచ్చటలే, యనుకొనుచుం జనిరి రాత్రి ♦ యటు లరుగంగన్.

♦ సీతాశపథముఁ జూచుటకు లోకులు గుంపులు చేరుట. ♦

సీ. వఱువాత రామభూ♦పతి యజ్ఞవాటంబుఁ, జేరి పిల్పించె వ♦సిష్ఠు వామ
దేవు జాబాలిని ♦ ధీమంతుఁ గాశ్యపు, గాధిజు దుర్వాసు ♦ గర్గుఁ జ్యవనుఁ
బర్వతు నారదు ♦ భార్గవు శక్తిని, వామనునిన్ భర♦ద్వాజమౌని
గౌతముఋషిని మా♦ర్కండేయునిఁ బులస్త్యుఁ, గాత్యాయనర్షి న♦గస్త్యమౌని
తే. నగ్నిసుతు సుప్రభుని ని సు♦యజ్ఞమౌని
మఱియు మౌద్గల్యుఁ దక్కిన♦మౌనివరుల
వానరుల రాక్షసుల భూమి♦వరుల వైశ్య
శూద్రజనముల నెల్లరఁ ♦ జూచుటకును. ౧౪౯౫

తే. పెక్కుదేశంబులందుండి ♦ విప్రవరులు, సంశ్రితవ్రతు లగువారు ♦ జ్ఞాననిష్ఠ
కర్మనిష్ఠయు భూరియో♦గమున నిష్ఠ, గలుగువారలు వచ్చిరి ♦ కాంచుటకును.

తే. అరుగుదెంచినవారెల్ల ♦ నద్రివోలెఁ, గదల కుండిరి దండియా♦శ్చర్యమునను
జనములెల్లరు మూఁగిన♦జాడ దెలిసి, మైథిలీయుక్తి వాల్మీకి♦మౌని వచ్చె. ౧౪౯౬

## సీతాదేవిని దోడ్కొని వాల్మీకిమహర్షి యజ్ఞశాలకు వచ్చుట.

కం. మునివరు వెంటన ధరణీతనయయు నెమ్మోము వ్రాల్చి ♦ దశరథరాముఁ
దనమనమున ధ్యానించుచుఁ, గనునీరము నిలుపుకొనుచుఁ ♦ గంతమునందున్.

కం. కరకంజంబులు మోడిచి, యరుదేరఁగ బ్రహ్మవెంట ♦ ననుగమనంబుం
బొనరుచు శ్రుతిచందంబున, మునివరుబడి వచ్చుచున్న ♦ ముగ్ధం గనుచున్. ౧౪౯౮

కం. ఘనతరశోకభరంబున, జనములు హాలహాలరవంబు ♦ సమ్మర్దముగా
నినుచుచు మేల్మే లనుచుం, గనుఁగొని రాభూమితనయఁ ♦ గాకుత్స్థవరున్. ౧౪౯౯

కం. బాపురె! రామా! యనుచును, బాపు! బళీ! సీత యనుచుఁ ♦ బలుకఁగ జనముల్
బాపురె! యని యాయిద్దఱఁ, జూపఱు మెచ్చిరి నితాంత ♦ శోకప్లుతు లై. ౧౫౦౦

తే. భూమితనయాసహాయుఁ డై ♦ పుణ్యమౌని
వల్మికోద్భవుఁ డరుదెంచి ♦ ప్రజలనడుమ
నిలిచి యెల్లరు విన రఘు ♦ కులునిఁ జూచి
బిగ్గ పలికెను రాఘవా! ♦ వినుము నీవు. ౧౫౦౧

## సీతాదేవి పతివ్రత యని వాల్మీకిమహర్షి సత్యముఁ జేసి చెప్పుట.

శా. రామా! జానకి సువ్రతాత్మ శుభధ ♦ ర్మస్థితచారిత్ర నీ
వేమో లోకమునిందమాటలకు నై ♦ యీసాధ్విని మత్తపో
భూమీసక్తవనంబునన్ విడిచి, తీ ♦ భూపుత్రి లోకాపవా
దామానస్యుఁడ వీవు నమ్మ శపథం ♦ బారంగఁ గావించెడిన్. ౧౫౦౨

కం అనుమతి యిమ్మా జానకి, తనయుల యీకవలవారు ♦ తథ్యము నీకుం
జనియించిరి దుర్ధర్షులు, దినకరకుల నే వచించి ♦ తిన్ సత్యంబున్. ౧౫౦౩

సీ. శ్రీరామ! నేను బ్ర ♦ చేతసుపదియవ, పుత్త్రుండ మది నైన ♦ బొంకుఁ దలఁప
నీపుత్త్రు లిద్దఱు ♦ నీపుత్త్రులే చుమ్ము, పెక్కువేలేఁడు లే ♦ నుక్కడంపుఁ
దప మొనరించితి ♦ ధరణిజ దుష్టయేన్, దపముఫలంబెల్ల ♦ దగ్ధ మగుత
మనసునఁ గర్మంబు ♦ నను వాక్కుచేతను, గలుషంబు నే నెప్డు ♦ సలుప లేదు

ఆ. వానిఫలము నాకుఁ ♦ బ్రాపించు భూసుత, పాపహీన యేని ♦ పార్థివేంద్ర
భూతపంచకమున ♦ బుద్ధిని జానకి, నెఱిఁగి పూత యని గ్ర ♦ హించినాఁడ.[1] ౧౫౦౪

ఆ. పాపహీనురాలు ♦ పతిదేవతామణి, యతిపవిత్రశీల ♦ యవనిజనుల
నడికి వెఱచునీకుఁ ♦ జక్కఁగ నమ్మిక, కలుగఁజేయ బాస ♦ సలుపు నిపుడు. ౧౫౦౫

ఆ. దివ్యదృష్టిచేత ♦ భవ్యాత్మ యీసతి, యనుచు నెఱిఁగినాఁడ ♦ జనులదూఱు
పడఁగ లేక నీవు ♦ పడఁతి శుద్ధ యటంచు, నెఱిఁగయెఱిఁగి విడిచి ♦ తీమె నడవి.[2]

---

[1] ఈపద్యమును జదివినవారు వాల్మీకిక్రూరవృత్తియం దుండె ననుకథ నెంతవఱకు విశ్వసింతురొ

[2] ఈమె పాతివ్రత్యమును - మహిమనులోకమున స్థాపించుటకే వాల్మీకి శ్రీమద్రామాయణమును నామె తన యాశ్రమమందుండు కాలములో రచియించెను.

## లోకాపవాదముఁ బాపుకొన సీతాదేవి శపథము సేయ వలయు నని రాముఁ డనుట.

కం. అని యిటు వాల్మీకి వచించిన విని కరయుగము మోడ్చి ♦ శ్రీరాఘవుఁడుఙ్
జనమధ్యంబున సీతా,వనజాక్షిం గనుచుఁ బలికెఁ ♦ బరమతపస్వీ! ౧౫౦౭

ఉ. నమ్మితి నేను నీపలుకు ♦ నాయెడ సందియ మేమి లేదు, ని
క్కమ్ము ధరాతనూభవ య♦కల్మష, మున్ను సురాళిసన్నిధిఙ్
సమ్మతిఁ బ్రత్యయం బిడియెఁ ♦ జాన, యటైటఁ గదయ్యె యప్డు గే
హమ్మున కేను దెచ్చితి, జ♦నావళిదూఱు సహింప శక్యమే? ౧౫౦౮

ఉ. కావున లోకభీతి మహీ♦కన్యక శుద్ధ యటం చెఱింగి నే
నీవిధి వీడఁగా వలసె ♦ నీవు క్షమింపుము నన్ను దానికై
భావమునం దెఱుంగుదును ♦ బాలకు లిద్దఱు నాకుమారు లీ
భూవలయంబు సీత పరి♦పూత యటన్నను బ్రీతిఁ గూరెడన్.[1] ౧౫౦౯

సీ. అనవుడు దశరథ♦తనయునభిప్రాయ, మెఱింగి దేవతలెల్ల ♦ నింద్రుఁ డాది
బ్రహ్మ మున్నుగ మింట ♦ వచ్చినిల్చిరి సీత,శపథంబుఁ జూడంగ ♦ సంభ్రమమున
వసువులు రుద్రు ల♦ప్సరసలు గంధర్వు, లాదిత్యులు మరుత్తు ♦ లశ్వు లోలి
విబుధ సిద్ధులు సాధ్య ♦ విశ్వదేవులు మహా,ఋషివరుల్ వచ్చిన ♦ నెల్లవారిఁ

ఆ. జూచి రాముఁ డనియె ♦ సురలార! మునులార!, మౌనివాక్యములను♦మహితనూజ
నిర్మలాత్మ యనుచు ♦ నెఱనమ్మినాఁడను, జగము నమ్మెనేని ♦ సంతసింతు. ౧౫౧౦

చం. అనవుడు దివ్యగంధము సు♦ఖావహముఙ్ హృదయంగమంబు నై
యనిలుఁడు సర్వలోకులకు ♦ హాయిగ వీచెఁ గృతంబునం దనఙ్
జనము మహాద్భుతం బనుచు ♦ సంభ్రమ మూఁగఁ జూచు చుండ భూ
తనయయుఁ గావిచేలమును ♦ దాల్చి సభాజనతాంతరంబునన్. ౧౫౧౧

## శ్రీసీతాదేవి శపథంబు సేయుట.

కం. కరకంజంబులు మోడిచి, ధరణిం గనుఁగొనుచు శిరముఁ ♦ దగ వ్రాలిచి యె
ల్లరు వినఁగా ని ట్లనియెను, సరసీరుహనయన దా న♦చంచలమతి యై. ౧౫౧౨

తే. స్వాంతమం దైన శ్రీరామ♦చంద్రుఁ దక్క, వేఱుపురుషుని మదిని భా♦వింపనేనిఁ
బరమశీలంబుచేతఁ బా♦వనిన యేనిఁ, దల్లి! యో మాధవీదేవి! ♦ దారి నిమ్ము.

తే. మనసు చేతను నుడులఁ గ♦ర్మములచేతఁ, బ్రాణవల్లభుఁ డైన శ్రీ♦రామభద్రు
నే సదా యర్చనము సేత ♦ నిక్క మేని, తల్లి! యో మాధవీదేవి! ♦ దారి నిమ్ము.

తే. ప్రాణవల్లభుఁ డౌ రామ ♦ భద్రుఁ దప్పఁ
బరపురుషు నే నెఱుంగ నా♦భాషితంబు

[1] సీత బాసచేయవలయునని రాముఁ డడిగెను గాని యట్లుచేసిన గ్రహింతునని యాయన యనలేదు. బాసచేయునని వాల్మీకి చెప్పెనుగాని మరల గ్రహింపుమని యాయన కోరలేదు. కాఁగల సంగతి నిరువురు నెఱుఁగుదురు.

పో ల్లుగా దేని ముమ్మాటి ♦ కెల్లరుఁ గనఁ
దల్లి! యో మాధవీదేవి![1] ♦ దారి నిమ్ము. ౧౫౧౫

⟵ సీతాదేవి రసాతలంబునకుఁ బోవుట ⟶

సీ. అని శపథంబుల ♦ నాడిన యంతన, పరమాద్భుతంబుగఁ ♦ బ్రజలు గనఁగ
నమితవిక్రము లైన♦యహిపతుల్ శిరమున, ధరియింప దివ్యర♦త్నజ్వలితము
దేవతారచితంబు ♦ దివ్యసింహాసన, మిలనుండి వెంటనె ♦ యెగయుఁ దెంచె
నందు ధాత్రీదేవి ♦ హస్తంబులను సీత, గ్రహియించి కుశలంబుఁ ♦ బ్రశ్న సేసి
తే. సింహపీఠిక నుపవిష్టఁ ♦ జేసి కొంచుఁ
బోయెను రసాతలమునకు ♦ భూమితనయ
పై నవిచ్ఛిన్నముగఁ బుష్ప♦వర్ష మపుడు
గురిసెఁ గొండాడఁ జొచ్చిరి♦సురలు ఋషులు. ౧౫౧౬
తే. మేలు మే లమ్మ! జానకీ! ♦ మేలు దేవి!
యౌర! బాపురె! బళి! బళీ! ♦ యహహ! చాఁగు!
నీదుశీలం బహో! యెంత♦నిర్మలంబొ!
యిట్టిదా నీదునడవడి ♦ యిగురుఁబోణి! ౧౫౧౭
కం. అని యంతరిక్షగతు లన, మనములు విస్మయ మహాబ్ధి♦మగ్నంబులుగా
మునులును యజ్ఞాలయగత,జనవర్యులు ప్రతిమలట్లు ♦ సంవీక్షింపన్. ౧౫౧౮
కం. భూతలమున గగనంబునఁ, బాతాళమునందు నెల్లఁ ♦ బన్నగదనుజ
వ్రాతము స్థావరజంగమ,జాతము క్రియ మాని వీత♦చైతన్యం బై. ౧౫౧౯
కం. కొందఱు ముదమున నఱచిరి, కొందఱు ధ్యానమున మునిఁగి ♦ కూరిరి చింతన్
గొందఱు రామునిఁ జూచిరి,కొందఱు కనుఁగొనిరి పుడమి♦కొమరితె పదులన్.
కం. సీతాప్రవేశనంబును, భూతకదంబంబు చూచి ♦ పొదలినచింతన్
జాతమహావిస్మయమునఁ, జేతము చెడి మోహమునను ♦ జేష్టుడి యుండెన్.

⟵ సీతావియోగంబునకు రాముఁడు పరితపించుట. ⟶

సీ. జానకీదేవి ర♦సాతలంబున కేగ, మేలు మే లని కపి♦జాల మనఁగ
దండకాష్ఠంబు నూఁ♦తగఁ గొని రాముండు, శిరము వ్రేలఁగ వైచి ♦ చింత మునిఁగి
పరమదుఃఖితుఁ డయి ♦ బాష్పము ల్గార్చుచుఁ,బెద్దకాలం బేడ్చి ♦ వితతశోక
రోషయుక్తుం డయి ♦ భాషించె నీగతి, నెప్పుడు దుఃఖ మే ♦ నెఱుఁగ నిప్పు
ఆ. డనుభూతశోక ♦ మాపహించెడి మది, నేను జూచు చుండ ♦ శ్రీనిబోలు
నాదుదయిత సీత ♦ నష్ట యయ్యె నయారె,యెట్లు సైఁపవచ్చు ♦ నిట్టివెతను.

[1] మరల నగ్నిలోఁ బ్రవేశింపరాదాయని కొందఱు సీత నధిక్షేపింతురు. మరల మరల నదియే చేసిన నగ్నిస్తంభనవిద్యచే నట్లు చేయుచున్నదని లోకులందురు. లంకలోని వృత్తాంత మయోధ్యలోనివారు నమ్మనప్పు డయోధ్యలో జరగినది దేశాంతరమునఁ గాలాంతరమునవారు నమ్ముదురని యేమి నమ్మిక? ఎన్ని మారులని యిట్టి పరీక్ష? భృగుశాపము ఫలింపఁజేయుటెట్లు? మాధవీదేవి = భూదేవి.

కం. జలనిధియావలితటమున, బలితపులంకన్ నిరుద్ధ ♦ భామిని మరలన్
బలమునఁ దెచ్చిన నా కీ,యిల దాఁచిన సీతఁ దెచ్చు ♦ టెంతటి పనియో. ౧౫౨౩

—రాముఁడు భూదేవిపైఁ గోపించుట.—

కం. వసుధాదేవీ! సీతను, వెసఁ గ్రమ్మఱఁ దెచ్చి విడుము ♦ విడువవ యేనిన్
గసిమసఁగి నాదురోషం, బసదృశగతిఁ జూపువాఁడ ♦ నాత్మ నెఱుంగన్. ౧౫౨౪

కం. హలహస్తుం డగుజనకుఁడు, కలికిని నీలోన నుండి ♦ కద దున్ను నెడన్
వెలికిం దెచ్చెను ధర్మము,కలిమిం బరికింప నత్త ♦ గారవు నాకున్. ౧౫౨౫

ఉ. కావున నాతలోదరిని ♦ గ్రమ్మఱ ని మ్మిపు డీవు కానిచో
దేవిరో! నాకు నిమ్ము చనఁ ♦ దెర్వు రసాతలమందొ స్వర్గమం
దో వనితామణిం గదిసి ♦ యుత్సుకతం జరియించు చుందు నా
దేవి యథాస్వరూపముగఁ ♦ దేకయె యాలముఁ జేసి తేనియున్. ౧౫౨౬

కం. అత్తా! జానకికతమున, మత్తుఁడఁ గోపమున రూపు ♦ మాపెద నిన్నున్
బత్తన కానన ధరణీ,భృత్తతితో నీటఁ గలిపి ♦ వేసెదఁ గనుమీ. ౧౫౨౭

—బ్రహ్మ రాముని శాంతునిఁ జేయుట.—

చం. అనుచు రుషాకషాయితదృ♦గంచలుఁ డై వచియించు రామునిన్
గని సురసంచయాన్వితుఁడు ♦ కంజభవుండు వచించె రాఘవా!
కినియకు రామచంద్ర! మదిఁ ♦ గీల్కొలుపం దగుఁ బూర్వభావమున్[1]
మును పొనరించుమంత్రమును ♦ ముగ్ధసరోజవిశాలలోచనా. ౧౫౨౮

కం. నిను స్మరియింపఁగఁ జేయఁగ, ననఘా! నే నెంతవాఁడ ♦ నాత్మఁ దలఁపుమీ
వనజాక్ష వైష్ణవం బగు,జననం బివ్వేళఁ జిత్త♦శాంతిం గనుమీ. ౧౫౨౯

కం. నీపూర్వపరాయణ యగు,భూపుత్త్రిక విమలసాధ్వి ♦ భోగి జగతిఁ ద్వ
త్ప్రాపితతపోబలంబున, నేపారెడి సర్వసుఖస♦మేతాత్మిక యై. ౧౫౩౦

—రామాయణ శేషము విను మని బ్రహ్మ రాముని వేఁడుట.—

కం. నినుఁ గలయును స్వర్గంబున,[2] ఘనవేణి నిజంబు నీదు♦కావ్యం బెల్లన్
విను మది సర్వముఁ దెలిపెడు, వనజాక్షా! నిలుపు నాదు♦వాక్యము లెదలోన్.

ఉ. ఉత్తమకావ్య మయ్యది త్వ♦దుద్భవమాది సుఖంబు దుఃఖముల్
హత్తినరీతిఁ దెల్పెడి య♦థార్థముగా సభవిష్యమై మఱిన్
సోత్తర మానటుల్ పలికె ♦ సొంపుగ వాల్మికి దాని నెల్ల నీ
విత్తఱి విన్ము నీవ యవ♦నీశ్వర! యర్హుఁడ వద్ది గైకొనన్. ౧౫౩౨

కం. నీయంద సుప్రతిష్ఠిత, మై యఖిలం బుండు రామ ♦ యాదిమకావ్యం
బీయది దివ్యం బద్భుత,మై యజ్ఞానచ్యుతంబు ♦ నై సత్యం బై. ౧౫౩౩

---

[1] పూర్వభావము = విష్ణుత్వము. మనుపొనరించు మంత్రము = అవతారమెత్తుటకుఁ బూర్వము చేసిన యాలోచన. [2] స్వర్గము = వైకుంఠము.

కం. రాజిలెడి నేను నిర్జర, రాజులతో విసినవాఁడ ♦ రామా! దీనిన్
భ్రాజితకీర్తిదసత్కృతి, రాజమునకుఁ దగఁ దెసందు ♦ రాముఁడు దక్కన్. ౧౫౩౪

కం. రామా! శేషభవిష్యము, రామాయణ మాలకింపు ♦ రాగమున ముని
స్తోమంబుతోడ నుత్తర, నామక మది మిగిలె నది వినం దగు దీవే. ౧౫౩౫

కం. మిగిలినరామాయణమును, దగు దీ వొక్కండె వినఁగఁ ♦ దగ రితరు లటం
చగపడ కుండ దివంబున, కెగసి చనెన్ సురలతోడ ♦ ఋషికాండముతోన్.

కం. ఆవల రాముఁడు విధివా, క్యావళి మది నిలిపి కొంతసే ♦ నాలించుమతిన్
దా వాల్మీకికి ని ట్లనె, నే వినియెద భావిచరిత ♦ నిఖిలము వేగన్. ౧౫౩౭

కం. అని నిశ్చయించి జనములఁ, బనివినుఁ డని చెప్పి కవల ♦ బాలురతో న
మ్మునిపర్ణశాలకుం జని, జనకజఁ దలఁపోసికొనుచు ♦ శర్వరి గడపెన్. ౧౫౩౮

←— రాముఁ డుత్తరకాండశేషమును వినుట. —→

కం. కనులాప్తుం డుదయించినఁ, గొమరుల డాయంగఁ బిలిచి ♦ కొంకక శేషం
బనులగతిం బాడుఁ డనన్, రమణీయము గాఁగ వారు ♦ రామాయణమున్.

కం. జరుగఁగలదానిఁ గలయు, త్తరకాండము శేష మెల్లఁ ♦ దత్త్వజ్ఞ ఋషుల్
ధరణీశుఁడు వినఁ బాడిరి, సరగన యజ్ఞంబు దీర ♦ జ్ఞానాథుండున్. ౧౫౪౦

కం. వైదేహి లేమి దుస్సహ, వేదన శూన్యంబు గాఁగ ♦ విశ్వము దోఁపన్
మేదురశోకంబున గో, త్రానయితులకును వనాట ♦ రాక్షసతతికిన్. ౧౫౪౧

←— రాముఁడు కొడుకులతో నయోధ్యఁ బ్రవేశించుట. —→

కం. జనములకున్ విప్రులకున్, ధనముల నర్పించి పంపి ♦ తమయూళ్లులకున్
మనమున సీత స్మరించుచుఁ, జనియె నయోధ్యకును నాత్మ ♦ జాతులతోడన్.

కం. జానకిని గాక వే ఱొక, మానవతి వరింపఁ డయ్యె ♦ మహితవ్రతుఁ డ
న్యానంబుగఁ గార్తస్వర, జానకియే భార్య జన్మ ♦ జన్మమునందున్.[1] ౧౫౪౩

కం. ఆవిధిఁ బదివేలేఁడులు, గావించెను వాజిమేధ ♦ కంబులఁ బెక్కుల్
సౌవర్ణవాజపేయము, లావారిగదక్షిణల స ♦ మర్పించెఁ దగన్. ౧౫౪౪

సీ. నియతిమై సలిపె న ♦ గ్నిష్టోమగోసవ, ములఁ బెక్కు లతిరాత్ర ♦ ములను విభుఁడు
కడచెను బెద్దయుఁ ♦ గాల మిట్టులు జను, లెల్లను సంప్రీతి ♦ నెసక మెసఁగ
వానరరాక్షసుల్ ♦ వర్తిలఁ దనయాజ్ఞఁ, గాలవర్షంబులు ♦ గలుగుచుండఁ
గాటకంబులు లేక ♦ కలిమిఁ దలిర్పఁగ, హృష్టు లై ♦ పుష్టు లై యెల్ల రెసఁగ

ఆ. వ్యాధు లెందు లేవు ♦ ప్రాణికోటి కకాల, మరణ మెందు లేదు ♦ పౌరయ రెవ్వ
రెట్టికీడు నైన ♦ నిట్టులు బహుదీర్ఘ, సమల నేలె రామ ♦ చంద్రవిభుఁడు. ౧౫౪౫

[1] శ్రీరామునియేకపత్నీవ్రతము నిది స్థాపించెడి వాల్మీకిరామాయణనాయకుఁడు బహు భార్యుఁడనుట వాల్మీకిమతము గాదు. సత్యమును గాదు.

## కౌసల్యాసుమిత్రాకైకేయులు మరణించుట.

సీ. పుత్రపౌత్రులతోడఁ ♦ బొలుపారుకౌసల్య, చాలకాలము వెన్కఁ ♦ జనియె దివికి
నాయువు వెదుకొని ♦ రనఘ సుమిత్రయుఁ, గైకయు ధర్మముల్ ♦ కడమనడక
సలిపి వారందఱు ♦ స్వర్గంబునకు నేగి, దశరథుఁ గూడి ము♦దంబుఁ గాంచ[1]
వారికై రాముండు ♦ బహుదానములు సల్పి, మునుల బ్రాహ్మణులను♦దనివి పఱిచి
ఆ. యూర్ధ్వదైహికముల ♦ నన్నిటిఁ బచరించి, పితరులకును జాలఁ ♦ బ్రీతిఁగూర్చి
యవల రాజ్య మేలె ♦ హాయనంబులు పెక్కు, వేలు రామచంద్ర♦విభుఁడు రక్తి.

## యుధాజితుండు గార్గ్యుని రామునొద్దకుఁ బంపుట.

తే. ఒక్కనాఁడు యుధాజితుం ♦ డుగ్ర తేజు, నంగిరునిపుత్రు, గార్గ్య మ♦హర్షి వరునిఁ
దనదుగురువును దశరథ♦తనయుకడకుఁ, బంచెఁ గంబళరత్నాళి ♦ వస్త్రయుక్తి.
కం. వాజుల దశసాహస్రం, బా జిసుతున కీయఁ బంచె ♦ నాతని రాకన్
రాజవరుఁడు రాముఁడు విని, రాజితగతి నెదురు చనియె ♦ భ్రాతలతోడన్. ౧౫౪౮
ఆ. అరిగి క్రోశమాత్ర ♦ మాతనిఁ గనుఁగొని, యమరవిభుఁడు జీవు ♦ నర్చసలుపు
నట్లు పూజచేసి ♦ యాధనంబులఁ గొని, ప్రశ్న చేసెఁ గుశల♦వార్తలెల్ల. ౧౫౪౯

## గార్గ్యుఁడు యుధాజిత్తుసందేశమును రామునితోఁ జెప్పుట.

సీ. ఉపవిష్టుఁ డైనయా♦యుర్వీసురునితోడ, మామేనమామకు ♦ క్షేమ మగునె
యేమికార్యార్థ మై ♦ యిందు మి మ్మనిచెనో, వచియింపుఁ డాయశ♦వాక్యములను
నావుడు బ్రహ్మర్షి ♦ నయముగ మీమామ, వచియించినదియెల్లఁ ♦ బలుకువాఁడ
విన నభిమత మేని ♦ విన వయ్య! సింధువు, నుభయపార్శ్వంబుల ♦ నొప్పమీఱు
తే. దేశ మయ్యది ఫలమూల♦దీపితంబు
దాని రక్షించువారు గం♦ధర్వవరులు
సాయుధుల్ యుద్ధకోవిదుల్ ♦ సాహసికులు
మూఁడుకోటులు శైలూష♦పుత్రకులును. ౧౫౫౦
తే. దారుణాహవమునను గం♦ధర్వపురము
రాఘువా! గెల్చి నీదురా♦ష్ట్రంబునందుఁ
గలుపుకొను మిది యిష్టమేన్ ♦ గానికార్య
మహిత మే నాడ నయ్య శూ♦రావతంస! ౧౫౫౧
కం. ఆరాష్ట్రంబులవంకను, బో రా దేవారి కైన ♦ భూపాలక నా
శ్రీరాముఁ డానుడు ల్విని, పేరిమిఁ గైకేయితనయు ♦ వీక్షించెఁ దమిన్. ౧౫౫౨
కం. మునివరుఁ గనుఁగొని భరతుని, తనయులు వీ రిర్వు రందుఁ ♦ దమతాత తముఁన్
గొనకొని కావఁగ నుండెద, రనుపమబల తక్షపుష్క♦లాఖ్యుల వీరిన్ ౧౫౫౩

[1] తక్కినవారి సంబంధమువలె భార్యా భర్తృసంబంధ మొక జన్మములోఁ దెగిపోవునది కాదు.

చం. భరతునితోడఁ బంపెదను ♦ వాహినిఁ గూర్చి విరోధిసంఘమున్
దురమునఁ గూల్చి తత్పురము ♦ దోర్బలశక్తి హరించి రెండుగాఁ
బురి విభజించి వీరలకుఁ ♦ బోషిమఁ బంచి యొసంగి క్రమ్మఱన్
బరమమునీంద్ర యంచుఁ దగు♦భంగి బలంబుల నిచ్చి బాలురన్. ౧౫౫౪

↞ రాముఁడు సపుత్రు భరతుని గంధర్వుల జయింపఁ బంపుట. ↠

కం. అభిషిక్తులుగా నొనరిచి, శుభనక్షత్రమునఁ బంప ♦ సుతులును వేధో
నిభుఁ డగుగార్గ్యుఁడు బడి రా, విభవంబునఁ గైకసుతుఁడు ♦ వెడలెం బురమున్.

కం. రామానుగతము దివిజ,స్తోమదురాధర్ష మగుచుఁ ♦ దోఁచె దళము సు
త్రామాన్వితం బయినటు, లీమాడ్కి ని వెడలి దూర ♦ మేగుచు నుండన్. ౧౫౫౬

కం. పలలాదము లగుసత్త్వం,బులు పోఁకులు భూతములును ♦ బోవం దొడఁగెన్
బలమునకు స్సంగలగాఁ, గలి[1] గంధర్వామిషంబుఁ ♦ గడుపారఁ దినన్. ౧౫౫౭

కం. పులులును సింహంబులుఁ బం,దులు మున్నగఁ బోవు చుండఁ ♦ దోయజకులుఁడున్
నెల పదునేనుదినంబులు, లలితగతిం ద్రోవఁ జని బ♦లంగముతోడన్. ౧౫౫౮

↞ భరతుండు గంధర్వుల జయించుట. ↠

సీ. కేకయపురిఁ జేరఁ ♦ గీర్తితశౌర్యుండు, భరతుండు వచ్చిన♦వార్త దెలిసి
తనదుసైన్యముతోడఁ ♦ దరలె నిట్లిర్వురు, భరతయుధాజితుల్ ♦ ప్రకటబలులు
దటుకున నేగి గం♦ధర్వపురంబును, ముట్టిన వా రాజి♦ మోదమునను
బలముతో భటులతో ♦ వెలువడి తుములంబు,గా సప్తరాత్రంబు ♦ నొసరిలక

తే. సమర మొనరింపఁ గోదండ ♦ శక్తి ఖడ్గ,నక్రములు శోణితాపగల్ ♦ నరకళేబ
రములతోఁ బ్రవహించె ని♦రంకుశముగ, సకలదిశలను రోమహ♦ర్షంబు గాఁగ.

ఉ. ధూర్త లతుల్యశౌర్యబల♦దుర్ధరు లై సరి గాఁగఁ బోర న
మ్మూర్తరపౌరుషంబుఁ గని ♦ మాడ్చెదఁ గా కని దారుణంబు సం
వర్త మనంగ నొప్పసమ♦వర్తిమహాస్త్రము రోషసంజ్వల
న్మూర్తి రఘూద్వహుం డెదురు♦మూఁకలపైఁ బఱపంగ నద్దియున్. ౧౫౬౦

కం. కాలానలహవ్యవహ,జ్వాలావళివోలె హేతి♦వర్గము గురియన్
గోలాహల మెసఁగఁగ రిపు,జాలంబుల మూఁడుకోట్ల ♦ క్షణమున మాడ్చెన్.

కం. ము న్నిట్టిదాని నెన్నఁడుఁ, గన్నట్టు స్మరింప రైరి ♦ ఖచరులు భరతుం
డు న్నటి గెలిచి విరోధుల, నన్నగరయుగంబునందు ♦ నాత్మజయుగమున్. ౧౫౬౨

↞ భరతుండు తక్షపుష్కలులకుఁ బట్టాభిషేకంబు సేయుట. ↠

తే. తక్షశిల[2]యందుఁ దక్షుఁ డ♦ న్తనయు నిలిపి
పుష్కలునిఁ బుష్కలావతీ♦పురమునందు

[1] కలిన్ = యుద్ధమందు. [2] తక్షశిల = ఇప్పుడు 'టాక్సిల' యనఁబడుచున్నది.

నిలిపె ధనరత్నకానన♦కలితమైన సు
దీపితం బగుగాంధార♦దేశమునను. ౧౫౬౩

సీ. పాపహీనంబులౌ♦వ్యవహారముల చేతఁ, దతసుందరోద్యాన♦తతుల చేత
నతులవిభక్తాంత♦రాపణంబుల చేతఁ, నవ్యంబులౌ విమా♦నముల చేతఁ
జూడఁ జూడఁగఁ గడు♦సొంపారునిండ్ల చే, హారులౌ దేవాల♦యముల చేతఁ
దిలకతాలతమాల♦లలితద్రుమాళిచే, వకులబంధురసార♦భముల చేతఁ

ఆ. బోటి వేసికొనిన♦పోలుపున వాడాడు, భంగిఁ బురయుగంబు ♦ వర్ధిలంగ
భరతుఁ డందు నైదు♦వత్సరంబులు నిల్చి, క్రమ్మఱంగ వచ్చె ♦ రాముకడకు.

కం. అరుదెంచి ధర్మమూర్తికిఁ, జరణంబుల వ్రాలి మ్రొక్కి ♦ సర్వము వినిచెన్
బరుల వధించుట తనయులఁ, బురముల నిల్పుటయు నన్న♦పొంగఁగ మదిలోన్.

## రాముఁడు లక్ష్మణకుమారులను గారుపథచంద్రకాంతములకుఁ బ్రభువులఁ జేయుట.

తే. సానుజుండైన శ్రీరామ♦చంద్రవిభుఁడు
సర్వ మాలించి సంతోష♦సంభ్రమమున
లక్ష్మణునిఁ జూచి. నీసుతు♦ల్ధర్మవేదు
లంగదుఁడు చంద్రకేతుండు ♦ నమితబలులు. ౧౫౬౬

ఉ. వీరలు చాలువారు పృథి♦వీభరణంబున కేప్రదేశముల్
తీరగు వీరి నిల్ప నది ♦ తెల్పుము యాశ్రమపాళి కేనియున్
భూరమణోత్కరంబునకుఁ ♦ బుట్టక యుండఁగఁ బీడ నావుడున్
శ్రీరఘునాథుఁ గన్గొని వ♦చించెను గైకయిసూనుఁ డీగతిన్. ౧౫౬౭

ఉ. కారుపథం బనంగఁ గడుఁ♦గమ్రమబాధము నైనదేశమం
దీరమణీయమూర్తి ధర♦ణీశ్వరుఁ జేయుఁగ నొప్పు నంగదున్
దీ రగుఁ జంద్రకాంత మను ♦ దేశమునం దొగిఁ జంద్రకేతునిన్
భూరమణేంద్రుఁ జేయ ననఁ ♦ బొంగి రఘూత్తముఁ డాకుమారులన్. ౧౫౬౮

ఆ. అంగదీయపురికి ♦ నంగదు రాజుగా, మల్లభూమియందు ♦ మల్లుఁడైన
చంద్రకేతు నిల్పి ♦ చంద్రకాంతాపురి, నాభిషేకవిధుల ♦ నాచరించె. ౧౫౬౯

చం. పడమటిభూమి కంగదునిఁ ♦ బంపె సలక్ష్మణుఁ, జంద్రకేతు వెం
బడి భరతుం గుబేరదిశ♦వైపునఁ బంపెను, వారు ప్రీతి నా
పుడముల కేగి రందు జన♦పూజ్యుఁడు లక్ష్మణుఁ, డబ్దముండి తాఁ
గొడుకుసు నిల్పి రాజ్యమునఁ ♦ గోరికఁ గ్రమ్మఱె రాముఁ గొల్వఁగన్. ౧౫౭౦

ఆ. చంద్రకేతుతోడ ♦ సంవత్సరాధిక, కాల ముండి మరలఁ గదలి వచ్చె
మాండవీవిభుండు ♦ మార్తండ తేజుఁడై, రామచంద్రుఁ గొలుచు ♦ రాగమునను.
కం. సౌమిత్రిభరతు లీగతి, రామపదాబ్జములఁ గొలుచు ♦ రక్తిని గాలం
బేమాడ్కిఁ జనెనొ నెఱుఁగరు, దా మాతలఁ దలఁప రెపుడుఁ ♦ దమనందనులన్.
చం. ఇటు పదివేలవత్సరము ♦ లేగ సదాజనకార్యరక్తులై
స్ఫుటపరిపూర్ణచిత్తు లయి ♦ శోభితభాగ్యరమావిలాసులై
పటుతరతేజులై ముగురు ♦ భ్రాతలు వెల్గిరి యాహుతీక్ విశం
కటరుచి మీఱువహ్నులత్రి ♦ కంబునకుక్ సరి సాటియాడుగన్. ౧౫౭౩

← రాముని సందర్శింపఁ గాలుఁడు వచ్చుట. →

ఉ. అంతటఁ గొంతకాలమున ♦ కంబుజనేత్రునిఁ జూడఁ గోరి భూ
కాంతునివాకిటక్ నిలిచి ♦ కాలుఁడు తాపసవేష మూని ధీ
మంతుని లక్ష్మణుం గని కు ♦ మారక! దూతను నేను ధారిణీ
కాంతునిఁ జూడఁ గోరెదను ♦ గార్యవశంబున వార్తఁ బుచ్చుమీ. ౧౫౭౪
కం. అమితౌజస్కుండగుసం, యమి యతిబలుఁ డంపె నన్ను ♦ నన లక్ష్మణుఁడుక్
సుముదంబున సరగం జని, యమి యొక్కఁడు దేవ! ఖరక ♦ రాంశునిభుండున్.
కం. దూత యయి మిమ్ముఁ జూడం, బ్రీతిపడె న టన్నఁ దెమ్ము ♦ వేగ మ టన్నక్
స్ఫీతద్యుతి ఋషిని సుమి, త్రాతనయుఁడు లోన విడువఁ ♦ దాపసవిభుఁడున్
ఉ. దీవన లిచ్చి రామవిభుఁ ♦ డెల్చిన నర్ఘ్యముఁ బాద్య మిచ్చి సీ
తావిభుఁ డర్హపీఠిపయిఁ ♦ దాపసు నుంచి మహాత్మ సేమమా?
యీవిధి రాఁగ నేమి కత ♦ మేర్పడఁ జెప్పుఁ డ టన్న రాఘవా!
యీవును నే రహస్యులిని ♦ నియ్యది ముచ్చటలాడ నర్హమా. ౧౫౭౭
కం. మనవాక్యము లెవఁ డేనియు, వినఁ గూడదు మఱియు మనల ♦ వీక్షింపఁగనేక్
జన దటుచేసినవానిక్, జనవర వధియింతు వేని ♦ సంభాషింతున్. ౧౫౭౮
కం. మునిమతము హితాచరణం, బున నీమది చనెడి నేని ♦ పొనరింపుము క్ర
న్నన యిట్టు లనఁగ నట్టుల, యొనరించెద ననుచు నిజస ♦ హోదరుఁ బిలిచెన్. ౧౫౭౯
తే. పిలిచి సౌమిత్రితో నను ♦ నిలుము నీవ
ద్వారమున ద్వారపాలకుఁ ♦ బంపు దూర
ముభయులము మాటలాడుచు ♦ నుండ లోన
వచ్చువాఁడును వినువాఁడు ♦ వధ్యుఁ డగును. ౧౫౮౦
కం. అని ద్వారమున సుమిత్రా, తనుజాతుని నిల్పి నియమ ♦ ధన! సందేశం
బును దెల్పఁ డదియు నామన, మున వర్తించెడిని నాఁగ ♦ ముని యిట్లనియెన్.

## ✥ బ్రహ్మసందేశమును గాలుండు రామునకుఁ దెల్పుట. ✥

తే. వినుము రాజేంద్ర! నాపల్కు♦విధము నెల్ల
బ్రహ్మపనుపున వచ్చిన♦వాఁడ నేను
పూర్వభవమున నే నీకుఁ ♦ బుత్రకుఁడను.
మాయచే నైతి సర్వసం♦హారకుఁడను. ౧౫౮-౨

సీ. కాలుండ నేను నీ ♦ వాలింపు మో దేవ! వారిజగర్భుని♦వాక్యములను
స్వీయలోకంబును ♦ జేరి రక్షింపఁగ, సమయ మియ్యది నీకు ♦ సౌమ్యచరిత!
పూర్వంబు జగములఁ♦బొలియించి మాయచే, స్వయముగ జలరాశి♦శాయి వగుచుఁ
దొలుత సృష్టించితి ♦ జలములయందు న,న్నవల జలేశయ♦మైన నాగ
ఆ. వర మనంత మనెడి♦పురుభోగవంతంబు, మాయచేత సత్త్వ♦మహితు లైన
మధునిఁ గైటభాఖ్యు ♦ మర్దింప వారల,యస్థితతి సశైల ♦ మవని గలిగె. ౧౫౮ ౩

తే. దివ్యమై తామరసహిత♦దీప్తిఁ దనరు, వారిజంబున నీనాభి ♦ వలన నన్నుఁ
గలుగఁ జేసి ప్రాజాపత్య♦కర్మమునను, నీవ నిలిపితి వో దేవ! ♦ నిత్యముగను. ౧౫౮ ౪

ఉ. శ్రీకర నేను సర్వమును ♦ సృష్టి యొనర్చియు రక్ష సేయఁగా
నేక[1] సమస్తభారమును ♦ నీపయి నైచి జగత్పతీ! కృపన్
లోకములెల్లఁ బ్రోచి యవి♦లోలతఁ దేజము నాకుఁ గూర్పు మం
చీకరణిన్ వచింపఁగ మ♦హీధవ! యంత దయాంతరంగతన్. ౧౫౮ ౫

సీ. నీవు దుర్ధర్షుండు ♦ నిత్యుండ వగుటను, భూతరక్షాకార్య♦మును దలంచి
విష్ణుండ వైతివి ♦ విశ్వేశ! యావల, నదితిసుతుండ వై ♦ యతులశక్తి
భ్రాతల నరయుచు ♦ వలసినచో నెల్ల, సాహాయ్య మొనరింప ♦ సాగి తయ్య
యట్టినీవు ప్రజాళి ♦ హావళి గొనఁ గని, రావణుఁ జంప ధ♦రాతలమున
ఆ. మానవత్వమునను ♦ మనసు నిల్పితి దేవ! పదియువేల యేండ్లుఁ ♦ బదియునూర్లు
వత్సరంబు లుర్వి ♦ వసియింప నియమంబు, నీవ మున్ను గొంటి ♦ నీరజాక్ష. ౧౫౮ ౬

కం. నీవు మనోమయపుత్త్రుఁడ,[2] వై వెలసితి దశరథునకు ♦ ననుకొన్నయటుల్
దేవా! కాలముడాసెను, నీవలచినఁ బ్రజలఁ బ్రోవ ♦ నిలువుము నెమ్మిన్. ౧౫౮ ౭

కం. రామా! యీగతి లోకపి,తామహుఁడు వచించె దేవ♦తాభువనంబుల్
బో మదిఁ గోరినచో నిఖి,లామరులు సనాథు లగుచు ♦ హర్షింతు రెదన్. ౧౫౮ ౮

కం. అను కాలునివాక్యంబులు, విని నవ్వుచు రాముఁ డనియెఁ ♦ బ్రీతి ఘటిల్లన్
జనుదెంచుట నీ వే నిల, జనియించుట లోకరక్ష ♦ సలుపఁగఁ గాదే. ౧౫౮ ౯

---

[1] నేక = నేరక. [2] మనోమయ పుత్త్రుఁడు = స్వసంకల్పకృతమైన దశరథ పుత్త్రభావముగలవాఁడు.

కం. ఎందుండి వచ్చినాఁడనొ, యందులకే మరల వత్తు ♦ నఖిలంబు క్రియా
బృందము దీరెను నామన, మందుం గలయదియు నేఁడు ♦ ప్రాప్తం బయ్యెన్. ౧౫౯౦

తే. సర్వసంహార! వారిజ ♦ సంభవుండు, పలికినట్టులు మద్వశ ♦ వర్తులైన
యమరనాథుల సర్వకా ♦ ర్యంబులందు, నిలువ వలయును నా కది ♦ నియమ మగుట.

↞{ దుర్వాసుండు తనరాక రామున కెఱిఁగింపు మని లక్ష్మణుతోఁ జెప్పుట. }↠

కం. వా రిటు భాషించు నెడన్, ద్వారంబున రామచంద్ర ♦ దర్శనకాంక్షన్
జేరి నిలిచి దుర్వాసుఁడు, శ్రీరామునిఁ జూపు మిపుడ ♦ చెచ్చెర నాకున్. ౧౫౯౨

ఉ. కాల మతిక్రమించెఁ జిని ♦ గా దిఁక జాగు వచింపుమీ ధరా
పాలున కిప్డె డన్న రఘు ♦ వర్యనితమ్ముఁడు మ్రొక్కి యి ట్లనున్
జాలము సేయ, నేమిపని ♦ సల్పెదు? నెయ్యది వాంఛ? రామభూ
పాలుఁడు వ్యగ్రుఁ డిప్డు డు కృ ♦ పారత నైఁపు నిమేషమాత్రమున్. ౧౫౯౩

కం. నావుడుఁ గన్నుల నిప్పులు, వావిరి గురియంగఁ గ్రోధ ♦ పరితప్తుం డై
భూవిభునకుఁ జని చెప్పుము, నీ వీక్షణమంద చనుము ♦ నిలువకు పో పో. ౧౫౯౪

కం. ఈనిమిషంబునఁ జెప్పక, మానెదవా మీపురంబు ♦ మండలమును రా
మానుజ! నిను నీయన్నల, మానక మీవంశములను ♦ మాడ్చెదఁ గనుమీ. ౧౫౯౫

కం. పెరిఁగెడికింక శమింపఁగఁ, దరమా శపియింతు నిపుడ ♦ తాళ న టన్నన్
బరుషము లగుమునివాక్కుల, సరణియు నిశ్చయముఁ దలఁచి ♦ సౌమిత్రి యెదన్.

కం. ఏలా యిందఱు నాశిల, మేలు గదా నే నొకండె ♦ మృతిఁ గను టని భూ
పాలునిఁ జేరం జని తా, వాలాయం బత్రిసుతుని ♦ వాక్యము వినిచెన్. ౧౫౯౭

కం. సౌమిత్రివాక్యముల విని, రాముఁడు వీడ్కొల్పి కాలు ♦ రయమున దుర్వా
సోమునిఁ జేరం జని ముని, సోమా! కార్యంబుఁ బలుకు ♦ మొప్పుగఁ దీర్తున్. ౧౫౯౮

చం. అనవుడు వేయివత్సరము ♦ లద్భుతనిష్ఠఁ దపంబుఁ జల్పితిన్
జనవర! యిప్పుడే ముగిసె ♦ సర్వము, క్షుత్తు సహింపఁ జాల భో
జన మిడు మున్నమాత్ర మన ♦ క్ష్మావిభుఁ డామునికిన్ సుధోపమం
బును రుచిరాన్నముం గుడువఁ ♦ బూర్ణముగా నిడఁ దుష్టచిత్తుఁ డై. ౧౫౯౯

తే. సంతసించితి నని మెచ్చి ♦ చనియె స్వాశ్ర
మంబునకు రామవిభుఁడును ♦ మనసునందుఁ
గాలువాక్యంబు నెంచి యూఁ ♦ గాక యింక
నిఖిలసంహారవేళ యన్ ♦ నిశ్చయమున. ౧౬౦౦

←→ { లక్ష్మణుఁడు శ్రీరామునితోఁ దన్ను వధించి సత్యము రక్షింపు మని చెప్పుట. } ←→

కం.దీనుఁ డయి మోము వ్రాలిచి, మౌనంబు వహించి గ్రస్తమహికాకరుచం
దాన విగత తేజుం డౌ,మ్లానవపతి లక్ష్మణుండు ♦ మధురోక్తులతోన్ ౧౬౦౧

చం.అలరుమనంబుతో నను వ♦ధర్హ మిటేల మహానుభావ! చిం
తలఁ దపియింపఁ? బూర్వనియ♦తం బగుకర్మముచే నిబద్ధ మై
చెలఁగెడికాల మి ప్పగిదిఁ ♦ జేకుఱె, నన్ను వధించి సత్యముల్
నిలుపుము, బాస తప్పుధర♦ణీజనముల్ నరకంబునం బడున్. ౧౬౦౨

ఉ. నన్నుఁ బ్రసాదదృష్టులఁ గ♦నన్ మది గల్గిన యేని, నాపయిన్
సన్నుతశీల! నీకు దయ ♦ చాలఁగఁ గల్గిన యేని నన్నయా!
నన్ను వధింపుమీ యిపుడ ♦ నర్మిలి మానుము, ధర్మవర్ధనం
బు న్నెఱి గూర్పుమీ, హృదయ♦ముం బదిలం బొనరింపుమీ యనన్. ౧౬౦౩

కం.చలితేంద్రియుఁడై రాముఁడు, వలనుగ మంత్రులఁ బురోధఁ♦ బనిచెం బిలువన్
దెలిపెను దాపసితోఁ దాఁ, బలికిన బాసయును నత్రి♦ప్రభవునిరాకన్. ౧౬౦౪

←→ వసిష్ఠువాక్యంబున రాముఁడు లక్ష్మణుని విడనాడుట. ←→

కం.సోపాధ్యాయులు మంత్రులు, భూపాలకువాక్యజాల♦మును వినుచుండన్
క్ష్మాపతితోడ వసిష్ఠుం, డీపగిది వచించె మున్నె ♦ దృష్టం బివియున్. ౧౬౦౫

కం.సౌమిత్రిని నీవిడుటయు, రామా! నీక్షయముఁ గానఁ ♦ గ్రచ్ఛఱ విడుమీ
యీమహితగుణునిఁ దమ్ముని, ధీమండన! కాలబలము ♦ దెలియని యదియే. ౧౬౦౬

ఆ. వ్యగ్రపఱుపరాదు ♦ ప్రతినను ధర్మజ్ఞ!, పలికి తప్ప ధర్మ♦విలయ మొదవు
ధర్మనష్టమునను ♦ ద్రైలోక్యమును జరా,చరము లమరమాని♦చయముఁ గూలు.

కం.త్రైలోక్యరక్షణార్థము, పాలింపఁగ ధర్మపథము ♦ భ్రాతను విడుమీ
మేలు ఘటింపుము జగతికి, నా లక్ష్మణుఁ జూచి ధర్మ♦నయపరుఁ డనియెన్. ౧౬౦౭

కం.చెడకుండ ధర్మవిధి నిను, విడిచితి సౌమిత్రి నాదు♦ప్రియసోదరుఁడా!
పుడమిని సాధుల కిష్టుల, విడుచుట చంపుటయు నొక్క♦విధ మై యునికిన్.

←→ లక్ష్మణుఁడు మేనితో దివంబున కేగుట. ←→

సీ. రామునివాక్యముల్ ♦ సౌమిత్రి యాలించి, కన్నుల నీళులు ♦ గార్చి యపుడ
తనగృహంబున కైనఁ ♦ జనక చక్కఁగఁ బోయె, సత్వరుం డగుచును ♦ సరయుకడకు
నంబువు లార్చి కృ♦తాంజలి యగుచును, నఖిలేంద్రియంబుల ♦ నాఁక గొనుచు
నూరుపు బిగియించి ♦ యుండ సశక్రాప్స,రోగణంబులు సుర♦పూగములును

ఆ. బుష్పవృష్టి గురియ ♦ బురుహూతుఁ డెవరికిఁ, గానరాక వచ్చి ♦ కడుబలాఢ్యుఁ
డనువుతో సుమిత్ర♦తనయుని గ్రహియించి, త్రిదివమునకుఁ జనియె ♦ దివ్యు లలర

కం. వెన్నునినాలవభాగం,బు[1] న్నిర్జరపరులు స్వర్గ♦మును జేరంగాఁ
గన్నారఁ గాంచి మిక్కిలి, మన్ననఁ బూజించి రెల్ల♦మానుల తోడన్. ౧౬౧౧

→ రాముఁడు మహాప్రస్థానం బేగ నిశ్చయించుట. ←

సీ. సౌమిత్రి విడనాడి ♦ సంతాపభరమున, సచివపురోహిత♦జానపదుల
నెల్లరఁ గనుఁగొని ♦ యిప్పు డయోధ్యకు, రాజుగా భరతు ధ♦ ర్మవ్రతాఢ్యు
పట్టాభిషేకంబు ♦ పరఁగించి లక్ష్మణుఁ, డేగినగతికి నే ♦ నేగువాఁడ
జత గూర్పుఁడీ! సర్వ♦సంభారముల నన, శిరములు వ్రేల ని♦ర్జీవులట్ల

తే. యయిరి పౌరులు నిశ్చేష్టుఁ ♦ డగుచు భరతుఁ
డార్త రోయుచు రాజ్యంబు ♦ నన్న కనియె
నిన్ను విడనాడి నిర్జర♦నిలయ మైనఁ
గోర నాకేల రాజ్యంబు ♦ గుణధురీణ! ౧౬౧౨

కం. సత్య మిది రామచంద్రా!, సత్యముపైఁ బలుకువాఁడ ♦ శపథము సేయా
పత్యముఁ గుశుఁ గోసలమున, నిత్యంబుగ నుత్తరమున ♦ నిలుపుము లవునిన్.

కం. దూతల శత్రుఘ్నుం డిట, కేతేరఁగఁ బంపు వయ్య ♦ యిపుడ వెస యథా
రీతిని గమనముఁ దెలుపఁగ, భ్రాతలవర! యంచుఁ బలుక♦జనసంఘంబుల్ ౧౬౧౪

చం. శిరములు వ్రేల వైచి తుద ♦ చెప్పఁగరానిభృశార్తిఁ గుందుటల్
భరతునివాక్యముల్ కని త♦లంచి రఘూత్తముతో నరుంధతీ
వరుఁ డిటు పల్కెఁ దండ్రి! యదె ♦ పౌరులఁ జూడుము వీరికోర్కె నీ
వరసి తదిష్టముం జలుప ♦ నర్హము నీకు మహాత్మ! నావుడున్. ౧౬౧౫

తే. నేలఁ బడియున్నవారల ♦ లీల నెత్తి
యేల యీచింత మీకు మ♦దిష్టులార!
యేమి సేయంగ వలయు మీ ♦ కెల్లరకును?
దెలియఁ జెప్పుఁడు మీమది♦ తెఱఁ గ టన్న. ౧౬౧౬

→ రాముని వెంటఁ బోవఁ బౌరు లనుజ్ఞ గోరుట. ←

కం. రామునివాక్యములను విని, భూమీజను లేకవాక్య♦ముగ ని ట్లనిరో
రామా! నీ వేగెడు నెడ, కే మరు దెంచెదము వెంట ♦ నిడు మీవరమున్. ౧౬౧౭

కం. పౌరతతిమీఁద నీ యెదఁ, గూరిమి నెయ్యంబు గలిగి ♦ కొలఁదిలెద వేనిన్
దారలతోఁ బుత్రులతో, వారక నీచనెడిత్రోవ ♦ వత్తుము దేవా! ౧౬౧౮

[1] వెన్నుని నాలవభాగము. చూడు బాలకాండము ౪౭౨. పద్యము.

తే. తొలఁగక తపోవనమునందొ ♦ దుర్గముననొ
యేటినీటనొ కాక ము♦న్నీటియందొ
యెందుఁ జొచ్చిన నీవు మే ♦ మందుఁ జొత్తు
మీశ్వరా! మమ్ముఁ దోడ్కొని ♦ యేగు వెంట. ౧౬౧౯

కం. ఇదె మాకుఁ బరమవర మగు, నిదియే పరమంపుఁ బ్రీతి ♦ యిందఱు దృఢమా
మదిఁ గోరిరి నిను వెనుకొన, సదయమతీ! తోడుకొనియె ♦ చనఁ దగు ననుడున్.

సీ. పౌరవర్గముదృఢ♦భక్తిఁ గనుంగొని, యట్ల చేయుదు నని ♦ యాడి యపుడ
కర్తవ్యముల నెంచి ♦ కలఁగక కావించి, కుశు నిల్పి దక్షిణ♦కోసలమున
లవుని నుత్తరకోస♦లంబున నిలిపి పట్టాభిషేకంబుల ♦ నాచరించి
కొడుకుల నిద్దఱఁ ♦ దొడలపైఁ జేరిచి, మూర్ధంబు ప్రీతిమై ♦ మూరుకొనుచుఁ
తే. గౌఁగిటను గ్రుచ్చి పదివేల♦కరుల నరద,ములను వేలను ఘోటక♦ముల దశాయు
తముల వేర్వేఱ యిచ్చిర♦త్నములవిత్త,ములను హృష్టసుపుష్టపౌ♦రులను గలుగు

తే. పట్టనములకు వారలఁ ♦ బంచి లక్ష్మ
ణానుజుని దోడితేర దూ♦తాళిఁ బంప
వారు మూఁడహోరాత్రముల్ ♦ బాట నిలక
తూర్ణముగ నేగి మధుర శ♦త్రుఘ్నుఁ గాంచి. ౧౬౨౨

## శత్రుఘ్నుఁడు కొడుకులకుఁ బట్టాభిషేక మొనర్చి యయోధ్యఁ జేరుట.

సీ. రామునిప్రతినయు ♦ రాముఁడు లక్ష్మణుఁ, బాయుటయును బౌర♦వర్గ మెల్ల
జనపతివెంటన ♦ చన నిశ్చయించుట, యభిషేకములఁ దీర్చి ♦ యాత్మజులకుఁ
గుశునకు వింధ్యాద్రి♦కూలంబునను గుశా,వతి యనుపట్టన♦వరము నిచ్చి
శ్రావస్తి లవునకు ♦ రాజధానిగఁ జేసి, విజనంబుగ నయోధ్య ♦ విడిచి రామ
తే. భరతు లిర్వురు స్వర్గంబు♦పథముఁ జనెడి,యత్నమున నున్నవారు మ♦హాత్మ నీవు
వేగ చనుదెమ్ము టన్ననా♦వీరవరుఁడు, కులము కూలంగ నుండుట♦ తెలిసి యపుడ.

ఉ. పౌరుల నెల్లరం బిలువఁ ♦ బంచి పురోహితుఁ గాంచనాఖ్యునిం
జేరఁగఁ జీరి వారలకుఁ ♦ జెప్పి సమస్తము రామవృత్తముం
ద్వారలతోడివే గతులు ♦ ప్రాప్తిలు నా కని రాజ్య మంతయుం
గూరిమి నాత్మపుత్రకుల♦కుం దగఁ బంచి కృతాభిషేకులన్. ౧౬౨౪

తే. చేసి మధుర సుబాహు వ♦జ్యేష్ఠసుతున
కిచ్చి వైదిశ మనుపురి ♦ నిచ్చె శత్రు

ఘాతి యనియెడిసుతునకుఁ ♦ గలబలంబు
స్వమ్ము నట్టులె సమముగఁ ♦ బంచి యొసఁగి. ౧౬-౨౫

తే. ఒంటిరథముగ నేగి య♦యోధ్య కందు
జిలుఁగుఁదెల్లనినునుఁబట్టుఁ♦జేలఁ దాల్చి
సంజ్వలత్పావకునిఁబోలి ♦ సంయమీంద్ర
వరులమధ్యంబునం దున్న♦భ్రాతఁ గనుచు. ౧౬-౨౬

తే. మ్రొక్కినిలఁబడి చేతులు ♦ మోడ్చి ధర్మ
మర్మవిదుఁ బల్కె రాముని ♦ ధర్మవిధిని
సుతుల కభిషేక మొనరించి ♦ హితవిధాన
నిన్ను వెన్కొనఁ బఱచితి ♦ నిర్మలాత్మ! ౧౬-౨౭

కం. భవదనుగమనముఁ గోరెద, నవనీశ్వర! మనసునిశ్చ♦యం బిది వింటే
యెవి యడ్డంబులు చెప్పకు, సవురుగ నీయాజ్ఞఁ జనఁగ ♦ సమ్మతి పడెదన్. ౧౬-౨౮

కం. అనవుడు రామమహీంద్రుం, డనుజాతునితోడ నట్ల ♦ యౌత మటంచున్
జనవునఁ బలుకఁగ నీలో, వనచరభల్లూకతతులుఁ ♦ బలలాశివరుల్. ౧౬-౨౯

↞ సుగ్రీవవిభీషణాదులు రామునిఁ జూడ వచ్చుట. ↠

ఉ. వచ్చిరి గుంపు గుంపుగను ♦ వారిజమిత్రసుతుండు మున్నుగా
సచ్చరితున్ రఘూత్తముని ♦ స్వర్గమనాభిముఖుం గనుంగొనన్
వచ్చి మహాత్మ! నీబడిని ♦ వచ్చెద మిందఱ మెందుఁ బోయినన్
మచ్చిక మమ్ము నెల్లఁ గొని ♦ మానక సత్కృపఁ బోఁగదే నృపా! ౧౬-30

కం. మముఁ బాసి నీవు పోయిన, యమదండముపాలఁ బడిన♦యట్లగుఁ బురుషో
త్తమ! మముఁ గావంగదవే, విమలమతీ! యనిన నవ్వి ♦ విభుఁ డౌ ననఁగన్. ౧౬-3౧

ఉ. అంతట వానరప్రవరుఁ ♦ డంగదు నిల్పి ధరాధిపత్యమం
దెంతయుఁ గోరి మీబడిగ ♦ నే నరుదేరఁగ నిశ్చయించి దై
త్యాంతక! వచ్చినాఁడ, నను ♦ న్యాయము గాదు విడంగ నన్నఁ దా
స్వాంతములోన నాప్లవగ♦వల్లభు మైత్రిఁ దలంచి యిట్లనున్. ౧౬-3౨

కం. ఘనమిత్రమ! సుగ్రీవా!, నినుఁ బాసి చనంగ నొల్ల ♦ నే నెందేనిన్
విను దేవలోకమునకేన్, వనచరరాజేంద్ర! పరమ♦పదమున కేనిన్. ౧౬-33

↞ శ్రీరాముఁడు హనుమద్విభీషణాదులకు వరంబు లిచ్చుట. ↠

సీ. అని విభీషణుఁ జూచి ♦ యబ్జాక్షుఁ డిట్లను, రాక్షసనాయకా ♦ ప్రజలు ధరణి
యుండెడిదాఁక నీ ♦ వుందుము మేనితో, లంకాపురమున ని♦శ్శంకమతిని

జంద్రుండు సూర్యుండు ♦ క్ష్మాచక్రమెల్లనుఁ నాకథ యెందాఁక ♦ లోకమునను
దలఁగక యుండునం ♦ దాఁక నీ వుండుము, రాజ వై స్నేహకా ♦ రణముఁ జేసి

ఆ. పలికినాఁడ నీవు ♦ పాలింపు నాయాజ్ఞ, బదులు పలుక వలదు ♦ ప్రజల నేలు
ధర్మమాచరింపు ♦ తలఁగకు మం దుండి, యేమి చెప్పువాఁడ ♦ నింక నీకు. ౧౬౩౪

కం. స్వారాణ్ముఖసకలసుధా, హారుల కారాధనీయు ♦ ననిశం బిక్ష్వా
క్వారాధితకులదైవము, నార జగన్నాథు నీవు ♦ నర్చింపు తమిన్.[1] ౧౬౩౫

కం. అనవుడు రామునిశాసన, మును నాత్మఁ దలంచి యసుర ♦ ముఖ్యుం డో నం
చును గ్రహియించెను దశరథ, తనయునివాక్యంబు వినయ ♦ తాత్పర్యములన్.

ఉ. ఆవల రామభద్రుఁడు గు ♦ ణాంబుధి వాయుజుఁ జూచి ప్రీతితో
జీవితమందు నాశ యెడ ♦ సేయకు, మానకుమా ప్రతిజ్ఞ, యీ
భూవలయంబునందుఁ గపి ♦ పుంగవ! మత్కథ యెంతదాఁకఁ బెం
పై విలసిల్లు నందనుక ♦ హాయి రమింపుము మద్వచస్థితిన్. ౧౬౩౭

చం. అనవుడుఁ బావమాని విన ♦ యంబు దొలంకఁగ హర్షవార్ధిలో
మునుఁగుచు విన్నవించెఁ గడు ♦ పుణ్యము త్వత్కథ లోకమందుఁ బా
వనగతి నుండుదాఁక ధర ♦ వర్తిలు చుండు భవన్ని దేశముం
గొని యన జాంబవంతు రఘు ♦ కుంజరుఁ డట్ల వచించి యావలన్. ౧౬౩౮

తే. మైందు ద్వివిదుని నమ్మాడ్కి ♦ మందలించి, బ్రహ్మసుతుతోడి యేవురఁ ♦ బలికె నిట్లు
ధరణిఁ గలివేళ ప్రాప్తించు ♦ దాఁక మీరు, జీవములతోడ నుండుఁడీ ♦ క్షేమముగను.

తే. అనుచు వచియించి తక్కిన ♦ వనచరాళి
భల్లుకంబులఁ గని మీరు ♦ వలచినట్ల
రండు నాతోడ నని పల్కి ♦ రాత్రి గడపి
తరణి యుదయింప నిజపురో ♦ ధనునిఁ జూచి. ౧౬౪౦

## శ్రీరాముఁడు సకలప్రాణులతో మహాప్రస్థాన మేగుట.

సీ. అగ్రజాతులతోడ ♦ నగ్నిహోత్రంబులు, తోలుతను బో నిమ్ము ♦ త్రోవలందు
వాజపేయచ్ఛత్ర ♦ వర్గంబు వఱలుత, మన వసిష్ఠుం డట్ల ♦ యాచరించి
వైదికవిధి మహా ♦ ప్రస్థానికం బగు, కార్యము దీరిచి ♦ కడమ వడక
యుండ శ్రీరామచం ♦ ద్రుండు సూక్ష్మాంబర, ధారి యై దర్భలఁ ♦ దాల్చి వ్రేళ్ల

తే. సందులను మాటలాడక ♦ స్వయము గాఁగఁ
బరమ మగుబ్రహ్మమంత్రంబుఁ ♦ బఠన మొనరఁ
జేసికొను చాత్మలోన ని ♦ శ్చేష్టుఁ డగుచు
మార్గసుఖములపై మది ♦ మరగ నీక. ౧౬౪౧

[1] ఈ మూర్తియె శ్రీరంగనాయకులు. యుద్ధకాండాంతమున సంగ్రహంబుగఁ జెప్పఁబడినవి యీ కాండమందు వివరింపఁబడినవి.

సీ. దీప్యమానార్కుని ♦ ధిక్కరించెడికాంతిఁ, దనమందిరము వీడి ♦ తరలుటయును
సపసవ్యదిశఁ బద్మ♦హస్తయై శ్రీదేవి, హ్రీదేవి భజయింప ♦ నెడమవంక
సంహారశక్తియుఁ ♦ జనఁగ మున్నుగ శర,చాపముల్ పూరుష♦రూపములను
సకలాయుధావళుల్ ♦ సరవిని గొలువంగ, బ్రాహ్మణాకృతులతోఁ ♦ బరఁగ శ్రుతులు
తే. సర్వరక్షిణి గాయత్రి ♦ చనఁగ వెంట
నోంకృతియును వషట్కార ♦ మొప్పు చుండ
బ్రాహ్మణులు ఋషులును రామ♦భద్రు వెంటఁ
జనిరి వాకిండ్లు దెఱచిన♦స్వర్గమునకు. ౧౬౪౫
తే. దశరథాత్మజుతోడ నం♦తఃపురంబు,సతులు బాలురతో వృద్ధ♦తతులతోడ
వర్షధరకింకరులతోడ ♦ వారి దాసి,మూఁకతో వెంట నంటెరి ♦ ముదము గూర.
ఆ. సాగ్నిహోత్రు లగుచు ♦ నాత్మపత్నులతోడ, భరతుఁడును సుమిత్ర♦పట్టి రాము
వెంటఁ జన మహాత్మ♦బృందంబు సుతసతీ,వహ్నియుక్తిఁ జనియెఁ ♦ బరమరక్తి.[1]
తే. సచివవర్యులు భృత్యులు ♦ సపశుపుత్ర,బాంధవులు గాఁగ శ్రీరామ♦భద్రు వెంట
రాగమునఁ బోయి రిట్టులు ♦ ప్రకృతులెల్ల, రామగుణరక్తిఁ జనిరి ని♦ర్మలమనీష.
ఉ. అందఱు స్నాన మాడి శుచు ♦ లై పరిహృష్టమనంబులం గపుల్
సందడి చేయుచుం గిలకి♦లధ్వను లారఁగ రాము వెన్కొనన్
మందున కైన నందు రుచి♦మాలినవాఁడును దుఃఖితుండు సి
గ్గొందెడివాఁడు దీనుఁ డెడ ♦ నొల్లనివాఁడును లేఁ డొకండునున్. ౧౬౪౬
కం. అందఱు నద్భుత మగునా,నందంబున నుల్లసిలిరి ♦ నవ్యగతి నమ
చ్ఛందను వెంబడి నాతని, సందర్శింపఁగను వచ్చు♦జనపదజనముల్. ౧౬౪౭
కం. నాకారోహణమతిచే, నేకాంక్షయు లేక చనిరి ♦ ఋక్షనిశాటా
గౌకసులును బురవాసులు, నేకవిధపుఁబరమభక్తి♦నేగిరి శ్రద్ధన్.[2] ౧౬౪౮
చం. పురిని నగోచరంబు లగు♦భూతములున్ రఘువంశవర్ధనున్
సరసతఁ గన్నప్రాణులును ♦ స్థావరముల్ రఘురాము వెన్కొనెన్
బురమున నెద్ది శ్వాసమును ♦ బుచ్చెడి దొక్కటి యైన లేక శ్రీ
కరుబడి నేగెఁ జిత్తముల ♦ గాటపుభక్తిని నిల్పి రాము పై. ౧౬౪౯

## బ్రహ్మాదులు శ్రీరాము దర్శింప వచ్చుట.

సీ. రామచంద్రుఁడు జన♦స్తోమంబు వెన్కొన, నధ్యర్ధయోజనం ♦ బరిగి యచటఁ
బశ్చిమముఖ మయి ♦ ప్రవహించుసరయువు,పుణ్యజలంబులఁ ♦ బోలఁ గాంచి
యాకులావర్త మా♦నంబువులం దిగి, సప్రజుఁ డగుచు ద♦త్స్థలముఁ జేర
నాముహూర్తంబున ♦ నఖిలలోకపితామ,హుండు విరించి ది♦వౌకసులును

---

[1] ఇందూర్మిళాదేవి చెప్పఁబడకుండుటచే లక్ష్మణుతోడ నామెయు నేగెనని యెఱుంగఁదగు. రామరాజ్యమున వైధవ్యములేదు. [2] దీనివలన మోక్షప్రాప్తికి భక్తియే యుపాయము పండితుఁడైనను, పామరుఁడైనను, జేతనమైన నచేతనమైనను, భగవద్దర్శన స్పర్శన సల్లాప నామకీర్తనాదులలో నేది లభించినను ముక్తిఁగాంచును.

తే. ఋషులు గొలువంగ స్వర్గంబు ♦ నేగుపొంటె
రాముఁ డుండెడిచోటికిఁ ♦ గ్రన్నవచ్చె
గగనతలమెల్ల నిండారఁ ♦ గలితకాంతు
లైనయాకాశయానవి ♦ తానములను. ౧౬౫౦

కం. జ్యోతిర్భూతం బగునా, ద్యోతలము స్వయంప్రభామ ♦ రోత్కరపుణ్య
వ్రాతమ్ములచే సుశ్రీ, స్ఫీతం బయి వెలిఁగె జనము ♦ వెఱఁ గొందంగన్. ౧౬౫౧

కం. దైవతకరముక్తం బై, పావిరిసుమవృష్టి గురిసెఁ ♦ బవనుండును సౌ
ఖ్యావహుఁ డై శీతలుఁ డై, పావనుఁ డై పుణ్యగంధ ♦ వహుఁ డై వీచెన్. ౧౬౫౨

తే. తూర్యరావంబు లెల్లెడఁ ♦ దోరముగను, వేల్పుఁగన్నెలు గంధర్వ ♦ విసరములును
సంకులంబుగ శ్రీరామ ♦ చంద్రుఁ డపుడు, పాదచారి యై సరయువు ♦ వారిఁ జొరఁగ

సీ. జతనంబు సేయంగ ♦ సరసిజసంభవుం, డాకసంబున నిల్చి ♦ యనియె నిట్లు
రా రమ్ము విష్ణు! భ ♦ ద్రం బగు మాయదృ, ష్టంబున వచ్చితి ♦ సాధురక్ష!
సురనిభు లగుభ్రాతృ ♦ వరులతో నీకోరు, విధిని బ్రవేశింపు ♦ స్వీయతనువు
వైష్ణవం బగుమహా ♦ వర తేజమో సనా, తన మగునభమొ నీ ♦ మనసుపగిది

తే. నీవ గతి వెల్లజగతికి ♦ నీదుమాయ
శ్రీవిశాలాక్షి పూర్వప ♦ రిగ్రహంబు
గాక యెవ్వఁడు తెలియంగఁ ♦ గలఁడు నిన్ను
నఘచయవిభంగ! విమలద ♦ యాంతరంగ! ౧౬౫౩

తే. అక్షయుండ వచింత్యుండ ♦ వజరుఁడవును
నీవు కోరినచొప్పున ♦ నీదుతనువుఁ
జొరుమ యెద్దాని నైన నం ♦ చును విరించి
ప్రార్థనము సేయ శ్రీరామ ♦ భద్రమూర్తి. ౧౬౫౪

↞ శ్రీరాముఁడు సానుజుఁడై సశరీరుం డై వైష్ణవతేజంబుఁ జొచ్చుట. ↠

కం. తా నిశ్చయించి మనమున, సానుజుఁ డై యపుడు చొచ్చె ♦ సశరీరుం డై
మానితవైష్ణవతేజము, మానసముల వేల్పులెల్ల ♦ మఱి మఱి పొగడన్.[1] ౧౬౫౫

ఆ. అంత విష్ణుమయుని ♦ నఖిలలోకేశ్వరు, దేవదేవు నఖిల ♦ దేవతాళి
సాధ్యులును మరున్ని ♦ చయములుఁ బూజించె, సేంద్రశక్ర మగుచు ♦ హితముదోఁప.

తే. దైత్యదానవయక్షగం ♦ ధర్వగరుడ
నాగదివ్యర్షు లప్సరః ♦ పూగములును
బావనం బయ్యె దివము స ♦ ర్వంబు హృష్ట
పుష్ట మయ్యెను గూరె మా ♦ యిష్టములును. ౧౬౫౭

[1] దీనివలన నిది ప్రాకృత దేహము గాదని యేర్పడుచున్నది.

చం. అని పొగడంగ విష్ణువు స్వ♦యంభువుఁ గాంచి వచించె సువ్రతా!
జనములఁ గంటె యిందఱు న♦చంచలభక్తిని స్నేహయుక్తులై
యనుగమనంబుఁ జేసి తమ♦ప్రాణము లిచ్చిరి నాకు, మద్వియు
క్తిని సహియింప రైరి, నిర♦తిక్ భజితవ్యులు పీర లెల్లరున్. ౧౬౫౯

—> బ్రహ్మ సమస్తజనంబుల నుత్తమలోకంబున నుంచుట. <—

కం. ఆకతమున వీరలఁ దగు,లోకంబున నిలుపు మనిన ♦ లోకగురుం డీ
లోకులు సంతానం బను,లోకంబున నుండువారు ♦ లోకారాధ్యా! ౧౬౬౦

కం. ఈవిధి నినుఁ దిర్యక్కులు, భావించిన యేని నీదు♦భక్తిని దనువుల్
బో విడిచిన యే నవ్వియు, వావిరి సాంతానికమున ♦ వఱలును దేవా! ౧౬౬౧

ఆ. బ్రహ్మలోకమునకుఁ ♦ బై నిఖిలబ్రహ్మ,గుణసమేత మగుచుఁ ♦ గోఱలు సదియు
. వానరాచ్ఛవరులు ♦ వారలతోల్లింటి,సురలరూపములను ♦ జొచ్చువారు. ౧౬౬౨

కం. వానరపతి సుగ్రీవుఁడు, భానునిమండలముఁ జొచ్చు♦వాఁడు మహాత్మా!
వానరు లెల్లరుఁ బిత్రులను, మానుగఁ బొందెదరు విబుధ♦మండలి గనఁగన్.

సీ. అని పితామహుఁ డిట్లు ♦ వినుచు చుండఁగ గోప్ర,తారతీరంబున ♦ ధరణిజనులు
సంతోషమున బాష్ప♦జలధారఁ గన్నులు, గురియింప సరయువుఁ ♦ గ్రుంకి రపుడు
రామభక్తిని దమ♦ప్రాణము ల్విడిచిన, యెల్లప్రాణులు మేని ♦ నింద విడిచి
దివ్యయానంబులఁ ♦ దేజరిల్లుచు నేగి, రప్పుడు సరయువు♦నందు మునిఁగి

తే. నట్టితిర్యక్సహస్రంబు ♦ లమర తేజ, మొప్పుమేనుల దివి కేగె ♦ నుత్సవముగ
ఋక్షవానరరాక్షసు ♦ లాక్షణమున,సరయువున దేహము ల్వీడి ♦ చనిరి దివికి.

కం. అంద ఱిటు చేర రా నా,నందంబున లోకగురుఁడు ♦ నవ్య మగుదివం
బం దందఱ నిల్పిముదం, బంది మహా తిదివమునకు ♦ నరిగెం బ్రీతిన్. ౧౬౬౫

—> శ్రీరామాయణ ఫలశ్రుతి. <—

ఉ. ఈయది స్తోత్రరం బయి ర♦హించును, బ్రహ్మనుపూజితంబు, రా
మాయణ మన్నసిద్ధిఁ గని♦నట్టిది, ముఖ్యము, వాల్మికుండు ని
ర్మాయి, చరాచరాత్మకుఁడు ♦ ప్రాగ్విధి విష్ణువు నిల్చె స్వర్గమం
దాయతహర్షవృద్ధి నమృ♦తాంధసు లెల్లరుఁ గూరుచుండఁగన్. ౧౬౬౬

కం. దివిజులు గంధర్వులు ముని, నివహంబులు సిద్ధులెల్ల ♦ నిత్యము ముదై వ
భవమున రామాయణమును, దివమున వినుచుందు రెలమి ♦ దివ్యం బగుటన్.

సీ. ఆఖ్యాన మియ్యది ♦ యాయుష్కరంబును, బాపనాశనము సౌ♦భాగ్యకరము
నామ్నాయసమము రా♦మాయణం బియ్యది, శ్రాద్ధకాలంబుల ♦ శ్రావ్య మగును

పాదమాత్రం బైనఁ ♦ బఠియింప వాఁ డన,పత్యుఁ డేనియు సుత♦వంతుఁ డగును
ధనహీనుఁ డైనను ♦ ధనవంతుఁ డయ్యెడు, సకలపాపంబులు ♦ సమసిపోవు

తే. దినము పాపంబులను జేయు♦దీనుఁ డైన
శ్రద్ధతోఁ బద్య మొక్కఁ డేని ♦ జదువుచున్న
వానిఁ బాపంబు లంటవు ♦ వాస్తవంబు
వహ్నిసోఁకిన కంట్లంబు♦పగిదిఁ జెడును.[1] ౧౬౬౯

కం. వాచకునకు దాతవ్యము, నైచికియుం గాంచనంబు ♦ నవ్యాంబరముల్
వాచకుఁడు సంతసించిన, నేచింతయు లేదు తృప్తు ♦ లెల్లరు విబుధుల్. ౧౬౭౦

కం. ఆయుష్కర మగు శ్రీరా, మాయణముఁ బఠించునాతఁ ♦ డాత్మజ పౌత్ర
శ్రీయుతుఁ డై సుఖయించుచు, నాయతసుఖమందు స్వర్గ♦మందుం బిదపన్.

తే. శూన్యమై యుండి పెక్కేండ్లు ♦ ధన్య మైన
యాయయోధ్య పదంపడి ♦ యవనివిభుఁడు
ఋషభుఁడనువాఁడు పాలింప ♦ వృద్ధిఁ గాంచు
జనవివాసోచితం బయి ♦ సౌఖ్యమిడుచు. ౧౬౭౧

తే. ఉర్వి నెలయించె దీని సం♦హారోత్తరంబు, గాఁగ సభవిస్మయముగ వల్మి♦కప్రభవుఁడు
లోకకర్త స్వయంబ యం♦గీకరించె, దీని సంపూర్ణముగ ♦ విని దివ్యు లలర. ౧౬౭౨

తే. వాజిమేధసహస్రముల్ ♦ వాజపేయ
శతసహస్రంబు లొనరించు ♦ సత్ఫలంబు
రామచంద్రునిచరితంబు♦శ్రవణమునన
ధ్యాన మొనరించుటన కాంచుఁ ♦ దథ్యముగను. ౧౬౭౩

తే. అమరవాహినిలోనగు♦నాపగలను
నైమిశాదిమహారణ్య♦భూములందు
మఱి ప్రయాగ కురుక్షేత్ర ♦ మండలములఁ
గాంచుఫల మొందు దీని నా♦లించునతఁడు. ౧౬౭౪

కం. భానూపరాగ వేళను, దాని గురుక్షేత్రమందుఁ ♦ దపనీయంబుల్
దాన మొనర్చినఫలమును, దీని న్వినువాఁడు నొందు ♦ దీ టీ రెండున్. ౧౬౭౫

కం. మానని శ్రద్ధను శ్రీసీ, తానాయకుచరిత వినిన♦ధన్యుఁడు ఘోరా
ఘౌఘకంబులఁ బాయుచుఁ, దా నెలకొను విష్ణుసన్ని♦ధానమునందున్. ౧౬౭౬

ఆ. ఆదికావ్య మిద్ది ♦ యార్షంబు పూర్వంబు, వల్మికోద్భవర్షి ♦భాషితంబు
నియతి భక్తిచేత ♦ నిరతంబు వినువాఁడు, రూఢిగాఁగ విష్ణు♦రూపుఁ గాంచు. ౧౬౭౭

[1] శ్రీరామనామమాహాత్మ్యమును బఠింపుఁడు. ఇది యెట్లు సత్యమో తెలియును.

కం. దారసుతాదులు వృద్ధిం, గూరెద రెడ దెగనికలిమిఁ ♦ గోమరాగుఁ గులం
బారఁగఁ దామరతంపర, యై రహిఁ గను నియతి వినెడి♦యనఘాత్మునకున్. ౧౬౭౮

కం. నిరతము రామునిచరితముఁ, బరమమతి న్వినెడివాఁడు ♦ భక్తివశమునన్
బరిపూతుం డై బహువ,త్సరములు జీవించి మోక్ష♦సంగతి వెలయున్. ౧౬౭౯

కం. నిరతము రాఘవచింతా,పరుఁ డగుమనుజుండు కోరు♦వాంఛితములఁ దా
పరగన కాంచును బ్రాహ్మణ,వరు లిది వినిపింపవలయుఁ ♦ బ్రతిదినసంబున్. ౧౬౮౦

కం. గాయత్రీరూపము రా,మాయణ మిదియొక్క పదమ ♦ యైనఁ బఠింపన్
జేయు దురితనాశము సుతు, లాయతధనములును గలుగు ♦ నక్షయ మగుచున్.

కం. సర్వము రామునిచరితము, నిర్వక్రమనీషఁ జదువు♦నియతాత్మకు లీ
యుర్వి విడిచి చనుపిదప ఖ,గార్వునిలోకమున నుందు ♦ రనవరతంబున్. ౧౬౮౨

కం. జనకుండు జనకజనకుఁడు, జనకునితాతయును నతని♦జనకుండును ద
జ్జనకుఁడును విష్ణులోకం,బున నిలుతురు రాముకథను ♦ బొరిఁ బొరి విన్నన్. ౧౬౮౩

తే. రామచరితంబు ధర్మార్థ♦కామములను, శాశ్వతం బగుపదము నొ♦సంగు నిజము
కాన నిత్యంబు జనులార! ♦ కార్య మగును, శ్రద్ధతో మీరు దీనిని♦జదువ వినుట.

తే. భక్తితోడుతఁ బదమైనఁ ♦ బాదమైన
నయ యఘనాశనంబు రా♦మాయణంబు
వినునతం డేగు బ్రహ్మస♦దనమునకును
బ్రహ్మచేఁ బూజితుం డయి ♦ వఱలు సతము. ౧౬౮౫

మానిని. ఈరహిఁ మించుమహత్త్వముఁ గల్గిన♦యిట్టిపురాతనవృత్తమణిన్
మీరు పఠింపుఁడు సంశయ మూనక ♦ నిండుమనంబున నమ్మి జనుల్!
దూరము లై చను దోషము లన్నియుఁ ♦ దోరపుభద్రము మీ కగుతన్
వారక విష్ణుమహామహిమోన్నతి ♦ వర్ధిలుతం గడువర్ధిలుతన్. ౧౬౮౬

కం. అని యార్ష మాదికావ్యం,బును నగురామాయణంబు ♦ మును వల్మికసం
జనితుఁడు తపస్వి సంహిత,గను బల్కెను భూప్రజోప♦కారక బుద్ధిన్. ౧౬౮౭

## ఆంధ్రకవికృతగ్రంథాంతనమస్కారములు.

కం. ఒదవినవిఘ్నము లణఁచుచుఁ, గదసినయాపదలఁ దొలఁచి ♦ కడముట్టఁగ నీ
సదయతఁబల్కించినకృతి, యిదిగోఁ గైకొమ్ము జాన♦కీశ్వరరామా! ౧౬౮౮

కం. తప్పొప్పు లెఱుంగను నీ, చెప్పించినయట్లు నేను ♦ జెప్పితిఁ గద మా
యప్పా! దీనం గలిగిన,తప్పొప్పుల కీవె దిక్కు ♦ దశరథరామా! ౧౬౮౯

ఉ. హెచ్చుగ నెందు నేని వచి♦యించియ యుండిన రక్తిచేతనే
హెచ్చని వీడి యుండిన ము♦నీశ్వర! జ్ఞానము లేమిచేతనే

యచ్చపుయోగిరత్నమ! మ♦హాత్మక! నీకృతి యీప్రబంధనుం
బొచ్చెము గాదు జీవయుత♦మూర్తియు ఛాయ యనంగ నుండెడిన్. ౧౬౯౦

ఉ. నీకృతి క్షీరసాగరము ♦ నీవ యెఱుంగుదు తన్మహత్త్వముం
నాకు వశంబొకో యెఱుఁగ ♦ నన్నుఁ దరింపఁగఁ జేయ దాని నీ
వే కరుణాతిరేకమున ♦ నిట్లు వచింపఁగఁ జేసి నంత నే
నాకు స్వతంత్రతాస్పదము ♦ నాథ! లవంబును లే దెఱుంగవే? ౧౬౯౧

చం. తరుచుకొలంది తీపి, యమృ♦తంబునుబోలెడి, లోఁ తదెంతయో
తర మఱి చొచ్చి చూడ, గుణ♦తత్త్వ మగమ్యము, పారమార్థిక
స్థిరమతియైనవానికిని♦ జిత్తము నిల్కడ నొందు నిందుఁ, గే
సరితనుజాతురీతి[1] ననుఁ ♦ జల్పుము రామ! త్వదీశచిత్తుఁగన్. ౧౬౯౨

కం. అఘటనఘటనాచాతురి, మఘవస్తుత! తెలుపుపొంకెు ♦ మాదృశుచేతన్
లఘుగతి నీదుమహాకృతి యఘుహర! చేయించి తీవ ♦ యన్యము గల దే? ౧౬౯౩

చం. ఎలమి హుళిక్కి నుండి యొక♦యింతిని జేసితి పాదధూళిచే
బలపరిపంథిముఖ్యుల క♦వార్యముఁ జేసితి దర్భపోఁచ, ని
శ్చల మపవర్గ మిచ్చితివి ♦ సత్కృప గ్రద్దకు, నట్టినీకు నే
కొలఁదియొ నన్ను నిట్లు రఘు♦కుంజర! త్వత్కృతికర్తఁ జేయఁగన్! ౧౬౯౪

కం. నాసత్త్వము నే నెఱుఁగుట, నీసంబును లేదు మోహ♦విభ్రమ మెద సం
తోసము శ్రద్ధయు హెచ్చెను, వాసవనుత! నీదుకృపకుఁ ♦ బాత్రమ నగుటన్.

కం. చేసితివి నీవు నాకున్, బాసను దరియింపు మీవు ♦ వార్ధి నటంచున్
బాసను దప్పవు నీ వను,వాసి జగం బెఱుఁగు సత్య♦భాషణ దీనన్. ౧౬౯౬

కం. జలనిధి దాఁటు మ టంటివి, జలనిధి కావ్యంబొ కాక ♦ సంసారంబో
పలుకవు దాఁటించితి కృతిఁ, దలఁకక భవవార్ధి నట్ల ♦ దాఁటింపు దయన్! ౧౬౯౭

ఉ. కాలము వ్యర్థ మేగు ప్రతి♦ఘుస్రమునందును గొంత రిక్తగా
ధాలపనంబునందు ఫల♦మా?యొకమూర్తమ యేని త్వత్కథా
జాలమునందుఁ జిత్త మిడ ♦ సత్ఫలదం బని యెంచి రామ! నీ
లీల రచింపఁ బూనితిని ♦ లేశము లేశము నాఁడు నాఁటికిన్. ౧౬౯౮

సీ. నీమాట నెద నమ్మి ♦ నేను శార్వరి నాశ్వ,యుజమాసమున శుద్ధ♦విజయదశమిఁ
గృతిని బ్రారంభింప♦ నెడ నెడ విఘ్నముల్, కలిగియు నేఁడుల♦ నెలలకొలఁదిఁ
నవియెల్ల నీకరు♦ణావ లోకనమునఁ, బాయుట నీమహా♦వాక్య మొకఁడె
యాధారముగఁ గొని ♦ యుదరక నీసేవ, సలుపఁగ నేఁటికి ♦ శాలివాహ

[1] కేసరితనుజాతురీతి = రామాయణమున హనుమంతుఁడు తప్పఁదక్కిన యందఱు సహింపరాని దుఃఖముల ననుభవించినవారే. హనుమంతునివలె రామభక్తియు రామకైంకర్యము దప్రతి హతశక్తియుఁ గవికాంక్షితములు. [2] దుస్సహతీవ్రక్షయము కారణముగ.

ఆ. శకమునందుఁ గ్రాలు ♦ చంద్రరామగజేందు,సంఖ్య యొనరి మిగుల ♦ శస్తమైన
కీలకాబ్దమునను ♦ కీర్తితశ్రావణ,పౌర్ణమాసియందుఁ ♦ బూర్ణ మయ్యె. ౧౧౯౯

కం. సైరింపు దేవ! నాయప,చారము లవి యెన్నొ కలవు ♦ సత్యము కరుణా
పారగ! కైకొనుము నమ,స్కారము లర్పింతు నొంట ♦ శక్తుఁడఁ గామిన్. ౧౨౦౦

కవి యీగ్రంథము నొంటిమిట్ట శ్రీరాముల కర్పించుట.

సీ. సాంతంబుగాఁగ నీ♦చరితంబు సకలంబు, నీగ్రామమం దిది ♦ నీ కొసంగఁ
దలఁచు చుండఁగను మి♦త్రులము మువ్వురము త,త్సంకల్పలతిక వ♦సంతసాహ్య
మునఁ బూచి ఫలియింప ♦ ముదమున నీయబ్ద,మందాశ్వయుజమాస♦మందుఁ బూర్ణి
మాతిథిఁ బాడ్యమి ♦ మఱి ద్వితీయాతిథి, వేలకొలంది ప్ర♦జాళి గనఁగ

తే. నీదుపాలకియంద యీ♦నీదుకృతిని
నిల్పి కవులును బండితుల్ ♦ నీదుభక్త
వరులు మోయఁగ ఛత్రంబు ♦ పట్టి రాఁగఁ
బుణ్యమంగళవాద్యముల్ ♦ మోరు కొనఁగ. ౧౨౦౧

చం. వలగొని దేవతాయతన♦నాటియు నేకశిలాపురంబుఁ, దా
రెలమిని జొచ్చి కోవెలను ♦ నెల్లకృతిం బఠియించి యాదినం
బుల, మహిమాభిరాముఁ డగు♦భూపతికిం దగుదొడ్డకొల్వులో
పల బిరుదాంకితుల్ కవులు ♦ పండితవర్యులు దూరదేశగుల్ ౧౨౦౨

కం నీకృతిఁ దమిఁ గనుఁగొనఁగా, నేకశిలాపురికి రక్తి ♦ నేతెంచినను
శ్లోకులు మూలమునందలి,శ్లోకంబులతోడఁ బోల్చి ♦ శోధించి[1] మఱిన్. ౧౨౦౩

ఉ. ఈకృతి నీకు నర్హమని ♦ యేక విధంబుగ నెల్లఁ బ్రాజ్ఞులున్
బ్రాకట రీతిఁ బల్కఁగ స♦మర్పణ చేసి యతండు తావకా
స్తోక మహత్త్వముం గరుణ ♦ చూపిన తీరు నుపన్యసించి నీ
యీ కృతి పార మందుటకు ♦ హేతువు నిక్కము నీవ యంచనెన్. ౧౨౦౪

కం. ఏవంవిధకృతిరచనకు, నీ వేమి వచించె దనుచు ♦ నినుఁ బ్రశ్నింపన్
నీ వాక్రుచ్చినవాక్యము, దేవా! కరుణ కాది♦దృష్టాంతమొకా. ౧౨౦౫

కం. తావుల కనుగుణముగ దుః,ఖావళి ప్రాప్తింపఁ[2] జిత్త ♦ మారట గొనఁగా
నే విసివినచోఁ దేర్పవె, దేవా! నీకరుణ కదియు ♦ దృష్టాంతమొకా. ౧౨౦౬

కం. నే వేఁడకయును గృతినిం, గావించుచు నుండ సాత్త్వి♦కత్యాగమునన్
భూవిభుఁ డిది ప్రకటించుట, దేవా! నీమహిమ కదియు ♦ దృష్టాంతమొ కా. ౧౨౦౭

కం. నావిభవము నీవు కృతిఁగొను,నావిభవము నిజము పలుక ♦ నత్యుక్తిగఁ దా
భావించఁ జూడనాతఁడు, దేవా! నీమహిమ కదియు ♦ దృష్టాంతమొ కా. ౧౨౦౮

[1] మూలమునందు రహస్యార్థములు. వాయుస్థానంబుల బీజాక్షరములు. మంత్రవర్ణములు లోనైనవి కల వానిని పరీక్షించి. [2] రాముఁడు తండ్రికి నివాపము లిడునపుడు మాతృమరణము. వాలివధకాలంబున భ్రాతృమరణము. నాగపాశబంధనవేళ నాకస్మికజ్వరప్రాప్తియు మోక్షములోనైనవి పెక్కులు నిదర్శనంబులు.

ఉ. కమ్ము నిమిత్తమాత్ర మని ♦ కవ్వడి కీవు వచించి తెల్పివా
క్యమ్మును నమ్మి నీనుడిప్ర ♦ కారము వర్తిలు చన్ని నీవె చి
త్రమ్ముగఁ దీర్చుటల్ కనితి ♦ దాశరథీ! కయిగొంటి వీవు నీ
స్వమ్మును బూర్ణచిత్తమునఁ ♦ జల్పుము నీపదివచ్చిన ట్లికన్. ౧౭౯

⟵ ఉత్తరకాండాంతపద్యములు. ⟶

కం. మస్కరిరక్షాదక్ష న,మస్కరణస్మరణతుష్ట ♦ మానసకమలా
భాస్కరకులదీపక శ్రే,యస్కర వినతాఘతస్క ♦ రా రఘువీరా. ౧౮౦

ఉ. పాలితసర్వలోకచయ ♦ బ్రహ్మముఖామరనిత్యపూజితా
క్షాళితభక్తలోకకలు ♦ షా యసమానవదాన్యశేఖరా
శ్రీలలితాంఘ్రివారినిజ ♦ చిన్మయనామపునీతసర్వదే
వాళిమనుష్యసంచయ న ♦ రాకృతిభాసిత కీర్తిభాసితా. ౧౮౧

సుగంధి. రామచంద్రగోత్రచంద్ర ♦ రమ్యపద్యగేయమా
నామలోత్తరప్రచార ♦ యాదిదేవ శ్రీహరీ
రామ యొంటిమిట్టధామ ♦ రాజకన్యకాలస
ద్వామభాగ[1] దివ్యభోగ ♦ వాసుదాససేవధీ. ౧౮౨

⟵ మంగళమహాశ్రీవృత్తము. ⟶

మంగళము రామునకు ♦ మంజుగుణధామునకు ♦ మాన్యసురసోమునకు నెందున్
మంగళము సీత కస ♦ మానపరిపూతకును ♦ మాత కఘధూతకు సతంబున్
మంగళము భ్రాతృహిత ♦ మండలసమేతునకు ♦ మారుతిసమర్చితునకున్ స
న్మంగళము భక్తజన ♦ మానసనివాసునకు ♦ మానగుత మంగళమహాశ్రీ. ౧౮౩

— గద్యము. —

ఇది శ్రీమద్రామచంద్ర చరణారవిందమిళిం
దాయమాన మానసత్వమహావైభవ వావిలి
కొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ సుబ్బరాయ
నామధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్రవాల్మీకిరామా
యణ మనునిర్వచనమహాకావ్యంబునందు
ఉత్తరకాండము.
సర్వము సంపూర్ణము.

---

శ్రీ రామార్పణమస్తు.
శ్రీ. శ్రీ. శ్రీ.

శ్లో. నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ, నమోఽస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోఽస్తు వాతాత్మభువే వరాయ, నమోఽస్తు వల్మీకభవాయ తస్మై.

---

[1] వామభాగమున సీత గల రాముఁడు ముక్తిప్రదుఁడు కుడివైపు సీతఁ గల రాముఁడు భుక్తిప్రదుఁడు.